బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

సరళ వ్యాఖ్యానసహితం

## నాల్గవ సంపుటము

6, 7 స్కంధములు


వ్యాఖ్యాతలు

డా॥ జోస్యుల సూర్యప్రకాశ రావు

డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ

శ్రీ కోట వేంకటలక్ష్మీనరసింహం

డా॥ ఆకురాతి పున్నారావు

డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ

ప్రధాన సంపాదకులు

డా॥ సముద్రాల లక్ష్మణయ్య






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

2017

**Bammera Potanamatya Praneeta**
**SRI MAHABHAGAVATAMU, with Commentary**
**Volume - IV (Skandhas - 6 & 7)**

*Author :* **Potana Mahakavi**

*Commentary by*
**Dr. Josyula Suryaprakasa Rao *(Skandha - 6)***
**Dr. Kompella Ramasuryanarayana *(Skandha - 6)***
**Sri Kota Venkatalakshminarasimham *(Skandha - 6)***
**Dr. Akurathi Punna Rao *(Skandha - 6 & 7)***
**Dr. Akella Vibheeshana Sarma *(Skandha - 7)***

*Edited by*
**Dr. Samudrala Lakshmanaiah**



T.T.D. Religious Publications Series No. 1240

*First Edition :* 2017

*Copies :* 3000

*Published by*
**Dr. D. Sambasiva Rao, I.A.S.,**
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati.

*D.T.P.*
Publications Division
T.T.D., Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందుమాట

**భా**రతీయ సనాతన వాఙ్మయంలో అద్భుతమైన ఆధ్యాత్మిక గ్రంథాలు చాలా ఉన్నాయి. అందులో అమూల్యమైన రత్నాల్లాగా శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారత, శ్రీమద్భాగవత గ్రంథాలు సంస్కృత వాఙ్మయ ప్రపంచంలో ప్రకాశిస్తున్నాయి.

వాటిల్లో శ్రీమద్రామాయణ మహాకావ్యం ఆదికవి వాల్మీకి మహర్షి ప్రణీతం. కాగా ఇక మిగిలిన భారత భాగవత గ్రంథాలు రెండూ కృష్ణద్వైపాయనుడైన శ్రీవ్యాసమహర్షి రచించినవి.

తి.తి.దేవస్థానం ధార్మిక సాహిత్య ప్రచురణలో భాగంగా ఇప్పటికే సంస్కృత శ్రీమద్రామాయణ కావ్యాన్నీ, తెలుగు కవిత్రయ మహాభారత కావ్యాన్నీ సవ్యాఖ్యానంగా ప్రచురించింది.

అదే వరుసలో పోతన మహాకవి రచించిన తెలుగు భాగవతకావ్యాన్ని కూడా తెలుగువారికి అందించాలన్న సదాశయంతో ప్రముఖ పండితులు డా॥ కరుణశ్రీ గారి ప్రధాన సంపాదకత్వంలో సరళమైన తాత్పర్యంతో పోతన భాగవతగ్రంథాన్ని ఐదుసంపుటాలుగా దేవస్థానం అందించింది. ఈ గ్రంథం పాఠకుల విశేషాదరణకు పాత్రమై పలు ముద్రణలను పొందింది.

ఆ తర్వాత కొందరు పండితుల సలహామేరకు, పాఠకుల అభ్యర్థనలమేరకు, 'కవిత్రయ భారతం' మాదిరిగానే పోతన మహాకవి భాగవతాన్ని కూడా అందరికీ సులభంగా అర్థం అయ్యేట్లు సరళమైనశైలిలో వ్యాఖ్యానాన్ని అందించాలనే లక్ష్యంతో దేవస్థానం ఆ కార్యక్రమాన్ని చేపట్టింది.

ప్రస్తుతం బమ్మెర పోతనగారి భాగవత గ్రంథం, ముప్పైమూడు మంది పండితులు సరళవ్యాఖ్యానాన్ని అందించగా ప్రముఖ సాహితీవేత్తలు డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రధానసంపాదకత్వంలో తయారయ్యింది. ఈ వ్యాఖ్యానగ్రంథం తయారీలో కృషిచేసిన దేవస్థానం ప్రచురణల విభాగం ప్రత్యేకాధికారి మరియు పోతన భాగవత వ్యాఖ్యాన పర్యవేక్షకులు, సమన్వయకర్త శ్రీ ప్రయాగ రామకృష్ణ గారికీ, వారి సహాయకులు, ఉపసంపాదకులు డా॥ నొస్సం నరసింహాచార్య గారికీ, ఈ పోతన భాగవత వ్యాఖ్యానగ్రంథ ప్రధాన సంపాదకులు డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికీ, వ్యాఖ్యాతలకూ, సంపాదకమండలి సభ్యులకూ, సహాయసహకారాలందించినవారికీ, కన్సల్టెంట్లందరికీ, ఈ గ్రంథాన్ని చక్కగా ముద్రింపజేసిన తి.తి.దేవస్థానం ప్రెస్సు వారందరికీ ప్రత్యేకంగా అభినందనలు తెలియజేస్తున్నాను. పోతన పద్యాలకు వ్యాఖ్యానాలనదగిన చక్కనైన బాపుగారి రేఖాచిత్రాలను ఈ గ్రంథ సంపుటాల్లో అక్కడక్కడా పొందుపరుచుటకు అనుమతించిన శ్రీ బాపుగారి కుటుంబ సభ్యులకు ప్రత్యేకంగా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

ఈ సరళవ్యాఖ్యాన గ్రంథం ఎనిమిది సంపుటాలుగా, ఆ యా పుటల్లో అక్కడక్కడ ప్రముఖ చిత్రకారులు బాపుగారి బొమ్మల మెరుపులతో సర్వాంగసుందరంగా, శ్రీ హేమలంబి నామసంవత్సరం తెలుగు ఉగాదినాడు తెలుగువారందరికి శ్రీ తిరుమలేశుడు అనుగ్రహిస్తున్న ప్రసాదంగా స్వీకరించగలరని ఆకాంక్షిస్తూ...

*సదా శ్రీవారి సేవలో...*

**కార్యనిర్వహణాధికారి**

తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

శ్రీరస్తు

# బమ్మెర పోతనామాత్య ప్రణీత శ్రీమహాభాగవత ప్రాజెక్టు పుట్టుపూర్వోత్తరాలు

**వేదకల్పవృక్షవిగళితమై శుక**
**ముఖసుధాద్రవమున మొనసియున్న,**
**భాగవతపురాణఫలరసాస్వాదన**
**పదవి గనుడు రసికభావవిదులు.**

అని భాగవత రచనకు ఉపక్రమించిన సహజకవి పోతనామాత్యుడు భాగవతప్రాశస్త్యాన్ని ఉగ్గడించాడు.

వాల్మీకి విరచితమైన ఆదికావ్యం రామాయణం. "వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా" అన్నట్లు వేదానికి మారురూపంగా అది ప్రసిద్ధి పొందింది. వ్యాసవిరచితమహాభారతాన్ని పంచమవేదంగా (భారతం పంచమో వేదః) భావిస్తారు. సనాతనధర్మానికి అనల్పమైన వ్యాప్తిని గావించిన ఈ మూడుగ్రంథాలు భారతీయ సాహిత్యంలో సాటిలేని మేటిరచనలుగా ప్రసిద్ధి పొందాయి.

తిరుమల తిరుపతి దేవస్థానం హిందూ ధర్మ ప్రచారంకోసం ఆధ్యాత్మికగ్రంథాలను పెద్ద ఎత్తున ప్రచురిస్తోంది. దేశంలో మరే ఇతరదేవస్థానం కూడా ధర్మప్రచారంకోసం గ్రంథముద్రణను ఇంత పెద్ద ఎత్తున చెయ్యడం లేదని చెప్పడం అతిశయోక్తి కాదు. వేదార్థాలను ప్రతిపాదించే వాఙ్మయాన్ని వివిధ భాషల్లో ప్రచురించి ప్రచారం చేయడం తిరుమల తిరుపతి దేవస్థానం తన బాధ్యతగా స్వీకరించింది. అనేకభాషల్లో దేవస్థానం ద్వారా వెలువడుతున్న ధార్మికగ్రంథాలలో రామాయణ, భారత, భాగవతాలు మిక్కిలి ప్రధానమైనవని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు.

1982లో జరిగిన భక్తకవి పోతన పంచశతాబ్ది జయంతి ఉత్సవాలలో పోతన భాగవతాన్ని తాత్పర్యంతో ముద్రించాలని దేవస్థానం సంకల్పించింది. **కరుణశ్రీ జంధ్యాలపాపయ్యశాస్త్రి** గారి నేతృత్వంలో 15 మంది పండితులు పోతనభాగవతానికి తాత్పర్యాన్ని సమకూర్చారు. తొలిసారిగా 1987లో తాత్పర్యసహిత పోతన భాగవతాన్ని తిరుమల తిరుపతి దేవస్థానం పాఠకలోకానికి అందించింది.

కవిత్రయవిరచితమహాభారతానికి ప్రసిద్ధపండితులచేత ప్రతిపదార్థతాత్పర్యవిశేషవివరణలు వ్రాయించి ప్రచురించాలన్న సంకల్పం 1983లో తిరుమల తిరుపతి దేవస్థానానికి కలిగింది. ముప్పైమంది పండితులు ఈ పద్ధతిలో భారతానికి వ్యాఖ్యానం రచించారు. 2005వ సంవత్సరంలో మహాభారతం సంపూర్ణంగా సవ్యాఖ్యానంగా వెలువడింది.

ప్రతిపదార్థ, తాత్పర్య, విశేషవ్యాఖ్యానాలతో కవిత్రయభారతం, తాత్పర్యసహితభాగవతం తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలలో అగ్రశ్రేణికి చెందినవిగా రూపొంది అతివిస్తృతమైన ప్రజాదరణకు పాత్రమైనాయి. వేలకొలది ప్రతులు భక్తులకు, పాఠకులకు అందుతున్నాయి.

1981లో డా॥ పన్నాల రాధాకృష్ణశర్మగారి నేతృత్వంలో వ్యాసవిరచితసంస్కృతభాగవతాన్ని ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలను సమన్వయించే మూడువ్యాఖ్యానాలతో పరిష్కరించి ప్రచురించాలని దేవస్థానం నిర్ణయించింది. ఆ నిర్ణయం మేరకు భాగవతం ప్రాజెక్టు ఏర్పాటైంది. **డా॥ రాధాకృష్ణశర్మ, డా॥ ఎన్.సి.వి.నరసింహాచార్యులు, శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మ, డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గార్ల నేతృత్వంలో శ్రీధరీయం (అద్వైతం), వీరరాఘవీయం (విశిష్టాద్వైతం), విజయధ్వజీయం (ద్వైతం) అన్న మూడువ్యాఖ్యానాలతో సమగ్రంగా 14 బృహత్ సంపుటాలుగా 2006 నాటికి భాగవతం సిద్ధమయింది.

ఈ పరిష్కరణ కార్యక్రమం ముగియగానే పురాణ ఇతిహాస ప్రాజెక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** నాటి తితిదే శ్రీకార్యనిర్వహణాధికారి **శ్రీ ఎ.పి.వి.ఎన్. శర్మ** ఐ.ఏ.ఎస్., గారి వద్దకు వెళ్ళి వ్యాసభాగవత పరిష్కరణ పూర్తి అయిందని విన్నవించారు. అప్పుడు కార్యనిర్వహణాధికారిగారు ఎంతో సంతోషించి “పోతన భాగవతాన్ని తాత్పర్యంతో మాత్రమే ముద్రించగలిగాం. తెలుగు ప్రజలందరికీ ఎంతో ప్రియమైన భాగవతాన్ని కూడా అర్థ తాత్పర్య వివరణలతో సిద్ధం చేస్తే బాగుంటుంది. ఇందుకు తగిన ప్రతిపాదనలను సిద్ధం చెయ్యండి” అని నిర్దేశించారు.

ఈ బృహత్కార్యక్రమం భాగవతప్రాజెక్టుద్వారా కాకుండా కవిత్రయ మహాభారతానికి వ్యాఖ్యానం సమకూర్చడంలో అనుభవం గడించిన సప్తగిరి సంపాదక కార్యాలయం ద్వారానే నిర్వహించడం సముచితంగా ఉంటుందని తెలుపుతూ **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** వ్యాఖ్యాన రచనకు అవసరమైన ప్రతిపాదనలను సిద్ధం చేసి కార్యనిర్వహణాధికారివారికి పంపగా వారు ఆమోదించారు.

**డా॥ సముద్రాల లక్ష్మణయ్యగారి ప్రతిపాదనలో సారాంశం**

- వ్యాఖ్య సామాన్యులకు కూడా అర్థమయ్యే తీరులో ఉండాలి.
- శిష్టవ్యావహారికభాషను ప్రయోగించాలి.
- వ్యాకరణాదివిశేషాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉండరాదు.
- ఆధ్యాత్మిక అంశాలను పరిమితంగా విశేషాంశాలలో చెప్పవచ్చు.
- కార్యనిర్వహణాధికారి వారి అధ్యక్షతన తితిదే ప్రజాసంబంధాధికారి, సప్తగిరి ప్రధాన సంపాదకులు, తితిదే స్థానిక పండితులతో ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి వ్యాఖ్యాతలను, సంపాదకమండలిని ఎన్నుకోవాలి.

- వ్యాఖ్యాత లందరితో తిరుపతిలో ఒక కార్యశాలను నిర్వహించి అందరి వ్యాఖ్యానం ఒకే విధంగా ఉండేలా చూడాలి.
- ఇంతకు మునుపు తితిదే ముద్రించిన తాత్పర్యసహిత భాగవతానికి తాత్పర్యం వ్రాసిన పండితులలో సమర్థులైనవారిని ఈ కార్యక్రమంలో వినియోగించుకోవచ్చు.

2007లో కార్యనిర్వహణాధికారి **డా॥ కె.వి.రమణాచారి** ఐ.ఏ.ఎస్., గారి ఆమోదంమేరకు నాటి సప్తగిరి సంపాదకులు **డా॥ సి.శైలకుమార్**, భాగవత ప్రాజెక్టు ప్రధానసంపాదకులుగా **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** గారిని నియమించారు. ఆ తరువాత ఈ బృహత్కార్యాచరణకు సలహాలు, సూచనలు చేసేందుకు కవిత్రయభారత వ్యాఖ్యాననిర్వహణలాగే తొమ్మిదిమందితో కూడిన సలహామండలిని ఏర్పాటు చేశారు. దీనికి తితిదే కార్యనిర్వహణాధికారి గౌరవ సంపాదకులుగా వ్యవహరించారు.

**సలహామండలి**

| | | |
|---|---|---|
| **శ్రీ కార్యనిర్వహణాధికారి** | - | **గౌరవ సంపాదకులు** |
| **శ్రీ ముదివర్తి కొండమాచార్యులు, తిరుపతి** | - | **ప్రధాన సంపాదకులు** |
| **డా॥ సముద్రాల లక్ష్మణయ్య, తిరుపతి** | - | **సభ్యులు** |
| **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, మద్రాసు** | - | **సభ్యులు** |
| **డా॥ శలాక రఘునాథశర్మ, రాజమండ్రి** | - | **సభ్యులు** |
| **ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి** | - | **పదవీ నిమిత్త సభ్యులు** |
| **సప్తగిరి సంపాదకుడు** | - | **సి. శైలకుమార్, కన్వీనర్** |
| **తితిదే ప్రజాసంబంధాధికారి** | - | **విశేష ఆహ్వానితులు** |
| **తితిదే ప్రెస్ మేనేజర్** | - | **విశేష ఆహ్వానితులు** |

ఈ సంపాదక మండలిలోని పండితవర్గమైన **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, డా॥ సముద్రాల లక్ష్మణయ్య, డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, డా॥ శలాక రఘునాథశర్మ** గార్లతో ప్రధాన సంపాదకమండలిని నెలకొల్పారు. ఆ తరువాత కారణాంతరాలవల్ల **డా॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య** గారి స్థానంలో **డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య** గారు సంపాదక మండలి సభ్యులుగా నియమితులయ్యారు. ఈ ప్రధాన సంపాదక మండలివారు భాగవత

వ్యాఖ్యాన రచనకు ముప్పైమంది పండితులను ఎంపికచేసి ఒక్కొక్కరికి 300 – 350 పద్యగద్యాలకు వ్యాఖ్యాన రచనా బాధ్యతలను అప్పగించారు.

ఆ తరువాత అనుకున్నంత వేగంగా ఈ కార్యక్రమం ముందుకు సాగలేదు.

తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణలను, సవ్యాఖ్యాన భాగవతాన్ని త్వరితగతిన వ్యాప్తిలోకి తేవాలన్న ఉద్దేశ్యంతో 2011లో ద్రవిడ విశ్వవిద్యాలయ విశ్రాంత ఉపకులపతి **ఆచార్య రవ్వా శ్రీహరి**గారిని ప్రచురణల విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నియమిస్తూ వీరికి సహాయకులుగా **డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గార్లను ప్రచురణల విభాగానికి ఉపసంపాదకులుగా, **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం** గార్లు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు.

అప్పటిదాకా మందకొడిగా సాగుతున్న ప్రచురణ కార్యక్రమంతోపాటు వ్యాఖ్యాన రచనా కార్యక్రమం కూడా **ఆచార్య రవ్వా శ్రీహరి** గారి సారథ్యంలో వేగాన్ని పుంజుకున్నది. వ్యాఖ్యాన రచయితలతో నిరంతరం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ రాయలేమని తెలిపిన వారి భాగాలను వేరే పండితులకు అప్పగిస్తూ 2013నాటికి దాదాపు పండితులందరినుండి భాగవత వ్యాఖ్యానాలను తెప్పించారు. వెనువెంటనే డి.టి.పి. వగైరా పనులుకూడా ముమ్మరంగా సాగాయి. పుటల సంఖ్య ఆధారంగా 12 స్కంధాల భాగవతాన్ని 8 సంపుటాలుగా ముద్రించేందుకు ప్రణాళికలు సిద్ధం చేశారు.

**ఆచార్య రవ్వా శ్రీహరి**గారి తదనంతరం 2014లో ఎడిటర్–ఇన్–చీఫ్‌గా బాధ్యతలు చేపట్టిన పురాణ ఇతిహాస ప్రాజక్టు ప్రత్యేకాధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** ఈ కార్యక్రమాన్ని మరింత వేగవంతం చేశారు. వ్యాఖ్యాన రచనలను పరిష్కరించడానికి, అక్షర దోషాలను తొలగించడానికి మరి కొందరు పండితులు అవసరం కావడంతో అప్పటికే భాగవతం కన్సల్టెంటుగా ఉన్న **డా॥ గల్లా చలపతి** గారితోపాటుగా **డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు** గార్లు భాగవతం ప్రాజెక్టు కన్సల్టెంట్‌లుగా నియమితులయ్యారు. భాగవత స్కంధాలను సంపాదకమండలి పరిష్కరణ స్థాయికి వీరు తీసుకువచ్చారు. 2015 ఏప్రిల్ 15వ తేదీన తితిదే కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., మరియు సంయుక్త కార్యనిర్వహణాధికారి (తిరుపతి) **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గార్ల ఆధ్వర్యంలో

**విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**డా॥ శలాక రఘునాథశర్మ**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**గార్లతో కూడిన పోతనభాగవత సంపాదకమండలి తొలి సమావేశం జరిగింది. త్వరితగతిన పరిష్కరణ పూర్తిచేసేందుకు గాను అనుసరించాల్సిన ప్రణాళికను ఈ సమావేశంలో సిద్ధం

చేశారు. ఆ తరువాత **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారి సంయోజకత్వంలో జరిగిన సంపాదక మండలి సమావేశాలలో మూడుస్కంధాల పరిష్కరణ పూర్తిచేసి ముద్రణార్హమైన ప్రతిని సిద్ధం చేశారు. అనివార్యకారణాలవల్ల సంపాదకమండలిలో కొందరు సభ్యులు తదుపరి సమావేశాలకు హాజరు కాలేకపోయారు.

2016లో ప్రచురణల విభాగానికి **శ్రీ ప్రయాగ రామకృష్ణ**గారు ప్రత్యేకాధికారిగా నియమితులయ్యారు. కార్యనిర్వహణాధికారి గారి అమోదం మేరకు వీరు భాగవత పరిష్కరణ కార్యక్రమం త్వరితగతిన పూర్తికావడానికి అంతకు మునుపున్న సంపాదకమండలి స్థానంలో

**డా॥ సముద్రాల లక్ష్మణయ్య (ప్రధాన సంపాదకులు)**

**శ్రీ గరిమెళ్ళ అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ**

**డా॥ తిప్పాభట్ల రామకృష్ణమూర్తి**

**డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి**

**డా॥ ధూళిపాళ రామకృష్ణ**

**డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**

**డా॥ కె.వి. సుందరాచార్యులు**

**డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ**గార్లతో కొత్త సంపాదకమండలిని ఏర్పాటు చేశారు. అప్పటినుంచి వ్యాఖ్యాన పరిష్కరణ కార్యక్రమం వేగవంతం అయింది. కాగా 2017 ఉగాదినాటికి సవ్యాఖ్యాన భాగవతం ముద్రించబడి ప్రజలకు అందుబాటులోకి రావాలన్న తితిదే సంకల్పాన్ని అనుసరించి పరిష్కరణ కార్యక్రమాన్ని మరింత త్వరగా పూర్తి చేసేందుకుగాను కార్యనిర్వహణాధికారి వారి ఆమోదంమేరకు

**డా॥ నిట్టల సుబ్రహ్మణ్యేశ్వర శాస్త్రి**

**డా॥ మరడాన శ్రీనివాసరావు**

**డా॥ గల్లా చలపతి** గార్లకు సంపాదకమండలిలో స్థానం కల్పించారు. 2016 సెప్టెంబరునుండి పండితులందరితో ప్రతినెలా దాదాపు 20 రోజులపాటు తిరుపతి శ్వేత సమావేశ మందిరంలో సమావేశాలు ఏర్పాటుచేసి పండితులందరి ఆమోదంమేరకు పరిష్కరణ కార్యక్రమాన్ని విజయవంతంగా ముగించి శుద్ధప్రతిని ముద్రణకు పంపేందుకు సిద్ధం చేశారు. ఇలా అనుకున్న సమయానికి శ్రీమహాభాగవతాన్ని ప్రకటించగలిగినందుకు సంతోషిస్తున్నాము.

సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకుని వ్యాఖ్యానం సరళంగా ఉండాలన్న కార్యనిర్వహణాధికారి, సంయుక్త కార్యనిర్వహణాధికారిగార్ల సూచనలమేరకు వ్యాఖ్యాన రచనలో విస్తృతంగా విశేషాలను వ్రాసిన పండితుల రచనల్లోంచి సంపాదకమండలి సూచనల ప్రకారం అవసరమైన మేరకు మాత్రమే విశేషాలను స్వీకరించడమయింది.

**కృతజ్ఞతలు**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావడానికి ఆధికారికమైన ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకమండలి అధ్యక్షులకు మరియు పాలకమండలి సభ్యులందరికీ కృతజ్ఞతలు.

లోగడ తితిదేవస్థానం కార్యనిర్వహణాధికారిగా ఉండి భాగవత ప్రాజెక్టు ప్రారంభానికి కారకులైన **శ్రీ ఎ.పి.వి.ఎన్.శర్మ** ఐ.ఏ.ఎస్., గారికి హృదయపూర్వక ధన్యవాదాలు. అదే పరంపరలో తితిదే కార్యనిర్వహణాధికారులుగా బాధ్యతలు నిర్వహించి భాగవత ప్రాజెక్టుకు సంపూర్ణ సహకారాన్ని అందించిన **డా॥ కె.వి.రమణాచార్య** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావు** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం** ఐ.ఏ.ఎస్., **శ్రీ ఎమ్.జి.గోపాల్** ఐ.ఏ.ఎస్., గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు.

పోతనభాగవతం ముద్రణదశకు చేరుకునేందుకు తగిన సూచనలు, సలహాలు ఇచ్చిన సలహామండలి సభ్యులందరికీ ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన భాగవత ప్రచురణలో ఆసక్తిని కనబరుస్తూ అన్నివిధాలా అందుకు తగిన ప్రోత్సాహాన్ని అందజేసిన గౌరవ శ్రీ కార్యనిర్వహణాధికారి **డా॥ డి.సాంబశివరావు** ఐ.ఏ.ఎస్., గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారి **శ్రీ పోల భాస్కర్** ఐ.ఏ.ఎస్., గారికి మా హృదయపూర్వక నమోవాకాలు.

భాగవత వ్యాఖ్యాన రచనకు అవసరమైన పండితులను ఎన్నుకొని వారికి వ్యాఖ్యాన బాధ్యతలను అప్పగించడంలో కృషిచేసిన నాటి సప్తగిరి ప్రధాన సంపాదకులు **డా॥ సి.శైలకుమార్** గారికి, సంపాదకులు **డా॥ కె.రాధారమణ** (ప్రస్తుత ప్రధాన సంపాదకులు) గార్లకు కృతజ్ఞతలు.

వ్యాఖ్యాతలందరినుండి వ్యాఖ్యాన భాగాలను రప్పించడంలో శ్రమించి, విశేష కృషిచేసిన నాటి ప్రచురణల విభాగం అధికారి **ఆచార్య రవ్వా శ్రీహరి** గారికి, పరిష్కరణ కార్యక్రమాన్ని వేగవంతంచేసిన తదుపరి అధికారి **డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారికి, కృతజ్ఞతాపూర్వక నమస్కృతులు.

పోతన భాగవత పరిష్కరణలో తమ అమూల్య సహాయసహకారాలనందించి శుద్ధప్రతిని తయారు చేయడంలో సహకరించిన **పోతన భాగవత సంపాదకమండలి సభ్యులందరికీ** పేరుపేరునా ధన్యవాదాలు.

ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ అన్నివిధాలా సంపూర్ణ సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగ ఉపసంపాదకులు **డా॥ నొస్సం నరసింహాచార్య** గారికి, పరిష్కరణ, అక్షరదోష సవరణల్లో సహకరించిన కార్యాలయ పండితులు **విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, డా॥ గల్లా చలపతి, డా॥ ముదివేడు ప్రభాకరరావు, శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు, శ్రీ కట్టా నరసింహులు**గార్లకు, ప్రచురణల విభాగంలో కొంతకాలం ఉపసంపాదకురాలుగా పనిచేసి భాగవత పరిశీలనా కార్యక్రమంలో సహకరించిన **శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి** గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవత ముద్రణకు సంబంధించిన దస్త్రాలను నడపడంలోను, సంపాదకమండలి సమావేశాలను ఏర్పాటు చేయడంలోను సహకరించిన **ప్రచురణల విభాగ కార్యాలయ సిబ్బందికి** నా ధన్యవాదాలు.

సవ్యాఖ్యాన పోతన భాగవతం ఎనిమిది సంపుటాలలో చివరన ముద్రించిన అకారాదిక్రమ పద్యగద్య సూచికను తయారు చేయడంలో సహకరించిన **శ్రీ వాడపల్లి శేషతల్పశాయి** (ఆంధ్రభారతి.కామ్) గారికి మా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాలను అందంగా డి.టి.పి. చేసి చక్కటి వర్ణచిత్రాలతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సహకరించిన ప్రచురణల విభాగ కార్యాలయ డి.టి.పి. సిబ్బంది **శ్రీమతి ఎమ్.సుబ్బరత్నమ్మ, శ్రీమతి జె.కరుణ, కుమారి ఎమ్.మానస, శ్రీ ఎమ్.రెడ్డిప్రసాద్** గార్లకు ధన్యవాదాలు.

ఈ గ్రంథంలో ప్రసిద్ధ చిత్రకారులు బాపుగారి అద్భుత వర్ణచిత్రాలను ముద్రించేందుకు అనుమతించిన బాపుగారి కుటుంబసభ్యులకు మా ప్రత్యేకధన్యవాదాలు.

తక్కువ వ్యవధిలో గ్రంథ ముద్రణను పూర్తిచేసి పాఠకులకు అందించేందుకు తోడ్పడిన టిటిడి ముద్రణాలయ ఉపకార్యనిర్వహణాధికారి **శ్రీమతి ఎమ్.గౌతమి** గారికీ, వారి సిబ్బందికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు.

*సదా శ్రీవారి సేవలో...*

ప్ర. రామకృష్ణ

**(ప్రయాగ రామకృష్ణ)**

కన్వీనర్

ప్రత్యేకాధికారి, ప్రచురణల విభాగం

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

## సంపాదక మండలి

బమ్మెర పోతనామాత్య ప్రణీత

# శ్రీమహాభాగవతము

| వ్యాఖ్యాతలు | స్కంధాలు |
|---|---|
| 1) డా॥ కేసాప్రగడ సత్యనారాయణ | ప్రథమస్కంధము (1-275) |
| 2) డా॥ మల్లెల గురవయ్య | ప్రథమస్కంధము (276-529) |
| 3) డా॥ సముద్రాల లక్ష్మణయ్య | ద్వితీయస్కంధము (1-288) |
| 4) డా॥ కడిమిళ్ళ వరప్రసాద్ | తృతీయస్కంధము (1-388) |
| 5) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (389-717) |
| 6) డా॥ గల్లా చలపతి | తృతీయస్కంధము (718-887) |
| 7) డా॥ కసిరెడ్డి వెంకటపతిరెడ్డి | తృతీయస్కంధము (888-1055) |
| 8) డా॥ దావులూరి కృష్ణకుమారి | చతుర్థస్కంధము (1-322) |
| 9) డా॥ ఆర్. అనంతపద్మనాభరావు | చతుర్థస్కంధము (323-636) |
| 10) డా॥ శలాక రఘునాథశర్మ | చతుర్థస్కంధము (637-977) |
| 11) డా॥ కె. సర్వోత్తమరావు | పంచమస్కంధము |
| | ప్రథమాశ్వాసము (1-183) |
| | ద్వితీయాశ్వాసము (1-167) |
| 12) డా॥ జోస్యుల సూర్యప్రకాశరావు | షష్ఠస్కంధము (1-251) |
| 13) డా॥ కొంపెల్ల రామసూర్యనారాయణ | షష్ఠస్కంధము (252-346) |
| 14) డా॥ ఆకురాతి పున్నారావు | షష్ఠస్కంధము (347-440) |
| 15) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | షష్ఠస్కంధము (441-530) |
| 16) డా॥ ఆకెళ్ళ విభీషణశర్మ | సప్తమస్కంధము (1-186) |

| | |
|---|---|
| 17) డా॥ ఆకురాతి పున్నారావు | సప్తమస్కంధము (187-482) |
| 18) డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద | అష్టమస్కంధము (1-391) |
| 19) శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు | అష్టమస్కంధము (392-744) |
| 20) డా॥ డి. మీరాస్వామి | నవమస్కంధము (1-364) |
| 21) శ్రీ కోట వేంకట లక్ష్మీనరసింహం | నవమస్కంధము (365-737) |
| 22) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య | దశమస్కంధము పూర్వభాగము (1-288) |
| 23) డా॥ ఎ.ఎస్. గోపాలరావు | దశమస్కంధము పూర్వభాగము (289-610) |
| 24) శ్రీ ప్రభల సుబ్రహ్మణ్యశర్మ | దశమస్కంధము పూర్వభాగము (611-912) |
| 25) డా॥ పి. నరసింహారెడ్డి | దశమస్కంధము పూర్వభాగము (913-1188) |
| 26) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు | దశమస్కంధము పూర్వభాగము (1189-1485) |
| 27) డా॥ పి.ఆర్. హరినాథ్ | దశమస్కంధము పూర్వభాగము (1486-1792) |
| 28) డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు | దశమస్కంధము ఉత్తరభాగము (1-245) |
| 29) డా॥ ఎన్.వి.ఎస్. రామారావు | దశమస్కంధము ఉత్తరభాగము (246-537) |
| 30) డా॥ కె. మలయవాసిని | దశమస్కంధము ఉత్తరభాగము (538-764) |
| 31) డా॥ కె.జె. కృష్ణమూర్తి | దశమస్కంధము ఉత్తరభాగము (765-1033) |
| 32) డా॥ సంగనభట్ల నరసయ్య | దశమస్కంధము ఉత్తరభాగము (1034-1343) |
| 33) డా॥ గల్లా చలపతి | ఏకాదశస్కంధము (1-127) |
| | ద్వాదశస్కంధము (1-54) |

**పోతన భాగవతప్రాజెక్టు కన్సల్టెంట్స్**

శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం ✻ డా॥ గల్లా చలపతి ✻ డా॥ ముదివేడు ప్రభాకరరావు

శ్రీ వైద్యం వేంకటేశ్వరాచార్యులు ✻ శ్రీ కట్టా నరసింహులు

# సంకేతాక్షర సూచి

| | | | | | |
|---|---|---|---|---|---|
| క. | – | కందం | య. | – | యగణం |
| ఆ. | – | ఆటవెలది | మ. | – | మగణం |
| తే. | – | తేటగీతి | త. | – | తగణం |
| సీ. | – | సీసపద్యం | ర. | – | రగణం |
| ఉ. | – | ఉత్పలమాల | జ. | – | జగణం |
| చ. | – | చంపకమాల | భ. | – | భగణం |
| మత్త. | – | మత్తకోకిల | న. | – | నగణం |
| మ. | – | మత్తేభవిక్రీడితం | స. | – | సగణం |
| శా. | – | శార్దూలవిక్రీడితం | ల. | – | లఘువు |
| శ్లో. | – | శ్లోకం | గ. | – | గురువు |
| వ. | – | వచనం | వ. | – | వగణం |
| అలం. | – | అలంకారం | | | |

| | | |
|---|---|---|
| అవ. | – | అవతారిక |
| తా. | – | తాత్పర్యం |
| ప్రతి. | – | ప్రతిపదార్థం |
| విశే. | – | విశేషార్థం |
| ప్ర. ఆ. | – | ప్రథమాశ్వాసం |
| ద్వి. ఆ. | – | ద్వితీయాశ్వాసం |
| క్రీ. శ. | – | క్రీస్తుశకం |
| సం. | – | సంవత్సరం |
| మొ. | – | మొదలైన |
| ... | – | తరువాతి పద్యం / వచనంతో అన్వయం |



# షష్ఠస్కంధ ప్రాశస్త్యం

**ఉ. ఎమ్మెలు సెప్పనేల? జగమెన్నఁగఁ బన్నగరాజశాయికిన్**
**సొమ్ములు వాక్యసంపదలు సూఱలు చేసిన వాని, భక్తి లో**
**నమ్మినవాని, భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ, బేర్మితో**
**బమ్మెర పోతరాజుఁ, గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్** **(6-12)**

అని పోతనను మొట్టమొదట స్తుతించిన కవి ఏర్చూరిసింగన. ఇతఁడు భాగవతంలో శిథిలమైన షష్ఠస్కంధాన్ని పూరించాడు.

విష్ణుమూర్తిని, శివుణ్ణి, బ్రహ్మను, వినాయకుణ్ణి, సరస్వతీదేవిని, లక్ష్మీదేవిని, కాళికాదేవిని స్తుతించాడు. వ్యాసమహర్షిని, వాల్మీకిని, శుకమహర్షిని, బాణుణ్ణి, మయూరుణ్ణి, భాసుణ్ణి, సౌమిల్లకుణ్ణి, భారవిని, మాఘుణ్ణి, కాళిదాసుని (వీరు సంస్కృత కవులు); నన్నయ్యను, తిక్కన్నను, ఎఱ్ఱన్నను, భాస్కరుణ్ణి, నాచనసోముణ్ణి, శ్రీనాథుణ్ణి, పోతనను క్రమంగా స్తుతించాడు.

ఒకనాడు సింగన కవి నిద్రిస్తూ ఉండగా సరస్వతీదేవి కలలో సాక్షాత్కరించింది.

**శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ**
**నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ ॥** **(6-20)**

అని కలలోనే వెంటనే సింగన ఒక శ్లోకం చెప్పాడు. సరస్వతీ దేవి ఈ శ్లోకాన్ని అంగీకరించింది. సింగన తన వంశాన్ని వర్ణించి, శ్రీకృష్ణార్పణంగా షష్ఠ్యంతాలు చెప్పి, షష్ఠస్కంధం ఆంధ్రీకరించాడు.

షష్ఠస్కంధంలో 1. అజామిళోపాఖ్యానం 2. అజామిళుని చెడ్డనడవడిక 3. కొడుకును 'నారాయణా' అని పిలుస్తూ అజామిళుఁడు మరణించడం 4. అజామిళుని తీసికొని పోవడానికి యమకింకరులు రావడం 5. నారాయణస్మరణతో మరణించిన అజామిళుని వైకుంఠానికి తీసికొనిపోవడానికి విష్ణుదూతలు రావడం 6. యమదూత – విష్ణుదూతల సంవాదం 7. అజామిళుని వైకుంఠలోకప్రాప్తి 8. దక్షుఁడు చేసిన హంసస్తవం 9. నారదమహర్షి శబళాశ్వులకు నివృత్తిమార్గాన్ని ఉపదేశించడం 10. దక్షుఁడు నారదుణ్ణి శపించడం 11. దక్షప్రజాపతి సృష్టి 12. దేవ–రాక్షసుల యుద్ధం 13. శ్రీమన్నారాయణ కవచం 14. వృత్రాసురుని కథ 15. ఇంద్ర–వృత్రాసురుల యుద్ధం 16. వృత్రాసురవధ 17. చిత్రకేతూపాఖ్యానము 18. చిత్రకేతుడు శివుణ్ణి అధిక్షేపించి పార్వతీదేవిచే శాపం పొందడం, 19. చిత్రకేతుని తపస్సు 20. చిత్రకేతునికి భగవత్ప్రసాదం లభించడం, 21. సవితృవంశవర్ణనం అనేవి క్రమంగా ప్రధాన విషయాలు.

**క. క్రూరాత్ముఁ డజామిళుఁడు, నారాయణ! యనుచు నాత్మనందనుఁ బిలువన్**
**ఏరీతి నేలుకొంటివి?, ఏరీ, నీసాటి వేల్పు లెందును!? కృష్ణా!**

అనే కృష్ణశతకపద్యాన్ని చిన్నతనంలో తల్లులు పిల్లలకు నేర్పుతారు. ఆ అజామిళునికథతో ఈ షష్ఠస్కంధం ప్రారంభమైంది.

జీవుడు నరకలోకంలో పడకుండా ఉండటానికి ఏది ఉపాయమని పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగీంద్రుణ్ణి అడిగాడు. హరినామస్మరణం ఒక్కటే ఉపాయమని శుకుఁ డీ కథ చెప్పాడు.

## అజామిళోపాఖ్యానం

కన్యాకుబ్జమనే పట్టణం ఉంది. ఆ పురంలో అజామిళుడనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. వాడు మహాపాపి. వట్టి నిర్భాగ్యుడు. అన్ని ఆచారాలు విడిచి పెట్టాడు. జూదాలాడుతాడు. చెడ్డవాదాలాడుతాడు. దొంగతనం చేస్తాడు. ఒక తొత్తును భార్యగా చేసుకొని పదిమంది కొడుకుల్ని కన్నాడు. మత్తుడై మోహసముద్రంలో మునిగాడు. అతడు భార్యను పిల్లల్ని లాలిస్తూ కాలం గడుపుతుండగా ముసలితనం వచ్చింది. 88 సంవత్సరాల ముసలి వాడయ్యాడు. తల వెంట్రుకలు తెల్లబడ్డాయి. అంగాల బలం తగ్గింది. తల వణకసాగింది. చూపు తగ్గింది. నాలుకరుచి తప్పింది. దంతా లూడాయి. దగ్గు మొదలైంది. తలనొప్పి వచ్చింది. మనస్సు చెదిరింది.

చిన్నకొడుకు పేరు నారాయణుడు. తాను, తన భార్య కడగొట్టుకొడుకును అల్లారుముద్దుగా పెంచసాగారు. ఆ బాలునికి తినిపిస్తూ, నీళ్ళుత్రాగిస్తూ, ఆడిస్తూ మృత్యువు వస్తుందనే మాటనే మఱచి పోయారు. అజామిళునకు మరణసమయం ఆసన్నమైంది. ఎంతో ప్రేమతో తన కుమారుని 'నారాయణా!' యని పిలుస్తూ అతడు ప్రాణాలు విడిచిపెట్టాడు. భయంకరులైన యమకింకరులు వచ్చి వాణ్ణి చుట్టుముట్టారు. పాశాలు ధరించి భయం కల్గిస్తూ భీతి కల్గిస్తూవచ్చిన యమదూతల్ని చూచి అజామిళుడు వణకుతూ 'నారాయణా!' అని తన కొడుకును పిలిచాడు.

**క. దూరమున నాడు బాలుఁడు, బోరనఁ దన చిత్తసీమఁ బొడఁగట్టిన నో**
**నారాయణ! నారాయణ!, నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్. (6-72)**

మరణసమయంలో 'నారాయణ' నామాన్ని ఉచ్చరించడం వల్ల అజామిళుఁడు చేసిన పాపాలన్నీ పటాపంచలైనాయి. వాణ్ణి తీసికొని వెళ్ళుటకై వైకుంఠం నుండి విష్ణుదూతలు వచ్చారు. అజామిళుణ్ణి చుట్టుముట్టిన యమదూతల్ని దూరంగా నెట్టివేశారు. విష్ణుదూతలకు-యమదూతలకు సంవాదం జరిగింది.

యమకింకరులు విష్ణుకింకరులను చూచి-"మీరెవరు? మీ రూపాలు కన్నుల కద్భుతంగా ఉన్నాయి. మాతో జగడాని కెందుకు వచ్చారు? యముని శాసనాలు మీకు తెలియవా! మీరు దేవతలా? సిద్ధులా? సాధ్యులా? పద్మాలవంటి కన్నులతో నాలుగు చేతులతో, దివ్యాయుధాలతో, నల్లనిమేఘకాంతులతో ఉన్న మీ రూపాలు మా కన్నులకు మిరుమిట్లు కొల్పుతున్నాయి. మీరు మమ్మల్ని ఎందుకు అడ్డుకొంటున్నారు? అని అడిగారు. అప్పుడు విష్ణుభటులు యమభటులతో ఇట్లన్నారు?" మీరు యమదూతలా, పుణ్యాత్ములెవరో? పాపకర్ములెవరో? ఎవర్నిఎలా దండించాలో మీకు తెలుసా?"- అని ప్రశ్నించారు. అది విని యమభటులు-వేదం చెప్పిందే ధర్మం. వేదంలో నిషేధింపబడింది అధర్మం. వేదమంతా శ్రీవిష్ణుస్వరూపం. ఈ అజామిళుఁడు బ్రాహ్మణవంశంలో పుట్టాడు. వేదాలు చదివాడు. గురువుల్ని సేవించాడు. సకలభూతాలయందు సమబుద్ధి కల్గి మంత్రసిద్ధులు పొందాడు. నిత్యం సత్యం పలికాడు. నిత్యకర్మలు, నైమిత్తికకర్మలు చేసేవాడు. లోభం మొదలైన దుర్గుణాలు విడిచి పెట్టాడు. మంచి గుణాలతో మెలిగాడు. అంత వీనికి క్రొత్తగా యౌవనం వచ్చింది.

యౌవనగర్వంతో మదం హెచ్చింది. కామవికారం కలిగింది. ముఖంలో చిరునవ్వులు మొదలయ్యాయి. దేహం పుష్టిగా బలసింది. తలజుట్టు నల్లనికాంతులతో మిసమిసలాడింది. తొడలు జిగిమీరాయి. భుజాలు పొడవుగా పెరిగాయి. వక్షఃస్థలం విశాలమైంది. దేహం కాంతులతో మెరసింది. ముఖం పద్మంలాగా వికసించింది. నూనూగుమీసాలు తుమ్మెదబారులాగా ఏర్పడ్డాయి. యౌవనంలో అడుగుపెట్టిన అజామిళునికి ఒక లతాగృహంలో ఒక వృషలి కనబడింది. ఆమె రూపం చూచి మోహంలో పడిపోయాడు. ఆ దాసీకాంత కూడా ఇతణ్ణి వలచింది. కల్లు తాగి మత్తెక్కిన ఆ దాసితో మన్మథకేళిలో ఓలలాడాడు. ఆమె చేసే పుంభావరతికి పరవశుడైనాడు. తాను పెండ్లాడిన కులస్త్రీని విడిచి పెట్టాడు. చుట్టాలను బాధపెట్టాడు. లోకాన్ని మరచి వృషలకాంతతో నిత్యం క్రీడించాడు. వేదచర్చ మాని ఆమె కుచద్వయాన్నే చర్చించాడు. తర్కశాస్త్రం మాని ఆమెతో ప్రణయతర్కానికి దిగాడు. ధర్మశాస్త్రపదాలు విడిచిపెట్టి ఆమె పదాలను అర్చించాడు. ఆ దాసీకాంతనే భార్యగా జేసుకొని ఆమె కుటుంబాన్నే పోషిస్తూ పాపాత్ముడై ప్రవర్తించాడు. ఇటువంటి పాపకర్ముణ్ణి, కుటిలుణ్ణి, ధూర్తుణ్ణి, క్రూరుణ్ణి మేము తీసుకొని వెళుతూ ఉంటే మీరెందుకు అడ్డుపడుతున్నారని ప్రశ్నిస్తున్న యమదూతల్ని చూచి విష్ణుదూతలు ఇట్లన్నారు.

ఈ అజామిళుడు కోటి జన్మలలో చేసిన పాపాలన్నీ మరణకాలంలో **'నారాయణ'** నామస్మరణం చేయడంతో పూర్తిగా తొలగిపోయాయి.

**సీ.** **బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని, కీలలు హరినామకీర్తనములు**
**గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ, గేకులు హరినామకీర్తనములు**
**తపనీయశౌర్యసంతమసంబునకు సూర్య, కిరణముల్ హరినామకీర్తనములు**
**మధుపానకిల్బిషమదనాగసమితికిఁ, గేసరుల్ హరినామకీర్తనములు**

**తే. గీ. మహితయోగోగ్రనిత్యసమాధివిధుల, నలరు బ్రహ్మాదిసురలకు నందరాని**
**భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య, ఖేలనంబులు హరినామకీర్తనములు. (6-118)**

శ్రీహరినామ కీర్తనలు బ్రహ్మహత్య మొదలైన అనేకపాపాలు అనే అడవులకు నిప్పుమంటల వంటివి. గురువుయొక్క భార్యతో కలవడం అనే దుష్టసర్పాలకు నెమళ్ళ వంటివి. బంగారాన్ని దొంగిలించడం అనే చీకట్లకు సూర్యకిరణాలు. కల్లు తాగడం అనే పాపపు ఏనుగులకు సింహాల వంటివి. నిత్యం యోగసమాధిలో ఉండే బ్రహ్మాదిదేవతలకు కూడా పొందడానికి వీలులేని మోక్షసామ్రాజ్యంలో, భోగభాగ్యక్రీడాసౌఖ్యాలను ఇచ్చేవి హరినామకీర్తనలు.

**సీ.** **ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్, కేలిమై హరినామకీర్తనములు**
**సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్, కేలిమై హరినామకీర్తనములు**
**మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్, కేలిమై హరినామకీర్తనములు**
**బహుకాలజనితతపఃఫలసారముల్, కేలిమై హరినామకీర్తనములు**

**తే.గీ. పుణ్యమూలంబు లనపాయపోషకంబు, లభిమతార్థంబు లజ్ఞానహరణకరము**
**లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ, లార్తశుభములు హరినామకీర్తనములు. (6-119)**

శ్రీవిష్ణుమూర్తి నామకీర్తనలు-ముక్తికాంత ఏకాంతంలో చేసే మోహనకృత్యాలు. బ్రహ్మలోకానందాన్ని కలుగచేసే సౌభాగ్యాలతో కూడినవి. మోక్షసామ్రాజ్యానికి అభిషేకం చేసేవి. మన మెన్నో జన్మాలలో చేసిన తపస్సుకు పండిన పండ్లరసాలవంటివి. పుణ్యాలకు మూలాలు. కోరిన కోరికలు తీర్చేవి. అజ్ఞానాన్ని హరించేవి. ఉపనిషత్తులవల్ల లభించేవి. అమృతాన్ని సేవించడం వంటివి. ఆర్తి పొందిన భక్తులకు శుభా లిచ్చేవి.

కోరదగింది, పుణ్యమార్గానికి నెలవైంది, మునీంద్రుల మనస్సులనే సరస్సుల్లో విహరించేది, నిర్మలమైంది అయిన శ్రీవిష్ణునామాన్ని కీర్తించేవాడు ధన్యుడు. అజామిళుడు పుత్రప్రేమతో 'నారాయణా' అని పిలిచినా శ్రీవిష్ణుమూర్తిని స్మరించినట్లే. అందువల్లనే పుట్టిన బిడ్డకు దేవుడిపేరు పెట్టాలి. బిడ్డను భగవంతుని పేరుతో పిలిచినా, భగవన్నామంతో ఆటలాడినా, గేలిచేసినా, పద్యంతోగాని, గద్యంతోగాని, గీతంతోగాని విష్ణువును గూర్చి పలికినా సకలపాపాలూ నశిస్తాయి. కిందపడినప్పుడూ, దుఃఖం కలిగినప్పుడూ, జ్వరంతో పలవరించినప్పుడూ, పాముకాటుకు గురైనప్పుడూ, పీడలు కలిగినప్పుడూ 'హరిహరీ!' అంటూ భగవంతుణ్ణి స్మరించిన వాళ్లకు నరకయాతన లుండవు. అజామిళుడు మరణకాలంలో హరినామస్మరణామృతం సేవించాడు. అదెలా వ్యర్థమౌతుంది?" అని విష్ణుదూతలు భాగవతధర్మాలు చెప్పి అజామిళుని విడువవలసిందని ఆదేశించారు. యమదూతలు యమలోకానికి వెళ్ళారు. విష్ణుదూతలు వైకుంఠానికి వెళ్ళారు. అజామిళుని మీదగల యమపాశాలు విడిపోయాయి. అతడు యమదూతల-విష్ణుదూతల సంవాదం విని శ్రీమన్నారాయణుణ్ణి ధ్యానించి విష్ణుభక్తుడయ్యాడు. అతని ఆత్మలో విష్ణుజ్ఞానదీపం ప్రకాశించింది. తాను చేసిన తప్పులు తలచుకొని పశ్చాత్తాపం పొందాడు. మోహం విడిచిపెట్టాడు. శ్రీకృష్ణుని దయను కోరాడు.

**క. హరిభక్తులతో మాటలు, ధర నెన్నడు జెడని పుణ్యధనముల మూటల్**
**వరముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు చొరని యరుదగు కోటల్. (152)**

అని తలచి గంగాద్వారం చేరి, యోగాభ్యాసంతో, శ్రీవిష్ణుమూర్తిని ఆత్మలో నిలిపి దేహం విడిచి, విష్ణుభటులు తెచ్చిన విమాన మెక్కి, వైకుంఠం చేరి సద్యోముక్తి పొందాడు.

యమభటులీ విషయమంతా యముడితో చెప్పారు. యముడు విష్ణుమహిమను కీర్తించాడు. ఇంద్రుడు, శివుడు, బ్రహ్మ కూడా విష్ణువు ప్రభావం తెలుసుకోలేరు. 1. శివుడు 2. బ్రహ్మ 3. కుమారస్వామి 4. కపిలుడు 5. నారదుడు 6. భీష్ముడు 7. మనువు 8. బలిచక్రవర్తి 9. జనకమహారాజు 10. ప్రహ్లాదుడు 11. శుకుడు 12. వ్యాసుడు - వీరు మాత్రమే వైష్ణవజ్ఞానులు. కాబట్టి, విష్ణునామాన్ని జపించే భక్తుల్ని మీరు దండించవద్దని యముడు యమభటులకు ఆజ్ఞాపించాడు.

**అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేబరమ్ ।**
**యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥ (భగవద్గీత 8-5)**

మరణం సమీపించిన అంత్యకాలంలో నన్నే స్మరిస్తూ ఎవడు దేహాన్ని విడిచిపెడతాడో అతడు నా స్వరూపాన్నే పొందుతాడు. ఏ మాత్రం సందేహం వద్దు – అని శ్రీ కృష్ణ భగవానుడు భగవద్గీతలో చెప్పిన శ్లోకానికి భాగవతంలోని ఈ అజామిళోపాఖ్యానం చక్కని ఉదాహరణం.

## దక్షప్రజాపతి కథ

ప్రచేతసుని కొడుకులైన ప్రాచీనబర్హి మొదలైనవారు పదిమంది సముద్రంనుండి వెలువడి పైకి వచ్చారు. అప్పుడు భూమి పెద్దపెద్ద చెట్లతో నిండి ఉంది. అప్పుడు వారు ఎంతో కోపంతో తమ ముఖాలనుండి భయంకరమైన గాలితో కూడిన నిప్పును పుట్టించి ఆ చెట్లను కాల్చివేయడం ప్రారంభించారు. అప్పుడు చంద్రుడు వచ్చి "ఓ మహానుభావులారా! మీరు చెట్లపై కోపించి దహింపజేసి నాశనం చేయడం న్యాయమా! సృష్టిప్రారంభంలో మొదటి ప్రజాపతి అయిన శ్రీమహావిష్ణువు – అన్నాన్ని, ఫలవృక్షాలను ప్రాణికోటికి అందివ్వాలని వనస్పతులలో ఓషధుల్ని, ధాన్యాన్ని సృష్టించి మానవజాతికి, చేతులులేని జంతువులకు ఆహారం సిద్ధపరచాడు. కాబట్టి దయచేసి వృక్షాలను తగులబెట్టకండి.

**ఉ. తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు; నేత్ర పంక్తికిన్ (6–200)**

చంటిపిల్లలకు తల్లిదండ్రులు, కన్నులకు రెప్పలు, స్త్రీకి భర్త, ప్రజలకు రాజు, అన్న మడిగేవారికి గృహస్థుడు, మూర్ఖులకు సజ్జనులు ఎప్పుడూ బంధువులుగా ఉంటారు. ముప్పు వచ్చినప్పుడు రక్షింపలేనివారు నిజమైన చుట్టాలు కారు. ఈ చెట్లనుండి ఒక అప్సరసను సృష్టించి మీకిస్తాను" అని చెప్పి 'మారిష' అనే కన్యను పుట్టించి వారికిచ్చి చంద్రుడు వెళ్లిపోయాడు. ఈ విధంగా మారిష ప్రచేతసులకు భార్య అయింది. ఆ ప్రచేతసులకు మారిషకు దక్షుడు పుట్టాడు. అతడు ప్రజాపతి అయ్యాడు.

ప్రాచేతసుడైన ఆ దక్షప్రజాపతి నరుల్ని, దేవతల్ని, గరుడుల్ని, పాముల్ని, కిన్నరుల్ని, రాక్షసుల్ని, యక్షుల్ని, పక్షుల్ని, పర్వతాల్ని, చెట్లను మరల సృష్టించాడు. సృష్టి చేసిన పిమ్మట దక్షుడు విష్ణుభక్తుడై వింధ్యపర్వతం చేరి 'అఘమర్షణ' తీర్థంలో స్నానంచేసి తపస్సు చేశాడు. "హంసగుహ్యం" అనే స్తవంతో శ్రీమహావిష్ణువును స్తోత్రం చేశాడు. దక్షుని తపస్సుకు మెచ్చి –

**క. సర్వేశుఁడు సర్వాత్ముఁడు, సర్వగతుం డచ్యుతుండు సర్వమయుండై**
**సర్వంబు చేరి కొలువఁగ, సర్వదుఁడై దక్షునకుఁ బ్రసన్నుండయ్యెన్. (6–220)**

శ్రీ మహావిష్ణువు ప్రత్యక్షమై అనేకవరాలిచ్చి పంచజనప్రజాపతి కూతురైన అసిక్నిని దక్షునకు భార్యగా ఇచ్చి అదృశ్యమయ్యాడు. ఆ దక్షునకు – అసిక్నికి హర్యశ్వులనే పేరుతో 10,000 మంది కుమారులు పుట్టారు. వారికి నారదుడు నివృత్తి మార్గం ఉపదేశింపగా వారు పెండ్లిండ్లు వద్దని తపస్సుచేసి మోక్షం పొందారు. తరువాత దక్షుడికి శబళాశ్వులనే పేరుతో వేలకొలది పుత్రులు పుట్టారు. నారదుడు వారికి కూడ నివృత్తిమార్గం ఉపదేశించి విరాగుల్ని చేయగా వారు సంసారాన్ని రోసి వివాహాలు తృణీకరించి తపస్సుచేసి ముక్తిపొందారు. ఇట్లు తన సంతానానికి వైరాగ్యాన్ని ఉపదేశించిన నారదమహర్షిపై దక్షుడు కోపించి "నీవు భాగవతులలో సిగ్గులేనివాడివై, కీర్తిలేక సంచరిస్తావు. ఎప్పుడూ త్రిలోకసంచారం చేసే నీకు ఏ లోకంలోనూ నిలుకడ లేకుండు గాక!' యని శపించాడు.

ఆ తరువాత అసిక్నీదక్షులకు 60మంది కూతుండ్రు జన్మించారు. వీరిలో 1. భానువు 2. లంబ 3. కకుప్పు 4. జామి 5. విశ్వ 6. సాధ్య 7. ఉరుత్వతి 8. వసువు 9. ముహూర్త 10. సంకల్ప అనే వాళ్లను ధర్ముడు పెండ్లాడాడు. ఈ విధంగా కశ్యపుడు 13 మందిని, చంద్రుడు 27 మందిని; భూతుడు ఇద్దరిని, ఆంగిరసుడు ఇద్దరిని, కృశాశ్వుడు ఇద్దరిని, తార్‌క్ష్యుడు నలుగురిని పెండ్లాడారు. వీరి సంతతితో, మనుమలతో, మునిమనుమలతో జగత్తు నిండిపోంది.

ఒకనాడు దేవతలు కొలుస్తూ ఉండగా, రంభ మొదలైన వారు నాట్యంచేస్తుండగా, మహేంద్రుడు శచీదేవిని తొడపై కూర్చోబెట్టుకొని సింహాసనంపై మహావైభవంతో ఉండినాడు. ఆ సమయంలో బృహస్పతి వచ్చాడు. ఇంద్రుడు స్వర్గలోకరాజ్య మదంతో సింహాసనంనుండి లేవలేదు. దేవగురువు అవమానంతో ఖిన్నుడై ఇంటికి పోయాడు. ఇంద్రుడు పశ్చాత్తాపం పొంది దేవగురువును సేవించడానికై అతని ఇంటికి వెళ్ళాడు. బృహస్పతి అధ్యాత్మమాయచే ఇంద్రునికి కనబడకుండ అదృశ్యుడయ్యాడు. ఈ విషయం రాక్షసులకు తెలిసింది. వాళ్లు శుక్రాచార్యులను ఆశ్రయించి దేవతలపై దాడిచేశారు. దేవతలకు–రాక్షసులకు పెద్ద యుద్ధమైంది. దేవతలు ఓడిపోయి బ్రహ్మలోకం చేరి బ్రహ్మకు నమస్కరించారు. బ్రహ్మ వారి కభయమిచ్చి. విశ్వరూపుడనే మహర్షిని ఆరాధించండి! మీకు జయం సిద్ధిస్తుందని చెప్పగా, దేవతలందరూ విశ్వరూపుణ్ణి సేవించారు. విశ్వరూపుడు **'శ్రీమన్నారాయణ కవచాన్ని'** వాళ్లకు ఉపదేశించాడు.

## నారాయణ కవచం

"విష్ణుమూర్తి నన్నురక్షించుగాక! వామనమూర్తి, నరసింహస్వామి, వరాహస్వామి, శ్రీరామచంద్రుడు, నారాయణుడు, నరుడు, దత్తాత్రేయుడు, కపిలుడు, సనత్కుమారుడు, హయగ్రీవుడు, నారదుడు, కూర్మస్వామి, ధన్వంతరి, ఋషభుడు. యజ్ఞదేవుడు, బలరాముడు, యముడు, ఆదిశేషుడు, వ్యాసమహర్షి, బుద్ధదేవుడు, కల్కి, రక్షింతురు గాక! కేశవ–గోవింద–నారాయణ–విష్ణు–మధు సంహర–త్రివిక్రమ–వామన–హృషీకేశ–పద్మనాభ– శ్రీవత్సధామ – సర్వేశ్వరేశ్వర–జనార్దన–విశ్వేశ్వర–కాలమూర్తి నామాలతో ఒప్పే శ్రీమన్నారాయణుడు కాపాడుగాక! సుదర్శన చక్రం, కౌమోదకీగద, పాంచజన్య శంఖం, నందక ఖడ్గం, శార్‌ఙ్గ ధనుస్సు అనే విష్ణుమూర్తి ఆయుధాలు కాచుగాక!". ఈ నారాయణకవచాన్ని పారాయణంచేసి ఇంద్రుడు రాక్షసులను జయించి పూర్వవైభవాన్ని పొందాడు.

విశ్వరూపుడికి 1. సురాపానం 2. సోమపానం 3. అన్నాదం – అనే మూడు తలలున్నాయి. ఈ తలలతో విశ్వరూపుడు యజ్ఞభాగాలు తీసుకొనివెళ్ళి రాక్షసులకు ఇచ్చేవాడు. అది తెలుసుకొని దేవేంద్రుడు అతని తలల్ని ఖండించాడు. 1. సోమపానశిరస్సు 'కపింజల'మైంది. 2. సురాపాన శిరస్సు 'కలవింక' మైంది. 3. అన్నాద శిరస్సు 'తిత్తిరి' అయింది. ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొంది.

విశ్వరూపుడి తండ్రి అయిన త్వష్ట కోపించి ఇంద్రునిపై మారణక్రతుహోమం చేశాడు. వృత్రాసురుడు పుట్టాడు. వృత్రాసురుడికి దేవతలకూ యుద్ధం జరిగింది. వృత్రుని ధాటికి ఆగలేక దేవతలు విష్ణుమూర్తిని శరణు పొందారు. స్తోత్రం చేశారు. "దధీచి అనే మహర్షి ఉన్నాడు. యాచించి అతని దేహం గ్రహించి, దాని ఎముకతో ఆయుధం చేసి సంధిస్తే వృత్రుడు చస్తాడని" మహావిష్ణువు ఉపాయం చెప్పాడు. ఇంద్రు డట్లే చేసి వృత్రాసురుణ్ణి వధించాడు. వృత్రాసురుని తేజస్సు శ్రీమహావిష్ణువులో లీనమైంది.

## చిత్రకేతూపాఖ్యానం

శూరసేనదేశానికి అధిపతి చిత్రకేతుడు. అతడికి కోటి మంది భార్యలున్నారు. కాని సంతానం లేదు. ఒకనాడు అంగిరసుడనే మహర్షి చిత్రకేతువు ఇంటికి వచ్చి పుత్త్రకామేష్టి చేసి, యజ్ఞశేషప్రసాదాన్ని అతన్ని పెద్దభార్య అయిన కృతద్యుతికిచ్చి నీకు పుత్త్రుడు కల్గుతాడని ఆశీర్వదించాడు. కృతద్యుతికి ఒక కుమారుడు పుట్టాడు. ఆమె సవతులు అసూయతో బాలునికి విషం పెట్టగా ఆ పసిబిడ్డ చనిపోయాడు. కృతద్యుతి పిల్లవానికై శోకించింది. అంగిరసుడు, నారదుఁడు వచ్చి చిత్రకేతుని చూచి వేదాంతజ్ఞానం ఉపదేశించి శ్రీమహావిష్ణువును సేవించమని మంత్రం ఉపదేశించాడు. చిత్రకేతుడు తీవ్రమైన తపస్సు చేశాడు. విష్ణుమూర్తి ప్రత్యక్షమై చిత్రకేతుణ్ణి విద్యాధరులకు రాజుగా చేసి ఒక దివ్యవిమానం ప్రసాదించాడు. చిత్రకేతుడు విష్ణుభక్తుడయ్యాడు.

**సీ. వాసించు నాత్మలో వైష్ణవజ్ఞానంబు, నాశించు భాగవతార్చనంబు (6-485)**

చిత్రకేతుడొకసారి కైలాసానికి వెళ్ళాడు. ఆ సమయంలో శివుడు పార్వతిని ఒడిలో కూర్చుండపెట్టుకొని కౌగిలించుకొంటూ ఉండినాడు. అలాంటి శివుణ్ణి చూచి చిత్రకేతుఁడు పకపకనవ్వి ఆక్షేపించాడు. అప్పుడు పార్వతి కోపించి "ఓరీ దురాత్మా! రాక్షసుడవై పుట్టు" మని శపించింది. చిత్రకేతుడు జగన్మాత కాళ్ళపైపడి నమస్కరించాడు. పరమేశ్వరునకు మొక్కాడు. ఆ చిత్రకేతుడే పార్వతీదేవి శాపంవల్ల త్వష్ట చేసే యజ్ఞంలో దక్షిణాగ్నినుండి వృత్రాసురుడుగా పుట్టాడు. పూర్వజన్మలో విష్ణుభక్తుడైన వృత్రాసురుడు ఇంద్రుని చేతిలో మరణించినప్పటికీ పూర్వ జన్మ జ్ఞానం వల్ల శ్రీమహావిష్ణువులో లీనమయ్యాడు. విష్ణుసేవ అంత గొప్పది.

## ఏర్చూరి సింగన

ఇతడు శ్రీవత్సగోత్రుడు. ఆపస్తంబసూత్రుడు. ఏర్చూరు గ్రామనివాసి. ఏర్చూరు నల్లగొండ మండలంలో ఉంది. ఏర్చూరిఎర్రన ఈయన మూలపురుషుడు.

ఆంధ్ర సాహిత్యంలో ముగ్గురు ఎర్రనలు ఉన్నారు.

1. చదలవాడ ఎర్రన (14శ.) - 1. అరణ్యపర్వశేషం 2. నృసింహ పురాణం 3. హరివంశం 4. రామాయణం ఇతని రచనాలు.

2. ఏర్చూరి ఎర్రన (14శ.) – ఏర్చూరి సింగన ముత్తాతకు తండ్రి

3. కూచిరాజు ఎర్రన (15శ.) – 1. కొక్కోక 2. సకల నీతినిధాన 3. పురాణసార కర్త

ఏర్చూరి ఎర్రన ఏర్చూరు గ్రామానికి కరణంగా ఉండేవాడు. ఇతని కొడుకు వీరన. ఇతని కొడుకు – ఆదయ. ఆదయ భార్య పోలమ్మ. ఈ దంపతులకు కసువన, వీరన, సింగన పుట్టారు. కసువన భార్య ముమ్మడమ్మ. ఈ పుణ్యదంపతులకు సింగన, తెలగన అనే ఇద్దరు పుత్త్రులు కలిగారు. ఈ సింగనే భాగవత షష్ఠస్కంధాన్ని పూరించిన కవి.

**సింగన వంశ వృక్షం**

ఏర్చూరి ఎఱ్ఱన

|

వీరన

|

ఆదయ్య: భార్య పోలమాంబ

|

1. కసువన: భార్య ముమ్మడమ్మ 2. వీరన 3. సింగన

|

1. సింగన్న, షష్ఠ స్కంధ కర్త 2. తెలగన్న

**సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డా, పస్తంబసూత్రుఁ డపార గుణుఁడు**
**నేర్చూరి శాసనుం డెఱ్ఱన ప్రెగ్గడ, పుత్త్రుండు వీరన పుణ్య మూర్తి... (6-26)**

అనే పద్యంలో స్పష్టంగా చెప్పబడింది.

పోతన భాగవతంలోని షష్ఠస్కంధం ఎక్కువగా శిథిలం కావడంచేత హరిభట్టు, నంది మల్లయ - ఘంట సింగనలు కూడా షష్ఠస్కంధాల్ని వేర్వేరుగా రచించారు. సింగన షష్ఠస్కంధంలోని శిథిలభాగాలను పూరించి 37 పద్యగద్యాలు గల అవతారికను జోడించి, శ్రీకృష్ణపరంగా స్కంధాద్యంత పద్యాల్ని రచించి తన పేర గద్యాన్ని వ్రాసుకొన్నాడు.

"ఇది శ్రీసకలసుకవిజనమిత్ర శ్రీవత్సగోత్రపవిత్ర కసువయామాత్యపుత్త్ర బుధజనప్రసంగానుషంగ సింగయనామధేయప్రణీతంబైన శ్రీమహాభాగవతపురాణమునందు........షష్ఠస్కంధము."

కాని, కొన్ని తాళపత్రప్రతులలో పోతనగద్యమే ఉంది. ఆం.ప్ర.సా.అకాడమీ ప్రతిలో ఇలా చెప్పబడింది.

1. క.2. నెం. 1203. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు వారిది. ఇది జ్ఞాన విద్యుత్ ప్రవాహినీ - ఆంధ్ర భాషా నిలయం ఖమ్మంనుండి కాకినాడ చేరుకొన్నది. తెలంగాణం ప్రతి. దీనిలో షష్ఠస్కంధం కూడ పోతనా మాత్య విరచితమనే ఉంది. అష్టమస్కంధం చివర 'రాక్షస నామ సంవత్సర చైత్ర శు॥ 13 మందవాసరం (క్రీ.శ. 31-3-1855) అని ఉంది.

2. త.2.నెం.4140. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిది. తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు సంపాదించింది. దీని పంచమస్కంధంలో ఆశ్వాస విభజనం లేదు. షష్ఠస్కంధం పోతనామాత్యుని పేరుతో ఉంది.

3. బ.2.నెం.3941. కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్తు వారిది. దూపాటిసోదరులు తెలంగాణం నుండి సేకరించి పంపింది. ఇందులో షష్ఠస్కంధం కూడ పోతనామాత్యవిరచిత మని ఉంది. అష్టమస్కంధం చివర రాక్షసనామ సంవత్సర బహుళపంచమీ స్థిరవారం (క్రీ.శ. 27-2-1796) నాటికి రంగరాజు వెంకటనరుసు రాసినట్లు చెప్పబడింది.

ముద్రితప్రతులలో షష్ఠస్కంధారంభంలో –

శా. **శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత లక్ష్మీచారువక్షస్థుల**
**శ్రీవిభ్రాజితనీలవర్ణు శుభరాజీవాక్షుఁ గంజాతభూ**
**దేవేంద్రాది సమస్తదేవ మకుటోద్దీప్తోరురత్నప్రభా**
**వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్.**

అనే పద్యమున్నప్పటికీ కొన్ని తాళపత్రప్రతుల్లో శ్రీరామసంబోధన గల కందపద్యమే ఉంది.

తంజవరపువారి ప్రతిలో పాదటిప్పణిలో యిలా రాయబడి ఉంది –

**'శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత'**.... కొన్ని ప్రతులలో ఈ పద్యానికి మారుగా

క. **భూతనయా హృదయస్థిత!, పాతకహర! సర్వలోకపావన! భువనా**
**తీతగుణాశ్రయ! యతివి, ఖ్యాతసురార్చితపదాబ్జ! కరుణానిలయా!** అనే పద్యం ఉంది.

ఈ పద్యం శ్రీకారంతో ప్రారంభం కాలేదు. అందుచే ఇది పోతన పద్యం కాదు. అకాడమీవారిప్రతిలో పాదటిప్పణిలో ఇలా ఉంది –

**శ్రీవత్సాంకిత కౌస్తుభస్ఫురిత......**

ఈ పద్యం క–ట–డ–బ లలో లేదు. 4140 క. లో ఈ క్రింది పద్యం ఉంది.(తాళపత్ర ప్రతులకు ఈ క,ట,డ,బ,లు సంకేతాక్షరాలు)

క. **శ్రీరామనామ! పావన, కారుణ్య సరోజనేత్ర! కౌసల్యసుతా!**
**భారతిపతి మునిసేవిత!, చారుకృపాలోల! రామచంద్ర నృపాలా!**

ఆంధ్ర సాహిత్య పరిషత్తు (15) 1533; 1468 లలోను; జ.ట.డ.బ.లలోను ఈ కింది పద్యముంది. (జ,ట,డ,బ,లు తాళపత్ర ప్రతులకు సంకేతాక్షరాలు)

క. **శ్రీవిశ్వభారభరణా, ప్రావీణ్య విభాసమాన ఫణిరాణ్ణిభ బా**
**హావిపుల విజయదోహల!, రావణమదకరిమృగేంద్ర! రామనరేంద్రా!**

ఈ పద్యం అచ్చంగా పోతన శైలిలో ఉంది. స్కంధాంతకంద పద్యంలో

**'రామరాజాఖ్యనిధీ'** అని ఉంది. ఇది పోతన పద్యమే.

షష్ఠస్కంధాంతంలో ఉండే –

**తరలం.** **మురవిదారణ! ముఖ్య కారణ! మూలతత్త్వవిచారణా!**

అనే తరలపద్యం తృతీయస్కంధాంతంలోగల –

**తరలం. పరమపావన! విశ్వభావన! బాంధవప్రకరావనా!**

అనే పద్యానికి ప్రతిబింబం.

షష్ఠస్కంధంలో - **అజామిళోపాఖ్యానం, చిత్రకేతూపాఖ్యానం,** ఇంకా **అఖిల ప్రమాదంబులైన** (6-307), **ఇట్లు భయార్తులై** (6-326) మొదలైన వచనాలు పూర్తిగా పోతనవే. శేషాద్రిరమణకవులు ఇలా చెబుతున్నారు.

"పంచమస్కంధ - షష్ఠస్కంధాలలో చాల భాగం ఉత్సన్నంకాగా కొంత పోతన రచన, మరికొంత తమరచన నింపి మాతృకనుండి లభించిన పద్యాలూ చేర్చి, తలలు మార్చి, కొత్త మార్పులు కూర్చి పూర్వ గ్రంథస్కంధాలలో నిలబెట్టినట్లు తెలుస్తున్నది. భాగవతపూర్వపీఠికాకారులందరూ ఏకముఖంగా గంగన - సింగనల కవిత పోతన కవితతో పోలికలు కలగి ఉందని చెప్పడానికి ఇదే తార్కాణం. పంచమస్కంధంలో బొప్పరాజు గంగయ్య ఏ కొద్దిగానో స్వశక్తిని ఉపయోగించి నష్టభాగాలకు కథాంశాలకు కూర్పు చేసి కొంత సొంత కవిత్వం చేర్చినట్లు తోస్తున్నది. షష్ఠస్కంధంలో 307, 326 వచనం, అజామిళోపాఖ్యానం, చిత్రకేతూపాఖ్యానం పోతనామాత్య కృతమేనని సర్వవిధాలా నమ్మదగి ఉంది. దానిలో పోతన అభిమానించే అంత్యనియమాలు, సాంస్కృతిక దీర్ఘసమాసాలు, సీసపద్యనియమాలు విశేషంగా ఉన్నాయి. విమర్శకులు షష్ఠస్కంధాన్ని పోతనకవిత అనే మనోవిశ్వాసంతో మరల చదివితే మా ఊహతో ఏకీభవింపక పోరు". (వావిళ్ళ ప్రతి పీఠిక - పు83)

షష్ఠస్కంధంలో కొంత శిథిలంకాగా అవతారికాపద్యాలు చేర్చి, కథాభాగాల్ని కలిపి సింగన పూరించాడు. హరిభట్టు కూడా షష్ఠస్కంధాన్ని రచించాడు. ఈ రెండు గ్రంథాలలో కొన్ని పద్యాలు సమానంగా ఉండడంచేత ఇవి పోతన కవిత్వమనేది స్పష్టం. షష్ఠస్కంధంలో కూడా పోతనకవిత్వం ఉందని సారాంశం.

శిథిలస్కంధాల్ని పూరించిన కవులు ముగ్వురిలో సింగన కవితాకుశలుడుగా కనపడ్తాడు. ఈయన షష్ఠ స్కంధపూరణమే కాక 'కువలయాశ్వ చరిత్ర' మనే ప్రబంధాన్ని కూడా రచించాడు. ఈ కావ్యం ఈనాడు లభింపకపోయినా పెదపాటి జగ్గకవి ప్రబంధ రత్నావళిలో ఉదహరించిన 12 పద్యాలు లభిస్తున్నాయి. ఈ పద్యాల్ని ఒకచోట చేర్చి వివరించిన ఆరుద్రగారు అభినందనీయులు.(స.ఆం.సా. 5వసం)

సింగన కువలయాశ్వచరిత్ర లభింపక పోవడం మన దురదృష్టం. ఇప్పుడు సవరం చిన నారాయణకవి రచించిన కువలయాశ్వచరిత్ర లభిస్తూ ఉంది.

## ఛందో విశేషాలు

సింగనామాత్యుడు ఈ స్కంధంలో 1. వసంతతిలక 2. తరలం 3. మంగళ మహాశ్రీ 4. లయగ్రాహి 5. స్రగ్ధర 6. ఇంద్రవజ్రం 7. వనమయూరం 8. ఉత్సాహ 9. మహాస్రగ్ధర 10. స్రగ్విణి 11. తోటకం - అనే విశేషవృత్తాల్ని వాడాడు.

**1. ఇంద్ర వజ్రం**

**సంధించి నీ యంగక - సంధులెల్లన్** (6-310)

**'ఇత్తా జగాలై తగు - నింద్ర వజ్రన్'** - అని చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహం

ఇంద్రవజ్రంలో ప్రతిపాదంలో - 'త-త-జ-గ-గ.' అనే గణాలుంటాయి. 8వ యక్షరం యతిస్థానం.

**2. ఉత్సాహం**

**గజము దెరలి దాని కొఱలి - గర్జ లిడుచుఁ బాఱఁగా** (6-389)
గ్రాహవైరి యర్వురినులు - గలసియైన వేఱుగా
నీహఁగూర్చియైన గణము - లేడు చేసి గురువుతో
నాహితోక్తినాల్గుగణము - లైన యతులు గూర్పను
త్సాహ యయ్యె విషమసీస - సంజ్ఞ నిది వహింపఁగాన్ - లక్షణ సార సంగ్రహం. ఉత్సాహలో బ్రతిపాదంలో 7 సూర్య గణాలు (న-హ) 1 గురువు ఉంటాయి. 5 వ గణం మొదటి అక్షరం యతిస్థానం.

**3. తరలం**

దీనిలో 5 తరల పద్యాలు (102) (169) (256) (449) (528) ఉన్నాయి. **బహుళదృక్పరిపాక మోహని - బద్ధుఁడౌచుమనంబులో** (6-102) **'భవయతిన్ దరళంబెసంగున - భంబులున్ రసజాగముల్.'** అని లక్షణ సంగ్రహం. తరలంలో ప్రతిపాదంలో - 'న-భ-ర-స-జ-జ-గ' గణాలుంటాయి. 12 వ యక్షరం యతిస్థానం.

**4. తోటకం**

**కరుణాకర! శ్రీకర! కంబుకరా!** (6-529)
'తుదిదాఁకససాసలఁదోటకమౌ'- లక్షణసారసంగ్రహం
తోటకవృత్తంలో ప్రతిపాదంలో 'స-స-స-స' గణాలుంటాయి.
9వ యక్షరం యతిస్థానం

**5. మహాస్రగ్ధర**

**హరిపై సర్వాత్ముపైన - త్యగణిత గుణుపై - నంతరంగంబు పర్వన్.** (6-403)
'కరిమౌనుల్ వళ్‌మహా స్ర-గ్ధర సతతనసల్-గల్గి రాగంబులుండున్.' లక్షణ సారసంగ్రహం
మహాస్రగ్ధరలో ప్రతిపాదంలో 'స-త-త-న-స-ర-ర-గ' అనే
గణాలుంటాయి. 9-16 అక్షరాలు యతిస్థానాలు.

**6. మంగళ మహాశ్రీ**

**ఈ విధమునన్ విబుధు-లేకతమ చిత్తముల-నేకతములేక హరినీశున్.** (6-184)

'ఆ భజసనద్వయగ- గాన్వితములైయతిగ-జాహులగు మంగళమహాశ్రీ' - అని లక్షణ సార సంగ్రహం

మంగళమహాశ్రీలో ప్రతిపాదంలో - 'భ-జ-స-న-భ-జ-స-న-గగ'- గణాలుంటాయి. 9-17 అక్షరాలు యతిస్థానాలు.

ఇక్కడ ఒక్క విశేషం – తాళపత్రప్రతుల్లో మంగళమహాశ్రీ పద్యానికి బదులుగా కింది లయగ్రాహి పద్యం ఉంది.

**ఈ విధమునన్ విబుధులే కతమ చిత్తముల –**
**నేకతములేకపర–మేశు హరినీశున్**
**భావమున నిల్పితగు–భాగవతయోగపరి –**
**పక్వమున నొందుదురు–పాలుపడివారున్**
**దేవలదు దండనగ–తిం జనదు మాకు గణు–**
**తింపనఘముల్ దొలఁగుఁ–దెల్లమగుమీఁదన్**
**శ్రీవరుని చక్రము వి–శేషగతిఁగాచుసుర –**
**సేవితుల ముక్తిఁగదుఁ–జెందుదురు పెద్దల్**

ఈ పద్యంలో ప్రాసయతులకు మారుగా యతులు ఉన్నాయి.

**7. లయగ్రాహి**

దీనిలో పై పద్యం గాక మూడు లయగ్రాహు (324) (373) (385) లున్నాయి.

**వీఁడు కదుదుర్దముఁడు–వాఁడి మొనకైదువులు –**
**పోఁడిసెడఁగా మెసఁగిఁయాడుగనకున్నా.** (6–324)

లయగ్రాహిలో ప్రతిపాదంలో' భ–జ–స–న–భ–జ–స–న–భ–య'– గణాలుంటాయి. 9–17–25 స్థానాల్లో ప్రాసయతులుంటాయి.

**ముందు భజసల్ నగణ–మందు నిరుచోటులను**
**నొంద భయలందుఁ బయిఁ–జెందఁగ లయగ్రా**
**హిందగు విరామములు–చెందవుసుమీ పవన**
**నందన! సురేషముని–బృందనుత శౌర్యా!**

ఇక్కడ మొదటి లయగ్రాహిలో యతులున్నాయి కాని ప్రాసయతులు లేవు. తక్కిన మూడు పద్యాలలో ప్రాసయతి పాటింపబడింది. ఇది దోషంకాదు. 'కవి సార్వభౌమ' శ్రీశ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి శ్రీకృష్ణభారతంలో యతినియమంతో, ప్రాసయతినియమంతో రెండు విధాలుగా లయగ్రాహులు రచించారు.

**'ప్రాజ్ఞుఁడు సుయజ్ఞనృపు–యజ్ఞమును దాశరథి –**
**యజ్ఞమును వైశ్రవణు–యజ్ఞమును వేధో (ఆది–3–350)**
**అంతగురునాజ్ఞఁగొని–యారవి కుమారుఁడపు –**
**దర్జునుఁడు చూపినమ–హాస్త్ర విధులెల్లన్. (ఆది–7–66)**

**8. వనమయూరం**

**అంత సురలేయు నిబి-డాస్త్రములపాలై.** (6-378)

**ఈభజసనల్ గగము-'నిందువదనాఖ్యన్'**
**ఒప్పునదియే 'వనమ-యూర' మహివళ్ళన్**

వనమయూరంలో ప్రతిపాదంలో 'భ-జ-స-న-గగ' గణాలుంటాయి. 9వ యక్షరం యతిస్థానం.

**9. వసంతతిలక**

**హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ** (6-20)

ఇది సంస్కృతశ్లోకం

'ఉక్తా వసంత తిలకా తభజా జగౌగః' - అని వృత్తరత్నాకరం.

వసంతతిలకలో ప్రతిపాదంలో - 'త-భ-జ-జ-గగ' గణాలుంటాయి. 8వ అక్షరం యతిస్థానం.

**10. స్రగ్ధర**

**దండిం గోదండ కాండో-ద్ధతరథహయవే-దండతండంబుతోడన్.** (6-272)

స్రగ్ధరలో ప్రతిపాదంలో 'మ-ర-భ-న-య-య-య' గణాలుంటాయి. 8-15 అక్షరాలు యతిస్థానాలు.

**11. స్రగ్విణి**

**వ్రాలి యోపుత్త్ర నీ-వార్తదంభోళియై.** (6-453)

షడ్యతిన్ రారరల్-స్రగ్విణీవృత్తమౌ. లక్షణ సార సంగ్రహం.

స్రగ్విణీ వృత్తంలో ప్రతి పాదంలో 'ర-ర-ర-ర' గణాలుంటాయి. 7వ యక్షరం యతిస్థానం.

**12. సీస విశేషాలు**

సీ. **దండంబు యోగీంద్ర-మండలనుతునకు, దండంబు శార్ఙ్గ కో-దండునకును (6-336)**

ఈ సీస పద్య పాదాలన్నీ ప్రాసయతులతోనడిచాయి. ఇది అవకలి ప్రాస సీసం.

## పూర్వకవుల అనుకరణలు

**బాణుడు - సింగన**

వ. **కుబేరుభాండాగారంబునుంబోలెఁబద్మ మహాపద్మ శంఖమకర కచ్ఛప ముకుంద కుందనీలవరసమగ్రంబై, విష్ణు కరకమలంబునుంబోలె సుదర్శనావర్త ప్రగల్భంబై........(6-326)**

ఈ వచనం బాణుని కాదంబరీశైలితో శ్లేషోపమలతో నడచింది.

**నాచన సోమనాథుడు - సింగన**

**వ. కుంతంబులం గ్రుచ్చుచుఁ, గుఠారంబుల వ్రచ్చుచు; ముసలంబుల మోదుచు, ముద్గరంబులన్ బాదుచుఁ జక్రంబులం ద్రుంచుచుఁ, బరిఘంబుల నొంచుచు........(6-370)**

ఈ వచనం నాచనసోమన ఉత్తరహరివంశశైలిలో సాగింది.

**పోతన - సింగన**

**ఆ.వె. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన (1-17)**

**ఆ.వె. భాగవతము తేట పఱుపనెవ్వఁడు సాలు, శుకుఁడుదక్క నరునిసకుఁడు దక్క (6-23)**

**శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ**
**బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై... (8 స్క-5-927)**

**శా. ఆ లీలావతి గండపాళికలపై హాసప్రసాదంబుపై... (6-103)**

పోతన వలెనే సింగన కూడా పెక్కు పద్యాల్ని అంత్యానుప్రాసలతో రచించాడు.

**క. కింకరుల ధర్మ రాజవ, శంకరుల దురంతదురిత సమధిక జననా (6-68)**
**శ్యామఁగుసుమాస్త్రఖేలన - కామగులస్త్రీలలామఁ గమనీయగుణ (6-103)**

**శ్రీనాథుడు - సింగన**

కాశీఖండంలో 'గుణనిధి' కథను, శివరాత్రిమాహాత్మ్యంలో 'సుకుమారచరిత్ర'ను శ్రీనాథమహాకవి రసవత్తరంగా రచించాడు. శ్రీనాథుని ప్రభావం అజామిళుని కథపై ఉంది.

**ఉ. పంకరుహాక్షి యేద్చెఁ బరిభావిత పంచమ సుస్వరంబునన్. (451)** అని వర్ణించడం శ్రీనాథుని ప్రభావమే.

## సింగన - మాదయ గారిమల్లన

**ఆ. వె. ఒనర నీశుసేవ యోగిమానససరో, వాసుసేవ హేమవాసుసేవ (6-125)**
**సీ. కడలేని సంసార జడధిలో మునిఁగిన**
**జనులపాలిటి నావ శంభుసేవ (రాజశేఖర - )**

**సింగన - తెనాలి రామకృష్ణ కవి**

**సీ. సముచిత శ్రుతిచర్చ చర్చింపనొల్లక**
**సతికుచద్వయచర్య చర్చసేయుఁ**
**దర్కకర్కశపాఠతర్కంబుగాదని**
**కలికితోఁ బ్రణయతర్కంబుసేయు (6-107)**

సీ. ఉష్ణాని హోమాగ్నినూఁద నొల్లఁడుగాని
విరహజ్వరార్తి చే వెచ్చనూర్చు
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడుగాని
విటవాదములు తీర్చువేఁగిలేచి (పాండు-3-)

**శ్రీహరి నామ మాహాత్మ్యం**

విష్ణుమూర్తి నామస్మరణ మహిమను చెప్పడం. షష్ఠస్కంధ ప్రధానలక్ష్యం.

**ఉ. కూలిన చోటఁగొట్టుపడి కుందిన చోట మహాజ్వరాదులం**
**బ్రేలిన చోట సర్పముఖపీడల నందిన చోట నార్తులై**
**తూలిన చోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న**
**క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్. (6-123)**

ఎల్లప్పుడూ హరినామస్మరణం చేసే వాడికి యమయాతన లుండవు.

**ఉ. మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం**
**బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యుగణేశు దేవతా**
**హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచితభక్తఫలప్రదాయకున్**
**మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. (6-4)**

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలో ఈ పద్యాన్ని ఉదాహరించారు కాని ఏ గ్రంథంలోనిదో తెలుపలేదు. ఇది షష్ఠస్కంధం అవతారికలో ఇష్టదేవతాస్తుతిలోని పద్యం.

శ్రీ మన్నారాయణకవచంలోని ఈ కింది పద్యాన్ని నిత్యం పఠిస్తే సమస్తపీడలు తొలగుతాయి.

**చ. అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్నికీలలం**
**దెదరుల నెల్ల నాకు నుతికెక్కఁగ దిక్కగుఁగాక! శ్రీనృసిం**
**హుఁడు సురశత్రుయూథపవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాసవ**
**క్త్రుఁడు ఘనదంష్ట్ర పావక విధూతదిగంతరుఁ డప్రమేయుఁడై. (6-303)**

*శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు*

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుడు
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

తిరుపతి,
23-01-2017.

# సప్తమస్కంధ ప్రాశస్త్యం

**భా**గవతంలోని పూర్వషట్కంలో (1–6 స్కంధాలవరకు) వేదాంతఘట్టాలు ఎక్కువగా ఉండడంవల్ల రచన శాంతంగా సాగింది. ఉత్తరషట్కంలో సప్తమస్కంధంనుండి భక్తుల కథలు ఉపాఖ్యానాలు ఎక్కువగా ఉండడంవల్ల పోతన ఎక్కువగా విజృంభించాడు. రసవంతాలైన ఘట్టాలన్నీ ఈ స్కంధం నుండే ప్రారంభమయ్యాయి.

శ్రీహరి ద్వారపాలకులైన జయవిజయులకు సనకసనందనాదులు శాపం ఇవ్వటం, జయవిజయులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టటం, హిరణ్యాక్షుని శ్రీయజ్ఞవరాహమూర్తి సంహరించగా దితి దుఃఖించటం, హిరణ్యకశిపుడు వేదాంతాన్ని చెప్పి తల్లిని ఓదార్చటం, యముడు చెప్పిన సుయజ్ఞోపాఖ్యానం, హిరణ్యకశిపుని తపస్సు, బ్రహ్మ వరాలివ్వటం, హిరణ్యకశిపుడు లోకాలను పీడించటం, ప్రహ్లాదచరిత్ర, హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని బాధపెట్టటం, నరసింహస్వామి భయంకరమైన ఆకారంతో స్తంభంనుండి ఉద్భవించి హిరణ్యకశిపుని వధించటం, దేవతలందరు నరసింహస్వామిని స్తుతించటం, ప్రహ్లాదుడు నమస్కారం చేసి పాదాలపైబడి స్తుతించి నరసింహస్వామిని శాంతింపచేయటం, నరసింహస్వామి ప్రహ్లాదుని తలపై అభయహస్తాన్ని పెట్టి దీవించటం, బ్రాహ్మణులు ప్రహ్లాదునికి పట్టం కట్టటం, త్రిపురాసురసంహారం, నారదుడు ధర్మరాజుకు వర్ణాశ్రమధర్మాలు చెప్పటం, ప్రహ్లాద – అజగర సంవాదం, నారదుని పూర్వజన్మవృత్తాంతం సప్తమస్కంధంలోని ప్రధానవిషయాలు.

ప్రాయోపవేశంలో ఉన్న పరీక్షిత్తు శుకమహర్షిని చూచి "శ్రీమహావిష్ణువు సర్వభూతాలను సమానంగా చూచేవాడు కదా? అతడు ఇంద్రుని రక్షించటానికి రాక్షసులను ఎందుకు వధించాడు? రాక్షసులను చంపి దేవతలను కాపాడటం వల్ల విష్ణుమూర్తికేమి లాభం కలిగింది?" అని అడిగాడు.

అప్పుడు శుకమహర్షి పరీక్షిత్తును చూచి "శ్రీమహావిష్ణు చరిత్రలు అతివిచిత్రమైనవి. నీ వడిగిన ప్రశ్నలు ధర్మరాజు నారదమహర్షిని అడుగగా అతడు వివరించాడు. అది నీకు చెబుతాను విను" అని యిట్లు చెప్పెను.

"ధర్మరాజు రాజసూయయాగం చేసి శ్రీకృష్ణునికి అగ్రపూజ చేశాడు. అది సహించలేక శిశుపాలుడు శ్రీకృష్ణుని కఠినంగా నిందించాడు. శ్రీకృష్ణుడు చక్రంతో శిశుపాలుని శిరస్సును ఖండించాడు. శిశుపాలుని దేహంనుండి దివ్యతేజస్సు వచ్చి శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. అప్పుడు ధర్మరాజు ఆశ్చర్యం పొంది, పరమయోగులైనా కూడా శ్రీకృష్ణునిలో చేరటం దుర్లభం. దుష్టుడైన శిశుపాలుడు శ్రీకృష్ణునిలో ఎలా ఐక్యం చెందాడు" అని అడిగాడు. అప్పుడు నారదుడు ఇలా చెప్పాడు.

కోపంతోనైనా, స్నేహంతో నైనా, కోరికతోనైనా, బంధుత్వంతోనైనా శ్రీమహావిష్ణువును స్మరించటంవల్ల ముక్తి లభిస్తుంది. నారాయణుణ్ణి చేరడానికి సాధుభక్తి కంటె వైరభక్తే గొప్పదని నాకు తోస్తున్నది. తుమ్మెద ఒక కీటకాన్ని తెచ్చి దాని చుట్టు శబ్దం చేయటం వలన ఆ కీటకం కూడ తుమ్మెద అవుతుంది కదా!

**శా. కామోత్కంఠత గోపికల్; భయమునం గంసుండు; వైరక్రియా**
**సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్; సంబంధులై వృష్ణులున్ (7-18)**

కామం వల్ల గోపికలు, భయం వల్ల కంసుడు, శత్రుత్వం వల్ల శిశుపాలుడు మొదలైనవారు, బంధువులై వృష్ణులు, యాదవులు, ప్రేమవల్ల మీరు (పాండవులు), భక్తి వల్ల మేము (నారదాదులు) శ్రీకృష్ణుణ్ణి చూడగల్గుతున్నాము. మార్గం ఏదైనా నిరంతరధ్యానం వలన విష్ణుపదం లభిస్తుంది.

ఒకనాడు బ్రహ్మవేత్తలు, భగవద్భక్తులు ఐన సనకసనందనాదులు శ్రీహరిని చూడటానికి వైకుంఠానికి వెళ్ళారు. ద్వారపాలకు లైన జయవిజయులు వారిని అడ్డగించారు. వారు కోపించి మీరు రాక్షసులై భూలోకంలో పుట్టండి అని శపించారు. వారు శ్రీహరితో ఈ శాపవిషయాన్ని మొఱపెట్టుకోగా మూడు జన్మల తరువాత మీకు వైకుంఠప్రాప్తి కలుగుతుందని కరుణించాడు. ఆ జయవిజయులు మొదటిజన్మలో హిరణ్యాక్ష, హిరణ్యకశిపులై పుట్టగా శ్రీహరి వరాహ-నరసింహరూపాలతో వారిని సంహరించాడు. రెండవ జన్మలో రావణ-కుంభకర్ణులై పుట్టగా శ్రీరాముడై విష్ణువు వారిని వధించాడు. మూడవజన్మలో వారే శిశుపాల-దంతవక్త్రులై పుట్టారు. వారిని కృష్ణుడు సంహరించాడు. శాపం పూర్తి అవటం వల్ల శిశుపాలదంతవక్త్రుల తేజస్సు శ్రీకృష్ణునిలో లీనమైంది.

హిరణ్యాక్షుని యజ్ఞవరాహస్వామి చంపాడు. దానికి కోపించి హిరణ్యకశిపుడు విష్ణువుతో శత్రుత్వాన్ని పొంది లోకాలను బాధించాడు. చనిపోయిన హిరణ్యాక్షుని చూచి అతని భార్యాబిడ్డలు దుఃఖించారు. తల్లియైన దితి ఎక్కువగా బాధపడింది. ఆమెను ఓదార్చటానికి హిరణ్యకశిపుడు ఈ కథను చెప్పాడు.

## సుయజ్ఞోపాఖ్యానము

ఉశీనరదేశంలో సుయజ్ఞుడు అనే రాజు ఉండేవాడు. అతణ్ణి శత్రువులు చంపారు. ఆ రాజు భార్యలు అతని శరీరంపై పడి ఏడుస్తున్నారు. ఆ సాయంసమయంలో యముడు బాలుని రూపంలో వచ్చి ఇలా చెప్పాడు.

**ఉ. మచ్చిక వీరి కెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్**
**జచ్చుట కూడఁ జూచెదరు, చావక మానెడి వారి భంగినీ (7-46)**

ఈ దేహం పంచభూతాలతో ఏర్పడినది. మళ్ళీ పంచభూతాలలోనే కలుస్తుంది. ఈ సుయజ్ఞుడు ఎప్పుడో దేహంలో నుండి వెళ్ళిపోయాడు. అతడు మీ ఏడ్పులను వినడు. మళ్ళీ రాడు. పూర్వం ఒక బోయవాడు ఉండేవాడు. వాడు అడవికి వేటకు వెళ్ళి చాల పక్షుల్ని చంపాడు. ఒక ఆడుపక్షిని చంపి చిక్కంలో వేసుకొని పోతుండగా మగపక్షి దుఃఖించింది. విలపిస్తున్న ఆ మగపక్షినికూడ కిరాతుడు చంపాడు. ఎవ్వరికీ చావు తప్పదని ఈ కథను యముడు చెప్పగా సుయజ్ఞుని భార్యలు, బంధువులు, ఈ సకలప్రపంచం నిత్యం కాదని భావించి వానికి పరలోకక్రియలు చేసి వెళ్ళారు. కాబట్టి, హిరణ్యాక్షునికొరకు దుఃఖపడవద్దు.

**క. పరులెవ్వరు? తా మెవ్వరు?, పరికింపఁగ నేకమగుట భావింపరు; త**
**త్పరమజ్ఞానము లేమినిఁ, బరులును మే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్ (7-69)**

అని హిరణ్యకశిపుడు తల్లిని మరదళ్ళను ఓదార్చాడు. శ్రీహరిని జయించాలని కోరి బ్రహ్మను గూర్చి తీవ్రమైన తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. నాకు ముసలితనం, చావు ఉండరాదు. నేను ముల్లోకాలకు అధిపతిని కావాలి. నన్ను మించిన శత్రువు ఉండరాదు. సింహబలం కావాలి - అని కోరరాని కోరికలు కోరాడు.

**శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్**
**రేలన్ ఘస్రములన్ దమఃప్రభల భూరిగ్రాహరక్షోమృగ (7-90)**

గాలిలోను, భూమిమీద, నిప్పులోను, నీరులోను, ఆకాశంమీద, దిక్కులలోను, రాత్రిపూట, పగటిపూట, చీకటిలోను, వెలుగులోను, జంతువులచేత, రాక్షసులచేత, మృగాలచేత, పాములచేత, దేవతలచేత, మానవులచేత, అస్త్రాలచేత, శస్త్రాలచేత మృత్యువు లేకుండావుండే (మంత్రించని కత్తి మొదలైనవి శస్త్రాలు, మంత్రించిన పాశుపతం మొదలైనవి అస్త్రాలు) వరాన్ని కోరాడు. (ప్రాణమున్నవాటిచేత, ప్రాణం లేనివాటిచేత కూడా చావకూడదని వరం కోరినట్లు హిరణ్యకశిపువధ ఘట్టాన్ని బట్టి తెలుస్తున్నది. హిరణ్యకశిపుని వరాలను నిజం చేస్తూ 'ప్రాణసహితంబులును బ్రాణరహితంబులును గాని గోళ్ళతో' (7-299) నరసింహస్వామి హిరణ్యకశిపుణ్ణి చంపాడు.)

ఇటువంటి దుర్లభాలైన వరాలను ఇచ్చి బ్రహ్మ మాయమయ్యాడు. వరం పొంది తిరిగివచ్చిన హిరణ్యకశిపుడు విష్ణువును జయించాలని అన్ని లోకాలను వశం చేసుకొన్నాడు. దిక్పాలకులను, సాధువులను బాధించాడు. భార్యయైన లీలావతితో విహరిస్తూ అనే భోగాలను అనుభవించాడు. హిరణ్యకశిపునికి సంహ్లాదుడు, అనుహ్లాదుడు, హ్లాదుడు, ప్రహ్లాదుడు - అను నలుగురు కొడుకులు పుట్టారు.

## ప్రహ్లాదచరిత్ర

**సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరుగువాఁడు (115)**

సమస్తభూతాలను తనలాగే సమదృష్టితో చూచేవాడు. పెద్దలకు భృత్యుని వలె నమస్కరించేవాడు. ఇతర స్త్రీలను తల్లివలె చూచి ప్రక్కకు తొలగేవాడు. దీనులను చూచి తల్లిదండ్రులవలె కాపాడాలని చింతించేవాడు. సఖులను సోదరులుగా, గురువులను దేవతలుగా తలచేవాడు. వేళాకోళం చేయటానికైనా అబద్ధం ఆడేవాడు కాడు.

**సీ. ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁడై, గర్వసంస్తంభ సంగతుఁడు గాఁడు (117)**

ప్రహ్లాదుడు అందమైన రూపం కలవాడు. చక్రవర్తి కొడుకుగా పుట్టినా, ఎంత ధనమున్నా, చక్కటి చదువు ఉన్నా గర్వం లేనివాడు. విషయభోగాలు లభించినాకూడా ఇంద్రియనిగ్రహం కలవాడు. వయస్సు, బలం, ప్రభుత్వం కలవాడైనా కూడా కామం, క్రోధం మొదలైనవి లేనివాడు. కామినులు మొదలైన భోగాలున్నా వ్యసనాలు లేనివాడు, విశ్వంలో ఉన్న ఏ వస్తువుపైనా కోరికలు లేనివాడు, విష్ణుభక్తి తప్ప తక్కినది ఏదీ కోరనివాడు ప్రహ్లాదుడు. ఇంత సద్గుణవంతుడైన ప్రహ్లాదుని గుణగణాలను పగవారైన దేవేంద్రుడు మొదలైనవారు కూడ కవుల వలె కీర్తించేవారు. ప్రహ్లాదుని సద్గుణాలను లెక్కించడానికి శేషుడు, బృహస్పతి, బ్రహ్మ కూడా సరిపోరు.

**క. గుణనిధి యగు ప్రహ్లాదుని, గుణము లనేకములు గలవు గురుకాలమునన్**
**గణుతింప నశక్యంబులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్ (120)**

ఈ సందర్భంలో పోతన ఈ 5 పద్యాలలో ప్రహ్లాదుని సంపూర్ణజీవితచరిత్రను చెప్పాడు. ఇవి కేవలం బాలప్రహ్లాదునిగూర్చి చెప్పినవి కావు. 5 సంవత్సరాల బాలునికి స్త్రీభోగాలపై ఆసక్తి కలగటం అసంభవం.

ప్రహ్లాదుడు గొప్ప విద్వాంసుడు. గ్రంథకర్త. సాముద్రికశాస్త్రాన్ని రచించినవాడు.

క. **"హరిభక్తుఁడు ప్రహ్లాదుఁడు, సరసులు కొనియాడఁ జెప్పె సాముద్రికమున్"** అని అన్నయమంత్రి సాముద్రికశాస్త్రంలో చెప్పాడు.

## ప్రహ్లాదుని విష్ణుభక్తి

మాధవుడు తనను చేరినట్లనిపిస్తే స్నేహితులతో చేరేవాడు కాదు. దైత్యారి తన దగ్గర ఆడినట్లు అనిపిస్తే రాక్షసబాలురతో ఆడేవాడు కాదు. భక్తవత్సలుడైన విష్ణువు తనతో మాట్లాడినట్లైతే ఇతరులతో మాట్లాడేవాడు కాదు. దేవతావంద్యుడైన హరి తన హృదయంలో పొడచూపినట్లైతే సమస్తాన్ని మరచిపోయేవాడు. పుండరీకాక్షుని పాదపద్మాలను ధ్యానించటం అనే అమృతంతో తన మనస్సంతా నిండినట్లైతే అన్నింటిని మరచి జడునివలె ఉండేవాడు. ప్రహ్లాదునికి శ్రీమన్నారాయణ స్మరణం తప్ప తక్కిన జాడ్యాలేవీ లేవు.

శా. **పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ**
**లానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షింపుచున్ సంతత (7-123)**

మంచినీళ్ళు త్రాగుతున్నా, భోజనం చేస్తున్నా, మాట్లాడుతున్నా, నవ్వుతున్నా, నిద్రిస్తున్నా, తిరుగుతున్నా, ఏ వస్తువును చూస్తున్నా శ్రీహరిచరణ ధ్యానమనే అమృత రసాస్వాదనలో మునిగి సమస్త విశ్వాన్ని మరచిపోయేవాడు.

శ్లో. **పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ।**
**ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిషన్ నిమిషన్నపి ॥ (భగవద్గీత 5-8)**

చూస్తూ, వింటూ, తాకుతూ, వాసన చూస్తూ, తింటూ, నడుస్తూ, నిద్రిస్తూ, ఊపిరి పీలుస్తూ, ఊపిరి విడుస్తూ, మాట్లాడుతూ, సమస్తాన్ని త్యజిస్తూ, భగవన్నామాన్ని గ్రహిస్తూ, కన్నులు తెరుస్తూ, మూస్తూ కూడా విష్ణుమూర్తినే ధ్యానిస్తూ ప్రహ్లాదుడు – శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో బోధించిన బ్రాహ్మీస్థితిలో ఉండేవాడు.

శ్రీహరిని ధ్యానిస్తూ ఏ చేష్టలూ లేక ఏడ్చేవాడు. గోవిందుని భావిస్తూ గొంతెత్తి పాడేవాడు. విష్ణువు తప్ప మరేమీ లేదని గట్టిగా నవ్వేవాడు. జగన్నాథుడు అనే నిధి లభించిందని ఆనందంతో గంతులు వేసేవాడు. పరమేశ్వరా! కేశవా! అంటూ ఆనందబాష్పాలతో శరీరం పులకరించగా కన్నులు మూసుకొని ఊరకనే ఉండేవాడు.

ప్రహ్లాదుడు ఏ విషయాలను పట్టించుకోకుండా జడునివలె ఉండటం చూచి హిరణ్యకశిపుడు చండుడు – అమర్కుడు అను శుక్రాచార్యుల కొడుకులను పిలిపించి ప్రహ్లాదునికి విద్య నేర్పమని అప్పగించాడు. కొన్నాళ్ళకు ప్రహ్లాదుణ్ణి పిలిచి "నీకేది భద్రమో చెప్పు" అని అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు

**ఉ. సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునం**
**దుల్లము చేర్చి తారడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ! (7-142)**

"శరీరధారులందరూ ఇల్లు అనే చీకటి నూతిలో పడక, మీరు - మేము - అను మతిభ్రమతో భేదభావం పొందక సమస్తవిశ్వం విష్ణు కళామయమే అనే జ్ఞానంతో భగవంతునిలో హృదయం చేర్చి అడవిలో ఉండటమే మేలు" అని చెప్పాడు.

ఇది విని హిరణ్యకశిపుడు - "లోకంలోని పిల్లలందరు ఎలాచెపితే అలాగే మాట్లాడుతారు. ఈ బుద్ధులు బాలునికి ఎవరు నేర్పారో నాకు ఆశ్చర్యమవుతూ ఉంది. ఈ బుద్ధి నీకే తోచిందా? లేదా పరులు చదివించారా? లేదా ఏకాంతసమయంలో గురుపుత్రులే పలికిరా? విష్ణువు నాకు శత్రువు. వాణ్ణి ఎలా వర్ణిస్తున్నావు? దేవతలను తరమడమో, ఇంద్రాదిదిక్పాలకులను బాధించడమో, మునులను హింసించడమో, యక్షులు, కిన్నరులు మొదలగువారిని నాశనంచేయటమో కాకుండ 'హరి' అని 'గిరి' అని ఎందుకు చెడిపోతావు?" అని ప్రశ్నించాడు. ప్రహ్లాదుడు పురోహితుని చూచి అయస్కాంతం దగ్గర ఇనుము ఆకర్షింపబడినట్లుగా విష్ణుసన్నిధికి నా హృదయం ఆకర్షింపబడుతున్నది.

**సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు, మధుపంబు వోవునే మదనములకు**
**అంబుజోదరదివ్యపాదారవింద, చింతనామృతపానవిశేషమత్త**
**చిత్త మేరీతి నితరంబుఁజేరనేర్చు? వినుతగుణశీల! మాటలు వేయునేల?**

అని పలికాడు. గురువులు కోపించారు. ప్రహ్లాదుని మరల చదివించారు. ప్రహ్లాదుని మొట్టమొదట పాఠశాలకు పంపించే సమయంలో హిరణ్యకశిపుడు -

**క. చదువనివాఁ డజ్ఞుం డగుఁ, జదివిన సదసద్వివేకచతురతగల్గున్**
**జదువఁగ వలయును జనులకుఁ, జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ! (7-130)**

అని చెప్పినాడు. ఈ వాక్యాలను దృష్టిలో పెట్టుకొని ప్రహ్లాదుడు రెండవసారి పాఠశాల నుండి వచ్చినపుడు -

**క. చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ**
**జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మ మెల్లఁ జదివితిఁ దండ్రీ! (7-166)**

అని బదులుచెప్పాడు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదునికి ధర్మ-అర్థ-కామాలనే (త్రివర్గము) బోధించమని చెప్పాడు. ప్రహ్లాదుడు ధర్మార్థముఖ్యశాస్త్రాలు చదివానని చెప్పాడు. కామశబ్దాన్ని ఉచ్చరించటం ప్రహ్లాదునికి ఇష్టం లేదు. తండ్రి హిరణ్యకశిపుడు ప్రహ్లాదునికి త్రివర్గాలైన ధర్మ-అర్థ-కామాలనే బోధించండని చండామర్కులకు చెప్పాడుగాని, ప్రహ్లాదుడు నాల్గవ వర్గమైన మోక్షపురుషార్థంలో ఆసక్తిని, జిజ్ఞాసను కనబరచినాడు. పరమభాగవతుడయ్యాడు. ఇది హిరణ్యకశిపుడు ఊహించని పరిణామం. అందుకే "నాకుం జూడఁగ చోద్య మయ్యెడి గదా నా తండ్రి!"

అన్నాడు. రెండవమారు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చూచి ఒకపద్యం చదివి, అర్థం చెప్పి, తాత్పర్యాన్ని వివరించమని అడిగాడు. ప్రహ్లాదుడు నవవిధభక్తులు పేర్కొన్నాడు.

**శా. అంధేందూదయముల్... హరిభక్తివర్జితులరిక్తవ్యర్థసంసారముల్**

**సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ...**

**సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే, పవనగుంభితచర్మభస్త్రి గాక...**

**సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే? చక్రిదాస్యప్రభంజనము లేక...**

అని విష్ణుభక్తిని గూర్చి వివరించాడు. ఇక్కడ ప్రహ్లాదుని నోటినుండి వచ్చిన పద్యాలన్నీ ఆణిముత్యాలే.

ఈ మాటలు విని హిరణ్యకశిపుడు కోపగించుకున్నాడు. ప్రహ్లాదుణ్ణి పలువిధాలుగా హింసలు పెట్టించాడు. రాక్షసులు శూలాలతో ప్రహ్లాదుణ్ణి పొడిచారు.

**ఉ. తన్ను నిశాచరుల్ వొడువ దైత్యకుమారుఁడు మాటిమాటి కో**
**పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా (7-193)**

ఏనుగులతో తొక్కించాడు. పాములతో కరిపించాడు. మంటలలో వేయించాడు. సముద్రం మధ్యలో పడవేయించాడు. విషం తాగించాడు. పర్వతాల నుండి కిందకు పడవేయించాడు. స్తంభానికి కట్టి కొట్టించాడు. ఎండలలో వానలలో నిలబెట్టించాడు. మంచులో గాలిలో బాధలు పెట్టించాడు. భూమిలో పాతించాడు. అన్నం, నీరు ఇవ్వక ఆకలిదప్పులకు గురిచేశాడు. గండశిలలు రువ్వించాడు. కొరడాలతో, గదలతో, బాణాలతో కొట్టించాడు. అయినా ప్రహ్లాదుడు ఏ మాత్రం జంకక విష్ణునామస్మరణం చేస్తూ నిర్భయంగా నిలబడ్డాడు.

చండామర్కులు మూడుసార్లు ప్రహ్లాదుని పాఠశాలకు తీసికొని వెళ్ళి ధర్మార్థకామాలను గూర్చే బోధించారు. ప్రహ్లాదుడు వినలేదు. తోడిబాలురకు విష్ణుభక్తిని, వేదాంతాన్ని ఉపదేశించాడు. రాక్షసబాలురకు తన జన్మవృత్తాంతాన్ని, నారదోపదేశాన్ని వివరించాడు. శుక్రాచార్యుని కొడుకులు విసిగి ప్రహ్లాదుణ్ణి హిరణ్యకశిపునికి అప్పగించారు. హిరణ్యకశిపుడు నీకు దిక్కెవరు అని గద్దించి అడిగాడు. 'నాకు మహావిష్ణువే దిక్కు' అని ప్రహ్లాదుడు సమాధానం చెప్పాడు. 'నీ విష్ణువు ఎక్కడున్నాడు' అని ప్రహ్లాదుణ్ణి అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు -

**క. ఇందుఁ గలఁ డందు లేఁడని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం**
**డెందెందు వెదకి చూచిన, నందందే గలఁడు దానవాగ్రణి వింటే. (275)**

అని నిర్భయంగా పలికాడు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో ఈ స్తంభంలో విష్ణువును చూపించు అని అరచేతితో స్తంభాన్ని చరచాడు. విష్ణుమూర్తి సింహ ముఖము, మానవ శరీరంతో నరసింహాకారంలో బ్రహ్మాండమంతా నిండాడు. నరసింహస్వామి భయంకరస్వరూపంతో స్తంభంనుండి ఉద్భవించాడు. హిరణ్యకశిపునితో యుద్ధం చేసి గరుత్మంతుడు పామును చీల్చినట్లుగా హిరణ్యకశిపుని గోళ్ళతో చీల్చి చంపాడు.

**శా. చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిన్**
**ద్రెంచున్ గర్కశనాడికావళులు భేదించున్ మహావక్షమున్**
**ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చి ద**
**ర్పించున్ ద్రేవులు కంఠమాలికలు కల్పించున్ నఖోద్భాసియై. (7-296)**

ఈ పోతన పద్యం చదివేటప్పుడు –

**మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చు కరణిన్ రౌద్రం బుదగ్రంబుగా**
**నుర మత్యుగ్రతఁ జీరి క్రమ్ము రుధిర మ్ముల్లాసియై దోయిటన్**
**వెరవారం గొని త్రావు; మెచ్చుఁ జవికిన్ మేనున్ మొగంబున్, భయం**
**కరరేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచున్ బొరిన్. (కర్ణ. 3-214)**

అను తిక్కన పద్యం పాఠకులకు తప్పక జ్ఞాపకానికి వస్తుంది.

నరసింహస్వామి హిరణ్యకశిపుని చంపగానే దేవతలు సంతోషంతో పూలవానలు కురిపించారు. శివుడు, ఇంద్రుడు, ఋషులు, పితృదేవతలు, సిద్ధులు మొదలైనవారు నరసింహస్వామిని స్తుతించారు. నరసింహస్వామిని సమీపించటానికి లక్ష్మీదేవి కూడ భయపడింది. బ్రహ్మదేవుడు ప్రహ్లాదుణ్ణి స్వామి ముందుకు పంపాడు. సాష్టాంగదండప్రణామం చేసిన ప్రహ్లాదుని శిరస్సుపై నరసింహస్వామి అభయహస్తం ఉంచాడు. ప్రహ్లాదుడు నరసింహస్వామిని స్తుతించాడు. గజేంద్రునివలె తనకు విష్ణువుపై భక్తి కలిగివుండాలని తన్మయత్వంతో నుతించాడు. నరసింహస్వామి ప్రహ్లాదునికి వరాలిచ్చి బ్రహ్మను పిలిచి "రాక్షసులకు ఎప్పుడూ హిరణ్యకశిపునికి ఇచ్చినట్లు వరాలీయవద్దు" ని చెప్పి దేవతలచే పూజితుడై మాయమయ్యాడు.

**ఉ. శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రుసం**
**హారముఁ బుణ్యభాగవతుఁ డైన నిశాచరనాథపుత్త్రు సం**
**చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁ బఠించినన్ శుభా**
**కారముతోడ నేభయము గల్గని లోకముఁ జెందు భూవరా! (7-385)**

## త్రిపురాసురసంహారము

మయాసురుడు పలు మాయలు కలిగినవాడు. అతని మాయలవల్ల శివుని కీర్తి మాసిపోయింది. విష్ణుమూర్తి పరమేశ్వరుని యశస్సును చక్కగా మళ్ళీ నిలబెట్టాడు. ఈ కథను నారదుడు ధర్మరాజుకు ఇలా వినిపించాడు.

బలోపేతుడైన శ్రీవిష్ణుమూర్తి తోడ్పాటుతో ఇంద్రాది దేవతలు రాక్షసులను ఓడించారు. రాక్షసులందరు ఆక్రోశిస్తూ మయాసురుణ్ణి శరణు వేడారు. మయుడు తన మాయాబలంతో ఇనుము, వెండి, బంగారాలతో మూడు పట్టణాలు నిర్మించి రాక్షసులకు ఇచ్చాడు. అవి కామగమనము కలవి. రాక్షసులు అందరు ఆ పట్టణాలలో

ప్రవేశించి కామసంచారులై లోకాలన్నింటిని బాధించడం మొదలుపెట్టారు. దేవతలందరు శివుణ్ణి శరణు వేడారు. శివుడు దివ్య బాణాలు సంధించి రాక్షసులను నాశనం చేశాడు. శివుని బాణాగ్ని వలన మాడిపోయి ప్రాణాలు విడిచిన రాక్షసులను మయుడు తన యోగబలంతో సిద్ధరసంతో నిండిన ఒక బావిలో వేశాడు. ఆ సిద్ధామృతరసమహిమ వలన రాక్షసులు మళ్ళీ జీవించారు. వారిని ఎలా గెలువాలో తెలియక శివుడు చింతించాడు. అప్పుడు విష్ణువు పాడియావు రూపం ధరించి బ్రహ్మను దూడగా చేసికొని వచ్చి ఆ బావిలో ఉన్న సిద్ధరసాన్ని పూర్తిగా త్రాగేశాడు. రాక్షసులు నిరాశ్రయులయ్యారు. విష్ణువు శివునికి రథము, సూతుడు, రథముపై ఉండే జెండా, కవచము, విల్లు మొదలైన యుద్ధసాధనాలు ఇచ్చాడు. శివుడు ఆ రథాన్ని ఎక్కి, సాధనాలను ధరించి ఆ మూడు పట్టణాలపై బాణం ప్రయోగించాడు. ఆ బాణాగ్నికి త్రిపురాలు కాలి బూడిదయ్యాయి.

**మ. శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై**
**సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై (404)**

ఇలా శివుడు అభిజిన్ముహూర్తంలో గెలువరాని త్రిపురాలను బూడిద చేయగానే దేవతలు జయజయ ధ్వానాలతో పూలవానలు కురిపించారు. ప్రజలు ఆనందించారు. బ్రహ్మాది దేవతలు కీర్తించారు. అప్సరసలు నాట్యం చేశారు. మునులు ఉత్సవాలు చేసుకొన్నారు. శివుడు త్రిపురాసురులను జయించి కైలాసాన్ని చేరుకొన్నాడు. ఈ విధంగా విష్ణువు శివుని ఖ్యాతిని నిలబెట్టాడు.

## ప్రహ్లాద – అజగర సంవాదం

ఒకసారి ప్రహ్లాదుడు మంత్రులతో బయలుదేరి లోకతత్త్వం తెలుసుకోవడానికి సంచారానికి వెళ్ళాడు. కావేరీ నది ఒడ్డున సహ్యాపర్వతం దగ్గర దుమ్ముతో నిండిన ఎవరికీ గుర్తు తెలియని అజగర (కొండచిలువ) వ్రతంలో ఉన్న ఒక ముని కనబడ్డాడు. ప్రహ్లాదుడు ఆ మునిని సమీపించి "ఓ మునినాథా! నీవు గొప్ప దేహం ధరించి కదలకుండా ఒకచోట పడివున్నావు. ప్రయత్నం చేయని వానికి ధనం రాదు. ధనవంతునికి తప్ప ఇతరులకు భోగాలుండవు. భోగి కానివానికి సంపూర్ణ శరీరం పుష్టిగా ఉండదు. నీవు ఎందుకు నిద్రిస్తున్నావు?" అని అడిగాడు. ఆ ముని ప్రహ్లాదుణ్ణి చూచి "నీవు విష్ణుభక్తుడవని నాకు తెలుసు. జీవులు ఆశ వల్ల అనేక కర్మలు చేస్తూ, అనేక జన్మలు ఎత్తుతూ చస్తూవుంటారు. ధర్మం వల్ల స్వర్గం లభిస్తుంది. అధర్మం వల్ల కుక్క, పంది మొదలైనవాని జన్మలు కలుగుతాయి. భోగాలు శాశ్వతాలు కావు. ధనం వల్ల దుఃఖం కలుగుతుంది కాని, సుఖం కలుగదు. సంసారం సత్యం కాదు. ద్వైత దృష్టి వలన సంసారమేర్పడుతుంది. రాజులు, దొంగలు, యాచకులు మొదలైన వారివలన ధనవంతులకు నిద్రాహారాలుండవు. శోకం, మోహం మొదలైనవి కోరికల వల్ల కలుగుతాయి. జ్ఞాని కోరికలను విడిచిపెట్టాలి. తేనెటీగ కూర్చిన తేనె జనులకు దక్కుతుంది. దీర్ఘదేహం కల పాము తిరుగకుండానే ఆహారం సంపాదిస్తుంది. కాబట్టి, కొండచిలువ, తేనెటీగ నాకు గురువులు" అని తత్త్వాన్ని ఉపదేశించాడు. ప్రహ్లాదుడు ఆ మునిని పూజించి తన ఇంటికి వెళ్ళిపోయాడు.

## అలంకార యోజనం

**1. వృత్త్యనుప్రాసం**

**వ. అప్పటప్పటికి దుర్జన సంసర్గనిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు నప్రమత్తుండును, సంసారనివృత్తుం డును, బుధజనవిధేయుండును, మహాభాగధేయుండును... (7-125)**

ఈ వచనంలో వృత్త్యనుప్రాస, అంత్యానుప్రాసలు ఉన్నాయి.

**2. అంత్యాను ప్రాసం**

**క. చిత్రంబులు త్రైలోక్యప, విత్రంబులు భవలతా లవిత్రంబులు స**
**న్మిత్రంబులు మునిజనవన, చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్. (7-6)**

ఇటువంటి అంత్యానుప్రాసలు గల పద్యాలు భాగవతం నిండ కుప్పలు తెప్పలుగా ఉన్నాయి.

**3. లాటానుప్రాసం**

**సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ (169)**

ఈ పద్యమంతా లాటానుప్రాసకు చక్కని ఉదాహరణ. ఒకే పదం తాత్పర్యభేదంతో రెండేసి మార్లు రావడంతో లాటానుప్రాసం.

**4. ముక్త పదగ్రస్తం**

**వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణవైరుండును, వైరానుబంధజాజ్వల్యమానరోషానలుండును, రోషానల జంఘన్యమానవిజ్ఞానవినయుండును, వినయగాంభీర్యధైర్య... ... (7-285)**

ఇక్కడ ముందు విడిచిపెట్టిన పదాన్ని, మళ్ళీ గ్రహించడంతో ముక్తపదగ్రస్తం. ఇలాంటి సుదీర్ఘ వచనాలు భాగవతంలో ఎక్కువగా ఉన్నాయి.

**5. ఉపమాలంకారం**

**సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో, ఘనకుఠారంబుల కరణి నొప్పు**
**గంభీరహృదయపంకజము భేదించుచోఁ, గుద్దాలముల భంగిఁ గొమరు మిగులు (7-297)**

ఈ పద్యంలో నరసింహస్వామి గోళ్ళు గొడ్డళ్ళవలె, గునపాలవలె, కొడవళ్ళవలె, రంపాలవలె ఉన్నాయని వర్ణించటంచేత ఉపమాలంకారం.

**6. రూపకాలంకారం**

**సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే? చక్రిదాస్యప్రభంజనము లేక**
**తాపత్రయాభీలదావాగ్ని లాఱునే? విష్ణుసేవామృతవృష్టి లేక (1-171)**

సంసారం= మేఘ సమూహం, విష్ణుదాస్యం= గాలి, తాపాలు= అగ్నులు, విష్ణుసేవ= అమృత వర్షం ఈ విధంగా సంసారం మొదలైనవానిలో అన్యధర్మాలు ఆరోపించుటచే ఈ పద్యమంతా రూపకం.

**7. కథా వస్తు ధ్వనులు**

**సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి, మున్నీట మునిఁగిన మునుఁగుఁగాక!**
**యలయించి పెనఁగు నా యచలసంభ్రమమున, కెలఁగి వెన్నిచ్చిన నిచ్చుఁగాక! (7-32)**

ఇవి హిరణ్యకశిపుని వచనాలు. ఈ సీసపద్యంలోని నాలుగు పాదాలలో క్రమంగా 1. మత్స్యావతారం 2. కూర్మావతారం 3. వరాహావతారం 4. నరసింహావతారం ధ్వనిస్తున్నాయి.

## శాస్త్రపరిచయం

**1. భక్తి దర్శనం**

**మ. తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా**
**ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం**
**బనునీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా! (7-16)**

శ్రవణం - విష్ణుమూర్తి కథలు వినటం, కీర్తనం - విష్ణువును ఎల్లప్పుడూ కీర్తించటం, స్మరణం - విష్ణువును స్మరించటం, పాదసేవనం - విష్ణువును సేవించటం, అర్చనం - విష్ణువును ఎల్లప్పుడు పూజించటం, వందనం - విష్ణువుకు నమస్కరించటం, దాస్యం - విష్ణువుకు దాసత్వం చేయటం, సఖ్యం - విష్ణువుతో స్నేహం చేయటం, ఆత్మనివేదనం - విష్ణువుకు ఆత్మను సమర్పించుకోవటం - ఇవి నవవిధభక్తులు. వీటిని మనో-వాక్-కాయ కర్మలతో ఆచరించాలని పోతనగారి అభిప్రాయం. భక్తి దర్శనం ప్రత్యేక శాస్త్రం. భక్తి యోగం ప్రత్యేక యోగం. ఈ భక్తియోగాన్ని గురించి తరువాత ప్రత్యేకంగా విస్తారంగా తెలుసుకుందాం.

**2. ధర్మశాస్త్రం**

నారదమహర్షి ధర్మరాజుకు వర్ణధర్మాలు, ఆశ్రమధర్మాలు చెప్పాడు.

1. సత్యం 2. దయ 3. ఉపవాసం 4. శుచిగా ఉండటం 5. ఓర్పు 6. సదసద్వివేకం మంచి-చెడ్డలు తెలుసుకోవటం లేక నిత్యానిత్య వివేకం 7. మనోనిగ్రహం 8. ఇంద్రియాలను జయించటం 9. అహింస 10. బ్రహ్మచర్యం 11. దానం 12. జపం 13. సంతోషం 14. మృదువుగా ఉండటం 15. సర్వసమత్వం 16. మహాజనులను సేవించటం 17. కోరికలు విడిచిపెట్టటం 18. నిష్ఫలాలైన క్రియలు చేయకపోవటం 19. మితంగా మాట్లాడటం 20. ఆత్మాన్వేషణం 21. అన్నం-నీరు దానం చేయటం 22. జీవులపట్ల దేవతాబుద్ధి

23. విష్ణుమూర్తి స్మరణం 24. కీర్తనం 25. సేవ 26. అర్చనం 27. నమస్కారం 28. దాస్యం 29. ఆత్మసమర్పణం 30. సఖ్యం – అను నవవిధభక్తులు – ఈ 30 లక్షణాలు సకల జనులకు సామాన్యధర్మాలు.

1. బ్రాహ్మణులు 2. క్షత్రియులు 3. వైశ్యులు 4. శూద్రులు అను 4 వర్ణాలున్నాయి. చతుర్థ కులజులు తప్ప తక్కిన వారు ద్విజులు. మంత్రాలతో పెళ్ళి, ఉపనయనం మొదలైన సంస్కారాలు చేయటం ద్విజులకు ధర్మాలు.

1. వేదం చదవటం 2. వేదం చెప్పటం 3. యజ్ఞం చేయటం 4. యజ్ఞం చేయించటం 5. దానం చేయటం 6. దానం పట్టటం అను 6 కర్మలు బ్రాహ్మణ ధర్మాలు. క్షత్రియుడు దానం తీసుకోకూడదు. ప్రజలను పాలించటం రాజు ధర్మం. 1. కృషి (వ్యవసాయం) 2. వాణిజ్యం (వర్తకం) 3. ఆవులను రక్షించటం వైశ్యుల ధర్మాలు 4. ద్విజ శుశ్రూష శూద్ర ధర్మం. సర్వ వేదమయుడు బ్రాహ్మణుడు. సర్వ దేవమయుడు క్షత్రియుడు. భగవద్భక్తి కల్గియుండుట అన్ని వర్ణాల వారికి సమాన ధర్మమే.

భర్తకు సేవచేయుట పతివ్రతా ధర్మం.

**సీ. నిలయము పాటించి నిర్మలదేహయై, శృంగార మేప్రొద్దుఁ జేయవలయు**
**సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు, చిత్తంబు ప్రేమ రంజింపవలయు...**

**ఆ.వె. మార్దవమునఁ బతికి మజ్జనభోజన, శయనపానరతులు జరుపవలయు**
**విభుఁడు పతితుఁ డైన వెలఁదిపాతివ్రత్యమహిమఁ బుణ్యుఁ జేసి మనుపవలయు. (6-417)**

భర్తను విష్ణుమూర్తిగా భావించి సేవించిన పతివ్రత లక్ష్మీదేవివలె ఆనందంతో వైకుంఠలోకంలో నివసించును, భర్త దేవుడని కపటం లేక కొలిచిన సతికి ఉపవాసాలు, వ్రతాలు అక్కరలేదు.

1. బ్రహ్మచర్యం 2. గృహస్థం 3. వానప్రస్థం 4. సన్యాసం అని ఆశ్రమాలు నాల్గు విధాలు.

## పుణ్యక్షేత్రాలు

**క. హరియందు జగము లుండును, హరిరూపము సాధుపాత్రమందుండు శివం**
**కరమగు పాత్రము గలిగిన, నరయఁగనది పుణ్యదేశ మనఘచరిత్రా! (450)**

మహావిష్ణువులో 14 లోకాలు ఉంటాయి. ఆ విష్ణుమూర్తి సాధువులలో ఉంటాడు, అట్టి సాధువులు నివసించు దేశం పుణ్యక్షేత్రం.

1. కురుక్షేత్రం 2. గయ 3. ప్రయాగ 4. పులహాశ్రమం 5. నైమిశారణ్యం 6. ఫల్గునం 7. సేతురామేశ్వరం 8. ప్రభాసం 9. కుశస్థలి 10. వారణాసి (కాశి) 11. మధుర 12. పంపాసరస్సు 13. బిందుసరోవరం 14. నారాయణాశ్రమం (బదరి). 15. సీతారామాశ్రమం (అయోధ్య) పుణ్యక్షేత్రాలు 16. మహేంద్రం 17. మలయం మొదలైనవి పుణ్యపర్వతాలు 18. శ్రీవిష్ణుదేవాలయాలుండే ప్రదేశాలు 19. విష్ణుభక్తులుండే హృషీకేశం మొదలైనవి కూడా పుణ్యక్షేత్రాలే. శుభాలు కోరేవారు ఈ పుణ్యక్షేత్రాలను సేవించాలి.

## వ్యాకరణ విశేషాలు

**1. ఒకమాటుఁ గూలంకషోల్లోలజలధిలో (7-198)**
**సర్వకూలాభ్రకరీషేషు కషః (3-2-42)**

అను పాణినీయ సూత్రంచే సర్వ - మొదలైన శబ్దాలకు పరమైన 'కష్' ధాతువుకు 'ఖచ్' ప్రత్యయం, ముమాగమం వచ్చి 'సర్వంకష', 'కూలంకష', 'అభ్రంకష' అను రూపాలు ఏర్పడతాయి. 'వహాభ్రే లిహః' (3-2-32) అను సూత్రంచే 'అభ్రంలిహ' అని ఏర్పడుతుంది. పోతన 'అభ్రంకష' (భాగ-1-17) 'సర్వంకష' (1-148); 'కూలంకష' (7-198); 'అభ్రంలిహ' (4-108) అను రూపాలు వాడాడు.

**2. తావకీ-య గుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మా-యాసౌఖ్య (7-365)**

'తావకీన - మామకీన' - అను రూపాలు ఉంటాయి కాని 'తావకీయ' అని ఉండదు. ఇది యతిస్థానంలో ఉన్నది. దుర్వాసమహర్షి రచించిన 'పరశంభుమహిమ్న' స్తోత్రంలో - 'తావకీయ' అని రెండుచోట్ల ఉన్నది.

**షట్త్రింశత్తత్త్వ పుష్పస్తబక పరిమలస్తావకీయ స్సతేజః (24)**
**మాయామంతరస్థ శరరసస్తావకీయః స్వకాలే**

వ్యాకరణాంతరంచేత సాధువు కావచ్చును.

## ఛందోవిశేషాలు

**సర్వలఘుకందాలు**

పోతన భాగవతంలో సర్వలఘుకందాలు సప్తమస్కంధంనుండి ప్రారంభమైనాయి.

**క. స్ఫురితవిబుధజనముఖములు, పరివిదళితదనుజనివహపతితనుముఖముల్**
**గురురుచిజితశిఖిశిఖములు, నరహరికరనఖము లమరు నతజనసఖముల్. (7-298) (7-343)**

## ప్రాచీనకవుల అనుకరణలు

**హనుమన్నాటకం - పోతన**

**శ్లో. బ్రహ్మన్నధ్యయనస్య నైషసమయ స్తూష్ణీం బహిః స్థీయతాం**
**స్వల్పంజల్ప! బృహస్పతే! జడమతే! నైషా సభా వజ్రిణః।**
**స్తోత్రం సంహర నారద! స్తుతికథాలాపై రలం తుంబురో!**
**సీతారల్లకభల్లభగ్నహృదయః స్వస్థో న లంకేశ్వరః (హను.8-45)**

బ్రహ్మా! వేదం చదువడానికి ఇది సమయం కాదు. బయట ఉండు. జడమతీ! బృహస్పతీ! మెల్లగా మాట్లాడు. ఇది ఇంద్ర సభ కాదు. నారదా! స్తోత్రం చేయటం మాను. తుంబురూ! స్తుతించడం చాలు. సీతాదేవి పాపిడి అనెడి

బల్లెంచే భగ్నమైన హృదయం కల రావణాసురుడు స్వస్థతలో లేడు. ఇవి రావణుని భటుల మాటలు. పోతన ఈ శ్లోకానికి ఛాయగా ఈ పద్యాన్ని రాశాడు.

**సీ. కోలాహలము మాని కొలువుఁడీ సురలార!, తవిలి దీవింపుఁడీ తపసులార!**
**ఫణ లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార!, ప్రణతులై చనుఁడి దిక్పాలురార!**
**గానంబు సేయుఁడీ గంధర్వవరులార!, సందడిఁ బడకుఁడీ! సాధ్యులార!**
**ఆడుఁడీ నృత్యంబు లప్సరోజనులార!, చేరిక మ్రొక్కుఁడీ! సిద్ధులార!**

**తే.గీ. శుద్ధకర్పూరవాసితసురభిమధుర, భవ్యనూతనమైరేయపానజనిత**
**సుఖ విలీనత నమరారి సొక్కినాఁడు, శాంతి లేదంద్రు నిచ్చలుఁ జారు లధిప! (7-101)**

ఇవి హిరణ్యకశిపుని అనుచరుల పలుకులు.

**పాలకుఱికి సోమన - పోతన**

**ద్విపద.క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస, గోరునే పడియల నీరు ద్రావంగఁ**
**జూతఫలంబులఁ జుంబించు చిలుక, బ్రాతి బూరుగు మ్రాని పండ్లు గన్గొనునె**
**రాకామలజ్యోత్స్నఁ ద్రావు చకోరక, మాకాంక్షసేయునే చీఁకటిఁ ద్రావ**
**విరిదమ్మివాసన విహరించు తేఁటి, పరిగొని సుడియునే ప్రబ్బలివిరుల. (బసవపురాణం 3 ఆ.)**

**సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు, మధుపంబు వోవునే మదనములకు. (భాగవతం 7-150)**

**ఎఱ్ఱన - పోతన**

**ఆ.వె. కుడిచినపుడు నిద్ర గూరిన యప్పుడు, మేలుకొనిన యపుడు మెలఁగినపుడు**
**విష్ణుకీర్తనంబు విష్ణుచింతయ కాని, పలుకఁ దొండు బుద్ధిఁ దలఁపఁ దొండు. (నృసింహపురాణం 3-151)**

**శా. పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్... (భాగ.7-123)**

**ఉ. ఊషరబీజముల్ భసితయోజ్యఘృతంబులు షండకన్యకా**
**న్వేషణముల్ పయోధిగతవృష్టితతుల్ మృగతృష్ణికాంబుగం**
**దూషలు దుర్గకానన కఠోరితచంద్రిక లేదమూకస**
**ద్భాషలు విష్ణుమంగళకథావిముఖాత్ముల కష్టజన్మముల్. (నృసింహ.5-24)**

**శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్... (భాగవతం 7-168)**

**సీ. వాసుదేవుని పాదవనరుహంబుల భక్తి తగదను తంద్రియుఁ దండ్రి కాఁడు. (నృసింహపురాణం 5-22)**

**సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ (7-166)**

## స్వీయ అనుకరణలు

పోతన పూర్వకవులను అనుకరించిన పద్యాలకంటె తనను తానే అనుకరించుకొన్న పద్యాలు ఎక్కువ.

**శ్రీనారాయణపాదపద్మయుగళీ చింతామృతాస్వాద (7-123; 256)**

ఈ పద్యపాదాన్ని రెండుచోట్ల ప్రయోగించాడు.

**మ. జలజాతప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిన్**
**బలుకన్ లేని జనార్దనాహ్వయపరబ్రహ్మంబు నీయింటిలోఁ (7-386)**

**మ. అఖిలాధారుఁ డజాదిదుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ**
**మఖమందర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై (7-478)**

ఇలా భావాలను మళ్ళీమళ్ళీ ప్రయోగించడం వల్ల విష్ణుభక్తి పాఠకుని మనస్సులో బాగా నాటుకొంటుంది.

## పోతనను అనుకరించిన కవులు

**పోతన - ధూర్జటి**

**సీ. మందారమకరందమాధుర్యమునఁ దేలు**
**మధుపంబు వోవునే మదనములకు (భాగవతం 7-150)**

**సీ. శివు నపేక్షించిన చిత్తంబు చిత్తజా**
**యత్తమై విటులపై నాసపడునె? (శ్రీకాళహస్తి.4-39)**

**పోతన - వేమన**

**క. అజగరమును జుంటీఁగయు, నిజగురువులుగాఁ దలంచి నిశ్చింతుఁడనై**
**విజనస్థలిఁ గర్మంబుల, గజిబిజిలేకున్నవాఁడ గౌరవవృత్తిన్. (7-437)**

**ఆ.వె. ధనముఁగూడఁబెట్టి ధర్మంబుసేయక, తాను దినక లెస్సదాఁచుఁగాక!**
**తేనెటీఁగ కూర్చి తెరువరి కీయదా? విశ్వదాభిరామ! వినురవేమ!**

పోతనగారు రచించిన 'కమలాక్షు నర్చించు కరములు కరములు' అనే పద్యాన్ని పలువురు కవులు అనుకరించారు.

## భాగవత సీసపద్యాలు - హరిదాసులు

ప్రహ్లాదచరిత్రను హరికథగా చెప్పే హరిదాసులు భాగవత సీసపద్యాలను కుదించి, పెంచి అనేక లయలతో పెక్కురాగాలలో గానం చేస్తారు.

సీ. మందారా-మకరందా-మాధుర్యా-మునా-దేలు
మధుపంబూ-వోవునే-మదనా-ములకూ...

సీ. కంజాక్షు-నకూ-గానీ-కాయంబూ-కాయామే
పవనా-గుంఫితా-చర్మా-భస్త్రీ-గాకా

## కొన్నివిశేషాంశాలు

(1) హిరణ్యకశిపుని భార్యపేరు 'కయాధువు'. ఈమె జంభాసురుని కూతురు. కాని, పోతన 'లీలావతి' (7-102) అని చెప్పాడు. లోకంలో అదే రూఢి అయింది.

పెద్దన కూడ మనుచరిత్రలో 'ప్రవరుని' పేరు ఇలాగే పెట్టాడు. లోకంలో ఇదే ప్రసిద్ధమైంది.

(2) హిరణ్యకశిపునికి ఐదుగురు పిల్లలు పుట్టినట్లు భారతంలో ఉంది. వారు ప్రహ్లాదుడు, సంహ్లాదుడు, అనుహ్లాదుడు, శిబి, బాష్కలుడు (భార.ఆది.3-62)

పోతన భాగవతంలో హిరణ్యకశిపునికి నలుగురు పిల్లలు పుట్టినట్లు చెప్పాడు. వారు సంహ్లాదుడు, అనుహ్లాదుడు, హ్లాదుడు, ప్రహ్లాదుడు. నన్నయ - పోతన ఎవరి మూలాన్ని వారు అనుసరించారు.

## నాటకీయత

పోతన ఒక్కొక్క ఉపాఖ్యానంలో ఒక్కొక్క అందాన్ని చూపించాడు. ఈ ప్రహ్లాదచరిత్ర నాటకీయశైలిలో సాగింది. దీనిలో పాత్రల సంభాషణలు ఎక్కువ.

కన్న తండ్రికిఁ బ్రియనందనుం డిట్ల నియె (7-141); పురోహితుండు ప్రహ్లాదుం జూచి తిరస్కరించి యిట్ల నియె (7-151); దానవేంద్రుండు... మందమధురాలాపంబుల నిట్లనియె (7-162); రుద్రుం డిట్లనియె (309) అను వానిని ప్రహ్లాదుడు:; పురోహితుడు:; హిరణ్య కశిపుడు (162) రుద్రుడు; - అని మార్చి వ్రాస్తే నాటక సంభాషణ అవుతుంది. ప్రహ్లాదచరిత్రను అంకాలుగా విడగొడితే చక్కని నాటకం అవుతుంది.

భక్తుల కథలు సప్తమస్కంధంతో ప్రారంభమయ్యాయి. ఈ సప్తమస్కంధాన్ని శ్రద్ధగా చదివి పాఠకులు విష్ణుభక్తులు అగుదురు గాక!

*శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు*

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుడు
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

తిరుపతి,
26-1-2017.

# షష్ఠస్కంధం - కథాసారం

ఆంధ్ర మహాభాగవతంలోని ఆరవ స్కంధం ఏర్చూరి సింగనకవి రచించాడు. ఇందులో మొత్తం ఐదు వందల ముప్పది గద్య పద్యాలు ఉన్నాయి. సంప్రదాయంగా ఇష్టదేవతా ప్రార్థన, పూర్వకవిస్తుతి చేసిన తర్వాత, సింగనకవి కథా ప్రారంభం చేశాడు.

నరక బాధలనుండి తప్పించుకొనే మార్గం మానవులకు ఏదైనా ఉందా? అని అడిగిన పరీక్షిన్మహారాజుతో హరినామస్మరణం అందుకు మార్గం అనీ అందుకు ఉదాహరణగా అజామిళుని కథను ఇలా వివరించారు శుకయోగీంద్రులు.

**అజామిళుని కథ**

కన్యాకుబ్జ పురంలో అజామిళుడు అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు సదాచారాలుమాని, వ్యసనలోలుడయ్యాడు. భార్యను కాదని, ఒక బానిస స్త్రీని భార్యగా స్వీకరించాడు, మోహంలో మునిగిపోయి, పదిమంది కొడుకులను కన్నాడు, వార్ధక్యం వచ్చింది. మరణ కాలం సమీపించింది. అతడి ప్రాణాలను తీసుకు పోవడానికి యమదూతలు వచ్చారు. వాళ్ళని చూసి అతడు భయపడ్డాడు. "నారాయణా!" అని చిన్న కొడుకుని పిలిచాడు. వెంటనే విష్ణుదూతలు వచ్చారు. వారు యమదూతలను అదిలించి, అక్కడనుంచి వెళ్ళగొట్టారు. ఈ సందర్భంలో విష్ణుదూతలకు యమదూతలకు మధ్య సంవాదం జరిగింది. అజామిళుణ్ణి నరకానికి తీసుకు వెళ్ళడానికి తగిన కారణాలను యమదూతలు వివరించారు. కట్టుకున్న ఇల్లాలిని కాదని, బానిస స్త్రీని పెళ్ళాడడం, దొంగతనాలు, దారి దోపిడీలు చేయడం, బంధువులను, సజ్జనులను బాధించడం, వేదశాస్త్రాల చర్చలు మాని, వ్యసన పరాయణుడు కావడం మొదలైన పాపాలన్నింటినీ యమదూతలు ఏకరువు పెట్టారు. ఇతణ్ణి నరకానికి తీసుకు వెళ్ళడమే న్యాయమని వాదించారు. వారి వాదాన్ని తిరస్కరిస్తూ, మరణ సమయంలో 'నారాయణ' నామం పలికిన కారణంగా అజామిళుడి పాపాలన్నీ పటాపంచలయ్యాయని, బిడ్డ పేరు పెట్టి పిలిచినా, ఆటగా, వేళాకోళంగా పలికినా హరినామం సత్ఫలితాన్నిస్తుందని విష్ణు దూతలు వాదించారు. అత్యంత ప్రభావంగల ఔషధాన్ని కాకతాళీయంగా సేవించినా వ్యాధి నివారణ అయినట్టుగా 'నారాయణ' నామాన్ని ఏ ఉద్దేశంతో ఉచ్చరించినా, ఆ నామం పాపాలను తొలగించక మానదని విష్ణుదూతలు వివరించారు. చేసేది లేక యమదూతలు అజామిళుణ్ణి వదలి తిరిగి వెళ్లిపోయారు. జరిగినదంతా యముడికి విన్నవించారు. అజామిళుడు యమపాశంనుండి విముక్తి పొంది, విష్ణు దూతలకు నమస్కరించాడు. విష్ణుదూతలు అదృశ్యమయ్యారు.

అజామిళుడు పశ్చాత్తాపం పొందాడు. వ్యసనంలోపడి తాను చేసిన పాపాలన్నీ తలచుకున్నాడు. ఏదో పూర్వపుణ్యం ఫలించి, తాను ఆ సమయంలో హరినామస్మరణ చేయ గలిగానని గుర్తించాడు. అతడి హృదయంలో విష్ణు భక్తి అనే దీపం వెలిగింది. గంగానదీ ముఖ ద్వారానికి చేరుకున్నాడు. అక్కడ నిరంతరం హరి స్మరణ చేస్తూ శరీరం విడిచి పెట్టాడు. వెంటనే అతడు విష్ణుసేవకుల రూపం పొందాడు. సకల పాపాలనూ నిర్మూలించి,

నరకంనుండి తప్పించే ఈ కథను వింటే చాలు, అధ్యయనం చేస్తే, చాలు. జన్మరాహిత్యం కలుగుతుందని శుకమహర్షి స్పష్టం చేశాడు.

విష్ణుదూతలు తరిమివేయగా యమభటులు, ఆ తరువాత ఏమి చేశారో తెలుసుకోవాలన్న కుతూహలంతో పరీక్షిత్తు శుకమహర్షిని అడుగగా. శుకుడు ఇలా వివరించాడు.

తిరిగి వచ్చిన యమదూతలు జరిగినదంతా యముడికి వివరించారు. సృష్టి స్థితి లయాలకు మూలకారణమై, బ్రహ్మేంద్రాది దేవతలకు, దిక్పాలకులకు, సూర్య చంద్రులకు అధిపతి అయిన శ్రీమహా విష్ణువును గురించి యముడు తన సేవకులకు వివరించాడు. ఆ విష్ణు దేవుని ఆదేశం మేరకు అన్నిలోకాలలోనూ తిరిగే విష్ణుదూతలు అజామిళుణ్ణి రక్షించారని, విష్ణుభక్తులకు ఏ ఆపదా రాకుండా చూడడం వారి కర్తవ్యమని యముడు తెలియ చేశాడు. విష్ణు భక్తులు ఎంతో భాగ్యవంతులని, హరినామ సంకీర్తనం విశిష్టమైనదని, కనుక, విష్ణు భక్తుల జోలికి వెళ్ళరాదని తన దూతలకు యమధర్మరాజు వివరించాడు. హరినామాన్ని ఎన్నడూ పలుకని వారిని, విష్ణు కథలను ఎన్నడూ వినని వారిని, విష్ణు దేవుని ఆలయానికి ఎన్నడూ వెళ్ళని వారిని పాశాలతో బంధించి తీసుకురండి – అని యమదూతలను ఆజ్ఞాపించాడు. హరి భక్తి మోక్షమార్గమని నమ్మి ఆచరించే వారినీ, వారి బంధువులనూ, వారికి సంబంధించిన వారినీ ప్రశంసిస్తూ, "వారి జోలికి వెళ్ళరాద"ని తన సేవకులను హెచ్చరించాడు యముడు. సర్వదుఃఖ హరం, సకల పుణ్యప్రదం అయిన ఈ కథను ఒకప్పుడు అగస్త్యమహర్షి తనకు బోధించాడని శుకయోగి వివరించాడు.

విష్ణుభక్తివైభవమంతా విని పులకించిపోయిన పరీక్షిత్తు, స్వాయంభువ మన్వంతరంలో జరిగిన దేవ మానవ దానవుల, పశు పక్ష్యాదుల, పాముల పుట్టుకలను వివరించ వలసిందని కోరగా శుక మహర్షి ఆ వృత్తాంతాన్ని ఇలా వివరించాడు.

## సృష్టి విస్తరణ

ప్రాచీనబర్హికి ప్రచేతసులనే కుమారులు పదిమంది ఉన్నారు. వాళ్లు సముద్రంనుండి వెలువడ్డారు. భూమి అంతా చెట్లతో నిండి, దట్టమైన అరణ్యంలా ఉండడం చూచి వారికి ఆగ్రహం కలిగింది. అగ్నిని సృష్టించి, చెట్లన్నింటినీ దహించి వేయసాగారు. ఇది చూసి, ఆవేదన చెందిన చంద్రుడు వారిని అడ్డుకున్నాడు. మిగిలిన వృక్షాలనైనా బ్రతకనివ్వండి అన్నాడు. అప్సరస అయిన 'మారిష' అనే కన్యను వారికి ఇచ్చాడు. ప్రచేతసులకూ మారిషకూ దక్షుడు పుట్టాడు.

దక్షుడు తన సంకల్పంతో పక్షులను, వృక్షాలను, జంతువులను, చేపలను, మానవులను, రాక్షసులను సృష్టించాడు. ఇంకా దేవతలు, గరుడులు, కిన్నరులు, యక్షులు, కొండలు మొదలైన వాటినికూడా సృష్టించాడు. ఆ తరువాత వింధ్య పర్వత ప్రాంతానికి వెళ్ళి, అఘమర్షణ తీర్థాన్ని సేవించి, అక్కడ హోమాలు చేశాడు. శ్రీ హరికోసం కఠోరమైన తపస్సు చేశాడు. **'హంస గుహ్యం'** అనే స్తోత్రం చేశాడు. సమస్త ప్రాణుల దేహాలలోనూ ప్రాణ శక్తి రూపంలో ఉన్న దైవాన్ని 'హంస' అనే పేరుతో ఆరాధించాడు. చెక్కలోని అగ్ని వలె సమస్త ప్రాణుల

హృదంతరాళాలలో దాగివున్న పరమ పురుషుణ్ణి ఆశ్రయించాడు. నామరూపాలు లేని పరమాత్మ జీవులను అనుగ్రహించడానికే నామ రూపాలను ధరించాడని, అలాంటి దైవం తన అభీష్టం నెరవేర్చాలనీ ప్రార్థించాడు.

దక్షుడి భక్తికి మెచ్చి శ్రీమహా విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. గరుడవాహనారూఢుడై, సర్వాయుధాలతో, చిరునవ్వులు చిందిస్తుండగా, పట్టు పీతాంబరం, సర్వాభరణాలు, కౌస్తుభమణి, శ్రీవత్సలాంఛనం కలిగి కిరీట కుండల కాంతులతో ప్రకాశిస్తుండగా, నారదాది మహర్షులు, వివిధ దేవతలు స్తుతించారు. ప్రత్యక్షమయిన దివ్యమంగళ విగ్రహుడైన శ్రీహరిని చూసి, దక్షుడు ఆనంద పరవశుడై. భక్తితో నమస్కరించాడు.

దయాసముద్రుడైన శ్రీహరి ఇలా అన్నాడు. "నాయనా! ఇంక తపస్సు చాలు. తపస్సు నా హృదయం. ధ్యానం నా శరీరం. ధర్మమే నా ఆత్మ. దేవతలు నా ప్రాణాలు. సృష్టి ప్రారంభంలో నేను ఒక్కడినే ఉన్నాను. నా మాయాశక్తినుండి పుట్టిన బ్రహ్మ తీవ్రమైన తపస్సుచేసి, మిమ్మల్ని సృష్టించాడు. ప్రజాపతి కూతురైన 'అసిక్ని' ని భార్యగా స్వీకరించి, సంతతిని పొందు" అన్నాడు.

విష్ణుదేవుని ఆదేశాన్ని అనుసరించి దక్షుడు పదివేలమంది పుత్రులను కన్నాడు. వారికే "హర్యశ్వులు" అని పేరు. వారందరూ తండ్రి చెప్పిన ప్రకారం ప్రజాసృష్టి కోసం సంకల్పించారు. సింధునదీ సాగరసంగమ ప్రాంతంలో, తపస్సు మొదలు పెట్టారు.

అలా తపస్సు చేసుకుంటున్న హర్యశ్వుల వద్దకు నారదుడు వచ్చి! తపస్సు వల్ల నెరవేరే ప్రజాసృష్టి అశాశ్వతమని, మోక్షమే జీవులకు పరమ లక్ష్యమని అన్నాడు. నారదోపదేశంతో హర్యశ్వులు మోక్షమార్గాన్ని ఆశ్రయించారు.

ఈ సంగతి తెలిసి, దక్షుడు బాధపడ్డాడు. బ్రహ్మ దేవుడు వచ్చి, ఓదార్చి, అనుగ్రహించాడు. దక్షుడు 'శబళాశ్వులు' అనే పేరుగల వేయిమంది పుత్రులను కన్నాడు. తండ్రి సంకల్పం తెలిసిన శబళాశ్వులు నారాయణ సరస్సు అనే పుణ్య తీర్థానికి చేరి, శ్రీహరిని గురించి తపస్సు ప్రారంభించారు. నానాటికీ తీవ్రతరం అవుతున్న ఆ తపస్సును చూసి, నారదుడు వచ్చి, వారికి మోక్షమార్గాన్ని ఉపదేశించి, తపస్సు మాన్పించాడు.

తన లక్ష్యం మళ్లీ నారదుడి వల్ల భగ్నమైందన్న ఆగ్రహంతో "నిరంతరం అన్ని లోకాలూ సంచరిస్తూ, ఏ లోకంలోనూ సుస్థిరస్థానంలేని వాడవు అయిపోదువు గాక!" అని నారదుణ్ణి శపించాడు దక్షుడు. నారదుడు మారు మాటాడకుండా అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

దక్షుడు దుఃఖిస్తుంటే, బ్రహ్మదేవుడు వచ్చి ఓదార్చాడు. ఆ తరువాత దక్షుడు అరవైమంది కూతుళ్ళను కన్నాడు. వారిలో పదిమందిని ధర్మువనకు, పదముగ్గురిని కశ్యపునకు, ఇరవైఏడుమందిని చంద్రునకు, ఇద్దరిని భూతునకు, ఇద్దరిని ఆంగిరసునకు, మరో ఇద్దరిని కృశాశ్వునకు, మిగిలిన నలుగురినీ తార్క్ష్యునకూ ఇచ్చి, పెళ్ళి చేశాడు.

వీరందరికీ సంతానం కలిగింది. ఆ సంతతినుండే మానవులు, దేవతలు, దానవులు, పశువులు, పాములు, పక్షులు, వృక్షాలు మొదలుగా అనంత వైవిధ్యం గల ప్రాణికోటితో సృష్టి విస్తృతం అయింది.

## దేవతలకు దానవ పౌరోహిత్యం

ఇలా ఉండగా ఒకనాడు దేవగురువైన బృహస్పతి ఇంద్ర సభకు వచ్చాడు. ఆ సభలో త్రిలోకాధిపత్య గర్వంతో ఇంద్రుడు దేవగురువును పట్టించుకోలేదు. బృహస్పతి మనస్సు కలత చెంది, ఆచార్య పదవినుంచి తప్పుకున్నాడు.

ఈ సంగతి తెలిసి రాక్షస గురువైన శుక్రాచార్యుడు తన శిష్యులను దేవలోక దండయాత్రకు పురికొల్పాడు. దేవతలు ఓటమి పాలయ్యారు. ప్రాణభయంతో పారిపోయి, దిక్కుతోచక, బ్రహ్మ దేవుడికి మొరపెట్టుకున్నారు. గురుధిక్కార నేరం వల్లనే దేవతలకు ఈ కష్టం కలిగిందని బ్రహ్మదేవుడు చెప్పాడు. రాక్షస స్త్రీ అయిన 'రచన'కు మనువుకొడుకైన త్వష్టకు పుట్టిన విశ్వరూపుణ్ణి దేవతలకు గురువుగా సూచించాడు. దేవతలు విశ్వరూపుణ్ణి ప్రార్థించగా, అతడు అంగీకరించి వారికి పౌరోహిత్యం వహించాడు.

విశ్వరూపుడు ప్రబోధించిన **'విష్ణుమాయా'** విద్య ఆధారంగా దేవేంద్రుడు రాక్షసులను జయించాడు. ఈ కథ వింటూ దేవతల కష్టాలు తీర్చి, తిరిగి వైభవం ప్రసాదించిన "విష్ణుమాయా విద్య"ను వివరించ వలసిందిగా పరీక్షిత్తు శుక మహర్షిని ప్రార్థించాడు. పరీక్షిత్తు కోరిక మేరకు శుక యోగీంద్రుడు **"శ్రీమన్నారాయణ కవచం"** అనే విద్యను తెలియ చేశాడు.

## శ్రీమన్నారాయణ కవచం

రాజా! విశ్వరూపుడు అంగన్యాస కరన్యాసాలతో నారాయణకవచం అనే మంత్రాన్ని అనుగ్రహించగా, దేవేంద్రుడు స్వీకరించాడు. **"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షరీ మంత్రాన్ని, **"ఓం నమో భగవతే వాసుదేవాయ"** అనే ద్వాదశాక్షరీ మంత్ర అనుసంధానంతో జపించే ఈ కవచంలో సాధకుని దివ్యదేహంలో 'న్యాసం' చేయవలసిన బీజాక్షరాలను, 'దిగ్బంధన విధానాన్ని' వివరించాడు శుకమహర్షి.

ఈ మంత్రంలో గరుడారూఢుడైన నారాయణుని మూలమూర్తిని, మత్స్య, వరాహ, నృసింహ, వామన, పరశురామ, రామ అవతార మూర్తులనూ, ఉపద్రవాలనుండి రక్షించే వివిధ దేవతా మూర్తుల ధ్యానవిధానాలనూ, వివిధసమయాలలో జపించదగిన విష్ణు నామాలనూ శుకమహర్షి స్పష్టం చేశాడు. ఆధి వ్యాధులనుండి, శత్రు బాధనుండి రక్షించే అమోఘమైన శక్తిగల దివ్యమంత్రం నారాయణ కవచమని తెలియచేశాడు. ఈ విద్యను ధారణ చేసి, యోగమార్గంలో తనువు చాలించినవారి అస్థికలలో కూడా ఆ ప్రభావం కనిపిస్తూ ఉంటుందని చెప్పి, కౌశికుడనే బ్రాహ్మణుని వృత్తాంతాన్ని దృష్టాంతంగా వివరించాడు శుక మహర్షి.

దేవేంద్రుడు విశ్వరూపునినుండి ఈ విద్యను గ్రహించి, అఖండ విజయం సాధించాడు.

విశ్వరూపుని తల్లి రాక్షస స్త్రీ. అందువల్ల ఆ విశ్వరూపుడికి రాక్షసుల పట్ల అభిమానం కలిగింది. దేవతలకు తెలియకుండా, వారి యజ్ఞఫలంలో కొంత భాగాన్ని రహస్యంగా రాక్షసులకు ఇవ్వసాగాడు. అది తెలిసి, ఇంద్రుడు భయపడి, మరేమీ ఆలోచించకుండా, ఆ విశ్వరూపుడి మూడుతలలనూ ఖండించాడు. తెగిన ఆ మూడు తలలూ మూడు పక్షుల రూపాలు ధరించాయి. బ్రహ్మహత్యా దోషం ఇంద్రుణ్ణి వెంబడించింది. ఒక ఏడాది పాటు ఎలాగో

ఆ దోషాన్ని భరించిన ఇంద్రుడు, ఆపై ఇక తట్టుకోలేక, భూమిని, నీటిని, వృక్షాలనూ, స్త్రీలనూ ప్రార్థించి, వారు కోరిన నిబంధనలకు అంగీకరించి, తనకు సంక్రమించిన దోషాన్ని నాలుగు భాగాలుగా చేసి, వారికి పంచి ఇచ్చాడు.

## వృత్రాసుర వృత్తాంతం

కొడుకు మరణంతో త్వష్టకు అంతులేని దుఃఖం, కోపం కలిగాయి. ఇంద్రుడిపై ప్రతీకార వాంఛతో క్రతుహోమం చేశాడు. అందులోనుంచి ఒక భయంకరాకారుడు పుట్టాడు. భూమ్యాకాశాలు వ్యాపించిన దేహంతో పదునైన కోరలతో గుహలా ఉన్న పెద్ద నోరు, మధ్యాహ్నసూర్యబింబంలా నిప్పులు చెరిగే కళ్లతో, ప్రచండశూలాన్ని చేతిలో ధరించి అతడు అడుగులు వేస్తుంటే భూమి కంపించి పోయింది. అతడే వృత్రాసురుడు.

అతడు రాక్షస సేనలకు నాయకుడై దేవతల పైకి యుద్ధానికి వచ్చాడు. ఇంద్రుడు అతణ్ణి ఎదుర్కొన్నాడు. కాని ఇంద్రాది దేవతలు ప్రయోగించే శస్త్రాస్త్రాలన్నింటినీ ఆ వృత్రాసురుడు మ్రింగివేశాడు. దేవతలు భయపడి, శ్రీహరిని ప్రార్థించగా, అతడు ప్రత్యక్షమయ్యాడు. వృత్రాసురుని బారినుండి రక్షించవలసిందిగా దేవతలు విష్ణుమూర్తిని ప్రార్థించారు.

శ్రీమహావిష్ణువు వారిని ఊరడించాడు. అపార తపశ్శక్తి సంపన్నుడైన దధీచి మహర్షిని ప్రార్థించి, అతడి దేహాన్ని తీసుకొమ్మని, ఆ ముని దేహంలోని ఎముకలతో నూరు అంచులుగల దివ్యాయుధాన్ని విశ్వకర్మ నిర్మిస్తే, తాను ఆ వజ్రాయుధంలో తేజోరూపంలో ఉంటానని, వృత్రాసురుని శిరస్సును ఖండించగల ఆయుధం అదేనని ఉపాయం చెప్పాడు.

దేవతలు దధీచి మహర్షిని సమీపించి కోరరాని తమ కోరికను విన్నవించారు. ఆ కోరిక విని దధీచి మహాముని "మరణం ఎప్పటికైనా తప్పదని, మరణానంతరం కుక్కల నక్కలపాలయ్యే ఈ దేహం కీర్తినీ పుణ్యాన్నీ పొందే విధంగా రాలిపోవడం మంచిదే కదా!" అన్నాడు. యోగమార్గంలో తనువు చాలించాడు.

దధీచిమహర్షిఎముకలతో విశ్వకర్మ నిర్మించిన వజ్రాయుధంతో ఇంద్రుడు వృత్రాసురుని పైకి యుద్ధానికి వెళ్ళాడు.

దేవ దానవ సంగ్రామం అతిదారుణంగా సాగింది. నర్మదాతీరాన కృతయుగంలో ప్రారంభమై త్రేతాయుగం వచ్చేవరకు వరకు యుద్ధం తీవ్రంగా జరుగుతూనే ఉంది. దేవ దానవ వీరులు చేస్తున్న ఈ భీకరయుద్ధంలో ఒకసారి దేవతలదీ, మరొకసారి దానవులదీ పై చేయిగా అయ్యింది. ఒక మారు యుద్ధ భూమినుండి ప్రాణభయంతో పారిపోతున్న తన సేనానాయకులను వృత్రాసురుడు యుద్ధమరణం, యోగస్థితిలో మరణం ఈ రెండూ ఉత్తమమైనవని హితవుపలికి ఉత్సాహపరిచాడు.

వృత్రుడు వికటాట్టహాసంతో విజృంభించగా, దేవేంద్రుడు అతడిపై గదాదండం విసిరాడు. ఆ గదను ఎడమ చేతితో అవలీలగా పట్టుకొని, దానితోనే ఐరావతం తలపై మోదాడు వృత్రాసురుడు. భయపడి పారిపోతున్న తన ఏనుగును ఎలాగో బుజ్జగించి దేవేంద్రుడు దారికి తెచ్చుకున్నాడు.

తన అన్న అయిన విశ్వరూపుణ్ణి చంపిన దేవేంద్రుణ్ణి గురుద్రోహి అని, బ్రాహ్మణ హంతకుడని నిందించి, వృత్రాసురుడు యుద్ధం తీవ్రతరం చేశాడు. దేవేంద్రుణ్ణి 'శూలంతో గుచ్చి చంపుతా' నన్నాడు. తనపై 'వజ్రాయుధం ప్రయోగించు' మని రెచ్చ గొట్టాడు.

ఈ సందర్భంలో వృత్రుడు పలికిన మాటలు అశ్చర్యకరంగా ఉన్నాయి.

శ్రీహరి కరుణ ఉన్నచోట విజయం, సంపద తప్పక లభిస్తాయన్నాడు. ఇంద్రుడు వజ్రాయుధంతో తన్ను చంపితే, ప్రాణం వదిలి, పరమాత్మను చేరుకుంటానని, తాను నారాయణ దాసుడనని, తనకు సంపదలు, భోగాలు రుచించవనీ అన్నాడు. తనకు పుణ్యలోకాలతో పనిలేదని, త్రికరణశుద్ధిగా శ్రీహరిసేవ తనకు కావాలని, పుణ్యాత్ములతో స్నేహం తన అభీష్టమనీ అన్నాడు. యుద్ధ సన్నద్ధుడై ఇంద్రుడి మీద శూలం ప్రయోగించాడు. ఆ శూలాన్ని, ఆ తర్వాత వృత్రుని భుజాన్ని ఇంద్రుడు వజ్రాయుధంతో నరికి వేశాడు. అయినా చలించక వృత్రాసురుడు ఇంద్రుడి మీద దెబ్బతీశాడు. ఇంద్రుడి చేతినుండి వజ్రాయుధం జారిపడింది. ఇంద్రుడు సిగ్గుతో తలదించుకున్నాడు.

నిరాయుధుడిపై తాను తలపడనని, వజ్రాయుధం తీసుకుని యుద్ధానికి రమ్మని వృత్రుడు ఇంద్రుణ్ణి హెచ్చరించాడు. ఆత్మతత్వాన్ని వివరిస్తూ, ఎన్నో మాటలు చెప్పాడు.

ఆ మాటలు విని, దేవేంద్రుడు **'ఇంత గొప్పవిష్ణుభక్తిగల నీకు ఈ రాక్షస రూపం ఎందు' కన్నాడు. పుణ్యాత్ముడవై పురాణ పురుషుని రూపం ధరించు'** అన్నాడు.

వృత్రాసురుడు ఈ మాటలు పట్టించుకోకుండా పరిఘతో ఇంద్రుడి గుండె మీద గట్టిగా కొట్టాడు. ఇంద్రుడు ఆ రాక్షసుడి రెండో భుజం కూడా ఖండించాడు. వృత్రాసురుడు ఆగ్రహించి, పెద్దగా నోరు తెరిచి, ఐరావతాన్ని, ఆయుధంతో సహా దేవేంద్రుణ్ణి మింగి వేశాడు.

ఇంద్రుడు నారాయణ కవచం జపించాడు. నిశ్చింతగా ఉన్నాడు. వజ్రాయుధంతో వృత్రాసురుడి పొట్టను చీల్చుకొని బయటకు వచ్చాడు. ఆ రాక్షసుడిపై వజ్రాయుధం ప్రయోగించాడు. ఆ వజ్రాయుధం ఏడాది పాటు రాత్రింబవళ్ళు వృత్రుడి శిరస్సును ఖండిస్తూ చివరికి అతణ్ణి కూల దోసింది. దేవ దుందుభులు మ్రోగాయి. దేవతలు పూలవాన కురిపించారు. ఆ రాక్షసుడి దేహంనుండి ఒక దివ్యతేజస్సు వెలువడి, అందరూ చూస్తూ ఉండగా, విష్ణుమూర్తిలో కలిసి పోయింది. దేవతలు, ఋషులు ఇంద్రుడికి చెప్పకుండానే తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు.

## నహుషుడి పతనం

వృత్రుణ్ణి చంపితే ఇంద్రుడికి బ్రహ్మహత్యా దోషం సంక్రమిస్తుందని, దాన్ని తొలగించడానికి అతడిచేత అశ్వమేధ యాగం చేయిస్తామని, ముందుగానే ఇంద్రుణ్ణి దేవతలందరూ ఒప్పించిన సంగతిని పరీక్షిత్తునకు శుకమహర్షి వివరించి, ఇంకా ఇలా కొనసాగించాడు.

బ్రహ్మహత్యా దోషం చండాలస్త్రీ రూపంలో దేవేంద్రుణ్ణి వెంబడించింది. ఆ దోషంనుంచి తప్పించుకొనే ప్రయత్నంలో ఇంద్రుడు భూమ్యాకాశాలన్నీ తిరిగాడు. దిక్కులన్నీ సంచరించాడు. చివరికి ఈశాన్యంలో మానససరస్సులోని ఒక తామరతూడులో దూరి, ఆ సన్ననిదారాలలో కలసి పోయి దాక్కున్నాడు. బ్రహ్మహత్యా దోషంనుండి ఎలా విముక్తి పొందారో తెలియక పరితపిస్తూ, ఆ తామరతూడులోనే వేయి సంవత్సరాలు గడిపాడు. అతణ్ణివెంబడించిన చండాలి అందులో ప్రవేశించలేక అక్కడే కాచుకొని ఉండిపోయింది.

ఇంద్రుడు స్వర్గంలో లేని కారణంగా ఇంద్రసింహాసనం ఖాళీగా ఉంది. నహుషుడు తన తపోబలంతో స్వర్గ రాజ్యాన్ని పరిపాలించ సాగాడు. మదించిన ఆ నహుషుడు ఇంద్రపత్ని అయిన శచీ దేవిని తనకు భార్యగా రమ్మని కోరాడు. దేవగురువైన బృహస్పతి సూచనతో ఆ శచీదేవి ఒక నిబంధన పెట్టింది. 'బ్రహ్మర్షులు మోసే పల్లకిలో వచ్చి తనను భార్యగా పొందు' మని చెప్పింది. ఆ ప్రయత్నంలో నహుషుడు అగస్త్యుని వలన శాపం పొంది, కొండ చిలువగా పుట్టాడు.

ఈశాన్యదిక్పతి అయిన పరమేశ్వరుని రక్షణలో వేయి సంవత్సరాలు విష్ణుధ్యానంలో గడిపిన కారణంగా ఇంద్రుడికి బ్రహ్మహత్యా దోషఫలం తగ్గింది. ఇంద్రుడు తిరిగి వచ్చి, స్వర్గ రాజ్యాధిపత్యం స్వీకరించాడు. బ్రహ్మర్షుల ఆధ్వర్యవంలో అశ్వమేధయాగం చేసి, పూర్తిగా తన దోషాన్ని పోగొట్టుకొని, విష్ణుదేవుని అనుగ్రహంతో పూర్వవైభవాన్ని తిరిగి పొందాడు.

శుకమహర్షి చెప్పిన వృత్రాసురకథలో పరీక్షిత్తుకు మరో సందేహం కలిగింది. **ధర్మాత్ములు, తపోధనులు అయిన మునులకు కూడా విష్ణుభక్తి కలగడం అరుదు కదా! అలాంటప్పుడు రజస్తమోగుణాలు గల రాక్షసుడికి విష్ణుభక్తి ఎలా కలిగింది? వృత్రాసురుడు యుద్ధంలో విష్ణు ధ్యానం చేయడం ఆశ్యర్యం కలిగిస్తోంది** – అన్నాడు. అప్పుడు శుక మహర్షి గతంలో వ్యాస నారదాదుల వల్ల తాను విన్న 'చిత్రకేతూపాఖ్యానం' పరీక్షిత్తునకు తెలియ చేశాడు.

### చిత్రకేతువు కథ

శూరసేన దేశాన్ని పరిపాలించే చిత్రకేతువనే రాజు, సంతతి లేక అలమటించాడు. ఒకనాడు ఆ రాజువద్దకు వచ్చిన అంగిరసమహర్షి పుత్రకామేష్టిని నిర్వహించి, యజ్ఞ ప్రసాదాన్ని పట్టపురాణి కృతద్యుతి కిచ్చి, 'మీకు పుత్రుడు కలుగుతాడ'ని, 'అతని వల్ల మీరు సుఖ దుఃఖాలు అనుభవిస్తా' రని చెప్పి వెళ్ళిపోయాడు. పిదప కృతద్యుతికి కొడుకు పుట్టాడు. చిత్రకేతువు పుత్రమమకారంతో కృతద్యుతిని ఎక్కువ అనురాగంతో చూడసాగాడు. మిగిలిన భార్యలు ఈర్ష్య చెంది, రాజకుమారుడికి విషం పెట్టి చంపారు. చిత్రకేతువు దుఃఖంలో మునిగి పోయాడు. అంగిరస నారద మహర్షులు అక్కడికి వచ్చారు.

మరణించిన బాలుణ్ణి బ్రతికించారు. 'మళ్ళీ ఈ శరీరంలో ప్రవేశించి, తల్లి దండ్రులకు సంతోషం కలిగించమ'ని, 'వారసత్వంగా రాజ్యాధికారం స్వీకరించు'మని చెప్పారు. ఆ జీవుడు – తనకు ఎన్నో జన్మలు గడిచి పోయాయని,

వీరు ఏ జన్మలో తల్లిదండ్రులో తనకు తెలియదని, సృష్టిలో నారాయణుడు ఒక్కడే శాశ్వతుడని, మిగిలిన బంధాలన్నీ తాత్కాలికమేనని, ఆత్మతత్త్వ విశేషాలు మాట్లాడి, అదృశ్యం అయ్యాడు. చిత్రకేతువుకు శోకమోహాలు తొలగిపోయాయి.

## చిత్రకేతువు తపస్సు, పార్వతి శాపం

చిత్రకేతువుకి నారదుడు నారాయణమంత్రం ఉపదేశించాడు. అంగిరస నారదులు తిరిగి వెళ్ళి పోయారు. చిత్రకేతువు ఏకదీక్షతో ఏడురోజులు నారాయణ ధ్యానం చేశాడు. శ్రీహరి ఆదిశేషుని రూపంలో దర్శనమిచ్చి, ఆ రాజుకి అపారమైన ఆత్మజ్ఞానం ప్రబోధించాడు.

త్రిలోకసంచారం చేస్తూ, ఒకనాడు కైలాసానికి వెళ్ళిన చిత్ర కేతువు, అక్కడ పరమేశ్వరుని ఒడిలో కూర్చున్న పార్వతిని చూశాడు. 'సకలలోకాలకూ గురువైన శివుడు ఏకాంతంలో ఉన్నట్లుగా బ్రహ్మవేత్తలున్న సభలో ఇలా భార్యతో జతగూడి ఉండడం సిగ్గులేని తనం' అని పరిహాసం చేశాడు. పరమశివుడు సహజ గంభీరుడు కనుక, నవ్వి ఊరుకున్నాడు. కాని, చిత్రకేతువు పలికిన నిందావాక్యాలను సహించలేక పార్వతి అతడి దురహంకారాన్ని ప్రశ్నించింది. 'శివ నింద చేసిన దోష ఫలంగా రాక్షసుడవై జన్మించు' మని శపించింది. చిత్రకేతువు తన తప్పు తాను తెలుసుకున్నాడు. పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించి, అక్కడినుంచి వెళ్ళిపోయాడు. 'ఆ చిత్రకేతువే వృత్రాసురుడుగా పుట్టాడని' శుకమహర్షి వివరించాడు. శాపం వల్ల రాక్షసత్వం, పూర్వపుణ్యఫలంగా హరి భక్తీ వృత్రాసురునిలో వ్యక్తమయ్యాయని పరీక్షిత్తు తెలుసుకున్నాడు.

## సవితృ వంశ కథనం

ఆ తరువాత శుక మహర్షి సవితృ వంశాన్ని గురించి వివరించాడు. ద్వాదశాదిత్యులలో ఐదవవాడు సవిత. అతడి భార్య పృశ్ని. ఈ దంపతులకు కుమారులూ కుమార్తెలూ కలిగారు. ఈ వంశంలోనే అదితి కశ్యపులకు శ్రీహరి వామనుడై పుట్టాడు. 'ఆ కథ తరువాత వివరిస్తా'నన్నాడు శుక మహర్షి.

దితి వంశంలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, పిదప హిరణ్య కశిపుడికి ప్రహ్లాదాదులు పుట్టారని చెప్పాడు శుకుడు. ప్రహ్లాదుని కొడుకు విరోచనుడు, అతడి పుత్రుడు బలి అని, 'అతడి కథను తరువాత వివరిస్తా'నన్నాడు శుక మహర్షి.

## మరుత్తుల జననం

దితికి మరుత్తులు అనే పేరుతో నలభై తొమ్మిది మంది కొడుకులు పుట్టారని, వారికి సంతానం లేదని, ఆ మరుత్తులు ఇంద్రుడితో కలసి దేవత్వం పొందారని శుకుడు చెప్పాడు. ఈ మాటలను విన్న పరీక్షిత్తు, కుతూహలంతో ఆ వివరాలు అడిగాడు. ఆ మరుత్తుల జన్మ వృత్తాంతం శుకుడు వివరించాడు.

రాజా! కశ్యపుని భార్య దితికి మనస్సులో ఒక ఆలోచన కలిగింది. తన కొడుకులందరినీ హతమార్చే ఇంద్రుడి అంతం చూడాలనే ఆలోచన అది. చాలాకాలం శ్రద్ధాభక్తులతో, అనురాగంతో భర్తను సేవించి, అతడి

మనస్సును చూరగొన్నది. కశ్యపుడు సంతోషించి, 'వరం కోరుకో' మన్నాడు. 'ఇంద్రుణ్ణి సంహరించగల అమరుడు, అజేయుడు, అతిబలవంతుడు అయిన పుత్రుణ్ణి ప్రసాదించు' మని దితి కోరింది. అంతవరకు దితి సేవలలోని ఆంతర్యం కశ్యపునికి తెలియరాలేదు.

వరమిచ్చాడు కనుక, 'తప్పదు' అనుకొని, 'సరే' అన్నాడు. అయితే, ఇంద్రుడికి ప్రాణహాని లేకుండా ఉండాలని ఆలోచించి, ఆచరణకు కష్టసాధ్యమైన అతికఠోర నియమాలతో ఒక వ్రతాన్ని దితికి ఉపదేశించాడు. ఒక సంవత్సరం పాటు నియమం తప్పకుండా ఈ వ్రతం పాటిస్తే, కోరిన విధంగా కొడుకు పుడతాడని చెప్పాడు.

ఆ వ్రత నియమాలను వివరించాడు. వ్రతకాలంలో ఏ జీవులనూ హింసించ రాదు. బిగ్గరగా మాటాడ కూడదు. కోపం, అసత్యం ఎంతమాత్రం పనికి రావు. గోళ్ళు, జుట్టు కత్తిరించుకో కూడదు. పుర్రెలు, ఎముకలు వంటి అమంగళ వస్తువులను తాకరాదు. నదులలో, సరస్సులలో మాత్రమే స్నానం చేయాలి. చెడ్డ వారితో మాట్లాడ రాదు. కట్టుకున్న చీర, పెట్టుకున్న పూలు మళ్ళీ మరోసారి ధరించ కూడదు. నిత్యం శుచిగా ఉదికిన వస్త్రాలే ధరించాలి. కుక్కలు, పిల్లులు, పక్షులు, పురుగులు, చీమలు, కోతులు తాకిన అన్నం తినకూడదు. ఎంగిలి భుజించ రాదు. చండికకు నివేదించిన అన్నం, మాంసంతో కూడిన అన్నం, వెంద్రుకలున్న అన్నం, శూద్రులు తెచ్చిన అన్నం తినకూడదు. దోసిటితో నీళ్ళు త్రాగకూడదు. సాయంకాలాలలో జుట్టు విరబోసుకో కూడదు. మితంగా మాట్లాడాలి. అలంకారాలు ధరించకుండా ఉండకూడదు. బయట తిరగ కూడదు. పడుకొనే ముందు కాళ్ళు కడుక్కోవాలి. అయితే, తడి కాళ్ళతో పడుకో కూడదు. పడమటి దిక్కుగా తల పెట్టుకుని గాని, నగ్నంగా గాని పడుకో కూడదు. సంధ్యాసమయంలో నిద్ర పోకూడదు. ప్రతిరోజూ ఉదయాన్నే తూర్పు దిక్కుగా తిరిగి, లక్ష్మీ నారాయణులను ఆరాధించాలి. ఇలా మార్గశిర పాడ్యమి నుండీ ఏడాదిపాటు ఈ నియమాలతో వ్రతం పాటించాలని కశ్యపుడు చెప్పాడు. భర్త చెప్పినదంతా విని, దితి ఆ నియమాలను పాటిస్తూ, వ్రతం ప్రారంభించింది. ఆ రాక్షసమాత గర్భవతి అయింది. వ్రతం కొనసాగిస్తోంది. దితి మనస్సులోని ఆలోచనను, ఆమె ఆంతర్యాన్ని తెలుసుకున్న ఇంద్రుడు రహస్యంగా ఆమెకు సేవలు చేయసాగాడు. ఆమెకు వ్రతభంగం కలగాలని పొంచి చూస్తున్నాడు.

ఒకనాటి సంధ్యాకాలంలో ఆమె అశుచి అయి, కాళ్ళు కడుక్కోకుండానే పడుకున్నది. గాఢనిద్రలోకి జారి పోయింది. ఆమెకు వ్రతనియమం భగ్నమైంది. ఇది అదనుగా చేసుకుని, ఇంద్రుడు యోగ మాయాబలంతో ఆమె గర్భంలో జొరబడి, అక్కడున్న పిండాన్ని వజ్రాయుధంతో ఏడుముక్కలుగా నరికాడు. ఆ ముక్కలన్నీ ప్రాణంతో ఉండి, ఏడుగురు బాలురుగా రూపుదిద్దుకున్నాయి. చావకుండా బాధతో ఏడుస్తున్న ఆ ఏడుగురు బాలురనూ 'మా రుద' (ఏడవకు) అంటూ మళ్ళీ ఏడేసి ముక్కలుగా ఖండించాడు ఇంద్రుడు. అయినా వారు చావలేదు. అలా ఆ నలభై తొమ్మిది మంది బాలురూ ప్రాణాలతో, గొప్ప తేజస్సుతో ఉన్నారు. వారే మరుత్తులు.

వాళ్ళందరూ ఇంద్రుడి చుట్టూ చేరి, నమస్కరించి, జాలి గొలిపే మాటలతో "మేము నీకు సోదరులం. ఎందుకు మమ్మల్ని చంపుతావు? నీకు అనుచరులమై 'మరుద్గణం' అనే పేరుతో నిన్ను సేవిస్తాం. మమ్మల్ని రక్షించు" అని ఇంద్రుణ్ణి ప్రార్థించారు. ఇంద్రుడికి దయ కలిగి, వారిని హింసించడం మాని వేశాడు.

“పరీక్షిన్మహారాజా! అశ్వత్థామ బాణాగ్నినుండి నిన్ను రక్షించినట్లే ఆ శ్రీహరి ఇంద్రుని వజ్రఘాతం నుండి వీరందరినీ రక్షించాడు. శ్రీహరిని సేవించిన ఫలంగా ఈ నలభై తొమ్మిది మందీ మరుద్గణంగా దితిగర్భంనుండి పుట్టారు అంటూ శుకమహర్షి కథను కొనసాగించాడు.

ఇంతలో దితికి మెలకువ వచ్చింది. ఇంద్రుణ్ణి చూసి “నిన్ను సంహరించే కొడుకు కావాలని నేను కఠోరవ్రతం చేస్తే, అనుకున్న ఆ కొడుకు ఒక్కడు కాకుండా, ఇలా నలభైతొమ్మిదిమంది అయ్యా రేమిటి?” అని అడిగింది. ఇంద్రుడు దాపరికం లేకుండా జరిగిన దంతా చెప్పి, “తన పాపాన్ని క్షమించుమని” మనస్ఫూర్తిగా కోరాడు.

“భగవదారాధన సిద్ధించకుండా ఎలా ఉంటుంది? మహాపురుషుడి అర్చనకు ఫలంగా పుట్టిన తేజస్సును నశింపచేయడం ఎవరితరం?” అన్నాడు ఇంద్రుడు.

దితి కూడా ‘సరే’ అని శాంతించింది. ఇంద్రుడు మరుద్గణాలతో కలసి స్వర్గానికి వెళ్ళాడు. సోమపానమూ హవిర్భాగాలూ వారికి పంచి ఇచ్చాడు.

శ్రీహరిని ఉద్దేశించి చేసిన వ్రతం ఫలించి పుట్టిన వీరి వృత్తాంతం చదివితే, సుదీర్ఘమైన కర్మలు కూడా హరిస్తాయని శుకమహర్షి చెప్పాడు. ఇలా ఫలశ్రుతితో కూడిన ఈ కథను పరీక్షిత్తునకు శుకుడు చెప్పాడని సూతుడు శౌనకాది మహామునులతో అన్నాడు.

శ్రీమహాభాగవతంలో ఏర్చూరి సింగన కవి రచించిన ఆరవ స్కంధంలోని కథాసారం ఇది.

**– డా॥ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి**

# సప్తమస్కంధం - కథాసారం

**సూ**తమహర్షి శౌనకాది మునులతో ఇలా అన్నాడు.

మోక్షకాంక్షతో ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూస్తూ, “శ్రీమహావిష్ణువు సర్వజీవకోటికి హితుడు కదా! కేవలం ఇంద్రుని కోసమే రాక్షసరాజులను ఎందుకు సంహరించాడు. దేవతలవల్ల అతనికి ఒరిగేదేదీ లేదు. అంతేగాక తనకు రాక్షసులవల్ల భయంగాని, వారిపై పగగాని లేవు గదా! అలాంటివాడు అసురులను అంతం చేయడం, అమరులను ఆదరించడం వింతగా ఉంది. ఈ సంశయాన్ని తామే నివారించాలి” అని అడిగాడు. అప్పుడు శుకమహర్షి ఇలా చెప్పాడు. మహావిష్ణువుతత్త్వం అంతు పట్టదు. అతడు కాలస్వరూపుడు. సత్త్వగుణంగల దేవతలకు ఆనందాన్ని, రజోగుణ తమోగుణాలు ఉన్న రాక్షసులకు దుఃఖాన్ని కలిగిస్తాడు. ఆయన తత్త్వసారాన్ని రాజసూయయాగ సమయంలో నారదమహర్షి ధర్మరాజుకు చక్కగా వివరించాడు. దాన్ని వింటే నీ సందేహం తొలగుతుంది.

రాజసూయ యాగంలో శిశుపాలుడు శ్రీకృష్ణుణ్ణి నిందించాడు. అది సహించని శ్రీకృష్ణుడు తన చక్రంతో శిశుపాలుని తలను ఖండించాడు. శిశుపాలుని దేహంనుండి వెలువడిన తేజస్సు వాసుదేవుని శరీరంలో విలీనమైంది. అది చూచి ఆశ్చర్యం పొందిన ధర్మరాజు, నారదుణ్ణి చూస్తూ, వాసుదేవునిలో లీనం కావడం పుణ్యాత్ములకైనా వీలుకాదు కదా! కృష్ణునికి శత్రువూ, దుష్టుడూ అయిన శిశుపాలుడెలా ఆ భాగ్యాన్ని పొందాడు అని అడుగగా నారదుడు ధర్మరాజుతో ఇలా అన్నాడు.

శిశుపాల దంతవక్త్రులు పూర్వం వైకుంఠంలో ద్వారపాలకులు. ఒకప్పుడు సనకసనందాదులు వైకుంఠంలోకి చొరబడ ప్రయత్నించారు. వారిని ద్వారపాలకులు అడ్డుకొన్నారు. అప్పుడు సనకసనందాదులు కోపంతో “మీరిక్కడ ఉండతగరు. రాక్షసులై భూలోకంలో పుట్టండి” అని శపించారు. వారు పశ్చాత్తాపంతో వేడుకోగా ఆ విప్రులు దయతో ఇలా అన్నారు. “మీరు మూడుజన్మల్లో వైరభక్తితో భగవంతుని ద్వేషిస్తూ, మీ స్వామి చేతే సంహరింపబడతారు. ఆ తర్వాత మీ స్థానాన్ని మీరు పొందుగలరు అని శాపావధి తెల్పి వెళ్లిపోయారు.

ఆ కారణంగానే వారిద్దరూ దితికి హిరణ్యకశిపు – హిరణ్యాక్షులై జన్మించారు. హిరణ్యాక్షుడు బలగర్వంతో భూమిని చాపలాగా చుట్టి, పాతాళంలోకి తీసుకొని వెళ్లాడు. విష్ణువు వరాహరూపంలో అతణ్ణి సంహరించి భూమిని ఉద్ధరించాడు. ఆ తర్వాత హిరణ్యకశిపుడు నరసింహరూపుడైన శ్రీహరి చేతుల్లో మరణించాడు. ఇతని కొడుకు ప్రహ్లాదుడు. నారాయణునిమీది పరమభక్తితో తరించి శాశ్వతుడైనాడు. ఆ జయ విజయులే రెండవ జన్మలో కైకసీ విశ్వవసులకు రావణ–కుంభకర్ణులుగా పుట్టి, శ్రీరామునిచే చంపబడినారు.

ఆ తర్వాత వాళ్ళే మూడవజన్మలో శిశుపాల–దంత వక్త్రులుగా జన్మించి బాల్యంనుండే శ్రీకృష్ణుణ్ణి ద్వేషించారు. వారి ఆలోచనంతా కృష్ణుణ్ణి గూర్చే! రాజసూయ సందర్భంలో కృష్ణపరమాత్మ సుదర్శనచక్రంతో శిశుపాలుని తలను ఖండించాడు. ఆ తరువాత మరో సందర్భంలో శ్రీకృష్ణుడు దంతవక్త్రుణ్ణీ సంహరించాడు. శాపం గడువు పూర్తి కావటంతో జయ విజయులు తిరిగి వైకుంఠలోకానికి చేరుకొన్నారని వివరించాడు.

అంతటితో సమాధాన పడని ధర్మరాజు మళ్ళీ నారదునితో ఇలా అన్నాడు "నారదమహర్షీ! ప్రహ్లాదుడు గుణవంతుడైన కుమారుడు. అతణ్ణి చూచి సంతోషించాలి కాని హిరణ్యకశిపుడు శిక్షించడం విచిత్రంగా ఉంది కదా!" అన్నాడు.

అప్పుడు నారదుడిలా అన్నాడు.

హిరణ్యాక్షుడు విష్ణువుచేతిలో మరణించడం వల్ల హిరణ్యకశిపుని మనస్సు మండిపోయింది. అతడు సభామంటపంలో నిల్చొని త్రిమస్తకాది దానవులను చూచి ఇలా అన్నాడు. 'సోదరులారా! ఆ మాయావి నీళ్ళల్లో అడవుల్లో మునుల సమూహంలో దాగి ఉంటాడు. దొరకడు, మాయోపాయంతో పట్టుకోవాలి. నాకు భయపడి సముద్రంలో దాగినా, వెన్నిచ్చి పారిపోయినా, పాతాళంలో దూరినా, సింహంవలె ఎదిరించినా నా బల్లెంతో వాని కంఠాన్ని ఛేదించి ఆ రక్తంతో నా తమ్మునికి తర్పణం చేస్తాను. విజయంతో తిరిగివచ్చి మీకు మేలు చేస్తాను. మొదట మీరు విప్రులుండే చోట్లను, యజ్ఞయాగాలు జరిగే చోట్లను ధ్వంసం చేయండి' అని చెప్పాడు.

ఆ హిరణ్యకశిపుని ఆజ్ఞను పొందిన రాక్షసులు భూగోళం అంతటా ఉపద్రవాలు కల్పించారు. హిరణ్యకశిపుడు సోదరుని అంత్యక్రియలు నిర్వహించాడు. అతనికొడుకులు శకుని శంబరాదులను ఓదార్చాడు. తల్లినీ, తమ్ముని భార్యలను ఊరడించి తల్లి దితితో ఇట్లన్నాడు. అమ్మా! లోకం చలిపందిరి వంటిది. బాటసారులు దాహం తీర్చుకొని వెళుతుంటారు. అలాగే మనం అందరం కలిశాం. దానికి చింతించవలసిన పనిలేదు. నీ చిన్నకుమారుడు వీరస్వర్గం పొంది నిన్ను వీరమాతను చేశాడు. కంట తడిపెట్టకూడదు. యోగ వియోగాలు కర్మబంధాలు. ఈ విషయంలో పెద్దలు 'ప్రేతబంధు – యమ' సంవాదకథ చెపుతారు. విను. ఉశీనరదేశంలో సుయజ్ఞుడనే రాజు ఉండేవాడు. యుద్ధంలో మరణించాడు. ఆ శవం చుట్టూ భార్యాపుత్రులు బంధువులు చేరి విలపించసాగారు. సూర్యాస్తమయ సమయంలో యముడు విప్రబాలునిగా వచ్చి వారిని ఓదారుస్తూ ఇట్లా బోధించాడు.

పుట్టటం – గిట్టటం సహజం. మీరు చనిపోనివారి వలె చనిపోయిన వారికోసం విలపిస్తారెందుకు? మృత్యువును తప్పించుకోవటం ఎవరికీ సాధ్యం కాదు. ప్రాణి ఎక్కడినుండి వచ్చాడో అక్కడికే పోవటం తప్పనిసరి. పరమేశ్వరుని దయ ఉంటే ఘోరారణ్యంలో ఉన్నా సురక్షితంగా ఉంటాడు. తల్లిగర్భంలోని శిశువును భగవంతుడే కదా రక్షించేది? అతడు లీలావిలాసంగా ఈలోకాన్ని రక్షిస్తూ పోషిస్తుంటాడు. శరీరం పంచభూతాత్మకమైంది. అందులో దేహి వేరుగా ఉంటాడు. ఆత్మ దేహాన్ని వదలగానే వేటితో సంబంధం ఉండదు. దానికోసం కుమిలిపోవటం వృథా.

పూర్వం అడవిలో ఒక పక్షిజంట ఉండేది. వేటగాడొకడు ఆడపక్షిని పట్టుకున్నాడు. చెట్టుపైనున్న మగపక్షి ఆడపక్షితో 'విధి వక్రబుద్ధి గలది. దాని చేతలు మనల్ని వేరు చేయటమేకాక మనపిల్లల భవిష్యత్తునే పాడు చేసింది' అంది. అలా చెపుతున్నపుడే బోయవాడు ఆ మగపక్షినికూడా బాణంతో కూల్చాడు. అందువల్ల కాలం చెల్లినపుడు ఎంతటివాడైనా మరణించక తప్పదు. ఈ యముని మాటలు విన్న సుయజ్ఞుని బంధువులు ఉత్తరక్రియలు చేసి వెళ్ళిపోయారు.

హిరణ్యకశిపుడు తల్లిని, తమ్ముని భార్యలను చూచి ఇంకా ఇలా అన్నాడు.

ప్రాణులకు పరతత్త్వ చింతన లేనందువల్ల 'వారు – మేము' అనుకుంటారు. ఆలోచిస్తే అందరూ ఒక్కటే. ఈ మాటలు విని, దితీ ఆమె కోడళ్ళూ తత్త్వం తెలుసుకొని విలపించటం మాని అక్కడినుండి వెళ్ళిపోయారు. హిరణ్యకశిపుడు వార్ధక్యం, మరణం లేకుండా ముల్లోకాలు పాలించాలని, శత్రువును జయించే సింహపరాక్రమం పొందాలని మందరపర్వతం సానువుల్లో తపస్సు చేయటం ఆరంభించాడు. ముల్లోకాలు తల్లడిల్లే అతని తపస్సును సహించలేక దేవతలు బ్రహ్మతో తమ బాధను వెల్లడించారు. మాకు నీవు తప్ప శరణ్యం లేదని, నీవే ప్రతీకారం ఆలోచించుమని కోరారు.

ఇంతలో తపస్సు చేస్తున్న హిరణ్యకశిపుని భక్తికి మెచ్చి బ్రహ్మదేవుడు ప్రత్యక్షమయ్యాడు "దానవేశ్వరా! దేనికోసం తపస్సు చేస్తున్నావు. నీకేం కావాలో చెప్పు" అనుగ్రహిస్తా నన్నాడు బ్రహ్మ. అపు డా దానవుడు లేచి నమస్కరించి, దేవా! గాలీ – ధూళీ – నిప్పూ – నీళ్ళూ – నింగీ – నేలా, దిక్కూ – దిగంతాలూ, రాత్రీ – పగలూ, చీకటీ– వెలుగుల్లో నేను మృత్యువును పొందకూడదు. ఇంకా రాక్షస – దేవత – మృగ – నర – నాగేంద్రాలు నన్ను చంపకూడదు. ఏ అస్త్ర – శస్త్రాలతో నాకు మరణం లేనట్లు వరం ప్రసాదించుమన్నాడు. బ్రహ్మ ఆ వరాలన్నీ ఇచ్చి ఇలా అన్నాడు. 'నీవు కోరినవన్నీ ఇచ్చాను. సుబుద్ధివై క్షేమంగా జీవించు' అని సత్యలోకానికి వెళ్ళిపోయాడు.

రాక్షసరాజు సంతోషంతో రాజధానికి చేరాడు. శ్రీహరిని సాధించాలని దుశ్చేష్ట లారంభించాడు. దేవతలపై దాడి చేశాడు. దేవేంద్రసింహాసనంపై కూర్చొని త్రిలోకనాథుడైనాడు. దేవతలు అచ్యుతుని స్తుతించారు. శ్రీహరి కంటికి కనిపించకుండా వారికి ధైర్యం చెపుతూ 'హిరణ్యకశిపుని కాలం మూడింది. నేనే సంహరిస్తాను. వాడు సద్గుణ సంపూర్ణుడైన తన కొడుకు ప్రహ్లాదుని హింసించినపుడే వాణ్ణి వధిస్తాను. మీకు శుభం కలుగుతుంది. వెళ్ళి రండి' అని అభయ మిచ్చాడు.

హిరణ్యకశిపునికి నల్గురు కుమారులు. వారిలో ప్రహ్లాదుడు హరిభక్తుడు. ఇతర ఆలోచనలు లేక నిత్యం విష్ణువును గూర్చే ఆలోచించేవాడు. తండ్రి అతణ్ణి తన మార్గంలోకి తేవటానికి విశ్వప్రయత్నం చేశాడు.

ఒకరోజు కుమారుణ్ణి పిలిచి 'బాబూ! చదువుకోని వాడు అజ్ఞాని. అందువల్ల గురువులవద్ద చదివిస్తాను. బాగా చదువుకో' అని చెప్పి శుక్రాచార్యుల కొడుకులను పిలిపించి 'మీరు మాకు గురుపుత్రులు. మా కుమారుడు అజ్ఞానాంధుడు. వీనికి నీతిశాస్త్రం బోధించి, సంస్కరించి మా వంశాన్ని రక్షించండి' అన్నాడు.

చండుడు – అమర్కుడు ప్రహ్లాదుని తమతో కూడా తీసుకుని వెళ్లారు. ఇతర రాక్షసకుమారులతో కూర్చోబెట్టుకొన్నారు. చండామార్కగురువులు అతనికి అతిముఖ్యమైన శాస్త్రాలు బోధించారు. కొంతకాలం తరువాత హిరణ్యకశిపుడు తనకుమారుని ఎంతవరకు చదివించారో తెలుసుకోవాలని పిలిపించాడు. ప్రహ్లాదుడు గురువులతోపాటు తండ్రి దగ్గరకు వచ్చాడు. రాజు కొడుకును వాత్సల్యంతో ఒళ్ళో కూర్చోబెట్టుకొని, ఏదైనా ప్రయత్నం సిద్ధించాలంటే ప్రభుశక్తి – మంత్రశక్తి – ఉత్సాహశక్తి కలిసిరావాలని చెప్పి గురువులు చెప్పిన పాఠాల్లో నీకు నచ్చిన అంశాన్ని తెలియజేయు మన్నాడు.

ప్రహ్లాదుడు 'నాకు నచ్చిన విషయం నారాయణచరణ స్మరణం. ఆ విష్ణువును తలచుకొంటూ అరణ్యంలో నివసించినా మంచిదే నాన్నా!' అన్నాడు. అందుకు తండ్రి 'విష్ణువు మనకు శత్రువు. అతణ్ణి భజించకూడదు. దీన్ని గురువులు బోధించలేదా? హరీ గిరీ అంటూ మూర్ఖుడవై అజ్ఞానాంధకారంలో పడకు' అని గద్దించాడు. తండ్రి మాటలు విన్న ప్రహ్లాదుడు 'గురువుల వంక చూచి జ్ఞానుల మనస్సులో 'మీరు – మేము' అనే భేదభావాలుండవు. దైవయోగంవల్ల నా మనస్సు హరివైపు ఆకృష్టమైంది'. అనగా గురువు కోపించి 'మేం చెప్పిన విషయాల్లో ఒక్కటి కూడా చెప్పవేం? శత్రువును మెచ్చుకొంటూ మీ వంశానికి మచ్చ తెచ్చావు. 'వీడు మహారాజుకు పుత్రుడు కాడు. వీణ్ణి కొట్టండి' అని హిరణ్యకశిపునితో ఇలా అన్నారు. 'ఈ బాలుణ్ణి భయపెట్టి కొట్టి చదివిస్తాం. మాపై కోపించకండి ప్రభూ!' అని ప్రహ్లాదుణ్ణి తోడ్కొనిపోయి ఒంటరిగా కూర్చోబెట్టి గురువులు నీతులు చెప్పారు.

గురువులు ధర్మ – అర్థ – కామశాస్త్రాలు, నీతి శాస్త్రాలు బోధించారు. ప్రహ్లాదుడు బుద్ధి మంతుడైనాడనుకొన్నారు. ప్రహ్లాదుని తల్లి లీలావతి దగ్గరకు తీసుకువెళ్ళారు. ఆమె కుమారుని అలంకరించి తండ్రి దగ్గరకు వెళ్ళమంది. గురువు శిష్యుణ్ణి చూచి 'రాకుమారా! మేం బోధించిందే చెప్పు. విరోధి అయిన విష్ణుమూర్తి ఊసెత్తకు' అని చెబుతూ మహారాజు దగ్గరకు తీసుకువెళ్ళి నమస్కరించుమన్నారు. హిరణ్యకశిపునితో 'కుమారుని విద్యాభ్యాసాన్ని పరీక్షించవచ్చు' అన్నారు. హిరణ్యకశిపుడు పుత్రుని ప్రేమతో దగ్గరకు తీసుకొని 'నాయనా! నీ కిష్టమైన పద్యం చెప్పి దాని అర్థం తాత్పర్యం వివరించమన్నాడు. ప్రహ్లాదుడు 'నాన్నా! నన్ను గురువులు బాగా చదివించారు. అన్ని శాస్త్రాల్లోని రహస్యాలను, సారాన్ని తెలుసుకున్నాను. భక్తిమార్గాలు తొమ్మిది. మనోవాక్కాయాలతో శ్రీహరిని నమ్ముకొన్న మానవుడు ఉత్తముడు. మరో సత్యం నాకు కన్పించలేదు. హరిభక్తి లేనివాని జీవితం నిస్సారం, వ్యర్థం అని భావిస్తాను. ప్రతీ గురువూ తండ్రీ శ్రీహరి బోధనే చేయాలి' అన్నాడు. 'అలా చెప్పేవాడే సరి అయిన తండ్రి' అన్నాడు.

జంకూ గొంకూ లేకుండా ప్రహ్లాదుడు చెబుతున్న మాటలకు హిరణ్యకశిపుడు అదిరిపోయాడు. గురువుతో 'భృగువంశజుడవని నమ్మి నా బిడ్డను మీకు అప్పగించాను' అన్నాడు. అపుడు గురువు వినయంగా 'వీనికిది సహజంగా పుట్టిన బుద్ధే. ఒకరు చెప్తే వచ్చేది కాదు. దీనికి ప్రతిక్రియ జాగ్రత్తగా ఆలోచించండి. మేము పురోహితులం. మీ మేలు కోరేవాళ్ళం. అంతే కాని శత్రువులం కాము కదా!' అన్నాడు.

హిరణ్యకశిపుడు ఆగ్రహం మాని కొడుకును చూచి 'నీ కీ బుద్ధులు ఎవరు నేర్పారు. వాళ్ళెవరో చెప్పు' అన్నాడు. ప్రహ్లాదుడు 'సంసారంలో మునిగినవాడు భగవంతుణ్ణి దర్శించలేడు, ఈ సంసారం భయంకరమైన సముద్రం. దాన్ని దాటటానికి చదువులు పనికిరావు'. ఈ మాటలు వినగానే కొడుకుపై ప్రేమ పోయి కోపంతో కిందకు తోసి వేశాడు. భటులతో 'వెంటనే వీణ్ణి వధించండి. జాలి చూపించకండి' అని హిరణ్యకశిపు డాజ్ఞాపించాడు. రాజాజ్ఞ కాగానే భటులు బాలుణ్ణి క్రూరంగా కొట్టారు. ఆ బాలునిలో అలసట – దీనభావం కనిపించలేదు. పైగా 'దీనశరణ్యా! మధుసూదనా!' అంటూ భగవంతుణ్ణి ప్రార్థించాడు. అతణ్ణి పెట్టే బాధలన్నీ విఫలంకాగా రాజు కఠినమైన పద్ధతులు ఆలోచించాడు. ఏనుగులతో తొక్కించాడు. పాములతో కరిపించాడు. అగ్నిగుండాల్లో తోయించాడు. సముద్రంలో ముంచమన్నాడు. కొండపైనుండి పడదోయించాడు. మారణహోమం చేయించాడు.

చివరకు భూమిలో పాతిపెట్టించాడు. అయినా ప్రహ్లాదునికి ఏమీ హాని జరగకపోవటంతో హిరణ్యకశిపునికి దిగులు పుట్టింది. ఏకాంతంగా 'శునశ్శేపుడు తండ్రిని అపకారిగా భావించక బతికే ఉన్నాడట. నా కొడుకు అట్లే ఉన్నాడు' అని ఆలోచించాడు.

గురువులు అతణ్ణి శాంతింప చేసి బాలునికి ధర్మార్థకామశాస్త్రాలు అవసరమని మళ్ళీ బోధన ఆరంభించారు.

ప్రహ్లాదుడు గురువులు జపతపాలకు గృహకృత్యాలకు ఇళ్ళకు వెళ్ళిన సమయం చూచి, ఆడుకుంటున్న రాక్షసకుమారులను చేరి, 'గురువులు మంచి చదువులు చెప్పటం లేదు. మీకు నచ్చే మంచి విషయం చెప్తాను. వింటారా!' అన్నాడు. ఆ బాలురు రాకుమారుని మాటలు వినటానికి ఉత్సాహం చూపగా ప్రహ్లాదుడు 'గురువులు చెప్పే ధర్మార్థకామశాస్త్రాలు మనిషిని సంసారంలో బంధిస్తాయి. అటువంటివాడు చావటం పుట్టటం అనే చక్రంలోనే ఉంటాడు. అందువల్ల ఈ సంసారబంధం లేని శాశ్వతమైన స్థితిని కలిగించేది మోక్షం. దానికై మనం ప్రయత్నించటం ధర్మం. హరికి హృదయాన్ని సమర్పించాలి. పరమాత్మతత్త్వాన్ని తెలుసుకోవాలి. ఈ లోకం నిజం కాదని గ్రహించాలి. పూర్వం నారాయణుడు ఈ తత్త్వాన్ని నారదునికి బోధించాడు. నేనా నారదమహర్షి వల్ల విశేషజ్ఞానాన్ని పరమభక్తిధర్మాల్నీ తెలుసుకున్నాను' అన్నాడు.

ఈ మాటలు విన్న రాక్షసకుమారులు 'చిన్నప్పటినుండి మనం కలిసే ఉంటున్నాం. మాకు తెలియకుండా నువ్వు వీటిని ఎప్పుడు ఎలా నేర్చుకున్నావో చెప్పు' అని అడిగారు.

ప్రహ్లాదుడిట్లా చెప్పాడు.

'పూర్వం మా తండ్రి తపస్సు చేయటానికి మందరపర్వతానికి వెళ్ళాడు. ఇంద్రుడు మా మందిరాన్ని ఆక్రమించి మా తల్లిని చెరబట్టాడు. ఆమె అదృష్టంవల్ల నారదమహర్షి కనిపించి ఇంద్రునితో ఈమె గర్భంలో పెరిగేవాడు హరిభక్తుడు. అతణ్ణి నీవు చంపలేవు అన్నాడు. ఇంద్రుడు కూడా హరిభక్తుడైనందువల్ల మా తల్లిని వదిలి స్వర్గానికి వెళ్ళాడు. నారదుడు తన ఆశ్రమంలో మా అమ్మకు ఆశ్రయమిచ్చాడు. ఆమె గర్భంలో ఉన్న నన్ను ఉద్దేశించి జ్ఞానాన్ని, ధర్మాన్ని ఉపదేశించాడు. నేటికీ నేను వాటిని మరువలేదు. జ్ఞానాన్ని స్త్రీలు బాలురుకూడా తెలుసుకోవటానికి అర్హులు, అని తెలిపాడు. కాలం ఈశ్వర స్వరూపం. మార్పు దేహానికే. ఆత్మకు కాదు. ఈ ఆత్మ ఈశ్వరాంశ గలది. అహంకార మమకారాలు వదిలి దేహం కంటె ఆత్మను భిన్నంగా భావిస్తే బ్రహ్మసాక్షాత్కార మవుతుంది. నిస్స్వార్థమైన మనసుతో కమలాక్షుణ్ణి కనుగొనటం మంచిది. మనసునిండా మాధవుణ్ణి నింపుకొని నిర్భయంగా విష్ణుభక్తులతో కలిసిపోదాం. 'రహస్యంగా ఇట్లా మోక్షమార్గం ఆ బాలురకు చూపించాడు. ఆ రాక్షసకుమారులు గురువులవద్ద చదువులు మాని తమ హృదయాల్లో కేశవుని నిలుపుకున్నారు.

గురువు ఈ విషయం గమనించి హిరణ్యకశిపునివద్ద మొరపెట్టుకున్నాడు. వీణ్ణి చదివించటం మావల్ల కాదు అన్నాడు. కుమారుని విష్ణుభక్తి తెలిసేప్పటికి హిరణ్యకశిపుడు కఠినుడైనాడు. 'అర్భకా! నా ఆజ్ఞలకు పంచభూతాలు యముడు దేవజాతులు భయపడతారు. నేనంటే నీకు భయమే లేదు. నీకెవరు దిక్కు. జనార్దనుణ్ణి జయించటం

సాధ్యం కాదంటున్నావు. నేను దేవతలను దండించేప్పుడు ఆ హరి నా ఎదుటకు రాలేదెందుకు? నీకు కూడా నేనే దిక్కని తెలుసుకో' అన్నాడు.

అందుకు ప్రహ్లాదుడు 'నాకూ నీకూ ఆ పరమాత్ముడే బలం. తండ్రీ! రాక్షసభావాన్ని వదులు. నీకు ప్రియమైనదీ, హితమైనది చెపుతున్నాను. అరిషడ్వర్గాన్ని నశింపచేస్తే నీకు విరోధి ఎవడూ ఉండడు' అన్నాడు. ఈ మాటలు ఈటెలై తగిలిన హిరణ్యకశిపుడు ఇలా గద్దించి పలికాడు. 'హిరణ్యాక్షుని చంపినపుడు విశ్వమంతా గాలించాను. ఎక్కడా కనపడలేదు. ఇప్పుడు ఎట్లా వస్తాడో చెప్పు. లేకుంటే నిన్నూ నీ హరినికూడా సంహరిస్తాను' అన్నాడు. అపుడు ప్రహ్లాదుడు 'విష్ణువు లేకుండా విశ్వమే లేదు. ఎక్కడ వెతికినా అక్కడే హరి కనిపిస్తాడు. నా మాట నమ్ము తండ్రీ!' అన్నాడు.

ఆ సమయంలో విష్ణువు 'నరసింహ'రూపంలో అణువణువునా ఆవరించి ఉన్నాడు.

హిరణ్యకశిపుడు ఉగ్రుడై ప్రహ్లాదునితో 'ఓరీ డింభకా! హరి అన్నిచోట్లా ఉన్నాడంటున్నావు. ఈ స్తంభంలో చూపగలవా?' అన్నాడు. ప్రహ్లాదుడు 'బ్రహ్మ మొదలు గడ్డి పరకదాకా నిండి ఉన్నాడు. ఈ స్తంభంలో కూడా ఉన్నాడు'. అనగానే హిరణ్యకశిపుడు వికటాట్టహాసం చేసి అరచేతితో ఆ స్తంభాన్ని బలంగా కొట్టాడు. వెంటనే ఆ స్తంభం పెళ పెళ ధ్వనులు చేస్తూ విరిగింది. అందులోంచి నరసింహదేవు డావిర్భవించాడు. ఆ స్వామి ఆకారం ప్రహ్లాదునికి సంతోషాన్ని, హిరణ్యకశిపునికి సంతాపాన్ని కలిగించింది. ఈ దృశ్యం చూచి హిరణ్యకశిపుడు ఇలా అనుకున్నాడు. 'బాలుని మాట నిలపటానికీ, సర్వాత్మకుడని నిరూపించుకోటానికీ, నన్ను శిక్షించటానికీ శ్రీహరి వచ్చాడు. నాకు మృత్యువు తప్పదు. అయినా నా బలం చూపి శత్రువును చంపి విజయం సాధిస్తాను'. ఇట్లా అనుకొని కర్తవ్యాకర్తవ్యాలు మరిచి, గదాదండం తిప్పి నరసింహస్వామిపై విసిరాడు. వెంటనే స్వామి హిరణ్యకశిపుని ఒడిసి పట్టుకొని, అడ్డంగా తన తొడలపై వేసుకొని గోళ్ళతో వాని రొమ్మును చీల్చి, ప్రేవులు లాగి కంఠంలో వేసుకొన్నాడు. ఇట్లా కేవలం నరరూపం, మృగరూపం కానట్టి 'నరసింహ'రూపంతో, రాత్రి పగలు కాని సంధ్యాసమయంలో, ఇంటికి లోపల – బయటకాని ద్వారం మధ్యలో, ఆకాశం – భూమికాని తన తొడలపై, ప్రాణం ఉండీ – లేని గోళ్ళతో బ్రహ్మవరాలకు భంగం కలుగకుండా దానవరాజును వధించాడు.

తనను చూచిన వాళ్లందరూ భయభ్రాంతులై తత్తరపడుతుండగా నరసింహుడు ఆ సభా భవనంలోని సింహాసనాన్ని అధిష్ఠించాడు. సునందాది పార్శ్వచరులు, బ్రహ్మ మహేశ్వరాది సురలు స్వామిని దర్శించాలని వచ్చారు. ఆ ఉగ్రస్వరూపాన్ని సమీపించలేక దూరంనుండే నమస్కరించారు.

బ్రహ్మ, రుద్ర, ఇంద్ర, ఋషి, పితృదేవతలు మొదలైనవారు తమ శక్తిననుసరించి స్వామిని స్తుతించారు. లక్ష్మీదేవి సయితం సమీపించలేక చనువూ భయం కలుగగా సంకోచంతో నిలుచుండిపోయింది.

బ్రహ్మ ఆమె అభిప్రాయం గ్రహించి, ప్రహ్లాదుణ్ణి పిలిచి 'నీవే స్వామిని శాంతింపజేయి తండ్రీ!' అన్నాడు. ప్రహ్లాదుడు వినయంగా చేతులు జోడించి నరసింహుణ్ణి సమీపించి, ఆయన పాదాలకు నమస్కరించాడు. నరహరి

ప్రసన్నుడై ప్రహ్లాదుణ్ణి ప్రేమగా చూచి, వాత్సల్యంతో అతని శిరసును చేతితో నిమిరాడు. ప్రహ్లాదుడు భయం విడిచి భక్తితో స్తోత్రం చేశాడు. 'జగదీశ్వరా! నేను అసుర కుమారుణ్ణి. బాలుణ్ణి మూర్ఖుణ్ణి. నిన్ను కీర్తించటం నాకు అసాధ్యం కదా! సర్వేశ్వరా! నీవు సత్త్వగుణప్రధానుడవు. రాక్షసేంద్రుణ్ణి చంపావు. అవతార ప్రయోజనం సిద్ధించింది. ఈ సంతోషసమయంలో ఈ ఉగ్రరూపం ఎందుకు? శ్రీలక్ష్మి ఈశ్వర బ్రహ్మాదులకు కూడ శిరసుపై దివ్యహస్తాన్ని ఉంచి అభయం ఇవ్వలేదు. నాతలపై హస్తముంచి దీవించావంటే ఆశ్చర్యంగా ఉంది. నీ సేవకులం, ప్రియభక్తులం అయిన మమ్ము రక్షించు' అన్నాడు. ప్రహ్లాదుని ప్రార్థనకు మెచ్చి నరసింహస్వామి నవ్వుతూ

'ప్రహ్లాదా! నిన్ను చూస్తే చాలా ఆనందంగా ఉంది. నీ భక్తికి మెచ్చాను. నీకు శుభం కలుగుతుంది. నీవు ఏదైనా వరం కోరుకో! తప్పక ఇస్తాను' అన్నాడు. ప్రహ్లాదుడు కోరికలను జయించాడా? లేదా? అని పరీక్షించటం కోసం ఇట్లా సెలవిచ్చాడు. ప్రహ్లాదుడు 'భక్తియోగానికి కోరికలు ఆటంకం. నన్ను పరీక్షిస్తున్నావా? స్వామీ. నేను మోక్షాన్ని కోరి నీ సన్నిధి చేరాను. నీవు వరమివ్వదలిస్తే దేవా! నా తండ్రి తన తమ్ముణ్ణి వధించావని నిన్ను బద్ధవిరోధిగా భావించాడు. నేడు నీ దృష్టి సోకి నిర్మలుడైనాడు. పాపాలు పోయి పరిశుద్ధాత్ముడయ్యేట్టు వరం ప్రసాదించు'. అపుడు స్వామి 'నా భక్తుల్లో నీవు ఉత్తముడవు. నీ తండ్రికి ఉత్తర క్రియలు నిర్వహించు. నా స్పర్శతోనే నీ తండ్రి నిర్మలదేహం పొందాడు. పుణ్యలోకాలకు వెళతాడు' అన్నాడు.

బ్రహ్మ కల్పించుకొని 'ఈ బాలుడు భక్తశిఖామణి. జన్మ – మృత్యుభయాలు లేకుండా వరం ప్రసాదించు' అన్నాడు.

స్వామి 'బ్రహ్మా! రాక్షసులను మెచ్చి ఎపుడూ ఇట్లాంటి వరాలియ్యకు!' అని ఆనతిచ్చి విష్ణుమూర్తి అంతర్ధానమైనాడు'.

బ్రహ్మ, శుక్రాది మునీంద్రులతో కలిసి దానవ రాజ్యానికి ప్రహ్లాదుణ్ణి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. దేవతలందరు ఆశీస్సులతో ప్రహ్లాదుణ్ణి ధన్యుణ్ణి చేసి తమ స్థానాలకు వెళ్ళారు.

ద్వారపాలకులు శాపముక్తులై మళ్ళీ వైకుంఠానికి వెళ్ళి ద్వారపాలకులైనారు. నారదుడు ధర్మజా! 'శ్రీకృష్ణుడు ఫలప్రదాతగా నీ ఇంట విహరించటం నీ మహాభాగ్యం' అని ప్రహ్లాద చరిత్ర ముగించాడు.

## త్రిపురాసుర సంహారం

నారదమహర్షి ధర్మరాజుకు మరో వృత్తాంతం చెప్పాడు. శ్రీహరి అండతో దేవేంద్రాదులు దానవులపై తమ ఉద్ధతిని ప్రదర్శించారు. రాక్షసులు మయుడనే శిల్పిని శరణు పొందారు. మయుడు ఇనుము – వెండి – బంగారం ఉపయోగించి మూడు పురాలు నిర్మించి సుఖంగా ఉండుమని చెప్పాడు. త్రిపురాల్లో ఉన్న రాక్షసులు కామసంచారులైనారు. మహేశ్వరుని కీర్తికి త్రిపురాల నిర్మాణంతో మచ్చ తెచ్చాడు మయుడు. దిక్పాలకుల వేడుకోలుతో మహేశ్వరుడు ఆగ్నేయాస్త్రం ప్రయోగించి ఆ పురాలను కాల్చివేశాడు. అందులో రాక్షసులందరు మరణించారు. మయుడు ఆ రాక్షసుల శవాలను సిద్ధరసంగల బావిలో ముంచి బతికించాడు. ఆ దానవులు మళ్ళీ

పేట్రేగిపోయారు. శివుడు దానికి విచారగ్రస్తుడు కాగా విష్ణువు ఓదార్చి తాను గోవుగా, బ్రహ్మ దూడగా మారి ఆ బావిలోని సిద్ధరసాన్ని తాగేశారు. కాపలా ఉన్నవాళ్ళు ఆవూ దూడల సోయగాన్ని చూచి తన్మయులై వాటిని సిద్ధరసం త్రాగకుండా వారించాలన్న విషయాన్నే మరిచిపోయారు. విష్ణువు శివునకు అనేక విధాలైన యుద్ధసామగ్రిని కూర్చగా శివుడు రథంపై కూర్చొని గురి చూచి ఒక బాణం సంధించాడు. దాని జ్వాలల్లో త్రిపురాలు భస్మమయ్యాయి. లోక కల్యాణకరం అయిన త్రిపురాల సంహారంతో లోకాలు సంతోషించాయి. శివుని కేర్పడిన మచ్చ తొలగిపోయింది. ఇది విన్న ధర్మరాజు నారదుణ్ణి ధర్మస్వరూపం వివరించమని కోరగా నారదుడు ఇట్లా వర్ణాశ్రమ ధర్మాలను వివరించాడు.

## ధర్మ స్వరూపం

పూర్వం బదరికాశ్రమంలో నారాయణుడు తపమాచరించే సమయంలో సనాతన ధర్మాన్ని గూర్చి నాకు వివరించాడు. దాన్ని వివరిస్తాను. విను. బ్రాహ్మణులు తమ కులాచారం ప్రకారం షోడశసంస్కారాలను పొందాలి. ఇవికాక యజ్ఞం చేయటం, చేయించటం, వేదం చదవటం, చదివించటం, దానం చేయటం, గ్రహించటం అనే షట్కర్మలు వారి ధర్మాలు. క్షత్రియులు దానస్వీకారం తప్ప, మిగిలిన అయిదు ధర్మాలతోపాటు ప్రజాపాలన, బ్రాహ్మణేతరులనుండి పన్నులు వసూలు చేయటం, దోషులను దండించటం తమ ధర్మాలుగా ఆచరించాలి. వైశ్యుల కులధర్మాలు వ్యవసాయం, వాణిజ్యం, పశుపాలన, బ్రాహ్మణ కులానుసరణం అనేవి. మిగిలిన కులంవాళ్ళు విప్ర పరిచర్య చేయటం ధర్మం. ఆపత్కాలంలో అగ్రజాతుల వాళ్ళ వృత్తుల్ని స్వీకరించటం దోషం కాదు. బ్రాహ్మణ క్షత్రియులకు నీచసేవ తగదు.

కర్మజ్ఞానేంద్రియాల నిగ్రహం, మృదుస్వభావం, శుచిత్వం, తపస్సు, దయ, సత్యం, జ్ఞానం, క్షమ, హరిభక్తి, హర్షం ఇవి విప్రుల ముఖ్యలక్షణాలు.

ధైర్యం, శౌర్యం, వీర్యం, ఆత్మనిగ్రహం, అనుగ్రహం, దానశీలం, ధర్మనిష్ఠ, అర్థసంపాదనం, బుధసేవ, అచ్యుతాచార్య ఆరాధన, సత్కార్య సంరక్షణం, సంతోషం ఇవి క్షత్రియుల లక్షణాలు.

వైశ్యుల లక్షణాలు ధర్మార్థకామాలు, దేవబ్రాహ్మణసేవ, ఆచార్యారాధన, నిగర్వం, నిర్మలత్వం, సంతృప్తి అనేవి.

దొంగతనం చేయకుండటం, శుచి శుభ్రత కలిగి ఉండటం, నిష్కపటం సేవాచరణం, మంత్రం లేకుండా పంచయజ్ఞాలు చేయటం, పండితాదరణ, గోరక్షణ, న్యాయమైన జీవితం నాలుగోకులంవారి ధర్మాలు.

స్త్రీలు ఇల్లు చక్కదిద్దుకోవాలి. శరీరాన్ని అందంగా నిర్మలంగా ఉంచుకోవాలి. సత్యం ప్రియంగా పలకాలి. చాతుర్యంతో వచనమాధుర్యంతో పతిని రంజింప చేయాలి. దాక్షిణ్యం, సంతోషం, ధర్మచింతనం, మేధాసంపద మొదలైన గుణాలకు తన పతి అధిపతి అని, అతని ఇష్టప్రకారం నడచుకోవాలి. బంధువులను మంచిమార్గంలో నడపాలి. పతికి స్నాన పాన ఆహారాదులు సమకూర్చి సౌఖ్యం కల్గించాలి. పతి పతితుడైతే తన పాతివ్రత్యంతో ఉద్ధరించి ఉత్తమునిగా తీర్చుకోవాలి. భర్తను విష్ణువుగా, తనను లక్ష్మిగా భావించి ప్రవర్తించాలి.

**ఆశ్రమ ధర్మాలు :** బ్రహ్మచారి మౌంజి కౌపీనం, యజ్ఞోపవీతం, కృష్ణాజినం, పలాశదండం, దర్భలు ధరించాలి. కేశసంస్కారం కూడదు. మౌనంగా ముప్పూటలా బ్రహ్మచారి గాయత్రి జపించాలి. గురువు ఇంట్లో దాసునివలె భక్తి వినయాలు గల్గి వేదాధ్యయనం చేయాలి. గృహస్థుల ఇండ్లలో భిక్షాన్నం గ్రహించి గుర్వాజ్ఞతో భుజించాలి. స్త్రీలోలురతో సాంగత్యం కూడదు.

ఉత్తమగృహస్థుడు అభ్యంగనాది స్నానాలు, చందన భూషణాలు ధరించి ఋతుకాలంలో మాత్రమే భార్యను పొందాలి. మనఃస్థైర్యం సంపాదించి, మధుమాంసాదులు వదలి సత్ప్రవర్తనతో తన ధర్మాన్ని నిర్వర్తించాలి. వనంలో ఉన్నా భవనంలో ఉన్నా నిష్ఠతో అచ్యుతుణ్ణి దర్శించాలి. ఆత్మజ్ఞానంతో ప్రవర్తించే గృహస్థుడు పరబ్రహ్మను పొందుతాడు.

వానప్రస్థాశ్రమం స్వీకరించినవాడు మునివృత్తిని అవలంబించాలి. ఋషులు నిర్దేశించిన నియమాలు పాటించిన పుణ్యాత్ముడు మహర్లోకం చేరి సుఖిస్తాడు. మానవుడు వానప్రస్థాశ్రమధర్మాలు పాటిస్తూ ముక్తసంగుడై సన్యాసాశ్రమం స్వీకరించాలి. సన్యాసి దేహమాత్రావశిష్టుడై ఉండాలి. నారాయణ పరాయణుడై కౌపీనం మాత్రం ధరించాలి. దండ కమండలాలు వదలాలి. ఆత్మచింతనలోనే నిమగ్నుడై సమాధినిష్ఠతో ఉండాలి. ఒక ఊరిలో ఒక రాత్రి మాత్రమే నివసించాలి. బ్రహ్మానుసంధానం చేస్తూ ఇతరులకు బాలునివలె మూగవానివలె కనిపించాలి.

## ప్రహ్లాద అజగర సంవాదం

ప్రహ్లాదుడు ఒకసారి లౌకికతత్త్వం తెలుసుకోవటానికి మంత్రులతో లోకసంచారం చేస్తూ సహ్యపర్వత సానువులకు వెళ్లాడు. అక్కడ ధూళితో నిండిన శరీరంతో ఉన్న అజగరుడనే ముని శయనించివుండటం చూశాడు. అతడు కొండచిలువవలె నేలపై పడుకొని ఉన్నాడు. ఆ ప్రహ్లాదుడు ఆతణ్ణి సమీపించి నమస్కరించి, అతని చరిత్ర తెలుసుకోవాలన్న కుతూహలంతో ఇట్లా పలికాడు.

'ఏ ప్రయత్నం లేకుండానే నీ కీ అసమాన సుందరదేహం ఎట్లా వచ్చింది. స్థితప్రజ్ఞుడవు. ఈ విధంగా ప్రతిదినం నిద్రతో ఎందుకు గడుపుతున్నావు?'. అజగరముని ప్రహ్లాదుణ్ణి చూచి ఆనందంతో ఇలా అన్నాడు.

'దానవోత్తమా! నీ వన్నీ తెలుసుకో గలవు. అయినా నీవు ధర్మజిజ్ఞాసతో అడుగుతున్నావు. నేను విన్న ధర్మాన్ని వివరిస్తాను విను.' 'భోగాలు కోరికలవల్ల కలిగేవే, కాని శాశ్వతాలు కావని పరీక్షించి నిర్ణయించుకున్నాను. కర్మబంధాలనుండి నివృత్తి పొంది ఏ ప్రయత్నమూ, కోరికా లేకుండా ఇట్లా నిద్రిస్తూ, ప్రారబ్ధ భోగాలను అనుభవిస్తున్నాను, ఇలాగే కదలకుండా పడి ఉండే పాముకూడా చాలకాలం బ్రతుకుతుంది. కొండచిలువను పరిశీలించి ఈ నీతిని నేర్చుకున్నాను. అందుకే ఏకాంతవాసం చేస్తున్నాను. నాకు ద్వేషం, ప్రేమ, సుఖం, దుఃఖం అనేవి ఏవీ లేవు. జీవితాన్నిట్లా లీలగా గడుపుతున్నాను. ఎల్లప్పుడు నిశ్చింతగా సంతృప్తిగా ఉండటం అభ్యాసం చేసుకున్నాను. మనస్సును మనస్సులో, అహంకారాన్ని అహంకారంలో, మాయను మాయలో, ఆత్మానుభూతిలో కేంద్రీకరించి విలీనం చేశాను. అది మొదలు సత్యదర్శనం చేస్తూ విరక్తిపొంది స్వానుభవంతో ఆత్మస్థితి అలవాటు

చేసుకున్నాను. నీవు భక్త శిఖామణివి. అందువల్ల రహస్యమైన 'పరమహంస' ధర్మాన్ని తెలిసినంతవరకు నీకు చెప్పాను' అన్నాడు. ప్రహ్లాదుడు అజగరమునిని పూజించి నమస్కరించి తన రాజధానికి వెళ్ళాడు.

ధర్మరాజు 'నా బోటి అజ్ఞాని, గృహస్థుడు ఆ పదవి చేరుకోవటం సాధ్యమా?' అని నారదుణ్ణి ప్రశ్నించాడు.

నారదుడు 'ధర్మరాజా! గృహస్థుడు మోక్షపదని అందుకోవచ్చు. గృహోచిత కర్మలన్నీ భగవదర్పణంగా ఆచరించాలి. మహర్షుల నాదరించి శ్రీహరిగాథలు చెప్పించు కోవాలి. సజ్జనసాంగత్యం ఉండాలి. పుత్రమిత్ర కళత్రాదుల కలయికలు కలలవంటివని తెలిసి మెలగాలి. మమకారాలు బంధాలు పెంచుకోరాదు. నిర్లిప్తుడుగా ఉంటూ తలిదండ్రులకు పిల్లలకు స్నేహితులు మొదలైనవారికి ధనమిచ్చి ఆనందపర్చాలి. చిన్న దొంగలను దండించకూడదు. మృగాదులను హింసించక కనికరంతో చూడాలి. దేవ ఋషి పితృ మానవ జంతువులకు సంతర్పణ చేయాలి. ఈ అయిదు సంతర్పణలకే పంచ మహాయజ్ఞాలని పేరు. ఈ విధంగా చెప్పి నారదుడు తన పూర్వజన్మ వృత్తాంతం ధర్మరాజుకు ఇట్లా వివరించాడు.

నేను గత కల్పంలో ఉపబర్హణుడు అనే గంధర్వుణ్ణి. అందగాణ్ణి. స్త్రీలు నా దగ్గర చేరేవాళ్ళు. వారితో క్రీడిస్తూ ఉండేవాణ్ణి.

ఒకసారి ప్రజాపతులు దేవసత్రం అనే యజ్ఞం చేస్తూ అందులో విష్ణుగాథలు గానం చేయటానికి గంధర్వులనూ అప్సరసలనూ ఆహ్వానించారు. నేనూ వెళ్ళాను. విష్ణుగాథలు గానం చేశాను. మధ్యలో మోహం పెరిగి మోహనాంగులతో పొందుకోసం పరుగెత్తాను. కోపించిన ప్రజాపతులు మా ఆజ్ఞాధిక్కారానికి ఫలంగా దివ్యశక్తులు లేకుండా భూలోకంలో శూద్రస్త్రీకి జన్మించమని శపించారు. ఆ కారణంగా బ్రాహ్మణ దాసికి పుత్రుడనై జన్మించాను. అక్కడ బ్రహ్మవేత్తలైన పెద్దలకు శుశ్రూష చేశాను. ఆ సేవా ప్రభావంవల్ల ఈ మహాకల్పంలో బ్రహ్మ మానసపుత్రుడనై జన్మించాను.

ఒక విషయం చాల ఆనందంగా ఉంది. నీవు చేసిన యజ్ఞంలో శ్రీమహావిష్ణువును ఆరాధించావు. నీ సన్నిధిలో మాధవుడు ఒక మానవుడుగా స్నేహితునిగా, ఆప్తబంధువుగా మంత్రిగా ఉండి సకలసుఖాలు సమకూర్చాడు. నీవు మహాభాగ్యశాలివి. అని నారదుడు చెప్పిన వృత్తాంతం విని ధర్మరాజు వాసుదేవుణ్ణి పూజించాడు. వాసుదేవ ధర్మనందనుల పూజలంది నారదముని వెళ్లిపోయాడు. అని శుకయోగీంద్రుడు పరీక్షిత్తుకు చెప్పాడని, సూతదు శౌనకాదులకు వివరించాడు.

**– డా॥ కె.వి. సుందరాచార్యులు**

# విషయసూచిక

## ఆరవస్కంధము



## ఏడవస్కంధము



అల వైకుంఠ పురంబులో నగరిలో ఆ మూల సౌధంబు దాపల
మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలోత్పల



పర్యంక రమా వినోదియగు ఆపన్నప్రసన్నుండు విహ్వల నాగేంద్రము
పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై ॥

# షష్ఠస్కంధము

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## షష్ఠస్కంధము

**శ్రీ వత్సాంకితకౌస్తుభస్ఫురితలక్ష్మీచారువక్షస్స్థల**
**శ్రీవిభ్రాజితు నీలవర్ణు శుభరాజీవాక్షుఁ గంజాత భూ**
**దేవేంద్రాదిసమస్తదేవమకుటోద్దీప్తోరురత్నప్రభా**
**వ్యావిద్ధాంఘ్రిసరోజు నచ్యుతుఁ గృపావాసుం బ్రశంసించెదన్.** 1

**ప్రతిపదార్థం :** శ్రీవత్స= శ్రీవత్సమనే పేరుగల; అంకిత= మచ్చ గుర్తు (లాంఛనం) చేతను; కౌస్తుభ= కౌస్తుభమనెడి రత్నం చేతను; స్ఫురిత= ప్రకాశించే; లక్ష్మీ= లక్ష్మీదేవికి నెలవైన; చారు= సుందరమైన; వక్షస్+స్థల= వక్షఃస్థలంయొక్క; శ్రీ= సౌందర్యంచేత; విభ్రాజితున్= ప్రకాశించేవానిని; నీలవర్ణున్= నీలవర్ణము కలిగినవానిని; శుభరాజీవ+అక్షున్= శోభాకరమైన పద్మంవంటి కన్నులు కలవానిని; కంజాతభూ= (నీటినుండి పుట్టిన) పద్మంనుండి పుట్టిన బ్రహ్మ; దేవ+ఇంద్ర+ఆది= దేవతలకు అధిపతి అయిన ఇంద్రుడు మొదలైన; సమస్త= అందరు; దేవ= దేవతలయొక్క; మకుట+ఉద్దీప్త= కిరీటంలో విశేషంగా ప్రకాశించే; ఉరు= గొప్పదైన; రత్నప్రభా= రత్నాలకాంతిచే (మణులకాంతిచే); వ్యావిద్ధ= ఆవరింపబడిన; అంఘ్రి+సరోజున్= పద్మాలవంటి పాదాలు కలవానిని; అచ్యుతున్= నాశరహితుడైన (నిత్యస్వరూపుడైన) వానిని; కృపా+ఆవాసున్= దయకు చోటైన వానిని; ప్రశంసించెదన్= బాగుగా పొగడెదను.

**తాత్పర్యం :** శ్రీవత్సమనే పేరుగల పుట్టుమచ్చ, కౌస్తుభమనే రత్నం, లక్ష్మీదేవికి నివాసస్థానం అయిన వక్షఃస్థలం, శోభాకరమైన దేహకాంతి, నల్లని శరీరచ్ఛాయ, శుభప్రదమైన తామరలవంటి కన్నులు, పద్మంనుండి పుట్టిన బ్రహ్మ, మహేంద్రుడు మొదలైన సర్వదేవతల కిరీటాల్లోని రత్నకాంతులచే ప్రకాశించే పాదపద్మాలు కలవానిని, నిత్యుడు (త్రికాలాలలో ఎల్లప్పుడూ ఉండువాడు), దయాసముద్రుడు అయిన విష్ణుమూర్తిని స్తుతిస్తాను.

**విశేషం :** 1. "శ్రీవత్సో లాంఛనం మతమ్" అని అమరం. 2. సారూప్యముక్తి కలిగిన భక్తులు వైకుంఠవాసులైనపుడు వారికి చతుర్భుజములతో కూడిన విష్ణుసదృశరూపం కలుగుతుంది. కాని, వారి దేహంలో శ్రీవత్సం, కౌస్తుభం, లక్ష్మీదేవి ఉండే అవకాశంలేదు. విష్ణువక్షఃస్థలమందు మాత్రమే ఆ విశేషాలు కనిపిస్తాయి. 3. ఈ ఆరవస్కంధం సింగన విరచితం. అందుకే ఇష్టదేవతాప్రార్థనం చేశాడు.

**ఉ. నిండుమతిం దలంతుఁ గమనీయభుజంగమరాజమండలీ**
**మండనుఁ జంద్రఖండపరిమండితమస్తకుఁ దారమల్లికా**
**పాండురవర్ణుఁ జండతరభండను హేమగిరీంద్రచారుకో**
**దండు మహేశు గంధగజదానవభంజను భక్తరంజనున్.** 2

**ప్రతి :** కమనీయ= అందమైన; భుజంగమరాజ= సర్ప రాజులయొక్క ; మండలీ= సమూహమే; మండనున్= అలంకారంగాగల వానిని; చంద్రఖండ= నెలవంకచేత; పరిమండిత= అలంకరింపబడిన; మస్తకున్= శిరస్సు కలవానిని; తార= నక్షత్రాలు;

మల్లికా= మల్లెపువ్వులవంటి; పాండుర+వర్ణున్= తెల్లని దేహకాంతికలవానిని; చండతర= మిక్కిలి భీకరమైన; భండనున్= యుద్ధం చేయగలవానిని; హేమగిరి+ఇంద్ర= మేరు పర్వతమనే; చారు= అందమైన; కోదండున్= ధనుస్సుకలవానిని; గంధగజదానవభంజనున్= మదగజ స్వరూపం కలిగిన రాక్షసుణ్ణి (గజాసురుని) సంహరించినవానిని; భక్తరంజనున్= భక్తులను (వరదానముచే) సంతోషపెట్టువానిని; మహా+ఈశున్= పరమేశ్వరుణ్ణి; నిండుమదిన్= సంపూర్ణమైన మనస్సుతో; తలంతున్= స్మరిస్తాను.

**తా :** సర్పరాజులు అలంకారాలుగా కలవానిని; నెలవంకను తలయందు అలంకరించుకొన్నవానిని; మెరిసే నక్షత్రాలవంటి, మల్లెపూవులవంటి తెల్లనిశరీరకాంతి కలవానిని; యుద్ధమందు శత్రుభీకరమైనవానిని; (త్రిపురాసుర సంహార సమయంలో) మేరుపర్వతాన్ని ధనుస్సుగా చేసుకున్న వానిని; సులభంగా భక్తులకు వరాలిచ్చే శంకరుణ్ణి మనసారా స్మరిస్తాను. (త్రిపురాసుర సంహార సమయంలో శివుడు మేరుపర్వతాన్ని ధనుస్సుగా చేసుకొన్నాడు.)

**ఉ॥ హంసతురంగముం బరమహంసము నంచితదేవతాకులో**
**త్తంసము నాగమాంతవిదితధ్రువపుణ్యరమావతంసముం**
**గంసజిఘాంసునంశమును గర్బురసూత్రసమావృతాంసమున్**
**హింస నడంచు బ్రహ్మము నహీనశుభంబులకై భజించెదన్. 3**

**ప్రతి :** హంస= హంస; తురంగమున్= వాహనంగాకలవానిని; పరమహంసమున్= యోగులలో శ్రేష్ఠుడైన వానిని; అంచితదేవతాకుల+ఉత్తంసమున్= ఒప్పారే దేవతల సమూహంలో మిక్కిలి ఉత్తముడైనవానిని (సుర జ్యేష్ఠుని); ఆగమ+అంత విదిత= వేదశిరస్సులైన ఉపనిషత్తులచేత తెలియబడదగిన; ధ్రువపుణ్య రమా+అవతంసమున్= నిశ్చితమైన పుణ్యంయొక్క సంపదకు శిఖరంవంటివానిని; కంసజిఘాంసున్= కంసుణ్ణి చంపినట్టి విష్ణువుయొక్క; అంశమునున్= భాగమైనవానిని; కర్బురసూత్ర= బంగారు వన్నెగల (చిత్రవర్ణం గల) యజ్ఞోపవీతం (జందెం) తో; సమావృత= ఆవరింపబడిన; అంసమున్= భుజం (మూపు) కలవానిని; హింసన్+అడంచు= బాధను కలిగించే ప్రవృత్తిని పోగొట్టు; బ్రహ్మమున్= పరమాత్ముణ్ణి; అహీన= గొప్పవైన; శుభంబులకై= క్షేమాలు కలుగుటకై; భజించెదన్= సేవిస్తాను.

**తా :** ఉపనిషత్తులచే పరబ్రహ్మంగా పొగడబడినవానిని; దేవతలలో ప్రథముడైనవానిని; లోకకంటకుడైన కంసుణ్ణి సంహరించిన శ్రీకృష్ణుని అంశ అయినవానిని; దుష్టసంహారానికి సూత్రధారి అయినవానిని; బంగారు వన్నెగల యజ్ఞోపవీతం కలవానిని; దుష్టప్రవృత్తిని పోగొట్టగల పరమాత్ముణ్ణి; తననుగూర్చి తపస్సు చేసిన భక్తులకు ఇష్టవరాలిచ్చెడి హంస వాహనుడైన బ్రహ్మను సేవించెదను.

**విశే :** కృష్ణుని అంశ అంటే 'విష్ణుని అంశ'. శ్రీహరి నాభికమలంలో ఆవిర్భవించినవాడు కదా! బ్రహ్మదేవుడు.

**ఉ. మోదకహస్తునిన్ సమదమూషకవాహను నేకదంతు లం**
**బోదరు నంబికాతనయు నూర్జితపుణ్యు గణేశు దేవతా**
**హ్లాదగరిష్ఠు దంతిముఖు నంచితభక్తఫలప్రదాయకున్**
**మోదముతోడ హస్తములు మోడ్చి భజించెద నిష్టసిద్ధికిన్. 4**

**ప్రతి :** మోదక= ఉండ్రాళ్ళు (కుడుములు); హస్తునిన్= చేతియందు కలవానిని; సమదమూషక వాహనున్= బలిసిన ఎలుక వాహనంగాకలవానిని; ఏకదంతున్= ఒకేదంతంకలవానిని; లంబ+ఉదరున్= వేలాడే బొజ్జకలవానిని; అంబికాతనయున్= పార్వతీదేవికుమారుని; ఊర్జితపుణ్యున్= గొప్పదైన పుణ్యం కలవానిని; గణ+ఈశున్= (శివ) గణాలకు అధిపతి అయినవానిని; దేవతా+ఆహ్లాదగరిష్ఠున్= దేవతలందరికీ సంతోషం కలిగించడంలో మిక్కిలి గొప్పవానిని; దంతిముఖున్= ఏనుగు మొగంకలవానిని; అంచితభక్తఫలప్రదాయకున్= పూజ్యులైన భక్తులకు ఇష్టసిద్ధిని కలిగించెడివానిని; మోదముతోడన్= నిండు సంతోషంతో; హస్తములు మోడ్చి= చేతులు జోడించి; ఇష్టసిద్ధికిన్= కోర్కెలు నెరవేరుటకై; భజించెదన్= సేవిస్తాను.

**తా :** చేతియందు కుడుములు గలవానిని, బలిష్ఠమైన ఎలుక వాహనంగా కలిగినవానిని; ఒకే దంతం కలిగి, పెద్ద బొజ్జ కలిగి, పార్వతీ తనయుడైనవానిని; పుణ్యస్వరూపుడైనవానిని; ప్రమథగణాలకు అధిపతి అయినవానిని; దేవతలందరికీ ఎక్కువగా సంతోషం కలిగించేవారిలో శ్రేష్ఠుడగువానిని; భక్తుల కోర్కెలను సులభంగా తీర్చెడివాడును అయిన గజాననుణ్ణి; సంతోషంతో చేతులు జోడించి కోర్కెలు నెరవేరుటకై సేవిస్తాను.

**ఉ. కల్లతనంబు గాక పొడగట్టిన పూర్వపురీతి నేఁడు నా**
**యుల్లమునందు నుండుము సమున్నతతేజముతోడ భక్తి రం**
**జిల్లిన చూపుగూడ విధిఁ జెందిన ప్రోడ బుధాళి నీడ మా**
**తల్లి దయామతల్లి ప్రణతద్రుమకల్పకవల్లి భారతీ! 5**

**ప్రతి :** భారతీ= ఓ సరస్వతీదేవీ!; సమున్నత= మిక్కిలి; తేజముతోడన్= ప్రకాశంతో; భక్తి రంజిల్లిన= విరాజిల్లెడి భక్తితోకూడిన; చూపు+కూడన్= కటాక్షం తోడుకాగా; విధిన్+చెందిన= బ్రహ్మతో కూడియున్న; ప్రోడ= ప్రౌఢురాలవు; బుధ+ఆళి= పండితుల సమూహానికి; నీడ= ఆశ్రయమైనదానవు; మా తల్లి= మాకు అమ్మవంటి దానవు; దయామతల్లి= దయచూపువారిలో శ్రేష్ఠురాలవు; ప్రణతద్రుమకల్పకవల్లి= నమస్కరించినవారికి కోరికలను తీర్చు కల్పవృక్షంవంటిదానవు; కల్లతనంబు+కాక= సత్యంగా; పొడగట్టిన= సాక్షాత్కరించినట్టి; పూర్వము+రీతిన్= వెనుకటి వలెనే; నేఁడు= ఈ సమయంలో; నా+ఉల్లము+అందున్= నా హృదయంలో; ఉండుము= స్థిరంగా నిలువుము.

**తా :** ఓ సరస్వతీదేవీ! నీవు మిక్కిలికాంతితో, భక్తితో కూడిన చూపుతో బ్రహ్మకు ఇల్లాలైన దానవు. పండితులందరికి ఆధారమైన దానవు. మాతల్లీ! దయచూపెడి తల్లీ! భజించువారికి కల్పవృక్షంవలె కోర్కె లీడేర్చు తల్లీ! ఇదివరలో నాకు సాక్షాత్కరించిన విధంగానే ఇప్పుడుకూడ నా హృదయంలో సత్యంగా నిలిచి ఉండుము.

**కం. విలసత్కంకణరవరవకలితంబగు నభయవరదకరములు బెరయం**
**జెలరేఁగి భక్తులకు నల కలుములు దయసేయు జలధికన్యకఁ దలఁతున్. 6**

**ప్రతి :** విలసత్= ఒప్పునట్టి; కంకణ= చేతిగాజులయొక్క; రవరవ= మనోహరమైన శబ్దాలతో; కలితంబు+అగు= కూడుకొన్న; అభయ= భయాన్ని పోగొట్టునట్టి; వరద= వరాలను ఇచ్చునట్టి; కరములు= చేతులు; పెరయన్= శోభిల్లగా; చెలరేఁగి= మిక్కిలి సంతోషంతో; భక్తులకున్= తనను సేవించే భక్తులకు; అల= ప్రసిద్ధమైన; కలుములు= సంపదలు; దయ+చేయు= ఇచ్చునట్టి; జలధికన్యకన్= సముద్రునిపుత్రిక అయిన లక్ష్మీదేవిని; తలఁతున్= స్మరిస్తాను.

**తా :** అందమైన చేతిగాజుల మనోహర ధ్వనులతోకూడిన అభయ వరద హస్తాలతో భక్తులకు సంపదలను ప్రసాదించే లక్ష్మీదేవిని నిండుమనసుతో స్మరిస్తాను.

**క. కాళికి బహుసన్నుతలో కాళికి కమనీయవలయకరకీలిత కం**
**కాళికిఁ దాపసమానసకేళికి వందనము సేసి కీర్తింతు మదిన్. 7**

**ప్రతి :** బహు= ఎక్కువగా; సన్నుత= స్తుతింపబడిన (స్తుతికి అర్హమైన); లోక+ఆళికిన్= లోకాల సమూహంకలదానికి; కమనీయ= మనోహరమైన; వలయ= కంకణం కలిగిన; కర= చేతియందు; కీలిత= ధరించి ఉన్న; కంకాళికిన్= పుర్రె కలదానికి; తాపస= తనను గూర్చి తపస్సు చేసేవారియొక్క; మానస= మనస్సులందు; కేళికిన్= విహరించుదానికి; కాళికిన్= కాళికాదేవికి; వందనము+చేసి= నమస్కరించి; మదిన్= మనస్సునందు; కీర్తింతున్= స్తోత్రం చేస్తాను.

**తా :** బహువిధాలుగా సన్నుతింపబడిన లోకాలుగలదీ, అందమైన గాజుగల ఒక చేతియందు తలపుర్రె కలది, తనను గురించి తపస్సు చేసేవారి మనస్సుల్లో విహరించేదీ, అగు కాళికాదేవికి నమస్కరించి, ఆమెను చిత్తంలో స్మరిస్తాను.

**వ. అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి. 8**

**ప్రతి :** అని= ఆ విధంగా; ఇష్టదేవతా= ఇష్టులైన దేవతలయొక్క; ప్రార్థనంబు+చేసి= ప్రార్థనలను చేసి...

**తా :** ఆ విధంగా కవి తనకు ఇష్టమైన దేవ, దేవీ రూపాలను స్తుతించి

**చ. పరమసమాధిధుర్యుఁ బటుపావనకర్మవిధేయదేవతా**
**వరనరవంద్యు సద్విమలవాక్కు జనార్దనకీర్తనక్రియా**
**భరణసమర్థు వేదచయపారగు భవ్యుఁ ద్రికాలవేది భా**
**సురమతిఁ గొల్చు టొప్పు బుధశోభితుఁ బుణ్యుఁ బరాశరాత్మజున్. 9**

**ప్రతి :** పరమ= గొప్పదైన (విశిష్టమైన); సమాధిధుర్యున్= తపస్సులోని భాగమైన సమాధియందు; పటు= గొప్పదైన; పావన= పవిత్రమైన; కర్మ= విధులచే; విధేయ= వశులు అయినట్టి; దేవతా= దేవతల చేతను; వర= శ్రేష్ఠమైన; నర= మానవుల చేతను; వంద్యున్= నమస్కరింపదగినవానిని; సత్+విమలవాక్కున్= సత్యమైన స్వచ్ఛమైన మాటల తీరు కలవానిని; జనార్దన= విష్ణువుయొక్క; కీర్తనక్రియా= స్తోత్రమనెడి పనిని; భరణ= నిర్వహించడంలో; సమర్థున్= మిక్కిలి నేర్పుగలవానిని; వేదచయ= వేదాల సమూహాన్ని; పారగున్= తుదముట్ట తెలిసిన వానిని; భవ్యున్= మంగళకరమైనవానిని; త్రికాలవేదిన్= భూత, వర్తమాన, భవిష్యత్ కాలాలు తెలిసినవానిని; భాసురమతిన్= ప్రకాశించే బుద్ధిశాలిని; బుధశోభితున్= పండితులలో ప్రకాశించేవానిని; పుణ్యున్= పుణ్యమూర్తిని; పరాశర+ఆత్మజున్= పరాశరఋషియొక్క కుమారుడైన వ్యాసమహర్షిని; కొల్చుట= సేవించుట; ఒప్పున్= చక్కగా తగి ఉంటుంది.

**తా :** తపోనిష్ఠకలవాడును; పవిత్రకర్మలు ఆచరించుటచే వశీభూతులగు దేవతలచేతను, సర్వమానవులచేతను నమస్కరింపదగినవాడూ; గొప్పమాటల నేర్పుకలవాడూ; విష్ణువును కీర్తించుటయందు శ్రద్ధ కలవాడూ; వేదసమూహాన్ని సంపూర్ణంగా తెలిసినవాడూ; భూత భవిష్యత్ వర్తమాన కాలాల జ్ఞానం కలవాడూ; పండితులలో మిక్కిలి శోభించేవాడూ; పుణ్యమూర్తియు, పరాశరుని కుమారుడూ అయిన వ్యాసమహర్షిని సేవించడం సముచితం.

**క. వ్యాసుని భగవత్పదసం వాసుని నాగమపురాణవరవిష్ణుకథా**
**వాసుని నిర్మలకవితాభ్యాసునిపదపద్మయుగము భావింతు మదిన్. 10**

**ప్రతి :** భగవత్+పదసంవాసునిన్= భగవంతుని పాదాలందే వసించేవాడు; ఆగమపురాణవరవిష్ణుకథా+ ఆవాసునిన్= వేదాలకు, అష్టాదశపురాణాలకు శ్రేష్ఠమైన హరిపరమైన కథలకు స్థానమైనవాడు; నిర్మలకవితా+అభ్యాసునిన్= పవిత్రమైన కవిత్వ (రచన) పరిపాటిగా గలవాడు అయినట్టి; వ్యాసుని= వ్యాసమహర్షియొక్క; పదపద్మయుగమున్= తామరలవంటి పాదాల జంటను; మదిన్= మనస్సులో; భావింతున్= స్మరిస్తాను.

**తా :** భగవంతుని పాదాలవద్ద నిత్యమూ నివసించేవాడు. వేదాలు, పురాణాలు, విష్ణుకథలు గల భాగవతం మొదలయిన వాటిల్ని రచించినవాడూ; స్వచ్ఛమైన కవిత్వం చెప్పే నేర్పు కలవాడూ అయిన వ్యాసమహర్షియొక్క పాదాలజంటను మనసారా స్మరిస్తాను.

**సీ. వరకవిత్వోద్రేకి వాల్మీకిఁ గొనియాడి భాగవతార్థవైభవముఁ బలుకు**
**శుకమంజులాలాపు శుకయోగిఁ బ్రార్థించి బాణమయూరులప్రతిభ నొడివి**
**భాస సౌమిల్లక భారవి మాఘుల ఘనసుధామధురవాక్యములఁ దలఁచి**
**కాళిదాసుఁ గవీంద్రకల్పవృక్షము గొల్చి నన్నపాచార్యువర్ణనలఁ బొగడి**

**తే. వెలయఁ దిక్కనసోమయాజుల భజించి, యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ నునిచి**
**సుకవిసోముని నాచనసోము నెఱఁగి, కవిమనోనాథు శ్రీనాథుఘనత మెచ్చి. 11**

**ప్రతి :** వరకవిత్వ+ఉద్రేకిన్= శ్రేష్ఠమైన కవిత్వం చెప్పడంలో సామర్థ్యం కలవాడైన; వాల్మీకిన్= ఆదికవి, రామాయణ కర్త అయిన వాల్మీకి మహర్షిని; కొనియాడి= పొగడి; భాగవత+అర్థవైభవమున్= విష్ణుకథలతో కూడిన భాగవతపురాణ పరమార్థంయొక్క గొప్పతనాన్ని; పలుకు= చెప్పడంలో; శుకమంజుల+ఆలాపున్= చిలుక పలుకులవంటి మనోహరమైన కథనరీతి కల్గిన; శుకయోగిన్= వ్యాసుని పుత్రుడైన శుకమహర్షిని; ప్రార్థించి= కొనియాడి; బాణమయూరుల= భట్టుబాణ, మయూరకవులయొక్క; ప్రతిభన్= సామర్థ్యాన్ని; నొడివి= చెప్పి; భాస= భాసుడూ; సౌమిల్లక= సౌమిల్లకుడూ; భారవి= భారవీ; మాఘుల= మాఘుడు అనే కవులయొక్క; ఘన= గొప్పదైన; సుధామధుర= అమృతంవలె తియ్యనైన; వాక్యములన్= మాటల్ని; తలఁచి= స్మరించి; కవీంద్ర= గొప్పకవులకు; కల్పవృక్షమున్= కల్పవృక్షంవంటివాడుఅయిన; కాళిదాసున్= (కవికులగురువగు) కాళిదాసుని; కొల్చి= సేవించి; నన్నప+ఆచార్యు= (తెలుగులో ఆదికవి అయిన) నన్నయభట్టు యొక్క; వర్ణనలన్= వర్ణనావిశేషాలను; పొగడి= మెచ్చుకొని; వెలయన్= ఒప్పునట్లుగా; తిక్కనసోమయాజులన్= (కవిత్రయంలో రెండవవాడైన) తిక్కనసోమయాజిని; భజించి= సేవించి; ఎఱ్ఱన+అమాత్యున్= (కవిత్రయంలో మూడవవాడైన) ఎర్రాప్రెగడను; భాస్కరున్= (తెలుగులో ఆది చంపూరామాయణం భాస్కర రామాయణం రచించిన హుళక్కి) భాస్కరుని; ఇచ్చన్+ఉనిచి= మనస్సులో ఉంచుకొని; సుకవి సోముని= మంచి కవులలో చంద్రునివంటివాడయిన; నాచనసోమున్= నాచనసోమనాథుని; ఎఱఁగి= మ్రొక్కి; కవి= కవులయొక్క; మనస్+నాథున్= మనస్సును రంజింపజేసినవాడగు; శ్రీనాథు= శ్రీనాథునియొక్క; ఘనతన్= గొప్పతనాన్ని; మెచ్చి= పొగడి...

**తా :** భవ్య కవితావేశంతో సంస్కృత భాషలో రామాయణాన్ని రచించి ఆదికవి అనిపించుకున్న వాల్మీకిని స్తుతిస్తాను. చిలుక పలుకులవలె అమృతవాక్కులతో భాగవతాన్ని ఏడు రోజుల్లో వినిపించి పరీక్షిత్ మహారాజుకు మోక్షప్రాప్తిని కల్గించిన శుక యోగీంద్రుణ్ణి ప్రార్థిస్తాను. బాణ, మయూరకవుల ప్రజ్ఞను కొనియాడుతాను. భాస, సౌమిల్లక, భారవి, మాఘ కవుల అమృతాన్ని తలపించే రచనారీతులను తలుస్తాను. కవులకు కల్పవృక్షంవంటి కవికులగురువైన కాళిదాసు యొక్క మధుర కవిత్వాన్ని శ్లాఘిస్తాను. అట్లే తెలుగు భారతరచనకు శ్రీకారం చుట్టిన నన్నయభట్టారకుని, ఉభయకవిమిత్రుడైన తిక్కన సోమయాజిని, కవిత్రయంలో మూడవవాడైన ఎఱ్ఱాప్రెగ్గడను కీర్తిస్తాను. రామాయణ కర్తయైన హుళక్కి భాస్కరుని, సుకవులలో చంద్రునివంటివాడైన నాచనసోమనాథుని కవుల మనస్సులకు నాయకుడైన శ్రీనాథునిఘనతను మెచ్చుకొని,

**ఉ. ఎమ్మెలు సెప్పనేల? జగ మెన్నఁగఁ బన్నగరాజశాయికిన్**
**సొమ్ముగ వాక్యసంపదలు సూఱలు చేసినవాని భక్తి లో**
**నమ్మినవాని భాగవతనైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో**
**బమ్మెర పోతరాజు కవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్. 12**

**ప్రతి :** ఎమ్మెలు+చెప్పనేల= అతిశయంగా చెప్పడమెందుకు?; జగము+ఎన్నన్+కన్= లోకమంతా పొగడే విధంగా; పన్నగరాజశాయికిన్= సర్పాలకు రాజైన శేషుడిని తల్పంగా కలవానికి; సొమ్ముగన్= ఆభరణమగునట్లు; వాక్య సంపదలు= శ్రేష్ఠమైన కవిత్వం; సూఱలు= కానుకలుగా; చేసినవానిన్= ఇచ్చినవానిని; భక్తిన్ లో నమ్మినవానిన్= భక్తితో మనస్సులో భగవంతుణ్ణి నమ్మినవాణ్ణి; భాగవత= భాగవత రచనయందు; నైష్ఠికుడై= మిక్కిలి నిష్ఠ కలిగి; తగువానిన్= యోగ్యుడైన వానిని; పేర్మితోన్= ప్రేమతో; కవి పట్టము+రాజున్= కవులకు అధీశ్వరుడు; బమ్మెర పోతరాజున్= (భాగవత ప్రధాన రచయిత అయిన) బమ్మెర పోతన మహాకవిని; తలంచి= స్మరించి; మ్రొక్కెదన్= నమస్కరిస్తున్నాను.

**తా :** మొగ మిచ్చకాలు కాదు; జగమంతా మెచ్చగా పన్నగరాజు శయ్యపై పవళించే భగవంతునికి తన కవితాసంపదలనే ఆభరణాలను కోకొల్లలుగా కానుకలుగా సమర్పించుకొన్నవాడూ, భక్తి విశ్వాసాలతో, పరమనిష్ఠతో భాగవత మహాగ్రంథాన్ని రచించినవాడూ, కవిరాజులకు పట్టపురాజూ అయిన బమ్మెరపోతరాజును తలంచి నమస్కరిస్తాను.

**విశే :** విష్ణుమూర్తికి ఆభరణంగా పోతన భాగవతాన్ని రచించాడు అనడం అక్షర సత్యం. ఇది పోతనపై సింగనకు గల గౌరవభావాన్ని ప్రస్ఫుటం చేస్తోంది.

**వ. అని సకలసుకవినికరంబులకు ముకుళితకరకమలుండనై. 13**

**ప్రతి :** అని= ఈ విధంగా; సకల= సమస్తమైన; సుకవినికరంబులకున్= మంచి కవులయొక్క సమూహాలకు; ముకుళితకర+కమలుండనై= జోడించిన చేతులనే పద్మాలు కలవాడనై...

**తా :** ఈ విధంగా పూర్వ సుకవులందరికి చేతులు జోడించి నమస్కరించిన వాడనై

**ఉ. ఎయ్యది కర్మబంధముల నెల్ల హరించు విభూతికారణం**
**బెయ్యది సన్మునీంద్రులకు నెల్లఁ గవిత్వసమాశ్రయంబు ము**
**న్నెయ్యది సర్వమంత్రముల నేలిన దెయ్యది మోక్షలక్ష్మి రూ**
**పెయ్యది దానిఁ బల్కెద సుహృద్యము భాగవతాఖ్యమంత్రమున్. 14**

**ప్రతి :** ఏ+అది= ఎయ్యది= ఏ గ్రంథమైతే; కర్మబంధములన్= ఐహికకర్మలు అనే బంధాల్ని; ఎల్లన్= అన్నింటినీ; హరించున్= నాశనం చేస్తుందో; విభూతికారణంబు+ఎయ్యది= అష్టైశ్వర్యాలు కలుగుటకు కారణం ఏదో; సత్+ముని+ ఇంద్రులకున్= సాధువులైన (సత్త్వగుణం కలిగిన) మునిశ్రేష్ఠులకు; ఎల్లన్= అందరికి; కవిత్వ= కవిత్వం చెప్పుటకు; సమాశ్రయంబు+ఎయ్యది= ఆశ్రయింపదగింది ఏదో; సర్వమంత్రములన్= సమస్త మంత్రాలలో; ఏలినది= ప్రశస్తమైంది; ఎయ్యది= ఏదో; మోక్షలక్ష్మి= కైవల్యం అనే సంపదకు; రూపు= స్వరూపమైంది; ఏ+అది= ఏదో; దానిన్= అటువంటిదైన; భాగవత+ఆఖ్య+మంత్రమున్= భాగవతం అనేపేరు కలిగిన మంత్రాన్ని; పల్కెదన్= చెపుతాను.

**తా :** లౌకిక కర్మబంధాలను తొలగించేదీ, అష్టైశ్వర్యాలను కలిగించేదీ, మునులకు, కవులకు సమస్త కవిత్వాలకూ ఆశ్రయమైనదీ, సర్వమంత్రాలకూ నాయకత్వం వహించేదీ, మోక్షలక్ష్మికి స్వరూపమైనదీ, సజ్జనుల హృదయానికి ఆనందం కలిగించేది అయిన హరికీర్తనాప్రధానమైన భాగవతమనే మంత్రాన్ని పలుకుతాను. అంటే 'భాగవతరచన చేస్తాను' అని సారాంశం.

**వ. అని శ్రీమహాభాగవతపురాణంబునందు షష్ఠస్కంధం బాంధ్రభాష రచియింపం బూని మదీయ కవితామహాలక్ష్మికి నారాయణుండె నాథుఁ డగుటంజేసి యీ కృతి కృష్ణార్పణంబుఁ జేసితి. అది యెట్లనిన, నేను విద్యాభ్యాసంబునం దగిలి కొండుక నై యుండ నొక్కనాఁడు దివంబున. 15**

**ప్రతి :** అని= ఆ విధంగా; శ్రీమహాభాగవతపురాణంబు+అందు= శ్రీమహాభాగవతం అనెడి పురాణంలో; షష్ఠస్కంధంబున్= ఆరవస్కంధాన్ని; ఆంధ్రభాషన్= తెలుగుభాషలో; రచియింపన్+పూని= రచన చేయడానికి ప్రారంభించి; మదీయ కవితామహాలక్ష్మికిన్= నా కవిత్వమనే లక్ష్మిదేవి; నారాయణుండు+ఎ= శ్రీమన్నారాయణుడే; నాథుఁడు+ అగుటన్+చేసి= కృతిపతి అయిన కారణంగా; ఈ కృతిన్= ఈ గ్రంథాన్ని; కృష్ణ+అర్పణంబున్+చేసితిన్= కృష్ణుడికి అంకితం ఇచ్చాను; అది ఎట్లు+అనినన్= అది ఎలా జరిగిందంటే; నేను; విద్యా+అభ్యాసంబునన్= విద్యనేర్చుకునే కాలంలో; తగిలి= విద్యపై ఆసక్తికలిగి; కొండుకను+ఐ+ఉండన్= చిన్నవాడిగా ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజున; దివంబునన్= ఆకాశమందు...

**తా :** అని భాగవతమహాపురాణంలోని ఆరవస్కంధాన్ని తెనిగించడానికి పూనుకున్నాను. నా కవితామహాలక్ష్మికి ఆ శ్రీమన్నారాయణునే కృతిపతిగా నిర్ణయించుకొన్నాను. దీనికి సందర్భమేమంటే నేను నా చిన్నతనంలో గురుకుల విద్యార్థిగా ఉన్నకాలంలో ఒకరోజున ఆకాశంలో

**చ. కలితవిశేషవస్త్రములు గట్టి హిమాంబుసుగంధచందనం**
**బలఁది వినూత్నభూషణము లారయఁ దాల్చి వినోదలీల నిం**
**పుల మృదుశయ్య నిద్రఁ దగఁ బొందినచోఁ గనుపట్టెఁ బల్మఱుం**
**గలయఁ దటిద్విలాసములు గట్టిగ నొక్కట నిల్చు పోలికన్. 16**

**ప్రతి :** కలిత= అందమైన; విశేష= ప్రత్యేకమైన; వస్త్రములు= బట్టలు; కట్టి= ధరించి; హిమ+అంబు= (మంచు) చల్లని నీట కలిపిన; సుగంధ= సువాసన కలిగిన; చందనంబు= మంచి గంధం; అలఁది= పూసుకొని; వినూత్న= సరికొత్తవైన; భూషణములు+ ఆరయన్= అలంకారాలు ఒప్పునట్లు; తాల్చి= ధరించి; వినోదలీలన్= విలాసంగా; ఇంపుల= ఇష్టమైన; మృదుశయ్యన్= మెత్తనిపడకపై; నిద్రన్+తగన్= నిద్ర తగినట్లు; పొందినచోన్= పొంది ఉండే సమయంలో; కలయన్=

కూడుకొనిన; తటిత్+విలాసములు= మెరుపుతీగల కాంతులు; గట్టిగ= చిక్కబడి; ఒక్కటన్= ఒకేచోట; నిల్చు+పోలికన్= నిలబడిన రీతిలో; పల్మఱున్= చాలసార్లు; కనుపట్టెన్= కనిపించెను.

**తా :** విలువైన వస్త్రాలు ధరించి, పన్నీరు కలిపిన సుగంధం పూసుకొని, కొత్త ఆభరణాలు అలంకరించుకొని మెత్తని పాన్పుపై సుఖనిద్రలో ఉన్నప్పుడు పెక్కు మెరుపు తీగలు ఒక్కటిగా చేరి స్థిరంగా నిలబడినట్లు నా కొక దివ్యస్వరూపం సాక్షాత్కరించింది.

**సీ. ఉరవడి ప్రాగ్వీథి నుదయించు మార్తాండకోటిబింబచ్ఛాయ గూడినట్లు**
**హరిహరబ్రహ్మల యాత్మలలో నుబ్బి కరుణ యొక్కట మూర్తి బెరసినట్లు**
**ఖరకర కర తీవ్రగతినిఁ గరంగుచు హేమాద్రి సోగ పెల్లెగసినట్లు**
**ఫణిరాజఫణరాజిమణిగణవిస్ఫూర్తి సుషిరంపు వెలిదల చూపినట్లు**
**తే. ఉట్టిపడ్డట్లు కట్టెఱ్ఱ నూఁదినట్లు తేజ మెసఁగంగ నా మ్రోల దివ్యవాణి**
**పూని సాక్షాత్కరించి సంపూర్ణదృష్టిఁ జూచి యిట్లని పలికె మంజులముగాను. 17**

**ప్రతి :** ఉరవడిన్= పెరుగుతున్న విధంగా; ప్రాక్+వీథిన్= తూర్పుదిక్కున; ఉదయించు= పొడసూపెడి; మార్తాండకోటి= కోటిసూర్యులయొక్క; బింబ+చాయ= బింబాల ప్రకాశం; కలిసినట్లు; హరిహరబ్రహ్మల= విష్ణువు శివుడు బ్రహ్మదేవుల (త్రిమూర్తులయొక్క); ఆత్మలలోన్= చిత్తాలలో; ఉబ్బి= పొంగి; కరుణ= దయ; ఒక్కటన్= ఒక్కటిగా; మూర్తి బెరసినట్లు= ఆకారం దాల్చినట్లు; ఖరకర= ఆదిత్యుని యొక్క కిరణాల చేత; కర= కిరణాలయొక్క; తీవ్రగతినిన్= మిక్కిలి వేగంతో; కరంగుచున్= కరిగిపోతూ; హేమ+అద్రి= మేరుపర్వతంయొక్క; సోగ= కాంతి; పెల్లు+ఎగసినట్లు= ఎక్కువగా వేగంగా పైకి వ్యాపించినట్లు; ఫణిరాజఫణరాజి మణిగణవిస్ఫూర్తి= సర్పరాజుయొక్క పడగల సమూహమందున్న మణుల వరుసయొక్క గొప్ప తేజస్సు; సుషిరము+వెలితల చూపినట్లు= రంధ్రంనుండి పైకి ఎగచిమ్మినట్లు; ఉట్టిపడ్డ+అట్లు= ఒక్కసారిగా దిగివచ్చినట్లు; కడు+ఎఱ్ఱన్= మిక్కిలి ఎర్రని కాంతిని; ఊదినట్లు= చిమ్మినట్లు; తేజము+ఎసఁగన్+కన్= కాంతి ఒప్పినట్లు; నామ్రోలన్= నా ఎదుట; దివ్యవాణి= ఆకాశవాణి; పూని= కలగి; సాక్షాత్కరించి= కలలో కనిపించి; సంపూర్ణ= నిండుదనం కలిగిన; దృష్టిన్= చూపుతో; చూచి= నన్ను వీక్షించి; మంజులము+కాను= మృదువుగా; ఇట్లు+అని పలికెన్= ఈ విధంగా పలికింది.

**తా :** తూర్పున కోటి సూర్యులు ఒకేసారి ఉదయించినట్లు, త్రిమూర్తుల కరుణ ఏకరూపాన్ని పొందిన విధంగా, సూర్యుని ప్రచండ కాంతికి కరిగిన మేరు పర్వతంమీద బంగారం మరింత వెలుగులు విరజిమ్ముతున్నట్లు, సర్పరాజుల తలల మీది మణులకాంతి మిఱుమిట్లు గొలిపినట్లు, ఒక్కసారిగా నా ఎదుట ఒక ప్రకాశవంతమైన కాంతిపుంజం స్థిరంగా నిలిచి నన్ను వీక్షించి ఆకాశవాణి మనోజ్ఞంగా ఇలా అన్నది.

**ఉ. ఆటలు పాటలుం జదువు లద్భుతముల్ వినఁబొప్పు వాద్యముల్**
**సాటి దలంపరాని బలుసాములు మున్నగు విద్యలెల్ల నీ**
**కాటలు పాట లయ్యె విను మన్నిటికిన్ మెఱుఁగిడ్డ భంగి నా**
**చాటునఁ జాటుకారపదసాధుకవిత్వముఁ జెప్పు మింపుగన్. 18**

**ప్రతి :** ఆటలు పాటలున్= బాలురకు ప్రియమైన ఆటపాటలు; చదువులు+అద్భుతముల్= నీ విద్యా వ్యాసంగాలు అబ్బురమైనవి; వినన్+ఒప్పు= వినుటకు ఇంపైన; వాద్యముల్ = వాద్య విశేషాలు; సాటి+తలంపరాని= సరి లేని; పలు సాములు= అనేక సాము గరిడీ విద్యలూ; మున్నగు= మొదలైన; విద్యలు+ఎల్లన్= చదువులన్నీ; నీకున్= నీకు; ఆటపాటలు+అయ్యెన్= ఆటపాటలైనాయి (అవలీలగా నేర్చుకున్నావు); వినుము= (నే చెప్పేది) ఆలకించు; అన్నిటికిన్= నీవు నేర్చుకున్న చదువులన్నిటికి; మెఱుఁగు+ఇడ్డభంగిన్= మెరుగు దిద్దిన రీతిలో; నా చాటునన్= నా సహాయంచేత; చాటుకార= ప్రియమైన; పద= పదాలు కల్గిన; సాధుకవిత్వము= మంచి కవిత్వాన్ని; ఇంపుగన్= వినువారికి ఆసక్తి కలుగునట్లు; చెప్పుము= చెప్పుము.

**తా :** నీవు శాస్త్ర సంబంధమైన చదువులు, శస్త్ర సంబంధమైన సాము గరిడీలు, ఆనందం కలిగించే సంగీతం మొదలైన వాటిలో ఆరితేరినావు. ఇక మీదట సాహిత్యంలో పరిశ్రమ చేయవలసిన సమయం ఆసన్నమైంది. కనుక ఇప్పుడు శ్రోతలకు వీనులవిందైన కవిత్వం చెప్పడం ప్రారంభించు. నా అండదండలు నీకు సదా ఉంటాయి.

**వ. అని యానతిచ్చు జగన్మాతృ కృపావలోకన సుశ్లోకుండనై యే నొక శ్లోకంబు నా క్షణంబ నొడివితి. అది యెట్టి దనిన. 19**

**ప్రతి :** అని= ఆ విధంగా; ఆనతి+ఇచ్చు= ఆజ్ఞాపిస్తున్న; జగత్+మాతృకృపా+అవలోకనసుశ్లోకుండను+ఐ= సర్వలోకాలకు తల్లి అయిన (ఆ దేవి యొక్క) దయతోకూడిన కటాక్షం చేత పవిత్రుడనై; ఏను+ఒక= నేను ఒక్క; శ్లోకంబును= శ్లోకాన్ని; ఆక్షణంబు+అ= అప్పుడే; నొడివితిన్= పలికాను; అది+ఎట్టిది+అనినన్= అది ఎలాంటిది అంటే...

**తా :** అని నాకు ఆజ్ఞాపించిన జగన్మాతయొక్క కరుణారసదృష్టితో పావనమైన నేను ఒక శ్లోకాన్ని ఆ క్షణమే అలవోకగా చెప్పాను. అది ఇది.

**శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ**
**నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ ।**
**సత్సంగ్రహాయ సగుణాయ నిరీశ్వరాయ**
**సంపూర్ణపుణ్యపతయే హరయే నమ స్తే ॥ 20**

**ప్రతి :** హంసాయ= పరమహంస స్వరూపుడూ; సత్త్వనిలయాయ= సత్త్వగుణానికి నెలవైనవాడు; సత్+ఆశ్రయాయ= సజ్జనులకు ఆశ్రయమైనవాడు; నిఖిలాయ= సమస్తం తానే అయినవాడు; నిరాశ్రయాయ= ఏ ఆధారం లేనివాడు; సత్+సంగ్రహాయ= సత్త్వస్వరూపుడు; సగుణాయ= గుణ సంపద కలిగినవాడు; నిరీశ్వరాయ= తనపై ఆధిపత్యం లేనివాడు; సంపూర్ణ= పూర్తి అయిన; పుణ్యపతయే= పుణ్యానికి అధిపతి; హరయే= సర్వాన్నీ హరించేవాడు అయిన; నారాయణాయ= శ్రీమన్నారాయణునికి; తే= నీకు; నమ= నమస్కారం.

**తా :** పరమహంస స్వరూపుడూ, సత్త్వగుణ సంపన్నుడు, సర్వాంతర్యామి, సజ్జనులకు ఆశ్రయమైనవాడు, తనకు ఆధారం అవసరంలేకుండా తానే అన్నిటికీ ఆధారమైనవాడు, సత్త్వస్వరూపుడు, సగుణ సంపదకలిగిన వాడు, అయిన శ్రీమన్నారాయణునికి నమస్కరిస్తాను.

**వ. ఈ శ్లోకం బద్దేవి యంగీకరించె. అంత మేలుకాంచి యానందభరితుండ నై నాఁటనుండి, చంద్రానుగత యగు చంద్రికయుం బోలె, నారాయణాంకితం బైన కవిత్వతత్త్వజ్ఞానంబు గోచరం బయ్యె. దానికి ఫలంబుగా గోపికావల్లభుని నుల్లంబున నిడుకొని. 21**

**ప్రతి :** ఈ శ్లోకంబున్= నేను చెప్పిన ఈ సంస్కృత పద్యమును; ఆ+దేవి= ఆ దివ్యవాణి; అంగీకరించెన్= ఆమోదించింది; అంతన్= ఆ వెంటనే; మేలుకాంచి= నేను నిద్రలేచి; ఆనందభరితుండన్+ఐ= సంతోషం నిండినవాడనై; నాఁటనుండి= ఆ నాటి నుంచి; చంద్ర+అనుగత+అగు= చంద్రుణ్ణి అనుసరించి ఉండే; చంద్రికయున్+పోలెన్= వెన్నెలవలె; నారాయణ= శ్రీమహావిష్ణునికి; అంకితంబు+ఐన= సమర్పింపబడిన; కవిత్వతత్త్వజ్ఞానంబు= కవితా స్వరూపజ్ఞానం; గోచరంబు+అయ్యెన్= అవగతమయ్యింది; దానికిన్= ఆ కవిత్వసిద్ధికి; ఫలంబు+కాన్= ఫలితంగా; గోపికా= గోపస్త్రీలకు; వల్లభుని= ప్రియుడైన శ్రీకృష్ణుణ్ణి; ఉల్లంబునన్= హృదయమందు; ఇడుకొని= ఉంచుకొని...

**తా :** నేను చెప్పిన శ్లోకాన్ని దివ్యవాణి ఆమోదించినందువల్ల చంద్రునివెంట వెన్నల వచ్చినట్లుగా నాకు కవిత్వతత్త్వదర్శనం కలిగింది. అప్పటినుండి నేను ఆనందంతో కృష్ణభక్తుడనై కవిత్వ రచన ప్రారంభించాను.

**ఆ. పలుకఁ గలిగె మొదలు భాగవతార్థంబు భర్త కృష్ణుఁ డాయె భాగ్య మొదవె**
**నమృతరసము గోర నలరు చింతామణిపాత్ర సంభవించు భంగి నిపుడు. 22**

**ప్రతి :** మొదలు= మొదటిది; భాగవత+అర్థంబు= భాగవత కథల యొక్క పరమార్థం; పలుకన్+కలిగెన్= చెప్పే అదృష్టం కలిగింది; భర్త= నా కవిత్వానికి కృతిపతి; కృష్ణుఁడు+ఆయెన్= శ్రీకృష్ణుడు అయ్యాడు; భాగ్యము+ఒదవెన్= నా అదృష్టం పండింది; అమృతరసమున్+కోరన్= అమృతమనే పానీయం త్రాగకోరగా; అలరు= ఒప్పునట్టి; చింతామణి= కోరికలను తీర్చు చింతామణియైన; పాత్ర= గిన్నె; సంభవించుభంగిన్= కలిగిన విధంగా; ఇపుడు= ఈ సమయంలో...

**తా :** నేను శ్రీకృష్ణునికి అంకితంగా భాగవతాన్ని రచించే అదృష్టాన్ని పొందాను. ఇది అమృతాన్ని తాగాలనుకునే వానికి చింతామణిపాత్ర లభించినట్టుగా ఉంది.

**ఆ. భాగవతము తేటపఱుప నెవ్వఁడు సాలు శుకుఁడు దక్క నరునిసఖుఁడు దక్క**
**బుద్ధిఁ దోఁచినంత బుధులచే విన్నంత భక్తి నిగిడినంత పలుకువాఁడ. 23**

**ప్రతి :** శుకుఁడు+తక్క= శుకమహర్షి తప్ప; నరుని= అర్జునునియొక్క; సఖుఁడు+తక్క= స్నేహితుడైన శ్రీకృష్ణుడు తప్ప; భాగవతము తేటపఱుపన్= భాగవతకథను వివరించడానికి; ఎవ్వఁడు+చాలున్= ఎవడు సమర్థుడవుతాడు; బుద్ధిన్+తోఁచినంత= నా బుద్ధికి తెలిసినంత; బుధులచేన్= పండితులచేత; విన్నంత= గ్రహించినంత; భక్తినిగిడిన+అంత= భక్తిపారవశ్యంలో తోచినంత; పలుకువాఁడన్= చెప్పడానికి ప్రయత్నిస్తాను.

**తా :** శుకయోగి, కృష్ణుడు తప్ప ఇతరులెవరూ వివరించడానికి సాధ్యం కాని భాగవతమహాపురాణాన్ని నేను నాకు తెలిసినంతగా, నా బుద్ధికి తోచినంతగా, భక్తి పారవశ్యంలో స్ఫురించినంతా చెప్పడానికి ప్రయత్నిస్తాను.

**ఉ. పుట్టిననాఁటనుండియును బుట్టద యెట్టి యదట్టు నైనఁ జే**
**పట్టి నుతింపఁ జిత్తము, శుభం బగు మద్వరవాక్యసీమకుం**

**బట్టము గట్టినాఁడ హరిఁ బాయక తత్కథనామృతంబు నే**
**నుట్టిపడంగఁ జెప్పుదు బుధోత్తము లానుఁడు శ్రోత్రపద్ధతిన్. 24**

**ప్రతి :** పుట్టిననాఁటన్+ఉండియునున్= పుట్టినరోజు మొదలుగా; ఎట్టి= ఎలాంటి; అదట్టున్+ఐనన్= సమయంలోనైనా; హరిన్= ఆ విష్ణుమూర్తిని; చేపట్టి= ఆశ్రయించి; నుతింపన్= ప్రార్థన చేయడానికి; చిత్తము= మనస్సు; పుట్టదు+అ= పుట్టలేదు; శుభంబు+అగు= మంగళకరమైన; మత్+వరవాక్యసీమకున్= శ్రేష్ఠమైన నా వాక్యసీమకు; హరిన్= శ్రీవిష్ణువును; పట్టము కట్టినాఁడన్= పట్టాభిషిక్తుణ్ణి చేశాను; పాయక= విరామం లేకుండా; తత్+కథన+అమృతంబున్= అమృతమువంటి ఆ కథనాన్ని; ఏన్= నేను; ఉట్టిపడన్+కన్= అతిశయించునట్లుగా; చెప్పుదున్= చెబుతాను (దానిని); బుధ+ఉత్తముల్= పండితశ్రేష్ఠులు; శ్రోత్రపద్ధతిన్= చెవులతో; ఆనుఁడు= వినండి.

**తా :** నాకు బాల్యంనుండి ఏనాడూ విష్ణుదేవుణ్ణి ప్రార్థించాలనే బుద్ధి పుట్టలేదు. ఇప్పుడు దివ్యవాణి దయవల్ల మంగళకరమైన నా వాక్యసీమకు శ్రీవిష్ణువును పట్టాభిషిక్తుణ్ణి చేస్తున్నాను. నిర్విరామంగా భాగవతకథను చెప్తాను. పండితవర్యులు చెవులారా వినండి.

**వ. అని, 25**

**తా :** ఆ విధంగా చెప్పి...

**సీ. శ్రీవత్సగోత్రుండు శివభక్తియుక్తుఁ డాపస్తంబసూత్రుఁ డపారగుణుఁడు**
**నేర్చూరిశాసనుం డెఱ్ఱన ప్రెగ్గడ పుత్త్రుండు వీరన పుణ్యమూర్తి**
**కాత్మజుండగు నాదెయామాత్యునకుఁ బోలమాంబకు నందను లమితయశులు**
**కసువనామాత్యుండు ఘనుఁడు వీరనమంత్రి సింగధీమణియు నంచితగుణాఢ్యు**

**తే. లుద్భవించిరి తేజంబు లూర్జితముగ సొరిది మూర్తిత్రయంబన శుభ్రకీర్తిఁ**
**బరఁగి రందులఁ గసువనప్రభువునకును ముమ్మడమ్మను సాధ్వి యిమ్ములను వెలసె. 26**

**ప్రతి :** శ్రీవత్సగోత్రుండు= శ్రీవత్స మనే గోత్రమందు పుట్టినవాడు; శివభక్తియుక్తుఁడు= శివునియందు భక్తి కలవాడు; ఆపస్తంబసూత్రుఁడు= ఆపస్తంబమహర్షి యొక్క గృహ్యసూత్రాలను అనుసరించేవాడు; అపార= అంతులేని; గుణుఁడు= సద్గుణాలు కలవాడు; ఏర్చూరి శాసనుండు= ఏర్చూరి గ్రామానికి అధికారి; ఎఱ్ఱన ప్రెగ్గడ= ఎఱ్ఱనామాత్యుని యొక్క; పుత్రుఁడు= కుమారుడు అయిన; వీరన= వీరనమంత్రి అనే; పుణ్యమూర్తికిన్= పుణ్యశీలికి; ఆత్మజుండు+అగు= కుమారుడైన; నాదెయ+అమాత్యునకున్= నాదెయ మంత్రికి; పోలమాంబకున్= (ధర్మపత్ని) పోలమాంబకు (కలిగిన); నందనులు= కుమారులు; అమితయశులు= మిక్కిలి కీర్తిమంతులు; కసువన+అమాత్యుండు= కసువనమంత్రి; ఘనుఁడు= గొప్పవాడైన; వీరనమంత్రి= వీరన అనే మంత్రి; సింగధీమణియున్= బుద్ధిశాలి అయిన సింగన అనే; అంచితగుణ+ఆఢ్యులు= మంచి గుణాలచే ప్రసిద్ధులు; తేజములు= ప్రభావాలు; ఊర్జితము+కన్= గొప్పగా; సొరిది= ఒప్పునట్లుగా; మూర్తిత్రయంబు+అనన్= త్రిమూర్తుల్లో అన్నట్లుగా; ఉద్భవించిరి= జన్మించారు; శుభ్రకీర్తిన్= స్వచ్ఛమైన యశస్సుతో; పరఁగిరి= ప్రసిద్ధిని పొందారు; అందులన్= వారిలో; కసువన ప్రభువునకును= కసువనమంత్రికి; ముమ్మడమ్మ+అను= ముమ్మడమ్మ అనే; సాధ్వి= సాధ్వియైన భార్య; ఇమ్ములను= మిక్కిలిగా; వెలసెన్= పేరు పొందినది.

**తా :** శ్రీవత్స గోత్రానికి, ఆపస్తంబ సూత్రానికి చెందిన పరమ శివభక్తుడు అయిన ఏర్చూరి గ్రామాధికారి, గుణశ్రేష్ఠుడు, ఎఱ్ఱన ప్రెగ్గడ. అతని కుమారుడు వీరన మంత్రి. అతని పుత్రుడైన నాదెయ మంత్రికి, పోలమాంబకు కసువన మంత్రి, వీరనమంత్రి, సింగయామాత్యుడు అనే ముగ్గురు గుణవంతులైన పుత్రులు కలిగి పేరు ప్రతిష్ఠలు పొందారు. అందులో కసువనమంత్రికి ముమ్మడమ్మ అనే అనుకూల అయిన భార్య ఉంది.

**ఉ. ఆడదు భర్తమాట కెదురా, డదు వచ్చినవారి వీఁడగా**
**నాడదు పెక్కుభాష, లెడనాడదు వాకిలి వెళ్ళి, కల్ల మా**
**టాడదు మిన్నకేని, సుగుణావళి కిందిరగాక సాటి, యే**
**చేడియ లేదు, చూరికులశేఖరు కస్వయ ముమ్మడమ్మకున్. 27**

**ప్రతి :** భర్తమాటకున్= తన భర్తయొక్క ఆజ్ఞకు; ఎదురు= వ్యతిరేకంగా; ఆడదు= మాట్లాడదు; వచ్చినవారిన్= ఇంటికి వచ్చినవారిని; వీఁడగాన్= వెళ్ళిపోయేవిధంగా; ఆడదు= మాట్లాడదు; పెక్కుభాషలు= ఎక్కువగా (అనవసరంగా); ఆడదు= మాట్లాడదు; వాకిలి+వెళ్ళి= ఇంటి ముంగిలిదాటి; ఎడనాడదు= వృథాగా తిరుగదు; మిన్నక+ఏనిన్= ఊరకే అయినా; కల్ల= అబద్ధం; మాటాడదు= పలుకదు; చూరికుల శేఖరు= ఏర్చూరి వంశంలో శ్రేష్ఠుడైన; కస్వయ= కసువనమంత్రియొక్క; ముమ్మడమ్మకున్= భార్య అయిన ముమ్మడాంబకు గల; సుగుణావళికిన్= సద్గుణముల సమూహానికి; ఇందిర+కాక= లక్ష్మీదేవి తప్ప; ఏ చేడియ= ఏ ఇతరస్త్రీ కూడా; సాటి= సమానం; లేదు= కాలేదు.

**తా :** ఏర్చురి వంశశ్రేష్ఠుడైన కసువనమంత్రి భార్య అయిన ముమ్మడాంబ భర్త మాటను జవదాటదు. అతిథి అభ్యాగతులను తిరస్కరించదు. ఇంటి ముంగిలిని దాటి వెళ్ళదు. ఊరకే అయినా – అబద్ధం చెప్పదు. అట్టి సుగుణవతి అయిన ఈమెకు లక్ష్మీదేవి తప్ప ఇతర స్త్రీలు సాటి రారు.

**క. ఆ కసువయమంత్రికిఁ బుణ్యాకల్పశుభాంగి ముమ్మడమ్మయు మము న**
**వ్యాకులచిత్తుల నిరువుర శ్రీకరగుణగణులఁ బుణ్యశీలురఁ గాంచెన్. 28**

**ప్రతి :** ఆ కసువయమంత్రికిన్= ఆ కసువనామాత్యునికి; పుణ్య+ఆకల్పశుభ+అంగి= పుణ్యమే ఆభరణంగా గల (మరియు) ప్రశస్తమైన శరీరం కలిగిన; ముమ్మడమ్మయు= ముమ్మడాంబ; అవ్యాకుల= నిశ్చలమైన; చిత్తులన్= మనసులు గల; శ్రీకర= శోభాకరమైన; గుణగణులన్= పెక్కు సద్గుణాలు కలిగిన; పుణ్యశీలురన్= పుణ్యమే స్వభావంగా గల; మము+ఇరువురన్= మా ఇద్దరిని; కాంచెన్= కనెను (జన్మనిచ్చింది)...

**తా :** ఆ కసువన ముమ్మడాంబ దంపతులకు భూరిగుణసంపన్నులమైన మేము ఇద్దరం అన్నదమ్ములం జన్మించాము.

**క. అంగజసమలావణ్యశుభాంగులు హరిదివ్యపదయుగాంబుజవిలస**
**ద్భృంగాయమానచిత్తులు సింగయ తెలగయలు మంత్రిశేఖరు లనఁగన్. 29**

**ప్రతి :** అంగజసమలావణ్యశుభ+అంగులన్= మన్మథునితో సమానమైన సౌందర్యంతో శోభాకరమైన శరీరాలు కలవారును; హరిదివ్యపదయుగ= విష్ణుమూర్తియొక్క ప్రశస్తమైన పాదముల జంట అనే; అంబుజవిలసత్+భృంగాయమానచిత్తులు= పద్మములందు ఆసక్తమైన తుమ్మెదలవంటి మనసులు కలిగినవారలుగా; సింగయ= సింగయ అనే పేరుగల; తెలగయ= తెలగయ అను పేరుగల; మంత్రిశేఖరులు= మంత్రివర్యులు; అనఁగాన్= అనేవాళ్లు...

**తా :** మన్మథునితో పోల్చదగిన శరీరాలు కలిగి, విష్ణుపాదారవిందాలయందు స్థిరమైన మనస్సు కలిగిన వారమైన మేము అనగా సింగయ, తెలగయలనే అన్నదమ్ములం పేరు పొందాం.

**క. అం దగ్రజుండ శివపూ, జం దనరినవాఁడ విష్ణుచరితామృత ని**
**ష్యందిపటువాగ్విలాసానందోచితమానసుఁడను నయకోవిదుఁడన్. 30**

**ప్రతి :** అందున్= ఆ ఇద్దరిలో; అగ్రజుండన్= పెద్దవాడను; శివపూజన్+తనరినవాఁడన్= శివార్చన యందు ఆనందించేవాడిని; విష్ణుచరిత+అమృత= విష్ణుచరిత్రమనే సుధారసం; నిష్యంది= స్రవించునట్లుగా; పటువాక్+విలాస= పాటవమైన మాటలను ప్రియంగా ప్రయోగించడంతో; ఆనంద+ఉచితమానసుఁడను= సంతోషంతో ఉప్పొంగే మనసు కలవాణ్ణి; నయకోవిదుఁడన్= నీతి విశారదుణ్ణి.

**తా :** మా ఇద్దరి సోదరులలో సింగన అనే నేను పెద్దవాడిని. నేను శివపూజా దురంధరుడనై, విష్ణుకథలు అనే అమృతం జాలువారే విధంగా మాటలను ప్రియంగా ప్రయోగించడంలో ఉప్పొంగే మనస్సు కలవాడను. నీతివిశారదుడను.

**వ. కావునం గృష్ణపాదారవిందసందర్శనాదర్శతలాయమానచిత్తుండనై. 31**

**ప్రతి :** కావునన్= ఆ కారణంచే; కృష్ణపాద+అరవిందసందర్శన+ఆదర్శతలాయమానచిత్తుండను+ఐ= శ్రీకృష్ణపరమాత్మ యొక్క తామరలవంటి పాదపద్మాల జంటను ప్రతిబింబింపజేసే స్వచ్ఛమైన అద్దంవంటి నిర్మలమైన హృదయం కలవాడనై...

**తా :** అద్దంవంటి స్వచ్ఛమైన నా హృదయమందు శ్రీకృష్ణుని పాదపద్మాలను సందర్శిస్తున్న వాడనై

**✤ షష్ఠ్యంతములు ✤**

**క. శ్రీపతికి మత్పతికి నుత, గోపతికిఁ ద్రిలోకపతికి గురుజనబుధ సం**
**తాపనివారణమతికినిఁ, బ్రాపితసనకాదితతికి బహుతరధృతికిన్. 32**

**ప్రతి :** శ్రీపతికిన్= లక్ష్మియొక్క భర్తకు (విష్ణువుకు); మత్+పతికిన్= నా స్వామికి; నుత= పొగడబడిన; గోపతికిన్= గోవులను కాచిన వాడికి (లేదా) భూదేవికి భర్త అయిన వాడికి; త్రిలోకపతికిన్= స్వర్గ, మర్త్య, పాతాళలోకాలకు అధిపతి అయినవాడికి; గురుజన= పూజ్యులైన వారి యొక్క; బుధ= పండితులయొక్క; సంతాప= దుఃఖాన్ని; నివారణ= పోగొట్టగల; మతికినిన్= మనసు కలిగిన వాడికి; ప్రాపిత= ఆశ్రయం ఇవ్వబడిన; సనక+ఆదితతికిన్= సనక, సనంద, సనత్కుమార, సనత్సుజాతీయులనే మునిగణం కలవాడికి; బహుతర ధృతికిన్= గొప్ప స్థిరత్వం కలవాడికి...

**తా :** శ్రీ భూదేవులకు భర్త అయిన వాడికి, నా స్వామికి, ముల్లోకాలకు అధిపతి అయిన వాడికి, పెద్దలు, జ్ఞానులు అయిన వారి శోకాన్ని పోగొట్టేవాడికి, సనకసనందనాది ముని గణానికి ఆశ్రయమై సంతసింపజేసేవాడికి, గొప్ప స్థిరత్వం కలవాడికి.

**విశే :** 'గురుజన బుధ సంతాప నివారణ మతికిని' అనే పదం సార్థక విశేషణం. ఎందుకంటే శ్రీకృష్ణుడు తనకు గురువైన సాందీపని ఇష్టం మేరకు అతని మృతపుత్రుని పునర్జీవితునిచేసి తీసుకొని అప్పగించాడు.

**క. హరికి గురుకలుషకుంజర, హరికి బలాభీలహరికి నంతశ్శ్రిత గ**
**హ్వరికి నరహరికి రక్షితకరికిఁ గరాగ్రస్థగిరికి ఘనతరకరికిన్. 33**

**ప్రతి :** హరికిన్= విష్ణుమూర్తికి; గురు= గొప్పవైన; కలుష= పాపాలనే; కుంజర= ఏనుగులను; హరికిన్= నశింపజేసే సింహానికి; బల+ఆఖీల= మిక్కిలి బలంచే భయంకరులైన శత్రువుల్ని; హరికిన్= అణచినవానికి; అంతస్+స్థితగహ్వరికిన్= అంతర్యామియైన వానికి (సకలజీవుల హృదయగుహల్లో నివసించేవానికి); నరహరికిన్= నరసింహునికి; రక్షిత= తనచే కాపాడబడిన; కరికిన్= గజేంద్రుడు కలిగిన వానికి; కర+అగ్రస్థగిరికిన్= చేతికొనతో గోవర్ధన పర్వతాన్ని ఎత్తినవానికి; ఘనతర= మిక్కిలి గొప్పదైన; కిరికిన్= (భూరక్షణార్థం) వరాహరూపం ధరించినవానికి...

**తా :** భక్తుల పాపాలను పోగొట్టేవానికి, మిక్కిలి బలంతో భయంకరులైన శత్రువుల్ని హరించేవానికి, సకతజీవుల హృదయగుహలలో నివాసం కలవానికి, నరసింహునికి, గజేంద్రుణ్ణి రక్షించిన వానికి, గోవర్ధనపర్వతం ఎత్తినవానికి, వరాహరూపం ధరించిన వానికి (అయిన శ్రీకృష్ణునికి)

**క. గుణికి సమాశ్రితచింతామణికి మహేంద్రాదిదివిజమండలచూడా**
**మణికిఁ బ్రకల్పితశయ్యాఫణికి నురోభాగకౌస్తుభప్రియమణికిన్. 34**

**ప్రతి :** గుణికిన్= (భక్తులను రక్షించడానికి) సగుణ స్వరూపుడైన వానికి; సమాశ్రిత= తనను ఆశ్రయించిన భక్తుల పాలిట; చింతామణికిన్= చింతామణి వంటి వానికి; మహా+ఇంద్ర+ఆది= దేవేంద్రుడు మొదలైన; దివిజమండల చూడామణికిన్= దేవతా సమూహంలో శిరోమణి అయినవానికి; ప్రకల్పిత= సంతరింపబడిన; శయ్యాఫణికిన్= పాన్పుగా శేషుడు కలవానికి; ఉరస్+భాగ= హృదయస్థానంలో; కౌస్తుభప్రియమణికిన్= ప్రియమైన కౌస్తుభమణి కలవానికి...

**తా :** తన భక్తులను రక్షించడానికి సగుణరూపుడైన వానికి, చింతామణి వలె భక్తుల కోర్కెలను తీర్చేవానికి, దేవేంద్రాది దేవతామండలిలో చూడామణి అయినవానికి, కౌస్తుభమణిని ధరించినవానికి, శేషుణ్ణి పాన్పుగా చేసుకున్నవానికి (అయిన శ్రీకృష్ణునికి)

**క. కంసాసురసంహారున కంసాంచితకర్ణకుండలాభరణునకున్**
**హింసాపరపరమస్తకమాంసకరాళితగదాభిమతహస్తునకున్. 35**

**ప్రతి :** కంస+అసుర= రాక్షసుడైన కంసుని; సంహారునకున్= చంపినవానికి; అంస+అంచితకర్ణకుండల+ ఆభరణునకున్= భుజాలను తాకుతున్న చెవి తాటంకాలు అనే అలంకారాలు కలిగిన వానికి; హింసాపర= క్రూర స్వభావంగల; పరమస్తక= శత్రువుల తలల; మాంసకరాళిత= మాంసపుతునకలతో భయంకరమైన; గదా= కౌమోదకీ అనే గదచేత; అభిమత= ఇష్టమైన; హస్తునకున్= హస్తంకలవానికి...

**తా :** లోక కంటకుడైన కంసుణ్ణి చంపినవానికి, భుజాలను తాకుతూ వ్రేలాడే చెవికమ్మలకు కలిగినవానికి, శిష్టులను రక్షించడానికి దుర్మార్గుల శిరస్సులను చిదిమి, ఆ మాంసం ముక్కలతో భయంకరమైన కౌమోదకి అనే గదను కలిగిన విష్ణుమూర్తికి (అయిన శ్రీకృష్ణునికి)

**క. వరయోగిమానసాంతఃకరణసుధాంభోధిభావకల్లోలలస**
**త్పరతత్త్వశేషశాయికిఁ జిరదాయికి సకలభక్తచింతామణికిన్. 36**

**ప్రతి :** వరయోగి= ఉత్తమయోగుల యొక్క; మానస+అంతఃకరణ= అంతరంగమైన మనస్సు అనే; సుధా+అంభోధి= పాలకడలియందు; భావకల్లోల= మనోభావాలనే అలలపై; లసత్= ప్రకాశించే; పరతత్త్వశేషశాయికిన్= పరతత్త్వరూపుడైన

శేషశాయికి; చిరదాయికిన్= శాశ్వతమైన ముక్తిని ఇచ్చువానికి; సకలభక్త= భక్తులందరికి; చింతామణికిన్= చింతామణి అయినవానికి...

**తా :** పరమయోగుల మనస్సు అనే పాలసముద్రంలో వారి భక్తి భావాలనే కెరటాలపై పరతత్త్వ స్వరూపంతో ఆదిశేషునిపై పవళించినవానికి, శాశ్వతముక్తిని కలిగించేవానికి, భక్తుల కోర్కెలను తీర్చుటలో చింతామణి అయినవానికి

## ❖ కథా ప్రారంభము ❖

**వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన షష్ఠస్కంధంబునకుం గథా ప్రారంభక్రమం బెట్టిదనిన, హరిచరణస్మరణపరిణామవినోదు లయిన శౌనకాదులకు నిఖిలపురాణేతిహాసనిర్ణయవిఖ్యాతుండైన సూతుం డిట్లనియె. 37**

**ప్రతి :** సమర్పితంబు+కాన్= అంకితంగా; నా= నాయొక్క; ఒనర్పన్+పూనిన= చేయడానికి (వ్రాయడానికి) పూనుకొన్న; షష్ఠ స్కంధంబునకున్= ఆరవ స్కంధానికి; కథా= (చెప్పబోవు) కథయొక్క; ప్రారంభక్రమంబు= మొదలు; ఎట్టిది+అనినన్= ఏమిటంటే (ఏవిధంగాఉంటుందంటే); హరిచరణ= విష్ణుపాదాలను; స్మరణ= తలచుటచే; పరిణామ= కలిగిన ఫలితమైన; వినోదులు+అయిన= ఆనందం పొందినవారైన; శౌనక+ఆదులకున్= శౌనకుడు మొదలైన ఋషులకు; నిఖిల= సమస్తమైన; పురాణ= భాగవతం మొదలైన పురాణాలు; ఇతిహాస= భారతం మొదలైన ఇతిహాసాలను; నిర్ణయ= అర్థాన్ని వివరించుట యందు; విఖ్యాతుండు+ఐన= ప్రసిద్ధుడైన; సూతుండు= సూతమహర్షి; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారంగా పలికాడు.

**తా :** నాచే శ్రీకృష్ణునికి అంకితంగా వ్రాయబడుతున్న ఈ ఆరవస్కంధంయొక్క ప్రారంభం ఏమిటంటే, విష్ణు పాదారవింద మననం వలన ఆనందం పొందిన శౌనకాది ముని బృందాలతో, పురాణ, ఇతిహాసాల సారాన్ని వివరించడంలో సమర్థుడైన సూతమహర్షి ఇలా చెప్పసాగాడు.

**క. శ్రీరమణీరమణకథాపారాయణచిత్తుఁ డగుచుఁ బలికెఁ బరీక్షి**
**ద్భూరమణుఁ డాదరంబున సూరిజనానందసాంద్రు శుకయోగీంద్రున్. 38**

**ప్రతి :** పరీక్షిత్+భూరమణుఁడు= పరీక్షిన్మహారాజు; శ్రీరమణీ= లక్ష్మీదేవియొక్క; రమణ= ప్రియభర్త అయిన విష్ణువుయొక్క; కథా= పుణ్యకథలను; పారాయణ= శ్రద్ధగా చదవడంలో; చిత్తుఁడు+అగుచున్= మనసు కలవాడగుచు; సూరిజన+ఆనంద సాంద్రున్= పండిత సమూహానికి సంతోషం కలిగించుటలో దిట్ట అయిన; శుకయోగి+ఇంద్రున్= శ్రేష్ఠుడైన శుక మహర్షితో; ఆదరంబునన్= కథాశ్రవణతత్పరతతో; పలికెన్= ఇలా చెప్పాడు.

**తా :** విష్ణుకథలను వినడంలో ఆసక్తికలిగిన పరీక్షిన్మహారాజు పండితులకు ఆనందం కల్గించడంలో సమర్థుడైన శుకయోగీంద్రుని కథను వినాలనే ఆసక్తితో ఇలా ప్రార్థించాడు.

**సీ. షడ్గుణైశ్వర్యశాశ్వతమూర్తి వైనట్టి మునినాథ! దయతోడ ముక్తిపదము**
**మున్నుగా నే మార్గమును వినిపించితి వారయ నపవర్గ భూరిమహిమఁ**
**గ్రమయోగసంభవబ్రహ్మాంబుతోడన యనువొంద నగు నవి వినుతి కెక్క**
**మఱియు సత్త్వరజస్తమఃప్రభావంబులఁ గడిఁదియై యున్నట్టి కర్మచయము**

**తే. నప్పటప్పటి కణఁగని యట్టి ప్రకృతిఁ, గలుగు పురుషుని భోగార్థఘటన దేహ**
**కారణారంభరూపమార్గంబు మొదలు, మాటిమాటికి నన్నియుఁ దేటపడఁగ. 39**

**ప్రతి :** షట్+గుణ+ఐశ్వర్యశాశ్వతమూర్తివి= ఆరు (విశిష్ట) గుణాలతో ప్రాభవం కలిగిన స్థిరమైన మూర్తివి; ఐనట్టి= అయిన; మునినాథ= ఓ మునిశ్రేష్ఠా!; దయతోడన్= నా యందు కృపతో; ముక్తిపదము= మోక్షపదవి లభించే; మార్గమును= పద్ధతిని; మున్నుగానే= ఇంతకుముందే; వినిపించితివి= తెలియపరిచావు; ఆరయన్= విచారించి; అపవర్గ= మోక్షంయొక్క; భూరిమహిమన్= గొప్ప విశేషాన్ని; క్రమ= చక్కని రీతిలో సాగిన; యోగ= తపస్సుచే; సంభవ= ఏర్పడే; బ్రహ్మంబుతోడనన్= పరమాత్మతో; అనువు+ఒందన్+అగున్= సరిపడుతుంది; అవి= అటువంటి వాటిని; వినుతికిన్+ఎక్కన్= పొగడగలిగినట్లుగా; వినిపించితి= నాకు వినిపించావు; మఱియున్= ఇంకను; సత్త్వ= సాత్త్వికగుణం; రజస్= రాజసగుణం; తమస్= తమోగుణాల యొక్క; ప్రభావంబులన్= శక్తులతో; కడిఁది+ఐ+ఉన్నట్టి= లోబడి ఉన్న; కర్మచయమున్= కర్మ సమూహాన్ని; అప్పటికిన్+ అప్పటికిన్= ఆ యా సమయాలలో; అణఁగని+అట్టి= నియంత్రించడానికి ఏ మాత్రం వీలుకాని; ప్రకృతిన్= స్వభావంతో; కలుగు= కలిగిఉండే; పురుషుని= జీవునియొక్క; భోగ+అర్థఘటన= సుఖాలు అనుభవించిన ప్రయోజనం; దేహ= వివిధ శరీరాలు ధరించడానికి; కారణ= కారణమైన; ఆరంభరూప= మూలమైన; మార్గంబు= దేహధారణ విధానం; మొదలు= మొదలైన; మాటికిన్+మాటికిన్= పెక్కుమార్లు; అన్నియున్= అన్ని విషయాలను; తేటపడన్+కన్= స్పష్టంగా; వినిపించితి(వి)= తెలియపరిచావు.

**తా :** విశిష్టమైన ఆరుగుణాలు కలిగిన ఓ శుకమునీంద్రా! జీవుడు పరమపదాన్ని పొందే మార్గాన్ని నాకు వివరించి చెప్పావు. నివృత్తి మార్గాన్ని అనుసరించిన జీవుడు ఊర్ధ్వగతిని పొందే మార్గం తేటతెల్లంగా చెప్పావు. జీవుడు స్వతహాగా త్రిగుణాలచే బద్ధుడై దుష్కర్మలు ఆచరిస్తూ దాని ఫలితంగా పలురకాలైన దేహాలను ధరిస్తూ జనన మరణ రూపమైన సంసారచక్రంలో బంధింపబడి కొట్టుమిట్టాడుతూ ఉంటాడు. ఆ ప్రవృత్తి మార్గాన్ని నాకు చక్కగా వివరించావు.

**విశే : షడ్గుణైశ్వర్యాలు :** ఐశ్వర్యం, ధైర్యం, కీర్తి, తేజస్సు, జ్ఞానం, వైరాగ్యం. ఇవి భగవదంశ కలిగిన వారికే శోభిస్తాయి. శుకయోగిని 'షడ్గుణైశ్వర్య శాశ్వతమూర్తి' అనే సార్థక విశేషణంతో సూచించడంవల్ల శుకునిలో భగవతత్త్వం నిండి ఉందని తెలుస్తూంది.

**వ. మఱియు ననేకపాపలక్షణంబులగు నానావిధనరకంబులును వాని కాద్యంతంబులును, స్వాయంభువ సంబంధియగు మన్వంతరంబును, బ్రియవ్రతోత్తానపాదులవంశంబును, దచ్చరిత్రంబును, ద్వీపవర్ష సముద్రాద్రినద్యుద్యానవనస్పతులును, భూమండలసంస్థానంబును, వానిపరిమాణంబును, జ్యోతిశ్చక్రచలన ప్రకారంబును, విభుండైన పరమేశ్వరుం డెవ్విధంబున నిర్మించె, నా విధం బంతయు నెఱింగించినాఁడవు. ఇప్పుడు. 40**

**ప్రతి :** మఱియున్= ఇవేకాకుండా ఇంకా; అనేక= పలురకాలైన; పాప లక్షణంబులు+అగు= పాపలక్షణ ఫలితాలైన; నానావిధ= పలురకాలైన; నరకంబులును= నరకలోకాలు; వానికిన్= ఆ నరకలోకాలకు; ఆది+అంతంబులును= మొదలు తుది; స్వాయంభువ= స్వాయంభువుడనే ఆది మనువుకు; సంబంధి+అగు= సంబంధించిన; మన్వంతరంబునున్= మనువులయొక్క శాసన కాలమునూ; ప్రియవ్రత+ఉత్తనపాదుల= స్వాయంభువునికుమారులైన ప్రియవ్రత, ఉత్తానపాదుల

యొక్క; వంశంబునున్= వంశ చరిత్రలను; తత్+చరిత్రంబును= వారి కథను; ద్వీప= నాలుగువైపుల నీరు ఆవరించబడిన భూభాగాల యొక్క; వర్ష= జంబూద్వీపంలోని తొమ్మిది భూభాగాల యొక్క; సముద్ర= ఏడు మహాసముద్రాల యొక్క; అద్రి= ఏడు పర్వతాలయొక్క; నదీ= నదులయొక్క; ఉద్యాన= అడవులయొక్క; వనస్పతులును= ఔషధ సంబంధమైన మొక్కలను; భూమండల= ఈ భూమియందు; సంస్థానంబును= నెలకొన్న విధానాన్ని; వాని= పైవాటియొక్క; పరిమాణంబును= వైశాల్యాలను; జ్యోతిస్+చక్రచలన= గ్రహాల, తారల గమనాల యొక్క; ప్రకారంబును= విధానాన్ని; విభుండైన= సర్వలోకాధిపతి అయిన; పరమ+ఈశ్వరుండు= పరమాత్మ; ఏ+విధంబునన్= ఏ మాదిరిగా; నిర్మించెన్= సృష్టించెనో; ఆ విధంబు+అంతయున్= ఆ పద్ధతి అంతా; ఎఱింగించినాఁడవు= తెలియజేశావు; ఇప్పుడు= ఇక ప్రస్తుతం...

**తా :** ఇవేకాక పలురకాలైన నరకాలగురించి; స్వాయంభువుడు, అతనికుమారులైన ప్రియవ్రత, ఉత్తానపాదుల వంశచరితలు; ఈ భూమండలంలో ఉన్న అనేకద్వీపాలు, భూభాగాలు, సముద్రాలు, నదులు, అడవులు మొదలైన సమస్తవిషయాలయొక్క ఆవిర్భావవైశాల్యాలు; జ్యోతిషపరమైన గతుల విశేషాలూ; వీటన్నింటిని పరమాత్మ ఏ విధంగా సృష్టించాడో నాకు తెలియజేశావు. ఇక ప్రస్తుతం

**తే. కడిఁది వేదనలకుఁ గారణంబై యుండు గుఱుతు లేని నరకకూపరాశి**
**పాలుగాక నరుఁడు బ్రతికెడు మార్గంబు పరమపుణ్య! తెలియఁ బలుక వయ్య! 41**

**ప్రతి :** పరమపుణ్యా= ఓ పుణ్యపురుషా!; కడిఁది= కఠినమైన; వేదనలకున్= బాధలకు (శిక్షలకు); కారణంబు+ఐ+ఉండు= హేతువై ఉన్న; గుఱుతులేని= లెక్కలేనటువంటి; నరక= నరకాలనే; కూపరాశి= నూతుల సమూహానికి; పాలు+కాక= గురికాకుండా; నరుఁడు= మానవుడు; బ్రతికెడు= జీవించే; మార్గంబు= విధానం (తెరువు); తెలియన్= అర్థమయ్యే విధంగా; పలుకవు+అయ్య!= వివరించవయ్యా!

**తా :** మహానుభావా! శుకదేవా! ఇప్పుడు నాకు ఈ విషయం వివరించి చెప్పు. ఈ ప్రపంచంలోని మానవుడు భరింపరాని బాధలతో నిండిన నానావిధ నరకకూపాలలో పడిపోకుండా సుఖంగా జీవించే మార్గం ఏదైనా ఉందా! ఉంటే దాన్ని నాకు విశదీకరించు.

**వ. అనినం బరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుం డిట్లనియె. 42**

**ప్రతి :** అనినన్= అని అడిగిన; పరీక్షిత్+నర+ఇంద్రునకున్= పరీక్షిన్మహారాజుతో; శుకయోగి+ఇంద్రుండు= శ్రీ శుక మహర్షి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తా :** ఈ విధంగా అడిగిన మహారాజుతో శుకుడు ఇలా చెప్పాడు.

**క. కట్టా! త్రికరణములచేఁ బుట్టిన దురితముల నపుడు పొలియింపని యా**
**కట్టిఁడి దేహం బుడిగినఁ గొట్టాడును బిట్టు నరకకూపంబులలోన్. 43**

**ప్రతి :** కట్టా= అకటా!; త్రికరణములచేన్= మనోవాక్కాయకర్మలచే; పుట్టిన= కలిగిన; దురితములన్= పాపాలను; అపుడు= ఆ క్షణమే; పొలియింపని= పరిహారం చేసుకోనందువల్ల; ఆ+కట్టిఁడి దేహంబు= ఆయొక్క చెడ్డదైన దేహం; ఉడిగినన్= నశించిన తరువాత; బిట్టు= భయంకరంగా; నరక= నరకమనే; కూపంబులలోన్= ఊబులలో (నూతులలో); కొట్టాడును= పడి కొట్టుకుంటుంది.

**తా :** అకటా! మనోవాక్కాయ కర్మల ఫలితంగా కలిగే పాపాలను, పరిహారం చేసుకొనక పోయినందువల్ల జీవుడు దేహం వదలిన తర్వాత భయంకరమైన నరకాలలో శిక్షలు అనుభవించాలి.

**ఉ. కావునఁ గాలకింకరవికారముఁ గానకమున్న మృత్యు దు**
**ర్భావన చిత్తమున్ వెడఁగుపాటును జెందకమున్న మేనిలో**
**జీవము వెల్గుచుండి తన చెల్వము దప్పకమున్న మున్నుగాఁ**
**బావనచిత్తుఁడై యఘముఁ బాయుతెఱం గొనరింపఁగాఁ దగున్. 44**

**ప్రతి :** కావునన్= అందువలన; కాలకింకర= యమభటుల; వికారమున్= వికృత రూపమును; కానకమున్న= చూడకముందే; మృత్యు= చావుయొక్క; దుర్భావన= చెడుతలంపు; చిత్తమున్= మనస్సును; వెడఁగుపాటునున్= తత్తరపాటును; చెందకమున్న= పొందకముందే; మేనిలోన్= శరీరంలో; జీవము= ప్రాణం; వెల్గుచుండి= ప్రకాశిస్తుండి; తన= జీవునియొక్క; చెల్వమున్= సొగసు; తప్పకమున్న= తగ్గకముందే; మున్నుగాన్= (వీటన్నిటికన్నా) ముందే; పావన= నిర్మలమైన; చిత్తుఁడు+ఐ= మనసు కలిగినవాడై; అఘమున్= పాపాన్ని; పాయుతెఱంగు= పోగొట్టుకునే విధానం; ఒనరింపన్+కాన్= చేసుకోవడానికి; తగున్= ఒప్పును.

**తా :** కాబట్టి జీవుడు యమభటుల దర్శనం కాకముందే, చావునుగురించి మనసు కలతపడక ముందే, శరీరంలో ప్రాణం చైతన్యవంతమై ఉండి, బలం తగ్గకముందే, చేసినపాపాలను నిష్కల్మషమైన మనసుతో పోగొట్టుకోవడానికి ప్రయత్నించడం మంచిది.

**క. కాలం బెడగని పాపము మూలముఁ జెఱుపంగవలయు మును రోగములన్**
**దేలిన దోషము నెఱుఁగుచు వాలాయము దాని నడఁచు వైద్యునిభంగిన్. 45**

**ప్రతి :** రోగములన్= వ్యాధులకు; తేలిన= పొడచూపిన; దోషమున్= చెడును; ఎఱుఁగుచున్= దాన్ని తెలుసుకొంటూ; వాలాయము= నిరంతరం; దానిన్= ఆ వ్యాధిని; అడఁచు= తగ్గించు; వైద్యునిభంగిన్= చికిత్సకుని మాదిరిగా; మును= ముందుగానే; పాపము= పాపం యొక్క; మూలమున్= కారణాన్ని (తెలుసుకొని); కాలంబు+ఎడగని= కాలం మించిపోకుండా; చెఱుపంగవలయున్= నశింపజేసుకోవాలి.

**తా :** రోగకారణాన్ని తెలుసుకొని వైద్యుడు ఔషధమిచ్చి రోగాన్ని నివారించే విధంగా, మానవుడు తాను చేసే పాపాల మూలకారణాన్ని తెలుసుకొని కాలం మించిపోకుండా వాటికి నివారణోపాయాలు గుర్తించి పోగొట్టుకోవాలి.

**సీ. అనవుడు నాతని కనియె భూకాంతుండు కనుకలి వినుకలి గలిగినట్టి**
**పాపము దనకు నొప్పనిదని కని చాలఁ బరితప్తుఁ డయ్యుఁ గ్రమ్మఱ నొనర్చు**
**మూఢాత్మునకు దోషమోచనం బెయ్యది యారయ నెఱిఁగింపు మదియుఁగాక**
**కలుష మొక్కొకచోటఁ గావించు నొకచోటఁ గావింపకుండుఁ దత్కర్మమెఱిఁగి**

**ఆ.వె. యిట్టి జనుఁడు పుణ్య మే రీతిఁ జేసిన, నది ఫలింపనేర దని తలంతు**
**సలిలమందు మేలి మలినంబు వోవంగ గజము గ్రుంకువెట్టుగతియుఁబోలె. 46**

**ప్రతి :** అనవుడున్= అని శుకుడు పలుకగా; ఆతనికిన్= అతనితో; భూకాంతుండు= భూపతి (పరీక్షిత్తు); కనుకలి వినుకలి= కనులతో చూచి, చెవులతో విని; కలిగిన+అట్టి= తెలుసుకున్నట్టి; పాపమున్= పాపకార్యం; తనకున్= తన జీవితానికి; ఒప్పనిది+అని= కుదరనిదని; కని= తెలుసుకొని (గ్రహించి); చాలన్= అమితంగా; పరితప్తుండు+అయ్యున్= పరితాపంచెంది కూడా; క్రమ్మఱన్= తిరిగి; ఒనర్చు= అదే పాపాన్ని చేసే; మూఢ+ఆత్మునకున్= అవివేకికి; దోషమోచనంబు= పాపపరిహారం; ఏ+అది= ఏ విధంగా ఉంటుంది; ఆరయన్= అర్థమయ్యే విధంగా; ఎఱిఁగింపుము= తెలియజేయి; అదియున్+కాక= అంత మాత్రమేకాక; కలుషము= పాపము; తత్+కర్మము+ఎఱిఁగి= ఆ కర్మను తెలుసుకొని; ఒకచోటన్= ఒక్కొక్క సందర్భంలో; కావించున్= చేస్తాడు; ఒకచోటన్= మరొక సందర్భంలో; కావింపక+ఉండున్= చేయడు; ఇట్టి= ఇటువంటి; జనుఁడు= మానవుడు; పుణ్యము= పుణ్యకర్మ; ఏ రీతిన్= ఏ విధంగా; చేసినన్= ఆచరించినా కూడా; అది= ఆ పుణ్యకర్మ; సలిలమందున్= నీటిలో; మేలి= చిక్కనైన; మలినంబు= బురద; పోవంగన్= పోయేవిధంగా; గజము= ఏనుగు; క్రుంకు+పెట్టు= మునిగిన; గతియున్+పోలెన్= స్థితి మాదిరిగా; ఫలింపన్+నేరదు= ఫలించదని; తలంతున్= భావిస్తాను; అనియెన్= అన్నాడు.

**తా :** అని పలికిన శుక మహర్షితో పరీక్షిత్తు, “ఓ స్వామీ! మానవుడు ఎటువంటి పాపాలను చూస్తాడో, వింటాడో వాటిని చేయకూడదని అనుకుంటూనే, పరితాపం పొందికూడా తిరిగి అవే పాపాలను చేస్తాడు. అటువంటి వాడికి పాప పరిహారం ఉంటుందా? జీవుడు సందర్భాన్ని అనుసరించి ఒకసారి పాపం చేయడం, మరొకసారి మానివేయడం చేస్తాడు. ఇటువంటి బురదతో నిండిన ఏనుగు నీళ్ళలో మునిగినా ఆ బురద ఏ విధంగా వదలదో అదే విధంగా చంచలమైన మనసు కలిగిన మానవుడు చేసిన పుణ్యాలు సత్ఫలితాన్ని ఇవ్వవని భావిస్తాను. ఈ విషయాలను గురించి సమగ్రంగా తెలియజేయవలసింది.

**వ. అనిన శుకుం డిట్లనియె. 47**

**ప్రతి :** అనినన్= పరీక్షిన్మహారాజు అనగా; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకమహర్షి ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా పలికిన మహారాజుతో శుకమహర్షి ఇలా చెప్పాడు.

**క. కర్మము కర్మముచేతను నిర్మూలము గాదు తెలియనేరక తా నే**
**కర్మము సేసినఁ ద త్ప్రతికర్మం బొనరింపవలయుఁ గలుషవిదూరా! 48**

**ప్రతి :** కలుష విదూరా= ఓ పుణ్యాత్ముడా!; కర్మము= ఒక కర్మ; కర్మము చేతను= మరొక కర్మచే; నిర్మూలనము= నాశనం; కాదు= అవదు; తెలియనేరక= తెలుసుకోలేక; తాను+ఏకర్మమున్= మానవుడు ఎటువంటి పాపపు పనిని; చేసినన్= ఆచరించినా కూడా; తత్+ప్రతికర్మంబు= దానికి తగిన పరిహార క్రియను; ఒనరింపవలయున్= చేయవలసి ఉంటుంది.

**తా :** ఓ రాజా! ఒక పని వలన కలిగిన ఫలితం మరొక పని వలన తొలగదు. మానవుడు తెలిసిగాని, తెలియకగాని ఏ చెడు కార్యం చేసినా దానిని పరిహరించుకోవడంకోసం ఒక సత్కర్మ చేయాలి.

**క. హితము గల కుడుపు మఱి రుగ్వితతులఁ బొడమంగనీని విధమున నతి స**
**ద్వ్రతుఁడైనవాఁడు నిర్మలమతిచే నఘరాశినెల్ల మట్టము సేయున్. 49**

**ప్రతి :** హితము+కల= శరీరానికి మేలుచేసే; కుడుపు= ఆహారంవల్ల; రుక్+వితతులన్= వ్యాధుల సమూహాన్ని; పొడమన్+కన్+ఈని విధమునన్= కలుగకుండా చేసే విధంగా; అతి= మిక్కిలి; సత్+వ్రతుఁడు+ఐనవాఁడు= సత్కార్యాచరణ

యందు నిష్ఠ కలవాడు; నిర్మలమతిచేన్= స్వచ్ఛమైన మనస్సుతో; అఘరాశిన్+ఎల్లన్= పాపపురాశినంతటిని; మట్టము= నాశనం; చేయున్= చేసుకొంటాడు.

**తా :** ఆరోగ్యకరమైన ఆహారం తిన్న కారణంగా మనిషి తన వ్యాధుల్ని ఎలా పోగొట్టుకుంటాడో, అదే విధంగా సత్కర్మలు ఆచరించేవాడు తన నిర్మలమైన మనసుతో తన పాపపురాశి నంతటినీ నశింప జేసుకుంటాడు.

**చ. తపమున బ్రహ్మచర్యమున దానములన్ శమసద్దమంబులన్**
**జపముల సత్యశౌచముల సన్నియమాదియమంబులన్ గృపా**
**నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తనువాక్యజంపుఁ బా**
**పపు గుదిఁ ద్రుంతు రగ్ని శతపర్వవనంబుల నేర్చుకైవడిన్. 50**

**ప్రతి :** కృపానిపుణులు= కరుణను చూపించడంలో నైపుణ్యం కలవారు; ధర్మవర్తనులు= ధర్మబద్ధంగా జీవించేవారు; తపమునన్= తపస్సుతో; బ్రహ్మచర్యమునన్= బ్రహ్మచర్య దీక్షతో; దానములన్= దానశీలతతో; శమ= అంతరింద్రియ నిగ్రహంతో; సత్+దమంబులన్= మంచి బాహ్యేంద్రియ నిగ్రహాలతో; జపములన్= నామ స్మరణలతో; సత్య= నిజం పలుకుతూ; శౌచములన్= నిర్మలత్వంతో; సత్+నియమ+ఆదియమంబులన్= చక్కని నియమాలు మొదలు సత్ప్రవర్తన విధానాలచే; హృత్+తను+వాక్యజము= ఆ మనసు, శరీరం, మాటల (త్రికరణాల) వలన; పాపము+గుదిన్= పాపాలగుత్తిని; అగ్ని= అగ్నిశిఖ; శతపర్వ= అనేక కణుపులు గల (వెదురు); వనంబులన్= అడవులను; ఏర్చు కైవడిన్= కాల్చి బూడిద చేసే విధంగా; త్రుంతురు(త్రుంచుదురు)= నశింపచేస్తారు; నిక్కము= ఇది నిజం.

**తా :** తపస్సు, బ్రహ్మచర్యదీక్ష, దానశీలత, ఇంద్రియనిగ్రహం, నామస్మరణం, సత్యవాక్యపాలన వంటి నియమాలతో పవిత్రజీవనం సాగిస్తున్న ధర్మవర్తనులైన దయాసముద్రులు మనోవాక్కాయకర్మల చేత ఏర్పడిన పాపాలగుదిని, అగ్ని వెదురు పొదలను భస్మం చేసినట్లుగా దహించివేస్తారు.

**విశే :** సత్పురుషునికి ఉండవలసిన లక్షణాలన్నీ ఈ పద్యంలో చెప్పబడ్డాయి. అవి –

తపం = అనగా మనస్సును, ఇంద్రియాలను ఏకాగ్రతతో ఉంచడం.

బ్రహ్మచర్యం= స్త్రీలను గురించి ఆలోచించడం, వారిని పొగడడం, వారితో సల్లాపం, కామబుద్ధితో చూడటం, మర్మంగా మాట్లాడటం, స్త్రీలతో పొందుగురించి తపించడం, వారి మీద ధ్యాసతో పనులు చేయకపోవడం మొదలైన వీటన్నిటికీ దూరంగా ఉండటమే బ్రహ్మచర్యం.

దానం = తన సర్వస్వాన్ని ఇతరుల హితం కోసం నిస్వార్థంగా త్యాగం చేయడం.
శమం = మనసు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే అంతరీంద్రియాలను నియంత్రించడం.
దమం = కన్ను, ముక్కు, చెవి, నోరు, చర్మం అనే బాహ్యేంద్రియాలను నిగ్రహించడం.
జపం = పరమాత్మను గురించి నిరంతర ధ్యానం.
సత్యం = ధర్మాన్ని, ధర్మసూక్ష్మాన్ని అనుసరించి యథార్థంగా మాట్లాడటం.
శౌచం = బాహ్యేంద్రియాలను దోషరహితంగా ఉంచడం.
నియమం = జప తపాదులు పాటించడం.
యమం = అహింస, పరుషంగా మాట్లాడకపోవడం వంటివి.

**వ. అదియునుంగాక. 51**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేగాక...

**తా :** అంతమాత్రమేగాక

**ఉ. కొందఱు పుణ్యవర్తనులు గోపకుమారపదారవిందజా**
**నందమరందపానకలనారతషట్పదచిత్తు లౌచు గో**
**విందపరాయణుల్ విమలవేషులు దోష మడంతు రాత్మలం**
**జెందిన భక్తిచేత రవి చేకొని మంచు నడంచు కైవడిన్. 52**

**ప్రతి :** కొందఱు= మరి కొంతమంది; పుణ్యవర్తనులు= పుణ్యప్రవృత్తి కలవారు; గోపకుమార= నందగోపుని కుమారుడైన శ్రీకృష్ణుని యొక్క; పద+అరవిందజ+ఆనందమరందపాన= పాదపద్మాలనుండి పుట్టిన ఆనందమనే తేనెను తాగుటయందు; కలనారత= ఆసక్తులై; షట్పద= (ఆరు పాదాలు కలిగిన) తుమ్మెదలవంటి; చిత్తులు+ఔచున్= మనసు కలిగిన వారవుతూ; గోవింద= విష్ణుమూర్తియందే; పరాయణులు= ఏకాంతభక్తి కల్గినవారు; విమల= స్వచ్ఛమైన; వేషులు= వస్త్రధారణాదులు కలవాళ్లు; ఆత్మలన్= వారిమనసులలో; చెందిన= స్థిరంగా ఉన్న; భక్తిచేతన్= భక్తిభావంచేత; రవి= సూర్యభగవానుడు; చేకొని= గ్రహించి; మంచున్= మంచును; అడంచు కైవడిన్= = పోగొట్టే విధంగా; దోషమున్= పాపాన్ని; అడంతురు (అడంచుదురు)= నశింప చేస్తారు.

**తా :** మరికొంతమంది శ్రీకృష్ణుని పాదాలు అనే పద్మాలయందలి తేనెను తాగే తుమ్మెద వంటి మనసు నిర్మల వేషధారులై, గోవిందుని భక్తులై, కలిగినవారై, ఆ భక్తి కారణంగా, సూర్యుడు మంచును కరిగించిన విధంగా తమశక్తిచేత పాపాలను సంపూర్ణంగా అంతం చేసుకుంటారు.

**క. మరి భక్తిచేతఁ గొందఱు బరిమార్తురు మొదలు ముట్టఁ బాపంబుల ని**
**ష్ఠురతరకరముల సూర్యుం డరుదుగఁ బెనుమంచుఁ బించ మణఁచినభంగిన్. 53**

**ప్రతి :** మరి= ఇంకను; కొందఱు= కొంతమంది; భక్తిచేతన్= వారి భక్తి ప్రభావంతో; నిష్ఠురతర= అత్యంత ప్రచండమైన; కరములన్= కిరణాలచే; సూర్యుండు= సూర్యభగవానుడు; అరుదుగన్= అబ్బురంగా; పెనుమంచున్= దట్టమైన మంచుయొక్క; పించము+అణఁచిన= గర్వాన్ని పోగొట్టిన; భంగిన్= విధంగా; పాపంబులన్= వారి పాపాలనన్నింటిని; మొదలుముట్టన్= సంపూర్ణంగా; పరిమార్తురు= నశింపజేస్తారు.

**తా :** సూర్యుడు తన తీక్షమైన కిరణాలచే దట్టమైన మంచును తొలగించినట్లుగా, ఇంకా కొందరు తమ భక్తి ప్రభావంచేత వారి పాపాలనుకూడ సంపూర్ణంగా నశింపజేసుకుంటారు.

**క. దంతిపురనాథ! విను మొకమంతన మెఱిఁగింతు శమదమంబులు నంహో**
**వంతు శుభవంతుఁ జేయవు కంతునిగురుభక్తి ముక్తిఁ గలిగించుగతిన్. 54**

**ప్రతి :** దంతిపుర= హస్తినాపురానికి; నాథ= ప్రభువైనవాడా! (ఓ పరీక్షిన్మహారాజా); ఒక మంతనము= ఒక రహస్యాన్ని; ఎఱిఁగింతున్= తెలియజేస్తాను; వినుము= ఆలకించు; కంతుని= మన్మథునియొక్క; గురు= తండ్రి అయిన శ్రీకృష్ణుని మీద;

భక్తి= భక్తిభావం; ముక్తిన్= మోక్షాన్ని; కలిగించుగతిన్= అందించే విధంగా; శమ= అంతరింద్రియనిగ్రహం; దమంబులున్= బాహ్యేంద్రియ నిగ్రహాలు; అంహోవంతున్= పాపాత్ముణ్ణి; శుభవంతున్= పుణ్యాత్ముడిగా; చేయవు= చేయలేవు.

**తా :** హస్తినాపురాధినాథుడవైన పరీక్షిన్మహారాజా! ఒక రహస్యం చెబుతాను విను. శ్రీహరిభక్తి పాపాత్ముడి పాపాలను పటాపంచలు చేసి అతడికి మోక్షాన్ని ప్రసాదిస్తుంది. శమదమాది సద్గుణాలు కూడ హరి భక్తివలె పాపాత్ముణ్ణి పుణ్యాత్మునిగా మార్చలేవు.

**సీ. హరికి నర్థముఁ బ్రాణ మర్పితంబుగ నుండువాని కైవల్య మెవ్వనికి లేదు**
**వనజలోచనుభక్తవరుల సేవించినవాని కైవల్య మెవ్వనికి లేదు**
**వైకుంఠ నిర్మలవ్రతపరుం డై నట్టివాని కైవల్య మెవ్వనికి లేదు**
**సరసిజోదరుకథాశ్రవణలోలుండైనవాని కైవల్య మెవ్వనికి లేదు**

**తే. లేదు తపముల బ్రహ్మచర్యాది నిరతి, శమదమాదుల సత్యశౌచముల దాన**
**ధర్మసుఖముల సుస్థిరస్థానమైన, వైష్ణవజ్ఞానజనితనిర్వాణపదము. 55**

**ప్రతి :** హరికిన్= శ్రీవిష్ణుమూర్తికి; అర్థమున్= సంపద; ప్రాణము= తన ప్రాణశక్తి; అర్పితంబు+కన్= సమర్పణంచేసి; ఉండువానిన్= ఉండే వాని యొక్క; కైవల్యము= మోక్షసిద్ధి; ఎవ్వనికిన్= ఇతరుడైన ఎవడికీ; లేదు= లభించదు; వనజలోచను= పద్మాలవంటి కన్నులు గల విష్ణువుయొక్క; భక్తవరులన్= పరమభక్తులను; సేవించినవాని= ఆశ్రయించినవాని; కైవల్యము= మోక్షసిద్ధి; ఎవ్వనికిన్= ఇతరునికి; లేదు= లభించదు, వైకుంఠ= విష్ణువుయొక్క; నిర్మల= స్వచ్ఛమైన; వ్రతపరుండు+అయినట్టి వాని= భక్తియే నియమంగాకలవాని; కైవల్యము= మోక్షసిద్ధి; ఎవ్వనికిన్= ఇతరుడికి; లేదు= లభించదు; సరసిజ+ఉదరు= పద్మనాభునియొక్క; కథా= కథలను; శ్రవణ= వినుటయందు; లోలుండు+ఐనవాని= ఆసక్తిగలవాని; కైవల్యము= మోక్షసిద్ధి; ఎవ్వనికిన్= ఇతరుడికి; లేదు= లభించదు; తపములన్= తపస్సులవలన; బ్రహ్మచర్య+ఆది= బ్రహ్మచర్యం మొదలైన నాలుగు ఆశ్రమాలయొక్క; నిరతి= ఆసక్తివల్ల; శమదమ+ఆదుల= అంతరింద్రియ, బాహ్యేంద్రియ నిగ్రహం మున్నగువాటి వల్ల; సత్యశౌచముల= సత్యపాలన, శుచిత్వాలవలన; దాన ధర్మ సుఖములన్= దానంచేత, ధర్మంచేత కలిగే ఇహలోక సుఖాలవలన; సుస్థిర= శాశ్వతమైన; స్థానము+ఐన= స్థానం (చోటు) అయినట్టి; వైష్ణవ= విష్ణుసంబంధమైన; జ్ఞాన= తెలివి వలన; జనిత= కలిగిన; నిర్వాణపదము= మోక్షస్థానం; లేదు= లభించదు.

**తా :** విష్ణుభక్తి పరిపూరితులైన వారికీ; ధన, మాన, ప్రాణాలను స్వామికి అర్పించినవారికీ; శ్రీహరిసేవాపరాయణులైన వారికీ; విష్ణుకథాశ్రవణమందు అత్యంతఆసక్తి కలగినవారికీ; లభించే శాశ్వతమైన ఆనందంతో కూడిన కైవల్యం; తపస్సులు, బ్రహ్మచర్యం, శమ దమాది నియమాలు, సత్యపాలనాదులవలన, శుచిత్వంవలన, దానధర్మాలవలన లభించదు.

**విశే :** హరిభక్తి ఎంత గొప్పదో చెప్పటానికే ఇదంతా. తపస్సు, బ్రహ్మచర్యం, శమదమాదులు కొరగానివని భావించరాదు. అవన్నీ భక్తితో కూడి ఉన్నప్పుడే సత్ఫలితాన్నిస్తాయని శుకమహర్షి ప్రబోధంలోని సారాంశంగా గుర్తించాలి. ఈ భావానికి వివరణే తరువాతి పద్యాలలో కనిపిస్తుంది.

**తే. అరయ నెన్నఁడుఁ జేటు లేనట్టి ముక్తివర్త్మ మీ లోకమందు నెవ్వనికిఁ గలదు?**
**సాధులును బుణ్యశీలురు సజ్జనులును హరిపరాయణతత్పరు లగుటఁ గాక. 56**

**ప్రతి :** సాధులును= సాత్త్విక జీవనం కలవారును; పుణ్యశీలురు= పుణ్యస్వభావులూ; సజ్జనులును= మంచి నడవడిక కలవారూ; హరిపరాయణ= హరిభక్తియందు; తత్పరులు= నిష్ఠ కలవారిరూ; అగుటన్+కాక= అగుటచే తప్ప; అరయన్= పరిశీలించగా; ఎన్నఁడున్= ఎప్పటికినీ; చేటు లేనట్టి= నశింపని (శాశ్వతమైన); ముక్తి వర్త్మము= మోక్షమార్గం; ఈ లోకము+అందున్= ఈ లోకంలో; ఎవ్వనికిన్= మరెవ్వరికి కలదు?= ఉంది? (ఉండదు).

**తా :** సాధు జీవనం కలిగి, పుణ్యస్వభావులై చరిస్తూ, సత్పరాయణులై, విష్ణుభక్తి తత్పరులైన వారికి తప్ప ఇతరులకు శాశ్వతమైన విష్ణులోకం ప్రాప్తించదు.

**క. అరుదుగ నరహరిభక్తిం బొరయని యా పురుషసుకృతిపుంజంబులు వే**
**మఱు పుణ్యుఁ జేయనేరవు నరవర! మధుఘటముఁ బెక్కునదులుంబోలెన్. 57**

**ప్రతి :** నరవర= ఓ మహారాజా!; మధుఘటమున్= కల్లుకుండను; పెక్కునదులున్ పోలెన్= అనేక నదుల వలె (దాని దుర్వాసన పోగొట్టలేని విధంగా); అరుదుగ= ఎంతచేసినా; నరహరి= నరసింహుని (విష్ణువు) యొక్క; భక్తిన్= భక్తిని; పొరయని= పొందలేని; ఆ పురుష= అటువంటి మానవుని యొక్క; సుకృతి పుంజంబులు= పుణ్య సమూహాలు; వేమఱున్= ఎన్నిసార్లు ఆచరించినా (ఎంతటివైనా); పుణ్యున్= పవిత్రునిగా; చేయనేరవు= చేయలేవు.

**తా :** మానవులు సహజంగా పాపపుణ్యాలు చేస్తుంటారు. కల్లుకుండను ఎన్నినదులలో ముంచినా దాన్ని పవిత్రం చేయలేనట్లు హరిభక్తిని ఆచరించకుండా ఎన్ని పుణ్యసమూహాలైనా నరుణ్ణి పవిత్రుణ్ణి చేయలేవు.

**చ. సతతముఁ గృష్ణపాదజలజంబులయందు మనంబు నిల్పు సు**
**వ్రతులు తదీయశుద్ధగుణరాగులు కాలునియుగ్రపాశ సం**
**హతుల ధరించు తత్సుభటకౌఘములంగలలోనఁ గాన రే**
**గతులను దుష్టకర్మములు గైకొని వారలఁ జెందనేర్చునే? 58**

**ప్రతి :** సతతమున్= ఎల్లప్పుడు; కృష్ణపాద= శ్రీకృష్ణుని పాదాలనే; జలజంబుల+అందున్= పద్మాలయందు; మనంబున్= మనస్సును; నిల్పు= లగ్నంచేసే; సువ్రతులు= మంచి నిష్ఠగలవారు; తదీయ= ఆ విష్ణువు యొక్క; శుద్ధగుణ= శ్రేష్ఠమైన గుణములయందు; రాగులు= ఆసక్తి కలవారు; కాలుని= యమునియొక్క; ఉగ్రపాశ= భయంకరమైన పాశాలయొక్క; సంహతులన్= సమూహాలను; ధరించు= తాల్చినట్టి; తత్+సుభటక+ఓఘములన్= ఆ యముని కింకర సమూహాన్ని; కలలోనన్= కలలోఅయినా; కానరు= చూడరు; ఏ గతులను= ఏ విధంగానైనా; దుష్టకర్మములు= పాపకర్మలు; కైకొని= చేకొని; వారలన్= అట్టి భక్తులను; చెందనేర్చునే= సమీపించగలవా (సమీపించవు).

**తా :** ఓ మహారాజా! నిత్యం విష్ణుపాదపద్మాలను ధ్యానిస్తూ, విష్ణుగుణకీర్తనయందు ఆసక్తి కలిగి ఉండేవారు యముణ్ణిగాని, యమపాశాలు ధరించిన యమభటులనుగాని కలలో కూడా చూడరు. అట్టివారు తెలియక చేసిన పాపాలు ఏవైనా ఉన్నా అవి వారిని సమీపించలేవు.

**వ. కావున నీ యర్థంబునకుం బురాతనంబగు నొక్క యితిహాసంబు గలదు. అది విష్ణుదూత యమదూతల సంవాదం బనంబడు, దాని నెఱింగింతు, ఆకర్ణింపుము. 59**

**ప్రతి :** కావునన్= కనుక; ఈ అర్థంబునకున్= ఈ భక్తి విశేషం తెలియజేయడానికి; పురాతనంబు+అగు= ప్రాచీనమైన; ఒక్క ఇతిహాసంబు= ఒక పూర్వగాథ; కలదు= (ప్రాచుర్యంలో) ఉంది; అది= ఆ కథ; విష్ణుదూత= విష్ణుసేవకుల; యమదూతల= యమకింకరుల; సంవాదం= సంభాషణ; అనన్+పడున్= అనబడుతుంది; దానిన్= ఆ కథను; ఎఱింగింతున్(ఎఱిగించుదును)= తెలియజేస్తాను; ఆకర్ణింపుము= (శ్రద్ధగా) విను.

**తా :** ఈ భక్తివిశేషాన్ని వివరించే ఒక ప్రాచీనమైన కథ ప్రాచుర్యంలో ఉంది. దాన్ని విష్ణుసేవకుల యమకింకరుల సంవాదం అంటారు. ఆ కథ నీకు చెపుతాను శ్రద్ధగా విను.

## ❖ అజామిళోపాఖ్యానము ❖

**సీ. నరనాథ! వినుము కన్యాకుబ్జపురమునఁ గలఁడు బ్రాహ్మణుఁడజామిళుఁ డనంగ**
**బాతకుం డతులనిర్భాగ్యుం డవజ్ఞుండు నష్టసదాచారి కష్టరతుఁడు**
**జూదంబులందు దుర్వాదంబులందును జౌర్యంబునందు మచ్చరము గలిగి**
**తొత్తును బత్నిగా మత్తుఁడై వరియించి కొడుకులఁ బదుగురం బడసి చాల**

**ఆ. మోహజలధిలోన మునిఁగి ముచ్చట దీర, బాల లాలనాదిలీలఁ దగిలి**
**పెద్దకాల మతఁడు పెంపార సుఖియించి, బలిత మెల్లఁదొలఁగి పలితుఁ డయ్యె. 60**

**ప్రతి :** నరనాథ= ఓ నరపతీ!; వినుము= ఆలకించు; కన్యాకుబ్జపురమునన్= కన్యాకుబ్జమనే పేరు గల నగరంలో; అజామిళుఁడు+అనన్+కన్= అజామిళుడు అనే పేరుగల; బ్రాహ్మణుఁడు= బ్రాహ్మణ వంశంలో పుట్టినవాడు; కలఁడు= (ఒకడు) ఉన్నాడు; (అతడు); పాతకుండు= అనేక పాపాలు చేసినవాడు; అతుల= సాటిలేని; నిర్భాగ్యుండు= భాగ్యం లేనివాడు, పరమ దరిద్రుడు; అవజ్ఞుండు= మంచిని తిరస్కరించేవాడు; నష్ట+సత్+ఆచారి= మంచి ఆచారాలను వదిలినవాడు; కష్టరతుఁడు= చెడ్డపనులయందు ఆసక్తి కలవాడు; జూదంబుల+అందున్= పాచికలు మొదలైన ఆటలయందును; దుర్వాదంబుల+ అందునున్= వితండ వాదాలయందును; చౌర్యంబు+అందున్= దొంగతనం చేయడంలో; మచ్చరము కలిగి= ఈర్ష్యతో కూడిన; తొత్తును= తన దగ్గరి సేవకురాలిని; పత్నిగా= భార్యగా; మత్తుఁడు+ఐ= మదించినవాడై; వరియించి= పెళ్ళి చేసుకొని; కొడుకులన్= కొడుకులను; పదుగురన్= పదిమందిని; పడసి= పొంది (వారిమీద); చాలన్= ఎక్కువగా; మోహజలధిలోనన్= వ్యామోహమనే సముద్రంలో; మునిఁగి= తలమునకలై; ముచ్చట+తీరన్= తనివి తీరేలా; బాల= పిల్లల యొక్క; లాలన+ఆది= లాలించుట మొదలైన; లీలన్= విలాసంలో; తగిలి= ఆసక్తుడై; పెద్దకాలము= చాలాకాలం; అతఁడు= ఆ అజామిళుడు; పెంపు+ఆరన్= ఇష్టపూర్వకంగా; సుఖియించి= సంసారసుఖాలు అనుభవించి; బలితము+ఎల్లన్= జవసత్త్వాలు అన్నీ, (బలమంతా); తొలఁగి= నశించి; పలితుడు+అయ్యెన్= (ముసలివాడు) వెంట్రుకలు నెరసినవాడు అయ్యాడు. (ఇక్కడ పలితుడు పదానికి, పతితుడు అని పాఠాంతరం ఉంది.)

**తా :** మహారాజా! పూర్వం కన్యాకుబ్జమనే పట్టణంలో అజామిళుడు అనే ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు మహాపాపాత్ముడు, పరమదరిద్రుడు, నింద్యచరిత్రుడు, మంచిని తిరస్కరించేవాడు. దురాచారపరుడు, నికృష్ట జీవనుడు. జూదాలన్నా, వివాదాలన్నా ఆదరం మెండు. దొంగతనానికి పెట్టింది పేరు. అతడు యౌవనపు మత్తులో ఒక దాసిని భార్యగా చేసుకొన్నాడు. ఆమెయందు పదిమంది కొడుకులను కన్నాడు. ఆతడు ఆ వ్యామోహసముద్రంలో మునిగిపోయాడు.

ఆ పిల్లల ఆలన పాలనలో, ముద్దుముచ్చట్లలో చాలాకాలం గడిపాడు. సంసారలంపటుడై ఆనందంతో మైమరచాడు. ఆ మురిపాలన్నీ ముగిసి ముసలివాడైనాడు.

**సీ. నిర్మలం బనఁజాల నెఱయు చిత్తంబన నల్లని వెండ్రుకల్ తెల్లనయ్యెఁ**
**దగు మోహపాశబంధంబు జాఱినమాడ్కిఁ బొదలిన యంగంబు వదల వ్రాలె**
**నింద్రియంబుల కోర్కు లిఁక నొల్ల ననుభంగి నుడుగక తల చాల వడఁకఁజొచ్చెఁ**
**దమకంబు ప్రాయంబు దగిలి పోయినమాడ్కి లోచనంబుల చూడ్కి నీచమయ్యె**

**తే. వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు, నుక్కిసయును దగ్గుఁ బిక్కటిల్లె**
**శిరసు నొవ్వఁదొడఁగెఁ జెదరె మనంబంతఁ, గడిఁదియైన ముప్పుకాలమునను. 61**

**ప్రతి :** నిర్మలంబు+అనన్= పవిత్రమైనదన్నట్లుగా; చాలన్+నెఱయు= ఎక్కువగా వ్యాపించిన; చిత్తంబు+అనన్= మనసు అన్నట్లుగా; నల్లని వెండ్రుకల్= నల్లనైన తల వెండ్రుకలు; తెల్లన+అయ్యెన్= తెల్లబడి పోయాయి; తగు= దానికితోడు; మోహపాశ= మోహమనే త్రాటి యొక్క; బంధంబు= ముడి; జాఱినమాడ్కిన్= వదులైనట్లుగా; పొదలిన= పెరిగిన; అంగంబు= శరీరం; వదలవ్రాలెన్= పట్టు తప్పింది; ఇంద్రియంబుల= జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాల యొక్క; కోర్కులు= విషయ వాంఛలును; ఇఁక+ఒల్లన్+అనుభంగిన్= ఇక వద్దన్నట్లుగా; ఉడుగక= మానకుండా; తల= శిరస్సు; చాలన్= ఎక్కువగా; వడఁకన్+చొచ్చెన్= వణకసాగింది; తమకంబు= తగులం (తీవ్రమైన కోరిక); ప్రాయంబున్= యౌవనం; తగిలి= అంటుకుని; పోయినమాడ్కిన్= పోయిన విధంగా; లోచనంబుల= కన్నులయొక్క; చూడ్కి= చూపు; నీచము+అయ్యెన్= బలహీనపడింది; వగరుపుట్టెన్= ఒగర్పు/అరుచి కలిగింది; అంతన్= అదే సమయంలో; దంతంబులున్= పన్నులు; పెగలెన్= ఊడిపోయినవి; ఉక్కిసయును= ఆయాసమూ; దగ్గున్= దగ్గు; పిక్కటిల్లెన్= ఎక్కువయ్యాయి; శిరసు= తల; నొవ్వన్+తొడఁగెన్= బాధ పెట్టసాగింది; కడిఁది+అయిన= బలీయమైన; ముప్పుకాలమునను= ముసలితనంలో; మనంబు+అంతన్= మనసంతా; చెదరెన్= చెదిరిపోయింది.

**తా :** మలినమైన మనస్సు చివరకు స్వచ్ఛతను పొందుతున్నట్లుగా అతని తలవెంట్రుకలు తెల్లబడ్డాయి. భార్యాపిల్లలయందు మమకారం తగ్గినట్లుగా శరీరం బిగువు తగ్గింది. ఇంద్రియాలు తమకు మోహం వద్దన్నట్లుగా తల అడ్డంగా వణకసాగింది. తీవ్రమైన కోరికలు వయసుతోపాటు తగ్గినట్లు కంటిచూపు మందగించింది. నోటికి అరుచి కలిగింది. దంతాలు ఊడిపోయాయి. ఆయాసం, దగ్గు పెరిగాయి. తలనొప్పి హెచ్చింది. ఈ విధంగా అతనికి ముసలితనం నాటికి మనసు కూడా చెదిరిపోయింది.

**తే. ఎనయ నతని కెనుబదెనిమిదివర్షంబు లంత నరుగుటయును భ్రాంతుఁ డగుచుఁ**
**గోరి పిన్నకొడుకు నారాయణాఖ్యుండు బాలుఁ డగుట మిగుల భక్తిఁజేసి. 62**

**ప్రతి :** అంతన్= ఆ తరువాత; ఎనయన్= సరిపోలుతుండగా; అతనికిన్= ఆ అజామిళునికి; ఎనుబది+ఎనిమిది= ఎనభై ఎనిమిది; వర్షంబులు= సంవత్సరాలు; అరుగుటయును= పూర్తికాగా; భ్రాంతుఁడు+అగుచున్= మోహానికి గురి అవుతూ; కోరి= ఇష్టంతో; పిన్నకొడుకు= చిన్న కుమారుడైన; నారాయణ+ఆఖ్యుండు= నారాయణ అనే పేరుగలవాడు; బాలుఁడు+అగుట= చిన్నవాడు కావడం కారణంగా; మిగులన్= మిక్కిలి; భక్తిన్+చేసి= ఇష్టం కలిగి...

**తా :** ఈ విధంగా అతడు ఎనభైఎనిమిది సంవత్సరాలు నిండినవాడైనప్పటికీ మోహభ్రాంతుడై చివరి కొడుకైన నారాయణుడు అనే వాడియందు మిక్కిలి ప్రేమ కలిగి ఉండేవాడు.

**క. తన సతియుఁ దానుఁ గూరిమి మనమునఁ బెనఁగొనఁగ నక్కుమారుని ననిశం**
**బును ముద్దు సేయుచుండెను జనవర! వాత్సల్య మాత్మ సందడిఁ గొనఁగన్. 63**

**ప్రతి :** జనవర= ఓ మహారాజా!; తన సతియున్= తనభార్య; తాను= అతడు; కూరిమి= ప్రేమ; మనమునన్= మనస్సులో; పెనఁగొనన్+కన్= అతిశయించగా; ఆ+కుమారుని= కొడుకైన ఆ నారాయణుణ్ణి; అనిశంబును= ఎల్లప్పుడూ; వాత్సల్యము= ఇష్టం; ఆత్మన్= హృదయంలో; సందడిన్+కొనన్+కన్= తొణికిసలాడుతుండగా; ముద్దు= ముద్దుమురిపాలను; చేయుచున్+ ఉండెను= చేస్తూ ఉండేవారు.

**తా:** ఓ మహారాజా! అజామిళుడు అతని భార్య కలసి చిన్న కొడుకైన నారాయణుణ్ణి మిక్కిలి ప్రేమతో ముద్దుచేసేవారు.

**క. బాలుని ముగ్ధవచోఋజు ఫాలుని నిజజనకబంధుపరిణామకళా**
**శీలుని లోలతఁ గనుఁగొని యాలరి బ్రాహ్మణుఁడు నందితాత్ముం డగుచున్. 64**

**ప్రతి :** బాలునిన్= ఆ చిన్నవాడిని; ముగ్ధ= మనోహరమైన; వచస్= మాటలు; ఋజుఫాలునిన్= తిన్ననైన నుదుటి భాగం కలవానిని; నిజ జనక= తన తండ్రికి; బంధు పరిణామ= ఆత్మబంధువుగా పరిణిింపజేసే; కళాశీలుని= కళతో శోభించేవాడు; ఆలరి= దుశ్శీలుడైన; బ్రాహ్మణుఁడు= బ్రాహ్మణుడు (అజామిళుడు); లోలతన్= అమితమైన ఆసక్తితో; కనున్+కొని= చూస్తూ; నందిత+ఆత్ముండు+ అగుచున్= సంతోషించిన మనసు కలవాడవుతూ...

**తా :** మనోహరమైన, తిన్నని నుదురు కల్గి, తన తండ్రికి ఆత్మబంధుత్వాన్ని పెంచే స్వభావం కలవాడు, అయిన కుమారుణ్ణి (నారాయణుణ్ణి), చూస్తూ ఆ దుశ్శీల బ్రాహ్మణుడైన అజామిళుడు చాలా సంతోషిస్తున్నాడు.

**క. అత్యంతపానభోజనకృత్యంబులఁ బొత్తు గలిగి క్రీడలఁ దత్సాం**
**గత్యంబు వదల కాగతమృత్యువుఁ గననేరఁ డయ్యె మిక్కిలి జడుఁడై. 65**

**ప్రతి :** అతి+అంత= మిక్కిలిగా; పాన= తాగుట; భోజన= ఆహారం తినడం మొదలయిన; కృత్యంబులన్= పనులయందు; పొత్తు+కలిగి= జతకూడి; క్రీడలన్= ఆటపాటలయందు; తత్+సాంగత్యంబు= ఆ బిడ్డతో సహవాసం; వదలక= విడిచిపెట్టక; మిక్కిలిజడుఁడై= పరమమూర్ఖుడై; ఆగత= విచ్చేసిన; మృత్యువున్= మరణాన్ని; కననేరఁడు+అయ్యెన్= ఊహించలేకపోయాడు.

**తా :** ఆ ఆఖరి కుమారుడిపై ప్రేమతో ఆహార, పానీయాదులయందు, ఆటపాటలయందు కూడా అతనితో కాలం వెళ్ళదీస్తూ జడుడైనందువల్ల తనకు ఆసన్నమైన మరణాన్ని గుర్తించలేక పోయాడు.

**తే. తెలియ కీ రీతి నతఁడు వర్తింపుచుండ భయదమగు మృత్యుకాలంబు ప్రాప్తమైన**
**భూరివాత్సల్యవృత్తి నప్పుత్త్రుఁ దలఁచి యాత్మఁ బ్రలపించు నారాయణా యటంచు. 66**

**ప్రతి :** అతఁడు= ఆ అజామిళుడు; తెలియక= అజ్ఞానంతో; ఈ రీతిన్= ఈ విధంగా; వర్తింపుచున్+ఉండన్= కాలం గడుపుతూ ఉండగా; భయదము+అగు= భయంకరమైన; మృత్యుకాలంబు= మరణకాలం; ప్రాప్తము+ఐనన్= ప్రాప్తించగా;

భూరి= అత్యంత; వాత్సల్యవృత్తిన్= ప్రేమభావంతో; ఆ+పుత్రున్= ఆ నారాయణుడనే ఆఖరి కొడుకును; నారాయణా+అట+ అంచున్= అతని పేరుతో నారాయణ అని పిలుస్తూ; ఆత్మన్= తనలో తాను; ప్రలపించున్= పలవరిస్తూ ఉండిపోయాడు.

**తా :** అజామిళుడు ఈ విధంగా అజ్ఞానంతో వ్యామోహంలో ఉంటూనే మృత్యువు ఆసన్నమైన సమయంలో తనకు ప్రియ పుత్రుడైన నారాయణుణ్ణి ఆ పేరుతోనే పిలుస్తూ తనలో తానే ఎక్కువగా తలచుకుంటూ కాలం గడుపుతున్నాడు.

**వ. అప్పుడు. 67**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**తా :** అలా ఉన్న సమయంలో

**క. కింకరుల ధర్మరాజవశంకరుల దురంతదురితసమధికజన నా**
**శంకరుల సకలలోకభయంకరులను గనియె నింద్రియాకులుఁ డగుచున్. 68**

**ప్రతి :** ధర్మరాజ= యమధర్మరాజుయొక్క; వశంకరులన్= ఆధీనంలో ఉండేవారిని; దురంత= తీవ్రమైన; దురిత= పాపాలు; సమధిక= ఎక్కువగా చేసిన; జన= మానవులను; నాశంకరులన్= అంతం చేసేవారిని; సకలలోక= అన్ని లోకాలకు; భయంకరులను= భయం పుట్టించేవారైన; కింకరులను= యమభటులను; ఇంద్రియ+ఆకులుఁడు+అగుచున్= ఇంద్రియాలు పట్టు తప్పుతుండగా; కనియెన్= భయంతో చూశాడు.

**తా :** ఆ సమయంలో ఆ అజామిళుడు పలురకాల పాపాలను చేసే సర్వలోక ప్రజలను క్రూరంగా శిక్షించే అతి భయంకరులైన యమభటులను శరీరం పట్టు తప్పుతుండగా భయభ్రాంతుడై చూశాడు.

**క. ఘాతకుల దండదండిత పాతకుల మహోగ్రకర్మభరనిష్కరుణా**
**జాతకులఁ బ్రేతనాయక దూతకసంతతుల నతఁడు దూరమునందున్. 69**

**ప్రతి :** ఘాతకులన్= పాపులను హింసించేవారిని; దండ= తమ ఆయుధాలచే; దండిత= శిక్షింపబడిన; పాతకులన్= పాపులు కలవారిని; మహా+ఉగ్రకర్మ= తీవ్రమైన పాపపు పనులతో; భర= నిండిన; నిష్కరుణా= నిర్దయనుండి; జాతకులన్= పుట్టినవారిని; ప్రేతనాయక= యముని; దూతక= భటులయొక్క; సంతతులన్= సమూహాలను; అతఁడు= ఆ అజామిళుడు; దూరము+అందున్= దూరంనుండే...

**తా :** పాపాత్ములను దండించడంలో కఠినంగా ప్రవర్తించేవారు, భయంకరరూపం గలవారు, నిర్దయాజాతకులు అయిన యమభటులను ఆ బ్రాహ్మణుడు దూరం నుండే చూశాడు.

**మ. కనియెన్ బ్రాహ్మణుఁ డంత్యకాలమున వీఁకన్ రోషనిష్ఠ్యూతులన్**
**ఘనపీనోష్ఠవికారవక్త్రవిలసద్గర్వేక్షణోపేతులన్**
**జనసంత్రాసకరోద్యతాయతసుపాశశ్రేణికాహేతులన్**
**హననవ్యాప్తివిభీతులన్ మువుర నాత్మానేతలన్ దూతలన్ 70**

**ప్రతి :** బ్రాహ్మణుఁడు= అజామిళుడు; అంత్యకాలమునన్= చనిపోయే చివరి సమయంలో; రోష నిష్ఠ్యూతులన్= రోషాన్ని కక్కేవారిని; ఘనపీన= మిక్కిలి బలిసిన; ఓష్ఠ= పెదవులవలన; వికార= వికృతంగా కనిపించే; వక్త్ర= ముఖములు కలిగి; విలసత్= ప్రకాశిస్తున్న; గర్వ= గర్వంతో కూడిన; ఈక్షణ= చూపులతో; ఉపేతులన్= కూడినవారిని; జన= ప్రజలను; సంత్రాసకర= భయపెట్టేవిధంగా; ఉద్యత్= ఎత్తబడిన; ఆయత= పొడవైన; సుపాశశ్రేణికాహేతులన్= పాశాలను ఆయుధాలను కలవారిని; హనన= చంపుట అనే; వ్యాప్తి= విశేషమైన పనియందు; విభీతులన్= భయంలేని వారిని; ఆత్మ+ఆనేతలన్= తనను తీసుకుపోవడానికి, వచ్చినవారినీ; ముపురన్= ముగ్గురిని; వీఁకన్= దైన్యంతో; కనియెన్= చూశాడు.

**తా :** కోపంతో భయంకరంగా వ్రేలాడుతున్న పెదవులు కలిగిన వికారముఖాలలో తీక్షమైన చూపులు కలిగినవారు, పాపులకు భయం కలిగించే యమపాశాలను, ఆయుధాలను కలిగినవారు, మరణవ్యాప్తితో విశేషంగా భయాన్ని కల్గించేవాళ్లు, తనను తీసుకువెళ్ళడానికి వచ్చిన ముగ్గురు యమదూతలను ఆ బ్రాహ్మణుడు చూచాడు.

**వ. ఇట్లతివికృతతుండగండభాగవిషమవివృత్తనేత్రులు, నతిపుష్టనిష్ఠురతనుయష్టిసంవేష్టిత మహోర్ధ్వరోములు, నభ్యస్తసమస్తజీవాపహరణకరణప్రశస్తహస్తవిన్యస్తపాశధారులు నగు యమభటుల మువ్వురం గనుంగొని యజామిళుండు వికలేంద్రియుండును, వికంపిత ప్రాణుండును వికృతలోచనుండును, విహ్వలాత్మకుండు నై. 71**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అతివికృత= అత్యంత వికారమైన; తుండ= ముఖం (నోరు); గండభాగ= చెక్కిళ్ళు; విషమ= ఎగుడుదిగుడుగా; వివృత్త= తిరిగిన; నేత్రులున్= కన్నులు కలవారిని; అతి= మిక్కిలి; పుష్ట= బలిసిన; నిష్ఠుర= కఠినమైన; తనుయష్టి= కొయ్యవంటి శరీరాన్ని; సంవేష్టిత= నిండుగా అలముకున్న; మహా+ఊర్ధ్వరోములున్= పొడవుగా నిక్కబొడుచుకున్న వెంట్రుకలు కలవారిని; అభ్యస్త= అలవాటుగా; సమస్త= సకల; జీవ+అపహరణ= ప్రాణుల జీవాలను తీసుకుపోవడమనే; కరణ= పనియందు; ప్రశస్త= ప్రసిద్ధమైన; హస్త= చేతులయందు; విన్యస్త= ధరించబడిన; పాశధారులు= యమపాశాలు ధరించినవారిని; అగు= అయిన; యమభటులన్= యమకింకరులను; మువ్వురన్= ముగ్గురిని; కనున్+కొని= చూచి; అజామిళుండు= ఆ అజామిళుడు; వికల+ఇంద్రియుండును= పట్టు తప్పిన ఇంద్రియాలు కలవాడై; వికంపిత= ఎక్కువగా ఊగిసలాడుతున్న; ప్రాణుండును= జీవం కలవాడును; వికృతలోచనుండును= వికారమైన కన్నులు కలవాడును; విహ్వల+ఆత్మకుండును+ఐ= తికమకపడుతున్న మనసు కలవాడును అవుతూ...

**తా :** జీవితం చివరిదశలో ఉన్న అజామిళునికి వికృతముఖాలతో, మిడిగుడ్లతో, వికారమైన చెక్కిళ్లతో, ఒంటినిండా నిక్కబొడుచుకున్న వెంట్రుకలతో, సకల జీవులను పీడించి ప్రాణాలను హరించగల అనువైన యమపాశాలు ధరించిన యమకింకరుల దర్శనంతో అవయవపటుత్వం కోల్పోయి, చలిస్తున్న ప్రాణాలు కలవాడై కదలిక లేనివాడై

**క. దూరమున నాడు బాలుఁడు బోరనఁ దన చిత్తసీమఁ బొడగట్టిన నో**
**నారాయణ! నారాయణ! నారాయణ! యనుచు నాత్మనందను నొడివెన్. 72**

**ప్రతి :** దూరమునన్= తనకు కొద్ది దూరంలో; ఆడు= ఆటలు ఆడుతున్న; బాలుఁడు= తన ఆఖరి కొడుకుని; బోరనన్= హఠాత్తుగా; తన= తనయొక్క; చిత్తసీమన్= మనసునందు; పొడగట్టినన్= గుర్తుకు రాగానే; నారాయణ నారాయణ నారాయణ+ అనుచున్= ముమ్మారు నారాయణ అంటూ; ఆత్మనందనున్= తన కుమారుణ్ణి; నొడివెన్= పిలిచెను.

**తా :** తన చివరి దశలో దూరంగా ఆడుకుంటున్న తనకు అత్యంత ఇష్టుడైన ఆఖరి కుమారుడిని చూడాలనిపించి నారాయణ అని మూడుసార్లు పిలిచాడు.

**చ. మరణపువేళ నద్దనుజమర్దను సంస్మరణంబు సేయఁ ద**
**త్పరిసరవర్తు లాత్మపరిపాలకునామము నాలకించి ని**
**ష్ఠురగతి నేగుదెంచి పొడసూపి యదల్చిరి కాలుదాసులన్**
**ఖరతరభాషలన్ వికటకల్పితవేషుల దీర్ఘరోషులన్. 73**

**ప్రతి :** మరణపువేళన్= చనిపోయే సమయంలో; ఆ+దనుజమర్దను= ఆ రాక్షస సంహారకుడైన మహావిష్ణువు యొక్క; సంస్మరణంబు+చేయన్= నామస్మరణం చేయగా; తత్+పరిసరవర్తులు= ఆ విష్ణువుయొక్క దగ్గరగా ఉండేవారు (విష్ణుదూతలు); ఆత్మపరిపాలకు= ఆత్మపరిపాలకుడైన నారాయణునియొక్క; నామమున్+ఆలకించి= పేరును విని; నిష్ఠురగతిన్= అత్యంత వేగంగా; ఏగుదెంచి= వచ్చి; పొడసూపి= ప్రత్యక్షమై; ఖరతర= మిక్కిలి తీవ్రమైన; భాషలన్= మాటలు కలవారిని; వికట= వికృతంగా; కల్పిత= రూపొందించబడిన; వేషులన్= ఆకారం కలవారును; దీర్ఘరోషులన్= అత్యధిక కోపం కలవారిని అయిన; కాలుదాసులన్= యమకింకరులను; అదల్చిరి= అడ్డగించిరి.

**తా :** ఆ అజామిళుడు తన మరణకాలంలో శ్రీమహావిష్ణువును నారాయణా అని స్మరించాడు. ఆ స్మరణను విన్న విష్ణుదూతలు త్వరితగతితో వచ్చి, పరుషంగా మాట్లాడేవారు, భయంకరరూపాలు కలిగినవారు, అత్యధికకోపంకలవారు అయిన యమకింకరులను అడ్డగించారు.

**విశే :** 'యం యం వాఽ పి స్మరన్ భావం త్యజత్యంతే కలేబరమ్ తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః' (భగవద్గీత, అష్టమ, 6) అనే గీతావాక్యాన్ని అనుసరించి ప్రాణోత్క్రమణ సమయంలో నారాయణ స్మరణం చేసిన మాత్రంచే ఎవరికైనా పాపాలు నశించి విష్ణుదూతల దర్శనమౌతుంది.

**క. దాసీభర్త నజామిళభూసురుఁ దత్తనువువలన బోరన వెలికిం**
**దీసెడు యమభటులను బోఁద్రోసిరి శ్రీవరునికూర్మిదూతలు కడిమిన్. 74**

**ప్రతి :** దాసీభర్త= సేవకురాలికి భర్త అయిన; అజామిళ= అజామిళుడనే; భూసురున్= బ్రాహ్మణునియొక్క జీవుణ్ణి; తత్+తనువు వలనన్= అతని శరీరం నుండి; బోరనన్= వేగంగా; వెలికిన్+తీసెడు= బయటకు లాగుతున్న; యమభటులను= ఆ యమకింకరులను; శ్రీవరుని= లక్ష్మీపతి (విష్ణువు) యొక్క; కూర్మిదూతలు= ఇష్టసేవకులు; కడిమిన్= బలప్రయోగంతో; పోన్+త్రోసిరి= గెంటివేశారు.

**తా :** పతితుడైన అజామిళునిశరీరంనుండి అతనిజీవాన్ని యమకింకరులు తీసుకుపోతుంటే విష్ణుదూతలు వారిని బలంతో గెంటివేశారు.

## ❖ విష్ణుదూత యమదూతల సంవాదము ❖

**వ. ఇట్లు విష్ణుదూతలవలన నిర్ధూతప్రయత్నులై యమదూత లిట్లనిరి. 75**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విష్ణుదూతలవలనన్= విష్ణుదూతలచే; నిర్ధూత= తరిమివేయబడిన; ప్రయత్నులై= ప్రయత్నం కలవారై; యమదూతలు= యమకింకరులు; ఇట్లు+అనిరి= ఇలా పలికారు.

**తా :** విష్ణుసేవకులచే నిరోధింపబడిన యముని బంటులు వారితో ఇలా పలికారు.

**క. ఎవ్వనివారలు? మాతోఁ జివ్వకుఁ గత మేమి? యిట్లు చిక్కినవానిం**
**గ్రొవ్వున విడిపించితి; రిcక నవ్వులకో? జమునిశాసనంబులు జగతిన్. 76**

**ప్రతి :** ఎవ్వనివారలు= మీరు ఎవరికి సంబంధించినవారు; మాతోన్= మాతో; చివ్వకున్= గొడవకు; కతము+ఏమి= కారణమేమిటి?; ఇట్లు= ఈ విధంగా; చిక్కినవానిన్= మా వశమైన ఈ ప్రాణిని; క్రొవ్వనన్= బలగర్వంతో; విడిపించితిరి= విడిపించారు; ఇcక= ఇకమీదట; జముని= యముని; శాసనంబులు= ఆజ్ఞలు; జగతిన్= ఈ లోకంలో; నవ్వులకున్+ఓ= నవ్వులకేనా?

**తా :** ఎవరు మీరు? ఈ విధంగా కర్తవ్య నిర్వహణలో ఉన్న మమ్మల్ని అడ్డగించి మా వశమైన ఈ ప్రాణిని కాపాడుతున్నారు. ఇక ఈ లోకంలో యముని శాసనాలు నవ్వులపాలు కావలసిందేనా?

**వ. అదియునుంగాక. 77**

**తా :** అది మాత్రమే కాకుండా...

**సీ. ఎవ్వరు మీ రయ్య! యీ భవ్యరూపముల్ కన్నుల కద్భుతక్రమ మొనర్చె;**
**దివిజులో? భువిజులో? దేవతాప్రవరులో? సిద్ధులో? సాధ్యులో? చెప్పరయ్య!**
**దళితపాండురపద్మదళదీర్ఘనేత్రులు వరపీతకౌశేయవాసు లరయ**
**గండమండలనటత్కుండలద్వయులును బటుకిరీటప్రభాభాసితులును**

**తే. భూరిపుష్కరమాలికాచారువక్షు, లమితకోమలనవయౌవనాధికులును**
**బాహుకేయూరమణిగణభ్రాజమాన, ఘనచతుర్భుజు లభ్రసంకాశరుచులు. 78**

**ప్రతి :** ఈ= ఈ విధంగా కనబడుతున్న; భవ్యరూపముల్= మంగళకరమైన ఆకారాలు; కన్నులకున్= మా కళ్ళకు; అద్భుతక్రమము+ఒనర్చెన్= ఆశ్చర్యాన్ని కలిగించాయి; మీరు; ఎవ్వరు+అయ్య= ఎవరయ్యా; దివిజులు+ఓ= స్వర్గలోకవాసులా?; భువిజులు+ఓ= భూలోకవాసులా?; దేవతా= దేవతాగణాలకు చెందిన; ప్రవరులు+ఓ= శ్రేష్ఠులా?; సిద్ధులు+ఓ= సిద్ధులా?; సాధ్యులు+ఓ= సాధ్యులనే దేవతా గణాలా?; చెప్పరు+అయ్య= తెలియజేయండి; దళిత= వికసించిన; పాండుర= తెల్లని; పద్మదళ= తామర రేకులవంటి; దీర్ఘనేత్రులు= విశాలమైన కన్నులు కలవారు; వర= శ్రేష్ఠమైన; పీత= పసుపుపచ్చని; కౌశేయవాసులు= పట్టువస్త్రాలు కలవారు; అరయన్= పరిశీలించగా; గండమండలనటత్+కుండల= చెక్కిళ్ళపై నర్తిస్తున్న కుండలాలనే ఆభరణాల; ద్వయులును= జంటగలవారు; పటు= గొప్పదైన; కిరీట= కిరీటం యొక్క; ప్రభా= కాంతిచే; భాసితులును= ప్రకాశిస్తున్నవారు; భూరి= పెద్దవైన; పుష్కర= పద్మాలయొక్క; మాలికా= దండలచే; చారు= అందమైన; వక్షులు= వక్షఃస్థలం కలవారు; అమిత= మిక్కిలి; కోమల= లేత; యౌవన+అధికులు= మిక్కిలి పడుచుదనం కలిగినవారు; బాహు= చేతి దండల యందు; కేయూర= భుజకీర్తులనే ఆభరణాల్లోని; మణిగణ= మణుల సమూహంచే; భ్రాజమాన= ప్రకాశిస్తున్న; ఘన= గొప్పవైన; చతుర్భుజులు= నాలుగు చేతులు గలవారు; అభ్ర= నీలమేఘంతో; సంకాశ= సమానమైన; రుచులు= కాంతిగలవారైన; మీరు; ఎవ్వరు+అయ్య= ఎవరో చెప్పండి.

**తా :** అయ్యా! అద్భుతరూపులై, తమ్మిరేకులవంటి కన్నులతో, శ్రేష్ఠమైన పీతాంబరాలతో, చెక్కిళ్ళపై కదులుతున్న కుండలాలతో, ప్రకాశవంతమైన కిరీటాలతో, పద్మాలదండలతో కూడిన విశాలమైన వక్షఃస్థలంతో, నిత్యయౌవనంతో, రత్నాలుతాపిన భుజకీర్తులతో చతుర్భుజులు, నీల మేఘశ్యాములు అయిన మీరు ఎవరో తెలియజేయండి.

**క. ధనువులు నిషంగచయములు కనదంబుజశంఖచక్రఖడ్గగదా సా**
**ధనములు ధరియించిన మీ తనువులు లోకముల కద్భుతం బొనరించెన్. 79**

**ప్రతి :** ధనువులు= విండ్లు; నిషంగచయములు= అమ్ములపొదులు; కనత్+అంబుజ= శోభించే పద్మం; శంఖ= శంఖం; చక్ర= చక్రం; ఖడ్గ= కత్తి; గదా= గద అనే; సాధనములు= ఆయుధాలు; ధరియించిన మీ= కలిగిన మీ యొక్క; తనువులు= శరీరాలు; లోకములకున్= విశ్వానికి; అద్భుతంబు+ఒనరించెన్= ఆశ్చర్యం కల్గిస్తున్నాయి.

**తా :** పద్మ, శంఖ, చక్ర, గదా, ఖడ్గ, ధనుర్బాణాది ఆయుధాలను కలిగిన మీ శరీరాలు లోకులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి.

**క. శాంతంబులైన మీ తనుకాంతులు జగములను దిశలఁ గలిగిన బహుళ**
**ధ్వాంతములఁ బాఱఁదోలుచు సంతస మొనరించె నిపుడు సర్వంకషమై. 80**

**ప్రతి :** శాంతంబులు+ఐన= సాత్వికాలైన; మీ తనుకాంతులు= మీ శరీరశోభలు; జగములను= లోకాలన్నింటి యొక్క; దిశల= అన్ని దిక్కులలోను; కలిగిన= ఉన్నటువంటి; బహుళ= చిక్కనైన; ధ్వాంతములన్= చీకట్లను; పాఱఁదోలుచున్= తొలగిస్తూ; సర్వంకషమై= అంతటా వ్యాపిస్తూ; ఇపుడు= ఈ సమయంలో; సంతసము+ఒనరించెన్= సంతోషం కలిగించాయి.

**తా :** శాంత స్వరూపంతో ఒప్పే మీ శరీరకాంతులు సర్వలోకాల్లో అన్ని దిక్కులయందు అలముకున్న దట్టమైన చీకట్లను పోగొడుతూ ప్రకాశవంతమైన వెలుగుతో మాకు ఆనందాన్ని కలిగించాయి.

**వ. ఇట్లఖిలలోకానందకరక్రమాకారులు, నఖిలవిభ్రాజమానతేజోదుర్నిరీక్ష్యమాణులును, నిఖిలధర్మ పాలురునగు మీరు ధర్మపరిపాలుర మమ్ము నడ్డపెట్టం గతం బేమి? యనిన మందస్మిత కందళిత ముఖారవిందులై గోవిందుని కందువ మందిరంబు కావలి వారలువారివాహగంభీరనిర్ఘోష పరిపోషణంబులైన విశేషభాషణంబుల నిట్లనిరి. 81**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అఖిల= సమస్త; లోక+ఆనందకర= లోకాలకు సంతోషం కలిగించే; క్రమ+ఆకారులున్= సుందరమైన స్వరూపాలు కలవారు; అఖిల= సంపూర్ణమైన; విభ్రాజమాన= ప్రకాశవంతమైన; తేజస్= వెలుగుతో; దుర్నిరీక్ష్యమాణులును= చూడ శక్యంకాని వారు; నిఖిల= సకల; ధర్మపాలురును= ధర్మాలను పాటించువారు; అగుమీరు= అయిన మీరు; ధర్మ= యమధర్మరాజుయొక్క; పరిపాలురన్= ఆజ్ఞకు బద్ధులమైన; మమ్మున్= మమ్మల్ని; అడ్డపెట్టన్= నిరోధించుటకు; కతంబు+ఏమి= కారణమేమిటి?; అనినన్= అని ప్రశ్నించగా; మందస్మిత= చిరునవ్వుతో; కందళిత= వికసించిన; ముఖ+అరవిందులు+ఐ= పద్మాలవంటి ముఖాలు కలవారై; గోవిందుని= విష్ణుమూర్తియొక్క; కందువ= సమీపంలోని; మందిరంబు= నివాసానికి; కావలివారలు= కాపలాదారులు; వారివాహ= మేఘాలయొక్క; గంభీర= ఘనమైన; నిర్ఘోష= ఉరుములను; పరిపోషణంబులు+ఐన= పెంపొందించేవైన; విశేష= గొప్పవైన; భాషణంబులన్= మాటలతో; ఇట్లు+అనిరి= ఇలా సమాధానమిచ్చారు.

**తా :** లోకాలన్నింటికి ఆనందం కలిగించే సుందర విగ్రహాలు కలవారు, చూడడానికి సాధ్యంకాని తేజస్సుతో విరాజిల్లుతున్న వారు, సర్వధర్మాలను పాటించేవారు అయిన మీరు యమధర్మరాజు దూతలమైన మమ్ములను అడ్డగించడానికి కారణమేమిటని ప్రశ్నించిన యమదూతలను చూచి చిరునవ్వు చిందుతున్న ముఖారవిందాలు కలవారై గోవిందుని దూతలు మేఘగంభీర భాషణాలతో ఇలా అన్నారు.

**ఉ. మీరు పరేతనాయకుని మేలిమి దూత లటేనిఁ బల్కుఁ డా**
**తోరపుఁబుణ్యలక్షణము, దుష్కృతభావము, దండకృత్యమున్**
**బీరముతోడ నీతని కభీష్టనివాసము, పూని దండ్యు లె**
**వ్వారలు? సర్వభూతములొ? వారక కొందఱు పాపకర్ములో? 82**

**ప్రతి :** మీరు; పరేతనాయకుని= యమధర్మరాజుయొక్క; మేలిమి= శ్రేష్ఠులైన; దూతలు+అట+ఏనిన్= కింకరులు అయినట్లైన; ఆ తోరపున్= ఆ గొప్పదైన; పుణ్యలక్షణము= పుణ్యం యొక్క స్వభావం; దుష్కృత= పాపం యొక్క; భావము= లక్షణం; దండ= శిక్ష; కృత్యమున్= విధానమూ; ఈతనికిన్= ఈ అజామిళునికి; అభీష్ట నివాసము= అర్హమైన స్థానమూ; బీరముతోడన్= ధైర్యంగా; పల్కుఁడు= తెలపండి; పూని= పూనికతో; దండ్యులు= శిక్షింపదగిన వారు; ఎవ్వారలు= ఎవరో; సర్వభూతములు+ఒ= సకల ప్రాణులా?; వారక= అలాకాక; కొందఱు= కొంతమంది; పాపకర్ములో= పాపం చేసినవారా?; పల్కుఁడు= వివరించండి.

**తా :** మీరు ధర్మపరిపాలన బద్ధుడైన యముని భటులు అయితే, ఈతని నివాసమెక్కడో, పుణ్య, పాప స్వభావాలు ఏమిటో మాకు తెలియజేయండి. లోకంలో సర్వప్రాణులు శిక్షార్హులేనా? లేక పాపజీవులు మాత్రమేనా అనేది వివరించండి.

**వ. అనిన యమభటు లి ట్లనిరి 83**

**ప్రతి :** అనినన్= అని పల్కిన; యమభటులు+ఇట్లు+అనిరి= యమభటు లిలా అన్నారు.

**తా :** అని పలికిన విష్ణుదూతలతో యమభటులు ఈ విధంగా పలికారు.

**క. వేదప్రణిహితమే యనుమోదంబుగ ధర్మ మయ్యె మున్ను, త దన్యం**
**బేది యగు నది యధర్మం బాదియు హరిరూపు వేద మన వినుకతనన్. 84**

**ప్రతి :** ఆదియున్= సృష్టి మొదటినుండి; వేదము= వేదము; హరిరూపు= విష్ణుస్వరూపమే; అన విను కతనన్= అని విన్న కారణంగా; వేద= వేదమందు; ప్రణిహితమే= చెప్పబడిందే; అనుమోదంబు+కన్= అంగీకరించవలసిన; ధర్మము+అయ్యెన్= ధర్మమని నిర్ణయింపబడింది; తద్+అన్యంబు+ఏది+అగున్= ఆ వేదానికి వ్యతిరేకమైంది ఏదో అది; అధర్మంబు+అ= అది అధర్మమే అవుతుంది.

**తా :** సృష్టి ప్రారంభంనుండి వేదం నారాయణ స్వరూపంగా విశ్వసింపబడింది. అట్టి వేద బోధితమైనది ధర్మమనీ, దానికి విరుద్ధమైనది అధర్మమని తెలియజేయబడింది.

**సీ. ఎవ్వనిచేఁ దన యిరవొందు త్రిగుణస్వభావమైనట్టి యీ ప్రాణిచయము**
**లనుగుణనామక్రియారూపములచేత నెంతయుఁ దమయంత నెఱుఁగఁబడును**

సర్యముం డనలంబు నాకాశమును ప్రభంజనుఁడు గోచయమును శశధరుండు
సంధ్యలు దినములు శర్వరీచయములు కాలంబు వసుమతీజాలములును

**తే.** దేహధారికి సాక్షులై తెలుపుచుండ, దండనస్థానవిధము సద్ధర్మగతియుఁ
దగుల మీ ఱీ క్రమానురోధనము చేసి, యఖిలకర్ములు దండార్హు లరయ నెపుడు. 85

**ప్రతి :** ఎవ్వనిచేన్= ఏ భగవంతునిచే; తన+ఇరవు+ఒందున్= తన ఉనికిని నిలుపుకున్నదో; త్రిగుణ= సత్త్వ, రజస్, తమోగుణాలతో; స్వభావము+ఐనట్టి= కూడిన స్వభావం కల; ఈప్రాణిచయముల్= ఈ జీవకోటి అంతా; అనుగుణ= అనువైన; నామ= పేరు; క్రియా= చర్య; రూపములచేతన్= ఆకారాలచేత; ఎంతయున్= ఏ విధంగానైన; తమ+అంతన్= తమకు తాముగా; ఎఱుఁగఁబడున్= గోచరిస్తాయో అట్టి; దండనస్థానవిధము= దండనార్హమైన పద్ధతి; సత్+ధర్మగతియున్= ఉత్తమ ధర్మంయొక్క విధానమూ; తగులన్= అన్వయించడాన్ని; మీఱి= అతిశయించి; తెలుపుచున్+ఉండన్= ప్రకటిస్తుండగా; ఈ క్రమ+అనురోధనముచేసి= ఈ క్రమాన్ని అనుసరించి; అఖిల కర్ములు= సమస్త కర్మలు చేసేవారును; అరయన్= పరిశీలింపగా; ఎప్పుడున్= ఎల్లవేళలా; దండ+అర్హులు= శిక్షించుటకు అర్హులగుదురు; అర్యముండు= సూర్యుడు; అనలంబున్= అగ్ని; ఆకాశమును= ఆకాశం; ప్రభంజనుఁడు= గాలి; గోచయమును= ఇంద్రియ సమూహం (ఆవులమందలు); శశధరుండు= చంద్రుడు; సంధ్యలు= ప్రాతః, సాయం సమయాలు; దినములు= పగళ్ళు; శర్వరీచయములు= రాత్రుల సమూహాలు; కాలంబు= కాలచక్రం; వసుమతీ= భూమీ; జాలములును= సమూహాలు ఇవన్నీకూడా; దేహధారికిన్= జీవునికి; సాక్షులై= సాక్ష్యం కలిగినవై; తెలుపుచున్+ఉండన్= తెలియజేస్తుండగా; దండనస్థానవిధము= శిక్షను అనుసరించే తీరు; సత్+ధర్మగతియున్= సక్రమమైన ధర్మమార్గమును; తగులన్= తగి ఉండగా; మీ+ఈ+క్రమ+అనురోధనముచేసి= మీరు ఈ పద్ధతిని అనుసరించి అడ్డు తగిలి; అఖిల కర్ములు= సకలకర్మలు ఆచరించేవారంతా; అరయన్= పరిశీలించగా; ఎపుడూ= ఎల్లవేళలా; దండన+అర్హులు= దండనకు తగినవారు...

**తా :** శ్రీమన్నారాయణుని సంకల్పబలంచేత సృష్టి కార్యక్రమం ప్రారంభమై సత్త్వరజస్తమోగుణాలతో కూడిన జీవులు జన్మించాయి. ఇవి తమకు అనుకూలమైన నామ, గుణ రూప భేదాలచే వేరు చేయబడి కర్మలను ఆచరిస్తాయి. ఈ జీవుల కర్మలకు సాక్షులుగా పంచభూతాలు, సూర్యచంద్రులు, రాత్రింబవళ్ళు, కాలం మొదలైనవి ఉన్నాయి. వారి సాక్ష్యాలను అనుసరించి జీవులకు శిక్షలు అమలు జరుగుతాయి.

**తే.** కోరి కర్మంబు నడపెడువారి కెల్లఁ, గలితశుభములు నశుభముల్ గలుగుచుండు!
నరయఁగా దేహి గుణసంగి యైనయపుడె, పూని కర్మంబు సేయక మానరాదు. 86

**ప్రతి :** కోరి= తనకు నచ్చిన రీతిలో; కర్మంబు= పుణ్యపాపకర్మలను; నడిపెడువారికిన్+ఎల్లన్= ఆచరించే వారందరికి; కలిత= ఆ కర్మలకనుగుణమైన; శుభములు= మంగళప్రదములు (మంచి); అశుభములు= అమంగళములు (చెడులు) కలుగుచున్+ఉండున్= కలుగుతూ ఉంటాయి; అరయన్+కాన్= విమర్శించి చూడగా; దేహి= జీవుడు; గుణసంగి= గుణ సహితుడుగా; ఐన+అపుడె= ఉన్న సమయంలోనే; పూని= ప్రయత్నించి; కర్మంబు= మంచి పనులను; చేయక= చేయకుండా; మానరాదు= మానుకోరాదు (కర్మలు చేయాలని భావం).

**తా :** జీవుడు తనకు ఇష్టమైన విధంగా పుణ్యపాపకర్మలు చేస్తాడు. ఆ కర్మల ననుసరించి శుభాలుగాని, అశుభాలుగాని ప్రాప్తిస్తూ ఉంటాయి. ఆలోచించి చూస్తే దేహధారులకు సత్వరజస్తమోగుణాల సంపర్కం తప్పదు. అందువల్ల దేహి అయిన ప్రతి జీవీ కర్మాచరణ తప్పక చేయవలసిందే!

**క. ప్రకృతమునఁ దా నొనర్చిన, సుకృతము దుష్కృతము నెంత చూడఁగ నంతే**
**వికృతిఁ గతి ననుభవించును, నకృతమతిన్ దత్ఫలంబు నతినిపుణుండై. 87**

**ప్రతి :** ప్రకృతమునన్= ఇప్పటి జన్మలో; తాన్+ఒనర్చిన= తాను చేసినట్టి; సుకృతమున్= పుణ్యకర్మను; దుష్కృతమున్= పాపకర్మను; ఎంత+చూడన్+కన్= ఎంత పరిశీలించిన; అంతే+వికృతిన్+కని= మరుసటి జన్మలలో అందుకు తగిన రూపాలను పొంది; అ+కృతమతిన్= సొంత నిర్ణయం లేనివాడై; తత్+ఫలంబున్= వాటి ఫలితాన్ని; అతినిపుణుండై= మిక్కిలి నేర్పరియై; అనుభవించునున్= అనుభవిస్తాడు.

**తా :** జీవుడు ఇప్పటి జన్మలలో చేసిన కర్మల పాప, పుణ్యాలను ఆధారంగా చేసుకొని, తరువాతి జన్మలలో అందుకు తగిన రూపాలు పొందుతాడు. ఈ జన్మ కర్మ ఫలితాలను మరుసటి జన్మలలో తప్పక అనుభవిస్తాడు.

**వ. మఱియు వినుండు, జన్మంబు శాంత ఘోర మూఢగుణంబులచేత నైనను, సుఖదుఃఖ గుణంబులచేత నయినను, ధార్మికాది గుణంబులచేత నైనను, సకల భూతంబులు త్రైవిధ్యంబు నే ప్రకారంబునం బొందు, నా ప్రకారంబున జన్మాంతరంబునం బొందుచుండు, దేవుండైన యముండు సర్వజీవాంతర్యామియై ధర్మాధర్మయుక్తంబైన పూర్వరూపంబులను మనస్సుచే విశేషంబుగఁ జూచుచుండి, వాని కనురూపంబులఁ జింతింపుచుండు. అవిద్యోపాధి జీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీనకర్మంబుల నేర్పడ్డ వర్తమాన దేహంబు, నే నని తలంపుచుండి, నష్టజన్మస్మృతి గలవాఁడై పూర్వాపరంబు లెఱుంగం జాలకుండు. మఱియుఁ గర్మేంద్రియములచేతఁ గర్మంబులఁ జేయుచుండి, జ్ఞానేంద్రియంబులచేతఁ దమోవిషయంబు లయిన శబ్దస్పర్శ రూప రసగంధంబుల నెఱుంగుచుండి, పదియాఱవది యైన మనంబుతోఁ గూడి, పదియేడవవాఁ డగుచుండి, షోడశోపాధ్యంతర్గతుండై యొక్కరుండైన జీవుండు, సర్వేంద్రియవిషయప్రతిసంధానంబు కొఱకు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోవిషయంబులం బొందుచుండి, షోడశకళలం గలిగి, లింగశరీరం బనం బరఁగి, గుణత్రయకార్యంబను నిమిత్తంబున హర్షశోకభయంబుల నిచ్చుచున్న సంసారంబు ధరియింపుచుండు. అజితషడ్వర్గుండైన దేహి కర్మంబు లొల్లని బుద్ధి నెఱింగియు, వినియుఁ, గర్మంబులు సేయుచుండి, తన సంచార కర్మంబునం జుట్టుకొన్న పసిరికాయపురువునుంబోలె నిర్గమోపాయం బెఱుంగక నాశంబు నొందుచుండు. వర్తమానవసంతాదికాలంబు, భూతభావివసంతకాల యోగ్యం బైన పుష్ప ఫలాదులు తత్కాలజ్ఞాపకంబు నెట్లు సేయు, నట్లు భూత భావి జన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు. ఒక్క నరుండు నొక క్షణంబును గర్మంబుఁ జేయకుండువాఁడు లేఁడు. పూర్వసంస్కారంబులం గల గుణంబులచేతఁ బురుషుం దవశుండు గావునఁ బలిమిఁ గర్మంబులు సేయింపబడుచుండు. అవ్యక్తనిమిత్తంబు నొంది తదనురూపంబు లైన స్థూల సూక్ష్మ శరీరంబులు మాతా పితృ సదృశంబు లగుచుండు. ఇట్టి విపర్యయంబు**

**పురుషునికిఁ బ్రకృతిసంగమంబునం గలుగుచుండు. ఆ ప్రకృతి పురాణపురుషుం డైన య ప్పరమేశ్వరుని సేవించినఁ దలంగుచుండు. 88**

**ప్రతి :** మఱియున్= ఇంకా; వినుండు= వినండి; జన్మంబున్= జీవుని జన్మ; శాంత= శాంతగుణ సంపన్నమైన; ఘోర= భయంకరాలైన (మరియు); మూఢ= అజ్ఞాన పూరితాలైన; గుణంబులచేతన్+ఐనను= గుణాలతో గాని; సుఖ= సుఖవంతమైన; దుఃఖ= బాధాకరమైన; గుణంబులచేతన్+ఐనను= గుణాలతో గానీ; ధార్మిక+ఆదిగుణంబులచేతన్+ఐనను= ధర్మసంబంధమైన గుణాలవల్లగానీ; సకలభూతంబులు= సమస్త జీవులు; త్రైవిధ్యంబును= గుణత్రయ వికారాన్ని; ఏ ప్రకారంబునన్= ఏ విధంగా; పొందున్= కలిగి ఉంటాయో; ఆ ప్రకారంబునన్= దానికి అనుగుణమైన; జన్మ+అంతరంబునన్= తరువాతి జన్మలో; పొందుచుండున్= పొందుతూ ఉంటాయి; దేవుండు+ఐన= దేవుడైన; యముండు= యమధర్మరాజు; సర్వజీవ= సకల ప్రాణులలోను; అంతర్యామి+ఐ= నిండినవాడై; ధర్మ+అధర్మయుక్తంబు+ఐన= ధర్మాధర్మాలతో కూడిన; పూర్వరూపంబులను= వెనుకటి రూపాలను; మనస్సుచేన్= చిత్తంచేత; విశేషంబు+కన్+చూచుచున్+ ఉండి= ప్రత్యేకంగా గమనిస్తూ; వానికిన్+అనురూపంబులన్= వానికి అనుగుణమైన పద్ధతుల్లో; చింతింపుచున్+ఉండున్= ఆలోచనలు చేస్తూ ఉంటాడు; అవిద్య= మిథ్యాజ్ఞానం; ఉపాధి= ఆశ్రయంగా గల; జీవుండు= ప్రాణి; తమస్+గుణ యుక్తుండు+ఐ= తామసగుణం కలవాడై; ప్రాచీన= పూర్వజన్మయొక్క; కర్మంబులన్= కర్మలవలన; ఏర్పడ్డ= సంభవించిన; వర్తమాన= ఇప్పటి; దేహంబున్= ఈ శరీరమే; నేను+అని= నేనని; తలంపుచున్+ఉండి= భావిస్తూండి (దేహాత్మ భ్రాంతి కలవాడై); నష్టజన్మ స్మృతి+కలవాఁడు+ఐ= పూర్వజన్మజ్ఞానం కోల్పోయినవాడై; పూర్వ+అపరంబులు= ముందు వెనుక జన్మలను; ఎఱుంగన్+చాలక+ఉండున్= గుర్తించలేకుండా ఉంటాడు; మఱియున్= ఇంకా; కర్మ+ఇంద్రియములచేతన్= వాక్కు, పాణి మొదలగు ఇంద్రియాలచే; కర్మంబులన్= పనులను; చేయుచున్+ఉండి= చేస్తూ; జ్ఞాన+ఇంద్రియంబుల చేతన్= శ్రోత్రం, చర్మం మున్నగు జ్ఞానేంద్రియాలచే; తమస్+విషయంబులు+అయిన= తామస గుణ పూరితాలైన; శబ్ద= ధ్వని; స్పర్శ= తాకుట; రూప= ఆకారం; రస= రుచి; గంధంబులన్= వాసన మొదలైన విషయాల్ని; ఎఱుంగుచున్+ఉండి= తెలుసుకొంటూ; పది+ఆఱవది+ఐన= పదహారవదిఅయిన; మనంబుతోన్+కూడి= మనస్సుతో కలిసి; పదియేడవ వాఁడు+అగుచుండి= తాను పదిహేడవవాడై; షోడశ+ఉపాధి+అంతర్గతుండు+ఐ= 16 విధాలైన ఉపాధులయందు సంచరిస్తున్నవాడై; ఒక్కరుండు+ఐనజీవుండు= ఒంటరివాడైన ప్రాణి; సర్వ+ఇంద్రియ= అన్ని ఇంద్రియాల యొక్క; విషయ= విషయాలయొక్క; ప్రతిసంధానంబు+ కొఱకు= కలియక కోసం; జ్ఞాన+ఇంద్రియ= జ్ఞానేంద్రియాలయొక్క; కర్మ+ఇంద్రియ= కర్మేంద్రియాలయొక్క; మనస్+విషయంబులన్= మనసుయొక్క విషయాలను; పొందుచున్+ఉండి= అనుభవిస్తూ ఉండి; షోడశ కళలన్+కలిగి= పదహారు కళలను పొందుతూ; లింగశరీరంబు+అనన్+పరఁగి= లింగ శరీరమనే పేరుతో; గుణత్రయ= సత్త్వ, రజస్, తమోగుణాలచే చేసిన; కార్యంబు+అను నిమిత్తంబునన్= కర్మల కారణంగా; హర్ష= సంతోషం; శోక= విచారం; భయంబులన్= భీతులను; ఇచ్చుచున్+ఉన్న= కలిగించే; సంసారంబు= జన్మ పరంపరలను; ధరియింపుచున్+ఉండున్= పొందుతూ ఉంటాడు; అజిత= జయించలేని; షట్+వర్గుండు+ఐన= కామక్రోధాదులైన ఆరుగుణాలతోకూడిన; దేహి= జీవి; కర్మంబులు+ఒల్లని= కర్మల్ని అంగీకరించని; బుద్ధిన్= జ్ఞానాన్ని; ఎఱింగియున్= గ్రహించీ; వినియున్= వినీ; కర్మంబులు= ఆ యా పనులను; చేయుచున్+ఉండి= చేస్తూ ఉంటూ; తన= తన యొక్క; సంచార= తిరుగుతుండే (మళ్ళీ మళ్ళీచేసే); కర్మంబునన్= పనులవలన; చుట్టుకున్న= బంధింపబడిన; పసిరికాయ= పట్టుగూడులోని; పురువునున్+పోలెన్= పట్టుపురుగువలె; నిర్గమ+ఉపాయంబు+ఎఱుంగక= బయటకు వచ్చే దారి

తెలుసుకోలేక; నాశంబున్+ఒందుచున్+ఉండున్= నశిస్తుంటాడు; వర్తమాన= ప్రస్తుతం జరుగుతున్న; వసంత+ఆది= వసంతం మొదలైన; కాలంబు= కాలం; భూత= గతించిన; భావి= రాబోవు; వసంతకాల= వసంతకాలానికి; యోగ్యంబు+ఐన= తగిన; పుష్ప+ఫల+ఆదులు= పూలు, పళ్ళు మొదలైనవి; తత్+కాల+జ్ఞాపకంబులన్= ఆ యా కాలాల స్మృతిని; ఎట్లుసేయున్= ఏ విధంగా కలిగిస్తాయో; అట్లు= అదే విధంగా; భూత= పూర్వ; భావి= భవిష్యత్; జన్మంబులకున్= జన్మలకు చెందిన; ధర్మ+అధర్మంబులు= చేయతగిన, చేయరానిపనులను; నిదర్శనంబులు= గుర్తించే విధంగా; చేయుచున్+ఉండున్= చేస్తుంటాడు; ఒక్క నరుండున్= ఏ ఒక్క మానవుడు; ఒక్క క్షణంబును= ఒక్క క్షణం కూడా; కర్మంబు= చేయలసిన పనిని; చేయకుండువాఁడు= చేయనివాడుగా; లేఁడు= ఉండలేదు; పూర్వ సంస్కారంబులన్= వెనుకటి జన్మవాసనలచే; కల గుణంబులచేతన్= కలిగిన గుణాలతో; పురుషుండు= జీవి; అవశుండు= తప్పక బద్ధుడవుతాడు; కావునన్= కాబట్టి; బలిమిన్= బలవంతంగా; కర్మంబులు= పనులు; చేయింపబడుచున్+ఉండున్= చేయబడుతుంటాయి; అవ్యక్త= మాయ; నిమిత్తంబున్= కారణాన్ని; ఒంది= పొంది; తద్+అనురూపంబులు+ఐన= ఆ యా గుణాలకు తగిన; స్థూల= దృశ్యరూపమైన (కనిపించే); సూక్ష్మ= అదృశ్యరూపమైన (కనిపించని); శరీరంబులు= దేహాలు; మాతాపితృసదృశంబులు= తల్లిదండ్రులను పోలినవి; అగుచున్+ఉండున్= అవుతాయి; ఇట్టి= ఈ విధమైన; విపర్యయంబు= మార్పు; పురుషునికిన్= జీవునికి; ప్రకృతి సంగమంబునన్= ప్రకృతి సంబంధంవల్ల; కలుగుచున్+ఉండున్= ఏర్పడుతుంది; ఆ ప్రకృతి= ఆ మాయా స్వభావం; పురాణ పురుషుండు+ఐన= ఆది దైవమైన; ఆ+పరమ+ఈశ్వరుని= ఆ భగవంతుణ్ణి; సేవించినన్= భజిస్తే; తలంగుచున్+ఉండున్= తప్పుతూ ఉంటుంది.

**తా :** ఇంకా వినండి. సత్త్వరజస్తమోగుణాలలో ఒక్కదానిప్రభావంవల్ల జన్మించినజీవులు సాత్త్వికులు, రాజసులు, తామసులు అని పిలువబడతారు. మొదటివారు ధర్మాచరణపరులై సుఖాలు అనుభవిస్తారు. రెండవ వారు అహంకారపూరితులై ధర్మాధర్మాలను ఆచరిస్తూ సుఖదుఃఖాలు రెంటిని అనుభవిస్తారు. మూడవవారు ఘోరబుద్ధి కలిగి అధర్మపరులై కష్టాలపాలౌతారు. వారి వారి ప్రవర్తనల కనుకూలమైన జన్మలే తదనంతరం వారికి ప్రాప్తిస్తాయి.

సమవర్తి అయిన యముడు సర్వప్రాణులలో అంతరాత్మరూపంలో ఉండి, వారివారిగుణాలకు, కార్యాలకు అంతస్సాక్షిగా ఉండి, వారి ప్రవృత్తులకు ప్రేరణ కల్పిస్తాడు. అజ్ఞానులు తమోగుణప్రధానులై దేహాత్మభావం పొంది ఉంటారు. పూర్వస్మృతిని కోల్పోయి కర్మేంద్రియాలతో పాపకర్మలు చేస్తూ, జ్ఞానేంద్రియాలవలన విషయలంపటులై వాగ్రూపమైన, మానసికమైన, శారీరకమైన పనులు చేస్తుంటారు. కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు తన్మాత్ర పంచకాలతో గూడి, మనసుతో కలిపి తాను పదిహేడవ వాడయి ఉపాధి సంబంధం కలిగి, సంసారబద్ధుడై కొట్టుమిట్టాడుతుంటాడు. పైన చెప్పిన పదహారు అంశాలతో కూడిన జీవుడు సత్త్వగుణం కలవాడైతే హర్షాన్ని, రజోగుణంగలవాడైతే శోకాన్ని, తమోగుణంగలవాడైతే భయాదులను పొందుతాడు.

అరిషడ్వర్గాన్ని జయించలేక కర్మ సంసారబంధకారణమని తెలిసికూడా, పూర్వజన్మవాసనల కారణంగా ఆ యా కర్మలను చేస్తుంటాడు. ఆ కారణంగా పట్టుపురుగు తాను అల్లుకున్న గూటిలో చిక్కుకొని, బయటకు రాలేని విధంగా సంసారజాలంలో చిక్కుకుంటాడు.

ప్రస్తుత వసంతకాలంలోని ఫల, పుష్ప భరితమైన వృక్ష, లతాదులను చూచి, భూతకాలంలోను, భావికాలంలోను వాటి స్థితిగతులను ఊహించవచ్చు. అలాగే జీవి ఇప్పటిజన్మలోని నడవడికనుబట్టి భూతకాలంలోని గుణశీలాలు ఎలాంటివో, భావికాలంలో ఎలా ఉండబోతాయో ఊహించవచ్చు.

ఏ ప్రాణి అయినా సరే తనకు విధించిన పనులను చేయకుండా ఉండటం సాధ్యం కాదు. వాసనాబలాన్ని బట్టి ఆ యా గుణాలు ఏర్పడతాయి. ఆ గుణాలకు అనుగుణంగానే జీవుడు కర్మలు తప్పక చేయవలసి ఉంటుంది. అవ్యక్తమైన ఆ వాసనాహేతువుచే ఏర్పడినగుణాలవల్ల జీవి బద్ధుడవుతాడు కాబట్టి బలవంతంగానైనా కర్మలు చేస్తూ ఉంటాడు. జన్మపరంపరా రూపమైన ఈ సంసారచక్రంనుండి విముక్తి పొందాలంటే ఆ పరమేశ్వరునియందు అనన్యభక్తి కలిగి ఉండాలి. అపుడే జీవన్ముక్తి లభిస్తుంది.

**సీ.** **కావున నితఁడు సత్కర్మవర్తనమున భూదేవకులమునఁ బుట్టినాఁడు**
**దాంతుఁడై శాంతుఁడై ధర్మసంశీలుఁడై సకలవేదంబులఁ జదివినాఁడు**
**అనయంబు గురువుల నతిథులఁ బెద్దలఁ జేరి శుశ్రూషలు చేసినాఁడు**
**సర్వభూతములకు సమబుద్ధియై చాల బహుమంత్రసిద్ధులఁ బడసినాఁడు**

**తే.** **సత్యభాషణనియమంబు జరపినాఁడు, నిత్యనైమిత్తికాదుల నెఱపినాఁడు**
**దండి లోభాదిగుణములఁ దరపినాఁడు, మంచిగుణములు దనయందు మరపినాఁడు. 89**

**ప్రతి :** కావునన్= కాబట్టి; ఇతఁడు= ఈ అజామిళుడు; సత్+కర్మవర్తనమునన్= (పూర్వజన్మలలో చేసుకున్న) మంచిపనుల ఫలితంగా; భూదేవకులమునన్= బ్రాహ్మణవంశమందు; పుట్టినాఁడు= జన్మించినాడు; దాంతుఁడు+ఐ= బహిరింద్రియ నిగ్రహం కలవాడై; శాంతుఁడు+ఐ= అంతరింద్రియ నిగ్రహం కలవాడై; ధర్మసంశీలుఁడు+ఐ= ధర్మప్రవర్తన కలవాడై; సకల వేదంబులన్= సమస్తవేదాలను; చదివినాఁడు= అధ్యయనంచేశాడు; అనయంబున్= నిత్యం; గురువులన్= గురువులను; అతిథులన్= అతిథులను; పెద్దలన్= తనకన్న పెద్దవారిని; చేరి= సమీపించి; శుశ్రూషలు= సేవలు; చేసినాఁడు= ఆచరించాడు; సర్వభూతములకున్= సకలప్రాణులయందు; సమబుద్ధి+ఐ= సమత్వ బుద్ధి కలిగి; చాలన్= మిక్కిలి; బహు= పలురకాలైన; మంత్ర= మంత్రాలయొక్క; సిద్ధులున్= జపసిద్ధులను; పడసినాఁడు= పొందాడు; సత్యభాషణ= నిజము పలుకుట అనే; నియమంబు= వ్రతాన్ని; జరపినాఁడు= ఆచరించాడు; నిత్య= నిత్యమూ చేయవలసిన; నైమిత్తిక+ఆదులన్= సమయానుసారమైన విహిత కార్యాలు మొదలైనవాటిల్ని; నెఱపినాఁడు= చేశాడు; దండి= ఎక్కువైన; లోభ+ఆది+గుణములన్= లోభం మొదలైన చెడ్డ గుణాలను; తరపినాఁడు= వదిలిపెట్టాడు; మంచి గుణములు= సత్ప్రవర్తనకు కారణమైన గుణాలను; తన+అందు= తన స్వభావంలో; మరపినాఁడు= మలచుకున్నాడు.

**తా :** కనుక ఈ అజామిళుడు పూర్వజన్మ సంస్కారం వల్ల శ్రేష్ఠమైన బ్రాహ్మణవంశంలో జన్మించి, వేదశాస్త్రాలను గురుసేవతో, ఇంద్రియ నిగ్రహంతో అభ్యసించాడు. పెద్దలను, జ్ఞానులను సేవించాడు, సకల ప్రాణులయందునూ సమత్వదృష్టి కలిగి, మంత్రానుష్ఠానంతో సిద్ధులు పొందాడు. సత్యవ్రతం, నిత్య నైమిత్తికాదికార్యాలు నిర్వహించాడు. లోభాది దుష్ట వర్తనలను వదిలి, సద్గుణవంతుడైనాడు.

**క.** **సతతాచారసమంచితమతియై సుజ్ఞానములకు మరగెడితఱి నా**
**యతగతి నాతని కంగజమతమై నవయౌవనాగమం బెడ సొచ్చెన్. 90**

**ప్రతి :** సతత+ఆచార= నిత్యం చేయవలసిన ఆచారాలచేత; సమంచిత= పూజితమైన; మతియై= మనసు కలవాడై; సుజ్ఞానములకున్= చక్కని జ్ఞాన విషయాలకు; మరగెడి తఱిన్= అలవాటు పడుతున్న సమయంలో; ఆయత గతిన్= అతి

విస్తృతంగా; ఆతనికిన్= ఆ అజామిళునికి; అంగజమతము+ఐ= మన్మథవికారప్రధానమై; నవయౌవన+ఆగమంబు= క్రొత్త జవ్వనంయొక్క రాక; ఎడ+చొచ్చెన్= సంభవించింది.

**తా :** నిత్యం ఆచారనిష్ఠకలవాడై, జ్ఞానాన్ని సముపార్జించే సరైన సమయంలో, తాను ఉత్తముడుగా మారబోతున్న కాలంలోనే అతనికి మన్మథవికారం కలిగించే కోడెవయసు ప్రారంభమైంది.

**విశే :** 'యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా, ఏకైక మప్యనర్థాయ కిము యత్ర చతుష్టయమ్' అనే సూక్తి వల్ల ఆధారంగా తరువాత వచ్చే అన్ని అనర్థాలకు మూలమై వివేకాన్ని పోగొట్టే దోషాలలో మొదటిదైన నవయౌవనం అని చెప్పవచ్చు.

**సీ. కడకంట యౌవనగర్వంబు వొడగట్టె మదిలోన నుద్రేకమదము దొట్టెఁ**
**గడు మేనఁ గామవికారంబు దలసూపె ముఖమునఁ జిఱునవ్వు మొలకలెత్తె**
**నతిపుష్టి నిష్ఠురంబయ్యె దేహంబెల్లఁ గచభారమున నెఱికప్పు మెఱసె**
**కటిభారమున నూరుకాండముల్ జిగి మీఱె బాహుశాఖలు దీర్ఘభంగిఁ దోఁచె**

**తే. నురము విపులమయ్యె నుల్లసద్వరకాంతి, పూర మంగకమునఁ బొందుపడియె**
**భూరితేజుఁడైన భూసురాన్వయునకు నభినవైకయౌవనాగమమున. 91**

**ప్రతి :** భూరితేజుఁడు+ఐన= మంచి తేజశ్శాలి అయిన; భూసుర+అన్వయునకున్= బ్రాహ్మణ వంశంలోనివానికి; అభినవ+ఏకయౌవన+ఆగమమునన్= కొత్తదైన ప్రాముఖ్యం కలిగిన జవ్వనం ప్రవేశించిన సందర్భంలో; కడకంటన్= కన్నుల చివరలో; యౌవనగర్వంబున్+పొడగట్టెన్= యౌవనావస్థలో కలిగే అతిశయం కన్పించింది; మదిలోనన్= హృదయంలో; ఉద్రేకమదము= ఆవేశపూరితమైన మత్తు; తొట్టెన్= ప్రవేశించింది; కడున్= ఎక్కువగా; మేనన్= శరీరమందు; కామ= మన్మథ సంబంధమైన; వికారంబు= వెకిలితనం; తలసూపెన్= పొటమరించింది; ముఖమునన్= మొగమునందు; చిఱునవ్వు= లేత నవ్వు; మొలకలు+ఎత్తెన్= అంకురించింది; దేహంబు+ఎల్లన్= శరీరమంతా; అతిపుష్టి= మిక్కిలి కండబలం; నిష్ఠురంబు+అయ్యెన్= కఠినమైంది; కచభారమునన్= తలకట్టునందు; నెఱికప్పు= నలుపు యొక్క నిగారింపు; మెఱసెన్= శోభించింది; కటి భారమునన్= నడుము బరువుచే; ఊరుకాండములు= తొడల సముదాయం; జిగిమీఱెన్= కాంతివంతములయ్యాయి; బాహుశాఖలు= భుజశాఖలు; దీర్ఘభంగిన్= పొడవుగా; తోఁచెన్= కనిపించాయి; ఉరము= హృదయభాగం; విపులము+అయ్యెన్= విశాలమయ్యింది; ఉల్లసత్= ప్రకాశిస్తున్న; వర= శ్రేష్ఠమైన; కాంతిపూరము= కాంతి ప్రవాహం (మేని మెరుపు); అంగకమునన్= శరీరమందు; పొందుపడియెన్= పొందుకొనింది.

**తా :** మిక్కిలి తేజోవంతుడైన అజామిళుడనే ఆ బ్రాహ్మణునికి యౌవనదశ ప్రాప్తించిన కాలంలో కన్నుల చివర యౌవన మదం, మనసులో తొందరపాటు, శరీరమంతా మన్మథచేష్టలు, మొగమున లేత నవ్వు, శరీరానికి గొప్పబలం, తలవెంట్రుకల నల్లని నిగారింపు, నడుము బరువుతో తొడలయందు కాంతి, చేతులు పొడవుగా సాగుట, విశాల వక్షఃస్థలం, శరీర లావణ్యం. మొదలైన కొత్తదనాలు రూపుదిద్దుకున్నాయి.

**క. హృదయమునఁ బొడము యౌవన మదము వెలిందోఁచుభంగి మానితరుచిఁ ద**
**ద్వదనమున నూఁగుమీసలు పొదలుచుఁ గప్పదరి చూడఁ బొంకం బయ్యెన్. 92**

**ప్రతి :** హృదయమునన్= మనసులో (ఎదలో); పొడము= పొంగుతున్న; యౌవనమదము= కోడె ప్రాయపు మత్తు; వెలిన్+తోఁచుభంగిన్= బయటకు వస్తున్నట్లుగా; మానితరుచిన్= విశేషమైన కాంతితో; తద్+వదనమునన్= అతని ముఖభాగంలో; నూఁగు మీసలు= నూనూగు మీసాలు; పొదలుచున్= మొలుస్తూ; కప్పు+అడరి= నలుపును కలిగి; చూడన్= చూడడానికి; పొంకంబు+అయ్యెన్= అందంగా ఉన్నాయి.

**తా :** మదిలో పుడుతున్న యౌవనమదం, తన చిహ్నాలను ప్రదర్శిస్తున్నట్లుగా అతనిముఖంపై మొలకెత్తిన నూనూగు మీసాలు నల్లగా అందంగా కనిపించాయి.

**వ. మఱియును.** **93**

**ప్రతి :** మఱియును= ఇంకా...

**తా :** అంతేకాక

**క. తమ్మివిరిమీఁద వ్రాలిన తుమ్మెదపంక్తియునుబోలెఁ దోరపులీలం**
**గ్రమ్ముకొని విప్రతనయుని నెమ్మొగమునఁ గానఁబడియె నెఱిమీసంబుల్.** **94**

**ప్రతి :** విప్రతనయుని= ఆ బ్రహ్మణ కుమారునియొక్క; నెఱ+మొగమునన్= నిండు ముఖమున; తమ్మివిరి మీఁదన్= తామరపూవు మీద; వ్రాలిన= కూర్చున్న; తుమ్మెద పంక్తియునున్+పోలెన్= తుమ్మెదల వరుసవలె; తోరము+లీలన్= సంపూర్ణ విలాసంతో; నెఱి+మీసంబుల్= అందమైన మీసకట్టు; క్రమ్ముకుని= దట్టంగా వ్యాపించి; కాన్+పడియెన్= కనబడింది.

**తా :** అరవిరిసిన తామరపూవుమీద తుమ్మెదలగుంపు వాలినట్లుగా అజామిళుని అందమైనముఖంపై చక్కని చిక్కని మీసకట్టు అంకురించింది.

**వ. అంత ననంగబ్రహ్మతంత్రంబునకు వసంతుం డొనర్చు నంకురార్పణారంభంబునుం బోలె లలిత కిసలయ విసర ప్రసారభాసురబహుపాదపాదిపురోపవనపవనజవనప్రభావపరికంపితవిటవిటీజన హృదయప్రఫుల్లపల్లవభల్లంబును, ననూనప్రసూననిర్భరగర్భావిర్భూతసురభిపరాగపటలపటఘటిత నభోమండలంబును. నమందనిష్యందమరందబిందుసందోహకందళితచిత్తమత్తమధుపసంకులఝుంకార ముఖరితసకలదిశావలయంబును, నిరంతరధారాళరసభరితపరిపక్వఫలానుభవప్రభవసమ్మోదవాద శుకప్రముఖపతంగకోలాహలంబు నైన మధుమాసంబు సర్వజనమనోహరంబునై నిఖిలవనపాదపంబుల నలంకరించె. అయ్యవసరంబున నజామిళుండు పితృనిర్దేశంబునం గుశసమిత్పుష్పఫలార్థంబు వనంబున కరిగి, తిరిగి వచ్చు సమయంబున నొక్క లతాభవనంబున.** **95**

**ప్రతి :** అంతన్= అదే సమయంలో; అనంగ= మన్మథుడనే; బ్రహ్మతంత్రంబునకున్= సృష్టికర్త యొక్క కార్యవిధానానికి; వసంతుండు+ఒనర్చు+ అంకురార్పణ+ఆరంభంబునున్+పోలెన్= వసంతుడు సమకూర్చేప్రారంభక్రియవలె; లలిత= మనోహరమైన; కిసలయ= లేత చిగుళ్ళ యొక్క; విసర= విస్తారమైన; ప్రసార= వ్యాపనం వలన; భాసుర= శోభ కలిగిన; బహు= పెక్కు; పాదప+ఆది= చెట్లు, లతలు మొదలైన; పుర+ఉపవన= ఉద్యానవనాలయందలి; పవన= గాలియొక్క;

జవన= వేగంతో కూడిన; ప్రభావ= సామర్థ్యంతో; పరికంపిత= కలవరపెట్టబడిన; విట= వ్యభిచారులు; విటీజన= వ్యభిచారిణుల సమూహంయొక్క; హృదయ= మనసులనే; ప్రఫుల్ల= వికసించిన; పల్లవ= చిగుళ్ళకు; భల్లంబునున్= బల్లెంవలె బాధించేది; అనూన= సంపూర్ణమైన; ప్రసూన= పుష్పాలయొక్క; నిర్భర= నిండైన; గర్భ+ఆవిర్భూత= మధ్యభాగం నుండి పుట్టిన; సురభి= సుగంధంగల; పరాగపటల= పుప్పొడులయొక్క సమూహమనెడి; పట ఘటిత= వస్త్రం వలె ఆవరింపబడిన; నభస్+మండలంబునున్= ఆకాశ భాగం కల్గిందీ; అమంద= అధికంగా; నిష్యంద= స్రవిస్తున్న; మరంద= పూదేనెల; బిందుసందోహ= తుంపరల సమూహంతో; కందళిత= వికసించిన; చిత్త= మనసులనే; మత్తమధుప= మత్తు కలిగిన తుమ్మెదల; సంకుల= సమూహంయొక్క; ఝుంకార= సుస్వరాల ఆలాపనచే; ముఖరిత= మోగుతున్న; సకల= అన్ని; దిశావలయంబును= దిక్కుల వలయం కల్గిందీ; నిరంతర= ఎడతెగని; ధారాళ= ధారగల; రసభరిత= రసాలతో నిండిన; పరిపక్వ= బాగా మగ్గిన; ఫల+అనుభవ= పండ్లను తినుటచే; ప్రభవ= పుట్టిన; సమ్మోదవాద= సంతోషంతో కూస్తున్న; శుకప్రముఖ= చిలుకలు మొదలైన; పతంగ= పక్షులయొక్క; కోలాహలంబును+ఐన= కలకల శబ్దాలు కల్గిందైన; మధుమాసంబు= వసంతకాలం; సర్వజన= సమస్త ప్రజలకు; మనస్+హరంబును+ఐ= మనసును హరించేది; నిఖిల= సకలమైన; వన= అడవులలోని; పాదపంబులన్= చెట్లను; అలంకరించెన్= శోభితంగా చేసింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అజామిళుండు= అజామిళుడు; పితృ= తండ్రి యొక్క; నిర్దేశంబునన్= మాట మీద; కుశ= దర్భలు; సమిత్ (సమిత్తు)= సమిధలు; పుష్ప= పూవులు; ఫల+అర్థంబు= పండ్ల కొరకు; వనంబునకున్+అరిగి= అడవికి వెళ్ళి; తిరిగి వచ్చు= మరలి వచ్చు; సమయంబునన్= వేళలో; ఒక్క= ఒకానొక; లతా భవనంబునన్= పొదరింటిలో...

**తా :** ఇంతలో వసంత ఋతువు వచ్చింది. మన్మథుడనే బ్రహ్మదేవుడు ప్రారంభించిన యజ్ఞానికి వసంతుడనే పురోహితుడు అంకురారోపణం చేసినట్లు ఉద్యానవనాలలోని చెట్లకొమ్మలు కొత్తచిగుళ్లు తొడిగాయి. వాయువేగానికి కదలుతున్న ఆ చిగురాకులు కంపిస్తున్న జారజారిణీ జనహృదయాలలో గుచ్చుకొనే బాకులు లాగా ఉన్నవి. చక్కగా వికసించిన పువ్వులలో నుండి చెలరేగిన పుప్పొడి దుమారాలు ఆకాశాన వేలాడగట్టిన చాందినీలవలె ప్రకాశిస్తున్నాయి. పూలలో చిందుతున్న మకరంద బిందువుల విందులతో మైమరచిన మధుకరాల మధుర ఝుంకార నాదాలతో దిక్కులన్నీ పిక్కటిల్లుతున్నాయి. బాగా పండి పగిలినఫలాలను ఆరగిస్తూ ఆనందంతో చిలుకలు మొదలైనపక్షులు కలకల ధ్వనులు చేస్తున్నాయి. ఈ విధంగా అందరికీ ఆనంద దాయకమైన మధుమాసం చెట్లన్నింటికీ కొత్తసొగసులు చేకూర్చింది. ఆ సమయంలో అజామిళుడు తన తండ్రి ఆజ్ఞానుసారం దర్భలూ, సమిధలూ, పుష్పాలూ, పండ్లూ తీసుకొని రావటంకోసం తోటలోనికి వెళ్లి తిరిగివస్తూ ఒక దట్టమైన పొదరింట్లో

**క. బద్ధానురాగయై స్మరయుద్ధంబున కలరు బుద్ధి నురుకామకళా**
**సిద్ధ యగు వృషలితోఁ బ్రియవృద్ధిం దగఁ గూడియున్న విటు నొరుఁ గాంచెన్. 96**

**ప్రతి :** బద్ధ+అనురాగ+ఐ= మిక్కిలి అనురాగంతో నిండినదై; స్మర= మన్మథ సంబంధమైన; యుద్ధంబునకున్= పోరాటానికి; అలరు= సంతోషించే; బుద్ధిన్= బుద్ధితో; ఉరు= ఎక్కువైన; కామకళా= రతి సంబంధమైన విద్యలో; సిద్ధ+అగు= ఆరితేరిన; వృషలితోన్= శూద్రస్త్రీతో; ప్రియవృద్ధిన్= అధికతమకంతో; తగన్+కూడియున్న= జంటగా కలిసిఉన్న; విటున్+ఒరున్= జారుడైన ఒక పురుషుణ్ణి; కాంచెన్= చూశాడు.

**తా :** ఆ పొదరింట్లో తీవ్రమైన రతిసంబంధమైన కోరికతో మన్మథక్రీడ యందు నిష్ణాతురాలైన శూద్రస్త్రీతో కూడిన ఒక పురుషుణ్ణి చూశాడు.

**క. భటునిన్ రతిశాస్త్రకళార్భటునిన్ వరయౌవనానుభవమదవిభవో**
**ద్భటునిన్ సురతేచ్ఛాసంఘటునిన్ విగతాంబరోరుకటునిన్ విటునిన్. 97**

**ప్రతి :** భటునిన్= వీరుణ్ణి; రతిశాస్త్రకళా+ఆర్భటునిన్= కామతంత్రమునందు ఆరితేరినవాడిని; వర= ఎన్నదగిన; యౌవన+అనుభవ= యౌవనంయొక్క అనుభవంచేత కల్గిన; మద+విభవ+ఉద్భటునిన్= కామంయొక్క వైభవంతో గడిదేరినవాడు; సురత+ఇచ్ఛాసంఘటునిన్= రతిక్రీడ యందుగల కోరికతో కూడినవాడిని; విగత+అంబర= జారిన వస్త్రం కలిగిన; ఉరుకటునిన్= పెద్ద దిసమొల కలవాడిని; విటునిన్= ఒక జారుణ్ణి; కాంచెన్= చూశాడు.

**తా :** ఆ పొదరింటిలో రతిక్రీడలో ఆరితేరినాడు; యౌవనమద వైభవాన్ని ప్రదర్శించడంలో గడిదేరినవాడూ, సురతేచ్ఛతో కూడినవాడు, దిసమొలతో ఉన్నవాడూ అగు ఒక విటుణ్ణి చూశాడు.

**శా. హాలాఘూర్ణితనేత్రతో మదనతంత్రారంభసంరంభతో**
**ఖేలాపాలనయోగ్యభ్రూవిభవతోఁ గీర్ణాలకాజాలతో**
**హేలాలింగనభంగి వేషవతితో నిచ్ఛావతీమూర్తితోఁ**
**గేళిందేలుచునున్నవానిఁ గనెఁ బుంఖీభూతరోమాంచుఁడై 98**

**ప్రతి :** హాలాఘూర్ణిత= మద్యపానంవలన తిరుగుతున్న; నేత్రతోన్= కన్నులుకలదానితో; మదనతంత్ర+ఆరంభ సంరంభతోన్= కామక్రీడను ప్రారంభించుటయందు తొందరపాటు కలదానితో; ఖేలాపాలన= పైకి కిందకు ఆడుతున్నట్లున్న; యోగ్య= తగిన; భ్రూవిభవతోన్= కనుబొమలు కలదానితో; కీర్ణ+అలకాజాలతోన్= నుదుటిపై చల్లాచెదరుగా వ్యాపించిన ముంగురుల సమూహం కలదానితో; హేలా+ఆలింగన= విలాసంతోకూడిన కౌగిలియొక్క; భంగి= భంగిమ కలిగిన; వేషవతితోన్= ఆకారం కలదానితో; ఇచ్ఛావతీ మూర్తితోన్= కోరికలు రూపుదాల్చిన దానితో; కేళిన్= రతిక్రీడలో; తేలుచున్+ఉన్న వానిన్= నిండా మునిగి తేలుతున్నవాడిని; పుంఖీభూత= నిక్కబొడుచున్న; రోమ+అంచుఁడు+ఐ= పులకలు కలవాడై; కనెన్= చూశాడు.

**తా :** మధువు తాగిన మత్తులో రతి తరువాత తిరిగి రతికోసం తొందరపడుతూ, కనుబొమలను, కనుగ్రుడ్లను విలాసంగా ఆడిస్తూ, నుదుటక్రమ్ముకొన్న ముంగురులతో, కౌగిలింతకోసం, రతిక్రీడకోసం వెంపర్లాడుతున్న వేశ్యతో, స్వేచ్ఛారతిలో ఉన్న జారుణ్ణి చూశాడు.

**క. కలికి వగ మదనకదనపుఁ బలుకుల కలకలము బెడఁగుపడు మేఖల ము**
**వ్వల రవళిఁ దగిలి గతిగొనఁ గలకంఠి రతంబు సలుపు గమకముఁ గనియెన్. 99**

**ప్రతి :** కలికి= ఆ వేశ్యయొక్క; వగన్= విలాసంతో; మదనకదనము+పలుకుల= మన్మథయుద్ధంలో వెలువడే; పలుకుల= అవ్యక్తమైన మాటల; కలకలమున్= కలకలంతో; బెడఁగు+పడు= అధికమవుతున్న; మేఖల= ఒడ్డాణంయొక్క; మువ్వల= మువ్వలయొక్క; రవళిన్= మోతను; తగిలి= ఆసక్తితో; గతిగొనన్= ఏకమై; కలకంఠి= మృదుమధురంగా మాట్లాడగలిగే ఆ స్త్రీ యొక్క; రతంబున్= కామక్రీడను; సలుపు= చేస్తున్న; గమకమున్= ఔత్సుక్యాన్ని; కనియెన్= చూశాడు.

**తా :** సంభోగసమయంలో అనుకోకుండా నోటి నుండి వచ్చిన మణితం (అవ్యక్త మాటలధ్వని) ఒడ్డాణపు మువ్వల ధ్వనితో కలిసి మధుర ధ్వనులు వినిపిస్తుండగా, రతిలో సంపూర్ణ తమకంతో ఉన్న వనితను చూశాడు.

**క. కవకవనై పదనూపుర రవరవ లాగుబ్బుకొన్న రతిపతిగతులం**
**జివచివనై విటు చెవులకు రవళిన్ రతిసల్పు రతుల రవరవఁ గనియెన్.** **100**

**ప్రతి :** కవకవన్+ఐ= కవకవ ధ్వనులు కల్గిందై; పదనూపుర= కాలి అందెలయొక్క; రవరవలాగు= రవరవ ధ్వనుల పద్ధతి; ఉబ్బుకొన్న= అతిశయించిన; రతిపతి= మన్మథునియొక్క; గతులన్= క్రీడలలో; చివచివనై= మరమర మోగేవై; విటుచెవులకున్= ఆ జారుడి చెవులకు; రవళిన్= చక్కని శబ్దాలతో; రతిసల్పు= సంభోగం జరుపుతున్న; రతుల= (వివిధాలైన) కామక్రీడలయొక్క; రవరవన్= స్పర్ధతో ఉన్న దృశ్యాన్ని; కనియెన్= చూశాడు.

**తా :** ఆ యువతి కాలి అందెలు పోటాపోటీగా మోగుతూ, అతనికి ఆనందం కలిగిస్తుంటే వారు పోటీగా ఒకరి మీద ఒకరు పడుతూ చేస్తున్న సంభోగంలోని వివిధ భంగిమలను అజామిళుడు చూశాడు.

**చ. కురు లళికంబుపై నెగయఁ గ్రొమ్ముడి వీఁడగ గుబ్బదోయిపై**
**సరములు చౌకళింపఁ గటిసంగతి మేఖల తాళగింప స**
**త్కర వరకంకణావళులు గర్జిలఁ గౌ నసియాడ మీఁదుగా**
**మరుని వినోదముల్ సలిపె మానిని యౌవనగర్వరేఖతోన్.** **101**

**ప్రతి :** కురులు= ముంగురులు; అళికంబుపైన్= నుదుటిపై; ఎగయన్= ఎగిరిపడుతుంటే; క్రొమ్ముడి= తలకొప్పు; వీఁడగన్= విడిపోగా; గుబ్బదోయిపై= చనుగుబ్బలపై; సరములు= ముత్యాల దండలు; చౌకళింపన్= ముచ్చటగా కదులుతుండగా; కటిసంగతి= నడుము కూడికతో; మేఖల= ఒడ్డాణం; తాళగింపన్= తాళం వేస్తుండగా; సత్+కర= చక్కని చేతుల; వరకంకణ+ఆవళులు= శ్రేష్ఠమైన గాజుల వరుసలు; గర్జిలన్= గలగలమంటుండగా; కౌను= నడుము; అసి+ఆడన్= ఊగిసలాడుతుండగా; మీఁదుగా= విటునిమీద తానుండి; మరుని వినోదముల్= సంభోగ క్రీడా వినోదాలను; మానిని= ఆ వనిత; యౌవనగర్వరేఖతోన్= జవ్వనపు పొంగుతో; సలిపెన్= రతిసల్పింది (ఇది పురుషాయితక్రీడ).

**తా :** ఆ వేశ్య ముఖంపై ముంగురులు కదలాడుతుంటే, కొప్పు వీడిపోయే విధంగా, మెడలోని ఆభరణాలు ఊగుతుండగా నడుము కదలికలకు అనుగుణంగా ఒడ్డాణం తాళం వేస్తుంటే నడుము ఒత్తిడికి గురయ్యే విధంగా తన ఆధిక్యాన్ని చూపిస్తూ పురుషాయిత సంభోగక్రీడ సాగిస్తోంది.

**క. మవ్వపు సుకుమారాంగిని జవ్వని నుపగూహనాదిసముచితరతులన్**
**నివ్వటిలుదానిఁ గని మది నువ్విళ్ళూరంగ మన్మథోద్దీపనుఁడై** **102**

**ప్రతి :** మవ్వము; సుకుమార+అంగిని= యౌవనవతిఐన కోమల సుందరాంగి అయిన; జవ్వనిన్= ఆ స్త్రీని; ఉపగూహన+ఆది= కౌగిలింతలు మొదలైన; సముచిత= తగిన; రతులన్= సంభోగాలతో; నివ్వటిలుదానిన్= అతిశయించినదాని (మత్తెక్కి); మదిన్= తన హృదయంలో; ఉవ్విళ్ళు+ఊరన్+కన్= కోరిక లీరికలెత్తగా; మన్మథ+ఉద్దీపనుడు+ఐ= కామవికారంతో రగిలినవాడై; కని= చూస్తూ...

**తా :** నిండు యౌవనంతో మృదువైన శరీరంతో, ప్రియుని కౌగిలింతలతో పురుషాయిత శృంగారక్రీడలలో ఆరితేరిన కామ విలాసిని అయిన స్త్రీని చూచిన ఆ అజామిళుడు కామోద్రేకం కలవాడై

**తరలము.**

**బహుళదృక్పరిపాక మోహనిబద్ధుఁ డౌచు మనంబులో**
**సహజకర్మము వేదశాస్త్రము సాత్త్వికంబుఁ దలంచి త**
**న్నిహితచిత్తము వట్టి పట్టఁగనేరఁ డయ్యె సదా మనో**
**గహనమందు మరుండు పావకుకైవడిన్ జరియింపఁగాన్. 103**

**ప్రతి :** బహుళ= మిక్కుటమైన; దృక్= చూపులచేత; పరిపాక= పరిపక్వత నొందినదైన; మోహ= మోహంతో; నిబద్ధుఁడు+ఔచున్= కట్టుబడినవాడై; మనస్+గహనము+అందున్= మనస్సనే అడవిలో; మరుండు= మన్మథుడు; పావకుకైవడిన్= కార్చిచ్చువలె; చరియింపన్+కాన్= వ్యాపిస్తుండగా; మనంబులోన్= తన మనసులో; సహజకర్మము= తన కుల సహజమైన కర్మను; వేదశాస్త్రము= వేదాలు, శాస్త్రాలు మొదలైన; సాత్త్వికంబున్= సత్త్వగుణ ప్రధానమైన జ్ఞానాన్ని; తలంచి= భావించి; తద్+నిహిత చిత్తమున్= దానియందు ఉంచబడిన మనస్సును; పట్టి, పట్టన్+కన్+నేరదు= నిగ్రహించినవాడైకూడా, ఇపుడు నిగ్రహించలేనివాడు; అయ్యెన్= అయ్యాడు.

**తా :** తేప తేపకూ ఏపుమీరిన తన చూపులనే మోహపాశాలలో చిక్కుకొన్న ఆ బ్రాహ్మణ కుమారుడు నిత్యకృత్యాలైన వైదిక కర్మలనూ, శాస్త్రపాఠాలనూ, జపతపాలనూ మరచిపోయాడు. అతడి మనస్సనేఅరణ్యంలో కామోద్రేకమనేకార్చిచ్చు చెలరేగ సాగింది. నియమబద్ధమైన అతడిచిత్తం పట్టు తప్పిపోయింది.

**శా. ఆ లీలావతి గండపాళికలపై హాసప్రసాదంబు పై**
**నాలోలాలకపంక్తిపై నొసలిపై నాకర్ణదృగ్భూతిపై**
**హేలాపాదికుచద్వయోరుకటిపై నిచ్చల్ పిసాళింపఁగా**
**జాలిం బొందుచు నాత్మఁ గుందుచు మనోజాతానలోపేతుఁడై 104**

**ప్రతి :** ఆ లీలావతి= అందాల భామయైన ఆ స్త్రీయొక్క; గండపాళికలపైన్= చెక్కిళ్ళపై; హాస= చిరునవ్వు యొక్క; ప్రసాదంబుపైన్= అనుగ్రహంపై; ఆలోల+అలకపంక్తిపైన్= అందంగా ఊగుతున్న ముంగురుల శ్రేణిపై; నొసలిపైన్= నుదుటిపై; ఆకర్ణ= చెవుల వరకు వ్యాపించిన (పొడవైన); దృక్+భూతిపై= కన్నుల శోభపై; హేలా+ఆపాది= విలాసహేతువైనా; కుచద్వయ+ఊరుకటిపైన్= చన్నుల జంటపై, తొడల జఘన భాగాలపై; ఇచ్చల్= కోరికలు; పిసాళింపన్+కాన్= వ్యాపిస్తుండగా; జాలిన్+పొందుచున్= దిగులు పడుతూ; ఆత్మన్+కుందుచున్= మనస్సులో మదనపడుతూ; మనస్+జాత+ అనల+ ఉపేతుఁడు+ఐ= మనసునందు పుట్టిన అగ్నితో కూడుకున్నవాడై...

**తా :** అజామిళుడు ఆ క్షణం మొదలు ఆ అందాల భామ చిక్కని చెక్కిళ్లనూ, చిరునవ్వునూ, కదలుతున్న ముంగురులనూ, నున్నని నుదురునూ, చెవులదాకా వ్యాపించిన వాలుకన్నులనూ, బిగువైన కుచాలనూ, విశాలమైన కటిప్రదేశాన్నీ, మాటి మాటికీ స్మరింపసాగాడు. అతడిమనస్సులో ఆమెను పొందాలనే కోరిక చెలరేగింది. దిగులుతో క్రుంగిపోయాడు. విచారించాడు. కామావేశానికి లోనైనాడు.

**గీ. మతి కులాచారవర్తన మాటు చేసి పరగు పిత్రర్థములు దానిపాలు చేసి**
**సాధులక్షణగుణవృత్తిఁ జాలు చేసి లోలలోచన పసఁ జెంది లోలుఁ డయ్యె. 105**

**ప్రతి :** మఱి= ఇంకా; కుల+ఆచార= తన కులాచారమైన; వర్తనన్= నడవడిని; మాటుచేసి= మరుగుపెట్టి; పరగు= ప్రసిద్ధమైన; పితృ+అర్థంబులు= తండ్రియొక్క సంపాదనలు; దాని పాలుచేసి= ఆమెకు అప్పగించి; సాధులక్షణ= సజ్జన సహజమైన; గుణవృత్తిన్= గుణ సంపదను; చాలుచేసి= విడిచిపెట్టి; లోలలోచనన్= చంచలమైన కన్నులు గల ఆ స్త్రీపట్ల; పసన్+చెంది= ఆకర్షణకులోనై; లోలుడు+అయ్యెన్= ఆసక్తుడయ్యాడు.

**తా :** కులాచార మర్యాదలను కూలద్రోశాడు. తండ్రిగారు సంపాదించిన ఆస్తి నంతటినీ ఆమెపాలు చేశాడు. సాధు లక్షణాలైన సద్గుణాలను విడనాడాడు. బాగా రుచి మరిగి ఆ వాలుగన్నుల ఇంతి అందచందాలకు లొంగిపోయాడు.

**క. శ్యామఁ గుసుమాస్త్రఖేలనకామఁ గులస్త్రీలలామఁ గమనీయగుణ**
**స్తోమ నిజభామ నొల్లక ధామంబున డించి క్రించుఁదనమునఁబొడవై. 106**

**ప్రతి :** శ్యామన్= యౌవనవతి; కుసుమ+అస్త్ర ఖేలనకామన్= మన్మథ లీలలందు ఇష్టురాలైన; కులస్త్రీ= పతివ్రతలలో; లలామన్= శ్రేష్ఠమైనది; కమనీయ= మెచ్చదగిన; గుణస్తోమన్= సద్గుణ నిధి అయిన; నిజభామన్= సొంతభార్యను; ఒల్లక= ఇష్టపడక; ధామంబునన్= సొంతయింటిలో; డించి= వదలి; క్రించు+తనమునన్+పొడవై= అధమాధముడై...

**తా :** నిండు యౌవనం కలిగి సుగుణ సంపత్తి కలిగి, కామక్రీడ యందు అతనికి అనుకూల్యవతి అయిన భార్యను ఇంటిలోనే వదిలి, తన గౌరవాన్ని పోగొట్టుకొని, నీచుడై ఆ స్త్రీతోనే కాపురం మొదలుపెట్టాడు.

**ఉ. బంధులఁ దిట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యనాథకోటిఁ బెన్**
**బందెలు సుట్టి యీరములు పట్టి పథంబులు గొట్టి దిట్టయై**
**నిందల కోర్చి సాధులకు నిందితుఁడై గడియించు విత్త మా**
**సుందరి కిచ్చి మచ్చికలు సొంపెదఁ గూర్చి వసించెఁ దత్కృపన్. 107**

**ప్రతి :** బంధులన్= తన చుట్టాలను; తిట్టి= నిందించి; సత్+జనులన్= మంచివారిని; బాధలన్+పెట్టి= కష్టాలు పెట్టి; అనాథకోటిన్= దిక్కులేని వారిని; పెన్‌బందెలు+చుట్టి= పెద్ద ఇబ్బందులు కలిగించి; ఈరములు పట్టి= పొదలను ఆశ్రయించి; పథంబులు+కొట్టి= దారి దోపిడీలు చేసి; దిట్టయై= ఆరితేరినవాడై; నిందలకున్+ఓర్చి= లోక నిందలను ఓర్చుకొని; సాధులకున్= మంచివాళ్ళకు; నిందితుఁడై= చెడ్డవాడై; గడియించు= సంపాదించుకున్న; విత్తము= ధనం; ఆ సుందరికిన్= ఆ అందగత్తెకు; ఇచ్చి= అప్పగించి; మచ్చికలు= ఆమెయందు మరులు; సొంపు= ఆమెయొక్క అందం; ఎదన్+కూర్చి= తన హృదయంలో కూర్చుకొని; తత్+కృపన్= ఆమె దయతో; వసించెన్= జీవించసాగాడు.

**తా :** ఈ విధంగా అజామిళుడు చుట్టపక్కాలను దూషించాడు. సజ్జనులను ద్వేషించాడు. దిక్కులేని దీనులను చిక్కులపాలు చేశాడు. చిట్టచివరకు ధనం కోసం దారులు కాచి వచ్చేపొయ్యే జనాన్ని దోచుకున్నాడు. దొంగతనంలో ఆరితేరాడు. ఎవరు ఏ మనుకొన్నా, ఎన్ని తిట్టినా లెక్కచెయ్యకుండా సంపాదించిన ధనమంతా ఆ సుందరి చేతుల్లో పోసి, దానికి దాసుడై దాని దయా దాక్షిణ్యాలపై జీవింపసాగాడు.

**సీ. సముచితశ్రుతిచర్చ చర్చింప నొల్లక సతికుచద్వయచర్చఁ జర్చసేయుఁ**
**దర్కకర్కశపాఠతర్కంబు గాదని కలికితోఁ బ్రణయతర్కంబు సేయు**

**స్మృతిపదవాక్యసంగతిఁ గాక తత్సతిపదవాక్యసంగతిఁ బరఁగఁజేయు**
**నాటకాలంకారనైపుణం బుడిగి తన్నాటకాలంకారపాటిఁ దిరుగుఁ**

**గీ. బరఁగఁ జిరకాల మీ రీతిఁ బాపనియతి, రమణ దాసీకుటుంబభారము వహించి**
**యది కుటుంబిని గాఁగఁ బాపాత్ముఁ డగుచు, నశుచియును దుష్టవర్తనుఁడై మెలంగె. 108**

**ప్రతి :** సముచిత= యుక్తమైన; శ్రుతిచర్చ= వేదచర్చను; చర్చింపన్+ఒల్లక= చర్చించడం ఇష్టంలేక; సతి= ఆమెయొక్క; కుచద్వయచర్చన్= పాలిండ్లపై పూసే పూతలను గూర్చి; చర్చసేయున్= చర్చించేవాడు; తర్క= తర్కశాస్త్రంలోని; కర్కశ= కష్టతరమైన; పారతర్కంబున్= తత్త్వచర్చను; కాదని= వదలిపెట్టి; కలికితోన్= ఆ ఇంతితో; ప్రణయ= ప్రేమపూర్వకమైన; తర్కంబున్= వాదాన్ని; చేయున్= చేసేవాడు; స్మృతి= స్మృతులలోని; పదవాక్య= పదం, క్రమం, వాక్యం అనే; సంగతిన్= పద్ధతిని, వానికి సంబంధించిన విషయాలను కాకుండా; తత్+సతి= ఆ స్త్రీయొక్క; పదవాక్య సంగతిన్= మాటల విషయాలను; పరగన్+చేయున్= తెల్పుతూ వచ్చాడు; నాటక+అలంకార+నైపుణంబు+ఉడిగి= నాటక, అలంకార శాస్త్రాల నిపుణతను వదిలి; తద్+నాటక= ఆమెయొక్క కల్పిత నటనలను; ఆభరణాల పాటిన్= నగల సొగసుతనాన్ని మెచ్చుకుంటూ; తిరుగున్= తిరిగేవాడు; పరఁగన్+చిరకాలము+ఈరీతిన్+పాపనియతిన్= ఈ విధంగా చాలాకాలం ఏ మార్పు లేకుండా పాపకార్య నిష్ఠతో; రమణ= ప్రీతితో; దాసీ= ఆ స్త్రీయొక్క; కుటుంబ భారమున్= సంసారభారాన్ని; వహించి= తానే మోస్తూ, భరిస్తూ; అది= ఆమె; కుటుంబిని+కాన్+కన్= సొంత భార్యలా మారగా; పాప+ఆత్ముఁడు+అగుచున్= పాపాలయందు ఆసక్తుడవుతూ; అశుచియును= శుభ్రతలేనివాడై; దుష్టవర్తనుఁడు+ఐ= చెడుమార్గంలో నడిచేవాడై; మెలంగెన్= ప్రవర్తించాడు.

**తా :** వేదాంత చర్చను వదిలి ఆమె స్తన గంధ(లేపన) చర్చను చేసేవాడు. తర్కశాస్త్రంలోని కఠిన విషయాల చర్చను వదిలి ఆమెతో ప్రేమపూర్వక తర్కాన్ని జరిపేవాడు. స్మృతులలోని పద, వాక్య, విశేషాలను వివరించడం మాని, ఆమె మాటల తీరులోని విశేషాలను వర్ణించేవాడు. నాటక, అలంకార పాటవాన్ని కాదని, ఆమె కపట వర్తనలను, ఆభరణాల సౌందర్యాన్ని పొగిడేవాడు. ఈ విధంగా ఏ మార్పు లేక పాపాత్ముడైన అజామిళుడు ప్రీతితో ఆ ఇంతిని సొంత భార్యగా భావించి, ఆమె సంసార భారాన్ని తానే మోస్తూ, మలినదేహుడై చెడుమార్గంలో జీవించాడు.

**క. అటు గానఁ బాపకర్మునిఁ గుటిలుని సుజనార్తు ధూర్తుఁ గ్రూరుని నే మా**
**రటమునఁ గొని యేగెద మంతట దండమువలన నితఁడు ధన్యత నొందున్. 109**

**ప్రతి :** అటు+కానన్= ఆ కారణంగా; పాపకర్మునిన్= ఈ చెడు వర్తన కల్గినవాడిని; కుటిలునిన్= వక్రబుద్ధిని; క్రూరునిన్= హింసా ప్రవృత్తి కలవాడిని; ఏము+ఆరటమునన్= మేము బలిమితో; కొని+ఏగెదము= తీసుకుపోతాము; అంతటన్= దానితో; దండమువలనన్= మేము విధించే శిక్షల కారణంగా; ఇతఁడు= ఈ అజామిళుడు; ధన్యతను+ఒందున్= పాపరహితుడు అవుతాడు.

**తా :** అందుకని ఇటువంటి పాపాత్ముడిని, దుష్టుడిని, దుర్మార్గుడిని, హింసాపరుడిని మేము తీసుకుపోయి, తప్పక శిక్షిస్తాము. దానివలనమాత్రమే అతడు పాపరహితుడు అవుతాడు.

**వ. ఇట్లు పలుకుచున్న యమదూతల వారించి, నయకోవిదులైన భగవద్దూత లిట్లనిరి. 110**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పలుకుచున్+ఉన్న= మాట్లాడుతున్న; యమదూతలన్= యమకింకరులను; వారించి= ఆపి; నయకోవిదులు+ఐన= నీతినిపుణులైన; భగవత్+దూతలు= విష్ణుభటులు; ఇట్టు+అనిరి= ఇలా మాట్లాడారు.

**తా :** ఈ విధంగా మాట్లాడుతున్న యమకింకరుల్ని ఆపి, నీతినిపుణులైన విష్ణుదూతలు సమాధానంగా ఇలా అన్నారు.

**క. అవురా! ధర్మవివేకప్రవరుల పస గానఁబడియెఁ బాపము పుణ్యో**
**ద్భవుల నదండ్యుల దండన వివరం బొనరింపఁబడియె విధి యెఱుఁగమిచేన్. 111**

**ప్రతి :** అవురా= ఓహో; ధర్మవివేక= ధర్మాధర్మ విచక్షణలో; ప్రవరుల= పండితులయొక్క; పస= తెలివి; కానన్+పడియెన్= వెల్లడైంది; పాపము= అయ్యో; విధి= దండన విధానం; ఎఱుఁగముచేన్= తెలియకపోవడంవల్ల; పుణ్య+ఉద్భవుల= పుణ్యాత్ములయొక్క; అదండ్యుల= శిక్షార్హులు కానివారియొక్క; దండన వివరంబు= శిక్షలయొక్క వివరణం; ఒనరింపన్+ పడియెన్= చేయబడింది.

**తా :** ఓహో! మీరు ఎంత గొప్ప పండితులో మీ మాటలే చెబుతున్నాయి. మీకు అసలు శిక్షలు అమలుచేసే విధానమేమిటో తెలియకపోవడం వలన అయ్యో! పాపం దండనార్హులు కానట్టి పుణ్యపురుషులు శిక్షలకు గురి చేయబడినారు.

**చ. సములును సాధులున్ విహితశాసనులున్ సుదయాళురున్ శుభో**
**త్తమగుణులైన యట్టి తలిదండ్రులు బిడ్డల కెగ్గు సేయుచోఁ**
**గ్రమమున వార లెవ్వరికిఁ గైకొని కుయ్యిడఁ జాలువారు సం**
**భ్రమమున మీ మనంబులఁ దిరంబుగఁ జర్చ యొనర్చి చూడుఁడా! 112**

**ప్రతి :** సములును= సమబుద్ధిగలవారు; సాధులున్= సత్త్వగుణవర్తనులు; విహితశాసనులున్= శాసనాలను చేసినవారు; సుదయాళురున్= మంచి దయకలవారు; శుభ+ఉత్తమగుణులు+ఐన= మంచిగుణాలు కలవారైన; అట్టి తలిదండ్రులు= అలాంటి అమ్మా నాన్నలే; బిడ్డలకున్= తమ పిల్లలకు; ఎగ్గు+చేయుచోన్= చెడుచేస్తే; క్రమమునన్= ఆ పరిస్థితులలో; వారలు= ఆ పిల్లలు; ఎవ్వరికిన్= ఎవరి దగ్గరకు; కైకొని= పూనుకొని; కుయ్యి+ఇడన్+చాలువారు= మొరపెట్టుకోగలరు; సంభ్రమమునన్= ఆదరంతో; మీ మనంబులన్= మీ మనస్సులలో; తిరంబుగన్= స్థిరంగా; చర్చ= విచారణ; ఒనర్చి= చేసి; చూడుఁడు+ఆ= చూడండి.

**తా :** సమబుద్ధి గలవారు, సాధువర్తనులు, శాసనకర్తలు, మంచి దయాపరులు, గొప్ప సుగుణాలు కల్గిన తల్లి దండ్రులే తమ బిడ్డలకు కీడు చేయ తలపెట్టితే ఇక ఆ బిడ్డలు ఎవరితో మొర పెట్టుకోగలరు? మీ మనస్సులలో మీరే కొంచెం ఆలోచించి చూడండి.

**గీ. ఎఱుక గలుగు నాతఁ డేది యొనర్చిన నదియ చేతు రితరు లైన వార**
**లతఁడు సత్య మిట్టి దనెనేని లోకంబు తత్ప్రవర్తనమునఁ దగిలి యుండు. 113**

**ప్రతి :** ఎఱుక= జ్ఞానం; కలుగు= కలిగిన; ఆతఁడు+ఏది+ఒనర్చినన్= ఆ వ్యక్తి ఏదైతే చేస్తాడో; అదియ= ఆ పనినే; ఇతరులు+ఐనవారలు= మిగిలిన వారు; చేతురు= చేస్తారు; అతఁడు= ఆ జ్ఞాని; సత్యము+ఇట్టిది+అనెన్+ఏనిన్= నిజం ఇలాంటిది అని చెప్పితే; లోకంబు= (మిగతా) ప్రపంచం; తత్+ప్రవర్తనమునన్= దాన్ని ఆచరించడంలోనే; తగిలి+ఉండున్= ఆసక్తి కల్గి ఉంటుంది.

**తా :** వివేకవంతుడు ఏ పనినైతే సరైంది అని చేస్తాడో, ఇతరులు దానినే ఆచరిస్తారు. అతడు ఏది నిజమని చెబుతాడో ఆ విషయాన్నే లోకం కూడా నమ్మి అనుసరిస్తుంది.

**గీ. నెమ్మిఁ దొడలమీఁద నిద్రించు చెలికాని నమ్మఁ దగినవాఁడు నయము విడిచి**
**ద్రోహబుద్ధిఁ జంపఁ దొడరునే? యెందైనఁ బ్రీతి లేక ధర్మదూతలార! 114**

**ప్రతి :** ధర్మదూతలార= ఓ యమకింకరులారా!; ఎందున్+ఐనన్= ఎక్కడైనా; నెమ్మిన్= స్నేహబుద్ధితో, తొడలమీఁదన్= (మిత్రుని) ఒడిలో; నిద్రించు= నిద్రించే; చెలికాని= స్నేహితుణ్ణి; నయమున్= నీతిని; విడిచి= వదలిపెట్టి; ద్రోహబుద్ధిన్= ద్రోహచింతనతో; చంపన్= చంపాలని; నమ్మన్+తగినవాఁడు= విశ్వాసపాత్రుడు; తొడరునే= ప్రయత్నిస్తాడా? (ప్రయత్నించడు).

**తా :** ఓ యమకింకరులారా! ఒకడిని స్నేహితుడని నమ్మి అతని ఒడిలో నిద్రిస్తున్న మిత్రుడిని ఎవడైనా దయారహితుడై చంపాలని అనుకుంటాడా? (అనుకోడు).

**గీ. చిత్తమెల్ల నిచ్చి చెలితనంబున వచ్చి నచ్చి కలయ మెచ్చి నమ్మువానిఁ**
**గరుణ గలుగువాఁడుఁ గడు సౌమ్యుఁ డగువాఁడుఁ జింతసేయ కెట్లు సెఱుప నేర్చు? 115**

**ప్రతి :** చిత్తము+ఎల్లన్= మనసంతా; ఇచ్చి= అర్పించి; చెలితనంబునన్ వచ్చి= స్నేహపూర్వకంగా వచ్చి; నచ్చి= ఇష్టపడి; కలయన్‌మెచ్చి= కలిసి జీవించడానికి ఇష్టపడి; నమ్మువానిన్= తనను నమ్మినవాడికి; కరుణ= దయ; కలుగువాఁడున్= ఉన్నవాడు; కడున్+సౌమ్యుఁడు+అగువాఁడున్= మిక్కిలి శాంతస్వభావుడైనవాడు; చింత+చేయక= ఏ మాత్రం ఆలోచించకుండా; ఎట్లు= ఏవిధంగా; చెఱుపన్+నేర్చున్= నాశనం చేయాలనుకుంటాడు? (అనుకోడు).

**తా :** స్నేహభావంతో వచ్చి, హృదయమిచ్చి, తనకు బాగా నచ్చి, తనను మెచ్చి నమ్ముకున్న వ్యక్తికి దయాదాక్షిణ్యాలు గల బుద్ధిమంతుడు ఏ మాత్రం ఆలోచన లేకుండా ఎలా అపకారం చేస్తాడు? (అపకారం చెయ్యడు).

**వ. అదియునుం గాక. 116**

**ప్రతి :** అదియునున్+కాక= అది మాత్రమే గాక...

**తా :** అది మాత్రమే గాక

**ఉ. ఈతఁడు కోటిసంఖ్యలకు నెక్కుడు పుట్టువులందుఁ జెంది యా**
**యాతములైన పాపనివహంబుల నన్నిటిఁ బాఱఁదోలెఁ బ్ర**
**ఖ్యాతమతిన్ మహామరణకాలమునన్ హరిపుణ్యనామ సం**
**భూత సుధామయాద్భుత విభూతికరాక్షరసంగ్రహంబునన్. 117**

**ప్రతి :** ప్రఖ్యాతమతిన్= ప్రశస్తమైన బుద్ధితో; మహామరణ కాలమునన్= తన జీవితం చివరిదశలో; హరిపుణ్యనామ= శ్రీహరి పవిత్రనామంతో; సంభూత= ఏర్పడినట్టి; సుధామయ= అమృతమయమైన; అద్భుత విభూతికర= ఆశ్చర్యం కల్గించే ఐశ్వర్యకారకమైన; అక్షర సంగ్రహంబునన్= అక్షరాలు గ్రహించడంచేత; ఈతఁడు= ఈ అజామిళుడు; కోటిసంఖ్యలకున్= కోటికి; ఎక్కుడు= పైగా; పుట్టువులు+అందున్= జన్మలందు; చెంది= పొంది (సంపాదించిన); ఆయాతములు+ఐన= వచ్చినవైన; పాప నివహంబులన్= పాపపు గుంపులను; అన్నిటిన్= అన్నిటినీ; పాఱన్+తోలెన్= దూరం చేసుకొన్నాడు.

**తా :** ఈ అజామిళుడు తనకు కలిగిన శ్రీవిష్ణునామోచ్చారణం అనే అమృతప్రాయమైన ఐశ్వర్యం కారణంగా మంచిబుద్ధితో, కోటి జన్మలలో అతనికి సంక్రమించిన మహాపాపసముదాయాన్ని పూర్తిగా ఈ జన్మలో పోగొట్టుకోగలిగాడు.

**సీ. బ్రహ్మహత్యానేకపాపాటవుల కగ్నికీలలు హరినామకీర్తనములు**
**గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు**
**తపనీయచౌర్యసంతమసంబునకు సూర్యకిరణముల్ హరినామకీర్తనములు**
**మధుపానకిల్బిషమదనాగసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు**

**గీ. మహితయోగోగ్రనిత్యసమాధివిధుల, నలరు బ్రహ్మాదిసురులకు నందరాని**
**భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య, ఖేలనంబులు హరినామకీర్తనములు. 118**

**ప్రతి :** బ్రహ్మహత్యా+అనేక= బ్రహ్మహత్య మొదలైన ఎన్నో; పాప+అటవులకున్= మహాపాతకాలనే అడవులకు; హరినామ కీర్తనములు= శ్రీహరి పేరిట కీర్తించుటలు; అగ్నికీలలు= అగ్నిజ్వాలలు; గురుతల్ప కల్మష= గురు భార్యాసంగమ పాపమనే; క్రూర సర్పములకున్= భయంకరమైన పాములకు; హరినామకీర్తనములు= నారాయణనామస్మరణాలు; కేకులు= నెమళ్ళు; తపనీయ= బంగారమును; చౌర్య= దొంగిలించడమనే; సంతమసంబునకున్= చిమ్మచీకటికి; హరినామ కీర్తనములు= మాధవుని నామస్తుతులు; సూర్యకిరణముల్= సూర్యుని వెలుగురేఖలు; మధుపాన కిల్బిష= మద్యం త్రాగే పాపం అనే; మదనాగ సమితికిన్= మదమెక్కిన ఏనుగుల సమూహానికి; హరినామ కీర్తనములు= గోవిందుని నామ గానాలు; కేసరులు= సింహాలు; మహిత= గొప్పవైన; యోగ+ఉగ్రనిత్యసమాధి= యోగ విద్యలతో కూడిన తీక్ష్ణమైన సమాధి; విధులన్= కార్యాలను నిర్వహించడంవల్ల; అలరు= శోభిస్తున్న; బ్రహ్మ+ఆదిసురులకున్= బ్రహ్మ మొదలైన దేవతా సమూహానికి కూడా; అందరాని= పొందలేనట్టి; భూరి= గొప్పదైన; నిర్వాణసామ్రాజ్య= మోక్షమనే రాజ్యం యొక్క; భోగభాగ్య= భోగభాగ్యాలకు; హరినామకీర్తనములు= శ్రీకృష్ణుని గుణగానాలు; ఖేలనంబులు= క్రీడలు.

**తా :** నారాయణుని గుణ కీర్తనలు అనేవి బ్రహ్మహత్య వంటి మహా పాతకాటవులకు కార్చిచ్చులు. గురుభార్యా సంగమం వంటి పాపాలు అనే పాములకు నెమళ్ళు. బంగారం దొంగిలించడమనే చీకట్లకు సూర్యకిరణాలు. మద్యం తాగడం వంటి పాపాలనే మత్తెక్కిన ఏనుగులకు సింహాలు. ఎంతో గొప్పవైన యోగసమాధివంటి విధులను ఆచరించిన బ్రహ్మాది దేవతా సమూహానికి కూడా లభించని మోక్షసామ్రాజ్యానుభవానికి చెందిన క్రీడలు.

**సీ. ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్ కేలిమై హరినామకీర్తనములు**
**సత్యలోకానందసౌభాగ్యయుక్తముల్ కేలిమై హరినామకీర్తనములు**
**మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ కేలిమై హరినామకీర్తనములు**
**బహుకాలజనితతపఃఫలసారముల్ కేలిమై హరినామకీర్తనములు**

**గీ. పుణ్యమూలంబు లనపాయపోషకంబు, లభిమతార్థంబు లజ్ఞానహరణకరము**
**లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ, లార్తశుభములు హరినామకీర్తనములు. 119**

**ప్రతి :** ముక్తికాంతా= మోక్షం అనే కన్యతో; ఏకాంత= ఏకాంతంగా; మోహన కృత్యముల్= ఆనందకరమైన పనులకు; కేలిమై= కేళీస్థానం; హరినామకీర్తనములు= ముకుందునిదివ్యగానాలు; సత్యలోక= సత్య (బ్రహ్మ) లోకంలోని; ఆనందసౌభాగ్య= సంతోషమనే ఐశ్వర్యానికి; యుక్తముల్= అనువైన; కేలిమై= కేళీస్థానం; హరినామకీర్తనములు= శ్రీకృష్ణుని గుణగానాలు; మహిత= గొప్పవైన; నిర్వాణ= మోక్షమనే; సామ్రాజ్య+అభిషిక్తముల్= గొప్ప రాజ్యానికి పట్టం గట్టించే; కేలిమై= కేళీస్థానం; హరినామ కీర్తనములు= వైకుంఠుని పేరిట పాడే పాటలు; బహుకాల= చాలాకాలంనుండి; జనిత= కల్గిన; తపస్+ఫల= తపస్సు యొక్క ఫలితానికి; సారముల్= సారాంశాలైన; కేలిమై= కేళీస్థానం; హరినామ కీర్తనములు= ముకుందుని స్తుతిగీతాలు; పుణ్యమూలంబులు= పుణ్యాలకు కుదురులు; అనపాయపోషకంబులు= అపాయరహితములైన పోషకాలు; అభిమత+అర్థంబులు= కోరుకొన్నవైన సంపదలు; అజ్ఞానహరణ కరములు= అజ్ఞానాన్ని పొందబడినవి; ఆగమ+అంత= ఉపనిషత్తులయొక్క; ఉపలబ్ధములు= ఉత్తమసారాంశాలు; అమృతసేవలు= అమృతపానాలు; ఆర్తశుభములు= దీనులకు మంచి చేసేవి; హరినామకీర్తనములు= నారాయణనామగేయాలు.

**తా :** శ్రీమన్నారాయణుని నామగానాలు మోక్షమనే కన్యతో సలిపే సల్లాపాలు. సత్యలోక సౌఖ్యాలకు నెలవైనవి. మహిమాన్వితమైన ముక్తి అనే రాజ్యాధిపత్యానికి ఆలవాలమైనవి. ఎడతెగని దీర్ఘ తపస్సులకు ఫలితమైనవి. పుణ్యానికి ఆధారమైనవి. నిరపాయపోషకాలై కోరికలను తీర్చగలిగేవి, అజ్ఞానాన్ని పోగొట్టేవి, ఉపనిషత్తుల మూలసారాంశాలు.

**క. కామంబు పుణ్యమార్గస్థేమంబు మునీంద్రసాంద్రచేతస్సరసీ**
**ధామంబు జిష్ణునిర్మలనామంబుఁ దలంచువాఁడు నాథుఁడు గాఁడే? 120**

**ప్రతి :** కామంబు= కోరదగింది; పుణ్యమార్గ= శుభలోకాలకు; స్థేమంబు= నెలవైంది; ముని+ఇంద్ర= మునిశ్రేష్ఠుల యొక్క; సాంద్ర= చిక్కని; చేతస్+సరసీ= చిత్తమనే కొలనులకు; ధామంబు= ఆలవాలం; జిష్ణు= జయశీలుడైన విష్ణువు యొక్క; నిర్మల= పవిత్రమైన; నామంబున్= పేరును; తలంచువాఁడు= స్మరించేవాడు; నాథుఁడు+కాఁడే= సర్వసమర్థుడు కాడా? (అవుతాడు).

**తా :** ఆశించదగింది, శుభలోకాలకు నెలవైంది, ఋషుల మనసులే నివాసంగా కలిగింది, ముక్తికి మార్గమైంది అయినట్టి గోవిందనామస్మరణం నిత్యం చేసేవాడు సర్వసమర్థుడూ అవుతున్నాడు.

**క. డెందంబు పుత్రువలనన్ జెందిన దని తలఁపవలదు శ్రీపతి పే రే**
**చందముననైనఁ బలికిన నందకధరుఁ డందె కలఁడు నాథుం డగుచున్. 121**

**ప్రతి :** డెందంబు= అజామిళుని హృదయం; పుత్రువలనన్= కుమారునిమీదనే; చెందినది+అని= లగ్నమైంది అని; తలఁపవలదు= అనుకోవద్దు; శ్రీపతి పేరు= లక్ష్మీపతి అయిన విష్ణువు యొక్క నామం; ఏ చందమునన్+ఐనన్= ఏ విధంగానైనా; పలికినన్= పలికినా; నందకధరుఁడు= నందకమనే ఖడ్గం ధరించిన విష్ణువు; నాథుండు+అగుచున్= రక్షకుడవుతూ; అందున్+ఎ కలఁడు= ఆ నామంలోనే ఉంటాడు.

**తా :** అజామిళుడు “నారాయణా” అని పిలిచినప్పుడు ఇతనిహృదయం కుమారునిమీద ఆసక్తమై ఉన్నదని మీరు అనుకోవద్దు. భగవంతునిపేరును ఏ విధంగా పలికినప్పటికీ వాసుదేవుడు రక్షకుడై అందులో ఉండనే ఉంటాడు.

**గీ. బిడ్డపేరుఁ బెట్టి పిలుచుట విశ్రామకేళినైన మిగుల గేలినైన**
**పద్య గద్య గీత భావార్థముల నైనఁ గమలనయనుఁ దలఁపఁ గలుషహరము. 122**

**ప్రతి :** కమలనయనున్= కమలనేత్రుడైన శ్రీమహావిష్ణువును; బిడ్డపేరున్+పెట్టి= కుమారునికి పేరుంచి; పిలుచుట= పిలవడం; విశ్రామ= విశ్రాంతి సమయంలోగాని; కేళిన్+ఐనన్= ఆటలోగాని; మిగులన్= మిక్కిలి; గేలిన్+ఐనన్= హాస్యానికి గాని; పద్యగద్యగీత= పద్యం, గద్యం, గీతం మొదలైన వాటితో; భావ+అర్థములన్+ఐనన్= అర్థవంతమైన భావాలతోగాని; తలఁపన్= స్మరించగా; కలుషహరము= పాపనాశనం అవుతుంది.

**తా :** శ్రీమహావిష్ణువును బిడ్డపేరుతోనైనా, విశ్రాంతి సమయంలో అయినా, ఆటల్లోనైనా, పరిహాసంగానైనా, పద్యంలోనైనా, గద్యంలోనైనా, గీతాల్లోనైనా వాటి భావార్థాల్లోనైనా స్మరిస్తే చాలు అది సకల పాపాలను పోగొడుతుంది.

**ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం**
**బ్రేలినచోట సర్పముఖపీడల నందినచోట నార్తులై**
**తూలినచోట విష్ణు భవదూరునిఁ బేర్కొనిరేని మీఁద న**
**క్కాలుని యాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభావముల్. 123**

**ప్రతి :** కూలినచోటన్= కిందపడినప్పుడూ; కొట్టుపడి= గాయపడి; కుందినచోటన్= బాధపడుతున్నప్పుడూ; మహాజ్వర+ఆదులన్= భయంకరమైన జ్వరాలు మొదలైన వ్యాధులవలన; ప్రేలినచోటన్= ఆపస్మారకం వచ్చినపుడు; సర్పముఖ= పాముకాటుయొక్క; పీడలన్+అందినచోటన్= ప్రభావానికి గురైనపుడు; ఆర్తులై= కష్టాలతో కూడి; తూలిన చోటన్= బాధపడుతున్న వేళల; విష్ణున్= సర్వవ్యాపకుడు; భవదూరునిన్= పాపనాశకుడు అయిన హరిని; పేర్కొనిరి+ఏనిన్= తలచినట్లైతే; మీఁదన్= ఆపై; అ+కాలుని= ఆ యమునివలన కలిగే; యాతనావితతిన్= కష్టాల సమూహాలను; కానరు= పొందరు; దుఃఖభావముల్= దుఃఖాన్ని; పూనరు= పొందరు.

**తా :** ప్రమాదవశాత్తు జారిపడినపుడూ, గాయపడి ఈతిబాధలతో కుంగినపుడూ, విషజ్వరాలవంటి వ్యాధులు సంక్రమించినపుడు, సంధివాతం ఏర్పడి ప్రేలాపన కలిగినపుడు, పాములవంటి విషజంతువుల వలన బాధకు గురైనపుడు, ఇలాంటి ఏ సందర్భంలోనైనా విష్ణువుని స్మరించగలిగితే అలాంటి వారికి యముని వలన ఏ విధమైన భయం పొందరు. దుఃఖ దశల్ని పొందరు.

**సీ. అతిపాపములకుఁ బ్రయత్నపూర్వకముగఁ దనుపాపములకు మితంబుగాఁగ**
**సన్మునివరులచే సంప్రోక్తమై యుండు నిర్మలంబగు పాపనిష్కృతములు**
**క్రమరూపమున నుపశమనంబులగుఁ గాని తత్క్షణంబున నవి దరువలేవు**
**సర్వకర్మంబుల సంహార మొనరించి చిత్తంబునకుఁ దత్త్వసిద్ధి నొసఁగు**

**గీ. నొనర నీశుసేవ యోగిమానస సరో, వాసుసేవ హేమవాసు సేవ**
**వేదవేద్యుసేవ వేదాంతవిభుసేవ, పరమపురుష పాదపద్మసేవ. 124**

**ప్రతి :** నిర్మలంబు+అగు= స్వచ్ఛమైన; పాప నిష్కృతములు= పాపపరిహారకాలు; అతిపాపములకున్= పెద్ద పాపాలకు; ప్రయత్నపూర్వకము+కన్= ఎంతో ప్రయత్నంతో (ఎక్కువగా); తను పాపములకున్= చిన్న పాపాలకు; మితంబు+కాన్+కన్= తక్కువగా; సత్+మునివరులచేన్= మునివర్యులచే; సంప్రోక్తము+ఐ+ఉందున్= చెప్పబడి ఉన్నాయి; అవి= ఆ పాపపరిహారాలు (ప్రాయశ్చిత్తాలు); క్రమరూపమునన్= వరుసగా (నెమ్మదిగా); ఉపశమనంబులు+అగున్+కాని= పాపశాంతిని కల్గిస్తాయేకానీ; తత్+క్షణంబునన్= వెంటనే; తరువలేవు= నశింపజేయలేవు; ఈశుసేవ= పరమేశ్వరునిసేవ; యోగిమానస సరస్ వాసుసేవ= యోగుల మనస్సులు అనే సరస్సులో ఉండే భగవంతుని సేవ; హేమవాసుసేవ= బంగారువన్నె గల వస్త్రం (పీతాంబరం) ధరించే విష్ణువు సేవ; వేదవేద్యుసేవ= వేదాలచే తెలియదగిన పురుషోత్తముని సేవ; వేద+అంత, విభుసేవ= ఉపనిషత్తులకు ప్రభువైన శ్రీహరి సేవ; పరమపురుష పాదపద్మసేవ= పరమపురుషుని అన్ని కర్మలనూ; సంహారము+ఒనరించి= నాశనం చేసి; చిత్తంబునకున్= మనస్సుకు; తత్త్వసిద్ధిన్= పరమాత్మ స్వరూపసిద్ధిని; ఒసఁగున్= కల్గిస్తుంది.

**తా :** పెద్ద పాపాలకు పెద్దప్రాయశ్చిత్తాలనూ, చిన్నపాపాలకు చిన్నప్రాయశ్చిత్తాలనూ మహానుభావులైన మునులు నిర్ణయించే ఉన్నారు. కాని ఆ ప్రాయశ్చిత్తాలవల్ల ఆ పాపాలు తాత్కాలికంగా ఉపశమిస్తాయి తప్ప, పూర్తిగా పరిహారం కావు. సమస్తపాపాలనూ సంపూర్ణంగా హరించి, మనస్సును పరిశుద్ధం చెయ్యాలంటే భగవంతునిసేవ ఒక్కటే సరి అయిన త్రోవ. ఆ పరమేశ్వరుణ్ణి, ఆ యోగిమానసవాసుణ్ణి, ఆ పీతాంబరధారుణ్ణి, ఆ వేదవేద్యుణ్ణి, ఆ పురుషోత్తముణ్ణి సంస్మరిస్తూ ఆయన పాదాలు సేవిస్తే మోక్షం సిద్ధిస్తుంది.

**క. హరి నెఱుఁగని యా బాలుఁడు హరిభక్తులతోడఁ గూడి హరియను వాఁడున్**
**సరియై దోషము లడఁచును గరువలితో నగ్ని తృణముఁ గాల్చినభంగిన్. 125**

**ప్రతి :** హరిన్+ఎఱుఁగని= విష్ణువు అంటే తెలియని; ఆ బాలుఁడు= ఆ చిన్నపిల్లవాడు కూడా; హరి భక్తులతోడన్= విష్ణు భగవద్భక్తులతో; కూడి= కలిసి; హరి+అనువాఁడున్= శ్రీహరీ! అంటూ స్మరించినవాడైతే (పలికేవాడైతే); కరువలితోన్= గాలితో; అగ్ని= నిప్పుచేరి; తృణమున్= గడ్డిపరకను; కాల్చినభంగిన్= కాల్చివేసిన విధంగా; సరియై= సంపూర్ణంగా; దోషములు+అడఁచున్= పాపాలను తొలగిస్తుంది.

**తా :** దైవం అంటే ఏమిటో అర్థం తెలియని చిన్నపిల్లవాడుకూడా మిగతా హరిభక్తులతో కలసి భగవన్నామస్మరణ చేస్తేచాలు గాలి సహాయంతో అగ్ని గడ్డిని బూడిదగా ఎలాచేస్తుందో అదేవిధంగా హరినామస్మరణం అతని పాపాలన్నిటిని పటాపంచలు చేస్తుంది.

**విశే :** వేదాంతశాస్త్ర పరిభాషలో 'బాలుడు' అంటే 'అజ్ఞాని' అని అర్థం. పరమాత్మను తెలుసుకోవటమే జ్ఞానం. తెలుసుకోకపోవటం అజ్ఞానం.

**ఉ. ఆరయ వీర్యవంతమగు నౌషధ మెట్లు యదృచ్ఛఁ గొన్నఁ ద**
**చ్చారుగుణంబు రోగములఁ జయ్యనఁ బాపినమాడ్కిఁ బుణ్య వి**
**స్ఫారుని నంబుజోదరునిఁ బామరుఁ డజ్ఞుఁ డవజ్ఞఁ బల్కినన్**
**వారక తత్ప్రభావము ధ్రువంబుగ నాత్మగుణంబుఁ జూపదే! 126**

**ప్రతి :** ఆరయన్= పరిశీలించగా; వీర్యవంతము+అగు= సమర్థవంతమైన; ఔషధము= మందు; ఎట్లు= ఏ విధంగానైతే; యదృచ్ఛన్= అనుకోకుండా (ఆకస్మికంగా); కొన్నన్= తీసుకున్నా కూడా; తత్+చారుగుణంబు= దాని ప్రభావవంతమైన లక్షణం; రోగములన్= (సంబంధిత) వ్యాధులను; చయ్యనన్= వెంటనే; పాపినమాడ్కిన్= పోగొట్టిన విధంగా; పుణ్యవిస్ఫారునిన్= అధికమైన పుణ్యంకలవాణ్ణి; అంబుజ+ఉదరునిన్= కమలనాభుణ్ణి; పామరుఁడు= సామాన్యుడు; అజ్ఞుఁడు= మూర్ఖుడు; అవజ్ఞన్= అవహేళనగా; పల్కినన్= పల్కినప్పటికీ; వారక= అడ్డులేని; తత్+ప్రభావము= ఆ నామం యొక్క శక్తి; ధ్రువంబు+కన్= నిశ్చయంగా; ఆత్మగుణంబున్= తన ప్రభావాన్ని; చూపదు+ఏ= చూపిస్తుంది కదా!

**తా :** శక్తిమంతమైన ఔషధం కాకతాళీయంగా తీసుకున్నా అది తన ప్రభావంతో ఏ విధంగా వ్యాధిని తగ్గిస్తుందో, ఆ విధంగా, భగవంతుని నామాన్ని మూర్ఖుడు తెలియక పలికినా, అవహేళనగా పలికినా దాని ప్రభావం ఊరకనే పోదు. దాని మహత్తరగుణాన్ని తప్పకుండా చూపించి తీరుతుంది.

**క. ధృతి దప్పిన తఱినిఁ బురాకృతమునఁగా కెట్లు దోఁచుఁ గేశవుఁడు మదిన్**
**మితిలేని జగముఁ దాల్చిన యతఁ డొక్కని మనములోన నణఁగెఁడువాఁడే? 127**

**ప్రతి :** ధృతిన్= (చావుభయంతో) ధైర్యాన్ని; తప్పిన= కోల్పోయిన; తఱినిన్= సమయంలో; పురాకృతమునన్= పూర్వజన్మలో చేసిన పుణ్యంవల్ల; కాక= తప్ప; కేశవుఁడు= శ్రీహరి; మదిన్= మనస్సులో; ఎట్లుతోఁచున్= ఎలా గుర్తుకు వస్తాడు; మితిలేని= అనంతమైన; జగమున్= లోకాన్ని; తాల్చిన= ధరించిన; అతఁడు= ఆ శ్రీహరి; ఒక్కని= ఎవరో ఒక్కరి; మనములోనన్= హృదయంలో మాత్రమే; అణఁగెఁడువాఁడే= ఉండిపోయేవాడా? (కాదు).

**తా :** పూర్వజన్మ పుణ్యఫలంగా తప్ప, ధైర్యం కోల్పోయిన మనస్సు భగవన్నామ స్మరణ చేయలేదు. సకల లోకాలను తనలో ఇముడ్చుకోగలిగిన విష్ణువు కేవలం ఒక్కని మనసులో మాత్రమే ఉంటాడా? (ఉండడని భావం).

**మ. నిరతంబై నిరవద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై**
**నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ**
**హరినామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా**
**మరణాంతంబున నిట్టి సజ్జనునిధర్మం బేల వ్యర్థం బగున్? 128**

**ప్రతి :** నిరతంబు+ఐ= (ఆద్యంతరహితమై) ఎడతెగనిదై; నిరవద్యము+ఐ= ఆక్షేపణ లేనిదై; నిఖిల= సమస్తమైన; చిత్+నిర్మాణము+ఐ= చైతన్యకారకమై; నిత్యము+ఐ= శాశ్వతమై; నిర్+అహంకార= అహంకారం లేని; గుణ+ఆఢ్యము+ఐ= గుణసంపద కలదై; నియమము+ఐ= క్రమబద్ధమై; నిర్దోషము+ఐనట్టి= దోషంలేనిదైన; శ్రీహరి= విష్ణువుయొక్క; నామస్మరణ+అమృతంబు= నామాన్ని స్మరించడం అనే అమృతాన్ని; ఇతఁడు= ఈ అజామిళుడు; ప్రత్యక్షంబు= స్వయంగా; తాన్= అతడు; మరణ+అంతంబునన్= చావుకు దగ్గరగా ఉన్న సమయంలో; సేవించెన్= తాగాడు; ఇట్టి= ఇలాంటి; సత్+జనుని= పుణ్యాత్ముని యొక్క; ధర్మంబు= పుణ్యం; ఏల= ఎందుకు; వ్యర్థంబు+అగున్= వృథా అవుతుంది? (వృథా కాదు).

**తా :** ఇక ఈ అజామిళుని విషయమంటారా! మరణకాలంలో ఈ మహనీయుడు శ్రీహరినామస్మరణం అనే అమృతాన్ని ప్రత్యక్షంగానే ఆస్వాదించాడు. శాశ్వతమైందీ, నిర్దోషమైందీ, సమస్తమైన చైతన్యానికి ఆలవాలమైందీ, నిత్యసత్యమైందీ, నిరహంకార సుగుణ సంపదలతో కూడిందీ, నియమబద్ధమైందీ, నిర్మలమైందీ అయిన నారాయణనామస్మరణం ఎలా వ్యర్థమవుతుంది?

**వ. అని యిట్లు భగవద్దూతలు భాగవతధర్మంబు నిర్ణయించి, యీ యర్థంబున మీకు సంశయంబు గలదేని మీ రాజు నడుగుఁడు పొండు అని పలికి బ్రాహ్మణుని నతిఘోరం బైన యామ్యపాశబంధ నిర్ముక్తునిం గావించి, మృత్యువువలని యెడరు వాపిరి. అంత నా యమదూతలు చేయునది లేక యమలోకంబునకుం జని, పితృపతికి సర్వంబును నెఱింగించిరి. అంత. 129**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; భగవత్+దూతలు= విష్ణుభటులు; భాగవత ధర్మంబు= భగవత్ భక్తులయొక్క ధర్మసూక్ష్మాన్ని; నిర్ణయించి= నిర్ధారణచేసి; ఈ+అర్థంబునన్= (మేము చెప్పిన) ఈ విషయంలో; మీకున్= యమభటులైన మీకు; సంశయంబు= సందేహం; కలదు+ఏనిన్= ఉన్నట్లయితే; మీ రాజున్= మీ పాలకుడైన యముడిని; అడుగుఁడు= అడగండి; పొండు= ఇక వెళ్ళండి; అని పలికి= అని చెప్పి; బ్రాహ్మణునిన్= అజామిళుణ్ణి; అతిఘోరంబు+ఐన= మిక్కిలి భయంకరమైన; యామ్యపాశ= యమపాశాలచే కలిగిన; బంధ= కట్టునుండి; నిర్ముక్తునిన్= విడుదల కలవాడుగా; కావించి= చేసి; మృత్యువువలని= చావువలన కలిగిన; ఎడరు= కష్టమును; పాపిరి= పోగొట్టిరి; అంతన్= ఆ తరువాత; ఆ యమదూతలు= ఆ యమకింకరులు; చేయునది లేక= చేయగల్గింది ఏమీలేక; యమలోకంబునకున్= యమలోకానికి; చని= వెళ్ళి; పితృపతికిన్= యమధర్మరాజుకు; సర్వంబునున్= జరిగిన విషయం మొత్తాన్ని; ఎఱింగించిరి= తెలియజేశారు; అంతన్= అటుపిమ్మట...

**తా :** ఈ విధంగా విష్ణుదూతలు భక్తితత్త్వాన్ని, నామవైశిష్ట్యాన్ని వివరించి, మీకు ఇంకా ఏమైనా అనుమానాలు ఉంటే మీ ప్రభువైన యమధర్మరాజును అడిగి తెలుసుకొమ్మని చెప్పి పంపించారు. ఇటు అజామిళుడిని మృత్యుభయం నుండి, నరక భీతినుండి విముక్తుణ్ణి చేశారు. యమకింకరులు అశక్తులై వెనుదిరిగి యమలోకానికి పోయి, జరిగిందంతా యమునికి తెలియజేశారు. ఆ తర్వాత

**క. అతఁడును బాశచ్యుతుఁడై గతభయుఁడై ప్రకృతి నొంది కడు నుత్సవ సం**
**గతిఁ జూచి మ్రొక్కి మదిలో నతులితముద మొదవి పొదలి హరిదాసులకున్. 130**

**ప్రతి :** అతఁడునున్= ఆ అజామిళుడును; పాశచ్యుతుఁడు+ఐ= యమపాశనుండి తొలగినవాడై; గతభయుఁడు+ఐ= భయం పోయినవాడై; ప్రకృతిన్+ఒంది= స్వస్థతను పొంది; కడున్+ఉత్సవసంగతిన్+చూచి= మిక్కిలి ఉత్సాహభరితుడై (విష్ణుదూతలను) కనుగొని; అతులిత= సాటిలేని; ముదము+ఒదవి= సంతోషం పొంది; పొదలి= ప్రయత్నంతో కూడి; హరిదాసులకున్= విష్ణుదూతలకు; మ్రొక్కి= నమస్కరించి; మదిలోన్= మనస్సులో...

**తా :** యమపాశం నుండి విముక్తుడై అజామిళుడు స్వస్థతపొంది, ఆనందపరవశుడై, విష్ణుదూతలకు మనసులోనే వందనాలు సమర్పించి

**తే. నిలిచి కేలు మొగిచి పలుక నుద్యోగించి చెలఁగుచున్న లోనితలఁపుఁ దెలిసి**
**చక్రధరునికూర్మిసహచరు లరిగి రదృశ్యు లగుచు దేవదేవుకడకు. 131**

**ప్రతి :** నిలిచి= నిలబడి; కేలు= చేతులు; మొగిచి= జోడించి (నమస్కరించి); పలుకన్+ఉద్యోగించి= మాట్లాడే ప్రయత్నం చేసి; చెలఁగుచున్= ఉత్సాహంతో ఉన్న; లోనితలఁపున్= అతని మదిలోని ఆలోచనను; తెలిసి= గుర్తించి; చక్రధరుని= విష్ణుమూర్తి యొక్క; కూర్మి సహచరులు= ప్రియసేవకులు; దేవదేవుకడకున్= దేవతలకు దైవమైన వాని (విష్ణువు) వద్దకు; అదృశ్యులు+అగుచున్= కన్పించనివారై; అరిగిరి= వెళ్లారు.

**తా :** అజామిళుడు లేచి వారికి నమస్కరించి ఏదో చెప్పడానికి ఉత్సహిస్తుండగా అతని మనసును గుర్తించిన విష్ణుదూతలు అదృశ్యులై వైకుంఠవాసుని వద్దకు వెళ్ళిపోయారు.

**క. వేదత్రయసంపాద్యము మోదంబు గుణాశ్రయంబు మును భగవద్ధ**
**ర్మాదేశంబగు తద్భటవాదంబు నజామిళుండు వదలక వినుచున్. 132**

**ప్రతి :** వేదత్రయ= మూడువేదాలయొక్క జ్ఞానంచేత; సంపాద్యము= పొందదగింది; మోదంబు= సంతోషంతో కూడింది; గుణ+ఆశ్రమంబు= త్రిగుణాలకు ఆశ్రయమైందీ; మును= పూర్వం; భగవత్= భగవంతునియొక్క; ధర్మ+ఆదేశంబు+అగు= ధర్మప్రబోధమైన; తద్+భట= విష్ణుయమదూతల; వాదంబున్= సంభాషణను; అజామిళుండు= అజామిళుడనే ఆ బ్రాహ్మణుడు; వదలక= శ్రద్ధగా; వినుచున్= ఆలకిస్తూ...

**తా :** ఋక్, యజుస్, సామవేదాల సారభూతం, ఆనందకరం, సమస్తశుభప్రదగుణాలకు నిలయం, పరమాత్ముని ధర్మప్రబోధం అయిన విష్ణు, యమదూతల సంవాదాన్ని అజామిళుడు శ్రద్ధాళువై ఆలకిస్తూ

**క. శ్రీమన్నారాయణపదతామరసధ్యానసలిలధౌతమహాఘ**
**స్తోముండై సద్భక్తికి ధామం బగుచుండెఁ దెలిసి తత్క్షణమాత్రన్. 133**

**ప్రతి :** శ్రీమత్+నారాయణ= ఆ లక్ష్మీనారాయణుని యొక్క; పద= పదములనే; తామరస= పద్మాలను; ధ్యాన= ధ్యానమనే; సలిల= పవిత్రజలంతో; ధౌత= కడుగబడిన; మహా+అఘస్తోముండు+ఐ= గొప్ప పాపాలనే సమూహాలను కలిగినవాడై; తత్+క్షణమాత్రన్= ఆ క్షణంలోనే; సత్+భక్తికిన్= నిర్మలమైన భక్తికి; ధామం= నిలయం; అగుచున్+ఉండెన్= అవుతూ ఉండెను.

**తా :** శ్రీమన్నారాయణునిచరణకమలస్మరణమనే నిర్మలజలం అతని మహాపాతక సమూహాలన్నింటినీ కడిగివేసింది. అతని హృదయం నిశ్చలభక్తికి నిలయమై క్షణమాత్రంలో అతనికి జ్ఞానోదయమయింది.

**క. బరవసమున నరికట్టిన దురితంబులఁ దలఁచి తలఁచి తుదిఁ దాపమునన్**
**హరి నీశు నాశ్రయింపుచుఁ బరితాపము నొంది పలికె బ్రాహ్మణుఁ డాత్మన్. 134**

**ప్రతి :** బరవసమునన్= బలవంతంగా (ధైర్యంతో); అరికట్టిన= అడ్డగించిన; దురితంబులన్= తన పాపాలను; తలఁచి తలఁచి= మాటిమాటికి జ్ఞాపకం చేసుకొని; తాపమునన్= (తనకు కలిగిన) బాధతో; తుదిన్= చివరి దశలో; ఈశున్= సర్వేశ్వరుడైన; హరిన్= శ్రీహరిని; ఆశ్రయింపుచున్= శరణుకోరుతూ; పరితాపమున్= పశ్చాత్తాపాన్ని; ఒంది= పొంది; బ్రాహ్మణుఁడు= ఆ అజామిళుడు; ఆత్మన్= తన మనస్సులో; పలికెను= మాట్లాడుకున్నాడు.

**తా :** ఇప్పటిజన్మలో తాను చేసినపాపాలన్నీ అజామిళుడికి మాటిమాటికి జ్ఞాపకానికి వచ్చి, బాధపెడుతుండగా, పశ్చాత్తాపహృదయంతో శ్రీహరిని శరణుకోరుకొంటూ, ఆత్మవిమర్శ చేసుకుంటున్నాడు.

సీ. వృషలియం దనురాగవృద్ధి బిడ్డలఁ గని కులము గోదావరిఁ గూలఁద్రోచి
రచ్చల కెక్కి పెన్ రజ్జుసేతల సరివారిలోపలఁ దలవంపు చేసి
కట్టిఁడిముదుకనై కర్మబంధంబుల పుట్టనై నిందల ప్రోవ నగుచుఁ
దరుణుల రోఁతల దవిలి భోగించిన కడిఁది నా జన్మంబు గాలిపోయెఁ

ఆ. జదువు చట్టువడియె శాస్త్రంబు మన్నయ్యె, బుద్ధి పురువు మేసెఁ బుణ్య మణఁగె
నీతి మట్టుపడియె నిర్మలజ్ఞానంబు, మొదలి కుడిగె బోధ మూరిఁబోయె. 135

**ప్రతి :** వృషలి+అందున్= వేశ్యపట్ల; అనురాగవృద్ధిన్= మిక్కిలి మోహం పెరిగినందున; బిడ్డలన్+కని= పిల్లలను పొంది; కులమున్= తన బ్రాహ్మణకులగౌరవాన్ని; గోదావరిన్= గోదావరినదిలో; కూలన్+త్రోచి= ముంచివేసి; రచ్చలకున్+ఎక్కి= పరువును వీథిపాలుచేసి; పెన్ రజ్జుచేతలన్= పెద్ద చెడ్డ పనులచేత; సరివారిలోపలన్= తన సాటివారిలో; తలవంపుచేసి= అవమానాలపాలుచేసి; కట్టిఁడి ముదుకనై= క్రూరుణ్ణి అయి, వృద్ధుడనై; కర్మబంధంబుల= సంసార బంధాలయొక్క; పుట్టన్+ఐ= నిలయమునై; నిందలప్రోవను+అగుచున్= అనేక అపవాదాల రాశినవుతూ; తరుణుల= పరస్త్రీలయొక్క; రోఁతలన్= రోత సుఖాలలో; తగిలి= చిక్కి; భోగించిన= అనుభవించిన; కడిఁది= సహింప శక్యంగాని; నా జన్మంబు= నా పుట్టుక; కాలిపోయెన్= కాలి బూడిదయ్యింది; చదువు= విద్య; చట్టు+పడియెన్= నాశనమయ్యింది; శాస్త్రంబున్= శాస్త్రజ్ఞానం; మన్ను+అయ్యెన్= మట్టిపాలు అయింది; బుద్ధిన్= తెలివిని; పురువుమేసెన్= చెదలు తినింది; పుణ్యము+అణఁగెన్= చేసిన పుణ్యరాశి నశించింది; నీతి= నియమబుద్ధి; మట్టుపడియెన్= తగ్గిపోయింది; నిర్మలజ్ఞానంబు= స్వచ్ఛమైన జ్ఞానం; మొదలికిన్+ఉడిగెన్= పూర్తిగా నిర్మూలమైంది; బోధ= పెద్దలవలన విన్న ఉపదేశం; మూరిన్+పోయెన్= నశించింది.

**తా :** నేను ఆ శూద్రకాంతమీద అనురాగం పెంచుకున్నాను. ఆ జారిణియందు సంతానాన్ని కన్నాను. కులగౌరవాన్ని గోదావరిలో కలిపి వేశాను. నా బ్రతుకు రచ్చల కెక్కించాను. సిగ్గుమాలిన పనులకు పాల్పడి సాటివారిలో తలవంపులు తెచ్చుకొన్నాను. వార్ధక్యం పైనబడినప్పటికీ సంసార బంధాలనుంచి బయటపడలేక – లోకనిందలను లెక్క చేయకుండా వారకాంతా పరాయణుండనై ఆ రోత సుఖాల రొచ్చులో మునిగి తేలుతూ నా బ్రతుకంతా పాడుచేసుకున్నాను. పవిత్రమైన జీవితం భస్మమైపోయింది. నా చదువు చట్టుబండలైంది. నా శాస్త్రజ్ఞానమంతా శూన్యమైపోయింది. నా బుద్ధి పురుగు మేసింది. పుణ్యం బుగ్గి అయింది. నీతి అడుగంటింది. నియమం మరుగుపడింది. నా తెలివి తెల్లవారింది.

క. చిక్కని చక్కని చన్నుల మక్కువ యిల్లాలి విడిచి మాయలు గల యీ
వెక్కసపుమద్యపానపు డొక్కపసం దగిలి దుర్విటుఁడనై చెడితిన్. 136

**ప్రతి :** చిక్కని= నిండైన; చక్కని= అందమైన; చన్నుల= వక్షోజాలు కల్గిన; మక్కువ= ప్రేమ కలిగిన; ఇల్లాలిన్= భార్యను; విడిచి= వదిలిపెట్టి; మాయలుగల= మోసపూరితమైన; ఈ వెక్కసము= ఈ అసహ్యకరమైన; మద్యపానము= కల్లుత్రాగే; డొక్కపసన్+తగిలి= ఈ చెడ్డ స్త్రీని పొంది; దుర్విటుఁడను+ఐ= చెడ్డజారుణ్ణి అయి; చెడితిన్= చెడిపోయాను.

**తా :** నిండుయౌవనం కలిగి, నన్ను మక్కువతో మన్నించే భార్యను వదిలిపెట్టి, మోసగత్తె, తాగుబోతు అయిన ఈ నీచస్త్రీ సాంగత్యం పొంది వ్యభిచారినై భ్రష్టుడనయ్యాను.

**ఉ. అక్కట! ఘోరదుష్కృతమహానలకీలలు నన్ను ముట్టి పే**
**రుక్కణఁగింప కిట్లు ధృతి నుండఁగ నిచ్చె నహో! దురాత్మునిం**
**గ్రక్కునఁ దల్లిదండ్రుల నకల్మషచిత్తులఁ బెద్దలన్ మఱే**
**దిక్కును లేనివారిఁ బెనుతీపులఁబెట్టుచుఁ బాఱఁదోలితిన్. 137**

**ప్రతి :** గ్రక్కునన్= తొందరపాటుతో; తల్లిదండ్రులన్= అమ్మా నాన్నలను; అకల్మషచిత్తులన్= నిర్మల స్వభావం కలవారిని; పెద్దలన్= ముసలివారిని; మఱి+ఏ దిక్కును లేనివారిన్= నేను తప్ప ఇతర ఆధారం లేనివారిని; పెనుతీపులన్= పెద్ద బాధలను; పెట్టుచున్= గురిచేస్తూ (సి); పాఱన్+తోలితిన్= ఇంటినుండి గెంటేశాను; దుర్+ఆత్మునిన్= ఇలాంటి దుర్మార్గపుబుద్ధి కలిగిన నన్ను; అక్కట= అయ్యో; ఘోర= భయంకరమైన; దుష్కృత= పాపాలనే; మహా+అనలకీలలు= గొప్ప అగ్నిజ్వాలలు; నన్నున్= నన్ను; ముట్టి= చుట్టుముట్టి; పేరు+ఉక్కు+అణఁగింపక= అధిక సామర్థ్యంతో నశింప చేయకుండగా; ఇట్లు= ఈ విధంగా; ధృతిన్= ధైర్యంతో; ఉండన్+కన్= ఉండేవిధంగా; ఇచ్చెన్+అహో= అయ్యో! చేశాయి కదా!

**తా :** నేను తప్ప ఏ ఆధారమూ లేని సౌమ్యులు, సాధుజీవనులు, పెద్దలూ అయిన నా తల్లిదండ్రులను నిర్దాక్షిణ్యంగా తీవ్రమైన కష్టాలకు గురిచేసి, ఇంటినుండి వెళ్ళగొట్టిన దుర్మార్గుడిని. అటువంటి ఆ ఘోర పాప ఫలితాలు నన్ను మహాఅగ్నిజ్వాలల్లాగా కాల్చకుండా ఎలా ఉండనిచ్చాయో గదా!

**క. అకృతజ్ఞుఁడ నై విడిచితిఁ బ్రకృతిం గల బంధువులను బాల్యమున ననున్**
**వికృతిఁ జనకుండఁ బెంచిన సుకృతుల మజ్జనకవరుల శోభనకరులన్. 138**

**ప్రతి :** బాల్యమునన్= చిన్నతనంలో; ననున్= నన్ను; వికృతిన్+చనకుండన్+పెంచిన= చెడిపోకుండా పెంచి పెద్దచేసిన; సుకృతులన్= పుణ్యాత్ములైన; మత్+జనకవరులన్= నా తల్లిదండ్రులను; శోభనకరులన్= శ్రేయస్సు కలిగించేవారిని; ప్రకృతిన్+కల= ఈ లోకంలోని; బంధువులను= చుట్టాలను; అకృతజ్ఞుఁడన్+ఐ= విశ్వాసం లేనివాడినై; విడిచితిన్= వదలిపెట్టాను.

**తా :** చిన్నప్పటి నుండి ఎటువంటి ఇబ్బందీ కలుగకుండా పెంచి పోషించిన తల్లిదండ్రులను, నా శ్రేయస్సు కోరే చుట్టాలను, నాకు మేలు చేసినవారిని కృతఘ్నుడినై వదలిపెట్టాను.

**వ. అప్పుడు 139**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**తే. పెక్కు పాతకముల భృశదారుణం బైన దొడ్డ నరకమందుఁ బడ్డ నన్ను**
**నాపదలకుఁ బాపి యరికట్టి రక్షించి రిట్టి ధర్మపురుషు లెందువారొ? 140**

**ప్రతి :** పెక్కు పాతకములన్= అనేక మహాపాపాలచేత; భృశదారుణంబు+ఐన= అత్యంత క్రూరమైన; దొడ్డ నరకమందున్= భయంకర నరకమునందు; పడ్డ నన్నున్= పడిపోయిన నన్ను; ఆపదలకున్= కష్టాలకు; పాపి= దూరంచేసి; అరికట్టి= నివారించి; రక్షించిరి= కాపాడారు; ఇట్టి ధర్మపురుషులు= ఇలాంటి ధర్మాత్ములు; ఎందువారు+ఓ= ఎక్కడివారో కదా!

**తా :** ఇన్ని ఘోరపాపాలు చేసి భయంకర నరకకూపంలో పడి కొట్టుకొనిపోతున్న నన్ను దయతలచి ఆపదలనుండి రక్షించి, నా పాపాలను పోగొట్టిన ఈ పుణ్యపురుషులు ఎక్కడివారో కదా!

**శా. చోద్యంబై కలవోలె నీ క్షణమునం జూడంగఁ బ్రత్యక్షమై**
**వేద్యం బయ్యెను నన్ను నీడ్చిన మహావీరుల్ భృశోదగ్రు లా**
**యుద్యోగంబులవారు పాశధరు లీ యుత్సాహముల్ మాని సం**
**పాద్యానేకవికారరూపకుటిలప్రఖ్యాతు లెం దేఁగిరో? 141**

**ప్రతి :** చోద్యంబు+ఐ= ఆశ్చర్యకరమైందైన; కల+పోలెన్= కలమాదిరిగా; ఈ క్షణమునన్= ఇప్పుడే; చూడన్+కన్= చూస్తూ ఉండగానే; ప్రత్యక్షము+ఐ= కన్నులముందు నిలిచి; వేద్యంబు+అయ్యెను= గోచరించింది; నన్నున్+ఈడ్చిన= నన్ను ఈడ్చుకొని పోతున్న; మహావీరుల్= శూరులు; భృశ+ఉదగ్రులు= మిక్కిలి కోపిష్ఠులు; ఆ+ఉద్యోగంబులవారు= పై ప్రయత్నం గలవారు; పాశధరులు= పాశాలు ధరించినవారు; ఈ+ఉత్సాహముల్= ఇటువంటి చొరవ పనులను; మాని= ఆపి; సంపాద్య= పొందదగిన; అనేక= మిక్కిలి; వికారరూప= వికృత ఆకారంగల; కుటిల= వక్రమార్గంలో; ప్రఖ్యాతులు= పేరుగలవారు; ఎందున్+ఏఁగిరి+ఓ= ఎక్కడికి వెళ్ళిపోయారో కదా!

**తా :** ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది. ముందు ఏదో కలవలె అనిపించింది. మరుక్షణంలో ప్రత్యక్షంగా కనిపించింది. నన్ను మృత్యుపాశాలతో బంధించి ఈడ్చుకొని వచ్చిన ఆ భయంకర స్వరూపాలు గల మహావీరులు ఆ వికృతాకారులు ఆ వక్రమార్గసంచారులు తమ ఉద్రేకాన్నీ, ఉత్సాహాన్నీ వదలిపెట్టి ఎక్కడికి వెళ్లారో కదా!

**ఉ. దారుణపాశబంధనవిధానములన్ నరకార్ణవంబులోఁ**
**గూరినవాని నన్నుఁ జెడకుండ నొనర్చిన పుణ్యవంతు లం**
**భోరుహనేత్రు లుజ్జ్వలనభోమణితేజులు లోచనోత్సవుల్**
**చారుదయాసమంచితవిచారులు నల్వురు నెందుఁ బోయిరో? 142**

**ప్రతి :** దారుణ= భయంకరమైన; పాశబంధన= యమపాశాలచే కట్టబడిన; విధానములన్= స్థితిలో; నరక+అర్ణవంబులోన్= నరకమనే సముద్రంలో; కూరిన వానిన్= మునిగిపోయినవాడనైన; నన్నున్= నన్ను; చెడక+ఉండన్= నాశనం కాకుండా; ఒనర్చిన= చేసిన; పుణ్యవంతులు= పుణ్యాత్ములు; అంభోరుహనేత్రులు= పద్మాలవంటి కన్నులు కలిగినవారు; ఉజ్జ్వల= ప్రకాశవంతమైన; నభోమణి= (ఆకాశరత్నమైన) సూర్యునివంటి; తేజులు= వెలుగు కలవారు; లోచన+ఉత్సవుల్= కన్నుల పండుగైనవారు; చారు= చక్కని; దయాసమంచిత= దయతో కూడుకున్న; విచారులు= స్వభావం కలవారు; నల్వురున్= ఆ నలుగురు; ఎందున్+పోయిరో= ఎక్కడికి వెళ్ళిపోయారో!

**తా :** మిక్కిలి క్రూరమైన యమపాశాలచే కట్టబడి నరకమనే సముద్రంలో మునిగిపోతున్న నన్ను కాపాడిన సూర్యతేజులు, పద్మనేత్రులు, సుందర రూపులు దయ కల్గినట్టి ఆ నలుగురు దివ్యులు ఎటువైపు వెళ్ళారో కదా!

**మ. నను రక్షించినపుణ్యవంతులు కనన్నాళీకపత్రాక్షు లం**
**జనసంకాశులు శంఖచక్రధరు లాజానూరుబాహుల్ స్మితా**

**నను లాలంబితకర్ణవేష్టనసువర్ణచ్ఛాయదివ్యాంబరుల్**
**ఘనకారుణ్యరసైకపూర్ణులు సమగ్రస్ఫూర్తి నెం దేఁగిరో? 143**

**ప్రతి :** నను రక్షించిన= నన్ను కాపాడిన; పుణ్యవంతులు= ఆ పుణ్యమూర్తులు; కనత్= ప్రకాశిస్తున్న; నాళీకపత్ర+అక్షులు= తామర రేకులవంటి కన్నులు కలిగినవారు; అంజన+సంకాశులు= కాటుకవర్ణంతో సమానమైన రంగు కలవారు; శంఖ చక్రధరులు= శంఖం, చక్రం తాల్చినవారు; ఆజాను= మోకాలివరకు కలిగిన; ఉరు= పొడవైన; బాహుల్= చేతులు కలవారు; స్మిత+ఆననులు= నవ్వు ముఖం కలవారు; ఆలంబిత= వేలాడుతున్న; కర్ణవేష్టన= చెవి ఆభరణాలు; సువర్ణచ్ఛాయ= బంగారు రంగుగల; దివ్య+అంబరుల్= గొప్పవస్త్రాలు ధరించినవారు; ఘన= గొప్పదైన; కారుణ్య+రస+ఏక= దయ అనే రసంతో మాత్రమే; పూర్ణులు= నిండినవారు; సమగ్రస్ఫూర్తిన్= నిండు ప్రకాశంతో; ఎందు+ఏఁగిరో= ఎక్కడికి వెళ్లిపోయారో కదా!

**తా :** నన్ను కాపాడిన పుణ్యాత్ములు, తామరులవంటి కన్నులతో, నల్లనిశరీరాలతో ప్రకాశించేవారు, పీతాంబరులు, శంఖచక్రాలను ధరించినవారు, ఆజానుబాహులు, నవ్వు ముఖం కలవారు, వేలాడుతున్న చెవి ఆభరణాలు, బంగారు వన్నెగల వస్త్రాలు ధరించిన ఆ దయాసముద్రులు ఎక్కడికి పోయారో కదా!

**వ. పాతకుండ నగు నాకు ని వ్విబుధోత్తమదర్శనంబు పురాకృతమదీయపుణ్యవిశేషంబునం గాని పొంద శక్యంబు గాదు. త త్సందర్శనం బాత్మకు నతిసుప్రసన్నంబై యొప్పు. అట్లు గాకుండె నేనిఁ గలుషవర్తనంబుల వృషలీభర్తనై యుండి మృతిం బొందుచున్న నాదు జిహ్వకు శ్రీమన్నారాయణనామగ్రహణంబు సంభవింపనేరదు. మఱియును. 144**

**ప్రతి :** పాతకుండన్+అగు= పాపాత్ముడనైన; నాకున్= నాకు; ఈ విబుధ+ఉత్తమ= ఈ దేవతాశ్రేష్ఠులయొక్క; దర్శనంబు= సాక్షాత్కారం; పురాకృత= పూర్వజన్మలలో చేసుకున్న; మదీయ= నాదైన; పుణ్యవిశేషంబునన్+కాని= గొప్పదైన పుణ్యం వలన తప్ప; పొందన్= పొందుటకు; శక్యంబు+కాదు= సాధ్యం కాదు; తత్+సందర్శనంబు= వారియొక్క దర్శనం కావడం; ఆత్మకున్= నా ఆత్మకు; అతిసుప్రసన్నంబు+ఐ= మిక్కిలి ప్రసన్నమైనదై; ఒప్పున్= ఒప్పుతున్నది; అట్లు+కాకుండెన్+ఏనిన్= ఆ విధంగా కాకపోతే; కలుషవర్తనంబులన్= పాపపు పనులతో; వృషలీ భర్తన్+ఐ+ఉండి= శూద్ర స్త్రీకి మగడుగా ఉంటూ; మృతిన్+పొందుచున్న= చనిపోతున్న; నాదు= నాయొక్క; జిహ్వకున్= నాలుకకు; శ్రీమత్+నారాయణుని= శ్రీ మహావిష్ణువుయొక్క; నామగ్రహణంబు= నామోచ్చారణం; సంభవింపన్+నేరదు= కలుగదు; మఱియును= ఇంకా...

**తా :** మిక్కిలి పాపాత్ముడినైన నాకు నేను పూర్వజన్మలోచేసిన పుణ్య విశేషంచేతనే అట్టి దేవతాశ్రేష్ఠుల దర్శనం కలిగింది. తద్వారా మనస్సుకు ప్రశాంతత చేకూరింది. లేకుంటే నీచస్త్రీ సాంగత్యం వలన పాపాత్ముడినైన నాకు మరణ సమయంలో నారాయణ నామస్మరణం ఎలా సాధ్యపడుతుంది? అంతేకాక

**ఆ.వె. పాతకుఁడను జడుఁడ బ్రహ్మఘాతుకుఁడను మానలోభమోహమత్సరుండ**
**నాకు నెట్లు దొరకు? నారాయణునిదివ్యనామవిమలకీర్తనంబు మదికి. 145**

**ప్రతి :** పాతకుఁడను= పాపాలు చేసినవాడను; జడుఁడన్= మూర్ఖుడను; బ్రహ్మఘాతకుఁడను= బ్రహ్మత్వాన్ని నాశంచేసినవాణ్ణి; మాన= అభిమానం; లోభ= పిసినారితనం; మోహ= కామం; మత్సరుండన్= మాత్సర్యం కలవాణ్ణి; నాకున్= అటువంటి నాకు; నారాయణుని= ఆ శ్రీహరియొక్క; దివ్యనామ= శ్రేష్ఠనామంయొక్క; విమల కీర్తనంబు= స్వచ్ఛంగా గానం చేయడం; మదికిన్= మనసుకు; ఎట్లు= ఏ విధంగా; దొరకున్= దొరకుతుంది?

**తా :** పాపాత్ముడను, బ్రహ్మహత్య వంటి ఘోరపాపాలను చేసినవాణ్ణీ, దురభిమానుణ్ణి, లోభిని, కామాతురుణ్ణి, మాత్సర్యం కలిగినవాణ్ణి, ఇలాంటి నా మనసుకు ఆ నారాయణుని పవిత్రమైననామగానం చేయాలనే ఆలోచన ఎలా వస్తుంది?

**సీ. దారుణమోహాంధకారపూరితుఁడను హరివిస్మయస్మరణార్హమతినె?**
**పంచమహాతీవ్రపాతకోపేతుఁడ హరివిస్మయస్మరణార్హమతినె?**
**కౌటిల్యకితవవికారపారీణుండ హరివిస్మయస్మరణార్హమతినె?**
**అఖిలదుఃఖైకఘోరార్ణవమగ్నుండ హరివిస్మయస్మరణార్హమతినె?**

**తే. నిందలకు నెల్ల నెలవైన నిర్గుణుండ, మందభాగ్యుండ నే నేడ? మధువిదారి**
**దివ్యగుణనామకీర్తన తెఱఁగదేడ?, పూర్వసుకృతంబు లే కెట్లు పొందఁగలుగు? 146**

**ప్రతి :** దారుణ= ఘోరమైన; మోహ+అంధకార= మోహమనే చీకటితో; పూరితుఁడను= నిండినవాడను; హరి= శ్రీహరియొక్క; విస్మయ= ఆశ్చర్యకరమైన; స్మరణ= మననం చెయ్యడానికి; అర్హ+మతినే= అర్హుడనా?; పంచ= ఐదురకాల; మహాతీవ్ర= అత్యంత క్రూరమైన; పాతక+ఉపేతుఁడన్= మహా పాతకాలతో కూడినవాడను; హరి= శ్రీహరి; విస్మయ= ఆశ్చర్యకరమైన; స్మరణ= స్మరించడానికి; అర్హ+మతినె= తగినవాడనా?; కౌటిల్య= కుటిలత్వంనూ; కితవ వికార= జూదగాని వక్రరీతులలో; పారీణుండన్= నేర్పరిని; హరి= శ్రీమన్నారాయణుని; విస్మయ= అబ్బురమైన; స్మరణ= తలచుటకు; అర్హమతినే= తగినవాడనా?; అఖిల= పెక్కు; దుఃఖ+ఏక= బాధలకు నిలయమైన; ఘోర+అర్ణవ= భయంకరమైన సముద్రంలో; మగ్నుండన్= మునిగిన వాడను; హరి= శ్రీహరి; విస్మయ= అచ్చెరువు గొలిపిన; స్మరణ= స్మరించుటకు; అర్హమతినే= సరిపోయేవాడనా?; నిందలకున్+ఎల్లన్= అన్ని రకాల అపవాదులకు; నెలవైన= నిలయమైన; నిర్గుణుండ= గుణహీనుడను; మందభాగ్యుండన్= దురదృష్టవంతుడనైన; నేను+ఏడ= నేను ఎక్కడ; మధువిదారి= మధుడనే రాక్షసుణ్ణి సంహరించిన విష్ణుదేవుని; దివ్యగుణనామ= మహిమాన్వితమైన గుణాలతో కూడిన పేరును; కీర్తన= కీర్తించడం అనే; తెఱఁగు= మార్గం; అది+ఏడ= అది ఎక్కడ; పూర్వ= పూర్వజన్మలో చేసిన; సుకృతంబు= పుణ్యఫలం; లేక= లేకపోతే; ఎట్లుపొందన్+కలుగున్= ఎలా పొంద వీలవుతుంది?

**తా :** నీచమైన మోహమనే చీకటిలో మునిగి ఉన్నవాడను, పంచమహాపాపాలను చేసినవాడను, కుటిలుడను, జూద వ్యసనపరుడను, నిందాపరుడను, గుణహీనుణ్ణి, అయిన నాకు అద్భుతమైన, విష్ణునామాన్ని స్మరించే అర్హత ఉందా? కేవలం నేను పూర్వజన్మలలో చేసుకున్న పుణ్యాల ఫలితంవలన మాత్రమే తప్ప, హరినామస్మరణ యోగం ఎలా కలుగుతుంది?

**వ. అని వితర్కించి. 147**

**ప్రతి :** అని; వితర్కించి= ఆలోచించుకొని...

**తా :** అని పరిపరివిధాల ఆలోచించుకొని

**మ. యతచిత్తేంద్రియమారుతుండ నగుచున్ యత్నం బొనర్తున్ హరి**
**వ్రతసంపత్తికిఁ బుణ్యవృత్తికిఁ జిదావాసోన్ముఖాసక్తికిన్**
**యుతనిర్వాణపదానురక్తికి సుఖోద్యోగక్రియాశక్తికిన్**
**ధృతిలబ్ధోత్తమముక్తికిన్ సకలధాత్రీధుర్యసద్భక్తికిన్. 148**

**ప్రతి :** హరివ్రత= విష్ణుపరమైన వ్రతమనే; సంపత్తికిన్= సంపదకు; పుణ్యవృత్తికిన్= పుణ్యప్రవర్తనకు; చిత్+ఆవాస+ఉన్ముఖ+ ఆసక్తికిన్= చైతన్యపు ఉనికికి సుముఖమైన కోరికకు; యుత= కూడిన; నిర్వాణపద= ముక్తిమార్గం; అనురక్తికిన్= పొందే కోరికకు; సుఖ+ఉద్యోగక్రియా శక్తికిన్= సంతోషాన్ని పొందే ప్రయత్నంలోని కాంక్షకు; ధృతి= స్థిరబుద్ధి వలన, లబ్ధ= పొందదగిన; ఉత్తమ ముక్తికిన్= శ్రేష్ఠమైన ముక్తి పదానికి; సకల= సమస్తమైన; ధాత్రీధుర్య= విశ్వాన్ని ధరించే; సత్+భక్తికిన్= శ్రేష్ఠమైన భక్తికి; యత= నియమించబడిన; చిత్త= చిత్తం; ఇంద్రియ= ఇంద్రియాలు; మారుతుండన్= శ్వాస వాయువు కలవాణ్ణి; అగుచున్= అవుతూ; యత్నంబు+ఒనర్తున్= ప్రయత్నం చేస్తాను.

**తా :** పుణ్యమైన వర్తనంకలదీ, చైతన్యానికి నెలవైన స్థానానికి ఉన్ముఖమైన ఆసక్తి కలదానికీ, మోక్షస్థానంలో అనురక్తితో కూడిందానికీ, సుఖప్రదమైన ప్రయత్న క్రియకు చెందిన సామర్థ్యం కలదానికి, ధైర్యంతో పొందబడిన శ్రేష్ఠమైనముక్తి కలదానికీ, సమస్త భూమండలాన్నీ ధరించగల ఉత్తమభక్తితో కూడిందానికీ, ఇట్టె విష్ణువ్రతసంపదకై నేను మనస్సును, ఇంద్రియాలను, శ్వాసను నియమించినవాణ్ణై ప్రయత్నిస్తాను.

**క. విడిచితి భవబంధంబుల నడఁచితి మాయావిమోహమయిన తమంబు**
**న్నొడిచితి నరివర్గంబులఁ గడచితి నా జన్మదుఃఖకర్మార్ణవమున్. 149**

**ప్రతి :** భవబంధంబులన్= సంసారబంధాలను; విడిచితిన్= వదిలిపెట్టాను; మాయా= మాయచేత; విమోహము+అయిన= వ్యామోహంతో నిండిన; తమంబున్= అజ్ఞానాన్ని; అడఁచితిన్= నాశనం చేశాను; అరివర్గంబులన్= అరిషడ్వర్గాల్ని; ఒడిచితిన్= ఓడించాను; నా= నా యొక్క; జన్మ= పుట్టుక వలన కలిగిన; దుఃఖ= బాధాకరమైన; కర్మ+అర్ణవమున్= పాపాలనే సముద్రాన్ని; కడచితిన్= దాటాను.

**తా :** నారాయణ నామగానంవలన భవబంధాలనుండి విముక్తి పొందాను. మాయవల్ల కలిగిన అజ్ఞానాన్ని పోగొట్టుకున్నాను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలనే ఆరుగురు అంతశ్శత్రువులను తరిమికొట్టాను. జనన మరణ పరంపర అనే దుఃఖ సాగరాన్ని దాటాను.

**క. యోషిద్రూపంబున నను నేషణ ముఖగహ్వరమున నెగ్రమింగి కడున్**
**ద్వేషమునఁ గోఁతిఁజేసిన దోషద యగు నాత్మమాయఁ దొలఁగంగంటిన్. 150**

**ప్రతి :** యోషిత్+రూపంబునన్= స్త్రీ అనే వేషంలో; ననున్= నన్ను; ఏషణ ముఖగహ్వరమునన్= కోరికలనే నోటి బిలంలోకి; ఎగ్రమింగి= పూర్తిగా మింగి; కడున్= మిక్కిలి; ద్వేషమునన్= వైరబుద్ధితో; కోఁతిన్+చేసిన= నన్ను కోతిగా మార్చినట్టి; దోషద= దోషాన్ని కలిగించేది; అగు= ఐనట్టి; ఆత్మమాయన్= నన్ను ఆవరించిన మాయను; తొలఁగన్+ కంటిన్= వదిలిపోవగా చూచాను.

**తా :** దాసీ రూపంలో వచ్చిన స్త్రీ నాలో కోరికలను రగిల్చి నన్ను కోతివలె ఆడించింది. అధోగతికి ఈడ్చిన ఆ మాయ నన్ను తొలగిపోవడం నేను కనుగొన్నాను.

**వ. అని యిట్లు వైష్ణవజ్ఞానదీపం బాత్మస్నేహంబునం దోఁచిన బ్రాహ్మణుండు. 151**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; వైష్ణవ= విష్ణుభక్తికి చెందిన; జ్ఞానదీపంబు= జ్ఞానశిఖ (జ్ఞానమనే వెలుగు); ఆత్మ= ఆత్మ అనే; స్నేహంబునన్= తైలంతో; తోఁచిన= చైతన్యం పొందిన; బ్రాహ్మణుండు= ఆ అజామిళుడు...

**తా :** ఈ విధంగా ఆత్మవిమర్శ చేసుకుంటున్న అజామిళునిలో విష్ణుభక్తి అనే జ్ఞానదీపం ఆత్మచైతన్యమనే తైలంతో ప్రకాశించింది.

**మ. భగవద్ధర్మపరాయణోత్తముల సంభాషైకమంత్రంబులన్**
**మిగులన్ జ్ఞానము పుట్ట మోహభవసమ్మిశ్రాత్మబంధంబులన్**
**దెగ ఖండించి సబంధుమిత్రసుతపత్నీమోహవిశ్రాంతుఁడై**
**జగతీనాథు రమేశుఁ గృష్ణుని దయైశ్వర్యంబులం గోరుచున్. 152**

**ప్రతి :** భగవత్+ధర్మపరాయణ+ఉత్తముల= భగవంతునియొక్క ధర్మాన్ని ఆచరించే శ్రేష్ఠులలో (జ్ఞానులలో); సంభాష+ఏక= మాట్లాడుట (చర్చించుట) అనే ముఖ్యమైన; మంత్రంబులన్= సలహాలవలన (విషయజ్ఞానం వలన); మిగులన్= అతిశయమైన; జ్ఞానము= తెలివి; పుట్టన్= కలుగగా; మోహ= వ్యామోహంవలన; భవ= పుట్టి; సమ్మిశ్ర= పెనవేసుకున్న; ఆత్మబంధములన్= తనకు తాను వేసుకున్న కట్లను; తెగన్= తెగునట్లు; ఖండించి= నరికివేసి; సబంధు= చుట్టాలతోకూడిన; మిత్ర= స్నేహితులు; సుత= కుమారులు; పత్నీ= భార్య (మొదలగు); మోహ= వ్యామోహాలనుండి; విశ్రాంతుఁడై= బయటపడిన వాడై; జగతీనాథు= లోకాధిపతి ఐన; రమా+ఈశున్= లక్ష్మీపతి అయిన; కృష్ణుని= శ్రీకృష్ణునియొక్క; దయా+ఐశ్వర్యంబులన్= దయ అనే భాగ్యాల్ని; కోరుచున్= ఆశిస్తూ...

**తా :** పునర్జన్మను పొందిన అజామిళుడు ఉత్తముల సాంగత్యంలో ఉంటూ వారితో జరిపే సంభాషణలవలన పవిత్రుడై, ఇహలోక బంధాలమీద విరక్తిచెంది బంధువులను, స్నేహితులను, భార్యాబిడ్డలను వదిలి సర్వేశ్వరుడైన ఆ శ్రీకృష్ణుని దయ అనే మహాభాగ్యంకోసం ప్రయత్నిస్తూ

**క. హరిభక్తులతో మాటలు ధర నెన్నఁడుఁ జెడనిపుణ్యధనములమూటల్**
**వరముక్తికాంతతేటలు నరిషడ్వర్గంబు చొరని యరుదగుకోటల్. 153**

**ప్రతి :** హరిభక్తులతోన్= విష్ణుభక్తులతో; మాటలు= పలుకులు; ధరన్= ఈ లోకంలో; ఎన్నఁడున్= ఎప్పటికీ; చెడని= నాశనం కాని; పుణ్యధనముల= పుణ్యమనే సొమ్ముల; మూటల్= ముల్లెలు (సంచులు); వర= శ్రేష్ఠమైన; ముక్తికాంత= మోక్షమనే కన్య యొక్క; తేటలు= విలాసాలు; అరిషట్+వర్గంబు= ఆరు రకాల అంతశ్శత్రువులు; చొరని= ప్రవేశించలేని; అరుదు+అగు= అపురూపమైన; కోటల్= రక్షణస్థానాలు.

**తా :** భాగవతులతో జరిపే సత్సంగచర్చలు ఈ లోకంలో ఎప్పటికీ తరగని పుణ్యమనే సొమ్ముల మూటలు. మోక్షలక్ష్మి యొక్క తరగని విలాసాలు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాలనే శత్రువులు దగ్గరకు రాలేని రక్షణస్థావరాలు.

**విశే :** కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు జీవుడి మనస్సులో దాగి ఉండి, కూడని పనులు చేయిస్తాయి. పతనంవైపు నడిపిస్తాయి. అందువల్ల వాటిని 'అరిషడ్వర్గాలు' అంటారు. జీవుడిలోన ఉండే శత్రువులు కనుక 'అంతశ్శత్రువులు' అంటారు.

**సీ. అనుచు నా బ్రాహ్మణుం డతితత్త్వవేదియై భవబంధములనెల్లఁ బాఱఁదోలి**
**మొనసి గంగాద్వారమున కేగి యచ్చటఁ బ్రబ్బిన దేవతాభవనమందు**
**నాసీనుఁడై యోగ మాశ్రయించి చెలంగు దేహేంద్రియాదుల తెరువువలన**
**దనుఁబాపుకొని పరతత్త్వంబుతోఁ గూర్చి మానుగా యోగసమాధిచేత**

**ఆ. గుణగణంబుఁ బాసి కొమ రొప్పిన భగవ, దనుభవాత్మయందు నాత్మఁ గలిపి**
**రమణఁ దన్ను మొదల రక్షించినట్టి యా, పురుషవరులఁ గాంచి పొసఁగ మ్రొక్కె. 154**

**ప్రతి :** అనుచున్= (అని) అంటూ; ఆ బ్రాహ్మణుండు= ఆ అజామిళుడు; అతి= గొప్ప; తత్త్వవేదియై= పరతత్త్వాన్ని తెలుసుకున్న వాడై; భవబంధములన్+ఎల్లన్= ఇహలోకపు కట్టడులను అన్నింటిని; పాఱన్+తోలి= వదిలిపెట్టి; మొనసి= పూనుకొని; గంగాద్వారమునకున్+ఏగి= హరిద్వారక్షేత్రానికి వెళ్లి; అచ్చటన్= అక్కడ; ప్రబ్బిన= వెలసిన; దేవతా= దైవసంబంధమైన; భవనము+అందున్= ఆలయంలో; ఆసీనుఁడు+ఐ= కూర్చొని; యోగము+ఆశ్రయించి= జ్ఞానమనే యోగాన్ని పొంది; చెలంగు= చెలరేగుతున్న; దేహ+ఇంద్రియ= శరీరం ఇంద్రియాలు; ఆదుల= మొదలైన; తెరువు వలనన్= మార్గంనుండి; తనున్= తనను; పాపుకొని= వేరుచేసుకొని; పరతత్త్వంబుతోన్= పరమాత్మతో; కూర్చి= కలిపి; మానుగాన్= చక్కగా; యోగసమాధిచేతన్= నిశ్చలమైన యోగంతో; గుణగణంబున్= గుణ సమూహమంతటిని; పాసి=వదిలి; కొమరు+ఒప్పిన= శోభిల్లిన; భగవత్= భగవంతునియొక్క; అనుభవ= అనుభూతితోకూడిన; ఆత్మ+అందున్= ఆత్మలో; అందున్= ఆత్మలో; ఆత్మన్= (తన) జీవాత్మను; కలిపి= జతచేసి; రమణన్= విలాసంగా; తన్నున్= తనను; మొదలన్= ముందు; రక్షించిన+అట్టి= యమభటులనుండి కాపాడినట్టి; ఆ పురుషవరులన్= ఆ మహాత్ములను; కాంచి= దర్శించి; పొసఁగన్= తగునట్లుగా; మ్రొక్కెన్= నమస్కరించాడు.

**తా :** ఈ విధంగా అజామిళుడు తననుగురించి తాను విమర్శించుకొని పరమాత్మతత్త్వాన్ని తెలుసుకున్నాడు. సంసార బంధాలను వదిలిపెట్టి హరిద్వారం చేరి ఒక దేవాలయంలో ధ్యానంలో ఉన్నాడు. తదనంతరం తన ఆత్మను యోగసమాధి ద్వారా పరమాత్మలో ఐక్యం చేయగా తనను పూర్వం యమభటుల నుండి రక్షించిన విష్ణుదూతలు సాక్షాత్కరించారు. వారిని చూచి అజామిళుడు వినయంగా నమస్కరించాడు.

**వ. అ ట్లజామిళుండు యోగమార్గంబున దేహంబు విడిచి పుణ్యశరీరుండై యగ్రభాగంబునం బ్రాగుపలబ్ధులైన మహాపురుషకింకరులం గాంచి, సమంచిత రోమాంచిత చలచ్ఛటా పింజరిత స్వేదబిందుసందోహ మిష నిష్యంద మహానందవల్లికా మతల్లికాంకుర సంకుల పరిశోభిత తనుండును, హర్షనికర్షమాణ మానసోద్యోగ యోగప్రభావోత్సాహ విస్మయ మందస్మిత ముఖారవింద కందళితుండును, నిఖిల జగజ్జేగీయమానాఖండ శుభప్రద శుభాకార సందర్శన సమాసాదిత కుతూహల మానసుండును నై, ప్రణామంబు లాచరించుచు భాగీరథీ తీరంబునఁ గళేబరంబు విడిచి, తత్క్షణంబున హరిపార్శ్వవర్తనులైన దాసవరుల స్వరూపంబుఁ దాల్చి, యా**

**విష్ణుసేవకులతోఁ గూడి దివ్య మణి గణ ఖచితంబగు సువర్ణమయం బయిన యసమాన విమానం బెక్కి, నిఖిలానంద భోగభాగ్యానుభవాకుంఠితంబైన వైకుంఠంబున శ్రీమన్నారాయణ పాదారవింద సేవాచరణ పరిణామ స్థితికిం జనియె. ఇట్లు విప్లావిత సర్వధర్ముండైన దాసీపతి, గర్హిత కర్మంబులచేతఁ బతితుండును, హతవ్రతుండును నై నరకంబునం గూలుచుండి, భగవన్నామ గ్రహణంబున సద్యోముక్తుం డయ్యెఁ గావున. 155**

**ప్రతి :** అట్లు= ఆ విధంగా; అజామిళుండు= ఆ అజామిళుడు; యోగమార్గంబునన్= యోగపద్ధతిలో చెప్పిన విధంగా; దేహంబున్= శరీరాన్ని; విడిచి= వదిలిపెట్టి; పుణ్యశరీరుండు+ఐ= దివ్యరూపం కలవాడై; అగ్రభాగంబునన్= తనకు ముందు భాగంలో; ప్రాక్+ఉపలబ్ధులు+ఐన= పూర్వం తనకు కనబడిన; మహాపురుష= పురుషోత్తమునియొక్క; కింకరులన్= సేవకులను; కాంచి= చూచి; సమంచిత= ఒప్పునట్టి; రోమ+అంచిత= పులకింతవలన; చలత్= కదులుతూ; ఛటా= కాంతిచేత; పింజరిత= బంగారువర్ణంగా చేయబడిన; స్వేదబిందు= చెమట చుక్కల; సందోహ= సమూహమనే; మిష= కారణంతో; నిష్యంద= తడిసిన; మహా+ఆనంద= గొప్ప సంతోషమనే; వల్లికామతల్లిక+అంకుర= శ్రేష్ఠమైన లేత తీగలమొలకలచే; సంకుల= పూర్తిగా; పరిశోభిత= అందగించిన; తనుండును= శరీరం కలవాడును; హర్ష= సంతోషంచేత; నికర్షమాణ= ఒరసికొన్న; మానస+ఉద్యోగ= మనస్సుయొక్క ప్రయత్నంగల; యోగ ప్రభావ+ఉత్సాహ= సమాధి మహిమచే కలిగిన ఉత్సాహంతో; విస్మయ= ఆశ్చర్యకరమైన; మందస్మిత= చిరునవ్వుతో కూడిన; ముఖ+అరవింద= ముఖపద్మంయొక్క; కందళితుండును= వికాసం కలవాడు; నిఖిల= సమస్తమైన; జగత్+జేగీయమాన= లోకాలన్నింటిచే పొగడబడుతూ; అఖండ= పరిపూర్ణమైన; శుభప్రద= శోభాకరమైన; శుభ+ఆకార= మంగళరూపునియొక్క; సందర్శన= చూచుటచే; సమాసాదిత= సంపాదించబడిన; కుతూహల= కౌతుకం కల్గిన; మానసుండును+ఐ= మనసు కలవాడై; ప్రణామంబులు= నమస్కారాలు; ఆచరించుచున్= చేస్తూ; భాగీరథీ= గంగానదియొక్క; తీరంబునన్= దరిలో; కళేబరంబున్= శరీరాన్ని; విడిచి= పరిత్యజించి; తత్+క్షణంబునన్= ఆ క్షణంలోనే; హరి= శ్రీహరియొక్క; పార్శ్వవర్తనులు+ఐన= ప్రక్కలుండేవారైన; దాసవరుల= సేవక శ్రేష్ఠుల; స్వరూపంబున్= రూపాన్ని; తాల్చి= ధరించి; ఆ విష్ణుసేవకులతోన్= తనకు కనబడిన ఆ విష్ణుదాసులతో; కూడి= కలిసి; దివ్యమణి గణ= గొప్ప రత్నాలరాశులతో; ఖచితంబు+అగు= పొదగబడిన; సువర్ణమయంబు+అయిన= బంగారంతో చేయబడిందైన; అసమాన= సాటిలేని; విమానంబు+ఎక్కి= విమానాన్ని అధిరోహించి; నిఖిల+ఆనంద= సకల సంతోషాలకు; భోగభాగ్య= గొప్పసుఖ సంపదలయొక్క; అనుభవ= అనుభూతులకు; అకుంఠితము+ఐన= తిరుగులేనిదైన; వైకుంఠంబునన్= విష్ణులోకంలో; శ్రీమన్నారాయణ= శ్రీహరియొక్క; పాద+అరవింద= పాదకమలాలను; సేవా+ఆచరణ= సేవించడం అనే; పరిణామ స్థితికిన్= గొప్పమార్పుకు; చనియెన్= వెళ్లెను; ఇట్లు= ఈ విధంగా; విప్లావిత= వదలిపెట్టబడిన; సర్వధర్ముండు+ఐన= సకల ధర్మాలు కలిగిన; దాసీపతి= ఆ జారిణిభర్త; గర్హిత= నిందింపతగిన; కర్మంబులచేతన్= పనుల వలన; పతితుండును= పతనం చెందినవాడును; హతవ్రతుండునున్+ఐ= నియమపాలన లేనివాడు అయి; నరకంబునన్= నరకలోకంలో; కూలుచుండి= పడబోతూ; భగవత్+నామ= భగవంతుని నామాన్ని; గ్రహణంబునన్= స్వీకరించటంవల్ల; సద్యస్+ముక్తుండు+అయ్యెన్= వెంటనే మోక్షాన్ని పొందాడు; కావునన్= కాబట్టి...

**తా :** ఈ ప్రకారంగా అజామిళుడు యోగమార్గం ద్వారా తన శరీరాన్ని పరిత్యజించి దివ్యదేహం ధరించినవాడై మున్ను తన్ను రక్షించిన విష్ణుకింకరులను తన కనులముందు సందర్శించాడు. వారిని తిలకించగానే అతని దేహం ఆనందంతో

పులకించింది. పారవశ్యంతో ఒడలంతా చెమర్చింది. ఆనందం చిగిర్చింది. హృదయం హర్షంతో నిండింది. యోగప్రభావం ప్రకాశించింది. విస్మయంతో, ఉత్సాహంతో కూడిన మందహాసం అతని ముఖారవిందం మీద చిందులు త్రొక్కింది. సమస్త లోకాలనూ ప్రకాశింపజేసేదీ, మంగళప్రదమైందీ అయిన భగవంతుని శుభాకారాన్ని సందర్శించాలనే కుతూహలం మనస్సులో కలిగింది. అజామిళుడు విష్ణుదూతలకు నమస్కరిస్తూ గంగాతీరంలో శరీరం విడిచాడు. వెనువెంటనే అతనికి నారాయణ పార్శ్వచరులైన మహాభక్తుల స్వరూపం ప్రాప్తించింది. అనంతరం అతడు విష్ణుదూతలతో కలిసి రత్నాలు పొదిగిన బంగారు విమానాన్ని అధిష్ఠించి ఆనందమయం, భోగ భాగ్య నిలయం అయిన వైకుంఠనగరంలో ప్రవేశించి శ్రీమన్నారాయణుని చరణారవిందాలను సేవించే పరిణత దశకు చేరుకున్నాడు. ఈ విధంగా అజామిళుడు సర్వధర్మాలనూ ఉల్లంఘించినవాడు, దాసీపుత్రిని పెండ్లాడినవాడు, దుష్కర్మలచేత భ్రష్టుడైనవాడు అయి నరకంలో పడబోతూ కూడా నారాయణ నామస్మరణంవల్ల క్షణమాత్రంలో మోక్షాన్ని అందుకున్నాడు.

**క. కర్మంబు లెల్లఁ బాయను, మర్మము దలఁపంగ లేదు మధురిపుపేరే**
**పేర్మిని నొడువుటకంటెను, దుర్మదమునఁ జిత్త మెన్ని త్రోవలఁ జన్నన్. 156**

**ప్రతి :** కర్మంబులు= పాపపుణ్యపుపనులు; ఎల్లన్= అన్నిటిని; పాయనున్= పోగొట్టుకోవాలంటే; దుర్మదమునన్= అహంకారంతో; చిత్తము= మనస్సు; ఎన్ని త్రోవలన్= ఎన్ని మార్గాలలో; చన్నన్= వెళ్ళినా; మధురిపు= విష్ణువుయొక్క; పేరు+ఏ పేర్మినిన్= పేరును ఏ విధంగానైనా; నొడువుటకంటెను= పలుకుటకన్నా; మర్మము= వేరేగుట్టు; తలపన్+కన్= ఏ మాత్రం ఆలోచించినా, లేదు= ఉండదు.

**తా :** కర్మలన్నీ విడిపోవటానికి వేరే ఉపాయం ఏదీ లేదు. చెప్పిన మాట వినకుండా ఎదురుతిరిగి మనస్సు ఎన్నిమార్గాల్లో పోయినా సర్వదా నారాయణ నామాన్ని ఉచ్చరించటమే కర్మఫరిత్యాణానికి సరైన ఉపాయం.

**ఉ. పాండవవంశపావన నృపాలక! యీ యితిహాస మెవ్వఁ డే**
**నొండొక భక్తి లేక విను నొప్పుమెయిం బఠియించు నాతఁ డు**
**ద్దండత ముక్తికామినికిఁ దానకమై దనుజారిలోకమం**
**దుండు మహావిభూతి యమదూతలచూడ్కి కగోచరాకృతిన్ 157**

**ప్రతి :** పాండవ వంశ= పాండవ వంశాన్ని; పావన= పవిత్రముచేసే; నృపాలక= ఓ మహారాజా!; ఈఇతిహాసమున్= ఈ పురాణ కథను; ఎవ్వఁడు+ఏనిన్= ఏ మానవుడైనా; ఒందు+ఒక+భక్తిలేక= మరొక రకం భక్తిలేకుండా ఏకాంతభక్తితో; వినున్= వింటాడో; ఒప్పుమెయిన్= శ్రద్ధగా; పఠియించున్= చదువుతాడో; ఆతఁడు= అలాంటి మానవుడు; ఉద్దండతన్= బలిమితో; ముక్తికామినికిన్= మోక్షమనే కన్యకు; తానకమై= స్థానమై; మహావిభూతి= గొప్ప ఐశ్వర్యంతో; యమదూతల= యమకింకరులయొక్క; చూడ్కికిన్= దృష్టికి; అగోచర+ఆకృతిన్= అందనిరూపంతో; దనుజ+అరి= విష్ణువుయొక్క; లోకము+అందున్+ఉండున్= నివాసంలో ఉంటాడు.

**తా :** పాండవ వంశాన్ని పావనంచేసే ఓ మహారాజా! ఈ అజామిళుని వృత్తాంతాన్ని ఎవడైనా సరే ఏకాగ్రచిత్తంతో విన్నా, చదివినా అలాంటి మానవుడు మోక్షలక్ష్మికి నెలవై, యమకింకరులకు కనపడకుండా శాశ్వతవైకుంఠవాసి అవుతాడు.

**తే. అరయ పుత్త్రోపచారిత మైన విష్ణునామ మవసానకాలంబునను భజించి**
**శార్ఙ్గినిలయంబుఁ జేరె నజామిళుండు నిట్లు సద్భక్తిఁ దలఁచిన నేమి చెప్ప? 158**

**ప్రతి :** అరయన్= ఆలోచించగా; పుత్త్ర+ఉపచారితము+ఐన= కుమారుని పేరు రూపంలో ఉన్న; విష్ణునామమున్= శ్రీహరియొక్క పేరును; అవసానకాలంబునను= మరణ సమయంలో; భజించి= స్మరించి; అజామిళుండున్= ఆ అజామిళుడు; శార్ఙ్గి నిలయంబున్= విష్ణు నివాసాన్ని; చేరెన్= చేరుకున్నాడు; ఇట్లు= ఈ విధంగా; సత్+భక్తిన్+తలఁచినన్= స్వచ్ఛమైన భక్తితో స్మరించినట్లైన; ఏమిచెప్పన్= చెప్పేది ఏముంటుంది?

**తా :** అజామిళుడు కేవలం తన కొడుకు పేరుతో మాత్రమే చివరిదశలో భగవన్నామం ఔపచారికంగా స్మరించి మోక్షాన్ని పొందాడు. ఇంకా సంపూర్ణమైన భక్తితో పలికితే ఫలితం ఇంకెంత ఉంటుందో చెప్పలేము కదా!

**క. కోరినవారల కెల్లను జేరువ కైవల్యపదము సిరివరుని మదిం**
**గోరనివారల కెల్లను దూరము మోక్షాప్తి యెన్ని త్రోవలనైనన్. 159**

**ప్రతి :** సిరివరునిన్= లక్ష్మీ భర్త అయిన శ్రీహరిని; మదిన్= మనసులో; కోరినవారలకున్+ఎల్లన్= స్మరించిన వారందరికి; కైవల్యపదము= మోక్షస్థానం; చేరువ= దగ్గరగా ఉంటుంది; కోరనివారలకున్+ఎల్లను= ఆశించని వారందరికి; మోక్ష+ఆప్తి= మోక్షప్రాప్తి; ఎన్ని త్రోవలను+ఐనన్= ఎన్ని మార్గాల్లో ప్రయత్నించినా; దూరము= దూరంగానే ఉంటుంది.

**తా :** విష్ణునామం తలచిన వారికి ముక్తి ఎంత దగ్గరవుతుందో, ఆ నామాన్ని స్మరించని వారికి ఎన్ని విధాలుగా ప్రయత్నించినా ఆ ముక్తిపదం దూరంగానే ఉంటుంది.

**వ. అనినం బరీక్షిన్న రేంద్రుం డిట్లనియె. మునీంద్రా! ఆజ్ఞా భ్రష్టుండై యమధర్మరాజు శ్రీవిష్ణు నిర్దేశకులచేత నిహతులైన భటులచేత వర్ణింపంబడ్డ నారాయణుని నామప్రభావం బాకర్ణించి, వారల కే మనియె? మఱియు, నెన్నఁడేనియు యమదండంబు విఫలంబై పోయిన తెఱంగు గలదేని వినవలయు; ఈ సందేహంబుఁ బాప మహాత్మా! నీవు దక్కఁ దక్కినవారలు సమర్థులు గా రని తలంచుచున్నవాఁడ; చిత్తంబును బ్రసాదాయత్తంబుగా భవదీయ వచనసుధాధారలఁ బ్రసాదింపవలయు అనిన శుకుం డిట్లనియె. 160**

**ప్రతి :** అనినన్= శుకుడు ఈ విధంగా పలుకగా; పరీక్షిత్+నరేంద్రుండు= పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; మునీంద్రా!= ఓ మునిశ్రేష్ఠా; ఆజ్ఞాభ్రష్టుండు+ఐ= తన ఆనతి వ్యతిరేకింపబడినవాడై; యమధర్మరాజు; శ్రీవిష్ణు నిర్దేశకులచేతన్= విష్ణుదూతలచే; నిహతులు+ఐన= అడ్డగింపబడిన; భటులచేతన్= తన కింకరుల వలన; వర్ణింపబడ్డ= వివరించబడిన; నారాయణుని= శ్రీహరియొక్క; నామప్రభావంబు= పేరుయొక్క గొప్పతనం; ఆకర్ణించి= విని; వారలకున్= ఆ కింకరులతో; ఏమి+అనియెన్= ఏమన్నాడు; మఱియున్= ఇంకా; ఎన్నఁడు+ఏనియున్= ఇంతకుముందు ఎప్పుడైనా; యమదండంబు= యమపాశంయొక్క శక్తి; విఫలంబు+ఐ+పోయిన= ఉపయోగం లేకుండా అయిన; తెఱంగు= విధం; కలదు+ఏనిన్= ఏదైనా ఉన్నట్లయితే; వినవలయున్= వినాలని ఉంది; ఈ సందేహంబున్= ఈ అనుమానాన్ని; పాపన్= నివారించుటకు; మహ+ఆత్మా= ఓ మహర్షీ!; నీవు+తక్కన్= నీవు తప్ప; తక్కినవారలు= ఇతరులు; సమర్థులు+కారు+అని= శక్తి కలవారు కారని; తలంచుచున్+ఉన్నవాఁడన్= భావిస్తున్నాను; చిత్తంబునున్= నా మనస్సును; ప్రసాద+ఆయత్తంబుగా=

అనుగ్రహ పాత్రంగా; భవదీయ= మీయొక్క; వచన= మాటలనే; సుధాధారలన్= అమృతపు జల్లులచే; ప్రసాదింపవలయున్= అనుగ్రహించాలి; అనినన్= అని కోరగా; శుకుండు= శుక మహర్షి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తా :** అజామిళుని కథను పూర్తిగా విన్న పరీక్షిత్తు శుక మహర్షితో ఓ మహర్షీ! యమకింకరుల ద్వారా జరిగిన కథను మొత్తం విన్న యముడు ఏమన్నాడు? ఈ విధంగా యముని ఆజ్ఞ తిరస్కరింపబడిన సందర్భం ఇంతకు ముందు ఏదైనా ఉందా? ఎక్కడైనా జరిగిందా? తెలియజేయగలరు. ఇలాంటివాటికి మీరు తప్ప ఇంకెవరు సమాధానం చెప్పగలరు? అందువల్ల మీ సుధామయవాక్కులతో నన్ను అనుగ్రహించగలరు అని కోరగా శుకుడు ఇలా అన్నాడు.

**క. శ్రీకృష్ణభటులచేత నిరాకృతులయి యామ్యభటులు యమునకు నాత్మ**
**స్వీకృతవిప్రకథాక్రమ మీ క్రియ మున్ దెలిపి రదియు నెఱిఁగింతుఁ దగన్. 161**

**ప్రతి :** శ్రీకృష్ణ= శ్రీమహావిష్ణువు యొక్క; భటులచేతన్= దూతలచే; నిరాకృతులు+అయి= అడ్డగింపబడిన వారై; యామ్యభటులు= యమకింకరులు; యమునకున్= తమ స్వామి అయిన యమధర్మరాజుకు; ఆత్మ స్వీకృత= తమచే స్వీకరింపబడిన; విప్ర కథాక్రమము= అజామిళుని కథ అంతటిని; ఈ క్రియన్= ఈ విధంగా; మున్+తెలిపిరి= పూర్వం చెప్పారు; అదియున్= దానినంతటిని; తగన్= చక్కగా; ఎఱిఁగింతున్= వివరిస్తాను.

**తా :** శ్రీమహావిష్ణువుదూతలచే నిశ్చేష్టితులైన యమభటులు, తమచేత బంధింపబడిన అజామిళుడు దేవదూతలచే విడిపింపబడిన వృత్తాంతాన్ని యమునికి పూర్వం తెలియజేసి ఉన్నారు. ఆ సంగతిని నీకు చక్కగా వివరిస్తాను వినుము.

**తే. చేరి త్రివిధకర్మలఁ జేయు జీవతతికిఁ గర్మఫలములఁ దెలిపెడు కారణంబు**
**నగుచు శిక్షించువార లీ యవనిమీఁద దేవ! యెందఱు గలరయ్య? తెలియవలయు. 162**

**ప్రతి :** చేరి= యమధర్మరాజు దగ్గరకు వెళ్ళి; త్రివిధ కర్మలన్= మనసు, మాట, శరీరం ద్వారా చేసే పనులను; చేయు= చేసే; జీవతతికిన్= ప్రాణికోటికి; కర్మఫలములన్= ఆ యా పనుల ఫలితాన్ని; తెలిపెడు= తెలియజేసే; కారణంబున్= హేతువు; అగుచున్= అవుతూ; శిక్షించువారలు= శిక్షను నిర్ణయించేవారు; ఈ+అవనిమీఁదన్= ఈ భూలోకంలో; దేవ= ఓ రాజా!, ఓ స్వామీ!; ఎందరు= ఎంతమంది; కలరు+అయ్య= ఉన్నారు?; తెలియవలయున్= తెలుసుకోవాలి తెలపండి.

**తా :** యముని సన్నిధిని చేరిన యమకింకరులు ఓ స్వామీ! జీవులు సత్త్వ, రజస్తమో గుణాలచే, మనోవాక్కాయ కర్మలచే చేసిన పలురకాల కర్మలకు ఫలితాన్ని నిర్ణయించేవారు మీరు కాక ఇంకా ఎవరైనా ఉన్నారా? తెలియజేయుమని కోరారు.

**క. దక్షిణదిశాధినాయక! శిక్షం దగఁ జేయువారు క్షితిఁ బెక్కం డ్రే**
**నీ క్షయమున్నక్షయమును సాక్షాత్తుగ రెండు నెందు సంపన్న మగున్? 163**

**ప్రతి :** దక్షిణ దిశ= దక్షిణ దిక్కుకు; అధినాయక= అధిపతివి అయిన ఓ యమధర్మరాజా!; శిక్షన్= శిక్షించడానికి; తగన్= తగినట్లు; చేయువారు= నిర్ణయించేవారు; క్షితిన్= ఈ లోకంలో; పెక్కండ్రు= చాలమంది; ఏనిన్= అయితే; ఈ+క్షయమున్= ఈ నాశనానికి; న+క్షయమును= నాశనం లేకపోవుటకు; సాక్షాత్తుగా= ప్రత్యక్షంగా; రెండును= ఈ రెండు సంఘటనలు; ఎందున్= ఏ విధంగా; సంపన్నము+అగున్= సక్రమంగా జరుగుతాయి?

**తా :** ఓ యమధర్మరాజా! లోకంలో నీవు కాక శిక్షలు వేసేవారు ఇంకా చాలామంది ఉంటే, ఈ జనన మరణ సంబంధాలైన క్రియా కలాపాలు ఈ లోకంలో సక్రమంగా ఎలా జరుగుతాయి?

**తే. దట్టమైనట్టి కర్మబంధముల నెల్ల నాజ్ఞ పెట్టెడువారు పెక్కైనచోట**
**నకట! శాస్తృత్వ ముపచార మయ్యెఁ గాదె! శూరులైనట్టి మండలేశులకుఁబోలె. 164**

**ప్రతి :** అకట= అయ్యో; శూరులు+ఐన+అట్టి= వీరులైన; మండల+ఈశులకున్= చిన్న ప్రాంతాల అధిపతులకు; పోలెన్= వలె; దట్టమైనట్టి= దృఢమైనట్టి; కర్మబంధములు+ఎల్లన్= ఇహలోక సంబంధమైన పనులన్నింటికి; ఆజ్ఞన్= శిక్షను; పెట్టెడువారు= నిర్ణయించేవారు; పెక్కు+ఐన+చోటన్= అధికమైనచోట; శాస్తృత్వము= నియామకుడు, అధికారి అనేమాట; ఉపచారము= కేవలం అప్రధానం; అయ్యెన్+కాదె= అవుతుంది కదా?

**తా :** లోకంలో చిన్న చిన్న అధిపతులను కూడా శాసకులని ఎలా అంటామో అలాగే లోకంలోని కర్మఫలాలకు శిక్షను విధించేవారు ఎక్కువగా ఉన్నట్లైతే 'శాసకుడు' అనే మాట కేవలం మర్యాదకోసమే అవుతుంది తప్ప నిజం కాదు కదా?

**ఉ. కావున నీవ యొక్కఁడవ కర్తవు మూఁడు జగంబులందు సం**
**భావిత భూతకోటిఁ బరిపాకవశంబున శిక్ష సేయఁగా**
**నీ వర శాసనం బఖిలనిర్ణయమై తనరారుచుండ నేఁ**
**డీవలఁ గ్రమ్మఱింప మఱి యెవ్వఁడు శక్తుఁడు ? ధర్మపాలకా! 165**

**ప్రతి :** కావునన్= అందువల్ల; ధర్మపాలకా= ఓ సమవర్తీ!; నీవ+ఒక్కఁడవు+అ= నీవు ఒక్కడివి మాత్రమే; మూఁడు జగంబుల+ అందున్= ఈ ముల్లోకాలలో; సంభావిత= తగినట్లుగా; భూతకోటిన్= సర్వప్రాణికోటిలో; పరిపాకవశంబునన్= చేసుకున్న కర్మఫలితాలకు అనుగుణంగా; శిక్ష+చేయన్+కాన్= శిక్షించడానికి; కర్తవు= అధికారివి; నీ వర శాసనంబు= నీవిచ్చిన ఆజ్ఞయే; అఖిల= అన్ని విధాలుగా; నిర్ణయము+ఐ= శాసనమై; తనరారుచున్+ఉండన్= ప్రకాశిస్తుండగా; నేఁడు= ఈనాడు; ఈ వలన్= ఇక మీదట; క్రమ్మఱింపన్= తప్పించడానికి; మఱి+ఎవ్వఁడు= మరొకడు ఎవ్వడు; శక్తుఁడు= శక్తిమంతుడు?

**తా :** ఓ ధర్మపాలకా! ఈ ముల్లోకాలలో జీవుల కర్మలకు అనుగుణంగా ఫలితాన్ని నిర్ణయించగలిగే సమర్థుడైన అధికారివి నీవు మాత్రమే కదా? మరి అలాంటి తిరుగులేని నీ శాసనాన్ని మార్చగలిగే శక్తిమంతులు ఎవరైనా ఉన్నారా?

**క. చండకరతనయ! యొరులకు దండధరత్వంబు గలదె! తన జగమున ను**
**ద్దండధరవృత్తి నొత్తిలి దండింతువు నిన్ను దండధరుఁడని పొగడన్. 166**

**ప్రతి :** చండకర= తీక్ష్ణమైన కిరణాలు కలిగిన సూర్యునియొక్క; తనయ= కుమారా!; తన జగమునన్= నీ తండ్రి సంచరించే లోకంలో; ఉద్దండధరవృత్తిన్= నిష్కర్షమైన న్యాయదండం సహాయంతో; ఒత్తిలి= నిర్ణయించి; దండింతువు= శిక్షిస్తావు (కనుక); నిన్నున్= అలాంటి నిన్ను; దండధరుఁడు+అని= పాశ హస్తుడవని; పొగడన్= మెచ్చుకుంటుండగా; ఒరులకున్= ఇతరులకు; దండధరత్వంబున్+కలదె= శాసన అధికారం ఉందా?

**తా :** ఓ సూర్యపుత్రా! ఈ జీవుల కర్మలకు నిష్పక్షపాతంగా శిక్షలు నిర్ణయించ గలిగేది నీవు ఒక్కడివే కదా! అందుకే నిన్ను పాశహస్తుడని అంటారు. అలాంటి నువ్వు కాక ఇంకెవరైనా శాసకులు ఉన్నారా?

**సీ. ఇట్టి నీ దండంబ యీ మూఁడు జగములఁ దెగువమై నేఁడు వర్తిల్లుచుండ**
**మనుజలోకంబుల మహితాద్భుతాకారసిద్ధుల మిగులఁ బ్రసిద్ధు లైన**
**వారు నల్వురు వేగ వచ్చి నిర్దేశంబు భంగించి మ మ్మంతఁ బాఱఁదోలి**
**మీ శాసనంబున మే మీడ్చికొని వచ్చు క్రూరచిత్తునిఁ బుచ్చికొని యదల్చి**

**తే. పాశబంధంబు లీసునఁ బట్టి త్రెంచి, బలిమి మిగులంగ మమ్మునుఁ బాఱఁదోలి**
**యిచ్చఁ జనినారు వారు దా మెచటివార, లాదరమ్మున నేఁడు మా కానతిమ్ము. 167**

**ప్రతి :** ఇట్టి= ఇలాంటి; నీ దండంబు+అ= నీ యమదండమే; ఈ మూఁడు జగములన్= ఈ మూడు లోకాలలో; తెగువమై= నిస్సంకోచంగా; వర్తిల్లుచున్+ఉండన్= నడుస్తుండగా; నేఁడు= ఈనాడు; మనుజ లోకంబులన్= ఈ భూలోకంలో; మీ శాసనంబునన్= మీ ఆజ్ఞతోనే; మేము= మీ సేవకులమైన మేము; ఈడ్చుకొని= లాగుకొని; వచ్చు= తీసుకువచ్చే; క్రూరచిత్తునిన్= దుర్మార్గుడిని; మహిత= గొప్పదైన; అద్భుత= ఆశ్చర్యకరమైన; ఆకారసిద్ధులన్= రూపాల ప్రాప్తిచేత; మిగులన్= మిక్కిలి; ప్రసిద్ధులు+ఐనవారు= పేరు కలిగినటువంటి వారు; నల్వురు= నలుగురు (దివ్యపురుషులు); వేగన్వచ్చి= త్వరగా వచ్చి; నిర్దేశంబున్= మీ నిర్ణయాన్ని; భంగించి= తిరస్కరించి; మమ్మున్+అంతన్= మమ్మల్ని బెదిరించి; పాఱన్+తోలి= పారిపోయేలా తరిమి; పాశ బంధంబులు= యమపాశాలు; ఈసునన్= కోపంతో; పట్టిత్రుంచి= తెంపివేసి; బలిమి= బలం; మిగులన్+కన్= అతిశయించగా; మమ్మునున్= మమ్మల్ని; పాఱన్+తోలి= వెడలగొట్టి; ఇచ్చన్+చనినారు= తమకు నచ్చిన విధంగా వెళ్ళారు; వారు= ఆ నలుగురు; తాము= వారు; ఎచటివారలు= ఎక్కడివారు?; ఆదరమ్మునన్= దయతో; నేఁడు= ఈ రోజు; మాకున్; ఆనతి+ఇమ్ము= తెలియజేయండి.

**తా :** ఈ ముల్లోకాలలో నిరాటంకంగా మీ ఆజ్ఞయే ప్రవర్తిస్తూ ఉండగా, ఈనాడు మీ ఆజ్ఞతో భూలోకంనుండి మేము తీసుకురాబోయిన దుర్మార్గుని జీవాత్మను మా నుండి నలుగురు దివ్యపురుషులు లాగుకొని, విడిపించి మమ్మల్ని భయపెట్టి, అడ్డగించి తరిమి వారు ఇష్టానుసారంగా వెళ్ళిపోయారు. వారు ఎక్కడి నుండి వచ్చారో ఎవ్వరో దయచేసి మాకు తెలియజేయండి.

**వ. అనిరి. అని మఱియు శుకుం డిట్లనియె. అట్లు దూతలు పరితాపసమేతులై పలికిన, దండధరుండు పుండరీకాక్షునిచరణకమలంబుల మానసంబున సన్నిహితంబులుగఁ జేసి, వందనం బాచరించి, పరమ భక్తిపరుండై వారల కిట్లనియె. 168**

**ప్రతి :** అనిరి= అని అడిగారు; అని= అనిచెప్పి; మఱియున్= ఇంకా; శుకుండు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; అట్లు= ఆ విధంగా; దూతలు= యమకింకరులు; పరితాప సమేతులై= మిక్కిలి బాధతో కూడుకున్నవారై; పలికినన్= జరిగినదంతా తెలుపగా; దండధరుండు= యమధర్మరాజు; పుండరీక+అక్షుని= శ్రీమహావిష్ణువుయొక్క; చరణ కమలంబులన్= పాదపద్మాలను; మానసంబునన్= తన మనసులో; సన్నిహితంబులు+కన్+చేసి= నిలుపుకొని; వందనంబు+ఆచరించి= ఆ స్వామికి మ్రొక్కి; పరమభక్తిపరుండు+ఐ= మిక్కిలి భక్తి తత్పరుడై; వారలకున్= ఆ యమకింకరులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా సమాధానం చెప్పాడు...

**తా :** అని అడిగారని చెబుతూ శుకమహర్షి తిరిగి ఇలా అన్నాడు. తన కింకరుల ద్వారా జరిగినదంతా తెలుసుకున్న యమధర్మరాజు సర్వం గ్రహించినవాడై నారాయణుని పాదపద్మాలను మనసులో నిలుపుకొని పరమభక్తితో నమస్కరిస్తూ తన భటులకు ఇలా సమాధాన మిచ్చాడు.

సీ. కలఁడు మదన్యుండు ఘనుఁ డొక్కఁ డతఁ డెందు వెలికిఁ గానఁగరాక విశ్వమెల్ల
నతిలీనమై మహాద్భుత సమగ్రస్ఫూర్తి నుండును గోక నూలున్నభంగి
దామెనఁ బశువులు దగిలి యుండెడుమాడ్కి నామసంకీర్తనస్థేమగతుల
విహరించు నెవ్వఁడు విలసితమత్పూజ లెవ్వనిపదముల నివ్వటిల్లుఁ

ఆ. గనుట మనుట చనుట గల్గు నెవ్వనిలీల, లందు లోక మెవనియందుఁ బొందు
నెన్నఁబడుచుఁ బుడమి నెవ్వనినామముల్, కర్మబంధనముల పేర్మి నడఁచు. 169

**ప్రతి :** మత్+అన్యుండు= నాకంటె ఇతరమైనవాడు; ఘనుఁడు+ఒక్కఁడు= గొప్పవాడు ఒకడు; కలఁడు= ఉన్నాడు; అతఁడు= ఆ మహాపురుషుడు; ఎందున్= ఎక్కడా; వెలికిన్+కానన్+కన్+రాక= పైకి కనబడకుండా; విశ్వము+ఎల్లన్= ఈ ప్రపంచమంతా; అతిలీనమై= సూక్ష్మంగా లయించి; మహా+అద్భుత= మిక్కిలి ఆశ్చర్యకరమైన; సమగ్ర స్ఫూరిన్= సంపూర్ణమైన ప్రభావంతో; ఉండును= నిండివున్నాడు; కోకన్= చీరలో; నూలు= దారం; ఉన్నభంగిన్= ఇమిడి వున్న విధంగా; దామెనన్= రాటకు; పశువులు= పెంపుడు జంతువులు; తగిలి ఉండెడుమాడ్కిన్= కట్టబడిన విధంగా; నామసంకీర్తన= భగవన్నామ స్మరణమనే; స్థేమగతులన్= ఉత్తమమార్గాలను; ఎవ్వఁడు= ఎవడైతే; విహరించున్= అనుసరిస్తాడో; విలసిత= చేయబడిన; మత్+పూజలు= నాయొక్క సేవలు; ఎవ్వని పదములన్= ఎవరి పాదాలను; నివ్వటిల్లున్= చేరుకుంటాయో; కనుట= సృష్టి; మనుట= స్థితి; చనుట= లయం; ఎవ్వని= ఎవరియొక్క; లీలలు= విలాసాలు; కల్గున్= జరుగుతాయో; లోకము= ఈ లోకమంతా; ఎవని+అందున్= ఎవని లోపల; పొందున్= నిండి వుంటుందో; పుడమిన్= ఈ భూమిపై; ఎవ్వని= ఎవరియొక్క; నామముల్= పేర్లు; ఎన్నన్+పడుచున్= స్తుతింపబడుతూ; కర్మబంధనముల= చేసుకున్న పాప, పుణ్య కర్మ ఫలితాల; పేర్మిన్= ప్రభావాన్ని; అడఁచున్= నిర్మూలించునో!

**తా :** ఉన్నాడు. నాకంటే ఘనుడైనవాడు ఒకడున్నాడు. అతడు బయటికి కానరాకుండా ప్రపంచమంతటా నిండి ఉన్నాడు. అత్యద్భుతంగా సమగ్రంగా చీరలో దారాల రీతిగా వ్యాపించి ఉన్నాడు. అతని ఆజ్ఞానుసారం జీవులందరూ త్రాళ్లతో కట్టబడిన పశువుల మాదిరిగా ఆ యా నామాలతో సంకేతాలతో గిరగిర తిరుగుతున్నారు. నేను చేసే పూజలన్నీ ఆయన పాదాలకే అంకితం. ప్రాణులు పుట్టటం బ్రతకటం మరణించటం అన్నీ ఆయన లీలావిలాసాలే. ఈ సమస్త జగత్తూ ఆయనలోనే లీనమై ఉంటుంది. ఆయన నామాలు ఉచ్చరిస్తే చాలు సమస్త కర్మబంధాలూ నిర్మూలమైపోతాయి.

**తరళము**

వినుఁడు నేను మహేంద్రుఁ డప్పతి వీతిహోత్రుఁడు రాక్షసుం
డనిలుఁ డర్కుఁడు చంద్రుఁడుం గమలాసనుండు మరుద్గణం
బును మహేశుఁడు రుద్రవర్గము భూరిసంయమిసిద్ధులున్
మొనసి కన్గొనఁజాల రెవ్వనిమూర్తి విశ్రుతకీర్తిమై. 170

**ప్రతి :** వినుఁడు= వినండి చెబుతున్నా; నేను= యముడనైన నేను; మహా+ఇంద్రుఁడు= తూర్పుదిక్కు అధిపతి అయిన ఇంద్రుడు; అప్+పతి= జలాధిపతి అయిన వరుణుడు; వీతిహోత్రుఁడు= ఆగ్నేయాధిపతి అయిన అగ్నిదేవుడు; రాక్షసుండు= నైఋతికి అధిపతి అయిన నిరృతి అనే రాక్షసుడు; అనిలుఁడు= వాయవ్యాధిపతి అయిన వాయుదేవుడు; అర్కుఁడు=

సూర్యుడు; చంద్రుఁడున్= చంద్రుడు; కమల+ఆసనుండు= బ్రహ్మ; మరుత్+గణంబును= మరుత్తులనే దేవగణ సమూహం; మహా+ఈశుఁడు= మహేశ్వరుడు; రుద్రవర్గము= ప్రమథగణాలు; భూరి= గొప్ప; సంయమి సిద్ధులున్= గొప్ప సంయమంగల సిద్ధులు; మొనసి= ప్రయత్నించి; విశ్రుతకీర్తిమైన్= మహోన్నతమైన యశస్సుగల; ఎవ్వని మూర్తి= ఏ స్వరూపాన్నైతే కలిగి ఉంటాడో దానిని; కన్గొనన్+చాలరు= తెలుసుకోలేరు.

**తా :** ఇంకా చెబుతాను వినండి. నేనేకాదు. ఇంద్రుడు, వరుణుడు, అగ్ని, నిరృతి, వాయుదేవుడు; సూర్యచంద్రులు; బ్రహ్మ, ఈశ్వరుడు, రుద్రుడు, ప్రమథగణాలు, బ్రహ్మర్షులు మొదలైన వారు ఎవరు కూడా ఆ పరమ పురుషుణ్ణి దర్శించలేరు.

**క. సత్త్వేతరగుణపాశవశత్వంబునఁ బొంద వీరు జలజాక్షుసదై**
**కత్వంబు గాన నోపరు సత్త్వప్రాధాన్యు లితరజనులకుఁదరమే? 171**

**ప్రతి :** సత్త్వప్రాధాన్యులు= సత్త్వగుణం ప్రధానంగా కలవారు; సత్త్వ+ఇతర గుణపాశ= సత్త్వం కంటే భిన్నమైన రజస్తమోగుణాలనెడి పాశాలకు; వశత్వంబునన్+పొందన్= వశంకాగా; వీరు= ఈ సత్త్వగుణ ప్రధానులు; జలజ+అక్షు= పద్మనేత్రునియొక్క; సత్+ఏకత్వంబున్= ఎల్లవేళల ఏకరూపంలో ఉండే స్థితిని, కానన్+ఓపరు= చూడలేరు; ఇతరజనులకున్= సత్త్వగుణం ఏమాత్రం లేని ఇతరులను, భగవత్తత్త్వాన్ని దర్శించడం సాధ్యమా? సాధ్యంకాదు.

**తా :** సత్త్వగుణప్రధానులై ఉండికూడా పొరపాటున రజస్తమో గుణాలకు వశులైనవారు, శ్రీహరియొక్క సదా ఏకత్వంతో ఉండే తత్త్వాన్ని దర్శింపలేరు. ఇక నిరంతరం త్రిగుణాలతో కూడినవారికి ఆ దివ్యతత్త్వాన్ని దర్శించడం సాధ్యమా? (సాధ్యంకాదు).

**చ. అభవు నమేయు నవ్యయు ననంతు ననారతుఁ బూని మేనిలో**
**నుభయము నై వెలుంగు పురుషోత్తముఁ గానరు చిత్తకర్మ వా**
**గ్విభవగరిష్ఠులై వెదకి వీఱిఁడి ప్రాణులు; సర్వవస్తువుల్**
**శుభగతిఁ జూడనేర్చి తనుఁ జూడఁగ నేరని కంటిపోలికన్. 172**

**ప్రతి :** అభవున్= జన్మలేనివాడు; అమేయున్= కొలతలకు దొరకనివాడు; అవ్యయున్= నాశనం లేనివాడు; అనంతున్= అంతులేనివాడు; అనారతున్= నిత్యసత్యమైనవాడు; పూని= పూనికతో; మేనిలో= సకల జీవుల శరీరాలలో; ఉభయమున్+ఐ= జీవ, పరమాత్మలు రెండూ తానే అయి; వెలుంగు= ప్రకాశించే; పురుష+ఉత్తమున్= పురుషోత్తముణ్ణి; చిత్త= మానసిక; కర్మ= కాయిక; వాక్+విభవ= వాచక వైభవంచేత; గరిష్ఠులై= అధికులై; వెదకి= బాహ్యంగా శోధించి కూడా; వీఱిఁడిప్రాణులు= ఆ వెర్రిజీవులు; సర్వవస్తువుల్= అన్ని విషయాలను; శుభగతిన్= స్పష్టంగా (చక్కగా), చూడనేర్చి= చూడగలిగీ; తనున్+చూడన్+కన్= తనను తాను చూడడానికి; నేరని= శక్తిలేని; కంటిపోలికన్= కన్ను మాదిరిగా; కానరు= చూడలేరు.

**తా :** జన్మలేనివాడూ, ప్రమాణాలకు దొరకనివాడూ, నాశం లేనివాడూ, అంతంలేనివాడూ, నిత్యసత్యమైనవాడూ, సకలజీవుల్లో జీవాత్మ, పరమాత్మ అనే రెండు రూపాల్లో తానే ప్రకాశిస్తుండేవాడూ, అయిన పురుషోత్తముణ్ణి త్రికరణవైభవంతో గరిష్ఠులై బాహ్యంగా ఎంత శోధించికూడా ఆ వెర్రిజీవులు అన్ని వస్తువులను స్పష్టంగా చూడగల్గిందైనా – కన్ను తనను తాను చూడలేనట్లుగా – ఆ భగవంతుణ్ణి చూడలేరు.

**చ. పరముని భక్తలోకపరిపాలనశీలుని దుష్టలోక సం**
**హరుని పతంగపుంగవవిహారుని కూరిమిదూతలా మనో**
**హరులు సురేంద్రవందితులు నా హరిరూపగుణస్వభావులై**
**తిరుగుచునుందు రెల్లెడల దిక్కులఁ దేజము పిక్కటిల్లఁగన్ 173**

**ప్రతి :** భక్తలోక= భక్తసమూహాన్ని; పరిపాలన= రక్షించడమే; శీలుని= స్వభావంగా కలవానియొక్క; దుష్టలోక= దుర్మార్గాల సమూహాన్ని; సంహరునిన్= నాశనం చేసేవానియొక్క; పతంగపుంగవ= పక్షుల రాజైన గరుత్మంతునిపై, విహారుని= సంచరించేవాడు అయిన; పరముని= ఆ పరమాత్మయొక్క; కూరిమిదూతలు= ఇష్టసేవకులు; ఆ మనోహరులు= ఆ దివ్యరూపులు; సుర+ఇంద్ర వందితులున్= దేవేంద్రునిచేత నమస్కరింపదగినవారు, ఆ హరి= ఆ విష్ణువుయొక్క; రూప= ఆకారం; గుణ= గుణాలు; స్వభావులై= పొందినవారై; దిక్కులన్+ఎల్ల+ఎడలన్= అన్ని దిక్కులయందును; తేజము= ప్రకాశం; పిక్కటిల్లన్+కన్= వ్యాపించునట్లు; తిరుగుచున్+ ఉందురు= తిరుగుతుంటారు.

**తా :** ఆయన పరమాత్ముడు. భక్తులను పరిపాలించేవాడు. దుష్టులను సంహరించేవాడు. గరుత్మంతునిపై అధిష్ఠించి సమస్త లోకాలలో విహరిస్తూ ఉంటాడు. ఆ మహానుభావుని ప్రియమైన దూతలుకూడా ఆకారంలో, గుణాలలో స్వభావంలో ఆ శ్రీహరినే పోలి ఉంటారు. ఆ దేవుని దూతలకు దేవేంద్రుడు సైతం చేతులు మోడ్చి నమస్కరిస్తాడు. అటువంటి విష్ణుదూతలు తమ దేహకాంతులు దిక్కులనిండా వ్యాపింపగా లోకమంతటా సంచరిస్తుంటారు.

**ఉ. లెక్కకు నెక్కువై కసటు లేని మహాద్భుతతేజ మెల్లెడం**
**బిక్కటిలం జరింతు రతిభీమబలాఢ్యులు విష్ణుదూత లా**
**చక్కని ధర్మశాంతు లతిసాహసవంతులు దేవపూజితుల్**
**గ్రిక్కిఱి సీ జగంబునను గేశవసేవకరక్షణార్థమై. 174**

**ప్రతి :** లెక్కకున్+ఎక్కువై= లెక్కించుటకు వీలుకానివై; కసటులేని= ఏ కళంకం లేని; మహా+అద్భుత= మిక్కిలి గొప్పదైన; తేజము= ప్రకాశం; ఎల్ల+ఎడన్= సర్వత్రా; పిక్కటిలన్= దట్టంగా వ్యాపించగా; అతి= అత్యంత; భీమబల+ఆఢ్యులు= భయంకరమైన బలసంపన్నులు అయిన; విష్ణుదూతలు= విష్ణుసేవకులు; ఆ చక్కని= అలాంటి చక్కనైన; ధర్మశాంతులు= ధర్మబద్ధమైన శాంత స్వభావంగలవారు; అతి సాహసవంతులు= మిక్కిలి సాహసం కలవారు; దేవపూజితుల్= దేవతలచే పూజింపబడేవారు; క్రిక్కిఱిసి= ఎడములేకుండా; ఈ జగంబునను= ఈ లోకంలో; కేశవసేవక= విష్ణుభక్తులను; రక్షణ+అర్థమై= రక్షించడంకోసం; చరింతురు= తిరుగుతుంటారు.

**తా :** మహోన్నతమైన తేజస్సుతో, అత్యంత బలవంతులై, శాంతమూర్తులై, వీరులై, దేవతలచేత సేవింపబడుతున్న వారైన విష్ణుదూతలు శ్రీహరిభక్తుల రక్షణార్థమై సర్వత్రా వ్యాపించి ఈ లోకంలో సంచరిస్తూ ఉంటారు.

**క. నావలనను మీవలనను దేవాసురగణమువలనఁ ద్రిజగంబులలో**
**నే వగలఁ బొందకుండఁగఁ గావంగలవారు పుడమిఁగల వైష్ణవులన్. 175**

**ప్రతి :** పుడమిన్+కల= భూలోకంలో ఉన్న; వైష్ణవులన్= విష్ణుభక్తులను; నా వలనను= నాచేతనూ, మీ వలనను= మీచేతనూ; దేవ+అసుర= దేవతల, రాక్షసుల; గణమువలనన్= సమూహంచేతను; త్రిజగంబులలోన్= ఈ ముల్లోకాలలో; ఏ+వగలన్= ఎటువంటి కష్టాలను; పొందక+ఉండన్+కన్= గురికాకుండా; కావన్+కలవారు= రక్షిస్తూ ఉంటారు.

**తా :** నాచేతా, మీచేతా, దేవతలచేతా, రాక్షసులచేతా ఎటువంటి ఇబ్బందులకు గురి కాకుండా ఈ ముల్లోకాలలోని విష్ణుభక్తులను విష్ణుదూతలు రక్షిస్తూ ఉంటారు.

**క. భగవత్ప్రణిహితధర్మం బగపడ దెవ్వారిమతికి ననిమిష గరుడో**
**రగ సిద్ధ సాధ్య నర సుర ఖగ తాపస యక్ష దివిజ ఖచరులకైనన్. 176**

**ప్రతి :** భగవత్= పరమాత్మచే; ప్రణిహిత= ఉంచబడిన; ధర్మంబు= ధర్మం; అనిమిష= దేవతలు; గరుడ= గరుడులు; ఉరగ= నాగులు; సిద్ధ= సిద్ధులూ; సాధ్య= సాధ్యగణాలు; నర= మానవులు; సుర= దేవగణాలు; ఖగ= పక్షిజాతి; తాపస= ఋషుల సమూహం, యక్ష= యక్షులు; దివిజ= స్వర్గవాసులు; ఖచరులకున్= ఆకాశ గమనం గల వారికి; మొదలైన; ఎవ్వారి మతికిన్+ఐన్= ఎలాంటివారి బుద్ధికైనా; అగపడదు= కనిపించదు.

**తా :** భగవంతుడు ప్రతిష్ఠించిన ధర్మాన్నికాని, భగవత్తత్త్వాన్నికాని, దేవతలు, గరుడులు, ఉరగులు, సిద్ధులు, సాధ్యులు, మానవులు, పక్షులు, మునులు, యక్షులు, విద్యాధరులు, ఖేచరులు మొదలైనవారు ఎవరూ కూడా సంపూర్ణంగా గ్రహించలేరు. వారి బుద్ధికి అందదు కూడా!

**క. ఎన్నఁడుఁ దెలియఁగ నేరరు పన్నగపతిశాయితత్త్వభావము మేనం**
**గన్నులవేల్పును డాపలఁ జన్నమరినవేల్పు ముదుకచదువులవేల్పున్. 177**

**ప్రతి :** పన్నగపతిశాయి= శేషశాయియొక్క; తత్త్వభావమున్= తత్త్వస్వరూపాన్ని; మేనన్+కన్నుల వేల్పు= శరీరమంతా కన్నులు కలిగిన దేవుడు (ఇంద్రుడు); డాపలన్= ఎడమప్రక్క; చన్ను+అమరిన వేల్పును= వక్షోజం కలిగిన దేవుడు (శివుడు); ముదుక చదువుల= ఆదికాలపు చదువులు చదివిన (వేదాలు చదివిన); వేల్పు= దేవుడు (బ్రహ్మ) (వీరంతా కూడా); ఎన్నఁడున్= ఏనాటికి కూడా; తెలియన్+కన్+నేరరు= తెలుసుకోలేరు.

**తా :** ఇంద్రుడు, బ్రహ్మ, శివుడు వీరందరూ ఎంతటివారైనా ఏనాటికీ కూడా శ్రీహరి తత్త్వాన్ని, గొప్పతనాన్ని తెలుసుకోలేరు.

**సీ. వరమహాద్భుతమైన వైష్ణవజ్ఞానంబు తిరముగా నెవ్వరు తెలియఁగలరు?**
**దేవాదిదేవుండు త్రిపురసంహరుఁ డొండెఁ గమలసంభవుఁడొండెఁ గార్తికేయ**
**కపిలనారదు లొండె గంగాత్మజుం డొండె మను వొండె బలి యొండె జనకుఁ డొండెఁ**
**బ్రహ్లాదుఁ డొండె నేర్పాటుగా శుకుఁ డొండె భాసురతరమతి వ్యాసుఁ డొండెఁ**

**తే. గాక యన్యుల తరమె? యీ లోకమందు, నీ సుబోధంబు సద్బోధ మీ పదార్థ**
**మీ సదానందచిన్మయ మీ యగమ్య, మీ విశుద్ధంబు గుహ్యంబు నీ శుభంబు. 178**

**ప్రతి :** ఈ లోకము+అందున్= ఈ సృష్టిలో; ఈ సుబోధంబు= ఈ ఉత్తమ జ్ఞానం; సత్+బోధము= విశేషజ్ఞానం; ఈ పదార్థము= ఈ మూల పదార్థ స్వరూపం; ఈ సత్+ఆనంద= ఈ శాశ్వత ఆనందం; చిత్+మయం= చైతన్య

స్వరూపం; ఈ+అగమ్యము= పొందశక్యం గాని ఈ మార్గం (హద్దు); ఈ విశుద్ధంబు= ఈ నిత్య నిర్మలం; గుహ్యంబున్= ఈ పరమ రహస్యం; ఈ శుభంబు= ఈ శోభాకర మూర్తిని; దేవ+ఆదిదేవుండు= దేవతలకు దేవుడైన; త్రిపుర సంహరుఁడు+ఒండెన్= స్వర్ణ, రజత, కాంస్య నగరాలను దహించిన శివుడుగాని; కమలసంభవుఁడు+ఒండెన్= పద్మంలో పుట్టిన బ్రహ్మగాని; కార్తికేయ= కుమారస్వామి; కపిల= కపిల మహర్షి; నారదులు+ఒండెన్= నారదులు గాని, గంగా+ఆత్మజుండు+ ఒండెన్= గంగాతనయుడైన భీష్ముడుగాని, మనువు ఒండెన్= లోకపాలకుడైన మనువుగాని; బలి+ఒండెన్= రాక్షసరాజైన బలి చక్రవర్తిగాని; జనకుఁడు+ఒండెన్= రాజర్షి ఐన జనక మహారాజు గాని; ప్రహ్లాదుఁడు+ఒండెన్= భాగవతోత్తముడైన ప్రహ్లాదుడుగాని; ఏర్పాటుగాన్= స్పష్టంగా; శుకుఁడు+ఒండెన్= శుకమహర్షి గాని, భాసురతర= ప్రకాశవంతమైన; మతి= బుద్ధిగలవాడైన; వ్యాసుఁడు+ఒండెన్= వ్యాసమహర్షి గాని; కాక= తప్ప; అన్యుల= ఇతరులకు; తరమే= సాధ్యమా?, వర= ఉత్తమమైన, మహా+అద్భుతము+ఐన= గొప్ప ఆశ్చర్యకరమైన; వైష్ణవజ్ఞానంబు= విష్ణుపరమైన జ్ఞానం; తిరముగాన్= స్థిరబుద్ధితో; ఎవ్వరు= ఇతరులెవరు; తెలియగలరు= తెలుసుకోగలరు? (తెలుసుకోలేరు).

**తా :** ఈ లోకంలో విష్ణుపరమైన విశేషజ్ఞానసంపదను, సత్, చిత్, ఆనంద స్వరూపాన్ని శుద్ధ, సత్య, పరబ్రహ్మాన్ని పరమశివుడు, బ్రహ్మదేవుడు, కుమారస్వామి, కపిలుడు, నారదుడు, భీష్ముడు, మనుచక్రవర్తి, బలిచక్రవర్తి, జనకమహారాజు, ప్రహ్లాదుడు, శుకమహర్షి, జ్ఞానమూర్తి వేదవ్యాసమహర్షి మొదలయినవారు కొంతవరకు మాత్రమే తెలుసుకోగలరు. వీరు తప్ప ఇంకెవ్వరూ తెలుసుకోలేరు. సాధ్యం కూడా కాదు.

**క. ఈ పన్నిద్దఱు దక్కఁగ నోపరు తక్కొరులు తెలియ నుపనిషదుచిత**
**శ్రీపతినామమహాద్భుతదీపితభాగవతధర్మదివ్యక్రమమున్. 179**

**ప్రతి :** ఉపనిషద్+ఉచిత= ఉపనిషత్తులచేత తెలయబడేది, శ్రీపతినామ= లక్ష్మీపతి యైన విష్ణునామంయొక్క; మహా+అద్భుత= గొప్ప ఆశ్చర్యంతో; దీపిత= వెలుగొందుతున్న; భాగవతధర్మ= భక్తుల రక్షా ధర్మంయొక్క; దివ్యక్రమమున్= పావనమైన పద్ధతిని; తెలియన్= తెలుసుకోవడానికి; ఈ పన్నిద్దఱు= పైన పేర్కొన్న పన్నెండు మంది మహానుభావులు, తక్కన్+కన్= తప్ప; తక్క+ఒరులు= మిగిలిన వారు; ఓపరు= తెలుసుకోలేరు.

**తా :** ఉపనిషద్గోచరమైన శ్రీహరియొక్క మహాద్భుతమైన తత్వాన్ని పై పన్నెండుగురు మహాత్ములు మాత్రమే గ్రహించగలరు. ఇతరులు ఈ జ్ఞాన, భక్త రక్షణ రహస్యాలను ఏమాత్రం గ్రహించలేరు.

**విశే :** ఈ పద్యంలో పేర్కొన్న పన్నిద్దరు భాగవతులు 1. పరమశివుడు 2. బ్రహ్మ 3. కుమారస్వామి 4. కపిలుడు 5. నారదుడు 6. భీష్ముడు 7. మనుచక్రవర్తి 8. బలిచక్రవర్తి 9. జనకమహారాజు 10. ప్రహ్లాదుడు 11. శుకమహర్షి 12. వేదవ్యాసుడు అనేవారు.

**తే. ఏది జపియింప నమృతమై యెసఁగుచుండు నేది సద్ధర్మపథమని యెఱుఁగఁదగిన**
**దదియె సద్భక్తియోగంబు నలవరించు మూర్తిమంతంబు దా హరికీర్తనంబు. 180**

**ప్రతి :** ఏది= ఏ మంత్రమైతే; జపియింపన్= స్మరిస్తే; అమృతము+ఐ= శాశ్వతమై; ఎసఁగుచున్+ఉండున్= అతిశయిస్తూ ఉంటుందో; ఏది= ఏ మంత్రము; సత్+ధర్మ= ఉత్తమమైన ధర్మంయొక్క; పథము+అని= మార్గమని; ఎఱుఁగన్+తగినది=

తెలియదగిందో; అది+ఏ= ఆ మంత్రమే; సత్+భక్తియోగంబున్= మంచి భక్తితత్వాన్ని; అలవరించున్= అలవాటు చేస్తుంది; మరియు తాన్= అది; మూర్తిమంతంబున్= మూర్తీభవించిందైన; హరికీర్తనంబున్= హరినామ స్మరణం.

**తా :** ఏ నామస్మరణ అమృతత్వాన్ని ప్రసాదిస్తుందో, ఏ నామ జపం ఉత్తమ ధర్మమార్గాన్ని చూపిస్తుందో, ఏ మంత్రమైతే భక్తితత్వాన్ని ఒంటబట్టిస్తుందో అదే మూర్తీభవించిన మహిమాన్వితమైన శ్రీహరినామసంకీర్తనం.

**తే. కంటిరే మీరు సుతులార! కమలనేత్రుభవ్యమగు నామకీర్తనఫలము నేఁడు**
**తవిలి మృత్యువుపాశబంధములవలన జాణతనమున వీడె నజామిళుండు. 181**

**ప్రతి :** సుతులారా= ఓ నాయనలారా!; మీరు; కంటిరే= చూచారా?; కమలనేత్రు= పద్మనయనుడైన శ్రీహరియొక్క, భవ్యము+అగు= దివ్యమైన; నామకీర్తనఫలము= నామస్మరణ ఫలితం; తవిలి= అంటి; నేఁడు= ఈ రోజు; మృత్యువు= మరణం యొక్క; పాశబంధముల వలనన్= కట్లనుండి; జాణతనమునన్= బుద్ధి నేర్పుతో; అజామిళుండు= అజామిళుడు; వీడెన్= విముక్తి పొందాడు.

**తా :** ఓ నాయనలారా! ఘోరమైన మృత్యుపాశానికి గురి అయి నరకానికి పోవలసిన అజామిళుడు తన చివరి గడియలలో కలిగిన బుద్ధి విశేషంతో నామస్మరణ చేసి యమపాశం కట్లనుండి విముక్తుడైన సంఘటనను మీరు కళ్ళారా చూశారు కదా?

**ఉ. ఏటికి జాలిఁ బొంద? నరు లీ క్రియఁ, గృష్ణునికీర్తనంబు పా**
**పాటవులం దహింపఁ గల దౌటకు సందియ మేల? యిప్పు డీ**
**తూఁటరి దోసకారి పెనుదోషి యజామిళుఁ డంత మొందుచుం**
**బాటిగ విష్ణునామమును బల్కుచుఁ గేవలముక్తి కేగఁడే? 182**

**ప్రతి :** ఇప్పుడు= ఈ క్షణంలోనే; ఈ తూఁటరి= ఈ దుష్టుడు; దోసకారి= దుర్మార్గుడు; పెనుదోషి= మహాపాపి అయిన; అజామిళుఁడు= అజామిళుడు; అంతము+ఒందుచున్= చనిపోతూ; పాటిగన్= అనుకోకుండా (చక్కగా), విష్ణునామమును+ పల్కుచున్= నారాయణస్మరణ చేస్తూ; కేవలముక్తికిన్+ఏగఁడే= మోక్షానికి వెళ్లాడు కదా!; నరులు= మనుజులు; ఈ క్రియన్= ఈ విధంగా; జాలిన్+పొందన్= విచారపడటం; ఏటికి= ఎందుకు; కృష్ణుని కీర్తనంబు= హరినామ స్మరణం (చేసినా); పాప+అటవులన్= పాపమనే అడవులను; దహింపన్+కలది+ఔటకున్= కాల్చుటకు సమర్థం అనడానికి; సందియము+ఏల= అనుమానం ఎందుకు? (లేదు).

**తా :** ఆకతాయి, దుష్టుడు, మహాపాపి ఐన అజామిళుడు చివరిక్షణంలో హరి నామస్మరణ చేసి వైకుంఠాన్ని పొందాడు కదా! మానవులు ఇలా విచారపడడం ఎందుకు? భగవన్నామకీర్తనం భయంకరమైన పాపపు అడవుల్నే కాల్చేస్తుంది. ఇందులో సందేహం లేదు.

**విశే :** అంత్యకాలంలో భగవంతుని నామాన్ని తలచినవారికి వారు ఎంత పాపకర్ములైనా, సరే భగవత్కృపా పాత్రులవుతారు.

**క. ఇంతయును దథ్య మని మది నెంతయుఁ దెలియంగలేరు హీనాత్ములు దు**
**ర్దాంతతరఘటితమాయాక్రాంతాత్యంతప్రకాశగౌరవజడులై. 183**

**ప్రతి :** దుర్దాంతతర= నిగ్రహించుటకు శక్యంకాని; ఘటిత= సంభవించిన; మాయా+ఆక్రాంత= మాయచే ఆక్రమింపబడిన; అతి+అంత= అధికమైన; ప్రకాశ= కాంతియొక్క; గౌరవ= గౌరవంచేత; జడులు+ఐ= మూఢులై; హీన+ఆత్ములు= నికృష్టులు; ఇంతయునున్= ఇదంతా; తథ్యము+అని= సత్యమని; మదిన్= మనస్సులో; ఎంతయున్= ఏ మాత్రమూ; తెలియంగలేరు= తెలుసుకోలేరు.

**తా :** బుద్ధిహీనులైన మానవులు దాటశక్యం కాని మహామాయలో చిక్కుకొని తమ తెలివిని కోల్పోతున్నారు. ఈ యథార్థమైన విషయాన్ని తమ మనస్సులో కొంచెమైనా ఆలోచించి తెలుసుకోలేరు.

**మంగళమహాశ్రీ**

**ఈ విధమునన్ విబుధు లేకతమచిత్తముల నేకతము లేక హరి నీశున్**
**భావమున నిల్పి తగు భాగవతయోగపరిపాకమున నొందుదురు వారిన్**
**దేవలదు దండనగతిన్ జనదు మాకు గుఱుతింప నఘముల్ దలఁగు మీఁదన్**
**శ్రీవరుని చక్రము విశేషగతిఁగాఁచు సురసేవితులు ముక్తిఁ గడుఁ బెద్దల్. 184**

**ప్రతి :** ఈ విధమునన్= ఈ ప్రకారంగా; విబుధులు= విజ్ఞులు; ఏకతమ చిత్తములన్= ఏకాంత హృదయాలతో; ఏకతము+లేక= ఏ కారణమూలేకనే; ఈశున్= ఈశ్వరుడైన; హరిని= విష్ణువును; భావమునన్= హృదయంలో; నిల్పి= నెలకొల్పి; తగు= తగినట్టి; భాగవతయోగ పరిపాకమునన్= భగవద్భక్తులతోడి కలయికవల్ల; పరిపక్వ= పరిపక్వతచేత; పొందుదురు= చేరుకొంటారు; వారిన్= అట్టివారిని; దండనగతిన్= దండిలా వేపద్ధతిలో; తేవలదు= తీసుకరావద్దు; అఘమున్= పాపాలు; తలఁగుమీఁదన్= తొలగిన తర్వాత; మాకున్= దండించేవారి స్థానంలో ఉండేమాకు; గుఱితింపన్+ చనదు= వారిని గుర్తించడానికి సాధ్యంకాదు; శ్రీవరుని చక్రము= విష్ణుచక్రం; విశేషగతిన్= మిక్కిలిగా; కాఁచున్= వారిని రక్షిస్తుంది; సురసేవితులు= వారు దేవతలచే సేవించబడేవారు; ముక్తిన్= ముక్తిచేత; కడున్ పెద్దలు= చాలా మాన్యులు.

**తా :** విజ్ఞులైనవారు ఈ రీతిగా ఒకే లక్ష్యమునందు నిల్పిన చిత్తంతో, ఏకారణంలేకనే ఈశ్వరుడైన విష్ణువును హృదయంలో నిల్పుతారు. భగవద్భక్తులయొక్క కలయికచే కల్గిన పరిపాకంవల్ల భగవంతుని చేరుకొంటారు. వారిని దండించాలని మావద్దకు తీసుకురావలదు. పాపాలు తొలగిన తర్వాత దండనార్హులుగా వాళ్లను గుర్తించలేము. పైగా విష్ణుచక్రం వీళ్లను రక్షిస్తూంటుంది. దేవతలు వాళ్లను సేవిస్తుంటారు. ముక్తికారణంగా మిక్కిలి శ్రేష్ఠులు.

**విశే :** ఈ పద్యంలో చెప్పిన రీతిగా ఏకాంత భక్తులకు ఎట్టి ఆపద రాకుండా సుదర్శనచక్రం రక్షిస్తుంది అనడానికి అంబరీషుని వృత్తాంతం మనకు చక్కని నిదర్శనం.

ఛందస్సు : 1) ఇది ఒక ప్రత్యేక వృత్తం. 2) ప్రతి పాదంలోను భ, జ, స, న, భ, జ, స, న, గ,గ అనే గణాలతో మొత్తం 26 అక్షరాలు ఉంటాయి. 3) 1-9-17 అక్షరాల మధ్య యతి చెల్లుతుంది. 4) ప్రాస నియమం ఉంది.

**ఉ. ఎవ్వరు సిద్ధసాధ్యఖచరేశలసత్పరిగీతగాథలం**
**దెవ్వరు ముక్తిభోగతలహేమమనోహరచంద్రశాలలం**

**దెవ్వరు శంఖచక్ర గురుహేతి గదా రుచిరోగ్రపాణు లా**
**మవ్వపురూపవంతు లసమానులు వో ధరలోని వైష్ణవుల్. 185**

**ప్రతి :** ఎవ్వరు= ఏ భక్తులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; ఖచర+ఈశ= ఆకాశ గమనం కలిగి దేవతా ప్రముఖులచే; లసత్= అందంగా; పరిగీత= గానం చేయబడుతూ (ఉంటారో); గాథలు+అందున్= కథలలో; ఎవ్వరు= ఏ భాగవతులు; ముక్తిభోగతల= ముక్తియొక్క అనుభవస్థానంలోని; హేమ= బంగారుమయమైన; మనోహర= అందమైన; చంద్రశాలల+అందున్= చంద్రకాంత శిలాభవనంలో (ఉంటారో); ఎవ్వరు= ఏ పరమభక్తులు; శంఖ= శంఖమును; చక్ర= చక్రమును; గురుహేతి= గొప్ప కత్తి; గదా= గద మొదలైన ఆయుధాలచే; రుచిర+ఉగ్రపాణు= ప్రకాశవంతమైన చేతులయందు కలిగి ఉంటారో; ఆ= అటువంటి; మవ్వము= చక్కని; రూపవంతులు= అందమైన ఆకారం కలిగినవారు; ధరలోని= భూలోకంలోని; వైష్ణవుల్= విష్ణుభక్తులు; అసమానులు+వో= సాటిలేనివారే కదా!

**తా :** విష్ణుభక్తులైన మహానుభావుల కీర్తిని సిద్ధులు, సాధ్యులు, ఖేచరులు లలితగీతాలతో గానం చేస్తుంటారు. అటువంటి భాగవతులు ముక్తి సౌధంలో అందమైన చంద్రశాలలలో నివసిస్తుంటారు. సాటిలేనివారూ, సౌందర్యవంతులూ అయిన వైష్ణవోత్తముల చేతులలో శంఖచక్రాలూ గదాఖడ్గాలూ విరాజిల్లుతుంటాయి.

**సీ. శ్రుత్యంతవిశ్రాంతమత్యనుక్రమణీయ భగవత్ప్రసంగతుల్ భాగవతులు**
**సనకాదిమునియోగిజనసదానందైకపరమభాగ్యోదయుల్ భాగవతులు**
**కృష్ణపదధ్యానకేవలామృతపానపరిణామయుతులు శ్రీభాగవతులు**
**బహుపాతకానీకపరిభవప్రక్రియాపరుషోగ్రమూర్తులు భాగవతులు**

**తే. భావతత్త్వార్థవేదులు భాగవతులు, బ్రహ్మవాదానువాదులు భాగవతులు**
**సిరులు దనరంగ నెన్నఁడుఁ జేటు లేని, పదవి నొప్పారువారు వో భాగవతులు. 186**

**ప్రతి :** శ్రుతి+అంత= ఉపనిషత్తులందు; విశ్రాంత= పూర్ణమైన; మతి= బుద్ధిచే; అనుక్రమణీయ= అనుసరించదగిన; భగవత్= భగవత్సంబంధమైన; ప్రసంగతుల్= ప్రసక్తి కలవారు; భాగవతులు= విష్ణుభక్తులు; సనక+ఆది= సనకుడు మొదలైన; ముని+యోగిజన= ముని ముఖ్యులు, యోగి ముఖ్యులు; సదా+ఆనంద= శాశ్వత ఆనందమనే; ఏక= ముఖ్యమైన; పరమ= మిక్కిలి; భాగ్య+ఉదయుల్= అదృష్టం కలిగిన వారు; భాగవతులు= వైష్ణవులు; కృష్ణపద= విష్ణు పాదాలను; ధ్యాన= తలంచుట అనే; కేవల+అమృతము= ఒకేఒక అమృతాన్ని; పాన= తాగుట అనే; పరిణామయుతులు= ఫలం పొందినవారు; శ్రీభాగవతులు= శ్రీహరి భక్తులు; బహుపాతక+అనీక= అనేక పాపాల సమూహాన్ని; పరిభవ= తిరస్కరించడం అనే; ప్రక్రియా= పనియందు; పరుష+ఉగ్రమూర్తులు= పటిష్ఠమైన భీకరాకారంగలవారు; భాగవతులు= శ్రీహరి భక్తులు; భావ= భగవత్ భావం యొక్క; తత్త్వ+అర్థవేదులు= తత్త్వాన్ని తెలుసుకున్నవారు; భాగవతులు= భగవద్భక్తులు; బ్రహ్మవాద= పరతత్త్వాన్ని; అనువాదులు= వివరించగలుగువారు; భాగవతులు= విష్ణుభక్తులు; సిరులు= సంపదలు; తనరన్+కన్= అతిశయించగా; ఎన్నఁడున్= ఏనాడూ; చేటులేని= నష్టం కలగని; పదవిన్= ఉత్తమ కైవల్య పదవిలో (భక్తిపదవిలో); ఒప్పారువారు+వో= ప్రకాశించేవారే; భాగవతులు= ఈ వైష్ణవభక్తులు.

**తా :** వేదాంతసారమైన భగవంతునియందుమాత్రమే మనస్సును లగ్నం చేయగలవారు, సనకాది మునులు పొందగలిగిన శాశ్వత ఆనందాన్ని అనుభవించేవారు, విష్ణుపాదారవింద అమృతాన్ని ఆస్వాదించి తన్మయులు ఐనవారు, ఐహిక సుఖలంపట

పాపాలను పోగొట్టుకో గలిగినవారు, నిత్య సత్య భగవత్స్వరూపాన్ని చూడగలవారు, భక్తి సామ్రాజ్యానికి అభిషిక్తులై ఏనాడు కష్టం పొందని వారు శ్రీమన్నారాయణుని పరమభక్తులు.

**క. అదిగాన విష్ణుభక్తులఁ గదియఁగఁ జనవలదు మీరు కరివరదులస**
**త్పదపద్మవినతివిముఖులఁ దుది నంటఁగఁ గట్టి తెండు ధూర్తులు వారల్. 187**

**ప్రతి :** అది+కాన= ఆ కారణంగా; విష్ణుభక్తులన్= శ్రీహరి భక్తులను, కదియన్+కన్= సమీపించడానికి; మీరు; చనవలదు= వెళ్ళవద్దు; కరివరదు= గజేంద్రుణ్ణి రక్షించిన విష్ణువుయొక్క; లసత్= ప్రకాశించే; పదపద్మ= పాదపద్మాలకు; వినతి= నమస్కరించడంలో; విముఖులన్= వ్యతిరేకించేవారిని; తుదిన్= మరణ సమయంలో; అంటన్+కన్+కట్టి= గట్టిగా బంధించి; తెండు= తీసుకురండి; వారల్= వారు; ధూర్తుల్= దుర్మార్గులు.

**తా :** కాబట్టి దూతలారా! పరమభాగవతోత్తముల జోలికి మీరు వెళ్ళవద్దు. విష్ణువుయొక్క పాదపద్మాలను ఆశ్రయించని దుర్మార్గులను వారి మరణకాలంలో పట్టి బంధించి తీసుకురండి.

**సీ. ఏకసక్కెమున కైన నిందిరా రమణునిఁ బలుకంగలేని దుర్భాషితులను**
**గలలోన నైన శ్రీకాంతునిసత్పాదకమలముల్ సూడని కర్మరతుల**
**నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ దార్పనేరని దుష్కథాప్రవణుల**
**యాత్రోత్సవంబుల నైన నీశునిగుడిత్రోవఁ ద్రొక్కఁగలేని దుష్పదులను**

**ఆ. బరమభాగవతుల పాదధూళి సమస్త, తీర్థసార మనుచుఁ దెలియలేని**
**వారి వారివారి వారిఁ జేరినవారిఁ, దొలుతఁ గట్టి తెండు దూతలార! 188**

**విశే :** దూతలార= ఓ కింకరులారా! ఏకసక్కెమునకున్+ఐనన్= వేళాకోళానికైనా; ఇందిరా రమణునిన్= లక్ష్మీపతిని గురించి; పలుకంగలేని= కీర్తించని; దుర్భాషితులను= చెడుమాటలు మాట్లాడేవారిని; కలలోనన్+ఐనన్= స్వప్నంలో నైనా; శ్రీకాంతుని= మాధవుణ్ణి; సత్+పాదకమలముల్= శ్రేష్ఠమైన పాదపద్మాలను; చూడని= దర్శించని (చూడక), కర్మరతులన్= చెడు అనుభవాలలో ఉండేవారిని; నవ్వుచున్+ఐనన్= సరదాకోసమైనా; కృష్ణప్రశంసకున్= శ్రీహరి స్తోత్రానికి; చెవిన్+తార్పనేరని= చెవి ఒగ్గని; దుష్కథా ప్రవణులన్= చెడు కథలను వినే ప్రబుద్ధులను; యాత్ర+ఉత్సవంబులన్+ఐనన్= యాత్రల్లోనూ ఉత్సవాల్లోనైనా; ఈశుని గుడిత్రోవన్= దేవుని మందిర మార్గాన్ని; త్రొక్కఁగలేని= అడుగు పెట్టని; దుష్పదులను= చెడుపాదాలు కలవారిని; పరమభాగవతుల= శ్రేష్ఠులైన భగవద్భక్తులయొక్క, పాదధూళిన్= పాదాలకు అంటుకున్న రేణువులను; సమస్త= సకల; తీర్థసారము+అనుచున్= పుణ్యతీర్థాల సారమని, తెలియలేని= గుర్తించలేని; వారిన్= అలాంటి వారిని; వారివారిన్= వారి సంబంధీకులను; వారిన్+చేరినవారిన్= వారితో కూడిన వారిని; తొలుతన్= ముందుగా; కట్టి= బంధించి; తెండు= తీసుకురండి.

**తా :** పరిహాసానికైనా భగవన్నామం పలుకలేని చెడు మాటకారుల్ని, కలలోనైనా భగవంతుని పాదపద్మాలను దర్శించని వారినీ, వేడుకగానైనా హరికథలను వినక చెడువిషయాలు వినేవారిని, దైవసంబంధమైన ఉత్సవాల సమయంలోనైనా దేవాలయం వైపు వెళ్ళని చెడుపాదాలు కలవారిని, హరి భక్తుల పాదధూళిని పరమపవిత్రమైందిగా భావించని వారిని, అలాంటి వారికి సంబంధించినవారిని, వారితో కలిసిన వారిని కూడా ముందుగా బంధించి తీసుకురండి.

**ఆ. ఎల్లపాపములకు నిల్లైనయింటిలో బద్ధతృష్ణు లగుచు బుద్ధిఁ దలఁగి**
**పరమహంసకులము గుఱితప్పి వర్తించు ధూర్తజనులఁ దెండు దూతలార! 189**

**ప్రతి :** దూతలార= ఓ సేవకులారా!; ఎల్ల పాపములకున్= సకల పాపాలకు; ఇల్లు+ఐన= స్థానమైన; ఇంటిలోన్= ఆవాసంలో; బద్ధతృష్ణులు+అగుచున్= ఆశాబద్ధులైన; బుద్ధిన్+తలఁగి= జ్ఞానం కోల్పోయి; పరమహంస కులమున్= యోగుల సమూహానికి; గుఱితప్పి= దూరమై; వర్తించు= నడచునట్టి; ధూర్తజనులన్= దుష్ట మానవులను; తెండు= తీసుకురండి.

**తా :** ఓ భటులారా! సకల పాపకార్యాలకూ నెలవైన సంసారమనే ఇంటిలో ఉంటూ, జ్ఞానం నశించి, మహాత్ములైన యోగుల సాంగత్యానికి దూరంగా ఉండే నీచ మానవులను పట్టుకురండి.

**ఆ. అరయఁ దనదు జిహ్వ హరిపేరు నుడువదు చిత్త మతని పాదచింతఁ జనదు,**
**తలఁపఁ దమకు ముక్తి తంగేటి జున్నొకో? సకలవిష్ణుభక్తులకునుబోలె. 190**

**ప్రతి :** అరయన్= పరిశీలించగా; తనదు+జిహ్వ= తన నాలుక; హరిపేరు= విష్ణునామం; నుడువదు= పలుకదు; చిత్తము= మనస్సు; అతని= ఆ విష్ణువుయొక్క; పాదచింతన్= చరణధ్యానంలో; చనదు = నడువదు; సకలవిష్ణుభక్తులకున్+పోలెన్= అందరు హరిభక్తులకువలె; తలఁపన్= ఆలోచించగా; తమకున్= హరిభక్తులకువలె; తలఁపన్= ఆలోచించగా; తమకున్= హరిభక్తులు కానివారికి; ముక్తిమోక్షం; తంగేటిజున్ను+ఒకో= తంగేటిజున్నులాగా సులభంగా దొరుకుతుందా? (దొరకదని భావం).

**తా :** హరిభక్తులకందరికీ ముక్తి తంగేటిజున్నులాగా సులభ సాధమై ఉంది. హరినామం నుడువనివానికీ, హరిచరణధ్యానం చేయనివానికీ, ముక్తి హరిభక్తులకువలె సులభసాధ్యమవుతుందా? (సులభసాధ్యం కాదు).

**ఆ. పద్మనయనుమీఁది భక్తియోగం బెల్ల ముక్తియోగ మనుచు మొద లెఱుంగు**
**వారి వారివారి వారిఁ జేరినవారి త్రోవఁ బోవవలదు దూతలార! 191**

**ప్రతి :** దూతలార= ఓ దాసులారా! పద్మనయను= కమలనేత్రుని; మీఁది= మీద; భక్తియోగంబు+ఎల్లన్= భక్తితత్పరత; ముక్తియోగము+అనుచున్= మోక్ష మార్గమంటూ; మొదలు+ఎఱుంగు= పూర్తిగా తెలుసుకున్న; వారిన్= వాళ్ళను; వారివారి= వాళ్ళకు సంబంధించిన వాళ్ళను; వారిన్+చేరిన+వారిన్= వాళ్ళతో కూడివున్న వాళ్ళయొక్క; త్రోవన్= మార్గంలోకి; బోవవలదు= ఏ మాత్రం వెళ్ళవద్దు.

**తా :** శ్రీహరిమీది భక్తి మాత్రమే కైవల్యానికి సోపానమని పూర్తిగా విశ్వసించినవారినీ, వారి బంధువర్గాన్నీ, వారితో కలిసి వున్నవారినీ పట్టుకోకండి. వారి మార్గాలవైపు ఏమాత్రం వెళ్ళకండి.

**వ. అని పలికెనని చెప్పి మఱియు శుకుం డిట్లనియె. శ్రీకృష్ణనామసంకీర్తనంబు జగన్మంగళం బనియును, జగన్మోహనం బనియును, జగజ్జేగీయమానం బనియును, నిఖిలమాయాగుణవిచ్ఛేదకం బనియును, ఉద్దామంబులగు హరివీర్యంబుల నాకర్ణించు వారలచిత్తంబు లతినిర్మలంబులగు భంగిం దక్కిన వ్రతాచరణంబులుం గావనియు, శ్రీకృష్ణపదపద్మంబులు హృత్పద్మంబుల నిలుపువార లన్యపాపకర్మంబు**

**లగు నవిద్యావ్యసనంబులం బొరయనేర రనియును, నిజస్వామి యైన యమధర్మరాజుచేత గీర్తింపఁబడ్డ భగవన్మహత్త్వంబు నాకర్ణించి, విస్మితులై కాలకింకరులు నాఁటనుండియు వైష్ణవజనంబులం దేఱిచూడ వెఱతురు. నరేంద్రా! పరమగుహ్యంబగు నీ యితిహాసంబును బూర్వకాలంబున సకల విజ్ఞాన గోచరుండైన కుంభసంభవుండు సకలదుఃఖవిలయంబును, సకలపుణ్యనిలయంబును నైన మలయంబునఁ బురాణ పురుషుండైన పురుషోత్తము నారాధనంబు సేయుచుండి నా కెఱింగించెనని చెప్పిన విని విస్మయానంద హృదయుండై పరీక్షిజ్జనపాలుం డిట్లనియె. 192**

**ప్రతి :** అని పలికెను+అని= ఈ విధంగా యమధర్మరాజు వివరించాడని; మఱియున్= ఇంకా; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకమహర్షి ఇలా అన్నాడు; శ్రీకృష్ణ= శ్రీమన్నారాయణుని యొక్క, నామసంకీర్తనంబు= నామస్మరణమే; జగత్+మంగళంబు+ అనియును= లోకోపకారమని; జగత్+మోహనంబు+అనియును= సకల లోక సమ్మోహనమని; జగత్+జేగీయమానంబు+ అనియును= సర్వలోకాలలో గానం చేయబడుతుందని; నిఖిల= సమస్తమైన; మాయా= మాయలతో కూడిన; గుణ విచ్ఛేదకంబు+అనియును= గుణాలను నాశనం చేయగలదని, ఉద్దామంబులు+అగు= గంభీరమైన; హరివీర్యంబులన్= శ్రీహరివీరగాథలను; ఆకర్ణించువారల= వినేవారియొక్క; చిత్తంబులు= మనస్సులు; అతి నిర్మలంబులు+అగుభంగిన్= మిక్కిలి పవిత్రములైన విధంగా; తక్కిన= మిగిలిన; వ్రత+ఆచరణంబులున్= వ్రతాలు, ఆచరించడం; కావనియు= పవిత్రం కావని, శ్రీకృష్ణపద పద్మంబులున్= విష్ణుపాద కమలాలను; హృత్+పద్మంబులన్= మనః కమలాలయందు; నిలుపువారలు= ఉంచుకున్నవారు, అన్యపాప కర్మంబులు+అగు= తక్కిన పాపకృత్య సంబంధమైన; అవిద్యా వ్యసనంబులన్= అజ్ఞాన సంబంధ విషయ లోలత్వాన్ని; పొరయనేరరు+అనియును= అంటరని; నిజస్వామి+ఐన= వారి ప్రభువైన; యమధర్మరాజు చేతన్= యమునిద్వారా; కీర్తింపన్+పడ్డ= పొగడబడిన; భగవత్+మహత్త్వంబున్= భగవంతుని ప్రభావాన్ని; ఆకర్ణించి= చెవులార విని; విస్మితులై= ఆశ్చర్యపడినవారై; కాలకింకరులు= ఆ యమభటులు; నాఁటనుండియున్= ఆ నాటినుండి; వైష్ణవ జనంబులన్= విష్ణుభక్తులను; తేఱిచూడన్= కళ్ళార చూడటానికి కూడా; వెఱతురు= భయపడుతున్నారు; నర+ఇంద్రా= ఓ మహారాజా!; పరమగుహ్యంబు+అగు= మిక్కిలి రహస్యమైన; ఈ+ఇతిహాసంబును= ఈ పూర్వగాథను; పూర్వకాలంబునన్= ఇంతకుముందు; సకల= సమస్త; విజ్ఞానగోచరుండు+ఐన= విజ్ఞానదర్శియైన; కుంభ సంభవుండు= అగస్త్య మహర్షి; సకల= పలురకాల; దుఃఖవిలయంబును= బాధలను తొలగించేది; సకల= సమస్త; పుణ్యనిలయంబును+ ఐన= సకల పుణ్యాలకూ స్థానమైన; మలయంబునన్= మలయపర్వతంపై; పురాణపురుషుండు+ఐన= ఆదిదేవుడైన; పురుష+ఉత్తమున్= పురుషోత్తముని, ఆ నారాయణుని; ఆరాధనంబున్= పూజను; చేయుచున్+ఉండి= చేస్తూ; నాకున్+ఎఱింగించెను= నాకు తెలియజేశాడు; అని చెప్పినన్= అని చెప్పగా; విని= ఆలకించి; విస్మయ+ఆనంద= ఆశ్చర్యం, ఆనందంతో కూడిన; హృదయుండు+ఐ= మనస్సు కలిగినవాడై; పరీక్షిత్+జనపాలుండు= ఆ పరీక్షిన్మహారాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా చెప్పి శుకమహర్షి పరీక్షిత్తుతో ఇంకా ఇలా అన్నాడు. శ్రీకృష్ణనామ సంకీర్తనం లోకాలకు శుభాలను ప్రసాదిస్తుందనీ, లోకాలను సమ్మోహింపజేస్తుందనీ, లోకులందరిచేతా విశేషంగా గానం చేయబడుతుందనీ, పలువిధాలైన మాయాబంధాలనూ తెంపివేస్తుందనీ, అమోఘాలయిన హరిపరాక్రమ గాథలను ఆకర్షించేవారి అంతరంగాలు అత్యంత నిర్మలంగా ఉంటాయనీ, ఈ విధంగా వ్రతాల ఆచరణచే కానీ మనస్సులు పవిత్రంకావనీ, శ్రీకృష్ణదేవుని పాదపద్మాలను హృదయపద్మంలో నిలుపుకొని ఆరాధించేవారిని ఇతరపాపాలుగానీ, అజ్ఞానంగానీ, వ్యసనాలుగానీ అంటనేరవని

యమధర్మరాజు తన కింకరులకు ఉపదేశించాడు. తమ ప్రభువుచేత కీర్తింపబడిన దేవదేవుని మహామహిమలను విని కాలకింకరులు ఆశ్చర్యచకితులైనారు. వారు ఆనాటి నుంచీ విష్ణుభక్తుల వైపు కన్నెత్తి చూడటానికి సైతం భయపడసాగారు. ఓ పరీక్షిన్మహారాజా! పరమరహస్యమైన ఈ ఇతిహాసాన్ని సర్వజ్ఞుడైన అగస్త్యమహర్షి సమస్త దుఃఖాలనూ విలయం చేసేదీ, సమస్త పుణ్యాలకూ నిలయమైందీ అయిన మలయపర్వతంమీద దేవాదిదేవుడైన వాసుదేవుణ్ణి ఆరాధిస్తూ నాకు ఈ వృత్తాంతాన్ని తెలియచేశాడు. అని చెప్పిన శుకయోగీంద్రుని మాటలు విని పరీక్షిన్నరేంద్రుడు ఆశ్చర్యం, ఆనందం నిండిన హృదయంతో ఇలా అన్నాడు.

**క. స్వాయంభువమనువేళల నో యయ్య! సురాసురాండజోరగనర వ**
**ర్గాయతసర్గముఁ దెలిపితి పాయక యది విస్తరించి పలుకంగదవే. 193**

**ప్రతి :** ఓ+అయ్య= ఓ తండ్రీ!; స్వాయంభువ= స్వయంభువు అనే, మనువేళలన్= ప్రజాపతి పాలన కాలంలో; సుర= దేవతల; అసుర= రాక్షసుల; అండజ= గుడ్డునుండి పుట్టు జీవుల; ఉరగ= పాముల; నరవర్గ= మానవ జాతుల; ఆయత= విశాలమైన; సర్గమున్= సృష్టిక్రమాన్ని; తెలిపితి(వి)= వివరించావు, చెప్పావు; పాయక= అంతటితో వదిలిపెట్టక; అది= ఆ సృష్టి క్రమాన్ని; విస్తరించి= వివరణాత్మకంగా; పలుకన్+కదవే= చెప్పవలసింది.

**తా :** అయ్యా! శుకమహర్షీ! ఇంతకుముందు స్వాయంభువ మనువు వృత్తాంతం చెప్పావు. ఆయన పరిపాలించే కాలంలో దేవతలు, రాక్షసులు, పక్షులు, పాములు, మానవులు మొదలైన ప్రాణుల సృష్టిక్రమాన్ని గూర్చి కొంతకొంత చెప్పావు. ఆ విషయాన్నే ఇంకా విస్తారంగా వివరించి చెప్పు.

**క. ఉత్తరకొడు కిట్లడిగిన యుత్తరమును నమ్మునీంద్రుఁ దుత్తమచేతో**
**వృత్తి ముదమంది పలికెను దత్తరపా టుడిగి వినుఁడు తాపసులారా! 194**

**ప్రతి :** ఉత్తర కొడుకు= ఉత్తర కుమారుడైన పరీక్షిత్తు; ఇట్లు+అడిగినన్= ఇలా ప్రశ్నించగా; ఆ+ముని+ఇంద్రుఁడు= ఆ శుక మౌనిశ్రేష్ఠుడు; ఉత్తమ+చేతస్+వృత్తిన్= గొప్పదైన మనస్సు యొక్క సంస్కారంతో; ముదము+అంది= సంతోషం పొంది; ఉత్తరమును= జవాబును; పలికెను= చెప్పాడు; తాపసులారా= ఓ మునులారా!; తత్తరపాటు= కంగారు, తొందర; ఉడిగి= విడిచి; వినుఁడు= ఆలకించండి.

**తా :** ఈ విధంగా పరీక్షిత్తు ప్రశ్నించగా, హృదయ సంస్కారంతో ఆనందించినవాడై శుకమహర్షి సమాధానం చెప్పాడు. ఓ మునులారా! ఏమరుపాటులేకుండా శ్రద్ధగా వినండి.

**సీ. పూని ప్రచేతసుపుత్రులు పదుగురు ప్రాచీనబర్హిష ప్రాఖ్య గలుగు**
**వారు మహాంభోధివలన వెల్వడి వచ్చి తగ వృక్షవృతమైన ధరణిఁ జూచి**
**మేదినీజములపై మిక్కిలి కోపించి మదిలోన దీపితమన్యు లగుచు**
**వక్త్రంబులను మహావాయుసంయుతమైన యనలంబుఁ గల్పించి యవనిజములఁ**

**తే. బెల్లువడఁ గాల్పఁ దొడఁగినఁ దల్లడిల్లి, వారికోపంబు వారించువాఁడపోలెఁ**
**బలికెఁ జందురుఁ డో మహాభాగులార!, దీనములు వృక్షములమీఁదఁ దెగుట తగునె? 195**

**ప్రతి :** ప్రాచీన బర్హిష= ప్రాచీన బర్హిషులు అనే; ప్ర+ఆఖ్యన్+కలుగువారు= ప్రసిద్ధమైన పేరు కలిగినవారు; ప్రచేతసుపుత్రులు= ప్రచేతసుని కుమారులు; పదుగురు= పదిమంది; పూని= ప్రయత్నించి; మహా+అంభోధివలన్= మహా సముద్రంనుండి; వెల్వడి వచ్చి= బయటకు వచ్చి; వృక్షవృతమైన= చెట్లతో నిండిన; ధరణిన్= భూమిని; తగన్+చూచి= క్షుణ్ణంగా పరిశీలించి; మేదినీజములపై= ఆ చెట్ల సముదాయంపై; మిక్కిలి= అధికంగా; కోపించి= కోపగించి; మదిలోనన్= మనస్సులో; దీపితమన్యులు+అగుచున్= చెలరేగిన కోపంగల వారై; వక్త్రంబులను= తమ నోళ్లలో; మహావాయు= పెనుగాలితో; సంయుతమైన= కూడిన; అనలంబున్+కల్పించి= అగ్నిని పుట్టించి; అవనిజములన్= ఆ చెట్లను; పెల్లువడన్= సంపూర్ణంగా; కాల్పన్+తొడఁగినన్= కాల్చబోతుండగా; తల్లడిల్లి= భయపడి; వారికోపంబు= ఆ ప్రాచేతసుల కోపాన్ని; వారించువాఁడ+ పోలెన్= తగ్గించే ప్రయత్నం చేస్తున్నవాడివలె; చందురుఁడు= చంద్రుడు; పలికెన్= ఇలా అన్నాడు; ఓ మహాభాగులార= ఓ పుణ్యాత్ములారా; దీనములు= దిక్కులేనివైన; వృక్షములమీఁదన్= చెట్లపై; తెగుట= కోపగించుట; తగునె= ఉచితమా?

**తా :** ప్రాచేతసుని కుమారులైన ప్రాచీన బర్హిషులు పదిమంది ఒకనాడు సముద్ర గర్భంనుండి బుద్ధిపూర్వకంగా బయటకు వచ్చి భూమిపై సర్వత్రా వ్యాపించిన చెట్లను చూచి కోపగించి వారి నోటినుండి గాలితో కూడిన అగ్నిని పుట్టించి ఆ చెట్లను సమూలంగా దహించబోయారు. అది చూచిన చంద్రుడు భయపడి వారి కోపాన్ని పోగొట్టడానికి వారితో మృదువుగా మాట్లాడుతూ ఓ మహాత్ములారా! ఏ దిక్కులేని ఈ చెట్లను నాశనం చేయడం ఉచితమేనా? అని ప్రశ్నించాడు.

**విశే :** ఓషధులు మొదలైన వృక్షసంతతికి చంద్రుడు అధిపతి. అందుకే అతణ్ణి ఓషధీపతి అంటారు. కనుకనే పై సంఘటనలో చంద్రుడు స్పందించవలసి వచ్చింది.

**తే. మొదల వర్ధిష్ణు లగుమిమ్ము సదయహృదయు లగుప్రజాపతు లనుచు సర్వాత్ముఁ డనియె,**
**నట్టి మీరు ప్రజాసృష్టికైనవార లీ వనస్పతితతుల దహింపఁ దగునె? 196**

**ప్రతి :** మొదలన్= ఆదిలో; వర్ధిష్ణులు+అగుమిమ్మున్= వృద్ధిని పొందుతున్న మిమ్మల్ని; సదయ హృదయులు+అగు= దయతో కూడిన మనస్సు కలవారైన; ప్రజాపతులు+అనుచున్= సృష్టి కర్తలని; సర్వ+ఆత్ముఁడు+అనియెన్= ఆ దేవదేవుడు నిర్దేశించాడు; అట్టి మీరు= అటువంటి మీరు; ప్రజాసృష్టికిన్= జీవులను సృష్టించడానికి; ఐనవారలు= మూలమైన వారు; ఈ వనస్పతి తతులన్= ఈ వృక్ష సముదాయాన్ని; దహింపన్+తగునె= కాల్చడం తగిన పనేనా?

**తా :** పూర్వం అభ్యుదయంపొందుతూ ఉన్న మిమ్మల్ని భగవంతుడు దయామూర్తులైన సృష్టికర్తలుగా పేర్కొన్నాడు. సృష్టికి మూలమైన అటువంటి మీరు ఈ విధంగా చెట్లను నశింపచేయడం తగునా? (తగదు).

**సీ. ఆదికాలంబున నా ప్రజాపతిపతి యయిన లోకేశ్వరుం డచ్యుతుండు**
**పద్మనేత్రుఁడు వనస్పతుల నోషధిముఖ్యజాతంబు నిషము నూర్జంబుఁ గోరి**
**కల్పించె; నందు ముఖ్యంబైన యన్నంబు నచరంబు లైనట్టి యపదమెల్ల**
**బాదచారులకును బాల్వెట్టి యిరుగాళ్ళ చేతులు గలిగిన జీవతతికి**

**తే. హస్తములు లేని యా చతుష్పాదు లెల్ల, నన్నముగఁ బూని కావించె నదియుఁగాక**
**యా మహాభాగుఁ డచ్యుతుఁ డాదరమున, మీకు ననఘాఖ్యవిఖ్యాతి జోకపఱిచె. 197**

**ప్రతి :** ఆదికాలంబునన్= సృష్టి ప్రారంభంలో; ఆ ప్రజాపతి= ఆ సృష్టి కర్తలకు; పతి+అయిన= అధిపతి అయిన; లోక+ఈశ్వరుండు= లోకప్రభువు; అచ్యుతుండు= నాశనంలేనివాడు; పద్మనేత్రుండు= కమలనయనుడు అయిన భగవంతుడు; వనస్పతులన్= వనస్పతి వృక్షాలను; ఓషధి ముఖ్య జాతంబున్= ఓషధులైన వృక్ష సముదాయాన్ని; ఇషమున్= ఆహారాన్ని; ఊర్జంబున్= శక్తిని; కోరి= ఆశించి; కల్పించెన్= సృష్టించాడు; అందున్= అందులో; ముఖ్యంబు+ఐన= ప్రధానమైన; అన్నంబున్= ఆహారంగా; పాదచారులకును= పాదాలతో చరించే జీవులకు; అచరంబులు+ ఐనట్టి= కదలనటువంటి; అపదము+ఎల్లన్= పాదాలు లేని జీవులనన్నింటినీ; పాలు+పెట్టి= ఆహారంగా నిర్ణయించి; ఇరు+కాళ్ళ= రెండు కాళ్ళు; చేతులున్= చేతులు; కలిగిన= కూడిన; జీవతతికిన్= ప్రాణి సమూహానికి; హస్తములు లేని= చేతులు లేనటువంటి; ఆ+చతుస్+పాదులు+ఎల్లన్= ఆ నాలుగు కాళ్ళ జంతువులన్నింటిని; అన్నముగన్= ఆహారంగా; పూని కావించెన్= ప్రయత్నపూర్వకంగా నిర్ణయించాడు; అదియున్+కాక= అంతేకాక; ఆ+మహాభాగుండు= ఆ పుణ్యపురుషుడు; అచ్యుతుండు= అంతము లేనివాడైన భగవంతుడు; ఆదరమునన్= అభిమానంతో; మీకున్= మీ ప్రాచేతసులకు; న+అఘ+ఆఖ్య= 'అనఘులు' (పాపరహితులు) అనే పేరున; విఖ్యాతిన్= విశేషఖ్యాతిని; జోకపఱిచెన్= కల్పించాడు.

**తా :** ఓ ప్రచేతసులారా! సృష్టికి ప్రారంభంలో ప్రజాపతులకు అధిపతి అయిన శ్రీమన్నారాయణుడు వనస్పతులనూ ఓషధులనూ సృష్టించాడు. అఖిలలోకాధినాథుడూ అచ్యుతుడూ అయిన ఆ పద్మలోచనుడు జీవులకు పోషకంగా ఇష్టమైన ఆహారం కోసమూ, శరీరానికి శక్తి ఇవ్వటం కోసమూ ఈ వృక్షాలను ఏర్పాటు చేశాడు. చరాలూ పాదచారులూ అయిన జీవులకు అచరాలూ, పాదరహితాలూ అయిన వాటిని ఆహారంగా కల్పించాడు. రెండుచేతులు, రెండుకాళ్లు గల ప్రాణులకు నాలుగు కాళ్ల జంతువులనూ, వృక్షాలనూ ఆహారంగా ఏర్పాటు చేశాడు. అందువలన మీరు ఈ విధంగా చెట్లను కాల్చివేయటం న్యాయం కాదు. అదీగాక మీరు తపస్సుచేసి పుణ్యవంతులై ఉండటానికి ఆ దయామయుడైన నారాయణుని అనుగ్రహమే గదా కారణం. ఆ మహానుభావుడైన అచ్యుతుడేగదా మీకు లోకమంతటా "అనఘులు" అనే ప్రఖ్యాతిని కల్పించింది.

**క.** **నిజముగ దేవాధీశ్వరుఁ డజుఁడు ప్రజాసర్గమునకు ననఘుల మిమ్మున్**
**సృజియించె నిట్టివారికిఁ గుజదహనము సేయ నెట్లు కోరిక వొడమెన్? 198**

**ప్రతి :** నిజముగన్= వాస్తవంగా; దేవ+అధీశ్వరుఁడు= దేవదేవుడైన; అజుఁడు= బ్రహ్మ; ప్రజాసర్గమునకున్= ప్రజాసృష్టికి; అనఘులన్= పుణ్యాత్ములైన; మిమ్మున్= మిమ్మల్ని; సృజియించెన్= సృష్టించాడు; ఇట్టి వారికిన్= ఇలాంటి మీకు; కుజ దహనము= చెట్లను కాల్చడం; చేయన్= చేయాలని; ఎట్లు= ఏ విధంగా; కోరిక; పొడమెన్= కలిగింది?

**తా :** నిజానికి బ్రహ్మదేవుడు మిమ్మల్ని సృష్టి చేయడానికి నియమించాడు. అలాంటి మీకు సృష్టి నాశనంచేయాలని, ఈ వృక్ష దహనం మీద కోరిక ఎలా కలిగింది?

**చ.** **సతతమహత్త్వసత్త్వగుణసత్పురుషస్మృతిఁ బొందరయ్య! మీ**
**పితరులునుం బితామహులుఁ బెద్దలు నెన్నఁడుఁ బొందనట్టి దు**
**ష్కృతమతమైన కోపమునఁ గిల్బిషభావము మానరయ్య! సం**
**భృతకరుణావలోకమున భీతతరుప్రకరంబుఁ జూచుచున్. 199**

**ప్రతి :** భీత= భయపడుతున్న; తరుప్రకరంబున్= చెట్ల సమూహాన్ని; సంభృత= అతిశయించిన; కరుణా+అవలోకమునన్= జాలి చూపుతో; చూచుచున్= చూస్తూ; సతత= ఎల్లప్పుడూ; మహత్త్వ= గొప్పతనంతోకూడిన; సత్త్వగుణ= సాత్త్విక గుణ సంపదతో; సత్+పురుష= పవిత్రులమనే; స్ఫూతిన్= భావనను, పొందరు+అయ్య= కలిగి ఉండండి; మీ= మీ యొక్క; పితరులునున్= తండ్రులును; పితామహులున్= తాతలును; పెద్దలున్= ఇతర పితృదేవతలును; ఎన్నఁడున్+పొందనట్టి= ఏనాడూ దరిజేరనివ్వని; దుష్కృతమతము+ఐన= చెడ్డపనులను చేయడానికి సమ్మతమైన; కోపమునన్= కోపంతో కలిగిన; కిల్బిషభావమున్= పాపపు ఆలోచనను; మానరు+అయ్య= వదలిపెట్టండి.

**తా :** ఎల్లప్పుడూ గొప్ప సత్త్వగుణాలను కలిగివుంటూ సత్పురుషులుగా పేరు పొందండి. మీ తండ్రులు, తాతలు, పెద్దలు ఏనాడూ పొందని కోపతాపాలకు మీరు లోనుకాకండి. కోపంతో కూడిన పాపపు ఆలోచనలను విడిచి అదిగో జాలి చూపులతో భీతిల్లుతున్న వృక్షసమూహాలపై కరుణ చూపించండి.

**ఉ. తప్పక యర్భకావళికిఁ దల్లియుఁ దండ్రియు నేత్రపంక్తికిన్**
**ఱెప్పలు నాతికిం బతి నరేంద్రుఁడు లోకుల కెల్ల నర్థికి**
**న్నొప్ప గృహస్థు మూఢులకు నుత్తము లెన్నఁగ వీరు బంధువుల్**
**ముప్పునఁ గావలేని కడుమూర్ఖులు గారు నిజాల బంధువుల్. 200**

**ప్రతి :** తప్పక= కచ్చితంగా; అర్భక+ఆవళికిన్= బిడ్డల సమూహానికి; తల్లియున్+తండ్రియున్= తల్లిదండ్రులు; నేత్ర పంక్తికిన్= కన్నుల జంటకు; ఱెప్పలు= కనురెప్పలు; నాతికిన్= భార్యకు; పతి= భర్త; లోకులకున్+ఎల్లన్= ప్రజలందరికి; నర+ఇంద్రుఁడు= రాజు; అర్థికిన్= యాచకునికి; ఒప్పన్= తగినవిధంగా; గృహస్థు= యజమాని; మూఢులకున్= మూర్ఖులకు; ఉత్తముల్= జ్ఞానులు; ఎన్నఁగన్= ఆలోచించి చూడగా; వీరు= వీరందరు; బంధువుల్= శ్రేయస్సు కోరువారు; ముప్పునన్= ఆపదలో; కావలేని= ఆదుకోలేని; కడుమూర్ఖులు+కారు= మిక్కిలి తెలివిలేనివారు కారు; నిజాల బంధువుల్= నిజమైన చుట్టాలు.

**తా :** బిడ్డలకు తల్లిదండ్రులు, కళ్ళకు కనురెప్పలు, భార్యకు భర్త, ప్రజలకు పాలకుడు, యాచకునికి ఇంటి యజమాని, మూర్ఖులకు జ్ఞాని మొదలగువారు నిజమైన క్షేమాన్ని కోరే ఆప్తబాంధవులు. అంతే తప్ప ఆపద సమయంలో ఆదుకోలేని కఠినచిత్తులు నిజమైన బంధువులు కానేకారు.

**సీ. అఖిలభూతముల దేహాంతస్థమగు నాత్మ యీశుఁ డచ్యుతుఁ డని యెఱుఁగవలయు,**
**నెఱిఁగి సర్వంబైన యిందిరారమణు లో చూపునఁ దనివిగాఁ జూడవలయుఁ,**
**జూచిన చిద్రూపశుద్ధాత్ములగు మిమ్ము నెనసిన వేడ్కతో నిచ్చ మెచ్చు,**
**మెచ్చిన సర్వాత్ము మీ రెఱింగినచోటఁ గోపగుణంబులఁ బాపవలయుఁ;**

**ఆ. బాపి దగ్ధశేషపాదపజాలంబుఁ, దియ్య మెసఁగ బ్రతుకనియ్యవలయు;**
**ననఘులార! మీర లస్మదీయప్రార్థ, నంబు పరఁగఁ జేకొనంగవలయు. 201**

**ప్రతి :** అఖిల= సమస్తమైన; భూతముల= ప్రాణుల యొక్క; దేహ+అంతస్థము+అగు= శరీరంలో ఉన్నటువంటి; ఆత్మ= ఆత్మయే; ఈశుఁడు= ప్రభువువైన; అచ్యుతుఁడు+అని= శ్రీమన్నారాయణుడని; ఎఱుఁగవలయున్= గుర్తించాలి; ఎఱిఁగి=

గుర్తించి; సర్వంబు+ఐన= అన్నీ తానే ఐన; ఇందిరారమణున్= శ్రీహరిని; లోచూపునన్= అంతర్దృష్టితో; తనివిగాన్= తృప్తిగా; చూడవలయున్= దర్శించాలి; చూచిన= అలా దర్శించిన; చిత్+రూప= చైతన్య రూపంతో; శుద్ధ+ఆత్ములు+అగు= పవిత్ర ఆత్మకలిగిన; మిమ్మున్= మిమ్మల్ని; ఎనసిన= సరిపోలిన; వేడ్కతోన్= కుతుహలంతో; ఇచ్చమెచ్చున్= పరమాత్మ మెచ్చుకుంటాడు; మెచ్చిన= అలా మెచ్చుకున్న; సర్వ+ఆత్మున్= పరమాత్మున్ణి; మీరు+ఎఱింగినచోటన్= మీరు గుర్తించిన ప్రతిచోటా; కోప గుణంబులన్= కోపమనే దుర్గుణాలను; పాపవలయున్= విడిచిపెట్టాలి; పాపి= అలా విడిచి, దగ్ధశేష= కాలిపోగా మిగిలిన; పాదపజాలంబున్= చెట్ల సమూహాన్ని, తియ్యము+ఎసఁగన్= ప్రేమ అతిశయించునట్లు; బ్రతుకనియ్యవలయున్= జీవించనివ్వండి; అనఘులార= ఓ పుణ్యాత్ములారా; మీరలు= మీరు; అస్మదీయ= నాయొక్క; ప్రార్థనంబున్= విన్నపమును; పరఁగన్= ప్రసిద్ధంగా; చేకొనంగ వలయున్= అంగీకరించాలి.

**తా :** ఇంకా చంద్రుడు ప్రాచేతసులను ఇట్లా వేడుకొన్నాడు – సమస్త జీవరాసుల దేహాలలోపల సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు ఆత్మస్వరూపంలో ఉన్నాడని మీరు తెలుసుకోవాలి. అట్లా తెలుసుకొని సర్వత్ర నిండి ఉన్న ఆ ఇందిరారమణుడైన గోవిందుని లోచూపులతో తనివితీరా చూడాలి. అట్లా చూచినట్లయితే పరిశుద్ధాత్ములూ జ్ఞానస్వరూపులూ అయిన మిమ్మల్ని ఆ భగవంతుడు ఎంతో మెచ్చుకుంటాడు. అట్లా మెచ్చుకొన్న పరాత్పరుడు మీరు చూచే ప్రదేశమంతటా అన్నిట్లోనూ ఉన్నాడని తెలుసుకొని మీరు మీ కోపాన్ని శాంతింపజేసుకోవాలి. ఆగ్రహాన్ని త్యజించినవారై మీరు దహింపగా మిగిలిన వృక్షాలను ఇకనైనా సంతోషంగా బ్రతుకనీయాలి. ఓ పుణ్యాత్ములారా! మీరు నా ప్రార్థనను అంగీకరించాలి.

**క. ఇదె వృక్షసముద్భవయగు మదిరేక్షణ నాప్సరసిఁ గుమారిక నిత్తున్**
**వదలక బత్నిఁగఁ జేకొని ముదమందుఁడు పాదపముల మోసము వాయన్. 202**

**ప్రతి :** పాదపముల= చెట్లయొక్క; మోసము+పాయన్= ఆపద తొలగుటకు; ఇది+ఎ= ఈ; వృక్షం సముద్భవ+అగు= వృక్షం నుండి పుట్టిన; మదిర+ఈక్షణన్= మత్తు కలిగించే చూపులు గల కన్యను; ఆప్సరసిన్= దేవతాకన్య ఐన; కుమారికన్= కన్యను; ఇత్తున్= మీకు అప్పగిస్తాను; వదలక= కాదనక; పత్నిన్+కన్= భార్యగా; చేకొని= స్వీకరించి; ముదము+అందుఁ డు= సంతోషం పొందండి.

**తా :** ఈ చెట్లకు కలిగిన ఆపదను పోగొట్టినందుకుగాను అప్సరస కుమార్తెయైన, వృక్షపుత్రిక అయిన మారిష అనే కన్యను మీకు భార్యగా ఇస్తున్నాను. కాదనక స్వీకరించి ఆనందించండి.

**వ. అని యి ట్లామంత్రణంబు సేసి, మారిష యను కన్యకను వారల కిచ్చి చంద్రుండు సనియె. నప్పుడు 203**

**ప్రతి :** అని= అని పలికి; ఇట్లు+ఆమంత్రణంబు+చేసి= ఇలా వీడ్కోలు చెప్పి; మారిష+అను కన్యకను= మారిష అనే పేరుగల పడుచును; వారలకున్+ఇచ్చి= ఆ ప్రాచేతసులకు అప్పగించి; చంద్రుండు+చనియెన్= చంద్రుడు వెళ్ళిపోయాడు; అప్పుడు= ఆ తరువాత...

**తా :** చంద్రుడు వారికి వీడ్కోలు పలికి మారిష అనే అప్సరసను ఆ ప్రాచీన బర్హిషులకు అప్పగించి వెళ్ళాడు. ఆ తరువాత

**క. వారలు పర్యాయంబున నీరేజముఖిన్ వరించి నెఱి రమియింపన్**
**ధీరుఁడు ప్రాచేతసుఁడై వారక దక్షుండు పుట్టె వనజజసముఁడై. 204**

**ప్రతి :** వారలు= ఆ ప్రాచేతసులు; పర్యాయంబునన్= ఒకరి తరువాత ఒకరుగా, నీరేజముఖిన్= పద్మంవంటి ముఖం కలిగిన ఆ మారిషను; వరించి= పెళ్ళాడి; నెఱిన్= ఇష్టపూర్వకంగా; రమియింపన్= ఆమెతో సంగమించగా; ధీరుఁడు= ధైర్యశాలి; ప్రాచేతసుఁడై= ప్రాచేతస కుమారుడై; వారక= శీఘ్రంగా; వనజజ= బ్రహ్మతో; సముఁడై= సమానుడైన; దక్షుండు= దక్ష ప్రజాపతి; పుట్టెన్= జన్మించాడు.

**తా :** ఆ ప్రాచేతసులు ఆ మారిషను వివాహం చేసుకొన్నారు. వారికి ధైర్యవంతుడు, బ్రహ్మతో సమానుడు అయిన దక్షప్రజాపతి పుట్టాడు.

**క. ఎవ్వని సంతానంబులు నివ్వటిలెన్ వసుధ నెల్ల నెఱి నా దక్షుం**
**డి వ్వలన జగము లన్నిటఁ బ్రవ్వ జలము నిలిపినట్లు ప్రజఁ బుట్టించెన్. 205**

**ప్రతి :** ఎవ్వని సంతానంబులు= ఎవరి యొక్క సంతతి; వసుధన్+ఎల్లన్= ఈ భూమి అంతటా; నెఱిన్= సంపూర్ణంగా; నివ్వటిలెన్= వ్యాపించిందో; ఆ దక్షుండు= ఆ దక్షప్రజాపతి; ఈ+వలనన్= ఈ విధంగా; ప్రవ్వన్= కుండలో; జలము= నీరు; నిలిపినట్లు= నిండుగా నింపిన విధంగా; జగముల్+అన్నిటన్= ఈ లోకాలన్నింటిలోనూ; ప్రజన్= ప్రజలను; పుట్టించెన్= పుట్టించాడు.

**తా :** ఎవరి సంతానం ఈ లోకమంతా ఆవరించిందో ఆ దక్షుడు, కుండలో నీటిని సంపూర్ణంగా నింపినట్లుగా ఈ భూమండలమంతటా తన సంతానాన్ని పుట్టించాడు.

**ఉ. వారని వేడ్కతో దుహితృవత్సలదక్షుఁడుఁ దక్షుఁ డాత్మచేఁ**
**గోరి సృజించెఁ గొన్నిటి నకుంఠిత వీర్యముచేతఁ గొన్నిటిం**
**బోరన ఖేచరంబులను భూచరముఖ్యవనేచరంబుల**
**న్నీరచరవ్రజంబు రజనీచరజాలదివాచరంబులన్. 206**

**ప్రతి :** వారని= అనివార్యమైన; వేడ్కతోన్= కోరికతో; దుహితృ= కుమార్తెల మీద; వత్సలదక్షుఁడున్= వాత్సల్యంలో దిట్ట ఐన; దక్షుఁడు= ఆ దక్ష ప్రజాపతి; ఆత్మచేన్= తన ఆత్మశక్తితో; కోరి సృజించెన్= ఇష్టపడి పుట్టించాడు; కొన్నిటిన్= కొన్నింటిని; అకుంఠిత= గొప్పదైన; వీర్యముచేతన్= తన శుక్రకణ ధాతువులచేత; కొన్నిటిన్= మరికొన్ని జీవులను; బోరనన్= శీఘ్రంగా; ఖేచరంబులను= ఆకాశగమనులైన జీవులను; భూచరముఖ్య= భూమిపై కదిలే జీవులలో ముఖ్యులు; వనేచరంబులన్= అడవులలో సంచరించే జీవులను; నీరచర వ్రజంబు= నీటిలో తిరిగే జంతువులను; రజనీచరజాల= రాత్రి సంచరించే వాటిని; దివాచరంబులన్= పగటిపూట తిరిగే జీవులను; సృజించెన్= పుట్టించాడు.

**తా :** కూతురంటే ఇష్టపడే దక్షప్రజాపతి తన ఆత్మశక్తితో కొన్ని జీవరాశుల్ని పుట్టించాడు. మరికొన్ని జీవరాసుల్ని స్వయంగా కన్నాడు. వీటితోపాటు కొన్ని ఆకాశగమనం కలవి, మరికొన్ని భూమిపై తిరుగాడేవి, అడవుల్లో సంచరించేవి, నీళ్లలో జీవించేవి, రాత్రిళ్లు తిరిగేవి, పగటిపూట సంచరించేవి అయిన జీవులను, జంతువులను దక్షుడు పుట్టించాడు.

**క. నర సుర గరు డోరగ కిన్నర దానవ యక్ష పక్షి నగ వృక్షములం**
**దరమిడి సృష్టి యొనర్చెను దిరముగ దక్షప్రజాపతి వితతకీర్తిన్. 207**

**ప్రతి :** తిరముగన్= స్థిరబుద్ధితో, దక్షప్రజాపతి= ఆ దక్షుడు; వితతకీర్తిన్= గొప్ప యశస్సుతో; నర= మానవులను; సుర= దేవతలను; గరుడ= గరుడులు అనే పెద్దపక్షి జాతిని; ఉరగ= నాగజాతిని; కిన్నర= సంగీతజ్ఞులైన దేవతా గణాలను; దానవ= రాక్షస గణాలను; యక్ష= మాయావిద్యాచతురులైన యక్షులను; పక్షి= పలురకాలైన పక్షులను; నగ= పర్వతాలను; వృక్షములన్= చెట్లను; తరమిడి= ఒకదాని తరువాత ఒకటిగా; సృష్టి= జీవసృష్టిని; ఒనర్చెను= చేశాడు.

**తా :** దక్షుడు నిశ్చలమైన బుద్ధితో దేవ, రాక్షస, మానవ, యక్ష, కిన్నర, నాగ, గరుడ పక్షులను, వృక్షాలను, పర్వతాలను ఇలా వరుసగా అనేక జీవ, అజీవ జాతులను క్రమంగా సృష్టించి విశాలమైన యశస్సును సంపాదించాడు.

**క. బహువిధముల బహుముఖముల బహురూపము లైన ప్రజల బహులోకములన్**
**బహుళముగఁ జేసి మదిలో బహుమానము నొందఁ డయ్యెఁ బ్రఖ్యాతముగన్. 208**

**ప్రతి :** ప్రఖ్యాతముగన్= ప్రశంసింపబడునట్లు; బహు విధములన్= అనేక విధాలుగా; బహు ముఖములన్= అనేక ముఖాలుగలవీ; బహురూపములు+ఐన= అనేక స్వరూపాలు కలిగినవీ అయిన; ప్రజలన్= జీవులను; బహు లోకములన్= అనేక లోకాలలో; బహుళముగన్= విశేషంగా; చేసి= సృష్టించి; మదిలోన్= మనస్సులో; బహుమానమున్= సంతృప్తిని; ఒందదు+అయ్యెన్= పొందలేక పోయాడు.

**తా :** దక్షుడు ఈ విధంగా పలురకాలుగా, అనేక విధాలైన, జీవజాలాన్ని సకల లోకాలలోను ఆవిర్భవింపజేసినప్పటికీ ఏ కారణంచేతనో తృప్తిని మాత్రం పొందలేకపోయాడు.

**తే. ఆ ప్రజాసర్గబృంహితంబైన జగము దక్షుఁ డీక్షించి మదిలోనఁ దాప మొంది**
**మఱియు జననంబు నొందించు మతము రోసి పరమపురుషుని నాశ్రయింపంగఁ దలఁచె. 209**

**ప్రతి :** ఆ ప్రజాసర్గ= ఆ సమస్త ప్రాణుల సృష్టితో, బృంహితంబు+ఐన= నిండిపోయిన; జగమున్= లోకాన్ని; దక్షుఁడు+ ఈక్షించి= దక్షప్రజాపతి చూచి; మదిలోనన్= తన మనస్సులో; తాపము+ఒంది= బాధపడి; మఱియున్= తరువాత; జననంబున్+ఒందించు= సృష్టి చేసే; మతమున్= ఆలోచనను; రోసి= వదలిపెట్టి; పరమపురుషునిన్= ఆ దేవదేవుణ్ణి; తలఁచెన్= స్మరించాడు.

**తా :** ఈ విధంగా ప్రాణుల సృష్టితో నిండిపోయిన లోకాన్ని చూచి దక్షుడు బాధపడి ఇంకా సృష్టి చేయాలన్న కోరికను వదిలిపెట్టి పరమ పురుషుని ఆశ్రయించాలని తలచాడు.

**వ. ఇట్లు దక్షప్రజాపతి ప్రజాసర్గంబు చాలక చింతించి మంతనంబున లక్ష్మీకాంతుని సంతుష్టం జేయువాఁడై 210**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దక్షప్రజాపతి; ప్రజాసర్గంబు= ప్రజలను సృష్టించడం; చాలక= తగినంతగా లేకపోవడంవల్ల; చింతించి= వేదనపడి; మంతనంబునన్= తనలో తానుగా; లక్ష్మీకాంతునిన్= ఆ శ్రీహరిని; సంతుష్టన్+చేయువాఁడై= మెప్పింప దలచిన వాడై...

**తా :** ఈ విధంగా తాను చేసిన సృష్టి తనకే సంతృప్తి కలిగించనందువల్ల దక్షప్రజాపతి బాధపడుతూ శ్రీహరిని మెప్పించే ప్రయత్నం చేస్తున్నవాడై

**క. మోదంబై పరిదూషితఖేదంబై శాబరీద్ధ కిలికించిత దృ**
**గ్భేదంబై బహుసౌఖ్యాపాదం బై యొప్పు వింధ్యపాదంబునకున్. 211**

**ప్రతి :** మోదంబు+ఐ= సంతోషకరమైందై; పరిదూషిత= దూరంగా నెట్టబడిన; ఖేదంబై= దుఃఖం కలిగిందై; శాబరీ+ఇద్ధ= శబరి స్త్రీలయొక్క స్వచ్ఛమైన; కిలికించిత= శృంగారచేష్టలతో కదలాడుతున్న; దృక్+భేదంబై= చూపుల విన్యాసం కలదై; బహుసౌఖ్య+ఆపాదంబై= పలురకాల సుఖాలకు నిలయమై; ఒప్పు= తగి ఉన్నటువంటి; వింధ్యపాదంబునకున్= వింధ్య పర్వతపాదప్రదేశానికి...

**తా :** ఆనందకరమైన, దుఃఖహరమైన, శబరస్త్రీల శృంగారచేష్టలతో కూడిన వీక్షణాలతో వివిధసుఖాలకు ఆస్పదమై ఒప్పుతున్న వింధ్య పర్వత ప్రాంతం వద్దకు

**వ. అరిగి, యం దఘమర్షణం బను తీర్థంబు సర్వ దురితహరం బై యొప్పుదాని ననుసవనంబు సేవించి, యతిఘోరం బైన తపంబు సేయుచు హరిం బ్రసన్నుంజేసి, హంసగుహ్యం బను స్తవరాజంబున నిట్లని స్తుతించె. 212**

**ప్రతి :** అరిగి= వెళ్ళి; అందున్= అక్కడ; అఘమర్షణంబు= 'అఘమర్షణము' అనే సార్థక నామం కల; తీర్థంబున్= పుణ్య తీర్థ తీరప్రాంతం; సర్వదురిత= సకల పాపాలను; హరంబు+ఐ= పోగొట్టేదై; ఒప్పు= విలసిల్లే; దానిన్= ఆ తీర్థాన్ని; అనుసవనంబు= నిత్యం యజ్ఞకర్మలతో; సేవించి; అతిఘోరంబు+ఐన= మిక్కిలి తీవ్రమైన; తపంబు+చేయుచున్= తపస్సు చేస్తూ; హరిన్= ఆ శ్రీహరిని; ప్రసన్నున్+చేసి= ప్రత్యక్షం కావించుకుని; హంసగుహ్యంబు+అను= 'హంసగుహ్యం' అనే; స్తవరాజంబునన్= స్తోత్రరాజంతో; ఇట్లు+అని+స్తుతించెన్= ఈ విధంగా ప్రార్థించాడు.

**తా :** దక్షుడు వింధ్య పర్వతం లోయలో సకల పాపహరమైన 'అఘమర్షణం' అనే తీర్థం చేరి అందు నిత్యం యజ్ఞకర్మలు చేస్తూ నిష్ఠగా అతి తీవ్రమైన తపస్సు చేశాడు. దానికి సంతోషించి సాక్షాత్కరించిన శ్రీహరిని 'హంసగుహ్యం' అనే శ్రేష్ఠమైన స్తోత్రంతో ఆ ప్రజాపతి ఇలా స్తుతించాడు.

**విశే :** 'అఘమర్షణం'= పాపపరిహారకమైంది.

### ✣ దక్షుఁడు కావించిన హంసగుహ్యం బను స్తవరాజము ✣

**తే. పరమునికి వందనము సేతుఁ బరిఢవించి ము న్నవితథానుభూతికి మ్రొక్కికొందు,**
**మెఱయు గుణములఁ దేలు నిమిత్తమాత్రబంధుఁడైనట్టివానికిఁ బ్రణుతి సేతు. 213**

**ప్రతి :** పరమునికిన్= పరమాత్మునికి; వందనము+చేతున్= నమస్కారం చేస్తాను; మున్ను= ముందుగా; పరిఢవించి= ప్రకాశించి; అవితథా+అనుభూతికిన్= అమోఘమైన చైతన్య శక్తికలవానికి; మ్రొక్కి కొందున్= శిరసా నమస్కరిస్తాను; మెఱయు= ప్రకాశించే; గుణములన్+తేలు= గుణవంతుడై విరాజిల్లుతూ; నిమిత్తమాత్ర= ఏదో కారణంగా; బంధుఁడు+ ఐనట్టివానికిన్= ఆప్తుడైన వానికి; ప్రణుతి+చేతున్= ప్రణామం చేస్తాను.

**తా :** సర్వశ్రేష్ఠుడై అనుగ్రహం చూపడానికి చైతన్య శక్తితో సాక్షాత్కరించే ఆ దేవదేవునికి నమస్కారం చేస్తాను. నిత్యం ప్రకాశించే పరమాత్మునికి వందనం చేస్తాను. అద్భుతమైన దివ్యానుభూతే రూపంగా వెలుగొందేవానికి నమస్కరిస్తాను. నిమిత్తమాత్రంగా బంధువైనట్టి సగుణసాకారమూర్తి అయిన పరమాత్మకు స్తుతులు సమర్పిస్తాను.

**ఆ. తవిలి గుణముచేతఁ దత్త్వబుద్ధులచేత నిగిడి కానరాని నెలవువాని**
**మొదలఁ దాన కలిగి ముక్తిమానావధిరూపమైనవాని ప్రాపుఁ గందు. 214**

**ప్రతి :** తవిలి= ఇష్టపూర్వకంగా; గుణముచేతన్= గుణాలచేత; తత్త్వబుద్ధులచేతన్= తార్కిక బుద్ధిచేత; కానరాని= కనుగొనలేని; నిగిడి= వ్యాపించిన; నెలవువానిన్= స్థానం కలవానిని; మొదలన్= అనాదిగా; తాన్+కలిగి= తానే ఉండి; ముక్తిమాన+అవధి= ముక్తి పొందడమే గమ్యమైన; రూపమైనవానిన్= ఆకారం కలవానిని; ప్రాపున్+కందున్= శరణు పొందుతాను.

**తా :** గుణాలలో చిక్కుకున్నవారికీ, కేవలం తాత్త్విక బుద్ధితో అన్వేషించే వారికీ నీ ఉనికి తెలియరానిది. మొదటినుండి ఉన్నవాడవు నీవు! మోక్షానికి పరమావధివై ప్రకాశించే వాడవు నీవు! అలాంటి అంతర్యామివైన స్వామిని నిన్ను ఆశ్రయిస్తున్నాను.

**తే. ఎల్ల తనువులందు నిరవొంది తనతోడఁ బొందు సేసినట్టి పొందుకాని**
**పొందు వొందలేఁడు పురుషుండు గుణముఁ దా గుణినిఁబోలె నట్టి గుణి భజింతు. 215**

**ప్రతి :** ఎల్లతనువుల+అందున్= సమస్త దేహాలలో; ఇరవున్+పొంది= స్థానం సంపాదించి (అంతర్యామిగా ఉండి); తనతోడన్= తనతో (దేహులతో); పొందు+చేసినట్టి= సహవాసం చేసినట్టి; పొందుకానిన్= స్నేహితుడుగా ఉన్నవానిని; పురుషుండు= జీవుడు; పొందు= స్నేహం; పొందలేడు= చేయలేడు (పరమాత్మను గుర్తించలేడు); గుణమున్+తాన్= సత్త్వరజస్తమస్సులలో తగుల్కొన్న ఆ దేహి; గుణినిన్+పోలినట్టి= త్రిగుణాతీతుణ్ణి పోలిన; గుణిన్= పరమాత్మను; భజింతున్= సేవిస్తాను.

**తా :** నీవు సర్వప్రాణుల దేహాలయందు జీవాత్మ రూపంలో ఉంటున్నావు, కానీ త్రిగుణాలచే బద్ధుడైన జీవుడు తనలోనే అంతర్యామిగా వున్న నిన్ను గుర్తించలేకున్నాడు. త్రిగుణాలకు లోబడి ఇతరులతో కలసి ఉంటున్నాడు. కాని, ఓ పరమాత్మా! గుణాతీతుడవైన నీతో కలసి ఉండడమే లేదు. అలాంటి ఓ పరమాత్మా నిన్ను సేవిస్తాను.

**ఉ. పూని మనంబులుం దనువు భూతములున్ మఱి యింద్రియంబులున్**
**బ్రాణములున్ వివేకగతిఁ బాయక యన్యముఁ దమ్ము నెమ్మెయిం**
**గానఁగ నేర వా గుణనికాయములం బరికించునట్టి స**
**ర్వానుగతు న్సమస్తహితు నాదిమపూరుషు నాశ్రయించెదన్. 216**

**ప్రతి :** పూని= పూనికతో; మనంబులున్= మనసులు; తనువు= శరీరం; భూతములున్= పంచభూతాలు; మఱిన్= మరియు; ఇంద్రియంబులున్= పంచేంద్రియాలు; ప్రాణములున్= ఐదు జీవములు; వివేకగతిన్= చక్కని తెలివైన మార్గాన్ని; పాయక= వదలక; అన్యమున్= ఇతరములను; తమ్ము= తమను తాము; నెమ్మెయిన్= శరీరమందు; కానన్+కన్= చూడడానికి; నేరవు= శక్తి కలిగినవి కావు; ఆ గుణనికాయములన్= ఆ గుణాల సమూహాలను; పరికించునట్టి= పరిశీలించి చూచే; సర్వ+అనుగతున్= సర్వప్రాణులయందు ఉండే అంతర్యామిని; సమస్త హితున్= సర్వప్రాణి క్షేమకరుడూ అయిన; ఆదిమ పూరుషున్= మూలపురుషుణ్ణి; ఆశ్రయించెదన్= శరణు పొందుతాను.

**తా :** మనసు, శరీరం, ప్రాణాలు, పంచేంద్రియాలు, పంచప్రాణాలు చక్కని వివేచనతో ప్రయత్నించకపోతే తప్ప జీవుడు తమలో ఉన్న పరమాత్మను చూడలేడు. అటువంటి సర్వగుణ సహితుడైన జీవునిలో అంతర్యామిగా ఉండేవాణ్ణి, సమస్తప్రాణులకూ మేలు కలిగించే వాడినీ, మూలపురుషుడిని ఆశ్రయిస్తాను.

వ. మఱియు బహువిధ నామ రూప నిరూప్యంబగు మనంబునకు దృష్టస్మృతుల నాశంబువలన గలిగెడు నుపరామంబగు సమాధియందుఁ గేవల జ్ఞానస్వరూపంబునఁ దోఁచు నిర్మల ప్రతీతిస్థానంబైన హంసస్వరూపికి నమస్కరింతు; దారువందు నతిగూఢంబైన వీతిహోత్రుని బుద్ధిచేతం బ్రకాశంబు నొందించు భంగి బుద్ధిమంతులు హృదంతరంబున సన్నివేశుండైన పరమపురుషుని నాత్మశక్తిత్రయంబులచేతం దేజరిల్లం జేయుదురు; అట్టి దేవుండు సకల మాయావిచ్ఛేదకం బైన నిర్వాణసుఖానుభవంబులం గూడి యుచ్చరింపం గొలఁదిగాని శక్తిగల విశ్వరూపి నాకుం బ్రసన్నుండగుం గాక; వాగ్బుద్ధీంద్రియమానసంబులచేతం జెప్పను, నిట్టి దని నిరూపింపను, నలవిగాక ఎవ్వని గుణరూపంబులు వర్తించు, నెవ్వఁడు నిర్గుణుండు, సర్వంబు నెవ్వనివలన నుత్పన్నంబగు, నెవ్వనివలన స్థితిం బొందు, నెవ్వనివలన లయంబగు, నట్టి పరాపరంబులకుఁ బరమంబై, యనన్యంబై సర్వవ్యాపకంబై, యదియ బ్రహ్మంబై, యాదికారణంబై యున్న తత్త్వంబు నాశ్రయింతు; ఎవ్వని ప్రభావంబుమాటలాడెడు వారలకు, వాదంబు సేయువారలకు వివాదస్థలం బగుచు, నప్పటప్పటికి మోహంబు నొందింపుచుండు, నట్టి యనంతగుణంబులు గల మహాత్మునకుం బ్రణామంబు సేయుచు నస్తి నాస్తి యను వస్తుద్వయనిష్ఠలం గలిగి, యొక్కటనఁ గలిగియుండి, విరుద్ధధర్మంబులుగ నుపాసనాశాస్త్ర సాంఖ్యశాస్త్రంబులకు సమంబై, వీక్షింపఁదగిన పరమంబు నాకు ననుకూలంబగుం గాక; ఎవ్వఁడు నామరూపంబులు లేకుండియు, జగదనుగ్రహంబుకొఱకు జన్మకర్మంబులచేత నామరూపంబులు గల్గి తేజరిల్లు, నట్టి యనంతుండైన భగవంతుండు సుప్రసన్నుం డగుఁగాక. ఎవ్వఁడు జనుల పురాకృత జ్ఞానపదంబుచేత నంతర్గతుండై, మేదినింగలుగు గంధాదిగుణంబుల నాశ్రయించిన వాయువుభంగి మెలంగుచుండు నా పరమేశ్వరుండు మదీయ మనోరథంబు సఫలంబు సేయుంగాక అనుచు భక్తి పరవశుండై యుక్తివిశేషంబున స్తుతియింపుచున్న దక్షునికి భక్తవత్సలుం డైన శ్రీవత్సలాంఛనుండు ప్రాదుర్భావంబు నొంది ప్రత్యక్షంబయ్యె నంత. **217**

ప్రతి : మఱియున్= ఇంకా; బహువిధ= అనేక రకాలైన; నామ రూప= నామాలచేత, రూపాలచేత; నిరూప్యంబు+అగు= నిరూపించదగు; మనంబునకున్= మనస్సుకు; దృష్ట= స్పష్టపడిన; స్మృతుల= జ్ఞాపకాల; నాశంబువలనన్= కోల్పోవుట వలన; కలిగెడు= ఏర్పడే; ఉపరామంబు+అగు= ఉపశమనస్థితి అయిన; సమాధి+అందున్= సమాధ్యవస్థయందు; కేవల= పూర్తిగా ఆవరించిన; జ్ఞాన స్వరూపంబునన్= జ్ఞానమనే వెలుగునందు; తోఁచు= కనిపించు; నిర్మల= స్వచ్ఛమైన; ప్రతీతిస్థానంబు+ ఐన= ముఖ్య ఆవరణయైన; హంస స్వరూపికిన్= అంతరాత్మ రూపుడైనవానికి; నమస్కరింతున్= నమస్కరిస్తాను; దారువు+అందున్= చెక్కలో; అతి గూఢంబు+ఐన= మిక్కిలి గోప్యంగా ఉన్న; వీతిహోత్రుని= అగ్నిని; బుద్ధిచేతన్= తెలివితేటలచేత; ప్రకాశంబున్+ఒందించు+భంగిన్= మండించిన విధంగా; బుద్ధిమంతులు= జ్ఞానులు; హృత్+ అంతరంబునన్= అంతరాత్మలో; సన్నివేశుండు+ఐన= నెలవై ఉన్న; పరమపురుషునిన్= పురుషోత్తముడైన శ్రీహరిని; ఆత్మశక్తి త్రయంబులచేతన్= తమయొక్క ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులచేత; తేజరిల్లన్+చేయుదురు= ప్రకాశింపజేస్తారు; అట్టి దేవుండు= అటువంటి పరమాత్మ; సకల= పలురకాల; మాయా= మోహమనేవాటికి; విచ్ఛేదకంబు+ఐన= నాశనకారియైన; నిర్వాణ= ముక్తి యొక్క; సుఖ+అనుభవంబులన్+కూడి= సౌఖ్యానుభూతులను పొంది; ఉచ్చరింపన్+కొలఁది+కాని= చెప్పడానికి శక్యంకాని; శక్తిగల= మహత్తు కల్గిన; విశ్వరూపి= అంతా తానే అయిన పరబ్రహ్మ; నాకున్= నాకు;

ప్రసన్నుండు+అగున్+ కాక= అనుకూలుడుగా మారును గాక; వాక్= పలుకులు ద్వారా; బుద్ధి= బుద్ధి ద్వారా; ఇంద్రియ= ఇంద్రియసమూహం ద్వారా; మానసంబులచేతన్= మనస్సు మొదలైన వాటి ద్వారా; చెప్పనున్= చెప్పడానికి; ఇట్టిది+అని= ఇటువంటిదని; నిరూపింపనున్= నిర్ధారించడానికి; అలవిగాక= వీలుపడక; ఎవ్వని= ఎవరియొక్క; గుణరూపంబులు= స్వభావం; వర్తించున్= కలిగి ఉంటాయో; ఎవ్వఁడు= ఏ భగవంతుడు; నిర్గుణుండు= గుణ రహితుడో; సర్వంబునున్= ఈ సకల సృష్టి; ఎవ్వనివలనన్= ఏ పరమాత్మనుండి; ఉత్పన్నంబు+అగున్= పుట్టుచున్నదో; ఎవ్వనివలనన్= ఏ పరంధామునివలన; స్థితిన్+పొందున్= ఉనికిని కలిగి ఉంటుందో; ఎవ్వనివలనన్= ఏ దైవం కారణంగా; లయంబు+అగున్= నాశనం అవుతున్నదో; అట్టి= అటువంటి; పర+అపరంబులకున్= ఇహపరాలకు; పరమంబు+ఐ= అతీతమై; అనన్యంబు+ఐ= సాటిలేనిదై; సర్వవ్యాపకంబు+ఐ= అంతటా నిండిందై; అది+అ= ఆ తత్త్వమే; బ్రహ్మంబై= పరబ్రహ్మస్వరూపమై; ఆదికారణంబు+ఐ= మూలహేతువై; ఉన్న= ఉన్నట్టి; తత్త్వంబున్= తత్త్వరూపాన్ని (పరతత్త్వాన్ని), ఆశ్రయింతున్= శరణు పొందుతాను; ఎవ్వని= ఏ పరమాత్మయొక్క; ప్రభావంబున్= అనంతశక్తిని; మాటలు+ఆడెడు వారలకున్= ఉచ్చరించే వారికి; వాదంబు= వాదోపవాదాలు (తర్కాలు); చేయువారలకున్= చేసేవారికి; వివాదస్థలంబు+అగుచున్= సభావేదికగా మారుతున్న; అప్పటికిన్+అప్పటికిన్= అంతలోనే; మోహంబున్= భ్రాంతిని; ఒందింపుచున్+ఉండున్= పొందిస్తుందో; అట్టి= అటువంటి; అనంత గుణంబులు గల= అనంతగుణాలు కల్గిన; మహా+ఆత్మునకున్= ఆ దేవదేవునికి; ప్రణామంబు= నమస్కారం; చేయుచున్= చేస్తూ; అస్తి= ఉంది; న+అస్తి= లేదు; అను= అనేటువంటి; వస్తుద్వయ= రెండు తత్త్వాలయొక్క; నిష్ఠలన్+కలిగి= నియమాలు పొంది; ఒక్కటనన్+కలిగియుండి= ఒక్కడే అన్నట్లుగా ఉండి; విరుద్ధ= పరస్పరవ్యతిరేకాలైన; ధర్మంబులు+కన్= ధర్మసిద్ధాంతాలైన; ఉపాసనాశాస్త్ర= ఉపాసనవిధానాలకు; సాంఖ్యశాస్త్రంబులకు= కపిలుని వేదాంతసిద్ధాంతాలకు; సమంబై= సరిసమానమై; వీక్షింపన్+తగిన= చూడడానికి తగినట్టి; పరమంబు= ఆ మూలపదార్థం; నాకున్= నాకు; అనుకూలంబు+అగున్+కాక= ప్రసన్నం అగును గాక; ఎవ్వఁడు= ఏ భగవంతుడు; నామరూపంబులు= పేరు, ఆకారముల వంటివి; లేకుండియు= లేకున్నా; జగత్+అనుగ్రహంబుకొఱకున్= లోకాన్ని అనుగ్రహించేందుకై; కొఱకున్= కోసం; జన్మకర్మంబుల చేతన్= పుట్టుట మొదలైన పనుల వలన; నామరూపంబులున్+కల్గి= పేర్లు, ఆకారాలు పొంది; తేజరిల్లున్= ప్రకాశిస్తున్నాడో; అట్టి= అటువంటి; అనంతుండు+ఐన= అంతం లేనివాడైన (అంతట నిండినవాడైన); భగవంతుండు= సకల శక్తి సంపన్నుడు; సుప్రసన్నుండు+అగున్+కాక= ప్రసన్నుడగు గాక; ఎవ్వఁడు= ఏ దైవం; జనుల= మానవుల; పురాకృత= ముందుజన్మలలో చేసుకున్న (సంపాదించిన); జ్ఞానపదంబుచేతన్= జ్ఞానస్థితి కారణంగా; అంతర్గతుండు+ఐ= అంతర్యామియై; మేదినిన్+కలుగు= భూమిపై ఉన్న; గంధ+ఆది గుణంబులన్= వాసన మొదలగు గుణాలను; ఆశ్రయించిన= పొందిన; వాయువుభంగిన్= గాలిమాదిరిగా; మెలంగుచున్+ఉండున్= సంచరిస్తున్న; ఆ పరమేశ్వరుండు= ఆ లోకాధిపతి; మదీయ= నా యొక్క; మనోరథంబు= కోరికను, సఫలంబున్= నెరవేరేలా; చేయున్+కాక= చేయగలవాడు; అనుచున్= అని ప్రార్థిస్తూ, భక్తిపరవశుండు+ఐ= భక్తిలో మునిగినవాడై; ఉక్తి విశేషంబునన్= తన స్తోత్రాల గొప్పతనంతో; యుక్తి విశేషంబునన్= యుక్తి అతిశయంతో; స్తుతియింపుచున్+ఉన్న= పూజిస్తున్న; దక్షునికిన్= ఆ దక్షప్రజాపతికి; భక్తవత్సలుండు+ఐన= భక్తులయందు ప్రేమ కలిగిన; శ్రీవత్సలాంఛనుండు= ఆ విష్ణుమూర్తి; ప్రాదుర్భావంబున్+ఒంది= నిజరూపం పొంది; ప్రత్యక్షంబు+అయ్యెన్= దర్శనమిచ్చాడు; అంతన్= అటుపిమ్మట...

**తా :** మనస్సు సంకల్ప వికల్పాలకు స్థానం. మనసులో అనేక విరుద్ధ భావాలు సంఘర్షణకు గురై వస్తూ, పోతూ వుంటాయి. ఈ విధమైన మనస్సు ఇంద్రియాల విషయంలో నిగ్రహాన్ని, నిలుకడను పొందగల్గితే దానిని నిర్వికల్పసమాధి

అంటారు. ఈ విధమైన జ్ఞానానికి మూలమైన అంతరాత్మస్వరూపానికి నమస్కారం. కట్టెలో మిక్కిలి గూఢంగా ఉన్న అగ్నిని రాపిడిశక్తిచేత బయటకు రప్పించినట్లు, బుద్ధిమంతులు తమ మనసనే ఆకాశమందు విహరించే పరమాత్మను తమయొక్క ఇచ్ఛాజ్ఞానక్రియలనే ఆత్మశక్తులచేత సాక్షాత్కరింపజేస్తారు. అటువంటి ఏకాత్మరూపుడైన నిర్గుణ పరబ్రహ్మ 'ఏకోఽహం బహూస్యాం' అనే సంకల్పంతో అనేక నామరూపాలను ధరించి విశ్వరూపి అయ్యాడు. అటువంటి సర్వాత్మకుడు నన్ను అనుగ్రహించుగాక. అవాఙ్మానస గోచరుడు, నిర్గుణ పరబ్రహ్మ, సృష్టిస్థితి లయకారణుడు అయిన దేవదేవుణ్ణి ఆశ్రయిస్తాను. ఏ దేవుని మాయాప్రభావం కారణంగా పండితులు, పామరులు, భగవంతుని విషయంలో ఉన్నాడు, లేడు అని వాదించుకుంటారో, వారందరియందు కూడా ఒకే ఆత్మశక్తిగా ఉంటూ, యోగాది ఉపాసనా ధర్మాలు వేరైనా **'నదీనాం సాగరో గతిః'** అన్నట్లు వాటన్నిటికి ఒకే గమ్యరూపమైన పరాత్పరుడు నాకు అనుకూలంగా మారునుగాక. నిర్గుణుడు, నిరాకారుడు ఐన పరమాత్మ జగత్తును రక్షించటంకోసం సద్గుణుడు, సాకారుడు అవుతున్నాడో; అటువంటి సర్వవ్యాపకుడు నాకు ప్రసన్నుడు అగుగాక. ఏ భగవానుడు జీవుల పూర్వజన్మ విశేషం కారణంగా ప్రస్తుతజన్మలలో జ్ఞానమనే జ్యోతిగా వెలుగొందుతూ, భూ పదార్థాల వాసనతో కూడుకున్న వాయువు (గాలి) మాదిరిగా అన్నింటిలో ఉంటూ, అన్నింటికి దూరంగా ఉండగలిగే నారాయణుడు నా కోరికను తీర్చుగాక. అని భక్తితో నిండినవాడై తన మాటలతో కీర్తిస్తున్న దక్షునికి, భక్తపాలకుడైన శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైనాడు. అంత

**సీ. భర్మాచలేంద్ర ప్రపాతద్వయంబునఁ గలిగిన నీలంపుఁగను లనంగ**
**మొనసి తార్క్ష్యుని యిరుమూఁపుపై నిడినట్టి పదముల కాంతులు పరిఢవింపఁ**
**జండ దిఙ్మండల శుండాల కరముల కైవడి నెనిమిదికరము లమరఁ**
**జక్ర కోదండాసి శంఖ నందక పాశ చర్మ గదాదుల సరవిఁ బూని**

**ఆ. నల్లమేను మెఱయ నగుమొగం బలరంగఁ, జల్లచూపు విబుధసమితిఁ బ్రోవ**
**బసిఁడికాసెఁ బూని బహు భూషణ కిరీట కుండలముల కాంతి మెండుకొనఁగ. 218**

**ప్రతి :** భర్మ+అచల+ఇంద్ర= మేరు పర్వతం యొక్క; ప్రపాత ద్వయంబునన్= చరియలకు ఇరువైపుల; కలిగిన= ఉన్నటువంటి; నీలము+గనులు+అనంగన్= ఇంద్రనీల మణుల గనులు అన్నట్లుగా; మొనసి= పూనుకొని; తార్క్ష్యుని= గరుత్మంతుని యొక్క, ఇరుమూఁపుపైనన్= రెండు భుజాలమీద; ఇడినట్టి= ఉంచినటువంటి; పదములకాంతులు= పాదాలయొక్క తేజస్సులు; పరిఢవింపన్= ఒప్పుతుండగా; చండ= తీక్ష్ణమైన; దిక్+మండల= దిక్కుల సమూహంలో ఉన్న, శుండాల= ఏనుగులయొక్క; కరముల= తొండముల; కైవడిన్= విధంగా; ఎనిమిది కరములు= ఎనిమిది చేతులు; అమరన్= ప్రకాశిస్తుండగా; చక్ర= సుదర్శనం; కోదండ= శార్ఙ్గం; అసి= కత్తి; శంఖ= పాంచజన్యం; నందక= నందకమనే ఖడ్గం; పాశ= పాశం; చర్మ= డాలు; గదా+ఆదులన్= కౌమోదకి మొదలైన ఆయుధాలను; సరవిన్+పూని= వరుసగా ధరించి; నల్లమేను= శ్యామలకాంతి కలిగిన శరీరం; మెఱయన్= ప్రకాశిస్తుండగా; నగుమొగంబు= మందహాసంతో కూడిన ముఖం; అలరన్+కన్= ఒప్పుతుండగా; చల్లచూపు= కారుణ్య దృష్టి; విబుధ సమితిన్= జ్ఞానుల సమూహాన్ని; ప్రోవన్= రక్షించగా; పసిఁడికాసెన్= బంగారు వర్ణపు పట్టువస్త్రాలను; పూని= ధరించి; బహు= పెక్కు; భూషణ= ఆభరణాలు; కిరీట= కిరీటం; కుండలముల= చెవికమ్మల; కాంతి= తేజస్సు; మెండుకొనన్+కన్= అంతట వ్యాపిస్తుండగా...

(ఈ పద్యం నాల్గవపాదంలో చెప్పిన ఎనిమిది ఆయుధాలలో అసి, నందక అనేవి ఉన్నాయి. అసి అంటే ఖడ్గం. విష్ణుదేవుని ఖడ్గం పేరు నందకం. కనుక 'అసి, నందక' అనేవి పునరుక్తులవుతాయి. అందుచే మూలానుగుణంగా 'కోదండేషు' అని 'ఇషు' శబ్దాన్ని గ్రహిస్తే అప్పుడు పునరుక్తి తొలగుతుంది. ఇషు= బాణము (సం.భా.6-4-36)).

**తా :** శ్రీమన్నారాయణుడు గరుత్మంతుని మీద ఆసీనుడై ఉన్నాడు. గరుడుని రెండు భుజాలమీద చాచిన ఆ స్వామి పాదాలు మేరుపర్వతం చరియకు రెండుప్రక్కలా ప్రకాశించే ఇంద్రనీలమణుల గనులవలె ఉన్నాయి. ఆయన అష్టబాహువులూ అందంగా పైకిచాచిన అష్టదిగ్గజాల తొండాలవలె ప్రకాశిస్తున్నాయి. ఎనిమిది చేతులలోనూ చక్రమూ, ధనుస్సూ, కత్తి, శంఖమూ, ఖడ్గమూ, పాశమూ, డాలూ, గదాదండమూ విరాజిల్లుతున్నాయి. నల్లని దేహంతో నగుమోముతో సాధుజనులను సంరక్షించే చల్లనిచూపులతో బంగారురంగు పట్టుపీతాంబరంతో మణిమయకిరీటంతో నలుమూలలా కాంతులు విరజిమ్మే భూషణాలతో, మకరకుండలాలతో పుండరీకాక్షుడు దక్షునిముందు ప్రత్యక్షమైనాడు.

**సీ. కుండల మణి దీప్తి గండస్థలంబులఁ బూర్ణేందురాగంబుఁ బొందుపఱుప**
**దివ్యకిరీట ప్రదీప్తు లంబరరమాసతికిఁ గౌసుంభవస్త్రంబు గాఁగ**
**వక్షస్థలంబుపై వనమాల మాలికల్ శ్రీవత్స కౌస్తుభ శ్రీల నొఱయ**
**నీలాద్రిఁ బెనఁగొని నిలిచిన విద్యుల్లతలభాతిఁ గనకాంగదములు మెఱయ**

**ఆ. నఖిలలోక మోహనాకారయుక్తుఁడై, నారదాదిమునులు చేరి పొగడఁ**
**గదిసి మునులు పొగడ గంధర్వ కిన్నర, సిద్ధ గానరవము సెవుల నలర. 219**

**ప్రతి :** కుండల= చెవి తాటంకములలోని; మణిదీప్తి= రత్నములకాంతి; గండస్థలంబులన్= చెక్కిళ్ళయందు, పూర్ణ+ఇందురాగంబున్= నిండు చంద్రుని కాంతిని, పొందుపఱుపన్= కల్గిస్తూండగా; దివ్యకిరీట= దివ్యమైన కిరీటం యొక్క; ప్రదీప్తులు= తేజస్సులు; అంబరరమాసతికిన్= ఆకాశమనే లక్ష్మికి; కౌసుంభవస్త్రంబు= కుంకుమరంగు చీర; కాఁగన్= కాగా; వక్షఃస్థలంబుపైన్= ఎదపైన ఉన్న; వనమాల= వనమాలయొక్క; మాలికల్= వరుసలు; శ్రీవత్స= శ్రీవత్సమనే మచ్చయొక్క; కౌస్తుభ= కౌస్తుభమనే ఇంద్రనీలమణియొక్క; శ్రీలన్+ఒఱయన్= అందాన్ని పెంపొందించగా; నీల+అద్రిన్= నల్లని కొండను; పెనఁగొని= చుట్టుకొని; నిలిచిన= ఉన్న; విద్యుత్+లతల భాతిన్= మెఱుపు తీగలవలె; కనక+అంగదములు= బంగారు భుజకీర్తులు; మెఱయన్= ప్రకాశిస్తుండగా; అఖిలలోక= సమస్త లోకాలకు; మోహన+ఆకారయుక్తుఁడు+ఐ= వ్యామోహం కలిగించే రూపం కలిగినవాడై; నారద+ఆది= నారదుడు మొదలైన; మునులు= మహర్షులు; చేరి= సమీపించి; పొగడన్= స్తుతించగా; కదిసి= కూడి; మునులు= మహర్షులు; పొగడన్= ప్రశంసిస్తుండగా; గంధర్వ= గంధర్వులు; కిన్నర= కిన్నరులు; సిద్ధ= సిద్ధులు మొదలైనవారి; గానరవము= కీర్తనల సవ్వడి; చెవులన్= చెవులకు; అలరన్= ఆనందం కలిగించగా...

**తా :** మకర కుండలాల కాంతి చెక్కిళ్ళపై చంద్రకాంతిలా ప్రసరిస్తుండగా, కిరీటం యొక్క శ్రేష్ఠమైన ప్రకాశం ఆకాశలక్ష్మికి కుంకుమరంగు వస్త్రంగా మారగా, వక్షఃస్థలం మీద వనమాలికల కాంతి శ్రీవత్సం, కౌస్తుభమణుల కాంతిలో కలిసి అతిశయిస్తుంటే, నల్లని కొండను చుట్టిన మెఱుపు తీగల మాదిరి స్వామి భుజకీర్తులు శోభిస్తుండగా, సకల లోకాలనూ సమ్మోహింపజేస్తూ, నారదుడు మొదలైన దేవర్షులు, మహర్షులు స్వామిని సేవిస్తుండగా, గంధర్వాది దేవగణాల కీర్తనలు చెవులకు ఆనందం కలిగిస్తుండగా

**క. సర్వేశుఁడు సర్వాత్ముఁడు సర్వగతుం డచ్యుతుండు సర్వమయుండై**
**సర్వంబు చేరి గొలువఁగ సర్వదుఁడై దక్షునకుఁ బ్రసన్నుం డయ్యెన్. 220**

**ప్రతి :** సర్వ+ఈశుఁడు= అఖిల లోకాధిపతి; సర్వ+ఆత్ముఁడు= అన్ని జీవులకు ఆత్మ అయినాడు; సర్వగతుండు= సర్వాంతర్యామి; అచ్యుతుండు= నాశనం లేనివాడు (శాశ్వతుడు); సర్వమయుండు+ఐ= అంతటా వ్యాపించినవాడై; సర్వంబు చేరి= తన సకల పరివారం కూడి, కొలువన్+కన్= సేవిస్తూ ఉండగా; సర్వదుఁడు+ఐ= అన్నిటిని ఇచ్చేవాడై; దక్షునకున్= దక్ష ప్రజాపతికి; ప్రసన్నుండు+అయ్యెన్= ప్రత్యక్షం అయ్యాడు.

**తా :** సర్వశక్తిమంతుడు, సర్వాత్మకుడు, సర్వవ్యాపకుడు, శాశ్వతుడు, సర్వదుడు అయిన ఆ శ్రీహరి తనను సమస్త భక్తజనులు సేవిస్తుండగా దక్షునికి ప్రత్యక్షమయ్యాడు.

**వ. ఇట్లు ప్రసన్నుండైన సర్వేశ్వరుని సర్వంకషంబై మహదాశ్చర్యధుర్యంబై తేజరిల్లు దివ్యరూపంబుం గాంచి, భయంబును, హర్షంబును, విస్మయంబును జిత్తంబున ముప్పిరిగొని చొప్పు దప్పింపం దెప్పిఱి, కప్పరపాటునఁ బుడమిపై నిడుసాగిలంబడి, దండప్రణామంబు లాచరించి, కరకమలంబులు మొగిడ్చి సెలయేఱులతోఁ గొట్టువడి, యిట్టట్టు పట్టుచాలక నిట్టవొడిచి, మున్నీరు దన్ని నిలిచిన పెన్నీరునుంబోలె, సర్వాంగంబులుం దొంగలింపఁ, జిత్తంబు నాత్మాయత్తంబు సేసి, పిక్కటిల్లిన సంతోషంబుచేత భగవంతుం బలుకను, నత్యంత మంగళసందోహోపాదకంబు లైన తన్నామంబు లుగ్గడింపను, నతి నిర్మలంబులైన తదీయ కర్మంబులు దడవను, విబుధ హర్షకరంబులైన తత్పౌరుషంబులు పొగడను, నాత్మీయ మనోరథంబు వాక్రువ్వను నోపక ప్రజాకాముండై యూరకున్న ప్రజాపతిం జూచి, సర్వజీవ దయాపరుండును, సర్వసత్త్వ హృదంతరస్థుండును, సర్వజ్ఞుండునుం గావున నతని భావంబు దెలిసి, జగన్నాథుం డార్త షోషణంబుల భాషణంబుల నిట్లనియె. 221**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ప్రసన్నుండు+ఐన= అనుగ్రహించినవాడైన; సర్వ+ఈశ్వరునిన్= ఆ దేవదేవుణ్ణియొక్క; సర్వంకషంబు+ఐ= అన్ని దిక్కులందు వ్యాపించిందై; మహత్+ఆశ్చర్యధుర్యంబు+ఐ= మిక్కిలి ఆశ్చర్యంతో పెనవేసుకొన్నదై; తేజరిల్లు= ప్రకాశిస్తున్న; దివ్యరూపంబున్+కాంచి= మహోన్నత రూపాన్ని దర్శించి; భయంబును= భయం; హర్షంబును= ఆనందం; విస్మయంబును= ఆశ్చర్యం; చిత్తంబునన్= తన మనస్సులో; ముప్పిరిగొని= ముప్పేట ఆవరించి; చొప్పు= ఆ స్థితిని; తప్పింపన్= పోగొట్టడానికి; తెప్పిఱి= తెప్పరిల్లి; కప్పరపాటునన్= తడబాటుతో; పుడమిపైన్= నేలమీద; నిడుసాగిలన్+పడి= నిలువుగా సాగిలపడి; దండప్రమాణంబులు+ఆచరించి= దండనమస్కారాలుచేసి; కరకమలంబులు= తామరలవంటి చేతులు, మొగిడ్చి= జోడించి; సెలయేఱులతోన్= సెలయేళ్లు; కొట్టువడి= కలిసి; ఇట్టు+అట్టు= గట్లు ఒరుసుకొంటూ; పట్టుచాలక= నిలబడలేక; నిట్టవొడిచి= ప్రవహిస్తూ; మున్నీరున్+తన్ని= సముద్రాన్ని చేరి; నిలిచిన= సంగమించిన; పెన్నీరునున్+పోలెన్= పెద్దనదివలె; సర్వ+అంగంబులున్= శరీరభాగాలన్నీ; తొంగలింపన్= పట్టుతప్పగా; చిత్తంబున్= మనస్సును; ఆత్మ+ ఆయత్తంబు+చేసి= ఆత్మయందు లీనం చేసి; పిక్కటిల్లిన= మితిమీరిన (హద్దులేని), సంతోషంబుచేతన్= ఆనందంతో; భగవంతున్= దేవునితో; పలుకను= మాట్లాడడానికి; అతి+అంత= మిక్కిలి; మంగళ= శుభప్రదమైన; సందోహ= పరంపరలకు; ఆపాదకంబులు+ఐన= పుట్టిండ్లు అయిన; తద్+నామంబులు= అతని పేర్లను;

ఉగ్గడింపను= కీర్తించడానికీ; అతి నిర్మలంబులు+ఐన= మిక్కిలి స్వచ్ఛములైన; తదీయ= ఆ స్వామియొక్క; కర్మంబులు= కృత్యాలను; తడవను= స్మరించడానికి; విబుధ= శిష్టులకు; హర్షకరంబులు+ఐన= ఆనందం కలిగించేవైన; తత్+పౌరుషంబులు= ఆయన వీరగాథలు; పొగడను= ప్రశంసించడానికి; ఆత్మీయ= తన; మనోరథంబున్= మనసులోని కోరికను; వాక్రువ్వను= విన్నవించడానికి; ఓపక= శక్తిలేక; ప్రజాకాముండు+ ఐ= సృష్టికాముడై; ఊరకున్నన్= నిశ్చేష్టుడుకాగా; ప్రజాపతిన్+చూచి= దక్షుని చూచి; సర్వజీవ= సకల ప్రాణుల; దయాపరుండును= కరుణకలవాడు; సర్వసత్త్వ= సకల సాత్త్విక; హృద్+అంతరస్థుండును= మనసులలో నివసించేవాడు; సర్వజ్ఞుండునున్= అన్నీ తెలిసినవాడు; కావునన్= కాబట్టి; అతని భావంబున్= దక్షుని ఆలోచనను; తెలిసి= గ్రహించి; జగత్+నాథుండు= ఆ శ్రీహరి; ఆర్తపోషణంబులన్= ఆశ్రితులను రక్షించేవైన; భాషణంబులన్= మాటలతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా సాక్షాత్కరించిన సర్వేశ్వరుని దివ్యరూపం సర్వదిక్కులనూ వెలిగిస్తూ మహాశ్చర్యాన్ని కలిగించింది. అలా ప్రకాశించే ఆ దేవదేవుని తేజోమయమూర్తిని వీక్షించి, దక్షుని హృదయంలో భయమూ, ఆనందమూ, ఆశ్చర్యమూ ముప్పిరి గొన్నాయి. ఎలాగో ఆ తన్మయత్వంనుండి తెప్పరిల్లి తొట్రుపాటుతో దక్షుడు స్వామికి సాష్టాంగదండప్రణామం చేశాడు. జోడించి మోడ్చి నిలుచున్నాడు. సెలయేళ్ళు కలయికతో దరులొరసి పొంగి మిన్నంటి సముద్రాన్ని దరిసిన మహానదీ ప్రవాహంవలె దక్షప్రజాపతి పులకించిన దేహంతో భగవంతుని ముందు నిలిచాడు. ఆయన పరవశించిన తన హృదయాన్ని ఎలాగో అదుపు చేసుకొని పొంగిపొరలే ఆనందంతో ఆ పరమేశ్వరునితో ఏమేమో పలుకాలి అనుకొన్నాడు. పరమ మంగళదాయకాలైన ఆయన పవిత్రనామాలను ఉచ్చరించాలనుకొన్నాడు. పరమపవిత్రాలైన ఆయన లీలలను అభివర్ణించాలనుకొన్నాడు. విబుధులకు సంతోషాన్ని కలిగించే ఆయనపరాక్రమాన్ని ప్రస్తుతించాలనుకొన్నాడు. తన మనస్సులోని కోరికను వెల్లడించాలనుకొన్నాడు. కానీ పాపం! ఏమీ చేయలేక పోయాడు. ఆ విధంగా మైమరచి నోట మాటరాక మౌనం వహించి ఉన్న ప్రజాకాముడైన ప్రజాపతిని చూచి, సర్వజ్ఞుడూ సర్వప్రాణి హృదయాంతర్యామీ అయిన ఆ స్వామి అతని అభిప్రాయాన్ని గ్రహించి, ఆర్తజనులను రక్షించే లక్షణంగల మాటలతో ఇలా అన్నాడు.

**క. మెచ్చితి ప్రాచేతస! తప మిచ్చుట ఫలసిద్ధి యయ్యె నిట్లతిభక్తిన్**
**హెచ్చుగు మద్వరవిభవము నచ్చుపడం బొంద నెవ్వఁ డర్హుఁడు? జగతిన్. 222**

**ప్రతి :** ప్రాచేతస= ఓ దక్షా! తపము= నీ తపస్సు; మెచ్చితిన్= నిన్ను మెచ్చుకున్నాను; ఇచ్చుట= ఇక్కడ; ఫలసిద్ధి= తపస్సుకు ఫలప్రాప్తి; అయ్యెన్= అయింది; ఇట్లు+అతిభక్తిన్= ఇలా మిక్కిలి భక్తితో; హెచ్చు+అగు= గొప్పదైన; మత్+వరవిభవము= నా వరప్రసాదాన్ని; అచ్చుపడన్= తేటపడగా; జగతిన్= ఈ లోకంలో; ఎవ్వడు= నీకంటె మరెవ్వరు; అర్హుడు= తగినవాడు?

**తా :** ఓ దక్షా! నీ తపస్సుకు మెచ్చాను. అందుకు ఈ క్షణంలోనే నీకు ఫలసిద్ధిని ప్రసాదిస్తున్నాను. నానుండి వరం పొందడానికి ఈలోకంలో నీకంటె అర్హుడు ఎవడున్నాడు?

**ఆ. తపము చాలు నింకఁ దగ భూతతతికి విభూతు లొనరుఁ గాక పొందుపడఁగ,**
**నిదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గల కోర్కి పొసఁగ నీదువలనఁ బొందుపడియె. 223**

**ప్రతి :** తపము చాలు= నీ తపస్సు ఇక చాలు; ఇంకన్= ఇప్పుడు; తగన్= చక్కగా; భూతతతికిన్= జీవకోటికి; విభూతులు= ఐశ్వర్యాలు; ఒనరున్+కాక= కలుగుగాక; పొందుపడన్+కన్= సరిపడునట్లుగా; ఇది+అ సుమ్ము= ఇదే సుమా!; మాకు;

ఇచ్ఛలోన్+కల కోర్కి= మనసులో ఉన్న ఆశయం; పొసఁగన్= అనుకూలించగా; నీదు వలనన్= నీ కారణంగా? పొందుపడియెన్= సఫలమయ్యింది.

**తా :** ఈ నీ తపస్సు ఇక చాలు. సకల జీవరాశులకు సమస్త సంపదలు సిద్ధిస్తాయి. నీవు సృష్టి చేయాలనే కోరికతో నన్ను గూర్చి తపస్సు చేశావు. నా సంకల్పం కూడా ఇదే. నీ తపస్సు నెరవేరింది.

**వ. వినుము; బ్రహ్మయు, భర్గుండును, బ్రజాపతులును, మనువులును, నింద్రులును, వీరలు నిఖిల భూతంబులకు భూతిహేతువులైన మద్భూతివిభవంబులు. మఱియు నాకు యమ నియమాది సహిత సంధ్యావందనాది రూపంబగు తపంబు హృదయంబు; సాంగ జపవద్ధ్యానరూపంబగు విద్య శరీరంబు. ధ్యానాది విషయ పుంవ్యాపారంబుగా నుండు భావనాది శబ్దవాచ్యంబగు క్రియ యాకృతి; క్రతు జాతంబు లంగంబులు; ధర్మం బాత్మ; దేవతలు ప్రాణంబులు; నిగమంబు మత్స్వరూపంబు; జగదుత్పత్తికి నాదియందు నే నొక్కండన తేజరిల్లుచుంటి; బహిరంతరంబుల వేఱొక్కటియు లేదు; సుషుప్త్యవస్థయందు సర్వంబు లీనం బగుటం జేసి సంజ్ఞామాత్రుండును, నవ్యక్తుఁడునుఁగా నుండు జీవునిభంగి నొక్కఁడన యుండుదు; అనంతుండ నయి యనంత గుణంబువలన గుణవిగ్రహం బగు బ్రహ్మాండంబును, నయోనిజుఁడు స్వయంభవుండగు బ్రహ్మయును నుదయించిరి; మదీయ వీర్యోపబృంహితుండై మహాదేవుండగు నా బ్రహ్మ యసమర్థునింబోలె నకృతార్థమ్మన్యమాన మనస్కుఁడై, సృజింప నుద్యమించు తఱి తపం బాచరించుమని నాచేత బోధితుండై, యఘోరంబైన తపం బాచరించి తొలుత సృష్టికర్తృత్వము వహించిన మిమ్ము సృజించె; అంతఁ బంచజనుండను ప్రజాపతి తనూజ యగు నసిక్ని యను పేరిట వినుతి నొందియున్న యిక్కన్యకను నీ కిచ్చితి. దీనిం బత్నిగాఁ గైకొని మిథునవ్యవాయధర్మంబు గలవాఁడవై, మిథునవ్యవాయ ధర్మంబుగల యీ నాతియందుఁ బ్రజాసర్గంబు నతి విపులంబుగ గావింపం గలవాఁడవు; మఱియు నీకుఁ బిదప నిదే క్రమంబున నిఖిల ప్రజలును మన్మాయా మోహితులయి, మిథునవ్యవాయ ధర్మంబునఁ బ్రజావృద్ధి నొందించి మదారాధనపరులై యుండఁ గలవారు అని పల్కి, విశ్వభావనుండైన హరి స్వప్నోపలబ్ధార్థంబునుం బోలె నంతర్ధానంబు నొందె. అప్పుడు దక్షుండు విష్ణుమాయోపబృంహితుండై పాంచజనియగు నసిక్నియందు హర్యశ్వ సంజ్ఞల వినుతిఁ జెందియున్న యయుత సంఖ్యా పరిగణితులైన పుత్త్రులం గాంచె; అప్పు డా ధర్మశీలురైన దాక్షాయణులు పితృనిర్దేశంబునం బ్రజాసర్గంబు కొఱకుఁ దపంబు సేయువారై పశ్చిమదిశకుం జని, యచ్చట సింధు సముద్ర సంగమంబున సమస్త దేవ ముని సిద్ధగణ సేవితంబై, దర్శనమాత్రంబున నిర్ధూత కల్మషులను, నిర్మల చిత్తులం జేయుచున్న నారాయణ సర స్సనం బరఁగు తీర్థరాజంబున నవగాహనంబుఁ జేసి, నిర్మలాంతరంగులై పరమహంసధర్మంబు నందు నుత్పన్నమతులై ప్రజాసర్గంబుకొఱకుఁ దండ్రి యనుమతంబున నుగ్రతపంబు సేయుచుండ వారికడకు నారదుండు వచ్చి యిట్లనియె. 224**

**ప్రతి :** వినుము= ఇంకా చెబుతాను విను; బ్రహ్మయు= సృష్టికర్త ఐన బ్రహ్మ; భర్గుండును= లయకారుడు శివుడును; ప్రజాపతులును= ప్రజాసృష్టి చేయు అధిపతులును; మనువులును= పదునాలుగుమంది మనువులు; ఇంద్రులును=

దేవలోకాధిపతులైన ఇంద్రులు; వీరలు= వీరందరు; నిఖిల భూతంబులకున్= సమస్త జీవులకు; భూతి హేతువులు+ఐన= ఐశ్వర్య కారకాలైన; మద్+భూతి విభవంబులు= నా యొక్క ఈశ్వరత్వాంశ రూపాలు; మఱియున్= ఇంకా; నాకు; యమనియమ+ఆది= బహిరంతరింద్రియ నిగ్రహ కార్యాలతో; సహిత= కూడిన; సంధ్యావందన+ఆది= గాయత్ర్యుపాసన మొదలైన; రూపంబు+అగు= రూపమైన; తపంబు= తపస్సు; హృదయంబు= నాకు హృదయం; స+అంగ= అంగ సహితమైన (సాంగోపాంగమైన) ; జపవత్+ధ్యానరూపంబు+అగు= జపంవంటి మననరూపమైన; విద్య= చదువు; శరీరంబు= మేను; ధ్యాన+ఆది= ధ్యానం మొదలగు; విషయ= విషయానికి చెందిన; పుంవ్యాపారంబు+కాన్= మానవ ప్రయత్నాలతో; ఉండు= ఉండే; భావన+ఆది= ఆలోచన మొదలగు; శబ్దవాచ్యంబు+అగు= వాగ్రూపమైన; క్రియ= పనులు; ఆకృతి= నా ఆకారం; క్రతు జాతంబులు= యజ్ఞాలు; అంగంబులు= నా శరీర అవయవాలు; ధర్మంబు+ఆత్మ= ధర్మమే నాకు ఆత్మ; దేవతలు= దేవతా సమూహాలు; ప్రాణంబులు= నాకు జీవములు; నిగమంబు= వేదం; మత్+స్వరూపంబు= నా స్వరూపమే; జగత్+ఉత్పత్తికిన్= లోకాలు పుట్టడానికి; ఆది+అందున్= ప్రారంభంలో; నేను+ఒక్కండన= నేను ఒక్కడిని మాత్రమే; తేజరిల్లుచున్+ఉంటిన్= ప్రకాశిస్తూ ఉన్నాను; బహిస్+అంతరంబుల= బయట, లోపల; వేఱు+ఒక్కటియు= ఇంకేదీ; లేదు; సుషుప్తి+అవస్థ+అందున్= నిద్రావస్థలో; సర్వంబు= సమస్తం; లీనంబు+అగుటన్+చేసి= నాలోనే ఇమిడి ఉండుటచే; సంజ్ఞామాత్రుండను= ఉనికి మాత్రం కలిగిన వాడను; అవ్యక్తుఁడనున్+కాన్= కనిపించని వాడుగాను; ఉండు= ఉండే; జీవుని భంగిన్= ప్రాణివలె; ఒక్కఁడన= ఒక్కడిని మాత్రమే; ఉండుదున్= ఉంటాను; అనంతుండను+అయి= పరిమితి లేనివాడనై; అనంత గుణంబువలనన్= సర్వగుణాలకు నిలయమైన కారణంగా; గుణ విగ్రహంబు+అగు= గుణ సహితరూపమైన; బ్రహ్మ+అండంబునున్= ఈ సకల లోకాలన్నీ; అయోనిజుఁడు= పుట్టుక లేనివాడు; స్వయంభువుండు+అగు= తనకు తానుగా ఆవిర్భవించినవాడు అయిన; బ్రహ్మయునున్= బ్రహ్మదేవుడును; ఉదయించిరి= జన్మించారు; మదీయ= నా యొక్క; వీర్య+ఉపబృంహితుండు+ఐ= తేజస్సుతో నిండినవాడై; మహాదేవుండు+అగు= దేవతలలో పెద్దవాడైన; ఆ బ్రహ్మ= ఆ బ్రహ్మదేవుడు; అసమర్థునిన్+పోలెన్= ఏమి చేయలేనివాడై; అకృత+అర్థము+మన్యమాన= నెరవేరని కోరికను తలచుకుంటున్న; మనస్కుఁడు+ఐ= మనస్సు కలవాడై; సృజింపన్= సృష్టి చేయడానికి; ఉద్యమించు= ప్రయత్నిస్తున్న; తఱిన్= సమయంలో; తపంబు= తపస్సు; ఆచరించుము+అని= చేయుమని; నాచేతన్= నా ఆజ్ఞచేత; బోధితుండు+ఐ= ప్రబోధితుడై; ఘోరంబు+ఐన= మిక్కిలి కష్టతరమైన; తపంబు= తపస్సు; ఆచరించి= చేసి; తొలుత= ముందుగా; సృష్టికర్తృత్వమున్= సృష్టి కార్యక్రమాన్ని; వహించిన= నిర్వహించిన; మిమ్మున్= మీ వంటి ప్రజాపతులను; సృజించెన్= పుట్టించాడు; అంతన్= ఆ తరువాత; పంచజనుండు+అను= పంచజనుడు అనే పేరు కలిగిన; ప్రజాపతి= ప్రజాపాలకుని యొక్క; తనూజ+అగు= కుమార్తె అయిన; అసిక్ని; అనుపేరిటన్= అనే పేరుతో; వినుతిన్= కీర్తిని; ఒందియున్న= పొందిన; ఈ+కన్యకను= ఈ పడుచును; నీకున్+ఇచ్చితిన్= నీకు అనుగ్రహించాను; దీనిన్= ఈమెను; పత్ని+కాన్= భార్యగా; కైకొని= స్వీకరించి; మిథునవ్యవాయ= సంసార సంబంధ దాంపత్య; ధర్మంబున్= ధర్మాన్ని; కలవాఁడవై= కలిగినవాడుగా; మిథునవ్యవాయ= దాపంత్య విషయంలో; ధర్మంబుగల= ఆసక్తివున్న; ఈనాతి+అందున్= ఈ స్త్రీ యందు; ప్రజాసర్గంబున్= ప్రజాసృష్టికార్యాన్ని; అతివిపులంబు+కన్= చాల విస్తృతంగా; కావింపన్+కలవాఁడవు= చేయగలవాడవు; మఱియున్= ఇంకా; నీకున్+పిదప= నీ తరువాతకూడ; ఇదే క్రమంబునన్= ఇదే వరుసలోనే; నిఖిల ప్రజలును= సమస్త జనులు; మత్+మాయామోహితులు+అయి= నామాయచేత మోహింపబడినవారై; మిథునవ్యవాయ= సంసార విషయకమైన; ధర్మంబునన్= ధర్మంతో; ప్రజావృద్ధిన్= మానవ సృష్టిని; ఒందించి= చేసి; మద్+ఆరాధనపరులై= నాయొక్క సేవాపరులై; ఉండన్+కలవారు= ఉండగలరు; అని పల్కి= అని చెప్పి; విశ్వభావనుండు+ఐన= సకల లోకపోషకుడైన; హరి= శ్రీమహావిష్ణువు;

స్వప్న+ఉపలబ్ధ+అర్థంబునున్+పోలెన్= కలలో కనబడిన రూపంలోవలె; అంతర్ధానంబున్+ఒందెన్= మాయమయ్యాడు; అప్పుడు= ఆ తర్వాత; దక్షుండు= దక్ష ప్రజాపతి; విష్ణుమాయ= వైష్ణవ సంబంధ మాయచే; ఉపబృంహితుండు+ఐ= వృద్ధిపొందినవాడై; పాంచజని+అగు= పంచజనని కుమార్తె ఐన; అసిక్ని+అందున్= అసిక్ని వలన; హర్యశ్వ= హర్యశ్వులు అనే; సంజ్ఞలన్= పేరులతో; వినుతిన్= కీర్తి; చెందియున్న= కలిగి ఉన్న; అయుత= పదివేల; సంఖ్యా పరిగణితులైన= సంఖ్యాబలం కల; పుత్రులన్+కాంచెన్= కుమారులను కన్నాడు; అప్పుడు= ఆ తరువాత; ఆ+ధర్మశీలురు+ఐన= ఆ ధర్మబద్ధులైన; దాక్షాయణులు= దక్షుని కుమారులు; పితృనిర్దేశంబునన్= తండ్రి ఆజ్ఞచే; ప్రజాసర్గంబు కొఱకున్= ప్రజాసృష్టి కోసం; తపంబు= తపస్సు; చేయువారు+ఐ= చేయాలనుకొన్నవారై; పశ్చిమదిశకున్+చని= పడమటి దిక్కుకు వెళ్ళి; అచ్చట= అక్కడ; సింధు సముద్ర సంగమంబునన్= సింధునది సముద్ర సంగమ ప్రదేశంలో; సమస్త= సర్వ; దేవముని= దేవర్షులు; సిద్ధగణ= సిద్ధుల సమూహంతో; సేవితంబు+ఐ= పూజింపబడుతూ; దర్శనమాత్రంబునన్= కేవలం చూచినంతటనే; నిర్ధూత= పోగొట్టుకోబడిన; కల్మషులను= పాపము కలవారుగా; నిర్మలచిత్తులన్= పవిత్ర మనస్కులుగా; చేయుచున్న= చేస్తున్న; నారాయణ సరస్సు; అనన్+పరcగు= అనే పేరు కలిగిన; తీర్థరాజంబునన్= శ్రేష్ఠమైన తీర్థ జలంలో; అవగాహనంబున్+చేసి= స్నానం చేసి; నిర్మల+అంతరంగులు+ఐ= స్వచ్ఛమైన మనస్సుకలవారై; పరమహంస ధర్మంబున్+అందున్= పరబ్రహ్మ తత్త్వమునందు; ఉత్పన్నమతులు+ఐ= బుద్ధికలవారై; ప్రజాసర్గంబు కొఱకున్= మానవ సృష్టికోసం; తండ్రి= తమ తండ్రియొక్క; అనుమతంబునన్= ఆజ్ఞ మేరకు; ఉగ్రతపంబు= ఘోరమైన తపస్సు; చేయుచున్+ఉండన్= చేస్తుండగా; వారికడకున్= వారి వద్దకు; నారదుండు= నారదమహర్షి; వచ్చి= అరుగుదెంచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఇంకా చెబుతాను విను. బ్రహ్మ, రుద్రుడు, ప్రజాపతులు, మనువులు, ఇంద్రాదులు వీరందరూ నా అంశకు చెందినవారే. వేదచోదితమైన సంధ్యావందనాదులు నా మనస్సు. జపధ్యానాదులు నాశరీరం. ధ్యానధారణాది మానవకార్యాలు నా ఆకారం. యోగాదులు అవయవాలు. ధర్మం నా ఆత్మ. దేవతాగణాలు జీవములు. వేదం నా స్వరూపం. సృష్టిపూర్వం నేను మాత్రమే ఉన్నాను. శాశ్వతుడైన నా నుండి సంకల్ప మాత్రాన ఈ బ్రహ్మాండం, బ్రహ్మ తమకు తాముగా పుట్టారు. నా తేజస్సును కలిగి ఉన్న బ్రహ్మ క్రియారహితుడై ఉన్నప్పుడు నాచే ప్రేరితుడై ఘోరతపస్సు చేశాడు. తదనంతరం నా సంకల్పంతో ప్రజాసృష్టి చేయగల మిమ్మల్ని సృష్టించాడు.

ప్రజాపతులలో ఒకడైన పంచజనుని కుమార్తె ఐన అసిక్నిని నీకు భార్యగా అనుగ్రహించాను. గృహస్థ ధర్మాన్ని పాటించి మీరు అత్యధిక ప్రజలను సృష్టించండి. నీ సంతానం కూడా నాచే ప్రభావితులై సృష్టిని పెంపొందిస్తారు అని ఆదేశించి మాయమయ్యాడు. అప్పుడు దక్షుడు స్వామి ఆజ్ఞమేరకు అసిక్నితో కూడి పదివేలమంది హర్యశ్వులకు జన్మనిచ్చాడు. వారు తండ్రి ఆజ్ఞమేరకు ప్రజాసృష్టికోసం తపస్సు చేయడానికి సింధునది సముద్రసంగమ ప్రాంతమైన విశిష్ట పుణ్యతీర్థమైన నారాయణసరస్సునుచేరి అందు స్నానం చేసి పవిత్ర మనస్కులై తపస్సు ప్రారంభించారు. ఆ సమయంలో వారి వద్దకు నారదుడు వచ్చి ఇలా అన్నాడు.

**సీ. మీ రతిమూఢులు మీcదటిగతి గాన రెన్నంగc బసిబిడ్డ లన్నలార!**
**పుడమిc దా నింతని కడ పరికింపరు ప్రజలc బుట్టించ నే ప్రతిభ కలదు?**
**అట్లైన నొక్క మహాత్ముcడు పురుషుండు బహురూపములు గల భామ యొకతె**
**పుంశ్చలీ భర్తయుc బురణింప నుభయప్రవాహంబు గల నది వఱలc గదల**

**ఆ. నంచ యొకటి యిరువదైదింటి మహిమలఁ, గలిగియుండు తెరువు గానరాక**
**వజ్రనిబిడ మగుచు వరుసఁ దనంతన, తిరుగు, రాష్ట్రబిలము దేటపడఁగ. 225**

**ప్రతి :** అన్నలార= ఓ సోదరులారా! మీరు= మీరందరూ; పసిబిడ్డలు= ఏమి తెలియని చిన్నపిల్లలు; అతిమూఢులు= బుద్ధి ఏమాత్రం లేనివారు; ఎన్నంగన్= ఆలోచించగా; మీఁదటిగతిన్= భవిష్యత్తులో జరిగే విషయాన్ని; కానరు= గ్రహించలేరు; పుడమిన్= ఈ భూమి; తాన్+ఇంత+అని= అది ఇంత పరిమాణంలో ఉంటుందని; కడన్= హద్దును; పరికింపరు= చూడలేరు; ప్రజలన్= మానవులను; పుట్టించన్= కనడానికి; ఏ ప్రతిభ= ఏ శక్తి; కలదు= ఉంది? అట్లు+ఐనన్= అలాగైతే; ఒక్క మహాత్ముఁడు= గొప్పవాడైన ఒక; పురుషుండు= పరమపురుషుడు; బహురూపములు గల= వివిధ ఆకారాలు కలిగిన; భామ= స్త్రీ (ప్రకృతి); ఒకతె= ఒకామె ఉంది; పుంశ్చలీ= పురుషుని లోబరచుకోగలిగే ఆ స్త్రీ, భర్తయున్= ఆ పురుషుడు; పురణింపన్= కలుసుకోగా; ఉభయ ప్రవాహంబు గల= రెండువైపుల ప్రవాహ సామర్థ్యం గల; నది; వఱలన్= ప్రవహిస్తూ ఉంటూ; కదలన్= చలిస్తూ ఉండగా; అంచ ఒకటి= ఒక హంస; ఇరువది+ఐదింటి మహిమలన్= ఇరవై అయిదు మహిమలను; కలిగి ఉండున్= కలిగి ఉంటుంది; తెరువు కానరాక= బయటపడే మార్గం తెలియక; వజ్రనిబిడము+అగుచున్= వజ్రంలా గట్టిదైన; తేటపడన్+కన్= స్పష్టపడగా; రాష్ట్రబిలము= ఆ దేశమనే సుడిగుండంలో; తనంతనన్= తనకు తాను; వరుసన్= క్రమంగా; తిరుగున్= సంచరిస్తూ ఉంటుంది.

**తా :** నాయనలారా! మీరు మిక్కిలి మూఢులుగా కన్పిస్తున్నారు. మీ భవిష్యత్తును విచారించుకొనలేకున్నారు. మీరు పసిబిడ్డలు. ఈ భూమి పరిమాణమెంతో తెలియనివారు. ఇక జీవులను ఏ విధంగా సృష్టించగలరు? సర్వాంతర్యామియైన ఆత్మస్వరూపుడు పురుషుడు ఒక డున్నాడు. స్త్రీరూపిణియై అనేక రూపాలు ధరించిన ప్రకృతి ఒకటున్నది. మాయలమారి అయిన ఆ ప్రకృతి పురుషుణ్ణి లోబరచుకుంటుంది. ప్రకృతీ పురుషుడూ కలిసి సంసార ప్రవాహాన్ని సాగిస్తారు. ఈ సంసారమనే నది రెండువైపులనుండీ ప్రవహిస్తూ ఉంటుంది. ఆ ప్రవాహాన్ని అనుసరించి ఒక హంస విహరిస్తూ ఉంటుంది. ఆ హంసకు ఇరవై అయిదు మహిమ లుంటాయి. అయినప్పటికీ ఆ హంస సరియైన మార్గం కానరాక వజ్రంవలె దిట్టమై మెరుస్తున్న జలప్రవాహం పడే గోతిచుట్టూ తిరుగుతుంటుంది. ఆ గోతిలో పడితే మళ్లీ బయటపడటమంటూ లేదు.

**విశే :** ఇక్కడ హంస అనేది జీవాత్మకు ప్రతీక. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, తన్మాత్రాదిగా గల కాళ్ళు, చేతులు, వాక్కు, మల, మూత్ర అవయవాలు అయిదూ కర్మేంద్రియాలు. చెవి, కన్ను, చర్మం, ముక్కు, నాలుక అనే అయిదూ జ్ఞానేంద్రియాలు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు అయిదూ తన్మాత్రలు. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే అయిదూ పంచభూతాలు. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే నాలుగింటినీ అంతఃకరణ చతుష్టయం అంటారు. వీటన్నింటికీ మూలమైన శక్తి ఆత్మ. ఈ ఇరవై అయిదు రూపాల సామర్థ్యం, ఐహిక సుఖలోలత్వం కలిగి ఉండి, బయటపడే మార్గం అనగా ముక్తిమార్గం తెలియక పోవడమే సుడిగుండంలో పడటం. దానిని దాటి ముక్తిని పొందే మార్గాన్ని తెలుసుకోవాలనేదే నారదుని ఉపదేశం.

**క. వినుఁ డందుల యనురూపము నను వొందఁగ నెఱుఁగ కాత్మ నాత్మగురూక్తిం**
**గొనసాగించెద మను మిమ్మున నేమియు లేదు మూఢు లని తెలిసి తగన్. 226**

**ప్రతి :** వినుఁడు= నేను చెప్పేది వినండి; అందుల= దానికి; అనురూపమున్= అనుగుణంగా; అనువు+ఒందఁగన్= సరిపడునట్లుగా; ఆత్మన్= బుద్ధిరీత్యా; ఎఱుఁగక= తెలుసుకోలేక; ఆత్మగురు+ఉక్తిన్= మీ తండ్రియొక్క మాటను; కొనసాగించెదము+అను= ఆచరిస్తాము అనే; మూఢులు+అని= మీరు అజ్ఞానులని; తెలిసి తగన్= బాగా తెలిసినందున...

**తా :** హరిదశ్వులారా! వినండి. ఈ సంగతులను గుర్తించండి. ఇందుకు తగ్గట్టుగా ప్రవర్తించండి. ఈ సృష్టి రహస్యాన్ని ఏ మాత్రమూ తెలుసుకోకుండా కేవలం మీ తండ్రిగారి ఆజ్ఞలను కొనసాగించటానికి పూనుకొన్నారు. అటువంటి మిమ్ములను ఇంత తెలివి తక్కువ వాళ్లను ఏమనాలి?

**వ. అని నారదుండు బోధించిన హర్యశ్వులు సహజబుద్ధిచేత నారదవాక్యంబులను దమలో నిట్లని వితర్కించిరి. 227**

**ప్రతి :** అని= తండ్రిమాట పాటిస్తున్నారని; నారదుండు= నారద మహర్షి; బోధించినన్= వివరించగా; హర్యశ్వులు= ఆ హర్యశ్వులనే వారు; సహజ బుద్ధిచేతన్= తమ సొంతబుద్ధితో; నారదవాక్యంబులను= నారదుడు చెప్పిన మాటలను; తమలోన్= తమలో తాము; ఇట్లు+అని= ఇలా అని; వితర్కించిరి= ఆలోచించుకున్నారు.

**తా :** ఈ విధంగా నారదుడు చెప్పిన విషయాన్ని హర్యశ్వులు తమ విచక్షణ బుద్ధితో తమలో తాము ఇలా చర్చించుకున్నారు.

**తే. సొరిది క్షేత్రజ్ఞుఁడన నతిసూక్ష్మబుద్ధి నరయ నజ్ఞానబంధనం బగుచు లింగ**
**దేహమున నెద్ది గల దది దెలియకున్నఁ గలదె? మోక్షంబు దుష్కర్మగతులచేత. 228**

**ప్రతి :** సొరిది= క్రమంగా; క్షేత్రజ్ఞుఁడు+అనన్= క్షేత్రజ్ఞుడు అనగా ఎవరో; అతి సూక్ష్మబుద్ధిన్= మిక్కిలి వివేచనతో; అరయన్= తెలుసుకోగా; అజ్ఞాన బంధనంబు+అగుచున్= అజ్ఞానంతో కట్టివేసే; లింగదేహముననన్= సూక్ష్మదేహంలో; ఎద్ది+కలదు= ఏది ఉందో (తెలియాలి); అది+తెలియకున్నన్= ఆ విషయం తెలియకపోతే; దుష్కర్మ గతులచేతన్= చెడ్డపనులవలన; మోక్షంబు= ముక్తి; కలదే= ఉందా?, దొరుకుతుందా?

**తా :** ముందుగా చక్కగా ఆలోచించి క్షేత్రజ్ఞుడు అనగా ఏమిటి? అజ్ఞాన సంబంధమైన లింగదేహం అనగా ఏది? అనే విషయాలు ముందుగా తెలుసుకోవాలి. అవేవీ తెలుసుకోకుండా కేవలం పనికిరాని పనులు చేసిన కారాణంగా ముక్తి లభించదు.

**తే. కలఁడు జగదేకసన్నుతకారణుండు స్వామి భగవంతుఁ డభవుండు స్వాశ్రయుండు**
**పరముఁ డాతనిఁ జూడక బ్రహ్మకైనఁ గలుగునే? ముక్తిపదము దుష్కర్మగతుల. 229**

**ప్రతి :** జగత్+ఏక= లోకమంతటికి ముఖ్యమై; సన్నుత కారణుండు= పూజింపదగినవాడు; స్వామి= ప్రభువు; భగవంతుఁడు= షడ్గుణైశ్వర్యయుక్తుడు; అభవుండు= జన్మ అనేది లేనివాడు; స్వ+ఆశ్రయిండు= తనకు తానే ఆధారమైన వాడు; పరముఁడు= సర్వశ్రేష్ఠుడు; కలఁడు= ఉన్నాడు; ఆతనిన్+చూడక= అలాంటి వాడిని దర్శించకుండా; బ్రహ్మకున్+ఐనన్= బ్రహ్మదేవునికి కూడా; దుష్కర్మగతులన్= వేరే చెడు ప్రయత్నాలతో; ముక్తిపదము= కైవల్యం; కలుగునే= కలుగుతుందా?

**తా :** ఈ సమస్త లోకాలకూ మూలకారణమైన భగవంతు డొక డున్నాడు. ఆయన సర్వేశ్వరుడు. పుట్టుక లేనివాడు. ఆత్మాశ్రయుడు. పురుషోత్తముడు. అటువంటి అంతర్యామి అయిన స్వామిని దర్శింపకున్నచో బ్రహ్మదేవునికైనా మోక్షం లభించదు.

**ఆ. పురుషుఁ డెట్టులేని పూని బిలస్వర్గగతుఁడు వోలె వర్తకంబు మాను**
**నట్టి బ్రహ్మ మెఱుఁగు నయ్యకు స్వర్భోగకర్మగతుల నేమి కానఁబడును? 230**

**ప్రతి :** పురుషుఁడు= జీవుడు; ఎట్టులేనిన్= ఏ విధంగానైనా; పూని= ప్రయత్నించి; బిలస్వర్గగతుఁడున్+పోలెన్= పాతాళమనే స్వర్గంలోకి వెళ్లేవాడిగా; వర్తకంబున్= ప్రవర్తనను; మానున్= విరమిస్తాడు; అట్టి= ఆ విధమైన; బ్రహ్మమున్= పరబ్రహ్మాన్ని; ఎఱుఁగున్= తెలుసుకునే; అయ్యకున్= పురుషుడికి; స్వర్భోగ= స్వర్గ సుఖాలు కలిగించే; కర్మగతులన్= క్రియా విశేషాలచే; ఏమికానన్+పడును= ఏమి కనిపిస్తుంది?

**తా :** జీవుడు సంసారమనే కూపాన్ని స్వర్గంగా భావిస్తాడు. దాని నుండి బయటపడకుండా పరబ్రహ్మాన్ని గుర్తించటం సాధ్యం కాదు. కర్మలను చేయడంవలన స్వర్గసౌఖ్యాలు లభిస్తాయి. కానీ కైవల్యం లభించదు.

**శా. తన్నిష్ఠాగతి లేనివారికి నసత్కర్మ ప్రచారంబుచే**
**మున్నేమయ్యెడి నాత్మబుద్ధి గుణసమ్మోహంబునం దోఁచుచున్**
**వన్నెల్ వెట్టుక వింతబాగుల తఱిన్ వర్తించు దౌర్గుణ్య సం**
**పన్న స్త్రీయునుబోలె నెల్లగతులం బ్రఖ్యాతమై యుండఁగన్ 231**

**ప్రతి :** వన్నెల్+పెట్టుక= పలురంగులు కలిగి; వింతబాగులన్= విచిత్రమార్గాలతో; తఱిన్= సమయాన్ని; వర్తించు= గడిపే; దౌర్గుణ్య= దుర్గుణాలతో; సంపన్న= కూడిన; స్త్రీయునున్+పోలెన్= స్త్రీ మాదిరిగా; ఎల్లగతులన్= అన్ని విధాలా; ప్రఖ్యాతమై= ప్రసిద్ధమై; ఉండన్+కన్= ఉండగా; తత్= ఆ పరబ్రహ్మమందు; నిష్ఠాగతి= స్థిరబుద్ధి; లేనివారికిన్= కుదరని వారికి; అసత్+కర్మ= పాపపు పనుల; ప్రచారంబుచేన్= వ్యాప్తివలన; మున్ను= ముందు ఉన్నటువంటి; ఆత్మబుద్ధి= తన జ్ఞాన విశేషం; గుణ సమ్మోహంబునన్= మంచి గుణాలనే వ్యామోహబుద్ధిని; తోఁచుచున్= కలిగిస్తూ; ఏమి+అయ్యెడిన్= ఏమవుతుంది?

**తా :** సామాన్య జీవునికి మోక్షంపై ఆసక్తి కలగడం, భగవంతునియందు ఆసక్తి ఏర్పడటం చాలా కష్టం. జీవుడు మెరమెచ్చులవంటి ఐహికసుఖాలకై పాటుపడుతూ బాధపడుతూ ఉంటాడు. అలాంటి చంచలమైన మనస్సు కల్గిన వారికి మోక్షపదవి దూరం.

**సీ. అనువొంద సృష్టి నవ్యయముగఁ జేయుచుఁ బ్రచురప్రవాహసంపతితమైన**
**నెఱయఁ గూలం బను నిర్గమస్థానంబు నందు వేగముగల క్రందు మాయఁ**
**గదలి యహంకారగతివశంబునఁ జాల వివశుఁ డై బోధకు విపరి యైన**
**వానికి నీరీతి వలవంత కర్మప్రచారంబులను మీఁదఁ జక్కనైన**

**ఆ. జన్మ మరణ ముఖ్య జాడ్యంబుతోఁ బాసి, యఖిలసౌఖ్యపదవి నరసి కర్మ**
**మార్గ మైన యట్టి మహనీయధామంబు, చిత్త మార నెట్లు చేరఁగలఁడు! 232**

**ప్రతి :** అనువు+ఒందన్= అనుకూలతను పొంది; సృష్టిన్= సంతానవృద్ధిని; అవ్యయము+కన్= ఎడతెరపి లేకుండా; చేయుచున్= కలిగిస్తూ; ప్రచుర= తీవ్రమైన; ప్రవాహ= ప్రవాహంలో; సంపతితము+ఐనన్= పడిపోతే; నెఱయన్= ఆశించిన, నిండైన; కూలంబు+అను= ఒడ్డు అనే; నిర్గమస్థానంబున్+అందున్= గమ్యస్థానమునందు; వేగము గల= ఉధృతి కలిగిన; క్రందు మాయన్= ఉపద్రవం కలిగించే మోహంలో; కదలి= తిరుగాడుతూ; అహంకార= నేను అనే; గతి వశంబునన్= విపరీత భావనతో; చాల వివశుఁడై= మిక్కిలి కలత పొందినవాడై; బోధకున్= ఆత్మప్రబోధానికి; విపరి+ఐన=

వ్యతిరేకంగా ఉండే; వానికిన్= వానికి; ఈ రీతిన్= ఈ విధంగా; వలవంత= దుఃఖపూరితమైన; కర్మ ప్రచారంబులను= చెడ్డపనుల ఆచరణలవలన; మీదన్= అటు పిమ్మట; చక్కనైన= తగినవైన; జన్మమరణ= పుట్టుక, చావులనే; ముఖ్యజాడ్యంబుతోన్= ప్రధాన వ్యాధి నుండి; పాసి= బయటపడి; అఖిల= సమస్తమైన; సౌఖ్యపదవిన్= సుఖాలు కలిగించే స్థానాన్ని; అరసి= ఆలోచించి చూడగా; కర్మమార్గము+ఐన+అట్టి= సుకృత కర్మ ఫలమైన; మహనీయధామంబున్= అత్యుత్తమ మోక్షపదవిని; చిత్తము+ఆరన్= మనస్సు సంతోషపడే విధంగా; ఎట్లు= ఎలా; చేరగలఁడు= అందుకోగలడు?

**తా :** అనుకూలత కల్పించుకొని జీవుడు ఐహికసుఖాలలో తేలుతూ ప్రజాసృష్టి మీదుమిక్కిలిగా చేస్తూ ఆ సంసార ప్రవాహంలో కొట్టుకుంటూ అవతలి గట్టును చూచికూడా చేరలేడు. నేను అనే అహంకారం అతణ్ణి జ్ఞానానికి దూరంచేసి, చెడ్డపనులు చేయిస్తుంది. జననమరణాలనే ఈ లంపటంలో చిక్కుకున్న జీవుడు శాశ్వతసౌఖ్యం అందించే మోక్షపదవిని ఎలా అందుకోగలడు?

**తే.** **దాని సంసర్గగుణములు దప్పి నడచు కుచ్చితపు భార్యఁ జేకొన్న కుమతివోలె**
**తివిరి సుఖదుఃఖములఁగూడి తిరుగు జీవరూప మెఱుఁగనివారికిఁ బ్రాపు గలదె? 233**

**ప్రతి :** దాని సంసర్గగుణములున్= భార్యకు సంబంధించిన (ఉండవలసిన) గుణాలను; తప్పి= విడిచిపెట్టి; నడచు= ప్రవర్తించే; కుచ్చితముభార్యన్= చెడు ప్రవర్తన గల స్త్రీని భార్యగా; చేకొన్న= గ్రహించిన; కుమతిన్+పోలెన్= దుర్బుద్ధి గల పురుషునివలె; తివిరి= ప్రయత్నించి; సుఖదుఃఖములన్+కూడి= సుఖదుఃఖాలలో తేలుతూ; తిరుగు= సంచరించే; జీవరూపము= తన స్వస్వరూపం; ఎఱుఁగనివారికిన్= గుర్తించనివారికి; ప్రాపు+కలదే= రక్షణ ఉంటుందా?

**తా :** తన సహజ లక్షణాలు విడిచి, వక్రమార్గంలో నడిచే స్త్రీని పెళ్ళాడిన తెలివిమాలిన భర్తవలె, ఐహికసుఖాలలో దుఃఖాలలో మునిగి తేలుతూ సంచరించే జీవుడు తన నిజ స్వరూపమైన పరమాత్మను తెలుసుకోలేక దుఃఖపడుతూ రక్షణ పొందలేడు.

**మత్తకోకిల.**

**పంచవింశతితత్త్వరాశి కపారదర్పణ మయ్యుఁ దాఁ**
**గొంచెమై పురుషుండు తత్త్వముఁగోరి పట్టఁగ నేర కే**
**మంచుఁ గించుఁ దలంచువార లమార్గకర్మము సేయఁగా**
**మంచిలోకము వారి కేటికి మానుగా సమకూరెడిన్? 234**

**ప్రతి :** పంచవింశతి= ఇరవై ఐదు అయిన; తత్త్వరాశికిన్= తత్త్వ సమూహానికి; అపార దర్పణము+అయ్యున్= గొప్ప అద్దంవంటిది అయినా కూడా; తాన్+కొంచెము+ఐ= ఆ పరతత్త్వం సూక్ష్మమై; పురుషుండు= జీవుడు; తత్త్వమున్=+కోరి= పరతత్త్వాన్ని తెలుసుకోవాలని; పట్టన్+కన్+నేరక= ప్రయత్నం చేయలేక; ఏమి+అంచున్= ఏది అని; కించున్= అల్పంగా; తలంచువారలు= ఆలోచించువారు; అమార్గకర్మము= చేయకూడని, పనులను; చేయన్+కాన్= నిర్వర్తించగా; మంచిలోకము= ఉత్తమగతి; వారికిన్= అటువంటి వారికి; ఏటికిన్= ఎందుకు; మానుగా= సులభంగా; సమకూరెడిన్?= లభిస్తుంది?

**తా :** 25 తత్త్వాలకు స్పష్టమైన అద్దం వంటిది పరతత్త్వం. వీటిని వ్యతిరేకంగా ఉపయోగించి చెడుమార్గాలలో వెళ్ళే పురుషుడు ఆ సూక్ష్మతత్త్వాన్ని తెలుసుకోలేక పోతే అలాంటి వానికి ఉత్తమగతి ఎందుకు లభిస్తుంది?

**విశే :** పంచ వింశతి తత్త్వరాశి అనగా జీవుని శరీరంలో ఉండి అతనికి ప్రాణశక్తిని కలిగించి, అతడిని కార్యోన్ముఖుడిని చేసేవి. అవి 1) ఐదు జ్ఞానేంద్రియాలు 2) ఐదు కర్మేంద్రియాలు 3) ఐదు తన్మాత్రలు 4) పంచభూతములు 5) మనసు, చిత్తం, బుద్ధి, అహంకారం, పురుషుడు. వీటికి లొంగినవాడు అధోగతిని, లేదా వీటికి తట్టుకొని దీటుగా నిలబడినవాడు సద్గతిని పొందుతారు.

**క.** **బంధానుమోక్షణక్రమసంధానైశ్వర్యధుర్యశాస్త్రసమగ్ర**
**గ్రంథంబు మాను చిద్రూపాంధునకు నకర్మగతుల నగునే శుభముల్.** **235**

**ప్రతి :** బంధ= సంసార బంధం; అనుమోక్షణ= దానినుండి విముక్తి; క్రమ= పద్ధతియొక్క; సంధాన= కలయికతో; ఐశ్వర్య= ఈశ్వర సంబంధమైన; ధుర్య= శ్రేష్ఠమైన; శాస్త్ర= విద్య అనే; సమగ్ర= సంపూర్ణమైన; గ్రంథంబున్= విషయాన్ని; మాను= తెలుసుకోలేని; చిత్+రూప= చైతన్యరూపం; అంధునకున్= చూడలేని గుడ్డి వానికి; అకర్మగతులన్= చెడ్డపనులు చేయుట కారణంగా; శుభముల్= క్షేమములు; అగునే= కలుగుతాయా?

**తా :** సంసార బంధానికి కారణం, దానినుండి విముక్తి పొందే మార్గం అనే ఈ రెండింటికి సంబంధించిన పరిపూర్ణ శాస్త్రజ్ఞానం లేక కర్మమార్గంలో పడి కొట్టుకునే వాడికి పరతత్త్వాన్ని దర్శించే ఉత్తమగతి ఎలా కలుగుతుంది?

**మత్తకోకిల.**

**చూడ నీ జగమంతయున్ వెసఁ జుట్టి పుట్టుక లీల నే**
**జోడులేక రయంబునం గుడి చుట్టినట్టి స్వతంత్రముం**
**గూడి యుండిన కాలచక్రముఁ గోరిచూడని వారి కే**
**జాడఁ గల్గు నకర్మసంగతిఁ జారుమోక్షపదం బిలన్?** **236**

**ప్రతి :** చూడన్= పరిశీలించగా; ఈ జగము+అంతయున్= ఈ లోకమంతా; వెసన్+చుట్టి= వేగంగా చుట్టుకొని; పుట్టుక లీలన్= కలిగి తిరుగుతూ; ఏ జోడులేక= ఎలాంటి తోడూలేక; రయంబునన్= వేగంగా; గుడిచుట్టిన+అట్టి= గుండ్రంగా తిరుగుతూ; స్వతంత్రమున్= తన ఇష్టానుసారం; కూడి+ఉండిన= తిరిగే; కాలచక్రమున్= కాలమనే చక్రమును; కోరి= మనస్సు కలిగి; చూడనివారికిన్= వివేచన చేయనివారికి; అకర్మసంగతిన్= చెడ్డపనుల ఫలితం వలన; చారుమోక్ష పదంబు= సుందరమైన కైవల్యం; ఇలన్= ఈ భూలోకంలో; ఏజాడన్+కల్గున్= ఏ విధంగా లభిస్తుంది?

**తా :** ఈ కాలచక్రం చాలా శక్తిమంతమైనది. ఈ సమస్త జగత్తునూ చుట్టచుట్టి పట్టుకొని సున్న చుట్టి మటుమాయం చేసే కిటుకులు దానికి తెలుసు. అటువంటి కాలస్వరూపాన్ని తెలుసుకోకుండా ఊరకే కర్మలు చేస్తూ కూర్చుంటే వానికి అక్షయమైన మోక్షపదం ఎట్లా దక్కుతుంది?

**ఆ.** **జన్మహేతువైన జనకునిర్దేశంబు తనకుఁ జేయ రాని దనుచుఁ దెలిసి**
**గుణమయప్రవృత్తి ఘోరాధ్వనిశ్వాసనిరతుఁ డగుచుఁ జేయ నేరఁ డతఁడు.** **237**

**ప్రతి :** జన్మహేతువు+ఐన= తమ పుట్టుకకు కారణమైన; జనకు= తండ్రియొక్క; నిర్దేశంబు= ఆజ్ఞ; తనకున్= ఆ తండ్రికి; చేయరానిది+అనుచున్= చేయకూడని పని అంటూ; తెలిసి= గ్రహించి; గుణమయ= త్రిగుణ సహితమైన; ప్రవృత్తి=

సృష్టికార్యమనే; ఘోర+అధ్వ= భయంకర మార్గంయొక్క; నిశ్వాస= నిట్టూర్పు; నిరతుఁడు+అగుచున్= కలిగినవాడై; చేయనేరఁడు+ అతఁడు= ఆ పని చేయడానికి అతడు ఇష్టపడడు.

**తా :** ఈ సృష్టికార్యాన్ని మనతండ్రి అయిన దక్షప్రజాపతికి ఆయన తండ్రి బ్రహ్మదేవుడు అప్పగించాడు. అతి భయంకరమైన ప్రవృత్తి మార్గాన్ని అవలంబించటం ఇష్టం లేక మన తండ్రి ఆ పని చేయలేదు.

**విశే :** పితృాజ్ఞ ఉల్లంఘించరానిదైనా అది శ్రేయాదాయకం కానప్పుడు ఉల్లంఘించడం దోషం కాదనేది ఇక్కడి ధర్మసూక్ష్మం.

**వ. అని తనలో వితర్కించి యా కుమారు లప్పుడు- 238**

**ప్రతి :** అని= అలా అని; తనలో= వారిలో వారు; వితర్కించి= ఆలోచించుకొని; ఆ కుమారులు+అప్పుడు= ఆ దక్షపుత్రులు ఆ తరువాత.

**తా :** ఇలా వారిలో వారు ఆలోచించుకొని ఆ తరువాత

**సీ. వినవయ్య! భూపాల! మునివరేణ్యునిమాట లనువొందఁ దలపోసి వినయ మలర**
**వలగొని యతనికి వందనం బొనరించి తిరిగి యెన్నఁడు రాని తెరువు వట్టి**
**చయ్యన నేగిరి సహజస్వరబ్రహ్మ మయమైన పంకజనయను పాద**
**పద్మమరందంబు పానంబు సేయుచు మత్తిల్లి నిలిచిన మానసాళి**

**తే. పరిణమింప విష్ణుఁ బాడుచుఁ దత్కీర్తి, సరణిమ్రోయు మహతి సంఘటించి**
**నారదుండు గుణవిశారదుం డెందేనిఁ జనియె జగము దన్ను సన్నుతింప. 239**

**ప్రతి :** భూపాల= ఓ పరీక్షిన్మహారాజా!; వినవయ్య; మునివరేణ్యుని మాటలు= మునిశ్రేష్ఠుడైన నారదుని యొక్క పలుకులు; అనువు+ఒందన్= అనుకూలంగా; తలపోసి= ఆలోచించి; వినయము+అలరన్= నమ్రత పెంపొందగా; అతనికి వలగొని= నారదునికి ప్రదక్షిణం చేసి; వందనంబు+ఒనరించి= నమస్కరించి; తిరిగి+ఎన్నఁడురాని= మళ్లీ ఎప్పుడూ తిరిగిరాని; తెరువున్+పట్టి= మార్గాన్ని అనుసరించి; చయ్యనన్+ఏగిరి= వెనువెంటనే వెళ్ళారు; సహజ= సహజమైన; స్వరబ్రహ్మమయము+ఐన= నాదబ్రహ్మ స్వరూపమైన; పంకజనయను= పద్మాక్షుడైన విష్ణువుయొక్క; పాదపద్మ= పాదాలనే పద్మాలలోని; మరందంబున్= తేనెను; పానంబు+చేయుచున్= తాగుతూ; మత్తిల్లి= తన్మయమై; నిలిచిన= ఉన్న; మానస+అళి= మనస్సనే తుమ్మెద; పరిణమింపన్= పరిపక్వత పొందగా; విష్ణున్+పాడుచున్= నారాయణుణ్ణి కీర్తిస్తూ; తద్+కీర్తిన్= ఆ స్వామి ప్రశంసను; సరణిన్= వరుసగా; మ్రోయు= మోగుతున్న; మహతిన్= మహతి అనే వీణను; సంఘటించి= మీటుతూ; గుణవిశారదుండు= సద్గుణశ్రేష్ఠుడైన; నారదుండు= నారదమహర్షి; జగము= లోకం; తన్ను= తనను; సన్నుతింపన్= పొగడుతుండగా; ఎందు+ఏనిన్= తనకు నచ్చిన చోటికి; చనియెన్= వెళ్ళిపోయాడు.

**తా :** ఓ మహారాజా! ఇంకా చెబుతున్నా విను. నారద ప్రబోధం వల్ల నివృత్తిమార్గాన్ని అనుసరించిన దక్షుని కుమారులు తమకు ప్రబోధించిన నారదునికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి ఉత్తమగతులవైపు వెళ్లారు. అంత నారదుడు కూడ విష్ణు పాదారవిందాలలోని తేనెను ఆస్వాదించే మనస్సుతో తన మహతి అనే వీణను మీటుతూ గానం చేసుకుంటూ తనకు నచ్చిన చోటికి వెళ్ళిపోయాడు.

**క. అప్పుడు దక్షుఁడు తనయులు దప్పి మహాపథము గనుట తగ నారదుఁడే**
**చెప్పినఁ గప్పిన శోకము ముప్పిరిగొని చిత్తవృత్తి మూరింబోవన్. 240**

**ప్రతి :** అప్పుడు= ఆ సందర్భంలో; దక్షుఁడు= దక్షప్రజాపతియొక్క; తనయులు= కుమారులు; తప్పి= తన ఆజ్ఞను కాదని వెళ్లడం; మహాపథమున్= నివృత్తి మార్గాన్ని; కనుట= తెలుసుకోవడం; తగన్= వివరంగా; నారదుఁడే= స్వయంగా నారదుడే; చెప్పినన్= చెప్పగా (విని); కప్పిన= కమ్ముకొన్న; శోకము= దుఃఖం; ముప్పిరిగొని= ముప్పేటలుగా పెనవేసి; చిత్తవృత్తి= తన మనస్సు; మూరిన్+పోవన్= మిక్కిలి బాధపడగా...

**తా :** నారదమహర్షి దక్షప్రజాపతి దగ్గరికి వెళ్లి, ఆయన కుమారులు తండ్రిమాట కాదని నివృత్తి మార్గాన్ని అనుసరించి వెళ్లారని చెప్పగా విని, దక్షుడు దుఃఖం పొంగిపొరలగా మనస్సులో చాల బాధపడ్డాడు.

**చ. అడలుచు నున్న వచ్చి కమలాసనుఁ డూఱడిలంగఁబల్కె మున్**
**పడసిన లీలఁ బుత్రుల నపారగుణాఢ్యులఁ గాంచుమన్న నా**
**పడఁతుక వల్లఁగ్రమ్మఱను బల్వురఁ దా శబళాశ్వసంజ్ఞలం**
**బెడఁగగు వారి పుణ్యములఁ బేర్చినవారి సహస్రసంఖ్యలన్. 241**

**ప్రతి :** అడలుచున్+ఉన్న= దుఃఖిస్తున్న దక్షుని వద్దకు; కమల+ఆసనుఁడు= బ్రహ్మ; వచ్చి= సాక్షాత్కరించి; ఊరడిలంగన్= ఓదార్పు పొందేటట్లు; పల్కెన్= చెప్పాడు; మున్+పడసినలీలన్= ఇంతకు ముందు పొందిన విధంగానే; పుత్రులన్= కుమారులను; అపార గుణ+ఆఢ్యులన్= సాటిలేని గుణవంతులను; కాంచుము+అన్నన్= పొందుమని చెప్పగా; ఆ పడఁతుక వల్లన్= తన భార్య అయిన ఆ అసిక్నియందు; క్రమ్మఱను= తిరిగి మరల; పల్వురన్= చాలామందిని; తాన్= ఆ దక్షుడు; శబళాశ్వ సంజ్ఞలన్= శబళాశ్వులు అనే పేరుగల వారిని; బెడఁగగు వారిన్= సౌందర్యవంతులైన వారిని; పుణ్యములన్+పేర్చినవారిన్= పుణ్యమూర్తులైన వారిని; సహస్ర సంఖ్యలన్= వేలమందిని...

**తా :** ఆ విధంగా బాధపడుతున్న దక్షుని వద్దకు బ్రహ్మ వచ్చి ఓదార్చి, తిరిగి సంతాన వృద్ధి చేయమని ఆదేశించగా, దక్షుడు తన భార్య అసిక్ని ద్వారా సౌందర్యవంతులు, సకలగుణసంపన్నులూ అయిన అనేక వేలమంది శబళాశ్వులు అనే పేరు గలవారికి జన్మనిచ్చాడు.

**క. పుట్టించిన జనకుని మదిఁ బుట్టిన తలఁపెఱిఁగి వారు పూనిక ప్రజలం**
**బుట్టించు వ్రతము గై కొని గట్టిగఁ దప మాచరింపఁగాఁ జనిరి వెసన్. 242**

**ప్రతి :** పుట్టించినన్= తమను పుట్టింపగా; జనకుని= తండ్రియొక్క; మదిన్+పుట్టిన= మనసులో కలిగిన; తలఁపు+ఎఱిఁగి= ఉద్దేశాన్ని గ్రహించి; వారు= ఆ శబలాశ్వులు; పూనికన్= ప్రయత్నంతో; ప్రజలన్= ప్రజాసమూహాన్ని; పుట్టించు= ఉద్భవింపజేసే; వ్రతమున్+కైకొని= దీక్షను పూని; గట్టిగన్= తీవ్రంగా; తపమున్= తపస్సును; ఆచరింపఁగాన్= చేయడానికి; వెసన్= వేగంగా; చనిరి= వెళ్ళారు.

**తా :** తమకు జన్మనిచ్చిన తండ్రి కోరికను గ్రహించి ఆ కోరికను నెరవేర్చడానికి ఆ శబలాశ్వులు తపస్సు చేయడానికి వేంటనే వెళ్ళారు.

**వ. ఇట్లు శబళాశ్వులు ప్రజాసర్గంబు కొరకుఁ దండ్రి పంపునం దపంబు సేయువారై యే తీర్థంబు తీర్థరాజంబై సకలతీర్థఫలంబులు నాలోకనమాత్రంబున ననుగ్రహించుచు సకలపాపంబుల నిగ్రహించు, నే తీర్థప్రభావంబున నగ్రజన్ములు ఫలసిద్ధిం బొందుదు, రట్టి నారాయణ సరస్సను పుణ్యతీర్థంబునకుం జని, తదుపస్పర్శమాత్రంబున నిర్ధూతమలాశయులై, 243**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; శబళాశ్వులు; ప్రజాసర్గంబు కొరకున్= ప్రజాసృష్టి కోసం; తండ్రి పంపునన్= తమ జనకుని ఆజ్ఞమేరకు; తపంబున్+చేయువారై= తపస్సును చేయడంకోసమై; ఏ తీర్థంబు= ఏ పుణ్యతీర్థం; తీర్థరాజంబు+ఐ= పరమపావనమైన తీర్థమైనదో; సకల తీర్థ= పుణ్యతీర్థాలన్నిటి; ఫలంబు= పుణ్య ఫలితాన్ని; ఆలోకన మాత్రంబునన్= చూసినంత మాత్రాననే; అనుగ్రహించుచున్= ప్రసాదిస్తూ; సకల పాపంబులన్= అన్ని రకాల పాపాలనూ; నిగ్రహించున్= పోగొడుతుందో; ఏ తీర్థ ప్రభావంబునన్= ఏ పుణ్యతీర్థంయొక్క మహిమచేత; అగ్రజన్ములు= బ్రాహ్మణులు; ఫలసిద్ధిన్= ఫలప్రాప్తిని; పొందుదురు= పొందుతారో; అట్టి= అటువంటి; నారాయణ సరస్సు+అను= పుణ్యప్రదమైన నారాయణ సరస్సు అనే; పుణ్యతీర్థంబునకున్= పవిత్ర తీర్థానికి; చని= వెళ్ళి; తద్= ఆ తీర్థాన్ని; ఉపస్పర్శ మాత్రంబునన్= తాకినంతనే; నిర్ధూత= పోగొట్టబడిన; మల+ఆశయులై= మాలిన్యం కలవారై...

**తా :** ఈ విధంగా ఆ శబలాశ్వులు తండ్రి ఆజ్ఞమేరకు ప్రజాసృష్టి చేయడానికి తపస్సు చేయాలని నిశ్చయించుకొన్నారు. ఏ పుణ్యతీర్థం అన్ని తీర్థాల పుణ్యఫలాన్ని ఇస్తుందో, ఏ పుణ్యతీర్థాన్ని చూసినంతనే పాపాలన్నీ పటాపంచలౌతాయో అటువంటి నారాయణ తీర్థం అనే సరస్సు దగ్గరకు వెళ్ళి అక్కడ నీటిని స్పృశించినంత మాత్రంచేతనే తమ మాలిన్యాన్ని పోగొట్టుకొని

**శా. బ్రహ్మేంద్రాదులు నందనేరని పరబ్రహ్మంబుఁ జింతింపుచున్**
**బ్రహ్మానందముఁబొంది జిహ్వికలపై బ్రహ్మణ్యమంత్రంబు స**
**ద్బ్రహ్మాలోకనవాంఛతో నిలుపుచున్ బ్రహ్మం బితం డంచు మున్**
**బ్రహ్మజ్ఞానగురున్ హరిం దపమునం బాటించి ర బ్బాలకుల్. 244**

**ప్రతి :** ఆ+బాలకుల్= ఆ శబలాశ్వులనే బాలురు; బ్రహ్మ+ఇంద్ర+ఆదులున్= బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన వారు కూడా; అందన్+నేరని= అందుకోలేని; పరబ్రహ్మంబున్= పరతత్త్వాన్ని; చింతింపుచున్= మననం చేసుకుంటూ; బ్రహ్మ+ఆనదమున్= శాశ్వతమైన ఆనందాన్ని; పొంది= అనుభవించి; జిహ్వికలపై= నాలుకలపై; బ్రహ్మణ్యమంత్రంబున్= పరబ్రహ్మ యొక్క మంత్రాన్ని; సద్+బ్రహ్మ+ఆలోకన= ఆ పరబ్రహ్మాన్ని చూడాలనే; వాంఛతోన్= కోరికతో; నిలుపుచున్= మనస్సును పరబ్రహ్మంపై ఉంచుతూ; బ్రహ్మంబు= మూలస్వరూపమైన పరబ్రహ్మం; ఇతండు= ఇతడే; అంచున్= అనుకొంటూ; మున్= ఆది; బ్రహ్మజ్ఞాన గురున్= పరతత్త్వజ్ఞానానికి మూలమైన; హరిన్= శ్రీమన్నారాయణుణ్ణి; తపమునన్= తపోధ్యానంలో; పాటించిరి= స్మరించారు.

**తా :** ఆ శబలాశ్వులు బ్రహ్మాది దేవతలకు సాధ్యం కాని పరబ్రహ్మాన్ని సంపూర్ణంగా అనుభవిస్తూ, పరమాత్మ సంబంధమైన మూలమంత్రాన్ని జపిస్తూ, ఆ మూలపురుషుణ్ణి చూడాలనే కుతూహలంతో సమస్తం పరబ్రహ్మ స్వరూపంగా భావించి తపస్సు చేశారు.

సీ. ఏకపాదాంగుష్ఠ మిలమీఁద సవరించి నిశ్చలకాయులై నిక్కి నిలిచి
కరములు గీలించి సరవి మీఁదికి నెత్తి గుఱుతుగాఁ బెనుబయల్ గుట్టి పట్టి
నిడివిగాఁ గ్రూరమై నిగిడిన చూడ్కులఁ గడు తీవ్రభానునిఁ బొదివిపట్టి
వడిఁ గొంతకాలంబు వాయువు భక్షించి యంతనుండియు నిరాహారు లగుచు

తే. సకలలోకములకు సంహారకరమును బేర్చి దేవతలకు భీతికరముఁ
గాఁగ ఘోరతపముఁ గావింపఁ దొడఁగిరి, మహితచిత్తు లక్కుమారవరులు, 245

**ప్రతి :** ఆ+కుమారవరులు= ఆ శబలాశ్వులనే కుమారశ్రేష్ఠులు; మహితచిత్తులు= స్థిరమైన మనస్సు కలిగిన వారై; ఏకపాద= ఒంటికాలి; అంగుష్ఠము= బొటనవ్రేలిని; ఇలమీఁదన్= నేలమీద; సవరించి= కుదురుగా ఉంచి; నిశ్చలకాయులు+ఐ= ఏ మాత్రం కదలనివారై; నిక్కి నిలిచి= నిటారుగా నిలబడి; కరములున్+కీలించి= చేతులను జోడించి; సరవి మీఁదికిన్+ఎత్తి= నిటారుగా పైకి లేపి; గుఱుతుగాన్= స్ఫుటంగా; పెనుబయల్ గుట్టిపట్టి= దిక్కులు చూడకుండా (ఏకాగ్రతతో); నిడివిగాన్= సూటిగా; క్రూరమై= తీక్ష్ణమై; నిగిడిన= ప్రసరించిన; చూడ్కులన్= చూపులతో; కదుతీవ్ర= మిక్కిలి తాపం కలిగించే; భానునిన్= సూర్యుని; పొదివిపట్టి= గట్టిగా బంధించి; వడిన్= వేగంగా; కొంతకాలంబు= కొన్ని సంవత్సరాలు; వాయువున్= గాలిని; భక్షించి= ఆహారంగా తీసుకొని; అంత నుండియు= అటు పిమ్మటనుండి; నిరాహారులు+అగుచున్= ఎటువంటి ఆహారం తీసుకోకుండా; సకల లోకములకున్= సమస్త ప్రపంచాన్ని; సంహారకరమునున్+పేర్చి= నాశనం చేయగలిగే స్థాయిని కలిగి; దేవతలకున్= వేల్పులకు కూడా; భీతికరమున్+కాఁగన్= భయం కలిగించే విధంగా; ఘోరతపమున్= తీవ్రమైన తపస్సును; కావింపన్+తొడఁగిరి= చేయసాగారు;

**తా :** ఆ దక్షపుత్రులు స్థిరబుద్ధితో ఒంటికాలిబొటన వేలిపై నిలబడి చేతులు పైకెత్తి జోడించి చూపులతో తీక్ష్ణమైన సూర్యుడిని చూస్తూ, కొంతకాలం గాలిని ఆహారంగా తీసుకుంటూ, కొంతకాలం ఏ ఆహారమూ లేకుండా సమస్త లోకాలకూ, దేవతలకూ భయం కలిగే విధంగా ఘోరతపస్సు చేశారు.

### ❖ నారదుండు శబలాశ్వులకు నివృత్తి మార్గంబు నుపదేశించుట ❖

**వ. ఇట్లతిభయంకరంబైన తపంబు సేయుచు, నెడతెగక భగవన్మంత్రంబుల నొడువుచుఁ, బ్రజాసర్గ కాములై యున్న యచ్చిన్ని బాలుర కడకు నారదుండు సనుదెంచి, పూర్వవిధంబునం బలుకుచు నిట్లనియె; భ్రాతృవత్సలులై యున్న మీరలు వేదాంతసారంబు వలుకుచున్న నా వచనంబు లాదరించి తోఁబుట్టువులు సనిన మార్గంబునఁ జనుండు; ఎవ్వఁడేనియుఁ దన యగ్రజులు గన్న మార్గంబునం దానునుం దప్పక వర్తించు, నట్టివానిని విశేషధర్మం బెఱింగిన వాఁడంద్రు; సతతంబును బుణ్యబంధువులైన దేవతలంగూడి సుఖం బుండుండని పల్కి నారదుండు సనియె. వారలు సర్వకర్మంబులయందు నిర్మోహితులై పరమ పదంబునకు నాస్పదంబులైన దేవర్షివాక్యంబుల నాశ్రయించి. 246**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; అతి భయంకరంబు+ఐన= మిక్కిలి ఘోరమైన; తపంబున్+చేయుచున్= తపస్సును చేస్తూ; ఎడతెగక= అవధి లేకుండా, ఆగకుండా; భగవత్+మంత్రంబులన్= నారాయణ మంత్రాలను; ఒడువుచున్= ఉచ్చరిస్తూ;

ప్రజాసర్గకాములై= మానవ సృష్టియందు ఆసక్తులై; ఉన్న= ఉన్నటువంటి; ఆ+చిన్నిబాలుర కడకున్= ఆ చిన్నవారి వద్దకు; నారదుండు= నారదమహర్షి; చనుదెంచి= వచ్చి; పూర్వవిధంబునన్= ఇదివరకటిమాదిరిగానే; పలుకుచున్= మాట్లాడుతూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; భాతృవత్సలులై+ఉన్న= సోదరప్రేమ కలిగిన; మీరలు= మీరు; వేదాంతసారంబున్= ఉపనిషదర్థాన్ని; పలుకుచున్న= చెబుతున్న; నా వచనంబులు= నా పలుకులు; ఆదరించి= చక్కగా విని; తోఁబుట్టువులు= మీ అన్నలు; చనిన= వెళ్ళిన; మార్గంబునన్= దారిలో; చనుండు= వెళ్ళండి; ఎవ్వఁడు+ఏనియున్= ఎవడైనా కూడా; తన+అగ్రజులు= వాని అన్నలు; కన్న మార్గంబునన్= వెళ్ళిన దారిలోనే; తానునున్= అతడు కూడా (చిన్నవాడు కూడా); తప్పక= తప్పనిసరిగా; వర్తించున్= వెళతాడో; అట్టివానిన్= అలాంటి వానిని; విశేషధర్మంబు= విశిష్టమైన ధర్మమార్గం; ఎఱింగినవాఁడు+అంద్రు= తెలిసినవాడని అంటారు; సతతంబును= ఎల్లప్పుడూ; పుణ్యబంధువులైన= పుణ్యానుకూలురైన; దేవతలన్+కూడి= వేల్పులను చేరి; సుఖంబున్+ఉండుడు= క్షేమంగా ఉండండి; అని పల్కి= అని చెప్పి; నారదుండు+చనియెన్= నారదమహర్షి వెళ్ళిపోయాడు; వారలు= ఆ శబలాశ్వులు; సర్వకర్మంబులు+అందున్= సకల ఐహిక కార్యాలలో; నిర్మోహితులై= విరాగులై; పరమ పదంబునకున్= కైవల్యానికి; ఆస్పదంబులు+ఐన= ఆధారాలైన; దేవర్షి= నారదునియొక్క; వాక్యంబులన్= మాటలను; ఆశ్రయించి= ఆదరించి...

**తా :** ఈ విధంగా ఘోరతపస్సు చేస్తున్న శబలాశ్వులను మోక్షపథగాములుగా చేయడానికి నారదుడు ఇదివరకటిలాగే వచ్చి వారికి ధర్మబోధ చేశాడు. 'మీ అన్నలు ఏ మార్గాన్ని ఆశ్రయించి ముక్తిని పొందారో మీరు ఆ మార్గాన్నే ఆశ్రయించవలసి ఉంది. ఎవ్వడైనా సోదరులు చూపిన మార్గాన్ని అనుసరించి వెళ్లేవాడే విశేషజ్ఞుడు అని పెద్ద లంటారు. అందువల్ల ఆ మార్గంలోనే మీరు ప్రవర్తించి ఎల్లవేళలా దేవతలతో కలిసి స్వర్గంలో సుఖంగా ఉండండి' అని చెప్పి వెళ్ళిపోయాడు. నారదుని మాటలను నమ్మిన శబలాశ్వులు విరాగులై

**ఉ. అప్పుడు లజ్జతోడ శబలాశ్వులు పూర్వజు లేగినట్టి యా**
**చొప్పున నెన్నఁడుం దిరిగి చూడని త్రోవ విశేషపద్ధతిం**
**దప్పక పోయిరయ్య! గుణధాములు, నేఁడును మళ్ళరేమి నేఁ**
**జెప్పెదఁ గాక రాక కడఁజేరిన రాత్రులఁబోలి భూవరా. 247**

**ప్రతి :** గుణధాములు= మంచి గుణవంతులైన; శబల+ఆశ్వులు= ఆ శబలుడు, అశ్వుడు; అప్పుడు= ఆ సమయంలో; లజ్జతోడన్= సిగ్గుపడి; పూర్వజులు+ఏగినట్టి= అన్నలు వెళ్ళిన; ఆ+చొప్పునన్= ఆ విధంగానే; ఎన్నఁడున్= ఎప్పటికి; తిరిగి చూడని= పునరావృత్తి లేని; త్రోవన్= మార్గాన్ని; విశేష పద్ధతిన్= ప్రత్యేక మార్గంలో; తప్పక= తిన్నగా; పోయిరి+అయ్య= వెళ్లారు; భూవరా= ఓ మహరాజా; నేన్+చెప్పెదన్+కాక= నేను చెబుతున్నాను; రాక= పున్నమినాటి రాత్రి; కడన్+చేరిన= గతించిన= తరువాత; రాత్రులన్+పోలి= కృష్ణపక్ష రాత్రుల మాదిరిగా; నేఁడును= ఇప్పటిదాక; మళ్ళరు+ఏమి= తిరిగి రాలేదు కదా?

**తా :** ఓ రాజా! నేను చెప్పేది విను. మంచి గుణవంతులైన ఆ శబలాశ్వులు ఇంతవరకు ఆచరించిన ఐహిక కర్మలకు సిగ్గుపడి, తమ అన్నలు వెళ్ళిన మోక్షమార్గాన్ని అనుసరించి పున్నమినాటి రాత్రి గతించిన తరువాత చంద్రకళలు క్రమంగా క్షీణించిన విధంగా కర్మ క్షయాన్ని పొంది వారు మోక్షాన్ని చేరుకున్నారు.

**క. దక్షున కా కాలంబున లక్షిత మై యుండెఁ బెక్కు లాగుల నుత్పా**
**త క్షోభంబులు వానికి రూక్షవ్యథ నొంది యా పురుషనాశమునున్. 248**

**ప్రతి :** దక్షునకున్= దక్షప్రజాపతికి; ఆ కాలంబునన్= ఆ సమయంలోనే; పెక్కులాగులన్= అనేక విధాలుగా; ఉత్పాత క్షోభంబులు= చెడు ఉపద్రవాల బాధలు; లక్షితమై+ఉండెన్= అనుభవానికి వచ్చాయి; వానికిన్= ఆ శకునాలకు; రూక్షవ్యథన్+ పొంది= క్రూరమైన బాధ కలిగి; ఆ పురుష నాశమునున్= ఆ పుత్రులు తనకు దూరం కావడానికి...

**తా :** అదే సమయంలో దక్షునికి అనేక విధాలైన దుశ్శకునాలు గోచరించాయి. ఆయన మనస్సు అధికమైన వ్యథతో క్షోభించింది. తన పుత్రులు గతించడానికి కారణం

**క. నారదకృత మని యెఱిఁగి మహా రోషముతోడ నేగి యాతనిఁ గని దుః**
**ఖారూఢచిత్తుఁడై మది నూఱడిలం దెరువు లేక యుగ్రుం డగుచున్. 249**

**ప్రతి :** నారదకృతము+అని= నారదుడు చేసిన పనే అని; ఎఱిఁగి= గ్రహించి; మహారోషము తోడన్= పట్టరాని కోపంతో; ఏగి= వెళ్ళి; ఆతనిన్+కని= నారదుని చూచి; దుఃఖ+ఆరూఢచిత్తుఁడై= బాధతో నిండిన హృదయం కలవాడై; మదిన్+ఊఱడిలన్= మనసు ఊరట చెందుటకు; తెరువు లేక= మార్గం లేక; ఉగ్రుండు+అగునున్= కోపావేశుడై...

**తా :** నారదుని కారణంగానే ఇలా జరిగిందని గ్రహించిన దక్షుడు మిక్కిలి కోపంతో అతని వద్దకు వెళ్ళి ఆపలేని బాధకు గురైనవాడై మిక్కిలి ఆగ్రహంతో

**తే. మోము జేవుఱింప ముడివడ బొమదోయి చూపువెంట మంట సుడిగొనంగఁ**
**బెదవు లదరఁ బండ్లు పెటపెటఁ గొఱుకుచు దక్షుఁ డాగ్రహించి తపసిఁ బలికె. 250**

**ప్రతి :** మోము= ముఖం; జేవురింపన్= కోపంతో ఎర్రబడగా; బొమదోయి= రెండు కనుబొమలు; ముడివడన్= దగ్గరకు ముడిపడునట్లుకాగా; చూపువెంటన్= కళ్ళవెంబడి; మంట= నిప్పులు; సుడిగొనన్+కన్= చెలరేగగా; పెదవులు+అదరన్= (కోపంతో) పెదవులు వణకుతుండగా; పండ్లు= దంతాలు; పెటపెటన్+కొఱుకుచున్= పటపట కొరుకుతూ; దక్షుఁడు= దక్షప్రజాపతి; ఆగ్రహించి= కోపించి; తపసిన్= నారదునితో; పలికెన్= ఇలా అన్నాడు.

**తా :** దక్ష ప్రజాపతికి మిక్కిలి కోపంతో ముఖం ఎర్రబడింది, కనుబొమలు ముడివడినాయి. కన్నులలో నిప్పులు రేగాయి. పెదవులు అదిరాయి. పండ్లు పటపట కొరుకుతూ నారదునితో ఇలా అన్నాడు.

**చ. నెరయఁగ సాధురూపమున నీ వతిబాలుర కాత్మజాళికిం**
**గఱకున భిక్షుమార్గ మగు కందువ సెప్పితి వేల? ధూర్తవై**
**మఱుఁగక యుండవచ్చునె? కుమారుల నీ దురితంబు వొంద, ని**
**న్నొఱలఁగఁ ద్రోతు నాదు సమదోగ్రమహాగ్రహశాపవహ్నులన్. 251**

**ప్రతి :** నెరయన్+కన్= నిండుగా; సాధు రూపమునన్= సాత్త్విక రూపంతో (ముని వేషంతో ఉండి); నీవు= నువ్వు; అతి బాలురకున్= చిన్నపిల్లలైన; ఆత్మజ+ఆళికిన్= నా కుమారుల సమూహానికి; కఱకునన్= కఠిన స్వభావంతో; ధూర్తవు+ఐ=

వంచకుడవై; భిక్షుమార్గము+అగు= సన్యాసులకు సహజమార్గమైన; కందువన్= జాడను; చెప్పితివి+ఏల= ఎందుకు ఉపదేశించావు; కుమారులన్= నా బిడ్డలను; ఈ+దురితంబు+పొందన్= ఈ దుస్థితిని పొందినందుకుగాను; మఱుఁగకన్+ఉండవచ్చును+ఎ= బాధపడకుండా ఉండగలనా?; నిన్నున్= ఇటువంటి నిన్ను; నాదు= నా యొక్క; సమద+ఉగ్ర= మిక్కిలి తీవ్రమైన; మహా+ఆగ్రహ= తీవ్ర కోపంతో కూడిన; శాపవహ్నులన్= శాపమనే అగ్నులయందు; ఒఱలంగన్= విలపించే విధంగా; త్రోతున్ (త్రోచుదును)= పడవేస్తాను.

**తా :** పరమసాధువులాగా ఉంటూ ధూర్తుడవై చిన్నపిల్లలైన నా పుత్రులకు సన్యాసమార్గాన్ని బోధించావు. నా కుమారులు ఈ దుస్థితి పొందగా నేను బాధపడకుండ ఉండగలనా? ఇందుకు కారణమైన దుష్టుడవగు నిన్ను నా శాపాగ్నిజ్వాలలో పడదోసి బాధిస్తాను.

## ✤ దక్షుండు నారదుని శపియించి ప్రజాసర్గం బొనరించుట ✤

**వ.** **అది యెట్లంటేని, దేవర్షి పితృ ఋణంబులు దీర్చక అమీమాంసిత కర్మంబులు గల బాలురకు బుద్ధిఁ జెఱిచి వారలకు నుభయ లోకంబుల శ్రేయోహాని నొనర్చితివి. ఇట్టి పాతకంబున భాగవతోత్తములలో లజ్జాహీనుండవై యశోహానిం బొంది చరింపుదువు గాక! నిరపరాధులై వైరంబులేని నా పుత్త్రుల పట్ల ద్రోహకృత్యం బొనర్చిన నీవు తప్పఁ దక్కిన భాగవతోత్తములు సకల భూతానుగ్రహ పరవశులు. అతి కుతూహలంబున నీ చేత స్నేహపాశ నికృంతనం బైన మిత్రభేదంబె కాని తదుపశమనంబు గాకుండెడు. ఇంతనుండియుఁ బురుషుండు విషయ తీక్ష్ణత్వంబు లనుభవింపక కాని తెలియ కుండెడు. జ్ఞానంబు తనంతనె కాని యొరులచే బోధింపఁబడి తెలియరాకుండెడి. నిరంతరంబును లోకసంచారియైన నీకు నే లోకంబున నునికిపట్టు లేకుండుఁ గాక అని నిర్దయుండై శాపం బిచ్చె. అంత నారదుండు త ద్క్రోధవాక్యంబుల కలుగక యట్ల కానిమ్మని సమ్మతించి చనియె. ఇట్టి శాంతభావం బెవ్వనివలనం గలుగు, నతండు సర్వాతీతుండై సర్వేశ్వరుం డనంబడు.**

**మఱియు, దక్షుండు తన మనోరథంబు విఫలం బగుటం జేసి యతి దుఃఖిత మనస్కుండై పొగులుచున్న పితామహుండు చనుదెంచి, మఱియుఁ బ్రజాసర్గోపాయం బుపదేశించిన, నా ప్రజాపతి ప్రియభామ యైన యసిక్నియందుఁ బితృ వత్సల లైన పుత్రికల నఱువదుండ్రం బుట్టించి వారిలో ధర్మునకుం బదువురను, గశ్యపునకుం బదుముగ్గురను, జంద్రునకు నిరువదేడ్గురను; భూతునకు, నాంగిరసునకుఁ, గృశాశ్వునకు నిద్దరేసి చొప్పున నార్గురును, తార్క్ష్యుఁడను నామాంతరము దాల్చిన కశ్యపునకు మరలఁ గడమ నల్గుర న్నీ క్రమంబున నిచ్చె. వారి నామంబు లాకర్ణింపుము.** **252**

**ప్రతి :** అది= ఆ శాపం; ఎట్లు+అంటివి+ఏని= ఏ విధంగా అన్నట్లయితే; దేవ+ఋషి, పితృ ఋణంబులు= దేవఋణం ఋషిఋణం పితృదేవతల ఋణాలను; తీర్చక= తీర్చకుండగా; అమీమాంసిత= విచారింపబడని; కర్మంబులు కల= విధ్యుక్త కర్మములుకల; బాలురకున్= పిల్లలకు; బుద్ధిన్= బుద్ధిని; చెఱిచి= పాడుచేసి; వారలకున్= ఆ బాలురకు; ఉభయలోకంబులన్= ఇహలోకంలోను, పరలోకంలోను; శ్రేయః+హానిన్= శ్రేయస్సుకి భంగాన్ని; ఒనర్చితివి= కలిగించావు; ఇట్లు= ఈ విధంగా చేసిన; ఈపాతకంబునన్= ఈ పాపంచేత; భాగవత+ఉత్తములలోన్= ఉత్తములైన భగవద్భక్తులయందు;

లజ్జాహీనుండవు+ఐ= సిగ్గులేనివాడవై; యశః+హానిన్+పొంది= కీర్తిని కోల్పోయి; చరింపుదువుగాక= తిరుగుదువుగాక!; నిరపరాధులు+ఐ= తప్పులు లేనివారయి; వైరంబులేని= నీయెడల శత్రుత్వంలేని; నా పుత్రులపట్ల= నా కొడుకులయెడల; ద్రోహకృత్యంబు= కీడు; ఒనర్చిన= చేసిన; నీవుతప్పన్= నీవు మినహా; తక్కిన= మిగిలిన; భాగవతోత్తములు= భగవద్భక్తులతో శ్రేష్ఠులయిన; భూత= ప్రాణులయెడల; అనుగ్రహ= దయ చూపించుటయందు; పరవశులు= లగ్నమైన మనస్సుకలవారు; అతికుతూహలంబునన్= అధికమైన ఆసక్తివలన; నీచేత; స్నేహపాశ= మైత్రి అనే త్రాటిని; నికృంతనంబు+ఐన= త్రెంచే; మిత్రభేదంబు+ఎ+కాని= మిత్రులకు విరోధమేకాని; తద్+ఉపశమనంబు= మిత్రుల విరోధం శాంతించుట; కాకుండెడున్= కాకుండుగాక; ఇంతనుండియున్= ఇప్పటినుండీ; పురుషుండు= జీవుడు; విషయ= ఇంద్రియభోగాల; తీక్ష్ణత్వంబులు= తీవ్రతలను; అనుభవింపకకాని= అనుభవించకుండగ; తెలియకుండెడున్= తెలిసికొనలేకపోవునుగాక; జ్ఞానంబు= జ్ఞానం; తనంతన్+ఎ+కాని= స్వయంగానే తప్ప; ఒరులచేన్= ఇతరులచేత; బోధింపబడి= తెలుపబడి; తెలియరాకుండెడిన్= తెలియకుండుగాక; నిరంతరంబును= ఎల్లప్పుడూ; లోకసంచారివి+ఐన నీకున్= లోకాలలో సంచరించే నీకు; ఏ లోకంబునన్= ఏ లోకంలోను; ఉనికిపట్టు= నివాసస్థానం; లేకుండుగాక= లేకపోవునుగాక; అని= ఈ విధంగా; నిర్దయుండై= దయలేనివాడై; శాపంబు+ఇచ్చె= శపించాడు; అంతన్= అప్పుడు; నారదుండు= నారదుడు; తత్+క్రోధవాక్యంబులకున్= ఆ దక్షునియొక్క కోపపు మాటలకు; అలుగక= కోపగించుకొనక; అట్లు+అ+కానిమ్ము+అని= ఆ విధంగానే జరుగనిమ్ము అని; సమ్మతించి= దక్షశాపాన్ని అంగీకరించి; చనియెన్= వెళ్ళాడు; ఇట్టి శాంతభావంబు= ఈ విధమైన శాంతస్వభావం; ఎవ్వనివలనన్= ఎవనికి; కలుగున్= ఉండునో; అతండు= ఆ వ్యక్తి; సర్వ+అతీతుండు+ఐ= అన్నిటిని అతిక్రమించినవాడై; సర్వేశ్వరుడు= సమస్తాన్ని శాసించగలవాడని; అనంబడును= చెప్పబడును.

మఱియున్= ఇంకను; దక్షుండు= దక్షుడు; తన= తనయొక్క; మనోరథంబు= కోరిక; విఫలంబు+అగుటన్+చేసి= వ్యర్థమగుటవలన; అతిదుఃఖితమనస్కుండు+ఐ= మిక్కిలి దుఃఖించిన మనస్సు కలవాడై; పొగులుచున్+ఉన్నన్= బాధపడుతుండగా; పితామహుండు= బ్రహ్మ; చనుదెంచి= వచ్చి; మఱియున్= మరొకమారు; ప్రజాసర్గ+ఉపాయంబున్= ప్రజలను సృష్టించుటకు మార్గాన్ని; ఉపదేశించినన్= తెలుపగా; ఆ ప్రజాపతి= ఆ దక్షప్రజాపతి; ప్రియభామయైన= ప్రియమైన భార్యయగు; అసిక్నియందున్= అసిక్నియందు; పితృవత్సలలు+ఐన= తండ్రియందు ప్రేమకల; పుత్రికలన్= కూతుళ్ళను; అఱువదుండ్రన్= అరవై మందిని; పుట్టించి; వారిలో= ఆ అరవైమంది కూతుళ్ళలో; పదువురను= పదిమందిని; ధర్మునకున్= ధర్మునకు; పదుముగ్గురను= పదమూడుమందిని; కశ్యపునకున్= కశ్యపునకు; ఇరువదేడ్గురను= ఇరవై ఏడుమందిని; చంద్రునకు; ఇద్దరేసిచొప్పున ఒక్కొక్కరికి ఇద్దరు చొప్పున; ఆర్గురను= ఆర్గురు కూతుళ్ళను; భూతునకున్= భూతుడనే వానికి; అంగిరసునకున్= అంగిరసుడనే వానికి; కృశాశ్వునకున్= కృశాశ్వుడనే వానికి; మరలన్= మరొకమారు; కడమ నల్గురన్= చివరి నలుగురు కూతుళ్ళను; తార్క్ష్యుడను నామాంతరము+తాల్చిన= తార్క్ష్యుడనే మరొక పేరుకూడ కలిగిన; కశ్యపునకు; ఈక్రమంబున= ఇదే వరుసలో; ఇచ్చెన్= ఇచ్చాడు; వారి నామంబులు= ఆ కూతుళ్ళ పేర్లను; ఆకర్ణింపుము= విను.

**తా :** అది ఎలాగంటే – వీరు బాలురు. దేవఋషి పితృఋణాలు తీర్చుకోలేదు. ఏ కర్మలను చేయలేదు. కర్మల అనిత్యత్వాన్ని వీరెరుగరు. అటువంటి చిన్నపిల్లల బుద్ధిని తప్పుత్రోవ పట్టించి వారిని ఈ లోకంలోను, పరలోకంలోను కూడా శ్రేయస్సు పొందకుండగా చేశావు. నీవు చేసిన ఈ పాపంవలన భగవద్భక్తులందరిలోను సిగ్గులేని వాడవై అపకీర్తి పాలవుతావు. నా పుత్రులు నిరపరాధులు. నీపైనవారికి శత్రుత్వం లేదు. అటువంటివారికి ద్రోహం చేశావు. నీవు తప్ప

మిగిలిన భాగవతోత్తములందరూ ప్రాణులపట్ల అనుగ్రహం కలవారే. నీవు చాలా ఆసక్తిగా మిత్రులమధ్య ఉన్న స్నేహబంధాన్ని ఛేదిస్తావు. నీవలన మిత్రులమధ్య విరోధం ఏర్పడుతుంది. శత్రుత్వాలు నీవలన శాంతింపవు. ఇకపైన ఎవరికీకూడా విషయసుఖాలు అనుభవించకుండా అవి దుఃఖహేతువులనే విషయం తెలియదు. జ్ఞానం స్వయంగా కలుగుతుందేతప్ప నీబోటివాళ్ళు చెప్పినంతమాత్రాన కలుగదు. నీవు నిరంతరం లోకాలన్నీ తిరుగుతూనే ఉంటావు. నీకెక్కడా నివాసస్థానమంటూ ఉండదు అని దక్షుడు నిర్దయగా నారదుణ్ణి శపించాడు. అయినా నారదుడు కోపగించుకోలేదు. ఆ శాపాన్ని అంగీకరించాడు. అటువంటి శాంతస్వభావం ఉంటే ఏ వ్యక్తి అయినా అన్ని ద్వంద్వాలకూ అతీతుడయి సర్వేశ్వరుడనబడతాడు కదా!

దక్షుడు ప్రజలను సృష్టించాలనే తన కోరిక తీరకపోవడం చేత చాలా దుఃఖపడ్డాడు. అపుడు బ్రహ్మ వచ్చి సృష్టికి ఉపాయం చెప్పాడు. దక్షుడు తన భార్యయైన అసిక్నియందు అరవైమంది కూతుళ్ళను కన్నాడు. వారిలో పదిమందిని ధర్ముడికిచ్చాడు. పదుముగ్గురిని కశ్యపుడికిచ్చాడు. ఇరవైయేడుగురిని చంద్రుడి కిచ్చాడు. భూతుడి కిద్దరిని, ఆంగిరసుడి కిద్దరిని, కృశాశ్వుడి కిద్దరిని ఇచ్చాడు. చివరి నల్గురిని తార్క్ష్యుడనే పేరుకల కశ్యపుడి కిచ్చాడు. పైన చెప్పిన వరుసలోనే కూతుళ్ళనిచ్చాడు. ఆ కూతుళ్ళ పేర్లు విను.

**విశే :** ప్రతి వ్యక్తి పుడుతూనే మూడు ఋణాలతో పుడతాడు. అవి దేవఋణం, ఋషిఋణం, పితృఋణం.

**దేవఋణం :** దేవతలు వర్షాలు కురిపించి తద్వారా మనకాహారాన్ని సమకూరుస్తున్నారు. అందుకు మనం వారికి ఋణపడి ఉన్నాం. ఆ ఋణం తీర్చుకొనే ఉపాయం ఏమిటంటే యజ్ఞాలు చేసి మనం ఇచ్చే ఆహుతులద్వారా వారిని సంతోషపరచడమే.

**ఋషిఋణం :** ఋషులు మనకు వేద వాఙ్మయాన్నిచ్చారు. అందువలన మనం వారికి ఋణపడి ఉన్నాం. అది తీర్చుకొనే ఉపాయం బ్రహ్మచర్యం. అంటే వేదాధ్యయనం చెయ్యడమే.

**పితృఋణం :** పితృదేవతలు మనకు శరీరాన్నిచ్చారు. అందువలన మనం వారికి ఋణపడి ఉన్నాం. అది తీర్చుకొనే ఉపాయం వంశం కొనసాగేవిధంగా సత్సంతానాన్ని కనడమే.

ఈ మూడు ఋణాలూ తీర్చుకొనిన తరువాతనే మనస్సును మోక్షమార్గంలో ప్రవేశపెట్టే అవకాశం ఉంటుంది. ఇవేవీ తీర్చుకొనని తన పుత్రులను మోక్షమార్గంలో ప్రవేశపెట్టి నారదుడు వారిని భ్రష్టుల్ని చేశాడు – అని దక్షుడి అభిప్రాయం –

**ఆ. ఎట్టి పుణ్యవతులొ? యీ చేడియలు సెప్ప, సవతు లేనియట్టి సవతులయ్యుఁ**
**గడుపు వడసి రెట్టి కడుపునఁ బుట్టిరో, కడిఁది త్రిజగ మెల్లఁ గడుపు గాఁగ. 253**

**ప్రతి :** ఈ చేడియలు= ఈ స్త్రీలు; ఎట్టి= ఎటువంటి; పుణ్యవతులు+ఒ= పుణ్యం కలవారో!; చెప్పన్= చెప్పడానికి; సవతు= పోలిక; లేని+అట్టి= లేనటువంటి; సవతులు+అయ్యున్= సవతులు అయ్యుండీ; కడిది= అధికమైన; త్రిజగము+ఎల్లన్= మూడు లోకములన్నీ; కడుపు+కాగన్= తమ సంతానమయ్యేవిధంగా; కడుపు+పడసిరి= సంతానాన్ని పొందారు; ఎట్టి= ఏ విధమైన; కడుపునన్= గర్భమునందు; పుట్టిరో= జన్మించారో కదా!

**తా :** దక్షుని కూతుళ్ళు ఎంత పుణ్యం చేశారో కదా! అందరూ సాటిలేని సవతులే అయినా ముల్లోకాలూ వారి సంతానమయ్యేంతగా సంతానవతులయ్యారు. ఏ తల్లి వారిని కన్నదో కదా!

వ. వార లెవ్వరనిన భానువును, లంబయుఁ, గకుప్పును, జామియు, విశ్వయు, సాధ్యయు, మరుత్వతియు, వసువును, ముహూర్తయు, సంకల్పయు ననంబదుగురు ధర్మునకుఁ బత్నులై కొడుకులం బడసిరి. వారెవ్వ రంటేని భానువునకు వేదఋషభుండు వుట్టె. ఆతనికి నింద్రసేనుండు నుదయించె. లంబకు విద్యోతుండు గలిగె. అతనికి స్తనయిత్నువు లనువారు పుట్టిరి. కకుబ్దేవికి సంకటుండు వుట్టె, సంకటునకుం కీకటుండు వుట్టె. కీకటునకు దుర్గాభిమానినులైన దేవతలు జన్మించిరి. జామిదేవికి దుర్గభూముల కధిష్ఠానదేవతలు జనియించిరి. వారికి స్వర్గుండును, నందియు జన్మించిరి. విశ్వ యనుదానికి విశ్వేదేవతలు జన్మించిరి. వార లపుత్త్రకు లనం బరఁగిరి. సాధ్యయను దానికి సాధ్యగణంబులు వుట్టె. వానికి నర్థసిద్ధి యను వాఁడు వుట్టె. మరుత్వతి యనుదానికి మరుత్వతుండు, జయంతుం డనువార లుదయించిరి. అందు జయంతుండు వాసుదేవాంశజుండైన యుపేంద్రుం డనంబడి, వినుతి నొందె. ముహూర్త యనుదానికి సకల భూతంబులకు నా యా కాలంబులఁ గలిగెడు నా యా ఫలంబుల నిచ్చు మౌహూర్తికు లనియెడు దేవగణంబులు పుట్టిరి. సంకల్పయను దానికి సంకల్పుం డుదయించె. ఆ సంకల్పునకు కాముండు జనించె. వసు వను దానికి ద్రోణుండును, బ్రాణుండును, ధ్రువుండును, నర్కుండును, నగ్నియును, దోషుండును, వస్తువును, విభావసు వను నెనమండ్రు వసువు లుదయంబు నొందిరి. అందు ద్రోణునకు నభిమతి యను భార్యయందు హర్ష శోక భయాదులు పుట్టిరి. ప్రాణునకు భార్యయైన యూర్జస్వతియందు సహుండును, నాయువును, బురోజవుఁడను వారును గలిగిరి. ధ్రువుని భార్యయగు ధరణియందు వివిధంబులగు పురంబులు వుట్టె. అర్కునికి భార్యయగు వాసనయందు తర్షాదు లుదయించిరి. అగ్నికి భార్యయైన వసోర్ధారయందు ద్రవిణకాదులు వుట్టిరి. మఱియుఁ గృత్తికలకు స్కందుండు గలిగె. ఆ స్కందునకు విశాఖాదు లుదయించిరి. దోషునకు శర్వరి యను భార్యయందు హరికళయగు శింశుమారుం డుదయించె. వస్తువునకు నాంగిరసయందు విశ్వకర్మ యనుశిల్పాచార్యుం డుదయంబందె. ఆ విశ్వకర్మకు నా కృతి యను సతియందు చాక్షుషుం డను మనువు జనించె. ఆ మనువువలన విశ్వులు, సాధ్యులు ననువారలు వుట్టిరి. విభావసునకు నుష యను భార్యయందు వ్యుష్టియు, రోచిస్సును, నాతపుండును జనించిరి. అందు నాతపునికిఁ బంచయాముండను దివసాభిమానదేవత జనించె. శంకరాంశజుండైన భూతునకు సురూప యను భార్యయందుఁ గోట్ల సంఖ్యలైన రుద్రగణంబు లుదయించిరి. మఱియు రైవతుండు, నజుండు, భవుండు, భీముండు, వాముండు, నుగ్రుండు, వృషాకపియు, నజైకపాత్తును, నహిర్బుధ్న్యుండును, బహురూపుండును. మహాంతుండును ననువారలును, రుద్రపారిషదులును నతిభయంకరులైన ప్రేతలును, వినాయకులును బుట్టిరి. అంగిరసుండను ప్రజాపతికి స్వధ యను భార్యయందుఁ బితృగణంబులు వుట్టిరి. సతియను భార్యకు నథర్వవేదాభిమాన దేవతలు వుట్టిరి. కృతాశ్వునకు అర్చిస్సను భార్యయందు ధూమ్రకేశుం డను పుత్రుం డుదయించె. వేదశిరస్సుకు ధిషణ యను భార్యయందు దేవలుండును, వయునుండును. మనువునుం బుట్టిరి. తార్క్ష్యునకు వినత, కద్రువ, పతంగి, యామిని యను నలువురు భార్యలు. అందుఁ బతంగికిఁ బక్షులు వుట్టె, యామినికి శలభంబులు వుట్టె. వినతకు సాక్షాత్కరించిన యజ్ఞాధిపతికి

**వాహనం బైన గరుడుండును, సూర్యునకు సారథియైన యనూరుండును జనియించిరి. కద్రువకుఁ బెక్కు తెఱంగుల భుజంగమంబులు పుట్టె. చంద్రునకుఁ గృత్తికాది నక్షత్రంబులు భార్యలు. వారలయందుఁ జంద్రుఁడు రోహిణియందు మాత్రము మోహితుం డగుటంజేసి దక్షశాపంబున క్షయ రోగగ్రస్తుండై సంతానంబు వడయనేరఁ డయ్యె. అంత దక్షప్రసాదంబున క్షయపీడితంబు లగు కళల మరలం బొందె. మఱియును. 254**

**ప్రతి :** వారలు= దక్ష ప్రజాపతి కూతుళ్ళు; ఎవ్వరు+అనినన్= ఏ పేర్లు కలవారు? అంటే; భానువును; లంబయున్= లంబయు; కకుప్పును= కకుప్పు; జామియున్= జామి; విశ్వయున్= విశ్వ; సాధ్యయున్= సాధ్య; మరుత్వతియున్= మరుత్వతి; వసువును= వసువు; ముహూర్తయున్= ముహూర్త; సంకల్పయున్= సంకల్ప; అనన్= అనే పేర్లుకల; పదుగురు= పదిమంది; ధర్మునకున్= ధర్మువు అనేపేరు కలవానికి; పత్నులు+ఐ= భార్యలై; కొడుకులన్= పుత్రులను; పడసిరి= పొందిరి; వారు= ఆ పుత్రులు; ఎవ్వరు= ఏ పేర్లు కలవారు; అంటేని= అన్నట్లయితే; భానువునకున్= దక్షప్రజాపతి కూతురు, ధర్ముని భార్య అయిన భానువునకు; వేద ఋషభుండు= వేద ఋషభుడు; పుట్టెన్= పుట్టాడు; అతనికిన్= వేద ఋషభునకు; ఇంద్రసేనుండు= ఇంద్రసేనుడు; ఉదయించెన్= పుట్టాడు; లంబకున్= దక్షప్రజాపతి కూతురు ధర్ముని భార్య అయిన లంబకు; విద్యోతుండు= విద్యోతుడు; కలిగెన్= పుట్టాడు; అతనికిన్= విద్యోతునకు; స్తనయిత్నువులు+అనువారు= స్తనయిత్నువులనేవారు; పుట్టిరి; కకుప్+దేవికిన్= దక్షప్రజాపతి కూతురు, ధర్ముని భార్యయైన కకుప్పు అనే ఆమెకు; సంకుటుండు= సంకుటుడు; పుట్టెన్= పుట్టెను. సంకుటునకున్= సంకుటునకు; కీకటుండు= కీకటుడు; పుట్టెన్= పుట్టాడు; కీకటునకున్= కీకటునకు; దుర్గ+అభిమానులు+ఐన= దుర్గాభిమానులైన; దేవతలు; జన్మించిరి= పుట్టారు; జామిదేవికిన్= దక్షప్రజాపతి కూతురు, ధర్ముని భార్య అయిన జామి అనుదానికి; దుర్గభూములకున్= దుర్గ ప్రదేశాలకు; అధిష్ఠాన దేవతలు; జనియించిరి= పుట్టారు; వారికిన్= ఆ దేవతలకు; స్వర్గుండును= స్వర్గుడనేవాడును; నందియును= నంది అనే వాడును; జన్మించిరి= పుట్టారు; విశ్వయనుదానికిన్= దక్షుని కూతురు, ధర్ముని భార్య అయిన విశ్వకు; విశ్వేదేవతలు; జన్మించిరి= పుట్టారు; వారలు= ఆ విశ్వేదేవతలు; అపుత్త్రకులు= పుత్రులు లేనివారు; అనన్+పరగిరి= అని ప్రసిద్ధి చెందారు; సాధ్యయనుదానికిన్= దక్షప్రజాపతి కూతురు, ధర్ముని భార్యయు అయిన సాధ్యకు; సాధ్యగణంబులు= సాధ్యగణాలు; పుట్టెన్= పుట్టారు; వానికిన్= ఆసాధ్యగణములకు; అర్థసిద్ధియనువాడు= అర్థసిద్ధి అనే పేరుగలవాడు; పుట్టెన్= పుట్టాడు; మరుత్వతి యనుదానికిన్= దక్షప్రజాపతి కూతురు, ధర్ముని భార్య అయిన మరుత్వతికి; మరుత్వతుండు= మరుత్వతుడు; జయంతుండు= జయంతుడు; అనువారలు= అనే పేర్లు కలవారు; ఉదయించిరి= పుట్టారు; అందున్= వారిరువురిలో; జయంతుండు= జయంతుడనేవాడు; వాసుదేవ+అంశజుండు+ఐన= వాసుదేవుని అంశతో జన్మించిన; ఉపేంద్రుండు+అనన్+పడి= ఉపేంద్రుడనబడి; వినుతిన్= ప్రసిద్ధిని; ఒందెన్= పొందాడు; ముహూర్త అనుదానికిన్= దక్షప్రజాపతి కూతురు, ధర్మువు భార్య అయిన ముహూర్తకు; సకలభూతంబులకున్= సమస్తమైన ప్రాణులకు; ఆ+ఆ+కాలంబులన్= ఆయా సమయములందు; కలిగెఁడు= సంభవించు; ఆ+ఆ+ఫలంబులన్= ఆయా ఫలములను; ఇచ్చు= ఇచ్చే; మౌహూర్తికులు+అనియెడు= మౌహూర్తికులు అనే పేరుగల; దేవగణంబులు= గణదేవతలు; పుట్టిరి= పుట్టారు; సంకల్ప అనుదానికిన్= దక్షుని కూతురు, ధర్ముని భార్య అయిన సంకల్పకు; సంకల్పుండు= సంకల్పుడు; ఉదయించెన్= పుట్టాడు; ఆ సంకల్పునకున్= సంకల్పునకు; కాముండు= కాముడు; జనించెన్= పుట్టాడు; వసువు+అనుదానికిన్= దక్షుని కూతురు, ధర్ముని భార్య అయిన వసువునకు; ద్రోణుండును= ద్రోణుడు; ప్రాణుండును= ప్రాణుడు; ధ్రువుండును= ధ్రువుడు; అర్కుండును= అర్కుడు; అగ్నియును= అగ్ని; దోషుండును= దోషుడు; వస్తువును=

వస్తువు; విభావసువు; అను= అనే పేర్లుగల; ఎనమండ్రు= ఎనిమిదిమంది; వసువులు; ఉదయంబున్+ఒందిరి= పుట్టారు; అందున్= ఆ ఎనిమిది మందిలో; ద్రోణునకున్= ద్రోణునకు; అభిమతి అను= అభిమతి అనే పేరుగల; భార్యయందు= ఇల్లాలియందు; హర్షశోకభయ+ఆదులు= హర్షుడు, శోకుడు, భయుడు మొదలయిన పుత్రులు; పుట్టిరి= పుట్టారు; ప్రాణునకున్= ప్రాణునకు; భార్య+ఐన= ఇల్లాలయిన; ఊర్జస్వతియందున్= ఊర్జస్వతి అనే దానియందు; సహుండును= సహుడు; ఆయువును= ఆయువు; పురోజవుడు; అనువారును= అనే పేర్లు గలవారూ; కలిగిరి= పుట్టారు; ధ్రువుని= ధ్రువునియొక్క; భార్య+అగు= ఇల్లాలయిన; ధరణియందున్= ధరణి అనే ఆమెయందు; వివిధంబులు+అగు= అనేకములయిన; పురంబులు= పురాలు; పుట్టెన్= పుట్టాయి; అర్కునికిన్= అర్కుడనేవానికి; భార్య+అగు= ఇల్లాలయిన; వాసనయందున్= వాసన అనే దానియందు; తర్ష+ఆదులు= తర్షుడు మొదలయినవారు; ఉదయించిరి= పుట్టారు; అగ్నికిన్= అగ్నికి; భార్య+అగు= ఇల్లాలయిన; వసోర్ధారయందున్= వసోర్ధార అనే దానియందు; ద్రవిణక+ఆదులు= ద్రవిణకుడు మొదలయినవారు; పుట్టిరి= పుట్టారు; మఱియున్= అంతేకాకుండా; కృత్తికలకున్= అగ్ని భార్యలయిన కృత్తికలకు; స్కందుండు= స్కందుడు; కలిగెన్= జన్మించాడు; ఇంతకుముందు చెప్పబడిన, స్కందునకున్= స్కందునకు; విశాఖ+ఆదులు= విశాఖుడు మొదలయినవారు; ఉదయించిరి= పుట్టారు; దోషునకున్= దోషుడనేవానికి; శర్వరి+అను భార్యయందున్= శర్వరి అనే పేరుగల ఇల్లాలియందు; హరికళ+అగు= శ్రీహరి అంశ అయిన; శింశుమారుండు= శింశుమారుడు; ఉదయించెన్= పుట్టాడు; వస్తువునకున్= వస్తువనేవానికి; ఆంగిరసయందున్= ఆంగిరస అనే భార్యయందు; విశ్వకర్మ+అను= విశ్వకర్మ అనే పేరుగల; శిల్ప+ఆచార్యుండు= విగ్రహాది నిర్మాణములందు ఆచార్యుడు; ఉదయంబు+అందెన్= పుట్టాడు; ఆ విశ్వకర్మకున్= ఇంతకుముందు చెప్పబడిన విశ్వకర్మ అనేవానికి; ఆకృతి అను= ఆకృతి అనే పేరుగల; సతియందున్= భార్యయందు; చాక్షుషుండు అను= చాక్షుషుడు అనే పేరుగల; మనువు; జనించెన్= పుట్టాడు; ఆ మనువువలనన్= ఆ మనువువలన; విశ్వులు; సాధ్యులు; అనువారలు= అనే పేరుగలవారు; పుట్టిరి= జన్మించారు; విభావసునకున్= విభావసుడనేవానికి; ఉష అను= ఉష అనే పేరుగల; భార్యయందున్= ఇల్లాలియందు; వ్యుష్టియు= వ్యుష్టి; రోచిస్సును= రోచిస్సు; ఆతపుండును= ఆతపుడనే పుత్రుడు; జనించిరి= పుట్టారు; మఱియున్= అంతేకాక; రైవతుండు= రైవతుడు; అజుండు= అజుడు; భవుండు= భవుడు; భీముండు= భీముడు; వాముండు= వాముడు; ఉగ్రుండు= ఉగ్రుడు; వృషాకపియున్= వృషాకపి; అజైకపాత్తును= అజైకపాత్తు; అహిర్బుధ్న్యుండు= అహిర్బుధ్న్యుడు; బహురూపుండును= బహురూపుడు; మహాంతుండు= మహాంతుడు; అనువారలును= అనే పేరు గలవారును; రుద్రపారిషదులును= రుద్రుని అనుచరులును; అతిభయంకరులు+ఐన= మిక్కిలి భయాన్ని కలిగించే; ప్రేతలు= ప్రేతలును; వినాయకులును; పుట్టిరి= పుట్టారు; అంగిరసుండు+అను= అంగిరసుడు అనే పేరుగల; ప్రజాపతికిన్= ప్రజాపతికి; స్వధ అను= స్వధ అనే పేరుగల; భార్యయందున్= ఇల్లాలియందు; పితృగణంబులు= పితృగణములు; పుట్టిరి= పుట్టారు; సతి అను= సతి అనే పేరుగల; భార్యకున్= అంగిరస ప్రజాపతియొక్క మరియొక భార్యకు; అథర్వవేద+అభిమాన దేవతలు= అథర్వాభిమాన దేవతలు; పుట్టిరి= జన్మించారు; కృతాశ్వునకున్= కృతాశ్వునకు; అర్చిస్సు అను= అర్చిస్సు అనే పేరుగల; భార్యయందు; ధూమ్రకేశుండు+అను= ధూమ్రకేశుడు అనే పేరుగల; పుత్త్రుండు= కొడుకు; ఉదయించెన్= పుట్టాడు; వేదశిరస్సుకున్= వేదశిరస్సు అనే వానికి; ధిషణ అను= ధిషణ అనే పేరుగల; భార్యయందున్= ఇల్లాలియందు; దేవలుండును= దేవలుడు; వయునుండును= వయునుడు; మనువునున్= మనువు; పుట్టిరి= జన్మించారు; తార్క్ష్యునకున్= తార్క్ష్యుడనేవానికి; వినత; కద్రువ; పతంగి; యామిని; అను= అనే పేర్లుగల; నలుగురు; భార్యలు= భార్యలు; అందున్= వారిలో; పతంగికిన్=

పతంగి అనే ఆమెకు; పక్షులు; పుట్టెన్= జన్మించాయి; యామినికిన్= యామిని అనే ఆమెకు; శలభంబులు= మిడుతలు; పుట్టెన్= జన్మించాయి; వినతకున్= వినత అనే ఆమెకు; సాక్షాత్కరించిన= ప్రత్యక్షమైన; యజ్ఞాధిపతికిన్= యజ్ఞేశ్వరుడయిన శ్రీహరికి; వాహనంబు+అయిన= వాహనమయిన; గరుడుండును= గరుడుడు; సూర్యునకున్= సూర్యునకు; సారథి ఐన= సారథి అయిన; అనూరుండును= అనూరుడనే వాడూ; జనియించిరి= పుట్టారు; కద్రువకున్= కద్రువ అనే ఆమెకు; పెక్కు తెఱంగుల= అనేక విధాలయిన; భుజంగమంబులు= పాములు; పుట్టెన్= పుట్టాయి; చంద్రునకున్= చంద్రునికి; కృత్తికా+ఆది+నక్షత్రంబులు= కృత్తిక మొదలయిన నక్షత్రాలు; భార్యలు= ఇల్లాండ్రు; వారలయందున్= ఆకృత్తికాది నక్షత్రాలయందు; చంద్రుడు; రోహిణియందు మాత్రము= రోహిణియందే; మోహితుండు= అధికానురాగం కలవాడు; అగుటంజేసి= కావటం వలన; దక్షశాపంబునన్= దక్షుడిచ్చిన శాపంచేత; క్షయరోగ గ్రస్తుండు+ఐ= క్షయరోగంచేత ఆక్రమింపబడినవాడై; సంతానంబు= సంతతిని; పడయనేరఁడు= పొందు సామర్థ్యం లేనివాడు; అయ్యెన్= అయ్యెను; అంతన్= పిమ్మట; దక్ష= దక్షునియొక్క; ప్రసాదంబునన్= అనుగ్రహంచేత; క్షయ= క్షయరోగంచేత, కృశించడంచేత; పీడితంబులు+అగు= దుఃఖించిన; కళలన్= కళలను; మరలన్= తిరిగి; పొందెను= పొందాడు; మఱియును= అంతేకాక.

**తా :** దక్షప్రజాపతికి అరవైమంది పుత్రికలు. వారిలో పదిమంది ధర్ముని భార్యలు. వారి పేర్లు – భానువు, లంబ, కకుప్పు, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసువు, ముహూర్త, సంకల్ప. వారిలో భానువు కొడుకు వేదఋషభుడు. వేదఋషభుని కొడుకు ఇంద్రసేనుడు. లంబయొక్క పుత్రుడు విద్యోతుడు. విద్యోతుని పుత్రులు స్తనయిత్నువులు. కకుబ్దేవి యొక్క పుత్రుడు సంకటుడు. సంకటుని పుత్రుడు కీకటుడు. కీకటునికి దుర్గాభిమాని దేవతలు పుత్రులు. దుర్గభూములకధిష్ఠాన దేవతలు జామిదేవియొక్క పుత్రులు. ఆ దేవతల పుత్రులు స్వర్గుడు, నంది.

విశ్వయొక్క పుత్రులు విశ్వేదేవతలు. విశ్వేదేవతలకు సంతానం లేదు. సాధ్యయొక్క పుత్రులు సాధ్యగణాలు. సాధ్యగణాల పుత్రుడు అర్థసిద్ధి. మరుత్వతికి మరుత్వంతుడు, జయంతుడు అని ఇద్దరు పుత్రులు. అందులో జయంతుడు వాసుదేవుని అంశతోపుట్టి ఉపేంద్రుడనే ప్రసిద్ధి పొందాడు. ముహూర్తకు మౌహూర్తికులనే పుత్రులు కలిగారు. వారు ప్రాణులకు కాలాన్ననుసరించి ఫలం ఇస్తారు. సంకల్ప కొడుకు సంకల్పుడు. సంకల్పుని కొడుకు కాముడు. వసువునకు ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వస్తువు, విభావసువు అనే ఎనమండుగురు వసువులు పుట్టారు. వారిలో ద్రోణుని భార్య అభిమతి. వారికి హర్షుడు, శోకుడు, భయుడు అనేవారు జన్మించారు.

ప్రాణుని భార్య ఊర్జస్వతి. వారికి సహుడు, ఆయువు, పురోజవుడు అనే ముగ్గురు పుత్రులు. ధ్రువుని భార్య ధరణి. పురములు వారి సంతానం. అర్కుని భార్య వాసన. వారి పుత్రులు తార్షుడు మొదలయినవారు. అగ్నిభార్య వసోర్ధార. ద్రవిణకాదులు వారి పుత్రులు. అగ్నికి కృత్తికలు కూడా భార్యలు. వారికి స్కందుడు పుత్రుడు. స్కందునికి విశాఖుడు మొదలయినవారు పుత్రులు. దోషుని భార్య శర్వరి. ఆమె పుత్రుడు శింశుమారుడు. అతడు శ్రీహరి అంశతో జన్మించాడు. వస్తువు భార్య ఆంగిరస. విశ్వకర్మ అనే శిల్పాచార్యుడు ఆమె కొడుకు. విశ్వకర్మ భార్య ఆకృతి. ఆమె పుత్రుడు చాక్షుషమనువు. ఆ మనువునకు విశ్వులు, సాధ్యులు అనేవారు పుత్రులు. విభావసుని భార్య ఉష. ఆమె పుత్రులు వ్యుష్టి, రోచిస్సు, ఆతపుడు. ఆతపుని పుత్రుడు పంచయాముడు. అతడు దివసాభిమానిదేవత. భూతుడు శంకరుని అంశతో జన్మించాడు. భూతుని భార్య సురూప. కోట్లాదిమంది రుద్రగణాలు ఆమె పుత్రులు. అంతేకాదు. సురూపకు రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాయుడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాత్తు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు, మహాంతుడు అనేవారు, రుద్రుని అనుచరులయిన ప్రేతలు, వినాయకులు అనేవారు కూడా పుత్రులుగా ఉదయించారు.

అంగిరసుని భార్య స్వధ. పితృగణాలు ఆమె పుత్రులు. అంగిరసుని మరో భార్య సతి. ఆమెకు అథర్వాభిమాన దేవతలు పుత్రులు. కృతాశ్వుని భార్య అర్చిస్సు. ఆమె పుత్రుడు ధూమ్రకేశుడు. వేదశిరస్సుని భార్య ధిషణ. ఆమెకు దేవలుడు, వయునుడు, మనువు అని ముగ్గురు పుత్రులు. తార్క్ష్యునకు వినత, కద్రువ, పతంగి, యామిని అని నలుగురు భార్యలు. వారిలో పతంగి సంతానం పక్షులు. యామిని సంతానం మిడుతలు. వినతకు ఇద్దరు కొడుకులు. గరుత్మంతుడు, అనూరుడు, గరుత్మంతుడు శ్రీహరి వాహనం. అనూరుడు సూర్యుని రథసారథి. కద్రువ సంతానం పాములు. కృత్తికాది నక్షత్రాలు చంద్రుని భార్యలు. చంద్రుడు రోహిణియందు అధికాసక్తుడయి తక్కిన భార్యలను పట్టించుకోని కారణంగా దక్షుడు చంద్రుణ్ణి క్షయ రోగగ్రస్తుడవగుము అని శపించాడు. ఆ కారణంగా సంతానం పొందే అర్హత చంద్రునికి లేకపోయింది. అటుపైన దక్షుడు అనుగ్రహించగా క్షీణించిన కళలు తిరిగి చంద్రుణ్ణి చేరాయి. ఇంతేకాక –

**సీ.** **కామిత ప్రదుఁడైన కశ్యపు కౌఁగిట ముచ్చట దీర్తురే ముద్దరాండ్రు,**
**అఖిలలోకములకు నవ్వలై జగమెల్లఁ బూజింప నుందురే పూవుఁబోండ్లు,**
**బలియురై పుత్త్రులుఁ బౌత్త్రులుఁ ద్రిజగంబు లేలంగఁ జూతురే యిందుముఖులు,**
**ముంగొంగు పసిఁడియై మూల్గుపుణ్యంబుల విఱ్ఱవీఁగుదు రెట్టి వింతరాండ్రు,**

**తే.** **వారి కలగంప కడుపుల నేరుపఱుప, నరిది బిడ్డలఁ బడసిన బిరుదుసతుల**
**నామములు నన్వయంబులు నీ మనంబు, పూనఁజెప్పుదు వినవయ్య! మానవేంద్ర!** **255**

**ప్రతి :** మానవ+ఇంద్ర= ఓ రాజా!; ఏ ముద్ద+ఆండ్రు= ఏ సౌందర్యవతులు; కామిత ప్రదుడు+ఐన= కోర్కెలను ఇచ్చువాడయిన; కశ్యపు= కశ్యప ప్రజాపతియొక్క; కౌఁగిటన్= కౌగిలియందు చేరి; ముచ్చటన్= కోర్కెను; తీర్తురు= తీర్చెదరో; ఏ పూవుబోండ్లు= పూవువంటి శరీరముకల ఏ యువతులు; అఖిల= సమస్తమయిన; లోకములకున్= లోకాలకు; అవ్వల+ఐ= అతీతమై; జగము+ఎల్లన్= సమస్త జగత్తు; పూజింపన్= గౌరవింపగా; ఉందురు= ఉందురో; ఏ+ఇందుముఖులు= చంద్రునివంటి ముఖము కల ఏ యువతులు; పుత్త్రులున్= కొడుకులును; పౌత్త్రులున్= కొడుకుల కొడుకులయిన మనుమలును; బలియురు+ఐ= బలవంతులై; త్రిజగంబులు= ముల్లోకాలను; ఏలంగన్= పరిపాలిస్తుండగా; చూతురు= చూచెదరో; ఎట్టి వింత+ఆండ్రు= ఆశ్చర్యం కొలుపు ఏ యువతులు; ముంగొంగు (ముందు+కొంగు) పసిడి+ఐ= కొంగుబంగారమై; మూల్గు= వ్యయముకాక పడి ఉన్న; పుణ్యంబులన్= పుణ్యాలతో; విఱ్ఱవీగుదురు (వీఁగు+వీగు= విఱ్ఱవీగు) మిక్కిలి గర్వించి ఉంటారో; వారి= అట్టి ఆ యువతులయొక్క; కలగంప కడుపుల= అనేక విధములయిన సంతానములను; ఏరుపఱుపన్= నిరూపించడానికి; అరిది= అశక్యం; బిడ్డలన్= సంతానాన్ని; పడసిన= పొందిన; బిరుదు సతుల= ప్రసిద్ధి పొందిన ఆ పతివ్రతలయొక్క; నామములు= పేర్లు; అన్వయంబులు= వంశాలు; నీ మనంబు= నీ మనస్సు; పూనన్= హత్తుకొనునట్లు; చెప్పుదున్= చెప్తాను; వినవయ్య (వినుము+అయ్య)= విను.

**తా :** ఎవరు కశ్యప ప్రజాపతికి భార్యలో, ఎవరు అలౌకికమైన చరిత్ర కలిగి సమస్త జగత్తుల పూజలందుకుంటున్నారో, ఎవరి పుత్రులు, పౌత్రులు బలవంతులయి ముల్లోకాలను పరిపాలించారో, ఎవరికి కొంగుబంగారమై ఎంత వ్యయం చేసినా తరుగని పుణ్యం ఉందో అటువంటి కశ్యపుని భార్యల యొక్క నానావిధాలయిన సంతతిని స్పష్టంగా నిరూపించడం అసాధ్యం. సంతానవతులయిన ఆ ప్రసిద్ధ సాధ్వీమణుల పేర్లు, వారి వంశాలు చెప్తాను. ఓ రాజా! విను.

**విశే :** ముంగొంగు బంగారం అనేది తెలుగు జాతీయం. మూల్గుపుణ్యం అంటే ఎంత తీసినా తరగకుండా గుట్టలు గుట్టలుగా పడి ఉందనీ, ముంగొంగు బంగారం అంటే అవసరమయిన వెంటనే వాడుకునేందుకు వీలయినది, విలువైనది అని అర్థం.

**తరల.**

**అదితియుం దితి కాష్ఠయుం దను వ య్యరిష్టయుఁ దామ్రయు**
**న్నదనఁ గ్రోధవశాఖ్యయున్ సురసాఖ్యయున్ సురభిన్ మునిన్**
**మొదలుగాఁ దిమియు న్నిళప్రియముఖ్య యా సరమాదిగా**
**ముదిత లెన్నఁగఁ గన్నసంతతి ముజ్జగంబుల భూవరా! 256**

**ప్రతి :** భూవరా!= రాజా!; ఎన్నగన్= లెక్కింపగా; మూడు+జగంబులన్= మూడు లోకాలలోనూ; అదితియున్= అదితి; దితి; కాష్ఠయున్= కాష్ఠ; దనువు; ఆ+అరిష్టయున్= అరిష్ట; తామ్రయున్= తామ్ర; అదనన్ క్రోధావశా+ఆఖ్యయున్= క్రోధవశ అను పేరుగల ఆమెయు; సురసా+ఆఖ్యయున్= సురస అనే పేరుగల ఆమెయు; సురభిన్= సురభి; మునిన్= మునియు; మొదలుగా= మొదలగునట్లుగా; తిమియున్= తిమియు; ఇళా+ఆఖ్య= ఇళ అనే పేరుగల; సుముఖ్య= మిక్కిలి ముఖ్యురాలైన ఆమెయు; ఆ సరమా+ఆదిగా= ఆ సరమ మొదలయిన; ముదితలు= స్త్రీలు; కన్నసంతతి= కన్న సంతానమే.

**తా :** మూడు లోకాల్లో ఉన్న ప్రాణులన్నీ అదితి, దితి, కాష్ఠ, దనువు, అరిష్ట, తామ్ర, క్రోధవశ, సురస, సురభి, ముని, తిమి, ఇళ, సరమల సంతానమే.

**సీ.** **చాలంగఁ దిమికిని జలచరంబులు వుట్టె శ్వాపదంబులు వుట్టె సరమయందు,**
**సురభికి మహిషాది సురభులు జనియించెఁ, దామ్రకు శ్యేన గృధ్రములుఁ గలిగె**
**మునికి నప్సరసల మూఁకలు జనియించె, నిళ గనె భూరుహములను, గ్రోధ**
**వశ కుద్భవిల్లె దుర్వార సర్పంబులు, సరి యాతుధానులు సురస కరయ**

**తే.** **నుప్పతిల్లిరి గంధర్వు లొక్క మొగి న, రిష్టకు సుతుల్, దనువునకుఁద్రిదశ రిపులు**
**పదియు నెనమండ్రునై నట్టి విదితబలులు, వారి నామాన్వయంబులఁ గోరి వినుము. 257**

**ప్రతి :** తిమికినిన్= తిమికి; జలచరంబులు= నీళ్ళల్లో చరించే చేపలు మొదలయినవి; చాలంగన్= అధికంగా; పుట్టెన్= జన్మించాయి; సరమయందున్= సరమయందు; శ్వాపదంబులు= క్రూరజంతువులు; పుట్టెన్= పుట్టాయి; సురభికిన్= సురభి అనే ఆమెకు; మహిషాది= దున్నపోతు మొదలయినవి; సురభులు= గోవులు; జనియించెన్= పుట్టాయి; తామ్రకున్= తామ్ర అనే ఆమెకు; శ్యేన= డేగలు; గృధ్రములున్= గ్రద్దలును; కలిగెన్= కలిగాయి; మునికిన్= ముని అనే ఆమెకు; అప్సరసల మూకలు= అప్సర స్త్రీల గుంపులు; జనియించెన్= పుట్టాయి; ఇళ= ఇళ అనే ఆమె; భూరుహములను= చెట్లను; కనెన్= కనెను; క్రోధవశకున్= క్రోధవశ అనే ఆమెకు; దుర్వార= వారింప శక్యముకాని; సర్పములు= పాములు; ఉద్భవిల్లెన్= పుట్టాయి; అరయన్= ఆలోచింపగా; సురసకున్= సురస అనే ఆమెకు; యాతుధానులు= రాక్షసులు; సరి= యుక్తంగా; ఉప్పతిల్లిరి= పుట్టారు; అరిష్టకున్= అరిష్ట అనే ఆమెకు; ఒక్క మొగిన్= ఒక మొత్తంగా; గంధర్వులు; ఉప్పతిల్లిరి= ఉద్భవించారు (ఉప్పతిల్లిరి అనే పదం గడపమీది దీపంలా ముందరి వెనుక వాక్యాలు రెండింటితోనూ అన్వయిస్తుంది);

దనువునకున్= దనువనే ఆమెకు; పదియున్+ఎనమండ్రును+ఐన+అట్టి= పద్దెనిమిదిమంది అయిన; విదితబలులు= లోకప్రసిద్ధమయిన బలం కలవారు అగు; త్రిదశ= దేవతలకు; రిపులు= శత్రువులయిన రాక్షసులు – సుతుల్= కొడుకులు; వారి= వారియొక్క; నామ+అన్వయంబులన్= పేర్లు, వంశములను; కోరి= శ్రద్ధతో; వినుము= విను.

**తా :** తిమికి చేపలు మొదలగు జలచరాలు పుట్టాయి. సరమకు వ్యాఘ్రాది క్రూరజంతువులు పుట్టాయి. సురభికి దున్నపోతులు, ఆవులు మొదలయినవి జన్మించాయి. తామ్రకు డేగలు, గద్దలు పుట్టాయి. మునికి అప్సరసలు, ఇళకు చెట్లు, చేమలు, క్రోధవశకు పాములు, సురసకు రాక్షసులు, అరిష్టకు గంధర్వులు, దనువునకు సుప్రసిద్ధ బలంకల పద్దెనిమిది మంది దేవతాశత్రువులయిన రాక్షసులు జన్మించారు. వారి పేర్లు, వంశాలు విను.

**వ.** **ద్విమూర్ధుండును, శంబరుండును, అరిష్టుండును, హయగ్రీవుండును, విభావసుండును, అయోముఖుండును, శంకుశిరుండును, స్వర్భానుండును, కపిలుండును, అరుణియును, పులోముండును, వృషపర్వుండును, ఏకచక్రుండును, అనుతాపకుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును, విప్రచిత్తియు, దుర్జయుండు నను వారలు. వీరలలోన స్వర్భానునకు సుప్రభయను కన్యక పుట్టె. దాని నముచి వివాహం బయ్యె. వృషపర్వునకు శర్మిష్ఠ యను కూఁతురు పుట్టె. దాని నహుష పుత్త్రుండైన యయాతి పెండ్లియయ్యె. వైశ్వానరునకు నుపదానవి, హయశిర, పులోమ, కాలక యను నలువురు పుత్రిక లుదయించిరి. అందు నుపదానవి హిరణ్యాక్షునకుం బత్ని యయ్యె. హయశిరను గ్రతువు వివాహం బయ్యె. పులోమ, కాలక లను నిరువురకును గశ్యప ప్రజాపతి చతుర్ముఖుని వాక్యంబునం గైకొనియె. ఆ యిరువురకును సమరకోవిదు లైన దానవులు పౌలోమ కాలకేయులనం బుట్టిరి. మఱియు నా యిరువురకు నఱువదివేల రాక్షసులు జన్మించిరి. వారు యజ్ఞకర్మంబులకు విఘాతుకులై వర్తింప, వారి నింద్రునకుం బ్రియంబుగా నీ పితామహుం డగు నర్జునుండు వధించె. మఱియు విప్రచిత్తి సింహిక యను దానియందు రాహుప్రముఖంబుగాఁ గల కేతు శతంబును బడసె. వారలు గ్రహత్వంబుఁ గైకొనిరి. మఱియుం బురాణపురుషుండైన శ్రీమన్నారాయణుండు దన యంశంబునఁ బరమ భాగ్యవతియైన యదితి గర్భంబున నుదయించె. ఆ యదితి వంశంబును విదితంబుగా వినిపించెద. సావధానుండవై వినుము. వివస్వంతుండును, అర్యముండును, పూషుఁడును, త్వష్టయు, సవితయు, భగుండును, ధాతయు, విధాతయు, వరుణుండును, మిత్రుండును, శక్రుండును, ఉరుక్రముండును నను ద్వాదశాదిత్యులు జన్మించిరి. అందు వివస్వంతునకు శ్రాద్ధదేవుం డను మనువు సంజ్ఞాదేవియందు నుదయించె. మఱియు యముండు, యమియు నను నిరువురు మిథునంబుగా నుదయంబు నొందిరి. మఱియు నా సంజ్ఞాదేవి బడబాస్వరూపంబు నొంది యశ్వినీ దేవతలం గనె. ఛాయాదేవి యందు శనైశ్చరుండును, సావర్ణి యను మనువును, దపతియను కన్యకయుం బుట్టిరి. ఆ తపతిని సంవరణుండు వరియించె. అర్యమునకు మాతృక యను పత్నియందు చర్షణు లుదయించిరి. వారి మూలంబున మనుష్యజాతి యీ లోకంబున స్థిరంబుగా నుండునట్లు బ్రహ్మదేవునిచేఁ గల్పింపంబడె. పూషుండు భర్గునిం జూచి దంతంబులు వివృతంబులుగా నగిన, నతండు క్రోధించి దంతంబు లూడనడిచిన, నాఁటినుండియు భగ్నదంతుండై, యనపత్యుండై పిష్టాదులు**

**భక్షింపుచుండె. త్వష్టకు దైత్యానుజ యైన రచన యను కన్యకకు నధిక బలాఢ్యుండగు విశ్వరూపుండు వుట్టె. అంత నా దేవతలు బృహస్పతిం గోపింప, నతఁడు తలఁగిపోయినం దమకు నా విశ్వరూపుని నాచార్యునింగా వరియించిరి అని చెప్పిన విని శుకయోగీంద్రునకుం బరీక్షిన్నరేంద్రుం డిట్లనియె. 258**

**ప్రతి :** ద్విమూర్ధుండును= ద్విమూర్ధుడూ; శంబరుండును= శంబరుడూ; అరిష్టుండును= అరిష్టుడూ; హయగ్రీవుండును= హయగ్రీవుడూ; విభావసుండును= విభావసుడూ; అయోముఖుండును= అయోముఖుడూ; శంకుశిరుండును= శంకుశిరుడూ; స్వర్భానుండును= స్వర్భానుడూ; కపిలుండును= కపిలుడూ; అరుణియును= అరుణీ; పులోముండును= పులోముడూ; వృషపర్వుండును= వృషపర్వుడూ; ఏకచక్రుండును= ఏకచక్రుడూ; అనుతాపకుండును= అనుతాపకుడూ; ధూమ్రకేశుండును= ధూమ్రకేశుడూ; విరూపాక్షుండును= విరూపాక్షుడూ; విప్రచిత్తియు= విప్రచిత్తీ; దుర్జయుండును= దుర్జయుడూ; అనువారలు= అనే పేర్లు కలవారు; వీరలలోనన్= వీరియందు; స్వర్భానునకున్= స్వర్భానునకు; సుప్రభ+అను= సుప్రభ అనే పేరుగల; కన్యక= కూతురు; పుట్టెన్= పుట్టింది; దానిన్= ఆ కన్యకను; నముచి= నముచి అనేవాడు; వివాహంబు+అయ్యెన్= వివాహం చేసుకొన్నాడు; వృషపర్వునకున్= వృషపర్వునకు; శర్మిష్ఠ+అను= శర్మిష్ఠ అనే పేరుగల; కూతురు; పుట్టెన్= పుట్టింది; దానిన్= ఆ శర్మిష్ఠను; నహుష పుత్రుండు+ఐన= నహుషుని కొడుకైన; యయాతి= యయాతి అనేవాడు; పెండ్లి+అయ్యెన్= పెండ్లాడాడు; వైశ్వానరునకున్= వైశ్వానరునకు; ఉపదానవి; హయశిర; పులోమ; కాలక; అను= అనే పేర్లుకల; నలువురు= నలుగురు; పుత్రికలు= కూతుళ్ళు; ఉదయించిరి= పుట్టారు; అందున్= వారియందు; ఉపదానవి= ఉపదానవి అనే ఆమె; హిరణ్యాక్షునకున్= హిరణ్యాక్షునకు; పత్ని= భార్య; అయ్యెన్= అయింది; హయశిరను= హయశిర అనే ఆమెను; క్రతువు= క్రతువనేవాడు; వివాహంబు+అయ్యెన్= పెండ్లాడాడు; పులోమ; కాలకలు; అను= అనే పేర్లుగల; ఇరువురను= ఇద్దరు కన్యలను; కశ్యప ప్రజాపతి; చతుర్ముఖుని= బ్రహ్మయొక్క; వాక్యంబువలన= మాటవలన; కైకొనియెన్= గ్రహించెను; ఆ+ఇరువురకును= ఆ పులోమ, కాలకలను ఇద్దరకును; సమరకోవిదులు+ఐన : సమర= యుద్ధమునందు; కోవిదులు+ఐన= పండితులైన; పౌలోమ కాలకేయులు+అనన్= పౌలోమ, కాలకేయులనే పేర్లుగల; దానవులు= రాక్షసులు; పుట్టిరి= పుట్టారు; మఱియును= ఇంకా; ఆ+ఇరువురకున్= ఆ ఇద్దరికిని; అఱువదివేల= అరవైవేలమంది రాక్షసులు; జన్మించిరి= పుట్టారు; వారు= ఆ రాక్షసులు; యజ్ఞ కర్మంబులకున్= యజ్ఞవిధులకు; విఘాతుకులు+ఐ= విధ్వంసం చేసేవారై; వర్తింపన్= ప్రవర్తిస్తుండగా; వారిన్= ఆ రాక్షసులను; ఇంద్రునకున్= ఇంద్రునకు; ప్రియంబు+కాన్= ప్రీతి కలుగునట్లుగా; నీ= నీయొక్క; పితామహుండు+అగు= తాత అయిన; అర్జునుండు= అర్జునుడు; వధించెన్= చంపాడు; మఱియున్= ఇంకా; విప్రచిత్తి= విప్రచిత్తి అనేవాడు; సింహిక; అనుదానియందున్= అనే పేరుగల ఆమెయందు; రాహుప్రముఖంబు+కాన్ కల= రాహువు ముఖ్యుడుగా గల; కేతుశతంబును= వందమంది కేతువులను; పడసెన్= పొందాడు; వారలు= రాహుకేతువులు; గ్రహత్వంబున్= గ్రహత్వాన్ని; కైకొనిరి= స్వీకరించారు; మఱియున్= ఇంకా; పురాణపురుషుండు+ఐన= ఆదిపురుషుడైన; శ్రీమన్నారాయణుండు= శ్రీహరి; తన+అంశంబునన్= తన అంశతో; పరమభాగ్యవతి+ఐన= మిక్కిలి అదృష్టవంతురాలయిన; అదితి గర్భంబునన్= అదితియొక్క కడుపునందు; ఉదయించెన్= పుట్టాడు; ఆ+అదితి వంశంబును= ఆ అదితియొక్క వంశమును; విదితంబుగా= తెలిసేటట్లుగా; వినిపించెదన్= వినిపిస్తాను; స+అవధానుండవు+ఐ= ఏకాగ్రత కలవాడవై; వినుము= విను; వివస్వంతుండును= వివస్వంతుడూ; అర్యముండును= అర్యముడూ; పూషుఁడును= పూషుడూ; త్వష్టయున్= త్వష్టా; సవితయున్= సవితా; భగుండును= భగుడూ; ధాతయు= ధాతా; విధాతయు= విధాతా; అరుణుండును= అరుణుడూ; మిత్రుండును= మిత్రుడూ; శక్రుండును= శక్రుడూ;

ఉరుక్రముండును= ఉరుక్రముడూ; అను= అనే పేర్లుకల; ద్వాదశ+ఆదిత్యులు= పన్నెండుమంది సూర్యులు; జన్మించిరి= పుట్టారు; అందున్= ఆ పన్నెండుమంది సూర్యులలో; వివస్వంతునకున్= వివస్వంతుడనే పేరుగల సూర్యునకు; శ్రాద్ధదేవుండు+అను= శ్రాద్ధదేవుడు అనే పేరుగల; మనువు; సంజ్ఞాదేవియందున్= సంజ్ఞాదేవియందు; ఉదయించె= పుట్టాడు; మఱియున్= అంతేకాక; యముండు= యముడు; యమియు= యమి; అను= అనే పేర్లుగల; ఇరువురు= ఇద్దరు; మిథునంబుగాన్= కవలలుగా; ఉదయంబున్= పుట్టుకను; ఒందిరి= పొందారు; మఱియున్= ఇంకా; ఆ సంజ్ఞాదేవి; బడబా= ఆడుగుర్రంయొక్క; స్వరూపంబును= రూపాన్ని; ఒంది= పొంది; అశ్వినీ దేవతలను; కనెన్= కన్న; ఛాయాదేవియందున్= ఛాయాదేవియందు; శనైశ్చరుండును= శనియు; సావర్ణియను= సావర్ణి అనే పేరుగల; మనువును; తపతి అను= తపతి అనే పేరుగల; కన్యకయున్= కూతురును; పుట్టిరి= జన్మించారు; ఆ తపతిని; సంవరణుండు= సంవరణుడు అనేవాడు; వరియించెన్= వివాహమాడాడు; అర్యమునకున్= అర్యమునకు; మాతృక అను= మాతృక అనే పేరుగల; పత్నియందున్= భార్యయందు; చర్షణులు= చర్షణులనువారు; ఉదయించిరి= పుట్టారు; వారి మూలంబున= వారివలన; మనుష్యజాతి= మానవజాతి; ఈ లోకంబునన్= ఈ లోకమునందు; స్థిరంబుగాన్= శాశ్వతంబుగా; ఉండునట్లు= ఉండే విధంగా; బ్రహ్మదేవునిచేన్= బ్రహ్మచేవునిచే; కల్పింపబడె= చేయబడింది; పూషుండు= పూషుడు అనేవాడు; భర్గునిన్= శివుని; చూచి; దంతంబులు= పళ్ళు; వివృతంబులుగా= కనపడునట్లుగా; నగినన్= నవ్వగా; అతండు= ఆ శివుడు; దంతంబులు= పళ్ళు; ఊడనడిచినన్= రాలునట్లు కొట్టగా; నాటి నుండియున్= అప్పటి నుండీ; భగ్నదంతుండు+ఐ= ఊడిన, దంతాలుకలవాడై; అనపత్యుండు+ఐ= సంతానములేనివాడై; పిష్టాదులు= పిండి మొదలయినవాటిని; భక్షింపుచుండెన్= తింటూ ఉండే; త్వష్టకున్= త్వష్ట అనే ప్రజాపతికి; దైత్య+అనుజ+ఐన= దితిపుత్రులకు చెల్లెలయిన; రచన అను= రచన అనే పేరుగల; కన్యకకున్= స్త్రీకి; అధిక= మిక్కుటమయిన; బల= బలముచే; ఆఢ్యుండు+అగు= సంపన్నుడగు; విశ్వరూపుండు= విశ్వరూపుడు అనే పేరుగలవాడు; పుట్టెన్= పుట్టాడు; అంతన్= అపుడు; ఆ దేవతలు= దేవతలు; బృహస్పతిన్= బృహస్పతిని; కోపింపన్= కోపం వచ్చేటట్లు చేయగా; అతడు= ఆ బృహస్పతి; తలఁగి పోయినన్= తొలగిపోగా; తమకున్= తమకు; ఆ+విశ్వరూపుని= త్వష్టకుమారుడయిన విశ్వరూపుని; ఆచార్యునిగా= గురువుగా; వరియించిరి= గ్రహించారు; అని= ఈ విధంగా; చెప్పినన్= చెప్పగా; విని; శుకయోగీంద్రునకున్= శుకయోగీంద్రునితో; పరీక్షిత్+నర+ఇంద్రుడు= రాజైన పరీక్షిత్తు; ఇట్లు+అనియె= ఈ విధంగా పలికెను.

**తా :** కశ్యపుని భార్యలలో దనువొకతె. ఆమె పుత్రులు పద్దెనిమిదిమంది. వారి పేర్లు – ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసుడు, ఆయోముఖుడు, శంకుశిరుడు, స్వర్భానుడు, కపిలుడు, అరుణి, పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపకుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు. వీరిలో స్వర్భానువు కూతురు సుప్రభ, ఆమె భర్త నముచి. వృషపర్వుని కూతురు శర్మిష్ఠ. ఆమె భర్త యయాతి. అతడు నహుషుని కొడుకు. వైశ్వానరునకు ఉపదానవి, హయశిర, పులోమ, కాలక అని నలుగురు పుత్రికలు. ఉపదానవి హిరణ్యాక్షుని భార్య. హయశిర భర్త క్రతువు. పులోమకాలకలను బ్రహ్మవాక్యముపై కశ్యపుడు వివాహమాడాడు. పులోమకు పౌలోములు, కాలకకు కాలకేయులు పుట్టారు. వారు సమరకోవిదులు. పౌలోమకాలకేయులకు అరువదివేలమంది రాక్షసులు జన్మించారు. వారు యజ్ఞాలను ధ్వంసం చేసేవారు. ఇంద్రుని ప్రీతి కొరకు నీ తాతగారైన అర్జునుడు వారిని వధించాడు. విప్రచిత్తికి సింహికయందు రాహువు, వందమంది కేతువులు మొత్తం నూట ఒక్కమంది జన్మించారు. వారు గ్రహాలు. ఆదిపురుషుడైన శ్రీహరి తన అంశతో అదితియందు జన్మించాడు. అంత అదృష్టవంతురాలయిన అదితి వంశం విను. వివస్వంతుడు, అర్యముడు,

పూషుడు, త్వష్ట, సవిత, భగుడు, ధాత, విధాత, అరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు అనే పేర్లుకల పన్నెండుగురు సూర్యులు అదితికి జన్మించారు. వివస్వంతునికి యముడు, యమి అనే కవలలు కలిగారు. సంజ్ఞ ఆడుగుర్రం రూపం ధరించి అశ్వినీ దేవతలను కన్నది. వివస్వంతుని మరో భార్య ఛాయ. ఆమెకు శని, సావర్ణి అనే మనువు, తపతి అనే కూతురు పుట్టారు. తపతి భర్త సంవరణుడు. అర్యముని భార్య మాతృక. వారి సంతానం చర్షణులు. వారు వివేకంకల వారయిన కారణంగా వారిని ఆధారంగా చేసుకొని బ్రహ్మ మానవజాతిని రచించాడు. పూషుడు భర్గుని చూచి నవ్వగా అతడు కోపగించి పూషుని పళ్ళు రాలగొట్టాడు. అప్పటి నుంచి అతనికి పిండే తిండి. ఆ పూషునికి సంతానం లేదు. త్వష్టయొక్క భార్య రచన. ఆమె దితిపుత్రులకు చెల్లెలు. త్వష్ట రచనల కొడుకు విశ్వరూపుడు. దేవతలు బృహస్పతికి కోపం వచ్చేవిధంగా ప్రవర్తిస్తే బృహస్పతి దేవతలను విడిచి వెళ్ళిపోయాడు. అపుడు దేవతలు విశ్వరూపుణ్ణి తమ గురువుగా స్వీకరించారు. ఈ విధంగా శుకమహర్షి చెప్పగా పరీక్షిన్మహారాజు ఇలా అడిగాడు.

**సీ. అరయంగ యోగీంద్ర! యద్భుతం బయ్యెడు సురలపై నేటికి సురగురుండు**
**కోపించె? నీతండు గురుభావమున దేవతల కేమి యాపదఁ దలఁగఁ జేసె?**
**నెఱిఁగింపు మనవుడు నింద్రుండు త్రిభువ నైశ్వర్య మదంబున సత్పథంబు**
**గానక వసు రుద్ర గణములు నాదిత్య మరు దశ్విదేవాది మండలములు**

**తే. సిద్ధ చారణ గంధర్వ జిహ్మగాది, సురలు మునులును రంభాది సుందరాంగు**
**లాడఁ బాడంగ వినుతి సేయంగఁ గొలువ, నొక్క భద్రాసనంబున నుక్కుమీఱి. 259**

**ప్రతి :** యోగి+ఇంద్ర= యోగీశ్వరా!; అరయంగన్= ఆలోచింపగా; అద్భుతంబు= ఆశ్చర్యం; అయ్యెడున్= అవుతూంది; సురగురుండు= దేవగురుడైన బృహస్పతి; సురలపైన్= దేవతలమీద; ఏటికిన్= ఎందుకు; కోపించె= కోపగించుకున్నాడు? ఈతండు= విశ్వరూపుడు; గురుభావమున= గురుత్వం వహించి; దేవతలకున్= దేవతలకు; ఏమి ఆపదన్= ఏ కష్టాన్ని; తలఁగన్+చేసెన్= తొలగించాడో; ఎఱిగింపు= తెలుపు; అనవుడు= అనగా; ఇంద్రుండు= ఇంద్రుడు; త్రిభువన= ముల్లోకములందలి; ఐశ్వర్య= ఐశ్వర్యంచేత కలిగిన; మదంబునన్= గర్వంచేత; సత్పథంబున్= సన్మార్గాన్ని; కానక= లెక్కింపక; రంభాది= రంభ మొదలయిన; సుందరాంగులు= సౌందర్యవతులు; ఆడన్= నృత్యం చేయగా; పాడంగన్= గానం చేస్తుండగా; వినుతి= స్తోత్రం; చేయంగన్= చేయగా; వసు= అష్టవసువులు; రుద్రగణములు= రుద్రులు; ఆదిత్య= ఆదిత్యులు; మరుత్= మరుద్గణాలు; అశ్వినీదేవ= అశ్వినీదేవతలు; ఆది= మొదలయినవారి యొక్క; మండలములు= సమూహాలు; సిద్ధ= సిద్ధులు; చారణ= చారణులు; గంధర్వ= గంధర్వులు; జిహ్మగ= నాగములు; ఆది= మొదలుగాగల; సురలు= దేవతలు; మునులును; కొలువన్= సేవిస్తుండగా; ఒక్క= ఒక; భద్రాసనంబునన్= సింహాసనంపై; ఉక్కు= గర్వం; మీఱి= అతిశయింపగా.

**తా :** 'ఓ యోగీశ్వరా! ఇది చాలా ఆశ్చర్యం కలిగిస్తోంది. దేవతలపై బృహస్పతికి కోపం ఎందుకు వచ్చింది? విశ్వరూపుడు దేవతలకు కలిగిన ఏ ఆపదను తొలగించాడు? తెల్పు' మని పరీక్షిన్మహారాజు అడుగగా శుకుడు ఈ విధంగా చెప్తున్నాడు. 'ఇంద్రుడు త్రిలోకాధిపత్యగర్వంచేత సన్మార్గాన్ని లెక్కించకుండా, రంభాది అప్సరసలు నృత్యంచేస్తూ, గానంచేస్తూ తనను ప్రశంసిస్తూండగా, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుద్గణాలు, అశ్వినీదేవతలు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, మునులు తనను సేవిస్తూండగా సింహాసనం మీద గర్వంతో' (తరువాతి పద్యంలోని ఒప్పారె అనే దానితో అన్వయం.)

సీ. నిండు పున్నమనాఁడు గండరించిన చంద్ర మండల శ్రీలతో మాఱుమలయ
భద్రవిద్యోతాతపత్రంబు గ్రాలంగ మిన్నేటి తరఁగల మేలుకొలుపఁ
గలిత దివ్యాంగనా కరతల చాతుర్య చామర శ్రేణులు జాడపడఁగఁ
జింతామణి స్ఫుట కాంత రత్నానేక ఘటిత సింహాస నాగ్రంబునందు

తే. నూరుపీఠంబుపై శచి యుండ నుండి, వరుస దిక్పాలకాది దేవతలు గొలువ
సాటి చెప్పంగరాని రాజసముతోడ, నింద్రుఁ డొప్పారె వైభవసాంద్రుఁ డగుచు. 260

**ప్రతి :** భద్ర= మంగళప్రదమైన; విద్యోత= కాంతిగల; ఆతపత్రంబు= ఛత్రం; నిండుపున్నమనాడు= నిండుపూర్ణిమనాడు; గండరించిన= ఉదయించిన; చంద్రమండల శ్రీలతోన్= చంద్రబింబంయొక్క శోభలతో; మాఱుమలయన్= పోటీపడేటట్లు; క్రాలంగన్= ప్రకాశింపగా; కలిత= ఒప్పుతున్న; దివ్య+అంగనా= దేవకాంతల; కరతల= అరచేతుల; చాతుర్య= నేర్పరితనంకల; చామర శ్రేణులు= వింజామరల వరుసలు; మిన్ను+ఏటి= ఆకాశగంగయొక్క; తరఁగలన్= కెరటాలను; మేలుకొలుపన్= నిద్రలేపుటకై, వాటితో సమానమగుటకై; జాడపడగన్= నెమ్మదిగా కదలుచుండగా; చింతామణి= చింతామణి అనే పేరుగల; స్ఫుట= నిర్మలమైన; కాంత= అందమయిన; రత్న= రత్నాలతో; అనేక= పెక్కుచోట్ల; ఘటిత= పొదగబడిన; సింహాసన+అగ్రంబునందున్= గొప్పసింహాసనమునందు; ఊరుపీఠంబుపై= ఇంద్రుని తొడ అనే పీఠంపై; శచి= శచీదేవి; ఉండన్= కూర్చొని ఉండగా; వరుసన్= క్రమంగా; దిక్పాలక+ఆదిదేవతలు= దిక్పాలకులయిన అగ్ని మొదలయిన దేవతలు; కొలువన్= సేవింపగా; సాటి= పోలిక; చెప్పంగరాని= చెప్పడానికి శక్యంకాని; రాజసముతోడన్= రాజఠీవితో; ఇంద్రుండు= ఇంద్రుడు; వైభవ= సంపదలచే; సాంద్రుడు= దట్టమైనవాడు, గొప్పసంపదలు కలవాడు; అగుచున్= అవుతూ; ఒప్పారెన్= ప్రకాశించాడు.

**తా :** దేవేంద్రుని శిరస్సుపై పున్నమనాటి నిండు చంద్రునితో సరివచ్చే తెల్లగొడుగు ప్రకాశించగా, దేవకాంతలు చాతుర్యంతో విసిరే వింజామరల వరుసలు ఆకాశగంగా తరంగాలతో సమానంగా నెమ్మదిగా కదలుతూ ఉండగా, అనేక చింతామణి రత్నాలు పొదిగిన సింహాసనంమీద, తన ఊరువుపై శచీదేవి కూర్చొని ఉండగా; దిక్పాలకులు సేవిస్తూండగా సాటిలేని రాచఠీవితో, వైభవోపేతుడై ఇంద్రుడు కొలువు తీరాడు.

వ. అ య్యవసరంబున. 261

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయమందు...

క. గురుతర ధర్మక్రియ నయ, గురుఁడు మరున్మంత్ర విషయ గురుఁడు వచశ్శ్రీ
గురుఁడు సమస్తామరగణ, గురుఁడు గురుం దరుగుదెంచెఁ గొల్వునకు నృపా! 262

**ప్రతి :** నృపా!= రాజా!; నయగురుడు= నీతిశాస్త్రమునందు గొప్పవాడు; మరుత్= దేవతలకు; మంత్రవిషయ= రహస్యాలోచనములందు; గురుడు= ఉపదేశకుడు; వచశ్శ్రీ= వాక్సంపదలయందు; గురుడు= గొప్పవాడు; సమస్త+అమర+గణ= సమస్తదేవతల సమూహానికి; గురుడు= ఆచార్యుడు అయిన; గురుండు= బృహస్పతి; గురుతర= మిక్కిలి గొప్పదియైన; ధర్మక్రియన్= ధర్మకార్యమునిమిత్తం; కొల్వునకున్= సభకు; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తా :** ఆ సమయంలో, నీతికోవిదుడు, దేవతలకు రహస్యాలోచనములలో మార్గదర్శకుడు, వాగ్వేత్త, దేవతలందరకును గురువు అయిన బృహస్పతి ఒకానొక ధర్మకార్యనిమిత్తంగా ఇంద్రసభకు వచ్చాడు.

**చ.** **అమిత తపః ప్రభావుఁ గరుణాత్ముని గీష్పతిఁ జూచి రాజ్య దు**
**ర్దమ మదరేఖ నింద్రుఁడు వృథా తనగద్దియ లేవకుండె నె**
**య్యమున నెదుర్కొనం జనక యాసన మీయక గౌరవోప చా**
**రములఁ బ్రసన్నుఁ జేయక తిరంబుగ దివ్యసభాంతరంబునన్.** **263**

**ప్రతి :** ఇంద్రుఁడు= ఇంద్రుడు; దివ్యసభాంతరంబునన్= దేవలోకమునందు, దేవతల సభమధ్యలో; అమిత= హద్దులేని; తపః= తపస్సుయొక్క; ప్రభావున్= ప్రభావంకలవాడు; కరుణా+ఆత్ముని= దయాస్వభావంకలవాడూ అయిన; గీష్పతిన్= బృహస్పతిని; చూచి; రాజ్య= రాజ్యంచేత కలిగిన; దుర్దమ= అదుపుచేయ శక్యంకాని; మదరేఖన్= గర్వరేఖచేత; నెయ్యమునన్= ప్రీతితో; ఎదుర్కొనన్= ఎదురేగి స్వాగతం పలకటానికి; చనక= వెళ్ళక; ఆసన మీయక= కూర్చొనుటకు ఆసనం చూపించక; గౌరవ+ఉపచారములన్= గౌరవాన్ని ప్రకటించే క్రియలచేత; ప్రసన్నున్= అనుగ్రహంకలవానిగా; చేయక= చేసికొనక; తిరంబుగన్= స్థిరంగా; వృథా= వ్యర్థంగా; తన గద్దియ= తన సింహాసనంనుండి; లేవకుండె= లేవకుండా ఉన్నాడు.

**తా :** గొప్ప తపస్సంపన్నుడు, దయాస్వభావుడు, వాక్పతి అయిన బృహస్పతిని చూచి కూడా ఇంద్రుడు రాజ్యగర్వంతో ఆ బృహస్పతికి ఎదురేగలేదు. కూర్చోమని ఆసనం చూపించలేదు. ఎటువంటి గౌరవాలు చెయ్యలేదు. ఆయనను ప్రసన్నుణ్ణి చేసుకోలేదు. చివరకు తన సింహాసనంనుండి లేవనైనాలేవలేదు. ఇదంతా దేవతల నిండు సభలో జరిగింది.

**క.** **అప్పుడు సురపతి కన్నులఁ, గప్పిన సురరాజ్య మదవికారంబునకుం**
**జప్పుడు సేయక గృహమున, క ప్పుణ్యుఁడు దిరిగిపోయె నతిఖిన్నుండై** **264**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో; ఆ+పుణ్యుండు= పుణ్యాత్ముడైన ఆ బృహస్పతి; సురపతి= దేవేంద్రునియొక్క; కన్నులన్+కప్పిన= కన్నులు కనపడకుండగా చేసిన; సురరాజ్య= దేవతలకు రాజగుటచేత కలిగిన; మదవికారంబునకు= గర్వంచేత సంభవించి దుష్క్రియకు; చప్పుడుసేయక= నిశ్శబ్దంగా ఎటువంటి ప్రతిక్రియచేయక; అతిఖిన్నుండు+ఐ= మిక్కిలి దుఃఖితుడై; గృహమునకున్= ఇంటికి; తిరిగిపోయెన్= వెళ్ళిపోయాడు.

**తా :** స్వర్గరాజ్యాధిపత్యంతో దేవేంద్రుని కన్నులు మూసుకుపోయాయి. దాని ఫలితమే బృహస్పతికి కలిగిన అవమానం. దానికి బృహస్పతి ఏ ప్రతీకారం చెయ్యకుండా చాలా బాధపడుతూ ఇంటికి వెళ్ళిపోయాడు.

**చ.** **ఎఱుఁగమిఁ జేసినట్టి గురుహేళన మంత నెఱింగి యింద్రుఁ డ**
**చ్చెరుపడి భీతినొంది యతిచింతితుఁడై తలపోసి పల్కె న**
**ప్పరమపవిత్రు లోకనుతభవ్యచరిత్రు విశేష పాద పం**
**క రుహముఁ బూజసేయక యకర్మముఁ జేసితి నల్పబుద్ధి నై.** **265**

**ప్రతి :** అంతన్= అప్పుడు; ఇంద్రుఁడు= ఇంద్రుడు; ఎఱుగమిన్= అజ్ఞానంచేత; చేసిన+అట్టి= చేసినటువంటి; గురుహేళనము= గురుతిరస్కారాన్ని; ఎఱింగి= తెలిసికొని; అచ్చెరుపడి= ఆశ్చర్యపడి; భీతినొంది= భయపడి; అతిచింతితుఁడు+ఐ= మిక్కిలి

దుఃఖంకలవాడై; తలపోసి= ఆలోచించి; పల్కెన్= ఇలా అన్నాడు; అల్పబుద్ధిని+ఐ= బుద్ధిహీనుడనై; ఆ+పరమపవిత్రు= మిక్కిలి పవిత్రుడైన; లోక= లోకాలచేత; నుత= స్తుతింపబడిన; భవ్య= శుభమైన; చరిత్రు= చరిత్ర కలిగిన బృహస్పతియొక్క; విశేష= గొప్పదైన; పాదపంకరుహమున్= పాదపద్మాన్ని; పూజ+చేయక= పూజింపక; అకర్మమున్= చెడ్డపనిని; చేసితిని= చేశాను.

**తా :** బృహస్పతి వచ్చినవాడు వచ్చినట్లు వెళ్ళిపోయేసరికి ఇంద్రునికి తాను అవివేకంచేత చేసిన గురుతిరస్కారం తెలిసొచ్చింది. జరిగినదానికి ఆశ్చర్యపోయాడు, భయపడ్డాడు, దుఃఖపడ్డాడు. ఇలా అన్నాడు. బృహస్పతి పరమపవిత్రుడు. శుభచరిత్రకలవాడు. ఆయన చరిత్రను లోకాలన్నీ స్తుతిస్తున్నాయి. ఎంతో ప్రభావంగల బృహస్పతియొక్క పాదపద్మాలను పూజింపక మూర్ఖత్వంతో చెయ్యరాని పని చేశాను.

**క. త్రిభువన విభవ మదంబున, సభలో మద్గురువునకుఁ బ్రసన్నునకు లస**
**త్ప్రభువునకు నెగ్గు సేసితి, శుభములు దొలఁగంగ నే నసురభావమునన్. 266**

**ప్రతి :** నేను; త్రిభువన= ముల్లోకాలకు సంబంధించిన; విభవ= సంపదలచే కలిగిన; మదంబునన్= గర్వంచేత; అసురభావమునన్= రాక్షసస్వభావంచేత; ప్రసన్నునకున్= నాయందనుగ్రహం కలవాడును; లసత్+ప్రభువునకున్= ప్రకాశించేవాడూ, సమర్థుడూ అయిన; మత్+గురువునకున్= నాకు గురువైన బృహస్పతికి; శుభములు= మంగళములు; తొలగంగన్= పోవునట్లుగా; సభలోన్= సభయందు; ఎగ్గు= అవమానం; చేసితిన్= చేశాను.

**తా :** నా యందు ప్రసన్నుడూ, సమర్థుడూ అయిన నా ఆచార్యునకు త్రిభువన సంపదలచే గర్వించిన నేను అసురభావంతో నాకు శుభాలు పోయేటట్లుగా అవమానం చేశాను.

**ఆ. పారమేష్ఠ్య మయిన పదవి నొందిన భూపు లెట్టివారి కైన లేవవలదు,**
**విబుధులిట్లు సెప్పు విధమెన్న వారలు, ధర్మవేత్త లనుచుఁ దలఁపఁబడరు. 267**

**ప్రతి :** పారమేష్ఠ్యము+అయిన= చక్రవర్తికి సంబంధించిన; పదవిన్= స్థానాన్ని; ఒందిన= పొందిన; భూపులు= రాజులు; ఎట్టివారికిన్+ఐనన్= ఎంత గొప్పవారికైనా; లేవవలదు= లేచి నిలబడరాదు; ఇట్లు= ఈ విధంగా; విబుధులు= పండితులు; చెప్పు విధము= చెప్పే పద్ధతి; ఎన్నన్= ఆలోచింపగా; వారలు= ఆ పండితులు; ధర్మవేత్తలు+అనుచున్= ధర్మము తెలిసినవారు అని; తలఁపఁబడరు= గుర్తింపబడరు.

**తా :** ఎంతగొప్పవారు తన దగ్గరకు వచ్చినా చక్రవర్తి స్థానంలో ఉన్నవారు తమస్థానం నుండి లేవకూడదు అని చెప్పే పండితులను ధర్మవేత్తలుగా ఎవ్వరూ గుర్తించరు.

**తే. కుపథవర్తు లగుచుఁ గుత్సిత దుర్వచో, నిపుణు లైనవారు నిడివి దెలిసి**
**తొలఁగలేక తా రధోగతిఁ బడుదురు, తప్పులేక రాతితెప్ప భంగి. 268**

**ప్రతి :** కుపథ= చెడ్డమార్గమునందు; వర్తులు= ఉన్నవారు; అగుచున్= అవుతూ; కుత్సిత= జుగుప్సాకరమైనట్టి; దుర్+ వచః= దుష్టవాక్కులను పలుకుటయందు; నిపుణులు+ఐనవారు= నేర్పరులైనవారియొక్క; నిడివి= (పొడవు) తత్త్వం; తెలిసి= తెలిసికొని; తొలఁగలేక= తప్పించుకొనలేక; తప్పులేక= తమ దోషంలేకపోయిననూ; తారు= తాము, దుష్టుల ఉపదేశాలననుసరించినవారు; రాతితెప్పభంగి= రాతి పడవవలె; అధోగతిన్+పడుదురు= నీచ స్థితిని పొందుతారు.

**తా :** దుష్టమార్గంలో ఉండి చెడ్డమాటలు పలికేవారి ఉపదేశాలను అనుసరించేవారు ఉపదేశాలు చేసేవారి తత్త్వం తెలిసినా చేసిన దుష్కార్యాలను దిద్దుకోలేక తమ తప్పు లేకపోయినా రాతి పడవవలె అధోగతిపాలవుతారు.

**ఉ. కావున లోకవందితుని కార్యవిచారుని యింటి కేగి త**
**త్పావన పాదపద్మములపై మకుటంబు ఘటిల్ల మ్రొక్కి త**
**త్సేవ యొనర్చి చిత్తము వశించి ప్రసన్నునిఁ జేతు నంచు న**
**ద్దేవవిభుండు వోయె నతితీవ్రగతిం గురుధామ సీమకున్. 269**

**ప్రతి :** కావునన్= అందువలన; లోకవందితుని= లోకాలచే నమస్కరింపబడేవాడూ; కార్య విచారుడు= కార్యం తెలిసినవాడూ అయిన బృహస్పతియొక్క; ఇంటికిన్+ ఏగి= ఇంటికి పోయి; తత్= ఆ బృహస్పతియొక్క; పావన= పవిత్రమయిన; పాదపద్మములపై= పాదాలనే పద్మాలపై; మకుటంబు= కిరీటం; ఘటిల్ల= కూడునట్లుగా; మ్రొక్కి= నమస్కరించి; తత్+సేవ= ఆ బృహస్పతియొక్క సేవ; ఒనర్చి= చేసి; చిత్తము= అతని మనస్సును; వశించి= వశీకరించుకొని; ప్రసన్నునిన్= నా యందు దయకలవానినిగా; చేతును= చేసెదను; అంచున్= అనుకుంటూ; ఆ+దేవవిభుండు= ఆ దేవేంద్రుడు; అతి తీవ్రగతిన్= మిక్కిలి వేగంగా; గురుధామసీమకున్ : గురు= బృహస్పతియొక్క; ధామసీమకున్= గృహప్రదేశానికి; పోయెన్= వెళ్ళాడు.

**తా :** చెడ్డమార్గంలో పయనించేవాడు అధఃపతితుడౌతాడు. నేనావిధంగా కాకుండా ప్రజలచేత నమస్కరింపబడేవాడు; కార్యవిదుడు అయిన బృహస్పతి ఇంటికి వెడతాను. వారి పాదపద్మాలకు కిరీటం తాకేవిధంగా నమస్కరిస్తాను. వారిని సేవిస్తాను. వారి మనస్సు నాకు సుముఖంగా ఉండేటట్లు వారికి నా యందు దయకలిగేటట్లూ చేస్తాను. అని ఆలోచించి ఆ దేవేంద్రుడు శీఘ్రంగా బృహస్పతి గృహానికి వెళ్లాడు.

**సీ. ఈ రీతిఁ దనయింటి కేతెంచు దేవతా పతి రాక యా బృహస్పతి యెఱింగి**
**యధ్యాత్మమాయచే నడఁగి యదృశ్యుఁడై పోయె నప్పుడు దేవపుంగవుండు**
**సకలంబుఁ బరికించి జాడ గానక గురుఁ జింతించి తలపోసి చిన్న వోయెఁ**
**బోయిన విధమెల్ల దాయలు రాక్షస వీరులు వేగులవారివలనఁ**

**తే. దెలిసి మిక్కిలి తమలోనఁ దెలివి నొంది, యందఱును గూడి భార్గవు నాశ్రయించి**
**తత్కృపాదృష్టిఁ దమశక్తి దట్టమైన, దేవతలమీఁది దాడికిఁ దెరువు వెట్టి. 270**

**ప్రతి :** ఈ రీతిన్= ఈ విధంగా; తన యింటికిన్= తన గృహానికి; ఏతెంచు= వచ్చు; దేవతాపతి= దేవేంద్రునియొక్క; రాక= రావడం; ఆ బృహస్పతి; ఎఱింగి= తెలిసికొని; అధి+ఆత్మమాయచేన్= అధికమైన తన మాయాశక్తిచేత; అడఁగి= సూక్ష్మరూపుడై; అదృశ్యుడు+ఐ+పోయెన్= కానరాకుండెను; అప్పుడు; దేవపుంగవుండు= దేవశ్రేష్ఠుడయిన ఆ ఇంద్రుడు; సకలంబు= అంతా; పరికించి= పరీక్షించి; జాడ+కానక= బృహస్పతి జాడ తెలియక; గురున్= బృహస్పతిని గూర్చి; చింతించి= దుః ఖించి; తలపోసి= బృహస్పతిని గూర్చి ఆలోచించి; చిన్న+పోయెన్= చిన్నబుచ్చుకున్నాడు; పోయిన= జరిగిన; విధము+ఎల్లన్= పద్ధతి అంతా; దాయలు= శత్రువులయిన; రాక్షసవీరులు= రాక్షసయోధులు; వేగులవారివలనన్= చారులవలన; తెలిసి= తెలుసుకొని; తమలోనన్= తమలో; మిక్కిలి= అధికమయిన; తెలివిన్+ఒంది= తెలివితెచ్చుకొని;

అందఱును+కూడి= అందరూకలిసి; భార్గవున్= శుక్రాచార్యుణ్ణి; ఆశ్రయించి; తత్+కృపాదృష్టిన్= ఆ శుక్రాచార్యుల దయాదృష్టిచేత; తమ శక్తి= తమబలం; దట్టమైనన్= అధికంకాగా; దేవతలమీఁది= దేవతలమీదికి; దాడికిన్= దండెత్తుటకు; తెరువు+పెట్టి= త్రోవతీసి...

**తా :** దేవేంద్రుడు తన ఇంటికి వస్తున్నాడని తెలిసి బృహస్పతి తన మాయాశక్తి నుపయోగించి అదృశ్యుడైపోయాడు. దేవేంద్రుడు బృహస్పతి గృహాన్ని బాగా పరిశీలించికూడా బృహస్పతి జాడతెలిసికోలేకపోయాడు. చాలా దుఃఖపడ్డాడు. చిన్నబుచ్చుకున్నాడు. ఈ విషయం అంతా రాక్షసులకు వేగులవలన తెలిసింది. ఇదే అదనని వారు భావించి అందరూ కలిసికట్టుగా శుక్రాచార్యుణ్ణి ఆశ్రయించారు. శుక్రుని దయ వల్ల రాక్షసులశక్తి బాగాపెరిగింది. దేవతలమీద దాడికి వారు త్రోవతీసి

## ✤ దేవాసుర యుద్ధ ప్రారంభము ✤

**క. ధూర్తులు సమస్త కిల్బిష, మూర్తులు వర ధర్మ కర్మ మోచిత మార్గా**
**వర్తులు దుర్ణయ నిర్మిత, కీర్తులు దానవులు సనిరి గీర్వాణులపై. 271**

**ప్రతి :** ధూర్తులు= వంచకులు; సమస్త= అన్ని; కిల్బిష= పాపాలయొక్క; మూర్తులు= రూపాలు; వర= శ్రేష్ఠమయిన; ధర్మకర్మ= ధర్మకార్యాలచేత; మోచిత= విడిపింపబడిన; మార్గ= త్రోవలయందు; ఆవర్తులు= తిరిగేవారు; దుర్ణయ= దుష్టనీతియందు; నిర్మిత= చేయబడిన; కీర్తులు= కీర్తికలవారు అయిన; దానవులు= రాక్షసులు; గీర్వాణులపై= దేవతలపై; చనిరి= దండెత్తారు.

**తా :** రాక్షసులు వంచకులు. సమస్త పాపాలరూపాలు. అధర్మమార్గంలో సంచరించేవారు. అవినీతిలో పేరుగడించినవారు. అటువంటి రాక్షసులు దేవతలమీద యుద్ధానికి వెళ్లారు.

**స్రగ్ధర.**
**దండిం గోదండ కాండోద్ధత రథ హయ వేదండ తండంబుతోడన్**
**దండెత్తెన్ మెండుగా న ద్దనుజనికరముల్ దైవవర్గంబు మీఁదం**
**జండ బ్రహ్మాండభే ద్యోచ్ఛ్రయ జయరవముల్ సర్వదిక్ క్షోభగా ను**
**ద్దండ ప్రఖ్యాతలీలన్ దలపడిరి సురల్ దర్పులై వారి తోడన్. 272**

**ప్రతి :** ఆ+దనుజనికరముల్= ఆ రాక్షససమూహాలు; దండిన్= శౌర్యంతో; కోదండ= ధనుస్సుల; కాండ= బాణాలయొక్క; ఉద్ధత= మదించిన; రథ= రథాలయొక్క; హయ= గుర్రాలయొక్క; వేదండ= ఏనుగులయొక్క; తండంబులతోడన్= సమూహాలతో; చండ= భయంకరమైన; బ్రహ్మాండ= బ్రహ్మాండాలు; భేద్య= పగులగొట్టబడినవి గాగల; ఉచ్ఛ్రయ= ఆధిక్యంకల; జయరవముల్= జయజయధ్వనులు; సర్వదిక్క్షోభగాన్= సమస్తమయిన దిక్కులకు క్షోభకలుగ చేయగా; దైవవర్గంబు మీదన్= దేవతాసమూహాలపై; మెండుగాన్= అధికంగా; దండెత్తెన్= దాడి చేశాయి; సురల్= దేవతలు; దర్పులు+ఐ= గర్వముకలవారై; ఉద్దండ= అధికం; ప్రఖ్యాత= ప్రసిద్ధం అయిన; లీలన్= విధంగా; వారితోడన్= రాక్షసులతో; తలపడిరి= యుద్ధానికి తలపడ్డారు.

**తా :** రాక్షస సమూహాలు గొప్పపరాక్రమంతో బ్రహ్మాండం బ్రద్దలయ్యేంతగా భయంకరమయిన జయ జయ ధ్వనులు చేస్తూ ధనుర్బాణాలతో, రథాలతో, గుర్రాలతో, ఏనుగులతో దేవతలపై దండెత్తారు. దేవతలు ప్రసిద్ధ పద్ధతిలో దర్పంతో రాక్షసులతో తలపడ్డారు.

**చ. మదమున దేవదానవులు మచ్చరముల్ గడుఁ బిచ్చలింప సం**
**పదలను గోరి పోరునెడ భార్గవ మంత్రకళా విశేషులై**
**యెదురులు వాలి యస్త్రమున నేయ మహాసురు లేచియేచి పెం**
**గుదులుగఁ గ్రువ్వ దేవతలు కోల్తల కోర్వక పాఱి రయ్యెడన్. 273**

**ప్రతి :** దేవదానవులు= దేవతలు, రాక్షసులు; మదమునన్= గర్వంతో; మచ్చరముల్= ద్వేషాలు; కడున్= అధికంగా; పిచ్చలింపన్= అతిశయింపగా; సంపదలను= ఐశ్వర్యాలను; కోరి; పోరు+ఎడన్= యుద్ధం చేసే సమయంలో; ఎదురులు= శత్రువులయిన దేవతలు; వాలి= విజృంభించి; అస్త్రమునన్= ఆయుధంతో; ఏయన్= కొట్టగా; మహాసురులు= గొప్ప రాక్షసులు; భార్గవ= శుక్రాచార్యుని; మంత్రకళా= మంత్రకౌశలంవలన కలిగిన; విశేషులు+ఐ= విశేషశక్తి కలవారయి; ఏచి+ఏచి= మిక్కిలి విజృంభించి; పెన్+గుదులుగన్= పెద్దగుంపులుగా; క్రువ్వన్= బాణాలునాటునట్లు చేయగా; ఆ+ఎడన్= ఆ సమయంలో; దేవతలు; కోల్తలకున్= ఎదురునిలిచి యుద్ధం చేయటానికి; ఓర్వక= శక్తిలేక; పాఱిరి= పారిపోయారు.

**తా :** దేవతలు, రాక్షసులు ద్వేషాలు పెరిగిపోగా ఒకరి సంపదలు ఒకరు పొందాలని మదంతో యుద్ధం చేశారు. దేవతలు విజృంభించి అస్త్రం ప్రయోగిస్తే శుక్రాచార్యుల మంత్రప్రభావంచేత విశేషశక్తి పొందిన రాక్షసులు మరీ విజృంభించి గుంపులు గుంపులుగా బాణాలు నాటించేసరికి దేవతలు ముఖాముఖి యుద్ధానికి శక్తిలేక పలాయనం చిత్తగించారు.

**ఆ. దనుజవీరు లేయు దారుణ దివ్యాస్త్ర, దళితదేహు లగుచుఁ దలలు వీడ**
**నోడి పాఱి రద్భుతోపేత బలులైన, త్రిదశవరులు బిట్టు దిట్టినట్లు. 274**

**ప్రతి :** దనుజవీరులు= రాక్షసవీరులు; ఏయు= ప్రయోగించే; దివ్య+అస్త్ర= దివ్యాస్త్రాలచేత; దళిత= చీల్చబడిన; దేహులు+అగుచున్= శరీరాలు కలవారవుతూ; అద్భుత= ఆశ్చర్యాన్ని కలిగించేలా; ఉపేత= పొందబడిన; బలులు+ఐన= బలంకలవారయిన; త్రిదశవరులు= దేవతాశ్రేష్ఠులు; బిట్టు= గట్టిగా; తిట్టినట్లు= శపించినట్లు; పాఱిరి= పారిపోయారు.

**తా :** అద్భుతబలంకల దేవతలు రాక్షసవీరులు ప్రయోగించిన దివ్యాస్త్రాలచేత గాయపడి, ప్రాణాలు పోగొట్టుకోలేక ఎవరో శపించినట్లుగా పలాయనం చిత్తగించారు.

**విశే :** మహాత్ముల పట్ల చేసిన అపరాధమే దేవతల ఓటమికి కారణం అని ఈ సన్నివేశం సూచిస్తోంది.

**క. ఒక మొగము గాక దివిజులు, తికమక గొని వైరులెల్ల దీకొనఁ దమ్మున్**
**బకపకలై నకనక లై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్. 275**

**ప్రతి :** వైరులు+ఎల్లన్= శత్రువులయిన రాక్షసులందరూ; తమ్మున్= తమను; దీకొనన్= ఢీకొనగా; దివిజులు= దేవతలు; ఓడి= అపజయముపాలై; లోఁగొను= తమను వశం చేసికొనిన; భీతిన్= భయంతో; తికమక+కొని= తొట్రుపాటు పొంది; పకపకలై= చిందరవందరయై; నకనకలు+ఐ= కలతనొంది; లుకలుకన్= లుకలుకమంటూ; ఒక మొగముకాక= అనేక దిక్కులకు; పాఱిరి= పారిపోయారు.

**తా :** రాక్షసులందరు తమను ఢీకొనేసరికి దేవతలు ఓడిపోయి భయవశులై కకావికలై నలుదిక్కులకూ పారిపోయారు.

**చ.** **దనుజుల గర్వరేఖయును దానవవీరుల యంపజోకయున్**
**మనుజవిశేష భోజనుల మచ్చరికంబు నిశాటకోటి యే**
**చిన బల శౌర్యముం దమకు సిగ్గును హాని మహాభయంబు ని**
**ర్గుణతను జేయు నుమ్మలికఁ గోల్తల కోపక పాఱి రార్తులై. 276**

**ప్రతి :** దనుజుల= రాక్షసుల యొక్క; గర్వరేఖయును= నిండైన గర్వమూ; దానవవీరుల= రాక్షసవీరులయొక్క; అమ్ము+జోకయున్= బాణ విజృంభణమూ; మనుజవిశేషభోజనుల= మనుష్యులే విశేష భోజనంగాగల రాక్షసుల; మచ్చరికంబు= ద్వేషమూ; నిశాట= నిశాచరుల; కోటి= సమూహంయొక్క; ఏచిన= విజృంభించిన, బలశౌర్యమున్= బలమూ, పరాక్రమమూ; తమకున్= దేవతలకు; సిగ్గును; హానిన్= కీడును; మహాభయంబు= గొప్పభయాన్ని; నిర్గుణతను= గుణ రాహిత్యాన్ని; చేయన్= కలిగింపగా; ఉమ్మలికన్= శోకంచేత; కోల్తలకున్= ఎదిరించి యుద్ధం చేయటానికి; ఓపక= శక్తిలేక; ఆర్తులు+ఐ= దుఃఖితులై; పాఱిరి= పారిపోయారు.

**తా :** రాక్షసుల గర్వం, వారి బాణ విజృంభణం, వారి ద్వేషం, వారి బలపరాక్రమాలు దేవతలకు సిగ్గు, కీడు, భయం, నిశ్చేష్టతలను కలిగించేయి. ఆ దుఃఖంతో వారు రాక్షసులను ఎదిరించలేక (దేవతలు) పారిపోయారు.

**క.** **అమరులు విసృష్ట దానవ, సమరులు శరభిన్న దేహ సంతాపగుణ**
**భ్రమరులు దైత్య కిరాతక, చమరులు కమలజుని కడకుఁ జనిరి భయార్తిన్. 277**

**ప్రతి :** విసృష్ట= విడిచిపెట్టబడిన; దానవ= రాక్షసుల యొక్క; సమరులు= యుద్ధంకలవారూ; శర= బాణాలతో; భిన్న= చితికిన; దేహ= దేహం కారణంగా కలిగిన; సంతాపగుణ= దుఃఖంతో; భ్రమరులు= తిరుగుతున్నవారూ; దైత్య= రాక్షసులనే; కిరాతక= బోయవారికి; చమరులు= సవరపు మృగాలూ అయిన; అమరులు= దేవతలు; భయార్తిన్= భయంతోనైన దుఃఖంతో; కమలజుని కడకున్= బ్రహ్మ దగ్గరకు; చనిరి= వెళ్లారు.

**తా :** దేవతలు రాక్షసులనే బోయల చేతిలో చమరమృగాలైపోయారు. రాక్షసుల బాణాలతో గాయపడిన దేవతల శరీరాలు దుఃఖంతో తిరుగుడుపడుతున్నాయి. యుద్ధం విడిచిపెట్టి వారు దుఃఖంతో, భయంతో బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు.

**ఉ.** **ధాతకు దేవతా విభవదాతకుఁ బుణ్యజనానురాగ సం**
**ధాతకు సర్వలోక హితదాతకు వైదిక ధర్మమార్గ ని**
**ర్ణేతకు నుల్లస ద్విభవ నేతకు సర్వజగ జ్జయాంగజ**
**భ్రాతకుఁ బుణ్య యోగిజన భావవిజేతకు మ్రొక్కి రయ్యెడన్. 278**

**ప్రతి :** దేవతలు, ఆ+ఎడన్= ఆ సమయంలో; దేవతా= దేవతలకు; విభవ= వైభవాన్ని; దాతకున్= ఇచ్చేవాడూ; పుణ్యజన= పుణ్యాత్ములపట్ల; అనురాగ= ప్రీతిని; సంధాతకు= కూర్చేవాడూ; సర్వ= సమస్తమయిన; లోక= లోకాలకు; హిత= శ్రేయస్సును; దాతకున్= ఇచ్చేవాడూ; వైదిక= వేదోక్తమయిన; ధర్మమార్గ= ధర్మమార్గాన్ని; నిర్ణేతకున్= నిర్ణయించేవాడును; ఉల్లసత్= ప్రకాశించే; విభవ= సంపదలకు; నేతకున్= నాయకుడూ; సర్వ= సమస్తమయిన; జగత్+జయ= జగత్తులపై

జయంకల; అంగజ= మన్మథునకు; భ్రాతకున్= సోదరుడూ; పుణ్య= పవిత్రులయిన; యోగిజన= యోగుల; భావ= మనస్సును; విజేతకున్= జయించినవాడూ అయిన; ధాతకున్= బ్రహ్మకు; మ్రొక్కిరి= నమస్కరించారు.

**తా :** అపుడు దేవతలకు సంపదల నిచ్చేవాడూ, పుణ్యాత్ములయందనురాగంకలవాడూ, సర్వలోకాలకూ శ్రేయస్సును కూర్చేవాడూ, వేదోక్త ధర్మమార్గాన్ని నిర్ణయించేవాడూ, గొప్ప సంపదలకు నాయకుడూ, సర్వజగత్తులనూ జయించే మన్మథునకు సోదరుడూ, పవిత్రులయిన యోగిజనుల మనస్సులను జయించినవాడూ అయిన బ్రహ్మకు దేవతలు నమస్కరించారు.

**క. ఆఖండలుండు మొదలుగ, లేఖానీకముల బ్రహ్మ లేనగవున ని**
**త్యాఖండ సత్కృపారస, శేఖర వాక్యముల వారి సేదలు దేర్చెన్. 279**

**ప్రతి :** బ్రహ్మ; లేత+నగవునన్= చిరునవ్వుతో; నిత్య= నాశములేని; అఖండ= నిండయిన; సత్+కృపారస= చక్కని దయారసానికి; శేఖర= తలమానికమయిన; వాక్యముల= మాటలు అనే; వారిన్= నీటితో; ఆఖండలుండు మొదలుగ= ఇంద్రుడు మొదలయిన; లేఖ+అనీకముల= దేవతాసమూహాల; సేదలు= బడలికలు; తేర్చెన్= తీర్చాడు.

**తా :** బ్రహ్మ చిరునవ్వుతో, చెడని, నిండయిన, దయతో కూడిన మాటల జలంతో ఇంద్రాది దేవతల బడలికలు పోగొట్టాడు.

**వ. ఇట్లు బ్రహ్మదేవుండు దేవేంద్రప్రముఖులైన దేవతల కనుకంపాతివిభవంబున నభయం బొసంగి యిట్లనియె. 280**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బ్రహ్మదేవుండు= బ్రహ్మదేవుడు; దేవేంద్రప్రముఖులయిన= దేవేంద్రుడు మొదలుగాగల; దేవతలకున్= దేవతలకు; అనుకంపా+అతివిభవంబున= మిక్కుటమయిన; అభయంబు= శరణం; ఒసంగి= ఇచ్చి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** బ్రహ్మదేవుడు దయాతిశయంతో దేవతలకు అభయం ఇచ్చి ఈ విధంగా అన్నాడు.

**ఉ. నెట్టనఁ బాపకర్మమున నేరమిఁ జేసితి రేమి చెప్ప! మీ**
**పుట్టిన నాఁటనుండియును బుద్ధులు సెప్పి జగంబు లేలఁగాఁ**
**బట్టముఁ గట్టి పెంచిన కృపానిధి బ్రహ్మకళా విధిజ్ఞుఁ జే**
**పట్టక గుట్టు జాఱి సిరిపట్టునఁ దొట్టిన పొట్ట క్రొవ్వునన్. 281**

**ప్రతి :** మీపుట్టిననాటనుండియును= మీరు పుట్టినప్పటి నుండి; బుద్ధులు సెప్పి= జ్ఞానం కలిగించి; జగంబులేలగాన్= లోకాలను పరిపాలించడానికి; పట్టమున్+కట్టి= పట్టాభిషేకం చేసి; పెంచిన= మిమ్మల్ని వృద్ధిలోకి తెచ్చిన; కృపానిధిన్= దయానిధి అయిన; బ్రహ్మకళావిధిజ్ఞున్= బ్రహ్మవేత్త అయిన బృహస్పతిని; చేపట్టక= స్వీకరింపక; గుట్టుజారి= ధైర్యం కోల్పోయి; సిరిపట్టునన్= సంపదకారణంగా; తొట్టిన= పెరిగిన; పొట్టన్= పొట్టయొక్క; క్రొవ్వునన్= కొవ్వుచేత; నెట్టనన్= పూనికతో; పాపకర్మమునన్= పాపపుపని చేసి; నేరమిన్= అపరాధాన్ని; చేసితిరి= చేశారు; ఏమి చెప్పను!

**తా :** మీరు పుట్టిననాటి నుండి మీకు జ్ఞానాన్నిచ్చి, లోకాలను పరిపాలించడానికి రాజ్యాభిషేకంచేసి మిమ్మల్ని పెంచిన దయాళువు, బ్రహ్మజ్ఞాన నిధి అయిన బృహస్పతిని లక్ష్యపెట్టక, నిగ్రహం కోల్పోయి ఐశ్వర్యం వలన పొట్టలు పెరిగి కొవ్వుపట్టి పూనికతో పాపపుపని చేసి తప్పుచేశారు. ఏం చెప్పేది?

**వ. బ్రహ్మిష్ఠుఁడైన బ్రాహ్మణు నాచార్యుం గైకొనక గురు ద్రోహంబుఁ జేసితిరి. తద్దోషం బిపుడు మీకుఁ జేసేఁత శత్రుకృతం బై యనుభవింపం జేసె. అతి బలవంతులైన మిమ్ము నతిక్షీణులైన రాక్షసులు జయించుట, తమ యాచార్యుండైన శుక్రు నారాధించి తన్మంత్ర ప్రభావంబునఁ బునర్లబ్ధవీర్యు లగుటచేతనే ఇప్పుడు మదీయం బైన నిలయంబు నాక్రమింపం గలవారై మదోద్రేకంబున నెదురులేక వర్తిల్లుచున్న రక్షోనాయకులకుఁ ద్రిదివంబుఁ గొనుట తృణప్రాయంబు. అభేద్య మంత్రబలంబు గల భార్గవునకు వారు శిష్యులగుటం జేసి విప్రగోవింద గవేశ్వరానుగ్రహంబు గలవారలకుఁ దక్కం దక్కిన రాజుల కరిష్టం బగు. కావున మీరిప్పుడు త్వష్ట యను మను పుత్రుం డగు విశ్వరూపుండను ముని నిశ్చల తపో మహత్త్వ సత్త్వస్వభావుం డగు నతని నారాధించిన, మీకు నభీష్టార్థంబు నతండు సంఘటిల్లఁజేయు. ఎట్టి దుర్దశల నైన నతం డడంచు అని చెప్పిన దిక్పాలకాదులు డెందంబులు డిందుపడి, కమలగర్భుని వీడ్కొని, విశ్వరూపు కడకుం జని యిట్లనిరి. 282**

**ప్రతి :** బ్రహ్మిష్ఠుఁడు+ఐన= బ్రహ్మజ్ఞాని అయిన; బ్రాహ్మణున్= బ్రాహ్మణుడయిన; ఆచార్యున్= ఆచార్యుణ్ణి; కైకొనక= లక్ష్యపెట్టక; గురుద్రోహంబున్= గురువులకు కీడు; చేసితిరి= చేశారు; తత్+దోషంబు= ఆ దోషం; ఇపుడు; మీకున్= మీకు; చేసేతన్= వెంటనే; శత్రుకృతంబు+ఐ= శత్రువులచే చేయబడినదై; అనుభవింపన్+చేసెన్= అనుభవించేటట్లు చేసింది; అతిబలవంతులు+అయిన= మిక్కిలి బలంకల; మిమ్మున్= మిమ్ము; అతిక్షీణులు+అయిన= మిక్కిలి అల్పులయిన; రాక్షసులు; జయించుట= గెలుచుట; తమ= తమయొక్క; ఆచార్యుండు+ఐన= గురువైన; శుక్రున్= శుక్రాచార్యులను; ఆరాధించి= సేవించి; తత్+మంత్రప్రభావంబునన్= ఆ శుక్రుని మంత్రమహిమచేత; పునర్+లబ్ధవీర్యులు+అగుటచేతన్+ఎ= తిరిగి, పొందబడిన, బలముకలవారగుటచేతనే; ఇప్పుడు; మదీయంబు+ఐన= నాదైన; నిలయంబున్= నివాసమయిన సత్యలోకమును; ఆక్రమింపంగలవారు+ఐ= ఆక్రమించుటకు సమర్థులై; మద+ఉద్రేకంబునన్= గర్వాతిశయంచేత; వర్తిల్లుచున్న= ప్రవర్తిస్తూన్న; రక్షోనాయకులకున్= రాక్షసనాయకులకు; త్రిదివంబున్= స్వర్గమును; కొనుట= వశపరచుకొనుట; తృణప్రాయంబు= గడ్డిపోచతో సమానం (మిక్కిలి తేలిక); అభేద్య= నాశనం చేయడానికి శక్యంకాని; మంత్రబలంబు+కల= మంత్రశక్తికల; భార్గవునకున్= శుక్రునకు; వారు= రాక్షసులు; శిష్యులు= శిష్యులు; అగుటన్+చేసి= కావడంవలన; విప్ర= వేదవిదులయొక్క; గోవింద= విష్ణువుయొక్క; గో+ఈశ్వర= గోవులయొక్క, పరమేశ్వరుని యొక్క; అనుగ్రహంబు= దయ; కలవారలకు+తక్కన్= కలవారలకు మినహా; తక్కిన రాజులకున్= మిగిలిన రాజులకు; అరిష్టంబు+అగున్= కీడు కలుగుతుంది; కావునన్= అందువలన; మీరు; ఇప్పుడు; త్వష్ట+అను= త్వష్ట అనే పేరుగల; మనుపుత్రుండు+అగు= మనువుయొక్క కొడుకైన; విశ్వరూపుండు+అను= విశ్వరూపుడు అనే పేరుగల; మునిన్= మునియు; నిశ్చల= స్థిరమయిన; తపః= తపస్సుయొక్క; మహత్త్వ= మహిమ; సత్త్వ= సత్త్వగుణం; స్వభావుండు+అగు= స్వభావంగాగల వాడూ అయిన; అతనిన్= ఆ విశ్వరూపుణ్ణి; ఆరాధించినన్= సేవిస్తే; అతండు= ఆ విశ్వరూపుడు; మీకున్= మీకు; అభీష్ట+అర్థంబు= కోరిన ప్రయోజనమును; సంఘటిల్లన్+చేయు= సమకూరునట్లు చేస్తాడు; ఎట్టి= ఎటువంటి; దుర్+దశలను+ఐనన్= ఆపదలనైనను; అతండు= ఆ విశ్వరూపుడు; అడంచున్= తొలగిస్తాడు; అని= ఈ విధంగా; చెప్పినన్= చెప్పగా; దిక్+పాలక+ఆదులు= దిక్పాలకులయిన అగ్ని మొదలయినవారు; డెందంబులు= హృదయాలు; డిందుపడి= శాంతించి; కమలగర్భునిన్= బ్రహ్మదేవుని; వీడ్కొని= వదలి; విశ్వరూపు కడకున్= విశ్వరూపుని దగ్గరకు; చని= పోయి; ఇట్లు+అనిరి= ఈ విధంగా పలికారు.

**తా :** బ్రహ్మ జ్ఞానినీ బ్రాహ్మణుడూ అయిన ఆచార్యుణ్ణి సరకుసేయక మీరు గురుద్రోహం చేశారు. ఆ దోషం శత్రురూపంలో వెంటనే దాని ఫలాన్ని అనుభవింప చేసింది. బలవంతులైన మిమ్మల్ని బలహీనులయిన రాక్షసులు జయించడం తమ ఆచార్యుడయిన శుక్రుణ్ణి ఆరాధించి ఆయన మంత్రప్రభావంతో బలవంతులు కావటం వల్లనే వారు నా సత్యలోకాన్ని కూడా ఆక్రమించే సామర్థ్యం కలిగి గర్వంతో ఉన్నారు. వారికి స్వర్గాన్ని ఆక్రమించడం తృణప్రాయం. గొప్ప మంత్రబలంకల శుక్రాచార్యునకు వారు శిష్యులైన కారణంగా విప్రుల, గోవిందుని, గోవుల, ఈశ్వరుని అనుగ్రహం కలవారు మినహా మిగిలిన రాజులకు అరిష్టం తప్పదు. అందువలన మీరు త్వష్టమనువుపుత్రుడయిన విశ్వరూపుడనే మునిని ఆరాధించండి. ఆయన గొప్ప తపోమహిమకలవాడు. సత్త్వస్వభావుడు. మీరు కోరిన దానిని సమకూర్చగలడు. ఎంతటి ఆపదలనైనా తొలగింపగలడు. ఈ విధంగా బ్రహ్మ చెప్పేసరికి దేవతలకు శాంతి కలిగింది. వారు బ్రహ్మదేవుని దగ్గర సెలవు తీసికొని విశ్వరూపుని దగ్గరకు వెళ్ళి ఈ విధంగా అన్నారు.

**తే. అన్న! మేలగు నీకు ని న్నడుగఁ గోరి, వచ్చినారము భవదీయ వనమునకునుఁ**
**దండ్రులకు నేఁడు సమయోచితంబు లైన, కోర్కు లొనఁగూడఁజేసి చేకొనుము యశము. 283**

**ప్రతి :** అన్న!= నాయనా!; నీకున్= నీకు; మేలు+అగున్= శుభమగు గాక! నిన్ను; అడుగన్= అడుగుటకు; కోరి; భవదీయవనమునకున్= నీ ఆశ్రమానికి; వచ్చినారము= వచ్చాం; నేడు= ఈ రోజున; తండ్రులకున్= తండ్రులమైన మాకు; సమయ+ఉచితంబులు+ఐన= సమయానికి తగినవైన; కోర్కులు= కోరికలు; ఒనఁగూడన్+చేసి= సమకూర్చి; యశమున్= కీర్తిని; చేకొనుము= పొందు.

**తా :** నాయనా! నీకు శుభం. నిన్ను ఒకటి అడగడంకోసం నీ ఇంటికి వచ్చాం. తండ్రులతో సమానులమైన మా కోరిక తీర్చి కీర్తి సంపాదించు.

**క. సుతులకుఁ బితృశుశ్రూషణ, మతిపుణ్యము సేయుచుండు నాత్మజులు గుణో**
**న్నతి బ్రహ్మచారు లైనను, మతితో గురుసేవకన్న మఱియుం గలదే? 284**

**ప్రతి :** సుతులకున్= కొడుకులకు; పితృశుశ్రూషణము= తండ్రులసేవ; అతి పుణ్యము= గొప్పపుణ్యమును; చేయుచుందును= కలిగిస్తుంది; ఆత్మజులు= కొడుకులు; గుణ+ఉన్నతిన్= గొప్పగుణాలచేత; బ్రహ్మచారులు+ఐనను= వివాహితులు కాకపోయినను; మతితోన్= బుద్ధితో – గురుశుశ్రూష చేయాలి; గురుసేవకన్న= తండ్రి సేవకంటె; మఱియున్= గొప్పదైన మరొకటి; కలదు+ఏ= ఉన్నదా? లేదు.

**తా :** కొడుకులకు తండ్రిసేవ మహాపుణ్యాన్నిస్తుంది. కొడుకులు ఉన్నతగుణాలు కలిగినవారై బ్రహ్మచారులుగానే ఉండిపోయినా శ్రద్ధగా పితృదేవ సేవ చెయ్యాలి. పితృసేవకంటె గొప్పది మరొకటేముంది?

**వ. అదియునుం గాక. 285**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక...

**తా :** అంతేగాక

**సీ. అరయ నాచార్యుండు పరతత్త్వరూపంబు, దండ్రి తలంపంగ ధాతరూపు,**
**రూపింప భ్రాత మరుత్పతి రూపంబు, దెలియంగఁ దల్లి భూదేవిరూపు**
**భగిని కరుణరూపు, భావంబు ధర్మ స్వరూపంబు దా నర్థిరూపు మొదల**
**నభ్యాగతుఁడు మున్న యగ్ని దేవుని రూపు సర్వభూతములుఁ గేశవుని రూపు**

**తే. గానఁ దండ్రి! వేగఁ గడు నార్తులగు పితృ, జనుల మైన మమ్ముఁ జల్లఁ జూచి**
**పరభయంబు వాపి నిరుపమం బగు తపో, మహిమచేత మెఱసి మనుపవయ్య! 286**

**ప్రతి :** అరయన్= ఆలోచింపగా; ఆచార్యుండు= గురువు; పరతత్త్వరూపంబు= పరబ్రహ్మ స్వరూపం; తలంపంగన్= ఆలోచింపగా; తండ్రి; ధాతరూపు= బ్రహ్మదేవుని స్వరూపం; రూపింపన్= ఆలోచింపగా; భ్రాత= సోదరుడు; మరుత్+పతిరూపంబు= ఇంద్రుని రూపం; తెలియంగన్= తెలిసికొనగా; తల్లి; భూదేవిరూపు= భూదేవి రూపం; భగిని= సోదరి; కరుణ రూపు= దయారూపమైన; భావంబు= పదార్థం; మొదలన్= మొదట; అర్థిరూపు= అతిథి; తాను; ధర్మస్వరూపంబు= ధర్మరూపం; అభ్యాగతుడు= సమయానికి వచ్చిన అతిథి; మున్ను+అ= ముందుగానే; అగ్నిదేవుని రూపు= అగ్నిదేవుని రూపం; సర్వభూతములు= సర్వప్రాణులు; కేశవునిరూపు= విష్ణువు రూపాలు; కానన్= అందువలన; తండ్రి!; వేగన్= శీఘ్రంగా; కడు+ఆర్తులు+అగు= మిక్కిలి దుఃఖితులైన; పితృజనులము+ఐన= తండ్రులమైన; మమ్మున్= మమ్ము; చల్లన్= చల్లగా; చూచి; పరభయమును= శత్రుభయాన్ని; పాపి= పోగొట్టి; నిరుపమంబు+అగు= సాటిలేని; తపోమహిమచేతన్= తపఃప్రభావంచేత; మెఱసి= ప్రకాశించి; మనుపుము+అయ్య= బ్రతికింపుమయ్య!

**తా :** ఆచార్యుడు పరబ్రహ్మస్వరూపం. తండ్రి బ్రహ్మదేవుని రూపం. సోదరుడు ఇంద్ర స్వరూపం; తల్లి భూదేవి రూపం. సోదరి కరుణ రూపం. అతిథి ధర్మస్వరూపుడు. అభ్యాగతుడు అగ్నిదేవుని రూపం; సర్వప్రాణులు విష్ణు స్వరూపం; అందువలన నాయనా! కడు దుఃఖితులము, నీకు తండ్రితో సమానులము అయిన మమ్ము చల్లగాచూచి శత్రుభయం పోగొట్టుము. అఖండ తపస్సుతో విరాజిల్లు. మమ్ము బ్రతికించు.

**వ. ఇప్పుడు బ్రహ్మనిష్ఠుండ వైన నిన్ను నా చార్యునిఁగా వరించి, భవదీయ తేజో విశేషంబుచేత వైరివీరులం బరిమార్చెదము. ఆత్మీయార్థంబైన యవిష్ఠ పాదాభివందనంబు నిందితంబు గాదని వేదవాక్యంబు గలదు. కావున నీవు నమస్కరించుచున్న దేవతలం గైకొని పౌరోహిత్యంబు సేయుము అనినఁ బ్రహసిత వదనుండై య మ్మునీశ్వరుం డిట్లనియె. 287**

**ప్రతి :** ఇప్పుడు; బ్రహ్మనిష్ఠుండవు+ఐన= బ్రహ్మజ్ఞానివైన; నిన్నున్= నిన్ను; ఆచార్యునిగాన్= గురువుగా; వరించి= స్వీకరించి; భవదీయతేజః+విశేషంబుచేతన్ : భవదీయ= నీదైన; తేజః+విశేషంబుచేతన్= గొప్పదైన ప్రభావంచేత; వైరివీరులన్= శత్రువీరులను; పరిమార్చెదము= చంపుతాము; ఆత్మీయ+ఆర్థంబు+ఐన= తమకోసమైన; యవిష్ఠ= చిన్నవారియొక్క; పాదాభివందనము= పాదాలకు నమస్కారం; నిందితంబుకాదు+అని= తప్పుకాదని వివరించే; వేదవాక్యంబు= వేదవాక్యం; కలదు= ఉన్నది; కావునన్= ఆకారణముచే; నీవు; నమస్కరించుచున్నదేవతలన్= నమస్కారం చేస్తున్న దేవతలను; కైకొని= స్వీకరించి; పౌరోహిత్యంబు= పురోహితకృత్యాన్ని; చేయి; అనినన్= అనగా; ప్రహసిత వదనుండు+ఐ= గొప్ప నవ్వుమొగంకలవాడై; ఆ+ముని+ఈశ్వరుండు= ఆ మునిశ్రేష్ఠుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** బ్రహ్మజ్ఞానివైన నిన్ను ఆచార్యునిగా స్వీకరించి నీ ప్రభావంతో శత్రువుల్ని సంహరిస్తాం. తనకోసం తనకంటె చిన్నవానికి పాద నమస్కారం చెయ్యడంలో తప్పులేదని వేదాలు చెప్తున్నాయి. నమస్కారం చేస్తున్న దేవతలమైన మమ్మల్ని అంగీకరించి మాకు పురోహితునిగా ఉండడానికి అంగీకరించు అనగానే ఆ విశ్వరూపుడు గట్టిగానవ్వి ఈ విధంగా అన్నాడు.

**ఆ.  బ్రహ్మతేజంబు వోయెడి ప్రార్థనంబు, ధర్మగుణ గర్హితం బని తా నెఱింగి**
**సొరిది ననుబోఁటి తపసి యీ సురల చేతఁ, బ్రకట మధురోక్తి నేటికిఁ బలుకఁబడియె? 288**

**ప్రతి :** బ్రహ్మతేజంబు= బ్రహ్మవర్చస్సు; పోయెడి= నశించెడి; ప్రార్థనంబు= ప్రార్థింపబడిన పౌరోహిత్యం; ధర్మగుణ= ధర్మగుణంకలవారి చేత; గర్హితంబు+అని= దూషింపబడినది అని; తాను= నేను; ఎఱింగి= తెలిసికొనికూడా; సొరిదిన్= తగిన విధంగా; ననుబోఁటి= నావంటి; తపసి= ముని; ఈ సురలచేతన్= ఈ దేవతలచేత; ప్రకట= తేటతెల్లమూ; మధుర= తీయనిదీ అయిన; ఉక్తిచేన్= మాటతో; ఏటికిన్= ఎందులకు; పలుకఁబడియె= అడుగబడింది.

**తా :** వీరుకోరిన పౌరోహిత్యం బ్రహ్మతేజస్సును నశింపచేసేది, ధర్మశీలురచే నిందింపబడేది అని తెలిసిన నావంటి తపస్వితో ఈ దేవతలు ఇంత తేటతెల్లంగా తియ్యగా ఎలా చెప్పారో!

**వ.  విశేషించి. 289**

**ప్రతి :** విశేషించి= ప్రత్యేకించి...

**తా :** ప్రత్యేకంగా

**క.  గురుధనముఁ గూర్పనేటికి, గురుశిక్షం దగిలి మంత్రకోవిదులై స**
**ద్గురుధర్మ నిరతు లేనియు, గురువులకును శిష్యవరులె కూర్చిన ధనముల్. 290**

**ప్రతి :** గురుధనమున్= గురువులకు ధనమును; శిష్యులు; కూర్పన్= సమకూర్చుట; ఏటికిన్= ఎందులకు?; గురుశిక్షన్= గురువులవద్ద ఉపదేశాన్ని; తగిలి= పొంది; మంత్రకోవిదులు+ఐ= మంత్రజ్ఞులై; సత్= మంచిదీ; గురు= గొప్పదీ అయిన; ధర్మ= ధర్మమునందు; నిరతులేనియున్= ఆసక్తి గలవారయితే; గురువులకున్= గురువులకు; శిష్యవరులు+ఎ= శ్రేష్ఠులైన శిష్యులే; కూర్చిన= సంపాదించిపెట్టబడిన; ధనముల్= సంపదలు.

**తా :** శిష్యులు గురువులకు దక్షిణ రూపంలో ధనం ఈయవలసిన ఆవశ్యకతలేదు. గురూపదేశంపొంది, మంత్రవిదులై, ధర్మాన్ని అనుష్ఠించే శిష్యులే గురువులకు సంపదలు.

**సీ.  అరయ నకించను లై నట్టివారికిఁ దగు శిలోంఛనవృత్తి ధనము సుమ్ము,**
**దానిచే నిర్వర్తిత ప్రియసాధు సత్క్రియ గలవారలై ప్రీతినొందె**
**దరు గాన సద్గర్హితాచారమైన యాచార్యత్వ మిపుడు మీ శాసనమునఁ**
**గైకొంటి, గురువుల కామంబు బ్రాణార్థ వంచనములు లేక వడి నొనర్తు**

**ఆ.  ననుచు విశ్వరూపుఁ డనియెడి ముని ప్రతి జ్ఞోక్తిఁ బలికె వారి నూఱడించి**
**మహిత మైన తత్సమాధిచే గురుభావ, మమరఁ జేసె దేవసమితి కపుడు. 291**

**ప్రతి :** అరయన్= ఆలోచింపగా; అకించనులు+ఐన+అట్టివారికిన్= దరిద్రులయిన వారికి; తగు= యోగ్యమయిన; శిలోంఛనవృత్తి= శిలోంఛనవృత్తియే; ధనము సుమ్ము= ధనం సుమా; దానిచేన్= శిలోంఛనవృత్తిచే; నిర్వర్తిత= చేయబడిన; ప్రియ= ప్రియమైన; సాధు= సత్పురుషులయొక్క; సత్క్రియ= సత్కారం, ఆతిథ్యం; కలవారలు+ఐ= కలిగినవారై; ప్రీతిన్= తృప్తిని; ఒందెదరు= పొందుతారు; కానన్= అందువలన; సత్+గర్హిత+ఆచారము+ఐన : సత్= సజ్జనులచేత; గర్హిత= నిందింపబడిన; ఆచారము+ఐన= పనియైన; ఆచార్యత్వము= పౌరోహిత్యం; ఇపుడు; మీ శాసనమునన్= మీ ఆజ్ఞచేత; కైకొంటిన్= స్వీకరించితిని; గురువుల= తండ్రులయిన మీ యొక్క; కామంబు= కోరిక; ప్రాణ= ప్రాణములయొక్క; అర్థ= ధనముయొక్క; వంచనములు= మోసాలు, దాపరికాలు; లేక= విడిచి; వడిన్= శీఘ్రంగా; ఒనర్తును= సమకూరుస్తాను; అనుచున్= ఈ విధంగా పలుకుతూ; విశ్వరూపుడు+అనియెడి= విశ్వరూపుడనే పేరుగల; ముని; ప్రతిజ్ఞా+ఉక్తిన్= శపథపు మాటను; పలికెన్= పలికాడు; అపుడు; వారిన్= దేవతలను; ఊఱడించి= ఓదార్చి; మహితము+ఐన= గొప్పదైన; తత్సమాధిచేన్= ప్రసిద్ధమగు ఏకాగ్రతతో; దేవసమితికిన్= దేవతాసమూహానికి; గురుభావము= గురుత్వమును; అమరన్+చేసెన్= సమకూర్చాడు.

**తా :** ధనహీనులైనవారికి శిలోంఛనవృత్తియే ధనం. దానిచేతనే సత్పురుషులకాతిథ్య మిచ్చి తృప్తిపడుతారు. నీచమైన పద్ధతిలో పౌరోహిత్యం వలన ధనం సంపాదింపనవసరంలేదు. కాని మీ ఆజ్ఞ ననుసరించి మీకాచార్యుడుగా ఉండటానికి అంగీకరించాను. ప్రాణాలను ధనమును దాచుకొనక మీకభీష్టమును సమకూరుస్తాను. అని విశ్వరూపుడు శపథంచేసి ఏకాగ్రతతో దేవతలకు పౌరోహిత్యాన్ని చేశాడు.

**విశే :** శిలవృత్తియనగా మళ్లలోని ధాన్యపు కంకులనేరుకొని బతకడం. ఉంఛమనగా రోళ్లమొదట పడ్డ గింజలనేరుకొని జీవించడం. కొందరు శిలోంఛనమును ఒకటిగానే చెప్పటం కూడా ఉన్నది.

**క. భార్గవవిద్యా గుప్త, స్వర్గశ్రీ ద్విగుణ దనుజ సమధిక సంప**
**ద్వర్గముల విష్ణుమాయా, నర్గళగతిఁ దెచ్చి యింద్రునకు నిచ్చె నృపా! 292**

**ప్రతి :** నృపా!= రాజా!; భార్గవ= శుక్రుని; విద్యా= నీతిచే; గుప్త= రక్షింపబడిన; స్వర్గశ్రీ= స్వర్గసంపదలచేత; ద్విగుణ= రెట్టింపయిన; దనుజ= రాక్షసులయొక్క; సమధిక= మిక్కుటమైన; సంపత్= సంపదలయొక్క; వర్గములన్= సమూహాలను; విష్ణుమాయా= విష్ణుమాయయొక్క; అనర్గళ= అడ్డులేని; గతిన్= ప్రసారముచేత; తెచ్చి; ఇంద్రునకున్+ఇచ్చెను= ఇంద్రునకు ఇచ్చాడు.

**తా :** శుక్రాచార్యుల నీతిచేత స్వర్గసంపదలు రాక్షసులకు వశమయ్యాయి. స్వర్గసంపదలు కలిసి రాక్షససంపదలు రెట్టింపయ్యాయి. వాటికి శుక్రాచార్యులవారి నీతియే రక్ష. విశ్వరూపుడు అడ్డులేని విష్ణుమాయ ప్రభావంతో ఆ సంపదలను తెచ్చి ఇంద్రుని వశం చేశాడు.

**క. ఏ విద్యచేత రక్షితుఁ, డై వజ్రి దురంబులోన నసురులఁ ద్రుంచెన్**
**భావింప నట్టి విద్యను, శ్రీవరమాయామతంబుఁ జెప్పెను హరికిన్. 293**

**ప్రతి :** భావింపన్= ఆలోచింపగా; ఏ విద్యచేతన్= ఏ ఉపాసనచేత; వజ్రి= దేవేంద్రుడు; రక్షితుడు+ఐ= రక్షింపబడి; దురంబులోనన్= యుద్ధంలో; అసురులన్= రాక్షసులను; త్రుంచెన్= చంపెనో; అట్టి= అటువంటి; శ్రీవర= విష్ణువుయొక్క; మాయా= మాయగా; మతంబున్= తలంపబడే; విద్యను= ఉపాసనను; హరికిన్= ఇంద్రునకు; చెప్పెన్= చెప్పాడు.

**తా :** విశ్వరూపుడు ఏ విద్యచేత ఇంద్రునికి రక్షణ కల్పించాడో, ఇంద్రుడు యుద్ధంలో రాక్షసుల్ని జయించాడో విష్ణుమాయగా ప్రసిద్ధమయిన ఆ విద్యను విశ్వరూపుడు ఇంద్రునకుపదేశించాడు.

**ఉ. నావుడు ꣳబాండవాన్వయుꣳడు నమ్మినభక్తి జగన్నివాసు రా**
**జీవదళాక్షుꣳ గృష్ణుꣳ దన చిత్తమునన్ భజియించి పల్కె నో**
**దేవగణార్చితాంఘ్రియుగ! దివ్య మునీశ్వర! విశ్వరూపుꣳ డ**
**ప్పావనమైన విద్య సురపాలున కే క్రియ నిచ్చెꣳ? జెప్పవే! 294**

**ప్రతి :** నావుడున్= అనగా; పాండవ+అన్వయుడు= పాండవుల సంతతియైన పరీక్షిన్మహారాజు; నమ్మిన భక్తిన్= విశ్వాసంకల భక్తితో; జగత్+నివాసున్= జగత్తులకు ఆశ్రయమైన; రాజీవ= పద్మాల; దళ= రేకులవంటి; అక్షున్= కన్నులుగల; కృష్ణున్= కృష్ణుని; తన చిత్తమునన్= తన మనస్సునందు; భజియించి= సేవించి; పల్కెను= అన్నాడు; ఓ= ఓయీ!; దేవగణ= దేవతాసమూహాలచేత; అర్చిత= పూజింపబడిన; అంఘ్రియుగ!= పాదయుగ్మం కలవాడా!; దివ్యముని+ఈశ్వర= దేవఋషీ!; విశ్వరూపుꣳడు= విశ్వరూపుడు; ఆ+పావనము+ఐన= ఆపవిత్రమయిన; విద్యన్= విద్యను; సురపాలునకు= ఇంద్రునకు; ఏక్రియన్= ఏ విధంగా; ఇచ్చెన్= ఇచ్చాడో?; చెప్పుము+ఏ= చెప్పుమా!

**తా :** శుకమహర్షి ఇట్లనగా పాండవ వంశీయుడైన పరీక్షిన్మహారాజు అత్యంత విశ్వాసంకల భక్తితో జగత్తులకు నివాసమైనవాడూ తామరరేకులవంటి కన్నులు కలవాడూ అయిన కృష్ణుణ్ణి మనస్సులో ధ్యానించి ఇలా అన్నాడు. దేవతలచే నమస్కరింపబడే ఓ దేవఋషీ! విశ్వరూపుడు ఏ విధంగా ఆ పవిత్రవిద్యను దేవేంద్రున కిచ్చాడో తెల్పుము.

**ఉ. ఎందును రక్షితుం దగుచు నింద్రుꣳడు లీలయ పోలె వైరి సే**
**నం దునుమాడి దేవతలు నమ్మి సుఖింపꣳగ నిష్టసంపదం**
**జెంది సమస్తలోకములꣳ జేకొని యేలె మునీంద్ర! దాని నే**
**విందు సుఖంబుꣳ గందు నిꣳక వీనులు సంతస మందꣳ బల్కవే? 295**

**ప్రతి :** మునీంద్రా!= ఓ మునిశ్రేష్ఠుడా!; ఇంద్రుꣳడు= ఇంద్రుడు; ఎందును= అన్నింటియందు; రక్షితుండు+అగుచున్= రక్షణపొందుతూ; లీల+అ+పోలెన్= ఆటవలె; వైరిసేనన్= శత్రుసేనను; తునుము+ఆడి= సంహరించి; దేవతలు; నమ్మి= నమ్మకంకలిగి; సుఖింపꣳగన్= సుఖమనుభవించునట్లుగా; ఇష్టసంపదన్= కోరిన సంపదను; చెంది= పొంది; సమస్తలోకములన్= అన్నిలోకాలనూ; చేకొని= జయించి; ఏలెన్= పరిపాలించాడు; దానిన్= దానికి కారణమైన ఆవిద్యను; నేన్= నేను; విందున్= వింటాను; సుఖంబున్= సుఖాన్ని; కందున్= పొందుతాను; ఇకన్= ఇటుపైని; వీనులు= చెవులు; సంతసము+అందగన్= తృప్తిపొందేటట్లు; పల్కుము+ఏ= చెప్పవే!

**తా :** ఓ మునీంద్రా! దేనివలన ఇంద్రుడు సర్వత్ర రక్షణపొంది అనాయసంగా రాక్షస సేనను సంహరించి దేవతలు నిర్భయంగా సుఖించే విధంగా కోరిన సంపదలు పొంది అన్నిలోకాల్నీ జయించి పరిపాలించాడో ఆ విద్యను చెప్పు. వీనులవిందుగా విని సంతోషపడతాను.

## ❖ శ్రీమన్నారాయణ కవచ ప్రారంభము ❖

**క. వర నారాయణ కవచము, నరిభీకర వజ్రకవచ మాశ్రిత సంప**
**త్పరిణామ కర్మసువచము, పురుహూతున కెట్లు మౌని బోధించెఁ? దగన్. 296**

**ప్రతి :** అరి= శత్రువులకు; భీకర= భయం కలిగించే; వజ్రకవచము= వజ్రంతో చేసిన కవచం; ఆశ్రిత= ఆశ్రితులకు; సంపత్ పరిణామ= సంపదగా పరిణమించే; కర్మ= కర్మకలవారికి అనగా పుణ్యంకలవారికి; సువచము= చెప్పుటకు తగినది అయిన; వర= శ్రేష్ఠమయిన; నారాయణ= నారాయణ అనే పేరుకల; కవచమున్= కవచాన్ని; మౌని= మునియైన విశ్వరూపుడు; పురుహూతునకున్= దేవేంద్రునకు; ఎట్లు= ఏ విధంగా; తగన్= తగునట్లుగా; బోధించెన్= తెలియచేశాడు?

**తా :** శత్రువులకు భయం కలిగించే వజ్రకవచమూ ఆశ్రయించినవారికి పుణ్యఫలంగా సంపదలను కలిగించేదీ, అలాంటివారికి చెప్పదగినదీ అయిననారాయణ కవచాన్ని విశ్వరూపుడు దేవేంద్రునకు ఏ విధంగా బోధించాడు?

**వ. అనినం బరీక్షి జ్జనపాలునకు మునినాథుం డిట్లనియె. 297**

**ప్రతి :** అనినన్= అని అడిగిన; పరీక్షిజ్జనపాలునకు= పరీక్షిత్తు అనే రాజుతో; మునినాథుడు= మునివరుడైన శుకయోగి ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా ప్రశ్నించిన పరీక్షిన్నరేంద్రునితో శుకయోగీంద్రుడు ఇలా అన్నాడు.

**సీ. వినవయ్య! నరనాథ! మునినాథుఁ డింద్రున కనువొంద నారాయణాఖ్య మైన**
**కవచంబు విజయ సంకల్పంబు నప్రమేయ స్వరూపంబు మహాఫలంబు**
**మంత్రగోప్యము హరిమాయావిశేషంబు సాంగంబుతోడ నెఱుంగఁజేసె!**
**దాని నే వినిపింతుఁ బూని తదేకాగ్ర చిత్తంబుతోడుతఁ జిత్తగింపు,**

**తే. మొనర ధౌతాంఘ్రిపాణి యై యుత్తరంబు, ముఖముగా నుత్తమాసనమున వసించి**
**కృత నిజాంగ కరన్యాస మతిశయిల్ల, మహిత నారాయణాఖ్య వర్మము నొనర్చె. 298**

**ప్రతి :** నరనాథ!= రాజా!; వినుము+అయ్య!= విను; మునినాథుడు= మునీశ్వరుడయిన విశ్వరూపుడు; ఇంద్రునకున్= ఇంద్రునకు; విజయ సంకల్పంబున్= విజయాన్ని కలిగించేదీ; అప్రమేయ= మితి చెప్పరాని; స్వరూపంబున్= స్వరూపంకలదీ; మహాఫలంబున్= గొప్పఫలంకలదీ; మంత్రగోప్యమున్= మంత్రంవలె రహస్యమైనదీ; హరి= విష్ణువుయొక్క; మాయావిశేషంబున్= ఒకానొకమాయ ఐనది; అగు; నారాయణ+ఆఖ్యము+ఐన= నారాయణ అనే పేరుకల; కవచంబున్= కవచమును; సాంగంబుతోడన్= సాంగముగాని; ఎఱుంగఁజేసెన్= తెలియచేశాడు; దానిన్= ఆకవచమును; నేన్= నేను; వినిపింతును= వినిపిస్తాను; పూని= ప్రయత్నించి; తత్= ఆకవచమందే; ఏకాగ్ర= లగ్నమయిన; చిత్తంబు తోడుతన్= మనస్సుతో; చిత్తగింపుము= విను; ఒనరన్= ఒప్పునట్లుగా; ధౌత= కడుగుకొనబడిన; అంఘ్రి= పాదాలు; పాణి+ఐ= చేతులు కలవాడయి; ఉత్తరంబు ముఖముగా= ముఖము ఉత్తర దిక్కునకుందునట్లుగా; ఉత్తమ+ఆసనమునన్= మంచి ఆసనమందు; వసించి= ఉండి; కృత= చేయబడిన; నిజ= తనదైన; అంగ= అవయవములందు; కర= చేతియందు;

న్యాసము= మంత్రాక్షరాలను ఉంచడం అనేక్రియ; అతిశయిల్లన్= ఒప్పుగా; మహిత= పూజింపబడిన; నారాయణ+ఆఖ్య= నారాయణ అనే పేరుగల; వర్మమున్= కవచమును; ఒనర్చెన్= చేశాడు.

**తా :** ఓ రాజా! విను. మునీశ్వరుడైన విశ్వరూపుడు ఇంద్రునకు సాంగంగా నారాయణ అనే కవచాన్ని తెలియచేశాడు. ఆ కవచం విజయాన్నిస్తుంది. దాని స్వరూపం తెలియశక్యంకాదు. అది గొప్ప ఫలాన్నిస్తుంది. మంత్రంవలె అది రహస్యంగా ఉంచదగినది. అది హరియొక్క ఒకానొక మాయాశక్తి. దాన్ని వినిపిస్తాను. సావధాన మనస్సుతో విను. విశ్వరూపుడు తాను పాదాలు చేతులు కడుగుకొని ఉత్తరముఖంగా తిరిగి పవిత్రమయిన ఆసనంపై కూర్చొని అంగన్యాసకరన్యాసాలు చేసి నారాయణకవచాన్ని చేశాడు.

**విశే :** అంగన్యాసము= జపించే మంత్రంయొక్క అక్షరములను ఆయా అవయవములందు స్థాపించడం; కరన్యాసము= జపించేమంత్రంయొక్క అక్షరములను చేతి వ్రేళ్ళయందు స్థాపించడం. మంత్రజపం చేసే సాధకుడు ఆ మంత్రాధిష్ఠాన దైవాన్ని తనలోకి ఆవాహనం చేసుకొనే ప్రక్రియలు అంగన్యాస, కరన్యాసాలు. తద్వారా ఆ మంత్రజపసాధకుడు ఆ దైవంతో అభిన్న స్థితిని అనుభవిస్తాడు. అలాంటి దశలో మంత్రజపం సాగాలి – అనేది మంత్రశాస్త్ర ప్రసిద్ధమైన అంశం.

**వ. ఇట్లు నారాయణకవచంబు ఘటియించి పాదంబులను, జానువులను, ఊరువులను, ఉదరంబునను, హృదయంబునను, ఉరంబునను, ముఖంబునను, శిరంబునను నిట్లష్టాంగంబులం బ్రణవపూర్వకం బైన యష్టాక్షరీ మంత్రరాజంబు విన్యాసంబుఁ జేసి, ద్వాదశాక్షర విద్యచేత కరన్యాసంబు చేసి, మంత్రమూర్తియై భగవచ్ఛబ్ద వాచ్యంబైన ప్రణవాది యకారాంతమగు మహామంత్రంబు చేత నంగుళ్యంగుష్ఠ సర్వసంధులయందు న్యసించి, మఱియు హృదయంబున ఓంకారము, వికారంబు మూర్ధంబున, షకారంబు భ్రూమధ్యంబునందు, ణకారంబు శిఖయందు, వేకారంబు నేత్రంబులయందు, నకారంబు సర్వసంధులయందు, మఱియు నస్త్రము నుద్దేశించి మకారంబు నుపన్యసించెనేని మంత్రమూర్తియగు. మఱియును అస్త్రాయ ఫట్ అను మంత్రంబున దిగ్బంధనంబుచేసి, పరమేశ్వరునిఁ దన భావంబున నిల్పి విద్యామూర్తియుఁ, దపోమూర్తియు నగు షట్ఛక్తి సంయుతంబైన నారాయణ కవచాఖ్య మైన మంత్రరాజంబు నిట్లని పఠించె. 299**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నారాయణ కవచంబున్= నారాయణ కవచాన్ని; ఘటించి= కూర్చి; పాదంబులను= పాదములందు; జానువులను= మోకాళ్ళయందు; ఊరువులను= తొడలయందు; ఉదరంబునను= పొట్టయందు; హృదయంబునను= హృదయమందు; ఉరంబునను= వక్షఃస్థలమందు; ముఖంబునను= ముఖమునందు; శిరంబునను= తలయందు; ఇట్లు= ఈ విధంగా; అష్ట+అంగంబులన్= ఎనిమిది అవయవములందు; ప్రణవ పూర్వకంబు+ఐన= ఓంకారము ముందుగల; అష్ట+అక్షరీ= ఎనిమిది అక్షరాల సమూహమైన; మంత్రరాజంబున్= మహామంత్రాన్ని; విన్యాసంబు+చేసి= స్థాపించి; ద్వాదశ+అక్షర= పన్నెండు అక్షరాలుకల; విద్యచేతన్= మంత్రంచేత; కరన్యాసంబు+చేసి= కరన్యాసంచేసి; అట్లు చేయుటవలన; మంత్రమూర్తియై= మంత్రస్వరూపుడై; భగవత్+శబ్ద= భగవాన్ అనే శబ్దమునకు; వాచ్యమైన= అర్థమయిన; ప్రణవ+ఆది= ఓంకారం మొదట; యకార+అంతము+అగు= చివర యకారం కల; మహామంత్రంబుచేతన్= గొప్పదైన మంత్రంచేత, ఓం నమో భగవతే వాసుదేవాయ అనే మంత్రముచేత; అంగుళీ= వ్రేళ్ళయందు; అంగుష్ఠ సర్వసంధిషు= బొటనవేలి కణుపులయందు; న్యసించి= న్యాసంచేసి; మఱియున్= అంతేకాక;

హృదయంబునన్= హృదయమునందు; ఓంకారం; మూర్ధంబునన్= శిరస్సునందు; వికారము= వి అనే అక్షరం; భ్రూమధ్యంబునందున్= కనుబొమలమధ్యయందు; షకారంబు= షకారం; శిఖయందున్= తలమీద పిలక ఉండే ప్రదేశంలో; ణకారంబు= ణకారం; నేత్రంబులయందున్= కన్నులందు; వేకారంబు= వేకారం; సర్వసంధులయందున్= అన్ని కీళ్ళయందు; నకారంబు; మఱియున్= ఇంకాను; అస్త్రమునుద్దేశించి= అస్త్రమునుద్దేశించి; మకారంబును= మకారాన్ని; ఉపన్యసించెను+ఏని= న్యాసం చేస్తే; మంత్రమూర్తి యగున్= మంత్ర స్వరూపుడు అవుతాడు; మఱియును= ఇంకా; అస్త్రాయఫట్ అనుమంత్రంబునన్= అస్త్రాయఫట్ అనే మంత్రంతో; దిక్+బంధనము= దిగ్బంధనం; చేసి; పరమేశ్వరుని; తన భావంబునన్= తన మనస్సులో; నిల్పి= ఉంచి; విద్యామూర్తియున్= జ్ఞాన రూపమూ; తపోమూర్తియున్= తపస్స్వరూపమూ; అగు= ఐన; షట్+శక్తి సంయుతంబు+ఐన= ఆరు శక్తులతో కూడిన; నారాయణకవచ+ఆఖ్యము+ఐన= నారాయణ కవచమనే పేరుగల; మంత్రరాజంబును= మహామంత్రాన్ని; ఇట్లని= ఈ విధంగా; పఠించెన్= పలికాడు.

**తా :** ఈ విధంగా నారాయణ కవచాన్ని కూర్చి పాదాలయందు, మోకాళ్ళయందు, తొడలయందు, పొట్టయందు, హృదయమందు, వక్షఃస్థలమందు, ముఖమునందు, తలయందు ఈ విధంగా ఎనిమిది అంగములందు "ఓం నమో నారాయణాయ" అనే అష్టాక్షరీమంత్రాన్ని న్యాసం చెయ్యాలి. "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే ద్వాదశాక్షరీ మంత్రంతో కరన్యాసం చెయ్యాలి. ఈ అంగన్యాస కరన్యాసాలవలన సాధకుడు తాను మంత్రస్వరూపుడవుతాడు. అంతేకాకుండా భగవంతుడనే శబ్దానికి అర్థమైన మొదట ఓంకారం చివర యకారం కల మహామంత్రంతో వేళ్ళయందు, బొటనవ్రేలియందు అన్ని కీళ్ళయందు న్యాసం చెయ్యాలి. అంతేకాక హృదయంలో ఓంకారాన్ని ; తలపై "వి" అనే అక్షరాన్ని, కనుబొమ్మల మధ్యలో షకారాన్ని; తలమీద పిలక ఉండే ప్రదేశంలో ణకారాన్ని; కన్నులయందు వేకారాన్ని; అన్ని కీళ్ళల్లోనూ నకారాన్ని, అస్త్రము నుద్దేశించి మకారాన్ని న్యాసం చేస్తే సాధకుడు మంత్రస్వరూపుడే అవుతాడు. ఇంకా ఓం నమః అస్త్రాయఫట్ అని దిగ్బంధనం చేసి పరమేశ్వరుణ్ణి ధ్యానంలో నిల్పి నారాయణకవచాన్ని పఠించాడు. ఆ కవచం జ్ఞానరూపం, తపోరూపం, ఆరు శక్తులుకలది.

**విశే :** అష్టాక్షరీమహామంత్రం – **ఓం నమో నారాయణాయ**

ద్వాదశాక్షరీ మహామంత్రం – **ఓం నమో భగవతే వాసుదేవాయ**

ఆరు శక్తులు – సమగ్రములైన ఐశ్వర్యం, వీర్యం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం.

**చ.** **గరుడుని మూఁపుపై పదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్ర చ**
**ర్మ రుచిర శార్ఙ్గ ఖడ్గ శర రాజితపాశ గదాది సాధనో**
**త్కర నికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతి సం**
**భరిత మహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.** **300**

**ప్రతి :** గరుడుని= గరుత్మంతునియొక్క; మూపుపై= వీపుపై; పదయుగంబు= రెండుపాదాలు; ఘటిల్లగన్= ఉండగా; శంఖ= శంఖం; చక్ర= చక్రం; చర్మ= డాలు; రుచిర= అందమైన; శార్ఙ్గ= ధనుస్సు; ఖడ్గ= కత్తి; శర= బాణాలు; రాజిత= ప్రకాశించే; పాశ= పాశం; గదా+ఆది= గద మొదలయిన; సాధన+ఉత్కర నికరంబులు= ఆయుధ సమూహాలు అనే నిధులు; ఆత్మ= తన; కరకంజములన్= పాణిపద్మాలందు; ధరియించి= తాల్చి; భూతి= ఐశ్వర్యాలతో; సంభరిత= నిండిన;

మహాష్టబాహుఁడు= గొప్పవైన ఎనిమిది చేతులతోకూడినవాడు; కృపామతితోన్= దయాబుద్ధితో; ననున్= నన్ను; కాచుఁగావుతన్= రక్షించునుగాక.

**తా :** పాదాలు గరుత్మంతుని వీపుపై ఉంచి తన చేతులతో శంఖం, చక్రం, డాలు, ధనుస్సు, కత్తి, బాణాలు, పాశం, గద మొదలయిన సాధనాలను ధరించి, అష్టైశ్వర్యాలతో అష్టబాహువులతో కూడిన విష్ణుమూర్తి నన్ను రక్షించు గాక.

**విశే : అష్టైశ్వర్యాలు**

**అణిమ** – మిక్కిలి సూక్ష్మమగుట – దీనిచే రాతిలో దూరగలడు.

**లఘిమ** – తేలిక అగుట – దీనిచే సూర్యకిరణా లాధారంగా చేసికొని సూర్యలోకం చేరగలడు.

**మహిమ** – వ్యాపించుట – దీనిచే సమస్త బ్రహ్మాండములందు వ్యాపించి అందలి విషయాలను గ్రహిస్తాడు.

**గరిమ** – బరువెక్కడం, దించడానికి, ఎత్తడానికి – వీలుకానంత బరువు అవుతాడు.

**ప్రాప్తి** – తాకటం – భూలోకంలోనుండి చంద్రుని స్పృశింపగలుతాడు.

**ప్రాకామ్యము** – కోరికకు అడ్డులేకపోవటం – దీనిచే నీటిలోవలె భూమిలో ప్రవేశింపగలుగుతాడు

**ఈశిత్వము** – తన శరీరావయవములను సంకల్ప మాత్రము చేతనే ప్రేరేపించినట్లు భూత భౌతికములను సంకల్పమాత్రం చేతనే ప్రేరేపింప గలుగుతాడు.

**వశిత్వము** – సర్వమును తన వశములో నుంచు కొనుగలుగుతాడు.

ఇవి అణిమాది అష్టసిద్ధులు. అష్టైశ్వర్యాలు – అష్ట విభూతులని ప్రసిద్ధి.

**ఆ. ప్రకట మకర వరుణ పాశంబులందుల, జలములందు నెందుఁ బొలయ కుండఁ**
**గాచుఁగాక నన్ను ఘనుఁడొక్కఁ డైనట్టి, మత్స్యమూర్తి విద్యమానకీర్తి. 301**

**ప్రతి :** విద్యమానకీర్తి= ప్రశస్తమయిన కీర్తికలవాడును; ఘనుఁడు+ఒక్కడు+ఐనట్టి= ఒకే ఒక గొప్పవాడయిన; మత్స్యమూర్తి= చేప రూపమయిన విష్ణువు; ప్రకట= ప్రసిద్ధమయిన; మకర= మొసళ్ళు అనే; వరుణ= జలాధిపతియైన వరుణునియొక్క; పాశంబులందులన్= ఆయుధాలయిన పాశంబులందును; జలములందున్= నీటియందును; పొలియకుండన్= మరణించకుండునట్లు; నన్ను; కాచుఁగాక= రక్షించునుగాక!

**తా :** గొప్పకీర్తికల మత్స్యావతారం, మొసళ్ళ రూపమయిన వరుణ పాశాల వలన నీటి వలన మరణం కలుగకుండా నన్ను రక్షించుగాక.

**క. వటుఁడు సమాశ్రిత మాయా, నటుఁడు బలి ప్రబల శోభన ప్రతిఘటనో**
**ద్భటుఁడు త్రివిక్రమదేవుఁడు, చటుల స్థలమందు నన్ను సంరక్షించున్. 302**

**ప్రతి :** వటుఁడు= బ్రహ్మచారి; సమాశ్రిత= ఆశ్రయించిన; మాయా= మాయాశక్తితో; నటుఁడు= నటించువాడును; బలి= బలిచక్రవర్తియొక్క; ప్రబల= గొప్పదియైన; శోభన= మంగళమును; ప్రతిఘటన= ఎదుర్కొనుటయందు; ఉద్భటుఁడు= శూరుడు అయిన; త్రివిక్రమదేవుఁడు= మూడుగొప్ప అడుగులుకల దైవం; నన్ను; చటుల= భయంకరమయిన; స్థలమందున్= చోటునందు; సంరక్షించున్= రక్షించుగాక.

**తా :** బ్రహ్మచారి మాయతో నటించేవాడు, బలికి కల్గు మంగళమును ప్రతిఘటించడంలో శౌర్యం చూపించినవాడు, గొప్పవైన మూడడుగులుకల వామనమూర్తి భయంకరమయిన స్థలములందు నన్ను రక్షించుగాక.

**చ. అడవుల సంకటస్థలుల నాజిముఖంబుల నగ్ని కీలలం**
**దెడరుల నెల్ల నాకు నుతి కెక్కఁగ దిక్కగుఁగాక శ్రీనృసిం**
**హుఁడు సురశత్రుయూథపవధోగ్రుఁడు విస్ఫురితాట్టహాస వ**
**క్త్రుఁడు ఘన దంష్ట్ర పావక విధూత దిగంతరుఁ డప్రమేయుఁడై. 303**

**ప్రతి :** సురశత్రు= దేవతలకు శత్రువులయిన రాక్షసులయొక్క; యూథప= సమూహానికి నాయకుడైన హిరణ్యకశిపుని; వధ= చంపుటయందు; ఉగ్రుఁడు= భయంకరుడూ; విస్ఫురిత= మిక్కిలి ప్రకాశించే; అట్టహాస= పెద్దనవ్వుకల; వక్త్రుఁడు= ముఖముకలవాడూ; ఘన= గొప్పదైన; దంష్ట్ర= కోరలుకల, ముఖమునందలి; పావక= అగ్నిచేత; విధూత= కంపించిన; దిక్+అంతరుండు= దిక్కుల మధ్య భాగంకలవాడూ అగు; శ్రీనృసింహుఁడు= లక్ష్మీనరసింహుడు; అప్రమేయుడు+ఐ= హద్దులేనివాడయి; అడవులన్= అడవులయందు; సంకటస్థలులన్= ప్రవేశింప శక్యంకాని స్థలములందూ; ఆజి= యుద్ధములయొక్క; ముఖంబులన్= ముందు భాగములందును; అగ్నికీలలందున్= అగ్ని జ్వాలలందూ; ఎడరులన్+ఎల్లన్= అన్ని ఆపదలందూ; నుతికిన్+ఎక్కగన్= స్తుతింపబడే రీతిగా; నాకున్= నాకు; దిక్కు+అగుగాక= శరణు అగుగాక.

**తా :** శ్రీనృసింహుడు హిరణ్యకశిపుని వధించే సమయంలో అతిభయంకరంగా ఉన్నాడు. ముఖం అట్టహాసంతో ప్రకాశిస్తోంది. పెద్దపెద్దకోరలున్న ముఖం నుండి వెలువడే మంటలతో దిక్కులన్నీ వణికిపోతున్నాయి. ఇంతని చెప్పలేని ఆకారం. అటువంటి నృసింహుడు అడవులలోను, చొరరాని చోట్ల, యుద్ధాలలో, మంటలలో అన్ని ఆపదలలో ప్రశస్తమయిన రీతిలో నాకు రక్షణ కల్పించుగాక!

**చ. అరయఁగ నెల్ల లోకములు నంకిలి నొంద మహార్ణవంబులో**
**నొరగి నిమగ్న మైన ధర నుద్ధతిఁ గొమ్మున నెత్తినట్టి యా**
**కిరిపతి యగ్ని కల్పుఁ డురుఖేలుఁడు నూర్జిత మేదినీ మనో**
**హరుఁడు కృపావిధేయుఁడు సదాధ్వముల న్ననుఁ గాచుఁగావుతన్ 304**

**ప్రతి :** అరయఁగన్= ఆలోచింపగా; ఎల్లలోకములున్= లోకాలన్నీ; అంకిలిన్= ఆపదను; ఒందన్= పొందగా; మహార్ణవంబులోన్= మహాసముద్రంలో; ఒరగి= వంగి; నిమగ్నము+ఐన= మునిగిన; ధరన్= భూమిని; ఉద్ధతిన్= గర్వంతో; కొమ్మునన్= కోరతో; ఎత్తినట్టి= నీటినుండిపై కెత్తిన; అగ్నికల్పుడు= అగ్నివంటివాడు; ఉరు= గొప్ప; ఖేలుఁడును= ఆటకలవాడూ; ఊర్జిత= దృఢమైన; మేదినీ= భూమికి; మనోహరుడు= భర్త; కృపా= దయకు; విధేయుఁడు= వశుడూ అయిన; ఆ కిరిపతి= ఆ వరాహనాథుడు; సదా+అధ్వములన్= నిరంతరమైన త్రోవలందు; ననున్= నన్ను; కాచుఁ గావుతన్= రక్షించుగాక!

**తా :** అన్ని లోకాలూ ఆపదలపాలయ్యే విధంగా భూమి మహాసముద్రంలో మునిగిపోయినప్పుడు ఆదివరాహమూర్తి తన కోరతో నీటిలో మునిగిపోకుండా భూమిని పైకెత్తాడు. ఆ ఆదివరాహం అగ్నితో సమానమైనది. ఆ ప్రళయజలాల్లో ఆటలాడింది. భూమికి అది భర్త; దయ కలది. నిరంతరమైన ప్రయాణం సాగే త్రోవలలో అటువంటి ఆదివరాహం నన్ను రక్షిస్తూ ఉండుగాక.

**క. రాముఁడు రాజకులైక వి, రాముఁడు భృగు సత్కులాభిరాముఁడు సుగుణ**
**స్తోముఁడు నను రక్షించును, శ్రీమహితోన్నతుఁడు నద్రిశిఖరములందున్. 305**

**ప్రతి :** రాజకుల= క్షత్రియ వంశములకు; ఏక= ముఖ్యమయిన; విరాముఁడు= వినాశకుడు; భృగుసత్కుల= పవిత్రమయిన భృగువంశమునకు; అభిరాముఁడు= అలంకారమైనవాడు; సుగుణ= మంచిగుణముల; స్తోముఁడు= ప్రోగు; శ్రీ= సంపదలచేత; మహితుఁడు= పూజింపబడినవాడు; ఉన్నతుఁడు= గొప్పవాడు అయిన; రాముఁడు= పరుశురాముడు; అద్రిశిఖరములందున్= పర్వత శిఖరములందు; నను= నన్ను; రక్షించును= కాపాడుగాక.

**తా :** పరశురాముడు క్షత్రియ సంహారం చేశాడు. భృగువంశంలో జన్మించి దానిని శోభింపచేశాడు. సకలసద్గుణాల రాశి; శ్రీమంతుడు – వాటిచేత ప్రతిష్ఠ పొందాడు.

**సీ. తాటక మర్దించి తపసిజన్నముఁ గాచి, హరువిల్లు విఱిచి ధైర్యమున మెఱసి**
**ప్రబలు లైనట్టి విరాధకబంధోగ్ర ఖరదూషణాదిరాక్షసులఁ దునిమి**
**వానరవిభు నేలి వాలిఁ గూలఁగ నేసి జలరాశిగర్వంబుఁ జక్కఁజేసి**
**సేతువు బంధించి చేరి రావణకుంభకర్ణాది వీరులఁ గడిమిఁ ద్రుంచి**

**తే. యలవిభీషణు లంకకు నధిపుఁ జేసి, భూమిసుతఁ గూడి సాకేతపురము నందు**
**రాజ్యసుఖములు గైకొన్న రామవిభుఁడు, వరుస ననుఁ బ్రోచుచుండుఁ బ్రవాసగతుల. 306**

**ప్రతి :** తాటకన్= తాటకను; మర్దించి= చంపి; తపసి= ఋషియొక్క; జన్నమున్= యజ్ఞమును; కాచి= రక్షించి; హరువిల్లున్= శివధనుస్సును; విఱిచి= విరిచి; ధైర్యమునన్= ధైర్యంతో; మెఱసి= ప్రకాశించి; ప్రబలులు+ఐనట్టి= బలవంతులైన; విరాధ= విరాధుడు; కబంధ= కబంధుడు; ఉగ్ర= భయంకరులైన; ఖర= ఖరుడు; దూషణ+ఆది= దూషణుడు మొదలగు; రాక్షసులన్= రాక్షసులను; తునిమి= సంహరించి; వానరవిభున్= వానరరాజైన సుగ్రీవుణ్ణి; ఏలి= పాలించి; వాలిన్= వాలిని; కూలఁగన్+చేసి= చంపి; జలరాశి= సముద్రంయొక్క; గర్వంబున్= మదమును; చక్కన్+చేసి= పోగొట్టి; సేతువున్= వారధిని; బంధించి= కట్టి; చేరి= లంకకుచేరి; రావణ= రావణుడు; కుంభకర్ణ+ఆది= కుంభకర్ణుడు మొదలయిన; వీరులన్= శూరులను; కడిమిన్= పరాక్రమంతో; త్రుంచి= చంపి; అల= ప్రసిద్ధుడైన; విభీషణున్= విభీషణుని; లంకకున్= లంకకు; అధిపున్+చేసి= రాజుచేసి; భూమిసుతన్= భూపుత్రిక అయిన సీతతో; కూడి= కలసి; సాకేతపురమునందున్= అయోధ్యానగరమందు; రాజ్యసుఖములు= రాజ్యభోగములను; కైకొన్న= పొందిన; రామవిభుఁడు= శ్రీరామచంద్రప్రభువు; ననున్= నన్ను; ప్రవాసగతులన్= స్వస్థలం విడిచి దూరప్రాంతాలలో ఉన్న సమయాలలో; ప్రోచుచుండున్= రక్షించునుగాక.

**తా :** తాటకను చంపి, విశ్వామిత్రుని యజ్ఞాన్ని రక్షించి, శివునివిల్లు విరిచి, ధైర్యంతో విరాధుడు కబంధుడు ఖరుడు దూషణుడు మొదలైన రాక్షసుల్ని చంపి, సుగ్రీవుణ్ణి చేరదీసి, వాలిని చంపి, సముద్ర గర్వం అణచి, వారధి నిర్మించి, రావణకుంభకర్ణాది వీరులను సంహరించి, విభీషణుణ్ణి లంకారాజ్యానికి అభిషిక్తుణ్ణి చేసి, సీతతో అయోధ్యకు వెళ్ళి రాజ్యసుఖాలు అనుభవించిన శ్రీరామచంద్ర ప్రభువు స్వస్థలం విడిచి దూరప్రాంతాలలో ఉన్న సమయాలలో నన్ను రక్షించుగాక.

**వ. మఱియు నఖిల ప్రమాదంబులైన యభిచారకర్మంబువలన నారాయణుండును, గర్వంబువలన నరుండును, యోగభ్రంశంబు వలన యోగనాథుం డైన దత్తాత్రేయుండును, గర్వబంధమువలన గణేశుం**

దైన కపిలుండును, గామదేవుని వలన సనత్కుమారుండును, మార్గంబుల దేవహేళనంబుఁ జేయుటవలన శ్రీహయగ్రీవమూర్తియును, దేవతానమస్కార తిరస్కార దేవపూజా చ్ఛిద్రంబుల వలన నారదుండును, నశేష నిరయంబుల వలనఁ గూర్మంబును, నపథ్యంబువలన భగవంతుండైన ధన్వంతరియును, ద్వంద్వంబువలన నిర్జితాత్ముండైన ఋషభుండును. జనాపవాదంబువలన నగ్నిదేవుండును, జనన మరణాదులం గలుగఁ జేయు కర్మంబులవలన బలభద్రుండును, గాలంబువలన యముండును, సర్పగణంబుల వలన శేషుండును, అప్రబోధంబువలన ద్వైపాయనుండును, బాషండ సమూహంబు వలన బుద్ధ దేవుండును, శనైశ్చరునివలనఁ గల్కియునై, ధర్మరక్షణ పరుండైన మహావతారుండు నన్ను రక్షించుఁగాత! ప్రాత స్సంగమ ప్రాహ్ణ మధ్యాహ్నా పరాహ్ణ సాయంకాలంబులను ప్రదో షార్ధరాత్రాపర రాత్ర ప్రత్యూ షానుసంధ్య ప్రభాతంబు గదాద్యాయుధంబుల ధరియించి కేశవ, గోవింద, నారాయణ, విష్ణు, మధుసంహార, త్రివిక్రమ, వామన, హృషీకేశ, పద్మనాభ, శ్రీవత్సధామ, సర్వేశ్వరేశ, జనార్ధన, విశ్వేశ్వర, కాలమూర్తులను నామరూపంబులు గల దేవుండు నన్ను రక్షించుఁగాక. ప్రళయకాలాన లాతితీక్ష్ణసంభ్రమ భ్రమణ నిర్వక్రవిక్రమ వక్రీకృత దనుజచక్రంబైన సుదర్శన నామ చక్రంబ! మహావాయు ప్రేరితుండై హుతాశనుండు నీరస తృణాటవుల భస్మీభూతంబు సేయు భంగి భగవత్ప్రయుక్తంబవై మద్వైరి సైన్యంబుల దగ్ధంబు గావింపుము. జగత్సంహారకాల పటు ఘటిత చటుల మహోత్పాత గర్జారవ తర్జన దశదిశాభి వర్జిత ఘనఘనాంతర నిష్పాత నిష్ఠురకోటి శతకోటి సంస్పర్శస్ఫుర ద్విస్ఫులింగ నిర్గ మానర్గళ భుగ భుగాయమాన మూర్తి విస్ఫూర్తి! నారాయణ కరకమలవర్తి! గదాయుధోత్తమ! మదీయ వైరితండోపతండంబుల భండనంబులం జండ గతిం బిండిపిండిగాఁ గూశ్మాండ వైనాయక యక్ష రక్షోభూత గ్రహంబులు చూర్ణంబులుగాఁ గొండొక వినోదము సలుపుము. దరేంద్రంబ వైన పాంచజన్యంబ! సర్వలోక జిష్ణుండైన శ్రీకృష్ణుని నిఖిల పుణ్యైక సదన వదన నిష్యూత నిశ్వా సాధర వేణు పరిపూతంబవై యున్మత్త భూత, ప్రేత, పిశాచ, విప్రగ్రహాది క్రూర దుర్గ్రహంబులు విద్రావణంబులుగా, నస్మత్పరవీర మండలంబుల గుండియలతో దదీయమానినీ దుర్భర గర్భంబులు గర్భ స్థార్భక వివర్జితంబులుగా నవియ, బ్రహ్మాండభాండ భీకరంబైన భూరి నాదంబున మోదింపుము. అతి తీవ్రధారా దళిత నిశాటకోటి కఠోర కంఠ కరాళ రక్తధారా ధౌత మలీమస విసరంబవైన నందక మహాసి శేఖరంబ! జగదీశ ప్రేరితంబవై మద్విద్వేషి విషమ వ్యూహంబులు బెండువడ మెండు గడికండలుగ ఖండించి చెండాడుము. నిష్కళంక నిరాతంక నిశ్శంక సాంద్ర చంద్ర మండల పరిమండిత సర్వాంగ లక్షణ విచక్షణ ధర్మ నిర్మితంబవైన చర్మంబ! దుర్మద మద్వైరిలోక భీకరాలోకంబులను సమాకుల నిబిడ నీరంధ్ర నిష్ఠుర తమఃపటల పటు ఘటనంబులం గుటిల పఱుపుము. నిఖిల పాపగ్రహంబుల వలనను, సకల నర మృగ సర్ప క్రోడ భూతాదులవలనను నగు భయంబులు భగవ న్నామ రూప యాన దివ్యాస్త్రంబుల వలనం బొందకుండుఁ గాక! బృహ ద్రథంతరాది సామంబులచేత స్తోత్రంబు చేయంబడుచున్న ఖగేంద్రుండు రక్షణ దక్షుండై నన్ను రక్షించుంగాక. శ్రీహరి నామ రూప వాహన దివ్యాయుధ పారిషదోత్తమ ప్రముఖంబు లస్మదీయ బుద్ధీంద్రియ మనః ప్రాణంబుల సంరక్షించు భగవంతుండైన శేషుండు సర్వోపద్రవంబుల నాశంబు

**సేయు. జగదైక్యభావంబైన ధ్యానంబు గలవానికి వికల్పరహితుండై, భూషణాయుధ లింగాఖ్యలగు శక్తులం దన మాయచేత ధరియించి తేజరిల్లుచుండు లక్ష్మీకాంతుండు వికల్ప విగ్రహంబులవలన నన్ను రక్షించుఁ గాక. లోకభయంకరాట్టహాస భాసురవదనగహ్వరుం డగుచు, సమస్త తేజోహరణ ధురీణ తేజః పుంజ సంజాత దివ్య నృసింహావతారుండగు నప్పరమేశ్వరుండు, సర్వ దిగ్భాగంబులవలన, సమస్త బహిరంతరంబులవలన నన్ను రక్షింపుచుండుఁ గాక అని నారాయణాత్మక కవచ ప్రభావం బితిహాసరూపంబున నింద్రుండు దెలిసి కొని, ధ్యానంబు చేసి, తద్విద్యాధారణ మహిమవలన నరాతుల నిర్జించె. కావున, నెవ్వరేని నిర్మలాత్ములగు వార లేతద్విద్యా ధారణులై యనుదినంబును బఠియించిన, నతిఘోరరణంబుల నత్యుత్కట సంకటంబులను, సర్వగ్రహ నిగ్రహకర్మ మారణకర్మాది దుష్కర్మజన్య క్లేశంబులను వదలి, అవ్యాకులమనస్కులై విజయంబు నొందుదురు. మఱియును, సర్వరోగంబులకు నగమ్యశరీరులై సుఖంబు నొందుదురు. అదియునుంగాక. 307**

**ప్రతి :** మఱియును= ఇంకా; అఖిలప్రమాదంబులు+ఐన= సమస్తమయిన ఆపదలకు మూలమయిన; అభిచార కర్మంబువలన= పరులను హింసించు ప్రయోగాలబారి నుండి; నారాయణుండును= విష్ణువూ; గర్వంబువలనన్= గర్వమునుండి; నరుఁడును= నరుడూ; యోగభ్రంశంబువలన= యోగభ్రష్టతనుండి; యోగనాథుండు+ఐన= యోగేశ్వరుడయిన; దత్తాత్రేయుండును= దత్తాత్రేయుడూ; గర్వబంధమువలనన్= గర్వం నుండి; గణేశుండు+అయిన= గణములకు పతియైన; కపిలుండును= కపిలుడూ; కామదేవునివలనన్= మన్మథునినుండి; సనత్కుమారుండును= సనత్కుమారుడూ; మార్గంబులన్= మార్గములలో; దేవహేళనంబు= దేవతావమానం; చేయుటవలనన్= చేయడంవలన; శ్రీహయగ్రీవమూర్తియున్= శ్రీహయగ్రీవుడూ; దేవతా= దేవతలకు; నమస్కార= నమస్కరించుటను; తిరస్కార= తిరస్కరించుట; దేవపూజా= దేవతలను పూజించుటయందలి; ఛిద్రంబులవలనన్= లోపాలనుండి; నారదుండును= నారదుడూ; అశేష= సమస్తమయిన; నిరయంబులవలనన్= నరకములనుండి; కూర్మంబును= కూర్మనాథుడైన విష్ణువూ; అపథ్యంబువలనన్= అపథ్యములబారి నుండి; భగవంతుఁడు+ఐన= భగవంతుడైన; ధన్వంతరియున్= ధన్వంతరీ; ద్వంద్వంబువలనన్= సుఖ దుఃఖాదిద్వంద్వముల నుండి; నిర్జిత= జయింపబడిన; ఆత్ముండు= మనస్సుకల; ఋషభదేవుండును= ఋషభదేవుడూ; జన= జనుల; అపవాదంబువలనన్= అపకీర్తినుండి; అగ్నిదేవుండును= అగ్నిదేవుడూ; జననమరణాదులన్= పుట్టుక చావు మొదలయిన వాటిని; కలుగఁజేయు= కలిగించే; కర్మంబులవలనన్= పుణ్యపాపకర్మలనుండి; బలభద్రుండును= బలరాముడూ; కాలంబువలన= కాలమునుండి; యముండును= యముడూ; సర్పగణంబులవలనన్= పాముల సమూహములనుండి; శేషుండును= శేషుడూ; అప్రబోధంబువలనన్= అజ్ఞానమునుండి; ద్వైపాయనుండును= వ్యాసుడూ; పాషండసమూహంబు వలనన్= వేదబాహ్యుల సమూహాలనుండి; శేషుండును= శేషుడూ; శనైశ్చరునివలనన్= శనినుండి; కల్కియు= కల్కీ; ధర్మరక్షణపరుండు+ఐన= ధర్మరక్షణతత్పరుడైన; మహావతారుండు= గొప్ప అవతారములెత్తిన విష్ణువూ; నన్ను; రక్షించుగాక; ప్రాతః= ఉదయమూ; సంగవ= పగటి రెండవ భాగమూ; ప్రాహ్ణ= పగటిమూడవభాగమూ; మధ్యాహ్న= పగటి నాల్గవభాగమూ; అపరాహ్ణ= పగటి అయిదవ భాగమూ; సాయంకాలంబులను= పగటి ఆరవ భాగాలలోనూ; ప్రదోషార్ధరాత్రాపర రాత్రప్రత్యూషాను సంధ్యలు= ప్రదోషం, అర్ధరాత్రం, అపరరాత్రం, ప్రత్యూషం, ప్రతిసంధ్యలు అనే వీటియందు; ప్రభాతంబు=ప్రతి ఉదయాల్లోనూ; గదా+ఆది+ఆయుధంబులను= గద మొదలయిన ఆయుధాలను; ధరియించి; కేశవ; గోవింద; నారాయణ; విష్ణు; మధుసంహార; త్రివిక్రమ; వామన; హృషీకేశ; పద్మనాభ; శ్రీవత్సధామ; సర్వేశ్వరేశ; జనార్దన; విశ్వేశ్వర; కాలమూర్తులు;

అనునామ రూపంబులుకల = అనే పేర్లు, రూపములు కల; దేవుండు= దేవుడూ; నన్ను; రక్షించుగాక= రక్షించునుగాక; ప్రళయకాల= లయకాలంలో; అనల= అగ్నివలె; అతితీక్ష్ణ= మిక్కిలి వాడియైన; సంభ్రమ= గుండ్రంగా; భ్రమణ= తిరుగుటచేత; నిర్వక్ర= అడ్డులేని; విక్రమ= పరాక్రమంచేత; వక్రీకృత= అభాగ్యులుగా చేయబడిన; దనుజ= రాక్షసుల; చక్రంబు+ఐన= సమూహం కలిగిన; సుదర్శన నామచక్రంబ!= సుదర్శనమనే పేరుగల చక్రమా!; మహావాయు= గొప్ప గాలిచేత; ప్రేరితుండు+ఐ= రెచ్చగొట్టబడినవాడై; హుతాశనుండు= అగ్ని; నీరస= ఎండిన; తృణ= గడ్డిగల; అటవులన్= అడవులను; భస్మీభూతంబు= బూడిద; చేయుభంగిన్= చేసే విధంగా; భగవత్= భగవానునిచే; ప్రయుక్తంబవు+ఐ= ప్రయోగింపబడినదానవై; మత్= నాయొక్క; వైరి= శత్రువుల; సైన్యంబులన్= సేనలను; దగ్ధంబు+కావింపుము= కాల్చివేయుము; జగత్= సకలలోకాలయొక్క; సంహారకాల= ప్రళయకాలంలో; పటు= గొప్పగా; ఘటిత= కూడిన; చటుల= భయంకరమైన; మహోత్పాత= గొప్ప ఉత్పాతములుగల; గర్జారవ= ఉరుములధ్వనిచేత; తర్జన= భయపెట్టుటకల; దశదిశా= పదిదిక్కులనుండి; అభివర్జిత= విడిచిపెట్టబడిన; ఘన= గొప్పవైన; ఘన= మేఘాల; అంతర= మధ్యనుండి; నిష్ప్యూత= చిమ్మబడిన; నిష్ఠుర= కఠినమైన; కోటి= అంచులుగల; శతకోటి= వజ్రాయుధాలయొక్క; సంస్పర్శ= తాకిడివల్ల; స్ఫురత్= ప్రకాశించే; విస్ఫులింగ= నిప్పురవ్వల; నిర్గమ= బయల్వెడులుటలచే; అనర్గళ= ఆటంకం లేకుండా; భుగభుగాయమాన= భుగభుగలాడే; మూర్తి= రూపంయొక్క; విస్ఫూర్తి!= ప్రకాశంకలదానా!; నారాయణ= విష్ణువుయొక్క; కరకమల= పాణిపద్మమందు; వర్తి!= ఉన్నదానా!; గదాయుధోత్తమా!= ఆయుధాలలో ఉత్తమమయిన ఓ గదా!; మదీయ= నాయొక్క; వైరి= శత్రువుల; తండ= సమూహాలనూ; ఉపతండంబులన్= చిన్నగుంపులనూ; భండనంబులన్= యుద్ధాలలో; చండగతిన్= క్రూరమైన విధంగా; పిండిపిండిగాన్= పిండిపిండిగా; కూశ్మాండ= కూశ్మాండాలనే పిశాచాలు; వైనాయక= వైనాయకాలు; యక్ష= యక్షులు; రక్ష= రాక్షసులు; భూత= భూతాలు; గ్రహంబులు= పిశాచాలు; చూర్ణంబులుగాన్= పిండి అయ్యేటట్లుగా; కొండొక= ఒకానొక; వినోదంబు= క్రీడ; సలుపుము= చేయుము; దర+ఇంద్రంబు= శంఖరాజమైన; పాంచజన్యంబ= పాంచజన్యమా!; శ్రీకృష్ణుని= శ్రీకృష్ణునియొక్క; నిఖిల= సమస్తమయిన; పుణ్య= పుణ్యములకు; ఏక= ఒకే ఒక; సదన= స్థానమయిన; వదన= ముఖమునుండి; నిష్ప్యూత= వెలువడిన; నిశ్వాస= గాలికల; అధర= పెదవిపైనున్న; వేణు= మురళివలె; పరిపూతంబవు+ఐ= పవిత్రమయి; ఉన్మత్త= మదించిన; భూత= భూతాలు; ప్రేత= ప్రేతాలు; పిశాచ= పిశాచాలు; విప్రగ్రహ+ఆది= బ్రహ్మరాక్షసులు మొదలయిన; క్రూర= భయంకరమయిన; దుర్గ్రహంబులు= దుష్టగ్రహాలు; విద్రావణంబులుగాన్= పారిపోయేటట్లుగా; అస్మత్= మాయొక్క; పరవీర= శత్రువీరుల; మండలంబుల= సమూహాల; గుండియలతో= గుండెలతోబాటు; తదీయ= ఆ శత్రువీరుల; మానినీ= స్త్రీల; దుర్భర= భరింపరాని; గర్భంబులు= గర్భాలు; గర్భస్థ= గర్భంలోని; అర్భక= శిశువులచే; వివర్జితంబులుగాన్= విడిచిపెట్టబడేటట్లు; అవియన్= పగిలేటట్లుగా; బ్రహ్మాండ= బ్రహ్మాండాలనే; భాండ= పాత్రలకు; భీకరంబుగాన్= భయం కలిగించేటట్లుగా; భూరినాదంబునన్= గొప్పధ్వనితో; మోదింపుము= సంతోషపడు; అతితీవ్ర= మిక్కిలి వాడియైన; ధారా= అంచులచేత; దళిత= చీల్చబడిన; నిశాట= రాక్షసుల; కోటి= సమూహాల; కఠోర= కఠినమైన; కంఠ= కంఠాలయొక్క; కరాళ= భయాన్ని కలిగించే; రక్తధారా= రక్తధారలచేత; ధౌత= కడుగబడిన; మలీమస= మాలిన్యంయొక్క; విసరంబు= ప్రవాహం కలిగిన దానవైన; నందక= నందకమనే పేరుగల; మహా= గొప్పది అయిన; అసిశేఖరమా!= శ్రేష్ఠమయిన ఖడ్గమా!; జగదీశ= జగత్ప్రభువైన నారాయణునిచేత; ప్రేరితంబవు+ఐ= ప్రయోగింపబడినదానవై; మత్= నాయొక్క; విద్వేషి= శత్రువుల; విషమ= దుష్టమయిన; వ్యూహంబులు= సమూహాలు; బెండువడన్= బలహీనపడేటట్లు; మెండు= అధికంగా; కడికండలుగాన్= ముక్కలుముక్కలుగా; ఖండించి= ఛేదించి; చెండాడుము= చంపుము; నిష్కళంక= మచ్చలేని; నిరాతంక= భీతిలేని; నిశ్శంక= సంశయంలేని; సాంద్ర=

దళసరియైన; చంద్ర= చంద్రుని ఆకారంగల బుడిపెల; మండల= సమూహంచేత; పరిమండిత= అలంకరింపబడిన; సర్వాంగ= సమస్త అవయవాలు కలిగినట్టి; లక్షణ= స్వభావాన్ని; విచక్షణ= తెలిసికోదగిన; ధర్మ= పుణ్యంతో; నిర్మితంబవు+ ఐన= నిర్మింపబడిన; చర్మంబ!= ఓడాలూ!; దుర్మద= గర్వితులైన; మత్+వైరి= నా శత్రువుల; లోక= సమూహాల; భీకర= భయంకరమయిన; ఆలోకంబులను= చూపులను; సమాకుల= వ్యాపించినట్టియు; నిబిడ= దట్టమయిన; నీరంధ్ర= చిక్కని; నిష్ఠుర= కఠినం అయిన; తమః పటల= చీకటి సమూహంయొక్క; పటు= పటిష్ఠమయిన; ఘటనంబునన్= కూర్చుటచేత; కుటిలపఱపుము= నాశనంచేయుము; నిఖిల= సమస్తమయిన; పాపగ్రహంబులవలనను; సకల= సమస్తమయిన; నర= మానవులు; మృగ= జంతువులు; సర్ప= పాములు; క్రోడ= పందులు; భూత+ఆదులవలనను= పిశాచాదులవలన; అగు= కలిగే; భయంబు= భయం; భగవత్= భగవానునియొక్క; నామ= పేరు; రూప= రూపం; యాన= వాహనం; దివ్య+అస్త్రంబులవలనను= దివ్యమయిన ఆయుధాలు కారణంగా; పొందకుండుగాక!= కలుగకుండుగాక!; బృహద్రథంతరాది సామంబులచేత= బృహద్రథంతరం మొదలయిన సామములచేత; స్తోత్రంబు= స్తుతి; చేయబడుచున్న; ఖగ+ఇంద్రుండు= పక్షిరాజు; రక్షణ= రక్షించడంలో; దక్షుడు+ఐ= సమర్థుడై; నన్ను; రక్షించుంగాక= రక్షించునుగాక!; శ్రీహరి= శ్రీహరియొక్క; నామ= పేర్లు; రూప= ఆకారాలు; వాహన= వాహనాలు; దివ్య+ఆయుధ= దివ్యమయిన ఆయుధాలు; పారిషద+ఉత్తమ= అనుచరశ్రేష్ఠులు; ప్రముఖులు= మొదలయినవారు; అస్మదీయ= మాయొక్క; బుద్ధి= బుద్ధులను; ఇంద్రియ= ఇంద్రియాలను; మనః= మనస్సులను; ప్రాణంబులన్= ప్రాణాలను; సంరక్షించున్= రక్షించే; భగవంతుండు+ఐన= భగవానుడైన; శేషుండు= ఆదిశేషుడు; సర్వ+ఉపద్రవంబులన్= సకల ఆపదలను; నాశంబు+చేయున్= నాశనం చేయుగాక; జగత్= జగత్తుతో; ఐక్యభావంబు+ఐన= తాదాత్మ్యంగల; ధ్యానంబు= ధ్యానం; కలవానికిన్= సిద్ధించినవానికి; వికల్పరహితుండు+ఐ= భేదంలేనివాడై; భూషణ= అలంకారాలు; ఆయుధ= ఆయుధాలు; లింగ+ఆఖ్యలు+అగు= చిహ్నాలు అనే పేరుగల; శక్తులన్= శక్తులను; తన మాయచేతన్= తన మాయాశక్తిచేత; ధరియించి= ధరించి; తేజరిల్లుచుండు= ప్రకాశించే; లక్ష్మీకాంతుండు= లక్ష్మీనాథుడు; వికల్ప= సంశయాలనుండి; విగ్రహంబులవలనన్= యుద్ధాలనుండి; రక్షించుగాక= కాపాడునుగాక; లోక= లోకాలకు; భయంకర= భయాన్ని కలిగించే; అట్టహాస= పెద్దనవ్వుతో; భాసుర= ప్రకాశించే; వదనగహ్వరుండు+అగుచున్= ముఖమనే గుహకలిగినవాడవుతూ; సమస్త= అన్ని; తేజః= తేజస్సులను; హరణ= హరించుటలో; ధురీణ= అగ్రగణ్యమైన; తేజఃపుంజ= తేజోరాశినుండి; సంజాత= పుట్టిన; దివ్య= గొప్పదైన; నృసింహ+అవతారుండు+అగుచున్= నరసింహావతారం కలవాడవుతూ; ఆ+పరమేశ్వరుండు= ఆ పరమేశ్వరుడు; సర్వ= అన్ని; దిగ్భాగంబులవలనన్= దిక్కులనుండి, సమస్త= అన్ని; బహిరంతరంబులవలనన్= బయటివాటినుండి లోపలివాటినుండి; నన్ను; రక్షింపుచుండుగాక= రక్షించునుగాక; అని= ఈ విధంగా; నారాయణాత్మక= నారాయణస్వరూపమైన; కవచ= కవచంయొక్క; ప్రభావంబు= మాహాత్మ్యం; ఇతిహాసరూపంబునన్= కథారూపంలో; ఇంద్రుండు= ఇంద్రుడు; తెలిసికొని; ధ్యానంబు చేసి= ధ్యానించి; తత్= ఆ; విద్యా= మంత్రంయొక్క; ధారణ= ధరించుటయొక్క; మహిమవలనన్= ప్రభావంచేత; అరాతులన్= శత్రువులను; నిర్జించెన్= జయించాడు; కావునన్= అందువలన; ఎవ్వరేని= ఎవరయినా; నిర్మలాత్ములు+అగువారలు= శుద్ధమయిన మనస్సుగలవారు; ఏతత్= ఈ; విద్యా= కవచరూపమయిన మంత్రాన్ని; ధారణులు+ఐ= మననం చేసినవారై; అనుదినంబును= ప్రతిదినమూ; పఠియించినన్= చదివితే; అతిఘోర= మిక్కిలి భయంకరమయిన; రణంబులన్= యుద్ధాలనూ; అతి+ఉత్కట= మిక్కిలి గొప్పవైన; సంకటంబులను= ఆపదలనూ; సర్వగ్రహా= అన్ని గ్రహాలనూ; నిగ్రహకర్మ= ఆటంకపరచడమూ; మారణకర్మ+ఆది= హింసించడమూ మొ॥; దుష్కర్మ= చెడ్డపనులవలన;

జన్య= పుట్టిన; క్లేశంబులను= కష్టాలను; వదలి= విడిచి; అవ్యాకుల= కలతలేని; మనస్కులు+ఐ= మనస్సుకలవారై; విజయంబున్= జయాన్ని; ఒందుదురు= పొందుతారు; మఱియును= అంతేకాక; సర్వరోగంబులకున్= అన్ని వ్యాధులకూ; అగమ్యశరీరులు+ఐ= పొంద శక్యంకాని శరీరాలుకలవారై; సుఖంబున్= సుఖాన్ని; ఒందుదురు= పొందుతారు; అదియునుంగాక= అంతేకాక.

**తా :** అన్ని ప్రమాదాలకూ కారణమయిన శత్రువులను చంపడంకోసం చేసే అభిచార కర్మలనుండి నారాయణుడు రక్షించుగాక. గర్వం కలగకుండా నరుడు; యోగభ్రంశం కలగకుండా యోగేశ్వరుడైన దత్తాత్రేయుడు; గర్వంవలన బంధం కలగకుండా కపిలుడు; కామవశులం కాకుండా సనత్కుమారుడు, మార్గాలలో ఉండే దేవతలను తిరస్కరించకుండా హయగ్రీవుడు; దేవతలకు నమస్కారాలను తిరస్కరించకుండా, దేవపూజలలో లోపాలు కలగకుండా కలిగిన లోపాలవలన పాపాలు రాకుండా నారదుడూ, అన్ని నరకాలనుండి కూర్మనాథుడూ, అపథ్యం నుండి ధన్వంతరీ, సుఖదుఃఖాదులు శీతోష్ణాదులు మొదలైన ద్వంద్వాలనుండి ఋషభుడూ, జనాపవాదాలనుండి అగ్నీ, చావుపుట్టుకలకు కారణమయిన కర్మలనుండి బలరాముడూ, కాలంనుండి యముడూ, సర్పాలనుండి, అజ్ఞానంనుండి శేషుడూ, వేద బాహ్యులనుండి బుద్ధుడూ, శనినుండి కల్కి మొ॥ రూపాలు ధరించి, ధర్మరక్షణ తత్పరుడయిన శ్రీమహావిష్ణువు నన్ను రక్షించుగాక. ప్రాతః కాలం, సంగవకాల ప్రాహ్ణ, మధ్యాహ్న, అపరాహ్ణ, సాయంకాలాల్లోను, ప్రదోషార్ధరాత్రాపరరాత్ర ప్రత్యూషానుసంధ్యలను ప్రభాతంబునందు గదాద్యాయుధాలు ధరించిన కేశవ, గోవింద, నారాయణ, విష్ణు, మధుసంహర, త్రివిక్రమ, వామన, హృషీకేశ, పద్మనాభ, శ్రీవత్సధామ, సర్వేశ్వరేశ, జనార్దన, విశ్వేశ్వర, కాలమూర్తులను పేర్లు రూపాలుకల విష్ణువు నన్ను రక్షించాలి. ఓ సుదర్శన చక్రమా! నీవు ప్రళయాగ్నివలె భయంకరమయి సుడులతో అడ్డులేని గతిలో దనుజుల్ని నాశనం చేసే దానవు. ప్రచండమైన గాలివలన చెలరేగే అగ్ని ఎండిన అడవుల్ని భస్మం చేసినట్లు నాశత్రుసమూహాల్ని దగ్ధంచెయ్యి. నారాయణుని చేతిలోని ఓ గదా! నీవు ప్రళయకాలంలో ఉత్పాత రూపమయిన ఉరుములతో అన్ని దిక్కులూ వ్యాపించిన మహామేఘాల నుండి వెలువడేవీ, కఠినమయిన పిడుగుల తాకిడివలన కలిగినవీ అయిన అగ్ని కణాలు చిమ్ముతూ భగభగలాడే ప్రకాశం కలదానవు. నీవు నా శత్రువుల్ని యుద్ధాలలో పిండి పిండి చెయ్యి. కూశ్మాండము మొదలయిన పిశాచాల్ని చూర్ణం చెయ్యి. ఓ పాంచజన్య శంఖమా! సకల పుణ్యాలనిలయం శ్రీకృష్ణుని అధరం. ఆ అధరంతో ఊదబడినది వేణువు. ఆ వేణువు వలె పవిత్రమైన దానవు నీవు. గొప్ప ధ్వని చెయ్యి. ఆ ధ్వనితో పిశాచాదులు పారిపోవాలి. మా శత్రువుల గుండెలు పగిలిపోవాలి. శత్రుస్త్రీల గర్భాలు విచ్ఛిన్నం అయిపోవాలి. ఓ నందక ఖడ్గమా! నీ తీవ్రమయిన అంచుతో రాక్షస సమూహాల కుత్తుకలు ఉత్తరించగా ఆ కంఠాలు చిమ్మే రక్తంతో పాపాలను కడిగే దానవు. శ్రీమహావిష్ణువు ప్రయోగించగా మా శత్రువుల సమూహాల్ని ముక్కముక్కలు చెయ్యి. ఓ డాలూ! నీవు చంద్రునివంటి బుడిపెలతో ప్రకాశిస్తున్నావు. అన్ని లక్షణాలు తెలిసినదానవు. పుణ్య రూపంనీవు. మా శత్రువుల క్రూరపుచూపుల్ని గొప్పచీకటితో కన్పించకుండా చెయ్యి. భగవంతుని పేర్లూ రూపాలూ, వాహనాలూ, ఆయుధాలూ మమ్మల్ని క్రూరగ్రహాలనుండీ, నర పశు భూతాలనుండీ రక్షించునుగాక. సామవేదమంత్రాలచేత స్తుతింపబడే గరుత్మంతుడు నన్ను రక్షించునుగాక. శ్రీహరియొక్క పేర్లూ, రూపాలూ, వాహనాలూ, దివ్యాయుధాలూ అనుచరులూ మా బుద్ధినీ ఇంద్రియాల్నీ మనస్సుల్నీ, ప్రాణాల్నీ సంరక్షించుగాక. ఆదిశేషుడు ఆపదలన్నింటినీ నాశనం చేయుగాక. జగత్తును ఈశ్వరరూపంగా ధ్యానించేవారికి ఆయుధాలనూ అలంకారాలనూ ధరించి భాసించే శ్రీహరి సంశయాలనుండి కలహాలనుండి నన్ను రక్షించుగాక, భయంకరాట్టహాసంతో ప్రకాశించే వదన గహ్వరంతో; అన్ని తేజస్సులనూ తిరస్కరించే గొప్ప తేజస్సుతో అవతరించిన నృసింహుడు అన్ని దిక్కులనుండి లోపలనుండి

బయటనుండి కలిగే ఉపద్రవాలనుండి నన్ను రక్షించుగాక! అని నారాయణ కవచం ప్రభావాన్ని ఇంద్రుడు తెలిసికొని, ధ్యానించి, దాని మహిమవలన శత్రువుల్ని ఓడించాడు. అందువలన విమలమనస్కులైన ఎవ్వరైనా ఈ కవచాన్ని ధరించి ప్రతినిత్యమూ చదువుకుంటే అన్ని విధాలయిన ఆపదలనుండి, దుష్కర్మలవలన కలిగే ఉపద్రవాలనుండి రక్షణపొంది మనస్సు ప్రశాంతమై జయం పొందుతారు. ఏ వ్యాధీ వారి జోలికి రాదు.

**1.** పగలు 4 జాములు. రాత్రి 4 జాములు. 1 జాము= 3గంటలు; పగలు= 12 గంటలు దాన్ని 5 భాగాలు చేస్తే ఒక్కోభాగం 2.20 ని॥ల వరకు ప్రాతఃకాలం అంటే సూర్యోదయం 6.00 గం॥లకు అయితే 6.00+2.20= 8.20 ని॥ల వఱకు ప్రాతఃకాలం. రెండో భాగం అంటే 8.20 నుండి 2.20 ని॥లు. 10.40 వఱకు సంగవకాలం అట్లే 3వ భాగం మధ్యాహ్నమని 4వ భాగం అపరాహ్ణమని 5వ భాగం సాయంకాలమని సాధారణమయిన గణన. ప్రకృతంలో పగలును 2 భాగాలుచేసి మూడవభాగంగా ప్రాహ్ణాన్ని చెప్పడం జరిగింది.

**2.** ప్రదోషం అంటే సూర్యాస్తమయంనుండి 3 ముహూర్తాలు ప్రదోషం. ముహూర్తం= 2 గడియలు; 1 గడియ= 24 ని॥లు; ముహూర్తం= 48 ని॥లు. ప్రదోషం 48×3= 144 ని॥లు= 2 గం. 24. సూర్యాస్తమయం 6.00 అయితే 6.00+ 2.24= 8.24 ని॥ల వఱకు ప్రదోషం.

**3.** ప్రత్యూషమన్నా ప్రభాతమన్నా ఒకటే= వేకువ. అదే అరుణోదయం. తెల్లవారడానికి ముందర 4 గడియలు. 1 గడియ= 24 ని॥లు.

**సీ. అతిభక్తిఁ గౌశికుం డను బ్రాహ్మణుఁడు దొల్లి యీ విద్య ధరియించి యెలమి మించి**
**మరుభూమియందు నిర్మలచిత్తుఁడై యోగ ధారణంబున బిట్టు తనువు విడిచె**
**దానిపై నొకఁడు గంధర్వవరేణ్యుండు చిత్రరథాఖ్యుఁ డఁజేయుఁ డొంటిఁ**
**జదలఁ జనంగఁ దచ్ఛాయ తదస్థిపైఁ గదిసిన నాతఁడు గళవళించి**

**ఆ. యువిదపిండుతోడ నవ విమానముతోడఁ దనదు విద్యతోడ ధరణిఁ ద్రెళ్లి**
**తిరిగి లేవలేక తికమక గుడువంగ, వాలఖిల్యమౌని వానిఁ జూచి. 308**

**ప్రతి :** తొల్లి= పూర్వం; కౌశికుండు+అను= కౌశికుడు అనే పేరుగల; బ్రాహ్మణుఁడు= బ్రాహ్మణుడు; అతిభక్తిన్= అధికభక్తితో; ఈ విద్యన్= ఈ నారాయణ కవచ మనే మంత్రాన్ని; ధరియించి= ఉపాసించి; ఎలమిన్= ధైర్యంతో; మించి= అతిశయించి; నిర్మలచిత్తుడు+ఐ= శుద్ధమనస్సుకలవాడై; మరుభూమియందు= ఎడారియందు; యోగధారణంబునన్= యోగవిద్య నవలంబించి; బిట్టు= శీఘ్రంగా; తనువున్= శరీరాన్ని; విడిచెన్= విడిచిపెట్టాడు; దానిపైన్= ఆశరీరంపై; అజేయుడు= జయింపశక్యంకానివాడు; చిత్రరథ+ఆఖ్యుడు= చిత్రరథుడనే పేరుగల; ఒకడు= ఒక; గంధర్వ వరేణ్యుండు= గంధర్వశ్రేష్ఠుడు; ఒంటిన్= ఒంటరిగా; చదలన్= ఆకాశంలో; చనంగన్= ప్రయాణించగా; తత్+ఛాయ= ఆ విమానపు నీడ; తత్+అస్థిపైన్= ఆ అస్థిపంజరంపై; కదిసినన్= కలియగా; ఆతడు= ఆ గంధర్వుడు; కళవళించి= కలతచెంది; ఉవిద= స్త్రీలయొక్క; పిండుతోడన్= సమూహంతో; నవ= క్రొత్తదైన; విమానము తోడన్= విమానంతో బాటుగా; ధరణిన్= నేలపై; త్రెళ్ళి= పడి; తిరిగి= మరల; లేవలేక= లేచుటకు అశక్తుడయి; తికమక= తొట్రుపాటు; కుడువంగా= పొందగా; వాలఖిల్యమౌని= వాలఖిల్యుడను ముని; వానిన్= ఆ గంధర్వుని; చూచి.

**తా :** కౌశికుడనే బ్రాహ్మణుడు నారాయణకవచాన్ని శ్రద్ధగా ఉపాసించాడు. తరువాత యోగశక్తితో ఒక ఎడారిలో తనువు చాలించాడు. చిత్రరథుడనే గంధర్వుడు విమానంలో ప్రయాణిస్తుండగా ఆ విమానం నీడ కౌశికుని అస్థిపంజరం మీద పడింది. అంతలో ఆ విమానంతోబాటు గంధర్వుడు అతని భార్యలు నేలమీద పడిపోయారు. ఆ గంధర్వుడు పైకిలేవలేకపోయాడు. చాలా కలత చెందాడు. ఆ సందర్భంలో వాలఖిల్యముని ఆ గంధర్వునితో–

**క.** **నారాయణకవచ సమా, ధారణ పుణ్యాస్థి దీని దగ్గఱ నీకుం**
**గూరెడినె? విష్ణుభక్తుల, వారక చేరంగ నెట్టివారికిఁ దరమే? 309**

**ప్రతి :** నారాయణకవచ= నారాయణకవచవిద్యను; సమాధారణ= ఉపాసించడంవలన; పుణ్య= పవిత్రమయిన; అస్థి= అస్థిపంజరం; దీనిన్= ఈ అస్థిపంజరాన్ని; దగ్గఱన్= సమీపించడానికి; నీకున్= నీకు; కూరెడినె?= శక్యమా?; ఎట్టివారికిన్= ఎటువంటి వారికైనా; విష్ణుభక్తులన్= విష్ణుభక్తులను; వారక= అడ్డులేని రీతిలో; చేరంగన్= సమీపించడానికి; తరము+ఏ= శక్యమా? కాదు.

**తా :** ఇది నారాయణకవచమంత్రాన్ని ఉపాసన చేయడంవలన పుణ్యమైన అస్థి. దీనిని సమీపించడం నీకు శక్యంకాదు. విష్ణుభక్తులను ఏ అడ్డులేకుండా సమీపించడం ఎంతవారికైనా శక్యంకాదు.

**ఇంద్రవజ్రము.**
**సంధించి నీ యంగక సంధు లెల్లన్, బంధించి తన్మంత్రబలంబు పేర్మి**
**న్నందంబు మాన్పింపఁ ద దన్య మేదీ? సింధుప్రవా హోన్నతి చేతఁ దీరున్. 310**

**ప్రతి :** నీ= నీయొక్క; అంగక= అవయవాల; సంధులు+ఎల్లన్= విడిపోయిన అన్నికీళ్ళను; సంధించి= కలిపి; తత్= ఆ; మంత్ర= నారాయణకవచంయొక్క; బలంబు= శక్తియొక్క; పేర్మిన్= అతిశయాన్ని; బంధించి= నిలువరించి; అందంబున్= బంధాన్ని, (నీకు కల్గిన ఆపదను); మాన్పింపన్= పోగొట్టటానికి; తత్= ఈ ఎముకలను నదీ ప్రవాహంలో ఉంచటం; అన్యము= మరొక ఉపాయం; ఏదీ= ఏది? (లేదు); సింధు= నదియొక్క; ప్రవాహ= ప్రవాహంయొక్క; ఉన్నతిచేతన్= గొప్పదనంచేత; తీరున్= నీ ఆపద తొలగిపోతుంది.

**తా :** పాడైన నీ కీళ్ళను సంధించి; ఆ మంత్రప్రభావాన్ని వారించి నీ ఆపదను తొలగించ గలిగిన ఉపాయం నదీజలాల్లో ఈ అస్థులను ఉంచడమే. అంతకంటె మరొక ఉపాయంలేదు.

**విశే :** ఇది ఇంద్రవజ్రవృత్తం – దధప్రాస వాడబడింది – ఇంద్రవజ్రంలో 'తతజగగ' గణాలుంటాయి. చాలా చిన్న పద్యం. పెద్ద ఆపదకు చిన్న ఉపాయం.

**వ.** **కావున నీ పుణ్యశల్యంబులు భక్తియుక్తుండవై కొనిపోయి ప్రాఙ్ముఖంబునఁ బ్రవహించెడు సరస్వతీ జలంబుల నిక్షేపణంబు సేసి కృతస్నానుండ వై యాచమనంబు చేసిన, నీ సర్వాంగ బంధనంబు లుడుగు ననిన నతం డట్లుచేసి, తన విమానం బెక్కి నిజస్థానంబున కరిగెం గావున. 311**

**ప్రతి :** కావునన్= అందువలన; ఈ పుణ్యశల్యంబులు= ఈ పవిత్రమయిన; ఎముకలు; భక్తియుక్తుండవు+ఐ= భక్తితోకూడినవాడవై; కొనిపోయి= తీసికొనిపోయి; ప్రాక్+ముఖంబునన్= తూర్పుముఖంగా; ప్రవహించెడు= ప్రవహించే;

సరస్వతీజలంబులన్= సరస్వతీనదియొక్క నీళ్ళలో; నిక్షేపణంబు+చేసి= ఉంచి; కృత= చేయబడిన; స్నానుండవు+ఐ= స్నానంకలవాడవై; ఆచమనంబు= ఆచమనం; చేసినన్= చేసినట్లయితే; నీ= నీయొక్క; సర్వ+అంగ= అన్ని అవయవాల; బంధనంబులు= కట్లు; ఉడుగును= పోవును; అనినన్= అని చెప్పగా; అతండు= ఆ గంధర్వుడు; అట్లు= ఆ విధంగా; చేసి; తన విమానంబు= తన విమానాన్ని; ఎక్కి= అధిరోహించి; నిజస్థానంబునకున్= తన చోటుకు; అరిగెన్= వెళ్లాడు; కావునన్= అందువలన...

**తా :** అందువలన ఈ పవిత్రమయిన ఎముకల్ని తీసుకొని తూర్పుగా ప్రవహించే సరస్వతీనదీ జలాల్లో వేసినట్లయితే నీ కీళ్ళకట్లు తొలగిపోతాయి – అని చెప్పగా ఆ గంధర్వుడు అలాగే చేసి తన విమానంలో తన స్థానానికి వెళ్ళిపోయాడు. అందువలన

**క. అనుదినము దీని నెవ్వరు, వినిరేనిఁ బఠించిరేని విస్మయ మొదవన్**
**ఘన భూతజాల మెల్లను, మునుకొని వారలను గాంచి మ్రొక్కుచు నుండున్. 312**

**ప్రతి :** అనుదినము= ప్రతిదినమూ; దీనిన్= ఈ నారాయణ కవచమును; ఎవ్వరు= ఎవరు; వినిరి+ఏనిన్= వింటారో; పఠించిరేనిన్= చదువుతారో; విస్మయము= ఆశ్చర్యం; ఒదవన్= కలిగేటట్లు; ఘన= గొప్పదైన; భూత= ప్రాణుల; జాతము+ఎల్లన్= సమూహమంతా; మునుకొని= ఎదురుపడి; వారలను= వారిని; కాంచి= చూచి; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; ఉండున్= ఉంటుంది.

**తా :** ఎవరు ఈ నారాయణ కవచాన్ని ప్రతిదినమూ వింటారో, చదువుతారో, వారికి ఎదురుపడినపుడు సమస్త ప్రాణులూ నమస్కరిస్తాయి.

**ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకరమైన, యిట్టి విద్యఁ దాల్చి యింద్రుఁడపుడు**
**మూఁడు లోకములకు ముఖ్యమైనట్టి శ్రీ, ననుభవించి మించె నధికమహిమ. 313**

**ప్రతి :** ఇంద్రుడు; విశ్వరూపువలనన్= విశ్వరూపునినుండి; ఐశ్వర్యకరము+ఐన= ఐశ్వర్యాన్ని కలిగించే; ఇట్టి= ఇటువంటి; విద్యన్= మంత్రాన్ని; తాల్చి= పొంది; అపుడు= ఆ సమయంలో; మూడులోకములకున్= ముల్లోకాలకూ; ముఖ్యము ఐనట్టి= ప్రశస్తమయిన; శ్రీన్= సంపదను; అనుభవించి= పొంది; అధిక= గొప్పదైన; మహిమన్= ప్రభావంతో; మించెన్= ప్రకాశించాడు.

**తా :** ఇంద్రుడు విశ్వరూపుని దగ్గర ఈ నారాయణకవచాన్ని ఉపదేశంపొంది ముల్లోకాల్లోనూ గొప్ప సంపదలను అనుభవించి మహాప్రభావంకలిగి ప్రకాశించాడు.

**సీ. భూపాల! యా విశ్వరూపున కరుదైన తలలు మూఁ దనువొందఁ దగిలియుండు**
**సొరిది సురాపాన సోమపానంబులు నన్నాద మనఁగను నమరవరుల**
**తోఁగూడి భుజియించి తూకొని వారితో యజ్ఞభాగంబు ప్రత్యక్ష మొంది**
**కై కొనుచుండి దుష్కర్ముఁడై యా యజ్ఞ భాగంబు రాక్షస ప్రవరులకును**

**ఆ. దల్లి మీఁదఁ గలుగు తాత్పర్యవశమున, దివిజవరుల మొఱఁగి తెచ్చి యిచ్చె**
**నది యెఱింగి యింద్రుఁ డతిభీతచిత్తుఁడై, తనకుఁగాని యతని తలలు ద్రుంచె. 314**

**ప్రతి :** భూపాల!= ఓ రాజా!; ఆ; విశ్వరూపునకున్= విశ్వరూపునకు; సొరిది= క్రమంగా; సురాపాన= మద్యం తాగేదీ; సోమపానంబులు= సోమరసం తాగేదీ; అన్నాదము= అన్నంతినేదీ; అనగను= అనబడే; అరుదు+ఐన= గొప్పవైన; తలలు మూడు= మూడుతలలు; అనువు+ఒందన్= బాగుగా; తగిలి యుండున్= సంబంధించి ఉంటాయి; అమరవరులతోన్+కూడి= దేవతాశ్రేష్ఠులతో కలిసి; భుజియించి= తిని; తూకొని= ప్రయత్నించి; వారితో= దేవతలతో బాటుగా; యజ్ఞభాగంబు= యజ్ఞాలలో భాగాన్ని; తల్లిమీదన్= తల్లిపై; కలుగు= ఉన్న; తాత్పర్యవశమునను= భక్తిచేత; దివిజవరులన్= దేవతాశ్రేష్ఠులను; మొఱగి= మోసగించి; రాక్షసప్రవరులకును= రాక్షసశ్రేష్ఠులకు; తెచ్చి+ఇచ్చెను= ఇచ్చాడు; అది= ఆ కపటము; ఎఱింగి= తెలిసి; ఇంద్రుఁడు= ఇంద్రుడు; అతిభీత= మిక్కిలి భయముపొందిన; చిత్తుడు+ఐ= మనస్సుకలవాడై; తనకున్+కాని= తనకుపయోగపడని; ఆతని= ఆవిశ్వరూపుని; తలలు= తలలను; త్రుంచెన్= ఖండించాడు.

**తా :** రాజా! ఆ విశ్వరూపునకు మూడుతలలున్నాయి. వాటిలో ఒకటి మద్యం తాగుతుంది. మరొకటి సోమరసం తాగుతుంది. మరొకటి అన్నం తింటుంది. యజ్ఞం జరిగేటపుడు ఆ విశ్వరూపుడు అందరకూ తెలిసే విధంగా దేవతలకు హవిస్సులిచ్చేవాడు. ఆతని తల్లి రాక్షసవంశంలో పుట్టింది. ఆమె పట్ల భక్తిచేత రాక్షసపక్షపాతం కలిగి విశ్వరూపుడు రహస్యంగా రాక్షసులకు హవిస్సుల నిచ్చేవాడు. ఇది తెలిసి దేవేంద్రుడు భయపడి, ఆ విశ్వరూపుని తలలు ఖండించాడు.

**క. భూసురుఁ డనక మహాత్మా, గ్రేసరుఁడన కతఁడు పూర్వకృత కర్మగతిన్**
**వేసరఁ డనక మహేంద్రుఁడు, భూసురు తల లపుడు రోషమునఁ దెగ నడిచెన్. 315**

**ప్రతి :** భూసురుడు+అనక= ఈ విశ్వరూపుడు బ్రాహ్మణుడు అని ఆలోచించక; మహాత్మ= మహాత్ములలో; అగ్రేసరుడు+అనక= గొప్పవాడని కూడా ఆలోచించక; పూర్వ= పూర్వజన్మలలో; కృత= చేయబడిన; కర్మగతిన్= పాపకర్మయొక్క తీరుచేత; వేసరఁడు= కపటం చేయడానికి వెనుదీయడు; అనక= అని ఆలోచింపక; మహేంద్రుఁడు= ఇంద్రుడు; భూసురు= బ్రాహ్మణుని; తలలు= శిరస్సులను; అప్పుడు= ఆ సమయంలో; రోషమునన్= కోపంతో; తెగనడిచెన్= నరికివేశాడు.

**తా :** ఈ విశ్వరూపుడు బ్రాహ్మణుడనికాని, మహాత్ముడని కాని, దేవేంద్రుడు ఆలోచించలేదు. పూర్వజన్మపాపప్రభావంచేత ఇలాంటి వంచన చెయ్యకూడదని విశ్వరూపుడాలోచించలేదు కదా! అని కూడా దేవేంద్రుడు భావించలేదు. కోపంతో ఆ విశ్వరూపుడి తలలు ఖండించాడు.

**వ. ఇట్లయ్యింద్రుండు క్రోధంబు సహింపంజాలక విశ్వరూపుతలలు ఖడ్గంబునం దెగనడిచిన సోమపానంబు చేయు శిరంబు కపింజలం బయ్యె. సురాపానంబు చేయు శిరంబు గలవింకం బయ్యె. అన్నంబు భక్షించు శిరంబు తిత్తిరి యయ్యె. ఇట్లు త్రివిధ పక్షి స్వరూపంబు దాల్చి, బ్రహ్మహత్య యేతెంచి, యింద్రునిఁ జుట్టుకొని తమ్ముఁ బరిగ్రహింపు మని నిర్బంధింప నపు డింద్రుం డతి భీతచిత్తుండై త్రిలోకనాయకుండైనం దానిం దప్పించుకొనఁజాలక యంజలి యొగ్గి, య మ్మహా దోషంబుఁ గైకొని, తద్దోషం బొక్క సంవత్సరం బనుభవించి, యంతం బాపుకొనువాఁడై భూ జల వృక్ష స్త్రీలం బ్రార్థించి, మద్దురితంబు చతుర్విధంబులం బుచ్చుకొనుం డనిన, భూమి తనయందుఁ జేయంబడిన ఖాతంబు తనంతన పూడునట్టి వరంబును, జలంబు సర్వంబు దనయందుఁ బ్రక్షాళితం బైనం బావనం బగు నట్టి వరంబును, వృక్షంబులు ఛేదింపంబడి పునఃప్రరోహంబు గలుగునను వరంబును, స్త్రీ లెల్లప్పుడుం దమకుఁ గామసుఖంబు గలుగు నను వరంబును గోరిన, నతం**

**డట్లుగాక యని యొసంగిన, నతని దుష్కృతంబు ధరణి యిరిణ విధంబునను, నుదకంబు బుద్బుదఫేన రూపంబునను, మహీరుహంబులు నిర్యాసభావంబునను, నింతులు రజోవికారంబునను నిట్లు చతుర్భాగంబులం బంచికొనిరి. అంత. 316**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ఆ+ఇంద్రుండు= ఆ ఇంద్రుడు; క్రోధంబు= కోపం; సహింపజాలక= ఓర్చుకొనలేక; విశ్వరూపుతలలు= విశ్వరూపుని తలలు; ఖడ్గంబునన్= కత్తితో; తెగనడిచినన్= నరకగా; సోమపానంబు చేయు= సోమరసాన్ని తాగే; శిరంబు= తల; కపింజలంబు= కముజుపిట్ట; అయ్యెన్= అయింది; సురాపానంబు చేయు= మద్యం సేవించే; శిరంబు= తల; కలవింకంబు= పిచ్చుక; అయ్యెన్= అయింది; అన్నంబు= అన్నం; భక్షించు= తినే; శిరంబు= తల; తిత్తిరి= తీతువు పిట్ట; అయ్యెన్= అయింది; ఇట్లు= ఈ విధంగా; త్రివిధ= మూడువిధాలయిన; పక్షి= పక్షుల; స్వరూపంబులు= రూపాలను; తాల్చి= ధరించి; బ్రహ్మహత్య= బ్రహ్మహత్యాపాపం; ఏతెంచి= వచ్చి; ఇంద్రునిన్= ఇంద్రుణ్ణి; చుట్టుకొని= ఆవరించి; తమ్మున్= తమను; పరిగ్రహింపుము+అని= స్వీకరింపుమని; నిర్బంధింపన్= ఒత్తిడి చేయగా; అపుడు= ఆ సమయంలో; ఇంద్రుండు= ఇంద్రుడు; అతిభీత చిత్తుండు+ఐ= మిక్కిలి భయపడిన మనస్సుకలవాడై; త్రిలోక= ముల్లోకాలకూ; నాయకుండు+ఐనన్= అధిపతి అయినా; దానిన్= ఆ బ్రహ్మహత్యాపాపాన్ని; తప్పించుకొనన్+చాలక= తప్పించుకోలేక; అంజలి+ఒగ్గి= దోసిలిపట్టి; ఆ+మహాదోషంబున్= ఆ గొప్పదోషాన్ని; కైకొని= స్వీకరించి; తత్+దోషంబు= ఆ దోషాన్ని; ఒక్క సంవత్సరంబు= ఒక ఏడాది; అనుభవించి; దానిన్= ఆ పాపాన్ని; పాపుకొనువాడు+ఐ= తొలగించుకొనేవాడై; భూ= నేలను; జల= నీటిని; వృక్ష= చెట్లను; స్త్రీలన్= స్త్రీలను; ప్రార్థించి= యాచించి; మత్+దురితంబు= నా పాపాన్ని; చతుర్+విధంబులన్= నాలుగు విధాలుగా; పుచ్చుకొనుండు= తీసికోండి; అనినన్= అనగా; భూమి= నేల; తనయందున్= తనలో; చేయబడిన; ఖాతంబు= గొయ్యి; తనంతన= తనకుతానుగా; పూడునట్టి వరంబును= నిండునట్టి వరాన్ని; జలంబు= నీరు; సర్వంబు= సమస్తం; తనయందున్= తనలో; ప్రక్షాళితంబు+ఐనన్= కడగబడినచో; పావనంబు+అగునట్టి= పవిత్రమయ్యే; వరంబును= వరాన్ని; వృక్షంబులు= చెట్లు; ఛేదింపబడి= నరకబడి; పునఃప్రరోహంబు కలుగును+అను= తిరిగి చిగురిస్తాయి అనే; వరంబును= వరాన్ని; స్త్రీలు; ఎల్లప్పుడున్= సదా; తమకున్= తమకు; కామసుఖంబు= రతిసుఖం; కలుగును+అను= కలుగుతుందనే; వరంబును= వరాన్ని; కోరినన్= కోరగా; అతండు= ఇంద్రుడు; అట్లు+కాక= అట్లేయగునుగాక; అని; ఒసంగినన్= రానివ్వగా; అతని= ఆ ఇంద్రుని; దుష్కృతంబు= పాపం; ధరణి= నేల; ఇరిణ విధంబునను= చవుడు రూపంలో; ఉదకంబు= నీరు; బుద్బుద= బుడగలు; ఫేన= నురుగుల; రూపంబునను= రూపంతో; మహీరుహంబులు= చెట్లు; నిర్యాసభావంబునను= జిగురు రూపంలో; ఇంతులు= స్త్రీలు; రజోవికారంబునను= నెలనెలా రజస్వలకావడం అనేరూపాన; ఇట్లు= ఈ విధంగా; చతుర్+భాగంబులన్= నాలుగు భాగాలను; పంచుకొన్నారు; అంతన్= తరువాత.

**తా :** ఇంద్రుడు కోపాన్ని ఓర్చుకోలేక విశ్వరూపుని తలలు కత్తితో ఖండించాడు. సోమపానంచేసే తల కముజుపిట్ట అయ్యింది. సురాపానంచేసే తల పిచ్చుక అయ్యింది. అన్నంతినే తల తీతువుపిట్ట అయ్యింది. ముల్లోకాలకు అధిపతి అయినా ఇంద్రుడికి బ్రహ్మహత్యాపాతకం తప్పలేదు. బ్రహ్మహత్యాపాతకం ఇంద్రుణ్ణి సమీపించి తనను స్వీకరించమని ప్రార్థించింది. ఇంద్రుడు దోసిలిపట్టి ఆ పాపాన్ని స్వీకరించి ఒక ఏడాదిపాటు దాన్ని అనుభవించాడు. దాన్ని పోగొట్టుకోవాలని నేలను, నీళ్ళను, చెట్లను, స్త్రీలను నా పాపం స్వీకరించండి అని ప్రార్థించాడు. అపుడు నేల – నాలో ఏర్పడిన గోతులు తమంతతాముగా పూడుకుపోవాలి – అనే వరం అడిగి, పొంది, ఆ పాపాన్ని చవుడునేలరూపంలో స్వీకరించింది. నీళ్ళు – నాలో ఏది కడగబడినా అది పవిత్రం కావాలి – అనే వరం అడిగి, పొంది, బుడగలు, నురుగు రూపంలో పాపాన్ని

స్వీకరించింది. చెట్లు – తాము నరకబడినా తిరిగి చిగురించాలి – అనే వరం అడిగి, పొంది, జిగురు రూపంలో ఆ పాపాన్ని స్వీకరించాయి. స్త్రీలు – తాము సదా రతిసుఖాన్ని పొందాలి – అనే వరం అడిగి, పొంది, నెల నెలా రజస్వలలు కావడం అనే రూపంలో ఆ పాపాన్ని స్వీకరించారు.

## ❖ వృత్రాసుర వృత్తాంతము ❖

**మ. హతపుత్రుం డగు విశ్వరూపజనకుం దా త్వష్ట దుఃఖాయతో**
**ద్ధత రోషానల దహ్యమానుఁ డగుచుం దా నింద్రుపై మారణ**
**క్రతు హోమంబు నొనర్ప నందుఁ బొడమెం గల్పాంతకాకార వి**
**శ్రుత కీలానల నిష్ఠు రేక్షణ గుణ క్షుభ్య త్త్రిలోకోగ్రుఁడై. 317**

**ప్రతి :** హత= చంపబడిన; పుత్రుండు+అగు= పుత్రుడు కలిగిన; విశ్వరూప= విశ్వరూపునియొక్క; జనకుండు+అగు= తండ్రియైన; ఆ త్వష్ట; దుఃఖ= దుఃఖంచేత; ఆయత= అధికమైన; ఉద్ధత= తీవ్రమైన; రోష+అనల= రోషాగ్నిచేత; దహ్యమానుడు= కాల్చబడినవాడు; అగుచున్= అవుతూ; ఆ ఇంద్రునిపైన్= ఆ ఇంద్రునిమీద; మారణ= శత్రువులను చంపే; క్రతు= యాగానికి సంబంధించిన; హోమంబున్= హోమాన్ని; ఒనర్పన్= చేయగా; అందున్= ఆహోమంలో; కల్ప= కల్పాన్ని; అంతక= నాశనం చేసే; ఆకార= స్వరూపంతో; విశ్రుత= ప్రసిద్ధమైన; కీలా= జ్వాలలుగల; అనల= అగ్నివలె; నిష్ఠుర= తీవ్రమైన; ఈక్షణ= చూపులయొక్క; గుణ= ఎర్రతనము మొదలయిన గుణాలచేత; క్షుభ్యత్= కలతపడిన; త్రిలోక= ముల్లోకాలు కలిగినట్లుగా; ఉగ్రుడు+ఐ= భయంకరుడై; పొడమెన్= పుట్టాడు.

**తా :** విశ్వరూపుడు చనిపోయేసరికి అతని తండ్రియైన త్వష్టకు దుఃఖం కలిగింది. ఆ దుఃఖంవల్ల కలిగిన తీవ్రకోపంతో ఆయన మండిపడిపోయాడు. ఇంద్రుణ్ణి చంపడం కోసం ఒక మారణ క్రతువు చేశాడు. ఆ హోమాగ్ని నుండి ఒకడు పుట్టాడు. అతని చూపులు కల్పాంతాగ్ని జ్వాలల్లా ఉన్నాయి. ఆ చూపులతో ముల్లోకాలు క్షోభించిపోయాయి.

**విశే :** కల్పమంటే బ్రహ్మదేవుడి కొక పగలు, మానవలోకం లెక్కలను అనుసరించి నాల్గు యుగాలూ వేయి మారులు తిరిగితే అది బ్రహ్మ కొకపగలు. ఆ పగటి చివర ప్రళయం.

క్రతువంటే యాగం. ఆయా దేవతల నుద్దేశించి ద్రవ్యత్యాగం. హోమమంటే ఆ ద్రవ్యాలను అగ్నిలో సమర్పించటం.

**సీ. యుగము గ్రుంగెడునాఁడు జగములు పొలియించు నంతకు మూర్తిపై నింత యగుచుఁ**
**బఱపును నిడుపును బ్రతిదినంబును నొక్క శరపాత మంగంబు విరివిఁగొనుచుఁ**
**గడుదగ్ధశైలసంకాశ దేహమునందుఁ గరము సంధ్యారాగకాంతిఁ బెరయ**
**మును గాఁక రాగిచేఁ గను మించు మించులఁ గఱకు మీసలు కచాగ్రములు మెఱయఁ**

**తే. జండ మధ్యాహ్న మార్తాండ మండలోగ్ర, చటుల నిష్ఠుర లోచనాంచల విధూత**
**దశ దిశాభాగుఁ దుజ్జ్వలతర కరాళ, భిదుర సునిశిత దంష్ట్రోరు వదనగుహుఁడు. 318**

**ప్రతి :** యుగము; క్రుంగెడునాడు= ముగిసేటప్పుడు; జగములు= ప్రపంచాలను; పొలియించు= నాశనం చేసే; అంతకు= రుద్రుని; మూర్తిపైన్= స్వరూపంపై; ఇంత+అగుచున్= అధికమవుతూ; పఱపును= వెడల్పూ; నిడుపును= పొడుగూ;

ప్రతిదినంబును= ప్రతి దినమూ; ఒక్క శరపాతము= ఒక బాణం పడినంత దూరం; అంగంబు= శరీరంయొక్క; విరివిన్+కొనుచున్= వృద్ధిని పొందుతూ; కడున్= మిక్కిలి; దగ్ధ= తగులబడిన; శైల= పర్వతంతో; సంకాశ= సమానమైన; దేహమునందున్= శరీరంలో; సంధ్యారాగకాంతిన్= సంధ్యాకాలంలోని ఎర్రనికాంతిని; పెరయన్= పొందుతూ ఉండగా; మునుగాఁక= బాగాకాల్చబడిన; రాగిచేగను= శుద్ధమయిన రాగిని; మించు= అతిక్రమించే; మించుల= కాంతులుకల; కఱకు= కర్కశమైన; మీసలు= మీసాలు; కచ+అగ్రములు= జుట్టుకొనలు; మెఱయన్= ప్రకాశింపగా; చండ= తీక్ష్ణమయిన; మధ్యాహ్న= మధ్యాహ్న సమయంలోని; మార్తాండ= సూర్యుని; మండల= బింబమువలె; ఉగ్ర= భయంకరమైన; చటుల= చలించుచున్న; నిష్ఠుర= కఠినమైన; లోచన= కన్నుల; అంచల= కొనలచేత; విధూత= కంపింపచేయబడిన; దశ= పది; దిశాభాగుడు= దిగ్భాగాలు కలవాడు; ఉజ్జ్వలతర= మిక్కిలి ప్రకాశిస్తున్న; కరాళ= భయంకరమైన; భిదుర= వజ్రాయుధంవలె; సునిశిత= పదునైన; దంష్ట్రా= కోరలచేత; ఉరు= పెద్దదయిన; వదనగుహుడు= ముఖమనే గుహకలవాడు...

**తా :** ప్రళయకాలంలో జగాలను సంహరించే రుద్రునికంటె అధికమైన ఒడ్డూ పొడుగూ కలవాడవుతూ, నానాటికీ శరీరం బాణపు వేటంతగా పెరుగుతూ, కాలినపర్వతంలా ఉన్న శరీరం సంధ్యాకాలంలోని ఎరుపురంగుతో ఉండగా పుట్టంపెట్టిన రాగిరంగుతో మెరుస్తున్న మీసాలు జుట్టు కొసలు కలిగి మధ్యాహ్నపు సూర్యబింబంలా ఉన్న కన్నుల కొసలతో దిక్కులను వణికిస్తూ, వజ్రాయుధంలా మెరిసే కోరలతో ప్రకాశించే గుహవంటి ముఖంతో

**ఉ. నింగికి నేలకుం బొడవు నిట్టలమై శిఖలందుఁ బర్వు ను**
**త్తుంగ త రాగ్నిజాలములఁ దొ్రటిలుచుం గ్రహపంక్తి జాఱ ని**
**స్సంగ కరాళశాత ఘన సద్ఘృణి మండల చండ శూల ము**
**ప్పొంగుచుఁ గేల లీలఁగొని భూమిచలింపఁగ సోలియాడుచున్. 319**

**ప్రతి :** పొడవు= ఎత్తు; నింగికిన్= ఆకాశానికీ; నేలకున్= నేలకు తాకేటట్లు; నిట్టలము+ఐ= అధికమై; శిఖలందున్= జుట్టునందు; పర్వు= వ్యాపించే; ఉత్తుంగ తర= మిక్కిలిఎత్తయిన; అగ్ని= నిప్పు అనే; జాలములన్= వలలలో; గ్రహపంక్తి= సూర్యచంద్రాది గ్రహాల, నక్షత్రాల వరుస; తొ్రటిలుచున్= తొ్రటుపాటు పడుతూ; జాఱన్= పడగా; నిస్సంగ= అడ్డులేని; శత్రువులను తాకకుండగనే; కరాళ= భయం కలిగించేదీ; శాత= పదునైనది; ఘన= దిటవుకలదీ; సత్= నక్షత్రాల; ఘృణిమండల= కాంతిమండలంవలె, చండ= భయంకరమూ అయిన; శూలము= శూలాన్ని; కేలన్= చేతితో; లీలన్= అనాయాసంగా; కొని= పట్టుకొని; ఉప్పొంగుచున్= మిక్కిలి సంతోషిస్తూ; భూమి= నేల; చలింపగన్= వణకగా; సోలి= పరవశించి; ఆడగన్= గంతులువేయగా...

**తా :** నింగినీ నేలనూ తాకే అంతగా ఎత్తుగా ఉన్నాడు. అతని శిరస్సుపై వ్యాపించిన మంటలవలలో నింగి నున్న గ్రహాలు జారిపడిపోతున్నాయి. శరీరానికి తగలకుండగానే భయం కల్గించేది పదునైనదీ, దిటవైనదీ, సూర్యబింబంలా తీక్ష్ణంగా ఉన్నదీ అయిన శూలాన్ని అనాయాసంగా చేతితో పట్టుకొని మహానందంతో నేలవణికేలా పరవశించి గంతులు వేస్తూ

**సీ. వదలక విరివిగా వదనంబు దెఱచుచు నాకాశమంతయు నప్పళించుఁ,**
**గడునాల్క నిగుడించి గ్రహతారకంబుల నయమెల్ల దిగజాఱ నాకి విడుచు,**
**నలవోకయును బోలె నట్టహాసము చేసి మెఱసి లోకములెల్ల మ్రింగఁ జూచుఁ,**
**దనదు దిగ్దంతి దంతములు చెక్కలువాఱ నుగ్రదంష్ట్రలు ద్రిప్పు నుక్కుమిగిలి,**

తే. త్వష్ట బలితంపుఁ దపమునఁ బుష్టినొంది, యఖిల లోకంబు లెల్లఁ దా నాక్రమించి
వృత్రనామాఖ్య దేవతాశత్రుఁ డగుచు, దారుణాకారుఁ డఖిల దుర్దముఁడు మెఱసె. 320

ప్రతి : వదలక= ఆపకుండా; వదనంబు= ముఖం (నోరు); విరివిగాన్= విశాలంగా; తెఱచుచున్= తెరుస్తూ; ఆకాశమంతయున్= ఆకాశమంతా; అప్పళించున్= చరిచాడు; కడు= గొప్పదైన; నాల్కన్= నాలుకను; నిగుడించి= పొడిగించి, చాచి; గ్రహ= చంద్రాది గ్రహాల; తారకంబుల= అశ్విన్యాదినక్షత్రాల; నయము+ఎల్లన్= అందమంతా; దిగజాఱన్= పోయేటట్లు; నాకి; విడుచున్= విడిచిపెడతాడు; అలవోకయును+పోలెన్= అనాయాసంగా; అట్టహాసముచేసి= పెద్దనవ్వునవ్వి; మెఱసి= ప్రకాశించి; లోకములు+ఎల్లన్= అన్ని లోకాలనూ; మ్రింగగన్+చూచున్= మింగటానికి ప్రయత్నిస్తాడు; దిగ్దంతి= దిగ్గజాల; దంతములు= దంతాలు; చెక్కలువాఱన్= ముక్కలు అయ్యేటట్లు; ఉక్కుమిగిలి= మిక్కిలి గర్వించి; తనదు= తనయొక్క; ఉగ్రదంష్ట్రలు= భయంకరమయిన కోరలు; త్రిప్పున్= త్రిప్పుతాడు; త్వష్ట= త్వష్టయొక్క; బలితము= శక్తిమంతమయిన; తపమునన్= తపస్సుచేత; పుష్టిన్= బలాన్ని; ఒంది= పొంది; అఖిలలోకంబు లెల్లన్= అన్ని లోకాలనూ; తాను; ఆక్రమించి= వ్యాపించి; వృత్రనామ+ఆఖ్యన్= వృత్రుడనే ప్రసిద్ధమయిన పేరుతో; దేవతాశత్రుడు+ అగుచున్= దేవతలకు శత్రువు అవుతూ; దారుణ= భయంకరమయిన; ఆకారుఁడు= ఆకారంకలిగినవాడు; అఖిల= అందరకూ; దుర్దముడు= అణచటానికి శక్యంకాని; ఆవృత్రాసురుడు; మెఱసెన్= ప్రకాశించాడు.

**తా :** వృత్రాసురుడు నిరంతరంగా నోరు తెరిచి ఆకాశాన్నిచరుస్తున్నాడు. నాలుక చాపి గ్రహాలను నక్షత్రాలను నాకుతున్నాడు. పెద్దనవ్వులు నవ్వుతూ లోకాలను మింగడానికి ప్రయత్నిస్తున్నాడు. తన భయంకరమయిన కోరలు తిప్పుతూ దిగ్గజాల దంతాలను ముక్కలు చేస్తున్నాడు. త్వష్ట తపోబలంచేత బలం సంపాదించి వృత్రాసురుడు అఖిలలోకాలనూ ఆక్రమించి, ఎవ్వరికీ లొంగకుండా విజృంభిస్తున్నాడు.

**మత్తకోకిల.**

అట్టి వృత్రునిమీఁద దేవత లల్కతోఁ బెనుమూఁక లై
చుట్టుముట్టి, మహాస్త్రవిద్యలు సూపి, యేపున నేయ నా
గొట్టువీరుఁడు వార లేసిన క్రూరశస్త్రము లన్నియుం
జుట్టి పట్టుక మ్రింగి, శూరత జోక నార్చె మహోగ్రుఁడై. 321

ప్రతి : అట్టి= అలాంటి; వృత్రునిమీదన్= వృత్రాసురునిపైకి; దేవతలు; అల్కతోన్= కోపంతో; పెనుమూకలు+ఐ= గొప్పగుంపులుగా; చుట్టుముట్టి; మహాస్త్రవిద్యలు= గొప్పవైన అస్త్రవిద్యలు; చూపి= ప్రదర్శించి; ఏపునన్= విజృంభణతో; ఏయన్= ఆయుధాలను ప్రయోగించగా; ఆ; గొట్టువీరుడు= దుష్టుడైన వీరుడు; వారలు= ఆదేవతలు; ఏసిన= ప్రయోగించిన; క్రూర= భయంకరమయిన; శస్త్రములన్నియున్= ఆయుధాలన్నింటినీ; చుట్టిపట్టుక= చుట్టి పట్టుకొని; మ్రింగి; శూరతన్= శౌర్యంతో; జోకన్= ఉత్సాహంతో; ఉగ్రుడు+ఐ= భయంకరుడై; ఆర్చెన్= బొబ్బరించాడు.

**తా :** దేవతలు ఆ వృత్రుని మీదకు పెద్ద పెద్ద సేనలతో పోయి గొప్ప అస్త్రాలను ప్రయోగించారు. ఆ అస్త్రాలను అన్నింటినీ పట్టుకొని వృత్రుడు మింగివేసి శౌర్యంతో ఉత్సాహంతో కేకలు పెట్టాడు.

క. భక్షిత దివ్యాస్త్రుం డగు, రక్షోనాయకుని నమరరాజ ప్రముఖుల్
వీక్షింప వెఱచి పఱచిరి, రక్షకుఁ జింతించి కొనుచు రయ మొప్పారన్. 322

**ప్రతి :** అమరరాజ= దేవేంద్రుడూ; ప్రముఖుల్= మొదలయినవారు; భక్షిత= తినబడిన; దివ్య+అస్త్రుండు+అగు= దివ్యాస్త్రాలుకల; రక్షోనాయకుని= రాక్షసనాయకుణ్ణి; వీక్షింపన్= చూడటానికి; వెఱచి= భయపడి; రక్షకున్= తమను రక్షించేవాడిని; చింతించికొనుచు= ఆలోచిస్తూ; రయము= వేగం; ఒప్పారన్= ప్రకాశింపగా; పఱచిరి= పారిపోయారు.

**తా :** వృత్రాసురుడు దేవతలు ప్రయోగించిన దివ్యాస్త్రాలనన్నింటినీ మింగేసరికి దేవతలు ఆవృత్రాసురుణ్ణి చూడడానికి కూడా భయపడి తమను రక్షించేది ఎవరా అని చింతిస్తూ పారిపోయారు.

**వ. ఇట్లు సర్వసాధనంబులతోడ సాధుజనంబుల వృత్రాసురుండు మ్రింగిన, నచ్చెరువడి చేయునది నేరక త త్తేజోవిశేష విభవంబునకు భయంబు నొంది. కందిన డెందంబునం గుందుచుఁ, బురందర ప్రముఖు లార్తరక్షకుండగు పుండరీకాక్షునకుం గుయ్యిడు వారలై. 323**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సర్వసాధనంబులతోడన్= సమస్తమైన సాధనాలతోకూడ; సాధుజనంబులన్= సత్పురుషులను; వృత్రాసురుఁడు= వృత్రాసురుడు; మ్రింగినన్= మింగగా; పురందరప్రముఖులు= దేవేంద్రుడు మొదలయినవారు; అచ్చెరువడి= ఆశ్చర్యపడి; చేయునది నేరక= కర్తవ్యం తెలియక; తత్= ఆ వృత్రాసురుని; తేజోవిశేష= తేజస్సుయొక్క; విభవంబునకున్= సంపదకు; భయంబున్= భయాన్ని; ఒంది= పొంది; కందిన= వాడిన; డెందంబునన్= మనస్సులో; కుందుచున్= దుఃఖపడుతూ; ఆర్త= దుఃఖితులకు; రక్షకుండు+అగు= రక్షకుడైన; పుండరీకాక్షునకున్= విష్ణువునకు; కుయ్యి+ఇడువారలై= మొరపెట్టు కొనువారలై...

**తా :** వృత్రాసురుడు ఆయుధాలు, రథాలు మొదలయిన సాధనాలతో బాటుగా సత్పురుషులందరినీ మ్రింగేసరికి దేవేంద్రాదులు ఆశ్చర్యపడి ఏం చెయ్యాలో తెలియక ఆయన తేజస్సుకి భయపడి వాడిపోయిన హృదయాలతో విష్ణువుతో మొరపెట్టుకోవాలని

**లయగ్రాహి.**

**వీఁడు కడు దుర్దముఁడు వాఁడి మన కైదువులు, పోఁడి సెడఁగా మెసఁవి యీడు గనకున్నాఁ**
**డేడ బ్రతుకింకఁ? బెనుకీడు వొడమెన్ మనకుఁ, దోడుపడ నొక్కరుఁడు లేఁడు హరి దక్కన్**
**వేఁడుదము శ్రీధరునిఁ, గూడుదము సద్భటులఁ, బాడుదము గీతములఁ జూడఁబడు నంతన్**
**వీఁడు చెడుత్రోవ దయతోడ నెఱిఁగించు ఘనుఁ డోడక సురాలయము పాడువడ దింకన్.324**

**ప్రతి :** వీఁడు= ఈ వృత్రాసురుడు; కడు= మిక్కిలి; దుర్దముఁడు= అదుపు చేయరానివాడు; వాడి= వాడియైన; మన= మనయొక్క; కైదువులు= ఆయుధాలు; పోఁడి= తీరు; చెడఁగాన్= చెడేటట్లు; మెసవి= మింగి; ఈడు= సాటి; కనకున్నాడు= తెలియకుండా ఉన్నాడు; ఇంకన్= ఇటుపై; బ్రతుకు; మనజీవితం; ఏడన్= ఎక్కడ?; మనకున్= మనకు; పెను= గొప్పదైన; కీడు= ఆపద; ఒడమెన్= సంభవించింది; తోడుపడన్= సహాయం చేయడానికి; హరి+తక్కన్= విష్ణువు తప్ప; ఒక్కరుఁడు= వేరొకడెవరూ; లేఁడు= లేదు; శ్రీధరునిన్= విష్ణువును; వేఁడుదము= ప్రార్థిద్దాం; సద్భటులన్= మంచియోధులను; కూడుదము= సమీకరిద్దాం; గీతములన్= పాటలను; పాడుదము; జూడబడు అంతన్= విష్ణువు చూడబడిన మాత్రం చేతనే; ఘనుఁడు= గొప్పవాడగు శ్రీహరి; ఓడక= వెనుతీయక; వీఁడు= ఈ వృత్రాసురుడు; చెడుత్రోవన్= చెడిపోయే ఉపాయాన్ని; దయతోడన్= దయతో; ఎఱిగించును= తెలియచేస్తాడు; ఇంకన్= ఇటుపై; సుర+ఆలయము= స్వర్గం; పాడు+పడదు= పాడైపోదు.

**తా :** ఈ వృత్రాసురుడు జయింపశక్యంకానివాడు. మన ఆయుధాలు మింగాడు. వాడికి సాటి యోధుడు కనపడడంలేదు. మన బ్రతుకేది? మనకు గొప్ప ఆపద వచ్చిపడింది. సహాయం చెయ్యడానికి శ్రీహరి తప్ప మరెవ్వరూలేరు. శ్రీహరిని ప్రార్థిద్దాం. మంచివీరులతో కలుద్దాం. గీతాలు పాడుదాం. చూచీ చూడడంతో శ్రీహరి సంకోచించకుండా ఈ వృత్రాసురుడు నశించే ఉపాయం చెప్తాడు. స్వర్గానికి కష్టాలు తప్పుతాయి.

**క. అని తలపోయుచుఁ దమలో, మునుకుచుఁ దికమకలు గొనుచు మురరిపు కడకున్**
**గునుకుచుఁ గునుకుచు నేగిరి, ఘనరాక్షసుఁ గన్న కన్నుఁగవ బెగ్గిలఁగన్. 325**

**ప్రతి :** అని= ఈ విధంగా; ఆ దేవతలు; తమలోన్= తమలో తాము; తలపోయుచున్= ఆలోచించుకొంటూ; మునుకుచున్= దుఃఖపడుతూ; తికమక+కొనుచున్= తడబడుతూ; ఘనరాక్షసున్= గొప్ప రాక్షసుని; కన్న= చూచిన; కన్ను+కవ= కన్దోయి; బెగ్గిలఁగన్= భయపడగా; కునుకుచున్+కునుకుచున్= తూలుతూ తూలుతూ; మురరిపు కడకున్= శ్రీహరి సమీపానికి; ఏగిరి= వెళ్ళారు.

**తా :** దేవతలు తమలోతాముపై విధంగా ఆలోచిస్తూ; దుఃఖపడుతూ; తడబడుతూ; తూలుతూ; అంతటిరాక్షసుణ్ణి చూచిన కన్నులు బెదురుతూ ఉండగా శ్రీహరిని సమీపించారు.

**వ. ఇట్లు భయార్తులైన యమర్త్యవ్రాతంబు సనిచని, ముందట నభంగ భంగ రంగ దుత్తుంగ డిండీర మండల సముద్దం దాడంబర విడంబిత నారాయణ నిరంతర కీర్తి లతా కుసుమగుచ్ఛ స్వచ్ఛంబును, అనవరత గోవింద చరణారవింద సేవా సమాకుల కలితఫలిత మహాపుణ్య ఫలాయమాన సముద్దీపి తావర్తవర్తిత దక్షిణావర్త రుచిర శంఖమండల మండితంబును, నతి నిష్ఠుర కఠిన పాఠీన పృథురోమ రాజీవ శకుల తిమి తిమింగిల కర్కట కమఠ కచ్ఛప మకర నక్ర వక్రగ్రహ గ్రహణ ఘుమ ఘుమారావ దారుణగమన విషమిత విషమ తరంగఘట్టన ఘట్టిత సముద్ధూత శీకర నికర నీరంధ్ర తారకిత తారాపథంబును,మహోచ్ఛ్రయ శిలోచ్చయ శిఖరాగ్ర ప్రవహిత దుగ్ధనిర్ఝర సమ్మార్జిత పురాణపురుష విశుద్ధ శుద్ధాంత విహరణధురీణ నవసుధాధౌత ధావళ్య ధగద్ధగాయమాన రమ్య హర్మ్య నిర్మాణ కర్మంబును, అతిపవిత్రగుణ విచిత్ర నిజకళత్ర ప్రేమానంద సందర్శిత ముకుంద పరిస్రవ దంతరంగ కరుణారస పరిమిళిత భావబంధుర విద్రుమవల్లీమతల్లి కాంకురశోభితంబును, ప్రసిద్ధ సిద్ధరసాంబువాహ సంగమ సముత్థిత గంభీరఘోష పరిపూరిత సకల రోదోఽంతరాళంబును, సముద్రమేఖ లాఖిలప్రదేశ విలసిత నవీన దుకూలాయమానంబును, హరిహర ప్రముఖ దేవతానిచయ పరిలబ్ధామృత మహైశ్వర్య దానధౌరేయ మహానిధానంబును, వైకుంఠపుర పౌరవార మనోహర కామ్యఫలఫలిత మందార పారిజాత సంతాన కల్పవృక్ష హరిచందన ఘన వనానుకూల కూలంబునునై యొప్పుచుఁ గుబేరు భాండాగారంబునుంబోలె బద్మ, మహాపద్మ, శంఖ, మకర, కచ్ఛప, ముకుంద, కుంద, నీల, వర సమగ్రంబై, విష్ణుకరకమలంబునుంబోలె సుదర్శనావర్త ప్రగల్భంబై, కైలాస మహీధరంబునుంబోలె నమృతకళాస్థాన శేఖరపదార్పణంబై, యింద్రవైభవంబునుంబోలె కల్పవృక్ష కామధేను చింతామణి జనిత విశేషంబై, సుగ్రీవసైన్యంబునుంబోలె నపరిమితనిబిడ హరిసంచారంబై, నారాయ**

**ణోదరంబునుంబోలె నిఖిల భువన భారభరణ సమర్థంబై, శంకరు జటాజూటంబునుంబోలె గంగాతరంగిణీ సమాశ్రయం బై, బ్రహ్మలోకంబునుంబోలెఁ బరమహంసకులసేవ్యంబై, పాతాళ లోకంబునుంబోలె ననంత భోగి భోగ్యయోగ్యంబై, నందనవనంబునుం బోలె నైరావత మాధవీరంభాది సంజననకారణంబై, సౌదామినీ నికరంబునుంబోలె నభ్రంకషంబై, విష్ణునామకీర్తనంబునుంబోలె నిర్మల స్వభావంబై, క్రతుశతగతుండునుంబోలె హరిపదభాజనంబై, యొప్పుచున్న దుగ్ధవారాశి డాసి, శ్వేతద్వీపంబున వసియించి, యందు సకల దిక్పాలకాది దేవతలు దేవదేవు నాశ్రయించి యిట్లని స్తుతియించి రంత. 326**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; భయ+ఆర్తులు+ఐన= భయంచేత పీడింపబడిన; అమర్త్య= దేవతల; వ్రాతంబు= సమూహం; చని+చని= ప్రయాణించి, ప్రయాణించి; ముందటన్= ఎదురుగా; అభంగ= అడ్డులేని; భంగ= తరంగాలతో; రంగత్= ప్రకాశించే; ఉత్తుంగ= ఎత్తయిన; డిండీర= నురుగుయొక్క; మండల= సమూహంయొక్క; సముద్దండ= గొప్పదైన; ఆడంబర= సంరంభంతో; విడంబిత= అనుకరింపబడిన; నారాయణ= శ్రీహరియొక్క; నిరంతర= ఎడతెగని; కీర్తిలతా= కీర్తి అనే తీగయొక్క; కుసుమ= పూల; గుచ్ఛ= గుత్తివలె; స్వచ్ఛంబును= తెల్లనిదీ; అనవరత= ఎల్లప్పుడూ; గోవింద= శ్రీహరియొక్క; చరణ+అరవింద= పాదపద్మాలయొక్క; సేవా= సేవయందు; సమాకుల= లగ్నమయిన వారిచేత; కలిత= పొందబడినదీ; ఫలిత= ఫలించినదీ అయిన; మహాపుణ్య= గొప్పదైన పుణ్యానికి; ఫలాయమాన= ఫలమవుతున్న; సముద్దీపిత= ప్రకాశింపచేయబడిన; ఆవర్త= సుడులచేత; వర్తిత= తిప్పబడిన; దక్షిణావర్త= దక్షిణావర్తమనే; శంఖ= శంఖాల; మండల= సమూహంచేత; మండితంబును= అలంకరింపబడినదీ; అతినిష్ఠుర= మిక్కిలి క్రూరమైన; కఠిన= కఠినమైన; పాఠీన= వేయికోరలచేప; పృథురోమ= పెద్దవెంద్రుకలుకలచేప; రాజీవ= ఒకానొక జాతిచేప; శకుల= బేడిసచేప; తిమి= మిక్కిలి పెద్దచేప; తిమింగిల= తిమిని కూడా మింగేచేప (ఇంతవరకు ఇవి చేపలలో రకాలు); కర్కట= ఎండ్రకాయ (పీత); కమఠ= తాబేలు; కచ్ఛప= తాబేలు (కమఠ కచ్ఛపశబ్దములు రెండును తాబేలు అనే అర్థముకలవే అయినా ఒకేచోట రెండు శబ్దములను ప్రయోగించడంవల్ల తాబేళ్ళలోని రకాలని గ్రహించడం యుక్తం) మకర= మొసళ్ళు; నక్ర= మొసళ్ళు (ఇచ్చటకూడా వేరు వేరు రకాల మొసళ్ళని అర్థం గ్రహించాలి) వీటిన్నిటియొక్క; వక్ర= వంచనతోకూడిన; గ్రహ= పట్టుదలతోనైన; గ్రహణ= ఆహారాన్ని పట్టుకోవడానికి; ఘుమ ఘుమ+ఆరావ= ఘుమఘుమధ్వనికల; దారుణ= భయంకరమైన; గమన= కదలికలచేత; విషమిత= భయంకరంగా చేయబడిన; విషమ= హెచ్చుతగ్గులుకల; తరంగ= కెరటాలయొక్క; ఘట్టన= తాకిడిచేత; ఘట్టిత= కదల్పబడిన; సముద్ధూత= పైకి ఎగిరిన; శీకర= తుంపురులయొక్క; నికర= సముదాయంచేత; నీరంధ్ర= దట్టంగా; తారకిత= నక్షత్రాలు కలదిగా చేయబడిన; తారాపథంబును= ఆకాశంకలదీ; మహోచ్ఛ్రయ= మిక్కిలి ఎత్తుకల; శిలోచ్చయ= పర్వతాల; శిఖర+అగ్ర= శిఖరాల పై భాగాలలో; ప్రవహిత= ప్రవహిస్తున్న; దుగ్ధ= పాల; నిర్ఝర= ప్రవాహంచేత; సమ్మార్జిత= కడుగబడినట్టియు; పురాణపురుష= శ్రీహరియొక్క; విశుద్ధ= నిర్మలమైన; శుద్ధాంత= అంతఃపురస్త్రీల; విహరణ= సంచరించుటచేత; ధురీణ= గొప్పదైన; నవ= క్రొత్తదైన; సుధా= సున్నంచేత; ధౌత= తెల్లగా చేయబడిన; ధావళ్య= తెల్లదనంచేత; ధగద్ధగాయమాన= ధగధగలాడుతున్న; రమ్య= అందమైన; హర్మ్య= మేడల; నిర్మాణకర్మంబును= నిర్మించేపని కలిగిన; అతిపవిత్ర= మిక్కిలిపవిత్రమైన; గుణ= గుణాలచే; విచిత్ర= విస్మయంకొలిపే; నిజ= తన; కళత్ర= భార్యల; ప్రేమ+ఆనంద= ప్రేమచేత కలిగిన ఆనందంచేత; సందర్శిత= చూపించబడిన; ముకుంద= శ్రీహరియొక్క; పరిస్రవత్= ప్రవహిస్తున్న; అంతరంగ= హృదయంలోని; కరుణారస= దయారసంతో; పరిమిళిత= కలిసిన; భావ= అనురాగంవలె; బంధుర= అందమైన; విద్రుమ= పగడాల; వల్లీమతల్లికా= శ్రేష్ఠమైనతీగల; అంకుర= మొలకలచేత;

శోభితంబును= ప్రకాశించేదీ; ప్రసిద్ధ= ప్రసిద్ధమైన; సిద్ధ= సిద్ధించిన; రస= నీరుకలిగిన; అంబువాహ= మేఘాల; సంగమ= కలయికచేత; సముత్థిత= పుట్టిన; గంభీర= గొప్పదియైన; ఘోష= ధ్వనితో; పరిపూరిత= నింపబడిన; రోదః= భూమ్యాకాశాల; అంతరాళంబును= మధ్యభాగం కలిగినదీ; సముద్రమేఖలా= సముద్రమే ఒడ్డాణంగాగల భూమియొక్క; అఖిలప్రదేశ= అంతటా; విలసిత= ప్రకాశిస్తున్న; నవీన= కొత్త; దుకూలాయమానంబును= తెల్లని పట్టుచీరవలె ఉన్నదీ; హరి= విష్ణువు; హర= శివుడు; ప్రముఖ= మొదలుగాగల; దేవతా= దేవతల; నిచయ= సమూహంచేత; పరిలబ్ధ= పొందబడిన; అమృత= అమృతాన్నీ; మహైశ్వర్య= గొప్పసంపదలనూ; దాన= ఇవ్వడంలో; ధౌరేయ= నైపుణ్యంగల; మహానిధానంబును = గొప్పనిధి ఐనదీ; వైకుంఠపుర= వైకుంఠపురంలోని; పౌర= నగరవాసుల; వార= సమూహంయొక్క; మనోహర= అందమయిన; కామ్యఫల= కోరిన ఫలాలను; ఫలిత= ఫలించిన; మందార= మందార వృక్షాలూ; పారిజాత= పారిజాతవృక్షాలూ; సంతాన= సంతానవృక్షాలూ; కల్పవృక్ష= కల్పవృక్షాలూ; హరిచందన= హరిచందన వృక్షాలతో; ఘన= దట్టమయిన; వన= వనానికి; అనుకూల= తగిన; కూలంబునున్+ఐ= ఒడ్డుగలదై; ఒప్పుచున్= ప్రకాశిస్తూ; కుబేరు= కుబేరుని; భాండాగారంబును+పోలెన్= కోశాగారంవలె; పద్మ= పద్మమనే నిధి; మహాపద్మ= మహాపద్మమనే నిధి; శంఖ= శంఖమనే నిధితో; మకర= మకరమనే నిధితో; కచ్ఛప= కచ్ఛపమనే నిధితో; ముకుంద= ముకుందమనే నిధితో; కుంద= కుందమనే నిధితో; నీల= నీలమనే నిధితో; వర= వరమనే నిధితో; సమగ్రంబు+ఐ= నిండినదై (ఇది కుబేరుని కోశాగారానికి అర్థము); పద్మ= పద్మాలతో; మహాపద్మ= మహాపద్మమనే సర్పంతో; శంఖ= శంఖాలతో; మకర= మొసళ్ళతో; కచ్ఛప= తాబేళ్ళతో; ముకుంద= ముకుందమనే ఒక జాతి మాణిక్యాలతో; కుంద= విష్ణువుతో (కుందమనే పరిమళ ద్రవ్యంతో); నీల= ఇంద్రనీలమణులతో; వర= శ్రేష్ఠమైనవస్తువులతో; సమగ్రంబు+ఐ= నిండినదై (ఇది పాలసముద్రపరంగా అర్థం); విష్ణు= విష్ణువుయొక్క; కరకమలంబునున్+పోలెన్= చేయి అనే తామరపూవువలె; సుదర్శన= సుదర్శనమనే చక్రంయొక్క; ఆవర్త= తిరగటంచేత; ప్రగల్భంబు+ఐ= దిట్టతనంకలదై (విష్ణువుచేతి పక్షమున అర్థం); సుదర్శన= చూడముచ్చటయిన; ఆవర్త= సుడులచేత; ప్రగల్భంబు+ఐ= అధికమై (పాలసముద్ర పక్షమున అర్థం); కైలాస మహీధరంబునున్+ పోలెన్= కైలాసపర్వతం వలె; అమృతకళా= క్షీణించనికళకు; స్థాన= స్థానమైన బాలచంద్రుడు; శేఖర= శిరోభూషణంగాగల శివుని; పద+అర్పణంబు+ఐ= పాదాలు ఉంచుట కలదై (కైలాసపక్షంలో అర్థం); అమృత= అమృతానికి; కళా= ఓడలకు; స్థాన= చోటయినదీ; శేఖర= కొండకొనలయందు; పద= అడుగులను; అర్పణంబు+ఐ= ఉంచుటకలదై (పాలసముద్రంపక్షంలో అర్థం); ఇంద్ర= ఇంద్రుని; వైభవంబునున్+పోలెన్= సంపదవలె; కల్పవృక్ష= కల్పవృక్షంచేత; కామధేను= కామధేనువుచేత; చింతామణి= చింతామణిచేత; జనిత= పుట్టింపబడిన; విశేషంబు+ఐ= గొప్పతనంకలదై (ఇంద్రవైభవపక్షంలో అర్థం) (ఇదియే పాలసముద్రపక్షంలోకూడా అర్థం); సుగ్రీవసైన్యంబునున్+పోలెన్= సుగ్రీవుని సైన్యంవలె; అపరిమిత= అంతులేని; నిబిడ= దృఢమైన; హరి= కోతుల; సంచారంబు+ఐ= సంచారంకలదై (సుగ్రీవసైన్యపక్షంలో అర్థం); అపరిమిత= అంతులేని; నిబిడ= దృఢమైన; హరి= శ్రీహరియొక్క; సంచారంబు+ఐ= సంచారంకలదై (పాలసముద్రపక్షంలో అర్థం); నారాయణ+ ఉదరంబునున్+పోలెన్= నారాయణుని పొట్టవలె; నిఖిల= అన్ని; భువన= లోకాల; భార= బరువును; భరణ= మోయుటకు; సమర్థంబు+ఐ= శక్తికలదై (నారాయణోదరపక్షంలో అర్థం); నిఖిల= సమస్తమయిన; భువన= నీటి; భార= బరువును; భరణ= మోయటానికి; సమర్థంబు+ఐ= శక్తికలదై (పాలసముద్రపక్షంలో అర్థం); శంకరు= శివుని; జటాజూటంబునున్+ పోలెన్= జడలముడివలె; గంగాతరంగిణీ= గంగానదికి; సమాశ్రయంబు+ఐ= స్థానమై (శివుని జటాజూటంపక్షంలోను, పాలసముద్రం పక్షంలోను ఒకే అర్థం); బ్రహ్మలోకంబునున్+పోలెన్= బ్రహ్మలోకమువలె; పరమహంస= ఉత్తమపదం

పొందిన సంన్యాసుల; కుల= సమూహం; సేవ్యంబు+ఐ= సేవింపబడేదై (బ్రహ్మలోకపక్షంలో అర్థము); పరమ= గొప్పవైన; హంస= హంసల; కుల= సమూహాలచే; సేవ్యంబు+ఐ= సేవింపబడేదై (పాలసముద్రం పక్షంలో అర్థం); పాతాళలోకంబునున్+పోలెన్= పాతాళలోకంవలె; అనంత= అనేకాలైన; భోగి= పాములకు; భోగ= సుఖానికి; యోగ్యంబు+ఐ= తగినదై (పాతాళలోక పక్షంలో అర్థం); అనంత= అనంతుడనే; భోగి= పాముయొక్క; భోగ= శరీరానికి; యోగ్యంబు+ఐ= తగినదై (పాలసముద్రపక్షంలో అర్థం); నందనవనంబునున్+పోలెన్= నందనవనంవలె; ఐరావత= నిమ్మ; మాధవీ= పూలగురివెంద; రంభా= అరటి; ఆది= మున్నగుచెట్ల లతలకు; సంజననకారణంబు+ఐ= పుట్టుకకు కారణమై (నందన వనపక్షంలో అర్థం); ఐరావత= ఐరావతమనే ఏనుగు; మాధవీ= మద్యము; రంభా= రంభ; ఆది= మున్నగువాటి; సంజననకారణంబు+ఐ= పుట్టుకకు కారణమై (పాలసముద్రంపక్షంలో అర్థం); సౌదామినీ= మెరుపుతీగల; నికరంబున్+పోలెన్= సమూహంవలె; అభ్రంకషంబు+ఐ= మేఘాలను తాకునదియై (మెరుపు తీగలపక్షమున అర్థం); అభ్రంకషంబు+ఐ= ఆకాశమును ఒరిపిడి చేస్తున్నదై (పాలసముద్రం పక్షంలో అర్థం); విష్ణునామ= విష్ణునామాల; కీర్తనంబునున్+పోలెన్= స్తోత్రమువలె; నిర్మల= స్వచ్ఛమయిన; స్వభావంబు+ఐ= స్వభావమును కలిగించునదై (విష్ణునామ కీర్తనంపక్షంలో); నిర్మల= స్వచ్ఛమయిన; స్వభావంబు+ఐ= స్వభావంకలదై (పాలసముద్రంపక్షంలో అర్థం); క్రతుశత= వంద యాగాలను; గతుండునున్+పోలెన్= పొందినవాడువలె; హరిపద= ఇంద్రపదవికి; భాజనంబు+ఐ= పాత్రమై (క్రతుశతగతుని పక్షంలో అర్థం); హరిపద= శ్రీహరిస్థానమునకు; భాజనంబు+ఐ= పాత్రమై (పాలసముద్రం పక్షంలో అర్థం); ఒప్పుచున్న= ప్రకాశిస్తున్న; దుగ్ధ= పాల; వారాశిన్= సముద్రాన్ని; డాసి= సమీపించి; శ్వేతద్వీపంబునన్= శ్వేతద్వీపంలో; వసియించి= ఉండి; అందున్= ఆ శ్వేతద్వీపంలో; సకల= సమస్తమయిన; దిక్+పాలక+ఆది= దిక్కులను పాలించు అగ్ని మొదలయిన; దేవతలు; దేవదేవున్= దేవదేవుడయిన శ్రీహరిని; ఆశ్రయించి= శరణుకోరి; ఇట్లని= ఈ విధంగా; స్తుతియించిరి= స్తోత్రం చేశారు.

**తా :** భయార్తులైన దేవతలు శ్రీమహావిష్ణువు దగ్గర మొరపెట్టుకోవడానికి వెళుతున్నారు. ముందుగా పాలసముద్రాన్ని సమీపించారు. పాలసముద్రం పెద్ద పెద్ద కెరటాలమీద పెద్ద పెద్ద నురుగుముద్దలతో తెల్లగా ఉంది. ఆ నురుగుముద్దలు శ్రీహరి కీర్తిలతపూచిన పూలగుత్తుల్లా ఉన్నాయి. పెద్ద పెద్ద సుడులున్నాయి. ఆ సుడులలో గిరగిర దక్షిణావర్త శంఖాలు తిరుగుతున్నాయి. ఆ శంఖాలు విష్ణుసేవవలన విష్ణు భక్తులకు లభించిన పుణ్యఫలాల్లా ఉన్నాయి. పాలసముద్రంలో భయంకరమైన జలచరాలున్నాయి. తమ ఆహారాన్ని మింగడానికి తీవ్రవేగంతో కదులుతున్నాయి. ఆ కదలికలవలన లేచిన కెరటాలు ఒకదానితోఒకటి ఢీ కొంటున్నాయి. అప్పుడు లేచిన నీటితుంపురులు ఆకాశంలో నక్షత్రాల్లామెరుస్తున్నాయి. పాలసముద్రంలో పర్వతాలున్నాయి. పాలకెరటాలు ఆ పర్వతాలమీద ప్రవహిస్తూ ఉన్నాయి. ఆ దృశ్యం శ్రీహరి అంతః పురకాంతలు విహరించడానికి యోగ్యమైన, చక్కగా కడగబడిన, కొత్త సున్నంతో వెల్లవేసిన, మేడలను నిర్మించే పనిలో పాలసముద్రం నిమగ్నమయినట్లుంది. పాలసముద్రంలో పగడాల తీగలమొలకలు ప్రకాశిస్తున్నాయి. అవి శ్రీహరి తన భార్యలపై చూపించిన అనురాగంలా ఉన్నాయి. కెరటాలు మేఘాలను తాకుతున్నాయి. ఆ రెండింటితాకిడివల్ల గొప్ప ఘోష పుడ్తోంది. దానితో భూమ్యాకాశాల మధ్యభాగం నిండిపోతోంది. తెల్లగా ఉన్న పాలసముద్రం భూమినంతా చుట్టుకొని ఉంది. కనుక భూదేవతకు అలంకరించిన తెల్లని పట్టుచీరలా ఉంది. పాలసముద్రం హరిహరాది సకలదేవతలకు అమృతాన్ని అనేక సంపదల్నీ ఇచ్చిన గొప్ప నిధిలా ఉంది. పాలసముద్రపుటొడ్డున దేవతావృక్షాలున్నాయి. అవి వైకుంఠ పురవాసులకోరికలన్నింటినీ తీరుస్తూ ఉన్నాయి. కుబేరుని కోశాగారం పద్మ మహాపద్మ శంఖ మకర కచ్ఛప ముకుంద

కుంద నీల వర అనే పేర్లు గల నవవిధులతో ప్రకాశిస్తోంది. అదే విధంగా పాలసముద్రం పద్మాలతో మహాపద్మాలతో శంఖాలతో మకరాల (మొసళ్ళ)తో కచ్ఛపాల (తాబేళ్ళ)తో ముకుందాల (ఒకజాతి మాణిక్యాల)తో కుందుని (విష్ణువు)తో నీలాల (ఇంద్రనీలమణుల)తో వరాల (శ్రేష్ఠవస్తువుల)తో ప్రకాశిస్తోంది. విష్ణువు పాణిపద్మం సుదర్శనం (చక్రం) యొక్క భ్రమణాలతో ప్రకాశిస్తోంది. అంటే విష్ణువు చేతిలో సుదర్శనచక్రం తిరుగుతూ ఉంటుంది. అదే విధంగా పాలసముద్రంకూడా సుదర్శన (చూడదగిన) ఆవర్తాల (సుడుల)తో ప్రకాశిస్తోంది. కైలాసపర్వతం అమృతకళాస్థానశేఖరుని (శివుని) పదార్పణాలతో (పాదాలు ఉంచడం)తో ప్రకాశిస్తోంది. అదే విధంగా పాలసముద్రంకూడా అమృతానికి, కళలకు (ఓడలకు) స్థానమై శేఖరాలమీద కొండకొనలమీద, పదార్పణల (అడుగులుంచడం= ప్రవహించడం)తో ప్రకాశిస్తోంది. ఇంద్రుని వైభవం కల్పవృక్షం కామధేనువు చింతామణులవలన వృద్ధిపొందినది. అదే విధంగా పాలసముద్రం కల్పవృక్షం, కామధేనువు, చింతామణులు అనే విశేషాలు కలది.

**సీ. పంచమహాభూత పరినిర్మితంబైన ముజ్జగంబుల కెల్ల నొజ్జ యైన**
**బ్రహ్మయు నేమును బరఁగ నందఱుఁ గూడి యెవ్వనికై పూజలిత్తు మెపుడు**
**నట్టి సర్వేశ్వరుం డాగమ వినుతుండు సర్వాత్మకుఁడు మాకు శరణ మగును**
**అతిపూర్ణకాము నహంకారదూరుని సముని శాంతునిఁ గృపాస్పదుని గురుని**

**తే. మాని యన్యుని సేవింపఁ బూనునట్టి, కపట శీలుని నతి పాపకర్మబుద్ధి**
**శునక వాలంబు వట్టుక ఘనతరాబ్ధిఁ, దరియఁ జూచుట గాదె! తాఁ దామసమున. 327**

**ప్రతి :** పంచమహాభూత= నేల, నీరు, అగ్ని, గాలి, ఆకాశం అనే అయిదు భూతాలచేత; పరినిర్మితంబు+ఐన= నిర్మింపబడిన; మూడు+జగంబులుకున్+ఎల్లన్= మూడులోకాలకంతటికీ ఒజ్జ+ఐన= గురువైన; బ్రహ్మయున్= బ్రహ్మదేవుడూ; ఏమును= మేమూ; పరఁగన్= ఒప్పుగా; అందఱున్= అందరూ; కూడి= కలిసి; ఎవ్వనికై= ఎవనికొరకు; ఎపుడున్= ఎల్లవేళలా; పూజలు+ఇత్తుము= పూజలు చేస్తామో; అట్టి= అటువంటి; ఆగమ= వేదాలచే; వినుతుండు= కొనియాడబడినవాడు; సర్వ+ఆత్మకుఁడు= అఖిలమూ తానైనవాడు; సర్వ+ఈశ్వరుడు= సమస్తమునకు ప్రభువూ అయిన శ్రీహరి; మాకున్= మాకు; శరణము= రక్షకుడు; అగును= అగుగాక; అతి= అత్యంతం; పూర్ణ= నిండిన; కామున్= కోరికలు కలవాడూ; అహంకారదూరుని= అహంకారంలేనివాడూ; సముని= సర్వభూతములందు సమభావం కలవాడూ; శాంతునిన్= ఇంద్రియాలు తన వశమందున్నవాడూ; కృపా+ఆస్పదునిన్= దయకు స్థానమైనవాడూ; గురుని= గురువైనవాడూ అయిన శ్రీహరిని; మాని= విడిచి; అన్యునిన్= మరొకని; సేవింపన్= సేవించటానికి; పూనునట్టి= ప్రయత్నించే; కపటశీలుని= వంచనాశీలుణ్ణి; అతిపాప= గొప్పపాపాలు కలిగించే; కర్మ= పనులు చేయించే; బుద్ధి; మహాత్ములను విడిచి అన్యులను సేవింపపూనుట; తాన్= తాను; తామసమునన్= మూర్ఖత్వంతో; శునక= కుక్కయొక్క; వాలంబు= తోక; పట్టుక= పట్టుకొని; ఘనతర= మిక్కిలి గొప్పదై; అబ్ధిన్= సముద్రాన్ని; తరియన్= దాటడానికి; చూచుట+కాదు+ఎ= ప్రయత్నించటం కాదా?

**తా :** పంచమహాభూతాలచేత నిర్మింపబడిన ఈ జగత్తునకు గురువు బ్రహ్మదేవుడు. అతడూ మేమూ ఎల్లవేళలా శ్రీహరిని పూజిస్తున్నాం. అతడు వేదాలచే స్తుతింపబడేవాడూ సర్వం తానైనవాడూ, కోరికలులేనివాడూ, అహంకారంలేనివాడూ, శాంతుడూ, దయాస్వభావుడు. అతణ్ణి విడిచి మరొకరిని సేవించాలనుకునే వంచనాశీలం గల అతి పాప కర్మ బుద్ధి...అంటే కుక్కతోకపట్టుకొని సముద్రం దాటాలనుకోవడమే.

**చ. ఉదకమయంబునన్ వసుధ నోడఁగఁ జేసి తనర్చు కొమ్మునన్**
**వదలక యంటఁగట్టి మనువల్లభుఁ గాచిన మత్స్యమూర్తి స**
**మ్మదమున మమ్ముఁబ్రోచు ననుమానము మానఁగ వృత్రుచేతి యా**
**పదఁ దొలఁగించి నేఁడు సురపాలుర పాలిటి భాగ్యదైవమై. 328**

**ప్రతి :** ఉదకమయంబునన్= నీటిలో నిండిన జగత్తులో; వసుధన్= భూమిని; ఓడఁగన్= నావగా; చేసి; తనర్చు= ప్రకాశించే; కొమ్మునన్= కొమ్మునందు; వదలక= విడిచిపెట్టక; అంటన్+కట్టి= గట్టిగాకట్టి; మనువల్లభున్= మనువులలో శ్రేష్ఠుడైన సత్యవ్రతుణ్ణి; కాచిన= రక్షించిన; మత్స్యమూర్తి= మత్స్య శరీరుడయిన శ్రీహరి; సమ్మదమునన్= సంతోషంతో; అనుమానం= సంశయం; మానఁగన్= తీరేటట్లు; సురపాలుర= దేవతాపాలకుల; పాలిటి= ఎడ; భాగ్యదైవము+ఐ= అదృష్టదేవత అయి; నేడు= ఇపుడు; వృత్రుచేతి= వృత్రాసురునివలన కలుగు; ఆపదన్= ఆపదను; తొలగించి= పోగొట్టి; మమ్మున్= మమ్ము; ప్రోచును= రక్షించునుగాక.

**తా :** జలప్రళయమందు శ్రీహరి తాను మత్స్యావతారమెత్తి భూమిని నావగాచేసి తన కొమ్మునకు ఆ ఓడను గట్టిగాకట్టి సత్యవ్రతుడనే మనువును ఓడలో ఉంచి రక్షించాడు. ఆ శ్రీహరి మాపాలిటి అదృష్ట దేవత అయి వృత్రాసురునివలన కలిగిన ఆపద నుండి మమ్ము రక్షించుగాక.

**మత్తకోకిల**

**రంతు సేయుచు వాతధూత కరాళ భంగుర భంగ దు**
**ర్దాంత సంతత సాగరోదక తల్ప మొంది వసించు బ్ర**
**హ్మాంతవానిని బొడ్డుఁదమ్మిని నాఁచి కాచిన నేర్ప రిం**
**తంతవాఁ డనరాని యొంటరి యాదరించు మముం గృపన్. 329**

**ప్రతి :** రంతు= శబ్దం; చేయుచున్= చేస్తూ; వాత= గాలులచేత; ధూత= కంపించిన; కరాళ= భయంకరమైన; భంగుర= విరిగే; భంగ= కెరటాలచేత; దుర్దాంత= అదుపుచేయరాని; సంతత= బాగావ్యాపించిన; సాగర+ఉదక= సముద్రజలాలలో; తల్పము= (శేష) శయ్యను; ఒంది= పొంది; వసించి= ఉండి; బ్రహ్మ+అంతవానిని= బ్రహ్మదేవుడంతటివాణ్ణి; బొడ్డు+తమ్మినిన్= నాభికమలంలో; ఆఁచి= నిలిపి; కాచిన= రక్షించిన; నేర్పరి= కుశలుడు; ఇంతింతవాడు= ఇంతవాడు; అనరాని= అనుటకు శక్యంకాని; ఒంటరి= ఒకేఒకడు; మమున్= మమ్ము; కృపన్= దయతో; ఆదరించున్= ఆదరించుగాక!

**తా :** జలప్రళయ సమయంలో పెనుగాలులతో పెద్దశబ్దంచేస్తూ, కంపిస్తూ, భయంకరంగా పడిలేచే కెరటాలతో, అదుపుచేయరాక, అంతటా వ్యాపించిన సముద్రజలాల్లో పడిపోయి విలపిస్తున్న బ్రహ్మను తన నాభికమలంలోకి చేర్చి రక్షించినవాడూ ఇంతంతనరానివాడూ అయిన అద్వితీయుడు మమ్ములను దయతో ఆదరించుగాక!

**తే. దేవతల మైన మే మిట్టి దేవదేవు, సర్వలోక శరణ్యుని శరణు చొచ్చి**
**బలిత మైనట్టి వీని యాపదలఁబాసి, మీఱి శుభములఁ జే కొనువార మిపుడు. 330**

**ప్రతి :** దేవతలము+ఐన= దేవతలమైన; మేము; ఇట్టి= ఇటువంటి; దేవ దేవున్= దైవాలకే దైవమయినవాడూ; సర్వలోక= సమస్తలోకాలకు; శరణ్యుని= శరణుపొందదగినవాడూ అయిన శ్రీహరిని; శరణుచొచ్చి= శరణుపొంది; బలితము+ఐనట్టి=

బలిష్ఠమైనట్టి; వీని= వృత్రాసురుని వలనకలిగిన; ఆపదలన్= ఆపదలను; పాసి= విడిచి; మీఱి= వృద్ధిపొంది; ఇపుడు; శుభములన్= శుభాలను; చేకొనువారము= పొందేవాళ్ళమౌతాం.

**తా :** మేముదేవతలం. శ్రీహరి దేవదేవుడు. సర్వలోకాలకూ శరణు ఇవ్వగలిగినవాడు. ఆ శ్రీహరిని శరణుపొంది వృత్రాసురుని వలన మాకు కలిగిన ఆపదలను తొలగించుకొని శుభాలు పొందగలం.

**వ. ఇట్లు స్తుతియించుచున్న దేవతలకు భక్తవత్సలుండైన వైకుంఠుండు ప్రసన్నుండయ్యె. అప్పుడు. 331**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; స్తుతియించుచున్న= స్తోత్రం చేస్తున్న; దేవతలకున్= దేవతలకు; భక్తవత్సలుండు+ఐన= భక్తులయందు వాత్సల్యముకల; వైకుంఠుండు= శ్రీహరి; ప్రసన్నుండు+అయ్యెన్= సంతుష్టుడై సాక్షాత్కరించాడు; అప్పుడు= ఆ సమయమందు...

**తా :** ఇలా స్తుతిస్తున్న దేవతల భక్తవత్సలుడైన శ్రీహరి సంతుష్టుడై సాక్షాత్కరించాడు. ఆ సమయంలో

**సీ. తగు శంఖ చక్ర గదా ధరుం డగు వాని శ్రీవత్స కౌస్తుభ శ్రీల వాని**
**గమనీయ మాణిక్య ఘన కిరీటమువాని దివ్యవిభూషణ దీప్తివాని**
**మండిత కోటీర కుండలంబులవాని, సిరి యురస్థలమునఁ జెలఁగు వానిఁ**
**దనుఁబోలు సేవకతండంబు గలవాని, జిలుఁగైన పచ్చని వలువవానిఁ**

**ఆ. దెల్లఁ దమ్మివిరులఁ దెగడు కన్నులవాని, నవసుధా ద్రవంపు నవ్వువానిఁ**
**గనియె వేల్పుపిండు కప్పరపాటుతోఁ, గన్నులందు నున్న కఱవు దీఱ. 332**

**ప్రతి :** తగు= తగినట్లుగా; శంఖ= శంఖాన్ని; చక్ర= చక్రాన్ని; గదా= గదను; ధరుండు+అగువానిన్= ధరించినవాడూ; శ్రీవత్స= శ్రీవత్సం అనే మచ్చయొక్క; కౌస్తుభ= కౌస్తుభమనే మణియొక్క; శ్రీలవానిన్= సౌందర్యం కలవాడూ; కమనీయ= అందమయిన; మాణిక్య= మాణిక్యాలు పొదిగిన; ఘన= గొప్పదైన; కిరీటము వానిన్= కిరీటం కలవాడూ; దివ్య= దివ్యమైన; భూషణ= అలంకారాల; దీప్తివానిన్= కాంతికలవాడూ; మండిత= అలంకరింపబడిన; కోటీర= జడముడి; కుండలంబులవానిన్= కుండలాలు కలవాడూ; ఉరస్థలమునన్= వక్షస్థలంలో; సిరి= లక్ష్మి; చెలగువానిన్= ప్రకాశించేవాడూ; తనున్= తనను; పోలు= పోలిన; సేవకతండంబు= సేవకుల సమూహం; కలవానిన్= కలవాడూ; జిలుగు+ఐన= పలుచనైన; పచ్చని= పసుపుపచ్చని; వలువవానిన్= వస్త్రంకలవాడూ; తెల్ల+తమ్మి= తెల్లతామర; విరులన్= పూలను; తెగడు= నిందించే; కన్నులవానిన్= కన్నులుకలవాడూ; నవ= కొత్త; సుధా= అమృతపు; ద్రవంపు= ద్రవం వంటి; నవ్వువానిన్= నవ్వు కలవాడూ అయిన శ్రీహరిని; వేల్పు= దేవతల; పిండు= సమూహము; కన్నులందున్= కన్నులలో; ఉన్న; కఱవు+తీఱన్= కరవుతీరునట్లు; కప్పరపాటుతో= తొట్రుపాటుతో; కనియెన్= చూసింది.

**తా :** దేవతలు కనుల విందుగా కరవు తీరేవిధంగా శ్రీహరిని దర్శించుకున్నారు. ఆ శ్రీహరి శంఖచక్రగదలను ధరించాడు. శ్రీవత్సలాంఛనసౌందర్యంతో, కౌస్తుభం అనే మణి అందంతో ప్రకాశిస్తున్నాడు. మాణిక్యాలు పొదిగిన కిరీటం ధరించాడు. దివ్యాలంకారాలు ధరించాడు. కేశపాశానికి అలంకారాలున్నాయి. చెవులకు కుండలాలున్నాయి. వక్షఃస్థలంపైన లక్ష్మి ఉంది. ఆయన సేవకులందరూ ఆయన వలెనే ఉన్నారు. పలుచనైన పచ్చని వస్త్రం ధరించాడు. ఆయన కన్నులు తెల్లతామరపూవులవలె ఉన్నాయి. నవ్వు అమృతద్రవంలా ఉంది.

**సీ. తన సేవకులలోనఁ దడబడు రూపంబు శ్రీవత్స కౌస్తుభశ్రీలు దెలుప**
**వికచాబ్జములతోడ వీడ్వడు కన్నుల కడల దై వాఱెడు కరుణ దెలుప**
**నెల్ల లోకములకు నిల్లైన భాగ్యంబుఁ గాఁపురం బుండెడు కమల దెలుప**
**మూఁడు మూర్తులకును మొదలైన తేజంబు ధాతఁ బుట్టించిన తమ్మి దెలుప**

**ఆ. బుద్ధిఁ బోల్పరాని పుణ్యంబుఁ దత్పాద, కమల జనిత యైన గంగ దెలుప**
**నప్రమేయుఁ డభవుఁ డవ్యక్తుఁ డవ్యయుఁ, డాదిపురుషుఁ డఖిలమోది యొప్పె. 333**

**ప్రతి :** తన= తనయొక్క; సేవకులలోనన్= సేవకులలో; తడబడు= కలిసిపోయిన; రూపంబున్= శ్రీహరి రూపాన్ని; శ్రీవత్స= శ్రీవత్సమనే మచ్చ; కౌస్తుభ= కౌస్తుభమణి; శ్రీలు= లక్ష్మి (శ్రీవత్స, కౌస్తుభం, లక్ష్మి అనే మూడూ); తెలుపన్= తెలియచేయగా; వికచ= వికసించిన; అబ్జములతోడన్= తామరపూలతో; వీడ్వడు= తారుమారగు, శ్రీహరి కన్నులను; కన్నులకడలన్= కంటికొసలయందు; దైవాఱెడు= పొంగిపొరలెడు; కరుణ= దయ; తెలుపన్= తెలియచేయగా; ఎల్లలోకములకున్= సమస్త లోకాలకూ; ఇల్లు+ఐన= స్థానమైన; భాగ్యంబున్= భాగ్యాన్ని; కాపురంబు+ఉండెడి= స్థిరనివాసం ఉండే; కమల= లక్ష్మీదేవి; తెలుపన్= తెలియచేయగా; మూడుమూర్తులకును= బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు ముగ్గురికీ; మొదలు+ఐన= కారణమయిన తేజస్సు ఇదే అని; ధాతన్= బ్రహ్మను; పుట్టించిన; తమ్మి= తామరపూవు; తెలుపన్= తెలియచేయగా; బుద్ధిన్= బుద్ధితో; పోల్పరాని= గుర్తింపశక్యంకాని; పుణ్యంబున్= పుణ్యాన్ని; తత్= శ్రీహరియొక్క; పాదకమల= తామరపూలవంటి పాదాలనుండి; జనిత+ఐన= పుట్టింపబడిన; గంగ= గంగానది; తెలుపన్= తెలియచేయగా; అప్రమేయుడు= కొలువశక్యంకానివాడూ; అభవుడు= పుట్టుకలేనివాడూ; అవ్యక్తుఁడు= వ్యక్తంకానివాడూ; అవ్యయుఁడు= నాశములేనివాడూ; అఖిలమోది= సమస్తాన్నీ సంతోషింపచేసేవాడూ, ఆదిపురుషుడూ అయిన; ఆదిపురుషుఁడు= ఆదిపురుషుడగు శ్రీహరి; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** సేవకులరూపం శ్రీహరి రూపం ఒకే విధంగా ఉన్నా శ్రీవత్సం కౌస్తుభం లక్ష్మి ఈయనే శ్రీహరి అని శ్రీహరిని గుర్తించే విధంగా చేస్తున్నాయి. ఆయన కన్నులు తామరపూలు ఏవి ఏవో తెలిసికోడానికి వీలులేకపోయినా కన్నులలో పొంగే కరుణ ఇవి శ్రీహరి నయనాలు అని గుర్తింప చేస్తోంది. శ్రీహరితో కాపురంచేసే లక్ష్మివలన సకలలోకాల భాగ్యాలకూ మూలభూతమయిన భాగ్యం ఇదే అని తెలుస్తోంది. అన్నిటినీ సృష్టించే బ్రహ్మను సృష్టించిన నాభికమలాన్ని చూస్తే ఈ శ్రీహరి తేజస్సే మూడు మూర్తుల తేజస్సులకూ మూలమైన తేజస్సు అని తెలుస్తోంది. శ్రీహరి పాదాలనుండి పుట్టి అన్నిటినీ పవిత్రం చేసే గంగను చూస్తే శ్రీహరియే అఖండ పుణ్యం అని తెలుస్తోంది; అటువంటి శ్రీవత్సకౌస్తుభాదులతో ఇంతని చెప్పవీలుకాని; పుట్టుకలేని, వ్యక్తంకాని; నాశంలేని; అన్నిటినీ సంతోషింపచేసే శ్రీహరి ప్రకాశించాడు.

**వ. ఇట్లు జగన్మోహనాకారుండైన నారాయణుని కృపావలోకనాహ్లాద చకిత స్వభావ చరితులై సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, ఫాలభాగాన పరికీలిత కరకమలులై యిట్లనిరి. 334**

**ప్రతి :** ఇట్లు= ఈ విధముగా; జగత్= లోకాలను; మోహన= మోహింపచేసే; ఆకారుండు+ఐన= రూపం కలిగిన; నారాయణుని= శ్రీహరియొక్క; కృపా= దయతోకూడిన; అవలోకన= చూపులచేత కలిగిన; ఆహ్లాద= సంతోషంచేత; చకిత= ప్రభావితమైన; స్వభావ= స్వభావం; చరితులు+ఐ= ఆచరణం కలవారై; సాష్టాంగ= ఎనిమిది అంగాలతో

చేయునట్టి; దండ= కర్రవలెసాగిలపడి చేయు; ప్రణామంబులు= నమస్కారాలు; ఆచరించి= చేసి; ఫాలభాగానన్= నుదుటియందు; పరికీలిత= కూర్చబడిన; కరకమలులు+ఐ= కమలాలవంటి చేతులుకలవారై; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తా :** ఈ విధంగా జగత్తులను మోహింపచేసే సౌందర్యంకల శ్రీహరియొక్క దయాపూర్ణమయిన చూపులు ప్రసరించేసరికి దేవతలకు మహానందం కలిగింది. వారందరూ శ్రీహరికి సాష్టాంగ దండప్రణామాలు చేసి దోసిలి నుదుటచేర్చి నమస్కరించి ఈ విధంగా అన్నారు.

**ఆ. దుర్గమంబు లైన స్వర్గాది ఫలములఁ, బుట్టఁ జేయఁ జాలునట్టి గుణము**
**గలిగి మెలఁగుచున్న ఘనుఁడ వైనట్టి నీ, కరయ మ్రొక్కువార మాదిపురుష! 335**

**ప్రతి :** ఆదిపురుష!= సృష్టికంటె ముందున్న పురుషుడా!; అరయన్= ఆలోచించగా; దుర్గమంబులు+ఐన= పొందుటకు వీలుకాని; స్వర్గ+ఆదిఫలములను= స్వర్గం మొదలైన ఫలాలను; పుట్టన్+చేయన్+చాలునట్టి= పుట్టించే సామర్థ్యంకల; గుణము= స్వభావం; కలిగి= పొంది; మెలఁగుచున్న= ప్రవర్తిస్తున్న; ఘనుడఁవు+ఐనట్టి= గొప్పవాడవయిన; నీకు; మ్రొక్కువారము= నమస్కరిస్తున్నాము.

**తా :** ఓ ఆదిపురుషుడా! దుర్లభాలైన స్వర్గాది ఫలాలను పుట్టించే సామర్థ్యంకల నీకు నమస్కారం.

**సీ. దండంబు యోగీంద్రమండల నుతునకు దండంబు శార్ఙ్గకోదండునకును,**
**దండంబు మండితకుండలద్వయునకు దండంబు నిష్ఠురభండనునకు,**
**దండంబు మత్తవేదండరక్షకునకు దండంబు రాక్షసఖండనునకు,**
**దండంబు పూర్ణేందుమండలముఖునకు, దండంబు తేజఃప్రచండునకును,**

**తే. దండ మద్భుతపుణ్యప్రధానునకును, దండ ముత్తమవైకుంఠధామునకును**
**దండ మాశ్రితరక్షణతత్పరునకు, దండ మురుభోగినాయకతల్పునకును. 336**

**ప్రతి :** యోగీంద్ర= యోగీశ్వరుల యొక్క; మండల= సమూహంచేత; నుతునకున్= స్తుతింపబడేవానికి; దండంబు= నమస్కారం; శార్ఙ్గకోదండునకున్= శార్ఙ్గమనేపేరుగల విల్లుకలవానికి; దండంబు= నమస్కారం; మండిత= అలంకరింపబడిన; కుండల= కుండలాల; ద్వయునకు= జతకలిగినవానికి; దండంబు= నమస్కారం; నిష్ఠుర= కఠినమైన; భండనునకు= యుద్ధం కలవానికి; దండంబు= నమస్కారం; మత్త= మదించిన; వేదండ= ఏనుగును; రక్షకునకున్= రక్షించినవానికి; దండంబు= నమస్కారం; రాక్షస= రాక్షసులను; ఖండనునకున్= నాశనం చేసేవానికి; దండంబు= నమస్కారం; పూర్ణ+ఇందుమండల= నిండుచంద్రుని బింబంవంటి; ముఖునకున్= మోముకలవానికి; దండంబు= నమస్కారం; తేజః= తేజస్సుచేత; ప్రచండునకున్= భయంకరమైనవానికి; దండంబు= నమస్కారం; అద్భుత= ఆశ్చర్యం కలిగించే; పుణ్య= పుణ్యం; ప్రధానునకున్= ముఖ్యంగా కలిగినవానికి; దండము= నమస్కారం; ఉత్తమ= గొప్పదైన; వైకుంఠ= వైకుంఠం; ధామునకున్= స్థానంగా కలవానికి; దండము= నమస్కారం; ఆశ్రిత= ఆశ్రయించినవారిని; రక్షణ= రక్షించుటలో; తత్పరునకున్= ఆసక్తికలవానికి; దండము= నమస్కారం; ఉరు= గొప్పదైన; భోగి= పాములకు; నాయక= నాయకుడైన శేషుడు; తల్పునకున్= శయ్యగా కలవానికి; దండము= నమస్కారం.

**తా :** యోగీశ్వరుల స్తుతులందుకొనే నీకు నమస్కారం. శార్‌ఙ్గమనే విల్లుకల నీకు, కుండలములచేత అలంకరింపబడిన నీకు; భయంకరమైన యుద్ధాలు చేసే నీకు, గజరాజును రక్షించిన నీకు; రాక్షసులను సంహరించే నీకు; పూర్ణచంద్రబింబం వంటి ముఖం కల నీకు; భయంకరమైన తేజస్సుకల నీకు; పుణ్యకర్మలే ప్రధానంగా కల నీకు; వైకుంఠమే స్థానంగాకల నీకు; ఆశ్రితులను రక్షించడంలో శ్రద్ధకల నీకు; ఆదిశేషుడే శయ్యయైన నీకు దండం.

**ఉ. చిక్కిరి దేవతావరులు చిందఱ వందఱలైరి ఖేచరుల్,**
**స్రుక్కిరి సాధ్యసంఘములు, సోలిరి పన్నగు లాజిభూమిలో,**
**గ్రక్కిరి దివ్యకోటి, కడు గ్రుగ్గిరి యక్షులు వృత్రుచేత నీ**
**చిక్కినవారి నైన దయసేయుము నొవ్వకయుండ నో హరీ! 337**

**ప్రతి :** ఓహరీ!= ఓ శ్రీహరీ!; ఆజిభూమిలోన్= యుద్ధభూమిలో; వృత్రుచేతన్= వృత్రుని వలన; దేవతావరులు= దేవతాశ్రేష్ఠులు; చిక్కిరి= వశమయ్యారు; ఖేచరుల్= ఆకాశంలో సంచరించేవారు; చిందఱవందఱలు+ఐరి= చెల్లాచెదరయ్యారు; సాధ్య= సాధ్యుల; సంఘములు= సమూహాలు; స్రుక్కిరి= కృశించారు; పన్నగులు= పాములు; సోలిరి= వాలిపోయారు; దివ్య= స్వర్గంలో ఉండేవారి; కోటి= సమూహం; గ్రగ్గిరి= వెలవెలపోయారు; యక్షులు; కడున్= మిక్కిలి; గ్రుగ్గిరి= కలతచెందారు; ఈ చిక్కినవారినైనన్= ఈ మిగిలినవారినై; నొవ్వక+ఉండన్= బాధలు పడకుండా; దయ+చేయుము= అనుగ్రహించుము.

**తా :** ఓ శ్రీహరీ! యుద్ధంలో దేవతలు వృత్రునికి వశమైపోయారు. ఆకాశసంచారులు చెల్లాచెదరైపోయారు. సాధ్యులు కృశించిపోయారు. పన్నగులు; యక్షులు వృత్రునిచేతిలో ఓడిపోయారు. మిగిలిన వారినైనా ఆపదలనుండి గట్టెక్కించు.

**క. మొదలాఱిన రక్కసులకు, మొదలై మా కాపదలకు మూలం బగుచుం**
**దుద మొదలు లేని రక్కసు, తుదిఁ జూపఁగదయ్య! తుదకుఁ దుదియైన హరీ! 338**

**ప్రతి :** తుదకు= అంతమునకు; తుది+ఐన= అంతమైన; హరీ!= శ్రీహరీ!; మొదలాఱిన= సమూలంగా నశించిన; రక్కసులకున్= రాక్షసులకు; మొదలు+ఐ= ఆశ్రయమై; మాకున్= దేవతలమైనమాకు; ఆపదలకున్= కష్టాలకు; మూలంబు+అగుచున్= కారణమవుతూ; తుద= అంతం; ఆది= మొదలు; లేని; రక్కసు= రాక్షసునియొక్క; తుది= నాశం; చూపన్+కద+అయ్య= కల్గించుమయ్యా!

**తా :** వినాశానికే వినాశమైన ఓ శ్రీహరీ! సమూలంగా నశించిపోయిన రాక్షసులకు తిరిగి ఊపిరిపోసి, మాకు కష్టాలు కలిగిస్తూ, తుది మొదలు తెలియనంతగా మహాకాయుడైపోయిన ఆ రాక్షసుణ్ణి అంతంచెయ్యి.

**తే. అకట! దిక్కుల కెల్ల దిక్కైన మాకు, నొక్క దిక్కును లేదు కా లూన నైన,**
**దిక్కుగావయ్య! నేఁడు మా దిక్కుఁ జూచి, దిక్కు లేకున్నవారల దిక్కు నీవ. 339**

**ప్రతి :** అకట!= అయ్యో!; దిక్కులకున్+ఎల్లన్= అన్ని దిక్కులకు, అందరికి; దిక్కు+ఐన= శరణైన; మాకున్= మాకు; కాలు; ఊనన్+ఐనన్= ఉంచుటకైనా; ఒక్క దిక్కును= ఒక్క చోటు కూడా; లేదు; నేడు= ఇపుడు; మా= మాయొక్క; దిక్కున్= వైపునకు; చూచి; దిక్కు= శరణు; కావయ్య= అగుము; దిక్కులేకున్నవారల= దిక్కులేనివారికి; దిక్కు= శరణు; నీవు+అ= నీవే.

**తా :** అందరికి దిక్కైనమాకు ఇపుడు కాలు ఊనుకోవడానికి కూడా చోటు లేదు. మా దీనదశచూచి మాకు శరణు అనుగ్రహించు. దిక్కులేనివారికి నీవే దిక్కు.

**క. నీ దిక్కు గానివారికి, నే దిక్కును వెదక నుండ దిహపరములకున్**
**మోదింపఁ దలఁచువారికి, నీ దిక్కే దిక్కు సుమ్ము! నీరజనాభా! 340**

**ప్రతి :** నీరజనాభా!= పద్మనాభా!; నీ దిక్కు= నీ వైపు; కానివారికి; వెదకన్= వెదకగా; ఏ దిక్కును= ఏ గతీ; ఉండదు; ఇహపరములకున్= ఇహ లోకంలోనూ, పర లోకంలోనూ; మోదింపన్= సుఖపడటానికి; తలచువారికిన్= ఆలోచించేవారికి; నీ దిక్కు+ఏ= నిన్ను ఆశ్రయించటమే; దిక్కుసుమ్ము= రక్షణ సుమా!

**తా :** ఓ పద్మనాభా! నీ భక్తులు కానివారు గతిలేనివారే. ఇహపరాలలో సుఖించాలనుకొనేవారికి నిన్ను శరణుపొందటమే కర్తవ్యం.

**తే. అరయ మా తేజములతోడ నాయుధములు, మ్రింగి భువన త్రయంబును మ్రింగుచున్న**
**భీకరాకారు వృత్రునిఁ బీఁచ మణఁచి, యెల్ల భంగుల మా భంగ మీఁగు మభవ! 341**

**ప్రతి :** అభవ= పుట్టుకలేనివాడా!; అరయన్= ఆలోచింపగా; మా= మాయొక్క; తేజములతోడన్= తేజస్సులతో పాటుగా; ఆయుధములు= ఆయుధాలను; మ్రింగి; భువనత్రయంబును= మూడులోకాలను; మ్రింగుచున్న; భీకర+ఆకారున్= భయంకరమైన ఆకారంకల; వృత్రునిన్= వృత్రాసురుణ్ణి; పీఁచము= మదం; అణఁచి= నాశనంచేసి; ఎల్లభంగులన్= అన్ని విధాల; మా= మాయొక్క; భంగము= ఆపదను; ఈఁగుము= పోగొట్టుము.

**తా :** ఓ శ్రీహరీ! వృత్రుడు మా తేజస్సుల్నీ మా ఆయుధాల్నీ మ్రింగి, ముల్లోకాల్నీ మింగడానికి చూస్తున్నాడు. భీకరాకారం గల వాడి మదం అణచి; మా ఆపద తొలగించు.

**ఆ. పరమపురుష! దుఃఖభంజన! పరమేశ!, భక్తవరద! కృష్ణ! భవవిదూర!**
**జలరుహాక్ష! నిన్ను శరణంబు వేఁడెద, మభయ మిచ్చి కావు మయ్య! మమ్ము. 342**

**ప్రతి :** పరమపురుష!= సర్వోత్కృష్టుడవైన పురుషుడా!; దుఃఖ= దుఃఖాన్ని; భంజన= పోగొట్టేవాడా!; పరమేశ!= పరమేశా!; భక్త= భక్తులకు; వరద= వరాలిచ్చేవాడా!; కృష్ణ!= కృష్ణా!; భవ= పుట్టుకకు; విదూర= మిక్కిలి దూరమైనవాడా!; జలరుహ+అక్ష= తామరపూలవంటి కన్నులు కలవాడా!; నిన్ను; శరణంబు= శరణు; వేడెదము= కోరుతున్నాం; అభయము+ఇచ్చి= భయాన్ని పోగొట్టి; మమ్ము; కావుము+అయ్య= రక్షింపుము.

**తా :** ఓ పరమపురుషా! దుఃఖనాశకా! పరమేశా! భక్తవరదా! కృష్ణా! పుట్టుకలేనివాడా! పద్మాలవంటి కన్నులు కలవాడా! నిన్ను శరణుపొందుతున్నాం. మా భయాన్ని పోగొట్టి రక్షింపుము.

**వ. నమస్తే భగవన్నారాయణ! వాసుదేవ! ఆదిపురుష! మహానుభావ! పరమమంగళ! పరమకళ్యాణ! దేవ! పరమ కారుణికు లైన పరమహంసలగు పరివ్రాజకులచేత నాచరితంబు లగు పరమసమాధి భేదంబులం బరిభావిత పరిస్ఫుటం బైన పరమహంస ధర్మంబుచేత నుద్ఘాటితం బగు తమః కవాటద్వారంబున నపావృతం**

బైన యాత్మలోకంబున నుపలబ్ధిమాత్రుండవై, నిజసుఖానుభవుండవై యున్న నీ వాత్మసమవేతంబులై యుపేక్షింపంబడని యీ శరీరంబులకు నుత్పత్తి స్థితి లయ కారణుండ వై యుండుదువు. గుణసర్గ పతితుండవై యపరిమిత గుణగణంబులున్న నీవు, దేవదత్తుని మాడ్కిఁ బారతంత్ర్యంబున స్వకృతంబులైన కుశలా కుశల ఫలంబుల ననుభవింతువు. షడ్గుణైశ్వర్య సంపన్నుండ వైన నీ వాత్మారామ స్వభావుండవై, యపరిమిత గుణగణంబులు గలిగి, యీశ్వరాహ్వయానవగాహ్య మాహాత్మ్యంబందు నర్వాచీన వికల్ప వితర్క విచార ప్రమాణాభాసంబులగు కుతర్కశాస్త్రంబులఁ గర్కశంబులైన ప్రజ్ఞలు గలిగి, దురవగ్రహవాదు లయిన విద్వాంసుల వివాదావసరంబులయందు నుపరతంబులగు అస్తి నా స్తీత్యాది వాక్యంబుల సమస్త మాయామయుండవై నిజమాయచేతఁ గానంబడని యుక్తిగోచరుండవై, సమ విషమ రూపంబులఁ బ్రవర్తింతువు. దేవా! రజ్జువునందు సర్పభ్రాంతి గలుగునట్లు, ద్రవ్యాంతరంబులచేత బ్రహ్మంబైన నీ యందుఁ బ్రపంచ భ్రాంతి గలుగుచుండు. సర్వేశ్వరా! సర్వ జగత్కారణ రూపంబవైన నీవు సర్వభూత ప్రత్యగాత్మ వగుటం జేసి సర్వగుణావభాసోపలక్షితుండవై కానంబడుచుందువు. లోకేశ్వరా! భవ న్మహిమమహామృత సముద్ర విప్రు ట్సకృత్పానమాత్రంబున సంతుష్టచిత్తులై, నిరంతర సుఖంబున విస్మారిత దృష్ట శ్రుత విషయసుఖ లేశాభాసులైన పరమభాగవతులు, భవచ్చరణకమలసేవాధర్మంబు విడువరు. త్రిభువనాత్మభవన! త్రివిక్రమ! త్రిణయన! త్రిలోక మనోహరానుభావ! భవదీయ వైభవ విభూతి భేదంబు లైన దనుజాదులకు ననుపక్రమ సమయం బెఱింగి, నిజమాయాబలంబున సుర నర మృగ జలచరాది రూపంబులు ధరియించి, తదీయావతారంబుల ననురూపంబైన విధంబున శిక్షింతువు. భక్తవత్సలా! భవన్ముఖ కమల నిర్గత మధుర వచనామృత కళావిశేషంబుల, నిజదాసులమైన మా హృదయతాపం బడంగింపుము. జగదుత్పత్తి స్థితి లయ కారణ ప్రధాన దివ్య మాయా వినోదవర్తివై సర్వ జీవనికాయంబులకు బాహ్యాభ్యంతరంబులయందు బ్రహ్మ ప్రత్యగాత్మ స్వరూప ప్రధాన రూపంబుల దేశకాల దేహావస్థాన విశేషంబులఁ, దదుపాదానానుభవంబులు గలిగి, సర్వప్రత్యయ సాక్షివై, సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుండవై యుండెడి నీకు నేమని విన్నవించువారము? జగదాశ్రయంబై, వివిధ వృజిన సంసార పరిశ్రమోపశమనంబైన భవదీయ దివ్యచరణ శతపలాశచ్ఛాయ నాశ్రయించెదము అని పెక్కువిధంబుల వినుతించి యిట్లనిరి. **343**

ప్రతి : భగవన్నారాయణ! = భగవంతుడవైన నారాయణా!; తే= నీకు; నమః= నమస్కారం; వాసుదేవ! = సృష్టిలోని చరాచర ప్రాణికోటిలో వసించే దేవా!; ఆదిపురుష= ఆదిపురుషా! మహానుభావ! = గొప్ప సామర్థ్యంకలవాడా!; పరమమంగళ! = సర్వోత్కృష్టమైన శుభాల రూపమా!; పరమకల్యాణ= సర్వోత్కృష్టమైన కళ్యాణమా!; దేవ= దేవా!; పరమకారుణికులు+ఐన= గొప్పదయకల; పరమహంసలు+అగు= గొప్ప ఆత్మజ్ఞానంకల; పరివ్రాజకులచేతన్= సంన్యాసులచేత; ఆచరితంబులు+అగు= చేయబడిన; పరమసమాధిభేదంబులన్= గొప్పవి, అనేకములు అగు ధ్యాననిష్ఠలచే; పరిభావిత= పరిశుద్ధం చేయబడినదీ; పరిస్ఫుటంబు+ఐన= బాగాస్ఫురించినదీ అయిన; పరమహంస ధర్మంబుచేతన్= పరమహంసల ధర్మమైన శమదమాదులచేత; ఉద్ఘాటితంబు+అగు= తెరువబడిన; తమః= అజ్ఞానమనే; కవాట= తలుపులుగల; ద్వారంబునన్= ద్వారంలో; అపావృతంబు+ఐన= ప్రకటమైన; ఆత్మలోకంబునన్= ప్రత్యగాత్మయందు; ఉపలబ్ధిమాత్రుండవు+ఐ= కేవలం తెలియబడిన

వాడవై; నిజసుఖ= ఆత్మానందంయొక్క; అనుభవుండవు+ఐ= అనుభూతియే స్వరూపం కలవాడవై ఉన్న; నీవు; ఆత్మ= ఆత్మయందు; సమవేతంబులు+ఐ= భాసిస్తూ; ఉపేక్షింపబడని= ఆత్మతాదాత్మ్యంతో చూడబడే; ఈశరీరంబులకు= ఈ శరీరాలకు; ఉత్పత్తి= పుట్టుకకు; స్థితి= ఉనికికి; లయ= వినాశనానికి; కారణుండవు= కారణం; ఉందువు= అయి ఉంటావు; గుణసర్గ= త్రిగుణకార్యములగు శరీరములందు; *పతితుడవు+ఐ= పడినవాడవై; అపరిమిత= హద్దులేని; గుణగణంబులు= అనేక గుణాలు; ఉన్న= కలిగిన; నీవు; దేవదత్తునిమాడ్కి= ఒకానొక సామాన్యజీవునివలె; పారతంత్ర్యంబునన్= కర్మాధీనతచే; స్వ= తనచేతనే; కృతంబులు+ఐన= చేయబడిన; కుశల= సత్కర్మలయొక్క; అకుశల= దుష్కర్మలయొక్క; ఫలంబులన్= ఫలములైన సుఖదుఃఖాలను; అనుభవింతువు= అనుభవిస్తున్నావు; షడ్గుణైశ్వర్య= ఆరుగుణాలు ఆరుఐశ్వర్యాలతో; సంపన్నుండవు+ఐన= కూడిన నీవు; ఆత్మారామస్వభావుండవు+ఐ= తనస్వరూపమునందే ఆనందించే స్వభావంకలవాడవై; అపరిమిత= హద్దులేని; గుణగణంబులు= గుణసమూహాలు; కలిగి= కలిగి; ఈశ్వర+ఆహ్వయ= ఈశ్వరుడనే పేరు కలిగి; అనవగాహ్య= తెలియశక్యంకాని; మాహాత్మ్య= మహిమలో; అర్వాచీన= నూతనములైన; వికల్ప= సంశయాలకు; వితర్క= విరుద్ధాలైనయుక్తులకు; విచార= వాదనలకు; ప్రమాణాభాసంబులగు= ప్రమాణాలుగా కనపడే ప్రమాణాలు కాని; కుతర్కశాస్త్రంబుల= చెడుతర్కాలు కల శాస్త్రాలలో; కర్కశంబులు+ఐన= కఠినమైన; ప్రజ్ఞలు= తెలివితేటలు; కలిగి= కలిగి; దురవగ్రహ= మొండిపట్టుదలతో; వాదులయిన= వాదించువారయిన; విద్వాంసుల; వివాదావసరంబులయందున్= వివాదసమయాలలో; ఉపరతంబులు+అగు= ముగిసిన; అస్తి= ఉన్నాడు; నాస్తి+ఇతి= లేదు అను; వాక్యంబులన్= వాక్యాలలో; సమస్తమాయామయుండవు+ఐ= సకలమాయాస్వరూపుడవై; నిజ= తనదైన; మాయచేతన్= మాయాశక్తి చేత; కానంబడని= తెలియబడని; యుక్తిగోచరుండవు+ఐ= యుక్తికి గోచరుండవై; సమ= సర్వాత్మరూపంచేత; విషమరూపంబులన్= విభిన్న రూపాలతో; ప్రవర్తింతువు= ఉంటావు; దేవా!; రజ్జువునందున్= త్రాటిలో; సర్పభ్రాంతి= పాము అనే భ్రమ; కలుగునట్లు= కలిగేవిధంగా; ద్రవ్య+అంతరంబులచేతన్= ఇతర వస్తువులకారణంగా; బ్రహ్మంబు+ఐన= పరమాత్మవైన; నీయందున్= నీయందు; ప్రపంచభ్రాంతి= ప్రపంచరూపంగా భ్రమ; కలుగుచుందున్= కలుగుతుంది; సర్వేశ్వరా!= సమస్తానికీ ప్రభువైనవాడా!; సర్వజగత్= సకలజగత్తులకు; కారణరూపంబు+ఐన= కారణమైన; నీవు; సర్వభూత= సమస్త ప్రాణులకు; ప్రత్యగాత్మవు= ఆంతరమగు ఆత్మవు; అగుటన్+చేసి= కావటంవల్ల; సర్వగుణ= గుణకార్యాలయిన ఇంద్రియాల; అవభాస= ప్రకాశంచేత; ఉపలక్షితుండవు+ఐ= గుర్తింపబడినవాడవై; కానంబడుచుందువు= కనిపిస్తూ ఉంటావు; లోక+ఈశ్వరా!= లోకాలకు ప్రభువైనవాడా!; భవత్= నీయొక్క; మహిమ అనే; మహామృత= అమృతపు; సముద్ర= సాగరంయొక్క; విప్రుట్= బిందువుయొక్క; సకృత్= ఒక్క మారు; పానమాత్రంబునన్= తాగినంతమాత్రాన; సంతుష్ట= సంతోషంపొందిన; చిత్తులు+ఐ= మనస్సుకలవారై; నిరంతర= అఖండమైన; సుఖంబునన్= సుఖంచేత; విస్మారిత= మరిచిపోబడిన; దృష్ట= చూడబడిన; శ్రుత= వినబడిన; విషయ= విషయాలకు సంబంధించిన; సుఖలేశ= కొంచెమైన సుఖాల; ఆభాసులు+ఐ= జ్ఞానంకలవారైన; భాగవతులు= భగవద్భక్తులు; భవత్= నీయొక్క; చరణకమల= పాదపద్మాలను; సేవా= సేవించటం అనే; ధర్మంబును= స్వభావాన్ని; విడువరు= విడిచిపెట్టరు; త్రిభువన= మూడులోకాలు; ఆత్మ= తన; భవన= ఇల్లుగా కలవాడా!; త్రి= మూడు; విక్రమ= గొప్పవైన అడుగులుకలవాడా!; త్రి= మూడు; నయన= కన్నులుకలవాడా!; త్రిలోక= మూడులోకముల; మనోహర= మనస్సునుహరించే; అనుభావ= మహిమకలవాడా!; భవదీయ= నీయొక్క; వైభవ= మహిమల; విభూతి= ఐశ్వర్యాలు; భేదంబులు+ఐన= విశేషములైన; దనుజ+ఆదులకున్= రాక్షసులు మొదలయిన వారికి; అనుపక్రమ= ఉద్యమింపదగని; సమయంబు= కాలం; ఎఱింగి= తెలిసికొని; నిజ= తనదైన (నీ) మాయా=

మాయాశక్తియొక్క; బలంబునన్= సామర్థ్యంచేత; సుర= దేవతలు; నర= మనుష్యులు; మృగ= జంతువులు; జలచర= జలచరాలు; ఆది= మొదలయినవానియొక్క; రూపంబులు= ఆకారాలను; ధరియించి= పొంది; తదీయ= ఆ; అవతారంబులన్= అవతారాలలో; అనురూపంబు+ఐన= తగిన; విధంబునన్= ప్రకారంగా; శిక్షింతువు= దండిస్తావు; భక్తవత్సలా!= భక్తులపట్ల వాత్సల్యంకలవాడా!; భవత్= నీయొక్క; ముఖకమల= ముఖపద్మంనుండి; నిర్గత= వెలువడిన; మధుర= తీయని; వచన= మాటలనే; అమృతంయొక్క; కళా= బిందువుల; విశేషంబులన్= భేదములచేత; నిజ= తన (నీ) దాసులము+ఐన= సేవకులమైన; మా= మాయొక్క; హృదయ= మనస్సులలోని; తాపంబు= దుఃఖం; అడగింపుము= పోగొట్టుము; జగత్= జగత్తుయొక్క; ఉత్పత్తి= పుట్టుకకు; స్థితి= ఉనికికి; లయ= నాశనానికి; కారణ= కారణమైన; దివ్యమాయా= దివ్యమాయచేత ఏర్పడిన; వినోద= క్రీడలో; వర్తివి+ఐ= ఉన్నవాడవై; సర్వ= సమస్తమయిన; జీవ= ప్రాణుల; నికాయంబులకున్= సమూహాలకు; బాహ్య= వెలుపలివాటిలోనూ; అభ్యంతరములందున్= లోపల ఉన్నవాటిలోనూ; బ్రహ్మ= పరమాత్మయొక్క; ప్రత్యగాత్మ= జీవాత్మయొక్క; స్వరూప= స్వరూపంచేతనూ; ప్రధాన= ప్రకృతియొక్క; రూపంబులన్= స్వరూపంచేతనూ; దేశ= స్థలాల; కాల= సమయాల; దేహ= శరీరాల; అవస్థాన= అవస్థల; విశేషంబులన్= భేదాలచేత; తత్= వాటన్నింటికీ; ఉపాదాన= మూలకారణమైనదాని; అనుభవంబులు= అనుభవాలు; కలిగి; సర్వ= అన్ని; ప్రత్యయ= జ్ఞానములకు; సాక్షివి+ఐ= సాక్షివై; సాక్షాత్+పరబ్రహ్మ= పరమాత్మయొక్క; స్వరూపుండవు+ఐ= స్వరూపమై; ఉండెడినీకున్= ఉండే నీకు; ఏమి+అని= ఏ విధంగా; విన్నవించువారము= మనవిచేసికొనగలము; జగత్= జగత్తులకు; ఆశ్రమంబు+ఐ= ఆధారమై; వివిధ= అనేకవిధాలైన; వృజిన= దుఃఖములతోడి; సంసార= సంసారంలోని; పరిశ్రమ= శ్రమను; ఉపశమనంబు+ఐన= పోగొట్టే; భవదీయ= నీ; దివ్య= అద్భుతమయిన; చరణ= పాదములనే; శతపలాశ= తామరపూల; ఛాయను= నీడను; ఆశ్రయించెదము= సేవిస్తాము; అని= ఇలా; పెక్కువిధంబులన్= అనేక ప్రకారాలుగా; వినుతించి= స్తుతించి; ఇట్లు= ఈ విధంగా; అనిరి= పలికారు.

**తా :** భగవంతుడవైన నారాయణా! వాసుదేవా! ఆదిపురుషా! గొప్పమహిమకలవాడా! పరమమంగళస్వరూపా! గొప్పశుభాలనిచ్చేవాడా! పరమహంసపరివ్రాజకులు, గొప్పదైన ఆత్మనిష్ఠకలవారు. ఆత్మనిష్ఠయందలి ఏకాగ్రతచేత వారి అంతఃకరణాలు పరిశుద్ధాలవుతాయి. వాటిలో సర్వసంగపరిత్యాగుల ధర్మాలైన పరమశాంతి; ఇంద్రియ నిగ్రహం మొదలయినవి ప్రకాశిస్తాయి. వాటి ప్రభావంచేత చిత్తం అనే మోక్షద్వారానికున్న అజ్ఞానపు తలుపులు తెరుచుకొంటాయి. అక్కడ ఆత్మకాంతి మాత్రమే ఉంటుంది. ఆ కాంతిలో ఆత్మగోచరిస్తుంది. ఆత్మానందం అనుభవానికి వస్తుంది. ఆత్మానందానుభూతిరూపుడవే నీవు. ఆత్మలోభాసించే శరీరాదుల ఉత్పత్తి స్థితిలయాలకు కారణం నీవే. నీవు సామాన్య జీవునివలె లోకంలో త్రిగుణకార్యాలయిన శరీరాదులయందు ఆత్మభావం కలవాడవై; పరాధీనుడవై పుణ్యపాపాలను చేసి వాటి ఫలాలైన సుఖదుఃఖాలను అనుభవిస్తావు. షడ్గుణైశ్వర్య సంపన్నుడవైన నీవు ఆత్మయందే క్రీడించేవాడవు అయినా అపరిమిత గుణాలకు ఆశ్రయమై ఉన్నావు. ఈశ్వరుడవైన నీమాహాత్మ్యం ఊహింపశక్యంకానిది. తెలిసికొనశక్యంకానిది. కొత్త కొత్త వికల్పాలు, వితర్కాలు, విచారాలు మొదలయిన ప్రమాణాభాసలతో కూడి జటిలమైన కుతర్కాలలోపడి కర్కశప్రజ్ఞలుకల విద్వాంసులు మొండి పట్టుదలతో వాదించుకొంటూ ఉంటారు. ఆ వివాదాలలో ఉన్నావని లేవని వాదనలు చోటుచేసుకుంటాయి. మాయామయుడవైన నీవు ఆ వాదనలకు అందేవాడవు కాదు. నీవు సమవిషమరూపాలలో ప్రవర్తిస్తూ ఉంటావు. తాడునందు పాము అని భ్రాంతి కలిగినట్లు నీయందు ప్రపంచభ్రమ కలుగుతోంది. నీవు సమస్త జగత్తునకూ కారణం. సర్వప్రాణులకూ అంతరాత్మవు నీవు. అందువలన అనేకగుణాలు కలిగినట్లు కన్పిస్తావు.

నీ మహిమ అపారమైన అమృతసముద్రం. భాగవతులు ఆ సముద్రంలోని ఒక చుక్క రుచిచూచి అఖండానందాన్ని అనుభవిస్తారు. ఆ ఆనందపారవశ్యంవలన కన్నవాటివలనా విన్నవాటివలనా కలిగే కించిత్తు సుఖాన్ని లెక్కచెయ్యరు. నీ పాదసేవను విడిచిపెట్టరు.

ముల్లోకాలలో నిండి ఉండే మహానుభావా! మూడడుగులతో ముల్లోకాలను ఆక్రమించినవాడా! ముక్కంటీ! నీ మహిమ ముల్లోకాల మనస్సును హరించేది. దనుజాదులు నీ విభూతిభేదాలే. వారి అంత్యకాలం ఆసన్నమయిందని తెలిసి; నీ మాయాబలంతో దేవతగానో, మనుష్యునిగానో, జంతువుగానో, జలచరంగానో ఇంకా అలాంటి రూపాలతో అవతరించి వారిని తగినవిధంగా శిక్షిస్తావు.

ఓ భక్తవత్సలా! నీ ముఖపద్మంనుండి వెలువడే తియ్యని వచనామృత తరంగాలతో నీ దాసులమైన మా హృదయతాపాన్ని ఉపశమింపచెయ్యి. ఈ జగత్తుయొక్క సృష్టి స్థితిలయాలకు కారణమయిన మూలప్రకృతి (మాయ) నీకు అధీనమై ఉంటుంది. సృష్టిలోని సమస్తప్రాణులకు లోపల ప్రత్యగాత్మగా బయట పరమాత్మగా వెలుగొందేది నీవే. ఆ పరమాత్మ స్వరూపమే అయిన మూలప్రకృతి రూపాలయిన దేశం కాలం, దేహం, అవస్థలు. వీటికి మూలకారణమయిన దాని అనుభవంకలిగి అన్ని అనుభవాలకూ అన్ని విషయాలకూ సాక్షివై పరబ్రహ్మస్వరూపుడవైన నీకు మేమేమని మనవి చేసుకోగలం.

సమస్తవిశ్వానికీ ఆశ్రయం నీవు. అనేక దుఃఖాలతో కూడి ఉండే సంసారపుతాపాన్ని ఉపశమింపచేసే నీ చరణ పద్మాల్ని మేము ఆశ్రయిస్తున్నాం. అని స్తుతించి ఈ విధంగా అన్నారు.

**క. తేజంబు నాయువును వి, భ్రాజిత దివ్యాయుధములఁ బరువడి వృత్రుం**
**దాజిముఖంబున మ్రింగెను, మా జయ మిం కెందుఁ? జెప్పుమా! జగదీశా! 344**

**ప్రతి :** జగత్+ఈశా!= జగత్ప్రభూ!; వృత్రుండు= వృత్రాసురుడు; ఆజిముఖంబునన్= యుద్ధంలో; తేజంబున్= పరాక్రమాన్ని; ఆయువును= ఆయుర్దాయాన్ని; విభ్రాజిత= ప్రకాశించే; దివ్య= మహామహిమకల; ఆయుధములన్= ఆయుధాలను; పరువడి= క్రమంగా; మ్రింగెను= కబళించాడు; ఇంకన్= ఇకపై; మాజయము= మాకు విజయం; ఎందున్= ఎక్కడ; చెప్పుము+ఆ= చెప్పుము.

**తా :** ఓ జగత్ప్రభూ! యుద్ధం ఆరంభంకాగానే క్రమంగా వృత్రాసురుడు మా పరాక్రమాన్ని మా ఆయుర్దాయాన్ని, మా ఆయుధాల్ని కబళించివేశాడు. ఇంక మాకు విజయం ఎక్కడ?

**వ. అని యిట్లతిమనోహర చతుర వచనంబుల భక్తిపరవశులై వినుతి సేయుచున్న దేవతలం జూచి, యప్పరమేశ్వరుం డమృత ప్రాయంబు లగు గంభీరభాషణంబుల నిట్లనియె. 345**

**ప్రతి :** అని ఇట్లు= అని ఈ విధంగా; మనోహర= అందమైన; చతుర= చాతుర్యంతో కూడిన; వచనంబులన్= మాటలతో; భక్తి= భక్తిచేత; పరవశులు+ఐ= మైమరచినవారై; వినుతి= స్తుతి; చేయుచున్న= చేస్తున్న; దేవతలన్= దేవతలను; చూచి ఆ+పరమేశ్వరుండు= పరమేశ్వరుడైన శ్రీహరి; అమృతప్రాయంబులు+అగు= అమృతంతో సమానమైన; గంభీర= లోతైన అర్థంగల; భాషణంబులన్= మాటలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** చాలా అందంగానూ నేర్పుగానూ భక్తితోనూ దేవతలు చేసిన స్తుతివిని శ్రీహరి అమృతంలాంటి మాటలతో గంభీరంగా ఈ విధంగా అన్నాడు.

క. మ దుపస్థానం బగు మీ, సదమల సుజ్ఞానమునకు సంతోషమునం
బొదలె మది ప్రీతి నొందితి, వదలక నా భక్తి వొడమి వ్యర్థం బగునే! **346**

**ప్రతి :** మత్+ఉపస్థానంబు+అగు= నన్ను స్తుతించుటకు ఉపయోగించిన; మీ= మీయొక్క; సత్= మంచిదీ; అమల= నిర్మలమూ అయిన; సుజ్ఞానమునకున్= గొప్పజ్ఞానానికి; మది= నా మనస్సు; సంతోషమునన్= సంతోషంతో; పొదలెన్= పెరిగింది; ప్రీతిన్= సంతృప్తిని; ఒందితిన్= పొందాను; వదలక= విడువక; నాభక్తి= నాయందుభక్తి; పొడమి= కలిగి; వ్యర్థంబు= వృథా; అగును+ఏ= అగునా!= కాదు సుమీ.

**తా :** నన్ను స్తుతించేందు కుపయోగించిన మీ జ్ఞానానికి నేను సంతోషించాను. సంతృప్తి చెందాను. నామీద కలిగిన భక్తి ఎప్పుడూ వ్యర్థంకాదు.

**వ. మఱియు, నతిప్రీతుండనైన నాయందు భక్తులకుం బొంద రాని యర్థంబు లేదు; విశేషించి నాయందు నేకాంతమతి యైన తత్త్వవిదుం దన్యంబులం గోరకుండు; గుణంబులయందుఁ దత్త్వ జ్ఞానగోచరుం డైనవాఁడు విషయ నివృత్త చిత్తుండై సంసార మార్గంబు నిచ్ఛయింపఁడు; కావున మీకు శుభం బయ్యెడు; దధీచియను ఋషిసత్తముండు గలండు; అతని శరీరంబు మద్విద్యాతిశయ మహత్త్వంబునం దేజో విశేషంబున సారం బై యున్నయది; అతని నడిగి, తచ్ఛరీరంబుఁ బుచ్చికొనుండు; అతండు పూర్వకాలంబున నశ్వినీ దేవతలకు నశ్వశిరోనామంబను బ్రహ్మ స్వరూపంబగు నిష్కళంకంబైన విద్య నుపదేశించిన, వారలు జీవన్ముక్తిత్వంబు నొందిరి; మఱియుఁ ద్వష్టృ పుత్త్రుండైన విశ్వ రూపునకు మదాత్మకంబైన యభేద్య కవచంబు నిచ్చె. కావున నతం డతివదాన్యుండు; అశ్వినీదేవతలచేత యాచింపంబడి, దేహంబు వంచింపక మీ కిచ్చు; అతని శల్యంబులు విశ్వకర్మ నిర్మితంబు లై, శతధారలు గల యాయుధ శ్రేష్ఠంబై, మత్తేజోపబృంహితంబై వృత్రాసుర శిరోహరణ కారణంబై యుండు; దానంజేసి మీరు పునర్లబ్ధ తేజోఽ స్త్రాయుధ సంపదలు గలిగి వెలింగెదరు; విశేషించియు మద్భక్తవరులైనవార లే లోకంబుల నెవ్వరికి నజేయులు; కావున మీకు భద్రంబయ్యెడు అని భూతభావనుండైన భగవంతుం డదృశ్యుం డయ్యె; అప్పుడు దేవతలు దధీచిమునికడకుం జనిన నత్తఱి యింద్రుం డిట్లనియె.** **347**

**ప్రతి :** మఱియున్= ఇంకా; అతిప్రీతుండను+ఐన నాయందు= మిక్కిలి సంతసించినవాడనైన నానుండి; భక్తులకున్= భక్తి గలవారికి; పొందన్+రాని= పొందలేని; అర్థంబు= ప్రయోజనం; లేదు= ఉండదు; విశేషించి= ప్రత్యేకంగా; నాయందున్= నాలో; ఏకాంతమతి+ఐన= పూర్తిగా బుద్ధి నిలిపినవాడయిన; తత్త్వవిదుండు= తత్త్వజ్ఞాని, వాస్తవం తెలిసినవాడు; అన్యంబులన్= (నాకంటె) ఇతరములను; కోరక+ఉండున్= కోరుకోకుండా ఉంటాడు; గుణంబులయందున్= వస్తు ధర్మాలలో; తత్త్వజ్ఞాన గోచరుండు+ఐనవాఁడు= తత్త్వజ్ఞానం పొందినవాడు; విషయనివృత్త చిత్తుండు+ఐ= ఆయా విషయాలనుండి మరలిన మనస్సుగలవాడై; సంసార మార్గంబున్= లోకపు త్రోవలను; ఇచ్ఛయింపఁడు= ఇష్టపడడు; కావునన్= కాబట్టి; మీకున్= మీకు; శుభంబు+అయ్యెడున్= మేలు కలుగుతుంది; దధీచి+అను= దధీచి అనే పేరుగల; ఋషిసత్తముండు= మునిశ్రేష్ఠుడు; కలండు= ఉన్నాడు; అతని శరీరంబు= అతని దేహం; మత్+విద్యా+అతిశయ మహత్త్వంబునన్= నన్ను గురించి తెలుసుకొన్న గొప్పతనంవల్ల; తేజస్+విశేషంబునన్= కాంత్యతిశయం వలన; సారంబు+ఐ+ఉన్న+అది= శక్తిగలదై ఉన్నది; అతనిన్+అడిగి=

ఆ దధీచిని అడిగి; తత్+శరీరంబున్= ఆ శరీరాన్ని; పుచ్చికొనుండు= తీసికోండి; ఆతండు= ఆ ఋషి దధీచి; పూర్వకాలంబుననన్= ప్రాచీనకాలంలో; అశ్వినీదేవతలకున్= అశ్వినీదేవతలకు; అశ్వశిరస్+నామంబు+అను= 'అశ్వశిరోనామము' అనే – ఆ పేరుగల; బ్రహ్మస్వరూపంబు+అగు= బ్రహ్మయొక్క ఆకారమైన; నిష్కళంకంబు+ఐన= మలినం లేనిదైన; విద్యను= మంత్రాన్ని; ఉపదేశించినన్= బోధించగా; వారలు= ఆ అశ్వినీదేవతలు; జీవత్+ముక్తిత్వంబున్+ ఒందిరి= బ్రతికుండగానే మోక్షం పొందారు; మఱియున్= ఇంకా; త్వష్టృ పుత్రుండు+ఐన= దేవశిల్పి కొడుకైన; విశ్వరూపునకున్= ఆ పేరు గలవానికి; మత్+ఆత్మకంబైన= నా నామాంకితమైన; అభేద్యకవచంబున్+ఇచ్చెన్= పగులగొట్టడానికి వీలుకాని కవచమును అనుగ్రహించాడు; కావునన్= కాబట్టి; అతండు= ఆ దధీచి; అతివదాన్యుండు= మిక్కిలి దానశీలి; అశ్వినీదేవతలచేతన్= అశ్వినీ దేవతలచేత; యాచింపన్+పడి= అడుగబడినవాడై; దేహంబున్= శరీరాన్ని; వంచింపక= మోసగింపక; మీకున్+ఇచ్చున్= మీకిస్తాడు; అతనిశల్యంబులు= అతని ఎముకలు; విశ్వకర్మ నిర్మితంబులై= విశ్వకర్మ అను దేవశిల్పిచేత చేయబడినవై; శతధారలు గల= నూరు అంచులు గల; ఆయుధశ్రేష్ఠంబు+ఐ= మిక్కిలి గొప్పదైన ఆయుధమై; మత్+తేజస్+ఉపబృంహితంబు+ఐ= నా శక్తిచేత పెరిగినదై; వృత్ర+అసుర శిరస్+హరణకారణంబై= వృత్రుడు అనే రాక్షసుని తల తెగగొట్టటానికి హేతువై; ఉండున్= ఉంటుంది; దానన్+చేసి= దానివలన; మీరు; పునర్+లబ్ధతేజస్+ అస్త్ర+ఆయుధ సంపదలు కలిగి= మరల పొందిన శక్తి, అస్త్ర శస్త్రాల సంపద కలిగి; వెలింగెదరు= ప్రకాశిస్తారు; విశేషించియున్= ప్రత్యేకంగా; మత్+భక్తవరులు+ఐనవారలు= నా భక్తులలో శ్రేష్ఠులైనవారు; ఏ లోకంబులన్= ఏ లోకాలలోనూ; ఎవ్వరికిన్= ఎట్టివారికైనా; అజేయులు= జయింప వీలు కానివారు; కావునన్; మీకున్; భద్రంబు+అయ్యెడున్= శుభమవుతుంది, మేలు కలుగుతుంది; అని; భూతభావనుండైన= ప్రాణులకు కారణమైన; భగవంతుండు= దేవుడు (నారాయణుడు); అదృశ్యుండు+అయ్యెన్= మాయమయ్యాడు; అప్పుడు; దేవతలు; దధీచిమునికడకున్= దధీచి మహర్షి దగ్గరకు; చనినన్= వెళ్ళగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; ఇంద్రుండు+ఇట్లు+అనియెన్= దేవతల రాజైన ఇంద్రుడు ఈ విధంగా అన్నాడు.

**తా :** నారాయణ దేవుడు తనను కలసి వృత్రహింసలబారినుండి తమకు విముక్తి కల్పింపమని వేడుకొన్న ఇంద్రాది దేవతలతో అన్నమాటలివి.

"నేను లెస్సగా ప్రీతి చెందితే నానుండి నా భక్తులు సర్వమూ పొందగలరు. నానుండి వారు పొందరానిది ఏదీ ఉండదు. అదీగాక నన్ను పొందడమే తనకు గొప్పలాభంగా కలిగినవాడు ఇతర వరాలు యాచించడు. లోకంలోని వస్తుస్వరూప స్వభావాలు సంపూర్ణంగా గుర్తెరిగినవాడు విషయసుఖాలనుండి విరక్తుడౌతాడు. వైరాగ్యంతో సంసార జీవనానికి దూరంగా నిలుస్తాడు. అందువల్ల మీకు మేలు కలుగుతుంది. దధీచి అనే పేరుగల ఋషి ఉన్నాడు. ఆయన శరీరం నా శక్తితో కూడి, మిక్కిలి ప్రభావవంతమై ఉంది. అతణ్ణి యాచించి ఆ శరీరాన్ని పొందండి. అతడు గొప్ప దానశీలి.

పూర్వం అతడు అశ్వినీదేవతలకు అశ్వశిరోనామమనే విద్యను ఉపదేశింపగా, వారు జీవన్ముక్తులయ్యారు. దేవశిల్పి అయిన త్వష్టకు కుమారుడైన విశ్వరూపునకు నారాయణాత్మకమైన కవచాన్ని కూడా ఆ దధీచి ఇచ్చాడు. కాబట్టి అశ్వినీ దేవతలు ప్రార్థిస్తే, తప్పకుండా తన శరీరాన్ని దానం చేస్తాడు. అతని ఎముకలతో విశ్వకర్మ నూరుఅంచులుగల ఆయుధాన్ని నిర్మించి ఇస్తాడు. అది నా శక్తితో కూడినదై, వృత్రాసురుని శిరస్సును ఖండించడానికి సమర్థమై ఉంటుంది. ఆ పిదప మీరు మరల మీ మీ తేజోవిశేషాలతో వెలుగుతూ పూర్వ వైభవాన్ని పొందగలరు.

లోకంలో నా భక్తవరేణ్యులు ఎవరికైనా అజేయులుగా నిలుస్తారు. మీకు మేలు కలుగుతుంది" అంటూ దేవుడు అదృశ్యుడైనాడు. తరువాత, దేవతలు దధీచిమహర్షిని దర్శించారు. అపుడు ఇంద్రుడు దధీచితో ఇలా అన్నాడు.

**ఆ. దేహి సుఖముఁ గోరు దేహంబు ఘటియించి, దేహి విడువలేఁడు దేహ మెపుడు,**
**దేహి! యస్మదీయ దేహంబుకొఱకునై, దేహ మీఁగదయ్య! దేవతలకు. 348**

**ప్రతి :** దేహంబు= ఈ శరీరాన్ని; ఘటియించి= సంపాదించి, స్వీకరించి; దేహి= శరీరి, దేహం కలవాడు; సుఖమున్= హాయిని; కోరున్= కావాలనుకొంటాడు; దేహి= ప్రాణి; ఎపుడున్= ఏ కాలంలోనైనా (కాలం తీరిన తరువాత తప్ప); దేహము= శరీరాన్ని; విడువలేడు= వదలలేడు; అస్మదీయ దేహంబుకొఱకున్+ఐ= మా శరీరాలకోసం; దేహి!= ఓ దేహం కలవాడా!; దేవతలకు; దేహము= నీ శరీరం; ఈన్+కదయ్య!= ఇవ్వవయ్యా!

**తా :** ప్రాణిలోకం శరీరం పొందిన వెంటనే సుఖంకోసం ఆరాటపడుతుంది. అది లోకనైజం. జీవి తన దేహాన్ని జీవితాంతాన తప్ప మరెప్పుడూ విడువడు – విడువలేడు; కాని, ఓ దధీచీ! దేహవంతుడా! మేము దేవతలం. మా దేహాలకోసం – ప్రాణాలకోసం– సుఖాలకోసం నీ దేహాన్ని యాచిస్తున్నాము. ఇయ్యవయ్యా మహాత్మా!

**ఉ. ఎక్కడ నెల్లలోకముల నెవ్వరుఁ గోరని కోర్కి నేఁడు మా**
**తెక్కలిపాటుకై తివిరి దేహము వేఁడఁగఁ వచ్చినార, మే**
**మెక్కడ! తీవ్ర కర్మగతి యెక్కడ! దైవకృతంబుగాక! యీ**
**త్రొక్కుడుదాన మీ వరుస రోయక వేఁడుదురే జగంబులన్? 349**

**ప్రతి :** ఎక్కడన్= ఏ చోటగాని; ఎల్లలోకములన్= అన్ని లోకాలలోగాని; ఎవ్వరున్= ఎవరూకూడా; కోరని= ఆశించని; కోర్కిన్= కోరికను; నేఁడు= ఈనాడు; మా తెక్కలిపాటుకై= మా విపత్తు కారణంగా; తివిరి= కోరి; దేహమున్= శరీరాన్ని; వేడఁగన్= యాచించుటకై; వచ్చినారము= వచ్చాము; ఏము+ఎక్కడ?= దేవతలమైన మేమెక్కడ; తీవ్రకర్మగతి= ఘోరమైన కర్మయొక్క తీరు; ఎక్కడ?= ఎక్కడిది?; దైవకృతంబుగాక!= దేవుడు చేసిన నిర్ణయం కదా!; ఈ త్రొక్కుడుదానము= దాతను అణచివేసే ఈ దానం; ఈ వరుసన్= ఈ విధంగా; రోయక= అసహ్యించుకోక; జగంబులన్= లోకాలలో; వేడుదురే!= కోరతారా!

**తా :** ఏ లోకాలలోనూ, ఎవ్వరుగాని, ఎప్పుడుగాని కోరని ఒక కొత్త కోరికను, నేడు మా ఆపదల నుండి రక్షించుకోవడం కారణంగా కోరడానికై నీ దగ్గరకు వచ్చా. దైవనిర్ణయంకాక ఇది మేము కల్పించుకొన్నది కాదు. మేము చేసే ఈ యాచన దాతను తొక్కివేసేది. ఇలాంటి యాచన లోకాలలో ఎవరైనా తమను తాము అసహ్యించుకోకుండా చేయగలరా? చేయలేరు.

**క. నీచగతి యెల్లభంగుల, యాచన యని తెలిసి తగని దడుగుదు రేనిన్**
**యాచక వర్గము లోపల, నీచకు లనఁబడరె? యెంత నేర్పరులైనన్. 350**

**ప్రతి :** ఎంత నేర్పరులు+ఐనన్= ఎంత తెలివిగలవారైనా; ఎల్లభంగులన్= అన్నివిధాలా; యాచన= అడుగుకోవడం; నీచగతి= హీనమైన స్థితి; అని; తెలిసి= తెలిసికూడా; తగనిది= అడుగదగనిదానిని; అడుగుదురు+ఏనిన్= కోరినట్లయితే; యాచకవర్గము లోపలన్= బిచ్చగాండ్రలో; నీచకులు+అనన్+పడరే= హీనులు అనే నిందను పొందరా?

**తా :** తెలివితేటలు ఎన్ని ఉన్నా, ఎవరైనా అడుక్కోవడం హీనమైన పని అని తెలిసికూడా, అడగగూడని దాన్ని అడిగితే, అలాంటివారు యాచకులలో హీనులుగా చూడబడరా!

**క. అడుగంగరాని వస్తువు, లడుగరు బతిమాలి యెట్టి యర్థులు నిను నే**
**మడిగితిమి దేహ మెల్లను, గడు నడిగెడు వారి కేడ కరుణ? మహాత్మా! 351**

**ప్రతి :** మహా+ఆత్మా!= గొప్ప మనస్సుగలవాడా!; ఎట్టి అర్థులున్= ఏవిధమైన యాచకులైనా; బతిమాలి= జాలిగా వేడుకొని; అడుగంగ రాని వస్తువులు= కోరరాని కోరికలు; అడుగరు= కోరరు; ఏము= దేవతలమైన మేము; నినున్= నిన్ను; దేహమున్+ఎల్లను= శరీరాన్ని పూర్తిగా; అడిగితిమి= యాచించాము; కడున్= మిక్కిలిగా; అడిగెడు వారికిన్= యాచించే వారికి; కరుణ= దయ; ఏడ= ఎక్కడ ఉంటుంది?

**తా :** మహాత్మా! దధీచీ! లోకంలో యాచకులెవరైనా యాచన సమయాన ఇంగితజ్ఞానం కలిగి అడుగరాని వాటినిగాక అడుగదగినవాటినే యాచిస్తారు. మేము మాత్రం అడుగరానిదగు మీ శరీర సర్వస్వాన్ని అడిగాము. అర్థులకు జాలి, దయ ఉండవు గదా!

**ఉ. నావుడు నా దధీచియు మనంబున సంతసమంది నవ్వి సం**
**భావిత వాక్య పద్ధతులఁ బల్కుచు నిట్లనెఁ బేర్మితోడ నో**
**దేవతలార! ప్రాణులకుఁ దెక్కలి మృత్యు భయంబు పూనుటే**
**భావములం దలంపరు కృపామతి నెన్నఁడు మీ మనంబులన్. 352**

**ప్రతి :** నావుడున్= అనిన వెంటనే; ఆ దధీచియున్= ఆ దధీచి మహర్షి; మనంబునన్= హృదయంలో; సంతసము+అంది= సంతోషం పొంది; నవ్వి; సంభావిత వాక్య పద్ధతులన్= గౌరవం ఉట్టిపడే మాటలతో; పల్కుచున్= మాట్లాడుతూ; పేర్మితోడన్= ప్రియంగా; ఇట్లు+అనెన్= ఇలా అన్నాడు; ఓ దేవతలార!; మీ మనంబులన్= మీ మనస్సులలో; ఎన్నఁడున్= ఎప్పుడుగూడ; ప్రాణులకున్= జీవులకు; తెక్కలి మృత్యుభయంబు= అపమృత్యువు వలన భీతి; పూనుట= కలుగటం; ఏ భావంబులన్= ఏ తలపులలోనూ; కృపామతిన్= దయాబుద్ధితో; తలంపరు= ఆలోచింపరు.

**తా :** దేవతల పల్కులు విన్న దధీచి తన దేహం దేవకార్యం కోసం ఉపయోగపడనున్నదని తెలిసి లోపల ఆనందించాడు. కాని, ఆ ఆనందపు గుర్తులు కనిపించకుండా నవ్వుతూ, ఓ దేవతలారా! మీరేనాడయినా మీ మనస్సులలో జీవులకు గలిగే అపమృత్యుభయాన్ని గూర్చి దయతోనయినా ఆలోచించారా? అంటూ ప్రేమతోనే భావపూర్ణ వాక్యాలతో ప్రసంగించాడు.

**ఆ. ఎలమి బ్రతుక నిచ్చయించిన వారికి, దేహ మెల్లభంగి దీపు గాదె?**
**యచ్యుతుండు వచ్చి యర్థించె నేనియు, తన్ను నిచ్చునట్టి దాత గలఁడె? 353**

**ప్రతి :** ఎలమిన్= ప్రీతితో; బ్రతుకన్= జీవించాలని; ఇచ్చయించిన వారికిన్= కోరుకునేవారికి; దేహము= శరీరం; ఎల్లభంగిన్= అన్నివిధాలా; తీపు+కాదె!= ప్రియమైనది గదా?; అచ్యుతుండు= విష్ణువు; వచ్చి; అర్థించెన్+ఏనియున్= యాచించినప్పటికీ; తన్నున్= తనను; ఇచ్చునట్టి= యాచకుడికి సమర్పించే; దాత= దానకర్త; కలఁడు+ఎ= ఉన్నాడా? లేదని అర్థం.

**తా :** బ్రతుకుమీద ప్రీతితో జీవించాలని కోరుకునేవారికి దేహమే గదా ప్రీతిపాత్రం. బ్రతుకు దేహంమీదే గదా కొనసాగేది. అటువంటి దేహాన్ని స్వయంగా నారాయణుడు వచ్చి యాచించినా ఇచ్చేవారు ఉంటారా! ఉండరు.

**వ. అదియునుం గాక. 354**

**ప్రతి :** అదియునున్+కాక...

**తా :** అంతే కాక,

**సీ. అర్థంబు వేఁడెడు నర్థులు గలరు గా కంగంబు వేఁడెడి యర్థి గలఁడె?**
**తగఁ గోరికల నిచ్చు దానశీలుఁడు గల్గుఁ దన దేహ మీ నేర్చు దాత గలఁడె?**
**యీ నేర్చువాఁడు దన్నిచ్చిన రోయక చంపెడునట్టి యాచకుఁడు గలఁడె?**
**చంపియుఁ బోవక శల్యంబు లన్నియు నేఱి పంచుక పోవువారు గలరె?**

**ఆ. రమణ లోకమెల్ల రక్షించు వారికి, హింస సేయుబుద్ధి యెట్టు వొడమె?**
**బ్రాఁతి యైనయట్టి ప్రాణంబుపైఁ దీపు, తమకుఁ బోలె నెదిరిఁ దలఁప వలదె? 355**

**ప్రతి :** అర్థంబు= ధనం; వేఁడెడున్+అర్థులు= కోరెడు బిచ్చగాండ్రు; కలరు+కాక= ఉన్నారు గాని; అంగంబు వేఁడెడి= శరీరాన్ని యాచించే; అర్థి= యాచకుడు; కలఁడె?= ఉన్నాడా?; తగన్= ఉచితంగా; కోరికలన్+ఇచ్చు= కోర్కెలు తీర్చే; దానశీలుఁడు= దాత; కల్గున్= ఉంటాడు; తన దేహమున్= తన శరీరాన్ని; ఈన్+నేర్చు= ఈయగల; దాత+కలఁడె?= దానకర్త ఉన్నాడా?; ఈన్+నేర్చువాఁడు= ఈయగలవాడు; తన్నున్+ఇచ్చినన్= తనను (తాను) దానం చేసుకొన్నప్పటికీ; రోయక= అసహ్యించుకోకుండా; చంపెడునట్టి= చంపివేసే; యాచకుఁడు= బిచ్చగాడు; కలఁడె?= ఉన్నాడా?; చంపియున్+పోవక= చంపి ఊరకనే వెళ్లకుండా; శల్యంబులు+అన్నియున్= ఎముకలన్నింటినీ; ఏఱి= ఏరుకొని; పంచుకపోవువారు= భాగాలు పంచుకొని పోయేవారు; కలరె?= ఉన్నారా?; రమణన్= ప్రీతితో; లోకము+ఎల్లన్= జగమంతటినీ; రక్షించువారికిన్= కాపాడేవారికి; హింస+చేయు బుద్ధి= హింసాత్మకమైన బుద్ధి; ఎట్టు+పొడమెన్= ఎలా కలిగింది?; బ్రాఁతి+ఐన+అట్టి= ప్రేమ పాత్రమైన; ప్రాణంబుపైన్= ప్రాణంమీద; తీపు= మక్కువ; తమకున్+పోలెన్= తమకువలె; ఎదిరిన్+తలపన్+వలదె?= ఎదుటివారిని (గూర్చి) ఆలోచించాలి కదా!

**తా :** లోకాన ఎక్కడైనా డబ్బునో కాక, ఒక ప్రయోజనాన్నో యాచించేవారు ఉంటారుగాని దాతను తన దేహాన్నే ఇమ్మని కోరే యాచకుడు ఉంటాడా? దాతలయినా అర్థుల కోర్కెలు తీర్చేవారు ఉంటారుగాని, తమ దేహాలను వస్తువులవలె అర్థికి అర్పించేవారు ఉంటారా? ఒకవేళ దాత తన శరీరాన్ని ఇచ్చినా, యాచకుడు అతనిని చంపగలడా? అంతటితో ఆగక ఆ శరీరంలోని ఎముకలను ఏరుకొని పంచుకొనే బిచ్చగాండ్రు లోకంలో ఉన్నారా? అయినా లోకాలను రక్షించే దేవతలు స్వయంగా హింసకు తలపడటం ఎట్లా సంభవించింది? ప్రాణం తమకు ఎంత ప్రియమో ఎదుటివారికీ అంతే ప్రియమని అనుకోవద్దా?

**వ. అనిన దేవత లిట్లనిరి. 356**

**ప్రతి :** అనినన్+దేవతలు+ఇట్లు+అనిరి= అని పలుకగా దేవతలు ఇలా బదులు చెప్పారు.

**తా :** దధీచి మాటలకు దేవతలు ఇలా అన్నారు.

**తే. సర్వ భూతదయాపర స్వాంతులకును, బుణ్యవర్తను లగు మిమ్ముబోఁటి వారి**
**కమిత సత్కీర్తి కాముల కలఘుమతుల, కియ్యరాని పదార్థంబు లెవ్వి గలవు? 357**

**ప్రతి :** సర్వ భూతదయాపర స్వాంతులకును= ఎల్లప్రాణులయెడ దయగల మనస్సులు గలవారికి; పుణ్యవర్తనులు+అగు= పవిత్రమైన నడత గలవారైన; మిమ్ము బోఁటివారికిన్= మీవంటివారికి; అమిత సత్కీర్తికాములకున్= మితిమీరిన గొప్ప కీర్తిని కోరేవారికి; అలఘుమతులకున్= గొప్ప బుద్ధులు గలవారికి; ఇయ్యరాని పదార్థంబులు= ఇవ్వకూడని వస్తువులు; ఎవ్వి+కలవు= ఏవి ఉన్నాయి?

**తా :** మహర్షీ! మీవంటివారు ప్రాణులన్నింటియెడ దయాగుణం కలిగి ఉంటారు. పవిత్రమైన వర్తనం మీది. మీరు సత్కీర్తిని కోరుకుంటారు. గొప్ప బుద్ధిగలవారు. అటువంటి మీకు ఈయరాని వస్తువంటూ ఒకటి ఉండదు.

**ఆ. అడుగరాని సొమ్ము లడుగ రాదని మానఁ, డడుగువాని మాట లడుగ నేల?**
**భ్రాంతి నడుగుచోటఁ బ్రాణంబు లేనియు, నిచ్చువాఁడు దాపఁ డిచ్చుఁగాని. 358**

**ప్రతి :** అడుగరాని సొమ్ములు= కోరరాని సంపదలు; అడుగరాదు= కోరకూడదు; అని; మానఁడు= ఊరుకోడు; అడుగువానిన్= యాచకుని; మాటలు అడుగన్+ఏల?= ప్రశ్నించటం ఎందుకు?; భ్రాంతిన్= భ్రమతో; అడుగుచోటన్= యాచించేచోట; ఇచ్చువాఁడు= దాత; ప్రాణంబులు+ఏనియున్= ప్రాణాలనైనా; ఇచ్చున్+కాని= ఇస్తాడేగాని; దాపఁడు= దాచుకోడు.

**తా :** యాచకుడు అడుగరానిదానినైనా అడుగుతాడు. ఇచ్చే దాత యాచకునితో వాద ప్రతివాదాలకు దిగడు. యాచకుడు ప్రాణమడిగినా ఇచ్చేస్తాడే గాని, దాత దాచుకోడు.

**వ. అని పరసంకటంబు దలంపక నిలింపులు కార్యపరత సవినయ వాక్యపరంపరలం బ్రార్థించిన, నతండు దరహసితవదనుండై, యఖిల లోకధర్మం బెఱింగియు నొక్కింత కాలంబు ప్రతివాక్యం బిచ్చితి, దీని సహింపందగుదురు; మీ యట్టి వారలకుం బ్రియంబగునేని నెప్పుడైన న్విడువందగిన శరీరంబు విడుచుట యేమి దుర్లభంబు? అధ్రువంబైన యీ దేహంబుచేతం గీర్తి సుకృతంబుల నెవ్వం డార్జింపకుండు నతండు పాషాణాదులకంటె నతి కఠినుండు; మీ యట్టి పుణ్యశ్లోకులచేత నాకాంక్షింపబడిన యీ శరీరం బప్రమేయ ధర్మార్జితంబు; ఏ దేహంబుచేతనైనను సకలభూతంబులు శోకానుభవంబున శోకించు, హర్షానుభవంబున హర్షించునట్టి మహాకష్టదైన్యాకరంబైన యీ శరీరంబు కాక శునక సృగాలాదులపాలు గాకుండ మే లయ్యె' అని నిశ్చితాత్ముండై దధీచి, తత్త్వావలోకనంబుచేత నిరసితబంధనుండై, బుద్ధీంద్రియ మానసంబులతోఁగూడిన క్షేత్రజ్ఞుని పరబ్రహ్మ స్వరూపంబైన భగవంతునందు నేకీభూతంబుఁ జేసి, యోగజ్ఞానంబున శరీరంబు విడిచె; అప్పుడింద్రుఁ డతని శల్యంబుల విశ్వకర్మ నిర్మితంబై, నిశిత శతధారా సమావృతంబై వెలుంగు వజ్రాయుధంబు గైకొని, భగవత్తేజోపబృంహితుండై, యైరావతారూఢుండై, సకలదేవోత్తమ గరుడ గంధర్వ ఖచర కిన్నర కింపురుష సిద్ధ సాధ్య విద్యాధర పరిసేవితుండై, సకల మునిజనంబులు వినుతింపఁ ద్రిలోకహర్షకారియై, భగవదనుగ్రహ సంప్రాప్త మహోత్సాహ వికసిత వదనారవిందుండై వృత్రాసురుపై నడచె; అప్పుడు. 359**

**ప్రతి :** అని= పైన వివరించిన విధంగా; పరసంకటంబున్+తలంపక= ఇతరుల కష్టం గణించక; నిలింపులు= దేవతలు; కార్యపరతన్= పనిలో నిమగ్నులు కావడంవలన; సవినయవాక్యపరంపరలన్= అణకువతోగూడిన మాటల వరుసలతో; ప్రార్థించినన్= వేడుకొనగా; ఆతండు= ఆ దధీచి; దరహసితవదనుండై= చిరునవ్వుతో కూడిన మోము గలవాడై; అఖిలలోక ధర్మంబు+ఎఱింగియున్= సమస్త లోకాల ధర్మాలను తెలిసికూడా; ఒక్కింత కాలంబు= కొద్ది సమయం; ప్రతివాక్యంబు+ ఇచ్చితిన్= బదులు పలికాను; దీనిన్ సహింపన్ తగుదురు= ఈ నా భాషణాన్ని ఓర్చుకొనగలరు; మీయట్టివారలకున్= మీవంటివారికి; ప్రియంబు+అగున్+ ఏని= ఇష్టమైనది ఐనచో; ఎప్పుడైనన్ విడువన్ తగిన శరీరంబు విడుచుట= ఏదో ఒకనాటికి వదలివేయవలసిన శరీరం వదలటం; ఏమి దుర్లభంబు= పొందరానిది ఎలా అవుతుంది? అధ్రువంబైన= అశాశ్వతమైన; ఈ దేహంబు చేతన్= ఈ శరీరంతో; కీర్తి సుకృతంబులన్= కీర్తినీ పుణ్యాన్నీ; ఎవ్వండు= ఏ మానవుడు; ఆర్జింపక+ఉండున్= సంపాదించకుండా ఉంటాడో; అతండు= ఆ మానవుడు; పాషాణ+ఆదులకంటెన్= రాళ్ళు మొదలయినవాటికంటె; అతి కఠినుండు= మిక్కిలి గట్టివాడు; మీ+అట్టి పుణ్యశ్లోకులచేతన్= మీవంటి మంచికీర్తి గలవారిచేత; ఆకాంక్షింపన్+పడిన= కోరబడిన; ఈ శరీరంబు= ఈ దేహం; అప్రమేయధర్మ+ఆర్జితంబు= కొలతలకందని పుణ్యం సంపాదించినట్టిది; ఏ దేహంబు చేతనైనను; సకల భూతంబులు= ఎల్లప్రాణులు; శోక+అనుభవంబునన్= తనవారి ఎడబాటు వలన కలిగిన అనుభవంతో; శోకించున్= దుఃఖిస్తుందో; హర్ష+అనుభవంబునన్= ఆనందం కలుగటంతో; హర్షించున్= ఆనందిస్తుందో; అట్టి మహాకష్టదైన్య+ఆకరంబైన= ఆ విధమైన గొప్ప కష్టానికి, దిక్కుమాలినతనానికి స్థానమైన; ఈ శరీరంబు= ఈ దేహం; కాక శునక శృగాల+ఆదులపాలుగాకుండ= కాకులకు, కుక్కలకు, నక్కలకు మొదలయిన వాటికి చెందకుండా (వాటిచే తినబడక); మేలు+అయ్యెన్= (మిగిలి) ఉండడం మంచిదైంది; అని= అనుకొని; నిశ్చిత+ఆత్ముండై= నిర్ణయించుకొన్న మనస్సు గలవాడై; దధీచి; తత్త్వ+అవలోకనంబుచేతన్= నిజజ్ఞాన దర్శనంతో; నిరసితబంధనుండై= తెంచుకొన్న సంబంధ బాంధవ్యాలు గలవాడై; బుద్ధి+ఇంద్రియ మానసంబులతోన్+కూడిన= తెలివి, కళ్ళు చెవులువంటి ఇంద్రియాలు, మనస్సు – వీటితో కూడిన; క్షేత్రజ్ఞునిన్= ఆత్మను; పరబ్రహ్మ స్వరూపంబైన= పరమాత్మ ఆకారంగల; భగవంతునందున్= దేవునిలో; ఏకీభూతంబున్+చేసి= ఒక్కటి చేసి; యోగజ్ఞానంబునన్= యోగ జ్ఞాన పద్ధతిలో; శరీరంబున్+విడిచెన్= దేహాన్ని పరిత్యజించాడు; అప్పుడు; ఇంద్రుఁడు; అతని శల్యంబులన్= ఆ దధీచి ఎముకలతో; విశ్వకర్మ నిర్మితంబై= దేవశిల్పి విశ్వకర్మచే చేయబడినదై; నిశిత శతధారాసమన్వితంబై= పదునైన వందఅంచులతో ఆయుధాన్ని కూడినదై; వెలుంగు= ప్రకాశించే; వజ్ర+ఆయుధంబున్= 'వజ్రము' అను పేరుగల ఆయుధాన్ని; కైకొని= చేత బట్టి; భగవత్+తేజస్+ఉపబృంహితుండై= దేవుని వెలుగుతో బలవంతుడై; ఐరావత+ఆరూఢుండు+ఐ= ఐరావతమనే తన వాహనాన్ని (ఏనుగును) ఎక్కినవాడై; సకలదేవ+ఉత్తమ= ఉత్తములైన సకల దేవతలు; గరుడ= గరుడులు; గంధర్వ= గంధర్వులు; ఖచర= ఖేచరులు; కిన్నర= కిన్నరులు; కింపురుష= కింపురుషులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; విద్యాధర= విద్యాధరులు మొదలగువారితో; పరిసేవితుండై= కూడినవాడై; సకల మునిజనంబులు= మునులందరూ; వినుతింపన్= స్తుతిస్తూ ఉండగా; త్రిలోక హర్షకారి+ఐ= ముల్లోకాలకు సంతోషం కలిగిస్తున్నవాడై; భగవత్= దేవుని; అనుగ్రహ= దయవలన; సంప్రాప్త= పొందిన; మహా+ఉత్సాహ= గొప్ప సంతోషంతో; వికసిత= వికసించిన, వదన+అరవిందుఁడై= పద్మమువంటి మోము గలవాడై; వృత్ర+అసురుపైన్= వృత్రుడు అనే రాక్షసుని మీదికి; నడచెన్= (దండెత్తి) వెళ్ళెను; అప్పుడు...

**తా :** దేవతలు స్వార్థ దృష్టితప్ప ఎదుటివారి కష్టాన్ని పట్టించుకోకుండా ఋషిశరీరాన్ని యాచిస్తే, ఋషి లోకస్వభావం ఎరిగినవాడై ఉండికూడా చిరునవ్వుతో ఒకింతసేపు వారితో యాచనను గూర్చి యాచకుని గూర్చి వాదించి చర్చించి, తరువాత 'ఎపుడైనా వదలక తప్పని ఈ దేహాన్ని దేవకార్యంకోసం త్యజించడం నాకు సమ్మతమే. ప్రాణం పోయిన పిదప కాకులు కుక్కలు నక్కలు – వంటివాటి పాలుగాకుండ, కష్టాలకు దైన్యాలకు పాత్రమైన ఈ దేహం ఒక మహాప్రయోజనంకోసం త్యజించడం మేలేగదా' అంటూ, తన ఆత్మను పరమాత్మలో నిలిపి, యోగశక్తితో తన శరీరాన్ని వదలివేశాడు. వెంటనే విశ్వకర్మ ఆ శరీరంలోని ఎముకలతో 'వజ్రము' అనే నూరంచుల ఆయుధాన్ని నిర్మించి ఇంద్రునకీయడంతో, అతడు వజ్రాయుధధారియై, దైవదత్తమైన తేజంతో వృద్ధి పొందింపబడినవాడై, ఐరావతమెక్కి, దేవజాతులు – గరుడ గంధర్వ కిన్నర కింపురుషాది సైన్యబలాలతో కూడి, మునులు పొగడగా, ముల్లోకాలకు ఆనందం కలిగిస్తూ, వృత్రాసురుని మీదికి దండెత్తి వెళ్లాడు. అప్పుడు

**ఉ. వృత్రుఁడు దానవాన్వయ పవిత్రుఁడు లోక జిఘాంసకక్రియా**
**సూత్రుఁడు నిగ్రహాగ్రహణ సుస్థిరవాక్య వివేకమాన చా**
**రిత్రుఁడు దేవతోరగదరీకృతవక్త్రుఁడు రోషదూషితా**
**మిత్రుఁడు శత్రురాకఁ గని మిక్కిలియైన యుగాంతకాకృతిన్. 360**

**ప్రతి :** దానవ+అన్వయ పవిత్రుఁడు= రాక్షసవంశంలో పరిశుద్ధుడు; లోకజిఘాంసకక్రియా సూత్రుఁడు= లోకాలను చంపడానికి ఇచ్చగించే పనినే లక్ష్యంగా పెట్టుకొన్నవాడు; నిగ్రహ= చంపడంలో; అనుగ్రహణ= జాలి చూపడంలో; సుస్థిర= మిక్కిలి గట్టివైన; వాక్య= మాటలతో; వివేకమాన= జ్ఞానపరిణతి గల; చారిత్రుఁడు= నడత గలవాడు; దేవతా+ఉరగ= దేవతలు అనే పాములకు; దరీకృతవక్త్రుఁడు= కొండగుహవంటి నోరు గలవాడు; రోషదూషిత+అమిత్రుఁడు= కోపంతో బాధితులయిన శత్రువులు గలవాడు; వృత్రుఁడు= వృత్రాసురుడు; శత్రురాకన్+కని= విరోధి రావడం చూచి; మిక్కిలి+ఐన= అధికమైన; యుగ+అంతక+ఆకృతిన్= యుగాంతాన యముని స్వరూపంతో...

**తా :** వృత్రాసురుడు రాక్షసవంశాన పావనుడు. లోకాలను కబళించి మింగివేయడమే తన మార్గంగా ఎన్నుకున్నవాడు; శత్రువును చంపడంగాని, జాలితో వదలివేయటంగాని మాటప్రకారం చేసి చూపేవాడు. దేవతలు అనే పాములను మింగడానికి తగిన కొండగుహవంటి నోరు గలవాడు – అంటే మింగేసేవాడు. శత్రువినాశకరుడు. అటువంటి వృత్రుడు తన విరోధిరాకను చూచి యుగాంతాన యమునివలె

**క. మెండు గల దనుజ నాయక, మండలములు గొల్వ నడచె మహిమోద్ధతి వే**
**దండముల నడుమఁ జను నడ, గొండయునుం బోలె నిబిడ కోపోద్ధతుఁడై. 361**

**ప్రతి :** మెండు గల= ఎక్కువగా ఉండిన; దనుజనాయకమండలములు= రాక్షసనాయకులసమూహాలు; కొల్వన్= సేవించగా; మహిమ+ఉద్ధతిన్= గొప్పతనపు పెంపుతో; వేదండముల నడుమన్= ఏనుగుల మధ్య, చను= వెళ్ళే; నడ కొండయునున్+పోలెన్= నడిచే కొండవలె; నిబిడ కోప+ఉద్ధతుఁడై= తీవ్రమైన కోపంతో గర్వించినవాడై; నడచెన్= (విరోధికి ఎదురుగా) వెళ్లాడు.

**తా :** రాక్షసనాయకులు అనేకులు తనను వెన్నంటిరాగా, మదపుటేనుగుల మధ్య నడిచి వస్తున్న కొండవలె వృత్రుడు కోపంతో, గర్వంతో శత్రువును ఎదుర్కొన్నాడు.

**క. కాలగళుఁ డదరి కడువడిఁ, గాలుని పైఁ గవయు మాడ్కి ఖరతర రవ సం**
**చాలిత పూర్వ దిగంతరుఁ, డై లీల మహేంద్రుమీఁద నతఁ డరిగె నృపా! 362**

**ప్రతి :** నృపా!= రాజా!; కాలగళుఁడు= శంకరుడు; అదరి= విజృంభించి; కడువడిన్= మిక్కిలి వేగంతో; కాలునిపైన్= యమునిమీదికి; కవయుమాడ్కిన్= తలపడేవిధంగా; ఖరతర= ఎక్కువ పరుషమైన; రవ= శబ్దంతో; సంచాలిత= వణికింపబడిన; పూర్వదిక్= తూర్పుదిక్కు; అంతరుఁడైన= లోపలిభాగం కలవాడై; లీలన్= విలాసంగా; అతఁడు= ఆ వృత్రుడు; మహా+ఇంద్రుమీఁదన్= దేవేంద్రుని మీది(కి); అరిగెన్= వెళ్లాడు.

**తా :** రాజా! రుద్రుడు కోపంతో వడివడిగా యమునిపైకి వెళ్ళినట్లు, ఆ వృత్రుడు పెద్ద అరుపుతో తూర్పు దిక్కు పిక్కటిల్లేలా ఎదురు నడిచాడు.

**వ. ఇట్లు రుద్రగణంబులు, మరుద్గణంబులు, నాదిత్యగణంబులు, నశ్వినీదేవతలు, పితృదేవతలు, విశ్వేదేవులు, వహ్నియు; యమ, నైరృతి, వరుణ, వాయు, కుబే, రేశానాదులు; సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, గరుడ, గంధర్వ, ఖేచర, ప్రముఖంబులగు నింద్ర సైన్యంబులతోఁడ నముచియు, శంబరుండును, ననర్వుండును, ద్విమూర్ధుండును, వృషభుండును, నంబరుండును, హయగ్రీవుండును, శంకుశిరుండును, విప్రచిత్తియు, నయోముఖుండును, పులోముండును, వృషపర్వుండును, హేతియు, ప్రహేతియు, నుత్కటుండును, ధూమ్రకేశుండును, విరూపాక్షుండును, కపిలుండును, విభావసుండును, నిల్వలుండును, పల్వలుండును, దందశూకుండును, వృషధ్వజుండును, గాలనాభుండును, మహానాభుండును, భూత సంతాపనుండును, వృకుండును, సుమాలియు, మాలియు మున్నగు దైతేయ దానవ యక్షరాక్షసా ద్యసంఖ్యంబులగు వృత్రాసురుబలంబులు దలపడి సమరంబుం జేసిరి. అప్పుడు. 363**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; రుద్రగణంబులు= రుద్రులసమూహాలు; మరుత్+గణంబులు= మరుత్తులసమూహాలు; ఆదిత్యగణంబులు= ఆదిత్యులసమూహాలు; అశ్వినీదేవతలు= 'అశ్వి' అనే ఇద్దరుదేవతలు; పితృదేవతలు= పితరులు అనేవారు; విశ్వేదేవులు= విశ్వేదేవులు అనేవారు – వీరందరు దేవజాతులు; వహ్నియున్= అగ్ని, యమ= యముడు; నైరుతి; వరుణుడు; వాయువు; కుబేరుడు; ఈశానుడు మొదలయినవారు; సిద్ధ... ప్రముఖంబులగు= సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, కింపురుషులు, గరుడులు, గంధర్వులు, ఖేచరులు మొదలుగా గల; ఇంద్రసైన్యంబుల తోడన్= ఇంద్రుని సేనలతో; నముచి, శంబరుడు, అనర్వుడు, ద్విమూర్ధుడు, వృషభుడు, అంబరుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోముడు, వృషపర్వుడు, హేతి, ప్రహేతి, ఉత్కటుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, కపిలుడు, విభావసుడు, ఇల్వలుడు, పల్వలుడు, దందశూకుడు, వృషధ్వజుడు, కాలనాభుడు, మహానాభుడు, భూతసంతాపనుడు, వృకుడు, సుమాలి, మాలి మొదలైన; దైతేయ దానవ యక్షరాక్షస+ఆది+అసంఖ్యాకంబులగు= దైతేయులు మొదలయిన లెక్కలేనంతమంది అయిన; వృత్ర+అసుర బలంబులు= వృత్రాసురునిసేనలు; తలపడి= ఎదురొడ్డి; సమరంబు+చేసిరి= యుద్ధం చేశారు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఇంద్రసేనలలో రుద్రులు, మరుత్తులువంటి ఆరు దేవజాతుల గుంపులు, అగ్ని, యముడువంటి దిక్పాలకులు, సిద్ధులు, సాధ్యులవంటి మహాయోధులు; వృత్రుసేనలలో, నముచి, శంబరుడు, అనర్వుడు వంటి ఇరవై తొమ్మిదిమంది

మహాయోధులు, దైతేయులు, యక్షులు, రాక్షసులు వంటి లెక్కలేనంతమంది యోధులు పరస్పరం తలపడి పోరాడారు. అప్పుడు

**చ. అసురులకున్ సురావలికి నయ్యె మహారణ మప్పు డొండొరుల్**
**ముసల గదాసి కుంత శర ముద్గర తోమర భిండివాల ప**
**ట్టస పటుశూల చక్రముల దంబము చూపి యదల్చి యార్చుచున్**
**మసలక కప్పి రస్త్రముల మార్కొని మంటలు మింట నంటఁగన్. 364**

**ప్రతి :** అసురులకున్= రాక్షసులకు; సుర+ఆవలికిన్= దేవతల సమూహానికి; మహారణము= గొప్ప యుద్ధం; అప్పుడు; అయ్యెన్= జరిగింది; ఒండు+ఒరుల్= ఒకరినొకరు; ముసల= రోకలి; గదా= గద; అసి= కత్తి; కుంత= బల్లెం; శర= బాణం; ముద్గర= ఇనుపగుదియ; తోమర= చిన్న ఈటె; భిండివాల= ఇనుప అలుగు గల ఆయుధం; పట్టస= ఆయుధ విశేషం; పటుశూల= గొప్ప శూలం; చక్రములన్= చక్రాలతో; దంబము= బడాయి చూపి; అదల్చి= అదలించి; ఆర్చుచున్= అరుస్తూ; మసలక= ఆలస్యం చేయక; మార్కొని= ఎదుర్కొని; మంటలు= ఆయుధ ఘర్షణలవలన కలిగిన మంటలు; మింటన్+అంటగన్= ఆకసాన్ని తాకగా; అస్త్రములన్= ఆయుధాలతో; ఒండొరుల్= ఒకరినొకరు; కప్పిరి= పరస్పరం ముంచివేసుకొన్నారు.

**తా :** దేవదానవులకు గొప్ప యుద్ధం జరిగింది. వారు రోకళ్ళు, గదలు, కత్తులు, ఇనుపగుళ్ళు, శూలాలు, చక్రాలతో ఒకరినొకరు మోదుకొంటూ పెద్దగా బొబ్బలు పెట్టి, ఆ శబ్దాలు ఆకాశాన్ని నింపివేయగా తమను తాము పరస్పరం ఆయుధాలతో ముంచెత్తుకొన్నారు.

**క. ఒండొరులఁ గడవ నేసిన, కాండము లాకాశపథముఁ గప్పి మహోల్కా**
**దండములఁ బోలి నిష్ఠుర, భండన ముఖ మొప్పెఁ జూడఁ బ్రళయోచితమై. 365**

**ప్రతి :** ఒండు+ఒరులన్= ఒకరినొకరు; కడవన్+వేసిన= మీరిపోవుటకై ప్రయోగించిన; కాండములు= బాణాలు; ఆకాశపథమున్+కప్పి= ఆకాశమార్గాన్ని మూసి; మహా+ఉల్కాదండములన్+పోలి= గొప్ప తోకచుక్కల కర్రలను పోలి; నిష్ఠుర భండన ముఖము= దారుణమైన యుద్ధపు ముందుభాగం; చూడన్= చూసేందుకు; ప్రళయ+ఉచితమై= ప్రళయ కాలానికి తగినదై; ఒప్పెన్= శోభిల్లెను.

**తా :** దేవాసురులు పరస్పరం మించిపోతూ బాణాఘాతాలతో ఆకాశాన్ని ముంచెత్తారు. అప్పుడు ఆ వినువీధిలోని బాణపరంపర ప్రళయకాలపు గొప్ప ఉల్కాపాతాన్ని (తోకచుక్కలు భూమిపై పడటాన్ని) గుర్తుకు తెస్తూ అందంగా కనిపించింది.

**చ. సురవరు లేయు బాణములు సూడ్కి కగోచరమై నభస్థ్సలం**
**బరిమురిఁ గప్పి రేసి దివసాంతముఁ జేసిన లీల నాసురే**
**శ్వర బలయూథ వీరు లురుసాయకపంక్తులచేత వాని రూ**
**పఱ శతధూళి సేసి పఱపైన తమం బొనరించి రార్చుచున్. 366**

**ప్రతి :** సురవరులు= దేవతాశ్రేష్ఠులు; ఏయుబాణములు= ప్రయోగించే బాణాలు; చూడ్కికిన్+అగోచరము+ఐ= చూపునకు ఆననివై; నభస్+స్థలంబు= ఆకాశప్రదేశం; అరిమురిన్= అడ్డదిడ్డంగా; కప్పి= ఆవరించి; రేసి= చెలరేగి; దివస+అంతమున్+

చేసిన లీలన్= రోజుయొక్క చివరను అనగా సంధ్యాసమయం చేసిన విధంగా; అసుర+ఈశ్వర బలయూథవీరులు= ఆ రాక్షససేనల అధిపతులు; ఉరుసాయక పంక్తులచేతన్= గొప్ప బాణాల వరుసలతో; వానిన్= ఆ దేవతల బాణాలను; రూపు+అఱన్= ఆకారం కోల్పోయేటట్లు; శతధూళి+చేసి= దుమ్ము దుమ్ముగా చేసి; పఱపు+అయిన తమంబున్= విశాలమైన చీకటిని; ఆర్చుచున్= అరుస్తూ; ఒనరించిరి= చేశారు.

**తా :** దేవతలు కంటికి కనిపించకుండా తమ బాణపరంపరతో ఆకాశస్థలమంతటినీ ఆక్రమించి సంధ్యాసమయాన్ని కల్పించారు. రాక్షసవీరులు దానికి బదులుగా తమ బాణాలవరుసలతో వారి బాణాలను రూపుమాపి, ఆ సాయం సమయాన్ని విశాలమైన చీకటిగా మార్చి వేశారు.

**చ. సమరమదాంధులై సురనిశాచరవీరులు సైనికాంఘ్రి సం**
**క్రమిత మహీపరాగములు గ్రమ్మిన నుమ్మలికంపుఁ జీఁకటుల్**
**దమ కనుదోయి కడ్డముగఁ దార్కొనినం జలమూఁది పోరి రా**
**క్రమిత నిజాంతరంగ పరిఘట్టిత రోషమహాగ్ని పెంపునన్. 367**

**ప్రతి :** సమరమద+అంధులై= యుద్ధగర్వంతో గుడ్డివారై; సుర నిశాచర వీరులు= దేవ రాక్షస యోధులు; సైనిక+అంఘ్రి సంక్రమిత మహీపరాగములు= సైనికుల కాళ్ళ వలన నేలమీద ఏర్పడిన దుమ్ము రేణువులు; క్రమ్మినన్= వ్యాపించగా; ఉమ్మలికంపున్+చీకఁటుల్= దట్టమైన చీకట్లు; తమ కనుదోయికిన్= తమ రెండు కళ్ళకూ; అడ్డముగన్+తార్కొనినన్= అడ్డంగా వ్యాపించగా; చలము+ఊఁది= పట్టుదల వహించి; ఆక్రమిత నిజ+అంతరంగ పరిఘట్టిత రోషమహా+అగ్ని పెంపునన్= వ్యాపించిన తమ మనస్సులను కుదిపివేసిన, క్రోధమనే నిప్పుల పెరుగుదలతో; పోరిరి= యుద్ధం చేశారు.

**తా :** యుద్ధమదంతో కన్నుగాననివారైన దేవదానవయోధులు తమ తమ కాళ్ళు భూమిని ఒరిపిడి చేసినందువలన పైకెగసిన దుమ్మురేణువులు యుద్ధభూమినంతటినీ చీకటిగా మార్చివేయగా, మనస్సులలో క్రోధమనే నిప్పుల సెగ లెగయగా, తమ తమ కళ్ళు ఆ చీకట్లలో చికాకుపడగా, తెగని పట్టుదలతో పోరు సాగించారు.

**క. అతిగళిత రక్తధారా, క్షతములతోఁ గానఁబడిరి సైనికులు మహో**
**ద్ధత రోషవహ్నికీలలు, వితతంబై పిక్కటిల్లి వెడలెడు భంగిన్. 368**

**ప్రతి :** అతిగళిత= ఎక్కువగా జారే; రక్తధారాక్షతములతోన్= నెత్తుటిధారల దెబ్బలతో; సైనికులు= సేనలు; మహా+ఉద్ధత రోషవహ్నికీలలు= గొప్పగా పైకెగసే క్రోధమనే నిప్పులరవ్వలు; వితతంబు+ఐ= విశాలమై; పిక్కటిల్లి= పైకి ఉబికి; వెడలెడుభంగిన్= వెలికివచ్చే విధంగా; కానన్+పడిరి= కనిపించారు.

**తా :** యుద్ధభూమిలో సేనలు తమ దేహాలనుండి ఎక్కువగాకారే నెత్తురుతో కూడిన దెబ్బలతో చూపరులకు తమ తమ తనువులలో ఎగసిపడే కోపపు నిప్పుల రవ్వలు ఆ రూపంగా పైకి కనిపిస్తున్నాయా అన్నట్లు ఉన్నారు.

**సీ. రవణించు శింజినీటంకారరవములు భటసింహనాదంబుఁ బరిఢవింప**
**భీషణోత్తమ హయహేషావిఘోషంబు కరి బృంహిత స్ఫూర్తిఁ గ్రందుకొలుప**
**సమర నిశ్శంకాంక శంఖనినాదంబు నేమిస్వనంబుల నిహ్నవింపఁ**
**దుములమై చెలఁగెడు దుందుభిధ్వానంబు లట్టహాసంబుల నాక్రమింప**

**తే. ఘటిత శస్త్రాస్త్ర నిష్ఠుర ఘట్టనోత్థ, ఖర కఠో రోరు విస్ఫులింగంబు లదరి**
**దివ్య కోటీర మణిఘృణి ధిక్కరింప, సమర మొనరించి రసురులు నమరవరులు. 369**

**ప్రతి :** అసురులు= రాక్షసులు; అమరవరులు= దేవతాశ్రేష్ఠులు; రవణించు= శబ్దించే; శింజినీ టంకార రవములు= అల్లెత్రాటి, 'టం' అనే శబ్దాలు; భట సింహనాదంబున్= సింహాలవంటి సైనికుల ధ్వనిని; పరిధవింపన్= అతిక్రమిస్తూ ఉండగా; భీషణ+ఉత్తమ, హయహేషావిఘోషంబు= భీకరమైన మంచి గుర్రాల అరుపుల శబ్దాలు; కరిబృంహిత స్ఫూర్తిన్= ఏనుగుల ఘీంకారాల శబ్దస్ఫూర్తిని; క్రందుకొలుపన్= అతిశయింపజేస్తుండగా; సమర నిశ్శంక+అంకశంఖ నినాదంబు= యుద్ధంలో అనుమానానికి తావులేదనడానికి గుర్తు అయిన శంఖపుధ్వని; నేమి స్వనంబులన్= రథచక్రాల శబ్దాలను; నిహ్నవింపన్= మరుగుపరుస్తుండగా; తుములమై= దట్టమై; చెలగెఁడు= ఎగసే; దుందుభి ధ్వానంబులు= భేరీ శబ్దాలు; అట్టహాసంబులన్= ఆటోపాలను, పెద్దనవ్వులను; ఆక్రమింపన్= లోబరచుకొంటూ ఉండగా; ఘటిత, శస్త్ర+అస్త్ర నిష్ఠురఘట్టన+ఉత్థ, ఖర, కఠోర+ఉరు విస్ఫులింగములు= ఘర్షణపడుతున్న శస్త్రాస్త్రాల ఒరిపిడితో ఎగసే పెను నిప్పురవ్వలు; అదరి= అతిశయించి; దివ్యకోటీరమణిఘృణిన్= దేవతల కిరీటాలలోని మణుల కాంతిని; ధిక్కరింపన్= తిరస్కరించగా; సమరము+ఒనరించిరి= యుద్ధం చేశారు.

**తా :** రాక్షసులు దేవతలు యుద్ధం చేస్తున్న ఆ సంగరరంగంలో పెద్దగా ధ్వనించే వీరుల ధనుష్టంకారాలు వారి సింహనాదాలను మించుతున్నాయి. అశ్వరాజాల భీషణహేషారావాలు ఏనుగుల ఘీంకారాలను ఆక్రమిస్తున్నాయి. విశృంఖలంగా మోగుతున్న శంఖధ్వానాలు రథచక్రధ్వనులను కింద పరుస్తున్నాయి. సంకులంగా చెలరేగిన దుందుభి నినాదాలు వీరుల వికటాట్టహాసాలను మరుగు పరుస్తున్నాయి. శస్త్రాస్త్రాల పరస్పర ఘర్షణవల్ల ఉద్భవించిన అగ్నికణాల కాంతులు వారి కిరీటాలలోని రత్నాల కాంతులను తిరస్కరిస్తున్నాయి.

**వ. ఇట్లు ప్రళయసంరంభ విజృంభిత సముత్తుంగ రంగత్తరంగిత భైరవారావ నిష్ఠ్యూత నిష్ఠుర మహార్ణవంబునుం బోలె, యుగాంతర సంక్రాంత ఝంఝాపవన పరికంపిత దీర్ఘ నిర్ఘాత నిబిడ నిష్ఠుర నీరదంబులుం బోలె, నుభయసైన్యంబులుం గలసి సంకులసమరంబు సలుపు సమయంబున, యుగాంత కృతాంత సకలప్రాణి సంహార కారణలీలయుంబోలెఁ, బదాతి రాహుత్త గజారోహక రథిక మహారథిక వీరు లొండొరులు చండగతిం గాండంబులుఁ బఱపుచుఁ గదలం జదుపుచుఁ, గత్తులఁ గత్తళంబులఁ జినుఁగం బొడుచుచు, నడిదంబుల నడఁచుచుఁ, గుంతంబులం గ్రుచ్చుచుఁ, గుఠారంబుల వ్రచ్చుచు, ముసలంబుల మోఁదుచు, ముద్గరంబులం బాఁదుచుఁ, జక్రంబులం ద్రుంచుచు, సబళంబుల నొంచుచు, సురియల మెఱముచుఁ, శూలంబులఁ దుఱుముచు, వాజుల కుఱికియు, వాలంబుల నఱికియుఁ, దొడలు తుండించియుఁ, దొండంబుల ఖండించియు, మెడ లెడయించియు, మొదళ్ళు గెడయించియు, నడుములు ద్రుంచియు, నాసికలుఁ ద్రెంచియుఁ, బదంబులు విఱిచియుఁ, బార్శ్వంబులం జెఱిచియు, గజంబులఁ బఱిపియు, గాత్రంబుల నుఱిపియుఁ, గుంభంబులఁ బగిలించియుఁ, గొమ్ముల నగిలించియు, హస్తంబులఁ ద్రెంచియు, నంగంబులఁ జించియు, రథంబుల నలియించియు, రథికులం బొలియించియు, సారథులం జంపియు, సైంధవులం దంపియు, శిరంబులు నొగిలించియు, సీసకంబు లగిలించియు, ఛత్రములం**

**దుఱుమాడియుఁ, జామరంబులం దునుమాడియు, సైన్యంబులఁ జదిపియు, సాహసుల మెదిపియు, నడుములు ద్రుంచియు మఱియును బరస్పర గుణవిచ్ఛేదనంబును, నన్యోన్య కోదండ ఖండన పటుత్వంబులు, నుభయ సైంధవ ధ్వజ సారథి రథిక రథ వికలనంబును, నొండొరుల పాద జాను జంఘా హస్త మస్తక నిర్దళనంబును, రక్తమాంసమేదః పంకసంకలిత సమరాంగణంబునై యతిఘోర భంగిం బెనంగిరి, అప్పుడు. 370**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; ప్రళయ= యుగాంతంలో; సంరంభ విజృంభిత= ఆర్భాటంగా ఎగసిపడిన; సమ్+ఉత్తుంగ= బాగా ఎత్తైన; రంగత్+తరంగిత= నటించే అలలుగల; భైరవ+ఆరావ= భయంకర శబ్దాలను; నిష్ఠ్యూత= వెలిగక్కే; నిష్ఠుర= కఠినమైన; మహా+అర్ణవంబునున్+పోలెన్= గొప్ప సముద్రంవలె; యుగ+అంత= ప్రళయకాలంలో; సంక్రాన్త= ఏర్పడిన; ఝంఝా= ఝంఝ అనే మహావేగం గల; పవన= గాలిచే; పరికంపిత= బాగా ఊపివేయబడిన; దీర్ఘ= పొడవైన; నిర్ఘాత= ఉరుములు గల; నిష్ఠుర= దారుణమైన; నీరదంబులున్+పోలెన్= మేఘాలవలె; ఉభయసైన్యంబులున్+కలిసి= ఇరువురి సేనలు కలిసి; సంకుల సమరంబు= దట్టమైన యుద్ధం; సలుపు సమయంబునన్= చేసేవేళ; యుగ+అంత= ప్రళయకాలంలో; కృత+అంత= యమునియొక్క; సకలప్రాణి= అన్ని జీవుల; సంహారకారణ లీలయనన్+పోలెన్= మరణాలకు హేతువైన విధంవలె; పదాతి= కాల్బలం; రాహుత్త= గుర్రపు రౌతులు; గజ+ఆరోహక= మావటీండ్రు; రథిక= రథములెక్కినవారు; మహారథిక వీరులు= గొప్పవారైన రథికులలోని ధీరులు; ఒండు+ఒరులు= ఒకరినొకరు; చండగతిన్= భయంకరమైన రీతిలో; కాండంబులు పరపుచున్= బాణాలు వేస్తూ; గదలన్+చదుపుచున్= గదలతో మోదుతూ; కత్తులన్= కత్తులతో; కత్తళంబులన్= కవచాలను; చినుగన్+పొడుచుచున్= చినుగునట్లుగా పొడుస్తూ; అడిదంబులన్= కత్తులతో; అడచుచున్= ఒత్తుతూ; కుంతంబులన్= ఈటెలతో; గ్రుచ్చుచున్= గుచ్చుతూ; కుఠారంబులన్ వ్రచ్చుచున్= గండ్రగొడ్డళ్ళతో నరకుతూ; ముసలంబులన్ మోదుచున్= రోకళ్ళతో కొడుతూ; ముద్గరంబులన్ పొఁదుచున్= ఇనుపగుదియలతో గట్టిగా కొడుతూ; చక్రంబులన్ త్రుంచుచున్= చక్రాలతో నరుకుతూ; సబళంబులన్+ఒంచుచున్= ఈటెవంటి ఆయుధాలతో బాధిస్తూ; సురియలన్ మెఱముచున్= చిన్న కత్తులతో పొడుస్తూ; శూలంబులన్+తుఱుముచున్= శూలాలతో ముక్కలు చేస్తూ; వాజులకున్+ఉఱికియున్= గుర్రాలకై ఎగురుతూ; వాలంబులన్= తోకలను; నఱికియున్= నరుకుతూ; తొడలు తుండించియున్= తొడలను నరుకుతూ; తొండంబులన్ ఖండించియున్= తొండాలను నరుకుతూ; మెడలు+ఎడయించియున్= మెడలు వేరుచేస్తూ; మొదళ్ళు కెడయించియున్= మొదటి భాగాలు ఖండిస్తూ; నడుములు; త్రుంచియున్= విరుస్తూ; నాసికలున్+ త్రెంచియున్= ముక్కులు కోస్తూ; పదంబులు విఱిచియున్= కాళ్ళు విరుస్తూ; పార్శ్వంబులన్+చెఱచియున్= పక్క భాగాలను ఖండిస్తూ; గజంబులన్+పఱిపియున్= ఏనుగులను పరుగెత్తిస్తూ; గాత్రంబులన్+ఉఱిపియున్= శరీరాలను విడిపిస్తూ; (చంపుతూ) కుంభంబులన్+పగిలించియున్= కుంభస్థలాలను పగులగొడుతూ; కొమ్ములన్+ అగిలించియున్= కొమ్ములను పెకలిస్తూ; హస్తంబులన్+త్రెంచియున్= చేతులు నరుకుతూ; అంగంబులన్= శరీర భాగాలను; చించియున్= తెంచివేస్తూ; రథంబులన్+అలియించియున్= రథాలను అలసిపోయేటట్లు చేస్తూ; రథికులన్+ పొలియించియున్= రథాలలోని వీరులను చంపుతూ; సారథులన్+చంపియున్= సారథులను చంపుతూ, సైంధవులను+దంపియున్= గుర్రపు వీరులను కొడుతూ; శిరంబులు నొగిలించియున్= తలలు తొలగిస్తూ; సీసకంబులు+ అగిలించియున్= కిరీటాలను పగులగొడుతూ; ఛత్రములన్+తుఱుము+ఆడియున్= గొడుగులను ముక్కలుచేస్తూ; సైన్యంబులన్+చదిపియున్= సేనలను చంపుతూ; సాహసులన్+మెదిపియున్= సాహసవంతులను చితక గొడుతూ; నడుములు; త్రుంచియున్= నరుకుతూ; మఱియును=

ఇంకా; పరస్పర గుణ విచ్ఛేదనంబును= ఒకరు మరొకరి అల్లెత్రాళ్ళు తెంచడమూ; అన్యోన్య కోదండ ఖండన పటుత్వంబులు= పరస్పరం ధనుస్సులు త్రుంచివేయడంలోనూ నేర్పులు; ఉభయ సైంధవ ధ్వజ సారథి, రథిక, రథ వికలనంబును= రెండుపక్కల గుర్రాల, రథపుజెండాల, సారథుల, రథికవీరుల, రథాల, నాశాలూ; ఒండొరుల పాద, జాను, జంఘా, హస్త, మస్తక, నిర్దళనంబును= పరస్పరం కాళ్ళు, మోకాళ్ళు, పిక్కలు, చేతులు, తలలు – వీటిని నరకడమూ; రక్తమాంస మేదః పంక సంకలిత సమర+అంగణంబును+ఐ= నెత్తుటితో, మాంసంతో, కొవ్వుతో (ఏర్పడిన) బురదతో కూడిన యుద్ధప్రాంగణమై; అతిఘోరభంగిన్= మిక్కిలి దారుణరీతిలో; పెనంగిరి= పెనుగులాడారు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ప్రళయకాలాన ఎత్తైన అలలతో, భయంకర ధ్వనులతో ఎగసిపడే మహాసముద్రాలవలె, యుగాంతాన ఝంఝూ అనే గాలులతో విజృంభిస్తూ, నేలను కుదిపివేసే భీకర మేఘాలవలె, రెండుసేనలు కలియబడిన సమయంలో యుగాంతాన యముడు భూమిపై గల సకల ప్రాణిసమూహాన్ని కబళింపజూసే విధంగా సేనలు రెండూ పరస్పర సంహారానికి సమకట్టాయి. పదాతులు, ఆశ్వికులు, గజయోధులు, రథయోధులు – అనే నాల్గు విధాల సేనలు (రథ గజ తురగ పదాతులు) పరస్పరం భీకరరీతిలో బాణాలతో, గదలతో, కత్తులతో, ఈటెలతో, గండ్రగొళ్ళతో, రోకళ్ళతో, ఇనుప గుదియలతో, చక్రాలతో, శూలాలతో, పరస్పరం నరుకుకొంటూ, మోదుకొంటూ కాళ్ళు, చేతులు, మోకాళ్ళు, తొడలు, నడుములు, పక్కటెముకలు పరస్పరం ఖండించుకొంటూ, మెడలు కోసి, ముక్కులు త్రుంచి, ఒకరినొకరు క్రూరకర్మలతో హింసించుకొంటూ, ఎదిరిసేనల రథాలను, రథికులను, గొడుగులను, ధనుస్సులను విరిచివేస్తూ, ధనుస్సుల అల్లెత్రాళ్ళను తెంచుకొంటూ, ఎదిరిసేనల జంతుజాలాలను తునుమాడుతూ, వైరులను తుండెములుగా ఖండములుగా కకావికలు చేస్తూ, ఎదుటివారి ఛత్రచామరాలను తునాతునకలు చేస్తూ, రణరంగాన్ని రక్తమాంసాలతో, కొవ్వులతో బురదమయంగా మార్చివేశారు. ఆ సమయంలో

**చ. సమజయమున్ సమాపజయ సామ్య పరిశ్రమమున్ సమోరు వి**
**క్రమము సమాస్త్రశస్త్రబల గర్వమునై కడుఘోరభంగి నా**
**నముచివిరోధి సైన్య గణనాథులతోడ నిశాచరేశ్వ రో**
**త్తములు దురంబు సేసి రొగిఁ దార్కొని వృత్రుబలంబు ప్రాపునన్. 371**

**ప్రతి :** సమజయమున్= సమానమైన గెలుపూ; సమ+అపజయ సామ్య పరిశ్రమమున్= సమానమైన ఓటమీ, సమానమైన అలుపూ; సమ+ఉరువిక్రమమున్= సమానమైన గొప్ప పరాక్రమాన్నీ; సమ+అస్త్ర శస్త్ర బలగర్వమున్+ఐ= సమానమైన అస్త్రశస్త్రాల, సేనల గర్వంతోకూడినదై; కడున్= మిక్కిలి; ఘోరభంగిన్= భయంకరరీతిలో; ఆ నముచివిరోధి సైన్య గణనాథులతోడన్= ఆ ఇంద్రునిసేనలోని గుంపుల నాయకులతో; నిశాచర+ఈశ్వర+ఉత్తములు= రాక్షసనాథుని సేనానాయకులు; ఒగిన్= వరుసగా; తార్కొని= ఎదుర్కొని; వృత్రుబలంబుప్రాపునన్= వృత్రుని శక్తియొక్క అండదండలతో; దురంబు+చేసిరి= పోరు సలిపారు.

**తా :** దేవదానవుల సైన్యాలు రెండూ సమానమైన పరాక్రమం కలవి. సమానమైన యుద్ధనైపుణ్యం కలవి. సమానమైన శస్త్రాస్త్ర సముదాయం కలవి. అందువల్ల జయాపజయాలుకూడా సరిసమానంగానే ఉన్నాయి. దేవేంద్రుని సేనానాయకులతో తలపడి వృత్రాసురుని అండదండలు గల రాక్షససేనానాయకులు ఘోరాతి ఘోరంగా పోరాడసాగారు.

**వ. అప్పుడు. 372**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయాన.

**లయగ్రాహి.**

**మొత్తముగఁ బాఱు పెనునెత్తురు మహానదులఁ, దత్తఱముతో నుఱికి కుత్తుకలు మోవన్**
**జిత్తముల నుబ్బి వెస నెత్తుకొను భూతముల, నత్తుకొని శాకినులు జొత్తిలెడి మాంసం**
**బుత్తలముతో మెసఁగి నృత్తములు సేయు మద, మత్తఘన డాకినులు నృత్తగతిఁ బ్రేవుల్**
**బిత్తరములం దిగిచి మెత్తమెదడుల్ మొనసి, గుత్తగొనుచుండ భయవృత్తిఁ గల నొప్పెన్. 373**

**ప్రతి :** మొత్తముగన్= అంతటా; పాఱు= ప్రవహించే; పెను= పెద్ద; నెత్తురు మహానదులన్= నెత్తురుతో ఏర్పడిన పెద్ద ఏరులలో; తత్తఱముతోన్+ఉఱికి= తొట్రుపాటుతో పరుగెత్తి; కుత్తుకలు మోవన్= మెడలు (రక్తంతో) తాకగా; చిత్తములన్+ఉబ్బి= మనస్సులలో సంతసించి; వెసన్= వేగంగా; ఎత్తుకొను భూతములన్= రేగిపోయే భూతాలతో; శాకినులు= ఒక రకపు పిశాచాలు; అత్తుకొని= అంటుకొని; జొత్తిలెడి= ఎఱ్ఱబడుతున్న; మాంసంబున్= మాంసాన్ని; ఉత్తలముతోన్= ఉత్సాహంతో; మెసఁగి= తిని; నృత్తములు+చేయు= నాట్యాలు చేసే; మద మత్త ఘన డాకినులున్= మదంతో బలిసిన గొప్ప డాకినులు అనే ఒక జాతి పిశాచాలు; నృత్తగతిన్= నాట్యభంగిమలో; ప్రేవుల్= పేగులు; బిత్తరములన్= కదలికలతో; తిగిచి= లాగి; మెత్తమెదడుల్= మృదువైన మెదళ్ళను; మొనసి= ప్రయత్నంతో; గుత్త+కొనుచుండన్= మొత్తంగా తీసికొంటూ ఉండగా; భయవృత్తిన్= భీతిగొల్పే పద్ధతిలో; కలను= యుద్ధం; ఒప్పెన్= ప్రకాశించింది.

**తా :** అక్కడ నెత్తురు ఏరులై పారింది. ఆ ఏరులలో భూతాలు ఉత్సాహంతో దుమికి మెడల వరకు మునిగి తెగ సంబరపడినాయి. శాకినులు నృత్యాలు చేస్తూ, ఎఱ్ఱని మాంసాలను మత్తుగా తింటూ సంతోషించాయి. డాకినులు నాట్యం చేస్తున్నట్లు పేగులతో పరస్పరం సరసాలాడుతూ, మెత్తని మెదళ్ళను ఆరగిస్తూ, చూపరులకు భీతిగొల్పుతుండగా ఆ యుద్ధం సాగింది.

**వ. ఇట్లు దేవదానవులు నర్మదాతీరంబునఁ గృతయుగంబునం దలపడి, త్రేతాయుగంబుఁ జొచ్చునంత కాలంబుఁ బోరు దారుణంబుగాఁ జేయుచుండ, నంత వృత్రాసురు భుజబలంబు పెంపునఁ దెంపుఁజేసి కంపింపక నిలింపులపై రక్కసులు గుంపులై సొంపుపెంపు చూపి, మహావృక్ష పాషాణ గిరిశిఖరంబులు వర్షించిన. 374**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దేవదానవులు; నర్మదాతీరంబునన్= నర్మదా నది ఒడ్డున; కృతయుగంబునన్+తలపడి= 'కృతము' అనే మొదటియుగంలో ఎదుర్కొని; త్రేతాయుగంబున్= 'త్రేత' అనే తరువాతి యుగం; చొచ్చు+అంతకాలంబున్= ప్రవేశించేటంతవరకు; పోరు= యుద్ధం; దారుణంబుగాన్= ఘోరంగా; చేయుచుండన్= చేస్తూ ఉండగా; అంతన్= పిదప; వృత్రాసురు భుజబలంబు= వృత్ర రాక్షసుని బాహుబలం; పెంపునన్= పెరుగుటవలన; తెంపున్+చేసి= తెగించి; కంపింపక= అదరక; నిలింపులపైన్= దేవతలపై; రక్కసులు= రాక్షసులు; గుంపులై; సొంపు, పెంపు, చూపి= అందం, ఆధిక్యం కనబరచి; మహావృక్ష, పాషాణ, గిరిశిఖరంబులు= పెద్ద చెట్లు, రాళ్ళు, కొండశిఖరాలూ; వర్షించినన్= కురిపించగా...

**తా :** ఈ విధంగా నర్మదానదీతీరంలో కృతయుగంలో ప్రారంభమైన దేవదానవుల పోరాటం త్రేతాయుగం ప్రవేశించేవరకు భయంకరంగా సాగుతూనే ఉంది. వృత్రాసురుని బాహుబలసంపదతో పెంపొందిన రక్కసి గుంపులు తెంపుచేసి విజృంభించి దేవతలమీద పెద్ద పెద్ద వృక్షాలనూ, రాళ్ళనూ, కొండశిఖరాలనూ కురిపించగా

**మ. గిరి పాషాణ మహీజముల్ గురియఁగా గీర్వాణు లన్నింటి ని**
**ష్ఠుర నారాచపరంపరల్ పఱపుచున్ జూర్ణంబుఁ గావింప ని**
**ర్భరలీలం దమచేయు సత్త్వములు దోర్భంగంబులై పోవఁగాఁ**
**దెరలెన్ రాక్షస యోధవీరుల మదోద్రేకంబు సంఛిన్నమై. 375**

**ప్రతి :** గిరి పాషాణ మహీజముల్= కొండలు, రాళ్ళు, చెట్లు; కురియన్+కాన్= వర్షింపగా; గీర్వాణులు= దేవతలు; అన్నింటిన్= అన్నింటినీ; నిష్ఠురనారాచపరంపరల్ పఱపుచున్= దృఢమైన బాణాలను వరుసగా ప్రయోగిస్తూ; చూర్ణంబున్+కావింపన్= నుగ్గు నుగ్గు చేయగా; నిర్భరలీలన్= దృఢమైన విధంగా; తమ చేయు సత్త్వములు= తాము ప్రయోగించే శక్తులు; దోః+భంగంబులై పోవన్+కాన్= చేతుల భంగపాటులైపోగా; రాక్షస యోధవీరుల మద+ఉద్రేకంబు= రక్కసులలోని వీరవరుల పొగరు, ఆవేశం; సంఛిన్నమై= బాగా తెగినదై; తెరలెన్= ఉబికింది.

**తా :** రాక్షసులు కొండలూ బండలూ చెట్లు తమమీద వర్షిస్తూ ఉంటే, దేవతలు కఠోరమైన బాణాలను గుంపులు గుంపులుగా ప్రయోగించి వాటిని ముక్కలు ముక్కలుగా ఖండించారు. ఈ విధంగా తమ బలప్రయోగాలన్నీ భగ్నం కాగా దానవసేనాపతులు మదోద్రేకంతో మరింత చెలరేగారు.

**క. ప్రచురముగ రాక్షసావళి, ఖచరులపై నేయు నిబిడకాండావళి దు**
**ర్వచనుఁ డెడ నాడు మాటలు, సుచరిత్రుని యందుఁ బోలెఁ జొరవయ్యె నృపా! 376**

**ప్రతి :** నృపా! = రాజా!; ప్రచురముగన్= ఎక్కువగా; రాక్షస+ఆవళి= రక్కసులగుంపు; ఖచరులపైన్= దేవతలమీద; ఏయు నిబిడకాండ+ఆవళి= వేసే దట్టమైన బాణసమూహం; దుర్వచనుఁడు= చెడ్డగా మాట్లాడేవాడు; ఎడన్+ఆడు మాటలు= దూషణలు; సుచరిత్రుని యందున్+పోలెన్= సజ్జనునియందువలె; చొరవు+అయ్యెన్= ప్రవేశింపజాలనివయ్యాయి.

**తా :** సురసైన్యాల మీద అసురవీరులు ఎడతెరిపి లేకుండా శరపరంపరలు కురిపించారు. ఐతే సజ్జనుల విషయంలో దుర్జనుల దూషణలు లాగా రాక్షసుల బాణాలు దేవతలను స్పృశింపలేక వృథా అయిపోయాయి.

**వ. అప్పుడు. 377**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయాన...

**వనమయూరము.**

**అంత సురలేయు నిబిడాస్త్రములపాలై, పంతములు దక్కి హతపౌరుషముతో ని**
**శ్చింతగతి రక్కసులు సిగ్గుడిగి భూమిం, గంతుగొని పాఱి రపకారపరు లార్వన్. 378**

**ప్రతి :** అంతన్= తరువాత; రక్కసులు= రాక్షసులు; సురలు+ఏయు= దేవతలు వేసే; నిబిడ+అస్త్రములపాలై= దట్టమైన బాణాల వశమై; పంతములు+తక్కి= పట్టింపులు మాని; హత పౌరుషముతోన్= పోయిన పౌరుషంతో; నిశ్చింతగతిన్= చింతలేని విధంగా; సిగ్గు+ఉడిగి= సిగ్గుమాలి; భూమిన్= నేలపై; గంతుగొని= ఎగిరిపడి; అపకారపరులు= కీడు చేయటంలో ఆసక్తులైనవారు; ఆర్వన్= దేవతలు అరువగా; పాఱిరి= పారిపోయారు.

**తా :** రక్కసులు శక్తు లుడిగి, సిగ్గుమాలి, దేవతల శస్త్రాస్త్రాలకు తాళలేక, వెనుకటి పంతాలు మాని దేవతలు అరుస్తూ ఉండగా ఎగిరెగిరి పారిపోయారు.

**విశే :** ఇది వనమయూరం అనే ఛందోభేదం. ప్రతిపాదంలో భ, జ, స, న, గ – అనే గణాలు ఉంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాస నియమం ఉంది.

**క. కొండలఁ బోలెదు రక్కసు, లొండొరులం గడవఁ బాఱి రుక్కఱి పటు కో**
**దండముఖ సాధనంబులు, భండనమున వైచి దివిజపతు లార్వంగన్. 379**

**ప్రతి :** కొండలన్+పోలెదు రక్కసులు= కొండలను పోలి ఉన్న రాక్షసులు; ఉక్కు+అఱి= శక్తి నశించి; పటు కోదండముఖ సాధనంబులు= గట్టి ధనుస్సులు మొదలయిన ఆయుధాలు; భండనమునన్ వైచి= యుద్ధంలో వదలి; దివిజపతులు+ఆర్వంగన్= దేవతల నాయకులు అరుస్తూ ఉండగా; ఒండు+ఒరులన్+కడవన్= ఒకరినొకరు దాటుకుంటూ; పాఱిరి= పరుగెత్తారు.

**తా :** కొండలవంటి పెద్ద దేహాలు గల రక్కసులు శక్తి నశించి, తమ ధనుస్సులు మొదలయిన ఆయుధాలనన్నింటినీ యుద్ధరంగంలో దిగవిడిచి, ఒకరినొకరు దాటుకుంటూ పారిపోయారు. అది చూచి దేవతలు జయజయధ్వానాలు చేశారు.

**వ. ఇట్లు సమరతలంబు వాసి తన ప్రాపు మాసి, తీసి పఱచుచుండు దండనాయకులం జూచి, యకుటిలమతిం బకబక నగి, వృత్రాసురుం డిట్లనియె. 380**

**ప్రతి :** ఇట్లు; సమరతలంబున్+పాసి= యుద్ధభూమిని విడిచి; తన ప్రాపుమాసి, తీసి= తన ఆధారాన్ని (తాను వారికి ఆధారమై ఉండటాన్ని) భంగపరచి; పఱచుచున్ ఉండు= పరుగెత్తుతున్న; దండనాయకులన్+చూచి= సేనాధిపతులను చూచి; అకుటిలమతిన్= సహజమైన బుద్ధితో; పక పక; నగి= నవ్వి; వృత్ర+అసురుండు= వృత్ర రాక్షసుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా తన బలాన్ని శంకించినట్లు యుద్ధరంగం నుండి పారిపోయే సేనానులతో పకపక నవ్వుతూ వృత్రుడు ఇలా అన్నాడు.

**ఉ. క్షుల్లకవృత్తి మీ కగునె? శూరుల కిమ్మెయి కీర్తి భోగముల్**
**గిల్లగఁ జేయు చావు మదిఁ గోరినవారల కైనఁ గల్గునే?**
**తల్లడ మంది యీ సమరధర్మము మాని తలంగఁ బాడియే?**
**మల్లుఁడు దుర్దమ ప్రథనమత్తుని వృత్రుని ప్రాపెఱుంగరే? 381**

**ప్రతి :** క్షుల్లకవృత్తి= నీచ వ్యవహారం; మీకు; అగునె?= తగునా?; శూరులకున్= వీరులకు; ఈ+మెయిన్= ఈ విధంగా; కీర్తిభోగముల్= యశస్సు, వైభవాలను; గిల్లగన్+చేయు చావు= త్రుంచివేసే చావు; మదిన్= మనస్సులో; కోరినవారలకైనన్= కోరుకొన్న వారికైనా; కల్గునే!= కలుగుతుందా?; తల్లడము+అంది= భయం పొంది; ఈ సమరధర్మము మాని= ఈ యుద్ధనీతిని విడిచి; తలంగన్+పాడియే!= తొలగిపోవడం న్యాయమా?; మల్లుఁడు= మల్లయోధుడూ; దుర్దమ ప్రథన

మత్తుని= యుద్ధంలో మదమెక్కి అణచడానికి వీలుగానివాడూ అయిన; వృత్రుని ప్రాపు+ఎఱుంగరే!= వృత్రాసురుని అండ మీకున్నదని ఎరుగరా?

**తా :** ఈ నీచ ప్రవృత్తి మీవంటి యోధులకు తగునా? కీర్తిని, సంపదలను కలిగించే శూరునికి యుద్ధమరణం కోరినా కలుగుతుందా? ఈ విధంగా భయపడి యుద్ధధర్మం మాని తొలగిపోవడం న్యాయమా? అయినా మహామల్లయోధుడైన వృత్రుని అండను మీరు ఎరుగరా? నేనుండగా మీకు చావెక్కడిది.

**క. చావు ధ్రువమైన ప్రాణికిఁ, జావులు రెం డరసికొనుఁడు సమరమునందున్**
**భావింప యోగమందును, జావంగా లేని చెడుగుచావుం జావే? 382**

**ప్రతి :** ప్రాణికిన్= జీవునికి; చావు ధ్రువము= మరణం సత్యం; ఐనన్= అయితే; చావులు; రెండు; భావింపన్= ఆలోచింపగా; అరసికొనుఁడు= తెలుసుకోండి; సమరమునందున్= యుద్ధంలో; యోగమందునున్= యోగమార్గంలోనూ; చావంగా లేని= చావజాలని; చెడుగుచావును= చెడ్డచావుకూడా; చావే?= మరణమా?

**తా :** జీవికి చావు నిత్యసత్యం, తప్పించుకోలేనిది. అయినపుడు లోకాన రెండు చావులు శ్రేష్ఠాలు. ఒకటి యుద్ధరంగాన పోరి చావడం, రెండు యోగమార్గాన కోరి కావలసినపుడు చావడం. ఈ రెండువిధాలుకాని చావు చావుగాదు. వ్యర్థం.

**వ. అని వాసుదేవ తేజోవిశేషవిశేషితులై దావానలకీలలంబోలె వెలుంగుచు వెఱచి వెన్నిచ్చి పాఱెడు నసురుల వెనుకొని తఱుము సురవీరులం జూచి హుంకరించి, స్వర్గానుభవంబున నిచ్ఛలేకుండె నేని మదవలోకన స్పర్శనమాత్రంబు ముందర నిలుతురుగాక అని యేచి కల్పాంతానల్ప ఘనఘనాటోపంబునుం బోలెఁ గఠోర కంఠ హుంకార తర్జనంబులం గర్జిల్లుచుఁ, బ్రళయకాల పవనపరిభాసిత మహాశిఖి శిఖావళులం దృణీకరించు కుటిలావలోకనంబుల నాలోకించుచుం, గాల పరిపక్వ లీలాలోలుండైన శూలిపోలిక నాభీలమూర్తియై సకల జీవభార భరణ దుర్భర భగ్న బ్రహ్మాండ భాండ మహాధ్వానంబు భంగి నాస్ఫోటించిన. 383**

**ప్రతి :** అని; వాసుదేవ తేజోవిశేష విశేషితులై= కృష్ణుని విశిష్టకాంతితో వెలుగుచున్నవారై; దావ+అనల కీలలంబోలెన్= అడవులను దహించే అగ్నిజ్వాలలవలె; వెలుగుంచున్= ప్రకాశిస్తూ; వెఱచి= భయపడి; వెన్ను+ఇచ్చిపాఱెడు= వెనుకకు తిరిగి పరుగెత్తే; అసురులన్+వెనుకొని= రాక్షసులను వెంబడించి; తఱుము సురవీరులన్+చూచి= పరుగెత్తించు దేవయోధులను చూచి; హుంకరించి= 'హుం' అని శబ్దంచేసి; స్వర్గ+అనుభవంబునన్+ఇచ్ఛ లేకుండెన్+ఏని= స్వర్గసుఖాల అనుభవంలో కోర్కె లేకపోయినట్లయితే; మత్+అవలోకన స్పర్శనమాత్రంబు= నన్ను చూడడం, తాకడం మాత్రానికై (క్షణకాలం); నిలుతురుగాక!= నిలిచి ఉంటారు గాక!; అని; ఏచి= ఎగసి; కల్ప+అంత+అనల్ప ఘనాఘన+ఆటోపంబునున్+పోలెన్= యుగాంతంలో గొప్ప మేఘపు ఆడంబరాన్ని పోలిన; కఠోరకంఠహుంకారతర్జనంబులన్= గొంతునుండి వెడలే కఠినమైన హుంకారంతోకూడిన బెదిరింపులతో; గర్జిల్లుచున్= అరుస్తూ; ప్రళయకాల, పవన పరిభాసిత, మహాశిఖి, శిఖా+ఆవళులన్= యుగాంతపు గాలితో రగుల్కొనే గొప్ప నిప్పుజ్వాలల వరుసలను; తృణీకరించు= తిరస్కరించే; కుటిల+ అవలోకనంబులన్= వంకర చూపులతో; ఆలోకించుచున్= చూస్తూ; కాలపరిపక్వ, లీలాలోలుండైన= కాలం పరిపాకం పొందినప్పటి (చంపుట అనే) క్రీడలో ఆసక్తుడైన; శూలి పోలికన్= శివునివలె; ఆభీలమూర్తియై= భయంకరాకారుడై; సకల= ఎల్ల; జీవభారభరణ=

జీవుల బరువు మోయటంవలన; దుర్భర= భరింపరాని; భగ్న, బ్రహ్మాండ, భాండ, మహాధ్వానంబు భంగిన్= పగిలిన బ్రహ్మాండం అనే కుండయొక్క గొప్ప ధ్వనివలె; ఆస్ఫోటించినన్= గొప్పశబ్దం చేయగా...

**తా :** ఈ విధంగా వాసుదేవుని తేజోవిశేషంవల్ల దావాగ్ని జ్వాలలవలె వెలుగుతూ అసుర సైనికుల వెంటబడి తరుముతున్న అమరవీరులను చూసి వృత్రాసురుడు అహంకారంతో హుంకారం చేసి ఇలా అన్నాడు. "ఓరీ! మీకు నాలుగు కాలాలపాటు స్వర్గంలో సుఖంగా జీవించాలని కోరిక లేకపోతే రండి. నా ముందుకు వచ్చి నిలబడండి. నన్ను ఎదుర్కొనండి" అంటూ ఆ దానవవీరుడు కల్పాంత కాలమేఘం లాగా గంభీర కంఠస్వరంతో కఠోరంగా గర్జించాడు. ప్రళయకాల ప్రభంజనంవల్ల భగభగ మండే అగ్నికీలలను తృణీకరించే కుటిల వీక్షణాలు ప్రసరింపజేస్తూ లయకాల మహారుద్రునివలె రౌద్రాకారం ధరించి మహోద్రేకంతో బ్రహ్మాండభాండం బద్దలయ్యేటట్లు పెద్ద శబ్దం చేయగా

**ఉ. కూడె జగంబు లన్నియును గ్రుంకిరి సూర్య సుధాంశు; లద్రు లూ**
**టాడె, నభస్స్థలం బగిలె, నంబుధు లింకె, నుడుగ్రహాళి ప**
**ట్టూడె, వడిం దిశల్పగిలె, నుర్వర గ్రుంగె, నజాండభాండ మ**
**ల్లాడె, విధాత బెగ్గడిలె నార్చుచు వృత్రుఁడు బొబ్బవెట్టినన్. 384**

**ప్రతి :** వృత్రుడు= వృత్రాసురుడు; ఆర్చుచున్= అరుస్తూ; బొబ్బ+పెట్టినన్= కేక వేయగా; జగంబులు+అన్నియును= అన్ని లోకాలూ; కూడెన్= దగ్గరయ్యాయి; సూర్యసుధా+అంశులు= సూర్యచంద్రులు; క్రుంకిరి= అస్తమించారు; అద్రులు= కొండలు; ఊటు+ఆడెన్= కదిలిపోయాయి; నభస్+స్థలంబు= ఆకాశ ప్రదేశం; అగిలెన్= పగిలింది; అంబుధులు= సముద్రాలు; ఇంకెన్= ఎండిపోయాయి; ఉడుగ్రహ+ఆళి= నక్షత్రాల, గ్రహాల సమూహం; పట్టు+ఊడెన్= పట్టుతప్పాయి; వడిన్= వేగంగా; దిశల్+పగిలెన్= దిక్కులు పగిలాయి; ఉర్వర= భూమి; క్రుంగెన్= కుంగిపోయింది; అజ+అండభాండము= బ్రహ్మాండం అనే కుండ; అల్లాడెన్= కదలాడింది; విధాత= బ్రహ్మ; బెగ్గడిలెన్= భయపడ్డాడు.

**తా :** వృత్రుని అరుపుకు అన్ని లోకాలూ ఒక్కటయ్యాయి, సూర్యచంద్రులు అస్తమించారు. కొండలు కదలాడాయి. ఆకాశం బద్దలయింది. సముద్రాలు ఇంకిపోయాయి. నక్షత్రాలు, గ్రహాలు తమ తమ స్థానాలు తప్పిపోయాయి. దిక్కులు పగిలాయి, భూమి కుంగింది. బ్రహ్మాండం ఒక కుండవలె అల్లాడింది. బ్రహ్మదేవుడు భయపడ్డాడు.

**లయగ్రాహి.**

**కూలిరి వియచ్చరులు, సోలిరి దిశాధిపులు, వ్రాలి రమరవ్రజము, దూలి రురగేంద్రుల్,**
**ప్రేలిరి మరుద్గణము, జాలిగొని రశ్వినులు, కాలుడిగి రుద్రు లవలీలఁ బడి రార్తిన్**
**వ్రేలిరి దినేశ్వరులు, కీ లెడలి నట్లు సుర, జాలములు పెన్నిదుర పాలగుచు ధారా**
**భీల గతితోడఁ దమ కేలిధనువు ల్విడిచి, నేలఁబడి మూర్ఛలను దేలిరి మహాత్మా! 385**

**ప్రతి :** మహా+ఆత్మా!= గొప్ప మనస్సుగల ఓ రాజా!; వియత్+చరులు= ఖేచరులనే దేవతలు; కూలిరి= పడిపోయారు; దిశా+అధిపులు= దిక్పతులు; సోలిరి= అలసిపోయారు; అమరవ్రజము= సురల సమూహం; వ్రాలిరి= పడిపోయారు; ఉరగ+ఇంద్రుల్= సర్పరాజులు; తూలిరి= చలించారు; మరుత్+గణము= 'మరుత్తులు' (గాలులు) అనే దేవజాతి జనులు; ప్రేలిరి= పగిలిపోయారు; అశ్వినులు= అశ్వినీ దేవతలు; జాలిన్+కొనిరి= దైన్యం పొందారు; రుద్రులు= ఆ పేరుగల

దేవయోధులు; కాలు+ఉడిగి= కాళ్ళురాక (పరుగెత్తడానికి); అవలీలన్= సులభంగా; ఆర్తిన్+పడిరి= బాధ పొందారు; దిన+ఈశ్వరులు= సూర్యచంద్రులు; వ్రేలిరి= (తమ స్థానాలు వదలి) వ్రేలాడారు; కీలు+ఎడలినట్లు= కీళ్ళు ఊడిపోయినట్లుగా; సురజాలములు= దేవతల సమూహాలు; పెను+నిదురపాలు+అగుచున్= పెద్ద నిద్రకు వశమై; ధారా+ఆభీలగతితోడన్= వరుసగా భయంకర రీతిలో; తమకేలి ధనువుల్ విడిచి= తమ చేతి ధనుస్సులు వదలి; నేలన్+పడి= నేలమీదపడి; మూర్ఛలన్+తేలిరి= మూర్ఛపోయారు.

**తా :** రాజా! వృత్రాసురుని బొబ్బకు ఖేచరులు పడిపోయారు. దిక్పాలకులు ఒరిగిపోయారు. దేవతలు కిందపడిపోయారు. సర్పరాజులు తూలిపోయారు, మరుత్తులు అనే దేవగణం ఛిన్నాభిన్నమైంది. అశ్వినులు దీనులైపోయారు. రుద్రులు చేష్టలుడిగి బాధపడ్డారు. సూర్యచంద్రులు స్థానాలు తప్పారు. తమ కీళ్ళు ఊడినట్లు దేవతల సమూహాలు తమ చేతి ధనుస్సులు నేలకు విడిచి, వాటితోపాటు తామూ కిందపడి మూర్ఛపోయారు.

**వ. ఇట్లు కఠోర కంఠనాదం బొనర్చిన నశనిపాతంబునం గూలు ప్రాణిచయంబు భంగి నంగంబు లెఱుంగక రణరంగంబునం బడి మూర్ఛిల్లిన, దివిజరాజసైన్యంబుల వృత్రాసురుండు సంగరరంగ దుర్దముండై మహీవలయంబు పదాహతంబుల గజగజ వడంక, నిశితశూలంబు కేల నంకింపుచు, మదించిన భద్రమాతంగంబు కమలవనంబు సొచ్చి, మట్టిమల్లాడు విధంబున నిమీలితాక్షుండగుచుఁ, బదతలంబుల రూపంబులు మాయం జమురుచు, వెక్కసంబుగఁ గ్రీడించు వానింగని వజ్రి వజ్రశతోపమ నిష్ఠురగదాదండం బాభీలభంగిఁ బ్రళయకాలమార్తాండ చండపరివేషఘోరంబుగాఁ ద్రిప్పి వైచిన. 386**

**ప్రతి :** ఇట్లు; కఠోరకంఠనాదంబు+ఒనర్చినన్= గొంతుతో గట్టిగా కేక వేయగా; అశనిపాతంబునన్= పిడుగుపాటునకు; కూలు= పడిపోయే; ప్రాణిచయంబు భంగిన్= జీవులసమూహంవలె; అంగంబులు+ఎఱుంగక= ఒడళ్ళు మరచి; రణరంగంబునన్+ పడి= యుద్ధభూమిలోపడి; మూర్ఛిల్లినన్= మూర్ఛపడగా; దివిజరాజ సైన్యంబులన్= ఇంద్రుని సేనలను; వృత్ర+అసురుండు; సంగరరంగదుర్దముండై= యుద్ధభూమిలో ఎదురు లేనివాడై; మహీవలయంబు= భూభూమండలం; పద+ ఆహతంబులన్= కాలిదెబ్బలతో; గజగజవడంకన్= గజగజ వణకగా; నిశితశూలంబు= వాడిశూలం; కేలన్+అంకింపుచున్= చేత ధరిస్తూ; మదించిన; భద్రమాతంగంబు= రాజరికపుటేనుగు; కమలవనంబు+చొచ్చి= తామరకొలను ప్రవేశించి; మట్టిమల్లాడు విధంబునన్= స్వేచ్ఛగా క్రీడించే విధంగా; నిమీలిత+అక్షుండు+అగుచున్= మూసుకొన్న కన్నులు గలవాడై; పదతలంబులన్= కాలి అడుగుభాగాలతో; రూపంబులు మాయన్= ఆకారాలు నశించేటట్లుగా; చమురుచున్= కొడుతూ; వెక్కసంబుగన్= అధికంగా; క్రీడించువానిన్= సమరకేళిని సాగించేవాణ్ణి; కని= చూచి; వజ్రి= ఇంద్రుడు; వజ్రశత+ఉపమనిష్ఠుర గదాదండంబు= నూరు వజ్రాలతో సమానమైన గట్టి గదను; ఆభీలభంగిన్= భయంకరమైన రీతిలో; ప్రళయకాలమార్తాండచండపరివేషఘోరంబుగాన్= యుగాంతపు సూర్యుని చుట్టూ కనిపించే వెలుగువలె దారుణంగా; త్రిప్పివైచినన్= తిప్పి ప్రయోగింపగా...

**తా :** రక్కసుని ఆ కేకకు, పిడుగు పడినపుడు జీవులు కిందబడినట్లుగా దేవతలు తమ ఒడలు మరచి యుద్ధరంగాన పడి మూర్ఛపోయారు. అపుడు ఆ కఠినుడు తన కాలి తన్నులతో భూమండలాన్ని వణికింపజేస్తూ, వాడి శూలమొకటి చేతబూని, మదించిన రాచ ఏనుగు తామరకొలనులో ప్రవేశించి దానిని అతలాకుతలం చేసినట్లు కళ్ళు మూసికొని, కాళ్ళతో దేవతల ఆకారాలు నశించేట్లు తన్నుతూ, స్వేచ్ఛగా యుద్ధక్రీడ సాగించాడు. ఆ రాక్షసునిజూచి ఇంద్రుడు వజ్రశత సమానమైన గొప్ప గదను, యుగాంతాన సూర్యుని చుట్టూ కనిపించే వెలుగువలె గిరగిర తిప్పి అతనిపై వేయగా

**మ. అది మింటం బెనుమంట లంటఁ బఱపై యాభీల వేగంబునన్**
**గదియన్ వచ్చిన లీల వామకరసంక్రాంతంబు గావించె బె**
**ట్టిదుఁడై చేరి సురారి దానిఁ గొని కాఠిన్యోరుపాతంబులం**
**జదియన్ మోఁదె గజేంద్రమస్తకము నుత్సాహైకసాహాయ్యుఁడై. 387**

**ప్రతి :** అది= ఆ గద; మింటన్= ఆకసాన; పెనుమంటలు+అంటన్= పెద్దమంటలు వ్యాపింపజేయగా; పఱపు+ఐ= విశాలమై; ఆభీలవేగంబునన్= భయంకరమైన వేగంతో; కదియన్ వచ్చినన్= దగ్గరకు రాగా; లీలన్= అవలీలగా; సుర+అరి= రాక్షసుడు; బెట్టిదుఁడై= కఠినుడై; చేరి= సమీపించి; వామకర సంక్రాంతంబున్= ఎడమచేతికి చిక్కిన దానిని; కావించెన్= చేశాడు; దానిన్= ఆ గదను; కొని= తీసికొని; కాఠిన్య+ఉరుపాతంబులన్= గట్టిదనపు గొప్ప దెబ్బలతో; ఉత్సాహ+ ఏకసాహాయ్యుఁడై= ఉత్సాహమొకటే సహాయంగా గలవాడై; గజ+ఇంద్ర మస్తకమున్= ఐరావతపు తలను; చదియన్ మోఁదెన్= నలిగేటట్లు కొట్టాడు.

**తా :** ఇంద్రుని గద గగనమండలం నిండా పెనుమంటలు కక్కుతూ మహావేగంతో వచ్చి దనుజేంద్రుణ్ణి తాకింది. వృత్రాసురుడు ఆ గదాదండాన్ని ఎడమచేతితో అవలీలగా పట్టుకొని ఇంద్రుని వాహనమైన ఐరావతం కుంభస్థలం మీద గట్టిగా ఒక్క పెట్టు పెట్టాడు.

**ఆ. అగ్గజంబు కులిశహతిఁ గూలు కులమహీ, ధ్రంబు వోలె రక్తధార లురల**
**మస్తకంబు పగిలి మదమఱి జిర జిర, తిరిగి విఱుగు సూపి తెరలి పఱచె. 388**

**ప్రతి :** ఆ+గజంబు= ఆ ఏనుగు; కులిశహతిన్= వజ్రాయుధపు దెబ్బకు; కూలు= పడే; కులమహీధ్రంబు+పోలెన్= గోత్ర పర్వతంవలె; రక్తధారలు= నెత్తుటి చారలు; ఉరలన్= ఉబికి రాగా; మస్తకంబు పగిలి= తలచిట్లి; మదము+అఱి= పొగరు నశించి; జిర జిర తిరిగి; విఱుగు+చూపి= (ఓటమి) విరుగుట చూపి; తెరలి= ఎగసి; పఱచెన్= పరుగెత్తింది.

**తా :** రక్కసుని కఠోర ఘాతానికి, ఆ ఐరావతం గిర గిర తిరిగి, నెత్తురులు కారగా, తల పగిలి ఓటమిని ఒప్పుకున్నట్లుగా ఎగురుకుంటూ పరుగుపెట్టింది.

**ఉత్సాహవృత్తము.**

**గజము దెరలి దాని కొఱలి గర్జ లిడుచుఁ బాఱఁగా**
**భజన నింద్రుఁ డంకుశమునఁ బట్టి బిట్టు నిల్పుచున్**
**నిజసుధారసైకపాన నిర్ణయార్ద్ర కరమునన్**
**ఋజుత మీఱ నిమిరె నపుడు రీతి మెఱసి క్రమ్మఱన్. 389**

**ప్రతి :** గజము= ఏనుగు; తెరలి= ఎగసి; దానికిన్+ఒఱలి= ఆ దెబ్బకు దొర్లుతూ; గర్జలు+ఇడుచున్= గర్జిస్తూ; పాఱఁ గాన్= పరువెత్తగా; ఇంద్రుడు; భజనన్= సేవాభావంతో; అంకుశమునన్+పట్టి= అంకుశంతో ఆపి; బిట్టు నిల్పుచున్= గట్టిగా ఆపుతూ; నిజ సుధారస+ఏకపాన నిర్ణయ+ఆర్ద్రకరమునన్= అమృతరసాన్ని ఆస్వాదించే తన తడిసిన చేతితో; ఋజుత మీరన్= సూటితనం అతిశయించగా; రీతిన్= పద్ధతితో; మెఱసి= వెలుగుతూ; క్రమ్మఱన్= మరల; అపుడు; నిమిఱెన్= ప్రేమతో నిమిరాడు.

**తా :** రక్కసుని దెబ్బతో పారిపోతున్న ఐరావతాన్ని ఇంద్రుడు తన అంకుశంతో అదిలించి నిలిపి, అమృతరసాన్ని ఆస్వాదించే తన చల్లని హస్తంతో మెల్లగా నిమిరాడు.

**విశే :** ఇది ఉత్సాహవృత్తం. ప్రతి పాదంలోనూ వరుసగా ఏడు సూర్యగణాలు. ఆపై ఒక గురువు ఉంటాయి. ఐదవ గణం మొదటి అక్షరం యతి స్థానం. ప్రాసనియమం ఉంది.

**వ. ఇ వ్విధంబున నైరావతంబును సేదదేర్చుచు, నెదుర నిలుచున్న భిదుర పాణింగని, తోఁబుట్టువుం జంపిన తెంపు దలంచి, మోహశోకంబున విపర్యాసంబుగా నవ్వుచు నాహవకామ్యార్థియై వృత్రుం డిట్లనియె. 390**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ రీతిగా, ఐరావతంబును; సేదదేర్చుచున్= ఓదారుస్తూ; ఎదురన్ నిలుచున్న= ఎదుట నిలిచి ఉన్న; భిదురపాణిన్+కని= ఇంద్రుణ్ణి చూసి; తోన్+పుట్టువున్= తోబుట్టువును; చంపిన; తెంపు తలంచి= తెగింపును గుర్తుకు దెచ్చుకొని; మోహశోకంబునన్= మోహం వల్ల కలిగిన శోకంతో; విపర్యాసంగా= తారుమారుగా; నవ్వుచున్= నవ్వుతూ; ఆహవకామ్య+అర్థియై= యుద్ధం కావాలనే కోరికతో; వృత్రుండు+ఇట్లు+అనియెన్= వృత్రాసురుడు ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా ఐరావతాన్ని ఓదారుస్తూ తన ఎదుట నిలబడి ఉన్న ఇంద్రుణ్ణి చూసి, తన సహోదరుణ్ణి చంపిన తెగువను స్మరించి, మోహం శోకం రెండూ ఏకకాలాన కలగడంతో తారుమారై, తబ్బిబ్బుతో నవ్వుతూ, తాను యుద్ధం కోసమే వచ్చినట్లు తేటపరుస్తూ వృత్రుడిలా అన్నాడు.

**శా. నాకుం బెద్దయు నీకు సద్గురువు దీనవ్రాతరక్షున్ శుభా**
**లోకుం జంపితి విట్లు పాపమతివై లోభంబుతో ని య్యెడన్**
**లోకుల్ నవ్వఁగ మద్భుజాపటిమకున్ లోనైతి వీ శూలమం**
**దాకంపింపఁగ నిన్నుఁగ్రుచ్చి ఋణముక్తాత్ముండనై పేర్చెదన్. 391**

**ప్రతి :** నాకున్+పెద్దయున్= నాకు అన్న; నీకు సద్గురువు= నీకు మంచి గురువు; దీన వ్రాత రక్షున్= దీనుల గుంపులకు బాసటైనవాణ్ణి; శుభ+ఆలోకున్= మంగళకరమైన చూపులు గలవాణ్ణి; ఇట్లు; పాపమతివై= పాపపు బుద్ధి కలిగి; లోభంబుతోన్= పేరాసతో; చంపితివి; ఈ+ఎడన్= ఇక్కడ; లోకుల్ నవ్వఁగన్= లోకులు పరిహసింపగా; మత్+ భుజాపటిమకున్= నా బాహుబల సామర్థ్యానికి; లోను+ఐతివి= చిక్కావు; ఈ శూలమందున్= ఈ నా చేతిశూలంతో; ఆకంపింపన్+కన్= దడ దడ కొట్టుకొంటున్న; నిన్నున్+క్రుచ్చి= నిన్ను గుచ్చి; ఋణముక్త+ఆత్ముండను+ఐ= అప్పు తీర్చిన మనస్సు గలవాడనై; పేర్చెదన్= పెంపు వహిస్తాను.

**తా :** నీకు సద్గురువు, నాకు అన్న, దీనులకు ప్రాపు, అయిన అందరికీ మేలుకూర్చే చల్లనిచూపు గలవాణ్ణి; పాపబుద్ధితో, పేరాసతో చంపావు. ఇపుడు ఇక్కడ లోకులందరూ చూచినవ్వగా, నా భుజబలానికి చిక్కి ఉన్నావు. నిన్ను ఈ శూలంతో దడ దడ కొట్టుకొంటున్న నిన్ను గుచ్చి కడదేర్చి, నేను మా అన్నగారి ఋణం తీర్చుకొని ఆనందిస్తాను.

**క. ఎట్టి తులు వైనఁ గానీ, నెట్టనఁ దన బ్రతుకు కొఱకు నీవలె గురువుం**
**జుట్టమునుఁ బుణ్యు బ్రాహ్మణుఁ, బట్టి వధింపంగఁ గలఁడె? పశువుంబోలెన్. 392**

**ప్రతి :** ఎట్టి తులువ+ఐనన్= ఎలాంటి నీచుడైనా; కానీ= కానిమ్ము; నెట్టనన్= నిండుగా; తన బ్రతుకు కొఱకున్= తాను జీవించడంకోసం; నీవలెన్= నీలాగా; గురువున్= గురువును; చుట్టమునున్= బంధువును; పుణ్యున్= పుణ్యమూర్తిని; బ్రాహ్మణున్= బ్రహ్మకులంలో పుట్టినవాణ్ణి; పశువున్+పోలెన్= జంతువును వలె; పట్టి= బంధించి; వధింపన్+కలండె= చంపగలడా?

**తా :** లోకాన ఎంత నీచుడైనా తన బ్రతుకుకోసం, తనకు బంధువు, గురువు మీదు మిక్కిలి పుణ్యమూర్తి, బ్రహ్మవంశాన పుట్టినవాడూ అయినవానిని పశువును చంపినట్లు నీవలె చంపగలడా?

**చ. దయయును సత్యమున్ విడిచి ధర్మము మాని యశంబుఁ బాసి శ్రీ**
**జయములఁ బాఱఁదోలి పురుషత్వము గానక లోకనిందితా**
**హ్వాయుఁ డగువాని చావునకు నార్యులు గుందుదురే? సృగాలముల్**
**ప్రియమున నంటునే శవముఁ? బ్రేలక చేరునె? కంక గృధ్రముల్. 393**

**ప్రతి :** దయయును= జాలీ; సత్యమున్= నిజమూ; విడిచి= వదిలిపెట్టి; ధర్మము; మాని= వీడి; యశంబున్+పాసి= కీర్తిని విడిచి; శ్రీ జయములన్= సంపదను, విజయాన్నీ; పాఱన్+తోలి= దూరంగా నెట్టివేసి; పురుషత్వము= పౌరుషం; కానక= చూడక; లోకనిందిత+ఆహ్వాయుఁడు+అగువాని= లోకులచే నిందింపబడిన పేరు గలవానియొక్క; చావునకున్= మరణానికి; ఆర్యులు= పెద్దవారు; కుందుదురే= దుఃఖిస్తారా?; శవమున్= (అతని) ప్రాణం లేని దేహాన్ని; సృగాలముల్= నక్కలు; ప్రియమునన్= ఇష్టంగా; అంటునే= ముట్టుకుంటాయా?; కంక గృధ్రముల్= రాబందులు, గద్దలు; ప్రేలక చేరునా?= అరవకుండా సమీపిస్తాయా?

**తా :** ఓరీ! ఇంద్రా! దయాదాక్షిణ్యాలు కోల్పోయి, సత్యాన్ని పరిత్యజించి, ధర్మాన్ని విడిచి, కీర్తిని పోగొట్టుకొని, సిరిసంపదలను దూరం చేసుకొని పౌరుషాన్ని పారదోలి, పదిమందీ చీవాట్లు పెట్టే పాడు పని చేశావు. ఇటువంటి నీచుడవయిన నీ చావుకు సజ్జనులైన వారెవ్వరూ బాధపడరు. నిర్భాగ్యుడవైన నీ మృతకళేబరాన్ని నక్కలు కూడా ముట్టుకోవు. రాబందులు, గద్దలు సైతం అంటుకోవు.

**క. నిక్కమగు పాపములచేఁ, జిక్కితివి నిశాత శూల శిఖరాగ్రమునన్**
**ద్రక్కించి నీదు మాంసము, నక్కలుఁ గుక్కలును జేరి నమలఁగఁ జేతున్. 394**

**ప్రతి :** నిక్కమగు= నిజమైన; పాపములచేన్= పాపాలచేత; చిక్కితివి= దొరికినావు; నిశాత శూల శిఖర+అగ్రమునన్= వాడి శూలపుమొనతో; ద్రక్కించి= చంపి; నీదు మాంసమున్= నీ మాంసాన్ని; నక్కలున్ కుక్కలును= నక్కలు కుక్కలు; చేరి= సమీపించి; నమలఁగన్= నమిలేటట్లు; చేతున్= చేస్తాను.

**తా :** నిజమైన పాపాలతో నా పాలబడినావు. నిన్నిపుడు నా ఈ వాడి శూలపు మొనకు గుచ్చి చంపి, నీ మాంసాన్ని నక్కలు, కుక్కలు తినేటట్లు చేస్తాను.

**ఉ. దీకొని నీకు నేఁ డిచట దిక్కని వచ్చిన వారు గల్గిరే**
**నేకమతిం బిశాచముల కెల్లను దృప్తిగ మన్నిశాత శూ**

**లైక మహాగ్నికీలల ననేకవిధంబుల సోమయాజి నై**
**మేకలఁ జేసి వేల్చెద నమేయమదోద్ధతి వ్రాలి యియ్యనిన్.** **395**

**ప్రతి :** ఈ+అనిన్= ఈ యుద్ధంలో; నేఁడు= ఈనాడు; ఇచట= ఇక్కడ; నీకు; దీకొని= అంగీకరించి; దిక్కు+అని వచ్చినవారు= అండగా నిలవడానికి వచ్చినవారు; కల్గిరి+ఏనిన్= ఉన్నట్లయితే; ఏకమతిన్= ఏకాగ్రతతో; పిశాచములకున్+ఎల్లన్= అన్ని పిశాచాలకూ; తృప్తిగన్= తనివితీరగా; మత్+నిశాతశూల+ఏకమహా+అగ్నికీలలన్= నా వాడియైన శూలపు అగ్నిజ్వాలలకు; అనేకవిధంబులన్= నానా పద్ధతులతో; సోమయాజినై= యజ్ఞం చేయువాడనై; మేకలన్+చేసి= (వారిని) మేకలుగా చేసి; అమేయ మద+ఉద్ధతిన్= దుర్వారమైన గర్వోద్రేకంతో; వ్రాలి= పడి; వేల్చెదను= యాగం చేస్తాను.

**తా :** నీకు దిక్కున్నవా డెవడైనా ఉంటే ఇక్కడికి రమ్మను. దుర్వారమైన గర్వోద్రేకంతో కదనరంగంలో దూకి నా పదునైన శూలం అంచున భగ భగమండే అగ్విజ్వాలలో సోమయాజి మేకలను వేల్చినట్లు నిన్ను వేల్చి పిశాచాల కన్నింటికీ తృప్తిగా విందు చేస్తాను.

**క.** **కాక ననుఁ గులిశధారల, దీకొని నిర్జింపఁ గలిగి తేనియు భూతో**
**ద్రేకంబు సేసి శూరుల, ప్రాకట పదపద్మధూళి భాగం బగుదున్.** **396**

**ప్రతి :** కాక= అలా కాకుండా; ననున్= నన్ను; కులిశధారలన్= వజ్రాయుధపు అంచులతో; దీకొని= ఎదిరించి; నిర్జింపన్+కలిగితి+ఏనియున్= జయింపగలిగినట్లయితే; భూత+ఉద్రేకంబు+చేసి= భూతాలకు ఆవేశం కలిగించి, శూరుల ప్రాకట పదపద్మ ధూళి భాగంబు+అగుదున్= ప్రసిద్ధమైన రణవీరుల పవిత్ర పాదపద్మపరాగంలో భాగం అవుతాను.

**తా :** ఒకవేళ ఎదుర నిల్చి వాడిగల వజ్రాయుధంతో నీవే నన్ను నిర్జింప గలిగినట్లయితే ఈ పంచభూతాలలో కలిసిపోయి రణవీరుల పవిత్ర పాద పద్మపరాగంలో భాగం సంపాదించుకొని కృతార్థుణ్ణి అవుతాను.

**సీ.** **సందేహ మేటికి జంభారి! వేవేగ భిదురంబు వ్రేయు మాభీలభంగి**
**నతిలోభి నడిగిన యర్థరాశియుఁబోలెఁ గడపకు మిది వృథ గాదు సుమ్ము,**
**మురమర్దనుని తేజమున నా దధీచి వీర్యాతిశయంబుల నధికమైన**
**యదిగాన హరిచే నియంత్రితోన్నతుఁడ వై గెలువుము శత్రుల గీ టడంచి**

**ఆ.** **యెందు గలఁడు విష్ణుఁ డందు జయశ్రీలు, పొందు గాఁగ వచ్చి పొందుచుండుఁ,**
**గాన భక్తవరదుఁ గమలాక్షు సర్వేశు పదములందు మనము పదిలపఱుతు.** **397**

**ప్రతి :** జంభ+అరి!= జంభాసురుని శత్రువైన ఓ దేవేంద్రా!; సందేహం; ఏటికి= ఎందుకు?; వేవేగన్= అతి తొందరగా; ఆభీలభంగిన్= భయంకర రీతితో; భిదురంబు వ్రేయుము= వజ్రాయుధం ప్రయోగించు; అతిలోభిని+అడిగిన= మిక్కిలి పిసినిగొట్టును యాచించిన; అర్థరాశియున్+పోలెన్= ధనసంచయంవలె; కడపకు= ఆలస్యంచేయకు; ఇది= ఈ వజ్రాయుధం; వృథగాదు సుమ్ము= వ్యర్థం కాదు సుమా!; మురమర్దనుని తేజమునన్= విష్ణువుయొక్క శక్తితో; ఆ దధీచివీర్య+అతిశయంబులన్= ఆ దధీచిమహర్షియొక్క శక్తివలన; అధికము+ఐన+అది= గొప్పదైనది; కానన్= కావున; హరిచేన్= విష్ణువుచేత;

నియంత్రిత+ఉన్నతుఁడవు+ఐ= ఆదేశింపబడినవాడవై; శత్రువులన్= విరోధులను; గీటు+అడంచి= మదమడచి; గెలువుము= జయించు; విష్ణువు; ఎందున్+కలఁడు= ఎక్కడున్నాడో; అందున్= అక్కడ; జయశ్రీలు= జయం, సంపదలు; పొందుగాఁ గన్= కలసి ఉంటూ; వచ్చి; పొందుచుందున్= చేరుతూ ఉంటాయి; కానన్= కాబట్టి; భక్తవరదున్= భక్తులకు వరములిచ్చేవాడు; కమల+అక్షున్= పద్మాక్షుడు; సర్వ+ఈశున్= అంతటికి ప్రభువు అయిన విష్ణువుయొక్క; పదములందున్= అడుగులందు; మనమున్= మనస్సును; పదిలపఱతున్= భద్రపరుస్తాను.

**తా :** ఇంద్రా! సందేహించక భయంకరమైన నీ చేతిలోని వజ్రాయుధాన్ని నామీద ప్రయోగించు. లోభి దానానికి ఆలసించినట్లుగా కాలయాపన చేయకు. ఆ ఆయుధం వ్యర్థంగాదు. కారణం – దానికి విష్ణుతేజస్సు, దధీచి దానవీర్యం తోడై, ప్రాభవాతిశయంతో ప్రకాశిస్తున్నది. కాబట్టి విష్ణువు ఆదేశాన్ని పాటించి శత్రువులను నశింపజేసి, గెలుపొందుము. విష్ణువు ఎక్కడుంటే అక్కడ విజయమూ, సౌభాగ్యమూ స్వయంగా వచ్చి వరిస్తాయి. కాబట్టి నన్ను కడతేరిస్తే, నేను ఆ సర్వేశ్వరుని పాదాలమీద మనస్సును లగ్నం చేస్తాను.

**వ. ఇట్లు వజ్రధారలం ద్రెంపఁబడిన విషయ భోగంబులు గల వాఁడనై శరీరంబు విడిచి, భగవ ద్ధామంబునుం బొందెద; నారాయణుని దాసుండ నైన నాకు స్వర్గమర్త్య పాతాళంబులం గల సంపద్భోగంబులు నిచ్ఛయింపఁబడవు; త్రైవర్గికాయాసరహితంబైన మహైశ్వర్యంబు ప్రసాదించుం గావున ననుపమేయం బైన భగవత్ప్రసాదం బన్యుల కగోచరంబు; అ ద్దేవుని పాదైకమూలంబుగా నుండు దాసులకు దాసానుదాసుండనై యున్నవాఁడ అని యప్పరమేశు నుద్దేశించి. 398**

**ప్రతి :** ఇట్లు; వజ్రధారలన్= వజ్రపు అంచులచే; త్రెంపన్+పడిన= ఖండింపబడిన; విషయభోగంబులు కలవాఁడనై= ఇంద్రియానందాలలో అనుభవాలు కలవాడనై; శరీరంబు విడిచి; భగవత్+ధామంబునున్+పొందెదన్= దేవుని సన్నిధికి చేరుకొంటాను; నారాయణుని దాసుండను+ఐన నాకున్= శ్రీమన్నారాయణుని సేవకుడనైన నాకు; స్వర్గమర్త్య పాతాళంబులన్+కల= దేవలోక భూలోక పాతాళ లోకాలలో ఉన్న; సంపత్+భోగంబులున్= సంపదలవలన కలిగిన అనుభవాలు; ఇచ్ఛయింపన్+పడవు= రుచించవు; త్రైవర్గిక+ఆయాసరహింబైన= ధర్మార్థ కామాల వలన శ్రమలేని; మహా+ఐశ్వర్యంబున్= గొప్ప సంపదను; ప్రసాదించున్+కావునన్= ఇస్తుంది కాబట్టి; అనుపమేయంబైన= పోల్చరాని; భగవత్ ప్రసాదంబు= దేవుని దయ; అన్యులకున్= ఇతరులకు; అగోచరంబు= కనిపించదు; ఆ+దేవుని; పాద+ఏకమూలంబుగాన్+ఉండు= ఆ దేవుని అడుగులే ప్రధాన ఆధారంగాగల; దాసులకున్= సేవకులకు; దాస+అనుదాసుండను+ఐ+ఉన్నవాఁడ= సేవకులకు సేవకుడనై ఉంటాను; అని; ఆ+పరమేశున్+ఉద్దేశించి= ఆ దేవుణ్ణి గురించి…

**తా :** “ఇప్పుడు నీ వజ్రాయుధం వేటుకు నా సంసార బంధాలన్నీ తెగిపోతాయి. పాంచభౌతికమైన ఈ శరీరాన్ని పరిత్యజించి సర్వేశ్వరుని సన్నిధికి చేరుకుంటాను. నేను నారాయణ భక్తపరాయణుడను. నాకు స్వర్గ మర్త్య పాతాళ లోకాలలో గల భోగభాగ్యాలు ఏవీ రుచించవు. ధర్మార్థ కామాల జంజాటాలు ఏమాత్రం లేని మహైశ్వర్యాన్ని ప్రసాదించే భగవంతుని అనుగ్రహం అనుపమానమైంది. అన్యులకు అగోచరమైంది. నేను ఆ దేవాదిదేవుని పాదాలు సేవించే దాసులకు దాసాను దాసుడను” అని వృత్రాసురుడు పరమేశ్వరుణ్ణి గురించి

**చ. అరయఁగ భక్తపాలనము లైన భవచ్చరితంబు లాత్మసం**
**స్మరణము సేయ వాక్కు నిను సన్నుతి సేయ శరీర మెల్లఁ గిం**
**కరపరివృత్తి సేయ మదిఁ గాంక్ష యొనర్చెదఁ గాని యొల్ల నే**
**నరిది ధ్రువోన్నతస్థలము నబ్జజుపట్టము నింద్రభోగమున్. 399**

**ప్రతి :** అరయఁగన్= పరిశీలించగా; భక్తపాలనములైన= భక్తులను పాలించేవైన; భవత్+చరితంబులు= నీ చరిత్రలు; ఆత్మన్+సంస్మరణము+చేయన్= మనస్సులో స్మరించటానికి; వాక్కు= మాట; నినున్= నిన్ను; సత్+నుతి+చేయన్= స్తుతి చేయడానికి; శరీరము= దేహం; ఎల్లన్= పూర్తిగా; కింకర పరివృత్తిన్+చేయన్= సేవావృత్తి; మదిన్= మనస్సులో; కాంక్ష+ఒనర్చెదన్+కాని= కోరుకొంటానేగాని; నేను; అరిది= సులభంగా లభించని, దాచేయటానికి; ధ్రువ+ఉన్నత స్థలమున్= శాశ్వతమైన గొప్ప చోటును; అబ్జజు పట్టమున్= బ్రహ్మపదాన్ని; ఇంద్రభోగమున్= ఇంద్రభోగాన్ని; ఒల్లన్= ఇష్టపడను.

**తా :** స్వామీ! నా హృదయం భక్తులను పరిపాలించే భవదీయ సద్గుణ సముదాయాన్ని సర్వదా సంస్మరణం చేయాలి. నా వాక్కు నిన్నే ఎల్లప్పుడూ సన్నుతించాలి. నా శరీరం నిత్యమూ నీకు సేవ చేయాలి. ఇదే నా కోరిక. ఇంతకుమించి నేను ధ్రువలోకాన్ని గాని, ఇంద్రభోగాన్ని గాని, బ్రహ్మపదాన్ని గాని ఆశించను.

**ఉ. ఆఁకలి గొన్న క్రేపులు రయంబున నీఁకలు రాని పక్షులుం**
**దీకొని తల్లికిన్ మఱి విదేశగతుండగు భర్త కంగజ**
**వ్యాకులచిత్త యైన జవరాలును దత్తఱ మందు భంగి నో**
**శ్రీకర! పంకజాక్ష! నినుఁ జేరఁగ నామది గోరెడుం గదే! 400**

**ప్రతి :** ఆఁకలి+కొన్న= ఆకలి కలిగిన; క్రేపులు= దూడలు; రయంబునన్= వేగంగా; ఈఁకలురాని పక్షులున్= రెక్కలు రాని పక్షులు; దీకొని= ఎదురేగి; తల్లికిన్= తమ తల్లికోసం; మఱి= ఇంకను; విదేశగతుండు+అగు భర్తకున్= పరదేశం వెళ్ళిన మగనికోసం; అంగజ వ్యాకులచిత్త+అయిన= మన్మథునివలన కల్లోలమైన మనస్సుగల; జవరాలును= యువతియు; తత్తఱము+అందుభంగిన్= తొందరపడు విధంగా; ఓ శ్రీకర!= సంపత్కరా!; పంకజ+అక్ష!= పద్మాలవంటి కన్నులు గలవాడా!; నినున్+చేరఁగన్= నిన్ను చేరాలని; నా మది= నా మనస్సు; కోరెదున్+కదే!= కోరుతుంది గదా!

**తా :** శ్రీహరీ! దూడలు ఆకలితో తల్లి ఆవులకై వేచినట్లు, ఈకలురాని పిట్టలు తల్లి పక్షులకై ఎదురు చూచినట్లు, మదన బాధ కలిగిన ఒక యువతి దేశం విడిచి వెళ్ళిన మగనికోసం నిరీక్షించినట్లు, నా మనస్సు నిన్ను చేరడానికి తహతహలాడుతున్నది.

**క. నాకును సఖ్యము పుణ్య, శ్లోకులతోఁగాని తత్త్వశూన్యులు సంసా**
**రైక విమోహులతోడం, గాకుండ నొనర్పు మయ్య! కంజదళాక్షా! 401**

**ప్రతి :** కంజదళ+అక్షా!= పద్మాలరేకులవంటి కనులు గలవాడా! శ్రీహరీ!; నాకును= నాకు; సఖ్యము= స్నేహం; పుణ్యశ్లోకులతోన్+కాని= పుణ్యాత్ములైన మహనీయులతోనే గాని; తత్త్వశూన్యులు= జ్ఞానశూన్యులు; సంసార+ఏక విమోహులతోడన్= సంసార వ్యామోహమే ప్రధానంగా కలవారితో; కాక+ఉండన్= ఏర్పడకుండా; ఒనర్పుము+అయ్యా= చేయుము తండ్రీ!

**తా :** శ్రీహరీ! నాకు స్నేహం సజ్జనులతో, సత్కీర్తిమంతులతో మాత్రమే కలిగించు. అంతేగాని జ్ఞానహీనులతోనూ, నిరంతరం సంసారమే జీవిత పరమావధిగా ప్రవర్తించే వారితోనూ ఏర్పడకుండా చూడు.

**మహాస్రగ్ధర.**

**హరి పై సర్వాత్ముపై నత్యగణితగుణుపై నంతరంగంబు పర్వన్**
**సరిమే నుప్పొంగఁ జావుం జయమును సరిగా సంతసం బందుచుం భీ**
**కరుఁడై కాలాగ్నివోలెన్ గనలుచుఁ గవిసెన్ గర్వదుర్వారుఁడై దు**
**ర్భరలీలం భూమి గంపింపఁగ దిశ లద్రువన్ భండనోద్దండవృత్తిన్. 402**

**ప్రతి :** సర్వ+ఆత్ముపైన్= సర్వాంతర్యామి పైన; అతి+అగణితగుణుపైన్= అనంత కల్యాణగుణునిపైన; హరిపైన్= విష్ణువుపైన; అంతరంగంబు= మనస్సు; పర్వన్= వ్యాపించగా; సరిమేను+ఉప్పొంగన్= శరీరమంతా పొంగిపోగా; చావున్, జయమును= చావు, గెలుపు – రెంటినీ; సరిగా= సమానంగా; సంతసంబు+అందుచున్= సంతోషపడుతూ; భీకరుఁడై= భయంకరుడై; కాల+అగ్ని+పోలెన్= ప్రళయకాలపు నిప్పువలె; కనలుచున్= రగులుతూ; గర్వదుర్వారుఁడై= పొగరుతో ఎదురు లేనివాడై; దుర్భరలీలన్= భరింపరాని విధంగా; భూమి= నేల; కంపింపఁగన్= వణకగా; దిశలు= దిక్కులు; అద్రువన్= అదరగా; భండన+ఉద్దండవృత్తిన్= యుద్ధాన చెలరేగిన ప్రవర్తనతో; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తా :** అనంత కల్యాణగుణుడు, సర్వాంతర్యామి అయిన శ్రీహరిపై వృత్రాసురుడు తన మనస్సును లగ్నం చేశాడు. సంతోషంతో శరీరమంతా పొంగిపోగా మరణాన్ని, రణవిజయాన్ని సమానంగా భావించాడు. సంతోషంతో చూపరులకు భయం కలిగిస్తూ, పొగరుతో తనకు ఎదురులేనివాడై, తన బరువు భరించలేక నేల వణకగా, దిక్కులు అదిరిపడగా, యుద్ధోత్సాహం అతిశయించగా, ప్రళయకాలపు అగ్నివలె రగులుతూ ఇంద్రునిపై కురికాడు.

**క. దొరకొని ప్రళయోదకమున, హరిపైఁ గైటభుఁడు గవియు హంకారమునన్**
**సురనాథు మీఁద వృత్రా, సురుఁడు మదోద్వృత్తి నడచె శూలాయుధుఁడై. 403**

**ప్రతి :** దొరకొని= ప్రయత్నించి; ప్రళయ+ఉదకమునన్= ప్రళయకాలపు జలరాశిలో; హరిపైన్= విష్ణువుపై; కైటభుఁడు= ఆ పేరుగల రక్కసుడు; కవియు= పోరాడే; హంకారమునన్= 'హం' అనే ధ్వనితో; సురనాథు మీఁదన్= ఇంద్రుని మీద; వృత్ర+అసురుఁడు= వృత్రరాక్షసుడు; శూల+ఆయుధుఁడై= శూలం ఆయుధంగా గలవాడై; మద+ఉత్+వృత్తిన్= పొగరుతో, అతిశయించే ప్రవర్తనతో; నడచెన్= నడిచాడు.

**తా :** సృష్టికి ముందు అనంతమైన జలరాశిపై కైటభుడనే రాక్షసుడు విష్ణువుపై పోరాటానికి దుమికినట్లుగా, హుంకరిస్తూ వృత్రుడు రోషావేశంతో శూలపాణియై ఇంద్రుని మీదికి కుప్పించి దూకాడు.

**శా. కల్పాంతాగ్నియుఁబోలె నుల్క లెగయంగా ద్రిప్పుచున్ దీన నో**
**యల్పా! చావు మటంచు శూలము రయంబారంగఁ బై వైచినం**
**బోల్పం గోటిరవిప్రకాశత దివిం బోవంగ వీక్షించి యా**
**వేల్పుల్పొంగఁగ వజ్రధారఁ దునిమెన్ విన్నాణ మొప్పారఁగన్. 404**

**ప్రతి :** శూలము= ఆ వేసిన శూలాయుధం; కల్ప+అంత+అగ్నియున్+పోలెన్= యుగాంతపు నిప్పువలె; ఉల్కలు+ఎగయంగాన్= నిప్పు రవ్వలు పైకి ఎగురగా; త్రిప్పుచున్= తిప్పుతూ; ఓ అల్పా!= ఓ నీచుడా!; దీనన్= దీనితో; చావుము+అట+అంచున్= చావు అని అంటూ; రయంబు+ఆరంగన్= వేగం పెరుగగా; పైన్+వైచినన్= మీదికి వేయగా; (అది) కోటిరవి ప్రకాశతన్= కోటి సూర్యులకాంతితో; పోల్పన్= పోలినట్లుగా; దివిన్+పోవంగన్= ఆకాశాన వెళ్తుండగా; వీక్షించి= (ఇంద్రుడు) చూచి; ఆ వేల్పుల్= ఆ దేవతలు; పొంగఁగన్= సంతసించగా; వజ్రధారన్= వజ్రాయుధంయొక్క అంచుతో; విన్నాణము+ఒప్పు+ఆరఁగన్= నేర్పు అతిశయించగా; తునిమెన్= త్రుంచాడు.

**తా :** వృత్రుడు ప్రళయాగ్నివలె జ్వాలలు ఎగసిపడే తన శూలాన్ని తిప్పుతూ, 'ఓ నీచుడా! దీనితో చావు' అంటూ ఇంద్రుని పైకి విసరివేయగా, అది ఆకాశాన కోటి సూర్యుల కాంతితో తనపైకి రావడం చూచిన ఇంద్రుడు వెంటనే దాన్ని తన వజ్రాయుధంతో ఆశ్చర్యకరంగా ఖండించాడు. అది చూచి దేవతలు ఆనందంతో పొంగిపోయారు.

**ఆ. శూల మప్పు డతఁడు స్రుక్కఁగ ఖండించి, పూని తోన కదిసి భుజముఁ ద్రుంచె,**
**నసుర గనలి యేకహస్తుఁడై పరిఘంబు, గొని మహేంద్రుఁ గిట్టి హనువు లడిచె. 405**

**ప్రతి :** అప్పుడు; అతఁడు= ఆ ఇంద్రుడు; శూలము= శూలాన్ని; స్రుక్కఁగన్= సమసిపోయేటట్లు; ఖండించి= తుంచి; తోనన్= వెనువెంటనే; పూని= ప్రయత్నించి; కదిసి= ఎదుర్కొని; భుజమున్= చేతిని; త్రుంచెన్= నరికాడు; అసుర= రాక్షసుడు; కనలి= కోపించి; ఏకహస్తుఁడై= ఒంటి చేతివాడై; పరిఘంబున్+కొని= ఇనుపకట్ల గుదియను తీసికొని; మహా+ఇంద్రున్+కిట్టి= సురరాజును తాకి; హనువులు+అడచెన్= దౌడలు పగులగొట్టాడు.

**తా :** ఆ సమయాన ఇంద్రుడు శూలాన్ని తుంచివేయడంతో ఆగక, వెంటనే వృత్రుని ఎదుర్కొని, అతని భుజాన్ని ఖండించాడు. రాక్షసుడు కోపించి ఒంటి చేతితోనే ఇనుపగుదియను తీసికొని ఇంద్రునిపై పడి అతని దౌడలు పగులగొట్టాడు.

**వ. ఇట్లు ప్రళయకాల భీషణ పరివేష పోషంబుగా రోషంబునం బరిఘంబు ద్రిప్పి, కుప్పించి, గజ కుంభస్థలంబు భగ్నంబు సేసి యింద్రు హనుప్రదేశంబును నిష్ఠురాహతి నొప్పించిన. 406**

**ప్రతి :** ఇట్లు; ప్రళయకాల భీషణ పరివేష పోషంబుగాన్= యుగాంతంలో భయంకరమై చుట్టూ వ్యాపిస్తున్న వెలుగుయొక్క అతిశయంతో; రోషంబునన్= క్రోధంతో; పరిఘంబు+త్రిప్పి= ఇనుప గుదియను తిప్పుతూ; కుప్పించి= పైకెగసి; గజకుంభస్థలంబున్= ఏనుగు తలను; భగ్నంబు+చేసి= పగులగొట్టి; ఇంద్రు హనుప్రదేశంబును= ఇంద్రుని దౌడలను; నిష్ఠుర+ఆహతిన్= కఠోరమైన దెబ్బతో; నొప్పించినన్= బాధింపగా...

**తా :** వృత్రుడు ఇనుపగుదియను తిప్పుతూ ప్రళయకాలాన కలిగే కాంతివలయంవలె రోషంతో జ్వలిస్తూ ఆ పరిఘతో, ఐరావతం తలను పగులగొట్టి, ఇంద్రుని దౌడలను ముష్టి ఘాతాలతో నొప్పించగా

**క. గజము మద ముడిగి తిరుగుచు, గుజగుజనై గీఁకవెట్టఁ గులిశము నేలన్**
**భజన చెడి విడిచె నింద్రుఁడు, గజిబిజితో బెగడె నసురకడిమి జగంబుల్. 407**

**ప్రతి :** గజము= ఏనుగు; మదము+ఉడిగి= శక్తి నశించి; తిరుగుచున్= గుండ్రంగా తిరుగుతూ; గుజగుజనై= విభ్రాంతితో ఏమీ తెలియనిదై; గీఁక+పెట్టన్= కేక వేయగా (ఘీంకారం చేయగా) ఇంద్రుడు; భజన చెడి= ఏకాగ్రత పోయి; కులిశం

నేలన్ విడిచెన్= వజ్రాయుధం నేలమీద చేతినుండి జార్చాడు; అసుర కడిమిన్= రాక్షసుడి పరాక్రమానికి; జగంబుల్= లోకాలు; గజిబిజితోఁ= ఏమీ తెలియని స్థితిలో; బెగడెన్= దుఃఖించాయి.

**తా :** వృత్రుని దెబ్బతో ఐరావతం శక్తి నశించి గుండ్రంగా తిరుగుతూ పెద్దగా ఘీంకారం చేస్తూ ఉండటం చూచిన ఇంద్రుడు తానూ విభ్రాంతుడై, తన చేతనున్న వజ్రాయుధాన్ని నేలపై వదలివేశాడు. ఈ దృశ్యం చూచిన లోకాలు రాక్షసుని పరాక్రమానికి గజిబిజిగా భీతిల్లాయి.

**క. గరుడుఁడు వొదివిన నాగము, కరణిన్ వృత్రాసురేంద్రు కడిమికి లోనై**
**తిరుగుడు వడ్డ హరిం గని, పురపుర నాహా! యటంచుఁ బొగిలె జగంబుల్. 408**

**ప్రతి :** గరుడుఁడు= గరుత్మంతుడు; పొదివిన నాగము కరణిన్= పట్టుకొన్న పామువలె; వృత్ర+అసుర+ఇంద్రు కడిమికిన్= వృత్రాసురుని పరాక్రమానికి; లోనై= లొంగినవాడై; తిరుగుడు+పడ్డ హరిన్+కని= చేష్టలుడిగిన ఇంద్రుణ్ణి చూచి; జగంబులు= లోకాలు; పురపురన్= శోకంతో; ఆహా!+అటు+అంచున్= అయ్యో అంటూ; పొగిలెన్= దుఃఖించాయి.

**తా :** గరుత్మంతుణ్ణి చేజిక్కిన పామువలె, వృత్రాసురుని పరాక్రమానికి లోబడిన ఇంద్రుని దురవస్థ చూచిన లోకాలు అయ్యో! అంటూ దుఃఖించాయి.

**వ. అప్పుడు. 409**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయాన...

**తే. గజముపాటుఁ జూచి కడుదీనగతిఁ జూచి, పవి కరంబుజాఱిపడుటఁ జూచి**
**యుద్ధధర్మ మెఱిఁగి యున్న శత్రునిఁ జూచి, సిగ్గుతోడ వజ్రి శిరము వంచె. 410**

**ప్రతి :** గజముపాటున్+చూచి= ఏనుగుయొక్క ఆపదను చూచి; కడుదీనగతిన్+చూచి= ఎంతో దైన్యం కలగడం గమనించి; పవి= వజ్రాయుధం; కరంబు జాఱిపడుటన్+చూచి= చేయి జారికిందపడడం గమనించి; యుద్ధధర్మము+ఎఱిఁగి+ఉన్న శత్రునిన్+చూచి= రణ నీతిని పాటించి ఊరక ఉన్న విరోధిని చూచి; వజ్రి= ఇంద్రుడు; సిగ్గుతోడన్= సిగ్గుతో; శిరము= తల; వంచెన్= వంచుకొన్నాడు.

**తా :** ఐరావతం అసురుని దెబ్బతో పెద్దగా బొబ్బలు పెడుతూ గిరగిర తిరిగింది. దీనుడై తాను చేతి ఆయుధాన్ని రణరంగాన జారవిడిచాడు – అంటే, నిరాయుధుడై నిలిచాడు. ఆ సమయంలో సామాన్య విరోధి ఎవడైనా మీదబడి కడతేరుస్తాడు. కాని వృత్రుడు యుద్ధధర్మం పాటించి మిన్నకున్నాడు. ఇది చూచిన ఇంద్రుడు సిగ్గుతో తల వంచుకొన్నాడు.

**వ. ఇట్లు యుద్ధంబున శత్రుసన్నిధిం గరంబు జాఱిపడిన వజ్రంబుఁ బుచ్చికొనక నివ్వెఱపడి, లజ్జించి యున్న పాకశాసనుంజూచి వృత్రుం డిట్లనియె. 411**

**ప్రతి :** ఇట్లు; యుద్ధంబునన్= యుద్ధభూమిలో; శత్రుసన్నిధిన్= విరోధి ముందర; కరంబు జాఱిపడిన వజ్రంబున్= చేతినుండి జారి కిందపడిన వజ్రాయుధాన్ని; పుచ్చికొనక= తిరిగి తీసికోకుండా; నివ్వెఱపడి= భయపడి; లజ్జించి+ఉన్న= సిగ్గుపడి ఉన్న; పాకశాసనున్+చూచి= ఇంద్రుణ్ణి జూచి; వృత్రుండు; ఇట్లు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తా :** రణరంగంలో శుత్రువు ముందు తనచేతినుండి జారిపడిన వజ్రాయుధాన్ని తిరిగి తీసికోకుండా ఆశ్చర్యంతో నిశ్చేష్టుడై ఉన్న ఇంద్రునితో వృత్రాసురుడు ఇలా అన్నాడు.

**క. దురమునఁ గైదువు వదలిన, శరణన్నను వైరిజనులఁ జంపము మది ని**
**వ్వెఱఁగొందనేల? కులిశము, కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితి నింద్రా! 412**

**ప్రతి :** ఇంద్రా!; దురమునన్= యుద్ధంలో; కైదువు= ఆయుధం; వదలినన్= విడిచిపెట్టినా; శరణు+అన్నను= శరణువేడినా; వైరిజనులన్+చంపము= మేము శత్రువులను చంపము; మదిన్= మనస్సులో; నివ్వెఱగున్= భయమును; ఒందన్+ఏల?= పొందటం ఎందుకు?; కులిశము= వజ్రాయుధం; కరము+అరుదుగన్= మిక్కిలి ప్రీతితో; పుచ్చికొనుము= తీసుకో; కాచితిన్= రక్షించాను.

**తా :** ఇంద్రా! యుద్ధాన ఆయుధం వదలినవారిని, శరణుజొచ్చినవారిని చంపము. అంతగా ఎందుకు భయపడతావు? వజ్రాయుధం తీసుకో. నిరాయుధుడవైన నిన్ను నేను తాకను.

**సీ. వజ్రంబు గైకొని వైరి నిర్జింపు, మి ట్లడలంగ వేళగా దమరనాథ!**
**యరయ దేహాధీనులైన మూర్తుల కెల్ల నీశు లక్ష్మీశు సర్వేశుఁ బాసి**
**కడతేఱ జయములు గల్గునె యెందైనఁ దలపోసి చూడుమా! తత్త్వదృష్టి**
**నీ లోకపాలురు నెవ్వని వశగతి వలఁ బడ్డ పక్షుల వర్తనమునఁ**

**తే. జిక్కి చేష్టలు సేయుచుఁ జింతసేతు, రట్టి మృత్యు బలంబుల నాత్మజయము**
**తమదిగాఁ గోరి యజ్ఞానతంత్రు లగుచుఁ, గమలలోచను లీలావికారములను. 413**

**ప్రతి :** అమరనాథ!= సురరాజా!; ఇట్లు; అడలంగన్= భయపడడానికి; వేళకాదు= సమయంకాదు; వజ్రంబున్+కైకొని= వజ్రాయుధం చేతబట్టి; వైరిన్= శత్రువును; నిర్జింపుము= జయించు; అరయన్= చూడగా; దేహ+అధీనులైన మూర్తులకున్+ఎల్లన్= శరీరధారులయిన ఆకారాలకు అన్నిటికి; ఈశున్= శక్తిమంతుని; లక్ష్మీ+ఈశున్= లక్ష్మీమగని; సర్వ+ఈశున్= అన్నింటికి అధిపతిని; పాసి= వదలి; కడతేఱన్= చావగా; ఎందైనన్= ఎక్కడైన; జయములు+కల్గునె= గెలుపులు సమకూరునా!; తత్త్వదృష్టిన్= వాస్తవమైన చూపుతో; తలపోసి= ఆలోచించి, చూడుమా= చూడు; ఈ లోకపాలురు= ఈ లోకరక్షకులు; ఎవ్వని వశగతిన్= ఎవ్వని చేజిక్కి; వలన్+పడ్డ= వలలోపడిన; పక్షులవర్తనమునన్= పిట్టల ప్రవర్తనవలె; చిక్కి= లోబడి, వశమై; చేష్టలు+చేయుచున్= పనులు చేస్తూ; అజ్ఞానతంత్రులగుచున్= తెలివిలేమికి వశమైనవారై; కమలలోచను లీలావికారములను= విష్ణువుయొక్క లీలలవికృతులవలన; అట్టిమృత్యుబలంబులన్= ఆ చచ్చేసేనలతో; ఆత్మజయము= తమ గెలుపు; తమదిగాన్= తాము చేసినదిగా; కోరి; చింత+చేతురు= అనుకుంటారు.

**తా :** ఇంద్రా! ఈ విధంగా భయపడటానికి ఇది వేళగాదు. వజ్రాయుధంచేత బూని విరోధిని గెలువు. ఎక్కడైనా అన్నింటికీ ఏలికైన విష్ణువును గాదని, ఈ మరణశీలురైనవారికి గెలుపులు కలుగునా? జ్ఞానదృష్టితో పరికించు. ఈ లోకపాలకులందరూ ఎవనికి వశమై తమ తమ విధులను నిర్వర్తిస్తున్నారో చూడు. తెలివిమాలి, విష్ణుని లీలలను గ్రహించక, ఈ మరణించే సేనలవలన గలిగే జయం తమ దనుకొంటున్నారు.

**తే. మెఱయ యంత్రమయం బైన మృగముభంగి, దారునిర్మిత మైనట్టి తరుణిపోల్కి**
**శక్ర! యెఱుఁగుమ యీ భూతజాల మెల్ల, దళిత పంకేరుహాక్షు తంత్రంబు గాఁగ. 414**

**ప్రతి :** శక్ర!= ఇంద్రా!; ఈ భూతజాలము+ఎల్లన్= ఈ ప్రాణి సమూహమంతా; యంత్రమయంబైన= యంత్రంతో ఏర్పడిన; మృగముభంగిన్= జంతువువలె; దారు నిర్మితమైనట్టి= చెక్కతో చేసిన; తరుణిపోల్కి= యువతివలె; దళితపంకేరుహ+అక్షు తంత్రంబు+కాఁగన్= వికసించిన పద్మాలవంటి కన్నులు గలవాని మాయగా; మెఱయన్= స్పష్టంగా; ఎఱుగుము= తెలుసుకో.

**తా :** దేవేంద్రా! యంత్రనిర్మితమైన జంతువుల వలె, కొయ్యతో కూర్చబడిన యువతివలె ఈ ప్రపంచంలోని ప్రాణులందరూ మహావిష్ణువు మాయాతంత్రంవల్ల కదులుతున్న జంత్రపు బొమ్మలని తెలుసుకో.

**వ. మఱియు భూతంబులచేతను, నింద్రియంబుల చేతను నవశుండైన పురుషుండు ప్రకృతిచేత వేఱుచేయబడిన యాత్మం బరమేశ్వరానుగ్రహంబు వాసి సుఖియించుచుండు. అవిద్వాంసుండైన వాఁ డనవరతంబుఁ దన్ను స్వతంత్రునిఁగాఁ దలంపుచుండు; భూతంబుల వలన భూతంబులుం బుట్టుచుండు; ఆ భూతంబులు భూతంబులచేత భక్షింపఁ బడుచుండు; పురుషున కాయువు, శ్రీయును, గీర్తియు, నైశ్వర్యంబును మొదలయినవి యనుభవింప నెంతకాలంబు ప్రాప్తం బంతకాలంబు నివసించు. ఆ ప్రాప్తంబు దీఱినఁ బురుషుండు జాలిం బొందిన నవి యుండక పోవుచుండు; కావున గుణంబును, నవగుణంబును, గీర్త్యపకీర్తులును, జయాపజయంబులును, సుఖదుఃఖంబులును, జావు బ్రతుకులును సమంబులై కలుగుచుండు; అజ్ఞానియైన వానికి సత్త్వరజస్తమో గుణంబులు గలిగియుండు. అట్టివానికి గుణమయంబులైన యింద్రియాదులే యాత్మయని తోఁచుచునుండు; కావున వాఁ డా గుణంబులచేత బద్ధుండగు; ఆ గుణంబులకు సాక్షిమాత్రం బైన శరీరంబు వేరని యెవ్వం డెఱుంగనోపు, వాఁ డా గుణంబులచేత బద్ధుండు కాఁడు; కావున గుణంబులును; గుణియును; భోక్తయును, భోగ్యంబును; జయంబు నపజయంబును, హర్తయును హన్యంబును; నుత్పత్తిస్థితి లయకర్తయై, సర్వోత్కృష్టుండైన యప్పరమేశ్వరుండే కాని యన్యంబు లేదు; ఇప్పుడొక్క హస్తంబు నాయుధంబును బోయినను భవత్ప్రా ణాపహరణంబునకు సమర్థుండ నగుచున్న నన్నుం జూడుము అని వృత్రాసురుండు మఱియు నిట్లనియె. 415**

**ప్రతి :** మఱియును; భూతంబులచేతను= పంచభూతాలచేత, ఇంద్రియంబుల చేతను; అవశుండైన= వశం తప్పిన; పురుషుండు= మానవుడు; ప్రకృతిచేత= సృష్టిచేత; వేఱుచేయబడిన+ఆత్మన్= దూరీకృతమైన ఆత్మతో; పరమ+ఈశ్వర+ అనుగ్రహంబున్+పాసి= విష్ణువుయొక్క దయను దూరం చేసుకొని; సుఖియించుచుండున్= సంతోషిస్తూ ఉంటాడు; అవిద్వాంసుండు+ఐనవాఁడు= జ్ఞానం లేనివాడు; అనవరతంబున్= ఎల్లప్పుడూ; తన్నున్= తనను; స్వతంత్రునిన్+కాన్+ తలంపుచుండున్= ఇతరులకు వశముగాని వానినిగా భావిస్తూ ఉంటాడు; భూతంబులవలనన్= ప్రాణులవలన; భూతంబులు= ప్రాణులు; పుట్టుచుండున్= పుడుతూ ఉంటాయి; ఆభూతంబులు= ఆ ప్రాణులు; భూతంబులచేతన్= ప్రాణులచే; భక్షింపఁ బడుచుండున్= తినబడుతూ ఉంటాయి; పురుషునకు= జీవునకు; ఆయువు= జీవనసమయం; శ్రీయును= సంపద;

కీర్తియున్= యశస్సు; ఐశ్వర్యంబును= ఐశ్వర్యం మొదలయినవి; అనుభవింపన్= అనుభవించడానికి; ఎంతకాలంబు; ప్రాప్తంబు= లభిస్తూ ఉంటుందో; అంతకాలంబు= అంత సమయం వరకు; నివసించున్= జీవిస్తాడు; అప్రాప్తంబు= ఆ (ముందు నిర్ణయించి ఇపుడు) పొందినది; తీఱినన్= ముగియగా, పురుషుండు; జాలిన్+పొందినన్= జాలిపడినా, యాచించినా; అవి= అప్రాప్తములు; ఉండక; పోవుచుండున్= నశించిపోతూ ఉంటాయి; కావునన్; గుణంబునున్+అవగుణంబునున్= మంచితనమూ, చెడ్డతనమూ; కీర్తి+అపకీర్తులును= మంచీ చెడ్డా పేరులు; జయ+అపజయంబులును= గెలుపూ ఓటములు; సుఖ దుఃఖంబులును= సంతోషమూ బాధా; చావు బ్రదుకులును= మరణమూ పుట్టుకా; సమంబులై= సమానాలై; కలుగుచుండున్= కలుగుతూ ఉంటాయి; అజ్ఞాని+ఐనవానికిన్= తెలివిమాలినవానికి; సత్త్వరజస్తమోగుణంబులు= సత్త్వం, రజస్సు, తమస్సు అనే ఈ మూడుగుణాలూ; కలిగి+ఉండున్= కూడి ఉంటాయి; అట్టివానికి; గుణమయంబులైన= ఆ మూడుగుణాలతో కూడిన; ఇంద్రియ+ఆదులే= కన్ను ముక్కువంటి ఇంద్రియాలు మొదలయినవే; ఆత్మ+అని; తోఁచుచున్+ఉండున్= అనిపిస్తూ ఉంటాయి; కావునన్; వాఁడు; ఆ గుణంబులచేతన్= ఆ గుణాలతో; బద్ధుండగున్= కట్టివేయబడినవాడవుతాడు; ఆ గుణంబులకున్= ఆ మూడు గుణాలకు; సాక్షిమాత్రంబు+ఐనన్= ఎదుట నిలిచి చూచునది మాత్రమే అయిన; శరీరంబు= దేహం; వేరు+అని; ఎవ్వండు+ఎఱుంగన్+ ఓపున్= ఎవడు తెలిసికొనగలుగుతాడో; వాఁడు; ఆ గుణంబులచేతన్= ఆ సత్త్వరజస్తమస్సులచేత; బద్ధుండు కాఁడు= కట్టబడినవాడుకాడు; కావునన్; గుణంబులును= గుణాలూ; గుణియును= గుణాలు గలవాడూ; భోక్తయును= అనుభవించేవాడూ; భోగ్యంబును= అనుభవించేదీ; జయంబును అపజయంబునున్= గెలుపూ ఓటములూ; హర్తయును హన్యంబునున్= చంపువాడూ, చంపబడేదీ; ఉత్పత్తి స్థితిలయకర్తయై= పుట్టువు బ్రతుకు చావులను చేసేవాడై; సర్వ+ఉత్కృష్టుండైన= అందరికంటె శ్రేష్ఠుడైన; ఆ+పరమ+ఈశ్వరుండే కాని= మిక్కిలి గొప్ప పరమాత్మ తప్ప; అన్యంబులేదు= మిగినది, ఇతరం ఉండదు; ఇప్పుడు; ఒక్కహస్తంబును= ఒక చేయీ; ఆయుధంబును= శస్త్రమూ; పోయినను= లేకపోయినా; భవత్ ప్రాణ+అపహరణంబునకున్= నీ ప్రాణం తీయటానికి; సమర్థుండను+అగుచున్న= చాలినవాడినై ఉన్న; నన్నున్+చూడుము అని; వృత్ర+అసురుండు= వృత్ర రాక్షసుడు; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు;

**తా :** సృష్టిలోని పంచభూతాలకు – పృథివి – మట్టి, అప్ – నీరు, తేజస్ – కాంతి, వాయు – గాలి, ఆకాశ – ఆకసం ఈ ఐదింటికి, పంచ – ఇంద్రియాలకు – కన్ను ముక్కు చెవి నాలుక చర్మాలకు బానిసై నరుడు దేవుని దయకు దూరంగా, ప్రకృతికి దగ్గరగా బ్రతుకుతూ, అజ్ఞానిగా, తనను తాను స్వతంత్రునిగా భావించుకొంటూ ప్రకృతి సుఖాలను అనుభవిస్తుంటాడు. జీవులనుండి జీవులుపుట్టి, మళ్ళీ వాటితోడనే నశిస్తుంటాయి. ఇది ప్రకృతి లక్షణం. జీవుడు తనకు సంక్రమించిన పుణ్యాన్ననుసరించి కీర్తిని, సుఖాన్ని, సంపదను పొందినవాడై, అది తీరిన తరువాత, ఎంత ఆరాటపడినా మరలవాటిని పొందలేడు. చావుబ్రతుకులు, మంచిచెడులు, సుఖదుఃఖాలు, గెలుపు ఓటములు సమానంగా జీవికి ప్రాప్తిస్తాయి. పరిశీలిస్తే, ఈ ద్వంద్వాలు – సుఖదుఃఖాదులు, వాటికి కర్త, భోక్త సర్వమూ ఆ నారాయణుడే. ఇతరమేదీ లేదు. ఇప్పుడు నేను ఒకే చేయి కలిగి ఆయుధహీనునిగా ఉన్నా నిన్ను చంపగలిగి ఉన్నాను చూడు అంటూ వృత్రుడు మరల ఇంకా ఇలా అన్నాడు.

**తే. వాహనంబులు సారెలు వాఁడిశరము, లూర్జి తాక్షము లసువులు నొడ్డణములు**
**గాఁగఁ బోరెదు నీ ద్యూతకర్మమందు, నెసఁగ జయమును నపజయ మెవ్వఁ డెఱుఁగు? 416**

**ప్రతి :** వాహనంబులు= బండ్లు, రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు మొ॥వి; సారెలు= అడ్డగడులు; వాడి శరములు= పదునైన బాణాలు; ఊర్జిత+అక్షములు= దృఢమైన పాచికలు; అసువులు= ప్రాణాలు; ఒడ్డణములుగాఁగన్= పందెములు కాగా;

పోరెదు= పోరాడే; ఈ ద్యూతకర్మమందు= యుద్ధమనే ఈ జూదపు పనిలో; ఎసగన్= చూడగా; జయమును అపజయమున్= గెలుపూ ఓటములు; ఎవ్వఁడు+ఎఱుఁగున్= ఎవ్వడు తెలుసుకోగలడు?

**తా :** ఈ యుద్ధం ఒక జూదం. దీనిలో వాహనాలైన ఏనుగులు, గుర్రాలు, రథాలు జూదపుగళ్ళు; బాణాలే పాచికలు. ప్రాణాలే పందెములు, ఈ ఆటలో గెలుపు ఓటమి ఎవరిదో తెలియదు.

**చ. అనవుడు వృత్రుమాటలకు నద్భుత మంది సురేంద్రుఁ డెంతయుం**
**దనమదిఁ గుత్సితం బుడిగి దైవముగా నతనిన్ తలంచి కై**
**కొనియెఁ గరంబునం దిగువఁ గూలిన వజ్రము, నప్పుడాత్మలోఁ**
**దనరె జగంబు లన్నియు, ముదంబును బొందిరి ఖేచరావళుల్. 417**

**ప్రతి :** అనవుడున్= అన్న వెంటనే; వృత్రుమాటలకున్= వృత్రాసురుని పలుకులకు; సుర+ఇంద్రుఁడు= దేవేంద్రుడు; అద్భుతము+అంది= ఆశ్చర్యం పొంది; తనమదిన్= తన మనస్సులో; ఎంతయున్= ఎంతగానో; కుత్సితంబు+ఉడిగి= చెడు తలంపును మాని; అతనిన్= ఆ వృత్రాసురుని; దైవముగాన్+తలంచి= దేవుడిగా భావించి; దిగువన్+కూలిన= కిందపడిన; వజ్రమున్= వజ్రాయుధాన్ని; కరంబునన్= చేతితో; కైకొనియెన్= గ్రహించాడు; అప్పుడు; ఆత్మలోన్= మనస్సులో; జగంబులు+అన్నియున్= లోకాలన్నీ; తనరెన్= సంతసించాయి; ఖేచర+ఆవళుల్= దేవతల సమూహాలు; ముదంబును+ పొందిరి= ఆనందం పొందారు.

**తా :** వృత్రుని మాటలు విన్న దేవేంద్రుడు ఆశ్చర్యపడ్డాడు. శత్రువులోని గొప్పతనానికి, తన మనస్సులో చెడు తలపు మాని, శత్రువును తన పాలిట దేవుడుగా భావించి, తాను జారవిడిచిన ఆయుధాన్ని తిరిగి చేతపట్టినాడు. ఆ సమయంలో లోకాలన్నీ దేవతలసమూహంతోపాటుగా సంతోషించాయి.

**క. రాహుగ్రహ వక్త్ర మహా, గేహాంతము వాసి వచ్చి కిరణావళి స**
**ద్బాహుళ్య మొప్ప వెలిగెఁడు, నా హరిదశ్వుండు వోలె హరి యొప్పె నృపా! 418**

**ప్రతి :** నృపా!= రాజా!; హరి= ఇంద్రుడు; రాహుగ్రహవక్త్రమహాగేహ+అంతము= రాహుగ్రహపు నోరు అనే పెద్దయింటి లోపలినుండి; పాసి= విడివడి; వచ్చి, కిరణ+ఆవళి సత్+బాహుళ్యము= కిరణాల వరుసల ఆధిక్యం; ఒప్పన్= తగినవిధంగా; వెలిగెఁడు= ప్రకాశించే; ఆ+హరిత్+అశ్వుండు పోలెన్= ఆ సూర్యునివలె; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తా :** వజ్రాయుధం ధరించిన దేవేంద్రుడు గ్రహణానంతరం రాహుగ్రహం ముఖంనుండి వెలువడి కిరణ సముదాయంతో ప్రకాశించే సూర్యబింబంలాగా విరాజిల్లాడు.

**వ. ఇట్లు కరకలిత వజ్రాయుధ రుఙ్మండల మండిత దిఙ్మండలుండై జంభారి గంభీర వాక్యంబుల విస్మయ మందస్మిత ముఖారవిందుండై వృత్రున కిట్లనియె. 419**

**ప్రతి :** ఇట్లు, కరకలిత= చేతబట్టిన; వజ్ర+ఆయుధ రుక్+మండల= వజ్రాయుధపు కాంతిపుంజంచేత; మండిత= అలంకృతమైన; దిక్+మండలుండై= దిక్కులసమూహం కలవాడై; జంభ+అరి= ఇంద్రుడు; గంభీర వాక్యంబులన్= లోతైన మాటలతో; విస్మయ= ఆశ్చర్యంతో కూడిన; మందస్మిత= చిరునవ్వుగల; ముఖ+అరవిందుండై= పద్మంవంటి ముఖం కలవాడై; వృత్రునకున్= వృత్రునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంద్రుడు కిందబడ్డ ఆ ఆయుధాన్ని తిరిగి చేతబట్టి, దాని కాంతి వలయాలతో దిక్కులన్నీ వెలుగులు చిమ్ముతుండగా, ఆశ్చర్యంతో కూడిన చిరునవ్వు చిందే పద్మంవంటి ముఖంతో పరికిస్తూ వృత్రునితో ఇలా అన్నాడు.

**క. ఓ దానవేంద్ర! నీ మతి, వేదాంతము వోలె తత్త్వ విజ్ఞాన కళా**
**మోదము, నీ వతిభక్తుఁడ, వాదిమ పురుషునకు హరికి నబ్జాక్షునకున్. 420**

**ప్రతి :** ఓ దానవ+ఇంద్ర!= ఓ రాక్షసరాజా!; నీ మతి= నీ బుద్ధి; వేద+అంతము+పోలెన్= ఉపనిషత్తులవలె; తత్త్వ విజ్ఞాన కళా+ఆమోదము= తత్త్వజ్ఞానపు వెలుగులతో అలరారుతున్నది; నీవు; అబ్జ+అక్షునకున్= పద్మములవంటి కన్నులు గలవాడైన; ఆదిమ పురుషునకున్= మొట్టమొదటి పురుషునకు (ఆదిదేవునకు); హరికిన్= విష్ణువునకు; అతిభక్తుఁడవు= గొప్ప భక్తుడవు.

**తా :** రాక్షస రాజా! నీ బుద్ధి ఉపనిషత్సారాన్ని నిండుగా గ్రహించి, తత్త్వజ్ఞాన వికాసంతో ఒప్పారుతున్నది. నీవు పురాణ పురుషుడు, కమలాక్షుడు అయిన విష్ణుదేవునకు గొప్ప భక్తుడవు.

**ఉ. లోకములెల్ల నిండి తన లోనుగ సర్వముఁజేసి ప్రాణులన్**
**దీకులఁ బెట్టి యెల్లెడలఁ దీపులు సూపెడి విష్ణుమాయ నేఁ**
**డేకమతిం దలంచి తిది యేల? మహాసురరూపుమాని సు**
**శ్లోకు పురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపునన్. 421**

**ప్రతి :** లోకములు+ఎల్లన్= అన్ని లోకాలలో; నిండి= వ్యాపించి; సర్వమున్ తనలోనుఁగన్+చేసి= అంతటినీ తనలోనే ఉండేటట్లుచేసి; ప్రాణులన్= జీవులను; దీకులన్+పెట్టి= చిక్కులలో ఉంచి; ఎల్లెడలన్= అన్నిచోట్ల; తీపులు+చూపెడి విష్ణుమాయన్= ఇష్టములను చూపే విష్ణుని మాయను; నేఁడు= ఈనాడు; ఏకమతిన్= ఏకాగ్ర బుద్ధితో; తలంచితి= తెలుసుకోగలిగావు; ఇది+ఏల= ఈ రాక్షస స్థితి ఎందుకు?; మహా+అసురు రూపుమాని= గొప్ప రాక్షసుని ఆకారాన్ని తొలగించుకొని; సుశ్లోకు= పరమ పవిత్రుడై; పురాణపూరుషుని= విష్ణువుయొక్క; శోభనమూర్తిన్= అందమైన ఆకారాన్ని; ఇంపునన్= ప్రియంగా; ధరింపుము= తాల్చుము.

**తా :** లోకాలలో విష్ణుమాయచేసే లీలలన్నీ నీ వెరుగుదువు. అది జగత్తులతో నిండిపోయి, తనలోనే జగాలను నింపుకొని, జీవులకు కష్టసుఖాలు, సరాగవిరాగాలు కల్పిస్తూ క్రీడించే తీరును నీ సూక్ష్మబుద్ధితో గ్రహించావు. మరి ఇపుడు ఈ రాక్షసపు తీరు తెన్నులెందుకు? రాక్షసరూపాన్ని వదలి పరమపవిత్రమైన నారాయణుని స్వరూపాన్ని సంతోషంగా ధరించు.

**ఉ. ఏ నియమంబు సల్పితివొ! యెట్టి మహాతప మాచరించితో**
**పూని రజోగుణాభిరతిఁ బొందిన నీ మతి శాంత దాంత స**
**న్మానస మానసానుభవ మత్తమరాళ నరోష భావ స**
**న్మాను నమేయు నా దనుజమర్దను భక్తి పొసంగె నెంతయున్. 422**

**ప్రతి :** ఏ నియమంబు సల్పితివొ= ఏ దీక్షను ఆచరించావో; ఎట్టి మహాతపము+ఆచరించితో= ఎలాంటి గొప్ప తపస్సు చేశావో; పూని= యత్నించి; రజస్+గుణ+అభిరతిన్= రజోగుణపు ఆసక్తిని; పొందిన నీ మతిన్= కలిగిన నీ బుద్ధిలో; శాంత= అంతరింద్రియ నిగ్రహమూ; దాంత= బహిరింద్రియ నిగ్రహమూ గల; సత్+మానస= మంచి మనస్సులుగలవారి;

మానస+అనుభవ= మనస్సులలో విహరించే; మత్తమరాళున్= రాజహంస అయిన; అరోష భావసన్మానున్= శాంతస్వభావమే తనకు గుణంగా గలవాణ్ణి; అమేయున్= కొలతకు అందనివాణ్ణి; అయిన; ఆ దనుజమర్దను భక్తి= విష్ణుభక్తి; ఎంతయున్+ పొసంగెన్= అత్యధికంగా కలిగింది.

**తా :** ఏ దీక్షను, ఏ గొప్ప తపస్సును చేశావో! రజోగుణంతో నిండిన, ద్వేషరోషాలకు నెలవైన నీ బుద్ధిలో అద్భుతంగా విష్ణుభక్తి కలిగింది. అది మనస్సులను – వాటి ప్రవృత్తులను నిగ్రహించి నిలిచిన వారికిగాని కలుగనిది. అట్టి మహానుభావుల మనస్సులు అనే కొలనులలో నారాయణుడు రాజహంసయై విహరిస్తుంటాడు. విష్ణువు ప్రశాంతచిత్తులలో నివసిస్తాడు.

**క. నారాయణ రూపామృత, పారావారమునఁ దేలు భక్తుఁడు దా భూ**
**దారకృత ఖాత కోదక, పూరంబుల నేల తృప్తిఁ బొందు? మహాత్మా! 423**

**ప్రతి :** మహాత్మా!= గొప్ప మనస్సుగలవాడా!; నారాయణరూప+అమృతపారావారమునన్= విష్ణువు రూపం అనే అమృత సముద్రంలో; తేలు భక్తుఁడు= విహరించే భక్తుడు; తాన్= తాను; భూదారకృత ఖాతక+ఉదక పూరంబులన్= పందులచేత చేయబడిన గుంటలలోని నీటిలో; ఏల తృప్తిన్+పొందున్= ఎలా తృప్తి పడతాడు?

**తా :** మహాత్మా! విష్ణువుయొక్క రూపం అనే అమృత సముద్రంలో విహరించే భక్తుడు గుంటలలోని నీళ్లతో తృప్తిపడగలడా?

**వ. ఇట్లు పలుకుచున్న యింద్రు నుపలక్షించి, వృత్రాసురుం డాయోధన దుర్మర్షణ సంఘర్షమాణ మానసుండై వైరిం బురికొల్పుకొని, వామహస్తంబునఁ బరిఘంబు ద్రిప్పుచు, మత్సరంబునం గుప్పించుచు, బ్రహ్మాండకర్పరంబు నిష్ఠుర భైరవారావంబునం బగిలించుచు, సముత్తుంగమత్తమాతంగపుంగవంబు వృషభంబుపైఁ గదియు భంగి సురవృషభు పేరుర ముపలక్షించి, భీషణాశనినిపాతవేగంబునఁ గొట్టిన, నింద్రుండు కులిశధార నప్పరిఘంబుఁ దునిమి, తోడనే శేషఫణావిశేషభాసురం బైన బాహు దండంబు ఖండించె; అప్పుడు వృత్రుండు భిన్న బాహుద్వయుండై, రక్తధారలం దోఁగుచు వజ్రిచేతఁ బక్షహతంబై దివంబుననుండి జాఱుచున్న కులపర్వతంబునుంబోలెఁ జూపట్టి, ప్రళయకాల సంహార నిటలచ్ఛటచ్ఛ టార్భట కఠోర కీలాభీలాగ్ని సమాన క్రూర కుటిల నిరీక్షణ దుర్నిరీక్షుండై భూనభోమండలంబులఁ గ్రింది మీఁది దౌడల హత్తించి, నభోమండలంబునుం బోలెఁ దుది మొద లెఱుంగరాక, వికృతంబుగా వక్త్రంబు దెఱచి, మందర మథన మథ్యమాన విషధరజనిత విష విషమ జిహ్వాభీలం బగు నాలుక నభంబు నాకుచుఁ గాలసంహారకారణుండైన కాలుని భుజదండమండితంబగు దండంబునుం బోని దంష్ట్రలచేత జగత్త్రయంబును మ్రింగెడు వానింబోలె నతిమాత్ర మహాకాయుండై, పర్వతంబులం దలంగ మీటుచు, నడగొండయుంబోలె నభోభాగ భూభాగంబుల నాక్రమించి యప్పుడు. 424**

**ప్రతి :** ఇట్లు పలుకుచున్న= ఇలా అంటున్న; ఇంద్రుని+ఉపలక్షించి= ఇంద్రుణ్ణి చూచి; వృత్రాసురుండు= వృత్రాసురుడు; ఆయోధన దుర్మర్షణ సంఘర్షమాణమానసుండై= యుద్ధాన్ని సహించలేక ఒరిపిడిగల మనస్సుగలవాడై; వైరిన్+పురికొల్పుకొని= విరోధిని ప్రేరేపించి; వామహస్తంబునన్= ఎడమచేతితో; పరిఘంబున్= ఇనుపకట్ల గుదియను; త్రిప్పుచున్= తిప్పుతూ; మత్సరంబునన్+కుప్పించుచున్= మాత్సర్యంతో గంతులువేస్తూ; బ్రహ్మాండకర్పరంబు= బ్రహ్మాండమనే తలపుర్రెను;

నిష్ఠురభైరవ+ఆరవంబునన్= మహాభయంకరమైన శబ్దంతో; పగిలించుచున్= బద్దలు గొడుతూ; సమ్+ఉత్తుంగ మత్త మాతంగ పుంగవంబు= ఉన్నతమైన మదించిన మగ ఏనుగు; వృషభంబుపైన్= ఎద్దుపై; కదియుభంగిన్= దాడిచేసే విధంగా; సురవృషభు= దేవరాజైన ఇంద్రునియొక్క; పేరు+ఉరమున్= విశాలమైన రొమ్మును; ఉపలక్షించి= గురిజూచి; భీషణ+అశని నిపాత వేగంబునన్+కొట్టినన్= భీకరమైన పిడుగుపాటు వేగంతో మోదగా; ఇంద్రుండు, కులిశధారన్= వజ్రాయుధంతో; ఆ+పరిఘంబున్+తునిమి= ఆ ఇనుపగదియను విరిచి; తోడనే= వెంటనే; శేషఫణా విశేష భాసురంబైన= ఆదిశేషుని పడగవలె వెలిగే; బాహుదండంబున్= కర్రవంటి చేతిని; ఖండించెన్= నరికాడు, అప్పుడు; వృత్రుండు; భిన్నబాహుద్వయుండై= నరకబడ్డ రెండుచేతులూ గలవాడై; రక్తధారలన్+తోఁగుచున్= నెత్తుటి ధారలతో తడుస్తూ; వజ్రిచేతన్= ఇంద్రునిచేత; పక్షహతంబై= రెక్కలు ఛేదింపబడినదై; దివంబుననుండి= స్వర్గంనుండి, జాఱుచున్న= జారిపడుతున్న; కులపర్వతంబునున్+ పోలెన్= కులపర్వతం వలె; చూపట్టి= కనిపించి; ప్రళయకాల= యుగాంతంలో; సంహార= చంపటానికి; నిటల= నొసటి; ఛటచ్ఛట+ఆర్భట= ఛటఛట ధ్వనుల ఆటోపపు; కఠోరకీల= గట్టిజ్వాలలతో; ఆభీల= భీకరమైన; అగ్ని సమాన= అగ్నితో సమమైన; క్రూర కుటిల నిరీక్షణ= ఘోరమైన వంకరచూపులతో; దుర్నిరీక్షుండై= చూడడానికి వీలు కానివాడై; భూ నభోమండలంబులన్= నేల, నింగి ప్రదేశాలను; క్రింది మీది దౌడలన్ హత్తించి= కింది దౌడతో నేలను పై దౌడతో నింగిని అదిమిపట్టి; నభోమండలంబునున్+పోలెన్= ఆకాశమండలంవలె; తుదిమొదలు+ఎఱుంగరాక= చివర మొదలు తెలియక; వికృతంబుగా= వికారంగా; వక్త్రంబు= నోరు, తెఱచి= తెరచి; మందర= మందర పర్వతమనే; మథన= కవ్వంతో; మథ్యమాన= చిలుకబడుతున్న; విషధర= పామునుండి; జనిత= పుట్టిన; విషవిషమ జిహ్వా+ఆభీలంబగు= విషంవలె ఘోరంగా భీకరమైన; నాలుక= నాలుకతో; నభంబున్ నాకుచున్= ఆకాశాన్ని నాకుతూ; కాలసంహారకారణుండైన= ప్రళయకాలంలో చంపడానికి హేతువైన; కాలుని భుజదండ మండితంబగు= యముని బాహుదండంవలె అలంకరింపబడిన; దండంబునుంబోని= కర్రవంటి; దంష్ట్రలచేతన్= కోరలతో; జగత్+త్రయంబును= ముల్లోకాలను; మ్రింగెడువానిన్ పోలె= మింగేవానివలె; అతిమాత్ర మహాకాయుండై= మిక్కిలి గొప్ప శరీరం గలవాడై; పర్వతంబులన్= కొండలను; తలంగన్ మీటుచున్= తొలగేటట్లు నొక్కుతూ; నడగొండయున్+పోలెన్= నడిచే కొండవలె; నభోభాగ భూభాగంబులన్= నింగి, నేల ప్రదేశాలను; ఆక్రమించి= లోబరచుకొని; అప్పుడు...

**తా :** ఈ విధంగా తనను పొగడుతున్న ఇంద్రుణ్ణి చూచి వృత్రుడు యుద్ధసంఘర్షణను కోరినవాడై, శత్రువును ప్రేరేపిస్తూ, తన ఎడమచేతితో ఇనుప గుదియను తిప్పుతూ, క్రోధంతో ఎగిసిపడుతూ, బ్రహ్మాండభాండాన్ని ఘోరశబ్దాలతో పగులగొడుతూ, బలిసిన మదపుటేనుగు ఎద్దుపైకి ఉరికినట్లు ఇంద్రునిపైకి ఎగసి, అతడి వక్షఃస్థలాన్ని గురిచూచి మోదగా, ఇంద్రుడు తన వజ్రాయుధంతో దాన్ని మసిజేసి, వెంటనే వృత్రుని ఎడమచేతిని కూడా నరికాడు. ఇలా రెండు చేతులూ పోయి, నెత్తురులొలుకుతూ వృత్రుడు పూర్వకాలాన ఇంద్రుడు రెక్కలు నరకగా జారిపడుతున్న కొండవలె, లయకాలపు చూడరాని భయంకర భ్రుకుటితో, తన రెండు దౌడలను పైదవడతో ఆకాశాన్ని కిందిదానితో భూమిని అదిమిపట్టి, తన తుదిమొదలు కానరానీయక, వికారంగా నోరుదెరచి, మందరపర్వతంతో దేవదానవులు సముద్రమథనం చేసినపుడు వెలువడిన భీకర విషజ్వాలవంటి నాలుకతో ఆకాశాన్ని నాకుతూ, యుగాంతపు యమునిచేతి దండాల వంటి కోరలతో ముల్లోకాలను మింగబోయేవానివలె మహాకాయుడై, కొండలను అటూ ఇటూ త్రిప్పుతూ, నడిచే కొండలాగా నేలనూ నింగినీ ఆక్రమించాడు. ఆ సమయంలో

**ఉ. కాలమునాఁటి మృత్యువుముఖంబునఁ బోలెను విస్ఫులింగముల్**
**గ్రాలఁగ దేవసంఘములు కంపమునొంద జగంబులెల్ల నా**
**హా లులి తారవం బెసఁగ నభ్రగజంబును నాయుధంబుతో**
**నాలుకఁ జుట్టి పట్టి సురనాథుని మ్రింగె మహాద్భుతాకృతిన్. 425**

**ప్రతి :** కాలమునాఁటి= ప్రళయకాలంనాటి; మృత్యుముఖంబునన్+పోలెను= మృత్యుదేవత ముఖంలోవలె; విస్ఫులింగముల్ క్రాలఁగన్= నిప్పురవ్వలు వెల్వడగా; దేవసంఘములు= సురసమూహాలు; కంపమున్+ఒందన్= వణుకు పొందగా; జగంబులు+ఎల్లన్= లోకాలన్నింటిలో; 'ఆహా'లులిత+ఆరవంబు+ఎసఁగన్= 'ఆహా' అనే శబ్దాలు అతిశయించగా; అభ్రగజంబును= ఐరావతాన్ని; ఆయుధంబుతోన్= శస్త్రంతో; నాలుకన్+చుట్టి= నాలుకతో చుట్టి; పట్టి= పట్టుకొని; మహా+అద్భుత+ఆకృతిన్= మిక్కిలి అబ్బురమైన స్వరూపంతో; సురనాథుని మ్రింగెన్= ఇంద్రుణ్ణి మింగాడు.

**తా :** ప్రళయకాలంలో మృత్యుదేవత ముఖంనుండి వెలువడినట్లు, తన నోటినుండి అగ్నిజ్వాలలు వెలువడుతుండగా, దేవసమూహం భయంతో వణుకుతుండగా, లోకాలన్నీ 'ఆహా' అంటూ అరుస్తుండగా ఐరావతాన్ని ఆయుధంతో చుట్టివేసి, పట్టుకొని ఇంద్రుణ్ణి మహా ఆశ్చర్యకరంగా మింగివేశాడు వృత్రుడు.

**ఆ. లోకమెల్ల నపుడు చీకాకు పడెఁ దమం, బడరె నుడుగణంబు లవనిఁ బడియె,**
**సోనవానఁ గురిసె సూర్యచంద్రాగ్నుల, రశ్మి లుడిగె దిశలు రభస మయ్యె. 426**

**ప్రతి :** అపుడు; లోకము+ఎల్లన్= జగమంతా, చీకాకు పడెన్= క్షోభ పొందింది; తమంబు= చీకటి; అడరెన్= వ్యాపించింది; ఉడుగణంబులు= నక్షత్రసమూహాలు; అవనిన్+పడియెన్= భూమిపైపడ్డాయి; సోనవాన కురిసెన్= చిరుజల్లు కురిసింది; సూర్యచంద్ర+అగ్నుల రశ్మలు= సూర్యుని చంద్రుని అగ్నియొక్క కాంతులు; ఉడిగెన్= నశించాయి; దిశలు= దిక్కులు; రభసము+అయ్యెన్= తొట్రుపాటుపడ్డాయి.

**తా :** అపుడు లోకాలన్నీ చీకాకుపడ్డాయి. చీకటి ముసిరింది. ఆకాశంనుండి చుక్కల గుంపులు నేలరాలిపడ్డాయి. చిరుజల్లు కురిసింది. సూర్య చంద్ర అగ్నుల కాంతులు నశించాయి. దిక్కులు తబ్బిబ్బుపడ్డాయి.

**వ. అప్పుడు. 427**

**ప్రతి :** అప్పుడు= ఆ సమయంలో...

**ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన మొందఁడు పెద్దనిద్దురం**
**జెందఁడు దత్తఱింపఁడు విశేషము చెప్పఁడు వైష్ణవీ జయా**
**నందపరైక విద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁగాని సం**
**క్రందనుఁ డానిశాచరుని గర్భములో హరిరక్షితాంగుఁడై. 428**

**ప్రతి :** ఆనిశాచరుని గర్భములోన్= ఆ రాక్షసుని కడుపులో; సంక్రందనుఁడు= ఇంద్రుడు; వైష్ణవీ జయ+ఆనందపర+ఏకవిద్యను= విష్ణువునకు చెందిన జయాన్ని, ఆనందాన్ని ఇచ్చే ముఖ్యమైన విద్యను; మనంబునన్+తాల్చుచున్= హృదయంలో ధరించినవాడై; ఉండెన్+కాని= ఉన్నాడేగాని; హరిరక్షిత+అంగుఁడై= విష్ణువుచే కాపాడబడ్డ శరీరం గలవాడై; కందఁడు=

కృశించదు; భీతిన్+కుందఁడు= భయంతో దుఃఖించదు; ప్రకంపనము+ఒందఁడు= వణుకును పొందదు; పెద్దనిద్దురన్+చెందఁడు= చావును పొందదు; తత్తఱింపఁడు= తత్తరపడదు; విశేషము చెప్పడు= ఏ విశేషాన్నీ చెప్పదు.

**తా :** వృత్రుడు మింగినా ఇంద్రుడు అతడి కడుపులో చెక్కుచెదరకుండా, నిబ్బరంగా ఉన్నాడు. ఎందుకంటే, అతనిని శ్రీహరి రక్షిస్తూ ఉన్నాడు. ఇంద్రుడు గూడ జయాన్ని ఆనందాన్ని అందించే వైష్ణవీ విద్యను మనస్సులో నిలిపి, కందకుండా, భయపడకుండా, వణకకుండా, తత్తరపడకుండా, ఏ విశేషాన్నీ చెప్పకుండా నిశ్చలంగా ఉన్నాడు.

**వ. ఇట్లు కవచరూప శ్రీమన్నారాయణ కృపాపాలితుండై యోగబలంబున బలభేది యతని యుదరంబు వజ్రాయుధంబున భేదించి, యైరావణసహితుం డై వెడలి, యతని కంధరంబు తెగనడువ వజ్రంబు ప్రయోగించిన, నతి నిష్ఠురవేగంబున వృత్రహరణార్థంబుగం దిరుగుచు సూర్యాది గ్రహ నక్షత్రంబులకు దక్షిణోత్తర గతిరూపంబైన సంవత్సర సంధియందు నహోరాత్రమధ్యంబున వృత్రుశిరంబు పర్వత శిఖరంబునుంబోలెఁ ద్రుంచి కూలం ద్రోచె. నప్పుడు. 429**

**ప్రతి :** ఇట్లు, కవచరూప= ఇనుప చొక్కా ఆకారంతో; శ్రీమత్+నారాయణ కృపాపాలితుండై= లక్ష్మితో గూడిన శ్రీహరి దయతో రక్షితుడై; యోగబలంబునన్= యోగవిద్యాశక్తితో; బలభేది= ఇంద్రుడు; అతని ఉదరంబున్= ఆ వృత్రుని పొట్టను; వజ్ర+ఆయుధంబునన్= వజ్రాయుధంతో; భేదించి= చీల్చి; ఐరావణసహితుండై వెడలి= ఐరావతంతో కూడా బయటపడి; అతని కంధరంబున్= అతనిమెడను; తెగనడువన్= నరికివేయడానికి; వజ్రంబు ప్రయోగించినన్= వజ్రాయుధాన్ని విసరగా; అతినిష్ఠురవేగంబునన్= మిక్కిలి వేగంతో; వృత్రహరణ+అర్థంబుగన్+తిరుగుచున్= వృత్రుణ్ణి చంపడానికి తిరుగుతూ; సూర్య+ఆది గ్రహనక్షత్రంబులకున్= సూర్యుడు మొదలయిన గ్రహాలకూ, చుక్కలకూ; దక్షిణ+ఉత్తర గతిరూపంబైన= దక్షిణాయన, ఉత్తరాయణ గమన విధి అయిన; సంవత్సర సంధియందున్= సంవత్సరం మధ్యలో; అహస్+రాత్రమధ్యంబునన్= పగటికి రాత్రికి మధ్యలో; వృత్రుశిరంబున్= వృత్రుని తలను; పర్వతశిఖరంబునున్+పోలెన్= కొండ కొననువలె; త్రుంచి= నరికి; కూలన్+త్రోచెన్= పడగొట్టాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** ఈ విధంగా శ్రీహరి కృపనే కవచంగా ధరించినవాడై ఇంద్రుడు, వృత్రుని పొట్టను వజ్రాయుధంతో చీల్చి, ఐరావతంతో కూడా బయటపడి, శత్రువు మెడను నరకడానికి వజ్రాన్ని ప్రయోగిస్తే, అది అతివేగంతో తిరుగుతూ సంవత్సరపు సంధికాలాన, సూర్యాది గ్రహనక్షత్రాలు, దక్షిణాయనం – ఉత్తరాయణం అంటూ తిరిగే కాలానికి మధ్యలో, పగటికి చీకటికి నడుమ, వృత్రుని చేరి అతని తలను పెద్ద కొండనువలె త్రుంచి నేలగూల్చింది. అప్పుడు,

**మ. మొరసెం దుందుభు లంబరంబునఁ గడున్ మోదించి గంధర్వులున్**
**సురలున్ సాధ్యులు సిద్ధులున్ మునివరుల్ సొంపార వృత్రఘ్ను భీ**
**కర తేజోవిభవ ప్రకాశకర విఖ్యాతైక మంత్రంబులం**
**దిర మొప్పం బఠియించుచుం గురిసి రెంతేఁ గ్రొత్త పూ సోనలన్. 430**

**ప్రతి :** అంబరంబునన్= ఆకాశంలో; దుందుభులు= భేరీలు; మొరసెన్= మ్రోగాయి; కడున్మోదించి= ఎంతో సంతోషించి; గంధర్వులున్, సురలున్, సాధ్యులు, సిద్ధులున్= గంధర్వులు మొదలయిన వీరందరు దేవతలలోని వేరువేరు జాతులు; మునివరుల్= ఋషిశ్రేష్ఠులు; సొంపు+ఆరన్= సంతోషం కలుగుతుండగా; వృత్రఘ్ను= వృత్రుని చంపిన; భీకర= భయంకరమైన;

తేజస్+విభవ ప్రకాశకర= కాంతి వైభవంతో వెలుగునిచ్చే; విఖ్యాత+ఏకమంత్రంబులన్= ప్రసిద్ధమైన ముఖ్య మంత్రాలతో; తిరము+ఒప్పన్= స్థైర్యం వెలుగొందగా; పఠియించుచున్= చదువుతూ; ఎంతేన్= ఎంతగానో; క్రొత్త పూసోనలన్= కొత్త పూలవానలను; కురిసిరి= కురిపించారు.

**తా :** ఆ సమయంలో ఆకాశంలో దేవదుందుభులు మ్రోగాయి. గంధర్వులూ, దేవతలూ, సాధ్యులూ, సిద్ధులూ, మునీంద్రులూ మిక్కిలి ఆనందించి వృత్రసంహారం చేసిన ఇంద్రుడి తేజో వైభవాన్ని ప్రకాశింపజేసే ప్రశస్తతర మంత్రాలు పఠిస్తూ పూలవానలు కురిపించారు.

**ఆ. ఏమి చెప్ప నప్పు డింద్రారి తనువున, నొక్క దివ్యతేజ ముబ్బి వెడలి**
**లోకమెల్లఁ జూడ లోకంబు చూడని, లోక మరిగి విష్ణులోను సొచ్చె. 431**

**ప్రతి :** అప్పుడు; ఇంద్ర+అరి తనువునన్= ఇంద్రుని శత్రువైన వృత్రుని శరీరంనుండి; ఒక్క దివ్యతేజము= ఒక దివ్యమైన కాంతి; ఉబ్బి వెడలి= పుట్టి వెలికివచ్చి; లోకము+ఎల్లన్చూడన్= లోకమంతా చూస్తుండగా; లోకంబుచూడని= (ఇంతవరకు) లోకానికి కనబడని; లోకము+అరిగి= లోకానికి వెళ్లి; విష్ణులోను+చొచ్చెన్= విష్ణువులో ప్రవేశించింది; ఏమిచెప్పన్= ఎలా చెప్పేది.

**తా :** వృత్రుని తలతెగిన పిదప అతని శరీరం నుండి దివ్యకాంతి ఒకటి బయల్వెడలి, లోకులలెల్లరూ చూస్తుండగా అంతవరకు చూడని లోకమైన విష్ణులోకానికి చేరి విష్ణువులో లీనమైంది.

**వ. ఇట్లు లోకభీకరుం డైన వృత్రాసురుండు గూలిన, నఖిల లోకంబులుఁ బరితాపంబు లుడిగి సుస్థితిం బొందె, దేవ ఋషి పితృగణంబులు దానవులతోడం గూడి, యింద్రునకుం జెప్పక తమ తమ స్థానంబులకుం జనిరి అనిన విని, పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 432**

**ప్రతి :** ఇట్లు, లోకభీకరుండైన= లోకాలకు భయంకలిగించే; వృత్ర+అసురుండు, కూలన్= చావగా; అఖిలలోకంబులు= లోకాలు; పరితాపంబులు+ఉడిగి= బాధలు నశించి; సుస్థితిన్ పొందెన్= మంచి స్థితిని పొందాయి; దేవఋషి పితృగణంబులు= సురలు, ఋషులు, పితరులు – వీరి సమూహాలు; దానవులతోడన్+కూడి= రాక్షసులతో కలిసి; ఇంద్రునకున్+చెప్పక= ఇంద్రునికి చెప్పకుండా; తమ తమ స్థానంబులకున్= తమ తమ నివాస ప్రాంతాలకు; చనిరి= వెళ్లారు; అనినన్, విని, పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; శుకయోగి+ఇంద్రునకున్= శుకమహర్షితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు;

**తా :** ఇలా వృత్రుని చావుతో ఎల్లలోకాలూ కష్టాలుపోయి శాంతించాయి. దేవతలు, ఋషులు, పితృదేవతలు, రాక్షసగణంతో కలిసి, ఇంద్రునకు చెప్పకుండా తమ తమ నెలవులకు వెళ్ళారు. అని శుకుడు పరీక్షిత్తునకు చెప్పగా ఆయన శుకునితో ఇలా అన్నాడు.

**తే. ఏమి కారణమున నింద్రుతోఁ బలుకక, సురలు వోయి? రట్టి సురగణంబు**
**లెందుచేత సుఖముఁ జెందిరి? వజ్రికిఁ జేటు గలుగు టెట్లు? చెప్పు మయ్య! 433**

**ప్రతి :** ఏమి కారణమునన్= ఏ కారణంగా; ఇంద్రుతోన్+పలుకక= ఇంద్రునితో చెప్పకుండా; సురలు+పోయిరి?= దేవతలు వెళ్లారు; అట్టి సురగణంబులు= ఆ దేవతల సమూహాలు; ఎందుచేతన్= దేనివలన; సుఖమున్+చెందిరి= సుఖం పొందారు; వజ్రికిన్= ఇంద్రునకు; చేటు కల్గుట= దుర్దశ కలగడం; ఎట్లు?= ఎలా సంభవించింది. చెప్పుము+అయ్యా!= చెప్పవయ్యా శుకయోగీ!

**తా :** సురలు ఇంద్రునితో చెప్పకుండా వెళ్ళిపోవడానికి కారణం ఏమిటి? అలాంటప్పుడు వారు ఎలా సుఖశాంతులు పొందారు? ఇంతకూ, ఇంద్రునికి కీడు ఎలా జరిగింది? చెప్పవయ్యా శుకయోగీ!

**వ. అనిన శుకుం డిట్లనియె. వృత్రపరాక్రమ చకితులైన నిఖిలదేవతలును మహర్షిగణంబులును, మున్ను వృత్రవధార్థం బింద్రునిం బ్రార్థించిన, నతండు బ్రహ్మహత్య చేయఁజాలక, తొల్లియు విశ్వరూపునిం జంపిన పాపంబు స్త్రీలయందును, భూమియందును, జలంబులందును, ద్రుమంబులందును విభజించి పెట్టితి, ఇపు డీ హత్య యేరీతిం బాపుకొనువాఁడ? నా కశక్యంబు అనిన మహర్షు లశ్వమేధయజ్ఞంబు సేయించి, యజ్ఞపురుషుండైన శ్రీ నారాయణదేవుని సంతుష్టునిం జేసి, యీ హత్యఁ బాపం గలవారము. స్వభావంబున బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జన హంతలైనవార లే దేవునిం గీర్తించి శుద్ధాత్ము లగుదురు, అద్దేవుని నశ్వమేధ మహామఖంబున శ్రద్ధాన్వితుండవై సేవించిన నీకు ఖలుండైన యి దుర్దురాత్ముని హింసించిన హత్య యేమి సేయంగలదు? అని యొడంబఱచిన, నింద్రుండు వల్లెయని యీ విధంబున శత్రునిం బరిమార్చి, బ్రహ్మహత్యం బొంది, యప్పాపంబు భరియింప నోపక దుర్దశం బొందె. నప్పుడు. 434**

**ప్రతి :** అనినన్= అని అడుగగా; శుకుండు, ఇట్లనియెన్= ఇలా అన్నాడు; వృత్రపరాక్రమచకితులైన= వృత్రుని వీరత్వానికి ఆశ్చర్యపడిన; నిఖిల దేవతలును= దేవతలందరూ; మహర్షి గణంబులును= మునుల సమూహాలూ; మున్ను= పూర్వం; వృత్రవధ+అర్థంబు= వృత్రుని సంహారంకోసం; ప్రార్థించినన్= వేడగా; ఆతండు= ఆ ఇంద్రుడు; బ్రహ్మహత్యచేయన్+చాలక= బ్రాహ్మణుని చంపలేక; తొల్లియు= ముందుగూడ; విశ్వరూపునిన్+చంపినపాపంబు= విశ్వరూపుని చంపినందువల్ల ఏర్పడిన పాపం; స్త్రీలయందును= స్త్రీ జాతియందును, భూమియందును; జలంబులందును= నీళ్లయందును; ద్రుమంబులందును= చెట్లయందును; విభజించి పెట్టితిన్= భాగాలుచేసి పంచాను; ఇపుఁడు= ఇప్పుడు; ఈ హత్య= ఈ వృత్రుణ్ణి చంపటం; ఏ రీతిన్= ఏ విధంగా; పాపుకొనువాఁడన్= తొలగించుకోగలను?; నాకు+అశక్యంబు= నాకు సాధ్యంకానిది; అనినన్= అనగా; మహర్షులు= మునులు; అశ్వమేధయజ్ఞంబు= అశ్వమేధ యజ్ఞం; చేయించి= నిర్వహించి; యజ్ఞపురుషుండైన= యాగభోక్త అయిన; శ్రీనారాయణ దేవునిన్= శ్రీహరిని; సంతుష్టునిన్+చేసి= సంతృప్తి పరచి; ఈ హత్యన్= ఈ హత్యను; పాపన్+కలవారము= తొలగించగలం; స్వభావంబునన్= సహజంగా; బ్రాహ్మణ పితృ గో మాతృ సజ్జన హంతకులైనవారలు= బ్రహ్మసంతతిని, తండ్రులను, గోవులను, తల్లులను, మంచివారిని చంపినవారు; ఏ దేవునిన్= ఏ వేలుపును; కీర్తించి= స్తుతించి; శుద్ధ+ఆత్ములు= పాపం తొలగి పరిశుద్ధమైన మనస్సులుగలవారు; అగుదురు= అవుతారో; ఆ+దేవునిన్= ఆ దేవుడైన శ్రీహరిని; అశ్వమేధ మహామఖంబునన్= అశ్వమేధ మహాయాగంతో; శ్రద్ధా+అన్వితుండవై= శ్రద్ధతో కూడినవాడవై; సేవించినన్= ఆశ్రయిస్తే; నీకు, ఖలుండైన= దుష్టుడైన; ఈ+దురాత్ముని హింసించిన హత్య= ఈ దుర్మార్గుణ్ణి చంపిన హత్య, ఏమి+చేయన్+కలదు?= ఏమి చేస్తుంది?; అని; ఒడంబఱచినన్= అంగీకరింపజేయగా; ఇంద్రుండు; వల్లె+అని= సరేనని; ఈ విధంబునన్= ఈ రకంగా; శత్రునిన్= విరోధిని; పరిమార్చి= చంపి; బ్రహ్మహత్యన్+పొంది= బ్రాహ్మణ హత్యను,

దానివలన పాపాన్ని పొంది; ఆ+పాపంబు= ఆ పాపాన్ని; భరియింపన్+ఓపక= మోయలేక; దుర్దశన్+పొందెన్= దురవస్థపాలయ్యాడు.

**తా :** పరీక్షిన్మహారాజుతో శుకుడిలా అన్నాడు– వృత్రుని శక్తికి భీతిల్లిన దేవతలు, ఋషులు పూర్వం వృత్రుని చంపమని ఇంద్రుని వేడగా, అతడు బ్రాహ్మణహత్య చేయలేక, "ముందుగూడ విశ్వరూపుణ్ణి చంపినపాపాన్ని భరించలేక, దాన్ని స్త్రీలకు కొంత, నేలకుకొంత, నీటికికొంత, చెట్లకుకొంత అప్పగించాను. ఇపుడు మళ్లీ మరొక బ్రహ్మహత్యచేస్తే, దాని పాపఫలితాన్ని ఎట్లా తొలగించుకోవాలి" అన్నాడు. అపుడు దేవమునివర్గం ఈ పాపాన్ని అశ్వమేధయాగం చేయించి, యాగపురుషుడైన విష్ణువును మెప్పించి, నిన్ను పాపవిముక్తుని చేయగలం. సహజంగానే బ్రాహ్మణులను, తండ్రులను, ఆవులను, తల్లులను చంపినవారే అయినా, శ్రీహరిని సేవించి పాపవిముక్తులవుతారు. అశ్వమేధయాగ నిర్వహణతో శ్రీహరిని సేవిస్తే వృత్రుని చంపినందువల్ల కలిగిన పాపం నిన్ను ఏమిచేస్తుంది అని ఇంద్రుణ్ణి అంగీకరింపజేశారు. ఇంద్రుడు అంగీకరించి వృత్రుణ్ణి వధించి, దానివలన పాపం పొంది, ఆ పాపాన్ని భరించలేని దుర్దశను పొందాడు.

**సీ. పాపంబుఁ జండాలరూపంబు గలదాని ముదిమిచే నొడలెల్లఁ గదలు దానిఁ**
**క్షయకుష్ఠరోగ సంచయకృతం బగు దాని నురురక్త పూరంబుఁ దొరఁగు దాని**
**నెరసిన వెండ్రుకల్ బెరసిన తలదాని నటఁ బోకుపో కుండు మనెడు దానిఁ**
**గదురు కంపునఁ బ్రేవు లదరఁ జేసెడుదానిఁ దా నెందుఁ బాఱినఁ దఱుము దాని**

**ఆ. నాగుణంబు లెల్ల భోగింప కేరీతి, నరుగ నెంతవాఁడ వనెడు దాని**
**బిట్టు దిరిగి చూచి భీతిల్లి సిగ్గుతో, దేవనాయకుండు దెఱలి పఱచె. 435**

**ప్రతి :** పాపంబున్= బ్రహ్మహత్యవలన కలిగిన పాపాన్ని (నన్ను); చండాలరూపంబుగలదానిన్= చండాలరూపం గలదాన్ని; ముదిమిచేన్= వయస్సు ఉడుగుటవలన; ఒడలు+ఎల్లన్+కదలుదానిన్= శరీరమంతా వణకుతున్నదాన్ని; క్షయకుష్ఠరోగ సంచయ కృతంబగుదాని= క్షయ, కుష్ఠు మొదలైన రోగాలతో కూడినదాన్ని; ఉరురక్త పూరంబున్= ఎక్కువ నెత్తుటిధార; తొరఁగుదానిన్= కారుతున్నదాన్ని; నెరసిన వెండ్రుకల్ బెరసిన తలదానిన్= తెల్లబడిన వెంట్రుకలు నిండిన తలగలదాన్ని; అటన్+పోక+ఉండుము+అనెడుదానిన్= అటు వెళ్లకుండా ఉండు అని పలికేదాన్ని; కదురుకంపునన్+ ప్రేవులు+అదరన్+ చేసెడుదానిన్= అధికమగు దుర్వాసనతో పొట్టలోని పేగులు కదలజేసుకొంటున్నదాన్ని; తాన్+ఎందున్+పాఱినన్+ తఱుముదానిన్= తాను ఎక్కడకు పరుగెత్తినా (వెన్నంటి) తఱిమేదాన్ని; నా గుణంబులెల్లన్ భోగింపక= నా లక్షణాలన్నింటినీ అనుభవించకుండా; ఏ రీతిన్+అరుగన్= ఏ విధంగా వెళ్ళటానికి; ఎంతవాడఁవు+అనెడుదానిన్= నీవెంతవాడవు అనేదాన్ని; బిట్టు= ఎక్కువగా; తిరిగి చూచి= మరలిచూస్తూ; భీతిల్లి= భయపడి; దేవనాయకుండు= ఇంద్రుడు, సిగ్గుతో; తెఱలిపఱచెన్= బయటకు పరుగెత్తాడు.

**తా :** బ్రహ్మహత్య భయంకరాకారంతో దేవేంద్రుణ్ణి వెంబడించింది. ఆ మహాపాపం చండాలరూపం ధరించి ముసలితనంతో ఒడలంతా ముడతలుపడి గడగడ వణుకుతూ నడచి వస్తున్నది. క్షయరోగంతో కుష్ఠరోగంతో దాని శరీరమంతా నెత్తురు చిమ్ముతున్నది. నెరసిన జుట్టు విరబోసుకొని 'ఆగు ఆగు!', 'పోకు పోకు!', 'ఉండు ఉండు!' అంటూ వెంటాడసాగింది. దేహమంతా దుర్గంధంతో వాంతి వచ్చి పేగులు తరుక్కుపోయే కంపుకొడుతున్నది. ఇంద్రుడు ఏ పక్కకుపోతే ఆ పక్కకూ పరుగెత్తుతూ వెంటబడి తరుముతున్నది. 'ఇదిగో! నాకు లోబడకుండా నన్ను అనుభవించకుండా ఎక్కడికి పోతావో ఎట్లా

పోతావో చూస్తాగా. నీవెంత!' అంటూ అరుస్తున్నది. వెంట పరుగిడుతూ వస్తున్న బ్రహ్మహత్యను తిరిగి తిరిగి చూస్తూ భయంతో సిగ్గుతో దేవేంద్రుడు పారిపోసాగాడు.

**వ. ఇ ట్లతి వికృతరూపంబుతోఁ బ్రహ్మహత్య వెనుతగుల నింద్రుండు నభోభాగ భూభాగ దిగ్భాగంబు లెల్లం దిరిగి, చొరం దెరువులేక దీర్ఘ నిర్ఘాతాటోప నిశ్వాస దూషితుండై, యీశాన్య భాగంబునకుం బఱచి, యద్దెస నమేయ పుణ్యగణ్యంబైన మానససరస్సుం బ్రవేశించి, యందు నొక్క కమలనాళంబు సొచ్చి, యందుఁ దంతువులం గలసి, రూపంబు లేక యలబ్ధభోగుండై, బ్రహ్మహత్యావిమోచనంబుఁ జింతించికొనుచు సహస్రవర్షంబు లుండె; ఆ చండాలియు నది పరమేశ్వర దిగ్భాగం బగుటం జేసి యందుం జొరరాక కాచియుండె; అంతకాలంబుఁ ద్రిదివంబున నహుషుండు విద్యాబల తపోబల యోగబలంబులం బాలించుచుండి, సంపదైశ్వర్యమదాంధుండై, యింద్రపత్నిం గోరి, యింద్రుండు వచ్చునందాఁక నాకుం బత్నివి గమ్మనిన, నా శచీదేవియును బృహస్పతి ప్రేరితయై, బ్రహ్మర్షి వాహ్యశిబికంబు నెక్కివచ్చి, నన్ను భోగింపు మనిన, నతం డట్లు చేసి, కుంభసంభవ శాపహతుండై, యజగరయోనియందుఁ బుట్టె. నంత నింద్రుండు బ్రహ్మర్షి గణోపహూతుండై, త్రిదివంబునకు వచ్చె; అంతకాలంబు నారాయణ చరణారవింద ధ్యానపరుండై యుండుటం జేసియు, దిశాధినాయకుండైన శంకరుచేత రక్షింపఁబడ్డవాఁడై యుండుటం జేసియుఁ, ద ద్దోషబలంబు దఱిగి, సహస్రాక్షుం బీడింపలే దయ్యె; నప్పు డింద్రుండు నిజైశ్వర్యంబునుం బొంది, బ్రహ్మర్షి పరివృతుండై, మహిపురుషారాధనంబు చేసి, హయామేధాధ్వరంబునకుం దీక్ష గైకొని, బ్రహ్మర్షులచేత యజనంబు సేయింపఁ బడుచున్న వాఁడై, సర్వదేవతామయుండైన నారాయణుం బరితృప్తుం జేసి, మంచు విరియించు మార్తాండుని చందంబునఁ ద్వాష్ట్ర వధరూప పాపంబును నాశంబు నొందించి, సకల దివిజ యక్ష గంధర్వ సిద్ధ మునిజన సంస్తూయమానుండయి త్రిభువనైశ్వర్య భోగభాగ్యంబులం గైకొనియె; అప్పుడు. 436**

**ప్రతి :** ఇట్లు; అతివికృతరూపంబుతోన్= మిక్కిలి వికారమైన ఆకారంతో; బ్రహ్మహత్య= బ్రహ్మ హత్యవలన కలిగిన పాపం; వెనుదగులన్= వెంబడింపగా; నభోభాగభూభాగదిగ్భాగంబులు+ఎల్లన్= ఆకాశం, నేల, దిక్కులు – ఇలా అన్నిచోట్ల; తిరిగి= సంచరించి; చొరన్+తెరువులేక= ప్రవేశించడానికి దారిలేక; దీర్ఘనిర్ఘాత+ఆటోప నిశ్వాస దూషితుండై= పెద్ద తుఫానుగాలి తీవ్రతగల నిట్టూర్పులతో భంగపడినవాడై; ఈశాన్యభాగంబునకున్+పఱచి= ఈశాన్యపు (ఈశానుడు పాలించే) దిక్కునకు పరుగెత్తి; ఆ+దెసన్= ఆ దిక్కున; అమేయపుణ్యగణ్యంబైన= కొలువరాని పుణ్యంతో వన్నెకెక్కిన; మానససరస్సున్= 'మానసము' అను పేరుగల కొలనులో; ప్రవేశించి; అందున్= దానిలో; ఒక్క కమల నాళంబు+చొచ్చి= ఒక తామరతూడు లోపలికి వెళ్లి; అందున్= ఆ తూడులో; తంతువులన్+కలసి= దారాలను చేరి; రూపంబులేక= ఆకృతిలేక; అలబ్ధభోగుండై= సుఖానుభవాలు లభింపనివాడై; బ్రహ్మహత్యావిమోచనంబున్+చింతించుకొనుచున్= బ్రహ్మహత్యాపాపాన్ని తొలగించు కోవడాన్ని గురించి ఆలోచిస్తూ; సహస్రవర్షంబులు+ఉండెన్= వేయి సంవత్సరాలు గడిపాడు; ఆ చండాలియున్= ఆ చండాలికకూడ; అది= ఆ దిక్కు; పరమ+ఈశ్వర దిగ్భాగంబు+అగుటన్+చేసి= పరమేశ్వరుని దిక్కుకు చెందింది కావడంవల్ల; అందున్+చొరరాక= ఆ దిక్కులో ప్రవేశించలేక; కాచి+ఉండెన్= వేచి నిలిచింది; అంతకాలంబున్= ఇంద్రుడు లేని ఆ

కాలంలో; త్రిదివంబునన్= స్వర్గంలో; నహుషుండు= ఆ పేరుగలరాజు; విద్యాబల తపోబల యోగబలంబులన్+ పాలించుచున్+ఉండి= చదువు తపస్సు యోగం ఈ మూడింటి బలంతో పాలనచేస్తూ ఉండి; సంపత్+ఐశ్వర్యమద+అంధుండై= సంపదలవలన, రాజరికంవలన కలిగిన పొగరుతో గుడ్డివాడై; ఇంద్రపత్నిన్+కోరి= ఇంద్రుని భార్య అయిన శచీదేవిని మోహించి; ఇంద్రుండు వచ్చునందాఁక= ఇంద్రుడు తిరిగి వచ్చేవరకు; నాకున్+పత్నివి+కమ్ము+అనినన్= నాకు ఆలివి కమ్మని అన్నపుడు; ఆ శచీదేవియును= ఆ శచీదేవి కూడా; బృహస్పతిప్రేరిత+ఐ= దేవగురునిచే ప్రేరేపింపబడినదై; బ్రహ్మర్షి వాహ్యశిబికంబున్+ఎక్కివచ్చి= బ్రహ్మర్షులచే మోయబడే పల్లకిలో ఎక్కివచ్చి; నన్నున్= నన్ను; భోగింపుము+అనినన్= అనుభవింపుము అనగా; అతండు= ఆ నహుషుడు; అట్లుచేసి= అలా పల్లకినెక్కివస్తూ; కుంభసంభవశాపహతుండై= అగస్త్యుని శాపంతో నశించినవాడై; అజగరయోనియందున్= కొండచిలువ జాతిలో; పుట్టెన్= జన్మించాడు; అంతన్= ఆ తరువాత; ఇంద్రుండు; బ్రహ్మర్షిగణ+ఉపహూతుండై= బ్రహ్మర్షులచేత పిలువబడినవాడై; త్రిదివంబునకున్= స్వర్గానికి; వచ్చెన్= వచ్చాడు; అంతకాలంబు= అంతవరకు; నారాయణ చరణ+అరవింద ధ్యాపరుండై+ఉండుటన్+చేసియున్= హరిపాదపద్మాల స్మరణతో గడుపుతూ ఉండడంవలన; దిశా+అధినాయకుండైన శంకరుచేతన్= దిక్పతియైన శివునిచేత; రక్షింపబడ్డవాఁడై+ ఉండుటన్+చేసియున్= కాపాడబడుతూ ఉండడంవల్ల; తత్+దోషబలంబు+తఱిగి= ఆ పాపబలం క్షీణించి; సహస్ర+అక్షున్= ఇంద్రుణ్ణి; పీడింపన్ లేదు+అయ్యెన్= బాధించలేకపోయింది; అప్పుడు; ఇంద్రుండు; నిజ+ ఐశ్వర్యంబునున్+పొంది= తన రాజరికం పొంది; బ్రహ్మ+ఋషిపరివృతుండై= బ్రహ్మర్షులతో కూడినవాడై; మహిన్ పురుష+ఆరాధనంబుచేసి= భూమిపై విష్ణువును సేవించటంవల్ల; (పురుషశబ్దానికి విష్ణువు అని అర్థం – హయమేధ+ అధ్వరంబునకున్= అశ్వమేధయాగానికి; దీక్షగైకొని= దీక్షబూని; బ్రహ్మర్షులచేతన్; యజనంబు= యజ్ఞం; చేయింపన్+ పడుచున్+ఉన్నవాఁడై= చేయిస్తూ ఉన్నవాడై; సర్వదేవతామయుండైన= దేవతలందరి సమన్వయ రూపమైన; నారాయణున్+ పరితృప్తున్+చేసి= శ్రీహరిని సంప్రీతుణ్ణి చేసి; మంచున్+విరియించు= మంచును రూపు మాపే; మార్తాండుని చందంబునన్= సూర్యునివలె; త్వాష్ట్రవధరూపపాపంబును= బ్రహ్మహత్య అనే పాపాన్ని; నాశంబున్+ఒందించి= నశింపజేసి; సకల= ఎల్ల; దివిజ= సురలు; యక్ష, గంధర్వ, సిద్ధ – ఈ మూడు దేవజాతులూ; మునిజన= ఋషిజనులచేత; సంస్తూయమానుండయి= స్తుతింపబడుతున్నవాడై; త్రిభువన+ఐశ్వర్య భోగభాగ్యంబులన్= మూడులోకాల రాజరికంతో భోగాన్నీ సంపదలనూ; కైకొనియెన్= స్వీకరించాడు; అప్పుడు= ఆ సమయంలో...

**తా :** బ్రహ్మహత్యాపాపం చండాల రూపంతో తనను వెంటాడి తరుమగా, ఇంద్రుడు దిక్కుతోచక, నింగిని నేలను అంతటను తిరిగి తిరిగి, నిట్టూర్పులతో పరుగెత్తి ఈశాన్యదిక్కుకు చేరాడు. అది ఈశ్వర రక్షితం గాబట్టి, ఆ చోటికి ఈ పాపరూపచండాల చేరలేకపోయింది. ఇంద్రుడు దాక్కోవడానికి చోటు వెతుక్కుంటూ, మానస సరోవరంలో ప్రవేశించి అందులో ఒక తామర తూడులోని దారమై శ్రీహరిధ్యానంలో వేయేళ్ళు గడిపాడు. ఆ సమయంలో స్వర్గాన్ని నహుష మహారాజు తన విద్య, తపస్సు, యోగాల బలంతో పాలిస్తూ, పొగరు తలకెక్కి శచీదేవిని తాను ఇంద్రస్థానాన ఉన్నాడు గాబట్టి తనకు భార్య కావాలని ఆశించాడు. బృహస్పతి సూచనతో బ్రహ్మర్షిగణం తన పల్లకిని మోస్తుండగా నహుషుడు శచిని జేరబోతుండగా అగస్త్య శాపగ్రస్తుడై కొండచిలువగా పుట్టాడు. అప్పుడు బ్రహ్మఋషుల పిలుపు మేరకు ఇంద్రుడు స్వర్గానికి మరలివచ్చాడు. శ్రీహరిస్మరణ, శివకృప కారణంగా ఆ పాపంనుండి విముక్తుడై, అశ్వమేధ యాగానికి దీక్ష తీసికొన్నాడు. దేవతలు, మహర్షులు పొగడగా తిరిగి తన ముల్లోకాల రాజరికాన్ని గైకొని భోగభాగ్యాలతో విలసిల్లాడు.

**చ. సతత మరీచి ముఖ్య మునిసంఘముచేత యథోచితంబుగాఁ**
**గృత ఘన వాజిమేధమునఁ గేశవు నీశుఁ బురాణ పూరుషున్**
**హితు జగదీశు యజ్ఞపతి నిష్టఫలప్రదు నంతరంగ సం**
**గతు భజియించి వజ్రి గతకల్మషుఁడై నెగడెన్ మహీశ్వరా! 437**

**ప్రతి :** మహీశ్వరా= రాజా!; సతత మరీచి ముఖ్య మునిసంఘముచేతన్= శాశ్వతులయిన మరీచి మొదలైన ఋషి గణాలచేత; యథా+ఉచితంబుగాన్= ఉచితాన్ని అతిక్రమించకుండా; కృత ఘన వాజిమేధమునన్= నిర్వహింపబడిన గొప్ప అశ్వమేధయాగంలో; కేశవున్, ఈశున్, పురాణపూరుషున్= కేశవుడు, ఈశుడు, పురాణ పురుషుడు అయిన హరిని; హితున్= హితుడు; జగత్+ఈశున్= జగదీశుడు; యజ్ఞపతిన్= యజ్ఞేశ్వరుడు; ఇష్టఫలప్రదున్= కోరిన ఫలితాలను ఇచ్చేవాడు; అంతరంగసంగతున్= మనస్సులో నిలిచినవాడు అయిన హరిని; భజియించి= సేవించి; వజ్రి= ఇంద్రుడు; గతకల్మషుడై= నశించిన పాపం గలవాడై; నెగడెన్= ప్రకాశించాడు.

**తా :** ఈ ప్రకారంగా దేవేంద్రుడు మరీచి మొదలైన మహామునుల సహాయంతో యథావిధిగా అశ్వమేధయాగం చేసి యజ్ఞేశ్వరుడూ జగదీశ్వరుడూ పరమేశ్వరుడూ అయిన శ్రీహరిని సేవించి బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టుకొని పరిశుద్ధుడై ప్రకాశించాడు.

**సీ. మఱియుఁ బుట్టింపంగ మనసు పెట్టినయట్టి క్రూరకర్మాంభోధి కుంభజుండు**
**అంగారములు సేయ నాహుతిఁ గన నోపు బహు పాపకానన పావకుండు**
**కందక దిగమ్రింగి గఱ్ఱునఁ ద్రేపంగఁ గల్మషగరళ గంగాధరుండు**
**ఘనగుహాంతరములఁ గాలూన నియ్యని కలుష దుస్తర తమోగ్రహవిభుండు**

**ఆ. సకల ముక్తిలోక సామ్రాజ్య సమధిక, సహజ భోగ భాగ్య సంగ్రహైక**
**కారణాప్రమేయ కంజాక్ష సర్వేశ, కేశవాది నామ కీర్తనంబు. 438**

**ప్రతి :** మఱియున్= మరల; శ్రీమన్నారాయణుడు; పుట్టింపంగన్= పుట్టించటానికి; మనసు+పెట్టినయట్టి= ఆలోచన చేసిన; క్రూరకర్మ+అంభోనిధి= దారుణమైన 'కర్మ' అనే సముద్రానికి; కుంభజుండు= అగస్త్యుడు; అంగారములు+చేయన్= నిప్పులను పుట్టించడానికి; ఆహుతిన్+కనన్+ఓపు= నిప్పులో వేయబడ్డ ఆహుతిని తీసికొనగల్గిన; బహుపాపకానన పావకుండు= పెక్కు పాపాలనే అడవికి అగ్నిహోత్రుడు; కందక= అలసట లేకుండ; దిగన్+మ్రింగి= లోపలికి జారేటట్లు మింగి; గఱ్ఱునన్+త్రేపంగన్= గర్రుమంటూ త్రేపగల; కల్మషగరళ గంగాధరుండు= పాపమనే విషాన్ని మింగిన శివుడు; ఘనగుహా+అంతరములన్= గొప్పగుహల లోపల; కాలు+ఊనన్+ఇయ్యని= కాలు పెట్టనివ్వని; కలుష దుస్తర తమస్= పాపమనే పెద్ద చీకటికి; గ్రహవిభుండు= సూర్యుడు; సకల ముక్తిలోక సామ్రాజ్య= సమస్తమైన మోక్షసామ్రాజ్యాన్నీ; సమ్+అధిక= మిక్కిలి; సహజ= సహజమైన; భోగభాగ్య= అనుభవాలు, సంపదలను, సంగ్రహ= సంపాదించడానికి; ఏకకారణ= ఒకే కారణమైన; అప్రమేయ= అప్రమేయుడు, కొలతకందనివాడు; కంజ+అక్ష= పద్మనయనుడు; సర్వ+ఈశ= అంతటికి అధిపతి; కేశవ+ఆది= కేశవుడు మొదలైన పేర్లతో పిలువబడేవాడైన శ్రీహరియొక్క; నామకీర్తనంబు= నామస్తుతి.

**తా :** శ్రీమన్నారాయణుడు పునర్జన్మకు కారణాలైన క్రూరకృత్యాలనే సముద్రాన్ని తాగివేసే అగస్త్యమహర్షివంటివాడు. మహాపాతకాలనే అరణ్యాలను భస్మంచేసే అగ్నిహోత్రునివంటివాడు. భక్తజనుల కల్మషాలనే కాలకూటాన్ని అలవోకగా కబళించే పరమశివునివంటివాడు. అంతులేని కలుషరాసులనే కటికచీకట్లను పటాపంచలు చేయటంలో ప్రభాకరునివంటివాడు. ఆ నారాయణదేవుని నామసంకీర్తనం సమస్తమైన మోక్షసామ్రాజ్యాన్ని సంపాదించి పెట్టి సకల భోగభాగ్యాలను సమకూరుస్తుంది.

**సీ. అఖిల దుఃఖైక సంహారాది కారణం బఖిలార్థ సంచ యాహ్లాదకరము**
**విమల భక్త్యుద్రేక విభవ సందర్శనం బనుపమభక్త వర్ణనరతంబు**
**విబుధహర్షానేక విజయ సంయుక్తంబు గ్రస్తామరేంద్ర మోక్షక్రమంబు**
**బ్రహ్మహత్యానేక పాప నిస్తరణంబు గమనీయ సజ్జన కాంక్షితంబు**

**తే. నైన యీ యితిహాసంబు నధికభక్తి, వినఁ జదివిన వ్రాసిన ననుదినంబు**
**నాయు రారోగ్య విజయభాగ్యాభివృద్ధి, కర్మనాశము సుగతియుఁ గలుగు ననఘ! 439**

**ప్రతి :** అనఘ= ఓ పాపరహితుడా!; అఖిల దుఃఖ+ఏకసంహార+ఆదికారణంబు= బాధలన్నింటినీ తొలగించడానికి మొదటి హేతువు; అఖిల+అర్థసంచయ+ఆహ్లాదకరము= అన్ని ప్రయోజనాలనూ కలిగిస్తూ, సంతోషానికి కారణమవుతుంది; విమలభక్తి+ఉద్రేక విభవ సందర్శనంబు= దోషంలేని భక్తి పారవశ్యం అనే సంపదను దర్శింపజేస్తుంది; అనుపమభక్తవర్ణన రతంబు= సాటిలేని భక్తుల వర్ణనలో ఆసక్తిని కలిగిస్తుంది; విబుధహర్ష+అనేక విజయసంయుక్తంబు= పండితులకు అనేక ఆనందాలను, విజయాలను కలిగిస్తుంది; గ్రస్త+అమర+ఇంద్ర మోక్షక్రమంబు= మింగబడ్డ ఇంద్రునికి విముక్తి కలిగిస్తుంది; బ్రహ్మహత్య+అనేక పాపనిస్తరణంబు= బ్రహ్మహత్యను, అనేక (ఇతర) పాపాలను పోగొడుతుంది; కమనీయసత్+ జనకాంక్షితంబు= మంచివారి కోరికలను తీరుస్తుంది; ఐన= అలాంటిదైన; ఈ; ఇతిహాసంబు= పురాణకథ; అధిక భక్తిన్= మిక్కిలి భక్తితో, వినన్, చదివినన్; వ్రాసినన్; అనుదినంబు= ప్రతిరోజు; ఆయుః= జీవనకాలం; ఆరోగ్య= ఆరోగ్యం; విజయ= గెలుపు; భాగ్య= సంపద; (వీటి అన్నింటి) అభివృద్ధి= పెరుగుదల; కర్మనాశము= 'కర్మ' నశించడమూ; సుగతియున్= ముక్తీ; కలుగున్= కలుగుతాయి.

**తా :** పాపరహితుడవైన ఓ పరీక్షిన్మహారాజా! ఈ పురాణకథ ప్రభావమిది. ఎల్లబాధలనూ హరిస్తుంది; అన్ని ప్రయోజనాలనూ సంతోషంగా నెరవేరుస్తుంది; నిర్మలమైన భక్తి ప్రభావాతిశయాన్ని చూపిస్తుంది; సాటిలేని భక్తులను గురించి తెలుసుకోవాలనే ఆసక్తిని కలిగిస్తుంది; పండితులకు అనేక విజయాలను సమకూరుస్తుంది; వృత్రుడు మింగగా ఇంద్రుడు విడుదల అయిన తీరుతెన్నులు వివరిస్తుంది; బ్రహ్మహత్య వలని కష్టనష్టాలను విశదీకరిస్తుంది; సత్పురుషులకు సర్వదా కాంక్షింపదగినది. అలాంటి ఈ పురాణకథను విన్నా, ప్రతిదినం చదివినా, వ్రాసినా, అట్టివారికి ఆయుస్సు, ఆరోగ్యం, గెలుపు, సంపదలు పెరుగుతాయి, దుష్కర్మలు తొలగిపోతాయి. తుదకు ముక్తి లభిస్తుంది.

**సీ. నావుడు యోగీంద్ర! నా మనం బీ వృత్రు వివరంబు నీచేత విన్న మొదలు**
**కడు నద్భుతంబునఁ గళవళం బందెడుఁ, గోరి రజస్తమోగుణములందు**
**వర్తించు నీ పాపవర్తికి నేరీతి మాధవ పదభక్తి మది వసించె?**
**సత్త్వ స్వభావులై సమబుద్ధు లై తపో నియమ ప్రయత్నులై నిష్ఠచేత**

**తే. నిర్మలాత్మకు లై నట్టి ధర్మపరుల, కమరులకుఁ బుణ్యమునులకు నంబుజాక్షు**
**భూరి కైవల్య సంప్రాప్తి మూలమైన, భక్తి వీనికిఁ బోలె నేర్పాటు గాదు. 440**

**ప్రతి :** నావుడున్= అన్నవెంటనే; యోగి+ఇంద్ర!= యోగిరాజా!; నా మనంబు= నా మనస్సు; ఈ వృత్రువివరంబు= ఈ వృత్రుని వృత్తాంతం; నీ చేతన్= నీ నుండి; విన్నమొదలు= విన్నప్పటినుండి; కడున్= మిక్కిలి; అద్భుతంబునన్= ఆశ్చర్యంతో; కళవళంబు+అందెఁడున్= తొట్రుపాటు పడుతున్నది; కోరి= కావాలని; రజస్+తమస్+గుణములందు= రజస్సు, తమస్సు అనే రెండు గుణాలలో; వర్తించు= జీవించే; ఈ పాపవర్తికిన్= ఈ పాపాత్మునికి; ఏ రీతిన్= ఏ విధంగా; మాధవ పదభక్తి= శ్రీహరి పాదాలమీద ఆసక్తి; మదిన్= మనస్సులో; వసించెన్= ఏర్పడింది; సత్త్వస్వభావులై= సత్త్వమే (తమ) నైజమైనవారై; సమబుద్ధులై= (సకల జీవులందు) సమానమైన బుద్ధిగలవారై; తపస్+నియమప్రయత్నులై= తపస్సుతో, నియమంతో ప్రవర్తించేవారై; నిష్ఠచేతన్= నిర్వహించటంలో నియమంతో; నిర్మల+ఆత్మకులైనట్టి= తప్పులులేని మనస్సులు గలవారైన; ధర్మపరులకున్= ధర్మాత్ములకు; అమరులకున్= దేవతలకు; పుణ్యమునులకున్= పుణ్యాత్ములైన ఋషులకు; అంబుజాక్షు= విష్ణువుయొక్క; భూరికైవల్య= గొప్ప ముక్తి; సంప్రాప్తి= పొందడానికి; మూలమైన= హేతువైన; భక్తి; వీనికిన్+పోలెన్= వీనికివలె; ఏర్పాటు కాదు= ఏర్పడదు.

**తా :** వృత్రాసురుని వృత్తాంతం అంతా విన్న అనంతరం పరీక్షిత్తు శుకమహర్షితో ఇలా అన్నాడు. యోగీంద్రా! వృత్రుని వృత్తాంతం విన్నది మొదలు నా హృదయం ఆశ్చర్యంతో కళవళపడుతున్నది. ఏమంటే వృత్రుడు రజోగుణమూ తమోగుణమూ ప్రధానంగా ప్రవర్తించేవాడు. దుష్టస్వభావుడు. అటువంటి వానికి నారాయణుని పాదపద్మాలపై భక్తి ఎలా సంభవించింది? సత్త్వగుణ సంపన్నులు, సమబుద్ధులు, తపోనిష్ఠులు, నిర్మల స్వభావులు, ధర్మమూర్తులు ఐన మహానుభావులకు, దేవతలకు, మహర్షులకు సైతం అలభ్యమై మోక్షానికి మూలకారణమైన భగవద్భక్తి పరమరాక్షసుడైన వీనికి ఎలా పట్టుబడింది?

**సీ. భూస్థలిఁ గల రేణువులకన్న దట్టమై కడు నొప్పు జీవసంఘములు గలవు,**
**ఆ జీవములలోన నరయ ధర్మాయతమతి వసించినవారు మనుజజాతి**
**యీ మనుష్యులలోనఁ గామంబు లెడఁబాసి మోక్షార్థు లగువారు మొదల నరిది,**
**మోక్షమార్గం బాత్మమూలంబుగా నుండు వారిలో ముక్తులు లేరు తఱచు**

**తే. ముక్తు లై నట్టి వారిలో యుక్తిఁ దలఁపఁ, జాల దుర్లభుఁ డమిత ప్రశాంతిపరుఁడు**
**పరమ సుజ్ఞాననిరతుండు భద్రగుణుఁడు, రమణ శ్రీవాసుదేవపరాయణుండు. 441**

**ప్రతి :** భూస్థలిన్+కల= భూభాగంలోగల; రేణువులకన్నన్= మట్టి అణువులకంటె; దట్టమై= అధికమై; కడున్ ఒప్పు= మిక్కిలిగా ఉన్న; జీవసంఘములు కలవు= ప్రాణుల సమూహాలు ఉన్నాయి; ఆ జీవముల లోనన్= ఆ ప్రాణులలో; అరయన్= చూడగా; ధర్మ+ఆయత మతిన్= ధర్మంతో కూడిన విపులమైన బుద్ధితో; వసించినవారు= నివసించేవారు; మనుజజాతి= మానవజాతి; ఈ మనుష్యులలోనన్= ఈ మానవులలో; కామంబులు+ఎడఁబాసి= కోరికలను విడిచిపెట్టి; మోక్ష+అర్థులగువారు= మోక్షం కోరేవారు; మొదల అరిది= ముందే అరుదుగా ఉంటారు; మోక్షమార్గంబు= ఆ మోక్షమార్గం; ఆత్మమూలంబుగాన్= ఆత్మ ప్రధానమని తలుస్తూ; ఉండువారిలో= ఉండేవారిలో; తఱచు= అధికంగా; ముక్తులు లేరు= ముక్తులైనవారు లేరు; యుక్తిన్+తలఁపన్= ఆలోచించిచూడగా; ముక్తులైనట్టివారిలోన్= ముక్తిని పొందినవారిలో; అమిత

ప్రశాంతపరుఁడు= మిక్కిలి ప్రశాంతి గలవాడు; పరమసుజ్ఞాన నిరతుండు= గొప్ప జ్ఞానం గలవాడు; భద్రగుణుఁడు= శుభమైన, భద్రమైన గుణాలు కలవాడు; రమణన్= ప్రియంతో; శ్రీ వాసుదేవపరాయణుండు= వాసుదేవునియందు తాత్పర్య బుద్ధి గలవాడు; చాల దుర్లభుఁడు= మిక్కిలి అరుదుగా కనిపిస్తాడు.

**తా :** ఈ భూతలంపై ఎన్ని రేణువులున్నాయో లెక్కింపలేము. అలాగే ఈ భూమిపై లెక్కలేనన్ని జీవసమూహాలు ఉన్నాయి. ఇన్ని జీవకోట్లలో ధర్మమార్గంలో వసించేవారు మానవులు. ఈ మనుష్య సమూహంలో కోరికలను విడిచిపెట్టి మోక్షాన్ని కోరేవారు తక్కువ. ఈ మోక్షం ఆత్మమూలం అని గ్రహించే ముక్తులైన వారు దొరకరు. ఆలోచించి చూస్తే ప్రశాంతపరుడు, పరమసుజ్ఞాని, భద్రగుణుడు, ప్రేమతో వాసుదేవ పరాయణుడు అయిన ముక్తుడు అరుదుగా కనిపిస్తాడు.

**తే. సకలలోకాపకారి దుస్సంగతుండు, వృత్రుఁ డేక్రియ సుజ్ఞాన నిరతుఁ డయ్యె?**
**సమరమునఁ బౌరుషంబుచే నమరవిభుని, నెట్టు మెప్పించె? దీని నా కెఱుఁగఁ జెపుమ. 442**

**ప్రతి :** సకలలోక+అపకారి= అన్ని లోకాలకూ కీడు చేసేవాడూ; దుస్సంగతుండు= దుష్టులతో కలసి ఉండేవాడూ; వృత్రుఁడు= వృత్రుడనేవాడు; ఏక్రియన్= ఏ విధంగా; సుజ్ఞాననిరతుఁడు+అయ్యెన్= సుజ్ఞానవంతుడయ్యాడు; సమరమునన్= యుద్ధంలో; పౌరుషంబుచేన్= పరాక్రమంతో; అమరవిభునిన్= దేవతల ప్రభువైన దేవేంద్రుణ్ణి; ఎట్టు మెప్పించెన్= ఏ విధంగా మెప్పించాడు; దీనిన్= ఈ విషయాన్ని; నాకు; ఎఱుఁగన్+చెపుమ= తెలిసేలా చెప్పండి.

**తా :** సకలలోక కంటకుడూ, దుస్సాంగత్యం కలవాడూ అయిన వృత్రాసురుడికి ఇంతటి దివ్యమైన జ్ఞానం ఎలా కలిగింది? రణరంగంలో ధర్మయుక్తమైన పౌరుషంతో దేవేంద్రుణ్ణి ఎలా మెప్పించగలిగాడు? ఈ విషయమంతా నాకు వివరించి చెప్పు.

## ✤ చిత్రకేతూపాఖ్యానము ✤

**వ. అని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నడిగె నని సూతుండు శౌనకాది మునులకుం జెప్పి, మఱియు నిట్లనియె. అట్లు గజపురవల్లభుండు సంప్రశ్నంబు సేసిన బాదరాయణి హరిస్మరణ శ్రద్ధాపరుండై యిట్లనియె. తొల్లి కృష్ణద్వైపాయన నారద దేవల మహర్షులు నా కెఱింగించిన యితిహాసంబు గలదు దాని నెఱింగించెద. సావధానుండ వై యాకర్ణింపుము అని యిట్లనియె. 443**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; పరీక్షిత్+నరేంద్రుండు= పరీక్షిత్తు అను పేరుగల రాజు; శుకయోగీంద్రున్+అడిగెన్ అని= శుక యోగీంద్రులను ప్రశ్నించాడని; సూతుండు= సూతుడనే కథకుడు; శౌనకాది మునులకున్+చెప్పి= శౌనక మహర్షి మొదలైన శ్రోతలకుచెప్పి; మఱియున్ ఇట్లు+అనియెన్= మరల ఇలా అన్నాడు; అట్లు= ఆ ప్రకారంగా; గజపురవల్లభుండు= హస్తినాపురరాజైన పరీక్షిత్తు; సంప్రశ్నంబు+చేసినన్= కుతూహలంతో ప్రశ్నింపగా; బాదరాయణి= బాదరాయణుడైన వ్యాసుని పుత్రుడు శుకమహర్షి; హరిస్మరణ శ్రద్ధాపరుండై= హరి స్మరణ చేయటంలో మిక్కిలి శ్రద్ధ గలవాడై; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; తొల్లి= పూర్వం; కృష్ణద్వైపాయన, నారద, దేవల మహర్షులు= వ్యాసుడు, నారదుడు, దేవలుడు అనే మహాఋషులు; నాకు ఎఱింగించిన= నాకు తెలియజేసిన; ఇతిహాసంబు కలదు= ఇతిహాసం ఒకటి ఉన్నది; దానిన్+ఎఱింగించెదన్= ఆ వృత్తాంతం నీకు తెలియజేస్తాను; స+అవధానుండవై (సావధానుండవై)= ఏకాగ్రచిత్తంతో; ఆకర్ణింపుము= వినుము; అని ఇట్లు+అనియెన్= అని పలికి ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా పరీక్షిత్తు శుకయోగీంద్రుని అడిగాడు అని సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పి మరల ఇలా అన్నాడు. శౌనకాది మహర్షులారా! ఆ విధంగా హస్తినాపుర ప్రభువైన పరీక్షిత్తు ఆసక్తితో అడిగిన ప్రశ్నకు వ్యాసపుత్రుడైన శుకయోగీంద్రుడు శ్రద్ధతో హరిస్మరణ గావించి ఇలా అన్నాడు. "ఓ పరీక్షిన్మహారాజా! పూర్వం నా తండ్రి వ్యాసభగవానుడు, నారదుడు, దేవలుడు అనే పేరు గల మహర్షులు నాకు తెలియజేసిన ఇతిహాసం ఒకటి ఉంది. దాన్ని నీకు తెలియజేస్తాను సావధానంగా విను" మని ఇలా చెప్పాడు.

**చ. అమితవిభూతిఁ జాల నమరాధిపుఁ బోలుచు శూరసేన దే**
**శములకు భర్త యై ప్రజలు సంతస మందఁగ సార్వభౌముఁడై**
**క్షమ దన కెల్లకాలమును గామదుహంబుగఁ జిత్రకేతు నా**
**మమునఁ బ్రసిద్ధి కెక్కె గుణమండనుఁ డంచిత కీర్తికాముఁడై. 444**

**ప్రతి :** అమిత విభూతిన్= అంతులేని సంపదతో; చాలన్= తగినట్లుగా; అమరాధిపున్+పోలుచున్= ఇంద్రునితో సమానమవుతూ; శూరసేన దేశములకు భర్తయై= శూరసేన దేశాలకు రాజై; ప్రజలు సంతస మందఁగన్= తన పాలనతో ప్రజలు ఆనందపడుతుండగా; సార్వభౌముఁడై= మహారాజై; క్షమ= ఓర్పు అనే సుగుణం; తనకు+ఎల్లకాలమును= తనకు ఎల్లప్పుడూ; కామదుహంబుగన్= కోరికలను కురిపించేది కాగా; చిత్రకేతు నామమునన్= చిత్రకేతువు అనే పేరుతో; గుణమండనుఁడు= సుగుణాలంకృతుడు; అంచితకీర్తికాముఁడై= సత్కీర్తిని కోరువాడై; ప్రసిద్ధికి+ఎక్కెన్= ఖ్యాతి పొందాడు.

**తా :** చిత్రకేతుడు అనే పేరుగల రాజు అంతులేని సంపదతో, మహేంద్రసమానుడై, శూరసేన దేశాలకు రాజై ప్రజలు ఆనందపడేలా పాలన చేస్తున్నాడు. అతనికున్న ఓర్పు అనే సుగుణం అన్ని కోర్కెలు తీరుస్తూ ఉండగా, సుగుణాలంకార భూషితుడై, సత్కీర్తిని పొందుతూ ప్రసిద్ధికెక్కాడు.

**సీ. మానిత తారుణ్య మదనతురంగులు కందర్ప విజయైక ఖడ్గలతలు**
**మదనసమ్మోహన మంత్రాధిదేవతల్ పంచశిలీముఖు బందెకత్తె**
**లసమాస్త్రుఁ దఖిలంబు నడకించు బొమ్మలు నాత్మసంభవుని కట్టాయితములు**
**పుండ్రేక్షుకోదండు భూరితేజంబులు శంబర విద్వేషి సాయకములు**

**తే. నాఁగఁ బొలుపారు నొకకోటి నళినముఖులు, దనకుఁ బత్నులు గాఁగ నత్యంత విమల**
**కీర్తివైభవ సన్మార్గవర్తి యగుచు, జగతిఁ బాలింపుచుండె నా జనవిభుండు. 445**

**ప్రతి :** మానిత= కీర్తింపబడే; తారుణ్య= నవయౌవనంలో ఉన్న; మదనతురంగులు= మన్మథుని గుర్రాలు; కందర్ప= మన్మథునకు; విజయ= విజయం కలిగించటానికి; ఏకఖడ్గలతలు= ముఖ్యమైన ఖడ్గమనే లతలు; మదన= మన్మథునకే; సమ్మోహన= అధికమైన మోహం కలిగించే; మంత్ర+అధిదేవతల్= మంత్ర అధిష్ఠాన దేవతలు; పంచ శిలీముఖు= ఐదు బాణాలుగల మన్మథునకు; బందెకత్తెలు= బంధించేవారు; అసమ+అస్త్రుఁడు= మన్మథుడు; అఖిలంబు= సమస్తాన్నీ; అడకించు బొమ్మలు= అపహసించడానికి కావలసిన బొమ్మలు; ఆత్మసంభవుని= మన్మథుని; కట్టాయితములు= సిద్ధమైన సేనవంటివారు; పుండ్రేక్షుకోదండు= మన్మథుని; భూరితేజంబులు= గొప్ప విస్తారమైన కాంతులు; శంబర విద్వేషి= మన్మథుని;

సాయకములు= బాణాలు; నా౦గన్= అనేటట్లుగా; పొలుపారు= ఒప్పుతున్న; ఒకకోటి నళిన ముఖులు= కోటి మంది పద్మముఖులు; తనకున్= తనకు; పత్నులుగా౦గన్= భార్యలు కాగా; అత్యంత= మిక్కిలి; విమల= స్వచ్ఛమైన; కీర్తి వైభవ= కీర్తి అనేవిభవం పొంది; సన్మార్గవర్తి అగుచున్= చక్కటి ధర్మమార్గంలో ప్రవర్తిస్తూ; ఆ జనవిభుండు= ఆ రాజు; జగతిన్ పాలింపుచుండెన్= లోకాన్ని పాలిస్తున్నాడు.

**తా :** మెచ్చుకోదగిన యౌవనమందున్న మన్మథుని గుర్రాల వంటివారు, మన్మథుని విజయానికై అవతరించిన ఖడ్గలతలు, మన్మథమంత్ర అధిష్ఠాన దేవతలు, మదనుని బందీలు, సమస్త ప్రపంచాన్ని అపహసించి లోబరచుకోగల బొమ్మలు, మనోజుని సంసిద్ధమైన సేనవంటివారు, ఇక్షుకోదండధారియైన మన్మథుని విస్తారమైన కాంతులు, శంబరారి బాణాలు వీరేనేమో అనేటట్లున్న కోటిమంది పద్మముఖులు ఆ రాజైన చిత్రకేతువునకు భార్యలుకాగా స్వచ్ఛకీర్తిని, సంపదను ఇచ్చే సన్మార్గంలో ప్రవర్తిస్తూ అతడు ప్రజాపాలన చేస్తున్నాడు.

**తే. కలిమి వేవేలు భార్యలు గలిగియుండ౦, బర౦గ సంతతి యొకరుని౦ బడయ లేక**
**చిత్తమున౦ జాల బాయని చింత వొడమి, బడల౦ జొచ్చెను వేసవి మడువువోలె. 446**

**ప్రతి :** కలిమి= సంపద; వేవేలు భార్యలు= వేలాదిమంది భార్యలు; కలిగియుండన్= ఆ రాజునకున్నప్పటికీ; పర౦గన్= తగినట్లుగా; సంతతి ఒకరునిన్= సంతానాన్ని ఒక బిడ్డనైె; పడయలేక= పొందలేక; చిత్తమునన్= మనస్సులో; చాల+పాయనిచింత+పొడమి= విడువని బాధను, చింతను పొంది; వేసవి మడువుపోలె= వేసవికాలంలో ఎండ తీవ్రతకు ఎండిపోయి చిక్కిపోయే మడుగువలె; బడలన్+చొచ్చెను= క్షీణించసాగాడు.

**తా :** రాజైన చిత్రకేతువు తనకు ఎంత సంపద ఉన్నప్పటికీ, ఎంతమంది భార్యలు కలిగినప్పటికీ, సంతతి ఒక బిడ్డకూడా లేని కారణంగా వేసవి తాపానికి ఎండిపోయే మడుగువలె బాధపడుతున్నాడు.

**ఉ. రూపము సత్ప్రతాపము మరుత్పతిభోగము యౌవనంబు సం**
**దీపితచారువర్తనము దిగ్విజయంబును సత్యముం జగ**
**ద్వ్యాపితకీర్తియున్ సతులు వైభవముఖ్యము లెల్ల మాన్ప౦గా**
**నోపకయుండె నా నృపతి నొందిన సంతతిలేని దుఃఖమున్. 447**

**ప్రతి :** ఆ నృపతిన్= ఆ రాజైన చిత్రకేతుమహారాజును; ఒందిన= పొందిన; సంతతిలేని దుఃఖమున్= సంతానం లేకపోవడంవల్ల కలిగిన దుఃఖాన్ని; రూపము= ఆ రాజుయొక్క అందమూ; సత్ప్రతాపము= గొప్ప పరాక్రమమూ; మరుత్పతి భోగము= దేవేంద్ర భోగమూ; యౌవనంబు= అతని యౌవనమూ; సందీపితచారు వర్తనము= బాగా ప్రకాశించే అతని సత్ప్రవర్తనమూ; దిగ్విజయంబును= దిగ్విజయమూ; సత్యమున్= ఆ రాజు సత్యదీక్షా; జగత్+వ్యాపిత కీర్తియున్= ప్రపంచమంతా వ్యాపించిన అతని యశస్సూ; సతులు= భార్యలూ; వైభవముఖ్యములెల్లన్= అతనికున్న వైభవాదులు అన్నీకూడా; మాన్ప౦గాన్= పోగొట్టటానికి; ఓపకయుండెన్= సరిపోలేదు.

**తా :** ఆ చిత్రకేతు మహారాజు పుత్రసంతానం లేక పొందిన బాధను అతనిరూపం, పౌరుషం, దేవేంద్ర వైభవం, యౌవనం, సత్ప్రవర్తన, దిగ్విజయశక్తి, సత్యనిష్ఠ, ప్రపంచమంతా అలుముకొన్న ఖ్యాతి, భార్యలు, వైభవాలు ఇవేవీ పోగొట్టలేకపోయాయి.

వ. ఇట్లు సంతతి లేక యతిదుఃఖ మానసుండైన యా నరేంద్రుని మందిరంబున కంగిరసుం డను మహాముని వచ్చి, యతని చేత నతిథిసత్కారంబులు వడసి, కుశలం బడిగి, రాజ్యంబు భవదధీనంబు కదా! పృథివ్యప్తేజో వాయ్వాకాశ మహదహంకారంబు లనియెడి యేడింటిచేత రక్షింపఁబడిన జీవుండునుం బోలె, నమాత్య జనపద దుర్గ ద్రవిణ సంచయ దండ మిత్రంబు లనెడి సప్తప్రకృతులచేత రక్షితుండవై, ప్రకృతి పురుషులయందు భారంబు వెట్టి, రాజసుఖంబు లనుభవింతువు కదా! మఱియు దార ప్రజామాత్య భృత్య మంత్రి పౌర జానపద భూపాలురు నీకు వశవర్తులు గదా! సర్వంబునుం గలిగి సార్వభౌముండ వైన నీ వదనంబు విన్నఁదనంబు గలిగి యున్నయది; కతంబేమి? అనిన నా మునిప్రవరునకు నతండు, మీ తపోబలంబున మీకు నెఱుంగరాని యదియుం గలదే? అని తలవంచి యూరకున్న నతని యభిప్రాయం బెఱింగి, యా భగవంతుండైన యంగిరసుండు దయాళుండై, పుత్రకామేష్టి వేల్చి యజ్ఞశేష మతని యగ్ర మహిషి యైన కృతద్యుతి కిచ్చి నీకుం బుత్రుండు గలిగెడి; అతనివలన సుఖదుఃఖంబు లనుభవింపంగలవు అని చెప్పి చనియె; ఆ కృతద్యుతి యనుదేవి గర్భంబు ధరియించి, నవమాసంబులు నిండినం గుమారునిం గనియె; ఆ కాలంబున రాజును, సమస్త భృత్యామాత్య జనంబులును బరమానందంబునుం బొందిరి; అపుడు చిత్రకేతుండు కృతస్నానుండై, సకల భూషణ భూషితుండై, సుతునకు జాతకర్మంబు నిర్వర్తించి, బ్రాహ్మణులకు నపరిమిత హిరణ్య రజత దానంబులును, వస్త్రా భరణంబులును, గ్రామంబులును, గజంబులును, వాహనంబులును, ధేనువులును, నాఱేసి యర్బుదంబుల ద్రవ్యంబును దానంబుసేసి, ప్రాణి సముదాయంబునకుం బర్జన్యుండునుం బోలెఁ దక్కినవారలకు నిష్టకామంబులు వర్షించి, పరమానంద హృదయుండై యుండె; అంతం బుత్రమోహంబునం గృతద్యుతి యందు బద్ధానురాగుం డై మహీధవుండు వర్తింపుచుండం, దక్కిన భార్యలు సంతాన సంతోష వికలలై, యీ మోహంబునకుం గారణంబు పుత్త్రుండ యని యీర్ష్యం జేసి దారుణచిత్తలై కుమారునకు విషం బిడిన, సుఖనిద్రితుండునుం బోలె బాలుఁడు మృతిఁ బొందె; అప్పుడు వేఁగుటయు దాది బోధింపం జని, యా కుమారుని వికృతాకారంబుఁ జూచి, విస్మయ శోక భయార్తయై పుడమిం బడి యాక్రందించె; నప్పుడు. 448

ప్రతి : ఇట్లు= ఈ ప్రకారంగా; సంతతిలేక= సంతానంలేక; అతిదుఃఖమానసుండైన= మిక్కిలి బాధతో కూడిన మనస్సు గలవాడైన; ఆ నరేంద్రుని= ఆ రాజైన చిత్రకేతుని; మందిరంబునకున్= రాజభవనానికి; అంగిరసుండను మహాముని వచ్చి= అంగిరసుడనే పేరు గల మహర్షి వచ్చి; అతనిచేతన్= ఆ రాజుచేత; అతిథి సత్కారంబులు పడసి= అతిథి మర్యాదలు పొంది; కుశలంబు అడిగి= క్షేమం తెలిసికొని; రాజ్యంబు భవత్ అధీనంబు కదా= ఈ రాజ్యం అంతా నీ అధీనంలోనే ఉన్నది కదా!; పృథివ్యప్+తేజో వాయ్వాకాశ మహదహంకారంబులనియెడి= భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం, మహత్తు, అహంకారం అనే పేర్లతో ఒప్పే; ఏడింటిచేతన్= ఏడు విషయాలచేత; రక్షింపన్+పడిన= రక్షింపబడే; జీవుండునున్+పోలెన్= జీవునివలె; అమాత్య జనపద దుర్గ ద్రవిణ సంచయ దండ మిత్రంబులనెడి= అమాత్యులు, జనపదులు దుర్గం, ధనం, సంచయం, దండనం, మిత్రులు అనబడే; సప్త ప్రకృతులచేతన్= ఏడు కారణాలచేత; రక్షితుండవై= రక్షింపబడుతున్నవాడవై; ప్రకృతి పురుషులయందున్= మంత్రులపై; భారంబు+పెట్టి= సమస్త భారాన్ని ఉంచి; రాజసుఖంబులు అనుభవింతువు కదా= రాజసుఖాలను అనుభవిస్తున్నావు కదా!; మఱియున్= ఇంకా; దార= భార్యలు; ప్రజా= ప్రజలు;

అమాత్య= మంత్రులు; భృత్య= సేవకులు; మంత్రి; పౌర= పౌరులు; జానపద= జానపదులు; నీకు; వశవర్తులు గదా= నీవు చెప్పినట్లు నడచుకొంటున్నారు గదా!; సర్వంబునున్= సమస్తమూ; కలిగి= కలిగి ఉన్న; సార్వభౌముండవైన= మహాచక్రవర్తివైన; నీవదనంబు= నీ ముఖం; విన్నఁదనంబు కలిగి ఉన్నయది= తెల్లబోయి చిన్నబోయి ఉంది; కతంబేమి= కారణం ఏమిటి?; అనినన్= అలా అడుగగా; ఆ మునిప్రవరునకున్= ఆ మునిశ్రేష్ఠునకు; అతండు= రాజైన చిత్రకేతువు; మీ తపోబలంబునన్= మీ తపస్సుయొక్క శక్తిచేత; మీకున్= మహాత్ములైన మీకు; ఎఱుంగరాని+అదియున్= తెలుసుకోలేనిదీ, తెలియనిదీ; కలదే= ఉన్నదా?; అని= అని పలికి; తలవంచి= శిరస్సువంచి; ఊరకున్నన్= మౌనం వహించి ఉండగా; అతని అభిప్రాయంబు+ఎఱింగి= ఆ చిత్రకేతువుయొక్క ఉద్దేశం తెలుసుకొని; ఆ భగవంతుడైన= ఆ దైవసముడైన; అంగిరసుండు దయాళుండై= అంగిరసమహర్షి దయగలవాడై; పుత్రకామ+ఇష్టి వేల్చి= పుత్రకామం అనే పేరుగల యజ్ఞాన్ని నిర్వహించి; యజ్ఞశేషము= యజ్ఞ ప్రసాదాన్ని; అతని అగ్ర మహిషి+ఐన= అతని పట్టపురాణి అయిన; కృతద్యుతికిన్+ఇచ్చి= కృతద్యుతి అనే ఆమెకు ఇచ్చి; నీకున్= నీకు; పుత్రుండు కలిగెడిన్= కుమారుడు జన్మిస్తాడు; అతనివలనన్= ఆ పుత్రునివలన; సుఖదుఃఖంబులు; అనుభవింపంగలవు= అనుభవిస్తావు; అని చెప్పి చనియెన్= అని చెప్పి వెళ్ళిపోయాడు; ఆ కృతద్యుతి అనుదేవి= కృతద్యుతి అనే పేరుగల ఆ రాణి; గర్భంబు ధరియించి= గర్భం దాల్చి; నవమాసంబులు నిండినన్= తొమ్మిది నెలలు పూర్తికాగా; కుమారునిన్+కనియెన్= పుత్రుణ్ణి ప్రసవించింది; ఆ కాలంబునన్= ఆ పుత్రుడు జన్మించినవేళ; రాజును= రాజైన చిత్రకేతువు; సమస్త భృత్య అమాత్య జనంబులును= సేవకులు, మంత్రులు మొదలైనవారంతా; పరమ+ఆనందంబునున్ పొందిరి= మిక్కిలి ఆనందాన్ని పొందారు; అపుడు= అప్పుడు; చిత్రకేతుండు= చిత్రకేతుమహారాజు; కృతస్నానుండై= స్నానం చేసి; సకలభూషణ భూషితుండై= అనేక ఆభరణాలు ధరించి; సుతునకున్= కుమారునకు; జాతకర్మంబు నిర్వర్తించి= జాతకర్మ అనే సంస్కారం చేసి; బ్రాహ్మణులకున్= విప్రులకు; అపరిమిత= లెక్కలేనంత; హిరణ్య= బంగారం; రజత= వెండి; దానంబులును= దానాలను; వస్త్ర+ఆభరణంబులును= వస్త్రాలను, భూషణాలను; గ్రామంబులును= గ్రామాలను; గజంబులును= ఏనుగులను; వాహనంబులును= గుర్రాలను; ధేనువులును= గోవులను; ఆఱేసి అర్బుదంబుల ద్రవ్యంబును= ఆరు పదికోట్ల (అరవైకోట్ల) ధనాన్ని; దానంబు+చేసి= దానంచేసి; ప్రాణిసముదాయంబునకున్= ప్రాణుల సమూహానికి; పర్జన్యుండునున్+పోలెన్= మేఘంవలె; తక్కినవారలకున్= మిగిలినవారికి; ఇష్టకామంబులు= కావలసిన కోరికలు; వర్షించి= కురిపించి; పరమ+ఆనంద హృదయుండై= మిక్కిలి సంతోషం పొందిన మనస్సుతో; ఉండెన్= జీవిస్తూ ఉన్నాడు; అంతన్= అంతట; పుత్రమోహంబునన్= పుత్రుని మీద మిక్కిలి ప్రేమతో; కృతద్యుతియందున్= కృతద్యుతి అనే పట్టపు రాణియందు; బద్ధ+అనురాగుండై= మిక్కిలి ప్రేమ గలవాడై; మహీధవుండు= రాజైన చిత్రకేతువు; వర్తింపుచుండన్= ప్రవర్తిస్తుండగా; తక్కిన భార్యలు= మిగిలిన రాణులు; సంతాన సంతోష వికలలై= తమకు సంతానంవల్ల సంతోషం లేకపోవడంచేత బాధపడి; ఈ మోహంబునకున్= రాజుగారికి ఇంత తీవ్ర ప్రేమ కృతద్యుతి పట్లనే ఉండటానికి; కారణంబు= కారణం; పుత్త్రుండ అని= పుత్రుడే కదా అని; ఈర్ష్యన్+చేసి= ఈర్ష్యాభావాన్ని పొంది; దారుణచిత్తలై= కఠిన హృదయం గలవారై; కుమారునకున్= ఆ కుమారునికి; విషంబు+ఇడినన్= విషం పెట్టగా; సుఖ నిద్రితుండున్+పోలెన్= సుఖంగా నిద్రపోతున్న వానివలె; బాలుఁడు= ఆ కుమారుడు; మృతిన్ పొందెన్= మరణం పొందాడు; అప్పుఁడు= ఆ సమయంలో; వేఁగుటయు= ప్రొద్దు పొడవగా (తెల్లవారగా); దాది= బిడ్డను పెంచేతల్లి; బోధింపన్ చని= పుత్రుని నిద్ర లేపుటకు వెళ్ళి; ఆ కుమారుని= ఆ బిడ్డయొక్క; వికృత+ఆకారంబున్ చూచి= వికృతమైన స్వరూపాన్ని చూచి; విస్మయ శోకభయ+ఆర్తయై= ఆశ్చర్య దుఃఖ భయసమన్వితయై బాధ పొంది; పుడమిన్ పడి= భూమిపై పడి పొర్లి; ఆక్రందించెన్= దుఃఖించింది; అప్పుడు= ఆ సమయంలో.

**తా :** ఈ విధంగా సంతానంలేక ఎంతగానో దుఃఖిస్తున్న ఆ రాజు భవనానికి అంగిరసుడు అనే మహర్షి వచ్చాడు. రాజుచేత అతిథి గౌరవాలు పొందాడు. కుశల ప్రశ్నలు వేశాడు. "రాజా! రాజ్యం నీ అధీనంలోనే ఉంది కదా. పంచభూతాలైన భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశాలతోపాటు మహత్తు అహంకారం అనే ఏడింటిచేత జీవుడు రక్షింపబడిన తీరుగా రాజుకూడా మంత్రులు, ప్రజలు, కోట, ఆర్థికసంపద, సైన్యం, మిత్రులు అనే సప్తాంగాల చేత రక్షింపబడతాడు. నీవు అలాగే రక్షింపబడుతున్నావా? మంత్రులపై భారంపెట్టి రాజ్యసుఖాలు అనుభవిస్తున్నావా? భార్యలు, ప్రజలు, మంత్రులు, సేవకులు, మంత్రాంగం చెప్పేవారు, పురప్రజలు, గ్రామప్రజలు, రాజులు నీకు వశవర్తులై ఉన్నారా? అన్నీ కలిగిన మహారాజువైనా నీ మొగం ఎందుకో చిన్నబోయినట్లుంది. కారణం ఏమిటో?" అనిన ఆ మునిశ్రేష్ఠునితో రాజు ఇలా అన్నాడు. అయ్యా! తపోబలం కలిగిన మీరు ఎరుగనిది ఏముంది అని తలవంచి మౌనంగా కూర్చున్నాడు.

రాజు అభిప్రాయాన్ని, సమస్యను ఎరిగిన అంగిరసుడు దయాళువై పుత్రకామేష్టి చేసి యజ్ఞప్రసాదాన్ని చిత్రకేతు మహారాజు పట్టమహిషి కృతద్యుతి అనే ఆమెకు ఇచ్చాడు. నీకు పుత్రుడు లభిస్తాడు, అతనివలన సుఖదుఃఖాలు అనుభవిస్తావు రాజా! అని చెప్పి వెళ్ళిపోయాడు. మహారాణి కృతద్యుతి యజ్ఞప్రసాదాన్ని స్వీకరించి గర్భం ధరించి తొమ్మిది నెలలు నిండగా కుమారుణ్ణి కన్నది. ఆ పుత్రోదయ సమయంలో రాజైన చిత్రకేతువు స్నానంచేసి, ఆభరణాలు ధరించి, గ్రామాలను, ఏనుగులను, గుర్రాలను, గోవులను, అరవైకోట్ల ద్రవ్యాన్ని దానంచేసి ప్రాణులకు మేఘుడు వర్షం కురిపించినట్లుగా ఇతరులందరికీ కోర్కెలను కురిపించి ఆనందంతో ఉన్నాడు. పుత్రమోహంతో మహారాణిపై ఎక్కువ ప్రేమను చూపిస్తున్నాడు మహారాజు. కృతద్యుతిపై ప్రేమను చూపడం వల్ల సంతానం లేని మిగిలిన రాణులకు బాధ కలిగింది. ఈర్ష్య కలిగింది. క్రూరచిత్తంతో మిగిలిన రాణులు ఆ రాజకుమారునకు విషం పెట్టారు. ఆ కుమారుడు సుఖనిద్ర పొందిన వానివలె మృతి చెందాడు. తెల్లవారగా దాది రాజపుత్రుణ్ణి మేల్కొల్పటానికి వెళ్ళి రాజపుత్రుడు విగతజీవుడై వికృతాకారంతో ఉండటంచూచి ఆశ్చర్యంతో, దుఃఖంతో, భయంతో శోకించి భూమిపైపడి దుఃఖించింది.

**తరల.పుడమి నిట్టక నిల్వునం బడి పొక్కుచుం గడుదీనయై**
**యడఁకు వేమియు లేని వాక్కుల నావు రంచు విలాపమం**
**దెడరు తోఁప భృశాతురోన్నతి నేడ్చినన్ విని భీతితోఁ**
**గడుపు బిట్టవియంగ భూపతి కాంత గ్రక్కున నేగుచున్.** **449**

**ప్రతి :** పుడమి= (పుడమిపై) భూమిపై; నిట్టక నిల్వునన్= నిట్టనిలువుగా; పడి= పడిపోయి; పొక్కుచున్= బాధపడుతూ; కడుదీనయై= మిక్కిలి దయ కలిగించే విధంగా; అడఁకువ ఏమియున్= ఏమాత్రమూ అణకువ; లేనివాక్కులన్= కనిపించని మాటలతో; ఆవురు+అంచున్= పెద్ద శబ్దంచేస్తూ; విలాపమందున్+ఎడరుతోఁపన్= ఆక్రోశంలో ఎక్కువ ఆపద కనిపించగా; భృశ+ఆతుర+ఉన్నతిన్= ఎక్కువ ఆతృతతో; ఏడ్చినన్= దుఃఖించగా; విని= ఆ ఏడుపు విని; భీతితోన్= భయంతో; కడుపు బిట్టు+అవియంగన్= కడుపు పగిలిపోతుండగా; భూపతికాంత= రాజు భార్య; గ్రక్కునన్+ఏగుచున్= వెంటనే అక్కడికి వెళుతూ...

**తా :** మృతుడై పడి ఉన్న ఆ రాజపుత్రునిజూచి దాది భూమిపై నిట్టనిలువుగా పడి దీనంగా అడ్డదిడ్డంగా మాట్లాడుతూ ఎక్కువ ఆతృతతో ఏడ్చింది. అది విని భయంతో రాజు భార్య వెంటనే అక్కడికి వస్తూ

**ఆ. బాలుఁ డొక్కరుండు పరిణామశీలుండు, వంశకర్త తపసివరమువలనఁ**
**బుట్టి మిన్న కట్లు పొలిసియున్నట్టి యా, కొడుకుఁ జూచి తల్లి యడలఁ జొచ్చె. 450**

**ప్రతి :** బాలుఁడు+ఒక్కరుండు= ఒకే ఒక కుమారుడు; పరిణామశీలుండు= క్రమంగా ఎదుగుతున్నవాడు; వంశకర్త= వంశాన్ని నిలిపేవాడు; తపసి వరమువలనన్= ఋషి అంగిరసుని వరంచేత; పుట్టి= జన్మించి; మిన్నక= ఏమీ ఎరుగనట్లు; అట్లు= ఆ విధంగా; పొలిసి ఉన్నట్టి= చనిపోయిన; ఆ కొడుకున్‌చూచి= ఆ కుమారుణ్ణి చూచి; తల్లి= ఆతని తల్లి; అడలన్+చొచ్చెన్= బాధపడసాగింది.

**తా :** ఒక్కగానొక్క బిడ్డ క్రమక్రమంగా పెరుగుతున్నవాడు అతడే వంశకర్త. తాపసి అయిన అంగిరసుని వరంవల్ల జన్మించినాడు. అటువంటి కుమారుడు చనిపోయిన తీరుచూచి తల్లి దుఃఖించసాగింది.

**ఉ. కుంకుమరాగ రమ్య కుచకుంభములన్ గడు కజ్జలంబుతోఁ**
**బంకిలమైన బాష్పములఁ బాల్పడ మజ్జన మాచరింపుచున్**
**కంకణపాణి పల్లవయుగంబున వక్షము మోఁదికొంచు నా**
**పంకరుహాక్షి యేడ్చెఁ బరిభావిత పంచమ సుస్వరంబునన్. 451**

**ప్రతి :** పంకరుహ+అక్షి= పద్మాలవంటి కన్నులుగల కృతద్యుతి; కుంకుమరాగ రమ్య కుచకుంభములన్= కుంకుమయొక్క ఎరుపురంగుతో కూడిన అందమైన పాలిండ్లను; కడు కజ్జలంబుతోన్= దట్టంగానున్న కాటుకతో; పంకిలమైన= బురదగా చేయబడిన; బాష్పములన్= కన్నీటిధారల; పాల్పడన్= పాలుకాగా (కన్నీటితో తడవగా); మజ్జనము+ఆచరింపుచున్= స్నానంచేస్తూ అనగా కాటుక కంటినీరు కిందికి జారి తన పాలిండ్లను తడుపుతూ ఉండగా; కంకణ పాణి పల్లవ యుగంబునన్= కంకణాలు ధరించిన చిగురులవంటి చేతిజంటతో; వక్షమున్= వక్షఃస్థలాన్ని; మోఁది కొంచున్= కొట్టుకొంటూ; పరిభావిత= కష్టం పొందిన; పంచమ సుస్వరంబునన్= కోకిల గొంతువలె మధురమైన సవ్వడితో; ఏడ్చెన్= దుఃఖించింది.

**తా :** చిత్రకేతుని భార్య కృతద్యుతి పుత్రమరణాన్ని సహించలేకపోయింది. ముఖంమీద పెట్టుకొన్న కుంకుమబొట్టుయొక్క ఎరుపు, కంటికి పెట్టుకొన్న కాటుక నలుపు కలిసిన కంటినీటి ధారలతో తన వక్షఃస్థలం తడిసిపోగా, బంగారు కంకణాలు ధరించిన చిగురులవంటి సుకుమార హస్తద్వయంతో హృదయాన్ని మోదుకుంటూ బాధతో కోకిల గొంతువంటి మధురమైన శబ్దంతో ఏడ్చింది.

**విశే :** పంచమ స్వరం అంటే కోకిలగొంతు అని అర్థం. 'పికః కూజతి పంచమం' అని ఉక్తి. అంటే పంచమస్వరంతో కోకిల కూస్తుంది అని అర్థం.

**క. ఆ యార్తరవమునకు భూ, నాయకుఁడు భయంబు నొంది నయ ముడిగి సుతున్**
**డాయఁగ వేగంబునఁ జని, పాయని మోహంబు తోడ బాలుని మీఁదన్. 452**

**ప్రతి :** ఆ ఆర్తరవమునకున్= తన భార్య కృతద్యుతి బాధతో ఏడ్చిన అరుపుకు; భూనాయకుఁడు= భూపతి అయిన చిత్రకేతువు; భయంబున్+ఒంది= భయపడి; నయము+ఉడిగి= యుక్తాయుక్త జ్ఞానం నశించి; సుతున్= కుమారుని; డాయఁగ వేగంబునన్ చని= సమీపించటానికి వేగంగా వెళ్ళి; పాయని మోహంబుతోడన్= విడువలేని పుత్ర ప్రేమతో; బాలుని మీఁదన్= తన కుమారునిపై...

**తా :** కృతద్యుతిచేసిన దుఃఖ ధ్వనిని విని రాజైన చిత్రకేతువు భయపడ్డాడు. తాను రాజును అన్న గంభీర భావాన్ని విడిచిపెట్టి సుతుని వద్దకు వేగంగా వచ్చి మోహంతో తన కుమారునిపై

**స్రగ్విణి. వ్రాలి యో పుత్ర! నీ వార్త దంభోళియై, కూలఁగా వ్రేయ కీ కొద్ది న న్నేటికిన్**
**జాలి నొందించె? నా జాడ యిం కెట్టిదో?, తూలి మీ తల్లికిన్ దుఃఖ మె ట్లాఱునో? 453**

**ప్రతి :** వ్రాలి= (సుతునిపై) వాలి; ఓ పుత్ర!= ఓ కుమారా!; నీ వార్త= నీ మరణవార్త; దంభోళియై= వజ్రాయుధమై; కూలఁగాన్+వ్రేయక= నన్ను కూలగొట్టక; ఈ కొద్ది నన్ను+ఏటికిన్= ఇలా కొంచెం నిలిచేలా నన్ను ఎందులకు; జాలిన్+ఒందించెన్= జాలి తలిచింది; నా జాడ= నా విధానం; ఇంక ఎట్టిదో= ఇకపై ఎలా ఉంటుందో; తూలి= ఈ వార్త మీదపడగా; మీ తల్లికిన్= నీ అమ్మకు; దుఃఖము ఎట్లు ఆఱునో= ఏ విధంగా దుఃఖం తీరుతుందో కదా!

**తా :** పుత్రునిపై వాలి చిత్రకేతువు ఇలా అంటున్నాడు. "ఓ కుమారా! నీ మరణవార్త వజ్రాయుధమై నన్ను కూలగొట్టక ఇలా నిలబెట్టి ఎందుకు జాలి తలచిందో! ఇకపై నా బతుకు ఎలా ఉంటుందో. ఈ నీ మరణవార్త విన్న మీ తల్లికి దుఃఖం ఎలా ఉపశమిస్తుందో కదా!"

**వ. అని తల మొల యెఱుంగక పలవించుచు, భృత్యామాత్య బంధుజనంబులం గూడి యడలుచు నున్న యా రాజు దుఃఖం బెఱింగి, యంగిరసుండు నారదునితోడం గూడి చనుదెంచి, మృతుండైన పుత్రుని పదతలంబున మృతుండునుం బోలె పడియున్న యా రాజునుం గనుంగొని యిట్లనియె. 454**

**ప్రతి :** అని= ఈ విధంగా; తలమొల ఎఱుంగక= కిందు మీదులు తెలియక; పలవించుచున్= దుఃఖిస్తూ; భృత్య అమాత్య బంధుజనంబులన్+కూడి= భటులు మంత్రులు బంధువులతో కూడి; అడలుచున్+ఉన్న= బాధపడతున్న; ఆ రాజు దుఃఖంబు+ఎఱింగి= ఆ రాజు బాధను గుర్తించి; అంగిరసుండు= అంగిరసుడనే మహర్షి; నారదుని తోడన్+కూడి= నారదునితో కలసి; చనుదెంచి= వచ్చి; మృతుండైన= చనిపోయిన; పుత్రుని పదతలంబునన్= కుమారుని పాదాలవద్ద; మృతుండునున్+పోలెన్= చనిపోయిన వానివలె; పడియున్న= పడి ఉండిన; ఆ రాజునున్= ఆ రాజును; కనుంగొని= చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా కిందు మీదులు తెలియకుండా భటులతో, మంత్రులతో, బంధువులతో కూడి ఆ రాజు దుఃఖిస్తున్నాడు. ఆ రాజు బాధ తెలుసుకొని అంగిరసుడు నారద మహర్షితో కలసివచ్చాడు. మరణించిన తన కొడుకు పాదాల దగ్గర శవంలా పడి ఉన్న రాజును చూచి అంగిరసుడు ఇలా అన్నాడు.

**సీ. నీకు వీఁ డెవ్వఁడు? నీ వెవ్వనికి శోక సంతాప మందెదు సార్వభౌమ?**
**పుత్త్ర మిత్త్రాదులు పూర్వజన్మంబున నెవ్వని వారలో యెఱుఁగఁ గలరె?**
**మొదలు నదీవేగమున నాడ కాడకు సికతంబు గూడుచుఁ జెదరుచుండు,**
**నారీతిఁ బ్రాణుల కతికాల గతిచేతఁ బుట్టుట సచ్చుట పొసఁగుచుండుఁ**

**ఆ. గాన భూతములకుఁ గలుగు భూతంబులు, మమత తోడ విష్ణుమాయఁ జేసి**
**దీని కడల నేల? ధృతిఁ దూలఁగా నేల? బుద్ధిఁ దలఁప వలదె? భూత సృష్టి. 455**

**ప్రతి :** సార్వభౌమ= ఓ రాజా! నీకు; వీఁడు+ఎవ్వఁడు= వీడు ఎవడయ్యా!; నీవు; ఎవ్వనికి= ఎవనికోసం; సంతాపము+ అందెదు= బాధను పొందుతున్నావు?; పుత్త్ర మిత్త్రాదులు= పుత్రులు స్నేహితులు మొదలైనవారు; పూర్వజన్మంబునన్= వెనుకటి జన్మలో; ఎవ్వనివారలో= ఎవనికి సంబంధించిన వారో; ఎఱుఁగన్+కలరె?= తెలుసుకోగలరా?; మొదలు నదీవేగమునన్= ప్రారంభింపబడిన నదీవేగానికి; ఆడకు+ఆడకు= అక్కడక్కడకు; సికతంబు+కూడుచున్= ఇసుక చేరుతూ; చెదరుచుండున్= చెదిరిపోతూ ఉంటుంది; ఆ రీతిన్= ఆ విధంగా; ప్రాణులకు= ఈ జీవులకు; అతికాల గతిచేతన్= కాలవశాన; పుట్టుట= జన్మించటం; చచ్చుట= మరణించటం; పొసఁగుచుండున్= కలుగుతూ ఉంటాయి; కాన= కాబట్టి; విష్ణుమాయన్+చేసి= విష్ణుమాయవలన; మమత తోడన్= ప్రేమతో; భూతములకున్= ప్రాణులకు; భూతంబులు= జీవులు; కలుగున్= కలుగుతాయి; దీనికి అడలనేల= దీనికి దుఃఖించడం ఎందుకు?; ధృతిన్= ధైర్యాన్ని; తూలఁగాన్+ఏల= కోల్పోవడం ఎందుకు?; భూతసృష్టి= ప్రాణుల ఉత్పత్తి క్రమాన్ని, సృష్టి రహస్యాన్ని; బుద్ధిన్ తలఁప వలదె?= బుద్ధితో ఆలోచించాలి గదా!

**తా :** ఓ సార్వభౌమా! ఈ బాలుడు నీ కేమి అవుతాడు? నీవు ఎవరికొరకు దుఃఖిస్తున్నావు? ఈ పుత్రులు, ఈ మిత్రులు పూర్వజన్మలో ఎవరివారో నీవు ఎరుగుదువా! నదిలోని ప్రవాహ వేగంవల్ల ఇసుక ఒకప్పుడు ఒకచోట మేటవేసి మరొకప్పుడు విడిపోయినట్లుగా ప్రాణులకు చావు పుట్టుకలు జరుగుతూ ఉంటాయి. విష్ణుమాయ వలన మమకారం కలిగి జీవులకు జీవులు జన్మిస్తాయి. దీనికి బాధపడవలసిన పనిలేదు. ధైర్యం కోల్పోకూడదు. ఈ విషయాన్ని నీవు ఆలోచించుకోవాలి కదా!

**వ. మఱియు నేము, నీవును, దక్కిన వారలును బ్రవర్తమాన కాలంబునం గలిగిన జన్మంబు నొంది, మృత్యువు వలన విరామంబు నొందంగలవారమై యిపుడ లేకపోవుదుము; చావు పుట్టువులకు నిక్కువంబు లేదు. ఈశ్వరుండు దన మాయచేత భూతజాలంబులవలనం భూతంబులం బుట్టించు; వాని నా భూతంబుల చేతనేరక్షించు; వాని నా భూతంబులచేతన హరించు; స్వతంత్రంబు లేని తన సృష్టిచేత బాలుండునుంబోలె నపేక్ష లేకయుండు; దేహియైన పితృదేహంబు చేత దేహియైన పుత్త్రదేహంబు మాతృదేహంబు వలనం గలుగుచుండు; ఆ ప్రకారంబున బీజంబు వలన బీజంబులు పుట్టుచు నుండు; దేహికి నివి శాశ్వతంబై జరుగుచునుండు; పూర్వకాలంబున సామాన్య విశేషంబులు సన్మాత్రంబైన వస్తువులం దేవిధంబునం గల్పింపంబడియె, నా ప్రకారంబున దేహంబునకు జీవునకు నన్యోన్య విభాగంబు పూర్వకాలంబున నజ్ఞాన కల్పితం బయ్యె; జన్మఫలంబులను జూచుచున్న వారికి దహనక్రియల నగ్ని పెక్కు రూపంబులం గానంబడు భంగి, నొకండైన జీవుండు పెక్కుభంగుల వెలుంగుచుండు; ఇవి యన్నియు నాత్మజ్ఞానంబు చాలక దేహి దేహసంయోగంబున స్వప్నంబునందు భయావహంబైన ప్రయోజనంబు నడపుచుండి, మేలుకాంచి, యా స్వప్నార్థంబైన ప్రయోజనంబు తనది గాదని యెఱుంగుభంగి, జీవుండే తా నని జ్ఞానగోచరుండైన వాఁడెఱుంగు; కావున నన్నియును మనోమాత్రంబని తెలిసి, మోహతమంబు వాసి, భగవంతుండైన వాసుదేవుని యందుఁ జిత్తంబు వెట్టి, నిర్మలాత్మకుండ వగుము అని బోధించినం జిత్రకేతుండు లేచి వారల కిట్లనియె. 456**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; ఏము= మేము; నీవును= నీవు; తక్కిన వారలును= మిగిలినవారు; ప్రవర్తమాన కాలంబునన్+కలిగిన= ఈ నడుస్తున్న కాలంలో కలిగిన; జన్మంబున్+ఒంది= పుట్టుక కలిగి; మృత్యువువలనన్= చావువల్ల; విరామంబున్= విశ్రాంతిని; ఒందంగలవారమై= పొందగలవారమై; ఇపుడు+ఆ= ఈ సమయంలోనే; లేకపోవుదుము= లేకుండా పోతాము; చావు పుట్టుకలకున్= జనన మరణాలకు; నిక్కువంబు లేదు= నిలకడ లేదు; ఈశ్వరుండు= పరమాత్మ; తన మాయచేతన్= తన మాయావిధానంతో; భూతజాలంబులవలనన్= ప్రాణుల సమూహంచేత; భూతంబులన్+పుట్టించున్= జీవులను పుట్టిస్తాడు; వానిన్= ఆ ప్రాణులను; ఆ భూతంబులచేతనే= ఆ జీవజాలంచేతనే; రక్షించున్= రక్షిస్తాడు; వానిన్= ఆ జంతు జాలాన్ని; ఆ భూతంబులచేతనన్= ఆ జీవులచేతనే; హరించున్= సంహరిస్తాడు; స్వతంత్రంబులేని= స్వేచ్ఛలేని; తన సృష్టిచేతన్= తన సృష్టి కార్యక్రమంచేత; బాలుండునున్ పోలెన్= చిన్న పిల్లవానివలె; అపేక్షలేక+ఉండున్= ఏ మాత్రం కోరికలేకుండా ఉంటాడు; దేహియైన పితృదేహంబుచేతన్= తండ్రి అనే దేహంచేత; దేహియైన పుత్త్రదేహంబు= కుమారుడనే దేహం; మాతృదేహంబువలనన్= తల్లి అనే దేహంచేత; కలుగుచుండున్= సంభవిస్తూ ఉంటుంది; ఆ ప్రకారంబునన్= ఆ క్రమంలో; బీజంబువలనన్= బీజంవల్ల; బీజంబులు పుట్టుచున్+ఉండున్= బీజాలు జన్మిస్తూ ఉంటాయి; దేహికిన్= ఈ దేహంగల జీవునకు; ఇవి శాశ్వతంబై జరుగుచున్+ఉండున్= ఈ చావు పుట్టుకలు శాశ్వతంగా జరుగుతూ ఉంటాయి; పూర్వకాలంబునన్= ముందుకాలంలో; సామాన్య విశేషంబులు= సామాన్యం విశేషం అనే అంశాలు; సన్మాత్రంబైన= సన్మాత్రాలుగా ఉండే; వస్తువులయందు= వస్తువులలో; ఏ విధంబునన్ కల్పింపన్+పడియెన్= ఏ విధంగా కల్పింపబడ్డాయో; ఆ ప్రకారంబునన్= ఆ విధంగానే; దేహంబునకున్ జీవునకున్= శరీరానికీ జీవునకూ; అన్యోన్య విభాగంబు= ఒకదానితో ఒకటి విభజింపబడటం; పూర్వకాలంబునన్= పూర్వకాలంలోనే; అజ్ఞాన కల్పితంబు+అయ్యెన్= అజ్ఞానంచేత కల్పింపబడింది; జన్మఫలంబులను చూచుచున్నవారికిన్= జన్మకు సంబంధించిన ఫలాలు చూచేవారికి; దహనక్రియలన్= అగ్నితో మండించే పనులలో; అగ్ని; పెక్కురూపంబులన్= అనేక రూపాలతో; కానంబడు భంగిన్= కనపడే విధంగా; ఒకండు+ఐన జీవుండు= ఒకడే అయిన జీవుడు; పెక్కుభంగులన్= అనేక రీతులుగా; వెలుంగుచున్+ఉండున్= వెలుగుతూ ఉంటాడు; ఇవి అన్నియున్= ఈ విషయాలన్నీ కూడా; ఆత్మజ్ఞానంబు చాలక= ఆత్మజ్ఞానం తగినవిధంగా లేకపోవడంవల్ల; దేహి దేహ సంయోగంబునన్= శరీరి శరీరం ఒకటే అని భావించడంవల్ల; స్వప్నంబునందు= కలలో; భయావహంబైన= భయంకరమైన; ప్రయోజనంబు నడపుచుండి= ఫలితాన్ని పొందుతూ; మేలుకాంచి= మెలకువను పొంది; ఆ స్వప్నార్థంబైన= ఆ కలలో కనిపించిన; ప్రయోజనంబు= ఫలితం; తనది కాదని= తనకు సంబంధించింది కాదని; ఎఱుంగు భంగి= తెలుసుకొనేటట్లుగా; జీవుండే తానని= తాను దేహముకాదు జీవుడే అని; జ్ఞానగోచరుండైన వాఁడు= జ్ఞానం పొందినవాడు మాత్రమే; ఎఱుంగున్= తెలుసుకొనగలుగుతాడు; కావునన్= కాబట్టి; అన్నియును= ఇవి అన్నీ; మనోమాత్రంబని= మనసువల్ల జన్మించినవేనని; తెలిసి= తెలుసుకొని; మోహతమంబున్+పాసి= మోహమనే చీకటిని విడిచి; భగవంతుండైన= పరమాత్మ అయిన; వాసుదేవునియందున్= శ్రీకృష్ణ భగవానునియందు; చిత్తంబు పెట్టి= మనస్సును నిలిపి; నిర్మల+ఆత్మకుండవు అగుము= నిర్మలమైన ఆత్మకలవాడవుకమ్ము; అని బోధించినన్= ఈ ప్రకారంగా తెలియజెప్పగా; చిత్రకేతుండు= చిత్రకేతుడు; లేచి= నిలబడి; వారలకు ఇట్లు అనియెన్= వారితో ఇలా అన్నాడు.

**తా :** 'ఓ రాజా! వినవయ్యా! మేము, నీవు, మిగిలిన వారందరూకూడా ఈ నడుస్తున్న కాలంలో జన్మించి మృత్యువులో విశ్రాంతి పొందుతాము. ఇపుడే లేకుండా పోతాము. చావు, పుట్టుక ఈ రెండూ నిజం కాదు. పరమేశ్వరుడు తన మాయాప్రభావంతో జీవులచేత జీవులను పుట్టించి, ఆ జీవుల చేతనే రక్షింపజేసి, ఆ జీవులచేతనే మరణించేలా చేస్తాడు.

ఈ సృష్టి స్వతంత్రమైనది కాదు. భగవంతునికి ప్రత్యేకమైన ఉద్దేశం లేదు. అందుకే ఆ భగవంతుడు ఈ సృష్టి విషయంలో ఎటువంటి అపేక్ష లేకుండా బాలునివలె ఉంటాడు. పితృదేహంచేత పుత్రదేహం మాతృదేహంవల్ల కలుగుతుంది. ఈ విధంగా బీజాలవల్ల బీజాలు పుడుతూ ఉంటాయి. దేహికి ఈ జననమరణ దేహాలు శాశ్వతంగా జరుగుతూనే ఉంటాయి. పూర్వం సామాన్య విశేషాలు సన్మాత్ర వస్తువులయందు ఏ విధంగా ఏర్పడ్డాయో ఆ ప్రకారంగానే దేహానికి జీవునకు ఒకదానికి ఒకటి విభజింపబడటం అజ్ఞానంవల్ల కల్పింపబడింది. జన్మ ఫలితాలను చూచేవారికి మండుతున్న మంట అనేక ఆకారాలలో ఎలా కనబడుతుందో అలాగే ఒకే జీవుడు అనేక దేహాలతో వివిధకాలాలలో వెలుగుతూ ఉంటాడు. ఆత్మజ్ఞానం లేకపోవడంవల్ల దేహి దేహం ఒకటే అనుకోవడం జరుగుతుంది.

స్వప్నంలో భయంకరమైన విషయాన్ని చూచి ఆ స్వప్న విషయం తనను ఏమీ చేయదని తెలియక అది తనకే జరిగినట్లు భయపడి; మెలకువ వచ్చిన తరువాత ఈ భయం అన్నది కేవలం కల మాత్రమేనని తనకు ఏమాత్రం అంటదని తెలుసుకొన్నరీతిగా, జీవుడే తాను అనే విషయం జ్ఞానికి మాత్రమే తెలుస్తుంది. కావున ఈ దేహాలు, జన్మ పరంపరలు కేవలం మనస్సుకు సంబంధించినవే అని తెలిసికొని మోహం అనే చీకటిని విడిచి భగవంతుడైన వాసుదేవునిపై చిత్తాన్ని నిలిపి, నిర్మలమైన మనస్సు కలవాడవు కమ్ము' అని బోధించగా చిత్రకేతుడు లేచి అంగిరస నారదులతో ఇలా అన్నాడు.

**సీ. యతివేషములు పూని యతి గూఢగతి నిందు నేతెంచినట్టి మీ రెవ్వరయ్య?**
**కడఁగి నన్ బోలిన గ్రామ్యబుద్ధులనెల్ల బోధింప వచ్చిన పుణ్యమతులొ?**
**రమణఁ గుమార నారద ఋషభాదులొ దేవలాసితు లను ధీరమణులొ?**
**వ్యాస వసిష్ఠ దుర్వాస మార్కండేయ గౌతమ శుక రామ కపిల మునులొ?**

**తే. యాజ్ఞవల్క్యుండుఁ దరణియు నారుణియును, చ్యవన రోమశు లాసురి జాతుకర్ణ**
**దత్తమైత్రేయ వర భరద్వాజ బోధ్య, పంచశిఖులొ? పరాశర ప్రభృతి మునులొ? 457**

**ప్రతి :** యతివేషములు పూని= మునుల రూపాలను ధరించి; అతి గూఢగతిన్= మిక్కిలి రహస్యంగా; ఇందున్= ఇక్కడకు; ఏతెంచినట్టి= వచ్చిన; మీరు ఎవ్వరయ్య= మీరు ఎవరు?; కడఁగి= ప్రయత్నించి; నన్ పోలిన= నావంటి; గ్రామ్యబుద్ధులన్+ఎల్లన్= అజ్ఞానులందరికీ; రమణన్= ప్రేమతో; బోధింప వచ్చిన= ఉపదేశించటానికి వచ్చిన; పుణ్యమతులొ= పుణ్యాత్ములా?; కుమార= సనత్కుమార; నారద= నారదముని; ఋషభ+ఆదులొ= ఋషభుడు మొదలైనవారా?; దేవల+అసితులు+అను= దేవలుడు అసితుడు అనే; ధీరమణులొ= ధీరశ్రేష్ఠులా?; వ్యాస వసిష్ఠ దుర్వాస మార్కండేయ గౌతమ శుక, రామ కపిల మునులొ= వ్యాసుడు వసిష్ఠుడు, దుర్వాసుడు, మార్కండేయుడు, గౌతముడు, శుకమహర్షి, రాముడు, కపిలుడు మొదలైన మునులా?; యాజ్ఞవల్కుండున్= యాజ్ఞవల్క్యుడు; తరణియున్= సూర్యుడు; ఆరుణియును= ఆరుణి; చ్యవన; రోమశులు; ఆసురి; జాతకర్ణుడు; దత్తమైత్రేయ= దత్తాత్రేయుడు, మైత్రేయుడు; వర= శ్రేష్ఠుడైన; భరద్వాజ= భరద్వాజుడను వానిచే; బోధ్య= తెలుసుకొన తగిన; పంచ శిఖులొ= పంచశిఖులా?; పరాశర ప్రభృతి మునులొ= పరాశరుడు మొదలైన మునులా?

**తా :** అయ్యా! యతిరూపాలను ధరించి గుప్తంగా వచ్చిన మీరు ఎవరు? నాబోటి అజ్ఞానులను ప్రబోధించడానికి వచ్చిన పుణ్యాత్ములా? సనత్కుమార, నారద, ఋషభాదులా? దేవలుడు అసితుడు అను ధీరులా? వ్యాస, వసిష్ఠ, దుర్వాస,

మార్కండేయ, గౌతమ, శుక, రామ, కపిలుడు మొదలైనవారా? యాజ్ఞవల్క్యుడు, సూర్యుడు, ఆరుణి, చ్యవనుడు, రోమశుడు, ఆసురి, జాతుకర్ణుడు దత్తాత్రేయుడు, మైత్రేయుడు మొదలైనవారా! భరద్వాజునిచే గుర్తింపబడిన పంచశిఖులా! పరాశరుడు మొదలైన మునులా?

**క. వీరలలో నెవ్వరు సుర, చారణ గంధర్వ సిద్ధ సంఘంబులలో**
**వారలొ? యీ సుజ్ఞానము, కారణమై యెవరియందుఁ గలదు తలంపన్? 458**

**ప్రతి :** వీరలలోన్= పైని చెప్పినవారిలో; ఎవ్వరు= మీరు ఎవరు?; సురచారణ గంధర్వ సిద్ధసంఘంబులలో వారలొ= దేవతలు, చారణులు, గంధర్వులు, సిద్ధులు మొదలైనవారిలోనివారా?; తలంపన్= ఆలోచించిచూడగా; ఈ సుజ్ఞానము= ఈ గొప్ప తత్త్వజ్ఞానం; కారణమై= మూలకారణంగా (ప్రధానమైన విషయంగా); ఎవరియందున్ కలదు= ఎవరిలో ఉంటుంది!

**తా :** నేనన్న వారిలో మీరు ఎవరు? దేవతలు, చారణులు, గంధర్వులు, సిద్ధులు మొదలైన వారి సమూహంలోని వారలా? ఆలోచించిచూడగా ఎవరియందు ఇటువంటి సుజ్ఞానం మూలకారణమై ఉంటుంది?

**క. పొందుగ గ్రామ్య పశుత్వముఁ, బొంది మహాశోకతమముఁ బొందిన నాకున్**
**ముందఱ దివ్యజ్ఞానముఁ, జెందించిన వారి మిమ్ముఁ జెప్పుదు తెలియన్. 459**

**ప్రతి :** పొందుగన్= తగినట్లుగా; గ్రామ్య పశుత్వమున్= అజ్ఞానంవలన కలిగిన మూర్ఖత్వాన్ని; పొంది; మహాశోకతమమున్= గొప్ప దుఃఖమనే చీకటిని; పొందిన నాకున్= పొందిన నాకు; ముందఱ= ఎదుట; దివ్యజ్ఞానమున్= గొప్పజ్ఞానాన్ని; చెందించిన వారిన్= పొందేలా చేసినవారిని; మిమ్మున్= మీగురించి; తెలియన్= తెలిసేటట్లుగా; చెప్పుడు= చెప్పండి.

**తా :** అయ్యా! అజ్ఞానం వల్ల ఏర్పడిన పశుత్వంతో గొప్ప దుఃఖమనే చీకటిలో ఉన్న నాకు దివ్యజ్ఞానం అందజేసిన మీరు ఎవరో తెలియజెప్పండి.

**వ. అనిన నంగిరసుం డిట్లనియె. నేను పుత్త్రకాంక్షివైన నీకుం బుత్త్రుం బ్రసాదించిన యంగిరసుండ; ఇతండు బ్రహ్మపుత్త్రుండైన నారదభగవంతుండు; దుస్తరంబైన పుత్త్రశోకంబున మగ్నుండ వైన నిను ననుగ్రహించి, పరమజ్ఞానం బుపదేశింప వచ్చితిమి; నీ దుఃఖం బెఱింగి, బుత్త్రు నిచ్చితి మేనిఁ బుత్త్రవంతులైన వారి తాపంబు నీచేత ననుభవింపంబడు; ఈ ప్రకారంబున లోకంబున సతులును, గృహంబులును, సంపదలును, శబ్దాదులయిన విషయంబులును, రాజ్యవైభవంబును జంచలంబులు; మఱియు రాజ్యంబును, భూమియును, బలంబును, ధనంబును, భృత్యామాత్య సుహృజ్జనంబులును మొదలయినవి శోక మోహభయ పీడలం జేయుచుండుం గాని సుఖంబుల నీ నేరవు; గంధర్వనగరంబునుం బోలె స్వప్న లబ్ధ మనోరథంబునుంబోని యర్థంబుఁ బాసి కానంబడుచు మనోభవంబులయిన యర్థంబులం గూడి స్వార్థంబులై కానంబడనేరవు; కర్మంబులచేత ధ్యానంబులు సేయుచుండు మనంబులు నానాకర్మంబు లగుచు నుండు; నీ దేహిదేహంబు ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబై దేహికి వివిధ క్లేశసంతాపంబులం జేయుచుండుఁ గావున నీవు నిర్మలంబయిన మనంబుచేత నాత్మగతి వెదకి ధ్రువం బయిన పదవి నొందు మనియె; అప్పుడు నారదుం డిట్లనియె; నుపనిషద్గోప్యంబగు నే నిచ్చు మంత్రం**

**బెవ్వండేని సప్తరాత్రంబులు పఠియించు, నతండు సంకర్షణుండైన భగవంతునిం జూచు; నెవ్వని పాదమూలంబు సర్వాశ్రయంబై యుండు నట్టి శ్రీమన్నారాయణుని పాదంబులు సేవించి యీ మోహంబు వదలి యతి శీఘ్రంబున నుత్తమపదంబు నొందు; మిప్పు డిక్కుమారునకును నీకును బ్రయోజనంబు గలదేనిం జూడు మని నారదుండు మృతబాలకుని కళేబరంబుఁ జూచి యోజీవుండ! నీకు శుభం బయ్యెడు; మీ తల్లిదండ్రుల బంధుజనులం జూచి వీరల దుఃఖంబు లార్చి యీ కళేబరంబునందుఁ బ్రవేశించి యాయుశ్శేషంబు ననుభవించి పిత్రధీనంబైన రాజ్యాసనంబునం గూర్చుండు మనిన న బ్బాలుం డిట్లనియె. 460**

**ప్రతి :** అనినన్= అలా అనేసరికి; అంగిరసుండు= అంగిరసుడు; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు; నేను; పుత్రకాంక్షివి+ఐన= కుమారుని కోరుకున్న; నీకున్= నీకు; పుత్త్రున్= కుమారుని; ప్రసాదించిన= దయతో ఇచ్చిన; అంగిరసుండ= అంగిరసుడు అనేవాడను; ఇతండు= ఇతడు; బ్రహ్మపుత్త్రుండైన= బ్రహ్మయొక్క కుమారుడైన; నారదభగవంతుడు= నారదుడనే భగవానుడు; దుస్తరంబైన= దాటుటకు వీలులేని; పుత్త్రశోకంబునన్= పుత్త్రునివలన కలిగిన దుఃఖంలో; మగ్నుండవైన= మునిగిపోయిన; నినున్= నిన్ను; అనుగ్రహించి= దయ దలచి; పరమజ్ఞానంబు= గొప్ప జ్ఞానాన్ని; ఉపదేశింపన్+వచ్చితిమి= ఉపదేశించడానికి వచ్చాము; నీ దుఃఖంబు+ఎఱింగి= నీ బాధను తెలుసుకొని; పుత్త్రున్+ఇచ్చితిమేనిన్= నీ కొడుకును నీకు ఇచ్చినప్పటికీ; పుత్త్రవంతులైనవారి= కొడుకులు కలిగినవారియొక్క; తాపంబు= బాధ; నీచేతన్= నీచేత; అనుభవింపన్+పడున్= అనుభవింపబడుతుంది; ఈ ప్రకారంబునన్= ఈ విధంగా; లోకంబునన్= ఈ ప్రపంచంలో; సతులును= స్త్రీలు; గృహంబులును= ఇండ్లు; సంపదలును= భాగ్యములు; శబ్ద+ఆదులైన విషయంబులు= శబ్దము స్పర్శ మొదలైన విషయాలు; రాజ్యవైభవంబులును= సామ్రాజ్య సంపదలు; చంచలంబులు= అస్థిరమైనవి; మఱియున్= అంతేకాక; రాజ్యంబును= రాజ్యం; భూమియును= భూమి; బలంబును= శారీరకబలం; ధనంబును= సంపద; భృత్య+అమాత్య సుహృత్+జనంబులును= సేవకులు, మంత్రులు, స్నేహితులు; మొదలైనవి= మొదలుగా గలవి; శోక, మోహ భయపీడలన్= దుఃఖాన్ని, తీవ్రమైన మోహాన్ని, భయాన్ని, కష్టాలను; చేయుచుండున్+కాని= కలుగజేస్తాయి తప్ప; సుఖంబులన్= సుఖాలను; ఈనేరవు= ఇవ్వలేవు; గంధర్వ నగరంబునున్‌పోలెన్= ఆకాశంలో కనపడే గంధర్వ నగరంవలె; స్వప్నలబ్ధ= కలలో పొందిన; మనోరథంబునుంబోని= కోరికవలె; అర్థంబున్+పాసి కానంబడుచున్= ఆ విషయం మరుగునపడి మరల కనిపించినట్లు; మనోభవంబులైన= మనసులో పుట్టిన; అర్థంబులన్+కూడి= విషయాలతోకూడి; స్వార్థంబులై= తనకు సంబంధించనివై; కానంబడనేరవు= కన్పట్టవు; కర్మంబులచేతన్= మన మన కర్మలచేత; ధ్యానంబులు చేయుచుండు మనంబులు= అదే ధ్యానంతో ఉండే మనస్సులు; నానాకర్మంబులు+అగుచున్+ఉండు= అనేక కర్మలు కలిగినవై ఉంటాయి; ఈ దేహి దేహంబు= ఈ జీవునకు ఆవరించియున్న ఉపాధి; ద్రవ్యజ్ఞాన క్రియాత్మకంబై= ద్రవ్యం జ్ఞానం క్రియ మొదలైనవాటితో కూడి; దేహికిన్= జీవునకు; వివిధ క్లేశ సంతాపంబులన్= అనేక బాధలను, దుఃఖాలను; చేయుచుండున్ కావున= చేస్తూ ఉంటుంది కాబట్టి; నీవు; నిర్మలంబైన మనంబుచేతన్= స్వచ్ఛమైన మనస్సుతో; ఆత్మగతిన్+వెదకి= ఆత్మమార్గాన్ని అన్వేషించి; ధ్రువంబయిన= శాశ్వతమైన; పదవిన్+ఒందుము= పదవిని పొందు; అనియెన్= అన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; నారదుండు= నారదుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; ఉపనిషత్ గోప్యంబు+అగు= వేదాంతంలో రహస్యంగా ఉన్న; నేను+ఇచ్చు మంత్రంబున్= నేనిచ్చే మంత్రాన్ని; ఎవ్వండేని= ఎవడైనా; సప్తరాత్రంబులు= ఏడు రాత్రులు; పఠియించున్= చదువుతాడో; అతండు= ఆ వ్యక్తి; సంకర్షణుండు+ఐన= సంకర్షణ నామంతో కీర్తింపబడే; భగవంతునిన్+చూచున్= పరమేశ్వరుణ్ణి దర్శిస్తాడు; ఎవ్వని పాదమూలంబు= ఎవ్వని పాదాలు; సర్వ+ఆశ్రయంబై+ఉండున్= అందరికీ

ఆశ్రయింపదగినవై ఉంటాయో; అట్టి= అటువంటి; శ్రీమన్నారాయణుని= ఆ విష్ణుమూర్తియొక్క; పాదంబులు సేవించి= పాదాలను స్తుతించి; ఈ మోహంబు వదలి= ఈ మోహమనే గుణాన్ని విడిచిపెట్టి; అతిశీఘ్రంబునన్= వెనువెంటనే; ఉత్తమ పదంబున్+ఒందుము= గొప్పదైన స్థానాన్ని పొందు; ఇప్పుడు= ఈ సమయంలో; ఈ+కుమారునకును= ఈ బిడ్డకు; నీకును= నీకు; ప్రయోజనంబు కలదేనిన్= ఉపయోగపడే అంశం ఏమైనా ఉంది అనుకుంటే; చూడుము= ఇదిగో చూడు; అని= అని చెప్పి; నారదుండు= నారదమహర్షి; మృతబాలకుని= చనిపోయిన కుమారుని; కళేబరంబున్+చూచి= మృతశరీరాన్ని చూచి; ఓ జీవుండ!= ఓ జీవుడా; నీకు శుభంబు అయ్యెడున్= నీకు శుభం కలుగుగాక!; మీ తల్లిదండ్రులన్= మీ అమ్మనాన్నలను; బంధుజనులన్= చుట్టాలను; చూచి; వీరల దుఃఖంబులు+ఆర్చి= వీళ్ళ దుఃఖాలను పోగొట్టి; ఈ కళేబరంబునందున్= ఈ శరీరంలోనే; ప్రవేశించి= దూరి; ఆయుశ్శేషంబున్= నీ మిగిలిన ఆయుష్షును; అనుభవించి; పితృ+అధీనంబైన= మీ తండ్రి అధీనంలో ఉన్న; రాజ్య+ఆసనంబునన్= రాజ్య సింహాసనంపై; కూర్చుండుము= ఆసీనుడవుకమ్ము; అనినన్= అని చెప్పగా; ఆ బాలుండు= ఆ బాలుడు; ఇట్లు అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** అంగిరసుడు చిత్రకేతునితో ఇలా అన్నాడు. 'పుత్రుని కోరుకున్న నీకు పుత్రుని ప్రసాదించిన అంగిరసుడను నేను. ఇతడు చతుర్ముఖబ్రహ్మకుమారుడైన నారదుడు. అంతులేని పుత్రశోకంలో ఉన్న నిన్ను అనుగ్రహించి, నిజమైన జ్ఞానాన్ని ఉపదేశించడానికి వచ్చాము. నీ దుఃఖాన్ని చూచి చనిపోయిన నీ కుమారుని బ్రదికించినా, పుత్రులు గలవారు పొందే దుఃఖం నీవు అనుభవించక తప్పదు. ఈ ప్రకారంగా లోకంలో భార్యలు, ఇళ్ళు, సంపదలు, శబ్దం, స్పర్శ, రూపం, రసం, గంధం మొదలైన విషయాలు, రాజ్య సంపదలు ఇవన్నీ నిశ్చలమైనవి కావు. చంచలములు మాత్రమే. అంతేకాదు, భూమి, బలం, ధనం, భటులు, మంత్రులు, స్నేహితులు మొదలైనవన్నీ దుఃఖాన్ని, మోహాన్ని, భయాన్ని, బాధను కలిగించేవే కాని సుఖాన్ని ఇచ్చేవి కావు.

గగనంలో కనిపించే గంధర్వ నగరంలాగా కలలో కనబడే వస్తువులు కోరికలు తీర్చినట్లు ఉంటాయి కాని అవి మాయం అయిపోయేవే. మన హృదయగత భావాలు స్వప్నంలో సాక్షాత్కరించి అదృశ్యం అవుతాయి. జీవియొక్క దేహం – ద్రవ్యం, జ్ఞానం, క్రియ అనే వాటిచేత దేహికి అనేకరకాలైన దుఃఖాలను, తాపాలను కలుగజేస్తూ ఉంటుంది. కాబట్టి నీవు నిర్మలమయిన మనసుతో ఆత్మ తత్త్వాన్ని గ్రహించి సత్యపదాన్ని పొందు' అని చెప్పాడు. తరువాత నారదుడు ఇలా అన్నాడు. 'ఉపనిషత్తులలో రహస్యంగా దాగి ఉన్న నేనిచ్చే మంత్రాన్ని ఏడు రాత్రులు ఎవడు మననం చేస్తాడో వాడు సంకర్షణుడనే భగవంతుణ్ణి దర్శించగలుగుతాడు. సమస్త ప్రపంచానికీ ఆశ్రయమైన శ్రీమన్నారాయణుని పాదాలు సేవించి ఈ మోహాన్ని వదిలి వెంటనే ఉత్తమపదాన్ని పొందు. ఈ కుమారుని వలన ఇప్పుడు నీకు ప్రయోజనం లేదు చూడు' అంటూ చనిపోయిన బాలకుని శరీరాన్ని చూచి 'ఓ జీవుడా! నీకు శుభం కలుగుగాక! మీ తల్లిదండ్రులను, బంధుజనులను చూచి, వీళ్ళ దుః ఖాన్ని పోగొట్టి, ఈ కళేబరంలో ప్రవేశించి, మిగిలిన నీ జీవితాన్ని అనుభవించి మీ తండ్రి ఇచ్చే సింహాసనంపై కూర్చో' అనగా ఆ బాలుడు ఇలా అన్నాడు.

**తే. కర్మవశమున నెందు సుఖంబు లేక, దేవ తిర్యఙ్నృ యోనులఁ దిరుగు నాకు**
**వెలయ నే జన్మమందునొ వీరు తల్లి, దండ్రు లయినారు చెప్పవే తాపసేంద్ర! 461**

**ప్రతి :** తాపస+ఇంద్ర!= ఓ మునిశ్రేష్ఠా; కర్మవశమునన్= పూర్వకర్మలకారణంగా; ఎందున్ సుఖంబులేక= ఎక్కడా ఏ విధమైన సుఖం లేకుండా; దేవ తిర్యక్+నృయోనులన్= దేవతలు, పశుపక్ష్యాదులు, మానవులు మొదలైన శరీరాలలో;

తిరుగునాకు= తిరుగాడుతున్న నాకు; వెలయన్= తగిన రీతిగా; ఏ జన్మమందునొ= ఏ జన్మలో; వీరు= నా ఎదురుగా ఉన్న వీరు; తల్లిదండ్రులు అయినారు= తల్లిదండ్రులై ఉన్నారో; చెప్పవే= తెలియజేయవా!

**తా :** ఓ మునిసత్తమా! నా పూర్వకర్మల కారణంగా ఇప్పటివరకు నేను దేవతలలో, పశుపక్ష్యాదులలో, నరులలో జన్మించి ఉంటాను. ఇప్పుడు నా ఎదురుగా ఉన్న వీరు ఏ జన్మలో నాకు తల్లిదండ్రులో తెలియజేయండి.

**తే. బాంధవజ్ఞాతిసుతులును బగతు రాత్మ, వరు లుదాసీన మధ్యస్థవర్గములును**
**సరవిఁ గనుచుందు రొక్కొక్క జన్మమునను, నెఱయఁ బ్రాణికి నొక వావి నిజము గలదె? 462**

**ప్రతి :** ఒక్కొక్క జన్మమునను= ఒక్కొక్క జన్మలో; బాంధవజ్ఞాతి సుతులును= బంధువులు, దాయాదులు, కుమారులును; పగతురు= శత్రువులు; ఆత్మవరులు= ప్రియమైనవారు; ఉదాసీన మధ్యస్థవర్గములును= ఉపేక్షించేవారు, వివాదాలు లేని మధ్యస్థుల సమూహాలు; సరవిన్= క్రమంగా; ఒక్కొక్క జన్మమునను= ఒక్కొక్క జన్మలో; కనుచుందురు= చూస్తుంటారు; నెఱయన్= చూడగా; ప్రాణికిన్= జీవికి; నిజము= సత్యంగా; ఒక వావి కలదె= ఒక చుట్టరికం ఉంటుందా!

**తా :** ఒకొక్క జన్మలో ఒక్కొక్కరు బాంధవులుగా, దాయాదులుగా, కుమారులుగా, శత్రువులుగా, మిత్రులుగా, పట్టించుకోనివారుగా, మధ్యస్థులుగా సంబంధాలు కలిగి ఉంటారు. ఇవన్నీ గమనిస్తే ప్రాణికుండే వావివరుసలు, సంబంధ బాంధవ్యాలు శాశ్వతాలా? కావు.

**తే. రత్నములు హేమములు ననురాగలీల, నమ్మకంబుల నీవల నావల నగు**
**భంగి నరులందు జీవుండు ప్రాప్తుఁ డగుచు, నెలమిఁ దిరుగుచునుండుఁ, దా నెందుఁ జెడఁడు. 463**

**ప్రతి :** అనురాగలీలన్= మనకు ఉండే ఇష్టాన్నిబట్టి; అమ్మకంబులన్= అమ్మే వేళలయందు, కొనే వేళలయందు; రత్నములు హేమములు= రత్నాలు బంగారం, ఈవలనావలనగు భంగి= ఇటూ అటూ పోతున్నట్లుగా; నరులందు= మానవులలో; జీవుండు= జీవుడు; ప్రాప్తుఁడగుచున్= చేరుతూ; ఎలమిన్= క్రమంగా; తిరుగుచున్+ఉండున్= ప్రయాణంచేస్తూ ఉంటాడు; తాన్= ఆ జీవుడు; ఎందున్= ఎక్కడ కూడా; చెడఁడు= నశించదు.

**తా :** అమ్మకాలు, కొనుగోళ్ళు జరిగేటప్పుడు బంగారమూ, రత్నాలూ మన ఇష్టానిష్టములను బట్టి మారినట్లుగా ఈ జీవుడు అనేక దేహాలలోకి మారుతూ తిరుగుతూ ఉంటాడు. ఈ వేళ ఒక దేహంలో ఉన్న దేహి లేక ఆత్మ రేపు మరొక దేహంలోకి మారుతూ తిరుగుతూ ఉంటాడు. దేహాలు మారవచ్చునేమో గాని జీవుడు మాత్రం నశించక శాశ్వతంగా ఉంటాడు.

**సీ. ఒక్కఁడై నిత్యుఁడై యెక్కడఁ గడలేక సొరిది జన్మాదుల శూన్యుఁడగుచు**
**సర్వంబునందుండి సర్వంబుఁ దనయందు నుండంగ సర్వాశ్రయుం డనంగ**
**సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాధికములకు సామ్యమై స్వప్రకాశమునఁ వెలిఁగి**
**యఖిలంబుఁ జూచుచు నఖిల ప్రభావుఁడై యఖిలంబు దనయందు నడఁచి కొనుచు**

**తే. నాత్మమాయాగుణంబుల నాత్మమయము, గాఁగ విశ్వంబుఁ దనసృష్టి ఘనతఁ జెందఁ**
**జేయుచుండును సర్వసంజీవనుండు, రమణ విశ్వాత్ముఁ డయిన నారాయణుండు. 464**

**ప్రతి :** రమణన్= ఆనందంతో; విశ్వాత్ముఁడయిన= విశ్వమంతా వ్యాపించి ఉన్న; నారాయణుండు= నారాయణుడు; సర్వసంజీవనుండు= అందరినీ అన్ని ప్రాణులనూ జీవింపచేసేవాడు; ఒక్కఁడై= ఒకే ఒక్కడై; నిత్యుఁడై= శాశ్వతుడై; ఎక్కడన్= ఏ ప్రదేశంలోనూ; కడలేక= అంతంలేక; సొరిదిన్= క్రమంగా; జన్మాదులన్= పుట్టుట, పెరుగుట, గిట్టుట మొదలైన వానిచేత; శూన్యుఁడు అగుచున్= లేనివాడు అవుతూ అనగా ఆది, మధ్య, అంతాలులేక; సర్వంబునందుండి= అన్ని జీవులలో ఉండి; సర్వంబు= సమస్త విశ్వం; తనయందున్+ఉండంగన్= తనలోనే ఇమిడి ఉండగా; సర్వాశ్రయుండు+ అనంగన్= అందరికీ ఆశ్రయమైనవాడు అని అన్నట్లుగా; సూక్ష్మమై= చిన్నవాడై; స్థూలమై= పెద్దవాడవుతూ; సూక్ష్మ+అధికములకున్= అతి చిన్న వస్తువునకు, అతి పెద్ద వస్తువునకుకూడా; సామ్యమై= పోల్చదగినవాడై; స్వప్రకాశమునన్+వెలిఁగి= స్వీయకాంతితో ప్రకాశించి; అఖిలంబున్+చూచుచున్= సర్వ ప్రపంచాన్ని చూస్తూ; అఖిల ప్రభావుఁడై= గొప్ప ప్రభావంగలవాడై; అఖిలంబున్= సమస్త ప్రపంచాన్ని; తనయందున్= తనలోనే; అడఁచి కొనుచున్= లయం చేసుకుంటూ; ఆత్మమాయాగుణంబులన్= తన మాయకు సంబంధించిన గుణాలు; ఆత్మమయము= ఆత్మకు సంబంధించిన గుణాలు; కాఁగన్= అయ్యేట్లుగా; విశ్వంబున్= ప్రపంచాన్ని; తన సృష్టిన్= తనయొక్క సృష్టిచేత; ఘనతన్+చెందన్+చేయుచుండును= గొప్పతనం పొందేలా చేస్తాడు.

**తా :** నారాయణుడు ఒక్కడు. అతడు నిత్యుడు. ఆద్యంతాలు లేనివాడు. జన్మాదులు లేనివాడు. సర్వంలోనూ తానుంటాడు. ఆయనలో సర్వమూ ఉంటుంది. అన్నిటికీ ఆతడే ఆశ్రయుడు. సూక్ష్మం స్థూలం తానే అయి, స్థూలానికి సూక్ష్మానికి తానే ఉదాహరణమై తన తేజస్సుతో తానే స్వయంప్రకాశుడై ఉంటాడు. సమస్తమూ తాను చూడగలడు. అన్నిటిపై తన ప్రభావం చూపగలడు. సమస్త విశ్వాన్ని తనలో ఇముడ్చుకోగలడు. తన మాయాగుణాలతో ఈ సమస్త ప్రపంచాన్ని ఆత్మమయంగా సృష్టి చేస్తుంటాడు. ఈ సమస్త ప్రపంచాలను జీవింపచేసే సంజీవనుడు ఆ నారాయణుడే.

**క. సతు లెవ్వరు? సుతు లెవ్వరు?, పతు లెవ్వరు? మిత్ర శత్రు బంధు ప్రియ సం**
**గతు లెవ్వరు? సర్వాత్మక, గతుఁడై గుణసాక్షి యైన ఘనుఁ డొక్కనికిన్. 465**

**ప్రతి :** సర్వాత్మకగతుఁడై= అందరి ఆత్మలో ఉండే; గుణసాక్షియైన= సత్త్వరజస్తమోగుణాలనే మూడు గుణాలకూ సాక్షీభూతుడై ఉండే; ఘనుఁడొక్కనికిన్= ఘనుడైన పరమాత్మకు; సతులెవ్వరు= భార్యలు ఎవరు?; సుతులు ఎవ్వరు= కుమారు లెవరు?; పతులెవ్వరు= భర్త లెవరు?; మిత్ర శత్రు బంధు ప్రియ సంగతులు ఎవ్వరు= స్నేహితులుగా, శత్రువులుగా, బంధువులుగా, ఇష్టులుగా కలిసి ఉండేవారు ఎవరు?

**తా :** ప్రపంచంలోని ప్రాణులందరి ఆత్మలలో ఉండే ఘనుడు, గుణముల సాక్షి అయిన పరమాత్మకు భార్యలు, కుమారులు, భర్తలు, మిత్రులు, శత్రువులు, బంధువులు, ప్రియులు అనే సంబంధం ఉండదు. పరమాత్మ అందరి ఆత్మలో ఉంటూ, అన్నీ సాక్షిభూతంగా చూస్తుండేవాడే తప్ప, బంధాలలో, బంధుత్వాలలో చిక్కేవాడు కాదు.

## ✣ చిత్రకేతుండు తపం బాచరించి భగవత్ప్రసాదంబు నొందుట ✣

**వ. మఱియు సుఖదుఃఖంబులఁ బొందక సర్వోదాసీనుండై పరమాత్మయై యుండు న ప్పరమేశ్వరరూపుండ నయిన నాకును మీకు నెక్కడి సంబంధంబు? మీకు దుఃఖంబునకుం బని లేదని పలికి యా జీవుండు వోయినం జిత్రకేతుండును బంధువులు నతి విస్మితచిత్తులై శోకంబులు విడిచి మోహంబులం బాసి యమునానదియందు**

**నక్కుమారునకు నుత్తరకర్మంబులు నిర్వర్తించిరి; చిత్రకేతుండు గాఢపంకంబునంబడి వెడలిన యేనుంగునుంబోలె గృహాంధకూపంబునందుండి వెడలి కాళిందీనదికిం బోయి యందు విధిపూర్వకంబుగఁ గృతస్నానుండై మౌనంబుతోడ నారదునకు నమస్కరించిన నతండు ప్రసన్నుండై భగవన్మంత్రంబు విధిపూర్వకంబుగా నతనికి నుపదేశించి యంగిరసుతోడం గూడి బ్రహ్మలోకంబునకుం జనియె; చిత్రకేతుండును నారదోపదేశమార్గంబున నిరాహారుండై సమాధినియతుండై నారాయణరూపంబయిన యా విద్య నారాధించి సప్తరాత్రాంతంబున నప్రతిహతంబయిన విద్యాధరాధిపత్యంబున భాస్వద్రత్నదివ్యవిమానంబునుం బడసి నారాయణునను గ్రహంబునుం బొంది మనోగమనంబునం ద్రిజగంబులం జరియించుచుండఁ గొన్ని దినంబులకు నొక్కచోట.**

**466**

**ప్రతి :** మఱియున్= అంతేకాకుండా; సుఖదుఃఖంబులన్+పొందక= సుఖదుఃఖాలను పొందకుండా; సర్వ+ఉదాసీనుండై= అన్నిటిలోనూ ఉపేక్షాభావం కలిగి; పరమాత్మయై= పరమాత్మగా; ఉండు= ఉండేటటువంటి; ఆ+పరమేశ్వర రూపుండన్+ అయిన= ఆ పరమేశ్వరుని స్వరూపమైన; నాకును= నాకూ; మీకున్= మీకూ; ఎక్కడి సంబంధంబు= సంబంధం ఎక్కడ ఉంటుంది?; మీకు; దుఃఖంబునకున్= దుఃఖపడటానికి; పనిలేదు= అవసరంలేదు; అని పలికి= అని చెప్పి; ఆ జీవుండు పోయినన్= ఆ జీవుడు వెడలిపోగా; చిత్రకేతుండును= చిత్రకేతు మహారాజు; బంధువులున్= బంధువులతో సహా; అతి విస్మిత చిత్తులై= మిక్కిలి ఆశ్చర్యం పొందిన మనస్సుగలవారై; శోకంబులు విడిచి= దుఃఖాలు వదిలిపెట్టి; మోహంబులన్+పాసి= మోహాలను విడిచిపెట్టి; యమునానది యందున్= యమునా నదీ ప్రాంతంలో; ఆ కుమారునకున్= మరణించిన ఆ పుత్రునకు; ఉత్తరకర్మంబులు= మరణానంతర క్రియలు; నిర్వర్తించిరి= చేశారు; చిత్రకేతుండు= చిత్రకేతు మహారాజు; గాఢపంకంబునన్పడి= దట్టమైన బురదలోపడి; వెడలిన= బయటకు వచ్చిన; ఏనుంగునున్+పోలెన్= ఏనుగువలె; గృహ+అంధ కూపంబునందుండి= గృహమనే చీకటి నూతినుండి; వెడలి= బయటపడి; కాళిందీనదికిన్ పోయి= యమునానదికి వెళ్ళి; అందున్= ఆ నదిలో; విధిపూర్వకంబుగన్= శాస్త్రం చెప్పినవిధంగా; కృతస్నానుండై= స్నానంచేసి; మౌనంబుతోడన్= మౌనంతో; నారదునకున్+నమస్కరించినన్= నారదునికి నమస్కారం చేయగా; అతండు= ఆ నారదుడు; ప్రసన్నుండై= దయగలవాడై; భగవత్+మంత్రంబున్= భగవంతునికి సంబంధించిన మంత్రాన్ని; విధిపూర్వకంబుగాన్= తగిన విధివిధానంతో; ఉపదేశించి= ఉపదేశంచేసి; అంగిరసునితోడన్+కూడి= అంగిరసమహర్షితో కలిసి; బ్రహ్మలోకంబునకున్+చనియెన్= బ్రహ్మ ఉండే సత్యలోకానికి వెళ్ళిపోయాడు; చిత్రకేతుండును= చిత్రకేతు మహారాజు; నారద+ఉపదేశమార్గంబునన్= నారదుడు ఉపదేశించిన పద్ధతిలో; నిరాహారుండై= ఆహారాన్ని విడిచిపెట్టి; సమాధినియతుండై= సమాధి స్థితిలో ఉండటం నియమంగా; నారాయణ రూపంబయిన= శ్రీమన్నారాయణుని స్వరూపమైన; ఆ విద్యన్ ఆరాధించి= ఆ విద్యను ఆరాధనా పూర్వకంగా నిర్వర్తించి; సప్తరాత్రాంతంబునన్= ఏడు రాత్రుల కడపట; అప్రతిహతంబయిన= ఎదురులేని; విద్యాధర+ఆధిపత్యంబునన్= విద్యాధరులందరిపై అధికారం కలవాడై; భాస్వత్= ప్రకాశించే; రత్న= రత్నకాంతులుగల; దివ్య విమానంబునున్+పడసి= మహత్తుగల విమానాన్ని పొంది; నారాయణు+అనుగ్రహంబునున్= శ్రీమన్నారాయణుని దయను; పొంది; మనోగమనంబునన్= మనోవేగంతో; త్రిజగంబులన్= మూడు లోకాలలో; చరియించుచుండన్= తిరుగుతూ ఉండగా; కొన్ని దినంబులకున్= కొన్ని నాళ్ళకు; ఒక్కచోట= ఒక ప్రాంతంలో...

**తా :** సుఖదుఃఖాలతో సంబంధం లేకుండా, అన్ని విషయాలలో ఉపేక్ష భావంతో ఉండే పరమాత్మ అయిన ఆ పరమేశ్వర స్వరూపుడ నైన నాకు మీకు సంబంధం ఏమున్నది? మీరు దుఃఖించవలసిన పనిలేదు అని చెప్పి ఆ జీవుడు వెళ్ళిపోయాడు. చిత్రకేతుమహారాజు, అతని బంధువులు మిక్కిలి ఆశ్చర్యపడ్డారు. దుఃఖాన్ని వదలిపెట్టారు. మోహాన్ని దరిచేర నివ్వలేదు. యమునానదీతీరంలో ఆ కుమారునకు ఉత్తరక్రియలు చేశారు. గొప్ప బురదలో కూరుకుపోయిన ఏనుగు బయటపడిన రీతిగా ఇల్లు అనే చీకటినూతినుండి చిత్రకేతుమహారాజు బయటపడ్డాడు. యమునానదికి వెళ్ళాడు. శాస్త్రవిధిగా స్నానంచేసి మౌనం వహించి నారదునకు నమస్కరించాడు. నారదుడు ప్రసన్నుడయ్యాడు. భగవంతుని మంత్రాన్ని విధివిధానంతో చిత్రకేతు మహారాజుకు ఉపదేశం చేశాడు. అంగిరసునితో కలసి నారదుడు బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు.

నారదుడు చెప్పిన రీతిగా చిత్రకేతుడు ఆహారాన్ని విడిచిపెట్టి సమాధి స్థితిలో నారాయణ స్వరూపం అయిన ఆ నారదోపదేశ విద్యను ఆరాధించి ఏడు రాత్రుల చివర ఎదురులేని విద్యాధర పరిపాలనాధికారం పొంది, కాంతులు చిమ్మే రత్నాలతో కూడిన గొప్ప విమానాన్ని పొంది, నారాయణుని దయను పొందినవాడై ముల్లోకాలలో మనోవేగంతో తిరుగుతూ ఉండగా కొన్ని రోజులకొక ప్రాంతంలో

**సీ. తారహారపటీర ధవళదేహమువాని రమణీయనీలాంబరంబువాని**
**మణికిరీటస్ఫురన్మస్తకంబులవానిఁ గంగణకేయూరకరమువానిఁ**
**గర్బురమయదీప్తకటిసూత్రములవానిఁ దరళయజ్ఞోపవీతములవాని**
**నతిసుప్రసన్నవక్త్రాంబుజంబులవానిఁ దరుణవివృత్తనేత్రములవాని**

**ఆ. సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్ర, సిద్ధి వెలసినట్టి యిద్ధచరితుఁ**
**బద్మలోచనునకుఁ బాదపీఠంబైన, ఘనునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు. 467**

**ప్రతి :** తారహార= ముత్యాలహారాలతో; పటీర= గంధంతో సమానమైన; ధవళ దేహమువానిన్= తెల్లని కాంతిగల దేహంతో ఒప్పేవాణ్ణి; రమణీయ= అందమైన; నీల+అంబరంబువానిన్= నీలవస్త్రం కలవాణ్ణి; మణికిరీట స్ఫురత్= మణిమయాలైన కిరీటాలతో ప్రకాశిస్తున్న; మస్తకంబులవానిన్= శిరస్సులు గలవాణ్ణి; కంకణ కేయూర కరము వానిన్= కంకణాలతో, భుజకీర్తులతో కూడిన హస్తం కలవాణ్ణి; కర్బురమయదీప్త= బంగారుమయమైన కాంతులతో కూడి ఉన్న; కటిసూత్రములవానిన్= మొలత్రాళ్లు కలవాణ్ణి; తరళ= కదలాడుతున్న; యజ్ఞోపవీతములవానిన్= జందెములు కలవాణ్ణి; అతిసుప్రసన్న= మిక్కిలి దయగల; వక్త్ర+అంబుజంబులవానిన్= పద్మంవంటి మోము గలవాణ్ణి; తరుణ= యౌవనంచేత; వివృత్త= విప్పారిన; నేత్రములవానిన్= కన్నులు గలవాణ్ణి; సిద్ధమండలంబు= సిద్ధుల సమూహం; సేవింపన్= సేవించగా; పుణ్యప్రసిద్ధిన్= పుణ్యంవల్ల కలిగిన ఖ్యాతితో; వెలసినట్టి= ఒప్పుతున్న; ఇద్ధచరితున్= గొప్ప చరిత్రగలవాణ్ణి; పద్మలోచనునకున్= విష్ణుమూర్తికి; పాదపీఠంబైన= పాదపీఠం అయిన; ఘనునిన్= గొప్పవాణ్ణి; పన్నగ+ఇంద్రున్= గొప్ప సర్పమైన ఆదిశేషుణ్ణి; అతఁడు= ఆ చిత్రకేతుమహారాజు; కాంచెన్= చూశాడు.

**తా :** ముత్యాలహారాలతో, గంధంతో సమానమైన తెల్లని దేహం కలవాణ్ణి, అందమైన పీతాంబరం ధరించినవాణ్ణి, మణులతోకూడిన కిరీటకాంతులు నిండిన శిరస్సులు గలవాణ్ణి, కడియాలు, భుజకీర్తులు నిండిన చేతులు కలవాణ్ణి, స్వర్ణమయకాంతులతో కూడిన మొలతాళ్లు కలవాణ్ణి, కదలాడే యజ్ఞోపవీతాలు కలవాణ్ణి, దయతోకూడిన ముఖపద్మాలు

కలవాణ్ణీ, యౌవనకాంతితో విప్పారిన నేత్రాలు కలవాణ్ణీ, సిద్ధమండలం సేవించగా పుణ్యప్రసిద్ధితో వెలసిన గొప్ప చరిత్రగలవాణ్ణీ, తామరస నేత్రుడైన శ్రీ విష్ణుమూర్తికి పాదపీఠమై ఉన్న మహాత్ముడైన ఆదిశేషుణ్ణి చిత్రకేతుమహారాజు చూశాడు.

**ఆ. కన్నమాత్ర నతఁడు కల్మషంబులఁ బాసి, విమలచిత్తుఁ డగుచు విశదభక్తి**
**నిట్టరోమములకుఁ బట్టగు చానంద, బాష్పనేత్రుఁ డగుచుఁ బ్రణుతి సేసె. 468**

**ప్రతి :** కన్నమాత్రన్= (ఆ ఆదిశేషుణ్ణి) చూచినంతనే; అతఁడు= చిత్రకేతుమహారాజు; కల్మషంబులన్+పాసి= పాపాలు తొలగినవాడై (పాపదూరుడై); విమల చిత్తుఁడు అగుచున్= నిర్మలమైన మనస్సుగలవాడవుతూ; విశదభక్తిన్= అధికమైన భక్తిభావంతో; నిట్టరోమములకున్= గగుర్పొడిచిన వెండ్రుకలున్న స్థితికి; పట్టగుచున్= నిలయుడవుతూ (గగుర్పాటుగల మేనితో అనిభావం); ఆనందబాష్పనేత్రుఁడు+అగుచున్= సంతోషంతో కన్నులలో నీరుగలవాడవుతూ; ప్రణుతి+చేసెన్= నమస్కారం చేశాడు.

**తా :** చిత్రకేతు మహారాజు ఆ ఆదిశేషుణ్ణి చూచినంతనే, ఆయన పాపాలన్నీ పోయాయి. మనసు ప్రశాంతమయింది. అధికభక్తియుతుడై రాజు శరీరం రోమాంచితంకాగా, ఆనందబాష్పాలతో ఆదిశేషునకు నమస్కారం చేశాడు.

**క. సంతోషాశ్రులచేత న, నంతునిఁ బరిషిక్తుఁజేసి యతఁడు ప్రమోదం**
**బెంతయు నరికట్టిన నొక, కొంతయుఁ బలుకంగలేక కొండొక వడికిన్. 469**

**ప్రతి :** సంతోష+అశ్రులచేతన్= ఆనంద బాష్పాలతో; అనంతునిన్= ఆ ఆదిశేషుణ్ణి; పరిషిక్తున్+చేసి= అభిషేకించి; అతఁడు= ఆ రాజు; ప్రమోదంబు ఎంతయున్ అరికట్టినన్= అధికమైన ఆనందం అడ్డుపడగా; ఒక కొంతయున్= రవంతకూడా; పలుకంగ లేక= మాట్లాడలేక; కొండొక వడికిన్= కొంతసేపటికి...

**తా :** చిత్రకేతు మహారాజు ఆనందబాష్పాలతో అనంతుణ్ణి అభిషేకించాడు. పట్టరాని ఆనందంతో గద్గదకంఠుడై మాట్లాడలేక మాట్లాడలేక కొంతసేపటికి

**చ. మది నొకయింతమాత్రన సమంబుగఁ జేయుచు బాహ్యవర్తనం**
**గదిసిన యింద్రియంబుల నొకంతకుఁ దెచ్చి మనంబు వాక్కునుం**
**గుదురుగఁ ద్రోచి తత్త్వమునఁ గూర్చుచు శాశ్వత విగ్రహంబునా**
**సదయుఁ బ్రశాంతు లోకగురు సన్నుతి సేయఁదొడంగె నిమ్ములన్. 470**

**ప్రతి :** మదిన్= మనస్సును; ఒక ఇంతమాత్రన= కొంతసేపటిలోనే; సమంబుగన్+చేయుచున్= సమంగా కుదుటపరచుకొని; అనగా మనసును సమస్థితిలో ఉంచి; బాహ్యవర్తనన్+కదిసిన= బయట విషయాల వెంబడి చరించే; ఇంద్రియంబులన్= ఇంద్రియాల నన్నిటినీ; (కన్ను, ముక్కు, చెవి, నాలుక, శరీరం, అనే పంచజ్ఞానేంద్రియాలను); ఒకంతకున్ తెచ్చి= ఒక చోటికి చేర్చి; మనంబు= మనస్సు; వాక్కునన్= మాటయందు; కుదరుగన్= నిలుకడగా ఉండునట్లు; త్రోచి= ఒక ప్రక్కకు తోసి; తత్త్వమునన్= తత్త్వంలో; కూర్చుచున్= కూర్చుతూ; శాశ్వత విగ్రహంబున్= సత్యమై నిత్యమై ఉండే ఆకృతి గలవాణ్ణీ; సదయున్= దయ గలవాణ్ణీ; ప్రశాంతున్= పరమశాంత స్వభావం గలవాణ్ణీ; లోకగురున్= జగద్గురువైనవాణ్ణీ; ఇమ్ములన్= తగినవిధంగా; సన్నుతి+చేయన్= ప్రశంసించటానికి; తొడంగెన్= ఆరంభించాడు.

**తా :** చిత్రకేతుమహారాజు మనసును చిక్కబట్టుకొన్నాడు. బాహ్యవిషయాలను మాత్రమే గుర్తిస్తున్న జ్ఞానేంద్రియాలను ఒకచోటకు చేర్చాడు. మనసు మాట ఈ రెండు ఒకటే కాగా వాటిని తత్త్వంలో నిలిపి శాశ్వతాకారుడు, దయ గలవాడు, ప్రశాంత స్వభావుడు, జగద్గురువు అయిన ఆదిశేషుణ్ణి స్తుతింప నారంభించాడు.

**క. అజితుఁడవై భక్తులచే, విజితుఁడ వైనాఁడ విపుడు వేడుక వారున్**
**విజితులు నీచేఁ గోర్కులు, భజియింపనివారు నిన్నుఁ బడయుదురె హరీ! 471**

**ప్రతి :** హరీ= ఓ పరమాత్మా!; అజితుఁడవై= జయింప శక్యంకాని వాడవై ఉండికూడా; భక్తులచేన్= నీ భక్తులచేత; ఇపుడు= ఈ సమయంలో; విజితుఁడవైనాఁడవు= జయింపబడినవాడవు అయ్యావు; వారున్= నీ భక్తులుకూడా; నీచేన్= నీ చేత; విజితులు= జయింపబడిన వారయ్యారు; కోర్కులు భజియింపనివారు= నిన్ను పొందాలనే కోరికతో నిన్ను పూజింపనివారు; నిన్నున్ పడయుదురె= నిన్ను పొందగలరా!

**తా :** ఓ హరీ! అనంతా! నీవు ఎవరిచేతను జయింప శక్యం కానివాడవై ఉండికూడా ఇప్పుడు నీ భక్తులచే జయింపబడినావు. నీ భక్తులు కూడా నీ చేత జయింపబడ్డారు. నిన్ను గూర్చి ఆసక్తితో పూజింపనివారు నిన్ను పొందలేరు కదా!

**ఉ. నీ విభవంబు లీ జగము నిండుట యుండుట నాశమొందుటల్**
**నీ విమలాంశజాతములు నెమ్మి జగంబు సృజించువార లో**
**దేవ! భగవద్గుణాంబుధుల తీరముఁ గానక యీశ! బుద్ధితో**
**వావిరిఁ జర్చచేయుదురు వారికి వారలు దొడ్డవారలై. 472**

**ప్రతి :** ఈశ= ఓ పరమాత్మా!; ఈ జగము నిండుట= ఈ ప్రపంచమందంతట నిండియుండటం; ఉండుట= నిలిచి ఉండటం; నాశమొందుటల్= కనబడక లయం అయిపోవడం అనే సృష్టి స్థితిలయకార్యాలు; నీ విభవంబులు= నీయొక్క లీల మాత్రమే; నెమ్మి జగంబు సృజించువారలు= ఈ ప్రపంచాన్ని ప్రేమతో సృష్టించేవారు; ఓ దేవ= ఓ పరమాత్మా!; నీ విమల+అంశజాతములు= నీయొక్క స్వచ్ఛమైన అంశలతో జన్మించినవారు మాత్రమే; వారికి వారలు దొడ్డవారలై= బ్రహ్మ విష్ణుమహేశ్వరులు ఎవరి అంతట వారు గొప్పవారై; భవత్ గుణ+అంబుధుల తీరమున్= నీయొక్క సద్గుణ సాగరంయొక్క ఆవలిగట్టును; కానక= చూడలేక; బుద్ధితో= తెలివితో; వావిరిన్ చర్చ చేయుదురు= వరుసగా చర్చిస్తూ ఉంటారు

**తా :** ఓ పరమాత్మా! ఈ ప్రపంచం సృష్టి, స్థితి, లయ అనే కార్యక్రమాలతో నిండి ఉండటం నీ వైభవమే. ఈ ప్రపంచాన్ని సృష్టించేవారు నీ అంశలు పొందిన వారే. ఈ సృష్టి, స్థితి, లయ అనే పనులు చేయగలిగే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు నీ సుగుణ సముద్ర తీరాన్ని చూడలేక తెలివిగల వారమనుకొని నీ గురించి చర్చచేసుకొంటూ ఉంటారు.

**క. పరమాణువు మొదలుగఁ గొని, పరమము దుదిగాఁగ మధ్యపరికీర్తనచే**
**స్థిరుఁడవు త్రయీవిదుఁడవై, సరి సత్త్వాద్యంత మధ్య సదృశగతుఁడవై. 473**

**ప్రతి :** పరమాణువు మొదలుగన్ కొని= అత్యంత సూక్ష్మమైన పరమాణువు మొదలుకొని; పరమము తుదికాఁగన్= అత్యంత గరిష్ఠమైన పరమంయొక్క చివరివరకు; మధ్య పరికీర్తనచే= మధ్యయందు కూడ కీర్తింపబడినవాడవై అనగా

పరమాణువు మొదలు పరమంయొక్క చివరివరకును మధ్యలోను ఉండి; స్థిరుఁడవు= నిత్యుడవు; త్రయీవిదుఁడవై= వేదత్రయంచే మాత్రమే తెలిసికొన గలవాడవై; సరి సత్త్వ ఆది అంత మధ్య సదృశ గతుఁడవై= సత్త్వమునకు మొదలు తుది మధ్యలో ఉన్నవాడవై (నీవు నెలకొంటావు).

**తా :** స్వామీ! నీవు వేదవేత్తవు. ఆది మధ్యాంతాలు నీ వశంలో ఉంచుకున్నవాడవు. పరమాణువు మొదలుకొని పరమోత్కృష్టమైన పదార్థంవరకూ వ్యాపించి ఉన్నావు. నీవు శాశ్వతుడవు.

**తే. ఉర్వి మొదలైన యేడు నొండొకటికంటె, దశగుణాధికమై యుండు, దానినండ**
**కోశమందు, రజాండంబు కోటి యెవని, యందు నణుమాత్రమగు ననంతాఖ్యుఁ డతఁడు. 474**

**ప్రతి :** ఉర్వి మొదలైన= భూమి మొదలైన; ఏడున్= పంచభూతాలు, మహత్తు, అహంకారం అనే ఏడు; ఒండు ఒకటి కంటెన్= ఒకదానికంటె ఒకటి; దశగుణ+అధికమై ఉండున్= పదిరెట్లు అధికంగా చుట్టూ ఉంటాయి; దానిన్= ఆ ఏడు తత్త్వాలు కలసినదాన్ని; అండకోశమందురు= అండకోశం అంటారు; అజాండంబు కోటి= అటువంటి బ్రహ్మాండాలు ఒక కోటి; ఎవని యందున్= ఎవ్వనిలో; అణుమాత్రము అగున్= ఒక అణువువలె ఉంటాయో; అతఁడు= ఆ మహాత్ముడు; అనంత+ఆఖ్యుఁడు= అనంతుడనే పేరుతో చెప్పబడతాడు.

**తా :** పృథ్వి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం అనే పంచభూతాలూ; మహత్తూ, అహంకారమూ అనే ఏడున్నూ ఒకదానికంటె ఒకటి పదిరెట్లు పెద్దవిగా కూర్చబడి ఉంటాయి. దీనినే అండకోశం అంటారు. ఇటువంటి బ్రహ్మాండాలు ఎవరిలో ఒక అణువువలె ఉంటాయో అతడు అనంతుడని పిలువబడతాడు.

**వ. మఱియు నొక్కచోట విషయతృష్ణాపరులైన నరపశువులు పరతత్త్వంబవైన నిన్ను మాని యైశ్వర్యకాములై తక్కిన దేవతల భజియింపుదురు; వారిచ్చు సంపదలు రాజకులంబునుంబోలె వారలం గూడి నాశంబునం బొందుచుండు; విషయకాములేని నిన్ను సేవించినవారు వేఁచిన విత్తనంబునుం బోలె దేహాంతరోత్పత్తి నొందకుండుదురు; నిర్గుణుండవై జ్ఞానవిజ్ఞానరూపంబు నొందియున్న నిన్ను గుణసమేతునింగా జ్ఞానులు భావింతురు; నీ భజనం బేరూపున నయిన మోక్షంబు ప్రసాదించు; జితమతివైన నీవు భాగవతధర్మం బే ప్రకారంబున నిర్ణయించితి, వా ప్రకారంబున సర్వోత్కృష్టుండ వయిన నిన్ను సనత్కుమారాదులు మోక్షంబు కొఱకు సేవించుచున్నారు; ఈ భాగవతధర్మంబునందు జ్ఞానహీనుం డొక్కండును లేఁ డన్యకామ్యధర్మంబునందు విషమబుద్ధిచేత నేను నీవు నాకు నీకు నని వచియించు చున్నవాఁ డధర్మనిరతుండై క్షయించుచుండు; స్థావర జంగమప్రాణిసమూహంబునందు సమంబైన భాగవతధర్మంబుల వర్తించుచున్న మనుజునికి భవద్దర్శనంబువలనఁ బాపంబు క్షయించుట యేమి చిత్రం? బిపుడు భవత్పాదావలోకనంబున నిరస్తాశయమ లుండనైతి; మూఢుండ నయిన నాకుఁ బూర్వకాలంబున నారదుం డనుగ్రహించి భగవద్ధర్మంబు దయసేసె; నది నేఁడు నాకు వరదుండవైన నీకతంబున దృష్టంబయ్యె; ఖద్యోతంబులచేత సూర్యుండు గోచరుండు గానిమాడ్కి జగదాత్మకుండవైన నీ మహత్త్వంబు మనుజులచేత నాచరింపంబడి ప్రసిద్ధంబైనదిగా, దం దుత్పత్తిస్థితి లయకారణుండవై భగవంతుండవైన నీకు నమస్కరించెద నని మఱియును. 475**

**ప్రతి :** మఱియును= అంతేగాక; ఒక్కచోట= ఒకచోట; విషయతృష్ణాపరులైన= ఇంద్రియ విషయాలలో పిపాసగల; నరపశువులు= పశువులవంటి మానవులు; పరతత్త్వంబైన= గొప్ప తత్త్వమైన; నిన్ను మాని= పరమాత్మవైన నిన్ను విడిచి; ఐశ్వర్యకాములై= సంపదనుకోరినవారై; తక్కిన దేవతలను= మిగిలిన దేవతలను; భజియింపుదురు= పూజిస్తూ ఉంటారు; వారిచ్చు సంపదలు= నీవు గాక ఇతర దేవతలు ఇచ్చే సంపదలు; రాజకులంబునున్+పోలెన్= రాజవంశంవలె; వారలన్ కూడి= వారితో కలసి; నాశంబునన్ పొందుచుండున్= నశిస్తూ ఉంటాయి; విషయకాములేని= ఇంద్రియాలకు సంబంధించిన అంశాలను కోరుకొనే వారైనప్పటికీ; నిన్ను సేవించినవారు= నిన్ను కొలిచినవారు; వేఁచిన విత్తనంబునున్ పోలె= అగ్నితో వేయించిన విత్తనంవలె (పెనంపై వేయించిన బీజంవలె); దేహ+అంతర+ఉత్పత్తిని= మరొక దేహాన్ని ధరించడం అనే పునర్జన్మను; ఒందకుండుదురు= పొందకుండా ఉంటారు అనగా పునర్జన్మ వారికుండదు; నిర్గుణుండవై= గుణరహితుడవై (సత్త్వరజస్తమోగుణాలకు దూరంగా ఉన్న); జ్ఞాన విజ్ఞాన రూపంబున్= జ్ఞానరూపం, విజ్ఞానరూపం; ఒందియున్న నిన్నున్= పొందిన నిన్ను; గుణసమేతునిన్+కా= గుణాలతోకూడినవాణ్ణిగా; జ్ఞానులు; భావింతురు= భావిస్తూంటారు; నీ భజనంబు= నీయొక్క సేవ; ఏ రూపునన్+అయినన్= ఏ రూపంలో చేసినా; మోక్షంబు ప్రసాదించున్= విముక్తిని కలిగిస్తుంది; జితమతివైన= జయింపబడిన మనసుగల; నీవు= పరమాత్మవైన నీవు; భాగవత ధర్మంబున్= భగవత్ భక్తుల ధర్మాన్ని; ఏ ప్రకారంబున నిర్ణయించితివి= ఏ విధంగా నిర్ణయించి చెప్పావో; ఆ ప్రకారంబునన్= ఆ విధంగా; సర్వ+ ఉత్కృష్టుండవు+ అయిన= అందరికంటె గొప్పవాడవయిన; నిన్ను; సనత్కుమార+ఆదులు= సనత్కుమారుడు మొదలైనవారు (సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు); మోక్షంబుకొఱకున్= ముక్తికోసం; సేవించుచున్నారు= సేవిస్తున్నారు; ఈ భాగవతధర్మంబునందు= ఈ భాగవత ధర్మంలో; జ్ఞానహీనుండు= జ్ఞానంలేనివాడు; ఒక్కండును లేఁడు= ఒక్కడు కూడా లేడు; అన్యకామ్యధర్మంబునందు= మిగిలిన కోరికలు కోరే విషయంలో; విషమ బుద్ధిచేతన్= సమంగా లేని బుద్ధిచేత; నేను నీవు నాకు నీకున్ అని= ఇది నేను, అది నీవు, ఇది నాకు అది నీకు అని; వచియించుచున్న వాఁడు= భేదభావంతో మాట్లాడేవాడు; అధర్మనిరతుండై= అధర్మం చేసేవాడై; క్షయించుచుండున్= క్షీణిస్తూ ఉంటాడు; స్థావర జంగమ ప్రాణి సమూహంబునందు= స్థిరంగా ఉండేవి కదిలేవి అనే ప్రాణుల గుంపులో; సమంబైన= సమానమైన; భాగవతధర్మంబులన్= భగవద్భక్తుల ధర్మాలతో; వర్తించుచున్న= ప్రవర్తిస్తున్న; మనుజునికిన్= మానవునకు; భవద్దర్శనంబువలనన్= నీయొక్క దర్శనంచేత; పాపంబు క్షయించుట= పాపం నశించిపోవడం; ఏమి చిత్రంబు= ఏమి ఆశ్చర్యం!; ఇపుడు= ఈ సమయంలో; భవత్ పాద+అవలోకనంబునన్= నీయొక్క పాదదర్శనంచేత; నిరస్త+ఆశయమలుండనైతి= పోగొట్టబడిన మనోమాలిన్యం గల వాడనయ్యాను; మూఢుండనయిన= మూర్ఖుడనైన; నాకున్= నాకు; పూర్వకాలంబునన్= పూర్వకాలంలో; నారదుండు అనుగ్రహించి= నారదమహర్షి దయ చూపి; భగవద్ధర్మంబు= భగవంతునియొక్క ధర్మాన్ని; దయ+చేసెన్= అనుగ్రహించాడు; అది= ఆ విషయం; నేఁడు= ఈ నాడు; నాకు; వరదుండవైన= వరాలు ఇచ్చే వాడవైన; నీకతంబునన్= నీవలన; దృష్టంబు+అయ్యెన్= గోచరం అయింది; ఖద్యోతంబులచేతన్= మిణుగురు పురుగులచేత; సూర్యుండు= సూర్య భగవానుడు; గోచరుండు కానిమాడ్కి= కంటికి కనబడనట్లు; జగదాత్మకుండవైన= సర్వజగత్తునకూ ఆత్మవైన; నీ మహత్త్వంబు= నీ గొప్పదనం; మనుజులచేతన్= మానవులచే; ఆచరింపబడి; ప్రసిద్ధంబైనది కాదు= ప్రసిద్ధి పొందినదికాదు; అందు= ఆ విషయంలో; ఉత్పత్తి స్థితి లయకారణుండవై= సృష్టి, స్థితి, ప్రళయాలకు కారణమైనవాడవై; భగవంతుండవైన= పరమాత్మవైన; నీకు నమస్కరించెదన్= నీకు నమస్కారం చేస్తాను; అని= అని పలికి; మఱియును= అంతేగాక.

**తా :** పశుస్వభావంగల మానవులు కొంతమంది ఒక్కొక్కచోట ఇంద్రియాలను, వాటి కోరికలను తీర్చుకోవాలని తీవ్రమైన ఆలోచనతో పరతత్త్వం అయిన నిన్ను వదిలిపెట్టి, ఐశ్వర్యాన్ని కోరుకొనేవారై మిగిలిన దేవతలను సేవిస్తూ ఉంటారు. నీవు కాక ఇతర దేవతలు ఇచ్చే సంపదలు అశాశ్వతులైన ఆ దేవతలతోపాటే నాశనం పొందుతాయి. నిజానికి ఇంద్రియ విషయాలను కోరుకొనేవారైనా ఇతర దేవతలనుకాక నిన్ను ఆరాధిస్తే, వేయించిన విత్తనం ఎలా మొలకెత్తదో అలా మరో దేహాన్ని ధరించే పునర్జన్మ పొందరు. నీవు నిర్గుణడవే. నీవు జ్ఞాన విజ్ఞానరూపుడవే. నిన్ను జ్ఞానులు గుణసమేతునిగా భావన చేస్తారు. వేయి మాటలెందుకు? నిన్ను ఏ రకంగా పూజించి సేవించినా మోక్షాన్ని పొందుతారు. సనత్కుమారులు మొదలైనవారు నీవు ఏ విధంగా భాగవత ధర్మాన్ని నిర్ణయించావో ఆ విధంగానే అన్నిటికంటె, అందరికంటె గొప్పవాడవైన నిన్ను మోక్షం పొందాలనే ఆలోచనతో సేవిస్తారు.

నీవు చెప్పిన భాగవతధర్మంలో జ్ఞానం లేనివాడు ఒక్కడు కూడా లేడు. ఈ భాగవతధర్మంగాక ఇతరమైన కోరికలతో సమంకాని బుద్ధిచేత మిగిలినవారు నేను, నీవు, నాకు, నీకు అనే స్వపరభేదంతో ప్రవర్తించి అధర్మాన్ని ఆచరిస్తూ నశిస్తారు. చైతన్యంగలవి, చైతన్యంలేనివి అయిన ఈ స్థావర జంగమ ప్రాణుల సమూహం విషయంలో నీచే ప్రవచింపబడిన భాగవతధర్మాన్ని అనుసరించే మానవునకు నీ దర్శనంవలన పాపం పోవడంలో విచిత్రం ఏముంది?! ఈ సమయంలో నీ పాదదర్శనంచేత నేను స్వచ్ఛతను పొందాను. ఏమీ ఎరుగని మూఢుడనైన నాకు గతంలో దయతో నారదుడు భగవద్ధర్మాన్ని తెలియజేశాడు. ఆ నారదుడు చెప్పిన విషయం ఈనాడు నాకు వరదుడవైన నీవలన స్పష్టంగా దర్శనం అయింది. మహాత్మా! మిణుగురు పురుగులకు సూర్యుడు గోచరించనట్లే సామాన్య మానవులకు జగదంతర్యామివైన నీ మహత్త్వం గోచరం కాదు. సృష్టి స్థితిలయాలకు హేతుభూతుడవై భగవంతుడవైన నీకు నమస్కరిస్తున్నాను.

**తే. అరయ బ్రహ్మాదు లెవ్వని ననునయించి, భక్తియుక్తుల మనమునఁ బ్రస్తుతింతు**
**రవని యెవ్వని తలమీఁద నావగింజఁ, బోలు నా వేయిశిరముల భోగిఁ గొల్తు. 476**

**ప్రతి :** అరయన్= ఆలోచిస్తే; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మ మొదలైనవారు; ఎవ్వనిన్= ఏ మహాత్ముణ్ణి; అనునయించి= అనుసరించి; భక్తియుక్తులన్= భక్తితో యుక్తితో; మనమునన్= మనస్సులో; ప్రస్తుతింతురు= ప్రశంసిస్తారో; అవని= ఈ విశ్వం (భూమి); ఎవ్వని తలమీఁదన్= ఏ మహాత్ముని శిరస్సుమీద; ఆవగింజన్+పోలు= ఆవగింజంత ఆకృతిలో ఉంటుందో; (ఈ సమస్త భూమండలాన్ని ఏ మహాత్ముడు శిరస్సుపై ఆవగింజవలె సునాయాసంగా ధరించగలడో); ఆ వేయిశిరములభోగిన్= ఆ వేయి తలలుగల ఫణిని (ఆదిశేషుణ్ణి); కొల్తున్= కొలుస్తాను.

**తా :** బ్రహ్మ మొదలైన సురశ్రేష్ఠులు ఏ మహాత్ముణ్ణి అనుసరించి భక్తియుక్తులతో ప్రశంసిస్తూ ఉంటారో, ఈ విశాల విశ్వం ఏ భగవానుని శిరస్సుపై ఆవగింజవలె సూక్ష్మ ఆకారాన్ని వహించి ఉంటుందో ఆ సహస్రఫణి అయిన ఆదిశేషుణ్ణి నేను సేవిస్తాను.

**క. ఈ విధమున వినుతింపఁగ, నా విద్యాధరులభర్త కనియె ననంతుం**
**డో విమలబుద్ధి! నీ దగు, ధీ విభవంబునకు మెచ్చితిం బ్రియమారన్. 477**

**ప్రతి :** ఈ విధమునన్= ఈ ప్రకారంగా; వినుతింపఁగన్= చిత్రకేతుమహారాజు స్తుతించగా; అనంతుండు= ఆ ఆదిశేషుడు; ఆ విద్యాధరులభర్తకు= విద్యాధరుల ప్రభువైన చిత్రకేతునితో; అనియెన్= ఇలా అన్నాడు; ఓ విమలబుద్ధి= ఓ స్వచ్ఛమైన

బుద్ధిగలవాడా! నీ దగు= నీ; ధీ విభవంబునకున్= బుద్ధి వైభవానికి; ప్రియమారన్= ఆనందంతో; మెచ్చితిన్= మెచ్చుకుంటున్నాను.

**తా :** విద్యాధరులకు అధిపతి అయిన చిత్రకేతువు ఇలా అనంతుని స్తుతించగా, ఆ ఆదిశేష హరిరూపుడైన అనంతుడు ప్రేమతో ఓ స్వచ్ఛ మనస్కా! నీ బుద్ధి వైభవాన్ని మెచ్చుకుంటున్నాను అన్నాడు.

**ఆ. అరయ నారదుండు నంగిరసుండును, దత్త్వ మొసంగినారు, దాని కతన**
**నన్నుఁ జూడఁగల్గె నా భక్తి మదిఁ గల్గె, నా పథంబు నీకు నమ్మఁ గలిగె. 478**

**ప్రతి :** అరయన్= (ఆలోచించి)చూడగా; నారదుండు= నారదమహర్షీ; అంగిరసుండును= అంగిరసుడూ; తత్త్వము+ ఒసంగినారు= భగవతత్త్వాన్ని నీకు తెలియజేశారు; దాని కతనన్= ఆ కారణంగా; నన్నున్ చూడన్‌కల్గెన్= నన్ను నీవు దర్శించగలిగావు; నా భక్తి= నాపై ఇంతటి భక్తిభావం; మదిన్= నీ మనస్సులో; కల్గెన్= నీకు ఏర్పడింది; నా పథంబు= నన్ను అనుసరించే మార్గం; నీకు; నమ్మన్ కలిగెన్= విశ్వాసం కలిగేలా ఏర్పడింది.

**తా :** ఓ చిత్రకేతూ! నారదుడు, అంగిరసుడు నీకు నా తత్త్వాన్ని తెలియజేశారు. దానివల్ల నీవు నన్ను దర్శించగలిగావు. నాపై భక్తి కలిగింది. నా మార్గంపై నీకు అచంచలమైన విశ్వాసం కలిగింది.

**సీ. పూని నా రూపంబు భూతజాలంబులు, భూతభావనుఁడ నేఁ బొందువడఁగ**
**బ్రహ్మంబు మఱియు శబ్దబ్రహ్మమును శాశ్వతంబైనతనువులు దగిలె నాకు**
**నఖిలలోకములందు ననుగతంబై యుందు, లోకంబు నాయందు జోకఁ జెందు,**
**నుభయంబు నాయందు నభిగతంబై యుండు, నభిలీన మగుదు న య్యుభయమందు**

**తే. వెలయ నిద్రించువాఁ డాత్మ విశ్వమెల్లఁ, జూచి మేల్కాంచి తా నొక్క చోటివానిఁ**
**గా వివేకించు మాడ్కి నీ జీవితేశ, మాయ దిగనాడి పరమధర్మంబుఁ దెలియు. 479**

**ప్రతి :** పూని; భూతజాలంబులు= ఈ సమస్తమైన ప్రాణుల సమూహం; నా రూపంబు= నా స్వరూపం; నేన్= నేను; భూతభావనుఁడన్= అన్ని ప్రాణులలో భావంగా ఉన్నవాడను; పొందువడఁగన్= పొందికగా; (నేనే) బ్రహ్మంబు= పరబ్రహ్మ తత్త్వమూ; మఱియున్= అంతేగాక; శబ్దబ్రహ్మమును= శబ్దబ్రహ్మమూ (అయి ఉన్నాను); శాశ్వతంబైన= నిత్యమైన; తనువులు తగిలెన్ నాకున్= శరీరాలు నాకు కలిగాయి; అఖిలలోకములందున్= అన్ని లోకాలలో; అనుగతంబై+ఉందున్= అనుసరించి లోన ఉంటాను; లోకంబు= ఈ సమస్త విశ్వం; నాయందున్= నా లోపల; జోకన్+చెందున్= ఇమిడి ఉంటుంది; ఉభయంబు= ఈ లోకాలలో నేను ఉండుట, ఈ లోకాలు నాలో ఉండుట అనే రెండు విషయాలు; నాయందున్= నా విషయంలో; అభిగతంబై ఉండున్= పొంది ఉంటాయి; ఆ+ఉభయమందున్= పైన చెప్పిన రెండు విషయాలలో; అభిలీన మగుదున్= కలిసి ఉంటాను; వెలయ నిద్రించువాడు= బాగా నిద్ర పొందినవాడు; ఆత్మ విశ్వమెల్లన్= తన ఆత్మగత ప్రపంచ మంతటినీ; చూచి= దర్శించి; మేల్కాంచి= మెలకువ పొంది; తానొక్క చోటివానిన్‌గా= తాను ఒక చోట ఉన్నవాడనే అని; వివేకించు మాడ్కిన్= తెలుసుకొనినట్లు; ఈ జీవితేశ= ఈ జీవితానికి అధిపతియైన; మాయన్ దిగనాడి= మాయను విడిచి; పరమ ధర్మంబున్ తెలియున్= గొప్ప ధర్మాన్ని తెలుసుకొంటాడు.

**తా :** ఈ విశాల విశ్వంలోని సమస్త ప్రాణులూ నా స్వరూపాలే. ఈ విశ్వంలోని అన్ని ప్రాణుల హృదయాలను ఎరిగి నిర్దేశించువాడనూ, బ్రహ్మమూ, శబ్దబ్రహ్మమూ నేనే. నేను శాశ్వత శరీరాలు ధరిస్తున్నాను. ఆత్మస్వరూపంతో అఖిలలోకాలలో నేను ఉన్నాను. లోకాలన్నీ నాలో ఉన్నాయి. నేను అన్ని లోకాలలో ఉండటం, అన్ని లోకాలూ నాలో ఉండటం అనే ఉభయ క్రియలూ నాలో ఉన్నాయి. ఈ ఉభయ కృత్యాలూ నాకు అనుకూలంగా నడుస్తూ ఉంటాయి. సమస్త ప్రపంచంలో నేను లీనమై ఉంటాను. నిద్రించేవాడు స్వప్నంలో ప్రపంచమంతటినీ దర్శించి మెలకువ వచ్చిన తరువాత తాను ఎక్కడ ఉన్నాడో గ్రహించినట్లు జీవుడు తిరిగి తిరిగి ఒకనాటికి మాయనుండి విడివడి పరమధర్మాన్ని తెలుసుకొంటాడు.

**ఆ. నిద్ర వోవువేళ నిరతుఁడై దేహి దా, నెట్టి గుణముచేత నింద్రియములఁ**
**గడచినట్టి సుఖముఁ గను, నట్టి బ్రహ్మంబుఁ, గడిమి మెఱయ నన్నుఁగా నెఱుంగు. 480**

**ప్రతి :** దేహి= జీవుడు; నిద్ర+పోవువేళ= నిదురించే సమయంలో; నిరతుఁడై= నిద్రలో లీనమైనవాడై; తాను= ఈ జీవుడు; ఎట్టి గుణముచేతన్= ఏ విధమైన గుణంచేత; ఇంద్రియములన్= ఇంద్రియాలతో; కడచినట్టి సుఖమున్= దాటిన సుఖాన్ని; కనున్= తెలుసుకుంటాడో; అట్టి బ్రహ్మంబున్= ఆ బ్రహ్మ తత్త్వాన్ని; కడిమి మెఱయన్= స్పష్టపడేలా; నన్నున్+కాన్= నేనేనని; ఎఱుంగు= తెలుసుకో.

**తా :** జీవుడు నిదురించేవేళ నిద్రలో మునిగి ఇంద్రియాలకు అతీతుడై ఉంటాడు. అతనిని గుణాలేవీ స్పృశింపవు. అటువంటి ఇంద్రియాతీతమైన ఆనందస్థితినే బ్రహ్మంగా గుర్తించు. ఆ బ్రహ్మస్వరూపమే నేనుగా తెలుసుకో.

**ఆ. స్వప్నమందు నెట్లు సంచార మొనరించు, మేలుకాంచి దృష్ట మోలి నెఱుఁగు**
**నుభయ మెఱుఁగునట్టి యుత్తమజ్ఞానంబు, తత్త్వ, మట్టిదైన తలఁపు నేను. 481**

**ప్రతి :** స్వప్నమందున్= కలలో; ఎట్లు= ఏ విధంగా; సంచార మొనరించు= దేవుడు సంచరిస్తాడో; మేలుకాంచి= మెలకువ వచ్చిన తరువాత; దృష్టము= కలలో కాంచిన విషయాన్ని; ఓలిన్ నెఱుఁగున్= క్రమంగా తెలుసుకొంటాడు; ఉభయ మెఱుఁ గునట్టి= కలలోను, మెలకువ వచ్చిన తరువాత సత్యాన్ని తెలుసుకోగలిగే; ఉత్తమజ్ఞానంబు= గొప్పదైన జ్ఞానం ఏదైతే ఉందో; తత్త్వము= అది తత్త్వం; అట్టిదైన= అటువంటి; తలఁపు నేను= ఆలోచనను నేనే.

**తా :** జీవుడు నిదురించేవేళ కలగంటాడు. ఆ కలలో వివిధ విషయాలను దర్శిస్తాడు. మెలకువ వస్తుంది. మెలకువ వచ్చిన తరువాత కలలో చూచిన విషయం సత్యంకాదని గ్రహిస్తాడు. కలలో దృశ్యాన్ని చూచి, మెలకువ వచ్చిన తరువాత సత్యాన్ని గ్రహించి కలయొక్క, సత్యంయొక్క లక్షణాన్ని సమన్వయం చేసుకోగల గొప్పజ్ఞానం ఏదైతే జీవునకు ఉంటుందో ఆ తత్త్వాన్ని 'నేను' అని గ్రహించాలి.

**సీ. అరయంగ నెవ్వని కలవిగానట్టి యీ సలలిత మానుషజాతిఁ బుట్టి**
**యాత్మతత్త్వ జ్ఞానహేతుఁడైన వానికిఁ గలుగునె యెందు సుఖం బొకింత?**
**వెలయఁ బ్రవృత్తినివృత్తిమార్గంబుల సుఖదుఃఖచయముల సొరిదిఁ దెలిసి**
**పనిచెడి సంకల్పఫల మూలమునఁ బాటి కదు సుఖదుఃఖమోక్షములకొఱకు**

**ఆ. దంపతి క్రియామతంబు వర్తింతురు, దాన మోక్ష మేల దక్కి యుండు?**
**నఖిల దుఃఖహేతు వయిన యీ కర్మంబు, నెఱిఁగి నన్నుఁ దలఁప రిచ్చలోన. 482**

**ప్రతి :** అరయంగన్= ఆలోచించి చూడగా; ఎవ్వనికి= ఎవ్వరికీ కూడా; అలవిగానట్టి= వీలు కానటువంటి; ఈ సలలిత= ఈ సుకుమారమైన; మానుషజాతిన్+పుట్టి= నరజన్మపొంది; ఆత్మతత్త్వ జ్ఞానహతుఁడైన వానికిన్= ఆత్మతత్త్వానికి సంబంధించిన జ్ఞానం లేనివానికి; ఒక ఇంత= రవంతైనా; సుఖంబు= సుఖం; ఎందున్= ఎక్కడైనా; కలుగునె= లభిస్తుందా?; వెలయన్= స్పష్టంగా; ప్రవృత్తి నివృత్తి మార్గంబులు= ప్రవృత్తి మార్గం, నివృత్తి మార్గం అనే రెండు మార్గాలతో; సుఖదుఃఖ చయముల= సుఖదుఃఖ సమూహాలు ఏర్పడతాయనే విషయం; సొరిదిన్ తెలిసి= వరుసగా తెలుసుకొని; పనిచెడి సంకల్పఫలమూలమునన్= మనోగతాలై సంకల్పాలకు కలిగే ఫలితాల మూలంగా; పాఱి= దూరమయి; కడు సుఖదుఃఖ మోక్షములకొఱకు= మిక్కిలి సుఖాలకోసమూ, దుఃఖాలకోసమూ, మోక్షంకోసమూ; దంపతి క్రియామతంబు= సంసార క్రియాత్మకమై దాంపత్య ధర్మంలో; వర్తింతురు= ప్రవర్తిస్తారు; దానన్= ఆ సంసార బంధాలవల్ల; మోక్షమేల దక్కియుండు= మోక్షం ఎలా లభిస్తుంది?; అఖిల దుఃఖహేతువయిన= అన్ని దుఃఖాలకూ మూలమైన; ఈ కర్మంబున్+ఎఱిఁగి= ఈ సంసార కర్మను గూర్చి తెలిసికూడా; ఇచ్చలోనన్= మనస్సులో; నన్నున్ తలఁపరు= నన్ను గూర్చి ఆలోచించరు.

**తా :** లోకంలో నరజన్మం పరమదుర్లభం. కావాలంటే లభించేది కాదు. అటువంటి ఉత్తమ జన్మమెత్తి కూడా ఆత్మస్వరూపం తెలుసుకోని వాడికి ఏమాత్రం సుఖం లభించదు. మానవులు సుఖప్రాప్తికోసం, దుఃఖనివృత్తికోసం ప్రయత్నిస్తుంటారు. ప్రవృత్తిమార్గాన్నీ, నివృత్తి మార్గాన్నీ అవలంబిస్తారు. కాని వారి సంకల్పం కోరికతో కూడినందువల్ల వారికి సుఖం ప్రాప్తించదు. దుఃఖం తొలగిపోదు. కొందరు సుఖంకోసం దాంపత్యధర్మాన్ని ఆశ్రయిస్తారు. దీనిలో కూడా పరస్పరం వియోగం కలిగినప్పుడు విషాదం తప్పదు. అందువల్ల సంసారసంబంధంలో సైతం సుఖదుఃఖాలు ప్రాప్తిస్తూనే ఉంటాయి. నన్ను విస్మరించి దుః ఖకారణమైన ఈ బంధాలలో చిక్కుకున్నవారికి మోక్షం ఎట్లా దక్కుతుంది!

**విశే :** మానవజన్మ దుర్లభమైంది. మానవుడు విషయలోలుడు కాకుండా ఆత్మతత్త్వాన్ని గ్రహించాలి. ప్రవృత్తిమార్గం నివృత్తిమార్గం అని రెండు మార్గాలున్నాయి. ప్రాపంచిక విషయాలలో కొట్టుమిట్టాడటం ప్రవృత్తిమార్గం. లోకంలో లౌకికంగా ప్రవర్తించకుండా ఉండడం నివృత్తిమార్గం. అంటే లౌకిక విషయాలకు పరాఙ్ముఖంగా ఉండటం, మనసును లోకం వైపునుండి ఆత్మతత్త్వం వైపు మళ్ళించడం. ప్రవృత్తివల్ల దుఃఖం, నివృత్తివల్ల సుఖం కలిగి తీరుతాయి. ఈ సంసారంలో ఉండే జీవికి సుఖదుఃఖాల పరంపర తప్ప, మోక్షం లభించదు. నిజానికి సుఖంగా భావించేది కూడా సుఖంకాదు. అదికూడా దుః ఖమే కాని మానవుడు ఆ దుఃఖాన్ని సుఖభ్రాంతితో చూస్తాడు. అన్ని దుఃఖాలకూ మూలం ఈ సంసారం అని అందరికీ తెలిసికూడా పరమాత్మను మనసులోనైనా ధ్యానించకుండా సంసారదుఃఖ ప్రవాహంలో ఉక్కిరి బిక్కిరి అవుతూ ఈ మానవుడు జీవిస్తూ ఉంటాడు. విషయ పరాఙ్ముఖత్వం అలవాటు చేసుకొంటూ చిత్తం పరబ్రహ్మంపై నిలపటం నిజమైన మోక్షహేతువు.

**వ. మఱియు విజ్ఞానాభిమానులయిన మనుష్యులకు నతిసూక్ష్మంబయిన యాత్మగతి నిజస్థానత్రయ లక్షణంబునఁ జతుర్థాంశంబు నెఱింగి యైహికాముష్మికవిషయంబులచేతను వివేకబలంబుచేతను నియుక్తుండై జ్ఞానవిజ్ఞానసంతృప్తుండైన పురుషుండు నాకు భక్తుండగు; నీ విధంబులు గలవారలు యోగనైపుణ్యబుద్ధి గలవారలునై స్వార్థంబయిన యాత్మచేతం బరమాత్మను దెలియుచుందురు; నీవు నీ క్రమంబున మద్భక్తి శ్రద్ధాపరుండవై విజ్ఞానసంపన్నంబులైన వాక్కులచేత స్తోత్రంబుసేసి ముక్తుండవైతి వని యా శేషభగవంతుండు విద్యాధరపతియైన చిత్రకేతుం బలికి యతని కదృశ్యుండై పోయె; ఏ దిక్కున సర్వాత్మకుండైన యనంతు డంతర్ధానంబు నొందె, నా దిక్కునకు విద్యాధర భర్త నమస్కరించి గగనచరుండై చని లక్షల సంఖ్యలైన దివ్య**

**వర్షంబు లవ్యాహత బలేంద్రియుండై పరమయోగిపురుషులును దివ్యమునీంద్రులును సిద్ధచారణగంధర్వులును వినుతి సేయం గులద్రోణాది శైలంబులను రమ్యప్రదేశంబులను సంకల్పసిద్ధ ప్రదేశంబులను వినోదించుచు శ్రీనారాయణదత్తంబగు దివ్యవిమానంబునందుఁ జరియించుచు నుండి. 483**

**ప్రతి :** మఱియున్= అంతేగాక; విజ్ఞాన+అభిమానులయిన= విజ్ఞానం పొందాలనే మక్కువగల; మనుష్యులకున్= మానవులకు; అతి సూక్ష్మంబయిన= మిక్కిలి సూక్ష్మంగా ఉండే; ఆత్మగతి= ఆత్మమార్గం; నిజస్థానత్రయ లక్షణంబునన్= దేహానికి ఉండే జాగ్రత్, స్వప్న, సుషుప్తి అనే మూడు అవస్థలు దాటిన; చతుర్థాంశంబున్+ఎఱింగి= తురీయమైన అంశంగా గుర్తించి; ఐహిక+ఆముష్మిక విషయంబులచేతను= ఇహసంబంధమైన, పరలోక సంబంధమయిన విషయాలచేత; వివేక బలంబుచేతను= తెలివియొక్క శక్తిచేత; నియుక్తుండై= నియోగింపబడినవాడై; జ్ఞాన విజ్ఞాన సంతృప్తుండైన పురుషుండు= జ్ఞాన విజ్ఞానములచేత సంతృప్తిపొందిన మానవుడు; నాకు భక్తుండు+అగున్= నాకు భక్తుడవుతాడు; ఈ విధంబులు గలవారలు= ఇటువంటి నా భక్తులు; యోగనైపుణ్య బుద్ధిగలవారలునై= యోగమార్గంలో నైపుణ్యం బాగా గ్రహించినవారై; స్వార్థంబయిన= తమదైన; ఆత్మచేతన్= ఆత్మచేత; పరమాత్మను= పరబ్రహ్మాన్ని; తెలియుచుందురు= గుర్తించ గలుగుతారు; నీవున్= నీవుకూడా; ఈ క్రమంబునన్= ఈ వరుసలో; మద్భక్తి శ్రద్ధాపరుండవై= నాయందు భక్తి శ్రద్ధలు గలవాడవై; విజ్ఞానసంపన్నంబులైన= విజ్ఞానంతో నిండిన; వాక్కులచేతన్= మాటలచేత; స్తోత్రంబు+చేసి= స్తుతి చేసి; ముక్తుండ వైతివి= ముక్తిని పొందావు; అని; ఆ శేషభగవంతుడు= ఆదిశేషుడైన ఆ పరమాత్మ; విద్యాధరపతియైన= విద్యాధరులకు రాజు అయిన; చిత్రకేతున్+పలికి= చిత్రకేతుమహారాజుతో చెప్పి; అతనికిన్= ఆ రాజునకు; అదృశ్యుండై పోయెన్= కనిపించకుండా పోయాడు; ఏ దిక్కునన్= ఏ దిశలో; సర్వాత్మకుండు+ఐన= సమస్త వ్యాపకుడైన; అనంతుండు= ఆదిశేషుడైన అనంతుడు; అంతర్ధానంబున్+ఒందెన్= అదృశ్యమైపోయాడో; ఆ దిక్కునకు= ఆ వైపునకు; విద్యాధరభర్త= విద్యాధర రాజు; నమస్కరించి= నమస్కారం చేసి; గగనచరుండై చని= ఆకాశమార్గంలో వెళ్లి; లక్షల సంఖ్యలైన= లక్షలాదిగా; దివ్యవర్షంబులు= దివ్య సంవత్సరాలు; అవ్యాహత= అడ్డులేని; బల+ఇంద్రియుండై= ఇంద్రియబలం గలవాడై; పరమయోగి పురుషులును= గొప్పదైన యోగమార్గంలో ప్రయాణించే మహాత్ములూ; దివ్యముని+ఇంద్రులును= మహత్తుగల మునిశ్రేష్ఠులూ; సిద్ధచారణ గంధర్వులును= సిద్ధులూ, చారణులూ, గంధర్వులు మొదలైన వారూ; వినుతి+చేయన్= స్తుతిస్తూ ఉండగా; కుల ద్రోణ+ఆది శైలంబులను= గొప్ప ద్రోణ మొదలైన పర్వతాలను; రమ్య ప్రదేశంబులను= అందమైన ప్రాంతాలను; సంకల్పసిద్ధ ప్రదేశంబులను= సంకల్పం చేసినంత మాత్రాన సిద్ధిని గలిగించే గొప్ప ప్రాంతాలను; వినోదించుచున్= చూచి ఆనందపడుతూ; శ్రీనారాయణదత్తంబు+అగు= శ్రీమన్నారాయణునిచే సమర్పింపబడిన; దివ్యవిమానంబునందున్= మహత్తుగల విమానంలో; చరియించుచున్+ఉండి= సంచరిస్తూ...

**తా :** మానవులు విజ్ఞానాన్ని అభిమానిస్తారు. అటువంటివారు మిక్కిలి సూక్ష్మమైన ఆత్మమార్గంలో జాగృత్, స్వప్న, సుషుప్తి అనే మూడు స్థితులు దాటిన నాల్గవదైన తురీయస్థితిని తెలుసుకొని, ఇహలోక, పరలోక విషయాలచేత, విచక్షణ అనే వివేకం యొక్క బలంచేత నియోగింపబడి జ్ఞాన విజ్ఞాన విషయాలలో ఎవడు సంతృప్తిని పొందుతాడో అటువంటి జీవుడు నాకు భక్తుడవుతాడు. ఈ విధంగా ఎవరు ఉంటారో వారు యోగమార్గనిపుణులై తమయొక్క ఆత్మచేత పరమాత్మను తెలుసుకోగలుగుతారు.

నీవు అదేవిధంగా నా యందు భక్తిశ్రద్ధలు గలవాడవై విజ్ఞానసంపదతో కూడిన మాటలచేత నన్ను స్తోత్రంచేసి ముక్తి పొందావు. విషయప్రపంచంనుండి బయటపడ్డావు అని ఆదిశేషుడైన అనంతపరమాత్మ విద్యాధరులందరికి ప్రభువైన

చిత్రకేతుమహారాజుతో చెప్పి అదృశ్యంఅయిపోయాడు. ఏ దిక్కులో స్వామీ, సర్వాత్మకుడూ అయిన అనంతపరమాత్మ అదృశ్యం అయ్యాడో ఆ దిక్కునకు విద్యాధరరాజు చిత్రకేతువు నమస్కారం చేశాడు. ఆకాశమార్గంలో సంచరిస్తూ ఆ చిత్రకేతువు లక్షల దివ్యసంవత్సరాలు ఎదురులేని ఇంద్రియబలంతో ఎంతోమంది పరమయోగిపుంగవులు, దివ్యమునీంద్రులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు స్తుతించే ద్రోణాది పర్వతాలను, రమ్యప్రదేశాలను, మనసులో అనుకున్నంత మాత్రంచేత ఆ సంకల్పాన్ని సిద్ధింపచేసే ప్రదేశాలను చూచి ఆనందిస్తూ, శ్రీమన్నారాయణుడు తనకు అనుగ్రహించిన దివ్యవిమానంలో సంచరిస్తూ

**శా. ఆడించున్ హరిదివ్యనాటక గుణవ్యాపార నృత్యంబులం,**
**పాడించున్ జలజాతనేత్రబిరుద ప్రఖ్యాతగీతంబులం,**
**గూడించున్ సతతంబు జిహ్వలతుదిన్ గోవిందనామావళుల్**
**క్రీడం గిన్నరయక్షకామినులచేఁ గృష్ణార్పితస్వాంతుఁడై. 484**

**ప్రతి :** కృష్ణ+అర్పిత స్వాంతుఁడై= పరమాత్మకే అర్పించిన మనస్సు గలవాడైన చిత్రకేతువు; కిన్నరయక్షకామినులచేన్= కిన్నరులు యక్షులు అనే దేవతాజాతి స్త్రీలచేత; క్రీడన్= వినోదంగా; హరి= విష్ణువుయొక్క; దివ్యనాటక= దివ్యలీలలనూ; గుణవ్యాపార= గుణవిశేషాలనూ; నృత్యంబులన్= నాట్యరీతులుగా; ఆడించున్= ప్రదర్శింపజేస్తాడు; జలజాతనేత్ర= పద్మనేత్రుడైన విష్ణువుయొక్క; బిరుద= బిరుదులతోకూడిన; ప్రఖ్యాత గీతంబులన్= విశేష కీర్తిని పొందిన పాటలను; పాడించున్= పాడిస్తాడు; సతతంబు= ఎల్లప్పుడు; జిహ్వలతుదిన్= నాలుకల చివర; గోవిందనామ+ఆవళుల్= విష్ణుమూర్తికి సంబంధించిన అనంతనామాలను; కూడించున్= కూడిపలికేలా చేస్తాడు.

**తా :** చిత్రకేతుమహారాజు కృష్ణార్పణబుద్ధితో బాగా గానంచేయగల యక్ష కిన్నర కాంతలచేత విష్ణుమూర్తికి సంబంధించిన గొప్పవైన నాటకరీతులనూ, గుణవిశేషాలను నృత్యాలుగా ఆడిస్తాడు. పద్మపత్ర నేత్రుడైన విష్ణువుయొక్క బిరుదులతో కూడిన ప్రఖ్యాతమైన గీతాలను పాడిస్తాడు. నిరంతరం వారి నోట గోవిందుని అనంత నామావళులను పలికిస్తాడు.

**సీ. వాసించు నాత్మలో వైష్ణవజ్ఞానంబు, నాశించు భాగవతార్చనంబు,**
**భూషించు నే ప్రొద్దుఁ బుండరీకాక్షుని, భాషించు హరికథాప్రౌఢి మెఱసి,**
**ఘోషించు హరినామగుణనికాయంబులు, పోషించుఁ బరతత్త్వబోధ మరసి,**
**సేవించు శ్రీకృష్ణసేవకనికరంబు, సుఖమునఁ జేయు నీశునకు బలులు,**

**తే. పాడుఁ బాడించు వైకుంఠభర్త నటన, రూపవర్తన గుణనామ దీపితోరు**
**గీతజాతప్రబంధ సంగీత విధులఁ, గేశవప్రీతిగాఁ జిత్రకేతుఁ డెపుడు. 485**

**ప్రతి :** చిత్రకేతుఁడు= చిత్రకేతుడనే ఈ విద్యాధర రాజు; ఎపుడు= ఎల్లప్పుడూ; కేశవ ప్రీతిగాన్= విష్ణుమూర్తికి ప్రీతికరంగా; వైష్ణవ జ్ఞానంబున్= విష్ణు సంబంధమైన జ్ఞానాన్ని; ఆత్మలోన్= తనలో; వాసించున్= నివసించేలా చేస్తాడు; భాగవత+ అర్చనంబు= భగవద్భక్తులసేవ; ఆశించున్= కోరుకుంటాడు; ఏ ప్రొద్దున్= అన్నివేళలా; పుండరీక+అక్షుని= పద్మనేత్రుడైన విష్ణువును; భూషించున్= (తులసీదామాదులచే) అలంకరిస్తాడు; హరికథాప్రౌఢి= విష్ణుమూర్తియొక్క ప్రౌఢమైన కథలను;

మెఱసి= స్పష్టపడేలా; భాషించున్= మాట్లాడతాడు; హరినామగుణనికాయంబులు= విష్ణువుయొక్క గుణాలను, అనంతనామాలను; ఘోషించున్= ఉద్ఘాటిస్తాడు; పరతత్త్వబోధము= పరతత్త్వానికి సంబంధించిన ప్రబోధాన్ని; అరసి= తెలిసికొని; పోషించున్= వృద్ధి చేస్తుంటాడు; శ్రీకృష్ణసేవకనికరంబున్= శ్రీకృష్ణునియొక్క భక్తసమూహాన్ని; సేవించున్= సేవిస్తూ ఉంటాడు; ఈశునకున్= పరమాత్మకు; బలులు= పూజాదికాలు; సుఖమునన్+చేయున్= ఆనందంగా చేస్తాడు; వైకుంఠభర్త= వైకుంఠానికి ప్రభువైన విష్ణుమూర్తియొక్క; నటన= నటించిన తీరు; రూప= ఆకృతి; వర్తన= నడవడి; గుణ= దివ్యగుణాలు; నామ= విష్ణుసహస్రనామాలు; దీపిత= ప్రకాశించే; ఉరు= గొప్పవైన; గీతజాత= గేయాలద్వారా జనించిన; ప్రబంధ సంగీత విధులన్= సంగీత శాస్త్రప్రకారంగా; పాడున్= తాను పాడుతూ ఉంటాడు; పాడించున్= ఇతరులచే పాడిస్తూ ఉంటాడు.

**తా :** చిత్రకేతు మహారాజు అన్నివేళలా విష్ణుప్రీతిగా ఈ క్రింది పనులు చేస్తూ, చేయిస్తూ ఉంటాడు. అవి: వైష్ణవజ్ఞానం తనలో నిలుపుకుంటాడు. భగవద్భక్తుల కైంకర్యం కోరుకుంటాడు. పద్మాక్షుడైన హరిని తులసీమాలాదులతో అలంకరిస్తాడు. విష్ణుకథామహాత్మ్యాన్ని భాషిస్తూ ఉంటాడు. విష్ణుమూర్తి గుణసమూహాన్ని ఎలుగెత్తి పలుకుతాడు. పరతత్త్వాన్ని గుర్తించి దాన్ని వృద్ధి చేసుకొంటాడు. శ్రీకృష్ణసేవకులను సేవిస్తూ ఉంటాడు. పరమాత్మకు పూజాదికాలు సంతోషంతో సమర్పిస్తాడు. వైకుంఠప్రభువుయొక్క లీలలూ, రూపమూ, ప్రవర్తనా, గుణాలూ, నామాలూ వీటితోకూడిన దివ్యప్రబంధాలను సంగీత శాస్త్రానుసారంగా తాను పాడుతూ, ఇతర భక్తులచేత పాడిస్తూ ఉంటాడు.

## ❖ చిత్రకేతుం డీశ్వరధిక్కారంబున గౌరిచే శాప మొందుట ❖

**మ. హరిఁ గీర్తించుచు నల్లనల్ల మదిలో నబ్జాక్షు సేవించుచుం**
**బరమానందము నొందుచున్ జగములం బ్రఖ్యాతి వర్తించుచున్**
**సురరాజోపమమూర్తి యక్షగణముల్ సొంపార విద్యాధరా**
**ప్సరసల్ గొల్వఁగఁ బాడఁగా సితగిరిప్రాంతంబున న్నేఁగుచున్. 486**

**ప్రతి :** సురరాజ+ఉపమమూర్తి= దేవేంద్రుడితో సమానుడైన చిత్రకేతువు; హరిన్= విష్ణుమూర్తిని; కీర్తించుచున్= స్తుతిస్తూ; మదిలోన్= హృదయంలో; అల్లనల్లన్= మెల్లమెల్లగా; అబ్జ+అక్షున్= పద్మాక్షుడైన విష్ణువును; సేవించుచున్= కొలుస్తూ; పరమ+ఆనందమున్= ఉత్కృష్టమైన ఆనందాన్ని; ఒందుచున్= పొందుతూ; జగములన్= లోకాలలో; ప్రఖ్యాతిన్ వర్తించుచున్= కీర్తితో ప్రవర్తిస్తూ; యక్షగణముల్= యక్షులసమూహాలు; సొంపు+ఆరన్= సౌందర్యంతో ఒప్పే; విద్యాధర+అప్సరసల్= విద్యాధరులు అచ్చర కాంతలు; కొల్వఁగన్= సేవిస్తూ ఉండగా; పాడఁగాన్= పాడుతూ ఉండగా; సితగిరి ప్రాంతంబునన్= తెల్లని కైలాస పర్వతప్రాంతంలో; ఏఁగుచున్= ప్రయాణం చేస్తూ...

**తా :** ఇంద్రసమానరూపంతో చిత్రకేతువు విష్ణువును స్తుతిస్తూ; మనసులో పద్మాక్షుడైన శ్రీహరిని సేవిస్తూ; ఆనందిస్తూ; లోకాలన్నింటా కీర్తి గడిస్తూ; యక్షులు, విద్యాధరులు, అప్సరఃకాంతలు తనను సేవిస్తూ, గానం చేస్తూ ఉండగా; కైలాసపర్వత ప్రాంతంలో పయనిస్తూ

**శా. ఆ విద్యాధరభర్త గాంచె హరనీహారామృతాహాసమున్**
**శ్రీవిభ్రాజితమున్ నిరస్తగిరిజాసేవాగతాయాసమున్**

**దేవానీక వికాసమున్ శుభమహాదేవాంఘ్రి సంవాసమున్**
**భూవిఖ్యాత విలాసముం ద్రిభువనీ పూతంబుఁ గైలాసమున్.** **487**

**ప్రతి :** ఆ విద్యాధరభర్త= విద్యాధరప్రభువైన ఆ చిత్రకేతువు; హర= శివునివలె; నీహార= మంచువలె; అమృతా= అమృతంవలె; హాసమున్= తెల్లని నవ్వులు (చిమ్మేదీ); శ్రీ విభ్రాజితమున్= సంపదలతో ప్రకాశించేదీ; నిరస్త= పోగొట్టబడిన; గిరిజాసేవాగత= పార్వతిదేవి చేసిన సేవవల్ల గలిగిన; ఆయాసమున్= అలసట గలది; దేవానీక వికాసమున్= దేవతలందరికీ వికాసం కలిగించేది; శుభ= శుభాన్ని కలిగించే; మహాదేవ= పరమేశ్వరునియొక్క; అంఘ్రి= పాదాలకు; సంవాసమున్= నిలయమైనదీ; భూవిఖ్యాత= భూమండలంలోనే కీర్తి పొందిన; విలాసమున్= హొయలు కలదీ; త్రిభువనీపూతంబున్= ముల్లోకాలలో పవిత్రమైనది అయిన; కైలాసమున్= కైలాసం అనే పేరుగల పర్వతాన్ని; కాంచెన్= దర్శించాడు.

**తా :** విద్యాధర ప్రభువైన చిత్రకేతువు శంకరునివలె, మంచువలె, అమృతంవలె తెల్లని నవ్వులు చిందించేదీ; సంపదలతో కాంతిమంతమైనదీ; సేవచే అలసిన పార్వతీదేవికి అలసటను పోగొట్టేదీ; దేవతాసమూహానికి వికాసం కలిగించేదీ; మహాదేవుడైన ఈశ్వరుని చరణస్పర్శతో కూడినదీ; భూమండలంలో విరాజమానమైనదీ; ముల్లోకాలలో పవిత్రమైనదీ; అయిన కైలాస పర్వతాన్ని దర్శించాడు.

**క.** **ఆ రజతభూధరంబున, నీరేజభవామరాదినికరము గొల్వం**
**బేరోలగమున నుండిన, గౌరీయుతుఁడయిన హరునిఁ గనియె నరేంద్రా!** **488**

**ప్రతి :** నరేంద్రా!= ఓ రాజా!; ఆ రజత భూధరంబునన్= ఆ వెండికొండపై; నీరేజభవ= బ్రహ్మ; అమర= దేవతలు; ఆది= మొదలుగాగల; నికరము= సమూహం; కొల్వన్= సేవిస్తూ ఉండగా; పేరోలగమునన్= నిండుసభలో; ఉండిన= ఉన్న; గౌరీయుతుఁడయిన= పార్వతీసహితుడైన; హరునిన్= పరమేశ్వరుణ్ణి; కనియెన్= చూశాడు.

**తా :** ఓ రాజా! ఆ వెండికొండపై బ్రహ్మాది దేవతలు కొలుస్తూ ఉండగా, నిండుసభలో పార్వతీసహితుడైన పరమేశ్వరుణ్ణి చిత్రకేతువు చూశాడు.

**సీ.** **తన నిజరూప మింతయు నున్కి దెలియక, వాదంబుసేసెడు వేదరవముఁ**
**గరుణావలోకనాకాంక్షితులై యున్న బ్రహ్మాది సనకసంప్రణుతిరవము**
**సారశివానంద సల్లాపముల నొప్పు ప్రమథగణాళి యార్భటరవంబు**
**డమరుమృదంగాది ధమధమధ్వనితోడి పటుభృంగి నాట్యవిస్ఫారరవము**

**తే.** **మానుగాఁ జామరలు వీచు మాతృకాది, కామినీజన మహిత కంకణరవంబు**
**మెండు జెలఁగఁగఁ గన్నుల పండువయ్యెఁ, గొండరాచూలి పెనిమిటి నిండుకొల్వు.** **489**

**ప్రతి :** తన= తనయొక్క; నిజరూపము= స్పష్టమైన స్వరూపం; ఇంతయు ఉన్కి= ఇంతగా ఉందని; తెలియక= తెలుసుకోలేక; వాదంబు+చేసెడు= వాదించుకొంటున్న; వేదరవమున్= వేదధ్వనిని; కరుణ+అవలోకన= దయతో చూసే క్రీగంటిచూపును; ఆకాంక్షితులై= కోరుతున్నవారై; ఉన్న; బ్రహ్మాది= బ్రహ్మ మొదలైన; సనక= సనకసనందనాదుల; సంప్రణుతిరవము= చక్కని కీర్తనల ధ్వని; సార= సారవంతమైన; శివ+ఆనంద= శివ దర్శనం వల్ల కలిగిన ఆనందం; సల్లాపములన్= చక్కని

మాటలతో; ఒప్పు= తగిన; ప్రమథగణ+ఆళి= ప్రమథగణ సమూహంయొక్క; ఆర్భటరవంబు= పెద్దధ్వని; డమరు మృదంగ+ఆది= డమరుకం, మృదంగం మొదలైన; ధమ ధమ ధ్వనితోడి= ధమ ధమ శబ్దాలతో కూడిన; పటు= గొప్పదైన; భృంగి= భృంగియొక్క; నాట్య= నాట్యానికి సంబంధించిన; విస్ఫారరవము= విస్తారమైన ధ్వని; మానుగాన్= అందంగా; చామరలు వీచు= వింజామరలు విసరుతున్న; మాతృక+ఆది= సప్తమాతృకలు మొదలైన; కామినీజన= స్త్రీలకు సంబంధించిన; మహిత= గొప్పదైన; కంకణరవంబు= కంకణాల ధ్వని; మెండు చెలఁగఁగన్= అధికంకాగా; కొండరాచూలి పెనిమిటి= పర్వతరాజపుత్రిక అయిన పార్వతీదేవియొక్క భర్త అయిన పరమేశ్వరునియొక్క; నిండు కొల్వు= పెద్దసభ; కన్నులపండువు+అయ్యెన్= నేత్రానందం కలిగించింది.

**తా :** ఆ పరమేశ్వరుని కొలువుకూటంలో ఒకపక్క భగవంతుని యథార్థస్వరూపాన్ని తెలుసుకోలేక వేదాలు వాదించుకుంటున్నాయి. ఒకపక్క పరమశివుని దాక్షిణ్యవీక్షణంకోసం నిరీక్షిస్తూ బ్రహ్మాది దేవతలూ, సనకసనందనాది దేవర్షులూ స్తోత్రాలు చేస్తున్నారు. ఒకపక్క సదాశివుని సల్లాపాలు చెప్పుకుంటూ ప్రమథగణాలు ఆనందంతో కేకలు వేస్తున్నాయి. మరొకపక్క డమరుకం, మృదంగం మొదలైన వాద్యాల ధమధమ ధ్వనులతో భృంగి నాట్యం చేస్తున్నాడు. మరొకపక్క వింజామరలు వీస్తున్న సప్తమాతృకల మణికంకణ నిక్వణాలు వినిపిస్తున్నాయి. ఈ విధంగా వెండికొండమీద పరమేశ్వరుని నిండు కొలువు కన్నులపండువు చేసింది.

**విశే :** సప్తమాతృకలు : బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వారాహి, వైష్ణవి, ఇంద్రాణి, చాముండి.

**వ. ఇట్లు బ్రహ్మాది సురనికర సేవితుండై యూరుపీఠంబున నున్న భవానిఁ గౌఁగిటం జేర్చుకొని యొడ్డోలగంబున నున్న పరమేశ్వరుం జూచి చిత్రకేతుండు పకపక నగి యద్దేవి వినుచుండ నిట్లనియె. 490**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; బ్రహ్మాది= బ్రహ్మ మొదలుగా గల; సురనికర సేవితుండై= దేవతాసమూహంచేత పూజింపబడుతున్నవాడై; ఊరుపీఠంబునన్+ఉన్న= తొడమీద ఆసీనురాలై ఉన్న; భవానిన్= పార్వతిని; కౌఁగిటన్ చేర్చుకొని= కౌగిలించుకొని; ఒడ్డు+ఓలగంబునన్= పెద్దసభలో; ఉన్న= ఉన్నటువంటి; పరమేశ్వరున్ చూచి= పరమశివుణ్ణి చూచి; చిత్రకేతుండు= చిత్రకేతువు; పకపకనగి= గట్టిగా నవ్వి; ఆ దేవి వినుచుండన్= ఆ పార్వతీదేవి వినేలా; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా బ్రహ్మాదిదేవతాసమూహం పరివేష్టించి సేవిస్తూ ఉండగా, తొడమీద కూర్చున్న పార్వతీదేవిని ఆదరంతో ఆలింగనం చేసుకొని నిండు కొలువులో ఉన్న శివుణ్ణి చూచి చిత్రకేతువు పకపకా నవ్వి పార్వతికి వినపడేలా ఇలా అన్నాడు.

**సీ. కొమరొప్పఁగా లోకగురుఁడును గడలేని ధర్మస్వరూపంబుఁ దాన యగుచు**
**జడలు ధరించియు సరిలేనితపమునఁ బొడవైన యీ యోగిపుంగవులును**
**బ్రహ్మవాదులుఁ గొల్వ భాసిల్లు కొల్వులో మిథునరూపంబున మెలఁతతోడఁ**
**బ్రాకృతుండునుబోలె బద్ధానురాగుఁడై లాలితుం డయ్యె నిర్లజ్జత నిట**

**ఆ. నకట! ప్రకృతి పురుషుఁ డైనఁ దా నేకాంత, మందు సతులతోడ నలరుఁగాని**
**యిట్లు ధర్మసభల నింతులతోఁగూడి, పరిభవింపలేఁడు భ్రాంతి నొంది. 491**

**ప్రతి :** కొమరు+ఒప్పఁగాన్= తగినవిధంగా; లోకగురుఁడును= లోకానికి గురువైనవాడు; కడలేని= అంతులేని; ధర్మస్వరూపంబున్= ధర్మగుణానికి ఆకారం; తానయగుచు= తానే అయి ఉండి; జడలు ధరించియున్= పెద్ద పెద్ద జడలు తాల్చి; సరిలేని తపమునన్= సాటిలేని తపస్సులో; పొడవైన= పెద్దవారలైన; ఈ యోగి పుంగవులును= ఈ యోగులలో శ్రేష్ఠులూ; బ్రహ్మవాదులున్= పరబ్రహ్మతత్త్వం గుర్తించినవారూ; కొల్వన్= పూజింపగా; భాసిల్లు కొల్వులోన్= ప్రకాశించే సభలో; మిథునరూపంబునన్= దంపతుల రూపంతో; మెలఁత తోడన్= భార్యతో; ప్రాకృతుండును+పోలెన్= మామూలు మానవునివలె; బద్ధ+అనురాగుఁడై= ప్రేమవివశుడై; ఇటన్= ఈ సభలో; నిర్లజ్జతన్= సిగ్గులేకుండా; లాలితుండు+అయ్యెన్= లాలింపబడుతూ ఉన్నాడు; అకట= అయ్యో!; ప్రకృతి పురుషుఁడు+ఐనన్= లౌకిక ప్రపంచంలోని మానవుడుకూడా; ఏకాంతమందున్= ఒంటరిగా ఉండి ఎవ్వరూ లేనివేళ మాత్రమే; సతులతోడన్= స్త్రీలతో; అలరుఁగాని= సంతోషిస్తాడుకాని; ఇట్లు= ఈ విధంగా; ధర్మసభలన్= ధర్మం తెలిసినవారు ఉండే సభలలో; ఇంతులతోన్ కూడి= స్త్రీలతోకూడి; భ్రాంతినొంది= మోహపడి; పరిఢవింపలేఁడు= ప్రవర్తించలేడు.

**తా :** అన్ని లోకాలకు పెద్దవాడై ధర్మరూపమే తానై ఉన్నవాడు పరమేశ్వరుడు. అంతులేని తపస్సుచేసి శిరోజాలు జడలు కట్టగా పెద్దలైన గొప్ప యోగులు, పరబ్రహ్మతత్త్వాన్ని గుర్తించినవారు కొలుస్తుండగా భాసిస్తున్న సభలో ఈ పరమేశ్వరుడు తన భార్యతో గూడి దంపతీరూపంగా సామాన్య మానవునివలె భార్యపై ప్రేమతో సిగ్గువిడిచి లాలింపబడుతున్నాడు. అయ్యో! లౌకిక మానవుడు కూడా ఏకాంతంలో మాత్రమే తన భార్యలతో కలసి ఉంటాడు తప్ప ఇలా ధర్మసభలలో భ్రాంతితో ఇలా ప్రవర్తించడు.

**క. అన విని పరమేశ్వరుఁ డా, తని నేమియు ననక నవ్వెఁ దత్సభవారుం**
**గనుఁగొని యూరక యుండిరి, మనుజేశ్వర! యీశుధైర్య మహి మెట్టిదియో? 492**

**ప్రతి :** అన విని= అలా చిత్రకేతువు పలుకగా ఆలకించి; పరమేశ్వరుఁడు+ఆతనిన్= మహేశ్వరుడతణ్ణి; ఏమియున్ అనక= ఏమీ అనకుండా; నవ్వెన్= చిరునవ్వు చిందించాడు; తత్+సభవారున్= ఆ సభలో ఉన్నవారందరూ కూడా; కనుఁగొని= చిత్రకేతుడు నవ్వుతూ ఉండడం చూచి; ఊరక ఉండిరి= 'కిం' అనకుండా ఉన్నారు; మనుజేశ్వర= ఓ మహారాజా!; ఈశుధైర్య మహిమ= పరమేశ్వరునకు గల మిక్కిలి ధైర్యం; ఎట్టిదియో?= ఎటువంటిదో కదా!

**తా :** ఓ మహారాజా! చిత్రకేతువుయొక్క పరిహాసవచనాలను వినికూడా పరమేశ్వరుడు ఏమీ అనకుండా చిన్ననవ్వు నవ్వాడు. ఆ సభలోని వారంతా ఈ విషయం చూచి మౌనం వహించారు. ఈశుడు ఇంత జరిగినా ఏమీ అనక ధైర్యంగా ఉన్నాడంటే పరమేశ్వరుని ధైర్యంయొక్క మహిమ ఎంత గొప్పదో కదా!

**వ. ఇట్లు దన పూర్వకర్మశేషంబున నింద్రియజయుండ నని పుట్టిన యహంకారంబున జగద్గురువుం బెక్కు ప్రల్లదంబు లాడుచున్న చిత్రకేతుం జూచి భవాని యిట్లనియె. 493**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; తన పూర్వకర్మ శేషంబునన్= గతకాలంలో చేసిన కర్మలలో కొంత మిగిలి ఉండడంవలన; ఇంద్రియజయుండన్ అని= నేను అన్ని ఇంద్రియాలనూ జయించినవాడనని; పుట్టిన= కలిగిన; అహంకారంబునన్= అహంభావంతో; జగత్+గురువున్= జగత్తుకు తండ్రి అయిన ఈశ్వరుణ్ణి; పెక్కు ప్రల్లదంబులు+ఆడుచున్న= ఎన్నో పరుషపు మాటలు పలుకుతున్న; చిత్రకేతున్ చూచి= విద్యాధరరాజైన చిత్రకేతువును చూచి; భవాని ఇట్లు అనియెన్= పార్వతీదేవి ఇలా అన్నది.

**తా :** ఈ విధంగా తన పూర్వ కర్మవల్ల తానే సర్వేంద్రియాలనూ జయించాను అనుకోవడంవలన కలిగిన అహంకారంతో చిత్రకేతువు జగద్గురువైన పరమేశ్వరుణ్ణి గురించి పరుషపు మాటలు మాట్లాడాడు. అలా మాట్లాడుతున్న చిత్రకేతువును జూచి పార్వతి ఇలా అన్నది.

**క. మముబోఁటి లజ్జ లుడిగిన, కుమతులకుం గర్త యగుచుఁ గోపింపంగా**
**నమితాజ్ఞానిపుణుండగు, శమనుండా నేఁడు వీఁడు జగముల కెల్లన్? 494**

**ప్రతి :** మముబోఁటి= మావంటి; లజ్జలు+ఉడిగిన= సిగ్గులను విడిచిన; కుమతులకున్= చెడ్డ మనసు గలవారికి; కర్త అగుచున్= కారణం అవుతూ; కోపింపంగాన్= కోపించటానికి; నేఁడు= ఈనాడు; వీఁడు= ఈ చిత్రకేతువు; జగములకు ఎల్లన్= ప్రపంచాలన్నింటికీ; అమిత+ఆజ్ఞానిపుణుండు+అగు= ఆజ్ఞాపించడంలో మిక్కిలి నేర్పరి అయిన; శమనుండా?= యముడా?!

**తా :** మావంటి సిగ్గుమాలినవారినీ, మతిమాలినవారినీ ఆక్షేపించడానికి, ఆజ్ఞాపించడానికి నేర్పరి అయిన యముడా ఈ చిత్రకేతువు?

**విశే :** పార్వతీ పరమేశ్వరులు అర్ధనారీశ్వరస్వరూపులు. పరమేశ్వరుడున్నచోట పార్వతి ఉండి తీరుతుంది. మావంటి సిగ్గుమాలినవారని పార్వతి అన్న మాటలో అర్థం మేము అర్ధనారీశ్వర స్వరూపం గలవారమని తెలియజేయడం. వీడు యముడా అన్నమాటలో యముని పరమేశ్వరుడు తన ఎడమకాలితో తన్ని తరిమినాడని, యముడే నిలబడలేకపోతే చిత్రకేతువు ఎలా నిలబడగలడనే అర్థం ధ్వనిస్తుంది.

**క. భృగునారద కపిలాదులు, నిగమాంతజ్ఞులును యోగనిర్ణయ నిపుణుల్**
**త్రిగుణాతీతు మహేశ్వరు, నగ రెన్నఁడు వారు ధర్మనయ మెఱుఁగరొకో! 495**

**ప్రతి :** భృగునారద కపిలాదులు= భృగుమహర్షి, నారదుడు, కపిలుడు మొదలైనవారూ; నిగమ+అంతజ్ఞులును= ఉపనిషత్ రహస్యాలు తెలిసినవారూ; యోగనిర్ణయ నిపుణుల్= ఏది యోగమార్గమో నిర్ణయించి చెప్పే మహాయోగులూ; త్రిగుణ+అతీతున్= మూడు గుణాలకూ అతీతుడైన; మహేశ్వరున్= మహేశ్వరుని (చూచి); ఎన్నఁడున్ నగరు= ఏనాడూ నవ్వలేదు; వారు= ఆ పెద్దలందరూ; ధర్మనయము= ధర్మ విధానం; ఎఱుఁగరొకో= ఎరుగరా ఏమి?!

**తా :** ఉపనిషద్రహస్యాలు ఎరిగినవారూ, యోగమార్గశ్రేష్ఠులూ అయిన భృగు నారద కపిలాదులు త్రిగుణాలకు అందని మహేశ్వరుణ్ణి చూచి నవ్వి ఎరుగరు. వారు ధర్మమార్గమెరుగరా?!

**సీ. ఎవ్వని పదపద్మ మింద్రాదివిబుధుల, చూడాగ్రపంక్తుల నీడఁ జూచు,**
**నెవ్వని తత్త్వంబ దెనయంగ బ్రహ్మాది, యోగిమానసపంక్తి నోలలాడు,**
**నెవ్వని రూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద మడుచు**
**నెవ్వని కారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యెంతయు ధన్యతములఁ జేయు**

**తే. నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు, శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు**
**నెగ్గు పల్కిన పాపాత్ముఁ డెల్లభంగి, దండనార్హుండు గా కెట్లు దలఁగఁ గలఁడు? 496**

**ప్రతి :** ఎవ్వని పదపద్మము= ఏ మహాత్ముని పాదపద్మం; ఇంద్ర+ఆది విబుధుల= ఇంద్రుడు మొదలైన దేవతల; చూడాగ్ర పంక్తుల నీడన్= శిరస్సులపైనున్న కిరీటాల నీడను; చూచున్= చూస్తుందో; ఎవ్వని తత్త్వంబు అది= ఏ మహనీయుని తత్త్వం ఏదికలదో అది; ఎనయంగన్= తగినవిధంగా; బ్రహ్మ+ఆది= బ్రహ్మ మొదలైన; యోగిమానసపంక్తిన్= యోగుల మనస్సుల సమూహంలో; ఓలలాడున్= మునిగి తేలుతూ ఉంటుందో; ఎవ్వనిరూపంబు= ఎవని ఆకారం; ఏర్పాటుగానక= నిరూపించలేక; వేదంబులు= వేదాలు; అందందన్= అక్కడికక్కడే; వాదమడచున్= వాదాలాడుకోవడం మానుకుంటాయో; ఎవ్వని కారుణ్యము= ఏ దేవదేవుని దయ; ఈ లోకములనెల్లన్= ఈ లోకాలనన్నింటినీ; తనిపి= తృప్తిపరచి; ఎంతయు= ఎంతగానో; ధన్యతములన్+చేయున్= ధన్యాత్ములలో గొప్పవారిని చేస్తుందో; అట్టి సర్వేశున్= అటువంటి సర్వేశ్వరుణ్ణి; పాపసంహారున్= పాపాలను పోగొట్టేవాణ్ణి; ధీరున్= ధీరుడైనవాణ్ణి; శాశ్వత+ఐశ్వర్యున్= నిత్య ఐశ్వర్యం గలవాణ్ణి; ఆత్మసంసారున్= ఆత్మారాముణ్ణి; ఈశున్= ఈశ్వరుని; ఎగ్గు పల్కిన= నిందించిన; పాపాత్ముఁడు= దుష్టచిత్తుడు; ఎల్లభంగిన్= అన్నివిధాలా; దండన+అర్హుండుగాక= దండింపబడేవాడుకాక; ఎట్లు= ఏ విధంగా; తలఁగన్+కలఁడు= తప్పించుకోగలడు?!

**తా :** సర్వేశ్వరుడు, పాపసంహారుడు, శాశ్వతమైన ఐశ్వర్యం గలవాడు, ఆత్మారాముడు, ఈశ్వరుడు అయిన ఈ మహాత్ముడు సామాన్యుడు గాడు. ఈయన పదపద్మములకు ఇంద్రాది దేవతలు నమస్కరించడంవల్ల వాళ్ళ కిరీటాల నీడ స్వామి పాదాలపై పడుతూ ఉంటుంది. బ్రహ్మాది యోగుల మానసాలలో ఈయన తత్త్వం ఓలలాడుతూ ఉంటుంది. ఈయన రూపాన్ని స్పష్టంగా తెలిసికోలేక వేదాలు వాదాలు మానుకుంటాయి. ఈయన దయ లోకాలన్నింటికీ తృప్తిని కలిగించి ధన్యత చేకూరుస్తుంది. ఇటువంటి పరమేశ్వరుణ్ణి నిందించిన ఈ చిత్రకేతువనే పాపాత్ముడు అన్నివిధాలా దండనకు అర్హుడు. అతడు దండన నుండి తప్పించుకోలేడు.

**తే.** **నిఖిలలోకాశ్రయంబు సన్నిహిత సుఖము, సకలభద్రైక మూలంబు సాధుసేవ్య**
**మైన కంజాక్షు పాదపద్మార్చనంబు, ననుసరింపంగ ఖలుఁడు వీఁ డర్హుఁ డగునె?** **497**

**ప్రతి :** నిఖిల లోక+ఆశ్రయంబు= అన్ని లోకాలకూ ఆశ్రయమైనదీ; సన్నిహిత సుఖము= సమీపాన ఉన్న సుఖం; సకల భద్ర+ఏకమూలంబు= అన్ని శుభాలకు మూలకారణం; సాధుసేవ్యము= సత్పురుషులు మాత్రమే సేవించగలిగేది అయిన; కంజ+అక్షు= పద్మాక్షుడైన విష్ణుమూర్తియొక్క; పాదపద్మ+అర్చనంబున్= పాదపద్మాల సేవను; అనుసరింపంగన్= అనుసరించడానికి పూజించుటకు; ఖలుఁడు వీఁడు= దుర్మార్గుడైన ఈ చిత్రకేతువు; అర్హుఁడు+అగునె?= తగినవాడా?!

**తా :** విష్ణుమూర్తి పదపద్మ అర్చనం అన్ని లోకాలవారూ చేయదగింది. అది సమస్త సుఖాలనూ కలిగిస్తుంది. సకల శుభాలకూ మూలకారణం. సత్పురుషులు సేవించేది. అటువంటి స్వామి పదార్చన చేయడానికి దుర్మార్గుడైన ఈ చిత్రకేతువు తగినవాడా?!

**వ.** **కావున నోరి! దురాత్మక! యీ పాపంబునం బాపస్వరూపంబైన రాక్షసయోనిం బుట్టుమని శపియించి యింతనుండి మహాత్ములకు నవజ్ఞ సేయకుండు మని పలికినఁ జిత్రకేతుండు విమానంబు డిగ్గి వచ్చి యద్దేవికి దండప్రణామంబు లాచరించి కరకమలంబులు దోయిలించి యిట్లనియె; ఓ జగన్మాత! భవచ్ఛాపవాక్యంబులట్ల కైకొంటిఁ బ్రాచీనకర్మంబులం బ్రాప్తంబైన సంసారచక్రంబుచేత నజ్ఞానమోహితులై తిరుగుచున్న జంతువులకు సుఖదుఃఖంబులును నైజంబులై ప్రవర్తిల్లుచుండు; నిందులకుఁ బరతంత్రులైన వా రాత్మపరసుఖదుఃఖంబులకు**

**నెవ్వరు కర్త లీగుణంబుల నిమిత్తమై శాపానుగ్రహంబులును స్వర్గనరకంబులును సుఖదుఃఖంబులును సమంబులు; భగవంతుం డొక్కండ తన మాయచేత జగంబులు సృజియించుచు, వారివారికి బంధాదిరాగంబులు గలుగం జేయుచుఁ దాను వానికి లోనుగాక నిష్కళుండై యుండు; నీ విధంబునం బుట్టుచున్న నరునకుం బత్ని బంధుశత్రు మిత్రోదాసీనత్వంబు లెక్కడివి?; వారి వారి కర్మవశంబునం బరమేశ్వరుండు కల్పించుచు సర్వసముండై యుండు; అప్పరమేశ్వరునకు సుఖదుఃఖంబులచేత రాగంబు లేదు; రాగానుబంధంబైన రోషంబును లేదు; అతని మాయాగుణవిసర్గంబు జంతువులకు సుఖదుఃఖంబులను, బంధమోక్షంబులను గల్పించుచుండుం గావున నీకు నమస్కరించుచున్న నన్ను ననుగ్రహింపుము; శాపభయశంకితుండం గాను; జగన్మాతవైన నిన్నుఁ బలికిన దోషంబునకు శంకించు చున్నవాఁడ నని దండప్రణామంబు లాచరించి పార్వతీపరమేశ్వరులం బ్రసన్నులం జేసి తనవిమానం బెక్కి చనియె; నప్పుడు పరమేశ్వరుండు బ్రహ్మాది దేవర్షిదైత్యదానవ ప్రమథగణంబులు వినుచుండఁ బార్వతి కిట్లనియె; నీకు నిప్పుడు దృష్టంబయ్యెఁగదా నారాయణదాసదాసానుచరుల నిస్స్పృహభావంబు!; హరితుల్యార్థదర్శనులై నిస్స్పృహులైన భాగవతులకు స్వర్గాపవర్గ నరక భేదభావంబులు లేవు; ప్రాణులకు దేహసంయోగంబు వలన నారాయణలీలం జేసి యుండి ద్వంద్వాదిసుఖదుఃఖంబు లాత్మయందు నజ్ఞానంబున భేదంబు సేయంబడియె; నిట్టి విపర్యయంబులు భగవంతుండయిన వాసుదేవునిభక్తి గలవారిం జెందవు; మఱియును. 498**

**ప్రతి :** కావునన్= కాబట్టి; ఓరి దురాత్మక!= ఓరి దుష్టుడా!; ఈ పాపంబునన్= ఈ పాపంచేత; పాపస్వరూపంబైన= పాపాకృతిలో ఉండే; రాక్షస యోనిన్ పుట్టుము అని= రాక్షసుడవై జన్మించు అని; శపియించి= శాపం ఇచ్చి; ఇంత నుండి= ఇప్పటినుండి; మహాత్ములకున్= గొప్పవారలకు; అవజ్ఞ చేయక ఉండుము= అవమానం చేయకుండా ఉండు; అని పలికినన్= అని చెప్పగా; చిత్రకేతుండు= చిత్రకేతుమహారాజు; విమానంబు డిగ్గివచ్చి= విమానం దిగివచ్చి; ఆ దేవికిన్= ఆ పార్వతీదేవికి; దండప్రణామంబులు= సాష్టాంగ నమస్కారాలు; ఆచరించి= చేసి; కరకమలంబులు= పద్మాలవంటి చేతులను; దోయిలించి= ముకుళించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; ఓ జగన్మాత!= ఓ లోకజననీ!; భవత్ శాపవాక్యంబులు= నీయొక్క శాపవాక్యాలను; అట్లకైకొంటిన్= అలాగే గ్రహించాను; ప్రాచీన కర్మంబులన్= పూర్వం చేసిన పనులనుబట్టి; ప్రాప్తంబైన= లభించిన; సంసార చక్రంబుచేతన్= సంసారమనే చక్రంచేత; అజ్ఞాన మోహితులై= అవిద్యచేత మోహాన్ని, తెలియనితనాన్ని పొంది; తిరుగుచున్న= సంసారచక్రంలో తిరుగుతున్న; జంతువులకున్= పశువులకు; సుఖదుఃఖంబులను= సుఖదుఃఖాలుకూడా; నైజంబులై= సహజాలై; ప్రవర్తిల్లుచుండున్= కలుగుతూనే ఉంటాయి; ఇందులకున్= ఈ సుఖదుఃఖాల రాకపోకలకు; పరతంత్రులైనవారు= ఇతరుల అధీనంలో ఉండే వారు; ఆత్మ= తమయొక్క; పర= ఇతరులయొక్క; సుఖదుఃఖంబులకున్= సుఖదుఃఖాలకు; ఎవ్వరు కర్తలు= ఎవ్వరు కారణం అవుతారు?; ఈ గుణంబుల నిమిత్తమై= ఈ గుణాలు కారణంగా; శాప+అనుగ్రహంబులు= శాపం, దయచూపడం మొదలైనవి; స్వర్గనరకంబులును= స్వర్గం నరకం అనేవి; సుఖదుఃఖంబులును= సుఖదుఃఖాలు అనేవి; సమంబులు= భేదం లేకుండా సమానమైనవే అవుతాయి; భగవంతుఁడొక్కండ= పరమాత్మ ఒక్కడే; తన మాయచేతన్= తన మాయాశక్తితో; జగంబులు సృజియించుచున్= లోకాలను సృష్టిస్తూ; వారివారికి= ఎవరికి వాళ్లకు; బంధ+ఆది రాగంబులు= బంధం మొదలైన అనురాగాలను (ఒకరిపై ఒకరికి ప్రేమాదికాలను); కలుగన్+చేయుచున్= ఏర్పడజేస్తూ; తాను= ఆ పరమాత్మ మాత్రం; వానికి లోనుగాక= రాగద్వేషాలకు వశం కాకుండా;

నిష్కళుండై ఉండున్= ఏమీ అంటకుండా ఉంటాడు; ఈ విధంబునన్= ఈ ప్రకారంగా; పుట్టుచున్న నరునకున్= జన్మించే మానవునకు; పత్ని బంధు శత్రు మిత్ర+ఉదాసీనత్వంబులు= ఇది భార్య, ఇతడు బంధువు, ఇతడు శత్రువు, ఇతడు మిత్రుడు, ఇతడు ఉపేక్షింపదగినవాడు అనే భేదాలు; ఎక్కడివి= ఎక్కడనుండి వస్తాయి?; వారి వారి= వారి వారియొక్క; కర్మవశంబునన్= పూర్వ వర్తమాన కర్మలకు లోబడి; పరమేశ్వరుండు= పరమాత్మ; కల్పించుచున్= సుఖదుఃఖాదులను, బంధాదులను ఏర్పాటు చేస్తూ; సర్వసముండై ఉండున్= అందరియందు సమదృష్టితో ఉంటాడు; ఆ+పరమేశ్వరునకున్= ఆ పరమాత్మకు; సుఖదుఃఖంబులచేతన్= సుఖం దుఃఖం అనే వాటిచేత; రాగంబు లేదు= అనురక్తిలేదు; రాగ+అనుబంధంబైన= రాగసంబంధమైన; రోషంబునులేదు= కోపం కూడా ఉండదు; అతని= ఆ పరమాత్మయొక్క; మాయాగుణవిసర్గంబు= మాయాగుణంయొక్క విశేషమైన కలయిక; జంతువులకున్= జీవులకు; సుఖదుఃఖంబులును= సుఖం, దుఃఖం అనేవి; బంధమోక్షంబులను= బంధం, మోక్షం అనేవి; కల్పించుచుండున్= కల్పన చేస్తూ ఉంటుంది; కావునన్= కాబట్టి; నీకు నమస్కరించుచున్న= నీకు వందనం చేస్తున్న; నన్నున్= నన్ను; అనుగ్రహింపుము= దయతో చూడుము; శాపభయ శంకితుండన్= శాపభయం చేత శంకింపబడేవాడను; కాను; జగన్మాతవైన= జగత్తులకు తల్లివైన; నిన్నున్= నిన్నుగూర్చి; పలికిన దోషంబునకున్= పరుషాలు పలికిన దోషానికి; శంకించుచున్నవాఁడన్ అని= సందేహపడుతున్నాను అని; దండప్రణామంబులు= సాష్టాంగ దండనమస్కారాలు; ఆచరించి= చేసి; పార్వతీపరమేశ్వరులన్= పార్వతీపరమేశ్వరులిద్దరిని; ప్రసన్నులన్ చేసి= సంతోషపరచి; తన విమానంబెక్కి= తన విమానాన్ని అధిరోహించి; చనియెన్= చిత్రకేతువు వెళ్ళిపోయాడు; అప్పుడు= ఆ సమయంలో; పరమేశ్వరుండు= మహేశ్వరుడు; బ్రహ్మ+ఆది= బ్రహ్మ మొదలైన; దేవర్షి= దేవఋషులు; దైత్యదానవ= రాక్షసులు; ప్రమథగణంబులు= కైలాసంలో తన భక్తులు, సేవకులు అయిన ప్రమథగణాలు; వినుచుండన్= ఆలకిస్తూ ఉండగా; పార్వతికి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు; నీకున్= నీకు; ఇప్పుడు= ఈ సమయంలో; దృష్టంబయ్యెన్+కదా!= సాక్షాత్తుగా కన్పట్టినది కదా!; నారాయణ దాస దాసానుచరుల= విష్ణుమూర్తియొక్క దాసానుదాసుల; నిస్పృహభావంబు= ఉపేక్షాభావం (సుఖదుఃఖాలను, శాపానుగ్రహాలను పట్టించుకోని లక్షణం); హరితుల్యార్థ దర్శనులై= సృష్టినంతటినీ విష్ణువుతో సమానంగా దర్శించేవారైన; నిస్పృహులైన= ఉపేక్షగల; భాగవతులకున్= భగవద్భక్తులకు; స్వర్గ+అపవర్గ నరక భేదభావంబులు లేవు= స్వర్గం, మోక్షం, నరకం అనే వ్యత్యాసాలు లేవు; ప్రాణులకున్= జీవులకు; దేహసంయోగంబువలనన్= శరీరాల కలయికవలన; నారాయణ లీలన్ చేసియుండి= భగవంతుని లీలచే చేయబడి; ద్వంద్వాది సుఖదుఃఖంబులు= జంటలుగా కలిగే సుఖదుఃఖాలు, శీతోష్ణాదులు; ఆత్మయందున్= వారి ఆత్మలలో; అజ్ఞానంబునన్= అవిద్యచే (తెలియనితనంచేత); భేదంబు+చేయంబడియెన్= విడివిడిగా కన్పట్టుతూ ఉన్నాయి; ఇట్టి విపర్యయంబులు= ఇటువంటి సుఖదుఃఖాదులలోని భేదభావాలు; భగవంతుండు+అయిన= పరమాత్ముడైన; వాసుదేవుని భక్తిగలవారిన్= వాసుదేవునిమీద భక్తిభావం కలిగినవారికి; చెందవు= అంటవు; మఱియును= అంతేకాక...

**తా :** కాబట్టి ఓ దుష్టుడా! నీవు చేసిన ఈ పాపం కారణంగా పాపస్వరూపుడైన రాక్షసుడవై జన్మించు అని శపించింది పార్వతీదేవి. ఇకపై మహాత్ముల విషయంలో దోషాలు ఆచరింపకు అని హెచ్చరించింది. చిత్రకేతుడు విమానం దిగి వచ్చాడు. పార్వతీదేవికి సాష్టాంగనమస్కారం చేశాడు. చేతులు జోడించి ఇలా అన్నాడు – ఓ లోకమాతా! నీవిచ్చిన శాపాన్ని స్వీకరిస్తున్నాను. గతంలో చేసిన కర్మలఫలంగా ప్రాప్తించిన సంసారం అనే చక్రంలో అజ్ఞానంవల్ల మోహాన్ని పొంది తిరిగే జీవులకు సుఖదుఃఖాలు సహజంగా కలుగుతాయి. అస్వతంత్రులైన వారు తమ సుఖదుఃఖాలకు కర్తలు కారు. శాపానుగ్రహాలు, స్వర్గనరకాలు, సుఖదుఃఖాలు సమానమైనవే. పరమాత్మ తన మాయతో ఈ లోకాలను సృష్టిస్తూ ఉంటాడు.

వారిలో వారికి  అనుబంధాలు, అనురాగాలు కలగజేస్తాడు కాని పరమాత్మ మాత్రం ఆ మాయకు లోనుగాడు. అతడు నిష్కలుడై దేనినీ అంటకుండా ఉంటాడు. ఇలా జన్మించే మానవులకు భార్య ఎవరు? బంధువెవరు? శత్రువు ఎవరు? మైత్రి ఎక్కడిది? సేవాభావం ఎక్కడిది? ఇవన్నీ వారి వారి కర్మానుసారంగా పరమేశ్వరుడు కల్పిస్తూ అన్ని జీవుల ఎడల సమభావంతో ఉంటాడు. పరమేశ్వరునికి సుఖదుఃఖాలకు సంబంధించిన అనురాగంగాని రాగానికి అనుబంధంగా ఉండే రోషంగాని ఉండవు. భగవంతుని మాయాగుణంవల్ల జంతువులకు, జీవులకు సుఖదుఃఖాలు, బంధమోక్షాలు కలుగుతూ ఉంటాయి. కాబట్టి నీకు నమస్కరిస్తున్న నన్ను దయచూడు. నీవు శపించావనే భయం నాకు లేదు. అఖిల లోకాలకూ జననివైన నిన్ను పరుషంగా మాట్లాడినందులకే భయపడుతున్నాను అని సాష్టాంగ  నమస్కారాలు చేసి చిత్రకేతువు పార్వతీపరమేశ్వరులను ప్రసన్నం చేసికొని తన విమానం ఎక్కి వెళ్ళిపోయాడు.

అప్పుడు పరమేశ్వరుడు బ్రహ్మాది దేవతలు, రాక్షసులు, ప్రమథులు వింటూ ఉండగా పార్వతీదేవితో ఇలా అన్నాడు. పార్వతీ! శ్రీమన్నారాయణునియొక్క దాసులు, ఆ దాసుల దాసులు ఎంత నిర్లిప్తంగా ఉపేక్షాభావంతో ఉంటారో గమనించావు కదా! నిరంతరం అంతటా హరిదర్శనం చేసేవారు ఇలాగే ప్రపంచ విషయాలపై నిరాసక్తంగానే ఉంటారు. వారికి స్వర్గం, మోక్షం, నరకం అనే తేడాలు ఉండవు. పరమాత్మయొక్క లీల ఆధారంగా దేహధారులకు సుఖదుఃఖాలు మొదలైన ద్వంద్వాలు అజ్ఞానంవల్ల కలుగుతాయి. ఇటువంటి భేదభావాలు విష్ణు భక్తి గలవారికి కలుగవు. అంతేగాదు

**ఉ. నేనుఁ గుమారనారదులు నీరజగర్భుఁడు దేవసంఘమున్**
**మానితయోగివర్యమునిమండల మిట్లగువార మందఱున్**
**దానవవిద్విడంశ జనితాత్ముల మయ్యుఁ దదీయతత్త్వముం**
**గానఁగనేర, మీశు ఘనగర్వమునం దలపోసి చూచుచున్. 499**

**ప్రతి :** నేనున్= ఈశ్వరుడనైన నేను; కుమార నారదులు= కుమారస్వామి, నారదుడు; నీరజగర్భుఁడు= బ్రహ్మ; దేవసంఘమున్= దేవతాసమూహం; మానిత= కీర్తిగాంచిన; యోగివర్య= యోగిశ్రేష్ఠులు; మునిమండలము= మునులసమూహం; ఇట్లగు వారమందఱున్= ఇలా మొదలైనవారమంతా కూడా; దానవవిద్విట్+అంశ జనిత+ఆత్ములమయ్యున్= దానవ విరోధి అయిన నారాయణుని అంశవల్ల జన్మించిన వాళ్ళమైనప్పటికీ కూడా; ఘనగర్వమునన్= గొప్పదైన గర్వంచేత; తలపోసి చూచుచున్= ఆలోచించి చూస్తూ; ఈశున్= ఆ ప్రభువైన విష్ణుమూర్తిని; తదీయతత్త్వమున్= ఆ విష్ణుసంబంధమైన తత్త్వాన్ని; కానఁగ నేరము= తెలుసుకోలేకపోతున్నాము.

**తా :** పరమేశ్వరుడనైన నేను, కుమారస్వామి, నారదుడు, బ్రహ్మ, దేవతాబృందం, ఘనయోగులు, మౌని సముదాయం, ఇలా మేమందరం దానవవిరోధి అయిన విష్ణుమూర్తి అంశతో జన్మించినవారమే. అయినా మాకు గొప్ప గర్వం ఉన్న కారణంగా ఆ విష్ణుమూర్తినిగాని, ఆ విష్ణుతత్త్వాన్నిగాని తెలుసుకోలేకపోతున్నాము.

**క. ఆతనికినిఁ బ్రియుఁ డ ప్రియుఁ, డే తెఱఁగున లేఁడు నిఖిల మెల్లను దానై**
**భూతముల కాత్మ యగుటయు, భూతప్రియుఁ డొక్కఁ డాదిపురుషుఁడు తన్వీ! 500**

**ప్రతి :** తన్వీ= ఓ పార్వతీ!; నిఖిలము+ఎల్లను తానై= సమస్త ప్రపంచం తానుగా ఉండి; భూతములకున్= అన్ని జీవులకూ; ఆత్మ+అగుటయు= అంతరాత్మగా తానై ఉండుటచేత; భూతప్రియుఁడు= అన్ని జీవులకు హితుడైనవాడు; ఒక్కఁడు= ఆ

పరమాత్మ ఒక్కడే; ఆదిపురుషుఁడు= ఆతడే మొట్టమొదటి పురుషుడు; ఆతనికిన్= ఆ పరమాత్మకు; ఏతెఱఁగునన్= ఏ విధంగా చూచినా; ప్రియుఁడు= ఇష్టుడు; అప్రియుఁడు= ఇష్టం లేనివాడు; లేఁడు= లేదు.

**తా :** ఓ పార్వతీ! ఆదిపురుషుడు, ఒకే ఒక్కడు అయిన విష్ణుపరమాత్మ సమస్తప్రపంచం తానై నిండి ఉంటాడు. అందరికీ అంతరాత్మ అయి ఉంటాడు. అతడు సర్వజీవులకూ ప్రియుడు. ఏవిధంగా చూచినా ఆ పరమాత్మకు ఒకడు ప్రియుడని, ఒకడు అప్రియుడని భేదం ఉండదు.

**ఆ. అరయఁ జిత్రకేతుఁ డతిశాంతుఁ డతిలోక, సముఁడు విష్ణుభక్తిసంగతుండు,**
**నితని నేమి సెప్ప? నీశుండ నగు నేను, నువిద! యచ్యుతప్రియుండఁ జుమ్మి! 501**

**ప్రతి :** అరయన్= గమనించి చూడగా; చిత్రకేతుఁడు= ఈ చిత్రకేతుడనే విద్యాధరరాజు; అతిశాంతుఁడు= మిక్కిలి శాంతస్వరూపుడు; అతిలోక సముఁడు= అన్ని లోకాలనూ సమదృష్టితో చూచేవాడు; విష్ణుభక్తిసంగతుండు= విష్ణుభక్తితో కూడియున్నవాడు; ఇతనిన్ ఏమి చెప్పన్= ఇతనిని గూర్చి చెప్పెడిదేమి?!; ఉవిద= ఓ పార్వతీ!; ఈశుండనగునేను= పరమేశ్వరుడనైన నేను; అచ్యుత ప్రియుండన్ చుమ్మి= హరిప్రియుడను సుమా!

**తా :** ఓ పార్వతీ! చిత్రకేతుడనే ఈ విద్యాధర రాజు శాంతచిత్తుడు. లోకాలను సమదృష్టితో చూచేవాడు. విష్ణుభక్తియుతుడు. వేయి మాటలెందుకు. పార్వతీ! అతనిని గూర్చి (చిత్రకేతునిగూర్చి) చెప్పేదేమున్నది! పరమేశ్వరుడనైన నేను సైతం విష్ణుప్రియుడను సుమా!

**క. కావున భగవద్భక్తుల, భావమునకు విస్మయంబు పనిలేదు మహా**
**ధీ విభవశాంత చిత్తులు, పావన పరతత్త్వనిపుణ భవ్యులు వారల్. 502**

**ప్రతి :** కావునన్= కాబట్టి; భగవత్+భక్తుల= భగవంతునియందు భక్తిగలవారల; భావమునకున్= అంతర్గత భావానికి; విస్మయంబు పనిలేదు= ఆశ్చర్యపడనక్కరలేదు; వారల్= ఆ విష్ణుభక్తులు; మహా ధీ విభవ శాంతచిత్తులు= గొప్ప బుద్ధి వైభవంగల శాంతస్వభావులు; పావన= పవిత్రమైన; పరతత్త్వనిపుణభవ్యులు= విష్ణుతత్త్వాన్ని గుర్తించటంలో నేర్పరులైనవారు.

**తా :** విష్ణుభక్తుల ఆలోచన క్రమానికి ఆశ్చర్యపడనవసరం లేదు. ఈ భవ్యచరిత గలవారు గొప్ప బుద్ధివైభవంతో శాంతమైన స్వభావం గలిగినవారు, పవిత్ర పరతత్త్వ జ్ఞాననిపుణులు అయి ఉంటారు.

**వ. అనిన విని యద్రినందన విస్మయంబు మాని శాంతచిత్త యయ్యె, నట్లు పరమభాగవతుండయిన చిత్రకేతుం డద్దేవికిఁ బ్రతిశాపం బియ్య సమర్థుండయ్యును మరల శపింపక యతి శాంతరూపంబునఁ దచ్ఛాపంబు శిరంబున ధరియించె. ఇట్టి సాధులక్షణంబులు నారాయణపరాయణు లయిన వారలకుంగాక యొరులకుఁ గలుగ నేర్చునే? యిట్లు శాపహతుండయిన చిత్రకేతుండు త్వష్ట సేయు యజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి వృత్రాసురుం డన విఖ్యాతుండయి భగవద్జ్ఞానపరిణతుం డయ్యెం గావున. 503**

**ప్రతి :** అనినన్+విని= అని చెప్పగా ఆలకించి; అద్రినందన= పర్వతరాజ పుత్రి; విస్మయంబు మాని= ఆశ్చర్యం నుండి తేరుకొని; శాంతచిత్త అయ్యెన్= ప్రశాంతమైన మనస్సు గలదైంది; అట్లు= ఆ ప్రకారంగా; పరమభాగవతుండయిన= గొప్ప

విష్ణుభక్తుడైన; చిత్రకేతుండు= విద్యాధరరాజు చిత్రకేతువు; ఆ దేవికిన్= ఆ పార్వతీదేవికి; ప్రతిశాపంబు ఇయ్యన్= తిరిగి శాపం ఇవ్వడానికి; సమర్థుండయ్యును= సమర్థత గలవాడైనప్పటికీ; మరల శపింపక= తిరిగి శపించకుండా; అతిశాంతరూపంబునన్= మిక్కిలి శాంతస్వభావంతో; తత్ శాపంబు= ఆ పార్వతీదేవి ఇచ్చిన శాపాన్ని; శిరంబునన్ ధరియించెన్= తల దాల్చాడు; ఇట్టి సాధు లక్షణంబులు= ఇటువంటి సత్పురుషుల లక్షణాలు; నారాయణపరాయణులయిన= నారాయణుని సేవించే స్వభావంగలవారయిన; వారలకున్+కాక= వారికి మాత్రమేకాక; ఒరులకున్= ఇతరులకు; కలుగనేర్చునే= కలుగుతాయా?!; ఇట్లు= ఈ విధంగా; శాపహతుండయిన= శాపం పొందిన; చిత్రకేతుండు= చిత్రకేతుడు; త్వష్ట చేయు= త్వష్ట అనే మహాత్ముడు చేస్తున్న; యజ్ఞంబునన్= యజ్ఞంలో; దక్షిణ+అగ్నియందున్= త్రేతాగ్నులలో ఒకటి అయిన దక్షిణాగ్నియందు; దానవయోనిన్+పుట్టి= రాక్షస జన్మ ఎత్తి; వృత్రాసురుండు+అనన్= వృత్రాసురుడనే పేరుతో; విఖ్యాతుండయి= ప్రఖ్యాతి పొంది; భగవత్ జ్ఞానపరిణతుండు= విష్ణుభక్తితో, జ్ఞానంతో నిండినవాడు; అయ్యెన్ కావున= అయ్యాడు కాబట్టి...

**తా :** ఈశ్వరుని మాటలు విని పర్వత రాజపుత్రి ఆశ్చర్యం నుండి తేరుకొని, ప్రశాంతచిత్తం పొందింది. ఆ విధంగా పరమ భాగవతుడైన చిత్రకేతుడు పార్వతీదేవికి తిరిగి శాపం ఇచ్చే సామర్థ్యం ఉన్నవాడైనప్పటికి తిరిగి శపింపక శాంతం వహించి పార్వతీదేవి శాపాన్ని తలదాల్చాడు. ఇటువంటి మంచి లక్షణాలు నారాయణ భక్తి పరాయణులకు మాత్రమే లభిస్తాయి తప్ప ఇతరులకు లభిస్తాయా! లభించవు. ఈ విధంగా శాపం పొందిన చిత్రకేతుడు త్వష్ట చేసే యజ్ఞంలో దక్షిణాగ్నినుండి జనించి రాక్షసుడై వృత్రాసురుడనే పేరుతో విఖ్యాతి పొంది భగవంతునికి సంబంధించిన పరిపూర్ణ జ్ఞానాన్ని పొందాడు కాబట్టి

**సీ. నరనాథ! యీ వృత్రునకు రాక్షసాకృతి గలిగిన యీ పూర్వకారణంబు**
**చిరపుణ్యుఁ డయినట్టి చిత్రకేతు మహానుభావంబు భక్తితోఁ బరఁగ విన్నఁ**
**జదివినవారికి సకలదుష్కర్మముల్ శిథిలంబులై కడుఁ జెదరిపోవు**
**సకలవైభవములు సమకూరుఁ దమయంతఁ దొల్కాడు కోర్కులతోడఁ గూడి**

**ఆ. నిర్మలాత్ము లగుచు నిత్యసత్యజ్ఞాన నిరతు లగుచు విగతదురితు లగుచు**
**బంధుమిత్ర పుత్త్ర పౌత్త్రాదులను గూడి యనుభవించుచుందు రధిక సుఖము. 504**

**ప్రతి :** నరనాథ= ఓ రాజా!; ఈ వృత్రునకున్= ఈ వృత్రాసురునికి; రాక్షస+ఆకృతి= రాక్షసాకారం; కలిగిన= లభించిన; ఈ పూర్వకారణంబు= ఈ వెనుకటి కారణాన్ని (ఈ వృత్రాసురుని పూర్వచరిత్రను); చిరపుణ్యుఁడయినట్టి= మిక్కిలి పుణ్యాత్ముడైన; చిత్రకేతు మహానుభావంబు= చిత్రకేతునియొక్క గొప్పదనాన్ని; భక్తితోన్+పరగన్= భక్తి ఒప్పునట్టుగా; విన్నన్= వినినా; చదివినన్= పఠించినా; వారికి= అలాంటి వారలకు; సకల దుష్కర్మముల్= అన్ని చెడ్డకర్మలు; శిథిలంబులై= పటాపంచలై; కడున్ చెదరిపోవున్= చెదిరిపోతాయి; సకల వైభవములు= సమస్త వైభవాలు; సమకూరున్= ప్రాప్తిస్తాయి; తమయంతన్= తమంత తామే; తొల్కాడు= అతిశయించే; కోర్కుల తోడన్కూడి= కోర్కులతో; నిర్మల+ఆత్ములగుచున్= స్వచ్ఛమైన ఆత్మగలవారై; నిత్య సత్యజ్ఞాన నిరతులగుచున్= ఎల్లప్పుడు సత్యజ్ఞానాలలో మునిగినవారై; విగతదురితులు+అగుచున్= పాపాలు పోయినవారవుతూ; బంధు మిత్ర పుత్త్ర పౌత్త్రాదులను కూడి= బంధువులు, స్నేహితులు, సుతులు, మనుమలతో కూడుకొని; అధిక సుఖమున్= అపార సౌఖ్యాన్ని; అనుభవించు చుందురు= అనుభవిస్తూ ఉంటారు.

**తా :** ఓ రాజా! ఈ వృత్రాసురునకు రాక్షసాకారం కలిగిన పూర్వ వృత్తాంతాన్ని, ఎంతో పుణ్యాత్ముడైన చిత్రకేతుని గొప్పదనాన్ని భక్తితో విన్నవారికి, చదివినవారికి, సకలదుష్కర్మలు నశిస్తాయి. సకల వైభవాలు సమకూరుతాయి. కోర్కెలు వాటంతట అవే తీరుతూ ఉండగా వారు నిర్మలాత్ములై, నిత్య సత్య జ్ఞానపరాయణులై, పాపాలు నశించిపోగా బంధువులతో, స్నేహితులతో, కొడుకులతో, మనుమలతో సుఖాన్ని అనుభవిస్తారు.

## ❖ సవితృ వంశ ప్రవచనాది కథ ❖

**సీ. వినవయ్య! నరనాథ! విశదంబుగాఁ ద్వష్టృ వంశంబు సెప్పితి, వాని వెనుక**
**సవితృండు పృశ్నియు సావిత్రి వ్యాహృతి యను భార్యలందు నింపారు వేడ్క**
**నగ్నిహోత్రంబుల నరయంగఁ బశుసోమ పంచయజ్ఞంబులఁ బరఁగఁ గనియె,**
**భగుఁడు సిద్ధిక యను భార్యకు మహిమానుభావుల విభవులఁ ఁబడసె మువురఁ**

**ఆ. దనయ నొకతెఁ గాంచెఁ దదనంతరమున నా, తరళనేత్ర సద్వ్రతస్వధామ**
**పుణ్యశీల సుగుణ పూరిత చారిత్ర, యఖిలలోక పూజ్య యాశిషాఖ్య! 505**

**ప్రతి :** నరనాథ!= ఓ రాజా!; వినవయ్య= వినండి; విశదంబుగాన్= స్పష్టంగా; త్వష్టృ వంశంబు చెప్పితి= త్వష్టయొక్క వంశాన్ని గూర్చి చెప్పాను; వానివెనుక= వాని తరువాత; సవితృండు= సవిత అనే అదితి ఐదవ తనయుడు; పృశ్నియు సావిత్రి వ్యాహృతి అను భార్యలందున్= పృశ్ని, సావిత్రి, వ్యాహృతి అనే భార్యలయందు; ఇంపారువేడ్కన్= ఆనందంతో; అరయంగన్= చూడగా; పశు సోమ పంచయజ్ఞంబులన్= పశు సోమ పంచయజ్ఞాలను; అగ్నిహోత్రంబులన్= అగ్నిహోత్రాలను; పరగన్ కనియెన్= ప్రసిద్ధి చెందేటట్లు కన్నాడు; భగుఁడు= ఆరవవాడైన భగుడనేవాడు; సిద్ధిక అను భార్యకు= సిద్ధిక అనే భార్యయందు; మహిమానుభావుల= గొప్ప మహిమ గలవారైన; విభవులన్= విభవులను; మువురన్= ముగ్గురను; పడసెన్= పొందాడు; తనయన్ ఒకతెన్ కాంచెన్= ఒక కొమార్తెను కూడా కన్నాడు; తదనంతరమునన్= తరువాత; తరళనేత్ర= ఆ చంచలమైన కనులు గల ఆమె; సద్వ్రతస్వధామ= చక్కని వ్రతాలకు నిలయమైనది; పుణ్యశీల= పుణ్యస్వభావం గలది; సుగుణపూరిత చారిత్ర= సుగుణాలతో కూడిన చరిత్ర కలది; అఖిలలోక పూజ్య= అన్ని లోకాలచేత పూజింపదగినది; ఆశిషా+ఆఖ్య= ఆమె ఆశిష అనే పేరు గలది.

**తా :** ఓ రాజా! విను. త్వష్టయొక్క వంశం గూర్చి నీకు వివరంగా చెప్పాను. తరువాత సవిత పృశ్ని, సావిత్రి, వ్యాహృతి అనే భార్యలయందు పశు సోమ పంచయజ్ఞాలనబడే అగ్నిహోత్రాలను కన్నాడు. భగుడు సిద్ధిక అనే భార్యయందు మహిమానుభావులైన విభవులను కన్నాడు. వారు ముప్వురు కాక అతడు ఒక పుత్రికను కూడా కన్నాడు. ఆమె పేరు ఆశిష. ఆమె సొగసైన కన్నులు కలది. పుణ్యశీలం కలది. సుగుణవతి. మంచి చరిత్ర కలది. అన్ని లోకాలచే పూజలందుకొనేది.

**వ. మఱియు ధాతకుఁ గల కుహూ సినీవాలీ రాకానుమతు లనియెడు నలువురు భార్యలలోఁ గుహూదేవి సాయమను సుతునిం గాంచె; సినీవాలి దర్శాఖ్యునిం బడసె; రాక ప్రాతరాఖ్యునిఁగాంచె; ననుమతి పూర్ణిమాఖ్యునిఁ గనె; విధాత క్రియయను భార్యయందు నగ్నిపురీష్యాదులం గనియె; వరుణునకుఁ జర్షిణి యను భార్యయందుఁ బూర్వకాలంబున బ్రహ్మపుత్త్రుండయిన భృగువును వల్మీకంబునం జనియించిన వాల్మీకియు నుదయించిరి;**

**మిత్రావరుణులకు నూర్వశియందు రేతోద్గమంబైన, దానిఁ గుంభంబునం బ్రవేశింపం జేయ నందు నగస్త్యుండును వసిష్ఠుండును జనియించిరి; ప్రత్యేకంబ మిత్రునకు రేవతియందు నుత్సర్గసంభవులైన యరిష్టయుఁ బిప్పలుండును ననువారలు జనియించిరి; శక్రునకుఁ బౌలోమియందు జయంత ఋషభ విదుషులన ముగ్గురు పుట్టిరి; వామనుం డయిన యురుక్రమ దేవునకుఁ గీర్తియను భార్యయందు బృహచ్ఛ్లోకుండు పుట్టె, నా బృహచ్ఛ్లోకునకు సౌభగాదులు పుట్టిరి; మఱియు మహానుభావుండయిన కశ్యపప్రజాపతికి నదితియందు శ్రీమన్నారాయణుం డవతరించిన ప్రకారంబు వెనుక వివరించెద; దితిసుతులైన దైతేయుల వంశంబు సెప్పెద; ఆ దైతేయ వంశంబునం బ్రహ్లాద బలులు పరమభాగవతులై దైత్యదానవ వందితులై వెలసిరి; దితి కొడుకులు హిరణ్యకశిపు హిరణ్యాక్షులనఁ బ్రసిద్ధి నొంది, రందు హిరణ్యకశిపునకు జంభాసురతనయయైన కయాధువను వధువునకుఁ బ్రహ్లాదానుహ్లాద సంహ్లాదహ్లాదులను నలుగురు కొడుకులును సింహికయను కన్యకయు జన్మించి, రా సింహికకు రాహువు జనియించె; నా రాహువు శిరం బమృతపానంబు సేయ హరి దన చక్రంబునం ద్రుంచె; సంహ్లాదునకు గతి యను భార్యయందుఁ బంచజనుండు పుట్టె; హ్లాదునకు దమని యను భార్యయందు వాతాపీల్వలులు పుట్టిరి; వారల నగస్త్యుండు భక్షించె; అనుహ్లాదునకు సూర్మ్యయను భార్యయందు బాష్కలమహిషులు గలిగిరి; ప్రహ్లాదునకు దేవియను భార్యయందు విరోచనుండు పుట్టె; నతనికి బలి జన్మించె; నా బలికి నశన యను భార్యయందు బాణుండు జ్యేష్ఠుండుగా నూర్వురు గొడుకులు పుట్టిరి. ఆ బలి ప్రభావంబు వెనుక వివరించెద; బాణాసురుండు పరమేశ్వరు నారాధించి ప్రమథగణంబులకు ముఖ్యుండయ్యె; మఱియు నా దితిసంతానంబులగు మరుత్తు లేకోన పంచాశత్సంఖ్యగలవార, లందఱు ననపత్యులై యింద్రునితోఁ గూడి దేవత్వంబు నొంది రనిన విని పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రున కిట్లనియె. 506**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; ధాతకున్+కల= ధాత అనేవానికి గల; కుహూ సినీవాలీ రాక అనుమతులనియెడు= కుహూ, సినీవాలి రాక అనుమతి అనే; నలువురు భార్యలలోన్= నలుగురు పత్నులలో; కుహూదేవి= కుహూ అనే ఆమె; సాయమను సుతునిన్= సాయ అనే పేరుగల కుమారుణ్ణి; కాంచెన్= కన్నది; సినీవాలి= సినీవాలి అనే ఆమె; దర్శాఖ్యునిన్+ పడసెన్= దర్శ అనే పేరు గలవాణ్ణి కన్నది; రాక= రాక అనే ఆమె; ప్రాతరాఖ్యునిన్+కాంచెన్= ప్రాతః అనే పేరు గలవాణ్ణి కన్నది; అనుమతి= అనుమతి అనే ఆమె; పూర్ణిమ+ఆఖ్యునిన్ కనెన్= పూర్ణిమ అనేవాణ్ణి కన్నది; విధాత= విధాత అనేవాడు; క్రియయను భార్యయందు= క్రియ అను పేరుగల భార్యలవల్ల; అగ్నిపురీష్యాదులన్ కనియెన్= పురీష్యాదులైన అగ్నులను కన్నాడు; వరుణనకున్= వరుణుడు అనేవానికి; చర్షిణి అను భార్యయందున్= చర్షిణి అనే భార్యవల్ల; పూర్వకాలంబునన్= గతకాలంలో; బ్రహ్మపుత్త్రుండయిన= బ్రహ్మ కుమారుడైన; భృగువును= భృగువు అనేవాడూ; వల్మీకంబునన్= పుట్టయందు; జనియించిన= జన్మించిన; వాల్మీకియున్= వాల్మీకి అనేవాడూ; ఉదయించిరి= జన్మించారు; మిత్రావరుణులకున్= మిత్రావరుణులు అనేవారికి; ఊర్వశియందున్= ఊర్వశి అనే అచ్చర కాంతయందు; రేతోద్గమంబైన= వీర్యపతనం కావడం వలన; దానిన్= ఆ వీర్యాన్ని; కుంభంబునన్= కుండయందు; ప్రవేశింపన్+చేయన్= పెట్టి ఉంచగా; అందున్= ఆ కుంభంనుండి; అగస్త్యుండును= అగస్త్యుడూ; వసిష్ఠుండును= వసిష్ఠుడూ అనేవారు; జనియించిరి= పుట్టారు; మిత్రునకున్= మిత్రుడు అనేవానికి; ప్రత్యేకంబు+ఆ= కేవలంగా అతనికే; రేవతియందున్= రేవతి అనే ఆమెయందు;

ఉత్సర్గ సంభవులైన= వర్ధిష్ణువులైన; అరిష్టయున్= అరిష్టుడు; పిప్పలుండును= పిప్పలుడు; అనువారలు= అనేవారు; జనియించిరి= పుట్టారు; శక్రునకున్= ఇంద్రునికి; పౌలోమియందున్= పులోముని కొమార్తె అయిన శచీదేవియందు; జయంత ఋషభ విదుషులనన్= జయంతుడు, ఋషభుడు, విదుషుడు అనబడే; ముగ్గురు పుట్టిరి= ముగ్గురు కొడుకులు జన్మించారు; వామనుండయిన= పొట్టివాడైన; ఉరుక్రమదేవునకున్= భగవంతుడైన విష్ణుదేవునకు; కీర్తియను భార్యయందు= కీర్తి అనే పేరుగల భార్యయందు; బృహచ్ఛ్లోకుండు= బృహత్ శ్లోకుడు; పుట్టెన్= జన్మించాడు; ఆ బృహచ్ఛ్లోకునకున్= ఆ బృహత్ శ్లోకుడు అనేవానికి; సౌభగ+ఆదులు పుట్టిరి= సౌభగుడు మొదలైనవారు జన్మించారు; మఱియున్= అంతేగాక; మహానుభావుండయిన= గొప్పవాడైన; కశ్యప ప్రజాపతికిన్= కశ్యపుడు అనే ప్రజాపతికి; అదితియందు= అదితి అనే ఆమెయందు; శ్రీమన్నారాయణుండు= శ్రీమహావిష్ణువు; అవతరించిన ప్రకారంబు= జన్మించిన విధానం; వెనుక వివరించెదన్= తరువాత చెపుతాను; దితిసుతులైన= దితియొక్క కుమారులైన; దైతేయుల వంశంబున్= దైతేయులయొక్క వంశప్రకారాన్ని; చెప్పెదన్= చెపుతాను; ఆ దైతేయవంశంబునన్= దితి కుమారుల వంశంలో; ప్రహ్లాద బలులు= ప్రహ్లాదుడు బలి అనేవారు; పరమభాగవతులై= గొప్ప భగవద్భక్తులై; దైత్య దానవ వందితులై= దితి కుమారులైన రాక్షసులచే నమస్కరింపదగినవారై; వెలసిరి= ఒప్పినారు; దితికొడుకులు= దితియొక్క తనయులు; హిరణ్యకశిపు హిరణ్యాక్షులనన్= హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అనే పేర్లతో; ప్రసిద్ధిన్+ఒందిరి= ఖ్యాతి పొందారు; అందున్= ఆ ఇరువురిలో; హిరణ్యకశిపునకున్= హిరణ్యకశిపుడు అనేవానికి; జంభాసుర తనయయైన= జంభాసురుని కొమార్తె అయిన; కయాధువు+అను వధువునకున్= కయాధువు అనే ఆమెకు; ప్రహ్లాదానుహ్లాదసంహ్లాద హ్లాదులను= ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు, సంహ్లాదుడు, హ్లాదుడు అనే పేర్లు గలిగిన; నలుగురు కొడుకులును= నలుగురు కుమారులు; సింహిక+అను= సింహిక అనే పేరుగల; కన్యకయు జన్మించిరి= కొమార్తె జన్మించారు; ఆ సింహికకు= ఆ సింహిక అనే ఆమెకు; రాహువు జనియించెన్= రాహువు పుట్టాడు; ఆ రాహువు శిరంబు= ఆ రాహువుయొక్క శిరస్సు; అమృతపానంబు చేయన్= అమృతం తాగుతుండగా; హరి= విష్ణుమూర్తి; తన చక్రంబునన్= తన సుదర్శనచక్రంతో; త్రుంచెన్= నరికాడు; సంహ్లాదునకున్= సంహ్లాదుడు అనేవానికి; గతియను భార్యయందున్= గతి అనే పేరుగల భార్యవల్ల; పంచజనుండు పుట్టెన్= పంచజనుడనేవాడు జన్మించాడు; హ్లాదునకున్= హ్లాదుడనేవానికి; దమనియను భార్యయందు= దమని అనే పేరుగల భార్యయందు; వాతాపి+ ఇల్వలులు పుట్టిరి= వాతాపి ఇల్వలులనే ఇద్దరు జన్మించారు; వారలన్= ఆవాతాపి ఇల్వలులను; అగస్త్యుండు= అగస్త్యుడు అనే మహాముని; భక్షించెన్= మింగివేశాడు; అనుహ్లాదునకున్= అనుహ్లాదుడనేవానికి; సూర్మ్యయను భార్యయందు= సూర్మ్య అనే పేరుగల భార్యయందు; బాష్కల మహిషులు= బాష్కలుడు, మహిషుడు అనేవారు; కలిగిరి= జన్మించారు; ప్రహ్లాదునకున్= ప్రహ్లాదుడనేవానికి; దేవియను భార్యయందు= దేవి అనే భార్యవల్ల; విరోచనుండు పుట్టెన్= విరోచనుడు అనేవాడు జన్మించాడు; అతనికిన్= ఆ విరోచనునికి; బలి జన్మించెన్= బలి పుట్టాడు; ఆ బలికిన్= ఆ బలిచక్రవర్తికి; అశన అను భార్యయందు= అశన అనే పేరుగల భార్యవలన; బాణుండు జ్యేష్ఠుండుగా= బాణుడు అనేవాడు పెద్దకొడుకుగా; నూర్వురు కొడుకులు= వందమంది కుమారులు; పుట్టిరి= జన్మించారు; ఆ బలి ప్రభావంబు= ఆ బలియొక్క గొప్పదనం; వెనుక వివరించెదన్= తరువాత విపులీకరిస్తాను; బాణాసురుండు= బలి కుమారుడైన బాణాసురుడు అనేవాడు; పరమేశ్వరున్+ఆరాధించి= పరమేశ్వరుణ్ణి పూజించి; ప్రమథగణంబులకున్= ఈశ్వర సేవకులైన ప్రమథగణాలకు; ముఖ్యుండయ్యెన్= ప్రధానమైన వాడయ్యాడు; మఱియున్= అంతేగాక; ఆ దితిసంతానంబులగు= ఆ దితిపుత్రులు అయిన; మరుత్తులు= మరుత్తులు అనేవారు; ఏకఊన పంచాశత్= ఒకటి తక్కువ ఏబది (అనగా నలుబది తొమ్మిది); సంఖ్యగలవారలు= సంఖ్య గలవారు; అందఱు= అందరూ; అనపత్యులై=

సంతానం లేనివారై; ఇంద్రునితోన్+కూడి= ఇంద్రునితో సహా; దేవత్వంబున్+ఒందిరి= దైవత్వం పొందారు; అనినన్= అనగా; విని= ఈ మాటను ఆలకించి; పరీక్షిన్నరేంద్రుడు= పరీక్షిత్తు అనేరాజు; శుకయోగీంద్రునకున్= యోగియైన శుకమహర్షితో; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ధాతకు కుహూ, సినీవాలి, రాకా, అనుమతులని నలుగురు భార్యలు. కుహూ అనే ఆమె సాయం అనే పేరుగల పుత్రుణ్ణి కన్నది. సినీవాలి దర్శ అనేవానిని, రాక ప్రాతః అనేవానిని, అనుమతి పూర్ణిమ అనేవానిని కన్నారు. విధాతకు క్రియ అనే ఆమె భార్య. వారు అగ్నిపురీష్యాదులను కన్నారు. వరుణుడు అనేవాడు చర్షిణి అనే భార్యయందు గతంలో బ్రహ్మపుత్రుడైన భృగువును, పుట్టలో పుట్టిన వాల్మీకిని కన్నారు. మిత్రావరుణులు అప్సరఃకాంత ఐన ఊర్వశిపై మరులుగొనడంవల్ల వీర్యపతనమైంది. ఆ వీర్యం ఒక కుంభంలో నిక్షిప్తం చేయబడింది. కుంభసంభవులుగా అగస్త్యుడు వసిష్ఠుడు జన్మించారు. ప్రత్యేకంగా మిత్రునకు రేవతియందు ఉత్సర్గసంభవులై అరిష్టుడు, పిప్పలుడు అనేవారు జన్మించారు. ఇంద్రునకు శచీదేవియందు జయంతుడు, ఋషభుడు, విదుషుడు అని ముగ్గురు జన్మించారు. వామనుడు అయిన ఉరుక్రమ భగవానునకు కీర్తి అనే భార్యయందు బృహత్‌శ్లోకుడు పుట్టాడు. ఆ బృహత్‌శ్లోకునకు సౌభగాదులు జన్మించారు. మహానుభావుడైన కశ్యపప్రజాపతికి అదితియందు శ్రీమన్నారాయణుడు ఎలా అవతరించాడో తరువాత వివరిస్తాను. ఇక దితికుమారులైన దైతేయుల వంశక్రమాన్ని చెబుతాను. ఆ దైతేయవంశంలో ఇద్దరు పరమభగవద్భక్తులు ఉన్నారు. దైత్య దానవులచే నమస్కరింపదగినవారు వారిరువురు. వారే ప్రహ్లాదుడు, బలి అనేవారు. దితి కుమారులు ప్రసిద్ధులైన హిరణ్యకశిపు, హిరణ్యాక్షులు. హిరణ్యకశిపుని భార్య జంభాసురుని కుమార్తె అయిన కయాధువు. ఈ కయాధువునకు ప్రహ్లాద, అనుహ్లాద, సంహ్లాద, హ్లాదులనే నలుగురు కుమారులు, సింహిక అనే కన్య జన్మించారు. ఆ సింహికకు రాహువు జన్మించాడు. అమృతపానం చేయబోగా ఆ రాహువు శిరస్సును విష్ణుమూర్తి తన చక్రంచేత ఖండించాడు. సంహ్లాదునకు గతి అనే ఆమె భార్య. వారికి పుట్టినవాడు పంచజనుడు. హ్లాదునకు దమని అనే ఆమెయందు వాతాపి ఇల్వలుడు అని ఇద్దరు జన్మించారు. వారలను అగస్త్యుడు మింగాడు. అనుహ్లాదునకు సూర్మ్య అనే భార్యయందు బాష్కలుడు, మహిషుడు జన్మించారు. ప్రహ్లాదునకు దేవి అనే భార్యయందు విరోచనుడు జన్మించాడు. అతని కుమారుడు బలి. ఆ బలికి అశన అనే ఆమెయందు బాణుడు మొదటివాడుగా నూర్గురు కొడుకులు పుట్టారు. బలియొక్క ప్రభావాన్ని తరువాత చెపుతాను. బలి కుమారుడైన బాణాసురుడు పరమేశ్వరుని ఆరాధించి ప్రమథగణాలలో ముఖ్యుడయ్యాడు. దితి సంతానమైన మరుత్తులు నలుబది తొమ్మిదిమంది. వీరికి సంతానం లేదు. ఈ మరుత్తులు ఇంద్రునితో సమానంగా దైవత్వాన్ని పొందారు అని శుకమహర్షి చెప్పగా విని పరీక్షిత్తు ఇలా అడిగాడు.

**ఆ. ఏమి కారణమున నింద్రునికిని మరు, చ్చయము లాప్తు లగుచు శాంతి నొంది?**
**రరయఁ దత్సమాను లగుచు వర్తించిరి?, దీని వినఁగ వలయుఁ దెలుపవయ్య! 507**

**ప్రతి :** ఏమి కారణమునన్= ఏ కారణంగా; ఇంద్రునికిని= ఇంద్రునకు; మరుత్‌చయములు= మరుత్తుల సముదాయం నలబై తొమ్మిదిమంది; ఆప్తులగుచున్= మిత్రులవుతూ; శాంతిన్+ఒందిరి= శాంతిని పొందారు; అరయన్= పరికించి చూడగా; తత్ సమానులు+అగుచున్= ఇంద్రునితో సమానమైనవారై; వర్తించిరి= దైవత్వాన్ని పొంది ప్రవర్తించారు; దీనివినఁగన్+వలయున్= ఈ విషయాన్ని వివరంగా వినాలి; తెలుపవయ్య= చెప్పు మహర్షీ!

**తా :** ఓ శుకమహర్షీ! మరుత్తులు నలబై తొమ్మిదిమంది ఏ కారణంగా ఇంద్రునకు ఆప్తులై ఎలా శాంతి పొందారు? ఇంద్రునితో సమానంగా ఎలా ప్రవర్తించారు? ఈ విషయాన్ని వినాలని ఉంది. తెలియజేయి.

**వ. అనిన శుకుం డిట్లనియె. 508**

**ప్రతి :** అనినన్= అనగా; శుకుండు+ఇట్లు+అనియెన్= శుకుడిలా అన్నాడు.

**తా :** అనగా విని పరీక్షిత్తుతో శుకుడు ఇలా అన్నాడు.

**సీ. నరనాథ! విను తన నందను లందఱు నమరేంద్రుచే హతు లగుచునుండఁ**
**గోపశోకంబులఁ గ్రుళ్ళుచుఁ దనలోన మండుచు దితి చాల మఱుఁగఁ దొడఁగె,**
**భ్రాతృ ఘాతకుఁ డతిపాతకుం డీ యింద్రుఁ జంపక నాకేల సొంపు గలుగు?**
**వీని భస్మము సేయువానిఁగా నొక సుతుఁ బడసెద నని చాల భర్తఁ గోరి**

**ఆ. ప్రియము సేయఁదొడఁగెఁ బెక్కు భావంబుల, భాషణముల నధిక పోషణముల**
**భక్తియుక్తిచేతఁ బరిచర్యగతిచేత, నుతులచేత నతుల రతులచేత. 509**

**ప్రతి :** నరనాథ!= ఓ రాజా!; విను= వినుము; తననందనులందఱున్= తన కుమారులందరూ; అమరేంద్రుచేన్= దేవేంద్రునిచేత; హతులగుచున్+ఉండన్= చంపబడుతూ ఉండగా; కోపశోకంబులన్= కోపంతో దుఃఖంతో; క్రుళ్ళుచున్= కుమిలిపోతూ; తనలోనన్= తనలో తాను; మండుచున్= తాపం పొందుతూ; దితి; చాల మఱుఁగన్+తొడఁగెన్= చాల బాధపడ సాగింది; భ్రాతృఘాతకుఁడు= సోదరులను చంపేవాడు; అతిపాతకుండు= మిక్కిలి పాపాత్ముడు అయిన; ఈ ఇంద్రున్= ఈ మహేంద్రుణ్ణి; చంపక= చంపకపోతే; నాకు ఏల సొంపు కలుగున్?= నాకు సుఖం ఎలా కలుగుతుంది?; వీనిన్ భస్మము చేయు వానిఁగాన్= వీణ్ణి చంపి బూడిద చేసే; ఒక సుతున్= ఒక కుమారుణ్ణి; పడసెదన్= పొందుతాను; అని= అని భావించి; చాల భర్తన్ కోరి= భర్తను అమితంగా కోరి; పెక్కు భావంబులన్= అనేక భావాలతో; భాషణములన్= మాటలతో; అధిక పోషణములన్= ఎక్కువ పోషణలతో; భక్తియుక్తిచేతన్= భక్తితో కూడుకున్న విధంగా; పరిచర్యగతిచేతన్= సేవలతో; నుతులచేతన్= స్తుతులతో; అతులరతులచేతన్= సరస సంభోగ క్రీడలతో; ప్రియము+చేయన్+తొడఁగెన్= ఇష్టం కలిగించే విధంగా ప్రవర్తించసాగింది.

**తా :** ఓ రాజా! వినుము. దితియొక్క కుమారులందరు దేవేంద్రునిచేత చంపబడుతూ ఉండగా కోపంతో, దుఃఖంతో దితి తనలో తాను మిక్కిలి తాపం పొంది బాధపడసాగింది. సోదరులను చంపుతున్న మిక్కిలి పాపాత్ముడైన ఇంద్రుణ్ణి చంపకపోతే నాకు సుఖం ఎక్కడిదని, ఈ ఇంద్రుణ్ణి భస్మంచేసే కొడుకును కనాలని అనుకొన్నది. భర్త సమీపానికి చేరి పెక్కు భావాలతో, చక్కటి సంభాషణలతో, మిక్కిలిగా భర్తకు అవసరమైన పదార్థాలను అందిస్తూ, భక్తితో కూడినదై, సేవలతో, స్తుతులతో, సంభోగ క్రీడలతో మనఃపూర్వకంగా నమస్కారాలందిస్తూ ఆయనను సేవించింది.

**చ. కలికి కటాక్ష వీక్షణ వికారములన్ హృదయానురాగ సం**
**కలిత విశేషవాఙ్మధుర గర్జనలన్ లలితాననేందు మం**
**డల పరిశోభి తామృత విడంబిత సస్మిత సుప్రసన్నతా**
**ఫల రుచిర ప్రదానముల భామిని భర్తమనంబు లోఁగొనెన్. 510**

**ప్రతి :** కలికి= దితి; కటాక్ష వీక్షణ వికారములన్= కడకంటి చూపుల విన్యాస విశేషాలతో; హృదయ+అనురాగ= హృదయంలో గల ప్రేమను; సంకలిత= మేళవించిన; విశేషవాక్+మధుర గర్జనలన్= ప్రత్యేకమైన మాటలలో గల తీయని గర్జనలతో; లలిత+ఆనన+ఇందుమండల= సుందరమైన ముఖచంద్ర మండలంతో; పరిశోభిత= కాంతులు చిందుచున్న; అమృత విడంబిత= అమృతంతో కూడిన; సస్మిత= చిరునవ్వుతో; సుప్రసన్నతా= ప్రసన్నతా గుణంగల; ఫలరుచిర ప్రదానములన్= ఫలాల కాంతులను ఇవ్వడంచేత; భామిని= దితి; భర్త మనంబు= తన భర్తయైన కశ్యప మహర్షియొక్క మనస్సును; లోఁగొనెన్= వశం చేసుకొన్నది.

**తా :** సౌందర్యవతి అయిన దితి తన కడకంటి చూపులతో, అనురాగం పొంగి పొరలే శృంగార చేష్టలతో, చందమామవంటి అందమైన ముఖంలో చిందే అమృతంవంటి చిరునవ్వులతో, ప్రసన్నమైన ప్రసంగాలతో, అపురూపాలైన ఉపచారాలతో మగని మనస్సును లొంగదీసుకొన్నది.

**తే. అఖిల మెఱిఁగిన కశ్యపు నంతవాని, హితవు తలకెక్కు రతుల సంగతులచేత**
**నవశుఁ గావించె వ్రేల్మిడి నబ్జవదన, పతుల భ్రమియింప నేరని సతులు గలరె? 511**

**ప్రతి :** అఖిలమెఱిఁగిన= సమస్త విషయజ్ఞానం కలిగిన; కశ్యపునంతవానిన్= కశ్యపప్రజాపతి అంతటి వానిని; హితవు= ఇష్టం; తలకెక్కు= తలకెక్కే; రతులసంగతుల చేతన్= భోగక్రీడలచేత; అబ్జవదన= పద్మముఖి అయిన దితి; వ్రేల్మిడిన్= చిటికె; అవశున్+కావించెన్= మైమరపించింది; పతుల భ్రమింప నేరని= పురుషులను తమచుట్టూ తిప్పుకోలేని; సతులు గలరె= స్త్రీలు ఉన్నారా?!

**తా :** సర్వమూ తెలిసిన కశ్యపుడంతటి వాణ్ణి దితి తన లీలావిలాసాలతో, రతుల సంగతులతో క్షణంలో మురిపించి మైమరపించింది. పతుల మతులను భ్రమింపజేయలేని సతులు లోకంలో ఉన్నారా?

**క. ఏ తలఁ పెఱుఁగక నిలిచిన, భూతంబులఁ జూచి ధాత పురుషుల మనముల్**
**ప్రీతి గొలుపంగ యువతీ, వ్రాతంబు సృజించెఁ బతులు వారల కరుదే! 512**

**ప్రతి :** ఏ తలఁపు+ఎఱుఁగక= ఏ విధమైన ఆలోచన లేకుండా; నిలిచిన= ఉంటున్న; భూతంబులన్+చూచి= జీవులను చూసి; ధాత= బ్రహ్మ; పురుషుల మనముల్= మగవారి మనస్సులను; ప్రీతి గొలుపంగన్= ప్రీతిని కలిగించడానికి; యువతీవ్రాతంబున్= స్త్రీల సమూహాన్ని; సృజించెన్= సృష్టించాడు; పతులు= భర్తలు; వారలకు= ఆ స్త్రీలకు; అరుదే= దుర్లభులా?!

**తా :** ఎటువంటి ఆలోచన లేకుండా పురుషులు జీవిస్తున్నవేళ బ్రహ్మదేవుడు ఆ పురుషుల మనస్సులను సంతోషపెట్టడానికి స్త్రీలను సృష్టించాడు. భార్య తన భర్తను వశపరచుకోవడంలో విడ్డూరం ఏముంది?!

**వ. ఇట్లు నిజసతిచేత నుపలాలితుండై కశ్యపప్రజాపతి యా సతికిం బరమప్రీతుండై యిట్లనియె; ఓ తన్వీ! నీకుఁ బ్రసన్నుండనైతి, వరంబు గోరు మిచ్చెద; నాథుండు ప్రసన్నుండైన స్త్రీలకుం గోరిక సంభవించుట కేమి కొఱంత?; సతికిం బతియె దైవంబు; సర్వభూతంబుల మానసంబులకు వాసుదేవుండే భర్త; నామరూప కల్పితులైన సకల దేవతామూర్తులచేతం బురుషులచేతను భర్తృరూపధరుండయిన భగవంతుండు సేవింపంబడు చుండు;**

**విశేషించి స్త్రీలచేతఁ బతిరూపంబున భజియింపంబడుఁగావునం బతివ్రతలైన సుందరులు శ్రేయస్కామలై యేకచిత్తంబున నాత్మేశ్వరుండయిన య ప్పరమేశ్వరుని భర్తృ భావంబున సేవించుచుండుదురు; ఏనును నీకీ భావంబున వరదుఁడ నైతి; దుశ్శీలలయిన వనితలకుం బొందరాని వరంబు నీ కిచ్చెద. వేఁడు మనిన నా కశ్యపునకు దితి యిట్లనియె. 513**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; నిజసతిచేతన్= తన భార్యచేత; ఉపలాలితుండై= బాగా లాలింపబడినవాడై; కశ్యప ప్రజాపతి; ఆ సతికిన్= తన భార్యయైన దితికి; పరమప్రీతుండై= మిక్కిలి ప్రియం కలిగినవాడై; ఇట్లనియెన్= ఇలా అన్నాడు; ఓ తన్వీ= ఓ సుందరీ!; నీకున్ ప్రసన్నుండనైతి= నీపై నాకు దయ కలిగింది; వరంబు కోరుము ఇచ్చెద= వరం కోరుకో ఇస్తాను; నాథుండు ప్రసన్నుండైనన్= భర్త దయగలవాడై సంతోషిస్తే; స్త్రీలకున్= స్త్రీలకు; కోరిక సంభవించుటకున్= కోరిక తీరడానికి; ఏమి కొఱంత= లోటేముంది?; సతికిన్= భార్యకు; పతియెదైవంబు= భర్తయే దైవం; సర్వభూతంబుల= సమస్త ప్రాణులయొక్క; మానసంబులకున్= మనస్సులకు; వాసుదేవుండే= శ్రీవిష్ణుమూర్తియే; భర్త= ప్రభువు; నామరూపకల్పితులైన= పేర్లతో, ఆకారాలతో కల్పింపబడిన; సకలదేవతామూర్తులచేతన్= దేవతలందరి ఆకారాలతో; పురుషుల చేతను= పురుషజాతితో; భర్తృరూపధరుండయిన= భర్త రూపం ధరించిన; భగవంతుండు= పరమాత్మ; సేవింపన్+పడుచుండున్= ఆరాధింపబడుతూ ఉంటాడు; విశేషించి= ముఖ్యంగా; స్త్రీలచేతన్= స్త్రీలచేత; పతిరూపంబునన్= భర్తరూపంతో; భజియింపంబడున్= ఆ విష్ణుమూర్తి పూజింపబడతాడు; కావునన్= అందుచేత; పతివ్రతలైన సుందరులు= పాతివ్రత్య ధర్మాన్ని పాటించే అందగత్తెలు; శ్రేయస్కామలై= శ్రేయస్సును కోరుకొనేవారై; ఏకచిత్తంబునన్= ఏకాగ్రమైన మనస్సుతో; ఆత్మేశ్వరుండయిన= తనకు భర్త అయిన; ఆ+పరమేశ్వరుని= ఆ పరమాత్మను; భర్తృభావంబునన్= భర్త అనే భావనతో; సేవించుచున్+ఉండుదురు= పూజిస్తూ ఉంటారు; ఏనును= నేను కూడా; నీకు= భార్యవు అయిన నీకు; ఈ భావంబునన్= ఈ భావనతో; వరదుఁడనైతి= వరములిచ్చేవాడనయ్యాను; దుశ్శీలలయిన వనితలకున్= చెడ్డశీలంగల స్త్రీలకు; పొందరాని= పొందుటకు శక్యంగాని; వరంబు నీకిచ్చెద= వరం నీకిస్తాను; వేఁడుము= కోరుకో; అనినన్= అనగా; ఆ కశ్యపునకు= భర్తయైన కశ్యపునకు; దితి ఇట్లు అనియెన్= దితి ఇలా అంది.

**తా :** ఈ విధంగా తన భార్య అయిన దితిచే కశ్యపప్రజాపతి లాలింపబడి దితియందు ప్రేమతో ఇలా అన్నాడు. "ఓ సుందరీ! నీ యందు నేను ప్రసన్నత పొందాను వరం కోరుకో. భర్త ప్రసన్నుడైతే స్త్రీలకు కోరికలు తీరడంలో ఆశ్చర్యం ఏ ముంది? స్త్రీకి భర్తయే దైవం. సమస్త ప్రాణుల మనస్సులకు వాసుదేవుడే నిజమైన భర్త. ఆ వాసుదేవుడు అనేక నామాలతో అనేక రూపాలతో ఒప్పుతున్న దేవతామూర్తులచేత, పురుషులచేత భర్త రూపంలో సేవింపబడుతూ ఉంటాడు. విశేషమైన విషయం ఏమంటే ఆ పరమేశ్వరుడే భర్త రూపంలో స్త్రీలచేత సేవింపబడుతూ ఉంటాడు. కాబట్టి పతివ్రతలైన స్త్రీలు శ్రేయస్సును కోరి ఏకాగ్రమైన మనస్సుతో తమ తమ భర్తలను పరమాత్మగా భావించి సేవిస్తూ ఉంటారు. నీ సేవలకు సంతసించి నీకు వరం ఇద్దామని అనుకుంటున్నాను. దుష్ట శీలంగల వనితలకు ఎటువంటి వరాలు దక్కవుగదా. నీకు మాత్రం ఎవ్వరూ పొందలేని వరాలు ఇస్తాను కోరుకో" అన్నాడు కశ్యపుడు. అప్పుడు భర్తఅయిన కశ్యపునితో దితి ఇలా అన్నది.

**ఆ. వరము గోర నాకు వరదుండ వేనియు, నింద్రుఁ ద్రుంచునట్టి యిద్ధబలుని**
**నమితతేజుఁ దనయు నమరత్వసంప్రాప్తు, నెందుఁ జెడనివాని నిమ్ము నాథ! 514**

**ప్రతి :** నాథ!= ఓ స్వామీ!; వరమున్+కోరన్= వరం కోరుకోవడానికి; నాకు; వరదుండ వేనియున్= వరాలు ఇచ్చేవాడవయితే, ఇంద్రున్ ద్రుంచునట్టి= ఇంద్రుణ్ణి చంపగల; ఇద్ధబలునిన్= ప్రసిద్ధమైన బలంగలవాణ్ణి; అమిత తేజున్= అధికమైన తేజస్సు గలవాణ్ణి; అమరత్వసంప్రాప్తున్= దైవత్వాన్ని పొందేవాణ్ణి; ఎందున్ చెడనివానిన్= ఎక్కడా ఓటమిలేనివాణ్ణి; తనయున్= (అటువంటి) కుమారుణ్ణి; ఇమ్ము= ప్రసాదించు.

**తా :** ఓ నాథా! మీరు నాకు వరం ఇవ్వటానికి సుముఖంగా ఉన్నట్లయితే ఇంద్రుణ్ణి జయించగలిగే ప్రసిద్ధమైన బలం, మిక్కిలి తేజస్సు, దైవత్వం, ఓటమి ఎరుగని తనం గలవాణ్ణి కుమారుడుగా నాకు ప్రసాదించు.

**వ. అనవుడు. 515**

**తా :** అనగా అటుపిమ్మట

**క. ఉట్టిపడునట్టి వర మీ, కట్టిఁడి న న్నెట్టు వేఁడె? గటకట యనుచున్**
**మిట్టిపడి యతఁడు మదిలోఁ, బుట్టిన తల్లడముతోడఁ బొక్కుచు నుండెన్. 516**

**ప్రతి :** ఉట్టిపడునట్టి= మూలమే తెగిపోయే; వరము= వరాన్ని; ఈ కట్టిఁడి= ఈ కఠినాత్మురాలు; నన్ను ఎట్టువేఁడెన్= నన్ను ఎలా కోరింది; కటకట= అయ్యయ్యో; అనుచున్= అనుకొంటూ; మిట్టిపడి= ఆశ్చర్యపడి; అతఁడు= ఆ కశ్యపుడు; మదిలోన్ పుట్టిన= మనస్సులో కలిగిన; తల్లడముతోడన్= తొట్రుపాటుతో; పొక్కుచున్+ఉండెన్= బాధపడుతూ ఉన్నాడు.

**తా :** దితి మాటలు విని కశ్యపుడు త్రుళ్ళిపడ్డాడు. ఉన్నట్లుండి ఈ కఠినురాలు ఇలాంటి క్రూరమైన వరం కోరిందే అని లోలోపల తల్లడిల్లాడు.

**చ. ప్రకృతినిఁ గర్మపాశమున బద్ధుఁడ నై తిఁ గదయ్య! నేఁడు నే**
**వికటసతీస్వభావమున వేఁదుఱు గొల్పిన మాయ నింద్రియా**
**ధికమతి యైనవాఁడు దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పా**
**తకములఁ గూలకున్నె? నను దైవము నవ్వదె లోలితాత్మునిన్? 517**

**ప్రతి :** నేఁడు= ఈనాడు; నేన్= నేను; ప్రకృతినిన్= ప్రాకృతమైన; కర్మపాశమునన్= కర్మ అనే తాటితో; బద్ధుఁడన్+ఐతిన్ కదయ్య= కట్టబడ్డాను కదా!; వికటసతీస్వభావమునన్= వంకరప్రవర్తనకలిగిన భార్యయొక్క స్వభావంచే; వేఁదుఱు గొల్పిన మాయన్= ఉన్మాదాన్ని కలిగించే మాయకు చిక్కి; ఇంద్రియ+అధికమతి+ఐనవాఁడు= ఇంద్రియలోలుడైనవాడు; తన తెంపునన్= తన నిశ్చయంతో; చిత్తము వెచ్చపెట్టి= మనస్సును తపింప చేసుకొని; పాతకములన్= పాపాలలో; కూలకున్నె?!= కూలకుండా ఉంటాడా?!; లోలిత+ఆత్మునిన్= చంచలాత్ముడనైన; ననున్= నన్ను చూచి; దైవము నవ్వదె= దైవం పరిహసించదా!

**తా :** పరమాత్మను కాదని ప్రకృతికి లోబడి కర్మపాశంచే కట్టబడిపోయాను కదా! కుటిల స్వభావంగల స్త్రీయొక్క ఉన్మాదంలోను, మాయలోను పడి ఇంద్రియలోలుడైనవాడు పాపాలలో పడక తప్పదు; ఇలా చంచలాత్ముడనైన నన్ను చూచి దైవం పరిహసించదా?

**సీ. ఖండ శర్కరతోడఁ గలహించు పలుకులఁ బద్మవిలాస మేర్పఱచు మోముఁ**
**దుహినాంశు కళలతోఁ దులదూఁగు చెయ్వులఁ జెమటఁ గ్రొన్నెత్తురు సేయు మేను**

**నిలువెల్లఁ గరఁగించు నేర్పులయింపులుఁ బువ్వుల కరుదైన ప్రోది సేఁత**
**తమకంబు రెట్టించు తరితీపుతలఁపులు నెనసిన మదిలోని యిచ్చగింత**

**ఆ. గలిగి కఱవనున్న కాలాహిపోలికిఁ, జెలఁగుచున్న సతులచిత్తవృత్తిఁ**
**దెలియవశమె యెంత ధృతి గలవారికి, నాక కాదు నిఖిలలోకములకు. 518**

**ప్రతి :** ఖండశర్కరతోడన్= చక్కెర పలుకులతో; కలహించు= పోట్లాడు; పలుకులన్= మాటలతో; పద్మవిలాసము= తామరయొక్క సొబగు; ఏర్పఱచు మోమున్= తెలియజేసే ముఖంలో; తుహినాంశు కళలతోన్= చంద్రకళలతో; తులదూఁగు= సమానమైన; చెయ్వులున్= చేష్టలు; చెమటన్= చెమటచేత; క్రొత్త+నెత్తురు+చేయు= నెత్తురుచిమ్మి ఎఱ్ఱబడిన; మేను= శరీరం; నిలువెల్లన్= శరీరమంతటిని; కరఁగించు= కరిగిపోయేలా చేసే; నేర్పుల యింపులు= నైపుణ్యాల సొగసులు; పువ్వులకు+అరుదైన= పూలకుకూడా చిక్కని; ప్రోదిసేఁత= వలపు; తమకంబున్= ఆసక్తిని; రెట్టించు= అధికంచేసే; తరితీపు= తీయని; తలఁపులు= ఆలోచనలు; ఎనసిన= పోలిన; మదిలోని= హృదయంలోని; ఇచ్చగింత= ఇష్టం; కలిగి= ఇవన్నీ ఉండి; కఱవనున్న= కాటు వేయుటకు సిద్ధంగా ఉన్న; కాల+అహిపోలికిన్= కృష్ణసర్పంతో సమానమై; చెలఁగుచున్న= ఒప్పుతున్న; సతుల చిత్తవృత్తిన్= స్త్రీల మానసిక ప్రవర్తనను; నాక కాదు= నాకే కాదు; నిఖిల లోకములకున్= సమస్తలోకాలకూ; ఎంత ధృతిగలవారికిన్= ఎంత ధైర్యం గలవారికైనా; తెలియవశమె!= తెలుసుకోవడం వీలవుతుందా!

**తా :** చక్కెర తీపిని ధిక్కరించే పలుకులు, పద్మవిలాసంగల మోము, వెన్నెలచిందే చేష్టలు, కొత్త నెత్తురు చిమ్మే శరీరం, నిలువునా కరిగించే నేర్పు, పూలకు కూడా లేని వలపు, తమకాన్ని పెంచే ఆలోచన, మదిలో గల ఇష్టం మొదలైన లక్షణాలు కలిగి కరవటానికి సిద్ధంగా ఉన్న కాలనాగుతో సమానమైన ఆడువారి మానసిక వర్తనం నాకే కాదు లోకంలో ఎంతటి ధైర్యవంతులకైనా తెలియవీలవుతుందా?

**ఆ. కోరి సతుల కెల్లఁ గూర్చువా రెవ్వరు?, పతులనైన సుతుల హితులనైన**
**బలిమిఁ జేసి యైనఁ బరహ స్తమున నైన, హింసపఱతు రాత్మహితము కొఱకు. 519**

**ప్రతి :** కోరి; సతులకు ఎల్లన్= స్త్రీలకు అన్నివిధాల; కూర్చువారు ఎవ్వరు= ఆత్మీయులు అయిన వారెవరు?!; ఆత్మహితము కొఱకున్= తమకు మేలు కలగడానికి; పతులనైనన్= భర్తలనైనా; సుతులన్= కుమారులనైనా, హితులనైనన్= స్నేహితులనైనా; బలిమిన్ చేసి+ఐనన్= బలవంతం చేసిగాని; పరహస్తముననైనన్= ఇతరుల సహాయం చేతగానీ; హింసపఱతురు= హింసిస్తారు.

**తా :** సతులకు ఎవరు ఇష్టులో ఎవరు అనిష్టులో చెప్పలేం. స్త్రీలు తమకు మేలు కలగడానికి, తమ ఇష్టం నెరవేరడానికి భర్తలకైనా, సుతులకైనా, స్నేహితులకైనా హింస చేయడానికి వెనుకాడరు. ఈ స్త్రీలు పైవారిని హింసించడానికి తమ బలాన్నైనా ఉపయోగిస్తారు లేదా ఇతరుల బలాన్నైనా ఉపయోగించి తమ ఇష్టాన్ని నెరవేర్చుకుంటారు.

**వ. అని చింతించి దీనికి నే మని ప్రతివాక్యం బిచ్చువాఁడ? మద్వచనం బెందు నమోఘంబు; త్రిలోక పరిపాలనశీలుండయిన ఖిదురపాణి వధార్హుండె? యేను దీనికి నైనది యొకటి గల్పించెద నని దితిం జూచి “యో తనుమధ్య! నీకు నట్లు దేవబాంధవుం డయిన యింద్రహంత యగు పుత్త్రుండు గలిగెడు; నొక్క సంవత్సరంబు**

**వ్రతంబునం జరియింపుము; దాని ప్రకారం బెల్ల నేను జెప్పెద విను, మెల్లజీవులవలన హింసాభావంబు లేక యతిధ్వనివాక్యంబులుడిగి కోపంబు మాని యనృతంబులు వలుకక నఖరోమచ్ఛేదనంబు సేయక యస్థి కపాలాదులైన యమంగళంబులు నంటక నదీతటాకాదులన కాని ఘటోదక కూపోదకంబుల స్నానంబు సేయక దుర్జనసంభాషణంబు వర్జించి కట్టిన కోకను ముడిచిన పువ్వులను గ్రమ్మఱ ధరియింపక భోజనంబులయందు నుచ్ఛిష్టాన్నంబును జండికానివేదితాన్నంబును గీశ శునక మార్జార కంక క్రిమిపిపీలికాది విదూషితాన్నంబును సామిషాన్నంబును వృషలాహృతాన్నంబును నను నీ పంచవిధ నిషిద్ధాన్నంబులు వర్జించి దోయిట నీళ్లు ద్రావక సంధ్యాకాలంబుల ముక్తకేశిగాక మితభాషిణియై యలంకారవిహీనగాక వెలుపలం దిరుగక పాదప్రక్షాళనంబు సేసికొని కాని శయనింపక యార్ద్రపాదయై పవ్వళింపక పశ్చిమ శిరస్కయయ్యును నగ్నయయ్యును సంధ్యాకాలంబుల నిద్రింపక నిత్యంబును ధౌతవస్త్రంబులు గట్టి శుచియై సర్వమంగళసంయుక్తయై ప్రాతః కాలంబునఁ దూర్పుమొగంబై లక్ష్మీనారాయణుల నారాధించి యావాహనార్ఘ్యపాద్యోపస్పర్శన వాసోపవీత భూషణ పుష్పధూప దీపోపచారాద్యుపచారంబుల నర్చించి హవిశ్శేషంబు ద్వాదశాహుతుల వేల్చించి ప్రణామంబు లాచరించి భగవన్మంత్రంబును దశవారంబు లనుసంధించి స్తోత్రంబుసేసి గంధపుష్పాక్షతంబుల ముత్తైదువులం బూజించి పతిని సేవించి పుత్త్రుం గుక్షిగతుంగా భావించి యివ్విధంబున మార్గశీర్షశుద్ధ ప్రతిపదారంభంబుగా నొక్క సంవత్సరంబు సలిపి యా ద్వాదశమాసాంత్యదివసంబున విధ్యుక్తంబుగా నుద్యాపనంబు సేయవలయు; నీ వీ పుంసవనం బనియెడు వ్రతంబు ద్వాదశమాసపర్యంతం బేమఱక సల్పిన నీవుగోరిన కుమారుండు గలిగెడు యనిన సేవించుచు వ్రతంబుతోడనె గర్భంబు ధరియించి వ్రతంబు సలుపుచునుండ నింద్రుండు మాత్రభిప్రాయం బెఱింగి యా యమ్మ నహరహంబును రహస్యంబున సేవించుచు వ్రతంబునకుం దగిన పుష్పఫల సమిత్కుశ పత్త్రాంకురంబులు మొదలయిన వస్తువితతిం ద్రికాలంబులం దెచ్చి యిచ్చుచుఁ బుండరీకంబు హరిణికిం బొంచియున్న భంగి నా యమ్మ వ్రతభంగంబునకై కాచి శుశ్రూష సేయుచు నా యమ్మగర్భంబున ధరియించిన తేజోవిశేషంబునకు బెగ్గలించుచుఁ గృశించుచునుండె, నంత నొక్కనాఁడు.** **520**

**ప్రతి :** అని చింతించి= అని ఆలోచించి; దీనికిన్= దీనికి; ఏమని= ఏ విధంగా; ప్రతివాక్యంబు= తిరిగి సమాధానం; ఇచ్చువాఁడన్= ఇవ్వగలవాడను; మద్వచనంబు= నామాట; ఎందున్ అమోఘంబు= ఎక్కడనూ మొక్కవోనిది (వ్యర్థం కానిది); త్రిలోక పరిపాలన శీలుండయిన= మూడులోకాలనూ పాలింప సమర్థుడైన; భిదురపాణి= వజ్రాయుధం హస్తమందు గల ఇంద్రుడు; వధ+అర్హుండె?= సంహరింపతగినవాడా?!; ఏను= నేను; దీనికినైనది= దీనికి తగినది; ఒకటి కల్పించెదన్= ఒకదానిని కల్పిస్తాను; అని= అనుకొని; దితిన్+చూచి= భార్యయైన దితినిచూచి; ఓ తనుమధ్య= ఓ తరుణీ!; నీకున్= నీకు; అట్లు= నీవు కోరిన ప్రకారంగా; దేవబాంధవుండు+అయిన= దేవతలకు బంధువు అయిన; ఇంద్రహంత+అగు= ఇంద్రుని సంహరింపగలవాడైన; పుత్త్రుండు కలిగెడున్= కుమారుడు కలుగుతాడు; ఒక్క సంవత్సరంబు= ఒక సంవత్సరకాలం; వ్రతంబునన్= నియమంతో; చరియింపుము= నిర్వర్తించు; దాని ప్రకారంబు ఎల్లన్ ఏను చెప్పెదన్= ఆ వ్రతవిధానం సర్వం నేను చెపుతాను; వినుము= విను; ఎల్లజీవులవలనన్= అన్ని జీవులపట్ల; హింసాభావంబులేక= హింసించాలనే ఆలోచన లేకుండా; అతిధ్వని వాక్యంబులు= పెద్దగా శబ్దించే మాటలు; ఉడిగి= విడిచిపెట్టి; కోపంబుమాని= కోపాన్ని

వదలి; అనృతంబులు పలుకక= అసత్యాలు మాట్లాడక; నఖరోమచ్ఛేదనంబున్+చేయక= గోళ్ళు వెండ్రుకలు కత్తిరించుకొనక; అస్థికపాల+ఆదులైన= ఎముకలు పుర్రెలు మొదలైన; అమంగళంబులు= అశుభమైన వస్తువులను; అంటక= తాకక; నదీతటాక+ఆదులనకాని= నదులు చెరువులు మొదలైనవాటిలో తప్ప; ఘట+ఉదక= కుండలలో గల నీళ్లతో; కూప+ఉదకంబులన్= బావుల నీళ్ళతో; స్నానంబుచేయక= స్నానం చేయక; దుర్జన సంభాషణంబున్= చెడ్డవారితో మాట్లాడటం; వర్జించి= విడిచిపెట్టి; కట్టినకోకను= ఒకసారి ధరించిన చీరను; ముడిచిన పువ్వులను= తలలో ఒకసారి సింగారించుకొన్న పూవులను; క్రమ్మఱన్ ధరియింపక= తిరిగి ధరించక; భోజనంబులయందున్= భుజించే అహారపదార్థాల విషయంలో; ఉచ్ఛిష్టాన్నంబును= (ఉచ్ఛిష్ట+అన్నంబును) ఒకరు కొంత తినగా మిగిలిన అన్నాన్ని; చండికా నివేదిత+అన్నంబును= కాళికాదేవికి నివేదన చేసిన అన్నాన్ని; కీశ= కోతి; శునక= కుక్క; మార్జార= పిల్లి; కంక= రాబందు; క్రిమి= పురుగు; పిపీలికా+ఆది= చీమ మొదలైన వాటిచే; విదూషిత అన్నంబును= స్పృశించుటవలన దూషింపబడుతున్న అన్నాన్ని; స+ఆమిష+అన్నంబును= మాంసంతో కూడిన ఆహారాన్ని; వృషల+ఆహృత అన్నంబును= శూద్రుడు తెచ్చిన అన్నాన్ని; అను= అనబడే; ఈ పంచవిధ= ఈ అయిదు విధాలుగా ఉన్న; నిషిద్ధ+అన్నంబులు= శాస్త్రంచే నిషేధింపబడిన ఆహారాలను; వర్జించి= విడిచిపెట్టి; దోయిటన్= దోసిలితో; నీళ్ళు త్రావక= నీటిని త్రాగక; సంధ్యాకాలంబులన్= ఉదయ సాయం సంధ్యాసమయాలలో; ముక్తకేశిగాక= జుట్టు విరబోసుకొనక; మితభాషిణియై= తగు మాత్రంగా మాత్రమే మాట్లాడుతూ; అలంకారవిహీనగాక= ఆభరణాలు ధరించకుండా ఉండక; వెలుపలన్ తిరుగక= ఆరుబయట స్థలాల్లో సంచరించక; పాదప్రక్షాళనంబు చేసికొనికాని= కాళ్ళుకడుగుకొని కాని; శయనింపక= పండుకొనక; ఆర్ద్రపాదయై= తడిసిన కాళ్ళతో; పవ్వళింపక= పరుండక; పశ్చిమ శిరస్క అయ్యును= పడమటి దిక్కుగా తలపెట్టిగాని; నగ్నయయ్యును= దిగంబరంగా కాని; సంధ్యాకాలంబులన్= ఉదయ సాయం సంధ్యా సమయాలలో; నిద్రింపక= నిద్రించకుండా; నిత్యంబును= అనుదినం; ధౌతవస్త్రంబులు కట్టి= ఉదికి ఆరవేసిన వస్త్రాలను మాత్రమే ధరించి; శుచియై= పరిశుభ్రంగా ఉండి; సర్వమంగళసంయుక్తయై= అన్ని శుభంకరవస్తువులతో కూడి; ప్రాతఃకాలంబునన్= ఉదయకాలంలో; తూర్పుమొగంబై= తూర్పు దిక్కునకు తిరిగి; లక్ష్మీనారాయణులన్= లక్ష్మీనారాయణులను; ఆరాధించి= పూజించి; ఆవాహన= ఆహ్వానం చేయడం; అర్ఘ్య= పూజకు పనికి వచ్చే జలం ఇవ్వడం; పాద్య= పాదాలు కడుగుకొనే జలం ఇవ్వటం; ఉపస్పర్శన= ఆచమనం చేయించడం; వాస= వస్త్రమివ్వడం; ఉపవీత= యజ్ఞోపవీతమివ్వడం; భూషణ= నగలివ్వడం; పుష్ప= పూవులనివ్వడం; ధూప= అగరుధూప మివ్వడం; దీప= దీపముంచడం; ఉపచార+ఆది= ఉపచారాలు చేయడం మొదలైన; ఉపచారంబులన్= సేవలతో (షోడశ ఉపచారాలతో); అర్చించి= లక్ష్మీనారాయణులను పూజించి; హవిశ్శేషంబున్= యజ్ఞం చేయగా మిగిలిన హోమద్రవ్యాన్ని; ద్వాదశ+ఆహుతులన్= పండ్రెండు ఆహుతులతో; వేల్చించి= హోమంలో నేయి మొదలైనవి సమర్పణ చేయించి; ప్రణామంబులు+ఆచరించి= నమస్కారాలు చేసి; భగవత్ మంత్రంబును= భగవంతునికి సంబంధించిన మంత్రాన్ని; దశవారంబులు= పదిసార్లు; అనుసంధించి= మనస్సులో ధ్యానించుకొని; స్తోత్రంబుచేసి= స్తుతించి; గంధ పుష్ప+అక్షతంబులన్= గంధం, పుష్పం, అక్షతలు మొదలైన వాటితో; ముత్తైదువులన్= మాంగల్యవతులైన స్త్రీలను; పూజించి; పతిని సేవించి= భర్తను సేవించి; పుత్రున్= సుతుని; కుక్షిగతున్‌గా= తన ఉదరంలో ఉన్నట్లుగా; భావించి= భావనచేసి; ఈ+విధంబునన్= ఈ విధంగా; మార్గశీర్షశుద్ధ ప్రతిపత్ ఆరంభంబుగా= మార్గశిరమాస శుద్ధపక్ష పాడ్యమి తిథి ఆరంభంగా; ఒక్క సంవత్సరంబు సలిపి= ఒక సంవత్సర కాలపర్యంతం వ్రతనియమం చేసి; ఆ ద్వాదశమాస+అంత్యదివసంబునన్= ఆ పండ్రెండునెలల చివరిరోజున; విధి+ఉక్తంబుగాన్= శాస్త్రం చెప్పినవిధంగా; ఉద్యాపనంబు చేయవలయున్= వ్రత పరిసమాప్తి కార్యక్రమం నిర్వహించాలి; నీవు; ఈ పుంసవనంబు+అనియెడు= ఈ పుంసవనం అను పేరుగల; వ్రతంబు= వ్రతం;

ద్వాదశమాసపర్యంతంబు= పండ్రెండునెలలు పూర్తి అగువరకు; ఏమఱక సల్పిన= జాగరూకతతో చేసినట్లయితే; నీవు; కోరిన= కోరినట్లుగా; కుమారుండు కలిగెడు అనినన్= కుమారుడు జన్మిస్తాడు అని చెప్పగా; సేవించుచున్= సేవిస్తూ; వ్రతంబు తోడనె= వ్రతం ఆచరించిన వెంటనే; గర్భంబు ధరియించి= గర్భవతియై; వ్రతంబు సలుపుచున్+ఉండన్= వ్రతం ఆచరిస్తూ ఉండగా; ఇంద్రుండు= ఇంద్రుడు; మాతృ+అభిప్రాయంబు ఎఱింగి= తల్లియొక్క అభిప్రాయాన్ని తెలుసుకొని; ఆ+అమ్మన్= ఆ తల్లియైన (పినతల్లి అయిన) దితిని; అహరహంబును= అనుదినం; రహస్యంబునన్ సేవించుచున్= రహస్యంగా సేవిస్తూ; వ్రతంబునకున్ తగిన= (ఆమె ఆచరించే వ్రతానికి) తగినవిధంగా; పుష్ప= పూలు; ఫల= పండ్లు; సమిత్= సమిధలు; కుశ= దర్భలు; పత్ర= ఆకులు; అంకురంబులు= మొలకలు; మొదలైన; వస్తువితతిన్= వస్తుసముదాయాన్ని; త్రికాలంబులన్= మూడుపూటలా; తెచ్చి ఇచ్చుచున్= సమకూర్చుతూ; పుండరీకంబు= పులి; హరిణికిన్= ఆడులేడికి; పొంచి ఉన్నభంగిన్= కాపు కాచుకొని ఉన్న విధంగా; ఆ+అమ్మ వ్రతభంగంబునకై= ఆ దితికి వ్రతభంగం చేయడానికి; కాచి= ఎదురుచూస్తూ; శుశ్రూష చేయుచున్= సేవచేస్తూ; ఆ+అమ్మ గర్భంబున ధరియించిన= ఆ దితి గర్భంలో ధరించిన; తేజోవిశేషంబునకున్= గొప్ప తేజస్సునకు; బెగ్గలించుచున్= భయపడుతూ; కృశించుచున్+ఉండెన్= కృశించిపోతూ ఉన్నాడు; అంతన్ ఒక్కనాఁడు= అంతలో ఒకరోజు...

**తా :** కశ్యపుడు దితి కోరికను గురించి చాల ఆలోచించి ఈమె కోరిన కోరికకు నేను ఏమని ప్రతివచనం ఇవ్వగలను? నామాట మొక్కవోనిది కదా! ముల్లోకాలు పాలించే ఇంద్రుడు చంపదగినవాడా! కాదు కదా! ఈమెకోరిక తీరకుండా ఉండడానికి, నామాట వ్యర్థం కాకుండా ఉండడానికి తగినవిధంగా ఒక అంశాన్ని కల్పిస్తాను అనుకొని దితిని చూచి ఓ సుందరీ! నీవు కోరిన విధంగా దేవబాంధవుడైన ఇంద్రహంత అగు కుమారుడు నీకు కలుగుతాడు. ఒక సంవత్సరకాలం వ్రతం ఆచరించు. ఆ వ్రత విధానం చెబుతాను విను అని ఇలా చెప్పాడు.

"అన్ని జీవుల ఎడ హింసను విడిచి దయగలిగి ఉండాలి. కఠోరమైన మాటలు విడవాలి. కోపం విడిచిపెట్టాలి. అసత్యం ఆడకూడదు. గోళ్ళు, వెంట్రుకలు, కత్తిరించుకోకూడదు. ఎముకలు పుర్రెలు మొదలైన అమంగళ వస్తువులను అంటకూడదు. నదుల చెరువుల నీళ్ళతో మాత్రమే స్నానంచేయాలి. బావినీటితో స్నానం చేయకూడదు. దుర్జనులతో మాట్లాడకూడదు. ఒకమారు కట్టిన కోకనుగాని ఒకమారు ధరించిన పూలనుగాని మరల ధరించకూడదు.

ఒకరు తినగా విడిచిన అన్నంగాని; కాళికాదేవికి నివేదన చేసిన అన్నంగాని; కోతులు, కుక్కలు, పిల్లులు, రాబందులు, క్రిములు, చీమలు మొదలైనవి ముట్టిన అన్నంగాని; మాంసాహారంగాని; శూద్రులు తెచ్చిన అన్నంగాని, ఈ విధంగా శాస్త్రం నిషేధించిన ఐదు విధాలైన ఆహారాలను విడిచి దోసిలితో నీళ్ళు తాగకుండా, సంధ్యాకాలాల్లో జుట్టు విరబోసుకోకుండా, సముచితంగా మాట్లాడుతూ, మంగళకరాలైన అలంకారాలు ధరించి, బయలు ప్రదేశాల్లో సంచరించకుండా; పాదాలు కడుగనిదే నిద్రింపకుండా, తడికాళ్ళతో నిద్రింపకుండా; పశ్చిమ దిక్కున శిరసు ఉంచి నిద్రింపకుండా, దిగంబరంగా నిద్రింపకుండా సంధ్యాకాలాల్లో నిద్రించకుండా నిత్యం ఉదికి ఆరవేసిన వస్త్రాలు ధరిస్తూ శుచిగా సర్వమంగళాలంకారాలతో ఉండాలి. ఉదయకాలాలలో తూర్పుముఖంగా నిలిచి లక్ష్మీనారాయణులను అర్చించాలి.

ఆ లక్ష్మీనారాయణులకు ఆవాహనం, అర్ఘ్యం, పాద్యం, స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, ఆభరణం, పుష్పం, ధూపం, దీపం, ఉపచారం అనే షోడశ ఉపచారాలు సమర్పించాలి. హోమంచేయగా మిగిలిన పదార్థాన్ని పండ్రెండుమార్లు అగ్నికి అందించి, నమస్కారంచేసి భగవంతునియొక్క మంత్రాన్ని పదిమార్లు మనసులో జపించి గంధపుష్ప అక్షతలతో ముత్తైదువలను పూజించాలి.

భర్తను భక్తితో సేవించి పుత్రుడు తన ఉదరంలో ఉన్నట్లుగా భావన చేయాలి. ఈ విధంగా మార్గశిరమాస శుక్లపక్షంలో పాడ్యమినాడు ప్రారంభించి ఒక సంవత్సరకాలం వ్రతం ఆచరించాలి. పండ్రెండు నెలల తరువాత చివరిరోజు విధివిధానంగా ఉద్యాపనం చేయాలి. ఈ పుంసవనం అనే వ్రతాన్ని పండ్రెండు నెలలు జాగరూకతతో చేసినట్లయితే నీవు కోరినవిధంగా కుమారుడు కలుగుతాడు" అని కశ్యపుడు చెప్పాడు. దితి కశ్యపుడు చెప్పిన ప్రకారం చేసింది. వ్రతంవల్ల గర్భం ధరించి వ్రతం జాగ్రత్తగా ఆచరిస్తోంది.

ఇంద్రుడు (పిన) తల్లి దితి అభిప్రాయం గ్రహించి ఆమెను అనుదినం రహస్యంగా సేవిస్తూ ఆమె వ్రతానికి అవసరమైన పుష్పాలు, ఫలాలు, సమిధలు, దర్భలు, ఆకులు, అంకురాలు మొదలైన వస్తువులను మూడుపూటలా తెచ్చి సమకూరుస్తున్నాడు. లేడిని అందిపుచ్చుకోవడానికి అదనుకోసం ఎదురుచూస్తున్న పులిలా దితివ్రతాన్నీ చేయాలనే తలపుతో ఎదురు చూస్తూ శుశ్రూషచేస్తూ తన పినతల్లి ధరించిన తేజస్సునకు భయపడుతూ సన్నగిల్లిపోతున్నాడు ఇంద్రుడు. ఇంతలో ఒకనాడు

**విశే :** ఇచట ఇంద్రహంత అనే మాటకు ఇంద్రుని చంపేవాడు అని ఒక అర్థం, ఇంద్రుడు చంపువాడుగా గలవాడు (అంటే ఇంద్రుని చేతిలో మరణించే వాడు) అని రెండవ అర్థం స్ఫురిస్తున్నాయి.

**సీ. వామాక్షి యనుదిన వ్రతధారణోన్నత పరిచర్య విధులచే బడలి యలసి**
**యొంటి సంధ్యావేళ నుచ్ఛిష్టయై పద ప్రక్షాళనాదులఁ బాసి మఱచి**
**తన కర్మమోహంబు దవిలి నిద్రింపంగ నింద్రుండు సయ్యన నెడరు గాంచి**
**యోగమాయాబలోద్యుక్తుఁడై యా యింతి యుదరంబుఁ జొరఁబడి యుగ్రుఁ డగుచుఁ**

**తే. దివిరి దేదీప్యమానమై తేజరిల్లు, నర్భకుని వజ్రధారల నడిచె నేడు**
**దునుకలుగ వాఁడు దునిసియుఁ దునుక ఁదునుక, చెడక యొక్కొక్క బాలుఁడై చెలఁగుచున్న 521**

**ప్రతి :** వామ+ఆక్షి= సుందరి అయిన దితి; అనుదిన వ్రతధారణ+ఉన్నత పరిచర్య విధులచేన్= ప్రతిదినం వ్రతం ఆచరిస్తూ పరిచర్యా విధులు నిర్వహిస్తూ; బడలి= శ్రమపడి; అలసి= అలసిపోయి; ఒంటి సంధ్యావేళన్= ఒకనాటి సంధ్యాసమయంలో; ఉచ్ఛిష్టయై= భోజనమారగించి; పదప్రక్షాళన+ఆదులన్= కాళ్ళుచేతులు కడుక్కోవడం మొదలైనవాటిని; పాసి= విడిచి; మఱచి= వ్రత నియమాన్ని విస్మరించి; తన కర్మమోహంబు తవిలి= తన పురాకృతకర్మయొక్క మోహానికి వశమై; నిద్రింపంగన్= నిద్రపోగా; ఇంద్రుండు= ఇంద్రుడు; చయ్యనన్= వేగంగా; ఎడరుగాంచి= అవకాశాన్ని గ్రహించి; యోగమాయాబల+ఉద్యుక్తుఁడై= యోగమాయయొక్క బలాన్ని పొందినవాడై; ఆ ఇంతి= ఆ దితియొక్క; ఉదరంబున్ చొరఁబడి= గర్భంలో ప్రవేశించి; ఉగ్రుఁడు+అగుచున్= తీవ్రమైన కోపంగలవాడవుతూ; తివిరి= త్వరపడి; దేదీప్యమానమై= ఎంతో కాంతిమంతంగా; తేజరిల్లు= ప్రకాశించే; అర్భకునిన్= బాలుణ్ణి (దితి గర్భంలో ఉన్న పిల్లవాణ్ణి); ఏడు తునుకలుగన్= ఏడు ముక్కలుగా; వజ్రధారలన్= వజ్రాయుధంయొక్క అంచులతో; అడిచెన్= ఖండించాడు; వాఁడు= ఆ దితి గర్భస్థుడైన బిడ్డ; తునిసియున్= ఖండింపబడికూడా; తునుకన్ తునుకన్= ఏ ముక్కకు ఆ ముక్క; చెడక= నశించక; ఒక్కొక్క బాలుఁడై= ఒక్కొక్క బిడ్డడై; చెలఁగుచున్+ఉన్నన్= ఒప్పుతూ ఉండగా.

**తా :** కశ్యపుని భార్య దితి ప్రతిదినం వ్రతం ఆచరిస్తూ సేవాకార్యక్రమాల వలన బడలి అలిసిపోయి, ఒకనాడు భోజనమారగించి కాళ్ళుసేతులు కడుగుకొనటం మరచిపోయి తన కర్మవశాన నిద్రపోయింది. దితి వ్రతభంగం ఎప్పుడు చేస్తుందా అని ఎదురుచూస్తున్న ఇంద్రుడు ఈ అవకాశాన్ని ఆసరాగా తీసికొని వెంటనే యోగమాయాబలంతో దితియొక్క గర్భంలోకి చొరబడ్డాడు. తీవ్రమైన కోపంతో దితిగర్భంలో అధిక తేజంతో ప్రకాశిస్తున్న బిడ్డను తన వజ్రాయుధంతో తెగగొట్టాడు. ఆ బిడ్డ ఏడు ముక్కలైపోయాడు. తెగిపడిన ఆ ఏడుముక్కలూ ప్రాణాలు కోల్పోక ఏడుగురు బిడ్డలుగా రూపొందారు.

**క.** **వా రేడ్వు రగుచుఁ గుయ్యిడ, నోరి యఱవ కనుచుఁ ద్రుంచె నొక్కొక్కని నా**
**శూరుం డేడ్గురుఁ దునుకలు, గా రయమున వారు సెడక ఖండితు లయ్యున్. 522**

**ప్రతి :** వారు= ఇంద్రునిచే ఖండింపబడినవారు; ఏడ్వురగుచున్= ఏడుగురు బిడ్డలుగా మారి; కుయ్యిడన్= రోదిస్తుండగా; ఓరి= ఓరి ఓరి; అఱవకు అనుచున్= గట్టిగా అరవకండి అంటూ; ఆ శూరుండు= ఆ పరాక్రమవంతుడైన ఇంద్రుడు; ఒక్కొక్కనిన్= ఆ ఒక్కక్క బిడ్డను; ఏడ్గురు తునుకలుగాన్= ఏడేడు ముక్కలుగా; త్రుంచెన్= ఖండించాడు; రయమునన్= వేగంగా; వారు= ఆ ఏడుగురు ఏడేసి ముక్కలుకాగా ఆ నలుబది తొమ్మిదిమంది; ఖండితులయ్యున్= ఖండింపబడినప్పటికీ కూడా; చెడక= నశింపకుండా...

**తా :** ఇంద్రుడు ఖండించిన బిడ్డ ఏడుగురు బిడ్డలుగా మారి పెద్దపెట్టున ఏడ్వసాగారు. ఓరి ఓరి ఏడవకండి అంటూ ఇంద్రుడు ఆ ఒక్కొక్కణ్ణీ ఏడేసి ముక్కలుగా తొమ్మిది ముక్కలు చేశాడు. అలా ఖండించినప్పటికీ ముక్కలైన ఆ నలభై తొమ్మిదిమందీ నశించలేదు.

**క.** **ఖండము లన్నియు నందఱుఁ, జండాంశుసమప్రకాశ శాశ్వతులగుచున్**
**యొందుకొని నిల్చి యని రా, ఖండలునకుఁ గరుణ పుట్టుగతి మదిఁ దోఁపన్. 523**

**ప్రతి :** ఖండములన్నియున్= తెగగొట్టబడిన ముక్కలు నలుబది తొమ్మిదియు; అందఱున్= నలభై తొమ్మిదిమంది బిడ్డలుగా మారిన వారందరూ; చండ+అంశు సమప్రకాశ= సూర్యునితో సమానంగా కాంతికలిగి; శాశ్వతులగుచున్= స్థిరంగా ఉండేవారై; ఒండుకొని నిల్చి= ఒక్కొక్కరూ కలసి ఏకమై నిలబడి; ఆఖండలునకున్= ఇంద్రునికి; కరుణ పుట్టుగతి= దయ కలిగే విధం; మదిన్ తోపన్= మనస్సులో తోచగా; అనిరి= ఇలా అన్నారు.

**తా :** ముక్కలైన ఆ నలభై తొమ్మిదిముక్కలూ నలభై తొమ్మిదిమంది బిడ్డలుగా సూర్యప్రకాశసమానంగా వెలుగొందుతూ ఏక కంఠంతో ఇంద్రునికి దయగలిగేలా ఇలా అన్నారు.

**వ.** **అందఱు ముకుళితకరకమలులై నీకుం దోడంబుట్టువులము. మమ్ము హింసింపంబని లేదు. నీకుం బారిషదులమై మరుద్గణములమై నిన్ను సేవించెదము, మమ్ము రక్షింపుమనిన నారాయణప్రసాదంబునం జెడని మరుద్గణంబుల పలుకులకుం గృపాళుండై యింద్రుండు వారల సహోదరులంగాఁ గైకొని మఱి హింసింపక మానె; అశ్వత్థామశరాగ్నివలన నారాయణరక్షితుండ వయిన నీవునుంబోలెఁ గులిశధారల శకలంబు లయిన కుమారు లన్నిరూపంబులై సంవత్సరంబునకు నొక్కింత కడమగా హరిం బూజించి నుద్భవించినవారు గావున నింద్రుతోడం గూడ నేకోనపంచాశద్దేవత లయిన మరుద్గణంబులు దితిగర్భంబు వెలువడి రంత దితి మేల్కాంచి**

**యనలప్రకాశులై యింద్రుతోడం గూడి వెలుంగుచున్నకుమారులం జూచి సంతోషింపక యింద్రుం జూచి నీకు మృత్యురూపంబయిన పుత్త్రుం గోరి దుస్తరంబయిన వ్రతంబు సలిపితి; సంకల్పించిన పుత్త్రుం డొక్కరుం డీ సప్త సప్త సంఖ్యలం గల కుమారు లగుట కేమి కతంబు? నీ వెఱింగిన భంగి తథ్యంబు పలుకుమనిన నింద్రుం డిట్లనియెఁ; దల్లీ! భవద్వ్రతంబుఁ జింతించి సమయవిచ్ఛేదనంబున గర్భంబు జొచ్చి పాపచిత్తుఁడనై వజ్రధారల గర్భంబు విదళనంబు సేసిన నాశకలంబులు సెడక మహాశ్చర్యంబుగా నివ్విధంబునం గుమారకులైరి. మహాపురుష పూజాసంసిద్ధి కార్యానుషంగి గాకుండునే? భగవదారాధనంబుఁ గోరికలఁ బాసి యెవ్వరు గావింతురు, వారిహపరంబుల సర్వార్థకుశలు లగుదురు; అ మ్మహాపురుష వ్రతసముత్పన్న తేజంబు నడంప నెవ్వండోపుఁ? గావున దుర్మదంబున బాలిశ స్వభావుండనై దోషంబు సేసిన నా దౌర్జన్యకర్మంబు సహింపఁ దల్లికన్న నెవ్వరు సమర్థులు? పాపాత్ముండ నగు నన్నుం గావుము; నేను వీరలతోడివాఁడ నని నిష్కపటంబుగాఁ బ్రార్థించిన నద్దేవి యట్లగాక యని శాంతచిత్త యయ్యె; నింద్రుండును వారలం గూడి త్రిదివంబునకుం బోయి సోమపాన హవిర్భాగంబులు వారలకుం బంచిపెట్టి కూడి సుఖంబుండె నని చెప్పి పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండు వెండియు నిట్లనియె. 524**

**ప్రతి :** అందఱు= ఆ నలబై తొమ్మిది మంది బిడ్డలు; ముకుళిత కరకమలులై= ముడిచిన పద్మాలవంటి హస్తాలతో (నమస్కరించి); నీకున్= ఇంద్రుడవైన నీకు; తోడన్ పుట్టువులము= తోడుగా జన్మించినవారము; మమ్మున్= మమ్ములను; హింసింపన్= బాధపెట్టవలసిన; పనిలేదు= అవసరం లేదు; నీకున్= నీకు; పారిషదులమై= పరిషత్తులోని వారమై (నీకు సభ్యులుగా); మరుద్గణములమై= 'మరుత్తులు' అను సమూహమై; నిన్ను సేవించెదము= నీకు సేవ చేస్తాము; మమ్ము రక్షింపుము= మమ్ములను కాపాడు; అనినన్= అనగా; నారాయణ ప్రసాదంబునన్= శ్రీమన్నారాయణుని దయవలన; చెడని= కీడుపొందని; మరుద్గణంబుల= మరుత్ గణాలయొక్క; పలుకులకున్= మాటలకు; కృపాళుండై= దయగలవాడై; ఇంద్రుండు= ఇంద్రుడు; వారలన్సహోదరులన్కాన్= వారిని సోదరులుగా; కైకొని= స్వీకరించి; మఱి= ఆ పైన; హింసింపకమానెన్= బాధించటం ఆపివేశాడు; అశ్వత్థామ శర+అగ్నివలనన్= ద్రోణపుత్రుడైన అశ్వత్థామయొక్క బ్రహ్మశిరోనామక అస్త్రంనుండి ఉద్భవించిన అగ్నినుండి; నారాయణ రక్షితుండవు అయిన= శ్రీమన్నారాయణునిచే రక్షియబడిన; నీవునున్ పోలెన్= పరీక్షిత్తువయిన నీవలె; కులిశధారలన్= వజ్రాయుధంయొక్క అంచులచేత; శకలంబులు అయిన= ముక్కలైన; కుమారులు= పుత్రులు; అన్ని రూపంబులై= నలబై తొమ్మిది రూపాలుగా; సంవత్సరంబునకున్= పండ్రెండు నెలలకు; ఒక్కింత కడమగా= కొంతకాలం తక్కువగా; హరిన్ పూజించినన్= శ్రీ విష్ణుమూర్తిని అర్చించగా; ఉద్భవించినవారు కావునన్= జన్మించినవారు కాబట్టి; ఇంద్రతోడన్ కూడన్= ఇంద్రునితో కలిసి; ఏక ఊన పంచాశత్ దేవతలయిన= ఒకటి తక్కువ యాభై సంఖ్యగల దేవతలుగా మారి (నలబై తొమ్మిదిమంది దేవతలై) దితిగర్భంబునుండి= దితి కడుపులో నుండి; వెలువడిరి= బయటకు వచ్చారు; అంతన్= అంతట; దితి మేల్కాంచి= దితి మేలుకొని; అనల ప్రకాశులై= అగ్నివలె కాంతిగలవారై; ఇంద్రు తోడన్ కూడి= ఇంద్రునితో కలిసి; వెలుంగుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; కుమారులన్ చూచి= పుత్రులను చూచి; సంతోషింపక= ఆనందపడక; ఇంద్రున్ చూచి= ఇంద్రుణ్ణి చూచి; నీకు; మృత్యు రూపంబయిన= మరణ రూపమైన; పుత్త్రున్కోరి= కొడుకును కోరుకొని; దుస్తరంబయిన= దాటుటకు వీలులేని (ఆచరించుటకు అతికష్టమైన) వ్రతంబు సలిపితి= వ్రతం చేశాను; సంకల్పించిన= నేను కోరుకొన్న; పుత్త్రుండొక్కరుండు= ఒక్క పుత్రుడు; ఈ సప్త సప్త

సంఖ్యలన్+కల= ఈ ఏడు ఏడు సంఖ్యలుగల (నలభై తొమ్మిదిమందిగా) కుమారులు; అగుటకున్= కావడానికి; ఏమి కతంబు= కారణం ఏమిటి?; నీవు ఎఱింగిన భంగిన్= నీకు తెలిసిన విధంగా; తథ్యంబు పలుకుము అనినన్= నిజం చెప్పుమనగా; ఇంద్రుండు ఇట్లు అనియెన్= ఇంద్రుడీవిధంగా బదులు పలికాడు; తల్లీ= ఓ జననీ!; భవత్ వ్రతంబున్= నీవు చేస్తున్న వ్రతాన్ని; చింతించి= యోచించి; సమయ విచ్ఛేదనంబునన్= ప్రతిజ్ఞాభంగం ఏర్పడగా (నియమం చెడిపోగా); గర్భంబు చొచ్చి= నీ గర్భంలోనికి ప్రవేశించి; పాపచిత్తుఁడనై= పాప సంకల్పంగల హృదయంతో; వజ్రధారలన్= వజ్రాయుధం యొక్క అంచులతో; గర్భంబు= గర్భాన్ని; విదళనంబు+చేసినన్= ఖండింపగా; ఆ శకలంబులు= ముక్కలు చేయబడ్డ ఆ శిశువుయొక్క ముక్కలు; చెడక= నశించక; మహా+ఆశ్చర్యంబుగాన్= ఎంతో విడ్డూరంగా; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; కుమారకులైరి= నలభై తొమ్మిదిమంది కుమారులుగా మారారు; మహాపురుష= గొప్పవారలయొక్క; పూజాసంసిద్ధి= పూజచేయటంలన కలిగిన ఫలితం; కార్య+అనుషంగి కాకుండునే= కార్యానికి అనుకూలమై ఉండకపోతుందా?; కోరికలన్ పాసి= మనసులో ఏ కోరికలూ కోరకుండా; భగవత్+ఆరాధనంబున్= భగవంతునియొక్క అర్చనను; ఎవ్వరు కావింతురు= ఎవరు ఆచరిస్తారో; వారు= అటువంటివారు; ఇహపరంబులన్= ఈ లోకంలోనూ పైలోకంలోనూ; సర్వ+అర్థ కుశలులు అగుదురు= సమస్త ప్రయోజనాలను పొందినవారవుతారు; ఆ+మహాపురుష= ఆ పురుషోత్తముడైన విష్ణువుయొక్క; వ్రత= వ్రతం చేయటంవల్ల; సముత్పన్న తేజంబున్= ఉద్భవించిన తేజస్సును; అడంపన్= నశింపచేయడానికి; ఎవ్వండు ఓపున్= ఎవడు సమర్థుడు కాగలడు?; కావునన్= కాబట్టి; దుర్మదంబునన్= దుష్టమైన మదంతో; బాలిశ స్వభావుండనై= మూర్ఖపుబుద్ధిగలవాడనై; దోషంబు చేసిన= తప్పు సలిపిన; నా దౌర్జన్యకర్మంబున్= నా ఈ దుర్మార్గపు పనిని; సహింపన్= సహించుటకు; తల్లికన్నన్= తల్లికంటె; ఎవ్వరు సమర్థులు= ఎవరు తగినవారు?; (తల్లివైన నీవే సహించగలవని భావం); పాప+ఆత్ముండన్ అగు= పాపస్వభావం కలవాడనైన; నన్నున్= నన్ను; కావుము= కాపాడు; నేను; వీరలతోడివాఁడన్= నీ కుమారులతో సమానుడను (సోదరతుల్యుడను); అని= అంటూ; నిష్కపటంబుగాన్= కపటంలేని విధంగా (స్వచ్ఛంగా); ప్రార్థించినన్= ప్రార్థన చేయగా; ఆ+దేవి= ఆ దితి; అట్లగాక అని= అలాగే అని; శాంతచిత్త అయ్యెన్= ప్రశాంతమైన హృదయంగలదైంది; ఇంద్రుండును= ఇంద్రుడుకూడా; వారలంగూడి= ఆ మరుద్గణంతో కలిసి; త్రిదివంబునకున్ పోయి= స్వర్గం చేరి; సోమపాన= సోమరసపానం; హవిర్భాగంబులు= హోమంచేసే హవిస్సులలోని భాగాలను; వారలకున్= ఆ మరుద్గణానికి; పంచిపెట్టి= పంచి ఇచ్చి; కూడి= ఆ మరుద్గణంతో కలిసి; సుఖంబు+ఉండెన్ అని= సుఖంగా ఉన్నాడని; చెప్పి= తెలియజెప్పి; పరీక్షిత్+నరేంద్రునకున్= పరీక్షిత్తు అనే రాజశ్రేష్ఠునకు; శుకయోగీంద్రుడు= యోగులలో శ్రేష్ఠుడైన శుకమహర్షి; వెండియున్= మరల; ఇట్లు అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇంద్రునిచేత ముక్కలు కావింపబడిన బిడ్డలు అందరూ ఇంద్రునికి చేతులు జోడించారు. 'మేము నీకు తోబుట్టువులం. మాకు కీడుచేయవలసిన పనిలేదు. మేము నీకు సేవకులమై 'మరుద్గణాలు' అనేపేరుతో నిన్ను సేవిస్తాం. మమ్మల్ని రక్షించు' అన్నారు. శ్రీమన్నారాయణుని దయవలన హాని పొందని మరుద్గణాల మాటలకు దయగలవాడై ఇంద్రుడు వారిని సహోదరులుగా స్వీకరించి హింసించడం మానుకున్నాడు.

ఓ పరీక్షన్మహారాజా! అశ్వత్థామ ప్రయోగించిన బాణాగ్నినుండి నారాయణునిచేత నీవు ఎలా రక్షింపబడ్డావో ఆ విధంగానే వజ్రాయుధం అంచులచేత ముక్కలైనవారు కూడా రక్షింపబడి ఆకృతులు ధరించి, కొద్దికాలం తక్కువగా సంవత్సరం పాటు విష్ణువును పూజించగా జన్మించినవారు గావున ఇంద్రునితోసహా నలభై తొమ్మిదిమంది మరుద్గణంగా దితిగర్భంనుండి పుట్టారు. అప్పుడు దితి మేలుకొని అగ్ని సమాన తేజస్సు కలిగి, ఇంద్రునితో సహా వెలుగొందుతూ ఉన్న కుమారులను చూచి సంతోషించకుండా ఇంద్రునితో ఇలా అన్నది.

నేను నీకు మృత్యువు కలిగించే కుమారుణ్ణి ఒక్కని కోరి అతి కష్టమైన వ్రతాన్ని ఆచరిస్తే నేను కోరిన రీతిగా ఒక పుత్రుడుగాక ఈ నలబై తొమ్మిదిమంది కుమారులు కలగటానికి కారణం ఏమిటి? నీకు తెలిసిన నిజాన్ని చెప్పు అని ఇంద్రుణ్ణి దితి ప్రశ్నించింది. ఇంద్రుడు దితికి బదులు చెప్పాడు. తల్లీ దితీ! నీవు చేస్తున్న కఠోరమైన వ్రతాన్ని, నీ కోరికను నేను గమనించాను. నీకు నియమభంగం ఎప్పుడవుతుందా! అని ఎదురుచూచి నీవు కాళ్ళూ చేతులూ కడుక్కోకుండా నిద్రించి నియమభంగం చేసినవేళ నీ గర్భంలో యోగమాయాబలంతో ప్రవేశించాను. పాపబుద్ధి కలిగి, వజ్రాయుధంతో నీ గర్భస్థ శిశువును ఖండించాను.

ఆశ్చర్యంగా ఆ బిడ్డ నా వజ్రఘాతానికి నశింపకుండా ఈ విధంగా నలబై తొమ్మిదిమంది కుమారులు అయ్యింది. అయినా మహాత్ములను పూజిస్తే కార్యసిద్ధి కలుగకుండా ఉండదు గదా! ఎవరు ఎటువంటి కోరికలూ లేక భగవదారాధన చేస్తారో వారు ఇహపరలోకాలలో అన్ని ప్రయోజనాలూ నిశ్చయంగా పొందుతారు.

ఆ మహాపురుషుడైన విష్ణుమూర్తియొక్క వ్రతాచరణంవల్ల జన్మించిన తేజస్సును ఎవ్వడు నివారించగలడు? దుష్టబుద్ధితో, మూర్ఖత్వంతో నేను చేసిన ఈ దోషాన్ని, ఈ దుర్మార్గాన్ని తల్లివైన నీవు తప్ప ఎవ్వరు క్షమించగలరు? పాపాత్ముడనైన నన్ను కాపాడు. నేను నీ పుత్రులతో సమానుడను అని మోసంలేకుండా స్వచ్ఛంగా మాట్లాడాడు ఇంద్రుడు. ఇంద్రుని ప్రార్థన విన్న దితి అట్లే అగుగాక అని శాంతమైన మనస్సుతో అంగీకరించింది.

ఇంద్రుడు మరుద్గణంతో స్వర్గానికి పోయి ఆ మరుద్గణానికి సోమపాన అర్హత, హవిర్భాగాన్ని గ్రహించడం అనే విషయాలు సమకూర్చి దితి పుత్రులకు ఎవ్వరికీ లేని గౌరవాన్ని ఇచ్చి సుఖంగా ఉన్నాడు అని చెప్పి పరీక్షిత్తుతో యోగీంద్రుడైన శుకమహర్షి మరల ఇలా అన్నాడు.

**క. హరి వరదుఁ డయిన వ్రతమఁట, హరి యంశజు లగుచు నెగడు నమరులజన్మ**
**స్ఫురణం బఁట! పఠియించిన, నరయఁగ నురుదీర్ఘపాపహరమగు టరుదే! 525**

**ప్రతి :** హరి= శ్రీమహావిష్ణువు; వరదుఁడయిన= వరములు ఇచ్చే; వ్రతమఁట= వ్రతమై ఉన్నది; హరి= విష్ణుమూర్తియొక్క; అంశజులగుచున్= అంశలనుండి పుట్టిన వారవుతూ; నెగడు= పెరుగుతున్న; అమరుల= దేవతలయొక్క; జన్మస్ఫురణంబఁట= జన్మను స్ఫురింపచేసేది; పఠియించినన్= చదివితే; అరయఁగన్= ఆలోచించగా; ఉరుదీర్ఘపాపహరము+అగుట= పెద్దదైన, అనేక జన్మార్జితమైన పాపం హరించిపోవటం; అరుదే= అరుదా!; (పాపం హరించిపోవుట నిశ్చయం కదా!)

**తా :** వరాలు ఇచ్చే విష్ణుమూర్తియొక్క వ్రతమై, విష్ణుమూర్తి అంశతో జన్మించిన దేవతలయొక్క ఆవిర్భావాన్ని స్ఫురింపచేస్తూ ఉన్న ఈ కథను పఠించినవారికి అనేక జన్మార్జిత పాపాలు హరించిపోవటం నిశ్చయం కదా!

**వ. అని విష్ణుకథాశ్రవణ కుతూహలాయమాన మానసులైన శౌనకాది మహామునులకు సూతుండు సెప్పెనని**
**శుకయోగీంద్రుండు పరీక్షిన్నరేంద్రునకుఁ జెప్పె ననుటయు. 526**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; విష్ణుకథాశ్రవణ= విష్ణువును గూర్చిన కథలను వినుటలో; కుతూహలాయమాన= అత్యంత ఆసక్తిని చూపుతున్న; మానసులైన= మనస్సులుగల; శౌనక+ఆది మహామునులకున్= శౌనకుడు మొదలైన మహామునులకు;

సూతుండు= పౌరాణికుడైన సూతుడు; చెప్పెను అని= వివరించి చెప్పాడు అని; శుకయోగీంద్రుండు= యోగివర్యుడైన శుకమహర్షి; పరీక్షిన్నర+ఇంద్రునకున్= రాజశ్రేష్ఠుడైన పరీక్షిత్తునకు; చెప్పెన్ అనుటయు= చెప్పాడు అని...

**తా :** ఈ విధంగా విష్ణుమూర్తియొక్క కథలను వినటంలో ఆసక్తిగల శౌనకాది మహామునులకు సూత పౌరాణికుడు చెప్పాడని పరీక్షిత్తునకు యోగివర్యుడైన శుకమహర్షి తెలియజేసి

**క. రాజీవరాజపూజ్య, శ్రీజిత గోపీకటాక్ష సేవాంతర వి**
**భ్రాజితమూర్తి! మదోద్ధత, రాజకులోత్సాద రామరాజాఖ్యనిధీ! 527**

**ప్రతి :** రాజీవరాజ= శ్రేష్ఠమైన పద్మాలచే; పూజ్య= పూజింపబడే; శ్రీ= సంపదచేత; జిత= జయింపబడిన; గోపీకటాక్ష= గోపికల కడకంటి చూపులయొక్క; సేవాంతర= సేవలచేత; విభ్రాజిత= ప్రకాశిస్తున్న; మూర్తి= రూపం గలవాడా!; మద+ఉద్ధత= మదంచే విజృంభించిన; రాజ= దుర్మార్గులైన రాజుల; కుల+ఉత్సాద= వంశాలను నిర్మూలించినవాడా; రామరాజ+ఆఖ్య= మహారాజైన రాముడనే పేరుగల; నిధీ= సంపదలకు నిలయమైనవాడా

**తా :** వికసించిన కమలాల కాంతులను జయించే కటాక్ష వీక్షణాలుగల గోపీజనులచే సేవింపబడే కాంతిమంతమైన ఆకృతికలవాడా! మదించిన రాజాధముల వంశాలను నిర్మూలించినవాడా! రామ నామంతో నిధియై అందరకూ సంపదలనిచ్చే వాడా!

**తరల. మురవిదారణ! ముఖ్య కారణ! మూలతత్త్వ విచారణా!**
**దురితతారణ! దుఃఖవారణ! దుర్మదాసుర మారణా!**
**గిరివిహారణ! కీర్తిపూరణ! కీర్తనీయ మహారణా!**
**ధరణిధారణ! ధర్మతారణ! తాపసస్తుతి పారణా! 528**

**ప్రతి :** మురవిదారణ= మురుడు అనే రాక్షసుణ్ణి సంహరించినవాడా!; ముఖ్యకారణ= సృష్టి స్థితిలయాలకు ప్రధానమైన కారణం అయినవాడా!; మూలతత్త్వవిచారణా= మూలతత్త్వ విచారణచేత తెలియదగినవాడా!; దురిత తారణ= పాపాలనుండి దాటించేవాడా!; దుఃఖవారణ= దుఃఖాలను నివారించేవాడా!; దుర్మద+అసురమారణా= మదాంధులైన రాక్షసులను సంహరించేవాడా!; గిరివిహారణ= గోవర్ధనగిరిపై విహరించేవాడా!; కీర్తిపూరణ= లోకాలలో వ్యాపించిన కీర్తిగలవాడా!;కీర్తనీయ మహారణా= స్తుతింపదగిన యుద్ధనైపుణ్యంగలవాడా!; ధరణి ధారణ= భూభారాన్ని వహించేవాడా!; ధర్మతారణ= ధర్మాలను దరికి చేర్చువాడా; తాపస స్తుతి పారణా= తాపసుల స్తోత్రాలకు పాత్రమైనవాడా!

**తా :** మురాసురుని సంహరించినవాడా! జగాలకు మూలకారణమైన వాడా! మూలతత్త్వ విచారణచేత తెలియదగినవాడా! పాపాలనుండి దాటించేవాడా! దుఃఖాలను నివారించేవాడా! దుర్మదరాక్షసులను సంహరించేవాడా! గిరివిహారం చేసేవాడా! లోకాలను కీర్తితో నింపినవాడా! కీర్తింపదగిన యుద్ధనైపుణ్యం గలవాడా! భూభారాన్ని వహించేవాడా! ధర్మాత్ములను దరికి చేర్చేవాడా! మునుల స్తుతులకు పాత్రమైనవాడా!

**విశే :** 'తరలము' అనే వృత్తానికి న, భ, ర, స, జ, జ, గ అనే గణాలు ఉంటాయి. యతి స్థానం – 12 వ అక్షరం. ప్రాస నియమం ఉన్నది.

**తోటకము.**

**కరుణాకర! శ్రీకర! కంబుకరా!, శరణాగత సంగత జాడ్యహరా!**
**పరిరక్షిత శిక్షిత భక్తమురా!, కరిరాజ శుభప్రద! కాంతిధరా!** **529**

**ప్రతి :** కరుణ+ఆకర= కరుణకు (దయకు) నిలయమైనవాడా! శ్రీకర= సంపదలను అందించేవాడా!; కంబుకరా= పాంచజన్యం అనే శంఖాన్ని చేత ధరించినవాడా! శరణ+ఆగత సంగత జాడ్యహరా= శరణని నిన్ను చేరిన వారి జడత్వాన్ని పోగొట్టేవాడా! పరిరక్షిత శిక్షిత భక్తమురా= ఆర్తులను రక్షించి మురాసురాదులను శిక్షించినవాడా!; కరిరాజ శుభప్రద= గజేంద్రునకు శుభం కలిగించినవాడా!; కాంతిధరా= దివ్యమైన తేజస్సును ధరించినవాడా!

**తా :** కరుణకు నిలయమైనవాడా! సంపదలు కలిగించేవాడా! శరణని చేరినవారికి చైతన్యం కలిగించేవాడా! ఆర్తులను రక్షించి మురాసురాదులను శిక్షించేవాడా! గజేంద్రునకు శుభాన్ని ప్రసాదించినవాడా! దివ్యతేజస్సును ధరించినవాడా!

**విశే :** ఇది 'తోటకం' అనే వృత్తం. ప్రతిపాదంలో నాలుగు 'స' గణాలు ఉంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాస నియమం ఉన్నది.

**గద్య.** ఇది సకల సుకవి జనమిత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర కనువయామాత్య పుత్త్ర బుధజన ప్రసంగానుషంగ సింగయ నామధేయ ప్రణీతంబైన శ్రీ మహాభాగవత పురాణంబునందు నజామిళోపాఖ్యానంబును, బ్రచేతసులఁ జంద్రుం డామంత్రణంబు సేయుటయు, దక్షోత్పత్తియుఁ, బ్రజాసర్గంబును, దక్షుండు శ్రీహరిం గూర్చి తపంబు సేయుటయు, నతనికి న ప్పరమేశ్వరుండు ప్రత్యక్షం బగుటయు, హర్యశ్వ కబళాశ్వుల జన్మంబును, వారలకు నారదుండు బోధించుటయు, నారదు వచనప్రకారంబున వారు మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబు నారదు వలన విని దక్షుండు దుఃఖాక్రాంతుం డగుటయుఁ, దదనంతరంబ బ్రహ్మ వరంబున దక్షుండు శబళాశ్వసంజ్ఞుల సహస్ర సంఖ్యాకులగు పుత్త్రులం గాంచుటయు, సృష్టినిర్మాణేచ్ఛా నిమిత్తంబున దక్షపంపున వార లగ్రజన్ములు సిద్ధింబొందిన దీర్ఘరాజంబైన నారాయణ సరస్సునకుం జనుటయు, వారికి నారదభగవంతుండు బ్రహ్మజ్ఞానంబు నుపదేశించుటయు, వారు పూర్వజు లేగిన ప్రకారంబున మోక్షంబు నొందుటయుఁ, దద్వృత్తాంతంబును దక్షుండు దివ్యజ్ఞానంబున నెఱింగి నారదోపదిష్టంబని తెలిసి నారదుని శపియించుటయు, నారదుండు దక్షుశాపంబు ప్రతిగ్రహించుటయుఁ, దక్షునకు మరల బ్రహ్మవరంబున సృష్టివిస్తారంబు కొఱకుఁ గూఁతులఱువండ్రు జనించుటయు, నందుఁ గశ్యపునకు నిచ్చిన పదమువ్వుర వలన సకల లోకంబులు నిండుటయు, దేవాసురనర తిర్యఙ్మృగఖగాదుల జన్మంబులును, దేవేంద్ర తిరస్కారంబున బృహస్పతి యధ్యాత్మ మాయచేతం గానరాకుండుటయుఁ, దద్వృత్తాంతంబు రాక్షసులు విని శుక్రోపదిష్టులై దేవతలపై నెత్తి వచ్చుటయు, దేవాసుర యుద్ధంబును, నాచార్య తిరస్కారంబున దివిజరాజ పలాయనంబును, బలాయమానులైన దేవతలు బ్రహ్మసన్నిధికిం జనుటయును, బ్రహ్మవాక్యంబునఁ ద్వష్టృ కుమారుం డయిన విశ్వరూపు నాచార్యునింగా దేవతలు వరించుటయును, విశ్వరూపు ప్రసాదంబున నింద్రుండు నారాయణవర్మంబను మంత్ర కవచంబు ధరియించి రాక్షసుల జయించుటయుఁ, బరోక్షంబున రాక్షసులకు ననుకూలుం డయిన విశ్వరూపు నింద్రుండు

**వధించుటయు, విశ్వరూప వధానంతరంబున నింద్రునకు బ్రహ్మహత్య సంప్రాప్తం బయిన నింద్రుండు స్త్రీ భూ జలద్రుమంబులయందుఁ బంచిపెట్టుటయు, విశ్వరూపుండు హతుం డగుటకుఁ ద్వష్ట కోపించి యింద్రవధార్థంబు మారణహోమంబు సేయ వృత్రాసురుండు జనియించుటయు, వృత్రాసుర యుద్ధంబునఁ బరాజితులై యింద్రసహితులైన దేవతలు శ్వేతద్వీపంబునకు ఁజనుటయు, నందు శ్రీహరి ప్రసన్నుండై దధీచి వలన భిదురంబు గైకొనుటయు, నింద్రుండు వజ్రాయుధంబున వృత్రుని సంహరించుటయు, నింద్రుండు బ్రహ్మ హత్యా పీడితుండై మానస సరస్సుఁ బ్రవేశించుటయు, నహుషుండు శతాశ్వమేధంబులం జేసి యింద్రాధిపత్యంబు వడయుటయు, నహుషుం డగస్త్య శాపంబున సురరాజ్య చ్యుతుండై యజగరయోనిం బుట్టుటయు, నింద్రాగమనంబును, నశ్వమేధంబును, నింద్రుండు త్రిలోకాధిపత్యంబు వడయుటయును, జిత్రకేతూపాఖ్యానంబును, మరుద్గణంబుల జన్మ ప్రకారంబును నను కథలం గల షష్ఠస్కంధము సంపూర్ణము.** **530**

**ప్రతి :** ఇది= ఈ రచింపబడిన గ్రంథం; సకల సుకవి జనమిత్ర= సుకవులకందరికీ, సజ్జనులకందరికీ మిత్రుడైన; శ్రీవత్సగోత్ర= శ్రీవత్సగోత్రుడైన; పవిత్ర= పవిత్రుడైన; కసువయ+అమాత్య పుత్ర= కసువయ అనువాని పుత్రుడైన; బుధజన= పండితజనుల; ప్రసంగ+అనుషంగ= ప్రసంగాలతో కూడిన; సింగయనామధేయ ప్రణీతంబైన= సింగయ అనే పేరుగల వానిచే రచింపబడిన; శ్రీ మహాభాగవతపురాణంబునందున్= శ్రీమహాభాగవతం అనే పురాణంలో; అజామిళోపాఖ్యానంబును= అజామిళుడు అనేవాని కథా; ప్రచేసులన్= ప్రచేతసులను; చంద్రుండు= చంద్రుడు; ఆ మంత్రణంబు చేయుటయున్= ఆహ్వానించడమూ; దక్ష+ఉత్పత్తియున్= దక్షుని జన్మమూ; ప్రజాసర్గంబును= ప్రజలను సృష్టించడమూ; దక్షుండు శ్రీహరింగూర్చి తపంబు చేయుటయున్= దక్షుడు శ్రీహరిని ఉద్దేశించి తపస్సు చేయడమూ; అతనికిన్= ఆ దక్షునకు; ఆ+పరమ+ఈశ్వరుండు= ఆ పరమాత్మ; ప్రత్యక్షంబు+అగుటయున్= కనులముందు కనిపించడమూ; హర్యశ్వ కబళాశ్వుల జన్మంబును= హర్యశ్వ కబళాశ్వులు జన్మించే వృత్తాంతమూ; వారలకు నారదుండు బోధించుటయు= హర్యశ్వ కబళాశ్వులకు నారదుడు జ్ఞానబోధ చేయడమూ; నారదు వచనప్రకారంబునన్= నారదుని మాటలను అనుసరించి; వారు మోక్షంబు నొందుటయున్= వారు మోక్షం పొందడమూ; తద్+వృత్తాంతంబున్= ఆ వృత్తాంతాన్ని; నారదువలన విని= నారదుని ద్వారా తెలుసుకొని; దక్షుండు= దక్షుడు; దుఃఖ+ఆక్రాంతుండగుటయున్= దుఃఖం పొందినవాడు కావటమూ; తత్+ అనంతరంబ= అటు తరువాత; బ్రహ్మవరంబునన్= బ్రహ్మయొక్క వరంచేత; దక్షుండు= దక్షుడు; శబళాశ్వసంజ్ఞులన్= శబళాశ్వులనే పేర్లుగల; సహస్ర సంఖ్యాకులగు= వేలమంది; పుత్రులన్ కాంచుటయు= కుమారులను పొందడమూ; సృష్టి నిర్మాణ+ఇచ్ఛా నిమిత్తంబునన్= సృష్టి నిర్మాణం చేయాలనే కోరికచేత; దక్షుపంపునన్= దక్షుడు పంపగా; వారలు= ఆ శబళాశ్వసంజ్ఞులైన పుత్రులు; అగ్రజన్ములు= తమ అన్నలు; సిద్ధిన్+పొందిన= సిద్ధిపొందిన; తీర్థరాజంబైన= శ్రేష్ఠతీర్థమైన; నారాయణ సరస్సునకున్= నారాయణ అనే పేరుగల సరోవరానికి; చనుటయు= వెళ్ళడమూ; వారికి; నారద భగవంతుండు= భగవంతుడైన నారదుడు; బ్రహ్మజ్ఞానంబున్ ఉపదేశించుటయు= బ్రహ్మజ్ఞానం ఉపదేశించడమూ; వారు= ఆ శబళాశ్వులనే వారు; పూర్వజులేగిన ప్రకారంబునన్= తమ అన్నలు వెళ్ళిన ప్రకారంగా; మోక్షంబున్+ఒందుటయున్= మోక్షం పొందుటమూ; తత్ వృత్తాంతంబును= ఆ విషయాన్ని; దక్షుండు= దక్షుడు; దివ్యజ్ఞానంబునన్= దివ్యజ్ఞానంతో; ఎఱింగి= గ్రహించి; నారద+ఉపదిష్టంబు అని= ఇది నారదోపదేశమని; తెలిసి= తెలుసుకొని; నారదుని శపించుటయు= నారదుని శపించడమూ;

నారదుండు= నారదుడు; దక్షుశాపంబు= దక్షుని శాపాన్ని; ప్రతిగ్రహించుటయున్= స్వీకరించటమూ; దక్షునకు; మరల= మరొకమారు; బ్రహ్మవరంబునన్= బ్రహ్మయొక్క వరంచేత; సృష్టి విస్తారంబుకొఱకున్= విశాలమైన సృష్టి చేయడానికి; కూఁతులఱువండ్రు= అరవైమంది కొమార్తెలు; జనించుటయున్= జన్మించడమూ; అందున్= ఆ అరవైమందిలో; కశ్యపునకున్= కశ్యపునికి; ఇచ్చిన పదమువ్వుర వలనన్= పెండ్లిచేసిన పదమూడుమందివల్ల; సకలలోకంబులు నిండుటయు= లోకాలన్నీ నిండడమూ; దేవ అసుర నర తిర్యక్ మృగ ఖగ+ఆదుల జన్మంబులును= దేవతల, రాక్షసుల, నరుల, పక్షుల, మృగాల, ఆకాశంలో ఎగిరే గద్దలు మొదలైన వాటియొక్క జనన విశేషాలూ; దేవేంద్ర తిరస్కారంబునన్= దేవేంద్రుడు తిరస్కరించటంచేత; బృహస్పతి; అధ్యాత్మమాయచేతన్= ఆధ్యాత్మికమైన మాయచేత; కానరాకుండుటయును= కనబడకుండా పోవడమూ; తత్ వృత్తాంతంబు= ఆ విషయం; రాక్షసులు విని= రాక్షసులు తెలుసుకొని; శుక్ర+ఉపదిష్టులై= రాక్షసగురువైన శుక్రాచార్యులచేత ఉపదేశింపబడినవారై; దేవతలపై నెత్తి వచ్చుటయు= దేవతలపై దండెత్తి రావడమూ; దేవ+అసురయుద్ధంబును= దేవతల రాక్షసుల యుద్ధమూ; ఆచార్య తిరస్కారంబునన్= దేవగురువైన బృహస్పతి తిరస్కరించటంచేత; దివిజరాజ పలాయనంబును= దేవతల అధిపతి అయిన ఇంద్రుడు పారిపోవటమూ; పలాయమానులైన దేవతలు= పారిపోయిన దేవతలు; బ్రహ్మ సన్నిధికిన్ చనుటయును= బ్రహ్మవద్దకు వెళ్ళటమూ; బ్రహ్మవాక్యంబునన్= బ్రహ్మ చెప్పిన మాటతో; త్వష్టృ కుమారుండయిన= త్వష్టయొక్క పుత్రుడైన; విశ్వరూపున్ ఆచార్యునిన్ కాన్= విశ్వరూపుడు అనేవాణ్ణి ఆచార్యుడుగా; దేవతలు వరించుటయును= దేవతలు స్వీకరించటమూ; విశ్వరూపు ప్రసాదంబునన్= విశ్వరూపుని దయచేత; ఇంద్రుడు; నారాయణ వర్మంబను= నారాయణ కవచమనే; మంత్ర కవచంబు ధరియించి= మంత్ర కవచాన్ని దాల్చి; రాక్షసుల జయించుటయున్= రక్కసులను జయించడమూ; పరోక్షంబునన్= చాటుగా; రాక్షసులకున్ అనుకూలుండయిన= రక్కసుల పక్షానికి సహాయంచేసే; విశ్వరూపున్= విశ్వరూపుణ్ణి; ఇంద్రుండు వధించుటయు= ఇంద్రుడు సంహరించటమూ; విశ్వరూపవధ+ అనంతరంబునన్= విశ్వరూపుని చంపిన తరువాత; ఇంద్రునకున్= దేవేంద్రునకు; బ్రహ్మహత్య సంప్రాప్తంబయినన్= బ్రహ్మహత్యాదోషం అంటుకోగా; ఇంద్రుండు= ఇంద్రుడు; స్త్రీ భూ జల ద్రుమంబులయందున్= స్త్రీలు, భూమి, నీరు, చెట్లు మొదలైన వాటియందు; పంచిపెట్టుటయు= పంచిపెట్టడమూ; విశ్వరూపుండు హతుండగుటకున్= విశ్వరూపుడు మరణించినందువల్ల; త్వష్టకోపించి= అతని తండ్రి త్వష్ట కోపం పొంది; ఇంద్ర వధ+అర్థంబు= ఇంద్రుని సంహరించడానికై; మారణహోమంబు చేయన్= ఒక మారణహోమాన్ని నిర్వర్తించగా; వృత్రాసురుండు= వృత్రాసురుడు; జనించుటయు= జన్మించడమూ; వృత్రాసుర యుద్ధంబునన్= వృత్రాసురుడు చేసిన యుద్ధంలో; పరాజితులై= ఓడిపోయి; ఇంద్ర సహితులైన దేవతలు= ఇంద్రునితోకూడిన దేవతలు; శ్వేత ద్వీపంబునకున్ చనుటయున్= శ్వేత ద్వీపానికి వెళ్ళడమూ; అందున్= ఆ శ్వేతద్వీపంలో; శ్రీహరి ప్రసన్నుండై= శ్రీ విష్ణుమూర్తి ప్రసన్నుడై; దధీచివలనన్= దధీచిమహర్షివల్ల; భిదురంబు గైకొనుటయున్= వజ్రాయుధం తీసికోవడమూ; ఇంద్రుండు= ఇంద్రుడు; వజ్రాయుధంబునన్= వజ్రాయుధంతో; వృత్రుని సంహరించుటయున్= వృత్రాసురుని చంపడమూ; ఇంద్రుండు= ఇంద్రుడు; బ్రహ్మహత్యా పీడితుండై= బ్రహ్మహత్యా దోషంచేత బాధింపబడినవాడై; మానస సరస్సునన్= మానససరోవరంలో; ప్రవేశించుటయు= ప్రవేశించడమూ; నహుషుండు= నహుషుడనే రాజు; శత అశ్వమేధంబులన్ చేసి= వంద అశ్వమేధయాగాలు నిర్వర్తించి; ఇంద్ర+అధిపత్యంబు పడయుటయు= ఇంద్రాధిపత్యాన్ని పొందడమూ; అగస్త్యశాపంబునన్= అగస్త్యమహర్షిశాపంచేత; సురరాజ్యచ్యుతుండై= దేవలోకరాజ్యంనుండి జారి భ్రష్టుడై; అజగరయోనిన్ పుట్టుటయున్= కొండచిలువగా జన్మించటమూ; ఇంద్ర+ఆగమనంబును= ఇంద్రుడు మానస సరోవరంనుండి తిరిగి రావడమూ; అశ్వమేధంబును= ఇంద్రుడు అశ్వమేధయాగం చేయటమూ; ఇంద్రుండు త్రిలోక+ఆధిపత్యంబు పడయుటయును=

ఇంద్రుడు భూలోక పాతాళలోక స్వర్లోకాలనే మూడులోకాలకూ ప్రభువు కావడమూ; చిత్రకేతు+ ఉపాఖ్యానంబును= చిత్రకేతుని ఉపకథా; మరుద్గణంబుల జన్మ ప్రకారంబును= మరుద్గణములు ఆవిర్భవించిన తీరు; అను కథలన్ కల= అనే కథలతో ఒప్పుతున్న; షష్ఠ స్కంధము= ఆరవ స్కంధం; సంపూర్ణము= పరిపూర్ణమయింది.

**తా :** ఇది సకల సుకవిజనులకు మిత్రుడు, శ్రీవత్స గోత్రుడు, కసువయామాత్యుని పుత్రుడు, పండితుల సాహిత్య ప్రసంగాలతో కూడి ఉండేవాడు అయిన సింగయ కవిచే రచింపబడిన శ్రీమహాభాగవత పురాణంలో అజామిళోపాఖ్యానం, ప్రచేతసులను చంద్రుడు ఆమంత్రణం చేయటం, దక్షప్రజాపతి జననం, ప్రజలను సృష్టించటం, దక్షుడు శ్రీమన్నారాయణుని గూర్చి తపస్సు చేయటం, అతనికి ఆ పరమాత్మ ప్రత్యక్షం కావటం, హర్యశ్వకబళాశ్వుల జననం, వారికి నారదుని ప్రబోధం, నారదోపదేశంతో వారు మోక్షం పొందడం, ఆ వృత్తాంతం నారదుని ద్వారా విని దక్షుడు బాధపడటం, తరువాత బ్రహ్మయొక్క వరంచేత దక్షుడు శబళాశ్వులనే వేయిమంది పుత్రులను పొందడం, సృష్టి చేయాలనే కోరికతో ఆ శబళాశ్వులు దక్షుని ఆజ్ఞను గైకొని తమ అన్నలు సిద్ధిపొందిన నారాయణ సరస్సునకు పోవడం, వారికి భగవంతుడైన నారదుడు బ్రహ్మజ్ఞానం బోధించడం, వారు తమ అన్నలు పొందిన రీతిగానే మోక్షం పొందడం, దివ్యజ్ఞానంతో దక్షుడు ఈ విషయాన్ని గ్రహించి నారదుని శపించడం, నారదుడు దక్షుని శాపాన్ని స్వీకరించడం. దక్షునకు మరల బ్రహ్మవరంచే సృష్టి చేయడంకోసం అరవైమంది కుమార్తెలు కలుగడం, ఆ అరవైమందిలో పదమూడు మందిని కశ్యపునకిచ్చి వివాహం చేయడం, వారివల్ల లోకాలన్నీ జీవజాలంతో నిండడం, దేవ, దానవ, నర, పక్షి, మృగ, ఖగాదుల ఉత్పత్తి ప్రకారం, దేవేంద్రుడు అగౌరవపరచటంతో బృహస్పతి అదృశ్యం కావడం, ఈ విషయాన్ని రాక్షసులు గ్రహించి తమ గురువైన శుక్రాచార్యుల ఉపదేశంతో దేవతలపై దండెత్తడం, దేవాసుర సంగ్రామం, గురు తిరస్కారంతో దేవేంద్రుడు పలాయనం కావడం, దేవతలు బ్రహ్మవద్దకు వెళ్ళి బ్రహ్మ అనుమతితో త్వష్టయొక్క కుమారుడైన విశ్వరూపుణ్ణి గురువుగా స్వీకరించడం, విశ్వరూపుడి దయతో ఇంద్రుడు నారాయణకవచాన్ని ధరించి ఆ మంత్రబలంతో రాక్షసులను జయించడం. పరోక్షంగా రాక్షసులకు అనుకూలంగా ప్రవర్తించే విశ్వరూపుణ్ణి ఇంద్రుడు సంహరించడం, విశ్వరూపుణ్ణి చంపటంవల్ల ఇంద్రునికి బ్రహ్మహత్యాదోషం అంటడం, ఆ దోషాన్ని ఇంద్రుడు స్త్రీలు, భూమి, జలం, వృక్షాలలో నిక్షిప్తం చేయడం, విశ్వరూపుని మరణానికి కోపించి అతని తండ్రి త్వష్ట ఇంద్రుణ్ణి వధించడంకోసం మారణహోమం చేయడం, అందుండి వృత్రాసురుడు జన్మించడం.

వృత్రాసురుడు చేసిన యుద్ధంలో దేవతలు ఓడిపోయి ఇంద్రునితో శ్వేతద్వీపం చేరడం, అక్కడ శ్రీహరి వారికి ప్రసన్నుడు కావడం, దధీచివలన వజ్రాయుధాన్ని పొందడం, ఇంద్రుడా వజ్రాయుధంతో వృత్రాసుర సంహారం చేయడం, ఇంద్రుడు బ్రహ్మహత్యా దోషనివారణకు మానససరోవరాన్ని చేరడం, నహుషుడు నూరు అశ్వమేధయాగాలు చేసి ఇంద్రపదవిని పొందడం, ఈ నహుషుడు అగస్త్యమహర్షి శాపంవల్ల దేవరాజ్యభ్రష్టుడై అజగరంగా జన్మించడం, ఇంద్రుడు స్వర్గానికి తిరిగిరావడం, అశ్వమేధం చేయడం, త్రిలోకాధిపత్యం పొందడం, చిత్రకేతుని కథ, మరుద్గణాలు జన్మించిన వృత్తాంతం అనే కథలుగల షష్ఠస్కంధం సంపూర్ణం.

***:: శ్రీకృష్ణార్పణమస్తు ::***

**పోతన గారి భాగవత పద్యాలు**

కలడంభోధి కలడు గాలి కలడాకాశంబునన్ కుంభినిం గలడు
అగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం గలడు
ఓంకారమునం త్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులం దంతటం గలడు
ఈశుండు గలండు తండ్రీ! వెదకంగా నేల నీ యాయెడన్ ॥

ఇందుగలడందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు
ఎందెందు వెదకి చూచిన అందందే కలడు దానవాగ్రణి వింటే ॥

నరసింహ

శ్రీరస్తు

# శ్రీమహాభాగవతము

## సప్తమస్కంధము

**శ్రీమద్విఖ్యాతి లతా, క్రామిత రోదోఽంతరాళ! కమనీయ మహా**
**జీమూతతులితదేహ, శ్యామలరుచిజాల! రామచంద్రనృపాలా! 1**

**ప్రతిపదార్థం :** శ్రీమత్= శోభాయుతమైన; విఖ్యాతి లతా= కీర్తి అనెడి లతచేత; ఆక్రామిత= ఆక్రమింపబడిన (నిండిన); రోదస్+అంతరాళ= ఆకాశముగలవాడా (విశ్వమంతటా వ్యాపించిన కీర్తిగలవాడా); కమనీయ= సుందరమైన; మహాజీమూత= గొప్పమేఘంతో; తులితదేహ= సమానమైన దేహంయొక్క; శ్యామల= నల్లని; రుచిజాల= కాంతి సమూహం గలవాడా!; రామచంద్రనృపాలా= ఓ రామచంద్ర ప్రభూ!

**తాత్పర్యం :** ఓ రామచంద్రప్రభూ! నీ కీర్తి విశ్వమంతా వ్యాపించింది. అందమైన గొప్పమేఘంతో సమానమైన నల్లని కాంతిగల నీకు నమస్కారం.

**వ. మహనీయగుణగరిష్ఠులగు నమ్మునిశ్రేష్ఠులకు నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుండయిన సూతుం డి ట్లనియె, నట్లు ప్రాయోపవిష్టుండయిన పరీక్షిన్నరేంద్రుండు శుకయోగీంద్రు నవలోకించి. 2**

**ప్రతి :** మహనీయ= గొప్పవైన; గుణ= గుణాలచే; గరిష్ఠులగు= గొప్పవారైన; ఆ+మునిశ్రేష్ఠులకు= ఆ మునులలో శ్రేష్ఠులైనవారికి; నిఖిల= సమస్త పురాణ= పురాణాలకు; వ్యాఖ్యాన= వివరించి చెప్పటంలో; వైఖరీ సమేతుండు+అయినన్= స్పష్టమైన భాషగలిగినట్టి సూతుండు+ఇట్లు+అనియెన్= సూతుడిలా అన్నాడు; అట్లు= ఆ విధంగా; ప్రాయః+ఉపవిష్టుండు+అయినన్= ప్రాయోపవేశదీక్ష వహించినటువంటి; పరీక్షిత్+నర+ఇంద్రుండు= పరీక్షిన్మహారాజు; శుకయోగి+ఇంద్రున్= శుకమహర్షిని; అవలోకించి= చూచి...

**తా :** సుగుణాలతో గొప్పవారైన ఆ మునీంద్రులకు సమస్త పురాణాలను వివరించటంలో దిట్ట అయిన సూతుడు ఇలా అన్నాడు. ఆ విధంగా ప్రాయోపవేశం చేసిన పరీక్షిన్మహారాజు శుకమహర్షిని చూచి,

**విశే :** మరణంకోసం అన్నికర్మలు వదలి ఉపవాసదీక్షలో ఉండడం.

### ❖ రాక్షసులపట్ల నారాయణునికి విరోధభావ మెందుకని పరీక్షిత్తు ప్రశ్నించుట ❖

**సీ. సర్వభూతములకు సముఁడు నెచ్చెలి ప్రియుం డైన వైకుంఠుఁ డనంతుఁ డాఢ్యుఁ**
**డింద్రుని కొఱకు దైత్యేంద్రుల నేటికి విషముని కైవడి వెదకి చంపె?**
**నసురులఁ జంపంగ నమరులచేఁ దన కయ్యెడి లాభ మింతైనఁ గలదె?**
**నిర్వాణ నాథుండు నిర్గుణుం డగు తన కసురుల వలని భయంబుఁ బగయుఁ**

**ఆ. గలుగ నేర, దట్టి ఘనుఁడు దైత్యులఁ జంపి, సురలఁ గాచుచునికి చోద్యమనుచు**
**సంశయంబు నాకు జనియించె! మునినాథ! ప్రజ్ఞ మెఱసి తెలియఁ బలుకవయ్య. 3**

**ప్రతి :** మునినాథ= ఓ మునిశ్రేష్ఠా! సర్వభూతములకు= సమస్త ప్రాణులకు; సముఁడు= సమానమైనవాడు (ప్రాణులందఱిని సమ దృష్టితో చూచేవాడు); నెచ్చెలి= స్నేహితుడు; ప్రియుండు+ఐన= ఇష్టుడు అయిన; వైకుంఠుఁడు= వైకుంఠమందున్న విష్ణువు; అనంతుఁడు= అంతంలేనివాడు; ఆద్యుఁడు= శ్రేష్ఠుడైన; ఇంద్రునికొఱకున్= అమరుల నాయకుడైన దేవేంద్రుని కోసం; దైత్య+ఇంద్రులన్= రాక్షసరాజులను; విషముని కైవడి= సముదు కానివిధంగా (విరోధిలాగా); ఏటికి= ఎందుకు; వెదకి= వెదకి; చంపెన్= చంపాడు?; అసురులన్= రాక్షసులను; చంపంగన్= చంపటంవల్ల; అమరులచేన్= దేవతలచేత; తనకున్= ఆ విష్ణుమూర్తికి; అయ్యెడిలాభము= జరిగే లాభము; ఇంతైనన్+కలదె?= కొంచెమైనా ఉన్నదా?; నిర్వాణనాథుండు= మోక్షాధినాథుడు; నిర్గుణుండు+అగు= గుణరహితుడు అయిన (సత్త్వగుణము రజోగుణము తమోగుణం అనేగుణాలు సోకని) తనకు= విష్ణువునకు; అసురలవలని= రాక్షసులవల్ల; భయంబున్= భయమునూ; పగయున్= ద్వేషమును; కలుగనేరదు= లేదుకదా!; అట్టి ఘనుఁడు= అటువంటి ఘనుడు; దైత్యులన్+చంపి= రాక్షసులను చంపి; సురలన్= దేవతలను; కాచుచునికి= కాపాడటం; చోద్యము+అనుచున్= వింత కదా అని; నాకు= నాకు; సంశయంబు జనియించెన్= సందేహం కలిగింది; ప్రజ్ఞమెఱసి= నీప్రజ్ఞ స్పష్టపడేవిధంగా; తెలియన్+పలుకవయ్య= నాకు తెలిసేటట్టు చెప్పు.

**తా :** ఓ మునిశ్రేష్ఠా! శుకమహర్షీ! వికుంఠలోకాధిపతి విష్ణుమూర్తి. అన్ని ప్రాణుల పట్ల సమబుద్ధిగలవాడు. స్నేహితుడు, ప్రియుడు, ఆద్యంతరహితుడు, శ్రేష్ఠుడు కదా! అటువంటి విష్ణుమూర్తి ఇంద్రుని కోసం రాక్షసరాజులను ఎందుకు విరోధి లాగా వెదకి చంపాడు? అలా రాక్షసులను చంపడంచేత దేవతలవల్ల తనకు కలిగే లాభం ఏమిటి? అటువంటి లాభం విష్ణువు కున్నదా? మోక్షసామ్రాజ్యాధిపతి, త్రిగుణాతీతుడు అయిన విష్ణుమూర్తికి రాక్షసులవల్ల భయంగాని, రాక్షసులపై పగగాని లేదు కదా! అటువంటి ఘనుడు రాక్షసులను చంపి, దేవతలను కాపాడటం నాకు వింతగా ఉన్నది. నాకు కలిగిన ఈ సందేహాన్ని నీ ప్రజ్ఞతో నాకు తెలిసే విధంగా తీర్చు.

**వ. అనిన శుకుం డిట్లనియె. 4**

**ప్రతి :** అనినన్= అని పలికిన పరీక్షిత్తుతో; శుకుండు+ఇట్లనియెన్= శుకమహర్షి ఇలా అన్నాడు.

**తా :** అలా పరీక్షిన్మహారాజు ప్రశ్నించగా శుకమహర్షి ఇలా అన్నాడు.

**శా. నీ సంప్రశ్నము వర్ణనీయము గదా, నిక్కంబు, రాజేంద్ర! ల**
**క్ష్మీ సంభావ్యుని సచ్చరిత్రము మహాచిత్రంబు చింతింపఁ, ద**
**ద్గాసాఖ్యానము లొప్పు విష్ణుచరణధ్యాన ప్రధానంబులై**
**శ్రీ సంధానములై మునీశ్వర వచో జేగీయమానంబులై. 5**

**ప్రతి :** రాజ+ఇంద్ర= ఓ రాజశ్రేష్ఠా!; నీ సంప్రశ్నము= తెలుసుకోవాలని నీవు వేసిన ఈ ప్రశ్న, గొప్ప సందేహంతో కూడిన ప్రశ్న; వర్ణనీయము+కదా= విపులంగా చెప్పవలసినది గదా; నిక్కంబు= ఇది సత్యము; లక్ష్మీసంభావ్యుని= లక్ష్మీదేవిచే గౌరవమునుపొందు (లోకమాత అయిన లక్ష్మిసేవించే) విష్ణుమూర్తియొక్క; సత్+చరిత్రము= గొప్పదైన చరిత్ర; చింతింపన్=

ఆలోచింపగా; మహాచిత్రంబు= గొప్ప ఆశ్చర్యాన్ని కల్గించేది; తద్+దాస+ఆఖ్యానములు= ఆ విష్ణుమూర్తి సేవకుల కథలు; విష్ణుచరణధ్యానప్రధానంబులు+ఐ= ఆ విష్ణుమూర్తియొక్క పదధ్యానమే ప్రధానంగా గలవై; శ్రీసంధానములు+ఐ= శోభను సంపదను కూర్చేవి అయి; మునీశ్వర= మునిశ్రేష్ఠుల; వచస్+జేగీయమానంబులు+ఐ= మాటలతో స్తుతింపబడి విరాజిల్లేవి అయి; ఒప్పున్= ఒప్పుతుంటాయి.

**తా :** ఓ పరీక్షిత్తూ! మహారాజా! నీవు వినయంతో తప్పక తెలిసికోవలననే కోరికతో అడిగిన ప్రశ్న నిజంగా వివరించి చెప్పవలసిందే కదా! ఆలోచిస్తే లక్ష్మీదేవిచేత నిరంతరం గౌరవించబడే ఆ మహనీయుని చరిత్ర మహావిచిత్రంగా విద్యూరంగా ఉంటుంది. ఆ విష్ణువుచరిత అలా ఉండగా; ఆయన దాసులైన భాగవతోత్తముల కథలు విష్ణుపదధ్యాన ప్రధానాలుగా, శోభతో ఐశ్వర్యప్రదాలై మోక్షప్రదాలై మునీశ్వరుల మాటలతో ప్రకాశించేవిగా ఉంటాయి.

**క. చిత్రంబులు త్రైలోక్య ప, విత్రంబులు భవలతా లవిత్రంబులు స**
**న్మిత్రంబులు మునిజన వన, చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్. 6**

**ప్రతి :** విష్ణుదేవు చారిత్రంబుల్= విష్ణుమూర్తి చరిత్రలు; చిత్రంబులు= చాలా చిత్రమైనవి (ఊహకు అంతుపట్టనివి); త్రైలోక్య= ముల్లోకాలలో; పవిత్రంబులు= శుచియైనవి పవిత్రమైనవి; భవలతా= సంసారమనే తీగకు; లవిత్రంబులు= కొడవళ్ళవంటివి; సన్మిత్రంబులు= చక్కని స్నేహితులు, మునిజనవన= మునిజనులనే వనాలకు; చైత్రంబులు= సంతోషాన్ని కలిగించే చైత్రమాసంవంటివి.

**తా :** శ్రీవిష్ణుదేవుని చరిత్రలు మూడులోకాలలోనూ పవిత్రమైనవి. మానవుల సంసారమనే తీగలను కోసి పారవేయగలిగే కొడవళ్ళ వంటివి. మంచి స్నేహితులవలె మేలు కల్గించేవి. మునిజనులనే వనాలకు ఆనందం కలిగించే చైత్రమాసం వంటివి.

**విశే :** చైత్రం వసంతర్తువులో వచ్చేది కనుక తోటలన్నీ చిగిర్చి సంతోషంగా ఉంటాయి. అట్లే విష్ణుదేవుని చరిత్రలు మునీశ్వరులకు సంతోషాన్ని కలిగిస్తాయని భావం.

**వ. నరేంద్రా! కృష్ణద్వైపాయనునకు నమస్కరించి హరికథనంబులు సెప్పెద వినుము. వ్యక్తుండు గాక, గుణంబులు లేక, ప్రకృతిం జెందక, భవంబుల నొందక పరమేశ్వరుండు దన మాయవలన నయిన గుణంబుల నావేశించి బాధ్య బాధకత్వంబుల నొందు, నతండు గుణరహితుండు, సత్త్వ రజ స్తమంబులు ప్రకృతి గుణంబు, లా గుణంబులకు నొక్కొక్క కాలంబున హాని వృద్ధులు గల, వా యీశ్వరుండు సత్త్వంబున దేవఋషులను, రజోగుణంబున నసురులను, దమోగుణంబున యక్ష రక్షోగణంబులను విభజించె. సూర్యుండు పెక్కెడలం గానంబడియు నొక్కరుండయిన తెఱంగునఁ దద్విభుండును సర్వగతుండయ్యును భిన్నుండు గాఁడు, తత్త్వ విదులయిన పెద్దలు తమలోనం బరమాత్మ స్వరూపంబున నున్న యీశ్వరు నవ్విధంబున నెఱుంగుదురు, జీవాత్మకుఁ బరుండైన సర్వమయుండు, దనమాయ చేత విశ్వంబు సృజియింపంగోరి రజంబును, గ్రీడింపంగోరి సత్త్వంబును, నిద్రింపంగోరి తమంబును నుత్పాదించి చరమైన కాలంబును సృజియించు, నా కాలంబున సర్వదర్శనుండయిన యీశ్వరుండును గాలాహ్వయుండునునై సత్త్వగుణంబయిన దేవానీకంబునకు వృద్ధియు, రజస్తమోగుణు లయిన రాక్షసులకు హానియుం జేయుచుండు. 7**

**ప్రతి :** నరేంద్రా= ఓ రాజా! కృష్ణద్వైపాయనునకున్= వ్యాసమహర్షికి; నమస్కరించి= చేతులు జోడించి; హరికథనంబులున్= విష్ణుమూర్తికి సంబంధించిన విషయాలను; చెప్పెద వినుము= వివరంగా చెప్తాను విను; వ్యక్తుండు+కాక= అందఱికి స్పష్టంగా తెలియక; గుణంబులులేక= సత్త్వరజస్తమో గుణాలతో సంబంధంలేక; ప్రకృతిన్+చెందక= ప్రకృతితో కలవక; భవంబులన్+ఒందక= జన్మం, సంసారం, మరణం అనేలక్షణాలు అంటక; పరమేశ్వరుండు= పరమాత్మ; తన మాయవలనన్+ అయిన= తన మాయచేనైన; గుణంబులన్+ఆవేశించి= త్రిగుణాలను ఆశ్రయించి; బాధ్య బాధకత్వంబులన్+ఒందున్= బాధింపబడేవాడు బాధించేవాడు అనే లక్షణాలను పొందుతాడు; అతండు= ఆ పరమాత్మ; గుణరహితుండు= త్రిగుణాలు లేనివాడు; సత్త్వరజస్తమంబులు= సత్త్వగుణం, రజోగుణం, తమోగుణం అనేవి; ప్రకృతి గుణంబులు= పరమాత్మకంటె వేరైన ప్రకృతికి సంబంధించిన లక్షణాలు; ఆ గుణంబులకున్= ఈ త్రిగుణాలకు; ఒక్కొకకాలంబునన్= ఒక్కొక్క సమయంలో; హానివృద్ధులు+కలవు= తక్కువ ఎక్కువలు కలుగుతాయి; ఆ+ఈశ్వరుండు= ఆ పరమాత్మ; సత్త్వంబునన్= సత్త్వగుణంతో; దేవఋషులను= దేవతలను ఋషులను; రజోగుణంబునన్= రజోగుణంతో; అసురులను= రాక్షసులను; తమోగుణంబునన్= తమోగుణంతో; యక్షరక్షోగణంబులను= యక్ష రాక్షస సమూహాలను; విభజించెన్= విభాగం చేశాడు; సూర్యుండు= సూర్యుడు; పెక్కు+ఎడలన్= ఎన్నోచోట్ల; కానన్+పడియున్= కనిపించికూడా; ఒక్కరుండు+అయిన తెఱంగునన్= ఒక్కడే అయినట్లుగా (ఒక్క సూర్యుడే ఎన్నో చోట్ల ఎన్నో సూర్యులుగా కనబడినట్లు); తద్+విభుండును= ఆ పరమాత్మకూడా; సర్వగతుండు+అయ్యును= అందఱిలో సర్వాంతర్యామిగావునప్పటికి; భిన్నుండు+కాఁడు= భిన్నమైనవాడుగాదు (అందరిలోను ఒకే పరమాత్మ); తత్త్వవిదులయిన పెద్దలు= ఈ తత్త్వాన్ని తెలిసికొన్న జ్ఞానులు; తమలోనన్= తమయందుగల; పరమాత్మ స్వరూపంబునన్= పరమాత్మ స్వరూపంతో; ఉన్న= ఉన్నట్టి; ఈశ్వరున్= పరమాత్మను; ఆ+విధంబునన్= ఆ విధంగా; ఎఱుంగుదురు= తెలిసికొంటారు; జీవాత్మకున్= జీవాత్మకు; పరుండు+ఐన= ఇతరుడైన (భిన్నుడైన); సర్వమయుండు= అందఱియందుండువాడు; తనమాయచేత= తనకుగల మాయాశక్తిచేత; విశ్వంబున్= ప్రపంచాన్ని; సృజియింపన్+కోరి= సృష్టించదలచి; రజంబును= రజోగుణాన్నీ; క్రీడింపన్+కోరి= క్రీడింపకోరుకొని; సత్త్వంబును= సత్త్వగుణాన్నీ; నిద్రింపన్+కోరి= నిద్రింపదలచి; తమంబునున్= తమోగుణాన్నీ; ఉత్పాదించి= ఉత్పత్తిచేసి (సత్త్వరజస్తమో గుణాలను ఉద్భవింపచేసి); చరమైన= కదలేస్వభావంగల (నిరంతర గమనశీలమైన); కాలంబును సృజియించున్= కాలాన్ని సృష్టిస్తాడు; ఆ కాలంబునన్= ఆ కాలంలో (ఆ కాలమనే గమనశీలశక్తిలో); సర్వదర్శనుండు+అయిన= అందరియందు కనబడే; ఈశ్వరుండును= పరమాత్మ; కాలాహ్వయుండునున్+ఐ= కాలం అనే పేరుతో పిలవబడుతూ; సత్త్వగుణంబు+అయిన= సత్త్వగుణంగల; దేవానీకంబునకు= దేవతా సమూహానికి; వృద్ధియున్= అభివృద్ధిని; రజస్+తమోగుణులు+అయిన= రజస్తమోగుణాలు కలిగిన; రాక్షసులకున్= రాక్షసులకు; హానియున్= కీడును; చేయుచు+ఉండున్= చేస్తూ ఉంటాడు.

**తా :** ఓ పరీక్షన్మహారాజా! వ్యాసమహర్షికి నమస్కరించి హరికి సంబంధించిన కథలు చెపుతాను విను. బయటకు వ్యక్తం కాకుండా, గుణరహితుడై, ప్రకృతితో కలవక, జన్మాది సంసారబంధాలలో చిక్కక, ఉండే పరమేశ్వరుడు తన మాయవల్ల పుట్టే సత్త్వరజస్తమోగుణాలను ఆశ్రయించి బాధింపబడేవాడు, బాధించేవాడుగా మారతాడు.

పరమాత్మ త్రిగుణాలు అంటనివాడు. సత్త్వరజస్తమోగుణాలు అనే ఈ త్రిగుణాలు ప్రకృతి గుణాలు. ఆ గుణాలకు ఒక్కొక్కకాలంలో హానీ వృద్ధీ కలుగుతూ ఉంటాయి. ఆ పరమాత్మ వృద్ధి క్షయాలు పొందే ఈ త్రిగుణాలలోని సత్త్వగుణంతో దేవ ఋషులను, రజోగుణంతో అసురులను, తమోగుణంతో రాక్షసులను యక్షులను సృష్టించి విభాగించాడు. ఒకే సూర్యుడు

పెక్కుచోట్ల వేరు వేరు సూర్యులుగా కనబడికూడా ఒక్కడే అయినట్లు, పరమాత్మ ప్రపంచగతుడై విభిన్నంగా కన్పడినా భిన్నుడు కాదు. తత్త్వం తెలిసిన జ్ఞానులు తమలో ఆత్మస్వరూపంగా ఉన్న ఈశ్వరుణ్ణి ఆ విధంగా తెలిసికొంటారు. జీవాత్మకంటె ఇతరుడై సర్వమయుడైన పరమాత్మ తన మాయతో విశ్వాన్ని సృష్టించాలని రజోగుణాన్ని, క్రీడించడం కోసం సత్త్వగుణాన్ని, నిద్రించడంకోసం తమోగుణాన్ని కల్పించి నిత్యగమనశీలమైన కాలాన్ని సృష్టించాడు. ఆ కాలంలో సర్వదర్శనుడైన పరమాత్మ కాలం అనే పేరుతో సత్త్వగుణంతో దేవతలకు వృద్ధిని, రజస్తమోగుణాలతో రాక్షసులకు హాని కలిగిస్తూ ఉంటాడు.

**క. జననాయక! యీ యర్థము, ఘన యశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్**
**మును నారదుండు సెప్పెను, వినిపించెద వినుము చెవులు విమలత నొందన్. 8**

**ప్రతి :** జననాయక!= ఓ రాజా! ఈ+అర్థము= ఈ విషయం; ఘనయశుఁడు+అగు= గొప్పకీర్తిగలిగినట్టి; ధర్మజునకున్= ధర్మరాజుకు; క్రతుకాలమునన్= యజ్ఞసమయంలో (రాజసూయయాగసమయంలో); మును= పూర్వం; నారదుండు+చెప్పెను= నారదుడు చెప్పాడు; చెవులు విమలతన్+ఒందన్= నీ చెవులు పవిత్రమయ్యే విధంగా; వినిపించెదన్= (ఆ విషయాలన్నీ) నీకు వినిపిస్తాను; వినుము= శ్రద్ధగా విను.

**తా :** ఓ పరీక్షిన్మహారాజా! ఈ విషయం అంతా యశస్సు (ఖ్యాతి)గల ధర్మరాజునకు రాజసూయ యాగసమయంలో నారదుడు వివరించి చెప్పాడు. నేను చెప్పే ఆ విషయాలను శ్రద్ధగా నీ చెవులు పవిత్రమయ్యేలా విను.

**వ. మున్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుం డైన శిశుపాలుండు హరిని నిందించి, నిశిత నిర్వక్రచక్రధారాదళితమస్తకుండయి తేజోరూపంబున వచ్చి హరి దేహంబు సొచ్చుటం జూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలో నున్న నారదునిం జూచి యిట్లనియె. 9**

**ప్రతి :** మున్ను= పూర్వము; ధర్మరాజు+చేయు= ధర్మరాజు చేస్తున్న; రాజసూయయాగంబునన్= రాజసూయ యాగంలో; బాలుండు+ఐన= ఏమీ తెలియని చిన్నవాడైన (శిశుపాలుడు సుగుణరహితుడు కావడం వల్ల వయస్సులో ప్రౌఢుడైనా, అజ్ఞానిగా చెప్పబడ్డాడు) శిశుపాలుండు= శిశుపాలుడు; హరిని= విష్ణుస్వరూపుడైన శ్రీకృష్ణుని; నిందించి= దూషించి; నిశిత= తీక్ష్ణమైన; నిర్వక్ర= ఎదురులేని తిన్ననైన; చక్ర= సుదర్శనచక్రం యొక్క; ధారా= అంచుచేత; దళిత= తెగగొట్టబడిన; మస్తకుండు+అయి= శిరస్సు గలవాడై; తేజస్+రూపంబునన్= కాంతి రూపంతో; వచ్చి= వెలుపలికి వచ్చి; హరిదేహంబున్= శ్రీకృష్ణునియొక్క శరీరంలో; చొచ్చుటన్+చూచి= ప్రవేశించడాన్ని చూచి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; ధర్మజుండు= ధర్మరాజు; సభలోన్+ఉన్న= రాజసూయ యాగసభలో ఉన్న; నారదునిన్= నారదుణ్ణి; చూచి= చూస్తూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** పూర్వం ధర్మరాజు చేసిన రాజసూయయాగంలో మూర్ఖుడైన శిశుపాలుడు శ్రీకృష్ణుని నిందించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు పదునైన ఎదురులేని చక్రంతో శిశుపాలుని శిరస్సు ఖండించగా, ఆ శిశుపాలుని శరీరంనుండి ఒక కాంతిరూపం వచ్చి శ్రీకృష్ణునిలో లీనం అవడంచూచి, ఆశ్చర్యపడుతూ ధర్మరాజు సభలోనున్న నారదునితో ఇలా అన్నాడు.

**ఆ. ఎట్టివారికైన నేకాంతులకు నైన, వచ్చి చొరఁగరాని వాసుదేవు**
**తత్త్వమందుఁ జేదిధరణీశుఁ డహితుఁడై, యెట్లు సొచ్చె మునివరేణ్య! నేఁడు. 10**

**ప్రతి :** మునివరేణ్య= మునిశ్రేష్ఠా! నారదా!; ఎట్టివారికైనన్= ఎటువంటివారికైనా; ఏకాంతులకున్+ఐనన్= విష్ణువును తప్ప ఇతర దేవతలను కొలువని అనన్య భక్తి తత్పరులే ఏకాంతులకైనా; వచ్చి చొరcగరాని= ప్రవేశించటానికి వీలులేని; వాసుదేవుతత్త్వమందున్= శ్రీకృష్ణుని తత్త్వంలో; నేcడు= ఈనాడు; అహితుcడు+ఐ= శత్రువైవుండికూడా; చేదిధరణీశుcడు= చేదివంశపురాజైన శిశుపాలుడు; ఎట్లు+చొచ్చెన్= ఏ విధంగా లీనమయ్యాడు.

**తా :** ఎటువంటి పండితులకైనా ఏకాంత భక్తిపరులకైనా చేరడానికి వీలులేని శ్రీకృష్ణతత్త్వంలో శత్రువై ఉండికూడా శిశుపాలుడు, నేడు ఎలా లీనమయ్యాడు? ఓ మునివరా! నారదా! తెలియజెప్పు.

**విశే :** ఏకాంతులు : దశవిధ వైష్ణవులలో ఏకాంతులు మొట్టమొదటివారు. రామాయణంలో రామునిపట్ల సీత, హనుమ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు, విభీషణ, సుగ్రీవులు, మహాభారతంలో విదుర, భీష్మ, కుంతి, ధర్మరాజాదులు, భాగవతంలో ప్రహ్లాదనారదాది పరమభాగవతులు; వీరిది అనన్య భక్తి. ఆత్యంతిక భక్తి. అహేతుక భక్తి. కైవల్యంకంటే కైంకర్యమే చేయాలనే భక్తి. ప్రతి ఫలాపేక్షలేని కేవలభక్తి కైంకర్యపరులు. ప్రహ్లాదుడు మొట్టమొదటి ఏకాంత భక్తుడు. మోక్షానికంటే కైంకర్యానికే ప్రాధాన్యమిచ్చేవారు – ఏకాంతులు.

**ఉ. వేనుcడు మాధవుం దెగడి విప్రులు దిట్టిన భగ్నుcడై తమో**
**లీనుcడు గాcడె? తొల్లి మదలిప్తుcడు చైద్యుcడు పిన్న నాcట నుం**
**దేనియు మాధవున్ విన సహింపcడు భక్తి వహింపc డట్టి వాc**
**డే నిబిడ ప్రభావమున నీ పరమేశ్వరునందుc జొచ్చెనో? 11**

**ప్రతి :** తొల్లి= పూర్వం; వేనుcడు= వేనుడు అనేపేరుగలరాజు; మాధవున్+తెగడి= విష్ణుమూర్తిని నిందించి; విప్రులు+తిట్టినన్= బ్రాహ్మణులు ఆ వేనుని నిందించినా; భగ్నుcడు+ఐ= తెగినవాడై (తనశక్తికోల్పోయి); తమః+లీనుcడు+కాcడె= తమస్సులో కూరుకుపోయాడు గదా (కాంతి విహీనుడై నశించాడు కదా); మదలిప్తుcడు= మదముతో నిండిన; చైద్యుcడు= చేదిదేశపురాజు శిశుపాలుడు; పిన్ననాcటనుండి+ఏనియున్= చిన్నతనంనుండి కూడా; మాధవున్= మాధవుడైన శ్రీకృష్ణుని; విన సహింపcడు= వినడానికికూడా ఓర్చుకోలేడు; భక్తివహింపcడు= శ్రీకృష్ణునిపై భక్తి చూపడు; అట్టివాcడు= అటువంటి శిశుపాలుడు; ఏ నిబిడప్రభావమునన్= ఏ బలమైన ప్రభావంతో; (ఏ శక్తితో); ఈ+పరమ+ఈశ్వరున్+అందున్= పరమాత్మ అయిన విష్ణుదేవునిలో; చొచ్చెనో= లీనమయ్యాడో!

**తా :** పూర్వం వేనుడనే రాజు విష్ణుమూర్తిని దూషించి, బ్రాహ్మణుల ఆగ్రహానికి గురై చీకటిలో కలిసి చరిత్ర హీనుడయ్యాడు కదా!. కాని మదం నిండిన ఈ శిశుపాలుడు చిన్ననాటినుండి శ్రీకృష్ణుని చరిత్రలు వినసహించనివాడు, కృష్ణభక్తి భావన పూననివాడుగా ఉండికూడా ఏ పుణ్య విశేషంచేత శ్రీకృష్ణపరమాత్మలో లీనమయ్యాడో కదా!

**మ. హరి సాధింతు, హరిన్ గ్రసింతు, హరిc బ్రాణాంతంబు నొందింతుc, దా**
**హరికిన్ వైరి నటంచు వీcడు పటురోషాయత్తుcడై యెప్పుడున్**
**దిరుగుం బ్రువ్వదు నోరు వ్రీలి పడ, దా దేహంబు దాహంబుతో**
**నరకప్రాప్తియు నొందc; డే క్రియ జగన్నాథుం బ్రవేశించెనో? 12**

**ప్రతి :** హరిసాధింతున్= హరిని సాధిస్తాను; హరిన్ గ్రసింతున్= హరిని మ్రింగివేస్తాను; హరిన్= ఆ శ్రీహరిని (శ్రీకృష్ణుని) ప్రాణ+అంతంబున్+ఒందింతున్= ప్రాణం తీస్తాను; తాన్= తాను; హరికిన్ వైరిన్+అటంచున్= శ్రీకృష్ణునికి శత్రువును అంటూ; వీఁడు= ఈ శిశుపాలుడు; పటురోష+ఆయత్తుఁడు+ఐ= మిక్కిలి రోషంగలవాడై; ఎప్పుడున్= ఎల్లప్పుడు; తిరుగున్= సంచరిస్తాడు; ప్రువ్వదునోరు= అలా దూషించిన శిశుపాలునినోట పురుగులుపడలేదు; వ్రీలిపడదు= పడిపోలేదు; ఆ దేహంబు= ఆ శిశుపాలుని శరీరము; దాహంబుతో= కాలుతూ; నరకప్రాప్తియున్+ఒందఁడు= అతడు నరకాన్ని కూడా పొందలేదు; ఏక్రియన్= ఏ విధంగా; జగత్+నాథున్= జగములకు అధిపతి అయిన శ్రీకృష్ణునిలో; ప్రవేశించెనో= లీనమయ్యాడో!

**తా :** శిశుపాలుడు ఎల్లప్పుడూ హరిని సాధిస్తాను. హరిని మ్రింగుతాను; హరి ప్రాణం తీస్తాను. నేను శ్రీకృష్ణుని శత్రువును అంటూ ఎంతో కోపంతో సంచరించేవాడు. అటువంటి శిశుపాలుని నోట పురుగులు పడలేదు. నోరు పడిపోలేదు. అతని మరణానంతరం శరీరం కాలిపోయి నరకాన్నీ పొందలేదు. అతడు ఏ విధంగా జగదీశ్వరుడైన శ్రీకృష్ణునిలో ప్రవేశించాడో కదా!

**విశే :** ఎప్పుడూ వైరభావంతో హరిని స్మరించడంవల్ల శిశుపాలుడు మరణానంతరం శ్రీకృష్ణునిలో ప్రవేశించాడు. ఇదే వైరభక్తి అంటారు.

**వ. అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరంతరంబు గోవిందు నిందసేయుదురు, నిఖిలజనులు సందర్శింప నేఁడు వీనికి విష్ణుసాయుజ్యంబు గలుగుట కేమి హేతువు? వినిపింపుము, పవనచలిత దీపశిఖయునుం బోలె నా హృదయంబు సంచలించుచున్న దనిన ధర్మనందనునకు నారదుం డిట్లనియె. దూషణభూషణ తిరస్కారంబులు శరీరంబునకుఁ గాని పరమాత్మకు లేవు, శరీరాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నేను, నాయది యనియెడు వైషమ్యంబును భూతంబులకు శరీరంబు నందు సంభవించు, అభిమానంబు బంధంబు. నిరభిమానుండై వధించినను వధంబు గాదు. కర్తృత్వ మొల్లని వానికి హింసయు సిద్ధింపదు. సర్వభూతాత్మకుండైన యీశ్వరునికి వైషమ్యంబు లేదు. గావున – 13**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక; దంతవక్త్రుండును= దంతవక్త్రుడు అనేవాడు; వీఁడును= ఈ శిశుపాలుడు కూడా; నిరంతరంబున్= ఎల్లప్పుడు; గోవిందు నిందసేయుదురు= గోవిందుని దూషిస్తూ ఉంటారు; నిఖిలజనులు= సమస్త జనులు; సందర్శింపన్= చూస్తూ ఉండగా; నేఁడు= ఈనాడు; వీనికిన్= ఈ శిశుపాలునకు; విష్ణుసాయుజ్యంబు= విష్ణువులో కలసిపోవుట; కలుగుటకు= పొందుటకు; ఏమి హేతువు= కారణం ఏమి; వినిపింపుము= తెలియచెప్పు; పవన చలిత= గాలిచే కదల్చబడిన; దీపశిఖయునున్+పోలెన్= దీపశిఖవలె; నా హృదయంబున్= నా మనసు; సంచలించుచున్నది= కదలాడుతుంది; అనినన్= అని పలికిన; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; నారదుండు+ఇట్లు+అనియెన్= నారదుడు ఇలా అన్నాడు; దూషణ భూషణ తిరస్కారంబులు= దూషించడం, ఆదరించడం, తిరస్కరించడం అనే ఈ లక్షణాలు; శరీరంబునకున్+కాని= శరీరానికే కాని; పరమాత్మకు లేవు= శరీరంకంటె భిన్నమైన పరమాత్మకు లేవు; శరీర+ అభిమానంబునన్+చేసి= శరీరంమీద ఉండే మమకారం కారణంగా; దండ వాక్పారుష్యంబులు= దండించడం కఠినంగా మాట్లాడటం అనేవి; హింసయై తోఁచు తెఱంగునన్= హింసగా తోచేట్లు; నేను నాయది అనియెడు= నేను నాది అనే;

వైషమ్యంబును= భేదభావం; భూతంబులకు= జీవులకు; శరీరంబున్+అందున్= శరీరంలో; సంభవించు= కలిగే; అభిమానంబు= నేను నాది అనే మమకారం; బంధంబు= బంధం; నిరభిమానుండు+ఐ= అభిమానంలేనివాడై; వధించినను= చంపినా; వధంబు గాదు= అది చంపబడదు; కర్తృత్వము= ఇది నా వల్లే అయింది అనే కర్తృత్వం; ఒల్లనివానికిన్= ఇష్టపడనివానికి; హింసయు సిద్ధింపదు= హింస అంటదు; సర్వభూత+ఆత్మకుండు+ఐన= అన్ని జీవులలో చైతన్యరూపంతో ప్రకాశించే; ఈశ్వరునికిన్= పరమాత్మకు; వైషమ్యంబు లేదు= విషమ భావం (భేదభావం)లేదు; కావున= కాబట్టి...

**తా :** అంతేకాకుండా, దంతవక్త్రుడు, శిశుపాలుడు ఎల్లపుడు శ్రీకృష్ణుని నిందిస్తూ ఉంటారు. సమస్తజనులు చూస్తూ ఉండగా ఈ రోజు ఈ శిశుపాలునకు విష్ణుసాయుజ్యం కలగడానికి కారణం ఏమిటి? నాకు వివరించు. గాలికి కదలాడే దీపం మాదిరిగా నా హృదయం చలిస్తోంది, అని పలికిన ధర్మరాజుతో నారదుడు ఇలా అన్నాడు.

దూషణం, భూషణం, తిరస్కరణం అనేవి శరీరానికి గాని పరమాత్మకు లేవు. శరీరంపై ఉండే అభిమానంవల్ల దండించడం, కఠినంగా మాట్లాడటం హింసగా తోస్తుంది. ఆ రీతిగా నేను నాది అనే భేదభావం, జీవులకు శరీరంవల్ల కలుగుతుంది. ఆ అభిమానం లేకుండా మమకార భావాన్ని విడిచి వధించినా కూడా అది వధ కాదు ఈ పని నా వల్లనే జరిగింది; ఈ పని జరగడానికి నేనే కారణం; నేను లేకుంటే ఈ పని జరిగి ఉండేది కాదు అనే కర్తృత్వ లక్షణం లేనివానికి హింస కూడా అంటదు. అన్ని జీవులలో ఉండే పరమాత్మకు ఎవరిపై ద్వేషం కాని ప్రేమ కాని ఉండవు. కాబట్టి

**ఆ. అలుకనైనఁ జెలిమి నైనఁ గామంబున, నైన బాంధవమున నైన భీతి**
**నైనఁ దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరిఁ, జేరవచ్చు వేఱు సేయఁ డతఁడు. 14**

**ప్రతి :** అలుకన్+ఐనన్= కోపంతోనైనా; చెలిమిన్+ఐనన్= స్నేహంతోనైనా; కామంబునన్+ఐన= కోరికతోనైనా; బాంధవమునన్+ఐనన్= చుట్టరికంతోనైన; భీతిన్+ఐనన్= భయంతోనైనా; తగిలి= తగులుకొని; తలఁపన్= స్మరింపగా; అఖిలాత్ముఁడు+అగున్= సర్వభూతాంతరాత్మకుడైనట్టి; హరిన్+చేరవచ్చున్= శ్రీహరిని చేరుకో వచ్చును; అతఁడు= ఆ శ్రీహరి; వేఱు+చేయఁడు= ఇతరునిగా చూడడు (పరాయివానిగా చూడడు)

**తా :** అఖిలాత్ముడైనవానిని శ్రీహరిని కోపంతో, స్నేహంతో, కామంతో, బంధుత్వంతో, భయంతో ఏ విధంగా తలచినా చేరవచ్చు. ఏ విధంగా శ్రీహరిని స్మరించినా అతడు స్మరించినవాడిని పరునిగా చూడడు.

**క. వైరానుబంధనంబునఁ, జేరిన చందమున విష్ణుఁ జిరతర భక్తిం**
**జేరఁగరా దని తోఁచును, నారాయణ భక్తియుక్తి నా చిత్తమునన్. 15**

**ప్రతి :** నా చిత్తమునన్= నా హృదయంలో (నా భావనలో); వైర+అనుబంధనంబునన్= శత్రుత్వముతో; విష్ణున్= విష్ణుమూర్తిని; చేరినచందమునన్= చేరినవిధంగా; నారాయణ భక్తియుక్తి= శ్రీమన్నారాయణునిపై భక్తితో కూడిన; చిరతర భక్తిన్= నిరంతర ప్రేమభావంతో; చేరఁగరాదని తోఁచును= చేరలేమని అనిపిస్తోంది.

**తా :** శ్రీ విష్ణుమూర్తిని వైరభావంతో చేరినట్లుగా నిరంతరం భక్తిభావంతో సేవించినా చేరలేమేమో అని నా మనస్సు కనిపిస్తుంది.

**క. కీటకముఁ దెచ్చి భ్రమరము, పాటవమున బంభ్రమింప భ్రాంతంబై త**
**త్కీటకము భ్రమరరూపముఁ, బాటించి వహించుఁగాదె భయయోగమునన్. 16**

**ప్రతి :** భయయోగమునన్= భయంవల్ల; భ్రమరము= తుమ్మెద; కీటకమున్+తెచ్చి= పురుగును తెచ్చి; పాటవమునన్= నేర్పుతో; బంభ్రమింపన్= చుట్టుతిరుగగా; భ్రాంతంబు+ఐ= భ్రాంతిని పొంది; తద్+కీటకము= ఆ పురుగు; భ్రమర రూపమున్= తన రూపాన్ని కాదని కీటకం ఆకారాన్ని; పాటించి వహించున్+కాదె= తాను పొందుతుంటుంది కదా!

**తా :** కీటకాన్ని తీసికొనివచ్చిన తుమ్మెద దానిచుట్టూ తిరుగుతుండగా, దాని ధ్వనిని విని విని భ్రాంతితో భయంతో ఆ పురుగు భ్రమరరూపాన్ని పొందుతూ ఉన్నట్లే భయభ్రాంతులు పొందినవారు వైరం గలవారు స్వామిని వేగంగా పొందుతారు.

**విశే :** తుమ్మెద కారణంగా కీటకం కూడా తుమ్మెద గుణాన్ని పొందుతుందని భావించాలి.

**వ. ఇవ్విధంబున** **17**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** పురుగు, భ్రమరంగా మారిన విధంగా

**శా. కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైర క్రియా**
**సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్**
**బ్రేమన్ మీరలు భక్తి నేము నిదె చక్రిం గంటి మెట్లైన ను**
**ద్దామ ధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్వచ్చు ధాత్రీశ్వరా!** **18**

**ప్రతి :** ధాత్రి+ఈశ్వరా= భూమీశ్వరా; ఓ పరీక్షిన్మహారాజా!; కామ+ఉత్కంఠతన్= కామంయొక్క ఆధిక్యంతో; గోపికల్= గోపికలు; భయమునన్= భయంతో; కంసుండు= కంసుడు; వైరక్రియాసామగ్రిన్= ద్వేషంతో కూడుకున్న కార్యకలాపాలతో; శిశుపాల ముఖ్యనృపతుల్= శిశుపాలుడు మొదలైన రాజులు; సంబంధులు+ఐ= బంధుత్వం గలవారై; వృష్ణులున్= వృష్ణివంశంవారైన యాదవులు; ప్రేమన్= ప్రేమతో; మీరలు= మీరందరు (ధర్మరాజాదులు అని భావం); భక్తిన్+ఏము= భక్తితో మేము (నారదాది మహర్షులు); ఇదె చక్రిన్+కంటిమి= ఈ విధంగా విష్ణుమూర్తిని కనుక్కో గలిగాము; ఎట్లైనన్= ఏ విధంగానైనా; ఉద్దామ= నిరంతరమైన; ధ్యానగరిష్ఠుఁడు+ఐనన్= ధ్యానంచే గొప్పవాడైనచో; హరిన్= విష్ణుమూర్తిని; చెందన్+వచ్చున్= పొందవచ్చును.

**తా :** ఓ మహారాజా! విష్ణుమూర్తిని (శ్రీకృష్ణుని) అధికమైన కామభావనతో గోపికలు, భయంతో కంసుడు, ద్వేషభావంతో శిశుపాలుడు మొదలైన రాజులు, బంధుత్వంతో యాదవులు, ప్రేమతో మీరు (ధర్మరాజాదులు), భక్తితో మేము (నారదాది మహర్షులము) కనులారా చూడగలిగాము. కాబట్టి, ఏ విధంగానైనా నిరంతర స్మరణవల్ల విష్ణువును చేరవచ్చునని తెలుస్తోంది.

## ❖ శ్రీహరి ద్వారపాలకులకు సనకాదుల వలన శాపంబు గల్గుట ❖

**వ. మఱియుం బెక్కండ్రు కామ ద్వేష భయ స్నేహ సేవాతిరేకంబులఁ జిత్తంబు హరిపరాయత్తంబుగాఁ జేసి తద్గతిం జెందిరి, హరి నుద్దేశించి క్రోధాదులైన ఏ నింటి లోపల నొక్కటియైన వేనునికి లేని నిమిత్తంబున నతండు వ్యర్థుండయ్యె. మీ తల్లికి చెలియలి కొడుకు లయిన శిశుపాల దంతవక్త్రులు దొల్లి విష్ణు మందిర**

**ద్వారపాలకులు విప్రశాపంబునఁ బదభ్రష్టులై భూతలంబునన్ జన్మించి, రనిన విని యుధిష్ఠిరుండు నారదుని కిట్లనియె.** **19**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; పెక్కండ్రు= చాలమంది; కామ= కామం చేత; ద్వేష= ద్వేషం చేత; భయ= భయం చేత; స్నేహ= స్నేహం చేత; సేవ+అతిరేకంబులన్= సేవలు చెయ్యడం ద్వారా; చిత్తంబున్= మనస్సును; హరిపర+ఆయత్తంబుగాన్+చేసి= హరిపైన మాత్రమే ఉంచి; తద్గతిన్+చెందిరి= ఆ హరి సాయుజ్యాన్ని చేరారు; హరిన్+ఉద్దేశించి= శ్రీవిష్ణుమూర్తిని గుఱించి; క్రోధ+ఆదులైన= కోపం మొదలైన; ఏనింటిలోపలన్= ఐదింటిలో; ఒక్కటి+ఐనా= ఒక్కటైనా; వేనునికి లేని నిమిత్తంబునన్= వేనుడు అనేవానికి లేనికారణంగా; అతండు= ఆ వేనుడు; వ్యర్థుండు+అయ్యెన్= వ్యర్థుడు అయ్యాడు; మీ తల్లికి= ధర్మరాజా! మీ తల్లికి!; చెలియలి కొడుకులయిన= చెల్లెలి కొడుకులు అయిన (నీ పినతల్లి కుమారులైన); శిశుపాల దంతవక్త్రులు= శిశుపాలుడు; దంతవక్త్రుడు అనేవారు; తొల్లి= పూర్వం; విష్ణుమందిర ద్వారపాలకులు= వైకుంఠంలోని విష్ణువు మందిరద్వారం వద్ద కావలికాసేవారు; విప్రశాపంబునన్= బ్రాహ్మణశాపం చేత; పదభ్రష్టులై= తమపదవులను పోగొట్టుకొని; భూతలంబునన్= భూమిపై; జన్మించిరి+అనినన్= జన్మించారు అనగా; విని= విన్న; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; నారదునకు+ఇట్లు+అనియెన్= నారదునితో ఇలా అన్నాడు.

**తా :** ధర్మరాజా చాలమంది కామం, ద్వేషం, భయం, స్నేహం, సేవ అనే లక్షణాలలో ఏదో ఒకటి మిక్కుటం కాగా శ్రీహరి సంబంధం పెట్టుకొని ఆయనలో ఐక్యమయ్యారు. శ్రీహరిని గూర్చి పైన చెప్పిన క్రోధాదులైదింటిలో ఒక్క లక్షణమైనను లేకపోవడంచేత వేనుడు వ్యర్థుడై భ్రష్టుడై నశించాడు.

మీ పినతల్లి కుమారులైన శిశుపాల దంతవక్త్రులు పూర్వం విష్ణుమూర్తి మందిరానికి ద్వారపాలకులు. బ్రాహ్మణశాపం వల్ల వారు వారి పదవులను కోల్పోయి భూలోకంలో జన్మించారు. అని నారదుడు చెప్పగా విని ధర్మరాజు నారదునితో ఇలా అన్నాడు.

**మ. అలుగం గారణ మేమి విప్రులకు? ము న్నా విప్రు లెవ్వారు? ని**
**శ్చలు లేకాంతులు నిర్జితేంద్రియులు నిస్సంసారు లీశాను వ**
**ర్తులు వైకుంఠ పురీనివాసు లన విందున్, వారి కెబ్భంగి నీ**
**ఖల జన్మంబులు వచ్చె? నారద! వినం గౌతూహలం బయ్యెడిన్.** **20**

**ప్రతి :** నారద!= ఓ నారద మహర్షీ! మున్ను= పూర్వం; విప్రులకున్= ఆ బ్రాహ్మణులు; అలుగన్+కారణమేమి= ఈ ద్వారపాలకులపై కోపించడానికి కారణంఏమిటి?; ఆ విప్రులు+ఎవ్వారు= ఆ బ్రాహ్మణులు ఎవరు?; వైకుంఠపురీనివాసులు+అనన్= వైకుంఠంలో నివసించేవారు అనగా; నిశ్చలులు= ద్వంద్వములకు చలించనివారు (కష్టసుఖాలు, శీతోష్ణాలు మొదలైన ద్వంద్వములకు చలించనివారు); ఏకాంతులు= (విష్ణువే పరతత్త్వంగా నమ్మి, ఆయననే ఆరాధించే అనన్య భక్తి పరులు); నిర్జిత+ఇంద్రియులు= జయింపబడిన ఇంద్రియాలు కలవారు; నిస్సంసారులు= భార్యాపుత్రాది సంసారబంధం లేనివారు; ఈశాను వర్తులు= పరమాత్మను అనుసరించి చరించేవారు; విందున్= ఈ ద్వారపాలకులను గూర్చి నేను విని ఉన్నాను; వారికి= అటువంటి ద్వారపాలకులకు; ఏ+భంగిన్= ఏ విధంగా; ఈ ఖలజన్మంబులు వచ్చెన్= ఈ నీచజన్మలు కలిగాయి?; వినన్= ఈ విషయాలను వివరంగా వినడానికి; కౌతూహలంబు+అయ్యెడిన్= కుతూహలంగా ఉంది.

**తా :** ఓ నారదా! బ్రాహ్మణోత్తములు ఈ ద్వారపాలకులపై కోపించడానికి కారణం ఏమిటి? ఆ విప్రులు ఎవరు? నిత్యవైకుంఠ నివాసులైన ఈ ద్వారపాలకులు సామాన్యులు కారని వీరు విష్ణువుపై స్థిరభక్తిగలవారు, విష్ణువే పరతత్త్వంగా ఆరాధించే అనన్య భక్తిపరులు, అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహం గలవారు, సంసారబంధానికి చిక్కనివారు, నిరంతరం పరమాత్మను అనుసరించి ప్రవర్తించేవారు అని నేను విని ఉన్నాను. అటువంటి వారికి ఇటువంటి నీచజన్మలు ఎలా ప్రాప్తించాయి. వినాలని కుతూహలంగా ఉంది (అన్నాడు ధర్మరాజు).

**వ. అనిన నారదుం డిట్లనియె. ఒక్కనాఁడు బ్రహ్మమానస పుత్త్రులైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబునందును సంచరించుచు, నై దా ఱేండ్ల ప్రాయంపు బాలకుల భావంబున దిగంబరులయి హరి మందిరంబునకు వచ్చి చొచ్చు నెడ, మొగసాల నున్న పురుషు లిరువురు వారలం జూచి 21**

**ప్రతి :** అనినన్= అలా ధర్మరాజు పలుకగా; నారదుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ఒక్క నాఁడు= ఒకరోజు; బ్రహ్మమానసపుత్త్రులైన= బ్రహ్మకు మానసపుత్త్రులుగా అవతరించిన; సనకసనందనాదులు= సనకుడు, సనందుడు మొదలగువారు; దైవయోగంబునన్= దైవవశాన; భువనత్రయంబున+అందునున్= ముల్లోకాలలోను; సంచరించుచున్= తిరుగుతూ; ఐదు+ఆఱేండ్ల ప్రాయంపు బాలకుల భావంబునన్= ఐదారేండ్ల పిల్లలవలె; అయి= దిక్+అంబరులు= దిక్కులే వస్త్రాలుగా గలవారు అంటే శరీరంపై వస్త్రాలు లేనివారై; హరి మందిరంబునకున్= విష్ణుమూర్తి నివసించే వైకుంఠానికి; వచ్చిచొచ్చున్+ఎడన్= వచ్చి ప్రవేశించేవేళ, మొగసాలన్+ఉన్న= ద్వారముందు వున్న; పురుషులు+ఇరువురు= ఇద్దరు పురుషులు; వారలన్+చూచి= సనక సనందాదులను చూచి...

**తా :** నారదుడు ధర్మరాజుతో ఇలా చెప్పాడు. ఒకనాడు బ్రహ్మమానస పుత్త్రులైన సనకసనందనాదులు దైవవశాన మూడులోకాలు తిరుగుతూ ఐదారేండ్ల బాలకులలాగా దిగంబరులై హరిమందిరం అయిన వైకుంఠానికి వచ్చారు. వాళ్లు లోనికి ప్రవేశించే సమయంలో ద్వారం ముందు కాపలా ఉన్న ఇద్దరు పురుషులు ఈ బాలకులను చూచి

**క. డింభకుల ననర్గళ వి, స్రంభకుల రమాధినాథసల్లాపసుఖా**
**రంభకుల ముక్తమానస, దంభకులం జొరఁగ నీక తరిమి రధీశా! 22**

**ప్రతి :** అధీశా= ఓ ధర్మరాజా!; డింభకులన్= బాలురను; అనర్గళ= అడ్డులేని; విస్రంభకులన్= నమ్మకం గలవారిని (భగవత్తత్త్వమందు నిరంతరం విశ్వాసం గలవారిని); రమ+అధినాథ= లక్ష్మీదేవికి భర్తయైన విష్ణుమూర్తియొక్క; సల్లాప= మంచిమాటలను (గుణవిశేషాలను) మాట్లాడడం; సుఖ+ఆరంభకులన్= ఆరంభం చేసేవారిని; ముక్తమానస దంభకులన్= మనసునందు విడువబడిన గర్వంగలవారలను; చొరఁగనీక= (విష్ణువున్న వైకుంఠమునకు) ప్రవేశించకుండా; తరిమిరి= తరిమివేశారు.

**తా :** ఓ ధర్మరాజా! మిక్కిలి దైవవిశ్వాసంతో, స్వామిగుణకీర్తనం ఆసక్తితో చేస్తూ, నిర్మల మనస్సుగల బాలరూపంతో, వున్న సనకసనందనాదులను, విష్ణుమూర్తి నివాసంలోనికి వెళ్ళనీయకుండా ఆ ద్వారపాలకులు తరిమివేశారు.

**క. వారించిన తమకంబున, వా రించుక నిలువలేక వడిఁ దిట్టిరి దౌ**
**వారికుల నసురయోని న, వారితులై పుట్టుఁడనుచు వసుధాధీశా! 23**

**ప్రతి :** వసుధ+అధీశా= భూపతీ, ధర్మరాజా!; వారించినన్= లోనికి వెళ్ళకుండా ద్వారపాలకులు అడ్డగించగా; తమకంబునన్= మోహంతో; వారు= ఆ సనకసనందనాదులు; నిలువలేక= సహింపజాలక; దౌవారికులన్= ద్వారరక్షకులను; అసురయోనిన్= రాక్షస గర్భాలలో; అవారితులై= తప్పక; పుట్టుఁడు+అనుచున్= పుట్టండి అని; వడిన్= వెంటనే; తిట్టిరి= శపించారు.

**తా :** ధర్మరాజా! ద్వారపాలకులు సనకసనందనాదులను లోనికి వెళ్ళకుండ అడ్డగించగా; విష్ణుదర్శనం చేసికోవాలన్న కుతూహలంతో ఉన్న విప్రులు సహించలేక "మీరు తప్పక రాక్షసయోనిలో జన్మింతురు గాక" అని ఆవేశంతో (తిట్టారు) శపించారు.

**వ. మఱియు నా పిన్న పెద్దలు వారలం జూచి 'మీర లీయెడ నుండ నర్హులు గారు. నారాయణ చరణమూలంబు విడిచి రజస్తమోగుణులైన రాక్షసయోనిం బుట్టుం"డని శపియించిన వారు నా శాపవశంబునఁ బదభ్రష్టులై కూలుచు మొఱలిడిన న మ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱం గరుణించి మూఁడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు మని నిర్దేశించి చని, రివ్విధంబున శాపహతులై హరిపార్శ్వ చరులైన పురుషు లిరువురు హిరణ్యకశిపు హిరణ్యాక్షులన దితికి జన్మించి, రందుఁ గనిష్ఠుండైన హిరణ్యాక్షుని హరి వరాహ రూపంబున సంహరించె, నగ్రజుండయిన హిరణ్యకశిపుండు నరసింహమూర్తి యయిన శ్రీహరిచేత విదళితుండయ్యె, నతని కొడుకు ప్రహ్లాదుండు దండ్రిచేత హింసితుం డయ్యును నారాయణ పరాయణుండై శాశ్వతుం డయ్యె, రెండవ భవంబునఁ గైకసి యను రాక్షసికి రావణ కుంభకర్ణులయి సంభవించిన, విశ్వంభరుండు రఘుకులంబున రాఘవుండయి యవతరించి వారల వధియించె, న మ్మహాత్ముని పరాక్రమంబులు మార్కండేయ ఋషివలన నెఱింగెదవు, తృతీయజన్మంబున మీ తల్లి చెలియలికి శిశుపాల దంతవక్త్రులన నుద్భవించి. 24**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; ఆ పిన్న పెద్దలు= వయసులో చిన్నవారైనా జ్ఞానంలో గొప్పవారు; వారలన్+చూచి= ఆ ద్వార పాలకులను రోషంతో చూచి; మీరల్+ఈయెడన్+ఉండన్= మీరు ఇక్కడ ఉండటానికి; అర్హులు+కారు= తగినవారు కారు; నారాయణ చరణమూలంబున్+విడిచి= నారాయణుని పాదాలకు నిలయమైన ఈ వైకుంఠాన్ని వదలిపెట్టి; రజస్+తమోగుణులు+ఐన= రజోగుణం, తమోగుణంగలిగిన; రాక్షసయోనిన్= రాక్షస యోనుల్లో; పుట్టుండు+అని= జన్మించండి అని; శపియించినన్= శాపం ఇవ్వగా; వారున్= ఆ ద్వారపాలకులు; శాపవశంబునన్= శాపంవల్ల; పదభ్రష్టులై= ద్వారపాలక పదవులను పోగొట్టుకొన్నవారై; కూలుచు= కూలిపోతూ; మొఱలు+ఇడినన్= ప్రార్థింపగా; ఆ+మహాత్ములు= ఆ సనకాదులు; దయాళువులు+ఐ= దయకలిగినవారై; క్రమ్మఱన్= తిరిగి; కరుణించి= దయదలచి; మూఁడుజన్మంబులకు= మూడు జన్మలవరకు; వైరంబునన్= వైరంతో; భగవత్సన్నిధానంబున్= భగవంతుని సాన్నిధ్యము; కలిగెడుమని= కలుగుతుందని; నిర్దేశించి చనిరి= నిర్ణయించి వెళ్ళిపోయారు; ఈ+విధంబునన్= ఈ విధంగా; శాపహతులు+ఐ= శాపాన్ని పొందినవారై; హరిపార్శ్వచరులు+ఐన= శ్రీహరి సమీపంలో సంచరించే; పురుషులు+ఇరువురు= ఆ ఇద్దరు ద్వారపాలకులు; హిరణ్యకశిపు హిరణ్యాక్షులు+అనన్= హిరణ్యకశిపుడు; హిరణ్యాక్షుడు అనే నామధేయాలతో; దితికి= దితి అనే కశ్యప ప్రజాపతి భార్యకు; జన్మించిరి= జన్మించారు; అందున్= వారిరువురిలో; కనిష్ఠుండు+ఐన= రెండవవాడు చిన్నవాడైన; హిరణ్యాక్షుని= హిరణ్యాక్షుడు అనేవానిని; హరి= విష్ణువు; వరాహరూపంబునన్= వరాహరూపంతో; సంహరించెన్= చంపివేశాడు; అగ్రజుండు+అయిన= అన్న అయిన; హిరణ్యకశిపుండు= హిరణ్యకశిపుడు; నరసింహమూర్తి+అయిన= నరసింహ స్వరూపాన్ని

ధరించిన; శ్రీహరిచేతన్= శ్రీవిష్ణుమూర్తిచేతిలో; విదళితుండు+అయ్యెన్= చంపబడ్డాడు; అతనికొడుకు= ఆ హిరణ్యకశిపుని కుమారుడు; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడనేవాడు; తండ్రిచేత= తన తండ్రిచేత; హింసితుండు+అయ్యును= హింసింపబడినప్పటికి; నారాయణ పరాయణుండు+ఐ= నారాయణుడైన విష్ణుమూర్తిపైనే పరమపూజ్య భక్తిభావం కలవాడై; శాశ్వతుండు+అయ్యెన్= శాశ్వతంగా పరమపదాన్ని; కీర్తినిపొందాడు; రెండవభవంబునన్= రెండవజన్మలో; కైకసియను రాక్షసికి= కైకసి అని పేరుగల రాక్షసికి; రావణకుంభకర్ణులు+అయి= రావణుడు, కుంభకర్ణుడుగా; సంభవించినన్= జన్మించగా; విశ్వంభరుండు= ఈ సమస్తవిశ్వాన్ని భరించే విష్ణుమూర్తి; రఘుకులంబునన్= రఘువంశంలో; రాఘవుండు+అయి= రాఘవుడై (శ్రీరామచంద్రుడై) అవతరించి= జన్మించి; వారలన్= ఆ రావణ కుంభకర్ణులను; వధియించెన్=సంహరించాడు; ఆ+మహాత్ముని పరాక్రమంబులు= ఆ శ్రీరామచంద్రుని శౌర్యపరాక్రమాలు; మార్కండేయ ఋషివలనన్= మార్కండేయ మహర్షివలన; ఎఱింగెదవు= తెలిసికొంటావు; తృతీయ జన్మంబునన్= మూడవ జన్మలో; మీ తల్లి చెలియలికి= మీ పిన తల్లికి; శిశుపాలదంతవక్త్రులు+అనన్= శిశుపాలుడు దంతవక్త్రుడు అనే పేర్లతో; ఉద్భవించి= జన్మించారు.

**తా :** బాలకులు జ్ఞానవృద్ధులు అయిన సనకసనందనాదులు ఆ ద్వారపాలకులను చూచి, మీరిద్దరు ఇక్కడ ఉండటానికి అర్హులు కారు. విష్ణుచరణాలను విడిచిపెట్టి రజోగుణతమోగుణాలు కలిగిన రాక్షసవంశంలో పుట్టుండని శపించారు. వారు ఆ శాపంవల్ల ద్వారపాలక పదవినుండి భ్రష్టులై, సనకసనందనాదులను ప్రార్థింపగా, ఆ మహాత్ములు దయగలవారై వెంటనే కరుణించి, “మీకు మూడు జన్మలలో విష్ణువుపై వైరంతో భగవత్ సాన్నిధ్యం లభిస్తుంది” అని చెప్పి వెళ్ళిపోయారు.

ఆ విధంగా శాపంవల్ల మొదటి జన్మలో ద్వారపాలకులు ఇద్దరూ దితికి హిరణ్యాక్ష హిరణ్యకశిపులనే పేర్లతో జన్మించారు. వారిద్దరిలో హిరణ్యాక్షుణ్ణి, హరి వరాహరూపంతో సంహరించాడు. హిరణ్యకశిపుడు నరసింహరూపం ధరించిన విష్ణువు చేతిలో మరణించాడు. ఆ హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు, తండ్రి హింసించినా కూడా మానకుండా నారాయణ పదార్చనాతత్పరుడై శాశ్వతకీర్తిని పరమపదాన్ని పొందాడు.

రెండవజన్మలో ఆ ద్వారపాలకులు కైకసి అనే రాక్షసికి, రావణ కుంభకర్ణులై జన్మించగా, విష్ణుమూర్తి రఘుకులంలో శ్రీరామచంద్రుడై అవతరించి వారిని సంహరించాడు. ఆ రాముని అమోఘపరాక్రమాన్ని మార్కండేయమహర్షి ద్వారా నీవు వింటావు.

పిదప మూడవజన్మలో వారిరువురు మీ పినతల్లికి శిశుపాలదంతవక్త్రులనే పేర్లతో జన్మించారు.

**శా. వక్రత్వం బెటు లేక పాయని మహావైరంబుతో నిత్య జా**
**తక్రోధ స్మరణంబులన్ విదళితోద్యత్పాపసంఘాతులై**
**చక్రచ్ఛిన్నశిరస్కులై మునివచశ్శాపావధిప్రాప్తులై**
**చక్రిం జెందిరి వారు పార్శ్వచరులై సారూప్యభావంబునన్. 25**

**ప్రతి :** వక్రత్వంబు+ఎటులేక= సూటిగా అయిన; (ఏమాత్రం తేడాలేక) పాయని= విడిచిపెట్టలేని; మహావైరంబుతో= తీవ్రమైన పగతో; నిత్యజాతక్రోధ= ఎప్పటికప్పుడే పుట్టే కోపం వల్ల; స్మరణంబులన్= ఆ విష్ణుమూర్తిని నిరంతరం స్మరించడంచేత; విదళిత+ఉద్యత్+పాపసంఘాతులు+ఐ= గొప్పగొప్పపాపాల సమూహాలన్నీ నశించగా; చక్రచ్ఛిన్న శిరస్కులై= చక్రంచేత శిరస్సులు ఖండింపబడగా; మునివచస్+శాప+అవధిప్రాప్తులు+ఐ= మునుల శాపాల గడువు పూర్తిగా అనుభవించి;

వారు= ఆ ద్వారపాలకులు; సారూప్యభావంబునన్= సారూప్యం అనే మోక్షలక్షణాన్నిపొంది; పార్శ్వచరులు+ఐ= శ్రీవిష్ణుమూర్తి సమీప సంచారులై; చక్రిన్+చెందిరి= విష్ణుమూర్తిని చేరారు.

**తా :** ఆ ద్వారపాలకులు మూడు జన్మలలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా, రావణ కుంభకర్ణులుగా, చివరగా శిశుపాల దంతవక్త్రులుగాను జన్మించి, తీవ్రమైన పగతో, విష్ణుమూర్తిపై ఎప్పుడూ క్రోధాన్ని చూపుతూ, ఆ కోపంలో నిత్యం ఆయననే స్మరిస్తూ, వారి పాపాలన్నీ ఆ విష్ణుస్మరణంతో నశించగా, శ్రీకృష్ణునిచక్రంచేత శిరస్సులు ఖండింపబడగా, అప్పటికి వారికి సనకసనందనాదులు ఇచ్చిన శాపంయొక్క గడువు పూర్తికాగా, వైకుంఠంలో విష్ణుమూర్తికి సమానమైన రూపాలతో సమీపవర్తులై చరించారు.

**వ. అనిన విని ధర్మనందనుం డిట్లనియె. 26**

**ప్రతి :** అనినన్= అని నారదుడు పలుకగా; విని= విన్న తర్వాత; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** అని నారదుడు పలుకగా విన్న ధర్మరాజు ఇలా అన్నాడు.

**క. బాలున్ హరిపద చింతా, శీలున్ సుగుణాలవాలు శ్రీమ న్మేధా**
**జాలున్ సంతోషింపక, యేలా శిక్షించె రాక్షసేంద్రుం డనఘా! 27**

**ప్రతి :** అనఘా= పాపరహితా! నారదా! రాక్షస+ఇంద్రుండు= రాక్షసరాజైన హిరణ్యకశిపుడు; బాలున్= చిన్నపిల్లవానిని; హరిపదచింతాశీలున్= విష్ణుమూర్తి పదధ్యానమే స్వభావంగా గలవానిని; సుగుణ+ఆలవాలున్= సుగుణాలకు నిలయమైనవానిని; శ్రీమన్+మేధా జాలున్= శ్రీమంతమైన బుద్ధిగలవానిని (జూచి); సంతోషింపక= ఆనందపడక; ఏలా= ఎందుకు; శిక్షించెన్= ఎందుకు శిక్షించాడు?

**తా :** ఓ మహాత్మా! నారదా! తన సుతుడు చిన్న వయసువాడు కదా! నిరంతరహరిపదధ్యానతత్పరుడు, గుణవంతుడు, మంచి బుద్ధిగలవాడు అయిన కుమారుని చూచి సంతోషించక, హిరణ్యకశిపుడు ఎందుకు శిక్షించాడు?

**క. పరిభూత వ్యథనంబులు, నిరుపమ సంసార జలధి నిర్మథనంబుల్**
**నరకేసరి కథనంబులు, పరిరక్షిత దేవ యక్ష ఫణి మిథునంబుల్. 28**

**ప్రతి :** నరకేసరి కథనంబులు= నరసింహమూర్తియొక్క కథలు; పరిభూతవ్యథనంబులు= బాధలను తొలగించేవి; నిరుపమ= పోల్చజాలని; సంసారజలధి= సంసారమనే సముద్రాన్ని; నిర్మథనంబుల్= పూర్తిగా చిలికేవి; దేవయక్ష ఫణి మిథునంబుల్= దేవతలు, యక్షులు, సర్పములు మొదలైన జాతులలోని స్త్రీపురుషులను; పరిరక్షిత= రక్షించే నేర్పుగలవి.

**తా :** నరసింహస్వామి చరిత్ర కథనాలు, అందరి వ్యథలను పోగొట్టగలవు. అగాధమైన సంసారసముద్రాన్ని పూర్తిగా మథించగల నేర్పుగలిగినవి. దేవతలు యక్షులు నాగులు మొదలైన సమస్త జాతుల స్త్రీపురుషులను రక్షించగలవి (కాబట్టి ఆ నరసింహుని గూర్చి వినాలన్న కుతూహలం ఈ పద్యంలో స్పష్టమవుతోంది.)

**వ. మునీంద్రా! వినిపింపు మనిన నారదుం డిట్లనియెఁ, కమలోదరుచేతం దన సహోదరుండు హతుం డయ్యె నని విని, హిరణ్యకశిపుండు రోష శోక దందహ్యమాన మానసుండయి ఘూర్ణిల్లుచు, నాభీల**

**దావదహనజ్వాలా కరాళంబులయిన విలోకన జాలంబుల గగనంబునం బొగ లెగయ నిరీక్షింపుచుఁ దటిల్ల తాంకుర సంకాశ ధగద్ధగిత దంత సందష్ట దశనచ్ఛదుండును, నదభ్ర భయంకర భ్రుకుటిత ఫాలభాగుండును, నిరంతరాక్రాంత దురంతవైర వేగుండును నై మహాప్రభాజాల జటాలంబగు శూలంబుఁ గేల నందుకొని, సభామండపంబున నిలువంబడి త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి ప్రముఖులైన దైత్య దానవుల నాలోకించి ఇట్లనియె. 29**

**ప్రతి :** మునీంద్రా= మునీంద్రా!; వినిపింపుము= వినిపించు; అనినన్= అనగా; నారదుండు+ఇట్లు+అనియెన్= నారదుడు ఇలా అన్నాడు; కమల+ఉదరుచేతన్= కమలము ఉదరమునందుగల విష్ణుమూర్తిచేత; తన సహోదరుండు= తన సోదరుడు; హతుండు+అయ్యెన్+అని విని= చంపబడ్డాడు అని విని; హిరణ్యకశిపుండు= హిరణ్యకశిపుడు; రోష= కోపంతో; శోక= దుఃఖంతో; దందహ్యమాన= బాగా కాలుతున్న; మానసుండు+అయి= మనసుగలవాడై; ఘూర్ణిల్లుచున్= సుడులు తిరుగుతూ; ఆభీలదావదహన జ్వాలా= భయంకరమైన కార్చిచ్చు మంటలవలె; కరాళంబులు+అయినన్= భీకరాలైన; విలోకన జాలంబులన్= చూపులతో; గగనంబునన్= ఆకాశంలో; పొగలు+ఎగయన్= పొగలు ఎగసినట్లుగా; నిరీక్షింపుచున్= చూస్తూ; తటిల్లత+అంకుర= విద్యుత్ లతలయొక్క మొలకల; సంకాశ= సమానమైన; ధగద్ధగిత= కాంతిచిందే; దంతసందష్ట= పండ్లతో కొరుకుడు పడుతున్న; దశనచ్ఛదుండునున్= పెదవి గలవాడును; అదభ్రభయంకర= మిక్కిలి భయంకరమైన; భ్రుకుటిత= బొమ ముడివేయబడిన; ఫాలభాగుండును= నుదుటి భాగం గలవాడును; నిరంతర= ఎల్లప్పుడు; ఆక్రాంత= ఆక్రమించబడిన; దురంత= అడ్డుకొనుటకు వీలులేని; వైరవేగుండునున్+ఐ= తీవ్రమైన ద్వేషం కలవాడై; మహాప్రభాజాల= గొప్పకాంతి సమూహంతో; జటాలంబు+అగు= జడలతో ఒప్పిన; శూలంబున్= శూలం అనే ఆయుధాన్ని; కేలన్+అందుకొని= చేతితో ధరించి; సభామండపంబునన్= సభామండపంలో; నిలువంబడి= నిలబడి; త్రిమస్తక= త్రిమస్తకుడు; త్రిలోచన= త్రిలోచనుడు, శకుని= శకుని, శంబర= శంబరుడు, శతబాహు= శతబాహుడు, నముచి= నముచి, హయగ్రీవ= హయగ్రీవుడు, పులోమ= పులోముడు; విప్రచిత్తి ప్రముఖులైన= విప్రచిత్తి మొదలైన; దైత్య దానవులన్+ఆలోకించి= రాక్షసులను చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** మునీంద్రా! నాకు వినిపించు అనగా నారదుడు ఇలా అన్నాడు. విష్ణుమూర్తి చేతిలో తన సోదరుడైన హిరణ్యాక్షుడు చనిపోయాడని విని, హిరణ్యకశిపుడు కోపంతో, దుఃఖంతో కుమిలిపోతూ భయంకరమైన కార్చిచ్చు జ్వాలలవంటి చూపులతో ఆకాశంలో పొగలు ఎగిసిపడేలాగా చూచి, మెరుపులు మెరుస్తున్నట్లుగా మిరుమిట్లు గొలిపేలా, పెదవులు కొరుకుతూ, కనుబొమలు ముడివడి భయం గొలిపే ఫాలభాగంతో, ఆపడానికి వీలులేని తీవ్రమైన కోపంతో కాంతులు చిందే శూలాన్ని చేతబట్టి, సభలో నిలబడి త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి మొదలైన రాక్షసులను చూచి ఇలా అన్నాడు.

**శా. నాకుం దమ్ముఁడు, మీకు నెచ్చెలి, రణన్యాయైకదక్షుండు బా**
**హాకుంఠీకృత దేవయక్షుఁడు హిరణ్యాక్షుండు, వానిన్ మహా**
**సౌకర్యాంగము దాల్చి దానవవధూ సౌకర్యముల్ నీఱుగా**
**వైకుంఠుండు వధించిపోయెనఁట! యీ వార్తాస్థితిన్ వింటిరే? 30**

**ప్రతి :** హిరణ్యాక్షుండు= హిరణ్యాక్షుడు; నాకున్+తమ్ముఁడు= నాకు సోదరుడు; మీకు= రాక్షసులైన మీకు; నెచ్చెలి= చెలికాడు (స్నేహితుడు); రణన్యాయ+ఏకదక్షుండు= యుద్ధ విద్యలో నేర్పరి; బాహా= బాహువులచే; కుంఠీకృత= మొక్కవోయేట్లు

చేయబడిన; దేవయక్షుఁడు= దేవతలు, యక్షులు కలవాడు; (తన బాహుబలంతో దేవతలను యక్షులను ఓడించినవాడు). వానిన్= అటువంటి హిరణ్యాక్షుని; వైకుంఠుండు= వైకుంఠవాసియైన విష్ణువు; మహా+సౌకర్య+అంగమున్+తాల్చి= గొప్ప సూకర శరీరాన్ని ధరించి; దానవవధూ సౌకర్యముల్= రాక్షసకాంతల సుఖములు; నీఱుగాన్= బూడిదకాగా (నశించిపోగా); వధించిపోయెనఁట= చంపి వెళ్ళిపోయాడట; ఈ వార్తాస్థితిన్= ఈ వృత్తాంత విధానాన్ని; వింటిరే= విన్నారా!

**తా :** ఓ దానవ మిత్రులారా! ఈ కఠోరవార్తను విన్నారా? నా సోదరుడు, మీ స్నేహితుడు, యుద్ధ విద్యానిపుణుడు బాహుబలంతో దేవయక్షులను ఓడించినవాడు అయిన హిరణ్యాక్షుణ్ణి, అతని భార్యల సౌఖ్యాలు వ్యర్థం అయ్యేలా శ్రీహరి మహావరాహరూపాన్ని ధరించి వధించి పోయాడట!

**విశే :** సూకరంయొక్క శరీరం (అంగం) సౌకర్యాంగం అనగా వరాహాకృతి అని అర్థం. 'దానవవధూసౌకర్యముల్' అనుచోట సౌకర్యములు అనగా సుఖములు అని అర్థం. 'సుకర' శబ్దంమీద, 'సూకర' శబ్దంమీద ఒకే తద్ధిత రూపంతో 'సౌకర్యం' ఏర్పడుతుంది.

**చ.** **వనముల నుండుఁ జొచ్చు మునివర్గములోపల ఘోణిగాఁడు, సం**
**జనన మెఱుంగ రెవ్వరును, జాడ యొకింతయు లేదు, తన్ను దా**
**సిన మఱి డాయు, వెంటఁబడి చిక్కక చిక్కఁడు, వీని నొక్క కీ**
**లున మన మెల్ల లోఁబడక లోఁబడఁ బట్టుకొనంగ వచ్చునే?** **31**

**ప్రతి :** ఘోణిగాఁడు= ఈ వరాహంగాడు / వరాహంకాడు (అంటే విష్ణువే); వనములన్+ఉండున్= అరణ్యాల్లో, తోటల్లో / నీళ్ళలో ఉంటాడు; మునివర్గములోపలన్+చొచ్చు= అగిసె చెట్ల మధ్యలో దూరుతాడు / మునిసమూహాల హృదయాలలో సంచరిస్తాడు; ఎవ్వరున్= ఎవ్వరైనా; సంజననము= పుట్టుకను; ఎఱుంగరు= తెలుసుకోలేరు; జాడ= అడుగుల గుర్తు; ఒకింతయు లేదు= ఎంతమాత్రమూ తెలియదు / భగవంతుని ఉనికి ఎంతమాత్రం తెలియదు; మఱి డాయును= తన్ను సమీపిస్తే ఎదుర్కొంటుంది / తనను (హరిని) సమీపిస్తే తాను మునులను చేరుతాడు; వెంటన్+పడి= వెనుకొని; చిక్కక= కృషిస్తే కాని / తపస్సుతో కృషిస్తే కాని; చిక్కడు= దొరకదు; వీనిన్; ఒక్కకీలునన్= ఒక ఉపాయంతో; మనము+ఎల్లన్= మనందరం; లోన్+పడక= లొంగకుండా; లోబడన్= మనకు లొంగునట్లుగా; పట్టుకొనన్+కన్+వచ్చునే= పట్టుకోవచ్చునా (పట్టుకోలేము) / మనమెల్లన్= మన మనస్సులన్నీ; లోబడక= అంతర్ముఖాలు కాకపోతే; పట్టుకొనంగవచ్చునే= హృదయంలో నిలుపుకోవచ్చునా.

**తా :** **1. వరాహరూపంగా** ఈ వరాహరూపంగాడు అడవులలో, నీళ్ళలో ఉంటాడు. అవిసె చెట్లలో చరిస్తాడు. ఇతడి పుట్టుక ఎవ్వరికీ తెలియదు. వీడి అడుగుల జాడలుకూడా తెలియవు. సమీపిస్తే ఎదుర్కొంటాడు, కృషిస్తేగాని దొరకడు. కనుక ఏదో ఒక ఉపాయంతో మనమందరం వాడికి దొరకకుండా వాడే మనకు దొరకాలంటే ఏం చేయాలి?

**2. విష్ణురూపంగా** ఘోణికాడు – ఇతడు సామాన్య వరాహం కాదు. నారాయణుడు కనుక ఎప్పుడూ నీళ్ళల్లోనే ఉంటాడు. మునీశ్వరుల హృదయాలలో సంచరిస్తాడు. ఇతని జన్మ కర్మ రహస్యాలు ఎవ్వరికీ తెలియవు. ఇతని ఉనికి ఒకింతయు ఎక్కడో తెలియదు. ఇతన్ని ఆశ్రయిస్తేనే ఇతడు లభిస్తాడు. మన మనస్సు ఈయనకు లోబడితేనే ఈయన మనకు దొరుకుతాడు.

**విశే :** జాగ్రత్తగా పరిశీలించి చూస్తే హిరణ్యకశిపుడు వరాహావతారాన్ని ధరించిన విష్ణువును నిందిస్తున్నట్లు కనిపిస్తున్నా పద్యంయొక్క ఆంతర్యంలో విష్ణుమూర్తి సర్వవ్యాపకత్వం అనే నిజస్థితి కన్పడుతుంది. 'ఘోణిగాఁడు' అన్న మాట నిందార్థకం. దానికిది వ్యంజకం. "వ్యాజస్తుతిర్ముఖేనిందా స్తుతిర్వారూఢిరన్యథా" పైకి నిందగా కన్పిస్తున్న ఈ పద్యంలో, అంతర్వాహినిగా విష్ణుతత్త్వం ప్రవహిస్తూంది. సంస్కృత మూలంలో లేని క్రొత్తపోకడగా ఈ పద్యం మనకు కానవస్తుంది.

**సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి మున్నీట మునిఁగిన మునుఁగుఁగాక,**
**యలయించి పెనఁగ నా యచలసంభ్రమమున కెఱఁగి వె న్నిచ్చిన నిచ్చుఁగాక,**
**జగడంబు సైఁపక సౌకర్య కాంక్షి యై యిలక్రింద నీఁగిన నీఁగుఁగాక,**
**క్రోధించి యటు గాక కొంత పౌరుషమున హరిభంగి నదరిన నదరుఁ గాక,**

**ఆ. కఠినశూలధారఁ గంఠంబు విదళించి, వాని శోణితమున వాఁడి మెఱసి**
**మత్సహోదరునకు మహిఁ దర్పణము సేసి, మెఱసి వత్తు, మీకు మేలు దెత్తు. 32**

**ప్రతి :** భుజశక్తిన్= భుజబలంతో; నాతోడన్= నాకు సమానంగా; పోరాడన్ శంకించి= యుద్ధం చేయటానికి భయపడి; మున్నీట మునిఁగినన్= సముద్రంలో మునిగినా; మునుఁగున్+కాక= మునగవచ్చు గాక; అలయించి= ప్రయత్నించి; పెనఁగన్= పెనుగులాడేవేళలో (యుద్ధం చేసే సమయంలో); నా+అచల సంభ్రమమునకున్= నా చలించని ఆటోపానికి; ఎఱఁగి= పరుగెత్తి; వెన్ను+ఇచ్చినన్= వెన్ను చూపి; ఓటమిని అంగీకరించినట్లుగా వెన్నిచ్చినా; ఇచ్చున్+కాక= ఇవ్వవచ్చుగాక; జగడంబు సైఁపక= యుద్ధాన్ని సహించక; సౌకర్యకాంక్షియై= సూకర (వరాహ) రూపంతో; ఇలక్రిందన్+ఈఁగినన్+ ఈఁగుగాక= భూమిక్రింది దాగిన దాగవచ్చును గాక; అటుగాక= ఆ విధంగా కాకుండా; క్రోధించి= కోపించి; కొంతపౌరుషమునన్= కొంత పౌరుషంతో (పురుషునిగా) హరిభంగిన్= సింహంవలె; అదరిన అదరుఁగాక= అతిశయించ వచ్చుగాక; కఠినశూలధారన్= కఠినమైన త్రిశూలంయొక్క అంచుతో; కంఠంబున్+విదళించి= కంఠాన్ని తెగగొట్టి (తలనరికి) వానిశోణితమునన్= ఆ విష్ణువుయొక్క రక్తంతో; వాఁడి మెఱసి= నాయొక్క వీరత్వము స్పష్టపడేలా; మత్సహోదరునకున్= నా సోదరుడైన హిరణ్యాక్షునికి; మహిన్= ఈ భూమిపై; తర్పణము+చేసి= తర్పణం గావించి; మెఱసివత్తున్= ప్రకాశించి వస్తాను; మీకు= రాక్షస మిత్రులైన మీ అందరికి; మేలుదెత్తు= క్షేమాన్ని కల్గిస్తాను.

**తా :** ఆ విష్ణుమూర్తి నాతో యుద్ధం చేయడానికి భయపడి భూమిపై నిలువలేక సముద్రంలో మునిగి (మత్స్యం మాదిరి) దాగవచ్చునుగాక. చలించని నా సంభ్రమానికి పరుగెత్తి వెన్నిచ్చి (తాబేలు) పారిపోవుగాక. నాతో పోరాడలేక సౌకర్యంగా (పంది) భూమికింద దాగిన దాగుగాక. ఈ పై విధములుగా కాకుండా పౌరుషంతో నాపై సింహం (నరసింహ రూపం) లాగా నాతో యుద్ధంచేసినా చేయుగాక. ఏది ఏ విధంగా జరిగినాసరే కఠినంగా, పదనుగా ఉండే నా శూలంతో విష్ణువు కంఠాన్ని తెగనరికి; వాని రక్తంతో నా సోదరుడైన హిరణ్యాక్షునికి తర్పణం చేసి నా ప్రతాపంతో తిరిగివస్తాను. ఓ రాక్షసమిత్రులారా! మీకు క్షేమాన్ని కలిగిస్తాను.

**విశే :** ఈ పద్యం పోతన కవిత్వచాతుర్యానికి తార్కాణం. హిరణ్యకశిపుని పలుకులలో పైకి విష్ణుమూర్తిపై గల క్రోధాన్ని తెలియజేస్తున్నట్లున్నా పరిశీలించి చూస్తే విష్ణుమూర్తియొక్క అవతార విశేషాలు ధ్వనిస్తాయి. అది ఎలాగో గమనిద్దాం. మొదటిపాదంలో **'మున్నీట మునిగిన మునుగుగాక'** అనేవాక్యం విష్ణుమూర్తియొక్క మత్స్యావతారాన్ని ధ్వనింపజేస్తుంది.

రెండవపాదంలో **'అచల సంభ్రమము'** అనేచోట 'అచలము' అను పదానికి 'పర్వతం' అనే అర్థం ప్రతీయమానమై **'వెన్నిచ్చిన ఇచ్చుగాక'** అనుచోట మంథర పర్వతాన్ని మోయడానికి 'వెన్నును ఇచ్చిన కూర్మావతారం' ధ్వనిస్తోంది.

మూడవపాదంలో **'సౌకర్యకాంక్షియై'** అనేచోట సూకరశబ్దం వరాహపర్యాయపదం గాబట్టి 'సౌకర్యకాంక్షియై' "యిలక్రింద నీఁగిన నీఁగుఁగాక" అను పదాలవల్ల ఇలను పైకెత్తిన వరాహావతారం స్ఫురిస్తోంది. నాల్గవపాదంలో **'కొంతపౌరుషమున'** అనుచోట కొంతమేర (నరుడు) పురుషుడుగా కన్పించి "హరిభంగి" అనే పదం ద్వారా "సింహం" స్ఫురించి సమీప 'నరసింహ' అవతారం ధ్వనిస్తోంది.

**క. ఖండిత మూలద్రుమమున, నెండిన విటపముల భంగి నితఁడు వడిన నా**
**ఖండల ముఖ్యులు వడుదురు, భండనమున నితఁడు దమకుఁ బ్రాణము లగుటన్. 33**

**ప్రతి :** ఖండిత మూలద్రుమమునన్= చెట్టుయొక్క మూలము (మొదలు) ఖండింపబడగా; ఎండిన విటపములభంగిన్= ఎండిపోయిన కొమ్మలవలె; ఇతఁడు+పడినన్= ఈ హరి పడిపోగా (మరణించగా); భండనమునన్= యుద్ధంలో; ఇతఁడు= ఈ విష్ణువు; తమకున్= తమకందరికి; ప్రాణములు+అగుటన్= ప్రాణం కావడంవల్ల; ఆఖండలముఖ్యులు= ఇంద్రాదులు; పడుదురు= ఓడిపోతారు.

**తా :** ఒక వృక్షం మూలాన్ని ఖండించేసరికి దాని కొమ్మలు అన్నీ శక్తిహీనమై ఎండిపోయినట్లుగానే; యుద్ధంలో విష్ణువు ఓడిపోగా, అతడే వారందరికీ ప్రాణసమానుడుగాన దేవతలందరూ కూడా యుద్ధంలో ఓడిపోతారు.

**సీ. పొండు దానవులార! భూసురక్షేత్ర సంగతయైన భూమికి గములు గట్టి**
**మఖతపస్స్వాధ్యాయ మౌనవ్రతస్థుల వెదకి ఖండింపుఁడు, విష్ణుఁ డనఁగ**
**నన్యు ఁడొక్కఁడు లేఁడు, యజ్ఞంబు వేదంబు నతఁడె, భూదేవ క్రియాది మూల**
**మతఁడె, దేవర్షి పిత్రాది లోకములకు ధర్మాదులకు మహాధార మతఁడె**

**తే. యే స్థలంబుల గో భూసురేంద్ర వేద, వర్ణ ధర్మాశ్రమంబులు వరుస నుండు**
**నా స్థలంబుల కెల్ల మీ రరిగి చెఱచి, దగ్ధములు చేసి రండు మీ దర్ప మొప్ప. 34**

**ప్రతి :** దానవులార= ఓ రాక్షసులారా!; భూసురక్షేత్ర సంగతయైన= భూదేవులైన బ్రాహ్మణులు నివాసముండే; భూమికిన్= ప్రాంతానికి; గములు గట్టి= సమూహాలుగా ఏర్పడి; పొండు= వెళ్ళండి; మఖ+తపః+స్వ+అధ్యాయము= యజ్ఞం, తపస్సు, తన వేదాధ్యయనం చేసేవారిని; మౌనవ్రతస్థులన్= మౌనమే వ్రతముగాగలవారిని; వెదకి= ఎక్కడ ఉన్నను గాలించి; ఖండింపుఁడు= చంపండి; విష్ణుఁడు+అనఁగన్= విష్ణువు అనగా; అన్యుఁడు+ఒక్కఁడు లేఁడు= వీటికి భిన్నంగా విష్ణువు మరొకడు లేడు; యజ్ఞంబున్= యజ్ఞం; వేదంబున్= వేదాన్ని; అతఁడె= ఆ విష్ణువే; భూదేవ క్రియాదిమూలము= బ్రాహ్మణక్రియలకు ఆధారమైనవాడు; అతఁడె= ఆ విష్ణుమూర్తియే; దేవర్షి పితృ+ఆదిలోకములకున్= దేవతలకు, ఋషులకు పితృదేవులు మొదలైన లోకాలకు; ధర్మ+ఆదులకున్= అన్ని ధర్మాలకు; మహా+ఆధారము+అతఁడె= ఆ విష్ణుమూర్తియే గొప్ప ఆధారం; గో= గోవులు, భూసురేంద్ర= బ్రాహ్మణులు, వేద= వేదాలు, వర్ణ ధర్మ= వర్ణధర్మాలు, ఆశ్రమంబులు= ఆశ్రమ ధర్మాలు; ఏ స్థలంబులన్= ఏ ఏ చోట్లలో; వరుసన్+ఉండున్= క్రమంగా ఉంటాయో; ఆ స్థలంబులకు+ఎల్లన్=

ఆ యా చోట్లకు; మీరు+అరిగి= మీరు వెళ్ళి; దర్పము+ఒప్పన్= గర్వం కనపడేలా; చెఱచి= చెడగొట్టి; దగ్ధములు+చేసిరండు= తగులబెట్టి రండి.

**తా :** ఓ రాక్షసులారా! మీరందరు గుంపులు గుంపులుగా బ్రాహ్మణులు నివసించే ప్రాంతాలకు పొండి. యజ్ఞము, తపస్సు, స్వాధ్యాయాలతో ఉన్న వారిని, మౌనవ్రతం చేసేవారిని వెదకి చంపండి. విష్ణువు అనగా వేరు కాదు. యజ్ఞం, వేదం విష్ణువే. బ్రాహ్మణుల క్రియాకలాపాలకు అతడే ఆధారం. ఆ విష్ణువే, దేవలోక, ఋషిలోక, పితృలోకాలకు, ధర్మాలకు అతడే గొప్ప ఆధారం. ఏ ఏ ప్రాంతాలలో గోవులు, బ్రాహ్మణులు, వేదాలు, వర్ణధర్మాలు ఆశ్రమధర్మాలు ఆచరింపబడుతూ ఉంటాయో ఆ యా ప్రాంతాలకు మీరువెళ్ళి మీ గర్వం ఉట్టిపడేలా వాటిని బుగ్గిపాలు చేసిరండి.

**వ. అని యిట్లు నిర్దేశించిన దివిజమర్దను నిర్దేశంబులు శిరంబుల ధరియించి రక్కసులు పెక్కండ్రు భూతలంబునకుం జని. 35**

**ప్రతి :** అని యిట్లు= అని ఈ ప్రకారంగా; నిర్దేశించినన్= ఆదేశించగా; దివిజమర్దనున్= దేవతల విరోధియైన హిరణ్యకశిపుని; నిర్దేశంబులు= ఆజ్ఞలను; శిరంబులన్+ధరియించి= తలదాల్చి; రక్కసులు పెక్కండ్రు= ఎందరో రాక్షసులు; భూతలంబునకున్= భూలోకానికి; చని= వెళ్ళి...

**తా :** హిరణ్యకశిపుడు ఈ విధంగా ఆదేశించగా అతని ఆజ్ఞలు తలదాల్చి రక్కసులు భూలోకానికి వెళ్ళి,

**సీ. గ్రామ పుర క్షేత్ర ఖర్వట ఖేట ఘోషారామ నగ రాశ్ర మాదికములు**
**గాలిచి కొలఁకులు గలఁచి ప్రాకార గోపుర సేతువులు ద్రవ్వి, పుణ్యభూజ**
**చయములు ఖండించి సౌధ ప్రపాగేహ పర్ణశాలాదులు పాడుచేసి**
**సాధు గోబ్రాహ్మణ సంఘంబులకు హింస గావించి వేదమార్గములు సెఱచి**

**ఆ. కుతల మెల్ల నిట్లు కోలాహలంబుగా, దైత్యు లాచరింపఁ దల్లడిల్లి**
**నష్టమూర్తు లగుచు నాకలోకము మాని, యడవులందుఁ జొచ్చి రమరవరులు. 36**

**ప్రతి :** గ్రామ= గ్రామాలు; పుర= నగరాలు; క్షేత్ర= పుణ్యక్షేత్రాలు; ఖర్వట= కొండ క్రింది పల్లెలు; ఖేట= పల్లెలు; ఘోష= గొల్లవాడలు; ఆరామనగర= తోటలు పట్టణాలు; ఆశ్రమ+ఆదికములు= ఆశ్రమాలు మొదలైనవి; కాలిచి= తగులబెట్టి; కొలఁకులు= సరస్సులు; కలఁచి= కల్లోలపరిచి; ప్రాకార= ఎత్తైన ప్రహరిగోడలను; గోపుర; సేతువులు= వారధులను (వంతెనలు) త్రవ్వి; పుణ్యభూజచయములు= పవిత్రాలైన మారేడు మొదలైన వృక్షముల సమూహాలను; ఖండించి= తెగనరికి; సౌధ= పెద్ద పెద్ద భవనాలను; ప్రపా= చలువపందిళ్లను; గేహ= గృహంబులను; పర్ణశాల+ఆదులు= ఆకులతో కట్టుకున్న ఇళ్లను; పాడుచేసి= పాడుచేసి; సాధు= సత్పురుషులకు; గో= గోవులకు; బ్రాహ్మణసంఘంబులకున్= బ్రాహ్మణుల సముదాయములకు; హింస గావించి= హింసించి; వేదమార్గములు= వేద సంప్రదాయాలను; చెఱచి= చెడగొట్టి; కుతలమెల్లన్= భూతలమంతటినీ; ఇట్లు= ఈ విధంగా; కోలాహలంబుగా; దైత్యులు= రాక్షసులు; ఆచరింపన్= చేయగా; అమరవరులు= దేవతాశ్రేష్ఠులు; తల్లడిల్లి= బాధపడి; నష్టమూర్తులు+అగుచున్= ఆకారములు చెడినవారై; నాకలోకము మాని= స్వర్గలోకాన్ని విడిచి; అడవులందున్= అడవులలో; చొచ్చిరి= ప్రవేశించారు.

**తా :** రాక్షసులు భూమిలోగల గ్రామాలు, పెద్దనగరాలు, పుణ్యక్షేత్రాలు, చిన్నగ్రామాలు, వాడలు, పల్లెలు, తోటలు మొదలైనవన్నీ వెదికి, సరస్సులు పాడుచేసి, పెద్ద ప్రహరీలు, గోపురాలు, వారధులు త్రవ్వి, జమ్మి, మారేడు మొదలైన పవిత్ర వృక్షసమూహాలు నరికి, పెద్ద పెద్ద భవనాలు, చలివేంద్రాలు, గృహాలు, పర్ణశాలలు పాడుచేసి, సాధుసమూహం, గోసమూహం, బ్రాహ్మణసమూహాలకు కీడు కలిగించి, వేదమార్గాలు చెడగొట్టి, భూతలాన్నంతటినీ ఆటోపంతో పాడుచేయగా, దేవతలందఱు తమ తమ ఆకారాలు చెడినవారై స్వర్గాన్ని విడిచి అరణ్యాలలో ప్రవేశించారు.

**వ. అంత హిరణ్య కశిపుండు దుఃఖితుండై మృతుండైన సోదరునకు నుదక ప్రదానాది కార్యంబు లాచరించి యతని బిడ్డలగు శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ ప్రముఖుల నూఱడించి వారల తల్లితోఁగూడ హిరణ్యాక్షుని భార్యల నందఱ రావించి, తమ తల్లియైన దితి నవలోకించి యిట్లనియె. 37**

**ప్రతి :** అంతన్= అంతట; హిరణ్యకశిపుండు= హిరణ్యకశిపుడు; దుఃఖితుండు+ఐ= దుఃఖాన్ని పొంది; మృతుండు+ఐన= చనిపోయిన; సోదరునకున్= సోదరుడైన హిరణ్యాక్షునకు; ఉదక ప్రదానాది కార్యంబులు= నీళ్లు వదలుట మొదలైన పనులు; ఆచరించి= చేసి; అతని బిడ్డలు+అగు= హిరణ్యాక్షుని కుమారులైన; శకుని, శంబర, కాలనాభ; మదోత్కచ ప్రముఖులన్= శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ మొదలైనవారిని; ఊఱడించి= ఓదార్చి; వారలతల్లితోన్= ఆ శకుని మొదలైనవారి తల్లితో; కూడ= కూడుకొని; హిరణ్యాక్షుని భార్యలన్+అందఱన్+రావించి= హిరణ్యాక్షుని భార్యలనందరిని పిలిపించి;తమ తల్లియైన దితిన్= తమ తల్లి అయిన దితిని; అవలోకించి= చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** హిరణ్యకశిపుడు చాలా దుఃఖించి చనిపోయిన తనసోదరుడు హిరణ్యాక్షునికి తిలోదకాలు మొదలైన ఉత్తరక్రియలు చేశాడు. హిరణ్యాక్షుని కుమారులైన శకుని, శంబర, కాలనాభ, మదోత్కచ మొదలైనవాళ్ళను ఓదార్చాడు. వాళ్ళ తల్లిని, హిరణ్యాక్షుని మిగిలిన భార్యలను పిలిపించాడు. తమ తల్లియైన దితిని చూచి ఇలా అన్నాడు.

**శా. నీరాగారనివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం**
**చారుల్ వత్తురు గూడి విత్తురు, సదా సంగంబు లేదొక్కచో**
**శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవత్సూనుండు దల్లీ! మహా**
**శూరుం డాతఁడు త ద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్? 38**

**ప్రతి :** తల్లీ= ఓ అమ్మా!; నీర+ఆగార నివిష్ట= చలువ పందిరి కింద నిలిచిన; పాంథులక్రియన్= బాటసారులలాగా; సంసార సంచారుల్= ఈ ప్రపంచంలోని జనులందఱూ; వత్తురు= వచ్చుదురు; కూడి= కలసి ఉండి; విత్తురు= విడిచిపోతారు; నిక్కంబు= నిజం; ఒక్కచోన్= ఒక్క చోటనే; సదా సంగంబు లేదు= ఎల్లప్పుడు కలసి ఉండుట జరగదు; భవత్+సూనుండు= నీ కుమారుడు; శూరుల్+పోయెడి= పరాక్రమవంతులు ప్రయాణించే; త్రోవన్+పోయెను= మార్గంలో వెళ్ళిపోయాడు; ఆతఁడు= ఆ హిరణ్యాక్షుడు; మహాశూరుండు= గొప్ప శూరుడు; తద్+వియోగమునకున్= అతడు మరణించడంతో కలిగిన ఎడబాటుకు; శోకింపన్= దుఃఖించటం; నీకు+ఏటికిన్= నీ కెందుకు?

**తా :** ఓ తల్లీ! ఈ ప్రపంచంలోని జనులందరూ చలువపందిరిలో కలుసుకొని కొంతసేపు కలిసియుండి తరువాత ఎవరికి వారు వెళ్ళిపోయేవారే. ఒకే చోటనే ఎల్లకాలం కలసి ఉండటం జరుగని పని. ఇది సత్యం. నీ కుమారుడైన హిరణ్యాక్షుడు మహాశూరుడు. అతడు వీరులు ప్రయాణించే మార్గంలో వెళ్ళాడు. అతని మరణానికి నీవు దుఃఖించే పనిలేదు.

**విశే :** నదీ ప్రవాహంలో రెండు కట్టెలు కొంతదూరం కలసి విడిపోతాయి. అలానే సంసార ప్రవాహంలో ఎందరో కలుస్తుంటారు. విడిపోతుంటారు.

**సీ. సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుఁ**
**డాత్మరూపంబున నశ్రాంతమును దన మాయా ప్రవర్తన మహిమ వలన**
**గుణములఁ గల్పించి గుణసంగమంబున లింగ శరీరంబు లీలఁ దాల్చి**
**కంపిత జలములోఁ గదలెడి క్రియఁ దోఁచు పాదపంబుల భంగి భ్రామ్యమాణ**

**ఆ. చక్షువుల ధరిత్రి చలిత యై కానంగఁ, బడిన భంగి వికల భావరహితుఁ**
**డాత్మమయుఁడు కంపితాంత రంగంబునఁ, గదలినట్ల తోఁచుఁ గదలకుండు. 39**

**ప్రతి :** ఆత్మమయుఁడు= ఆత్మరూపుడైన పరమేశ్వరుడు; సర్వజ్ఞుఁడు= అన్నీ తెలిసినవాడు; ఈశుండు= ప్రభువు; సర్వాత్ముఁడు= అన్నిటిలోను ఆత్మస్వరూపుడై ఉన్నవాడు; అవ్యయుండు= నాశము లేనివాడు; అమలుండు= స్వచ్ఛమైనవాడు; సత్యుఁడు= సత్యస్వరూపుడు; అనంతుఁడు= అంతం లేనివాడు; ఆఢ్యుఁడు= శ్రేష్ఠుడు; ఆత్మరూపంబునన్= ఆత్మరూపంతో; అశ్రాంతమును= ఎల్లప్పుడు; తన మాయాప్రవర్తన మహిమవలనన్= తాను మాయతో కలసి ప్రవర్తించే స్థితివలన; గుణములన్= త్రిగుణాలను (సత్త్వరజస్తమోగుణాలను) కల్పించి= ఏర్పరిచి; గుణసంగమంబునన్= ఆ గుణాల కలయికతో; లింగశరీరంబు= లింగశరీరాన్ని; లీలన్+తాల్చి= క్రీడగా ధరించి; కంపిత జలములోన్= కదలుతున్న నీటిలో; పాదపంబులభంగిన్= చెట్లవలె; కదలెడి క్రియన్+తోఁచు= కదలుతున్నట్లు కనబడే; భ్రామ్యమాణ= కదలుచున్న (తిరుగుతున్న) చక్షువుల= కండ్లకు; ధరిత్రి= భూమి; చలితయై= కదలుతున్నట్లు; కానంగన్+పడిన భంగిన్= కనపడిన విధంగా; వికలభావరహితుఁడు= కదలని భావాలుగల ఈశ్వరుడు; కంపితాంతరంగంబునన్= కదలే మనసులో; కదలినట్లు+అ= కదులుతున్నట్లు; తోఁచున్= కనబడతాడు; కదలక+ఉండున్= తాను మాత్రం కదలడు.

**తా :** పరమాత్మ సర్వజ్ఞుడు, ప్రభువు, సర్వాత్ముడు, నాశము లేనివాడు, స్వచ్ఛమైనవాడు, సత్యస్వరూపుడు, అంతము లేనివాడు, శ్రేష్ఠుడు ఎల్లప్పుడు ఆత్మరూపంతో తన మాయాప్రవర్తనవల్ల త్రిగుణాలను కల్పించి వాటి కలయికతో లింగశరీరాన్ని ధరిస్తూ ఉంటాడు. కదులుతూ ఉన్న నీటిలో పడిన చెట్లనీడలు కదలుచూ ఉన్నట్లు కనబడినట్లుగా, భ్రమకు లోనైన మానవుని కళ్లకు భూమి కదలుతున్నట్లు కనబడినట్లుగా, వికలభావాలు లేని ఆ ఆత్మమయుడు తాను కదలని వాడైనప్పటికీ కదలుతూ ఉన్న అంతరంగాలలో కదులుతూ ఉన్నట్లు కనిపిస్తాడు. అంతే తప్ప వాస్తవానికి అతడు కదలిక లేని అచలుడు.

**విశే :** ఈ పద్యంలో హిరణ్యకశిపుడు తల్లిని ఓదారుస్తూ భగవంతుని లీలావిభూతి తత్త్వాన్ని వివరించాడు.

## ✤ బాలవేషము దాల్చిన యముండు దెలిపెడు సుయజ్ఞోపాఖ్యానము ✤

**వ. అవ్వా! యవ్విధంబున లక్షణవంతుండు గాని యీశ్వరుండు లక్షితుండై కర్మసంసరణంబున యోగవియోగంబుల నొందు, సంభవ వినాశ శోక వివేకావివేక చింతా స్మరణంబులు వివిధంబు, లీ యర్థంబునకుఁ బెద్దలు ప్రేతబంధు యమసంవాదంబను నితిహాసంబు నుదాహరింతురు, వినుండు చెప్పెద నుశీనర దేశంబునందు సుయజ్ఞుం డను రాజుగలం డతండు శత్రువుల చేత యుద్ధంబున నిహతుండయి యున్నయెడ. 40**

**ప్రతి :** అవ్వా!= ఓ తల్లీ!; ఆ+విధంబున= ఆ విధంగా; లక్షణవంతుండు+కాని= ఈ లక్షణాలు గలవాడని చెప్పడానికి వీలులేని; ఈశ్వరుండు= పరమాత్మ; లక్షితుండు+ఐ= లక్షణములుగలవాడై; కర్మసంసరణంబునన్= కర్మలతో కలసి ఉండడం వల్ల; యోగవియోగంబులన్+ఒందున్= యోగాన్ని వియోగాన్ని పొందుతాడు; సంభవ= పుట్టడం; వినాశ= నశించడం; శోక= దుఃఖం; వివేక= జ్ఞానం కలిగి ఉండటం; అవివేక= అజ్ఞానం; చింత= విచారం; స్మరణంబులు= స్మరించడం అనేవి; వివిధంబులు= పలురకాలు; ఈ అర్థంబునకున్= ఈ విషయానికి; పెద్దలు= ఆర్యులు; ప్రేతబంధు యమసంవాదంబు+అను= ప్రేతబంధు యమసంవాదమనే పేరుగల; ఇతిహాసంబును= జరిగిన వృత్తాంతాన్ని; ఉదాహరింతురు= ఉదాహరణగా చెపుతారు; వినుండు చెప్పెదన్= చెపుతాను వినండి; ఉశీనరదేశంబునందున్= ఉశీనర అనేపేరుగల దేశంలో; సుయజ్ఞుండు+అను= సుయజ్ఞుడు అనే పేరుగల; రాజుగలండు= రాజు ఉన్నాడు; అతండు= ఆ రాజు; శత్రువులచేతన్= పగవారిచే; యుద్ధంబునన్= యుద్ధంలో; నిహతుండు+అయి= మరణించి; ఉన్నయెడన్= ఉన్న సమయంలో...

**తా :** తల్లీ! పరమాత్మ ఏ లక్షణాలు లేనివాడైనప్పటికీ, లక్షణాలు కలవానివలె, కర్మలతో కలిసియుండుటచే యోగాన్ని, వియోగాన్ని పొందుతాడు. జన్మము, మరణము, దుఃఖము, వివేకము, అజ్ఞానము, చింత, స్మరణము అనేవి పలురకములుగా ఉంటాయి. ఈ పరమార్థాన్ని చెప్పే సందర్భంలో పెద్దలైనవారు ప్రేతబంధు యమసంవాదమనే ఇతిహాసాన్ని చెపుతూ ఉంటారు. ఆ కథను చెపుతాను విను.

ఉశీనరదేశంలో సుయజ్ఞు డనే రాజు ఉన్నాడు. అతడు యుద్ధంలో శత్రువులచే మరణాన్ని పొంది ఉన్న సమయంలో

**సీ. చిరిఁగిన బహురత్న చిత్రవర్మముతోడ రాలిన భూషణరాజితోడ**
**భీకర బాణ నిర్భిన్న వక్షము తోడఁ దఱుచుఁ గాఱెడు శోణితంబుతోడఁ**
**గీర్ణమై జాఱిన కేశబంధము తోడ రయరోషదష్టాధరంబు తోడఁ**
**నిమిషహీనం బైన నేత్రయుగ్మము తోడ భూరజోయుత ముఖాంబుజము తోడఁ**

**ఆ. దునిసి పడిన దీర్ఘదోర్దండముల తోడ, జీవ రహితుఁడగు నుశీనరేంద్రుఁ**
**జుట్టి బంధుజనులు సొరిది నుండఁగ భయా, క్రాంత లగుచు నతని కాంత లెల్ల. 41**

**ప్రతి :** చిరిఁగిన= చిరిగిపోయిన; బహురత్న= అనేక రత్నములతో తయారు చేయబడిన; చిత్రవర్మముతోడన్= చిత్రమైన కవచంతో; రాలిన భూషణ రాజితోడన్= రాలిపోయిన అలంకార సముదాయంతో; భీకరబాణ= భయంకరమైన బాణాలచేత; నిర్భిన్న వక్షముతోడన్= భిన్నమైన వక్షఃస్థలంతో; తఱచున్+కాఱెడు= ఎక్కువగా ప్రవహిస్తున్న; శోణితంబుతోడన్= రక్తంతో; కీర్ణమై జాఱిన= చెదరి జారిపోయిన; కేశబంధముతోడన్= జుట్టుముడితో; రయ+రోష+దష్ట+అధరంబుతోడన్= కోపవేగంతో, ఆవేశంతో తన పెదవులను పండ్లతో నొక్కిపట్టి; నిమిషహీనంబు+ఐన= రెప్పపాటులేని; నేత్రయుగ్మముతోడన్= కంటిజంటతోను; భూ రజోయుత= ధూళితో కూడిన; ముఖాంబుజముతోడన్= ముఖపద్మంతో; తునిసిపడిన= తెగిపడిన; దీర్ఘదోర్దండంబులతోడన్= పొడవైన బాహుదండాలతోను; జీవరహితుఁడు+అగున్= ప్రాణం లేని; ఉశీనరేంద్రున్= ఉశీనరదేశాధీశ్వరుని; చుట్టి= చుట్టు ముట్టి; బంధు జనులు; సొరిదినుండఁగన్= బంధువులు చేరి ఉండగా; భయ+ ఆక్రాంతలు+అగుచున్= భయము నిండినవారై; అతని కాంతలు+ఎల్లన్= అతని భార్యలందరూ...

**తా :** చినిగిన రత్నకవచం, రాలిన ఆభరణాలు, బాణాలచే కొట్టబడిన వక్షఃస్థలం, కారుతున్న రక్తం, చెదిరి జారిన జుట్టుముడి, కోపంతో పెదవుల్ని పంటితో కొరుకుతూ, రెప్పపడని నేత్రాలు, దుమ్ము ధూళితో ఉన్న ముఖపద్మం, తెగిపడిన బాహుదండాలు కలిగి జీవం లేని ఉశీనరరాజును బంధువులు చుట్టుముట్టారు. అతని భార్యలు భయంతో కూడి

**శా. స్రస్తాకంపిత కేశబంధములతో సంఛిన్నహారాళితో**
**హస్తాబ్జంబులు సాఁచి మోఁదుకొనుచున్ హా నాథ! యంచున్ బహు**
**ప్రస్తావోక్తులతోడ నేడ్చిరి వగం బ్రాణేశు పాదాలపై**
**నస్తోక స్తనకుంకుమారుణ వికీర్ణాస్రంబు వర్షించుచున్. 42**

**ప్రతి :** స్రస్త+ఆకంపిత కేశబంధములతోన్= జారి బాగా కదులుచున్న జుట్టుముడులతోను; సంఛిన్నహారాళితోన్= తెగిపడిన హారసముదాయంతోను; హస్త+అబ్జంబులు+చాఁచి= పద్మాలవంటి హస్తాలు జాపి; మోఁదుకొనుచున్= కొట్టుకుంటూ; హానాథ+అంచున్= ఓ నాథా! అంటూ; వగన్= బాధతో; ప్రాణేశుపాదాలపైన్= భర్తయొక్క పాదాలమీద; అస్తోకస్తన= పెద్దవైన వక్షోజాలపై; కుంకుమ+అరుణ= పూసుకొన్న ఎర్రని కుంకుమ; వికీర్ణ+అస్రంబున్= కలిసిన కన్నీటి ధారలు; వర్షించుచున్= కారుతుండగా; బహుప్రస్తావ+ఉక్తులతోడన్= గతములో జరిగిన ఎన్నో విషయాలను ప్రస్తావిస్తూ; ఏడ్చిరి= దుఃఖించారు.

**తా :** ఆ రాజు భార్యలందఱూ జుట్టు ముడులు వీడిపోగా, తాము ధరించిన హారాలు తెగిపడగా, చేతులతో గుండెలపై బాదుకుంటూ, ఓ నాథా! అంటూ, గతంలో అతనితో కలిసిమెలసి ఉన్న వేళలలో జరిగిన అనేక అంశాలను గుర్తు చేసుకుంటూ, తమ వక్షాలపై రాసికొన్న ఎర్రని కుంకుమ కన్నీటితో కరిగి అతని పాదాలపై వర్షించగా, విలపించారు.

**మ. అనఘా! నిన్ను నుశీనర ప్రజల కర్థానంద సంధాయిగా**
**మును నిర్మించిన బ్రహ్మ నిర్దయత నున్మూలించెనే వీరికిం**
**దనయశ్రేణికి మాకు దిక్కు గలదే? ధాత్రీశ! నీబోఁటికిం**
**జనునే పాసి చనంగ భ్రాతృజనులన్ సన్మిత్రులం బుత్రులన్? 43**

**ప్రతి :** అనఘా= ఓ పుణ్యాత్ముడా! (పాపరహితుడా!) నిన్నున్= నిన్ను; ఉశీనర ప్రజలకు= ఉశీనరదేశంలో ఉండే ప్రజలకందరికి; అర్థ+ఆనంద= సంపదలతో ఆనందం; సంధాయిగా= అందించే వ్యక్తిగా; మును= పూర్వం; నిర్మించిన= సృష్టించిన; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; నిర్దయతన్= కరుణలేకుండా; ఉన్మూలించెనే= పెరికి వేశాడే! వీరికిన్= ఈ ప్రజలకు; తనయ శ్రేణికిన్= నీ కుమారుల సముదాయానికి; మాకున్= భార్యలమైన మాకు; దిక్కు+కలదే= దిక్కు ఉన్నదా; ధాత్రీశ!= ఓ రాజా; నీ బోఁటికిన్= నీ వంటివానికి; భ్రాతృజనులన్= సోదరులను; సన్మిత్రులన్= మంచి స్నేహితులను; పుత్రులన్= కుమారులను; పాసి చనంగన్= విడిచి వెళ్ళిపోవుట; చనునే= తగునా!

**తా :** ఓ పుణ్యాత్ముడా! పూర్వం బ్రహ్మదేవుడు నిన్ను, ఉశీనర దేశప్రజలకు సంపదలతో ఆనందం కల్గించడానికి సృష్టించి; ఇప్పుడు నిర్దయుడై నిన్ను తొలగించాడే! ఈ ప్రజలకు, సుతులకు, మాకు నీవు తప్ప దిక్కు ఉందా! ఓ రాజా! సోదరులను, మిత్రులను, పుత్రులను వదలిపోవడం నీ వంటివానికి తగునా!

**మ. జనలోకేశ్వర! నిన్నుఁబాసిన నిమేషంబుల్ మహాబ్దంబులై**
**చను లోకాంతర గామివై మరల కీ చందంబునన్ నీవు వో**
**యిన మే మెట్లు చరింతు? మొల్లము గదా యీ లోకవృత్తంబు నేఁ**
**డనలజ్వాలలఁ జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయిం జూడఁగన్. 44**

**ప్రతి :** జనలోకేశ్వర!= ఓ ప్రజానాయకా! నిన్నున్= నిన్ను; పాసిన= విడిచిపెట్టిన; నిమేషంబుల్= నిమిషాలు; మహా+అబ్దంబులు+ఐ చనున్= మహాసంవత్సరాలుగా జరుగుతాయి (నిన్ను విడిచిన క్షణాలు సంవత్సరాల్లా గడుస్తాయి); లోక+అంతరగామివై= పరలోకానికి వెళ్ళినవాడవై; మరలక= తిరిగి రాకుండా; ఈ చందంబునన్= ఈ విధంగా; నీవు+పోయినన్= నీవు వెళ్ళిపోగా; మేము+ఎట్లు చరింతుము= మేమెలా జీవిస్తాము; ఈ లోక వృత్తంబున్= ఈ లోక ప్రవర్తనను; ఒల్లము+కదా= అంగీకరించలేము గదా, (నీవులేక ఈ లోకంలో మేము) బ్రదుకలేము గదా!; నీ+అంఘ్రిద్వయిన్= నీ పాదాల జంటను; చూడఁగన్= చూచుట కొఱకు; నేఁడు= ఈ రోజు; అనలజ్వాలలన్+చొచ్చి= అగ్ని జ్వాలలలో దూకి (చితిలో దుమికి); వచ్చెదము= వస్తాము.

**తా :** ఓ నృపాలా! మాకు నిన్ను విడిచిన క్షణాలు యుగాలుగా ఉంటాయి కదా! (నిమిషం సంవత్సరంలా గడుస్తుంది కదా!) ఇలా నీవు తిరిగిరాకుండా పరలోకానికి వెళ్ళిపోతే, మేము ఈ లోకంలో ఎలా ఉండగలం?! ఈ ప్రపంచంలో నీవు లేకుండా బతకడానికి మేము ఇష్టపడం. నీ పాదద్వయాన్ని చూచే నిమిత్తం మేము కూడా ఈ చితిమంటలలో దుముకుతాము.

**వ. అని యిట్లు రాజభార్య లా రాజశవంబు డగ్గఱి విలపింపఁబ్రొద్దు గ్రుంకెడు సమయంబున వారల విలాపంబులు విని బ్రాహ్మణ బాలకుండై యముండు సనుదెంచి ప్రేత బంధువులం జూచి యిట్లనియె. 45**

**ప్రతి :** అని+ఇట్లు= అని యీ ప్రకారంగా; రాజభార్యలు= ఆ ఉశీనర దేశరాజైన సుయజ్ఞుని భార్యలు; ఆ రాజశవంబు డగ్గఱి= (ఆ రాజు శవాన్ని) సమీపించి; విలపింపన్= దుఃఖింపగా; ప్రొద్దు గ్రుంకెడు సమయంబునన్= ప్రొద్దు వ్రాలే సమయంలో (సూర్య అస్తమయవేళ) వారల= వారియొక్క; విలాపంబులు= ఏడుపులు, దుఃఖవాక్యాలు; విని= విని; యముండు= యముడు; బ్రాహ్మణ బాలకుండు+ఐ= బ్రాహ్మణ కుమారుని రూపంలో; చనుదెంచి= వచ్చి; ప్రేతబంధువులన్+చూచి= ఆ శవంయొక్క బంధువులను చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా ఆ సుయజ్ఞుని భార్యలు భర్త శవందగ్గర విలపిస్తుండగా, సూర్యాస్తమయ సమయంలో వారి దుఃఖవాక్యాలు విని యముడు బ్రాహ్మణ బాలకుని రూపంలో వచ్చి ఆ శవంయొక్క బంధువులతో ఇలా అన్నాడు.

**ఉ. మచ్చిక వీరికెల్ల బహుమాత్రముఁ జోద్యము, దేహి వుట్టుచుం**
**జచ్చుచునుండఁ జూచెదరు, చావక మానెడు వారిభంగి నీ**
**చచ్చిన వాని కేడ్చెదరు? చావున కొల్లక దాఁగవచ్చునే?**
**యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్. 46**

**ప్రతి :** వీరికెల్లన్= ఈ శవానికి బంధువులైన వారికందరికీ; మచ్చిక బహుమాత్రమున్= మోహం చాలా అధికం; చోద్యము= ఇది వింత; దేహి= శరీరి; పుట్టుచున్= పుడుతూ; చచ్చుచున్+ఉండన్= మరణించడం అనే అంశాన్ని;

చూచెదరు= చూస్తూనే ఉంటారు; ఈ చచ్చినవానికి= ఈ మరణించినవాని కొరకు; చావకమానెడు వారిభంగిన్= వీరు చావనివారు అయినట్లుగా; ఏడ్చెదరు= దుఃఖిస్తూ ఉన్నారు; చావునకు+ఒల్లక= చావే వద్దని, మరణాన్ని అంగీకరించకుండా; డాఁగవచ్చునే= తప్పించుకొనడం సాధ్యపడుతుందా!; ప్రాణికోటికిన్= ప్రాణుల సమూహానికి (జీవులందరికీ); ఎచ్చటన్+పుట్టెన్= ఎక్కడ నుండి పుట్టెనో; అచ్చటికిన్= అక్కడికే; ఏగుట నైజము= వెళ్ళడం సహజం.

**తా :** ప్రాణికోటికి సహజమైన విషయం ఒక్కటి ఉన్నది. ఎక్కువగా మక్కువ పెంచుకోవడం ఒక విచిత్రం. ప్రాణులు పుడుతూ చస్తూ ఉంటారు. అయినా చనిపోయినవారి కొరకు వీళ్లు చావనివాళ్లలాగా దుఃఖపడుతూ ఉంటారు. చావును ఎవరైనా తప్పించుకో గలరా! ప్రాణులన్నీ ఎక్కడ నుండి పుట్టాయో అక్కడికే వెళ్ళడం సహజమైన విషయం కదా!

**విశే :** ఈ పద్యమే మానవుల నైజగుణాన్ని ఒక సూక్తిగా మలచి వ్రాసినాడు పోతన. ఇది ఒక వేదాంతార్థసూక్తి!

**"చచ్చినవారికేడ్చెదరు చావక మానెడు వారి భంగి"** అనే వాక్యం, దుఃఖమనేది వాస్తవికమైన మృత్యువు ముందు ఎంత హాస్యాస్పదమో నిరూపిస్తున్నది.

**క. జననీ జనకులఁ బాసియు, ఘనవృకముల బాధవడక కడుఁ బిన్నలమై**
**మనియెద, మెవ్వఁడు గర్భం, బున మును పోషించె వాఁడె పోషకుఁ డడవిన్. 47**

**ప్రతి :** జననీ జనకులన్= తల్లిదండ్రులను; పాసియున్= విడిచి పెట్టికూడా; ఘనవృకముల బాధపడక= గొప్పవైన తోడేళ్ళ బారినిపడకుండా; కడున్+పిన్నలమై= మిక్కిలి పసివారమై; మనియెదము= బ్రదుకగలం; అడవిన్= అడవిలో ఉన్నప్పటికీ కూడా; ఎవ్వఁడు= ఎవ్వడైతే; గర్భంబునన్= తల్లి గర్భంలో ఉండగా; మును= ఇంతకుముందు (మనం ఈ భూమి పైకి రాకపూర్వం); పోషించెన్= మనలను కాపాడినాడో; వాఁడె= ఆ పరమాత్మయే; పోషకుఁడు= నిజమైన పోషకుడు.

**తా :** తల్లిదండ్రులను విడిచికూడా పసిపిల్లలమై వుండి, తోడేళ్ళవంటి మృగాల బారినపడకుండా అడవులలో అయినా బ్రదుకగలం. ఎందుకంటే భూమిపైకి రాకముందు తల్లిగర్భంలో ఉండగా మనలను ఎవడు పోషించడం వల్ల బ్రదికి ఉన్నామో. ఆ పరమాత్మయే నిజమైన పోషకుడు.

**క. ఎవ్వఁడు సృజించుఁ బ్రాణుల, నెవ్వఁడు రక్షించుఁ ద్రుంచు నెవ్వఁ డనంతుం**
**డెవ్వఁడు విభుఁ డెవ్వఁడు వాఁ, డివ్విధమున మనుచుఁ బెనుచు హేలారతుఁడై. 48**

**ప్రతి :** ప్రాణులన్= జీవులను; ఎవ్వఁడు సృజించున్= ఎవడు సృష్టిస్తాడో; ఎవ్వఁడు రక్షించున్= ఎవడు రక్షిస్తాడో; త్రుంచున్+ఎవ్వఁడు= ఎవ్వడు నశింప చేస్తాడో; అనంతుండు+ఎవ్వఁడు= ఎవడు అంతములేని గొప్పవాడో; విభుఁడు+ఎవ్వఁడు= ఎవడు ప్రభువై ఉన్నాడో; వాఁడు= ఆ పరమాత్మ; హేలారతుఁడు+ఐ= లీలా విలాసం కలిగినవాడై; ఈ+విధమునన్= ఈ విధంగా; మనుచున్= రక్షిస్తాడు; పెనుచున్= అభివృద్ధి చేస్తాడు.

**తా :** ఈ సమస్త ప్రపంచాన్ని సృష్టించి, రక్షించి, నశింప చేసే వాడెవడో ఆ అనంతశక్తి సంపన్నుడు ఎవడో, ఈ విశ్వానికి ప్రభువు ఎవడో, అతడే లీలావిలాసంతో ఈ లోకాలను రక్షిస్తూ పోషిస్తూ ఉంటాడు.

**ఆ. ధనము వీథిఁబడిన దైవవశంబున, నుండుఁ బోవు మూలనున్న నైన**
**నడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు, రక్షితుండు మందిరమునఁ జచ్చు. 49**

**ప్రతి :** ధనమున్= ధనాన్ని (సొమ్ము); వీథిన్+పడిన= వీథిలో పడవేసినా; దైవవశంబునన్= దైవయోగంవల్ల; ఉండున్= క్షేమంగా ఉంటుంది; మూలన్+ఉన్నన్+ఐనన్= ఎక్కడో మూలన భద్రంగా దాచి ఉంచినా; పోవున్= పోతుంది; అడవిన్= అరణ్యంలో అయినా; రక్షలేని+అబలుండు= రక్షణలేని బలహీనుడుకూడా; వర్ధిల్లున్= అభివృద్ధి పొందుతాడు; రక్షితుండు= అన్ని విధముల రక్షణలు గలవాడు కూడా; మందిరమునన్= తన ఇంటిలో ఉండికూడా; చచ్చున్= మరణిస్తాడు.

**తా :** దైవయోగం బాగున్నప్పుడు మన ధనం బైట పారవైచినా సురక్షితంగా ఉంటుంది. అలా కానప్పుడు ఇంట్లో మూల భద్రంగా దాచినా మటు మాయమై పోతుంది. బలహీనుడు కూడా దైవయోగం బాగుంటే అడవిలో ఉన్నా హాయిగా బతికే ఉంటాడు. అలా కాని పక్షంలో భవనంలో రక్షణతో భద్రంగా ఉన్నా వాడు మరణిస్తాడు.

**క. కలుగును, మఱి లేకుండును, గల భూతములెల్లఁ గాలకర్మవశము లై**
**నిలఁబడుఁ, బ్రకృతిం దద్గుణ, కలితుఁడుగాఁ డాత్మమయుఁ డగమ్యుఁడు దలఁపన్. 50**

**ప్రతి :** ప్రకృతిన్= ఈ ప్రకృతిలో; కల భూతములెల్లన్= ఉన్న జీవులన్నీ కూడా; కలుగును= జన్మిస్తాయి; మఱి లేకుండును= తర్వాత కనపడకుండా పోతాయి; నిలన్+పడున్= స్థితిని కలిగి ఉంటాయి (ఈ జనన స్థితి లయాలు) కాలకర్మవశములై= కాలకర్మలకు లోబడి ఉంటాయి; ఆత్మమయుఁడు= ఆత్మమయుడైన పరమాత్మ; తద్+గుణకలితుఁడు+కాఁడు= అలాంటి గుణాలున్నవాడు కాడు; తలఁపన్= ఆలోచింపగా; అగమ్యుఁడు= ఎవ్వరూ పొందలేనివాడు.

**తా :** ప్రాణులన్నీ కాలకర్మవశాలై పుడతాయి, జీవిస్తాయి, మరణిస్తాయి . ఇది ప్రకృతిలో జరిగే అంశం. కాని ఆత్మమయుడైన పరమాత్మ ఆ ప్రకృతి గుణాలు అంటనివాడై, అగమ్యుడై అనగా ఎవ్వరును చేరలేనివాడై ఉంటాడు.

**సీ. పాంచ భౌతికమైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలోఁ బూర్వ కర్మ**
**వశమున నొకవేళ వర్తించు దీపించుఁ దఱి యైన నొకవేళఁ దలఁగి పోవుఁ,**
**జెడునేని దేహంబు సెడుఁగాని పురుషుండు సెడఁ డాతనికి నింతసేటు లేదు,**
**పురుషునికిని దేహపుంజంబునకు వేఱు గాని యేకత్వంబు గాన రాదు,**

**ఆ. దారువుల వెలుంగు దహనుని కైవడిఁ, గాయములఁ జరించు గాలి భంగి**
**నాళలీనమైన నభము చాడ్పున వేఱు, దెలియవలయు దేహి దేహములకు. 51**

**ప్రతి :** దేహంబు= శరీరము; పాంచ భౌతికమైన= పంచభూతాలతో కూడిన; భవనంబు= గృహం; పురుషుండు= పురుషుడు (ఆత్మ అనేవాడు); పూర్వకర్మవశమునన్= గతజన్మలో చేసికొన్న కర్మలవల్ల; దీనిలోన్= ఈ దేహమనే భవనంలో; ఒక వేళన్= ఒక సమయంలో; వర్తించున్= ప్రవర్తిస్తూ ఉంటాడు; దీపించున్= వెలుగుతూ ఉంటాడు (జీవంకలిగి ఉంటాడు); తఱి+ఐనవేళన్= సమయం పూర్తి అయిపోతే; తలఁగి పోవున్= ఆ దేహమనే భవనంనుండి వెళ్ళిపోతాడు; చెడున్+ఏనిన్= చెడిపోతే; దేహంబున్= శరీరం; చెడున్+కాని= చెడిపోవచ్చు కాని; పురుషుండు= ఆత్మ అనే పురుషుడు; చెడఁడు= నశింపడు; ఆతనికిన్= ఆ ఆత్మపురుషునికి; ఇంతన్+చేటులేదు= రవంత కూడ నష్టం లేదు; పురుషునికినిన్= ఆత్మ పురుషునకు; దేహపుంజంబునకున్= దేహ సముదాయానికి; వేఱు గాని= సంబంధం లేదు; ఏకత్వంబున్+కానరాదు= ఒక్కటే తత్త్వం కనపడదు; దారువులన్= కట్టెలలో; వెలుంగు= జ్వలించే; దహనునికైవడిన్= అగ్నివలె; కాయములన్=

శరీరాలలో; చరించు= సంచరించే; గాలిభంగిన్= గాలివలె; నాళలీనమైన= తామర తూడులో ఉన్న; నభము చాడ్పునన్= శూన్యంవలె; దేహి, దేహములకున్= ఆత్మకు, శరీరానికి; వేఱు తెలియవలయున్= భేదాన్ని గ్రహించగలగాలి.

**తా :** పంచభూతాలతో కూడిన ఈ దేహము ఒక భవనం వంటిది. అందులో ఆత్మ అనే పురుషుడు పురాకృత కర్మల కారణంగా ఒక్క సమయంలో ఉంటాడు, వెలుగుతాడు, సమయం వస్తే వెళ్ళిపోతాడు. శరీరం నశిస్తుంది తప్ప, అందులో వున్న ఆత్మ (పురుషుడు) నశించదు. ఆత్మకు రవంతకూడా చేటు రాదు. పురుషునకు దేహానికి భేదం ఉంది కాని, ఆ రెండూ ఒకటి కావు. కట్టెలలో అగ్ని ఉన్నట్లుగా, శరీరాలలో గాలి కదులుతున్నట్లుగా, తామరతూడులో శూన్యం ఉన్నట్లుగా, దేహికి దేహానికి గల భేదాన్ని తెలుసుకోవాలి.

**విశే :** ఇక్కడ దేహమనగా 'ప్రకృతి' చే నిర్మించబడిన పాంచభౌతిక దేహం. 'దిహ ఉపచయే' అని ధాతువు. వృద్ధిపొందే లక్షణం కలది దేహం. దేహియైన జీవుడు నివసించేది దేహం. ఇది ప్రాకృతికమైనది. 'ప్రకృతి'లో పరిణామం సహజం. అందుచేత కాలగతిలో శరీరం నశిస్తుంది. దేహాన్ని ఆశ్రయించిన దేహి (జీవుడు)కి మరణం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే – ఎటువంటి వికారాలు మార్పులు లేనిది జీవాత్మ! అది మరోశరీరాన్ని ఆశ్రయిస్తుంది. 'షడ్భావవికారములు గలది శరీరం' అవి ఉన్నది, పుడుతున్నది, పెరుగుతున్నది, మారుతున్నది, క్షీణిస్తున్నది, నశిస్తున్నది. **'దేహంబు సెడుఁగాని పురుషుండు సెడఁడాతనికి నింత సేటు లేదు'** అన్నవాక్యంలో దేహం= శరీరం నశించేది; పురుషుడు= దేహి (జీవుఁడు) నశింపడు.

**వ. అని మఱియు నిట్లనియె. 52**

**ప్రతి :** అని= అని అంటూ; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని పలుకుతూ ఇంకా ఇలా అన్నాడు.

**సీ. భూపాలకుఁడు నిద్రవోయెడి నొండేమి? విలపింప నేటికి వెఱ్ఱులార!**
**యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు,**
**ప్రాణభూతుండైన పవనుఁ డాకర్ణింప భాషింప నేరఁడు ప్రాణి దేహ**
**ములకు వేఱై తాను ముఖ్యుఁడై యింద్రియవంతుఁడై జీవుండు వలను మెఱయఁ**

**ఆ. బ్రాభవమున భూత పంచకేంద్రియమనో, లింగదేహములను లీలఁ గూడు,**
**విడుచు నన్యుఁ డొకఁడు విభుఁడు దీనికి మీరు, వొగులనేల? వగలఁ బొరల నేల? 53**

**ప్రతి :** భూపాలకుఁడు= రాజు; నిద్ర+పోయెడిన్= నిదురిస్తున్నాడు; ఒండేమి= అంతేకాక మరేమి!; వెఱ్ఱులార= ఓ అమాయకులారా!; విలపింపన్+ఏటికి= ఎందులకు దుఃఖిస్తారు?; ఎవ్వఁడు= ఎవడు; భాషించున్= మాట్లాడతాడో; ఎవ్వఁడు= ఎవడు; ఆకర్ణించున్= వింటుంటాడో; అట్టివాఁడు= అటువంటివాడు; ఎన్నఁడో అరగినాఁడు= ఎప్పుడో వెళ్ళిపోయాడు; ప్రాణభూతుండు+ఐన= ప్రాణభూతుడుగా ఉన్న; పవనుఁడు= గాలి; ఆకర్ణింపన్= వినలేదు; భాషింప నేరఁడు= మాట్లాడలేదు; ప్రాణి దేహములకు వేఱై= ప్రాణికి శరీరానికి భిన్నమై; తాను ముఖ్యుఁడు+ఐ= తాను ప్రధానుడై; ఇంద్రియవంతుఁడు+ఐ= ఇంద్రియాలు కలవాడై; జీవుండు వలను మెఱయన్= జీవుని వలన ప్రకాశింపగా; ప్రాభవమునన్=

వైభవంతో; భూతపంచక= పంచభూతాలను; ఇంద్రియ= ఇంద్రియాలను; మనస్= మనస్సును; లింగదేహంబులను= లింగశరీరాలను; లీలన్+కూడున్= విలాసంగా కలుస్తాడు; విడుచున్= వాటిని విడిచిపెడతాడు కూడా; అన్యుఁడు+ ఒకఁడు= ఇతరుడైన మరొకడు (పరమాత్మ); విభుఁడు= ఈ క్రియలన్నిటికి ప్రభువు; దీనికి= ఈ పరిస్థితికి; మీరున్+పొగులన్+ ఏల= మీరు ఎందుకు బాధపడాలి!; వగలన్= బాధలతో; పొరలన్+ఏల= ఎందుకు దొర్లుతారు?!

**తా :** ఓ వెర్రులారా! ఈ రాజు నిద్రిస్తుంటే ఎందుకు దుఃఖిస్తారు! మాటలు మాట్లాడే, వినే జీవుడు ఎప్పుడో వెళ్ళిపోయాడు; ప్రాణభూతంగా ఉన్న వాయువు ఉన్నా, అది విడిగా భాషించడం కాని, వినడం గాని చేయలేదు. జీవుడు ప్రాణికి దేహానికి వేరుగా ఉండి అతడే ప్రధానుడై ఇంద్రియ ప్రభావంతో ఉంటాడు. పంచభూతాలు, ఇంద్రియాలు మనసులతో లింగదేహాలను అతడు కలుస్తూ ఉంటాడు. విడుస్తూ ఉంటాడు. అసలు ఈ వ్యాపారానికి ప్రభువు మరొకడున్నాడు. అతడే పరమాత్మ. ఈ రాజు మరణించాడని మీరు బాధ పడవలసిన పని లేదు. దుఃఖంతో దొర్లవలసిన పని కూడా లేదు.

**క. ఎందాఁక నాత్మదేహము, నొందెడు నందాఁకఁ గర్మయోగము లటపైఁ**
**జెందవు, మాయాయోగ, స్పందితులై రిత్త జాలిఁబడ నేమిటికిన్? 54**

**ప్రతి :** ఆత్మ= ఆత్మ అనేది; ఎందాఁకన్= ఎంత వరకు; దేహమున్+ఒందెడున్= దేహంతో కలసి ఉంటుందో; అందాఁకన్= అంతవరకు; కర్మయోగములు= కర్మతో కలయిక లుంటాయి; అటపైన్= అటుపైన (దేహంనుండి ఆత్మ విడివడిన పిదప); చెందవు= కర్మయోగాలు పొందవు; రిత్త= వ్యర్థంగా; మాయాయోగస్పందితులు+ఐ= మాయతో కలసి, కదలాడి; జాలిన్+పడన్= బాధపడుట; ఏమిటికిన్= ఎందుకు?!

**తా :** ఆత్మ, దేహంతో ఎంతవరకు కలసి ఉంటుందో అంతవరకే ఈ కర్మయోగ సంబంధం ఉంటుంది. ఆత్మ, దేహాన్ని విడిచిన తరువాత ఈ సంబంధాలు ఉండవు. మాయకు గురియై ఎందుకు వ్యర్థంగా చింతిస్తారు?!

**మ. చెలులుం దల్లులుఁ దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని**
**ర్మలగేహంబు లటంచుఁ గూర్తురు, మహామాయాగుణభ్రాంతులై**
**కలలోఁ దోఁచిన యర్థముల్ నిజములే? కర్మానుబంధంబులం**
**గలుగున్ సంగము, లేక మానుఁ బిదపం గర్మాంత కాలంబునన్. 55**

**ప్రతి :** మహామాయాగుణభ్రాంతులు+ఐ= మహా మాయాగుణానికి చిక్కినవారై; చెలులున్= స్నేహితులును; తల్లులున్= తల్లులు; తండ్రులు= తండ్రులు; ఆత్మజులు= కుమారులు; సంసేవ్యుల్= ఆశ్రయించినవారు; సతుల్= భార్యలు; నిర్మల గేహంబులు+అటంచున్+కూర్తురు= స్వచ్ఛమైన గృహాలు అంటూ ఏర్పరుచుకుంటారు; కలలోన్= స్వప్నంలో; తోఁచిన+ అర్థముల్= కనిపించిన అంశాలు; నిజములే= యథార్థాలా!; సంగము= కలయిక అనేది; కర్మ+అనుబంధంబులన్= కర్మ సంబంధంతో; కలుగున్= కలుగుతాయి; కర్మ+అంతకాలంబునన్= కర్మబంధం ముగిసిపోతే; పిదపన్= ఆ తర్వాత; లేక మాను= ఆ కలయిక ఉండదు.

**తా :** మహామాయా మోహితులైన కొందరు – స్నేహితులు, తల్లులు, తండ్రులు, కుమారులు, ఆశ్రితులు, భార్యలు మంచి గృహాలు అంటూ కొన్ని ఏర్పరుచుకుంటారు. స్వప్నంలో కనిపించిన అర్థాలు (విషయాలు) సత్యాలా! కాదు కదా! నిజానికి కర్మబంధంవల్లనే కలయిక, కర్మ నశిస్తే నిస్సంగం కలుగుతూ ఉంటాయి.

**వ. మఱియు మాయాగుణప్రపంచంబు నెఱింగెడు తత్త్వజ్ఞులు నిత్యానిత్యంబులం గూర్చి సుఖ దుఃఖంబులం జెంద, రజ్ఞులు గొందఱు యోగవియోగంబులకు సుఖదుఃఖంబుల నొందుదురు, తొల్లి యొక్క మహాగహనంబున విహంగంబులకు నంతకభూతుండైన యెఱుకగలఁ డతం డొక్కనాఁడు ప్రభాతంబున లేచి వాటంబైన వేఁట తమకంబున 56**

**ప్రతి :** మఱియున్= అంతేకాక; మాయాగుణప్రపంచంబున్+ఎఱింగెడు= మాయతో కూడిన ఈ ప్రపంచంగూర్చి తెలిసికొన్న; తత్త్వజ్ఞులు= తత్త్వం తెలిసినవారు; నిత్య+అనిత్యంబులన్+కూర్చి= ఏది శాశ్వతమో ఏది అశాశ్వతమో అనేదాని గుఱించి; సుఖదుఃఖంబులన్+చెందరు= సుఖదుఃఖాలు పొందరు; అజ్ఞులు+కొందఱు= కొంతమంది అజ్ఞానులు; యోగవియోగంబులకున్= కలయికలకు, విడిపోవడానికి; సుఖదుఃఖంబులన్= సుఖదుఃఖాలను; ఒందుదురు= పొందుతారు; తొల్లి= పూర్వం; ఒక్క మహాగహనంబునన్= ఒక దట్టమైన అడవిలో; విహంగంబులకున్= పక్షులకు; అంతక భూతుండు+ఐన= యముని వంటివాడైన; ఎఱుకగలఁడు= ఒక కిరాతుడు ఉన్నాడు; అతండు+ఒక్కనాఁడు= అతడు ఒకరోజు; ప్రభాతంబునన్ లేచి= సూర్యోదయాన మేల్కొని; వాటంబు+ఐన= అనుకూలమైన; వేఁట తమకంబునన్= వేటమీది మోహంతో...

**తా :** ఈ మాయాప్రపంచ లక్షణం ఎరిగిన, తత్త్వం తెలిసిన మహాత్ములు నిత్యమైన వాటికి సుఖం పొందరు. అనిత్యం అయినవాటికి దుఃఖం పొందరు. కొందరు అజ్ఞానులు మాత్రమే ఈ సంయోగ వియోగాలకు సుఖ దుఃఖాలు పొందుతారు. పూర్వం ఒక భయంకరారణ్యంలో ఒక బోయవాడు పక్షులను సంహరించేవాడు. అతడు ఒకనాడు సూర్యోదయాన లేచి, వేటాడాలనే ఆసక్తితో, (బయలుదేరాడు).

**క. వల లురులు జిగురుఁ గండెలుఁ, జలిదియుఁ జిక్కంబు ధనువు శరములు గొనుచుం**
**బులుఁగులఁ బట్టెడు వేఁడుక, నలుగులు వెడలంగఁ గదలి యడవికిఁ జనియెన్. 57**

**ప్రతి :** వలలు; ఉరులు= ఉచ్చులు; జిగురున్= అంటుకొనే పదార్థమైన బంక; కండెలున్= కొన్ని దారపు కండెలు; చలిదియున్= చద్ది అన్నము; చిక్కంబు= ఒక ఉట్టి; ధనువు= ధనుస్సు; శరములు+కొనుచున్= కొన్ని బాణాలు తీసికొని; పులుఁగులన్= పక్షులను; పట్టెడు వేఁడుకన్= పటుకోవాలన్న ఉత్సాహంతో; అలుగులు వెడలంగన్= బాణాలు వేసుకుంటూ; కదలి= బయలుదేరి; అడవికిన్+చనియెన్= అడవిలోకి వెళ్ళాడు.

**తా :** వలలు, ఉచ్చులు, జిగురు కండెలు, చద్ది అన్నపుమూట, చిక్కము తీసుకున్నాడు. ఇంకా విల్లంబులు తీసుకొని, పక్షులను వేటాడే ఉత్సాహంతో బాణాలు వేసికొంటూ అడవిలోకి వెళ్లాడు.

**వ. ఇట్లడవికిం జని తత్ప్రదేశంబునందు. 58**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; అడవికిన్+చని= అడవికి వెళ్ళి; తత్ప్రదేశంబున్+అందున్= ఆ అటవీ ప్రాంతంలో...

**తా :** ఈ విధంగా అడవికి వెళ్లాడు. ఆ అరణ్యంలో

**క. కట్టలుకఁ దడుకు చాటునఁ, బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున ఱెక్కల్**
**వట్టి విఱిచి చిక్కములోఁ, బెట్టుచు విహరించె లోకభీకరలీలన్. 59**

**ప్రతి :** కడు+అలుకన్= మిక్కిలి కోపంతో; తడుకు చాటునన్= తడికమాటున; ఉరిగోలన్= ఉచ్చులు వేసే కర్రలతో; పిట్టలన్= పిట్టలను; తిగిచి= పట్టుకొని; బిఱుసున= కర్కశంగా; ఱెక్కల్+పట్టి= రెక్కలుపట్టి; విఱిచి= ఆ రెక్కలు విరిచి; చిక్కములోన్+పెట్టుచున్= సంచిలో పెడుతూ; లోక భీకరలీలన్= లోకానికి భయం కలిగే విధంగా; విహరించెన్= సంచరించాడు.

**తా :** మిక్కిలి ఆగ్రహంతో, పొదల మాటున, ఉరిగోలలతో పిట్టలను పట్టుకొని, కఠినంగా వాటి రెక్కలను విరిచి చిక్కెంలో వేసికొంటూ లోకభయంకరంగా ఆ అడవిలో ఆ కిరాతుడు సంచరించాడు.

**వ. మఱియు నానావిధంబులగు శకుంతంబుల నంతంబు నొందించుచు సకల పక్షి సంహార సంరబ్ధకుండైన లుబ్ధకుండు తన ముందటఁ గాలచోదితంబై సంచరించుచున్న కుళింగపక్షి మిథునంబుల గనుంగొని యందుఁ గుళింగి నురిం దిగిచి యొక్క చిక్కంబులో వైచినం జూచి దుఃఖించి కుళింగపక్షి యిట్లనియె. 60**

**ప్రతి :** మఱియున్= మరియు; నానావిధంబులు+అగు= అనేక విధాలైన; శకుంతంబులన్= పక్షులను; అంతంబున్+ఒందించుచున్= చంపుతూ; సకలపక్షి సంహార సంరబ్ధకుండు+ఐనన్= అన్ని పక్షులను చంపడానికి సిద్ధపడినట్టి; లుబ్ధకుండు= ఆ బోయవాడు; తన ముందటన్= తన ఎదుట; కాలచోదితంబు+ఐ= దైవంచే నడుపబడినవాడై; సంచరించుచున్న= సంచరిస్తున్న; కుళింగపక్షి మిథునంబులన్= అడవి పిచ్చుకల జంటను; కనుంగొని= చూచి; అందున్= వాటిలో; కుళింగిన్= ఆడపక్షిని; ఉరిన్+తిగిచి= ఉచ్చువేసి పట్టుకొని; ఒక్క చిక్కంబులో వైచినన్= ఒక సంచిలో వేయగా; చూచి= చూచి; దుఃఖించి= బాధపడి; కుళింగపక్షి= మగ పక్షి; ఇట్లు అనియెన్= ఇలా అంది.

**తా :** మరియు అన్ని విధాల పక్షులను చంపుతూ పక్షులను సంహరించడానికి ఒడిగట్టిన ఆ కిరాతుడు తన ముందు దైవవశాన ఎగిరి సంచరిస్తున్న అడవి పిచ్చుక జంటలో ఆడపక్షిని ఉరిగోల వేసి పట్టుకొని తన చిక్కెంలో వేసుకున్నాడు. అది జూచి మగపక్షి దుఃఖిస్తూ ఇలా అంది.

**చ. అడవుల మేఁత మేసి మన మన్యుల కెన్నఁడు నెగ్గు సేయ కి**
**క్కడ విహరింప నేఁడకట! కట్టిఁడి బ్రహ్మ కిరాతు చేతిలోఁ**
**బడుమని వ్రాసెనే నుదుటఁ? బాపపు దైవము కంటికింత యె**
**క్కుడు బరువయ్యెనే బ్రదుకు? కోమలి! యే మన నేర్తుఁ జెల్లరే! 61**

**ప్రతి :** అడవులన్= అడవులలో; మేఁతమేసి= దొరికిన ఆహారం తిని; మనము= మనం; అన్యులకు+ఎన్నఁడున్= ఇతరులకు ఎప్పుడూ; ఎగ్గున్+చేయక= కష్టం కలిగించకుండా; ఇక్కడ= ఈ ప్రాంతంలో; విహరింపన్= సంచరిస్తుండగా; కట్టిఁడి బ్రహ్మ= కఠినమైన మనసుగల బ్రహ్మ; కిరాతు చేతిలోన్= బోయవాని చేతిలో పడుమని; నేఁడు+అకట= అయ్యో! నేడు; వ్రాసెనే నుదుటన్= నొసటన వ్రాసినట్లున్నాడు; పాపపు దైవముకంటికి= పాడు దైవము కంటికి; బ్రదుకు= మనజీవితం; ఇంత ఎక్కుడు బరువయ్యెనే= ఇంత ఎక్కువ భారం అయ్యిందా!; కోమలి!= ఓ భార్యామణీ!; ఏ మన నేర్తున్= ఏమనగలను; చెల్లరే= అయ్యో!

**తా :** ఇతరులకు ఎవ్వరికీ ఏ కష్టం కలిగించకుండా, అడవులలో మేతమేసి సంచరించే మనకు, కఠినాత్ముడైన బ్రహ్మ ఈ బోయవాని చేతిలో పడే వ్రాతను మన నుదుట వ్రాశాడు. పాడుదైవం చూపులకు, మన బ్రదుకు ఇంత బరువయ్యిందా? ఓ ప్రియురాలా! అయ్యో! ఇంకేమి చెప్పమంటావు!

**క. ఒక మాటు మనల నందఱఁ, బ్రకటించి కిరాతు వలలఁ బడఁ జేయక ని**
**న్నొకటిన్ వలఁ బడఁ జేసిన, వికటీకృత దక్షమైన విధి నే మందున్? 62**

**ప్రతి :** మనలను+అందఱన్= మనలనందరినీ; ఒక మాటు= ఒక్కసారిగా; ప్రకటించి= కనబడేలాచేసి; కిరాతువలలన్= ఈ బోయవానియొక్క వలలయందు; పడన్+చేయక= పడేలా చేయకుండా; నిన్ను+ఒకటిన్= నిన్ను ఒక్కదానినే; వలన్+పడన్+చేసిన= వలలో పడేలా చేసిన; వికటీకృత= కుటిలత్వం చేయడంలో; దక్షమైన= ఆరితేరిన; విధిన్= దైవాన్ని; ఏ మందున్= ఏమన గలను?!

**తా :** ఈ బోయవాని వలలో మనం అందరం ఒకే మారు పడేలా చేయకుండా, వంచన చేయడంలో నేర్పరియైన దైవం నిన్నొక్కదానినే ఈ బోయవాని వలలో పడేలా చేశాడు. ఈ విధి వికృత చేష్టలను ఏమని చెప్పగలను?

**ఉ. ఱెక్కలు రావు పిల్లలకు, ఱేపట నుండియు మేఁత గానమిం**
**బొక్కుచుఁ గూఁటిలో నెగసి పోవఁగ నేరవు, మున్ను తల్లి యీ**
**దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి న**
**ల్దిక్కులుఁ జూచుచున్న వతిదీనత నెట్లు భరింతు నక్కటా! 63**

**ప్రతి :** పిల్లలకున్= మన బిడ్డలకు; ఱెక్కలు రావు= ఇంకా రెక్కలు రానే రాలేదు; ఱేపటన్+ఉండియున్= తెల్లవారినప్పటినుండి; మేఁతన్+కానమిన్= ఆహారం దొరకకపోవడంవల్ల; పొక్కుచున్= బాధపడుతూ; గూఁటిలోన్= ఈ గూడులోనే ఉంటూ; ఎగసిపోవఁగ నేరవు= ఎగిరిపోలేని స్థితిలో ఉంటాయి; మున్ను= పూర్వము; తల్లి= తన తల్లి; ఈ దిక్కుననుండి వచ్చునని= ఈ మార్గంనుండే వస్తుందని; త్రిప్పని చూడ్కులన్= కళ్ళు ఆర్పకుండా (చూపు తిప్పకుండా); నిక్కి నిక్కి= మెడను పైకెత్తి ఎత్తి; అతిదీనతన్= మిక్కిలి దైన్యంతో; నలు+దిక్కులన్+చూచుచున్నవి= నాల్గువైపుల చూస్తున్నాయి; అక్కటా= అయ్యో! ఎట్లు భరింతున్= ఏరకంగా సహించగలను?!

**తా :** పిల్లలకు ఇంకా రెక్కలు రానే రాలేదు. తెల్లవారేసరికి ఆకలి వేస్తే దుఃఖిస్తాయి, తప్ప గూటినుండి ఎగరలేవు. నా తల్లి ఈ వైపునుండి వస్తుంది కదా అని చూపులు త్రిప్పకుండా మెడను పైకెత్తి దీనత్వంతో చూస్తూ ఉంటాయి. ఎలా నేను భరించగలను?!

**వ. అని ఇవ్విధంబున. 64**

**ప్రతి :** అని= అంటూ; ఈ+విధంబునన్= ఈ విధంగా...

**తా :** అని ఈ విధంగా పలుకుతుండగా

**క. కుంఠితనాదము తోడను, గంఠము శోషింప వగచు ఖగమును హననో**
**త్కంఠుండైన కిరాతుఁ డ, కుంఠిత గతి నేసె నొక్క కోలం గూలన్. 65**

**ప్రతి :** కుంఠితనాదము తోడను= మొక్కవోయిన ధ్వనితో (ధ్వని సన్నగిల్లగా); కంఠము శోషింపన్= కంఠం ఎండిపోగా; వగచు= దుఃఖించు; ఖగమును= పక్షిని; హనన+ఉత్కంఠుండు+ఐన= చంపుటకు ఆసక్తిగల; కిరాతుcడు= బోయవాడు; ఒక్కకోలన్= ఒక్క బాణంతో; కూలన్= నేలకూలే విధంగా; అకుంఠితగతిన్= గురితప్పకుండా; ఏసెన్= కొట్టెను.

**తా :** గొంతు ఎండిపోయేలా గద్గద స్వరంతో, బాధ పడుతున్న ఆ మగపక్షిని కూడా పట్టి చంపే ఆసక్తితో వున్న బోయవాడు ఒక్క బాణంతో గురితప్పకుండా నేల కూలేలా కొట్టాడు.

**క.　కాలము వచ్చిన శబరుని, కోలను ధరఁ గూలె ఖగము ఘోషము తోడం**
**గాలము డాసిన నేలం, గూలక పో వశమె యెట్టి గుణవంతులకున్? 66**

**ప్రతి :** కాలము వచ్చిన= చనిపోవు ఘడియలు సమీపించగా; ఖగము= ఆ మగపక్షి; శబరుని కోలను= బోయవాని బాణముచేత; ఘోషము తోడన్= పెద్దధ్వనితో; ధరన్+కూలెన్= భూమిపై కూలిపోయింది; ఎట్టి గుణవంతులకున్= ఎటువంటి సద్గుణాలు కలిగినవారికైనా కూడా; కాలము డాసినన్= కాలం సమీపించగా; నేలన్+కూలకన్= నేల కూలకుండా; పోవశమె= ఉండటం సాధ్య మవుతుందా!

**తా :** ఎంతటి సుగుణ సంపన్నులైనా కాలం సమీపించినట్లయితే, నేలకూలక తప్పదు గదా! అలాగే అంత్యకాలం చేరువ కాగానే ఈ మగపక్షి ఆ బోయవాని బాణపు దెబ్బకు పెద్దధ్వనితో నేల గూలింది.

**ఉ.　కావున మీరు చచ్చుతతిఁ గానరు, చచ్చి ధరిత్రిఁ బడ్డ ధా**
**త్రీవిభు దేహముం గదిసి దీనత నేడువ నేల? పొండు, చిం**
**తావతులార! వత్సరశతంబులకైన నిజేశు చక్కికిం**
**బోవుట దుర్లభంబు, మృతిఁ బొందిన వారలు చేరవత్తురే? 67**

**ప్రతి :** కావునన్= కాబట్టి; మీరు చచ్చుతతిన్= మీరు చనిపోయే సమయాన్ని; కానరు= తెలిసికోలేరు; చచ్చి ధరిత్రిన్+పడ్డ= చచ్చి నేలగూలిన; ధాత్రీవిభుదేహమున్= ఈ రాజు దేహాన్ని; కదిసి= సమీపించి; దీనతన్+ఏడువన్+ఏల= దైన్యంతో దుఃఖించడం ఎందుకు?! పొండు= ఇక్కడనుండి వెళ్ళిపొండి; చింతావతులార!= చింతిస్తున్న కాంతలారా!; వత్సరశతంబులకు+ఐనన్= వంద ఏళ్ళకైనా (ఎన్ని సంవత్సరాలకైనా); నిజ+ఈశు చక్కికిన్= మీ రాజు సమీపానికి; పోవుట దుర్లభంబు= మీరు వెళ్ళలేరు (ఎన్ని సంవత్సరాలు దుఃఖించినా మీరు ఆ రాజును చేరలేరు); మృతిన్+పొందిన వారలు= మరణించినవారు; చేరవత్తురే= తిరిగి వస్తారా!

**తా :** ఓ దుఃఖితులైన కాంతలారా! మీరు కూడా మీ మరణ సమయాన్ని గుర్తించ లేరు. నేలగూలి మరణించిన ఈ రాజు దేహంపై పడి ఏడ్చినా, వందేళ్లకైనా మీరు అతనిని చేరలేరు. వెళ్ళిపొండి. అయినా చనిపోయిన వారు తిరిగి వస్తారా!

**వ.　అని యిట్లు కపట బాలకుండై క్రీడించుచున్న యముని యుపలాల నాలాపంబులు విని సుయజ్ఞుని బంధువులెల్ల వెఱఁగుపడి సర్వప్రపంచంబు నిత్యంబు గాదని తలంచి శోకింపక సుయజ్ఞునికి సాంపరాయిక కృత్యంబులు సేసి చని, రంత నంతకుం డంతర్హితుం డయ్యెనని చెప్పి హిరణ్యకశిపుండు దన తల్లిని, దమ్మునిభార్యలంజూచి యిట్లనియె. 68**

**ప్రతి :** అని ఇట్లు= అని ఈ ప్రకారంగా; కపటబాలకుండు+ఐ= మాయా బాలుడై; క్రీడించుచున్న= అక్కడ ఆడుకుంటూ తిరుగుతున్న; యముని= యమునియొక్క; ఉపలాలన+ఆలాపంబులు= ఓదార్పుమాటలు; విని= వినినవారై; సుయజ్ఞుని బంధువులెల్లన్= సుయజ్ఞుని బంధువులంతా; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; సర్వప్రపంచంబు= ఈ సమస్త ప్రపంచం; నిత్యంబున్+కాదని తలంచి= శాశ్వతం కాదని గుర్తించి; శోకింపక= దుఃఖించక; సుయజ్ఞునికి= ఆ సుయజ్ఞుడు అనే రాజునకు; సాంపరాయిక కృత్యంబులు= ఉత్తర క్రియలు; చేసి చనిరి= జరిపించి వెళ్ళిపోయారు; అంతన్= అటుపిమ్మట; అంతకుండు= యముడు; అంతర్హితుండు+అయ్యెన్+అని= అదృశ్యం అయ్యాడు అని; చెప్పి= చెబుతూ; హిరణ్యకశిపుండు= హిరణ్యకశిపుడు; తన తల్లిని= తన తల్లి దితిని; తమ్ముని భార్యలన్ చూచి= తమ్ముని భార్యలను జూస్తూ; ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా మాయాబాలుడై అక్కడ తిరుగుతున్న యముని ఓదార్పు మాటలు విని సుయజ్ఞుని బంధువులంతా ఆశ్చర్య పడ్డారు. ఈ సమస్త ప్రపంచం అశాశ్వతం అని తెలిసికొని, దుఃఖపడకుండా సుయజ్ఞునికి ఉత్తరక్రియలు జరిపించి వెళ్ళిపోయారు. ఆ తరువాత యముడు అదృశ్యం అయిపోయాడు. అంటూ హిరణ్యకశిపుడు తన తల్లిని, తమ్ముని భార్యలను చూచి ఇలా అన్నాడు.

**క. పరు లెవ్వరు? దా మెవ్వరు?, పరికింపఁగ నేక మగుట భావింపరు, త**
**త్పరమజ్ఞానము లేమిని, బరులును నే మనుచుఁ దోఁచుఁ బ్రాణుల కెల్లన్. 69**

**ప్రతి :** ప్రాణులకు+ఎల్లన్= సమస్త జీవులకు; పరులు+ఎవ్వరు?= ఇతరు లెవరు? తాము+ఎవ్వరు= అసలు తాము ఎవరు; పరికింపఁగన్= పరీక్షించి సత్యం తెలిసికొంటే; ఏకము+అగుటన్= వారు వీరు అందరూ ఒక్కటే అనే విషయాన్ని; భావింపరు= ఆలోచించరు; తద్+పరమజ్ఞానము లేమిని= ఆ గొప్పజ్ఞానం లేనందువల్ల; పరులునున్= ఇతరులు; ఏము+అనుచున్= మేము అనే భేదభావం; తోఁచున్= ఏర్పడుతుంది.

**తా :** వీళ్ళు పరాయివాళ్ళు, వీళ్ళు మనవాళ్ళు అని అనుకుంటారు గాని, పరికించి సత్యం గుర్తిస్తే, అందరూ ఒక్కటే. ఈ తత్త్వం తెలియక పోవడంవల్లనే ప్రాణులందరికీ “వారు – మేము” అని భేదభావం కలుగుతున్నది.

**వ. అని తెలియం బలికిన హిరణ్యకశిపుని వచనంబులు విని దితి కోడండ్రునుం దానును శోకంబు మాని తత్త్వవిలోకనంబు గలిగి లోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియె నని చెప్పి నారదుండు ధర్మనందనున కిట్లనియె. 70**

**ప్రతి :** అని= ఈ విధంగా; తెలియన్+పలికినన్= వివరంగా చెప్పిన; హిరణ్యకశిపుని= హిరణ్యకశిపునియొక్క; వచనంబులు విని= మాటలువిని; దితి కోడండ్రునున్= దితియొక్క కోడళ్ళు అనగా హిరణ్యాక్షుని భార్యలు; తానును= దితి; శోకంబున్+మాని= దుఃఖాన్ని విడిచి; తత్త్వవిలోకనంబున్+కలిగి= తత్త్వాన్ని గ్రహించి; లోక+అంతరగతుండు+అయిన= పరలోకానికి చేరిన; కొడుకునకున్= తన కుమారుడైన హిరణ్యాక్షుని కొరకు; వగవక= దుఃఖించక; చనియెన్= వెళ్లెను; అని చెప్పి= అని ఈ ప్రకారంగా చెప్పి; నారదుండు= నారదుడు; ధర్మనందనునకు= ధర్మరాజుతో; ఇట్లనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని హిరణ్యకశిపుడు స్పష్టంగా చెప్పగా తల్లి దితి, కోడళ్ళు, దుఃఖాన్ని దిగమింగి, తత్త్వాన్ని గ్రహించారు. పరలోకానికి చేరిన హిరణ్యాక్షుని గూర్చి దుఃఖపడకుండా వెళ్లారు. అని చెప్పి, నారదుడు ధర్మరాజుతో ఇంకా ఇలా అన్నాడు.

**క. అజరామర భావంబును, ద్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వము దో**
**ర్విజితాఖిల శాత్రవమును, గజరిపు బలమును హిరణ్యకశిపుఁడు గోరెన్. 71**

**ప్రతి :** హిరణ్యకశిపుఁడు= రాక్షసరాజు హిరణ్యకశిపుడు; అజర+అమర భావంబునున్= ముసలితనం మరణంలేని విధానంతో; త్రిజగత్+రాజ్యంబున్= ముల్లోకాలపై ఆధిపత్యం; అప్రతిద్వంద్వము= ఎదురులేని శక్తి; దోర్+విజిత+అఖిల శాత్రవమును= తన భుజబలంతో ఇతరులను అందరినీ జయించేశక్తి; గజరిపు= ఏనుగుకు శత్రువైన; బలమును= సింహ బలాన్ని; కోరెన్= కోరుకున్నాడు.

**తా :** హిరణ్యకశిపుడు మరణం, ముసలితనం లేని స్థితిని, ఎదురులేని ముల్లోకాధిపత్యం, ఇతరులందరినీ జయించగల భుజబలం, సింహబలం కావాలని కోరుకున్నాడు.

**వ. ఇట్లు గోరి మందరాచలద్రోణికిం జని యందుఁ గాలి పెను వ్రేల నేల నిలువంబడి యూర్ధ్వ బాహుండయి మిన్ను సూచుచు వాఁడి మయూఖంబులతోడి ప్రళయకాల భానుండునుం బోలె దీర్ఘ జటారుణ ప్రభా జాలంబులతోడ నెవ్వరికిం దేఱిచూడరాక పరమ దారుణంబైన తపంబు సేయుచుండె, నిర్జరులు నిజస్థానంబుల నుండి, రంత 72**

**ప్రతి :** ఇట్లు+కోరి= ఈ విధంగా కోరుకొని; మందర+అచల ద్రోణికిన్+చని= మందరపర్వతం సానుప్రదేశానికి (మందర పర్వతంయొక్క కొండపల్లపు ప్రాంతానికి) వెళ్ళి; అందున్= ఆ ప్రదేశమందు; కాలి పెను వ్రేలన్= కాలియొక్క పెద్దవేలైన బొటనవ్రేలిపై; నిలువన్+పడి= నిలబడి; ఊర్ధ్వబాహుండు+అయి= చేతులు పైకెత్తి; మిన్నున్+చూచుచు= ఆకాశాన్ని చూస్తూ; వాఁడి మయూఖంబులతోడి= తీక్ష్ణమైనకిరణాలతో కూడిన; ప్రళయకాలభానుండునున్+పోలెన్= ప్రళయకాలంలో ఉండే సూర్యునివలె; దీర్ఘజట+అరుణ ప్రభా జాలంబులతోడన్= పెద్దవైన జడలయొక్క ఎఱ్ఱని కాంతి సమూహంతో; ఎవ్వరికిన్= ఎవ్వరికీ; తేఱిచూడరాక= స్పష్టంగా చూడలేనట్టుగా; పరమదారుణంబు+ఐన= మిక్కిలి భయంకరమైన; తపంబున్+చేయుచుండెన్= తపస్సు చేస్తున్నాడు; నిర్జరులు= దేవతలు; నిజస్థానంబులన్+ఉండిరి= వారి వారి ప్రదేశాలలో నిశ్చేష్టులై ఉన్నారు; అంతన్= అంతలో...

**తా :** ఇటువంటి వరాలుకోరి హిరణ్యకశిపుడు మందరాచలంయొక్క కొండపల్లపు ప్రాంతానికి చేరి, అక్కడ తన కాలిబొటన వ్రేలుపై నిలబడి, చేతులు పైకెత్తి, ఆకాశం వైపు చూస్తూ తీవ్రమైన కిరణాలతో కూడిన ప్రళయకాల భాస్కరునివలె పొడవైన ఎరుపురంగు జటలతో, ఎవ్వరు తేరిపార చూడలేనట్లుగా పరమఘోరమైన తపస్సు చేస్తున్నాడు. దేవతలంతా చేష్టలుడిగి వారివారి స్థానాలలో ఉండి చూస్తున్నారు. ఇలా ఉండగా,

**మ. అదరెం గుంభిని సాద్రియై, కలఁగె నేడంభోనిధుల్, తారకల్**
**సెదరెన్, సగ్రహసంఘులై దిశలు విచ్ఛిన్నాంతలై మండెఁ, బె**
**ల్లదరెన్ గుండెలు జంతుసంహతికి, నుగ్రాచారదైత్యేంద్ర మూ**
**ర్ధ దిశోద్ధూత సధూమ హేతిపటలోదంచత్తపోవహ్నిచేన్. 73**

**ప్రతి :** కుంభిని= భూమి; స+అద్రియై= పర్వతాలతో సహా; అదరెన్= అదిరిపోయింది; ఏడు+అంభోనిధుల్= ఏడు సముద్రాలు; కలఁగెన్= కలతపడ్డాయి, కిందు మీదులయ్యాయి; తారకల్+చెదరెన్= నక్షత్రాలు చెల్లా చెదురయ్యాయి;

దిశలు= దిక్కులు; విచ్ఛిన్న+అంతలు+ఐ= ముక్కముక్కలుగా అయి; సగ్రహసంఘులు+ఐ= గ్రహాలతో కూడి; మండెన్= తగులబడ్డాయి; ఉగ్ర+ఆచార= కఠినమైన దీక్షతో; దైత్య+ఇంద్ర= రాక్షసరాజుయొక్క; మూర్ధ దిశ= శిరసువైపునుండి; ఉద్ధూత= పైకి ఎగసిన; సధూమ= పొగతోకూడిన; హేతిపటల= అగ్ని శిఖల సమూహంయొక్క; ఉదంచత్= కూడిన; తపోవహ్నిచేన్= తపస్సుయొక్క మంటలచేత; జంతుసంహతికిన్= ప్రాణికోటికంతటికిని; గుండెలు= గుండెలు (ప్రాణాలు); పెల్లు+అదరెన్= ఎక్కువగా అదిరిపోయాయి.

**తా :** అతికష్టమైన ఆచారంతో హిరణ్యకశిపుడు తపస్సు చేయగా, పర్వతాలతో సహా భూమి అదిరింది. సప్తసముద్రాలు కల్లోలమయ్యాయి. గ్రహాలన్నీ ఉమ్మడిగా దిక్కులు పగిలి మండాయి. హిరణ్యకశిపుని తపస్సుయొక్క వేడిమితో అతని శిరస్సునుండి పొగతో కూడి, ఎగిసి పడే మంటలకు జంతుకోటి గుండెలు అదిరిపోయాయి.

**వ. ఇట్లు త్రైలోక్య సంతాపకరంబైన దైత్యరాజ తపో విజృంభణంబు సైరింపక నిలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకుం జని లోకేశ్వరుండయిన బ్రహ్మకు వినతులయి యిట్లని విన్నవించిరి. 74**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; త్రైలోక్య= మూడులోకాలకు; సంతాపకరంబు+ఐన= బాధను కలిగించే; దైత్యరాజ తపస్+విజృంభణంబున్= రాక్షసరాజు చేసే తపస్సుయొక్క ఆధిక్యతను; సైరింపకన్= సహింపలేక; నిలింపులు= దేవతలు; నాకంబున్= స్వర్గలోకాన్ని; విడిచి= విడిచిపెట్టి; బ్రహ్మలోకంబునకున్= బ్రహ్మలోకానికి; చని= వెళ్ళి; లోక+ఈశ్వరుండు+ అయిన= లోకాల నాయకుడైనట్టి; బ్రహ్మకున్= బ్రహ్మదేవునకు; వినతులు+అయి= వంగి నమస్కరించి; ఇట్లని= ఈ విధంగా; విన్నవించిరి= విన్నవించారు.

**తా :** ఈ విధంగా రాక్షసరాజు హిరణ్యకశిపుని తపస్సుయొక్క తీవ్రత మూడులోకాలను బాధించగా, దేవతలు సహింపలేక స్వర్గాన్ని విడిచి బ్రహ్మలోకానికి వెళ్ళి సకలలోక పాలకుడైన బ్రహ్మకు నమస్కరించి ఇలా విన్నవించారు.

**క. దితికొడుకు తపము వేఁడిమి, నతితప్తుల మైతి, మింక నలజడి నమరా**
**వతి నుండ వెఱతు, మె య్యది, గతి మాకును? దేవదేవ! కారుణ్యనిధీ! 75**

**ప్రతి :** కారుణ్యనిధీ= ఓ కరుణా నిలయా! దితికొడుకు= దితి పుత్రుడు హిరణ్యకశిపుని; తపము వేఁడిమిన్= తీవ్రమైన తపస్సుకు; అతి తప్తులము+ఐతిమి= మిక్కిలి తాపాన్ని పొందాం; ఇంకన్= ఇకపైని; అలజడిన్= ఆందోళనతో ఉన్న; అమరావతిన్= దేవనగరమైన అమరావతిలో; ఉండన్+వెఱతుము= నివసించడానికి భయపడుతున్నాం; దేవదేవ= దేవతలకు దేవుడవైన వాడా!; మాకును= మాకు; ఎయ్యది గతి= దిక్కు ఏది?!

**తా :** ఓ దేవ దేవా! కరుణానిలయా! బ్రహ్మదేవా! దితి పుత్రుడు హిరణ్యకశిపుడు చేస్తున్న తపోదీక్షవల్ల వచ్చిన వేడిచేత మేమందరం బాగా తపించి పోయాం. ఆందోళనతో ఈ అమరావతిలో ఉండలేం. మాకు దిక్కు తెలియక ఉన్నాం.

**శా. శంకా లేశము లేదు, దేవ! త్రిజగ త్సంహారమున్ దేవతా**
**సంకోచంబును వేదశాస్త్ర పదవీ సంక్షేపమున్ లేక యే**
**వంకన్ లేవ నటంచు దుస్సహ తపోవ్యావృత్తి చిత్తంబులో**
**సంకల్పించె నిశాచరుండు, ప్రతిసంస్కారంబు చింతింపవే. 76**

**ప్రతి :** దేవ!= ఓ బ్రహ్మదేవా!; త్రిజగత్= ముల్లోకాలను; సంహారమున్= సంహరించటం; దేవతా సంకోచంబును= దేవతలను అణగ తొక్కటం; వేదశాస్త్ర పదవీ సంక్షేపమున్ లేక= వేదశాస్త్రముల వినాశనం జరుగకుండా; ఏ వంకన్= ఏ విధంగానూ; లేవన్+అటంచున్= నా తపస్సును విరమించి లేవను అని; దుస్సహ= సహించుటకు వీలులేని; తపస్+వ్యావృత్తిన్= తపస్సుయొక్క నిష్ఠను; నిశాచరుండు= రాత్రులయందు సంచరించువారు, రాక్షసుడు; చిత్తంబులోన్= మనస్సులో; సంకల్పించెన్= సంకల్పించాడు; శంకాలేశము లేదు= రవంత అయినా అనుమానం లేదు; ప్రతిసంస్కారంబున్= ప్రతిక్రియను; చింతింపవే= ఆలోచించుమా!

**తా :** ఓ దేవా! మూడులోకాలను నశింపచేయాలనో, దేవతలను అణగద్రొక్కాలనో, వేదశాస్త్రాల వినాశనమో కోరి ఈ హిరణ్యకశిపుడు ఈ తీవ్రమైన తపస్సు ప్రారంభించాడు. ఇందులో రవంతైనా సందేహం లేదు. ఈ హిరణ్యకశిపుని ఆలోచనకు ప్రతీకారం ఏమి చేస్తే బాగుంటుందో ఆలోచించు!

**శా. నీ వే రీతిఁ దపోబలంబున జగ న్నిర్మాణముం జేసి యీ**
**దేవాధీశులకంటె నెక్కుడు సిరిం దీపించి, తిబ్భంగిఁ దా**
**నీ విశ్వంబుఁ దపస్సమాధి మహిమన్ హింసించి వే ఱొక్క వి**
**శ్వావిర్భావకరత్వశక్తి మదిలో నర్థించినాఁ డీశ్వరా! 77**

**ప్రతి :** ఈశ్వరా= ఓ ప్రభూ! నీవు+ఏ రీతిన్= నీవు ఏ విధంగా; తపోబలంబునన్= తపోబలంతో; జగత్+నిర్మాణమున్+చేసి= ఈ లోకాలన్నీ సృష్టించి; ఈ దేవ+అధీశులకంటెన్= ఈ దేవపాలకులకంటె; ఎక్కుడు సిరిన్= అధికమైన సంపదతో; దీపించితి(వి)= ప్రకాశిస్తున్నావో; ఈ+భంగిన్= ఈ రీతిగా; తాన్= తాను (ఆ హిరణ్యకశిపుడు); ఈ విశ్వంబున్= ఈ ప్రపంచాన్ని; తపస్+సమాధిమహిమన్= తపస్సు గొప్పదనంతో; హింసించి= బాధించి; వేఱొక్క= మరొక; విశ్వ+ ఆవిర్భావకరత్వశక్తి= విశ్వాలను పుట్టించే శక్తిని; మదిలోన్= మనసులో; అర్థించినాఁడు= కోరుతున్నాడు.

**తా :** ఓ ప్రభూ! నీవు నీ తపోబలంతో దేవపాలకులందరికంటె గొప్పవాడవై జగత్తులను సృష్టించి సంపదతో శోభిస్తుంటే ఈ హిరణ్యకశిపుడు తన తపస్సుతో ఈ లోకాలన్నిటిని హింసించి ఇంకొక క్రొత్త ప్రపంచనిర్మాణం చేసే శక్తిని మనసులో కోరుతున్నాడు.

**వ. అదియునుం గాక కాలాత్మకులగు జీవాత్ముల కనిత్యత్వంబు గలుగుటం జేసి తపోయోగ సమాధిబలంబునం దనకు నిత్యత్వంబు సంపాదింతు నని తలంచి నాఁడని మఱియు నిట్లనిరి. 78**

**ప్రతి :** అదియునున్+కాక= అంతేకాక; కాల+ఆత్మకులు+అగు= కాలానికిలోబడి ఉన్నట్టి; జీవ+ఆత్ములకు= జీవులందఱికి; అనిత్యత్వంబు= అశాశ్వతత్వం; కలుగుటన్+చేసి= ఉండటంచేత; తపస్+యోగ సమాధిబలంబునన్= తపస్సు యోగ సమాధులయొక్క బలంతో; తనకు= తనకు; నిత్యత్వంబు= శాశ్వతత్వాన్ని; సంపాదింతున్+అని= సంపాదిస్తానని; తలంచినాఁడు= భావించాడు; అని మఱియు నిట్లనిరి= అలా అంటూ తిరిగి ఇలా పలికారు.

**తా :** అంతేగాక కాలానికి అధీనమైన జీవులు అశాశ్వతులు కనుక; తపస్సు, యోగము, సమాధి బలంతో తనకు శాశ్వతత్వం కలగాలని హిరణ్యకశిపుడు అనుకుంటున్నాడు అంటూ, ఇంకా ఇలా అన్నారు.

**మ. భవదీయం బగు నున్నతోన్నత మహాబ్రహ్మైక పీఠంబు సం**
**స్తవనీయంబగు భూతియున్ విజయమున్ సౌఖ్యంబు సంతోషమున్**
**భువనశ్రేణికి నిచ్చు దైత్యుని తపస్స్ఫూర్తిన్ నివారించి యో**
**భువనాధీశ్వర! కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్. 79**

**ప్రతి :** ఓ భువన+అధీశ్వర= ఓ లోకాధినాథా!; భవదీయంబు+అగు= నీదైన; ఉన్నతోన్నత= అత్యున్నతమైన; మహా+బ్రహ్మ+ఏకపీఠంబునన్= అత్యున్నతమూ ఏకైకమైన బ్రహ్మస్థానాన్ని; సంస్తవనీయంబు+అగు= గౌరవింపబడే; భూతియున్= ఐశ్వర్యాన్ని; విజయమున్= విజయాన్ని; సౌఖ్యంబున్= సుఖాన్ని; సంతోషంబున్= ఆనందాన్ని; భువనశ్రేణికిన్+ఇచ్చు= లోకాలన్నిటికీ ఇచ్చే; దైత్యుని= రాక్షసుని; తపస్స్ఫూర్తిన్= తపోదీక్షను; నివారించి= అడ్డుకొని; పూర్ణప్రసాదంబునన్= సంపూర్ణమైన దయతో; భువనముల్= లోకాలను; కావవే= రక్షింపుమా!

**తా :** ఓ లోకాధీశ్వరా! నీ మహోన్నతమైన బ్రహ్మపీఠాన్ని, కొనియాడబడే నీ ఐశ్వర్యాన్ని, విజయాన్ని, సౌఖ్యాన్ని, సంతోషాన్ని లోకులపాలు చేయడానికి సిద్ధపడిన ఈ హిరణ్యకశిపుని తపస్సును నివారించి నీ పరిపూర్ణమైన దయతో ఈ లోకాలను కాపాడు.

## ✤ బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరంబు లిచ్చుట ✤

**వ. అని దేవతలు విన్నవించిన స్వయంభూతుండును, భగవంతుండు నైన నలుమొగంబుల వేల్పుప్రోడ భృగు దక్షాదులతోడ మందర పర్వతంబునకు వచ్చి యందు నియమ యుక్తుండును, బిపీలికావృత మేదో మాంసచర్మరక్తుండును, వల్మీకతృణ వేణుపటల పరిచ్ఛన్నుండును, మహాతపః ప్రభావ సంపన్నుండునునై నీరంధ్ర నిబిడ నీరద నికర నివిష్ట నీరజబంధుండునుం బోలె నివసించియున్న నిర్జరారాతిం జూచి, వెఱఁగుపడి నగుచు నిట్లనియె. 80**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; దేవతలు విన్నవించినన్= దేవతలందరు నివేదించగా; స్వయంభూతుండును= తనకు తానే జన్మించినవాడు; భగవంతుండును= భగవంతుడు; ఐన= ఐనటువంటి; నలుమొగంబుల వేల్పుప్రోడ= నాలుగు మొగముల బ్రహ్మ అనే దేవతాశ్రేష్ఠుడు; భృగుదక్షాదులతోడన్= భృగువు, దక్షుడు మొదలైన ప్రజాపతులతో కూడి; మందరపర్వతంబునకున్+వచ్చి= హిరణ్యకశిపుడు తపస్సు చేస్తున్న మందరపర్వతం వద్దకు వచ్చి; అందున్= ఆ పర్వతంమీద; నియమయుక్తుండును= నియమంతో కూడినవాడు; పిపీలిక+ఆవృత మేదో మాంసచర్మరక్తుండును= చీమలచేత ఆవరింపబడి వాటిచేత తినబడిన మజ్జ, మాంసచర్మరక్తాలు గలవాడు; వల్మీకతృణ వేణుపటల పరిః+ఛన్నుండును= పుట్టలు, గడ్డి, వెదుళ్ళ సమూహములచేత కప్పబడినవాడును; మహాతపః ప్రభావ= గొప్పదైన తపః ప్రభావంతో; సంపన్నుండునున్+ఐ= నిండినవాడు అయి; నిర్+రంధ్ర= ఎడం లేకుండా; నిబిడ= దట్టమైన; నీరద నికర= మేఘముల సమూహంచేత; నివిష్ట= కప్పబడిన; నీరజబంధుండునున్+పోలెన్= పద్మాలకు బంధువైన సూర్యుని లాగా; నివసించియున్న= నిలిచిన (ఉన్నటువంటి); నిర్+జర+అరాతిన్+చూచి= ముసలితనమంటూలేని దేవతల శత్రువైన ఆ హిరణ్యకశిపుణ్ణి చూచి; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** దేవతలందరూ బ్రహ్మవద్దకు వచ్చి మొరపెట్టారు; దేవతలలో అగ్రగణ్యుడు అయిన చతుర్ముఖబ్రహ్మ భృగువు దక్షుడు మొదలైన వారితో మందర పర్వతం వద్దకు వచ్చాడు. అక్కడ హిరణ్యకశిపుడు నియమనిష్ఠలతో ఉన్నాడు చీమలు అతని మజ్జనూ మాంసాన్ని చర్మాన్ని రక్తాన్ని పూర్తిగా తినివేశాయి. అతనిపైన పుట్టలు పెట్టాయి. గడ్డి మొలిచింది. వెదురు పొదలు పెరిగాయి. అతడు చేసిన మహాతపః ప్రభావంవల్ల దట్టమైన మేఘాల మధ్యలో ఉన్న సూర్యునివలె పుట్టలమధ్య ప్రకాశిస్తున్నాడు. అటువంటి హిరణ్యకశిపుడనే రాక్షసుని చూచి చతుర్ముఖబ్రహ్మ ఆశ్చర్యపడి నవ్వుతూ ఇలా అన్నాడు.

**మత్తకోకిలము.**

**ఓ సురారి కులేంద్ర! నీ క్రియ నుగ్రమైన తపంబు మున్**
**చేసి చూపినవారు లే రిఁకఁ జేయువారును లేరు, నే**
**నీ సమాధికి మెచ్చితిన్, విను, నీ యభీష్టము లిత్తు, నా**
**యాస మేటికి? లెమ్ము లెమ్ము మహాత్మ! కోరుము కోరికల్. 81**

**ప్రతి :** ఓ సుర+అరి+కుల+ఇంద్ర= దేవతలకు శత్రువులైన రాక్షస కులంలో శ్రేష్ఠుడా!; నీ క్రియన్= నీ వలె; ఉగ్రమైన తపంబున్= ఇంత ఘోరమైన తపస్సును; మున్= నీ కంటె పూర్వము; చేసి చూపినవారు లేరు= చేసి చూపించినవారు లేరు; ఇఁకన్= ఇకపైని; చేయువారును లేరు= చేయగలిగే వారు కూడా లేరు; నేన్= నేను; నీ సమాధికి మెచ్చితిన్= నీ తపస్సమాధికి మెచ్చుకున్నాను; మహాత్మ= గొప్పదైన ఆత్మగలవాడా!; విను= నేను చెప్పే మాటలు విను; నీ+అభీష్టములు+ఇత్తున్= నీవుకోరిన కోరికలు తీరుస్తాను; ఆయాసమేటికి= ఇంకా తపస్సుతో శ్రమపడడం దేనికి? లెమ్ము లెమ్ము= నీ తపస్సు నుండి శీఘ్రంగా లే; కోరికల్= వరాలను; కోరుము= నీకు ఇష్టమైనవాటిని కోరుకో.

**తా :** ఓ రాక్షస రాజేంద్రా! నీవలె తీవ్రమైన తపస్సు చేసినవారు ఇంతకు పూర్వం ఎవరూ లేరు. ఇకపై చేయగలిగినవారు లేరు. నీ తపస్సమాధికి మెచ్చుకొన్నాను. ఓ మహాత్మా! నీ వేమి కోరుకుంటావో అవి అన్నీ ఇస్తాను. ఇంకా ఆయాసపడవలసిన పని లేదు. తపస్సుతో కష్టపడవలసిన పని లేదు. తొందరగా లే! నీ కోరికలు ఏమిటో కోరుకో.

**శా. దంశవ్రాతములుం బిపీలికలు మేదఃక్రవ్యరక్తంబులన్**
**సంశీర్ణంబులు సేసి పట్టి తినఁగా శల్యావశిష్టుండవై**
**వంశచ్ఛన్న తృణావలీయుత మహావల్మీకమం దింద్రియ**
**భ్రంశం బింతయు లేక నీకు నిలువం బ్రాణంబు లెట్లుండెనో? 82**

**ప్రతి :** దంశవ్రాతములున్= అడవి ఈగల గుంపులు; పిపీలికలు= చీమలు; మేదః క్రవ్యరక్తంబులన్= మజ్జను, మాంసాన్ని, రక్తాన్ని; సంశీర్ణంబులు+చేసి= శిథిలమయేలా చేసి; పట్టి తినఁగా= పట్టుకొని తినగా; శల్య+అవశిష్టుండవు+అయి= ఎముకలు మాత్రమే మిగిలినవాడవై; వంశ+ఛన్న= వెదురుపొదలతో కప్పబడిన; తృణ+ఆవలీయుత= గడ్డితో కూడిన; మహావల్మీకమందు= గొప్ప పుట్టలో; ఇంద్రియభ్రంశంబు+ఇంతయు లేక= ఇంద్రియాలు రవంతకూడా చలించకుండా; నీకున్= నీకు; ప్రాణంబులు నిలువన్ ఎట్లుండెనో?= నీ ప్రాణాలు ఎలా నిలబడ్డాయో కదా!

**తా :** అడవిఈగలతో చీమలతో నీ రక్తమాంస మజ్జాదులు పూర్తిగా తినివేయబడ్డాయి. ఇక నీవు ఎముకల గూడుగా మాత్రం నిలిచి ఉన్నావు. నీ పైని వెదురుపొదలు గడ్డిదుబ్బులు మొలిచాయి. నీ చుట్టూ పెట్టిన పెద్దపుట్టలో ఇంద్రియాల

చలనం రవంత కూడా లేకుండా నీవు ఉన్నావు. అసలు ఈ స్థితిలోకూడా నీకు ప్రాణాలు ఎలా నిలబడ్డాయో ఆశ్చర్యంగా ఉంది.

**విశే :** కేవలం తపోనిష్ఠలో ఉండడంవల్ల శరీరం సర్వాత్మనా జీర్ణమైనప్పటికీ ఇంద్రియభ్రంశం లేకుండా ప్రాణాలకు నిలకడ సంభవించడం ఆశ్చర్యకరం. రాక్షసులు తమ ఆశయసాధన కోసం ఎన్ని కష్టాలైనా భరిస్తారు అందుకే రాకాసిపట్టు, రక్కసితాల్మి అనే పదబంధాలు ఏర్పడ్డాయి.

**ఉ. ఉత్సుకతన్ జలాన్నముల నొల్లక యీ క్రియ నూఱు దివ్య సం**
**వత్సరముల్ శరీరమున వాయువులన్ నిలుపంగ వచ్చునే?**
**యుత్సవ మయ్యె మాకు, మము నుగ్రతపంబున గెల్చి తీవు, నే**
**వత్సలతన్ నినుం గదియ వచ్చితిఁ, గోరిక లెల్ల నిచ్చెదన్. 83**

**ప్రతి :** ఉత్సుకతన్= తపస్సు చేయాలనే సడలని ఆసక్తితో; జల+అన్నములన్+ఒల్లక= నీరు ఆహారం అంగీకరించక (నీరు త్రాగకుండా ఆహారం తినకుండా); ఈ క్రియన్= ఈ విధంగా; నూఱు దివ్యసంవత్సరముల్= నూరు దేవసంవత్సరాలు; శరీరమునన్= శరీరంలో (దేహంలో) వాయువులన్= ప్రాణవాయువులను; నిలుపంగ వచ్చునే= నిలబెట్టుకోగలమా!; మాకున్= మాకును; ఉత్+సవమయ్యె= ఉత్కృష్టమైన యజ్ఞంవలె ఆనందాన్ని కలిగిస్తోంది; మమున్= మమ్ములను; ఈవు= నీవు; ఉగ్రతపంబునన్= తీవ్రమైన తపస్సుతో; గెల్చితి= జయించావు; వత్సలతన్= నీ పైని ఆప్యాయంతో (వాత్సల్యంతో); నినున్= నిన్ను; కదియ వచ్చితిన్= నిన్ను కలుసుకోవడానికి వచ్చాను; కోరికలు+ఎల్లన్= నీ కోరికలనన్నిటిని; ఇచ్చెదన్= ఇస్తాను.

**తా :** ఓ రాక్షసరాజా! ఆహార పానీయాలను మాని ఎంతో సడలని ఆసక్తితో ఈ విధంగా నూరు దివ్యవర్షాలు తపస్సు చేశావు. అయినా ప్రాణవాయువులు నిలబెట్టుకొన్నావు. ఇదెలా సాధ్యం. మాకు చాలా ఆనందం అయింది. నీ తీవ్రమైన తపస్సుతో మమ్మ జయించావు. వాత్సల్యంతో నిన్ను కలవాలని వచ్చాను. నీ కోరికలు అన్నీ తీరుస్తాను.

**వ. అని పలికి వనమక్షికా పిపీలికా భక్షితంబైన రక్షోవిభుని దేహంబు మీఁదం గమండలుజలంబులు ప్రోక్షించిన నద్దానవేంద్రుండు కమలాసన కరకమల కమనీయ కనకమయ దివ్యామోఘ కమండలు నిర్గతనిర్మల నీరధారా బిందుసందోహ సంసిక్త సకలాంగుండయి, తపంబు సాలించి, సాంద్ర కీచక సంఘాత సంఛాదిత వామలూరు మధ్యంబు వెలువడి, మహా ప్రభావబల సౌందర్య తారుణ్య సహితుండును వజ్రసంకాశ దేహుండును దప్తసువర్ణ వర్ణుండునునై నీరసేంధన నికరనిర్గత వహ్నియునుం బోలె వెలుంగుచుం జనుదెంచి. 84**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా పలుకాడి; వనమక్షికా= అడవి ఈగలచే; పిపీలికా= చీమలచే; భక్షితంబు+ఐన= తినబడిన; రక్షస్+విభుని= రాక్షసరాజైన హిరణ్యకశిపుని; దేహంబు మీఁదన్= శరీరం మీద; కమండలు జలంబులు= తన చేతి కమండలంలోని నీళ్ళు; ప్రోక్షించినన్= చిలకరించగా; ఆ+దానవేంద్రుండు= ఆ రాక్షసరాజు; కమలాసన= కమలమే ఆసనముగా గల బ్రహ్మ; కరకమల= హస్తపద్మమునుండి; కమనీయ= సుందరమైన; దివ్య= గొప్పదైన; అమోఘ= మొక్కవోని (వ్యర్థముకాని) కనకమయ= బంగారుమయమైన; కమండలు= కమండలువునుండి; నిర్గత= వెలువడిన; నిర్మల=

స్వచ్ఛమైన; నీరధారా= జలప్రవాహముయొక్క; బిందుసందోహ= నీటి బిందువులచే; సంసిక్త= తడుపబడిన; సకల+అంగుండు+అయి= సమస్త అవయవాలు గలవాడై; తపంబు+చాలించి= తపము మాని; సాంద్ర= దట్టమైన; కీచక సంఘాత= వెదురు పొదల సమూహము చేత; సంఛాదిత= కప్పబడిన; వామలూరు= పుట్టయొక్క; మధ్యంబున్= మధ్యభాగమునుండి; వెలువడి= బయటకు వచ్చి; మహాప్రభావ= గొప్ప ప్రభావం యొక్క; బల= బలంతో; సౌందర్య= అందము, తారుణ్య= యౌవనంతో; సహితుండును= కూడినవాడును; వజ్రసంకాశ= వజ్రముతో సమానమైన; దేహుండును= శరీరం కలవాడు; తప్త= బాగా కాల్చబడిన (పుటము వేయబడిన); సువర్ణ= బంగారంతో సమానమైన; వర్ణుండునున్+ఐ= శరీరకాంతి కలవాడై; నీరస= బాగ ఎండిన; ఇంధన= కట్టెల; నికర= సమూహంనుండి; నిర్గత= బయల్వెడలిన; వహ్నియున్+పోలెన్= అగ్నిలాగా; వెలుంగుచున్= కాంతులు చిందుచు; చనుదెంచి= బయటకు వచ్చి.

**తా :** బ్రహ్మ హిరణ్యకశిపునితో ఈ విధంగా మాట్లాడిన పిదప ఈగలు, చీమలచే పూర్తిగా తినివేయబడిన రాక్షసరాజు దేహంమీద తన కమండలం నీటిని ప్రోక్షించాడు. ఆ హిరణ్యకశిపుడు బ్రహ్మ హస్తపద్మంలో ఉన్న బంగారు కమండలంలోని మహిమాన్వితమై తిరుగులేని నీటిధారచే తడుపబడి. తపస్సు విరమించాడు. మహాసౌందర్యవంతమైన యౌవనంతో వజ్రంతో సమానమైన దృఢ దేహంతో పుటం పెట్టబడిన బంగారమువంటి శరీరకాంతితో ఎండుకట్టెలను మంట వేస్తే వచ్చే అగ్నివలె కాంతులీనుతూ హిరణ్యకశిపుడు తన చుట్టూ దట్టంగా మొలచిన వెదుళ్ళ పొదల పుట్టలనుండి బయటకు వచ్చాడు.

**మ. దివిజానీకవిరోధి మ్రొక్కెఁ గని వాగ్దేవీమనోనేతకున్**
**సవిశేషోత్సవ సంవిధాతకు నమత్సంత్రాతకున్ సత్తపో**
**నివహాభీష్ట వరప్రదాతకు జగన్నిర్మాతకున్ ధాతకున్**
**వివిధ ప్రాణి లలాట లేఖన మహావిద్యానుసంధాతకున్. 85**

**ప్రతి :** దివిజ+అనీకవిరోధి= దేవతల సమూహానికి శత్రువైన హిరణ్యకశిపుడు; కని= చూచి; వాక్+దేవీమనస్+నేతకున్= సరస్వతీదేవి మనస్సును ఏలేవానికి; సవిశేష= మంచి విశేషంతో కూడిన; ఉత్+సవ= సంతోషాన్ని; సంవిధాతకు= చేకూర్చేవానికి; నమత్= నమస్కరించే భక్తులను; సంత్రాతకున్= చక్కగా రక్షించేవానికి; సత్+తపస్+నివహ= చక్కటి తపస్సుచేసే జనుల సముదాయమునకు; అభీష్టవర= ఇష్టమైన కోరికలను; ప్రదాతకున్= ఇచ్చేవానికి; జగత్+నిర్మాతకున్= అన్ని జగములను సృష్టించే వానికి; వివిధప్రాణి= సమస్త జీవులయొక్క; లలాట= ఫాలభాగాల్లో; లేఖన= వ్రాయుట అనే; మహావిద్య= గొప్పవిద్యను; అనుసంధాతకున్= అనుసంధానం చేసేవానికి; ధాతకున్= బ్రహ్మకు; మ్రొక్కెన్= నమస్కరించాడు.

**తా :** సరస్వతీమనోనాథుడు, మంచి ఉత్సవాన్ని కలిగించేవాడు, భక్తులను కాపాడేవాడు, చక్కటి తపస్సు చేసే తాపసుల కోర్కెలు తీర్చేవాడు, జగములను సృష్టించేవాడు, ప్రాణికోటి నుదిటిపై వారి వారి జీవనగమనాలను వ్రాసే మహావిద్యానిపుణుడు అయిన బ్రహ్మదేవుని చూచి దేవతలందరికీ శత్రువైన హిరణ్యకశిపుడు మొక్కాడు.

**వ. ఇట్లు దైత్యేశ్వరుండు దివినున్న హంసవాహనునకు ధరణీ తలంబున దండ ప్రణామంబు లాచరించి సంతోష బాష్పసలిల సంవర్ధిత పులకాంకురుండై యంజలి సేసి కంజగర్భుని మీఁద దృష్టి యిడి గద్గదస్వరంబున నిట్లని వినుతించె. 86**

**ప్రతి :** ఇట్లు= ఈ విధముగా, దైత్యేశ్వరుండు= రాక్షసరాజు హిరణ్యకశిపుడు; దివిని+ఉన్న= ఆకాశంలో వున్న; హంసవాహనునకున్= హంస వాహనముగా గల చతుర్ముఖబ్రహ్మకు; ధరణీతలంబునన్= భూమీస్థలమున;

దండప్రణామంబులు+ఆచరించి= దండంవలె నమస్కారాలుచేసి (సాష్టాంగపడి); సంతోష= సంతోషంతో కూడిన; బాష్పసలిల= నీటి బిందువులచే; సంవర్ధిత= అధికం చేయబడ్డ; పులక+అంకురుండై= గగుర్పాటు కలిగినవాడై (ఆనందాశ్రువులు నిండిన కనులు పులకాంకురములు కలిగిన శరీరంతో); అంజలి+చేసి= నమస్కారం చేసి; కంజగర్భుని మీఁదన్= పద్మంనుండి జనించిన బ్రహ్మపైన; దృష్టి యిడి= చూపుసారించి; గద్గదస్వరంబునన్= బొంగురు పోయిన గొంతుతో; ఇట్లు+అని వినుతించెన్= ఈ విధంగా కీర్తించాడు.

**తా :** ఈ విధంగా రాక్షసరాజు హిరణ్యకశిపుడు ఆకాశంలో అగుపించిన బ్రహ్మదేవునకు భూమిమీద నుండి సాష్టాంగదండ ప్రణామాలు చేసి, సంతోషంతో ఆనందాశ్రువులు నిండగా, శరీరం పులకలెత్తగా, నమస్కారం చేసి బ్రహ్మపై చూపు నిలిపి గద్గద స్వరంతో ఈ విధంగా స్తోత్రం చేశాడు.

**విశే :** ధరణీతలంబున దండప్రణామంబు లాచరించి : ఒక కర్రవలె నిటారుగా నేలపై వాలి చేసెడి నమస్కారం. సాష్టాంగదండ ప్రణామం. స+అష్ట+అంగ+దండప్రణామం. ఎనిమిది అంగాలేవి? "కరయుగములు, చరణంబులు, ఉరము లలాట స్థలంబు, నున్నతభుజములు" నేలను తాకే విధంగా చేసే నమస్కారం.

**సీ. కల్పాంతమున నంధకార సంవృతమైన జగము నెవ్వఁడు దన సంప్రకాశ**
**మున వెలిఁగించుచు, మూఁడుభంగుల రజ స్సత్త్వ తమోగుణసహితుఁ డగుచుఁ**
**గల్పించు రక్షించుఁ గడపటఁ బ్రహరించు, నెవ్వఁ డాద్యుఁడు సర్వహేతు వగుచు**
**శోభితుండై స్వయంజ్యోతియై యొక్కట విలసిల్లు నెవ్వఁడు విభుత మెఱసి**

**ఆ. సమయ మయిన మానసప్రాణ బుద్ధీంద్రి, యములతోడ నెవ్వఁ డలఘుమహిమ**
**నడరు, నట్టి సచ్చిదానంద మయునకు, మహిత భక్తి నే నమస్కరింతు. 87**

**ప్రతి :** కల్పాంతమునన్= కల్పం పూర్తి అయిన పిదప; అంధకారసంవృతమైన= చీకటితో కూడిన; జగమున్= ప్రపంచాన్ని; ఎవ్వఁడు= ఏ మహాత్ముడు; తన సంప్రకాశమునన్= తన గొప్పదైన తేజస్సుతో; వెలిగించుచున్= కాంతివంతం చేస్తూ; మూఁడు భంగులన్= మూడు విధాలైన; రజస్+సత్త్వతమస్+గుణ సహితుఁడు+అగుచున్= రజో గుణం, సత్త్వం గుణం, తమో గుణాలతో కూడినవాడై; కల్పించు= సృష్టిస్తాడు; రక్షించున్= పోషిస్తాడు; కడపటన్= చివరలో; ప్రహరించున్= లయకార్యం నిర్వహిస్తాడో; ఎవ్వఁడు= ఏ మహనీయుడు; ఆద్యుఁడు= మొట్టమొదటివాడు; సర్వహేతువు+అగుచున్= సమస్త ప్రపంచానికి కారణభూతుడై; శోభితుండు+ఐ= కాంతివంతుడై; స్వయంజ్యోతియై= స్వయం ప్రకాశకుడై; ఒక్కట విలసిల్లున్= ఒక్కచోట విలసిల్లుతూ ఉంటాడో; ఎవ్వఁడు= ఏ గొప్పవాడు; విభుత మెఱసి= తనయొక్క ప్రాభవం ఉట్టిపడే విధంగా; సమయమయిన= మరల సృష్టికాలం రాగా; మానస ప్రాణ బుద్ధి+ఇంద్రియములతోడన్= మనస్సు, ప్రాణం, బుద్ధి, ఇంద్రియాలతో; ఎవ్వఁడు= ఎవ్వడు; అలఘుమహిమన్= అధికమైన మహిమతో; అడరున్= ప్రకాశించునో; అట్టి= అటువంటి; సత్+చిత్+ఆనందమయునకున్= సత్య జ్ఞాన ఆనందములతో కూడినవానికి; మహిత భక్తిన్= అధికమైన భక్తితో; ఏన్= నేను; నమస్కరింతున్= నమస్కారం చేస్తాను.

**తా :** ఈ ప్రపంచం అంతా కల్పాంత కాలంలో అంధకార మగ్నం కాగా, ఎవడు తన కాంతితో ఈ లోకంలో వెలుగులు నింపుతాడో, రజస్సత్త్వ తమోగుణాలతో కూడి ఎవడు సృష్టి, స్థితి, లయకార్యాలు నిర్వహిస్తాడో, ఎవడు ఆద్యుడో, ఎవ్వడు

అన్నిటికీ కారణ భూతుడో, స్వయం ప్రకాశంతో వెలుగొందుతూ ఉంటాడో, ఎవడు ప్రాభవంతో ఒప్పారుతూ ఉంటాడో, మరల సృష్టికాలం రాగా మనస్సు, ప్రాణం, బుద్ధి, ఇంద్రియాలతో ఎవడు గొప్ప ప్రభావంతో ఉంటాడో, అటువంటి సచ్చిదానందమయుడైన వానికి నేను భక్తితో నమస్కరిస్తాను.

**వ. దేవా! నీవు ముఖ్యప్రాణం బగుటంజేసి ప్రజాపతివి, మనోబుద్ధి చిత్తేంద్రియంబులకు నధీశ్వరుండవు, మహాభూతగణంబులకు నాధార భూతుండవు, త్రయీతనువునం గ్రతువులు విస్తరింతువు, సకల విద్యలు నీతనువు, సర్వార్థ సాధకులకు సాధనీయుండ, వాత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయంబగు నాత్మవు, కాలమయుండవై జనులకు నాయుర్నాశంబు సేయుదువు, జ్ఞాన విజ్ఞానమూర్తి, వాద్యంత రహితుండ, వంతరాత్మవు, మూఁడు మూర్తులకు మూలంబగు పరమాత్మవు, జీవలోకంబునకు జీవాత్మవు, సర్వంబును నీవ, నీవు గానిది లేశంబును లేదు, వ్యక్తుండవు గాక పరమాత్మవై పురాణపురుషుండవై యనంతుండ వైన నీవు ప్రాణేంద్రియ మనోబుద్ధి గుణంబుల నంగీకరించి పరమేష్ఠిపద విశేషంబున నిలిచి స్థూలశరీరంబునం జేసి యింతయుం బ్రపంచింతువు, భగవంతుండవైన నీకు మ్రొక్కెద నని మఱియు నిట్లనియె. 88**

**ప్రతి :** దేవా= ఓ పరమాత్మా!; నీవు; ముఖ్యప్రాణంబు+అగుటన్+చేసి= ముఖ్యమైన ప్రాణం అవడంచేత; ప్రజాపతివి= ప్రజాపతివి; మనస్+బుద్ధిచిత్త+ఇంద్రియంబులకున్= మనస్సు, బుద్ధి, చిత్తం, ఇంద్రియాలు అనేవాటికి; అధీశ్వరుండవు= అధిపతివి; మహాభూత గణంబులకున్= అనేక జీవసంఘాలకు; ఆధార భూతుండవు= ఆధారమైనవాడవు; త్రయీతనువునన్= వేదాలు అనే శరీరంతో; క్రతువులు విస్తరింతువు= యజ్ఞయాగాది క్రియలను అధికం చేస్తావు; సకలవిద్యలు= సమస్తములైన చదువులు; నీ తనువు= నీ శరీరమే; సర్వార్థ సాధకులకున్= అనేక పరమార్థాలు సాధించేవారికి; సాధనీయుండవు= నీవే సాధింపదగిన వాడవు; ఆత్మనిష్ఠా గరిష్ఠులకున్= ఆత్మవిద్యలో నిష్ఠగా ఉండే గొప్పవారికి; ధ్యేయంబు+అగున్= ధ్యానం చేయదగిన; ఆత్మవు= ఆత్మ స్వరూపానివి నీవే; కాలమయుండవు+ఐ= నీవే కాలస్వరూపుడవై; జనులకున్= జనులకు; ఆయుర్నాశంబు+చేయుదువు= ఆయుష్షును నశింప చేస్తావు; జ్ఞాన విజ్ఞానమూర్తివి= నీవే జ్ఞానం విజ్ఞానం అనే ఆకారం గలవాడవు; ఆది+అంతరహితుండవు= ఆది అంతాలు లేనివాడవు (మొదలు చివరలేనివాడవు) అంతరాత్మవు= నీవే అందఱిలో ఉండే అంతరాత్మవు; మూఁడు మూర్తులకున్= బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే ముగ్గురు మూర్తులకు; మూలంబు+అగు= మూలమైన; పరమాత్మవు= పరమాత్మ స్వరూపానివి; జీవలోకంబునకు= ఈ సమస్త జీవప్రపంచానికి; జీవాత్మవు= నీవే జీవాత్మవు; సర్వంబునున్+ఈవు+అ= ఈ సమస్త ప్రపంచం నీవే; నీవు గానిది లేశంబును లేదు= నీవు కాని పదార్థం రవంతకూడా ఈ ప్రపంచంలో లేదు; వ్యక్తుండవు గాక= వ్యక్తం అయేవాడివి కాకుండా (అందఱికీ తెలిసేవాడివి కాకుండా) పరమాత్మవు+ఐ= పరమాత్మస్వరూపానివై; పురాణ పురుషుండవు+ఐ= పురాణ పురుషుడవై (ప్రాచీనమైన పురుషరూపానివై); అనంతుండవు+ఐన నీవు= అంతంలేని నీవు; ప్రాణ= ప్రాణాలు; ఇంద్రియ= ఇంద్రియాలు; మనస్+బుద్ధి గుణంబులన్= మనస్సు, బుద్ధి అనే గుణాలను; అంగీకరించి= స్వీకరించి; పరమేష్ఠి పదవిశేషంబునన్= బ్రహ్మ అనే విశేషమైన పదవిలో; నిలిచి= ఒప్పి; స్థూలశరీరంబునన్+చేసి= నీ ఈ స్థూలశరీరంతో; ఇంతయున్= ఈ లోకాలనన్నిటినీ; ప్రపంచింతువు= విస్తరిస్తావు; భగవంతుండవు+ఐన నీకు= భగవానుడవైన నీకు; మ్రొక్కెదన్+అని= నమస్కరిస్తాను అంటూ; మఱియున్+ఇట్లు+అనియెన్= మఱియు ఇలా అన్నాడు.

**తా :** ఓ దేవా! నీవు ముఖ్య ప్రాణం అయిన కారణంగా ప్రజాపతివి. మనస్సు, బుద్ధి, చిత్తం, ఇంద్రియాలు అనే వాటికి అధినాయకునివి. సమస్త ప్రాణికోటికి నీవు ఆధారమైనవాడివి. వేద శరీరంతో యజ్ఞక్రియలు అధికం చేస్తావు. ఈ లోకంలో ఉండే సమస్త విద్యలు నీ శరీరమే. సర్వార్థసాధనం కోరే వారికి నీవే సాధనీయుడవు. ఆత్మనిష్ఠాగరిష్ఠులు పొందదగిన ఆత్మవు నీవే. నీవే కాలస్వరూపుడవై ప్రాణికోటి ఆయువును నశింపచేస్తావు. నీవు జ్ఞానమూర్తివి. విజ్ఞానమూర్తివి కూడా నీవే. నీవు ఆద్యంత రహితుడవు. అందరి అంతరాత్మ నీవే. బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు మూలమైన పరమాత్మవు నీవే. నీవే జీవలోకానికి జీవాత్మవు. ఈ సమస్త ప్రపంచం నీవే. నీవు కాకుండా ఈ విశ్వంలో రవంతకూడా లేదు. అందరికి తెలిసేలా వ్యక్తుడవుగా ఉండక పరమాత్మవై, సనాతనుడవై, అనంతుండవై నీవు ప్రాణ ఇంద్రియ మనోబుద్ధి గుణాలను స్వీకరించి, పరమేష్ఠి అనే విశేషమైన పదవిలో ఉండి స్థూలశరీరంతో ఈ ప్రపంచమంతా విస్తరిస్తావు. భగవంతుడవైన నీకు నమస్కరిస్తాను. అంటూ మరియు ఇలా అన్నాడు.

**క. కోరిన వారల కోర్కులు, నేరుపుతో నిచ్చి మనుప నీ క్రియ నన్యుల్**
**నేరరు కరుణాకర! నేఁ, గోరెద, నీ విచ్చెదేనిఁ గోరిక లభవా! 89**

**ప్రతి :** కరుణాకర= దయా నిలయా! కోరినవారల కోర్కులు= కోరుకొనే వాళ్ళ కోరికలను; నేరుపుతోన్= నైపుణ్యంతో; ఇచ్చి మనుప= ఇచ్చి కాపాడటంలో; నీ క్రియన్= నీ వలె; అన్యుల్= ఇతరులు; నేరరు= సమర్థులు కారు; అభవా= ఓ బ్రహ్మదేవా!; నీ విచ్చెదేనిన్= నీవు ఇచ్చే పక్షంలో; కోరికలు= నా కోర్కులు; నేన్+కోరెదన్= నేను కోరుకుంటాను.

**తా :** ఓ దయానిలయా! అభవా! బ్రహ్మదేవా! నీవలె కోరిన వారి కోర్కులు తీర్చి నేరుపుతో నిలబెట్టేవారు ఎవ్వరూ లేరు. నీ విచ్చే పక్షంలో కోరికలు నేను కోరుతాను.

**శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్**
**రేలన్ ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహ రక్షోమృగ**
**వ్యాళాదిత్య నరాదిజంతుకలహ వ్యాప్తిన్ సమస్తాస్త్ర శ**
**స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ! యిప్పింపవే. 90**

**ప్రతి :** లోక+అధీశ= ఎల్లలోకాలకు ప్రభువా!; గాలిన్= గాలిలోగాని; కుంభినిన్= భూమిపైగాని; అగ్నిన్= అగ్నిలో కాని; అంబువులన్= నీటిలో గాని; ఆకాశస్థలిన్= ఆకాశంలోగాని; దిక్కులన్= ఎనిమిది దిక్కులలోగాని; రేలన్= రాత్రులలోగాని; ఘస్రములన్= పగటికాలాల్లోగాని; తమః= చీకటిలోగాని; ప్రభలన్= కాంతిలోగాని; భూరిగ్రాహ= భయంకర గ్రహంబుల వల్లగాని; రక్షస్= రాక్షసులవల్లగాని; మృగ= జంతువులచేగాని; వ్యాళ= సర్పముల చేతగాని; ఆదిత్య= అదితి సంబంధమైన వారిచేగాని; నర+ఆది= నరులు మొదలైన వారిచే; జంతు= జంతువులచేగాని; కలహవ్యాప్తిన్= కలహాలు సంభవించినపుడు; సమస్త= అన్ని విధాలైన; అస్త్ర= అస్త్రాలచేతగాని; శస్త్ర+ఆళిన్= శస్త్రాల సముదాయంతో గాని; మృత్యువులేని జీవనము= మృత్యువు సంభవించని; జీవనాన్ని; ఇప్పింపవే= అనుగ్రహించవే.

**తా :** ఓ భువనాధీశ! గాలిలో గాని, భూమిపై గాని; అగ్నిలో గాని; నీటిలో గాని; ఆకాశంలో గాని; అష్టదిక్కులలో గాని; రేయింబవళ్ళలో గాని; చీకటి వెలుగులలో గాని; గ్రహాలు, రాక్షసులు, మృగాలు, సర్పాలు, దేవతలు, నరులు మొదలైన వారితో యుద్ధసమయంలో గాని, వివిధములైన అస్త్రశస్త్ర సమూహంచే గాని మృత్యువు లేని, రాని జీవనాన్ని నాకు అనుగ్రహించు.

**విశే :** ఇక్కడ హిరణ్యకశిపుడు బ్రహ్మను వరాలు కోరుతూ 'ఇప్పింపవే' అనుటలో ఇంకొకరి ద్వారా ఇప్పించమని అర్థం కాదు. వినయంతో గురువులను, దేవతలను, మహాత్ములను ఇప్పించండి అనడం గౌరవ సూచకం.

పుట్టినవాడు గిట్టక తప్పదు. కాని ఇతడు మృత్యువే లేని జీవితం కావాలని కోరడంలో ఇతడు ఎన్నుకొన్న సన్నివేశాలే ఇతని మరణానికి అవకాశం ఇస్తున్నాయి.

అస్త్రం అంటే మంత్రంతో ఉపయోగించేది. శస్త్రం అంటే బలంతో ఉపయోగించేది – ఆయుధం.

**వ. అని మఱియు రణంబులందుఁ దన కెదురులేని శౌర్యంబును లోకపాలుర నతిక్రమించు మహిమయును భువనత్రయ జయంబును హిరణ్యకశిపుండు గోరిన నతని తపంబునకు సంతోషించి దుర్లభంబు లయిన వరంబు లన్నియు నిచ్చి కరుణించి విరించి యిట్లనియె. 91**

**ప్రతి :** అని= ఇట్లు అని; మఱియున్= ఆ పిమ్మట; రణంబులందున్= యుద్ధాలలో; తనకు= తనకు (హిరణ్యకశిపునకు) ఎదురులేని శౌర్యంబును= తిరుగులేని శౌర్యాన్ని; లోకపాలురన్= లోకములను పాలించువారిని; అతిక్రమించు= దాటిపోవు; మహిమయును= గొప్పదనాన్ని; భువనత్రయ జయంబును= మూడులోకాలను జయించు శక్తిని; హిరణ్యకశిపుండు+కోరినన్= హిరణ్యకశిపుడు కోరగా; అతని తపంబునకు= అతడు చేసిన ఘోరమైన తపస్సుకు; సంతోషించి= సంతసించి; దుర్లభంబులు+అయిన= అసాధ్యములయిన; వరంబులు+అన్నియున్= వరములన్నిటిని; ఇచ్చి= హిరణ్యకశిపునకు ఇచ్చి; కరుణించి= దయను జూపి; విరించి= బ్రహ్మదేవుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అంతేకాక, హిరణ్యకశిపుడు యుద్ధాలలో తనకు ఎదురులేని పరాక్రమాన్ని, లోకపాలురను తృణీకరించగలిగే మహిమను, ముల్లోకాలను జయించే శక్తిని కోరాడు. అతని తపస్సుకు సంతసించిన బ్రహ్మ అసాధ్యాలైనప్పటికీ హిరణ్యకశిపుడు కోరిన వరాలను ఇచ్చి, అతనిని కరుణించి ఇలా అన్నాడు.

**శా. అన్నా! కశ్యపపుత్ర! దుర్లభము లీ యర్థంబు లెవ్వారికిన్,**
**ము న్నెవ్వారలుఁ గోర రీవరములన్, మోదించితిన్ నీ యెడన్**
**నన్నుం గోరిన వెల్ల నిచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధి సం**
**పన్నత్వంబున నుండు మీ సుమతివై భద్రైక శీలుండవై. 92**

**ప్రతి :** అన్నా= ఓ అన్నా! (ఇది ఆప్యాయతను తెలియజేసే సంబోధన) కశ్యపపుత్ర= ఓ కశ్యపుని కుమారా! ఏ+వారికిన్= లోకంలో ఎవరికైనా కూడా; ఈ అర్థంబులు= ఈ నీవు కోరిన వరాలు (కోరికలు) దుర్లభములు= పొందుటకు వీలు లేనివి; ఈ వరములన్= ఇటువంటి ఈ వరాలను; మున్ను= పూర్వము; ఏ+వారలున్= ఎవ్వరూ కూడా; కోరరు= కోరలేదు; నీ యెడన్= నీ విషయములో; మోదించితిన్= ఆమోదించాను; నన్నున్= నన్ను; కోరినవి+ఎల్లన్+ఇచ్చితిన్= నీవు కోరిన వరాలన్నీ ఇచ్చాను; సుమతివి+ఐ= బుద్ధిమంతుడవై; భద్ర+ఏకశీలుండవు+ఐ= అందరికి క్షేమం కలిగించే ఆలోచన నడవడిక గలవాడవై; ప్రవీణత్వంబుతోన్= నేర్పరితనంతో; బుద్ధి సంపన్నత్వంబునన్= బుద్ధి సంపదతో; ఉండుము+ఈ= జీవించుమా!

**తా :** అన్నా! ఓ కశ్యప కుమారా! నీవు కోరిన ఈ వరాలు ఎవ్వరికీ సాధ్య పడేవి కావు. ఇటువంటి వరాలు పూర్వం ఎవ్వరూ కోరలేదు. నీ తపాన్ని చూచి సంతోషించి నీవు కోరిన వరాలన్నీ ఇస్తున్నాను. మంచి మనసుతో, ప్రపంచానికి శ్రేయస్సు కలిగించే నడవడికతో, నైపుణ్యంతో, బుద్ధి సంపదకలిగి చక్కగా జీవించుమా!

**విశే :** అపూర్వ వరాలను బ్రహ్మ ప్రసాదించిన కారణంగా వాటిని దుర్వినియోగం చేయరాదని హిరణ్యకశిపునికి బ్రహ్మ ఒక విధంగా ధర్మప్రబోధం చేశాడు. 'ఈ వరాలతో నీవెంతో నైపుణ్యాన్ని సాధిస్తావు. కాని బుద్ధి వైభవంతో మెలగాలి. (బుద్ధి సంపన్నత్వమున) సుమతివై పాలించాలి. నీ పరిపాలనలో వున్న అందరూ భద్రంగా ఉండాలి'. అందుకే భద్రైక శీలుండవై అన్న పదప్రయోగం చేశాడు. పరిపాలకులెవరైనా రాజ్యాన్ని, ప్రజలను భద్రంగా చూడాలన్నది ఈ పద్యం పరమార్థం.

**వ. అని యి ట్లమోఘంబు లయిన వరంబు లిచ్చి దితినందనుచేతం బూజితుండై యరవింద సంభవుండు బృందారక సందోహవంద్య మానుం డగుచు నిజమందిరంబునకుం జనియె, నివ్విధంబున నిలింపారాతి వరపరంపరలు సంపాదించుకొని. 93**

**ప్రతి :** అని= అని పలికి; ఇట్లు= ఈ విధంగా; అమోఘంబులు+అయిన= అద్భుతమైనట్టి; వరంబుల్+ఇచ్చి= వరాలను ఇచ్చి; దితి నందనుచేతన్= దితియొక్క కుమారుడైన హిరణ్యకశిపునితో; పూజితుండు+ఐ= పూజింపబడి; అరవింద సంభవుండు= పద్మంనుండి జన్మించిన బ్రహ్మ; బృందారక= దేవతలయొక్క; సందోహ= సమూహంచేత; వంద్యమానుండు+ అగుచున్= నమస్కరింపబడుతూ (దేవతలందరూ నమస్కరిస్తుండగా) నిజమందిరమునకున్= తనయొక్క నివాసానికి; చనియెన్= వెళ్ళిపోయాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా; నిలింప+అరాతి= దేవతల శత్రువైన హిరణ్యకశిపుడనే రాక్షసుడు; వరపరంపరలు= వరసమూహాలను; సంపాదించుకొని= పొంది...

**తా :** ఈ విధంగా బ్రహ్మ తిరుగులేని వరాలు ఇచ్చి ఆ దితిపుత్రుడైన హిరణ్యకశిపునిచే పూజలందుకొని, బ్రహ్మ దేవతలు సమూహాలుగా చేరి నమస్కరిస్తూండగా తన నివాసానికి చేరాడు. ఈ ప్రకారంగా ఆ రాక్షసాధిపతి హిరణ్యకశిపుడు వరాల కొల్లలుగా సంపాదించుకుని

**క. సోదరుఁ జంపిన పగకై, యాదర మించుకయు లేక యసురేంద్రుఁడు కం**
**జోదరుపై వైరము దు, ర్మాద రతుం డగుచుఁ జేసె మనుజాధీశా! 94**

**ప్రతి :** మనుజ+అధీశా!= ఓ మహారాజా!; సోదరున్= తన సోదరుడైన హిరణ్యాక్షుని; చంపిన పగకై= విష్ణుమూర్తి చంపాడనే పగతో; అసుర+ఇంద్రుఁడు= రాక్షసరాజు హిరణ్యకశిపుడు; ఆదరము+ఇంచుకయున్ లేక= కొంచంకూడా ఆదరం లేకుండా; దుర్+మాదరతుండు+అగుచున్= దుష్టమైన మదం పొందినవాడై; కంజ+ఉదరుపైన్= కంజము (పద్మము) ఉదరమునందుగల పద్మనాభుడైన విష్ణుమూర్తిపైన; వైరము చేసెన్= విరోధాన్ని పెట్టుకొన్నాడు.

**తా :** ఓ మహారాజా! తన సోదరుడైన హిరణ్యాక్షుని విష్ణువు సంహరించినందుకుగాను పగబూని రవంత అయిన ఆదరం లేకుండా రాక్షసరాజు హిరణ్యకశిపుడు విష్ణుమూర్తిపై మదంతో విరోధాన్ని పెంచుకొన్నాడు.

**విశే :** బ్రహ్మ ధర్మోపదేశం చేసినా హిరణ్యకశిపునిలో ఏమాత్రం మార్పురాలేదు. ఇదే రాక్షస ప్రవృత్తి.

**సీ. ఒకనాఁడు గంధర్వ యూథంబుఁ బరిమార్చు దివిజుల నొకనాఁడు దెరలఁదోలు,**
**భుజగుల నొకనాఁడు భోగంబులకుఁ బాపు గ్రహముల నొకనాఁడు గట్టివైచు,**
**నొకనాఁడు యక్షుల నుగ్రత దండించు, నొకనాఁడు విహగుల నొడిసిపట్టు**
**నొకనాఁడు సిద్ధుల నోడించి బంధించు, మనుజుల నొకనాఁడు మద మడంచుఁ**

**తే. గడిమి నొకనాఁడు కిన్నర ఖచర సాధ్య, చారణ ప్రేత భూత పిశాచ వన్య**
**సత్త్వ విద్యాధరాదుల సంహరించు, దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు. 95**

**ప్రతి :** దితితనూజుండు= దితియొక్క కుమారుడైన హిరణ్యకశిపుడు; దుస్+సహతేజుఁడు+అగుచున్= సహించుటకు వీలులేని పరాక్రమంతో; ఒకనాఁడు= ఒక రోజు; గంధర్వయూథంబున్= గంధర్వుల సమూహాన్ని; పరిమార్చు= సంహరిస్తాడు; ఒకనాఁడు= ఒక దినమందు; దివిజులన్= దేవతలను; తెరలన్+తోలు= తరిమి కొడతాడు; భుజగులన్= సర్పాలను; ఒకనాఁడు= ఒక రోజు; భోగంబులకున్+పాపు= ఎటువంటి సుఖభోగాలు లేకుండా చేస్తాడు; గ్రహములన్= నవగ్రహాలను; ఒకనాఁడు= ఒక దివసాన; కట్టివైచున్= బంధించి వేస్తాడు; ఒకనాఁడు= ఒకరోజు; యక్షులన్= యక్షులనే దేవజాతిని; ఉగ్రతన్ దండించున్= కఠినంగా శిక్షిస్తాడు; ఒకనాఁడు= ఒకరోజు; విహగులన్= ఆకాశంలో ఎగిరే పక్షులను; ఒడిసిపట్టున్= ఒడుపుగా అదిమి పట్టుకుంటాడు; ఒకనాఁడు= ఒకరోజున; సిద్ధులన్+ఓడించి బంధించున్= సిద్ధులనేవారిని యుద్ధంలో ఓడించి బంధిస్తాడు; మనుజులన్= మనుష్యులను; ఒకనాఁడు= ఒకరోజు; మదము+అడంచున్= మదంపోయేలా చేస్తాడు; కడిమిన్= పరాక్రమంతో; ఒకనాఁడు= ఒకరోజు; కిన్నర= కిన్నరులు; ఖచర= ఆకాశంలో తిరిగే ఖేచరులు, సాధ్యచారణ= సాధ్యులు, చారణులు; ప్రేత= ప్రేతాలు, భూత= భూతాలు; పిశాచ= పిశాచాలు; వన్యసత్త్వ= అడవిజంతువుల సమూహాలు; విద్యాధరాదులన్= విద్యాధరులు మొదలైనవారిని; సంహరించున్= చంపుతాడు.

**తా :** దితికుమారుడైన హిరణ్యకశిపుడు ఎదిరించుటకు వీలులేని పరాక్రమంతో ఒకరోజు గంధర్వ సమూహాన్ని సంహరిస్తాడు. ఒకరోజు దేవతలను తరిమి కొడతాడు. ఒకరోజు సర్పాలను సుఖపడకుండా చేస్తాడు. ఒకనాడు నవగ్రహాలను కట్టి పడేస్తాడు. ఒకనాడు యక్షులను భయంకరంగా శిక్షిస్తాడు. ఒకనాడు పక్షులను ఎగరకుండా పట్టుకుంటాడు. ఒకరోజు సిద్ధులను ఓడించి బంధిస్తాడు. ఒకరోజు మనుష్యుల మదాన్ని అణచివేస్తాడు. ఒకరోజు కిన్నరులు, ఖేచరులు, సాధ్యులు, చారణులు, ప్రేతాలు, భూతాలు, పిశాచాలు, అడవిమృగాలు, విద్యాధరులు మొదలైన వారిని సంహరిస్తూ, రోజు కొక్కరకంగా అందరిని బాధిస్తున్నాడు.

**క. అట్టళ్లతోడఁ గోటలఁ, గట్టలుకం గూలఁ ద్రోచి క్రవ్యాదులతోఁ**
**జుట్టు విడిసి దిక్పాలుర, పట్టణములు గొనియె నతఁడు బలమున నధిపా! 96**

**ప్రతి :** అధిపా= ఓ రాజా!; అతఁడు= ఆ హిరణ్యకశిపుడు, అట్టళ్ళతోడన్= బురుజులతో; కోటలన్= కోటలను; కట్టలుకన్= మిక్కిలి కోపంతో; కూలన్+త్రోచి= కూలగొట్టి; క్రవ్యాదులతోన్= రాక్షసులతో; చుట్టు విడిచి= చుట్టూరా మోహరించి; బలమునన్= బలంతో (బలవంతముగా); దిక్పాలుర పట్టణములు= దిక్పతుల నగరాలను; కొనియెన్= స్వీకరించాడు (వశపరచుకొన్నాడు)

**తా :** ఓ రాజా! హిరణ్యకశిపుడు మిక్కిలి కోపంతో, బురుజులతో సహా కోటలన్నిటిని ధ్వంసం చేసి రాక్షసులు చుట్టూరా మోహరింపగా, అష్టదిక్పాలకుల నగరాలను వశపరచుకొన్నాడు.

**క. కృశలై సంప్రాపిత దు, ర్దశలై సర్వంకషోగ్ర దైతేయాజ్ఞా**
**వశలై నిశలును, దివములు, దిశ లెల్లను గట్టువడియె దీనత ననఘా! 97**

**ప్రతి :** అనఘా= పుణ్యాత్ముడా!; కృశలై= కృశించి చిక్కిపోయినవై; సంప్రాపిత= పొందబడిన; దుర్+దశలై= చెడుస్థితి గలవియై; సర్వంకష+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; (సమస్తాన్ని ఒరిపిడిపెట్టు–అడ్డులేని); దైతేయ= దితియొక్క కుమారుడైన

హిరణ్యకశిపునియొక్క; ఆజ్ఞావశలై= ఆజ్ఞను అనుసరించి నడుచుకొనేవై; నిశలును= రాత్రులు; దివములు= పగళ్ళు; దిశలు+ఎల్లను= అన్ని దిక్కులును; దీనతన్= దైన్యంతో; కట్టుపడియెన్= బంధింపబడ్డాయి.

**తా :** ఓ పుణ్యాత్ముడా! రాక్షసరాజైన హిరణ్యకశిపుని తీవ్రమైన ఆజ్ఞకు లోబడి, చిక్కి, దుర్దశ పొంది, రేయిం బవళ్ళు, దిక్కులు దైన్యంతో కట్టుబడ్డాయి.

**వ. మఱియు న ద్దానవేంద్రుండు విద్రుమ సోపానంబులును, మరకత మణిమయ ప్రదేశంబులును వైదూర్యరత్న స్తంభ సముదయంబులును, జంద్రికాసన్నిభ స్ఫటిక సంఘటిత కుడ్యంబులును, బద్మరాగ పీఠ కనక కవాట గేహళీ విటంక వాతాయనంబులును, విలంబమాన ముక్తా ఫలదామ వితానశోభిత ధవళ పర్యంకంబులును, వివిధ విచిత్ర విమానంబులును, నిరంతర సురభి కుసుమ ఫల భరిత పాదప మహోద్యానంబులును, హేమారవింద సౌగంధిక బంధుర సరోవరంబులును, రమణీయ రత్న ప్రాసాదవిశేషంబులును, మనోహర పరిమళశీతల మందమారుతంబులును, మృదుమధుర నినద కీరకోకిలకుల కోలాహలంబులును గలిగి విశ్వకర్మ నిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీ శోభితంబైన మహేంద్ర భవనంబు సొచ్చి. 98**

**ప్రతి :** మఱియును= అంతేకాకుండా; ఆ+దానవ+ఇంద్రుండు= ఆ రాక్షసరాజు; విద్రుమసోపానంబులును= పగడాలు పొదిగిన మెట్లు; మరకత మణిమయ ప్రదేశంబులునున్= మరకత మణులచే (పచ్చరాళ్ళచే) చెక్కబడిన స్థలములు; వైదూర్య= వైదూర్యములనే; రత్న= రత్నములతో చెక్కబడిన; స్తంభసముదయంబులును= స్తంభాల సమూహాలు; చంద్రికాసన్నిభ= వెన్నెలతో సమానమైన; స్ఫటిక= స్ఫటికాలతో; సంఘటిత= కూర్చిన; కుడ్యంబులునున్= గోడలు; పద్మరాగపీఠ= పద్మరాగమణులచే చేయబడిన పీఠాలు; కనక= సువర్ణమయాలైన; కవాట= తలుపులు; గేహళీ= గదులు; విటంక= గూళ్ళు; వాతాయనంబులును= కిటికీలు; విలంబమాన= వేలాడుతున్న; ముక్తాఫలదామ= ముత్యాల దండలతో కూడిన; వితాన= చాందినీలతో; శోభిత= కాంతులీనుచున్న; ధవళ పర్యంకంబులును= తెల్లని పాన్పులు; వివిధ విచిత్ర విమానంబులును= అనేకమైన అద్భుతమైన విమానాలు; నిరంతర= సతతము (ఎల్లప్పుడు) సురభి= సువాసన లీనుచున్న; కుసుమ= పూలతో; ఫల= పండ్లతో; భరిత= నిండిన; పాదప= చెట్లుగల; మహా+ఉద్యానంబులును= పెద్ద పెద్ద తోటలు; హేమ= సువర్ణమయాలైన; అరవింద= పద్మాలతో; సౌగంధిక= సౌగంధిక సుమాలతో; బంధుర= నిండిన; సరోవరంబులును= సరస్సులును; రమణీయ= సుందరమైన; రత్నప్రాసాద విశేషంబులును= రత్నాలతో కూడిన పెద్ద పెద్ద భవనాలు; మనోహర= సుందరమైన; పరిమళ= సువాసనలతో; శీతల= చల్లనైన; మందమారుతంబులును= పిల్లవాయువులు; మృదుమధుర= సున్నితమైన తీయనైన; నినద= శబ్దాలుచేసే; కీర= చిలుకల; కోకిలకుల= కోకిలల సముదాయములయొక్క; కోలాహలంబులును= శబ్దసముదాయంబులు; కలిగి; విశ్వకర్మ నిర్మితంబై= విశ్వకర్మచే నిర్మింపబడ్డ; త్రైలోక్యరాజ్యలక్ష్మీ శోభితంబు+ఐన= ముల్లోకాలలోని రాజ్యలక్ష్మియొక్క కాంతులు ఒప్పు; మహేంద్రభవనంబున్= దేవేంద్ర భవనంలో; చొచ్చి= ప్రవేశించి...

**తా :** పగడాలతో నిర్మించబడిన మెట్లుకలది, మరకతాలనే పచ్చరాళ్ళుగల ప్రాంతాలు గలది, వైదూర్య రత్నస్తంభాలతో కూడినది, వెన్నెలతో సమానమైన తెల్లని స్ఫటికాలతో చేయబడిన గోడలు కలది, పద్మరాగ పీఠాలతో, బంగారంతో

చేయబడిన తలుపులు, గదులు, గూళ్ళు, కిటికీలు కలది, వ్రేలాడు ముత్యాలదండలతో శోభించే తెల్లని పాన్పులు కలది, వివిధాలైన విచిత్రాలైన విమానాలు కలది, ఎల్లప్పుడు సువాసనలు వెదజల్లే పూలతో పళ్ళతో కూడిన చెట్లుగల తోటలు కలది; బంగారు పద్మాలతో, సౌగంధిక పుష్పాలతో నిండిన సరస్సులు కలది, రమణీయాలైన రత్నభవనాలు గలదియు, మనసుకు ఆనందం కలిగించే చల్లని సువాసనాభరిత మందవాయువులు కలది, సుకుమార మధురశబ్దాలు చేయు చిలుకల కోకిలల సమూహం కలది అయిన విశ్వకర్మ నిర్మితమై త్రిలోకరాజ్యలక్ష్మీ శోభితమైన మహేంద్రుని భవనంలో ఆ దానవరాజు హిరణ్యకశిపుడు ప్రవేశించి

**మ. దితిపుత్త్రుండు జగత్త్రయైకవిభుఁడై దేవేంద్ర సింహాసనో**
**ద్ధతుఁడై యుండ హరాచ్యుతాంబుజభవుల్ దప్పంగ భీతిన్ సమా**
**గతులై తక్కిన యక్ష కిన్నరమరుద్గంధర్వ సిద్ధాదు లా**
**నతులై కానిక లిచ్చి కొల్తు రతనిన్ నానా ప్రకారంబులన్. 99**

**ప్రతి :** దితిపుత్త్రుండు= దితి కుమారుడైన హిరణ్యకశిపుడు; జగత్త్రయ+ఏకవిభుఁడు+ఐ= ముల్లోకాలకు ప్రభువై; దేవ+ఇంద్ర= దేవేంద్రుని; సింహాసన= సింహాసనంపై; ఉద్ధతుఁడై= ఔద్ధత్యం గలవాడై (గర్వము గలవాడై) ఉండన్= ఉండగా; హర= ఈశ్వరుడు; అచ్యుత= విష్ణుమూర్తి; అంబుజభవుల్= పద్మమునుండి జన్మించిన బ్రహ్మ; తప్పంగ= తప్ప, మిగిలిన; యక్ష కిన్నర మరుత్+గంధర్వ సిద్ధ+ఆదులు= యక్షులు, కిన్నరులు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు మొదలైనవారు; భీతిన్= భయంతో; సమాగతులై= కలసి కట్టుగా; ఆనతులై= వంగి నమస్కరించినవారై; అతనిన్= ఆ హిరణ్యకశిపుని; నానా ప్రకారంబులన్= అనేక విధాలుగా; వచ్చి కానికలు+ఇచ్చి= కానుకలు సమర్పించి; కొల్తురు= సేవిస్తారు.

**తా :** దితియొక్క కుమారుడైన హిరణ్యకశిపుడు ముల్లోకాలకు ప్రభువై దేవేంద్ర సింహాసనం అధిష్ఠించి ఉండగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తప్ప మిగిలిన యక్ష, కిన్నరులు, మరుత్తులు, గంధర్వులు, సిద్ధులు మొదలైనవారంతా భయంతో కలిసికట్టుగా అతనిని కొలిచి పాదాభివందనాలు ఆచరిస్తూ కానుకలు సమర్పిస్తున్నారు.

**శా. ఏ దిక్పాలురఁ జూచి నేఁ డలుగునో యే దేవు బంధించునో**
**యే దిగ్భాగముమీఁద దాడి చనునో యే ప్రాణులం జంపునో**
**యీ దైత్యేశ్వరుఁ డంచు నొండొరులు దారింద్రాదు లాస్థాన భూ**
**వేదిన్ మెల్లన నిక్కి చూతురు భయావిర్భూత రోమాంచులై. 100**

**ప్రతి :** ఈ దైత్య+ఈశ్వరుఁడు= ఈ రాక్షసరాజైన హిరణ్యకశిపుడు; నేఁడు= ఈ రోజు; ఏ దిక్+పాలురన్+చూచి= ఏ దిక్కుల అధిపతులనుచూచి; అలుగునో= కోపించునో; ఏ దేవున్= ఏ దేవతను; బంధించునో= చెఱబట్టునో; ఏ దిగ్భాగము మీఁదన్= ఏ దిక్కు ఏ ప్రదేశంపైన; దాడిచనునో= దాడిగా వెళ్తాడో; ఏ ప్రాణులన్+చంపునో= ఏ ప్రాణులను చంపుతాడో; అంచున్= అనుకొంటూ; ఇంద్ర+ఆదులు= ఇంద్రాదులైనవారు; తారు= తాము; ఒండొరులు= ఎవరికివారు; భయ+ఆవిర్భూతరోమాంచులై= భయంతో కలిగిన గగుర్పాటుతో; ఆస్థాన భూవేదిన్= తమ ఆస్థానాలలో ఉన్న వేదికల పైకి ఎక్కి; మెల్లన= మెల్లగా (రహస్యంగా); నిక్కి చూతురు= నిక్కి నిక్కి (మెడలు పైకెత్తి) చూస్తారు.

**తా :** హిరణ్యకశిపుడు ఈ రోజు ఏ దిక్పాలకుని మీద కోపగించుకుంటాడో, ఏ దేవుని బంధిస్తాడో; ఏ దిగ్భాగంమీద దాడి చేస్తాడో, ఏ ప్రాణులను చంపుతాడో అనుకుంటూ దేవతలందరూ తాము ఎవరికి వారు భయంతో గగుర్పాటు పొందిన శరీరాలతో వారి వారి ఆస్థానాలలో ఉండే వేదికలపైకి ఎక్కి దేవేంద్రాది దేవతలు రహస్యంగా నిక్కి చూస్తుంటారు.

**సీ. కోలాహలము మాని కొలువుఁడీ సురలార! తలఁగి దీవింపుఁడీ తపసులార!**
**ఫణు లెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార! ప్రణతులై చనుఁడి దిక్పాలులార!**
**గానంబు సేయుఁడీ గంధర్వవరులార! సందడిఁ బడకుఁడీ సాధ్యులార!**
**యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార! చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార!**

**తే. శుద్ధకర్పూర వాసిత సురభి మధుర, భవ్య నూతన మైరేయ పానజనిత**
**సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు, శాంతి లేదంద్రు నిచ్చలుఁ జారు లధిప! 101**

**ప్రతి :** సురలార!= ఓ దేవతలారా!; కోలాహలము మాని= కలకలం మాని; కొలువుఁడీ= ఈ హిరణ్యకశిపుని కొలవండి; తపసులార!= తాపసులారా; తలఁగి దీవింపుఁడు+ఈ= ప్రక్కనుండి ఈయనను దీవించండి; పన్నగ+ఇంద్రములార= ఓ శ్రేష్ఠమైన సర్పాలారా; నిక్కి= అతిశయించి; ఫణులు ఎత్తకుఁడు= మీ మీ పడగలను ఎత్తవద్దు; దిక్పాలులార= ఓ అష్టదిక్పాలకులారా; ప్రణతులై= చక్కగా తలవంచి నమస్కరిస్తూ; చనుఁడి= మీరు వెళ్ళండి; గంధర్వ వరులార!= ఓ గంధర్వ శ్రేష్ఠులారా!; గానంబు+చేయుఁడీ= మీరు సొంపుగా పాటలు పాడండి; సాధ్యులార= ఓ సాధ్యులారా!; సందడిన్+పడకుఁడీ= మీరు అత్యుత్సాహాన్ని చూపకండి; అప్సరస్+జనులార= ఓ అప్సరః కాంతలారా!; నృత్యంబులు= చక్కని నాట్యాలను; ఆడుఁడీ= చేయండి; సిద్ధులార= ఓ సిద్ధులారా!; చేరిక మ్రొక్కుఁడీ= ఇంకా దగ్గరకు వచ్చి నమస్కరించండి; అమర+అరి= దేవతకు శత్రువైన హిరణ్యకశిపుడు; శుద్ధ= పరిశుద్ధమైన; కర్పూర= పచ్చకర్పూరం వల్ల వాసిత= సువాసితమై; సురభి= పరిమళభరితమై; మధుర= తీయని; భవ్య= తగిన; నూతన= క్రొత్తదైన; మైరేయ= మధువును; పాన= త్రాగుటచేత; జనిత= పుట్టిన; సుఖవిలీనతన్= సుఖంతో చక్కగా; చొక్కినాఁడు= మునిగి ఉన్నాడు; అధిప= ఓ రాజా!; నిచ్చలున్= ఎల్లప్పుడును; చారులు= వేగులు; శాంతి లేదు+అంద్రు= శాంతిలేక అల్లరిగా ఉన్నదని అంటూ ఉంటారు.

**తా :** ఓ ధర్మరాజా! దేవతలకు శత్రువైన హిరణ్యకశిపుడు పరిశుద్ధమైన కర్పూరంతో పరిమళభరితమైన తీయని నూతనమైన మధువును తాగుటచేత సుఖంలో మునిగి ఉన్నాడు. అలజడిగా కాక శాంతిగా వుండడానికి దేవతలారా! మీరు కలకలం మానండి. తాపసులారా! మీరు దీవించండి; ఓ సర్పశ్రేష్ఠులారా! గర్వంతో మీ పడగల నెత్తకండి. దిక్పాలులారా! మీరు చక్కగా నమస్కరించి వెళ్ళండి. ఓ గంధర్వ శ్రేష్ఠులారా! మీరు గానం చేయండి. సాధ్యులారా! మీరు సందడి చేయకండి. అప్సరఃకాంతలారా! మీరు చక్కని నృత్యాలు చేయండి. ఓ సిద్ధులారా! మీరు ఈ హిరణ్యకశిపుని చేరి మొక్కండి. అంటూ వేగులు నిత్యం హెచ్చరిస్తుంటారు.

**శా. లీలోద్యాన లతానివాసములలో లీలావతీయుక్తుఁడై**
**హాలాపాన వివర్ధమాన మద లోలావృత్త తామ్రాక్షుఁడై**
**కేళిం దేలఁగ నేనుఁ దుంబురుఁడు సంగీత ప్రసంగంబులన్**
**వాలాయంబుఁ గరంగఁ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా! 102**

**ప్రతి :** ఉర్వి+ఈశ్వరా!= ఓ ధర్మరాజా!; లీల+ఉద్యాన= కేళీవనంలోని; లతా నివాసములలో= తీగల పొదరిండ్లలో; లీలావతీ యుక్తుఁడై= భార్య అయిన లీలావతితో కూడినవాడై; హాలాపాన= మధువును సేవించడంవల్ల; వివర్ధమాన= బాగా పెరిగిన; మద= మదంచేత; లోల+ఆవృత్త= చంచలంగా తిరుగుచున్న; తామ్ర+అక్షుఁడు+ఐ= ఎఱ్ఱని కన్నులుగలవాడై; కేళిన్+తేలఁగన్= వినోదాలలో మునిగి తేలుతుండగా; ఏనున్= నేను; (నారదుడైన నేను) తుంబురుఁడు= తుంబురుడు; సంగీత ప్రసంగంబులన్= సంగీత సంగతులతో; దేవద్వేషిన్= దేవతలను ద్వేషించే హిరణ్యకశిపుని; వాలాయంబున్= విధిలేక, అనివార్యంగా; కరంగన్+చేయుదుము= మనసు మెత్తపడేలా చేస్తాం.

**తా :** ఓ ధర్మరాజా! దేవతలను ద్వేషించే ఆ హిరణ్యకశిపుడు లీలావతులతోకూడి ఉద్యానవనాలలో విహరిస్తూ మధువును సేవించడంవల్ల అతిశయించిన మదంతో చంచలమై తిరుగుతున్న ఎఱ్ఱటి కన్నులతో, కేళీవిలాసాలలో తేలుచున్నప్పుడు నారదుడినైన నేను, తుంబురుడు అతనిని (ఆ హిరణ్యకశిపుని) మా మా సంగీత ప్రసంగాలతో తప్పనిసరి పరిస్థితులలో ఆనందింప చేస్తుంటాం.

**క. యాగములు బుధులు ధరణీ, భాగములం జేయుచుండఁ బఱతెంచి హవి**
**ర్భాగములు దాన కై కొనుఁ, జాగింపఁడు దైత్యుఁ డమరసంఘంబునకున్. 103**

**ప్రతి :** ధరణీ భాగములన్= భువిలోని ఆయాచోట్ల; బుధులు= పండితులు; యాగములు చేయుచుండన్= యజ్ఞయాగాది క్రియలు చేసేవేళ; దైత్యుఁడు= అసురుడైన హిరణ్యకశిపుడు; పఱతెంచి= వేగంగా వచ్చి; తాన= తానే; హవిర్భాగంబులు= హవిస్సుల భాగాలను; కైకొనున్= స్వీకరిస్తాడు; అమరసంఘంబునకున్= దేవతా సమూహానికి; చాగింపఁడు= త్యాగంచేయడు. అనగా దోచుకొంటున్నాడని అర్థం.

**తా :** భూమిపై పలుచోట్ల పండితోత్తములు యజ్ఞయాగాది క్రియలు చేస్తుండగా, ఆ హిరణ్యకశిపుడు తానే వేగంగా అక్కడికి వచ్చి, ఆ హవిర్భాగాలు దేవతలకు ఇవ్వక దోచుకొంటున్నాడు.

**సీ. సకల మహాద్వీప సహిత విశ్వంభరా స్థలిని దున్నక పండు సస్యచయము,**
**కామధేన్వాదుల కరణి నర్థులు గోరు కోర్కులు గగనంబు గురియుచుండు,**
**వననిధు లేడును వాహినీ సందోహములును వీచుల రత్నములు వహించు,**
**నుర్వీరుహంబులు నొక్క కాలంబున నఖిలర్తు గుణముల నతిశయిల్లు,**

**తే. నంబు సంపూరిత ద్రోణు లగుచు నొప్పుఁ, బర్వతంబులు సర్వదిక్పాల వివిధ**
**గుణము లెల్లను దానె కైకొనుచు దైత్య, విభుఁడు త్రైలోక్యరాజ్య సంవృద్ధి నుండ. 104**

**ప్రతి :** సర్వదిక్పాల వివిధగుణములు+ఎల్లను= దిక్పాలకులుర సమస్త గుణాలను; తానె కైకొనుచున్= తానే స్వీకరిస్తూ; దైత్యవిభుఁడు= రాక్షసరాజైన ఆ హిరణ్యకశిపుడు; త్రైలోక్యరాజ్య సంవృద్ధినుండన్= మూడులోకాల రాజ్యాధిపత్యంతో వృద్ధితో ఉన్నవేళ; సకల మహాద్వీప సహిత= అనేక మహాద్వీపాలతో కూడిన; విశ్వంభరా స్థలిని= భూమిపైని; సస్యచయమున్= పంటల సమూహాన్ని; దున్నక పండున్= నాగలితో దున్నకుండానే పండుతున్నాయి; గగనంబు= ఆకాశము; కామధేను+ఆదుల కరణిన్= కామధేనువు మొదలైన వాటివలె; అర్థులు= కోరేవారు; కోరు= కోరుకొనే; కోర్కులు= కోరికలను; కురియుచుండున్=

సమృద్ధిగా ఇస్తుంటాయి; వననిధులు+ఏడును= ఏడు సముద్రాలు; వాహినీ సందోహములును= నదుల సమూహాలను; వీచుల= తరంగాలచే; రత్నములు వహించున్= రత్నాలను మోసుకొనివస్తాయి; ఉర్వీరుహంబులును= చెట్ల సమూహాలు; ఒక్క కాలంబునన్= ఒకే సమయంలో; అఖిల+ఋతు గుణములన్= అన్ని ఋతువుల గుణాలతో; అతిశయిల్లున్= అతిశయించి ఉంటాయి; పర్వతంబులు= పర్వతాలు; అంబు సంపూరిత ద్రోణులు+అగుచున్= నీటిచే బాగా నిండిన లోయలు గలవై; ఒప్పున్= ప్రకాశిస్తుంటాయి.

**తా :** అష్టదిక్పాలకుల గుణాలన్నీ ఆ రాక్షసరాజైన హిరణ్యకశిపుడే గైకొని ముల్లోకాలపై ఆధిపత్యం వహించి వృద్ధిలో ఉన్నవేళ సమస్త ద్వీపాలతో కూడియున్న భూభాగం దున్నకుండానే పంటలను ఇస్తున్నవి. ఆకాశం కామధేనువు మొదలైన వాటి వలె (కల్పవృక్షం, చింతామణి, కల్పలత వంటివివలె) యాచించే వారి కోరికలు సమృద్ధిగా కురుస్తున్నాయి. సప్తసముద్రాలు, నదులు వాటి తరంగాలచే రత్నాలను మోసుకొస్తున్నవి. వృక్షసముదాయం అన్నివేళల్లో అన్ని ఋతువుల గుణాలను కలిగి ఉన్నవి. అన్ని కాలాలలో అన్ని పూవులు పూస్తూ అన్ని పండ్లు పండుచున్నవి. పర్వతాలు మంచినీటితో బాగా నిండిన లోయలతో ఒప్పారి ఉన్నవి.

**వ. ఇట్లు సకల దిక్కులు నిర్జించి, లోకైకనాయకుండై, తన యిచ్ఛాప్రకారంబున నింద్రియసుఖంబు లనుభవించుచుం, దనియక శాస్త్రమార్గంబు నతిక్రమించి, విరించి వరజనిత దుర్వార గర్వాతిరేకంబున సుపర్వారాతి యైశ్వర్యవంతుండై పెద్ద కాలంబు రాజ్యంబు సేయునెడ. 105**

**ప్రతి :** ఇట్లు= ఈ ప్రకారంగా; సకల దిక్కులు= అన్ని దిక్కులను; నిర్జించి= జయించి; లోకనాయకుండై= అన్ని లోకాలకు తానే ప్రభువై; తన ఇచ్ఛాప్రకారంబునన్= తన ఇష్టానుసారంగా; ఇంద్రియ సుఖంబులను= ఇంద్రియ భోగాలను; అనుభవించుచున్= అనుభవిస్తూ; తనియక= తృప్తి పొందక; శాస్త్రమార్గంబున్= ధర్మశాస్త్ర మార్గాన్ని; అతిక్రమించి= పాటించక; విరించి వరజనిత= బ్రహ్మ వరంచే కలిగిన; దుర్వార= అడ్డుకొన వీలులేని; గర్వాతిరేకంబునన్= గర్వంయొక్క ఆధిక్యంతో; సుపర్వ+అరాతి= దేవతల శత్రువైన హిరణ్యకశిపుడు; ఐశ్వర్యవంతుండై= ప్రభుత్వ సంపద గలవాడై; పెద్దకాలంబున్= చాలకాలం; రాజ్యంబు+చేయునెడన్= రాజ్యాన్ని చేసేవేళ...

**తా :** ఇట్లు అన్ని దిక్కులను హిరణ్యకశిపుడు జయించాడు. అన్ని లోకాలకు నాయకు డయ్యాడు. తన ఇష్టానుసారంగా ఇంద్రియ భోగాలను అనుభవించి తనివి తీరక ధర్మమార్గాన్ని అతిక్రమించి, బ్రహ్మ ఇచ్చిన వరగర్వంతో జనించిన అధికమైన అహంకారంతో హిరణ్యకశిపుడు ఐశ్వర్యం కలవాడై చాలకాలం రాజ్యం చేస్తున్న సమయంలో

**ఉ. ఎన్నఁడు మాకు దిక్కుగల? దెన్నఁడు దైత్యుని బాధ మాను? మే**
**మెన్నఁడు వృద్ధిఁ బొందఁగల? మెవ్వరు రక్షకు లంచు దేవతా**
**కిన్నర సిద్ధ సాధ్య ముని ఖేచర నాయకు లాశ్రయించి రా**
**పన్నగతల్పు భూరి భవబంధవిమోచనుఁ బద్మలోచనున్. 106**

**ప్రతి :** దేవతా= దేవతలు; కిన్నర= కిన్నరులు; సిద్ధ= సిద్ధుల; సాధ్య= సాధ్యుల; ముని= మునుల; ఖేచర= ఖేచరుల; నాయకులు= అధిపతులు; ఎన్నఁడు= ఎప్పుడు; మాకు దిక్కుగలదు= మాకు దిక్కు రక్షణ కలుగుతుంది; ఎన్నఁడు దైత్యుని బాధమాను= ఈ హిరణ్యకశిపుడనే రాక్షసుని బాధ మాకు ఎప్పుడు పోతుంది; మేము+ఎన్నఁడు= మేము ఎప్పుడు;

వృద్ధిన్+పొందన్+కలము= అభివృద్ధిని పొందుతాము; ఎవ్వరు రక్షకులు+అంచు= మాకు రక్షణ ఇచ్చేవారు ఎవరున్నారు అంటూ; ఆ పన్నగ తల్పున్= శేషశయనుడైన వానిని; భూరి భవ బంధన విమోచనున్= అధికమైన సంసార బంధాలనుండి విడిపించేవానిని; పద్మలోచనున్= ఆ పుండరీకాక్షుని; ఆశ్రయించిరి= శరణు పొందారు.

**తా :** దేవ, కిన్నర, సిద్ధ, సాధ్య, ముని, ఖేచరుల అధిపతులు అందరు, మాకు శరణు ఎప్పుడు దొరుకుతుంది? ఆ రాక్షసుడైన హిరణ్యకశిపుని బాధ మాకు ఎప్పుడు తొలగిపోతుంది? మాకు అభివృద్ధి ఎప్పుడు లభిస్తుంది? మాకు రక్షకులు ఎవరున్నారు? అనుకుంటూ ఆ శేషశాయిని, భవ బంధములు త్రెంచువానిని, శేషతల్పుడు, పద్మాక్షుడైన విష్ణుమూర్తిని శరణు వేడారు.

**వ. ఇట్లు దానవేంద్రుని యుగ్రదండంబునకు వెఱచి యనన్య శరణులై రహస్యంబున నందఱుం గూడికొని. 107**

**ప్రతి :** ఇట్లు= ఈ విధముగా; దానవేంద్రుని= రాక్షసరాజైన హిరణ్య కశిపుని; ఉగ్రదండంబునకున్= భయంకరమైన శిక్షలకు; వెఱచి= భయపడి; అనన్య శరణులై= ఇతరు లెవ్వరిని ఆశ్రయింపక; రహస్యంబునన్= రహస్యంగా; అందఱున్ కూడుకొని= అందరు కలుసుకొని...

**తా :** ఈ విధంగా హిరణ్యకశిపుని భయంకరమైన శిక్షలకు భయపడి మరెవ్వరిని శరణువేడక రహస్యంగా అందరూ కూడుకొన్నారు.

**ఉ. ఎక్కడ నున్న వాఁడు జగదీశ్వరుఁ? డాత్మమయుండు మాధవుం**
**డెక్కడి కేఁగె శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱం**
**దిక్కులనెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగు నట్టి దిక్కుకై**
**మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయ రక్షకున్. 108**

**ప్రతి :** జగత్+ఈశ్వరుఁడు= సమస్త జగాలకు ప్రభువైనవాడు; ఎక్కడనున్నవాఁడు= ఎక్కడ ఉన్నాడు?; ఆత్మమయుండు= ఆత్మస్వరూపుడైనవాడు; మాధవుండు= లక్ష్మీవిభుడు; ఎక్కడికి+ఏఁగెన్= ఎక్కడకు వెళ్ళాడు?; శాంతులు= సత్త్వగుణప్రధానులై శాంతంగా జీవించేవారు; మునీశులు= మునిశ్రేష్ఠులు; భిక్షులు= భిక్షతో మాత్రమే జీవనం గడిపేవారు; దిక్కులను+ఎల్లన్= అన్ని దిక్కులను; ఎక్కుడు తుదిన్= మించిన చివరిదైనచోటు; చొరన్= చేరగా; క్రమ్మఱన్= తిరిగి; రారు= తిరిగిరారో; దిక్కు+అగున్= అందరికిని ఆధారమైన వాడగును; మదీయరక్షకున్= మా అందరికి రక్షణకోసం; అట్టి దిక్కుకై= అటువంటి దిక్కు అయిన వానికి; మేము= మేమందరం; హస్తయుగముల్= కేలుదోయిని (చేతుల జంటలను) ముకుళించి= నమస్కరించి; మ్రొక్కెదము= మ్రొక్కులు సమర్పిస్తాము.

**తా :** సకలజగదీశ్వరుడు ఎక్కడ ఉన్నాడు? ఆత్మస్వరూపుడైన శ్రీపతి ఎక్కడకు వెళ్ళాడు? పరమశాంతులు, మునిశ్రేష్ఠులు, సన్యాసులు – ఏ దివ్యపదానికి వెళ్ళి తిరిగిరారో ఆ పరమపదంలో ఉండే పరంధామునికి, దిక్కులన్నిటికి దిక్కైన దివ్యమూర్తికి, చివరకు విశ్వమంతటినీ తనలో విలీనం చేసుకొనే ఆ దేవదేవునికి మేము అంజలి ఘటించి మమ్ము రక్షించవలసినదిగా మొక్కుతున్నాము.

**వ. అని మఱియు నాహారనిద్రలు మాని, చిత్తంబులు పరాయత్తంబులు గానీక సమాహిత బుద్ధులై భగవంతుండును, మహాపురుషుండును, మహాత్ముండును, విశుద్ధ జ్ఞానానంద మయుండును నైన హృషీకేశునకు నమస్కరించుచున్న యెడ, మేఘరవసమాన గంభీర నినదంబున దిశలు మ్రోయించుచు సాధులకు నభయంబు గావించుచు, దృశ్యమానుండు గాక పరమేశ్వరుండైన హరి యిట్లనియె. 109**

**ప్రతి :** అని= అనుచు; మఱియున్= అంతేగాక; ఆహారనిద్రలు= ఆహారాన్ని, నిద్రను; మాని= విడిచి; చిత్తంబులు= మనసులు; పర+ఆయత్తంబులు+కానీక= ఇతర విషయములలో లగ్నం కానీక; సమాహితబుద్ధులు+ఐ= నిలకడగల బుద్ధి గలవారై; భగవంతుండును= భగవంతుడు; మహాపురుషుండును= మహాపురుషుడు; మహాత్ముండును= మహాత్ముడు; విశుద్ధజ్ఞాన+ఆనందమయుండునున్= నిర్మలమైన జ్ఞాన ఆనందంతో నిండినవాడు; ఐన= అయినటువంటి; హృషీక+ఈశునకున్= ఇంద్రియాధినాథుడైన పరమాత్మకు; నమస్కరించుచున్నయెడన్= నమస్కరించే వేళ; మేఘరవసమాన= మేఘధ్వనితో సమానమైన; గంభీర నినదంబునన్= గంభీరమైన శబ్దంతో; దిశలు= దిక్కులు; మ్రోయించుచున్= మాఱు మ్రోగేలా చేస్తూ; సాధులకున్= సత్పురుషులకు; అ+భయంబు గావించుచున్= అభయప్రదానంచేస్తూ; దృశ్యమానుండుగాక= కనులకు కానబడక; పరమేశ్వరుండైన హరి= పరమాత్మ అయిన విష్ణువు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని యీ ప్రకారంగా ఆహారం నిద్ర విడిచి మనసు ఇతర విషయములపై నిలపక, కుదురుకొన్న బుద్ధి గలవారై భగవంతుడు, మహాపురుషుడు, మహాత్ముడు, నిర్మలజ్ఞానానందస్వరూపుడు అయిన హృషీకేశునకు నమస్కరించే సమయంలో మేఘధ్వనితో సమానమైన శబ్దంతో దిక్కులు ప్రతిధ్వనించేలా సత్పురుషులకు అభయం ప్రసాదిస్తూ కనులకు కనబడకుండా పరమేశ్వరుడైన హరి ఇలా అన్నాడు.

**మ. భయముం జెందకుఁడయ్య నిర్జరవరుల్! భద్రంబు మీ కయ్యెడున్,**
**జయముం లాభము భూతసంతతికి మత్సందర్శన ప్రాప్తి న**
**వ్యయమై చేరు, నెఱుంగుదున్ దితిసుత వ్యాపార భాషా విప**
**ర్యయముల్, కాలము గూడఁ జంపెదఁ, జనుం డందాఁక మీ త్రోవలన్. 110**

**ప్రతి :** నిర్+జరవరుల్= దేవతలారా!; భయమున్ చెందకుఁడు+అయ్య= భయపడకండి; మత్+సందర్శన ప్రాప్తిన్= నా దర్శన భాగ్యంచేత; భూతసంతతికిన్= ప్రాణులన్నింటికీ; జయమున్+లాభమున్= జయ లాభాలు; అ+వ్యయమై చేరున్= అధికంగా చేరుతాయి; దితిసుత= దితి కుమారుడైన హిరణ్యకశిపుని; వ్యాపార= క్రియలు; భాషా విపర్యయముల్= అసంబద్ధమైన మాటల తీరులు; ఎఱుంగుదున్= నాకు తెలుసును; కాలము+కూడన్= సమయం వచ్చినపుడు; చంపెదన్= ఆ రక్కసుని చంపెదను; అందాఁకన్= అంతవరకు; మీ త్రోవలన్= మీ మీ మార్గాలలో మీరు; చనుండు= నడవండి.

**తా :** ఓ దేవతలారా! మీరు భయాన్ని పొందకండి. మీకు భద్రం కలుగుతుంది నా దర్శన భాగ్యంచేత జీవకోటికి జయ లాభాలు సమృద్ధిగా కలుగుతాయి. హిరణ్యకశిపుని క్రియలు అసంబద్ధమైన మాటలు అన్నీ నేను ఎరుగుదును. కాలం కలసివచ్చినపుడు అతనిని నేను సంహరిస్తాను. అంతవరకు మీ మీ మార్గాలలో మీరు సంచరించండి.

**ఆ. శుద్ధ సాధులందు సురలందు శ్రుతులందు, గోవులందు విప్రకోటియందు**
**ధర్మపదవియందుఁ దగిలి నా యందు వాఁ, డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు. 111**

**ప్రతి :** వాఁడు= ఆ రాక్షసుడైన హిరణ్యకశిపుడు; శుద్ధసాధులందున్= సత్పురుషులపై; సురలందున్= దేవతలపై; శ్రుతులందున్= వేదాలపై; గోవులందున్= ఆవులపై; విప్రకోటియందున్= బ్రాహ్మణుల సమూహంపైన; ధర్మపదవియందున్= ధర్మమార్గంపై; తగిలి= ప్రయత్నించి; నా యందున్= విష్ణువునైన నాపై; ఎన్నఁడు+అలుగున్= ఏనాడు ఆగ్రహిస్తాడో; నాఁడె= ఆ రోజే; హింసన్+ఒందున్= అతడు నశిస్తాడు (హాని పొందుతాడు)

**తా :** సత్పురుషులపై, దేవతలపై, వేదాలపై, గోవులపై, బ్రాహ్మణులపై ధర్మమార్గంపై విష్ణువైన నాపై ఆ రాక్షసుడెప్పుడు కోపించి వైరాన్ని పొందుతాడో ఆనాడే ఆ రక్కసుడు హింసను పొందుతాడు.

**క. కన్నకొడుకు శమ దమ సం, పన్నుఁడు నిర్వైరుఁ డనక ప్రహ్లాదుని వాఁ**
**డెన్నఁడు రోషంబున నా, పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్. 112**

**ప్రతి :** శమ దమ సంపన్నుఁడు= అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహం గలవాడు; నిర్+వైరుఁడు= అజాతశత్రువు; కన్నకొడుకు= తాను కన్న సంతానం; అనక= అని భావింపక; ప్రహ్లాదుని= ప్రహ్లాదుణ్ణి; వాఁడు= ఆ రాక్షసుడైన హిరణ్యకశిపుడు; రోషంబునన్= కోపంతో; ఆపన్నతన్+ఒందించు= ఆపదల పాలు చేస్తాడో; నాఁడె= ఆ నాడే; పట్టి వధింతున్= ఆ హిరణ్యకశిపుని పట్టి సంహరిస్తాను.

**తా :** తన కన్న కొడుకు ప్రహ్లాదుడు శమదమాది సద్గుణ సంపన్నుడనీ, అజాత శత్రువని భావించక ఆ హిరణ్యకశిపుడు ఆ ప్రహ్లాదునికి రోషంతో ఎప్పుడు ఆపదకలిగిస్తాడో ఆనాడే ఆ రక్కసుని నేను పట్టి సంహరిస్తాను.

**శా. వేధోదత్తవర ప్రసాద గరిమన్ వీఁ డింతవాఁడై మిమున్**
**బాధం బెట్టుచు నున్నవాఁడని మదిన్ భావింతు, భావించి నే**
**సాధింపం దతిగాదు, కావునఁ గడున్ సైరించితిన్, మీఁదటన్**
**సాధింతున్ సురలార! నేఁడు చనుఁడా శంకింప మీ కేటికిన్? 113**

**ప్రతి :** సురలార!= ఓ దేవతలారా!; వేధోదత్తవర ప్రసాద గరిమన్= బ్రహ్మ ఇచ్చిన గొప్ప వరప్రసాదంచేత; వీఁడు= ఈ హిరణ్యకశిపుడు; ఇంతవాఁడై= ఇంత గొప్పవాడై; మిమున్= దేవతలైన మిమ్మల్ని; బాధన్+పెట్టుచున్+ఉన్నవాఁడని= బాధపెడుతున్నాడని; మదిన్= నా మనసులో; భావింతున్= భావిస్తున్నాను; భావించి= ఇలా ఆలోచించికూడా; నే సాధింపన్+తతి కాదు= నేను సాధించుటకు తగిన సమయం కాదు; కావునన్= కాబట్టి; సైరించితిన్= ఓర్పు వహించాను; మీఁదటన్= ఇక పైని; సాధింతున్= వానిని సంహరిస్తాను; నేఁడు= ఈ రోజు; శంకింపన్= సందేహించవలసిన; మీకు+ఏటికిన్= మీకు పనిలేదు; చనుఁడా= వెళ్ళండి.

**తా :** ఈ హిరణ్యకశిపుడు బ్రహ్మ ఇచ్చిన వరబలం వల్ల ఇంతవాడై మిమ్మల్ని బాధపెడుతున్నాడు. ఇది నాకు తెలుసు. తెలిసినా ఇది సమయం కాదని ఇన్నాళ్ళు నేను సహించాను. ఇకపై వీనిని సంహరిస్తాను. మీరు నిర్భయంగా మీ మీ స్థావరాలకు వెళ్ళండి.

**విశే :** భగవంతునికైనా సరే కాలనియతిని తప్పించ తరముకాదు. కనుకనే విష్ణువు దేవతలతో 'మీరు వేచి చూడండి. ఆ సమయం వచ్చినప్పుడు తప్పక సంహరిస్తాను'. అని మాట ఇచ్చాడు.

**వ. అని యిట్లు దనుజమర్దనుండు నిర్దేశించిన, నిలింపులు గుంపులు గొని మ్రొక్కి రక్కసుండు మ్రగ్గుట నిక్కం బని తమ తమ దిక్కులకుం జనిరి. హిరణ్యకశిపునకు విచిత్ర చరిత్రులు నలువురు పుత్రు లుద్భవించి రందు. 114**

**ప్రతి :** అని యిట్లు= అని ఈ ప్రకారంగా; దనుజమర్దనుండు= రాక్షసాంతకుడైన హరి; నిర్దేశించినన్= స్పష్టం చేయగా; నిలింపులు= దేవతలందఱూ; గుంపులు గొని= సమూహాలుగా చేరి; మ్రొక్కి= విష్ణువునకు నమస్కరించి; రక్కసుండు= రాక్షసుడైన హిరణ్యకశిపుడు; మ్రగ్గుట= నశించుట; నిక్కంబు+అని= తథ్యమని; తమదిక్కులకున్+చనిరి= తమ తమ నెలవులకు వెళ్ళారు; హిరణ్యకశిపునకున్= ఆ రక్కసుడైన హిరణ్య కశిపునకు; విచిత్ర చరిత్రులు= విచిత్రమైన చరిత్ర గలిగినవారు; నలువురు పుత్రులు= నలుగురు కుమారులు; ఉద్భవించిరి= జన్మించారు; అందున్= అందులో...

**తా :** ఈ ప్రకారంగా రాక్షసాంతకుడైన శ్రీమహావిష్ణువు దేవతలకు అభయమిచ్చాడు దేవతలు గుంపులు గుంపులుగా పరమాత్మకు మొక్కినారు. హిరణ్యకశిపుడు మరణించుట తథ్యమని వాళ్ళ వాళ్ళ ప్రదేశాలకు వెళ్ళిపోయారు. హిరణ్యకశిపునకు విచిత్రమైన నడవడిగల నలుగురు పుత్రులు జన్మించారు. వారిలో

## ❖ ప్రహ్లాద చరిత్రము ❖

**సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాఁడు**
**పెద్దలఁ బొడగన్న భృత్యుని కైవడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు**
**కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావన సేసి మరలువాఁడు**
**తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు**

**తే. సఖులయెడ సోదరస్థితి జరుపువాఁడు, దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు**
**లీలలందును బొంకులు లేనివాఁడు, లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప 115**

**ప్రతి :** అధిప= మహారాజా! (ఓ ధర్మరాజా!); లలితమర్యాదుఁడు= మంచి మర్యాద కలవాడు; ప్రహ్లాదుడు= హిరణ్యకశిపు పుత్రుడైన ప్రహ్లాదుడు; తన యందున్= తనపై; అఖిల భూతములందున్= మిగిలిన అన్ని ప్రాణులపై; ఒక భంగిన్= ఒకే విధమైన; సమహితత్వంబునన్= సమానమైన హితంతో; జరగువాఁడు= వర్తించేవాడు; పెద్దలన్+పొడగన్నన్= పెద్దలను చూచినపుడు; భృత్యుని కైవడిన్= సేవకునివలె; చేరి= వారిని సమీపించి; నమస్కృతుల్+చేయువాఁడు= నమస్కారాలు చేసే లక్షణం గలవాడు; కన్నుదోయికిన్= రెండు కన్నులకు; అన్యకాంతలు= ఇతర స్త్రీలు; అడ్డంబైన= ఎదురైన వేళ; మాతృభావము+చేసి= తల్లిగా భావించి; మరలువాఁడు= తొలిగిపోయేవాడు; తల్లిదండ్రులభంగిన్= తల్లిదండ్రులవలె; ధర్మవత్సలతను= ధర్మము నందు వాత్సల్యంతో; దీనులన్= దీనులను; కావన్= కాపాడుటకు; చింతించువాఁడు= ఆలోచించేవాడు; సఖులయెడన్= స్నేహితుల విషయంలో; సోదరస్థితిన్= తోడబుట్టిన అన్నదమ్ములనే భావం; జరుపు వాఁడు= నిలబెట్టువాడు; గురువులన్= విద్యనేర్పు గురువులను; దైవతములు+అంచున్= దైవాలని అంటూ; తలఁచు వాఁడు= భావించేవాడు; లీలలందును= హాస్యానికైనా; బొంకులు లేనివాఁడు= అసత్యాలు పలుకనివాడు.

**తా :** ఓ ధర్మరాజా! రాక్షస కుమారుడైన ప్రహ్లాదుడు సమస్త జీవులను తనతో సమానంగా భావించేవాడు. పెద్దలు కనిపిస్తే సేవకునిలా వారిని చేరి నమస్కరించే తత్త్వం గలవాడు. ఇతర స్త్రీలు కన్పడ్డ వేళ మాతృభావంతో వారినుండి భక్తితో

దూరంగా వెళ్ళేవాడు. దీనులను తలిదండ్రులమాదిరిగా వాత్సల్యంతో ఆదరించేవాడు. స్నేహితులను సోదరులుగా భావించేవాడు. గురువులను దైవాలుగా భావించేవాడు. ఆడే మాటల్లో అసత్యాలు పలుకని వాడు. ఇటువంటి చక్కని మర్యాద కలవాడు ప్రహ్లాదుడు.

**విశే :** ధర్మవత్సలత – సంస్కారసంపన్నుడైన మానవుడికి సంబంధించిన అనేకాంశాలు ప్రహ్లాదుని నెపంతో వ్యాసభగవానుడు అందించగా పోతన వాటికి మెరుగులు దిద్ది 'ధర్మవత్సలత' అనే పదాన్ని కొత్తగా చేర్చాడు. కన్న సంతానంపై వాత్సల్యం ఉండడం సహజం. ఏ దిక్కులేనివారిని, దీనులను తల్లిదండ్రులవలె కాపాడి పోషించేవాడు ధర్మవాత్సల్యం కలవాడని పోతన అభిప్రాయం. ఈ ధర్మవాత్సల్యం అనే పదాన్ని పోతనగారే తొలిసారి ప్రయోగించారు. ప్రపంచ సాహిత్యంలోనే మొట్టమొదటగా ఇటువంటి పదప్రయోగం జరిగిందని విజ్ఞుల అభిప్రాయం. ఏ వయస్సు వారికైనా ఇవే గుణాలుండాలని వ్యాసుల నిర్ణయం.

**వ. మఱియును. 116**

**ప్రతి :** మఱియునున్= ఇంకా...

**తా :** అంతేగాక

**సీ. ఆకారజన్మ విద్యార్థవరిష్ఠుఁడై గర్వసంస్తంభ సంగతుఁడు గాఁడు,**
**వివిధమహానేక విషయసంపన్నుఁడై పంచేంద్రియములచేఁ బట్టువడఁడు,**
**భవ్యవయోబల ప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రందుకొనఁడు,**
**కామినీ ప్రముఖ భోగము లెన్ని గలిగిన వ్యసనసంసక్తి నా వంకఁబోఁడు,**

**ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు, వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు,**
**ధరణినాథ! దైత్య తనయుండు హరి పర తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు. 117**

**ప్రతి :** ధరణినాథ= ఓ ధర్మరాజా!; ఆకార, జన్మ విద్య+అర్థవరిష్ఠుఁడు+ఐ= ఆకృతిచేత, జన్మచేత, విద్యచేత, సంపదచేత గొప్పవాడై; గర్వసంస్తంభ సంగతుఁడు+కాఁడు= నిశ్చలమైన గర్వంగలవాడు కాదు (ఎప్పుడూ గర్వం పొందనివాడు); వివిధ= అనేక విధాలైన; మహా+అనేక= గొప్పవైన; విషయసంపన్నుఁడు+ఐ= ఇంద్రియ భోగభాగ్యాలకు సంబంధించిన సంపదలు ఉండికూడా; పంచ+ఇంద్రియములచేన్= కర్మేంద్రియ పంచకంచేత; పట్టువడఁడు= లొంగడు; భవ్యవయోబల= చక్కని యౌవన బలముచే; ప్రాభవ+ఉపేతుఁడు+ఐ= ప్రాభవం కలవాడై ఉండికూడా; కామరోష+ఆదులన్= కామం, క్రోధం మొదలైనవాటికి; క్రందు కొనఁడు= చిక్కుకోడు; కామినీ ప్రముఖ భోగములు+ఎన్ని గలిగినన్= కాంతాదిగా భోగాలు ఎన్ని ఉన్నప్పటికి; వ్యసన సంసక్తిన్= భోగ్యవస్తువులు అనుభవించాలనే భావంతో; ఆ వంకన్+పోఁడు= అటు ప్రక్కకే వెళ్ళడు; విశ్వమందున్= ఈ ప్రపంచంలో; కన్న విన్న+అర్థములందున్= చూచిన విన్న విషయాలలో; వస్తు దృష్టిన్+చేసి= ఆ యా వస్తు లక్షణాలు మాత్రమే చూచి; వాంఛ ఇడఁడు= కోరిక చూపించడు; దైత్య తనయుండు= రాక్షస పుత్రుడైన ప్రహ్లాదుడు; హరిపరతంత్రుఁడు+ఐ= శ్రీహరియందు మాత్రమే ఆసక్తి కలవాడై; హత+అన్యతంత్రుఁడు+అగుచున్= ఇతర విషయములందు ఆసక్తి రవంత కూడ లేకుండా ఉంటాడు.

**తా :** ధర్మరాజా! ఆకారంలో జన్మలో విద్యలో సంపదలో ప్రహ్లాదుడు గొప్పవాడైనప్పటికీ అతడు ఎన్నడూ గర్విష్ఠికాడు. అనేక విషయభోగాలు తన ముందున్నప్పటికీ అతడు పంచేంద్రియాలకు లొంగడు. యౌవన ప్రాభవం తనకున్నప్పటికీ కామరోషాదులకు లొంగిపోడు. స్త్రీలు మొదలైన భోగములెన్ని ఉన్నా అతడు వ్యసనాలకు లోనుగాడు. ప్రపంచంలో తాను ఎన్ని విషయాలు చూచినా విన్నా అతడు ఆ విషయాలను కోరుకోడు. అతడు సర్వదా బ్రహ్మ భావనలోనే ఉంటాడు. అంతేకాక హరిపై మాత్రమే లగ్నమనస్కుడై ఇతర విషయాసక్తుడు కాకుండా ఉంటాడు.

**ఆ. సద్గుణంబు లెల్ల సంఘుంబులై వచ్చి, యసుర రాజతనయునందు నిలిచి**
**పాసి చనవు విష్ణుఁ బాయని విధమున, నేఁడుఁ దగిలి యుండు నిర్మలాత్మ! 118**

**ప్రతి :** నిర్మల+ఆత్మ!= స్వచ్ఛమైన అంతఃకరణం గల ఓ ధర్మరాజా! సద్గుణంబులు+ఎల్లన్= సమస్త సద్గుణాలు; సంఘుంబులు+ఐవచ్చి= సమూహాలుగావచ్చి; అసుర రాజతనయున్+అందు= రక్కసుని కుమారుడైన ప్రహ్లాదునిలో; నిలిచి= నిశ్చలంగా ఉండి; విష్ణున్+పాయనివిధమున= విష్ణుమూర్తిని వదలిపెట్టని విధంగానే; పాసి చనవు= వదలిపెట్టి పోవు; నేఁడున్= ఈ నాటికీ; తగిలియుండున్= అతనిని ఆశ్రయించే ఉంటాయి.

**తా :** ఓ నిర్మలమైన అంతఃకరణంగల ధర్మరాజా! సమస్త సద్గుణాలు గుంపులు గుంపులుగా వచ్చి రాక్షస కుమారుడైన ప్రహ్లాదుణ్ణి చేరాయి. అవి యీ నాటికీ విష్ణుమూర్తిని వదిలిపెట్టని విధంగానే అతనిని ఆశ్రయించి ఉన్నాయి అవి తొలగిపోవు.

**మ. పగవారైన సురేంద్రులున్ సభలలోఁ బ్రహ్లాద సంకాశులన్**
**సుగుణోపేతుల నెందు మే మెఱుఁగ మంచున్ వృత్తబంధంబులన్**
**బొగడం జొత్తురు సత్కవీంద్రుల క్రియన్ భూనాథ! మీబోఁటి స**
**ద్భగవద్భక్తులు దైత్యరాజ తనయున్ బాటించి కీర్తింపరే! 119**

**ప్రతి :** భూనాథ!= ఓ ధర్మరాజ, భూపాలా!; పగవారైన సురేంద్రులున్= శత్రుపక్షంవారైన దేవతానాయకులు కూడా; సభలలోన్= సభాప్రాంగణాల్లో; ప్రహ్లాదసంకాశులన్= ప్రహ్లాదునితో సమానులను; సుగుణ+ఉపేతులన్= సుగుణవంతులను; ఎందున్= ఎక్కడా; మేము= మేము; ఎఱుఁగము+అంచున్= తెలియము అంటూ; వృత్తబంధంబులన్= చారిత్రక విషయాల కూర్పుతో; సత్కవి+ఇంద్రులక్రియన్= గొప్ప కవులవలె; పొగడన్+చొత్తురు= స్తుతిస్తూ ఉంటారు; మీ బోఁటి= మీ వంటి; సద్+భగవత్+భక్తులు= చక్కని దైవభక్తులు; దైత్యరాజతనయున్= రాక్షసపుత్రుడైన ప్రహ్లాదుని; పాటించి= గొప్పగా లెక్కించి; కీర్తింపరే!= స్తుతింపరా!

**తా :** ఓ ధర్మజా! ప్రహ్లాదుణ్ణి, శత్రుపక్షంవారైన దేవతాశ్రేష్ఠులు కూడా వారి వారి ప్రసంగాల్లో "ప్రహ్లాదునితో సమానమైన దైవభక్తులను మే మెరుగము" అంటూ సాధుపురుషుల గాథలను ప్రశంసించే సందర్భంలో ప్రహ్లాదునిగూడా అతని గుణగణ ప్రశంసలు చేయు వృత్తాలతో గాథలుగా కీర్తిస్తుంటారు. ప్రహ్లాదుని వివిధ ఛందోబంధాలతో కీర్తిస్తారని కూడా చెప్పవచ్చు. (మత్తేభ, చంపకమాల, ఉత్పలమాలాది వృత్తాలతో) అలాంటప్పుడు మీబోటి భగవద్భక్తులు దానవపుత్రుడైన ప్రహ్లాదుని గొప్పవానినిగా గణనచేసి కీర్తింపక ఉండగలరా!

**క. గుణనిధి యగు ప్రహ్లాదుని, గుణము లనేకములు గలవు గురుకాలమునన్**
**గణుతింప నశక్యంబులు, ఫణిపతికి బృహస్పతికిని భాషాపతికిన్. 120**

**ప్రతి :** గుణనిధి యగు ప్రహ్లాదుని= సకల సుగుణాలకు గనియైన ప్రహ్లాదునియొక్క; గుణములు= సుగుణాలు; అనేకములు+కలవు= చాల ఉన్నాయి; గురుకాలమునన్= చిరకాలం; ఫణిపతికిన్= సర్పశ్రేష్ఠుడైన ఆదిశేషునకు; బృహస్పతికిని= దేవతల గురువైన బృహస్పతికిని; భాషాపతికిన్= సరస్వతీదేవి భర్త అయిన బ్రహ్మకు; గణుతింపన్= లెక్కించుటకు; అశక్యంబులు= శక్యం కానివి.

**తా :** సుగుణములకు నెలవైన ప్రహ్లాదుని గుణములు అనేకము లున్నాయి. ఆ గుణాలెన్ని ఉన్నాయంటే ఎంతకాలం లెక్కించినా ఆదిశేషునకు గాని, బృహస్పతికి గాని, చదువులతల్లిభర్త బ్రహ్మకు గాని శక్యం గావు.

**వ. ఇట్లు సద్గుణ గరిష్ఠుండయిన ప్రహ్లాదుండు భగవంతుండయిన వాసుదేవుని యందు సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానరతుండై. 121**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సద్గుణ గరిష్ఠుండు+అయిన= సుగుణాలచేత గొప్పవాడైన; ప్రహ్లాదుండు= ప్రహ్లాద కుమారుడు; భగవంతుండు+అయిన= పరమాత్మ ఐన; వాసుదేవునియందు= విష్ణుమూర్తియందు; సహజ= సహజంగానే; సంవర్ధమాన= దిన దిన ప్రవర్ధమానమవుతూ; నిరంతర= సంతతము; ధ్యానరతుండు+ఐ= ధ్యానమునందే ఆసక్తి గలవాడై.

**తా :** సుగుణశ్రేష్ఠుడయిన ప్రహ్లాద కుమారుడు నిరంతరం భగవానుడైన విష్ణుమూర్తిపై భక్తి సహజంగా ఏర్పడి పెరిగి పెద్దదయిన విష్ణుధ్యానంలో మాత్రమే ఆసక్తి గలవాడై.

**సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్లైనఁ జెలికాండ్ర నెవ్వరిఁ జేర మఱచు,**
**నసురారి దనమ్రోల నాడినయట్లైన నసుర బాలురతోడ నాడ మఱచు,**
**భక్తవత్సలుఁడు సంభాషించి నట్లైనఁ బరభాషలకు మాఱుపలుక మఱచు,**
**సురవంద్యుఁ దనలోనఁ జూచిన యట్లైనఁ జొక్కి సమస్తంబుఁ జూడ మఱచు,**

**తే. హరిపదాంభోజయుగ చింతనామృతమున, నంతరంగంబు నిండినట్లైన నతఁడు**
**నిత్య పరిపూర్ణుఁ డగుచు నన్నియును మఱచి, జడత లేకయు నుండును జడుని భంగి. 122**

**ప్రతి :** శ్రీవల్లభుఁడు= మాధవుడు; తన్నున్+చేరిన+అట్లు+ఐనన్= తనను చేరినట్లు భావనరాగా; చెలికాండ్రన్+ఎవ్వరిన్= తన స్నేహితులందరితో; చేర మఱచున్= కలసి తిరగాలనే విషయాన్ని మరచి పోతాడు; అసురారి= దైత్యాంతకుడయిన హరి; తన మ్రోలన్= తన ముందు; ఆడిన+అట్లు+ఐనన్= ఆడినట్లు భావనరాగా; అసుర బాలురతోడన్= రాక్షస బాలకులతో; ఆడ మఱచున్= ఆడుకోవాలనే విషయం మరచిపోతాడు; భక్తవత్సలుఁడు= భక్తులపై వాత్సల్య భావం గల విష్ణువు; సంభాషించినట్లు+ఐనన్= తనతో మాట్లాడినట్లుండగా; పరభాషలకు= ఇతరుల మాటలకు; మాఱుపలుకన్= బదులు పలకడం; మఱచు= మరచిపోతాడు; సురవంద్యున్= దేవతలందరిచే నమస్కారాలు పొందే విష్ణుమూర్తిని; తనలోనన్= తన ఆత్మలో; చూచిన+అట్లు+ఐనన్= దర్శించినట్లైతే; చొక్కి= మిక్కిలి సంతోషించి; సమస్తంబున్+చూడమఱచున్= ఈ ఐహిక సమస్త ప్రపంచాన్ని చూడడం మరచిపోతాడు; హరి= విష్ణుమూర్తియొక్క; పద+అంభోజయుగ= పాదపద్మ ద్వయముయొక్క; చింతన+అమృతమునన్= చింతన అనే అమృతంచేత; అంతరంగంబున్= ప్రహ్లాదుని అంతరంగం; నిండినట్లైనన్= నిండిపోతే; అతఁడు= ఆ ప్రహ్లాదుడు; నిత్యపరిపూర్ణుఁడు+అగుచున్= నిత్య తృప్తుడై; అన్నియును మఱచి=

అన్ని విషయాలను మరచిపోయి; జడత లేకయున్= ఎటువంటి జడత్వమూ లేకపోయినా; జడుని భంగిన్= స్తబ్ధంగా (చైతన్య రహితునివలె) ఉండును= ఉంటాడు.

**తా :** శ్రీమహావిష్ణువు తనను చేరినట్లు భావించినప్పుడు ప్రహ్లాదుడు తన స్నేహితుల దగ్గరకు వెళ్ళడం మరిచిపోతాడు. ఆ దైత్యాంతకుడైన విష్ణువు తనముందు ఆడినట్లు అనిపించగా రాక్షసబాలురతో ఆటలకు వెళ్ళడం మరచిపోతాడు. భక్తులంటే దయగల స్వామి తనతో మాట్లాడుతున్నట్లు భావించినప్పుడు ఇతరుల మాటలకు సమాధానాలు ఇవ్వడం మరిచిపోతాడు. దేవతా బృందంచేత నమస్కారాలు స్వీకరించే విష్ణుమూర్తిని తనలో చూచినట్లు భావన పొందినప్పుడు ఇతర ప్రపంచాన్ని విస్మరిస్తాడు. తన అంతరంగం శ్రీహరియొక్క పదపద్మచింతన అనే అమృతంతో నిండిపోగా అతడు నిత్యపూర్ణుడై అన్నిటిని మరచి తనకు జడత్వం లేకపోయినా జడునిగా ఉండిపోతాడు.

**శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాస లీ**
**లా నిద్రాదులు సేయుచుం దిరుగుచున్ లక్షించుచున్ సంతత**
**శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతా స్వాద సం**
**ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా! 123**

**ప్రతి :** భూవరా!= ఓ రాజా; సుర+అరి సుతుఁడు= రాక్షస కుమారుడైన ప్రహ్లాదుడు; పానీయంబులు+త్రావుచున్= మంచినీళ్లు మొదలైనవి తాగేటప్పుడు; కుడుచుచున్= భోజనాదులు తినేటప్పుడు; భాషించుచున్= మాట్లాడుతున్నప్పుడు; హాస లీలానిద్రాదులు+చేయుచున్= పరిహాసంగా మాట్లాడేటప్పుడు, నిద్రించేటప్పుడు; తిరుగుచున్= సంచరించేటప్పుడు; లక్షించుచున్= భగవద్భక్తిని ప్రకటించే వేళ; సంతత= ఎల్లప్పుడూ; శ్రీనారాయణ= శ్రీమన్నారాయణమూర్తి; పాదపద్మయుగళీ= పాదపద్మాల జంటయొక్క; చింత= చింతించుట అనే; అమృత= సుధను; ఆస్వాద= గ్రోలుటయందు; సంధానుండై= లగ్నం ఐన మనసుతో; ఏతత్+విశ్వమున్= ఈ ప్రపంచాన్ని; మఱచెన్= మరచిపోయేవాడు.

**తా :** ఓ ధర్మరాజా! ప్రహ్లాద కుమారుడు. పానీయాలు త్రాగినా, భోజనాదులు చేసినా, మాట్లాడినా, ఆటపాటలలో, నిద్రించే వేళలలో, అటు ఇటు తిరిగేటప్పుడూ, సర్వకాల సర్వావస్థలయందు శ్రీమన్నారాయణమూర్తి పాదపద్మ ద్వయాన్ని తన హృదయంతో అనుసంధానం చేస్తూ బాహ్యంగా కన్పడే ఈ సమస్త ప్రపంచాన్ని మరచిపోయాడు.

**సీ. వైకుంఠ చింతా వివర్జిత చేష్టుఁడై యొక్కఁడు నేడుచు నొక్కచోట,**
**నశ్రాంతహరిభావనారూఢ చిత్తుఁడై యుద్ధతుఁడై పాడు నొక్కచోట,**
**విష్ణుఁ డింతియ కాని వేఱొండు లే దని యొత్తిలి నగుచుండు నొక్కచోట,**
**నలినాక్షుఁ దనునిధానముఁ గంటి నే నని యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ,**

**ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ, బ్రణయహర్షజనితబాష్పసలిల**
**మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై, యొక్కచోట నిలిచి యూరకుండు. 124**

**ప్రతి :** వైకుంఠచింతా వివర్జిత చేష్టుఁడు+ఐ= వైకుంఠనాథుడైన విష్ణుమూర్తి తప్ప ఇతర ఆలోచనలను విడిచిపెట్టినవాడై; ఒక్కఁడున్= ఒంటరిగా; ఒకచోటన్= ఒక ప్రదేశంలో; ఏడుచున్= విలపిస్తూ ఉంటాడు; అశ్రాంత= విశ్రాంతి లేకుండా;

హరిభావనా= హరిని భావించటంలో; ఆరూఢ= అధిరోహించిన; చిత్తుఁడు+ఐ= మనసు కలవాడై; ఉద్ధతుఁడు+ఐ= ఔద్ధత్యంగలవాడై; ఒక్కచోటన్= ఒక ప్రదేశంలో; పాడున్= పాటలు పాడుతూ ఉంటాడు; విష్ణుఁడు= విష్ణుమూర్తి; ఇంతియ కాని= ఇంతే సుమా! (విష్ణుడు ఒక్కడు మాత్రమే) వేఱొండు లేదు+అని= మరియొకటి లేదని; ఒత్తిలి= గట్టిగా; ఒకచోటన్= ఒక ప్రాంతంలో; నగుచుండున్= నవ్వుతూ ఉంటాడు; నలినాక్షుఁడు= పద్మాక్షుడైన హరి; అను నిధానమున్= అనే ఒక గొప్ప నిధిని; కంటిన్+ఏను+అని= నేను కనుగొన్నానని; ఒక్కచోటన్= ఒక ప్రాంతంలో; ఉబ్బి= సంతోషించి; గంతులు వైచున్= గంతులు వేస్తుంటాడు; ఒక్కచోటన్= ఒక ప్రాంతంలో; పరమేశున్= పరమేశ్వరుడైన; కేశవున్= విష్ణువును; ప్రణయ హర్షజనిత= ప్రేమ పూర్వక సంతోషంతో కలిగిన; బాష్పసలిల= ఆనంద బాష్పబిందువులతో; మిళిత= కూడిన; పులకుఁడు+ఐ= గగుర్పాటుగలవాడై; నిమీలిత నేత్రుఁడు+ఐ= కన్నులు మూసికొని; పలుకు= మాట్లాడతాడు; ఒక్కచోటన్= ఒక్కొక్క ప్రాంతంలో; నిలిచి= నిలబడి; ఊరకుండున్= మౌనంగా ఉంటాడు.

**తా :** ప్రహ్లాదుడు ఒక్కొక్కచోట విష్ణుమూర్తిని గూర్చి యోచించే స్థితిలో ఉండి ఇతర క్రియలు మాని విలపిస్తూ ఉంటాడు. నిరంతరం హరిని ధ్యానించటం మాత్రమే మనసులో నిలుపుకొని ఒక్కొక్కచోట ఉప్పొంగి పాడుతూ ఉంటాడు. విష్ణువు ఒక్కడే ఇంతే సుమా! వేరొకటి లేదని ఒకచోట నవ్వుతూ ఉంటాడు. పద్మాక్షుడనే పెన్నిధిని కనులార కన్నానని ఒకచోట హర్షాతిశయంతో గంతులు వేస్తుంటాడు. ఒకచోట పరమేశ్వరుడైన విష్ణువుపై ప్రేమభావంవల్ల మేను గగుర్పాటును పొందగా, ఆనందాశ్రువులు రాలుతుండగా, కండ్లు మూసుకొని పాడుతూ ఉంటాడు. ఒకచోట మౌనంగా నిలబడి ఉంటాడు. ఇలా హరిభావనతో చిత్రవిచిత్రంగా ప్రవర్తిస్తాడు ప్రహ్లాదుడు.

**వ. ఇట్లు పూర్వజన్మ పరమభాగవత సంసర్గ సమాగతంబైన ముకుంద చరణారవింద సేవాతిరేకంబున నఖర్వ నిర్వాణ భావంబు విస్తరించుచు, నప్పటికి దుర్జనసంసర్గ నిమిత్తంబునం దన చిత్తం బన్యాయత్తంబు గానీక నిజాయత్తంబు సేయుచు, నప్రమత్తుండును, సంసార నివృత్తుండును, బుధజన విధేయుండును, మహాభాగధేయుండును, సుగుణమణిగణగరిష్ఠుండునుఁ, బరమ భాగవత శ్రేష్ఠుండునుఁ, గర్మబంధ లతాలవిత్రుండునుఁ, బవిత్రుండునునైన పుత్రుని యందు విరోధించి, సురవిరోధి యనుకంప లేక చంపం బంపె నని పలికిన నారదునకు ధర్మజుం డిట్లనియె. 125**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; పూర్వజన్మ= గత జన్మలో; పరమభాగవత= గొప్ప భగవద్భక్తుల; సంసర్గ= కూడికతో; సమాగతంబు+ఐన= చక్కగా లభించిన; ముకుంద= విష్ణుమూర్తియొక్క; చరణ+అరవింద= పాద పద్మాల; సేవా+ అతిరేకంబునన్= అధికమైన సేవ చేత; అఖర్వ= తక్కువగాని; నిర్వాణ భావంబున్= మోక్షభావాన్ని (ముముక్షుత్వము); విస్తరించుచున్= అధికం అవుతూ; అప్పటికిన్= ఆ సమయానికి; (ప్రహ్లాదునిగా జన్మించినపుడు); దుర్జన సంసర్గ నిమిత్తంబునన్= దుర్జన రాక్షసుల కలయికవల్ల; తన చిత్తంబు= తన మనసు; అన్య+ఆయత్తంబున్+కానీక= ఇతర విషయములపై ప్రసరింపనీయక; నిజ+ఆయత్తంబున్+చేయుచున్= తన అధీనంలో ఉంచుకొనుచు; అప్రమత్తుండును= ఏమరుపాటు లేనివాడును; సంసార నివృత్తుండునున్= సంసార విషయాలనుండి మరలింపబడినవాడును; బుధజన విధేయుండునున్= పండిత జనులయందు అణకువ గలవాడును; మహాభాగధేయుండునున్= గొప్ప అదృష్టము గలవాడును; సుగుణ మణిగణ గరిష్ఠుండునున్= మంచి గుణాలనే మణుల సముదాయంచేత గొప్పవాడు; పరమభాగవత శ్రేష్ఠుండునున్= గొప్ప భగవద్భక్తులలో ఉత్తముడు; కర్మబంధ= సుకృత దుష్కృతాలనే బంధాలనే; లతా= లతలకు (తీగలకు) లవిత్రుండునున్=

కొడవలివంటివాడు (కర్మబంధములు తెంచుకున్నవాడును); పవిత్రుండునున్= మిక్కిలి పవిత్రుడు; ఐన= ఐనటువంటి; పుత్రుని+అందున్= కుమారునిపై; విరోధించి= విరోధ భావం వహించి; సురవిరోధి= దేవతల శత్రువైన హిరణ్య కశిపుడు; అనుకంప లేక= దయలేక; చంపన్+పంపెన్= చంపుటకు భటులను పంపాడు; అని పలికిన= అలా మాట్లాడిన; నారదునకున్= నారదునితో; ధర్మజుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ప్రహ్లాదునకు పూర్వజన్మలోగల పరమ భాగవతులతోడి స్నేహం వలన విష్ణు పదకమల సేవాభాగ్యంబు అధికమై ముముక్షుమార్గంలో ప్రయాణింప చేసింది. ఈ ప్రహ్లాద జన్మలో దుర్జనరాక్షసుల స్నేహంవల్ల తన మనసు ఇతర విషయాల మీదకు పోనివ్వకుండా తన అధీనంలోనే ఉంచుకొని, ప్రమాదరహితుడై, సంసారంనుండి విడివడి, పండితులకు అణకువగా ఉంటూ మంచి అదృష్టవంతుడై, సుగుణమణులచే గొప్పవాడై, గొప్ప భగవద్భక్తులలో ఉత్తముడై కర్మబంధాలనే లతలను తెంచుకొని, పవిత్రుడుగా ఉన్నాడు ప్రహ్లాదుడు. అటువంటి పుత్రునిపై హిరణ్యకశిపుడు శత్రుత్వం వహించి దయ లేకుండా కన్న కొడుకును చంపటానికి భటులను పంపాడు అని నారదుడు చెప్పగా ధర్మరాజు ఇలా అన్నాడు.

**శా. పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్**
**మిత్రత్వంబున బుద్ధి సెప్పి దురితోన్మేషంబు వారింతు రే**
**శత్రుత్వంబుఁ దలంప, రిట్టియెడ నా సౌజన్యరత్నాకరుం**
**బుత్రున్ లోకపవిత్రుఁ దండ్రి నెగులుం బొందింప నెట్లోర్చెనో? 126**

**ప్రతి :** పుత్రుల్= సుతులు (కుమారులు); నేర్చినన్= విద్యాదికాలు నేర్చినా; నేరకున్నన్= నేర్వకున్నా; జనకుల్= తలిదండ్రులు; ఎల్లప్పుడున్= అన్ని వేళలలో; పోషింతురు= దయతో సాకుతారు; మిత్రత్వంబునన్= స్నేహభావంతో; బుద్ధిన్= మంచి బుద్ధిని; చెప్పి= తెలియజేసి; దురిత+ఉన్మేషంబున్= చెడ్డ బుద్ధులను; వారింతురు= నివారిస్తారు. (పాపాలు చేయకుండా చేస్తారు); ఏ శత్రుత్వంబున్+తలంపరు= ఎటువంటి వైరభావమూ చూపింపరు కదా!; ఇట్టి యెడన్= ఈ సందర్భంలో (అనగా ఈ ప్రహ్లాదుని విషయంలో); ఆ సౌజన్య రత్న+ఆకరున్= మంచితనానికి సముద్రం వంటివాడైన (అనేక సుగుణములుగల); లోక పవిత్రున్= విశ్వంలోనే పవిత్రమైన వానిని; పుత్రున్= ప్రహ్లాదునికి; తండ్రి= తండ్రి అయిన హిరణ్యకశిపుడు; నెగులున్+పొందింపన్= కష్టం కలిగించడానికి; ఎట్లు+ఓర్చెనో= మనసు ఎలా ఒప్పిందో కదా!

**తా :** లోకంలో తలిదండ్రులు తమ కుమారులు విద్యాది విషయాలను నేర్చుకున్నా, నేర్వకున్నా పోషిస్తారు. ఎప్పుడూ స్నేహభావాన్ని వహిస్తూ మంచి బుద్ధులు చెప్పి తమ పిల్లల పాపపు బుద్ధిని నివారిస్తారు. ఎటువంటి శత్రుత్వం వహించరు. అటువంటిది అనంత సుగుణాల నిలయుడు, లోక పవిత్రుడు అయిన ప్రహ్లాద కుమారుణ్ణి కష్టపెట్టడానికి తండ్రికి మనసెలా ఒప్పిందో!

**ఉ. బాలుఁ బ్రభావిశాలు హరిపాదపయోరుహ చింతన క్రియా**
**లోలుఁ గృపాళు సాధు గురు లోక పదానతఫాలు నిర్మల**
**శ్రీలు సమస్త సభ్య నుతశీలు విఖండిత మోహవల్లి కా**
**జాలు నదేల తండ్రి వడిఁ జంపఁగ బంపె? మునీంద్ర! సెప్పవే? 127**

**ప్రతి :** మునీంద్ర!= ఓ నారద మహర్షీ!; బాలున్= చిన్నవానిని; ప్రభావిశాలున్= విస్తారమైన కాంతిగలవానిని; హరిపాద పయోరుహ= విష్ణుపాద పద్మాలగురించి; చింతన క్రియాలోలున్= చింతించుట అనే క్రియలో నిమగ్నమైనవానిని; కృపాళున్=

కృప (దయ)గలవానిని; సాధు= సత్పురుషుల; గురులోక= పెద్దల సముదాయం; పదానతఫాలున్= పాదాలయందు ఉంచబడిన నుదురుగలవాడు (సత్పురుషుల గురుదేవుల పాదాలకు నమస్కరించే వినయ స్వభావుడు); నిర్మలశ్రీలు= స్వచ్ఛమైన సంపదగలవానిని; సమస్త సభ్యనుతశీలున్= అందరు సభ్యజనులచే కీర్తించబడే స్వభావంగలవాడు; విఖండిత= ఖండింపబడిన; మోహ= మోహంఅనే; వల్లికా= తీగల; జాలున్= సమూహం గలవాడు (మోహంను తెంచుకున్నవాడు); తండ్రి= తండ్రి అయిన హిరణ్యకశిపుడు; వడిన్= వేగంగా; చంపఁగన్+పంపెన్= చంపడానికి పంపాడు; అది+ఏల= అది ఎందుకో; చెప్పవే= చెప్పుము.

**తా :** ఓ నారద మహర్షీ! బాలుణ్ణి, కాంతిగల వాడిని, హరిపాద పద్మాలను అనుదినం చింతించేవాడిని, దయాస్వభావం గలవాడిని, సత్పురుషులకు గురువులకు నమస్కరించేవాడిని, స్వచ్ఛమైన సంపదలు గలవాడిని, సభ్యులందరి పొగడ్తలు పొందేవాడిని, మోహ లతలను త్రెంచుకొన్నవాడైన ప్రహ్లాదుణ్ణి తండ్రి ఎందుకు చంపించే ప్రయత్నం చేశాడు. ఈ విచిత్రం నాకు చెప్పవా! అని ధర్మరాజు ప్రశ్నించాడు.

**వ. అనిన నారదుం డిట్లనియె. 128**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; నారదుండు= నారదమహర్షి; ఇట్లు+అనియెన్= మరల ఇలా అన్నాడు...

**తా :** అని పలికిన ధర్మరాజుతో నారదుడు ఇలా అన్నాడు.

**శా. లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింపఁడశ్రాంతమున్**
**సభ్యత్వంబున నున్నవాఁ డబలుఁడై జాడ్యంబుతో వీఁడు, వి**
**ద్యాభ్యాసంబునఁ గాని తీవ్రమతి గాఁ డంచున్ విచారించి దై**
**తేభ్యుం డొక్కదినంబునం బ్రియసుతున్ వీక్షించి సోత్కంఠుఁడై. 129**

**ప్రతి :** లభ్యంబు+ఐన= లభించిన; సుర+అధిరాజపదమున్= రాక్షస సామ్రాజ్య అధికార పదవిని; లక్షింపఁడు= లెక్కపెట్టడు; అశ్రాంతమున్= ఎల్లప్పుడు; అబలుఁడు+ఐ= బలం లేనివాడై; జాడ్యంబుతోన్= సోమరితనంతో; వీఁడు= ఈ ప్రహ్లాదకుమారుడు; సభ్యత్వంబునన్+ఉన్నవాఁడు= సభా మర్యాదను అనుసరించి ప్రవర్తిస్తున్నాడు; (మొరటుదనం లేక సాత్వికుడుగా ఉంటున్నాడు); విద్యాభ్యాసంబునన్+కాని= విద్యాభ్యాసం చేస్తే తప్ప; తీవ్రమతిన్+కాఁడు+అంచున్= తీక్ష్ణబుద్ధి కలవాడుగా కాదు అనుకుంటూ; విచారించి= ఆలోచించి; దైత్యేభ్యుండు= దానవరాజు; ఒక్క దివసంబునన్= ఒక రోజు; ప్రియసుతున్= ప్రియ పుత్రుడు ప్రహ్లాదుని; వీక్షించి= చూచి; స+ఉత్కంఠుఁడు+ఐ= తహతహ కలిగినవాడై...

**తా :** రాక్షసరాజు హిరణ్యకశిపుడు ఒకరోజు తన కుమారుని చూచి ఆలోచించి ఆతృతతో ఈ ప్రహ్లాద కుమారుడు లభించిన రాక్షస రాజ్యపదవిపై ఆశచూపడు. ఎల్లప్పుడు మర్యాద తప్పక బలం లేని వానివలె నిశ్చైతన్యంగా రాక్షసబుద్ధి లేక సభ్యతతో ఉంటాడు. వీడు విద్యాభ్యాసంవల్ల గాని తీక్ష్ణ బుద్ధి కాలేడని అనుకొన్నాడు.

**క. చదువనివా డజ్ఞుం డగుఁ, జదివిన సదసద్వివేక చతురత గలుగుం,**
**జదువఁగ వలయును జనులకుఁ, జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ! 130**

**ప్రతి :** తండ్రీ= ఓ ప్రియ పుత్రా! (వాత్సల్యంతో కొడుకును చేసిన సంబోధన); చదువని వాఁడు= చదువుకోనివాడు; అజ్ఞుండు+అగున్= అజ్ఞాని అవుతాడు; చదివినన్= చదువుకున్నట్లయితే; సత్+అసత్+వివేక చతురత+కలుగున్= మంచి

చెడులను తెలుసుకునే విజ్ఞానం కలుగుతుంది; జనులకున్= ప్రజలందరికి; చదువఁగ వలయును= చదువుట తప్పనిసరి; చదివించెదన్= చదువు చెప్పిస్తాను; ఆర్యుల+ఒద్దన్= పెద్దల పూజ్యులవద్ద; చదువుము= బుద్ధిగా చదువు నేర్చుకో!

**తా :** ఓ ప్రియకుమారా! విద్య నేర్వకున్నచో అజ్ఞాని అవుతాడు. విద్య నేర్చినవాడు విచక్షణా జ్ఞానం కలిగి నేర్పరి అవుతాడు. అందుకే అందరు తప్పక చదువుకొని తీరాలి. పెద్దలవద్ద నీకు విద్య నేర్పిస్తాను. బుద్ధిగా చదువుకో.

**విశే :** విద్యయొక్క ప్రయోజనాన్ని ఈ పద్యం సూచిస్తుంది. ఇది ఒక ప్రహ్లాదునికే కాదు సార్వకాలికం. అందరూ చదువుకోవాలనే సామాజిక స్పృహ ఇందులో ఉంది.

**వ. అని పలికి యసురలోక పురోహితుండును భగవంతుండును నయిన శుక్రాచార్యు కొడుకులఁ బ్రచండవితర్కులఁ జండామర్కుల రావించి సత్కరించి యిట్లనియె. 131**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా మాట్లాడి; అసురలోక పురోహితుండును= రాక్షస లోకానికి పురోహితుడు; భగవంతుండునున్= షడ్గుణైశ్వర్య సంపన్నుడు; అయిన= అయినటువంటి; శుక్రాచార్యు= శుక్రాచార్యుని; కొడుకులన్= కుమారులను; ప్రచండ వితర్కులన్= తీవ్రంగా విచారణ చేసేవారు; చండ+అమర్కులన్+రావించి= చండ అమర్క అనే వారిని పిలిపించి; సత్కరించి= వారిని గౌరవించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా సుతునితో హిరణ్యకశిపుడు పలికి, రాక్షసలోక పురోహితుడు, మిక్కిలి పూజ్యుడు అయిన శుక్రాచార్యుని కుమారులను, తీవ్రమైన విచారణ చేసే చండ, అమర్క అనేవారు ఇరువురిని పిలిచి, వారిని సత్కరించి ఇలా అన్నాడు.

**శా. 'అంధప్రక్రియ నున్నవాఁడు, పలుకం, దస్మత్ప్రతాపక్రియా**
**గంధం బించుక లేదు, మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో**
**బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మముం బాటించి యీ బాలకున్**
**గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గావించి రక్షింపరే!' 132**

**ప్రతి :** (నా కుమారుడైన ప్రహ్లాదుడు) అంధ ప్రక్రియన్+ఉన్నవాఁడు= అజ్ఞానంతో అంధునివలె ఉన్నాడు; పలుకండు= ఏమి అడిగినా తిరిగి సమాధానం పలుకడు; అస్మత్= నాయొక్క; ప్రతాప క్రియా గంధంబు= శౌర్యానికి సంబంధించిన క్రియలను చేయటంలో ఆసక్తి; ఇంచుకన్+లేదు= కొంచెం కూడా లేదు (నా వలె దేవతలను ప్రతాపంతో ఎదిరించుట వంటి తీవ్రమైన కార్యాలు చేయడు); మీరు గురువుల్= మీరు మాకు గురువులు; కారుణ్యచిత్తుల్= మాపై చాల దయగల మనసు గలవారు; మనస్+బంధుల్= మీరే మాకు ఆత్మ బంధువులు; మాన్యులు= గౌరవింపదగినవారు; మాకున్+పెద్దలు= మాకు మీరు ఆర్యులు; మమున్+పాటించి= మమ్మల్ని మన్నించి; ఈ బాలకున్= ఈ ప్రహ్లాద బాలకుని; గ్రంథంబుల్= అనేక గ్రంథాలను; చదివించి= విద్యలలో ఆరితేరిన వానిలా చేసి; నీతికుశలున్= రాజనీతిలో నైపుణ్యం గలవానినిగా; కావించి= తయారు చేయించి; రక్షింపరే= మమ్మల్ని రక్షించండి.

**తా :** మా ప్రహ్లాదకుమారుడు అజ్ఞానంతో అంధుడై ఉన్నాడు. దేనికి సమాధానం చెప్పడు. నా ప్రతాప క్రియల వాసన కూడా అతనికి తెలియదు. మీరు మాకు గురుదేవులు. దయగలవారు. మీరు మాకు మనఃపూర్వకమైన బంధువులు, మాన్యులు, మాకు పెద్దలు, మమ్మల్ని మన్నించి ఈ ప్రహ్లాదబాలుడి అనేక గ్రంథాలను చదివించి, రాజనీతిజ్ఞునిగా చేసి మమ్మల్ని రక్షించండి.

**విశే :** రాజుకోరింది 'రాక్షసనీతిమార్గంలో విద్యాభ్యాసం'. ఆ మార్గం ప్రత్యేకమూ, విలక్షణమూ.

**వ. అని పలికి వారలకుం బ్రహ్లాదు నప్పగించి తోడ్కొని పొం డనిన వారును దనుజ రాజకుమారునిం గొనిపోయి యతనికి సవయస్కులగు సహశ్రోతల నసురకుమారులం గొందఱం గూర్చి. 133**

**ప్రతి :** అని పలికి= ఈ విధంగా మాట్లాడి; వారలకున్= ఆ చండామర్కులకు; ప్రహ్లాదున్+అప్పగించి= ప్రహ్లాదుణ్ణి అప్పగించి; తోడ్కొని పొందు+అనినన్= తీసికొని పొండని అనగా; వారును= ఆ గురువులు కూడా; దనుజరాజకుమారునిన్= రాక్షసరాజపుత్రుని; కొనిపోయి= తీసికొని పోయి; అతనికి సవయస్కులగు= అతనికి సమానమైన వయసుగల; సహశ్రోతలన్= కూడా పాఠాన్ని వినేవారం; అసుర కుమారులన్= రాక్షస కుమారులను; కొందఱన్+కూర్చి= కొందరిని జతచేసి...

**తా :** ఈ విధంగా హిరణ్యకశిపుడు గురువులతో పలికి ప్రహ్లాదుని వారికి అప్పగించి తీసికొని పొమ్మన్నాడు. చండామర్కులు కూడా ఈ ప్రహ్లాద కుమారునితోపాటు అతని వయస్సే గల మరికొంతమంది రాక్షస పుత్రులను అతనితో పాఠాలను వినేవారిని చేర్చి.

**ఉ. అంచిత భక్తితోడ దనుజాధిపు గేహసమీపముం బ్రవే**
**శించి సురారి రాజసుతుఁ జేకొని శుక్రకుమారకుల్ పఠిం**
**పించిరి పాఠయోగ్యములు పెక్కులు శాస్త్రము, లాకుమారుఁ డా**
**లించి పఠించె నన్నియుఁ జలింపని వైష్ణవభక్తి పూర్ణుఁడై. 134**

**ప్రతి :** శుక్రకుమారకుల్= శుక్రాచార్యుని కుమారులు; అంచిత భక్తితోడన్= తగిన భక్తితో; దనుజ+అధిపు గేహసమీపమున్= రాక్షసరాజ గృహ సమీపాన్నే; ప్రవేశించి= భవనంలోనికి ప్రవేశించి; సుర+అరి రాజసుతన్= దేవతల వైరి అయిన హిరణ్యకశిపుని పుత్రుని; చేకొని= వెంటగొనిపోయి; పాఠయోగ్యములు= చదువదగినవి; పెక్కులు శాస్త్రములు= ఎన్నో శాస్త్రాలు; పఠింపించిరి= చదివించారు; ఆ కుమారుఁడు= ఆ ప్రహ్లాద కుమారుడు; చలింపని వైష్ణవ భక్తిపూర్ణుఁడు+ఐ= నిశ్చలమైన విష్ణుభక్తితో; ఆలించి= విని; అన్నియున్= గురువులు చెప్పిన విద్యలన్ని; పఠించెన్= చదివినాడు.

**తా :** శుక్రాచార్యుని పుత్రులు ప్రహ్లాదుని తీసికొని దానవరాజ ప్రాసాదానికి సమీపంలో ఉన్న భవనంలోనికి ప్రవేశించారు. హిరణ్యకశిపునిపై భక్తి అతిశయించగా ప్రహ్లాదునకు తగిన రాజనీతి శాస్త్రములు చాల చదివించారు. ప్రహ్లాదుడు నిశ్చలమైన విష్ణుభక్తి గలవాడై, గురువులు చెప్పిన శాస్త్రవిద్యలు అన్నింటిని విని చక్కగా అధ్యయనం చేశాడు.

**క. ఏ పగిది వారు సెప్పిన, నా పగిదిం జదువుఁ గాని యట్టి ట్టని యా**
**క్షేపింపఁడు, తా నన్నియు, రూపించిన మిథ్యలని నిరూఢమనీషన్. 135**

**ప్రతి :** తాను= ప్రహ్లాదుడు; అన్నియున్= గురువులు చెప్పుచున్న శాస్త్రాది విద్యలన్నీకూడా; రూపించిన= ఆరోపించినవి; మిథ్యలని= అసత్యాలని; నిరూఢమనీషన్= నిశ్చయమైన బుద్ధితో గ్రహించినా; ఏ పగిది వారు+చెప్పినన్= ఏ ప్రకారంగా గురువులు చెప్పారో; ఆ పగిదిన్= ఆ ప్రకారంగానే; చదువున్+కాని= చదువుతాడు కాని; అట్టు+ఇట్టు+అని= అలా అని ఇలా అని; ఆక్షేపింపఁడు= వాదించడు.

**తా :** ప్రహ్లాదుని నిశ్చయమైన బుద్ధికి గురువులు చెప్పే శాస్త్రాలన్నీ అసత్యాలని, అవి నిజాలుగా ఆరోపింపబడుతున్నాయని తెలుసు. అయినప్పటికీ వినయ సంపన్నుడు కాబట్టి, ఆ ప్రహ్లాదుడు గురువులు ఎలా చెప్పారో అలాగే చెపుతాడు తప్ప 'అదికాదు ఇదీ' అని గాని 'ఇలా కాదు అలా' అని గాని గురువులను ఆక్షేపించడు.

**విశే :** ప్రహ్లాదుడు తనకు నచ్చని పాఠాలు గురువులు చెప్పినా అవి వాస్తవంగా తండ్రికోరిన రాజనీతిలో భాగమే అయినా గురువులు చెప్పినట్లు పలకడమే తప్ప గురువులను కాని వారు చెప్పిన విషయాలను కాని ఆక్షేపించలేదు. ఇది అతని గురుభక్తికి నిదర్శనం.

**శా. అంతం గొన్నిదినంబు లేఁగిన సురేంద్రారాతి శంకాన్విత**
**స్వాంతుండై నిజనందనున్ గురువు లే జాడం బఠింపించిరో**
**భ్రాంతుం డేమి పఠించెనో, పిలిచి సంభాషించి విద్యా పరి**
**శ్రాంతిం జూచెదఁగాక నేఁడని మహాసౌధాంతరాసీనుఁడై. 136**

**ప్రతి :** అంతన్= అటు తరువాత; కొన్ని దినంబులు+ఏఁగినన్= కొన్ని రోజులు గడిచిపోగా; సురేంద్ర+అరాతి= దేవతల శత్రువైన హిరణ్యకశిపుడు; శంక+అన్విత స్వాంతుండు+ఐ= మనసులో అనుమానం కలిగినవాడై; నిజనందనున్= తనకుమారుని; గురువులు= చండామర్కులు; ఏ జాడన్+పఠింపించిరో= ఏ విధంగా చదివించారో; భ్రాంతుండు= భ్రాంతి కలిగినవాడు (అమాయకుడు); ఏమి పఠించెనో= ఏమి చదివాడో; పిలిచి= ఆహ్వానించి; సంభాషించి= మాట్లాడి; విద్యాపరిశ్రాంతిన్= విద్యలో చేసిన శ్రమను; చూచెదన్+కాక= తెలుసుకొంటాను; నేఁడు+అని= ఈ రోజు అని; మహా= గొప్పదైన; సౌధ+అంతర= భవనం లోపల; ఆసీనుఁడై= కూర్చున్నవాడై...

**తా :** విద్యనేర్చుకోవడానికి కొడుకును పంపిన కొన్నినాళ్ళకు, హిరణ్యకశిపునికి మనసులో శంక కలిగింది. తనకుమారుని గురువులు ఏ రీతిగా చదివించారో అమాయకుడైన ఈ పసిబాలుడు ఎలా చదివాడో? అనుకొంటూ, అతని విద్యాభ్యాస కృషిని తెలిసికొందామనే ఆలోచన కలిగి ఒకనాడు తన భవనంమధ్యలో ఆసీనుడై.

**విశే :** తల్లిదండ్రులు తమ పిల్లల్ని పాఠశాలల్లో చదివిస్తున్నప్పుడు చదువులలో వారి పురోగతి విషయమై తరచుగా శ్రద్ధ వహిస్తుండాలి. అనే సందేశం ఇందులో ఉంది.

**ఉ. మోదముతోడ దైత్యకులముఖ్యుఁడు రమ్మని చీరఁ బంచెఁ బ్ర**
**హ్లాదకుమారకున్ భవమహార్ణవతారకుఁ గామరోష లో**
**భాది విరోధివర్గ పరిహారకుఁ గేశవచింతనామృతా**
**స్వాద కఠోరకుం గలుషజాల మహోగ్రవనీకుఠారకున్. 137**

**ప్రతి :** భవ= సంసారమనే; మహా= గొప్పదైన; అర్ణవ= సముద్రాన్ని; తారకున్= దాటినవానిని; కామ= కోరికలు; రోష= క్రోధాలు; లోభ= లోభాలు; ఆది= మొదలుగాగల; విరోధివర్గ పరిహారకున్= విరోధం కల్గించేవాటిని జయించినవాడు; కేశవ= విష్ణుమూర్తియొక్క; చింతన= నిరంతరధ్యానమనే; అమృత= సుధను; ఆస్వాద= గ్రోలుటయందులో; కఠోరకున్= నిష్ఠురమైన వ్రతంగలవానిని; కలుషజాల= కలుషముల సముదాయమనే; మహా+ఉగ్ర= మహాభయంకరమైన; వనీ=

వనానికి; కుఠారకున్= గొడ్డలి అయినవానికి (కలుషాలనే భయంకరారణ్యాన్ని కూలగొట్టే గొడ్డలివంటివాడు) ప్రహ్లాద కుమారకున్= ప్రహ్లాదుడనే తన కుమారుని; మోదముతోడన్= ఆనందంతో; దైత్యకులముఖ్యుఁడు= రాక్షస కులశ్రేష్ఠుడైన హిరణ్యకశిపుడు; రమ్మని చీరన్+పంచెన్= దగ్గరికి రమ్మని పిలుచుటకు పంపించాడు.

**తా :** ఆ రాక్షస వంశశ్రేష్ఠుడైన హిరణ్యకశిపుడు సంసారసముద్రాన్ని దాటిన వాడిని, కామక్రోధలోభాది అరిషడ్వర్గాలను జయించినవాడిని, విష్ణు పదధ్యానమనే అమృతాన్ని నిరంతరం తాగటమే కఠోరవ్రతంగా గలవాడిని; పాపాలనే వృక్షాలుగల అరణ్యాన్ని ఖండించే గొడ్డలివంటివాడైన ప్రహ్లాద కుమారుని తనవద్దకు రమ్మని పిలిపించాడు.

**వ. ఇట్లు చారులచేత నాహూయమానుండై ప్రహ్లాదుండు చనుదెంచిన. 138**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; చారులచేతన్= రాజభటులచేత; ఆహూయమానుండు+ఐ= పిలువబడినవాడై; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; చనుదెంచినన్= రాగా...

**తా :** ఈ విధంగా రాజభటులచేత పిలిపించిన ప్రహ్లాదుడు, తండ్రివద్దకురాగా

**శా. ఉత్సాహ ప్రభు మంత్రశక్తి యుతమే యుద్యోగ? మారూఢ సం**
**వి త్సంపన్నుఁడ వైతివే? చదివితే వేదంబులున్ శాస్త్రముల్?**
**వత్సా! రమ్మని చేరఁ జీరి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుఁడై**
**యుత్సంగాగ్రముఁ జేర్చి దానవవిభుం డుత్కంఠ దీపింపఁగన్. 139**

**ప్రతి :** వత్సా= కుమారా!; ఉద్యోగము= నీవు చేసే ప్రయత్నం; ఉత్సాహ ప్రభు మంత్రశక్తియుతమే= ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి అనే మూడుశక్తులతో కూడిందా?; ఆరూఢ= పొందబడిన; సంవిత్= జ్ఞానమనే; సంపన్నుఁడవు+ఐతివే= సంపదగలవాడవైనావా!; వేదంబులున్= వేదాలు; శాస్త్రంబుల్= శాస్త్రాలు; చదివితే= చదివినావా? రమ్ము+అని= రా అని; చేరన్+చీరి= దగ్గరకు పిలిచి; కొడుకున్= కుమారుడైన ప్రహ్లాదుని; వాత్సల్యసంపూర్ణుఁడు+ఐ= నిండైన వాత్సల్యంతో; ఉత్సంగ+అగ్రమున్+చేర్చి= ఒడిలో చేర్చుకొని; దానవవిభుండు= దానవరాజు హిరణ్యకశిపుడు; ఉత్కంఠ= ఆసక్తి; దీపింపఁగన్= కన్పడగా...

**తా :** ఓ ప్రియపుత్రా! నీవు చేసే ప్రయత్నం ఉత్సాహ, ప్రభు, మంత్రశక్తుల మూడింటితో కలసిఉందా! జ్ఞానసంపన్నుడివైనావా! వేదాలు శాస్త్రాలు చదివావా! ఇలా దగ్గరకు రా. అని నిండైన వాత్సల్యంతో ప్రహ్లాదుని ఒడిలో చేర్చుకొని ఆసక్తితో హిరణ్యకశిపుడు (ఇలా అన్నాడు)

**విశే :** ఏ కార్యం నిర్వహించడానికైనా ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి అనే మూడు శక్తులు అవసరం. మొదట పనిచేయాలనే ఉత్సాహం కావాలి. ఆ ఉత్సాహాన్ని తప్పుదారి పట్టించకుండా తప్పించే ప్రభుశక్తి కావాలి. తరువాత సరైన ఆలోచనా శక్తి కావాలి. ఈ మూడు చక్కగా సమన్వయం చేసుకున్నప్పుడే ప్రయత్నం సఫలం అవుతుంది. ఇక్కడ దానవరాజు ప్రహ్లాదుని 'విద్యాభ్యాస సమయంలో ఈ మూడింటిని పాటిస్తున్నావా?' అని ప్రశ్నిస్తున్నాడు.

**క. అనుదినసంతోషణములు, జనితశ్రమతాపదుఃఖ సంశోషణముల్**
**తనయుల సంభాషణములు, జనకులకుం గర్ణయుగళ సద్భూషణముల్. 140**

**ప్రతి :** తనయుల సంభాషణములు= తమ తమ కుమారులతో మాటలాడుట; అనుదిన సంతోషణములు= నిత్యమూ సంతోషం కలిగించేవి; జనిత= కలిగిన; శ్రమ= శ్రమను; తాప= బాధను; దుఃఖ= దుఃఖాన్ని; సంశోషణముల్= ఎండగట్టేవి; జనకులకున్= తండ్రులకు; కర్ణయుగళ= చెవుల జంటకు; సద్భూషణముల్= చక్కని అలంకారాలు.

**తా :** ఓ ప్రహ్లాదకుమారా! తమ తమ పుత్రులతో సంభాషించడం ఆ యా తల్లిదండ్రులకు నిరంతరం సంతోషం నింపుతుంది. అంతేకాదు. వారి సంభాషణలు శ్రమను, తాపాన్ని, దుఃఖాన్ని నివారిస్తాయి. తల్లిదండ్రుల చెవులకు తమ పుత్రుల మాటలు వినడమే చెవులకు భూషణాలు ధరించుట వంటిది.

**వ. అని మఱియుఁ బుత్రా! నీ కెయ్యది భద్రంబై యున్నది? సెప్పు మనినఁ గన్న తండ్రికిఁ బ్రియనందనుం డిట్లనియె. 141**

**ప్రతి :** అని మఱియున్= అని పలుకుతూ ఇంకా ఇలా అన్నాడు; పుత్రా!= ఓ కుమారా!; నీకు+ఏ+అది భద్రంబు+ఐ+ ఉన్నది?= నీకు ఏది మంచిదని తోచుచున్నది; చెప్పుము+అనినన్= చెప్పు అని అడుగగా; కన్నతండ్రికిన్= కన్నతండ్రి హిరణ్యకశిపునితో; ప్రియనందనుండు= ప్రియపుత్రుడైన ప్రహ్లాదుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఓ కుమారా! ఇంతవరకు నీవు చేసిన విద్యాభ్యాస విషయాలలో నీకు మంచిదని తోచిన అంశాన్ని చెప్పు అని ప్రియపుత్రుడైన ప్రహ్లాదుణ్ణి కన్నతండ్రి హిరణ్యకశిపుడు అడిగాడు. అపుడు ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

**ఉ. ఎల్ల శరీరధారులకు నిల్లను చీఁకటి నూతిలోపలం**
**ద్రెళ్ళక వీరు నే మను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ**
**ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయ మంచు విష్ణునం**
**దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ! 142**

**ప్రతి :** ఓ నిశాచర+అగ్రణీ= ఓ రాక్షస శ్రేష్ఠా!; ఎల్ల శరీరధారులకున్= శరీరాన్ని ధరించిన ప్రతివ్యక్తికి; ఇల్లు+అను= తమ గృహం అనే; చీఁకటి నూతిలోపలన్= చీకటితో నిండిన లోతైనబావిలో; త్రెళ్ళక= పడక; వీరును+ఏము+అను= మీరు మేము అనే భేదభావంతో; మతిభ్రమణంబునన్= చంచలమైన మనసుతో; భిన్నులై= విడివిడి వారలుగా భావించుకుంటూ; ప్రవర్తిల్లక= నడుచుకోకుండా; సర్వమున్= ఈ సమస్త ప్రపంచమంతా; అతని= ఆ విష్ణుమూర్తియొక్క; దివ్యకళామయము= దివ్యమైన కళలతో నిండినది; అంచున్= అనుకొంటు; విష్ణునందు= శ్రీ విష్ణువుపై; ఉల్లమున్+చేర్చి= మనసును చేర్చి; తారు= తాము (ఈ ప్రజలందఱు); అడవిన్+ఉండుటమేలు= అడవులలో నివసించుట మంచిది.

**తా :** ఓ రాక్షసరాజా! మానవులందరూ వారి వారి ఇల్లు అనే చీకటి నూతిలో పడిపోకుండా, మీరు, మేము అనే భేదభావంతో అఖండతత్త్వ భావనను విడిచి ప్రవర్తించక ఈ సమస్త ప్రపంచం ఆ పరమాత్మ దివ్యమైన కళావిలాసమే అనే సత్యాన్ని గుర్తించి, విష్ణువులో తమ మనసును చేర్చి అడవులలో ఏకాంతంగా జీవించటం మేలు.

**విశే :** సంసారం అనే చీకటి బావిలో పడరాదు. అభేద దర్శనం జ్ఞానం అన్న శాస్త్రోక్తిని అనుసరించి భేదదృష్టితో కాకుండా అందరినీ సమబుద్ధితో చూడాలి. ఈ విశ్వమంతా కూడా వాసుదేవుని దివ్యకళాత్మకమే అని భావించాలి.

**వ. అని కుమారుం డాడిన ప్రతిపక్షానురూపంబు లయిన సల్లాపంబులు విని దానవేంద్రుండు నగుచు నిట్లనియె. 143**

**ప్రతి :** అని= ఈ ప్రకారంగా; కుమారుండు+ఆడిన= పుత్రుడు మాట్లాడిన; ప్రతిపక్ష+అనురూపంబులు+అయిన= శత్రువైన విష్ణుమూర్తికి అనుకూలంగానున్న; సల్లాపంబులు= మంచి మాటలు; విని= ఆలకించి; దానవ+ఇంద్రుండు= రాక్షసరాజు హిరణ్యకశిపుడు; నగుచున్= నవ్వుచూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ ప్రకారంగా ప్రహ్లాదుడు శత్రువైన విష్ణువును స్తుతించేలా మాట్లాడిన మాటలు విని హిరణ్యకశిపుడు నవ్వుతూ ఇలా అన్నాడు.

**క. ఎట్టాడిన న ట్టాడుదు, రిట్టి ట్టని పలుక నెఱుఁగ రితరుల శిశువుల్**
**దట్టించి యెవ్వ రేమని, పట్టించిరొ బాలకునకుఁ బరపక్షంబుల్? 144**

**ప్రతి :** ఇతరుల శిశువుల్= ఇతర రాక్షసబాలురు; ఎట్టు+ఆడినన్= ఏ విధంగా మాట్లాడితే; అట్టు+ఆడుదురు= ఆ రకంగానే మాట్లాడతారు (ఎలా చెపితే అలా వింటారు); ఇట్టు+ఇట్టు+అని= ఇది అలా ఇది ఇలా అని; పలుకన్+ ఎఱుఁగరు= ఎదురు చెప్పి ఎరుగరు; బాలకునకున్= నా కుమారుడైన ప్రహ్లాదునకు; పరపక్షంబుల్= శత్రుపక్షమైన విష్ణుమూర్తి ఆసక్తులను; ఏ+వారు= ఎవరు; ఏమని= ఏ విధంగా; దట్టించి పట్టించిరొ= గట్టిగా తలకెక్కించారో గదా!

**తా :** ఇతర రాక్షసపుత్రులు గురువులవద్ద చదువువారు ఎలా అడిగితే అలా సమాధానం చెపుతారు. ఇలా ఎదిరించి ఇది అది అది ఇది అని అనరు. నా పుత్రుడైన ప్రహ్లాదునకు శత్రుపక్షంపై అభిమానం కలిగేలా ఎవరు ఏ రీతిగా తల కెక్కేలా గట్టిగా చెప్పారో కదా!

**శా. నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా! నా తండ్రి! యీ బుద్ధి దా**
**నీకున్ లోపలఁ దోఁచెనో? పరులు దుర్నీతుల్ పఠింపించిరో?**
**యేకాంతంబున భార్గవుల్ పలికిరో? యీ దానవశ్రేణికిన్**
**వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్? 145**

**ప్రతి :** నా తండ్రి= నా కుమారా!; ఈ బుద్ధి= ఈ ఆలోచన; తా నీకున్= నీకు గానే; లోపలన్+తోఁచెనో= లోపల కలిగిందా!; పరులు= ఇతరులు (శత్రువులు); దుర్నీతుల్= చెడ్డవైన నీతులను; పఠింపించిరో= బోధించారా!; ఏకాంతంబునన్= ఒంటరిగా ఉన్న వేళలలో; భార్గవుల్= భృగువంశ సంజాతులు; శుక్రకుమారులు చండామర్కులు; పలికిరో= చెప్పారో; నాకున్=నాకు; చూడఁగన్= చూడటానికి; చోద్యము+అయ్యెడిన్+కదా= చాలా చిత్రంగా ఉన్నది సుమా!; ఈ దానవ శ్రేణికిన్= ఈ రాక్షస సమూహానికి; వైకుంఠుండు= (నీవు మెచ్చుకుంటున్న) విష్ణుమూర్తి; కృత+అపరాధుఁడు= కీడు చేసినవాడు; అతనిన్= ఆ విష్ణువును; వర్ణింపన్= పొగడుతూ చెప్పుట; నీకు+ఏటికిన్= నీకు ఎందుకు?

**తా :** ఓ ప్రహ్లాద కుమారా! నాకు చాల చిత్రంగా ఉంది. ఈ బుద్ధి నీకు స్వతహాగా కలిగిందా! ఇతరులు ఎవరైనా చెప్పారా! లేదా ఏకాంతంగా ఉన్నప్పుడు గురువులే బోధించారా! నిజానికి ఆ వైకుంఠ వాసుడైన విష్ణుమూర్తి మన రాక్షసులందరికి కీడు చేశాడు. బద్ధవిరోధి. అటువంటి విష్ణువును మరల మరల వర్ణించి చెపుతున్నావు. ఇది నీకు అనవసరం సుమా!

**మ. సురలం దోలుటయో సురాధిపతులన్ స్రుక్కించుటో సిద్ధులం**
**బరివేధించుటయో మునిప్రవరులన్ బాధించుటో? యక్ష కి**

**న్నర గంధర్వ విహంగనాగపతులన్ నాశంబు నొందించుటో**
**హరి యంచున్ గిరి యంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా! 146**

**ప్రతి :** పుత్రకా!= ఓ కుమారా!; సురలన్+తోలుటయో= దేవతలను తరిమి వేయడమో; సుర+అధిపతులన్= దేవతాధిపతులను; స్రుక్కించుటో= బాధించడమో; సిద్ధులన్= సిద్ధులనే దేవతా సమూహాన్ని; పరివేధించుటయో= మిక్కిలి బాధించడమో; మునిప్రవరులన్= మునులలో గొప్పవారిని; బాధించుటో= బాధించడమో; యక్ష= యక్షులను; కిన్నర= కిన్నరులను; గంధర్వ= గంధర్వులను; విహంగ= పక్షులను; నాగ= సర్పాల; పతులన్= నాయకులను; నాశంబున్+ఒందించుటో= నాశనం చేయడమో; (చేయాలి గాని); హరి+అంచున్ గిరి+అంచున్= హరి అంటూ గిరి అంటూ (ఇందున్న గిరిశబ్దము నిందార్థకము); మోహ+అంధుండవు+ఐ= మోహమనే గ్రుడ్డితనంతో; ఏల చెడన్= చెడుట ఎందుకు!

**తా :** ఓ కుమారా! దేవతలను తరిమికొట్టడమో, దేవతానాయకులను అణగగొట్టడమో, సిద్ధులను వేధించడమో, మునులను బాధించడమో యక్ష, కిన్నర, గంధర్వ, విహంగ, నాగ నాయకులను నాశనం చేయడమో చేయాలి తప్ప 'హరి గిరి' అంటూ మోహంతో కండ్లు మూసుకు పోయి మాట్లాడటం నీ కెందుకు?!

**విశే :** రాక్షసులకు ఎవరెవరు పగవారో విశదీకరించే పద్యం. వీరు పగవారు కావడానికి కారణం రాక్షసులకు విరోధులయిన వారి పక్షం కావడమే. హరియంచున్ గిరియంచున్ అనడంలో నిందార్థకం ద్యోతకం. **"నిందయందు'గిగీ'లగు"**

**ఉదా :** రావణుడు – గీవణుడు. హరి – గిరి.

**వ. అనినఁ దండ్రిమాటకుఁ బురోహితు నిరీక్షించి ప్రహ్లాదుం డిట్లనియె, మోహనిర్మూలనంబు సేసి యెవ్వని యందుఁ దత్పరులయి యెఱుక గల పురుషులకుం బరులు దా మనియెడు మాయాకృతం బయిన యసద్గ్రాహ్యంబగు భేదంబు గానంబడ, దట్టి పరమేశ్వరునకు నమస్కరించెద. 147**

**ప్రతి :** అనినన్= అలా అనగా; తండ్రి మాటకున్= తన తండ్రి హిరణ్యకశిపుని పలుకులకు; పురోహితున్= పురోహితుణ్ణి; నిరీక్షించి= చూచి; ప్రహ్లాదుండు+ఇట్లు+అనియెన్= ప్రహ్లాదుడు ఇలా అన్నాడు; ఎవ్వనియందున్= ఏ మహాత్మునియందు; తత్పరులయి= తాత్పర్యభావం గలవారై; ఎఱుకగల పురుషులకున్= జ్ఞానంగల వ్యక్తులకు; పరులు+తాము+అనియెడు= ఇతరులు మేము అనేటువంటి; మాయాకృతంబు+అయిన= మాయవల్ల ఏర్పడిన; అసద్గ్రాహ్యంబగు= గ్రహించదగని; భేదంబు= భేదభావము; కానంబడదు= కనబడదో; అట్టి= అటువంటి (జ్ఞానులైన పురుషులకు సత్యతత్త్వాన్ని తెలిపి మాయను పోగొట్టి అఖండ చైతన్య భావం కలిగించే) పరమేశ్వరునకున్= పరమాత్మకు; నమస్కరించెదన్= నమస్కారం చేస్తాను.

**తా :** తండ్రి మాటలకు ప్రహ్లాదుడు పురోహితులను చూచి ఇలా అన్నాడు. మోహాన్ని విడిచిపెట్టి, పరమాత్మతో తాత్పర్య భావం కలిగిన, జ్ఞానంగల పురుషులకు, ఎవరి దయవలన "ఇతరులు తాము" అనే భేదభావం నశిస్తుందో అటువంటి పరమేశ్వరునికి నమస్కారం చేస్తాను.

**విశే :** పరమాత్ముని దయగలవారికే, భేదదృష్టిలేని అఖండ చైతన్యజ్ఞానం లభిస్తుంది. సర్వం బ్రహ్మమయంగా గోచరిస్తుంది. అటువంటి దృక్పథం ఏర్పడాలంటే, ముందు మానవులు మోహాన్ని వదిలిపెట్టాలి. పరమాత్మయందు తాదాత్మ్యభావం కలిగి

ఉండాలి. అప్పుడే వారికి భేదదృష్టి అనే అవిద్య నశిస్తుంది. సత్యచైతన్య జ్ఞానం కలుగుతుంది. అలా కలగజేసే పరమాత్మకు నమస్కారం అని ప్రహ్లాదుని భావం.

**శా. అజ్ఞుల్ గొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం**
**బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమములన్ భాషింపఁగా నేర, రా**
**జిజ్ఞాసాపథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాది వే**
**దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపఁగా నేర్తురే? 148**

**ప్రతి :** అజ్ఞుల్= అజ్ఞానులు; కొందఱు= కొందరు; ఏము= మేము; తాము= తమరు; అనుచున్= అనుకొంటూ; మాయన్+చెంది= మాయలోపడి; సర్వాత్మకున్= అందరియందు ఆత్మతత్త్వంగా ప్రకాశించేవానిని; ప్రజ్ఞాలభ్యున్= ప్రజ్ఞవల్ల మాత్రమే లభించేవానిని; దుర్+అన్వయక్రమములన్= చెడుమార్గపు తెలివితేటలతో; భాషింపఁగానేరరు= మాట్లాడటం తెలియరు; బ్రహ్మాది వేదజ్ఞుల్= బ్రహ్మమొదలైన వేదజ్ఞానంగల మహానుభావులుకూడా; ఆ జిజ్ఞాసాపథమందు= ఆ ఆత్మస్వరూప చైతన్య జ్ఞానాన్ని తెలిసికొనే మార్గంలో; చింతింపన్= ఆలోచించుటకు; మూఢులు గదా= ఏమి తెలియనివారు కదా!; తద్+పరమాత్మున్= అటువంటి పరమాత్మ ఐన; విష్ణున్= విష్ణుమూర్తిని; ఇతరుల్= మిగిలినవారు; దర్శింపఁగాన్= దర్శించుటను; నేర్తురే= నేర్వగలరా!

**తా :** కొందరు అజ్ఞానులు మేము వేరు, మీరు వేరు, అనే మాయలోపడి, ప్రజ్ఞవల్ల మాత్రమే అందునటువంటి సర్వాత్మకుడైన, పరమాత్మను, తమ మూర్ఖపు తెలివితేటలతో గుర్తించి మాట్లాడలేరు. సర్వభూతాంతరాత్మ అయిన ఆ భగవానుణ్ణి గుర్తించడానికి, వేదవేత్తలైన బ్రహ్మాదులు కూడా మూఢులవుతున్నారు. అటువంటి పరమాత్ముడైన విష్ణువును ఇతరులు దర్శించగలుగుతారా! ఎంతమాత్రం దర్శించలేరు.

**విశే :** ప్రజ్ఞాలభ్య అన్న చోట ప్రజ్ఞా+అలభ్య అని విడదీసి ప్రజ్ఞకు లభించువాడు కాడు. అని కొందరు అర్థం చెప్పి ఉన్నారు.

**తే. ఇను మయస్కాంత సన్నిధి నెట్లు భ్రాంత, మగు హృషీకేశుసన్నిధి నా విధమునఁ**
**గరఁగుచున్నది దైవయోగమునఁ జేసి, బ్రాహ్మణోత్తమ! చిత్తంబు భ్రాంత మగుచు. 149**

**ప్రతి :** బ్రాహ్మణోత్తమ= ఓ గురువర్యా! దైవ యోగమునన్+చేసి= దైవయోగంవల్ల; చిత్తంబు= నా మనసు; భ్రాంతము+అగుచున్= తిరుగుడు పడుచు; ఇనుము= ఇనుము; అయస్కాంతసన్నిధిన్= అయస్కాంతంవద్ద; ఎట్లు= ఏ విధముగా; భ్రాంతము+అగున్= ఆకర్షింపబడుతుందో; ఆ విధమునన్= ఆ విధముగానే; హృషీకేశుసన్నిధిన్= విష్ణుమూర్తి సన్నిధిలో; కరఁగుచున్నది= లీనమవుతున్నది.

**తా :** ఓ బ్రాహ్మణోత్తమా! ఇనుము అయస్కాంతం వద్ద ఎలా ఆకర్షింపబడి ఉంటుందో ఆ విధంగా దైవయోగంవలన నా చిత్తంకూడా ఆకర్షింపబడుతూ, హృషీకేశుడైన విష్ణుమూర్తి సన్నిధిలో లీనమవుతోంది.

**విశే :** హృషీకములంటే ఇంద్రియాలు. ఇంద్రియాలకు ఈశుడు హృషీకేశుడు.

**సీ. మందార మకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు?**
**నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు రాయంచ సనునె తరంగిణులకు?**

**లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు కోయిల సేరునే కుటజములకుఁ?**
**బూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరకం బరుగునే సాంద్ర నీహారములకు?**

**తే. నంబుజోదర దివ్య పాదార వింద, చింతనామృత పానవిశేష మత్త**
**చిత్త మేరీతి నితరంబుఁ జేర నేర్చు? వినుత గుణశీల! మాటలు వేయు నేల? 150**

**ప్రతి :** వినుత గుణశీల= స్తుతింప దగిన గుణశీలములుగల ఓ మహానుభావా!; మందార మకరంద మాధుర్యమునన్= మందార పుష్పంలోని మకరందం తీపిలో; తేలు= ఆనందంలో తేలియాడే; మధుపంబు= తుమ్మెద; మదనములకు పోవునే= ఉమ్మెత్తపూల వద్దకు వెళ్ళునా?; నిర్మల= స్వచ్ఛమైన; మందాకినీ= ఆకాశగంగ; వీచికలన్= తరంగాలలో; తూఁగు= ఆనందంగా ఊగి ఆడే; రాయంచ= రాజహంస; తరంగిణులకు= చిన్న చిన్న వాగువంకలకు; చనునె?= వెళ్ళునా!; లలిత= సౌందర్యవంతమైన; రసాల= తీపి మామిడిచెట్టుయొక్క; పల్లవ= లేత చిగురు; ఖాదియై= తిని; చొక్కు= ఆనందించు; కోయిల= కోయిల; కుటజములకున్= కొండమల్లె చెట్లవద్దకు; చేరునే= చేరుతుందా?; పూర్ణ+ఇందు= నిండు చందురుని; చంద్రికా= వెన్నెలయందు; స్ఫురిత= విహారాన్ని స్ఫురింపచేసుకొనే (వెన్నెలలో విహరించే); చకోరకంబు= చకోరపక్షి; సాంద్ర= దట్టమైన; నీహారములకున్= మంచు చరియలకు; అరుగునే= పోవునా?; మాటలు వేయునేల= వేయిమాటలెందులకు?; అంబుజోదర= పద్మనాభుడైన విష్ణుమూర్తియొక్క; చింతన= చింతించుట అనెడి; అమృత= అమృతాన్ని; పాన= త్రాగుటచేత; విశేష= మిక్కిలి; మత్త= మదించిన; చిత్తము= మనసు; ఏ రీతిన్= ఏ విధంగా; ఇతరంబున్= ఇతర విషయాలను; చేరనేర్చున్= చేరగలుగుతుంది? చేరదు.

**తా :** ఓ సుగుణ సంపన్నా! మహానుభావా! వేయిమాట లెందుకు! మందార మకరందంలోని తీపిని అనుభవించే తుమ్మెద ఉమ్మెత్తపూల జోలికిపోదు. స్వచ్ఛమైన గంగా తరంగాలపై తూగాడే రాజహంస, వాగుల వంకల వైపు పోనే పోదు. లలితంగా ఉండే తీపి మామిడి చిగుళ్ళు తిని గొంతు సవరించే కోయిల, కొండమల్లెల వద్దకు వెళ్ళదు. నిండు చందమామ వెన్నెలలో తిరుగాడే చకోరపక్షి, మంచువద్దకు చేరనే చేరదు. పద్మనాభుడైన విష్ణుమూర్తి పదపద్మ ధ్యానమనే అమృతపానంచేత విశేషంగా మదించిన మనస్సు, ఐహిక విషయాలవైపు ఎలా చేరుతుంది చెప్పు. చేరనే చేరదు.

**వ. అనిన విని రోషించి రాజసేవకుం డైన పురోహితుండు ప్రహ్లాదుం జూచి, తిరస్కరించి యిట్లనియె. 151**

**ప్రతి :** అనినన్+విని= అలా అనగా విని; రోషించి= కోపించి; రాజసేవకుండు+ఐన= రాజసేవకుడైన; పురోహితుండు= ఆ బ్రాహ్మణుడు; ప్రహ్లాదున్+చూచి= ప్రహ్లాదుని చూచి; తిరస్కరించి= ఎదిరించి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ మాటలు విని రాజసేవకుడైన బ్రాహ్మణుడు ప్రహ్లాదుని ధిక్కరించి ఇలా అన్నాడు.

**ఉ. పంచశర ద్వయస్కుఁడవు, బాలుఁడ వించుక గాని లేవు భా**
**షించెదు తర్కవాక్యములు, చెప్పిన శాస్త్రములోని యర్థ మొ**
**క్కించుక యైనఁ జెప్ప వసురేంద్రుని ముందట మాకు నౌదలల్**
**వంచుకొనంగఁ జేసితివి వైరివిభూషణ! వంశదూషణా! 152**

**ప్రతి :** వైరివిభూషణ= శత్రువులను గౌరవించేవాడా; వంశదూషణా= స్వవంశాన్ని దూషించువాడా!; పంచశర ద్వయస్కుఁడవు= ఐదు వత్సరముల వయసుగలవాడవు; బాలుఁడవు= చిన్నవాడవు; ఇంచుకగాని లేవు= ఇంతైనా లేవు;

తర్కవాక్యములు= తర్కపు మాటలు; భాషించెదు= మాట్లాడుతున్నావు; చెప్పిన శాస్త్రములోని+అర్థము= ఇంతవరకు మేము బోధించిన శాస్త్రాలలో ఉన్న యథార్థాన్ని; ఒక్కించుకయైనన్+చెప్పవు= కొంచెం కూడా చెప్పవు; అసుర+ఇంద్రుని ముందట= రాక్షసరాజు ఎదుట; మాకున్= మాకు; ఔదలల్ వంచుకొనంగన్+చేసితివి= తలదించుకొనేలా చేశావు.

**తా :** శత్రువులను గౌరవించి స్వజనులను దూషించే స్వభావంగల ఓ ప్రహ్లాదా! నిండా ఐదేళ్ల వయసు లేదు. చిన్న బాలుడవు; ఇంతైనా లేవు. తర్కవాక్యాలు మాట్లాడుతున్నావు. ఇంతవరకు మేము విద్యాభ్యాస కాలంలో శాస్త్రార్థం ఎలా చెప్పామో అలా చెప్పక రాక్షసరాజు ముందు మాకు తలవంపులు తెచ్చావు.

**చ. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు, దైత్య చం**
**దనవనమందుఁ గంటకయుత క్షితిజాతముభంగిఁ బుట్టి నాఁ,**
**డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతి సేయుచుండు దం**
**డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టుఁడు కొట్టుఁ డుద్ధతిన్. 153**

**ప్రతి :** వీఁడు= ఈ ప్రహ్లాదుడు; దానవభర్తకున్= రాక్షసరాజుకు; తనయుఁడు గాఁడు= సుతుడుగాడు; శాత్రవుఁడు= శత్రువు సుమా!; దైత్య చందనవనమందున్= రాక్షసజాతి అనే చందనవనంలో; కంటకయుత క్షితిజాతముభంగిన్= ముళ్ళతో కూడిన చెట్టువలె; పుట్టినాఁడు= జన్మించాడు; అనవరతంబున్= ఎల్లప్పుడు; రాక్షస కుల+అంతకున్= రాక్షసుల శత్రువైన హరి; ప్రస్తుతిన్= ప్రస్తుతిని; చేయుచుండున్= చేస్తూ ఉంటాడు; దండనమునన్+కాని= నాల్గవ ఉపాయమైన దండనంతో తప్ప; శిక్షలకున్ డాయఁడు= మిగిలిన ఉపదేశాలకు మార్గంలోకి రాడు; పట్టుఁడు= వీనిని బంధించండి; ఉద్ధతిన్= గట్టిగా; కొట్టుఁడు= దండించండి.

**తా :** రాక్షసేంద్రునకు ఈ ప్రహ్లాదుడు కొడుకు కాదు, శత్రువు. రాక్షసకులం అనే శ్రీగంధపుతోటలో ఈతడు ముళ్ల చెట్టులాగా జన్మించాడు. నిత్యం రాక్షసుల శత్రువైన విష్ణువుని స్తుతిస్తూ ఉంటాడు. దండిస్తే తప్ప, వీడు, చెప్పిన మాట వినడు. వీణ్ణి బంధించి గట్టిగా కొట్టండి.

**క. ఈ పాపనిఁ జదివింతుము, నీ పాదము లాన, యింక నిపుణతతోడం**
**గోపింతుము దండింతుము, కోపింపకుమయ్య దనుజకుంజర! వింటే! 154**

**ప్రతి :** దనుజకుంజర= ఓ రాక్షస శ్రేష్ఠా!; ఈ పాపనిన్= ఈ బిడ్డను; చదివింతుము= చదివేలా చేస్తాము; నీ పాదముల+ఆన= ఈ నీ పాదాలపై ఒట్టు; ఇంక= ఇకపై; నిపుణతతోడన్= మునుపటికంటె నైపుణ్యంతో; కోపింతుము= కోపగించుకుంటాం; దండింతుము= శిక్షిస్తాము; వింటే= వింటున్నావు కదా!; కోపింపకుమయ్య= దయచేసి ఆగ్రహించకు.

**తా :** ఓ రాక్షసరాజా! విను! ఈ బిడ్డను మేము చదివిస్తాం. నీ పాదాలపై ప్రమాణం చేస్తున్నాం. బాగా చదివిస్తాం. ఇంతకు మునుపు కంటె జాగ్రత్తగా అతనిని దండిస్తాం. దయచేసి మాపై ఆగ్రహించవద్దు.

**వ. అని మఱియు నా రాచపాపనికి వివిధోపాయంబులం బురోహితుండు వెఱపుఁజూపుచు రాజసన్నిధిం బాపి, తోడుకొని పోయి యేకాంతంబున. 155**

**ప్రతి :** అని మఱియును= అని పలికి అంతేకాక; ఆ రాచపాపనికి= ఆ రాజ పుత్రునకు; వివిధ+ఉపాయంబులన్= అనేక ఉపాయాలతో; పురోహితుండు= పురోహితుడు; వెఱపున్+చూపుచున్= భయదుతు; రాజసన్నిధిన్+పాపి= రాజువద్దనుండి బయటకు తీసుకువెళ్ళి; తోడుకొనిపోయి= తమతో తీసికొనివెళ్ళి; ఏకాంతంబునన్= ఒంటరిగా...

**తా :** అని పలికి ఆ రాజపుత్రుని అనేక విధాలుగా భయపెట్టి, రాజువద్దనుండి బయటకు తమతో తీసికొని వెళ్ళి ఏకాంతంలో

**క. భార్గవనందనుఁ డతనికి, మార్గము చెడకుండఁ బెక్కు మాఱులు నిచ్చల్**
**వర్గ త్రితయము చెప్ప న, నర్గళమగు మతివిశేష మమర నరేంద్రా! 156**

**ప్రతి :** నరేంద్రా= ఓ ధర్మరాజా!; భార్గవనందనుఁడు= శుక్రాచార్యకుమారుడు; అతనికిన్= ఆ ప్రహ్లాదునికి; అనర్గళమగు= అడ్డులేని; మతివిశేషము+అమరన్= బుద్ధి విశేషము స్పష్టపడునట్లు; మార్గము చెడకుండన్= రాక్షస మార్గము చెడకుండా; నిచ్చల్= నిత్యం; పెక్కుమాఱులు= చాలసార్లు (అనేక పర్యాయములు); వర్గత్రితయము చెప్పన్= ధర్మ అర్థ కామాలనే మూడింటిని చెప్పగా...

**తా :** ఓ రాజా! రాక్షసమార్గం తప్పకుండా నిరంతరం అనేక పర్యాయాలు ప్రహ్లాదునకు ఆ భార్గవసుతుడు ధర్మార్థకామములను గూర్చి బోధింపగా

**వ. మఱియు, గురుండు శిష్యునకు సామ దాన భేద దండోపాయంబు లన్నియు నెఱింగించి, నీతి కోవిదుం డయ్యె నని నమ్మి నిశ్చయించి, తల్లికి నెఱింగించి, తల్లి చేత నలంకృతుం డయిన కులదీపకు నవలోకించి. 157**

**ప్రతి :** మఱియున్= ఇంకా; గురుండు= విద్యలు బోధించేగురువు; శిష్యునకున్= ప్రహ్లాదునకు; సామ దాన భేద దండోపాయంబులు+అన్నియున్= సామ, దాన, భేద దండోపాయాలను చతుర్విధోపాయములను; ఎఱింగించి= తెలియజేసి; నీతికోవిదుండు+అయ్యెన్+అని నమ్మి= నీతి విషయంలో పండితుడయ్యాడని నమ్మి; నిశ్చయించి= నిర్ణయానికి వచ్చి; తల్లికిన్ ఎఱింగించి= ప్రహ్లాదుని తల్లికి ముందు తెలియచెప్పి; తల్లిచేతన్+అలంకృతుండు+అయిన= తల్లిచే చక్కగా అలంకరింపబడిన; కులదీపకున్= రాక్షసవంశదీపాన్ని (ప్రహ్లాదుని) అవలోకించి= చూచి...

**తా :** గురువులు శిష్యుడైన ప్రహ్లాదునకు సామ, దాన, భేద, దండోపాయములను పూర్తిగా తెలియజెప్పి, నీతికోవిదుడయ్యాడని నమ్మి, నిర్ణయించుకొని, ఆ విషయాన్ని ముందుగా ప్రహ్లాదుని తల్లికి తెలియజెప్పి, తల్లిచేత అతనికి అలంకారం చేయించి ఆ ప్రహ్లాదుని చూచి

**విశే :** తల్లి బిడ్డకు మొదటి గురువు. అలాంటి బిడ్డను చిన్నతనంలోనే గురుకులంలో చేర్చారు. గురుకులంలో ఏవి నేర్పారో తల్లికి చెప్పడం అవసరం. అదీగాక కలవారి కుటుంబాలలో రాజకీయాదులు మగవారి ధర్మాలయితే, ఇంటి విషయాలు చూచేది స్త్రీలే. అంచేత తల్లిని గురువుగా చెప్పారు.

ఉపాయాలు నాలుగు రకాలు. మంచి మాటలతో చెప్పడం సామం. కొన్ని వస్తువులు ఇచ్చి మంచి చేసుకోవడం దానం. ఒకరికి మరొకరికి కలహాలు పెట్టడం భేదం. శిక్షించి ఒప్పించడం దండం.

**ఉ. త్రిప్పకు మన్న మా మతము దీర్ఘములైన త్రివర్గపాఠముల్**
**దప్పకు మన్న! నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేము మున్**

**జెప్పిన నీతిగాని మఱి చెప్పకుమన్న విరోధినీతులన్,**
**విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్ర కథార్థజాలముల్. 158**

**ప్రతి :** అన్న= ఓ ప్రహ్లాదా!; మా మతము= మేము చెప్పిన రాక్షసన్యాయ విధానాన్ని; త్రిప్పకుము= మరొక విధంగా తిప్పి చెప్పవద్దు; దీర్ఘములైన= విస్తారములైన; త్రివర్గపాఠముల్= ధర్మ అర్థ కామ విషయాలను; తప్పకు మన్న= మేము ఎట్లు చెప్పితిమో అట్లే చెప్పు తప్ప, వేరొక విధమైన తప్పు అర్థం చెప్పవద్దు; నేఁడు= ఈ రోజు; మన= మనయొక్క; దైత్యవరేణ్యుని మ్రోలన్= రాక్షసేంద్రుని వద్ద; ఏము= మేము; మున్ చెప్పిన నీతిగాని= పూర్వం చెప్పిన రాక్షస నీతినే గాని; మఱి; విరోధి నీతులన్= మన విరోధియైన విష్ణుమూర్తియొక్క దైవనీతులను; చెప్పకుమన్న= మరొక విధంగా చెప్పబోకు; దుష్టమగు= చెడ్డవైన; విష్ణుచరిత్ర= విష్ణు చరిత; కథ+అర్థజాలముల్= విష్ణుకథకు సంబంధించిన భావార్థ సముదాయాన్ని; విప్పకుము+అన్న= విప్పవద్దు సుమా!

**తా :** ఓ ప్రహ్లాదా! మా మాటను విను. మేము చెప్పిన విషయాలు తప్పవద్దు. విస్తారాలైన ధర్మార్థకామాలను గూర్చిన పాఠాలను తప్పవద్దు. మన రాక్షసేంద్రుని ముందు మేము చెప్పిన రాజనీతిని తప్ప, మనకు శత్రువైనవాని నీతులను చెప్పవద్దు. చెడ్డవైన విష్ణుకథా చరిత్రలు వెల్లడించవద్దు.

**వ. అని బుజ్జగించి, దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన. 159**

**ప్రతి :** అని బుజ్జగించి= ఈ విధంగా ప్రహ్లాదుని బుజ్జగించి; దానవేశ్వరుని సన్నిధికిన్= రాక్షసరాజు సమీపానికి; తోడి తెచ్చినన్= తోడ్కొని రాగా, తీసికొనిరాగా!...

**తా :** అని ఈ ప్రకారంగా ప్రహ్లాదుణ్ణి బుజ్జగించి, గురువులు దానవరాజువద్దకు తీసుకొని రాగా!

**సీ. అడు గడ్గునకు మాధ వానుచింతన సుధా మాధుర్యమున మేనుమఱచు వాని,**
**నంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని హరిభక్తి పుంభావమైనవాని,**
**మాతృగర్భము సొచ్చి మన్నది మొదలుగాఁ జిత్త మచ్యుతుమీఁదఁ జేర్చువాని,**
**నంకించి తనలోన నఖిల ప్రపంచంబు శ్రీవిష్ణుమయమని చెలఁగువాని,**

**తే. వినయ కారుణ్యబుద్ధి వివేక లక్ష, ణాది గుణముల కాటపట్టయిన వాని**
**శిష్యు బుధలోకసంభావ్యుఁ జేరి గురుఁడు, ముందటికి ద్రొబ్బి తండ్రికి మ్రొక్కు మనుచు. 160**

**ప్రతి :** అడుగడ్గునకున్= అడుగు అడుగునకు (ప్రతి పదానికి); మాధవ+అనుచింతన= విష్ణుచింతన అనే; సుధామాధుర్యమునన్= అమృత మాధుర్యంలో; మేను మఱచువానిన్= శరీరాన్ని మరిచిపోయేవానిని (మైమరచిపోయేవానిని); అంభోజగర్భాదులు= పద్మగర్భుడు మొదలైనవారు (బ్రహ్మమొదలైనవారు) అభ్యసింపఁగ లేని= నేర్వ లేని; హరిభక్తి= విష్ణుభక్తి; పుంభావమైనవానిన్= పురుషరూపాన్ని ధరించినవానిని; మాతృగర్భము+చొచ్చి మన్నది మొదలుగాన్= తల్లి గర్భంలో ప్రాణం పోసుకొన్నది మొదలు; చిత్తము= మనసు; అచ్యుతుమీఁదన్= విష్ణుమూర్తిమీద; చేర్చువానిన్= నిలుపువానిని; అంకించి= యోజించి; తనలోనన్= తనలో; అఖిలప్రపంచంబున్= ఈ సమస్త ప్రపంచాన్ని; శ్రీ విష్ణుమయము+అని= శ్రీవిష్ణువుతోనే నిండినదని; చెలఁగువానిన్= ఒప్పేవానిని; వినయ= అణకువ; కారుణ్య= దయ; బుద్ధి= సద్బుద్ధి; వివేకలక్షణ ఆది= విచక్షణ మొదలైన లక్షణాలకు; గుణములకు= సద్గుణాలకు; ఆటపట్టు+అయినవానిన్= నిలయమైనవానిని; శిష్యున్=

శిష్యుని; బుధలోక సంభావ్యున్= పండితులచే గౌరవింపబడువానిని; చేరి= దగ్గరకు వచ్చి; గురుఁడు= గురువైన భృగుపుత్రుడు; ముందటికి ద్రొబ్బి= ముందుకు తోసి; తండ్రికిన్= తండ్రి అయిన హిరణ్యకశిపునికి; మ్రొక్కుము+అనుచున్= నమస్కరించు అంటూ...

**తా :** అడుగుతీసి అడుగువేస్తే విష్ణుచింతన అనే అమృత మాధుర్యంలో మైమరచిపోయేవాడిని, బ్రహ్మాదులుకూడా నేర్వలేని, హరిభక్తి పురుషరూపం దాల్చినవాడిని ఎలా ఉంటుందో రూపుకట్టినవాడిని, తల్లికడుపులో ప్రాణం పోసుకున్నది మొదలు తన చిత్తం విష్ణువు మీదే నిలిపిన వాడిని, ఈ ప్రపంచం అంతా విష్ణుమయమే అని తనలో భావించేవాడిని, వినయం, దయ, సద్బుద్ధి, వివేకం, సల్లక్షణాలకు నిలయమైనవాడిని, పండితులచే ప్రశంసలు పొందగల తన శిష్యుడైన ప్రహ్లాదుణ్ణి, గురువు సమీపించి హిరణ్యకశిపుని ముందుకు తోసి "తండ్రికి నమస్కరించు" మని (అన్నాడు).

**విశే :** ప్రహ్లాదుడు తల్లి గర్భంలో ఉన్నప్పుడే నారదుని ఉపదేశంవల్ల అతనికి విష్ణుభక్తి విశేషంగా పెంపొందింది. పువ్వు పుట్టగానే పరిమళించినట్లు ప్రహ్లాదునిలో వినయ విధేయతాది లక్షణాలు బాల్యంనుండే వికసించాయి.

**క. శిక్షించితి మన్యము లగు, పక్షంబులు మాని నీతి పారగుఁడయ్యెన్.**
**రక్షోవంశాధీశ్వర!, వీక్షింపుము నీ కుమారు విద్యాబలమున్. 161**

**ప్రతి :** రక్షోవంశ+అధీశ్వర!= ఓ రాక్షసవంశ ప్రభూ!; శిక్షించితిమి= మంచి శిక్షణను ఇచ్చాము; అన్యములు+అగు= ఇతరమైన; పక్షంబులుమాని= పక్షాలు వదలిపెట్టి; నీతిపారగుఁడు+అయ్యెన్= రాక్షసనీతిలో పారంగతుడయ్యాడు; నీ కుమారు విద్యాబలమున్= నీ కుమారునికి విద్యాబలాన్ని; వీక్షింపుము= పరీక్షించి చూడు, పరిశీలించు.

**తా :** ఓ రాక్షసాధీశ్వరా! నీ కుమారుని మేం చక్కగా శిక్షించాం. అతడు ఇతర పక్షాలు మాని నీతికోవిదుడయ్యాడు. నీ బిడ్డ విద్యాబలాన్ని నీవు పరీక్షించి చూచుకోవచ్చు.

**విశే :** ఈ పద్యంలోని 'విద్యాబలము' సార్థక ప్రయోజనం. విద్యాబలం గొప్పది. విద్వాంసుడే సకలలోక పూజితుడు. ఆ బలం అన్నిటా విజయాన్నే ప్రసాదిస్తుంది. గురువులు నేర్పింది శాస్త్రబలం. ప్రహ్లాదుడు నేర్చుకుంది 'ఆధ్యాత్మిక విద్యాబలం'. విద్య అంటే ఆధ్యాత్మిక విద్యే.

**వ. అని పలికిన, శుక్రకుమారకు వచనంబు లాకర్ణించి, దానవేంద్రుండు దనకు దండ ప్రణామంబు సేసి నిలుచున్న కొడుకును దీవించి, బాహుదండంబు సాఁచి, దిగ్గనన్ దగ్గఱం దిగిచి, గాఢాలింగనంబు సేసి, తన తొడలమీఁద నిడుకొని, మంచు దువ్వి, చుబుకంబు పుణికి, చెక్కిలి ముద్దుగొని, శిరంబు మూర్కొని, ప్రేమాతిరేక సంజనిత బాష్పసలిలబిందు సందోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు, మందమధురాలాపంబుల నిట్లనియె. 162**

**ప్రతి :** అని పలికినన్= అని మాట్లాడగా; శుక్రకుమారకు వచనంబులు+ఆకర్ణించి= శుక్రాచార్య పుత్రమాటలు విని; దానవ+ఇంద్రుండు= దానవరాజు హిరణ్యకశిపుడు; తనకున్= తనకు; దండప్రణామంబులు+చేసి= నుదురుతాకి నమస్కరించి; నిలుచున్న= నిలబడిన; కొడుకును దీవించి= సుతుని ఆశీర్వదించి; బాహుదండంబున్+చాఁచి= తన భుజాదండాన్ని చాచి; దిగ్గనన్ డగ్గఅన్+తిగిచి= వెంటనే దగ్గరకు లాగుకొని; గాఢ+ఆలింగనంబు+చేసి= గాఢమైన కౌగిలింత ఇచ్చి; తన

తొడలమీఁదన్+ఇడుకొని= తన ఒడిలో కూర్చోబెట్టుకొని; చుంచుదువ్వి= ముంగురులను సవరించి; చుబుకంబున్ పుణికి= గడ్డమును పుణికి; చెక్కిలిన్+ముద్దుగొని= బుగ్గపై ముద్దు పెట్టుకొని; శిరంబున్+మూర్కొని= శిరస్సును ఆఘ్రాణించి; ప్రేమ+అతిరేక= అతిశయించిన ప్రేమవలన; సంజనిత= పుట్టిన; బాష్పసలిలబిందు సందోహంబులన్= నీటి బిందువుల సమూహంచేత; అతని= ప్రహ్లాదుని; వదనారవిందంబున్= ముఖపద్మాన్ని; తడుపుచున్= తడిపివేస్తూ; మందమధుర+ ఆలాపంబులన్= మెల్లని తీయని మాటలతో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు

**తా :** అలా మాట్లాడిన, శుక్రాచార్య కుమారుని మాటలు విని, హిరణ్యకశిపుడు తనకు సాష్టాంగనమస్కారం చేసి నిలుచున్న తన కుమారుని దీవించి, తన బాహువును సాచి దగ్గరకు తీసికొని, గాఢంగా కౌగలించుకొని, ఒడిలోనికి తీసికొని, ముంగురులు దువ్వి, గడ్డాన్ని పుణికి, బుగ్గపై ముద్దు పెట్టి, శిరస్సును ఆఘ్రాణించి, అతిశయించిన ప్రేమవల్ల జనించిన ఆనందాశ్రువులతో కుమారుని ముఖారవిందాన్ని తడుపుచూ, మెల్లని తీయని మాటలతో ఇలా అన్నాడు.

**విశే :** తమ బిడ్డలు నమస్కరించినప్పుడు తల్లిదండ్రులు ఆ బిడ్డల శిరస్సును మూర్కొనడం ప్రాచీన గ్రంథాలు చెప్పిన సంప్రదాయం. ఆ శిరస్సును పెద్దలు వాసన చూచినపుడు మంచి వాసన వస్తే శుభం కలుగుతుందని, చెడువాసన వస్తే అశుభం కలుగుతుందని చెప్తారు.

**శా. చోద్యం బయ్యెడి, నింతకాల మరిగెన్, శోధించి యే మేమి సం**
**వేద్యాంశంబులు సెప్పిరో? గురువు లే వెంటం బఠింపించిరో?**
**విద్యాసార మెఱుంగఁ గోరెద భవ ద్విజ్ఞాత శాస్త్రంబులోఁ**
**బద్యం బొక్కటి సెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా! 163**

**ప్రతి :** చోద్యంబు+అయ్యెడిన్= వింతగా ఉంది; ఇంతకాలము+అరిగెన్= ఇంతకాలం జరిగిపోయింది; గురువులు= నీ విద్యాగురువులు; శోధించి= వెదికి వెదికి; ఏమేమి సంవేద్య+అంశంబులు+చెప్పిరో= ఏ ఏ తెలిసికోవలసిన విషయాలు చెప్పారో?!; ఏ వెంటన్+పఠింపించిరో= ఏ మార్గంలో చదివించారో; విద్యాసారము+ఎఱుంగన్+కోరెదన్= నీ విద్యాభ్యాససారాన్ని తెలిసికొందామని ఉంది; భవత్= నీయొక్క; విజ్ఞాతశాస్త్రంబులోన్= తెలిసిన శాస్త్ర విషయంలో; పద్యంబు= పద్యాన్ని; ఒక్కటి+చెప్పి= ఒక్కదానిని చెప్పి; స+అర్థముగన్= అర్థంతో కూడ; తాత్పర్యంబున్= భావాన్ని; భాషింపుమా= చెప్పు!

**తా :** నీవు గురువులవద్దకు వెళ్లి చాలకాలం అయింది. మీ గురువులు వెదికి వెదికి నీకు ఏ ఏ విషయాలు చెప్పారో, ఏ మార్గంలో ఎంతవరకు చదివించారో, నీ విద్యాసారం తెలిసికోవాలని ఉంది. నీవు నేర్చిన శాస్త్రంలో ఒక్క పద్యాన్ని చెప్పి దానికి, అర్థంతోపాటు తాత్పర్యాన్ని కూడ వివరించవయ్యా!

**విశే :** బిడ్డలకు మొదటి గురువు తండ్రి. పిదప విద్యాబుద్ధులు చెప్పినవాడు గురువు. గురుకులంలో చదువుతున్న శిష్యుల్ని ఆ పాఠాలు చెప్పిన గురువు పరీక్షించడం ఒక విధానం. తల్లిదండ్రులు కూడా విద్యావంతులై ఉంటే ఆ బిడ్డల్ని ఇంటికి వచ్చినప్పుడు పిలిపించుకుని వారి విద్యావిజ్ఞానాలు ఎలా వున్నాయో తెలుసుకోవడానికి ఒక పద్యం చెప్పి దాని తాత్పర్యాన్ని అడిగి చెప్పిన విధానాన్నిబట్టి పరిశ్రమను అంచనావేయడం ఒక పద్ధతి. అప్పుడే పాఠం చెప్పిన గురువులకు తల్లిదండ్రులకు ఆ బిడ్డలపై శ్రద్ధ ఏర్పడుతుంది. హిరణ్యకశిపుడు రాక్షసరాజైనా లోకంలోని తల్లిదండ్రులకు ఆదర్శాత్మక బోధ చేశాడు.

**శా. నిన్నున్ మెచ్చరు నీతిపాఠ మహిమన్ నీతోడి దైత్యార్భకుల్**
**గన్నా రన్నియుఁ జెప్ప నేర్తురు గదా! గ్రంథార్థముల్ దక్షు లై**
**యన్నా! యెన్నఁడు నీవు నీతివిదుఁడౌ దంచున్ మహావాంఛతో**
**నున్నాఁడన్, ననుఁ గన్నతండ్రి! భవదీయోత్కర్షముం జూపవే! 164**

**ప్రతి :** నీ తోడి దైత్య+అర్భకుల్= నీతో చదువుకొనే రాక్షసపుత్రులు; గ్రంథ+అర్థముల్= గ్రంథాలలోని విషయాలను; కన్నారు+అన్నియున్= అన్నీ చూచారు; దక్షులు+ఐ= నేర్పుగలవారై; చెప్పనేర్తురుగదా= చెప్పగలరు గదా!; నీతిపాఠ మహిమన్= నీతిపాఠాలను చెప్పు గొప్పవిషయంలో; నిన్నున్ మెచ్చరు= నిన్ను మెచ్చుకోరు; అన్నా= ఓ ప్రహ్లాదకుమారా!; ఎన్నఁడున్= ఎప్పుడును; నీవు= నీవు; నీతివిదుఁడు+ఔదు+అంచున్= నీతిజ్ఞుడవవుతావో అని; మహావాంఛతోన్= గొప్ప కోరికతో; ఉన్నాఁడన్= ఉన్నాను; ననున్+కన్నతండ్రి= నా కన్నతండ్రీ!; భవదీయ= నీయొక్క; ఉత్కర్షమున్= గొప్పదనాన్ని; చూపవే= చూపుమా!

**తా :** ఓ ప్రహ్లాదకుమారా! నీతో చదువుకొనే నీ సహాధ్యాయులైన రాక్షసబాలురు నేర్పుతో గ్రంథాలన్నీ పరికించి అన్నీ చక్కగా చెప్పగలరు. నీతిపాఠాల విషయంలో వారు నిన్ను మెచ్చరు కదా! నీవు ఎప్పుడు నీతి పారంగతుడ వవుతావో అని మిక్కిలి కోర్కెతో ఎదురు చూస్తున్నాను. నా కన్నతండ్రివి కదూ! ఏదీ నీ గొప్పదనాన్ని చూపించు.

**వ. అనినం గన్న తండ్రికిఁ బ్రియనందనుం డయిన ప్రహ్లాదుం డి ట్లనియె. 165**

**ప్రతి :** అనినన్= అనగా; కన్నతండ్రికిన్= తండ్రి హిరణ్యకశిపునకు; ప్రియనందనుండు+అయినన్= ప్రియపుత్రుడయిన; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; ఇట్లు+అనియెన్= ఇలా సమాధానం ఇచ్చాడు.

**తా :** అలా అనగా కన్నతండ్రికి ప్రియ పుత్రుడైన ప్రహ్లాదుడు ఇలా సమాధానం చెప్పాడు.

**క. చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ**
**జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ! 166**

**ప్రతి :** తండ్రీ= ఓ తండ్రీ!; ననున్= నన్ను; గురువులు= మా గురుదేవులు; చదివించిరి= బాగా చదివించారు; ధర్మ+అర్థ ముఖ్యశాస్త్రంబులున్= ధర్మం, అర్థం ముఖ్యంగా చెప్పబడే శాస్త్రాలను; చదివితిన్= చదివితిని; నేన్= నేను; చదివినవి= చదివి నేర్చుకొన్నవి; పెక్కులు కలవు= చాల ఉన్నాయి; చదువులలో= సమస్త విద్యలలో ఉన్న; మర్మము+ఎల్లన్= రహస్యాన్నంతటిని; చదివితిన్= చదివినాను.

**తా :** తండ్రీ! నన్ను మా గురువులు చక్కగా చదివించారు. ధర్మం, అర్థం ప్రధానంగాగల శాస్త్రాలను నేను చదివాను. నేను చదివినవి చాల ఉన్నాయి. వేయిమాట లెందుకు! చదువులలో దాగి మర్మాన్ని నేను తెలుసుకున్నాను.

**విశే :** ఇక్కడ ప్రహ్లాదుని తండ్రి బోధించమన్నది ధర్మార్థకామాలు మాత్రమే. గురువులు అట్లే చెప్పారు. కాని తండ్రి అడిగినప్పుడు "చదివితి ధర్మార్థ ముఖ్యశాస్త్రంబులు" అన్నాడు. ఈ మాటల్లో ధర్మం, అర్థం ముఖ్యమైన శాస్త్రాలు అని అర్థం చెప్పినప్పుడు త్రివర్గంలోని ధర్మ, అర్థాలు మాత్రమే చదువుకున్నాడు అనిపిస్తుంది. అతనికి కామశాస్త్రంపై దృష్టిలేదు.

మరొక అర్థం ధర్మార్థముఖ్య అనేచోట ధర్మంయొక్క అర్థాన్ని వివరించే అంశాలు చదువుకున్నాడని చెప్పవచ్చు. అప్పుడు అర్థకామాలు రెండూ ఉండవు. కేవలం ధర్మమే ఉంటుంది. అదికూడా భగవత్పరమైనదిగా ప్రహ్లాదుని భావన.

చదువుల రహస్యమంతా పరతత్త్వం బోధించడమేనని ప్రహ్లాదుని భావం.

**మ. తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ దాసత్వమున్ వందనా**
**ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్, చింతనం**
**బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స**
**జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా! 167**

**ప్రతి :** దైత్య+ఉత్తమా= ఓ రాక్షసశ్రేష్ఠా; తను హృత్+భాషలన్= శరీరంతో, హృదయంతో, భాషతో (మనోవాక్కాయాలతో); సఖ్యమున్= స్నేహంతో; శ్రవణమున్= నిరంతర వినటంతో; దాసత్వమున్= దాస్యంతో; వందన+అర్చనముల్= నమస్కార పూజలతో, సేవయున్= బంటుతనంతో (కైంకర్యము); ఆత్మలోన్+ఎఱుకయున్= ఆత్మజ్ఞానంతో; సంకీర్తనల్= నిరంతరగానంతో; చింతనంబు+అనున్= తదేకంగా ధ్యానం అనేటువంటి; ఈ తొమ్మిది భక్తిమార్గములన్= ఈ తొమ్మిది విధాలైన భక్తిమార్గాలతో; సర్వ+ఆత్మున్= సర్వభూతాంతరాత్ముడైన; హరిన్ నమ్మి= శ్రీహరిని నమ్మి; సజ్జనుఁడు+ఐ ఉండుట= మంచివాడై ఉండటం; భద్రము+అంచున్= శ్రేయస్కరం అంటు; సత్యంబు= నిజంగా; తలఁతున్= భావన చేస్తాను.

**తా :** ఓ రాక్షసశ్రేష్ఠా! 1) స్నేహం, 2) శ్రవణం, 3) దాస్యం, 4) వందనం, 5) అర్చనం, 6) సేవ, 7) ఆత్మలో అన్నిటిని గ్రహించునేర్పు 8) సంకీర్తనం 9) నిరంతరభావన అనే ఈ తొమ్మిది భక్తి మార్గాలను మనసా వాచా కర్మణా త్రికరణశుద్ధిగా పాటిస్తూ, సర్వాత్ముడైన విష్ణువును నమ్మి సజ్జనుడై సాధుపురుషుడై ఉండటం సత్యమని, శ్రేయస్కరమని భావిస్తున్నాను.

**విశే : శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం ।**
**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం ॥** నవవిధ భక్తిమార్గాలు కూడా త్రికరణశుద్ధిగా పాటించాలని 'తనుహృద్భాషలు'గా అని పోతన పేర్కొనడం విశేషం.

**శా. అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక స**
**ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూకాంక్షల్ కృతఘ్నావలీ**
**బంధుత్వంబులు భస్మ హవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స**
**ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్త వ్యర్థ సంసారముల్. 168**

**ప్రతి :** హరిభక్తి వర్జితులు= విష్ణుమూర్తిపై భక్తిని విడిచినవారి; రిక్త= సద్భావ, సత్ప్రవర్తనలులేని; వ్యర్థ సంసారముల్= ఎందుకు పనికిరాని జీవితాలు; అంధ+ఇందు+ఉదయముల్= గ్రుడ్డివాని ఎదుట చంద్రోదయం వంటిది; మహాబధిర= చెవిటివానికి; శంఖారావముల్= శంఖధ్వని వినిపించుట వంటిది; మూక= మూగవానికి; సత్+గ్రంథ+ఆఖ్యాపనముల్= మంచి గ్రంథములు చదివించుట వంటివి; నపుంసక= షండుడు; వధూకాంక్షల్= చక్కని వధువుని కోరుటవంటిది; కృతఘ్న+ఆవలీబంధుత్వంబులు= చేసిన మేలు మరచినవారితో బాంధవ్యము నెరపుట వంటివి; భస్మహవ్యములు= బూడిదలో

పోసిన హోమద్రవ్యాలవంటివి; లుబ్ధద్రవ్యముల్= లోభివానివద్ద ఉన్న సంపదలవంటివి; క్రోడ= సూకరమునకు (బురదలో దొరలు పందికి) సత్+గంధంబుల్= సువాసనగల హరి చందనముల వంటివి

**తా :** గ్రుడ్డివానికి వెన్నెల విరిసినా తెలియదు. శంఖధ్వానము చెవిటివానికి వినిపించదు, మూగవాడు మంచి గ్రంథాలు చదివినా వాటిభావాలను వ్యక్తం చేయజాలడు. నపుంసకులు అందమైన స్త్రీలను వాంఛిస్తే నిరుపయోగం. కృతఘ్నులతో బంధుత్వం వహించుట పూర్తిగా వ్యర్థం. బూడిదలో హోమద్రవ్యాలు వేయటం నిరుపయోగం. లోభి వానివద్ద ఎంత సంపద ఉన్నా ఉపయోగం లేదు. సూకరానికి సుగంధాల ప్రయోజనం సిద్ధించదు. ఈ విషయాలు అన్నీ ఎలా నిరుపయోగాలో అలాగే విష్ణుమూర్తిపై భక్తిలేని జనుల జీవితాలు కూడా నిరర్థకాలే.

**సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ,**
**సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు, శేషశాయికి మ్రొక్కు శిరము శిరము,**
**విష్ణు నాకర్ణించు వీనులు వీనులు, మధువైరిఁ దవిలిన మనము మనము,**
**భగవంతు వలగొను పదములు పదములు, పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి,**

**తే. దేవదేవునిఁ జింతించు దినము దినము, చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు,**
**కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు, తండ్రి హరిఁ జేరుమనియెడి తండ్రి! తండ్రి 169**

**ప్రతి :** కమలాక్షున్= పద్మాక్షుడైన శ్రీవిష్ణువును; అర్చించు= పూజించే; కరములు కరములు= చేతులే చేతులు; శ్రీనాథున్= మాధవుని; వర్ణించు= కీర్తించే; జిహ్వ జిహ్వ= నాలుకే నాలుక; సురరక్షకునిన్= దేవతా రక్షకుడైన విష్ణువును; చూచు= చూచే; చూడ్కులు చూడ్కులు= చూపులే చూపులు; శేషశాయికిన్= శేషుని శయ్యగా చేసికొని పరుండు విష్ణువుకు; మ్రొక్కు= మొక్కే; శిరము శిరము= శిరస్సే శిరస్సు; విష్ణున్= విష్ణుమూర్తిని గూర్చి; ఆకర్ణించు= వినే; వీనులు వీనులు= చెవులే చెవులు; మధువైరిన్= మధు అనే రాక్షసుని చంపిన విష్ణుమూర్తిని; తవిలిన= ఆకాంక్షించే; మనము మనము= మనస్సే మనస్సు; భగవంతున్= పరమాత్మునికి; వలగొను= ప్రదక్షిణం చేసే, చుట్టూ తిరిగే; పదములు పదములు= పాదాలే పాదాలు; పురుషోత్తముని మీఁది= పురుషులలో ఉత్తముడైన శ్రీవిష్ణుదేవుని మీద; బుద్ధి బుద్ధి= నిలిపే బుద్ధే నిజమైన బుద్ధి; దేవదేవునిన్= దేవతలకే దైవమైన హరిని; చింతించు= ఆలోచించు; దినము దినము= రోజు మాత్రమే రోజు; చక్రహస్తునిన్= చక్రాన్ని ధరించు హరిని; ప్రకటించు= స్పష్టీకరించే; చదువు చదువు= చదువే చదువు; కుంభినీధవున్= భూదేవికి విభుడైన శ్రీమన్నారాయణుని గూర్చి; చెప్పెడి= తెలియజేసే; గురుఁడు గురుఁడు= బోధకుడే నిజమైన గురువు; తండ్రి!= ఓ తండ్రీ! హరిన్= విష్ణువును; చేరుమనియెడి= చేరుకో అనిచెప్పే; తండ్రి తండ్రి= తండ్రే నిజమైన తండ్రి!

**తా :** ఓ తండ్రీ! విష్ణువును పూజించే చేతులే చేతులు. శ్రీనాథుని వర్ణించే నాలుకే నాలుక; దేవరక్షకుని చూచే చూపులే చూపులు. శేషశయనుడైన హరికి మ్రొక్కే శిరస్సే నిజమైన శిరస్సు. విష్ణుని గూర్చి వినే చెవులే చెవులు. మధుసూదనునియందు లగ్నమైన మనస్సే మనస్సు. భగవంతునికి ప్రదక్షిణ చేసే పదములే పదములు. పురుషోత్తముని మీది బుద్ధే నిజమైన బుద్ధి. పరదైవమైన విష్ణువును యోచించే దినమే దినము. చక్రధారిని ప్రకటించే చదువే చదువు. భూదేవి భర్తఅయిన శ్రీహరిని గూర్చి చెప్పేవాడే నిజమైన గురువు. హరిపదాలను ఆశ్రయించు అని చెప్పే తండ్రే నిజమైన తండ్రి.

**విశే :** 'శ్రీహరిని చేరమని నీవు చెప్పలేదు కనుక నీవు తండ్రివి కాదు' అని ప్రహ్లాదుని భావన.

**సీ. కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే పవనగుంఫిత చర్మ భస్త్రి గాక**
**వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమ ధ్వనితోడి ఢక్క గాక!**
**హరిపూజనము లేని హస్తంబు హస్తమే తరుశాఖ నిర్మిత దర్వి గాక!**
**కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాల రంధ్రములు గాక!**

**ఆ. చక్రి చింతలేని జన్మంబు జన్మమే తరళ సలిలబుద్బుదంబు గాక!**
**విష్ణుభక్తి లేని విబుధుండు విబుధుఁడే పాదయుగముతోడి పశువు గాక! 170**

**ప్రతి :** కంజ+అక్షునకున్= పద్మాక్షునికి; కాని= ఉపయోగపడని; కాయంబు కాయమే= శరీరం శరీరమా!; పవనగుంఫిత= గాలితో నింపబడిన; చర్మభస్త్రిగాక= చర్మంతో చేయబడిన తిత్తిమాత్రమే; వైకుంఠున్= వైకుంఠనాథుని; పొగడని= నుతింపని; వక్త్రంబు వక్త్రమే= నోరు నోరవుతుందా! ఢమఢమ ధ్వనితోడి= ఢమ ఢమ అని శబ్దంచేసే; ఢక్కగాక= ఢక్కమాత్రమే; హరిపూజనము లేని= నారాయణుని అర్చించని; హస్తంబు హస్తమే= చేయి చేయి అగునా!; తరుశాఖన్= చెట్టుకొమ్మతో; నిర్మిత= చేయబడ్డ; దర్విగాక= గరిటెవంటిదే సుమా!; కమలా+ఈశున్+చూడని= ఇందిరాపతిని కనుగొనని; కన్నులు కన్నులే= నేత్రాలు నేత్రాలా?; తనుకుడ్యజాల= శరీరమనే కిటికీలయొక్క; రంధ్రములుగాక= సందులు మాత్రమే; చక్రి చింతలేని= చక్రధారియైన విష్ణుమూర్తిపై ధ్యానంలేని; జన్మంబు జన్మమే= పుట్టుక పుట్టుక అవుతుందా? కాదు; తరళసలిల= కదలాడు నీటిలోని; బుద్బుదంబుగాక= బుడగమాత్రమే సుమా!; విష్ణుభక్తి లేని= విష్ణుమూర్తిపైన భక్తిలేనట్టి; విబుధుండు= పండితుడు; విబుధుఁడే= పండితు డగునా!; పాదయుగము తోడి= రెండు కాళ్లతో వున్న; పశువుగాక= పశువు మాత్రమే సుమా!

**తా :** పద్మాక్షుడైన విష్ణుమూర్తికి సేవచేయని శరీరం శరీరం కాదు. గాలితో నిండిన తోలు తిత్తిమాత్రమే. వైకుంఠవాసుడైన విష్ణుమూర్తిని స్తోత్రం చేయని నోరు నోరు కాదు. కేవలం ఢమ ఢమ అని ధ్వనించే చర్మపుఢక్క మాత్రమే. హరిని పూజించని చేయి చేయే కాదు. కేవలం చెట్టు కొమ్మతో చేసిన తెడ్డు మాత్రమే. ఇందిరాపతిని చూడని కన్నులు కన్నులా! శరీరమనే కిటికీరంధ్రాలు మాత్రమే. సుదర్శనాయుధుని చింతించని జన్మము జన్మమే కాదు. నీటిపైని కదిలే బుడగ మాత్రమే. విష్ణుభక్తిలేని పండితుడు పండితుడు కాదు. రెండు పాదాలతో నడిచే పశువు మాత్రమే.

**విశే :** భగవంతుడు మనిషికి కరచరణాది అవయవాలు ప్రసాదించాడు. ఆ కారణంవల్ల మనిషి దేవునిపట్ల కృతజ్ఞుడై ఉండడం ఒక రకమైతే ఆ అవయవాలను విష్ణుసేవకు అర్పితం కావాలని ఈ పద్యంలో ప్రబోధిస్తున్నాడు. ఈ సీసపద్యంలోని కంజాక్ష, వైకుంఠం, హరిపూజనం, కమలేశ, చక్రశబ్దాలు, విశిష్టార్థద్యోతకాలు.

**సీ. సంసారజీమూత సంఘంబు విచ్చునే, చక్రిదాస్యప్రభంజనము లేక?**
**తాపత్రయాభీలదావాగ్ను లాఱునే విష్ణుసేవామృతవృష్టి లేక?**
**సర్వంకషాఘౌఘజలరాసు లింకునే హరి మనీషాబడబాగ్ని లేక?**
**ఘన విపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్ష నుతిరవిప్రభలు లేక?**

**తే. నిరుపమాపునరావృత్తి నిష్కళంక, ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన**
**శార్‌ఙ్గకోదండచింతనాంజనము లేక, తామరసగర్భునకు నైన దానవేంద్ర! 171**

**ప్రతి :** దానవ+ఇంద్ర!= ఓ రాక్షసరాజా!; చక్రిదాస్య ప్రభంజనము లేక= విష్ణుమూర్తిని సేవించుటం అనే సుడిగాలి లేకుండా; సంసార= సంసారమనే; జీమూత సంఘంబు= మబ్బుల సమూహం; విచ్చునే= చెదిరి పోవునా; విష్ణుసేవా+అమృత వృష్టిలేక= విష్ణుమూర్తియొక్క సేవ అనే సుధా వర్షంలేకుండా; తాపత్రయ+అభీల దావ+అగ్నులు ఆఱునే= ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికాలను మూడు తాపాలతో కూడిన భయంకరమైన కార్చిచ్చు మంటలు చల్లారునా?; హరి మనీషా= విష్ణుమూర్తిని గూర్చిన బుద్ధి అనే; బడబాగ్ని లేక= సముద్రంలో రేగే అగ్ని లేకుండా!; సర్వంకషా+అఘ+ఓఘ జలరాశులు= ఒడ్డులు ఒరుసుకొనే పాపమనే ప్రవాహంగల సాగరాలు; ఇంకునే= ఇంకుతాయా!; పద్మాక్షనుతి రవిప్రభలు= విష్ణుమూర్తి కీర్తనలనే సూర్యకాంతులు; లేక= లేకుండా; ఘన= గొప్పవైన; విపత్= కష్టాలనే; గాఢ= దట్టమైన; అంధకారంబుల్= చీకట్లు; అడఁగునే= అణగుతాయా!; ముఖ్యమైన= గొప్పదైన; శార్ఙ్గకోదండ చింతనా+అంజనములేక= శార్ఙ్గము అను కోదండాన్ని ధరించిన విష్ణువుయొక్క ధ్యానం అనే కాటుకలేకుండా; తామరస గర్భునకున్+ఐన= పద్మగర్భుడైన బ్రహ్మకైనా; నిరుపమ= పోల్చలేని; అపునరావృత్తి= పునరావృత్తిలేని; నిష్కళంక= మచ్చలేని; ముక్తినిధిన్= మోక్షమనే పెన్నిధిని; కానవచ్చునే= చూడవచ్చునా!

**తా :** ఓ రాక్షసేశ్వరా! విష్ణుమూర్తి సేవ అనే పెనుగాలి వీచకపోతే ఈ జననమరణాలనే దట్టమైన సంసారమేఘం వీడిపోదు. విష్ణుమూర్తి సేవ అనే ఒక అమృతవర్షం కురియకపోతే తాపత్రయాలతో కూడిన ఈ దావాగ్నులు చల్లారవు. శ్రీహరిపైగల జ్ఞానం అనే బడబాగ్ని లేకపోతే పాపపుజలరాసులు ఇంకిపోవు. పుండరీకాక్షుని గూర్చిన ధ్యానమనే సూర్యకాంతులు లేకుంటే కష్టాలనే గాఢాంధకారం సమసిపోదు. శార్ఙ్గమనే కోదండాన్ని ధరించిన విష్ణుచింతనం అనే కాటుక కనులకు పెట్టుకోకపోతే అపురూపమైన, తరగని, నిర్మలమైన ముక్తి అనే పెన్నిధిని చూడజాలం. ఈ మాటలు నీ కొఱకు నా కొఱకు మాత్రమే కాదు. సాక్షాత్ పద్మగర్భుడైన బ్రహ్మకుకూడా విష్ణుస్మరణ వినా ముక్తికి వేరొక మార్గం లేదు.

**విశే :** అంజనం – దూరంగా ఉన్న వస్తువును కనుగొనేందుకు కన్నులకు పెట్టుకునే కాటుక.

**వ. అని యి వ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక యులుకు సెడి పలికెడి కొడుకు నుడువులు చెవులకు ములుకుల క్రియ నొదవినఁ గటము లదరఁ బెదవులం గఱచుచు నదరిపడి గురుసుతునిం గనుంగొని విమత కథనంబులు గఱపినాఁడ వని దానవేంద్రుం డిట్లనియె. 172**

**ప్రతి :** అని= అనుచు; ఈ+విధంబునన్= ఈ విధంగా; వెఱపు మఱపున్+ఎఱుంగక= జంకూ గొంకూ లేకుండా; ఉలుకు+చెడి= భయాన్ని విడిచి; పలికెడి= మాట్లాడెడి; కొడుకు నుడువులు= సుతుని మాటలు; చెవులకు= తన చెవులకు; ములుకుల క్రియన్+ఒదవినన్= ములుకులవలె (ముళ్ళవలె) ఒప్పగా; కటములు+అదరన్= చెక్కిళ్ళు అదిరిపోగా; పెదవులన్+కఱచుచున్= పెదవులను కోపంతో కరుస్తూ; అదరిపడి= ఉలికిపడి; గురుసుతునిన్+కనుంగొని= గురుపుత్రుని చూచి; విమత కథనంబులు= వ్యతిరేక మతం వారి (శత్రుమతంవారి) కథలను; కఱపినాఁడవు+అని= నేర్పావని; దానవేంద్రుండు= రాక్షసరాజు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా జంకు గొంకులేకుండా భయం విడిచి మాట్లాడిన కొడుకు మాటలు చెవులకు ములుకులవలె తాకగా, చెక్కిళ్ళు అదిరిపోగా, కోపంతో పెదవి కరుస్తూ అదిరిపడి గురుపుత్రుని చూచి, శత్రువుకు సంబంధించిన కథలను నా పుత్రునకు నేర్పావని కోపంతో రాక్షసరాజు ఇలా అన్నాడు.

**చ. పటుతర నీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ**
**వటు గొనిపోయి వానికి ననర్థములైన విరోధిశాస్త్రముల్**
**కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం,**
**గటకట! బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే? 173**

**ప్రతి :** బాలున్= నా కుమారుని; పటుతర= శ్రేష్ఠమైన; నీతిశాస్త్రచయ= నీతి శాస్త్ర సమూహంలో; పారగున్+చేసెదన్+ అంచున్= ఉత్తీర్ణుని చేస్తాననిచెప్పి; నీవు= నీవు; అటుగొనిపోయి= నీ వద్దకు తీసికొనివెళ్ళి; వానికిన్= నా పుత్రునికి; అనర్థములైన= తగని (అర్థములుగాని) విరోధిశాస్త్రముల్= విరోధులకు సంబంధించిన శాస్త్రవిషయములను; కుటిలతన్= మోసంతో; చెప్పినాఁడవు= చెప్పినావు; భృగుప్రవరుండవు+అటంచున్= భృగువంశానికి చెందినవాడివని; నమ్మితిన్= నమ్మినాను; కటకట= అయ్యయ్యో!; బ్రాహ్మణ+ఆకృతివిగాక= బ్రాహ్మణాకారంతో ఉన్నావు గాని; యథార్థపు బ్రాహ్మణుండవే= నిజమైన బ్రాహ్మణుడవా!

**తా :** నా కుమారుని నీతిశాస్త్ర పారంగతుని చేస్తానని నీవు తీసికొని వెళ్ళి వానికి అర్థంగాని విరోధిశాస్త్రాలు కుటిల బుద్ధితో నూరిపోసి మోసం చేశావు. నేను నిన్ను భృగువంశంలో గొప్పవాడవని నమ్మినాను. అయ్యయ్యో! నీవు బ్రాహ్మణుని ఆకారంలో ఉన్నావుగాని నిజమైన బ్రాహ్మణుడవు కాదు.

**విశే :** 'బ్రాహ్మణుండవే' అనేచోట ప్రశ్నార్థకం, ఆశ్చర్యార్థకం, నిశ్చయార్థకం కూడా ఉన్నాయి.

**క. ధర్మేతరవర్తనులును, దుర్మంత్రులునైన జనుల దురితము లొందున్**
**మర్మములు గలఁచి కల్మష, కర్ముల రోగములు పొందు కైవడి విప్రా! 174**

**ప్రతి :** విప్రా= ఓ బ్రాహ్మణా!; మర్మములు= రహస్యాలు; కలఁచి= బాధపెట్టి; కల్మషకర్ముల= చెడ్డపనులను చేసేవారి; రోగంబులు పొందుకైవడిన్= రోగాలువచ్చి చేరినట్లుగా; ధర్మ+ఇతరవర్తనులును= అధర్మంగా ప్రవర్తించేవారిని; దుర్మంత్రులును+ఐన జనుల= కుటిలమైన ఆలోచనలు గలవారిని; దురితములు+ఒందున్= పాపాలు పట్టుకుంటాయి.

**తా :** ఓ బ్రాహ్మణా! ఆ యా జనులను బాధించి, రహస్యంగా చేసే చెడ్డపనులు దుర్మార్గపు పనులు చేసేవారిని రోగాలు పట్టి పీడిస్తాయి. అలాగే అధర్మవర్తనులను, కుటిలబుద్ధులను పాపాలు చేరి బాధిస్తాయి.

**వ. అనిన రాజునకుఁ బురోహితుం డిట్లనియె. 175**

**ప్రతి :** అనినన్= అని పల్కిన; రాజునకున్= రాజైన హిరణ్యకశిపునితో; పురోహితుండు= గురువు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని పలికిన ఆ రాక్షసరాజునకు, పురోహితుడు ఇలా చెప్పాడు.

**ఉ. తప్పులు లేవు మా వలన దానవనాథ! విరోధిశాస్త్రముల్**
**చెప్పము, క్రూరులై పరులు సెప్పరు, మీ చరణంబులాన సు**
**మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష, యెవ్వరుం**
**జెప్పెడి పాటిగాదు, ప్రతిచింతఁ దలంపుము నేర్పు కైవడిన్. 176**

**ప్రతి :** దానవనాథ!= రాక్షసరాజా!; మా వలన= మావల్ల; తప్పులు లేవు= ఏ దోషాలు జరుగలేదు; విరోధిశాస్త్రముల్= శత్రువును గూర్చిన శాస్త్రాలు; చెప్పము= మేము చెప్పలేదు; పరులు= ఇతరులెవ్వరూ; క్రూరులై= దుష్టులై; చెప్పరు= చెప్పలేదు; మీ చరణంబులాన సుమ్ము= మీ పాదాలపై ఒట్టు సుమా!; ఇంతయున్= ఇది అంతా; ఎప్పుడు= నిరంతరం; మీ కుమారునకున్= మీ పుత్రునకు; నైజమనీష= తన బుద్ధిమాత్రమే; ఎవ్వరున్+చెప్పెడి పాటిగాదు= ఎవ్వరైనా చెపితే వచ్చేది కాదు; నేర్పు కైవడిన్= చాతుర్యం వ్యక్తం అయ్యేవిధంగా; పై విషయాలను ఆలోచించి; ప్రతిచింతన్= తిరిగి ఏమిచేయాలో అనే ఆలోచనను; తలంపుము= యోచించు.

**తా :** ఓ రాక్షసరాజా! మా వల్ల ఏ దోషాలు జరగలేదు. మేము విరోధుల కథలు గాథలు చెప్పలేదు. మేమే కాదు. ఇతరులు కూడా చెప్పలేదు. మీ పాదాలపై ఒట్టు సుమా! ఇది మీ కుమారుని సహజమైన బుద్ధి విశేషం మాత్రమే. ఎవ్వరు చెప్పినది కాదు. జరిగింది జరిగిపోయింది. నేర్పుతో ఇప్పుడు ప్రతిక్రియ ఏమి చేయాలో ఆలోచించు.

**క. మిత్రులము పురోహితులము, పాత్రుల మే మదియుఁగాక భార్గవులము నీ**
**పుత్రుని నిటువలెఁ జేయఁగ, శత్రులమే? దైత్యజలధిచంద్రమ! వింటే? 177**

**ప్రతి :** దైత్యజలధిచంద్రమ!= రాక్షస వంశసముద్రానికి చంద్రునివంటి ఓ చక్రవర్తీ!; ఏము= మేం; మిత్రులము= నీకు స్నేహితులం; పురోహితులము= నీ మేలు కోరేవారం; పాత్రులము= యోగ్యులం; అదియున్+కాక= అంతేకాక; భార్గవులము= నీ వంశగురువులైన భృగువంశానికి చెందినవారం; నీ పుత్రునిన్= నీ కుమారుని; ఇటువలెన్= ఈ విధంగా; చేయఁగన్= చేయటానికి; శత్రులమే= నీకు మేం పగవారమా!; వింటే= వింటున్నావు కదా!

**తా :** ఓ దైత్యవంశాంబుధి చంద్రమా! చక్కగా విను. మేం నీకు మిత్రులం. పురోహితులమై నీ మేలు కోరేవాళ్లం. తగినవారం. అంతేగాక, నీ కులానికి గురువులైన భృగువంశంలో జన్మించినాము. ఇటువంటి మేం నీ కుమారునికి ఇలా విరోధిశాస్త్రాలు చెపుతామా! అలా చేయడానికి మేం నీకు శత్రువులమా చెప్పు!

**వ. అనిన గురునందనుం గోపింపక దైత్యవల్లభుండు గొడుకు నవలోకించి యిట్లనియె. 178**

**ప్రతి :** అనినన్= అలా అనగా; గురునందనున్= గురుపుత్రుడైన ఆ ఆధ్యాపకుని; కోపింపక= కోపపడకుండా!; దైత్యవల్లభుండు= రాక్షసరాజు; కొడుకున్+అవలోకించి= కుమారుని చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఈ విధంగా గురుపుత్రుడు పలుకగా, ఆ గురుపుత్రుడైన ఆచార్యునిపై ఆగ్రహింపక, ఆ దానవరాజు కొడుకునుచూచి ఇలా అన్నాడు.

**క. ఒజ్జలు సెప్పని యీ మతి, మజ్జాతుఁడ వైన నీకు మఱి యెవ్వరిచే**
**నుజ్జాత మయ్యె బాలక!, తజ్జనులం బేరుకొనుము తగ నా మ్రోలన్. 179**

**ప్రతి :** బాలక= ఓ కుమారా!; ఒజ్జలు+చెప్పని= ఉపాధ్యాయులు బోధించని; ఈ మతి= ఈ బుద్ధి; మత్+జాతుఁడవు+ఐన నీకు= నాకు జన్మించిన నీకు; మఱి ఎవ్వరిచేన్= మరి ఎవరివల్ల; ఉత్+జాతమయ్యెన్= పుట్టిందో; తగన్= ఒప్పునట్లు; నా మ్రోలన్= నా ఎదురుగా; తద్+జనులన్= ఆ జనాలను; పేరుకొనుము= తెలియజేయి.

**తా :** ఓ కుమారా! నీకు ఉపాధ్యాయులు బోధించని ఈ విషయాలు నా పుత్రుడవైన నీకు ఎవరివల్ల తెలిశాయి? ఎవరు నీకు ఈ వైరి విషయాలు చెప్పారో, వారెవరో ఇప్పుడు నా ఎదురుగా చెప్పు.

**వ. అనినఁ దండ్రికిఁ బ్రహ్లాదుం డిట్లనియె.** **180**

**ప్రతి :** అనినన్= అనగా; తండ్రికిన్= తండ్రి ఐన హిరణ్యకశిపునకు; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అలా మాట్లాడిన తండ్రి హిరణ్యకశిపునితో, ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

**ఉ. అచ్చపుఁ జీఁకటిం బడి గృహవ్రతులై విషయ ప్రవిష్టులై**
**చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైన వారికిం**
**జెచ్చెరఁ బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే**
**మిచ్చిన నైనఁ గానలకు నేఁగిన నైన హరి ప్రబోధముల్?** **181**

**ప్రతి :** అచ్చపున్+చీఁకటిన్+పడి= గాఢమైన అంధకారంలో మునిగి; గృహవ్రతులై= ఇల్లు, ఇంటిలో జనాలను గూర్చిన ఆలోచన మాత్రమే వ్రతంగా గలవారై; విషయ ప్రవిష్టులు+ఐ= ఇంద్రియాలకు సంబంధించిన కోరికలను తీర్చుకోవడంలో నిమగ్నులై; చచ్చుచున్+పుట్టుచున్= చస్తూ, పుడుతూ; మరలన్= మరల మరల; చర్విత చర్వణులు+ఐన వారికిన్= తిరుగుచున్నచోటే తిరిగే వారికిన్ (జనన మరణమనే సుడిగుండంలో పడి తిరిగేవారికి); హరి ప్రబోధముల్= హరిని గూర్చిన భక్తిజ్ఞానాలు; పరులు+చెప్పినన్+ఐనన్= ఇతరులు చెప్పినప్పటికీ; నిజ+ఇచ్ఛనైనన్= తమలో కోర్కె జనించినప్పటికీ; ఏమి+ఇచ్చిననైనన్= ఏమి ఇచ్చినప్పటికీ; కానలకున్+ఏఁగినన్+ఐనన్= అడవులకు పోయినప్పటికీ; చెచ్చెరన్+పుట్టునే= వెంటనే సిద్ధిస్తాయా!

**తా :** కానరాని కటిక చీకటిలోపడి, ఇల్లే వ్రతంగా భావిస్తూ, ఇంద్రియసుఖాలకు లోబడి, జనన మరణ చక్రంలో అక్కడే తిరుగులాడుచున్న వారికి, హరికి సంబంధించిన జ్ఞానం లభించదు. అటువంటివారికి ఏమిచ్చి చెబుదామన్నా, అడవులలోకి వెళ్లినా హరికి సంబంధించిన భక్తిజ్ఞానాలు సిద్ధించవు. ఎవరు చెప్పినా, తమకు కావాలని కోరుకున్నా, ఏదో ఒకటి బహుమానంగా ఇచ్చి చెబుదామన్నా, అడవులలోకి దూరినా 'హరిని పూజించాలి, హరిని కీర్తించాలి' అనే జ్ఞానం తొందరగా ప్రాప్తించదు.

**ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్**
**గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై**
**కానరు విష్ణుఁ గొంద ఱటఁ గందు రకించన వైష్ణవాంఘ్రి సం**
**స్థాన రజోఽభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!** **182**

**ప్రతి :** దానవేశ్వరా= ఓ రాక్షసరాజా! కాననివానిన్= చూడలేని గ్రుడ్డివానిని; ఊఁతన్+కొని= ఆధారంగా స్వీకరించి; కాననివాఁడు= మరొక గ్రుడ్డివాడు; విశిష్టవస్తువుల్= విశేష వస్తువులను; కానని భంగిన్= చూడలేని విధంగా; కొందఱు= కొంతమంది; కర్మములు గైకొని= కర్మలను చేకొని; కర్మబద్ధులై= కర్మలచే కట్టుబడి; విష్ణున్= విష్ణుమూర్తిని; కానరు= చూడలేరు; అకించన= సర్వసంగపరిత్యాగులైన; వైష్ణవ= విష్ణుభక్తులయొక్క; అంఘ్రి= పాదాలపై; సంస్థాన= ఉన్నటువంటి; రజః= పరాగంచేత; అభిషిక్తులగు= అభిషేకం చేయబడినటువంటి; సంహృతకర్ములు= కర్మసంబంధంలేనివారు; కొందఱు= కొందరు మాత్రమే; అటన్= అచట; విష్ణువున్= విష్ణుమూర్తిని; కందురు= కానగలరు (చూస్తారు).

**తా :** ఓ దానవరాజా! గుడ్డివానిని ఊతగా గొని మరొక గుడ్డివాడు విశేషవస్తువులను చూడలేడు గదా! అలాగే కర్మాచరణమే ప్రధానంగా ఉండేవారు, కర్మలకు కట్టుబడేవారు, విష్ణువును దర్శించలేరు. మరికొంతమంది ఉన్నారు, వారు కర్మలను చేయక, ఒకవేళ చేసినా, నిష్కామ కర్మ చేస్తూ లేదా కర్మఫలాన్ని పరమాత్మకే సమర్పిస్తారు. వారికి ఈ శక్తి నిష్కాములైన విష్ణుభక్తుల పాదధూళిని తమ శిరస్సుపై ధరించి కర్మసంబంధం లేనివారు కావడంవల్ల వచ్చింది. వారు మాత్రమే విష్ణువును కాంచగలరు, ఇతరులు కానలేరు.

**విశే :** కేవల కర్మబద్ధుల సాంగత్యంకంటే నిష్కాములైన విష్ణుభక్తుల సాంగత్యం వల్ల విష్ణుదర్శనం లభిస్తుంది.

**శా. శోధింపం బడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వే యేటికిన్**
**గాథల్ మాధవశేముషీతరణి సాంగత్యంబునం గాక దు**
**ర్మేధన్ దాcటcగ వచ్చునే సుతవధూమీనోగ్ర వాంఛా మద**
**క్రోధోల్లోల విశాల సంసృతి మహా ఘోరామితాంభోనిధిన్. 183**

**ప్రతి :** రక్షస్+నాథ= ఓ రాక్షసరాజా!; సర్వశాస్త్రములు= సమస్త శాస్త్రాలు, విద్యలు; శోధింపన్+పడెన్= లోతుగా అనుశీలింపబడ్డాయి; గాథల్ వేయి+ఏటికిన్= వేయికథ లెందుకు?; సుత= కుమారులు; వధూ మీన= స్త్రీలు అనే చేపలతోకూడా; ఉగ్రవాంఛా= ఘోరమైన కోర్కులు; మద= గర్వం; క్రోధ= క్రోధం అనే; ఉత్+లోల= ఎత్తుగా ఎగురుతున్న తరంగాలచేత; విశాల= విస్తారమైన; సంసృతి= సంసారమనే; మహా= గొప్పదైన; ఘోర= భయంకరమైన; అమిత= అంతులేని; అంభస్+నిధిన్= సముద్రాన్ని; మాధవశేముషీ= విష్ణువును గూర్చిన జ్ఞానమనే; తరణి సాంగత్యంబునన్+కాక= నావ యొక్క సాంగత్యంతో తప్ప; దుర్మేధన్= మిగిలిన చెడ్డదైన బుద్ధితో; దాటన్+కన్ వచ్చునే= దాటగలమా!

**తా :** ఓ రాక్షసరాజా! వేయి మాటలు, వేయి గాథలు త్రవ్వవలసిన పనిలేదు. అన్ని శాస్త్రాలు శోధించి చెప్పుచున్న విషయం ఇది. ఈ సంసారం అనే సముద్రం చాల విస్తారమైనది. లోతనైది. ఘోరమైనది. ఈ సముద్రంలో సుతులు సతులు పెద్ద పెద్ద చేపలు భయంకరమైన కోర్కులు, మదం, క్రోధం, ఎత్తుగా ఎగిరే అలలు. ఇటువంటి సంసార సముద్రాన్ని కేవలం విష్ణుమూర్తికి సంబంధించిన జ్ఞానమనే నావతో మాత్రమే దాటగలం తప్ప సామాన్యమైన జ్ఞానంతో దుష్టపు ఆలోచనలతో దాటలేం సుమా!

**విశే : 'మాధవ శేముషీ తరణి సాంగత్యంబునన్ గాక'** – అనే వాక్యం కీలకమైంది. 170వ సీసపద్యంలోని **"విష్ణుభక్తిలేని విబుధుండు"** అనే మాటను తాకుతున్నది.

**వ. అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసుల ఱేcడు దన తొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప వేcడిచూపులు మింట మంట లెగయ మంత్రులం జూచి యిట్లనియె. 184**

**ప్రతి :** అని పలికినన్= అని మాట్లాడిన; కొడుకును ధిక్కరించి= కుమారుని ఎదిరించి; మక్కువ+చేయక= ముద్దుచేయక; రక్కసుల ఱేcడు= రాక్షసరాజు; తన తొడలపైన్= తన ఒడిలో; ఉండనీక= నిలువనీయక; గొబ్బునన్= వెంటనే; దిగద్రొబ్బి= క్రిందకు పడవైచి; నిబ్బరంబు+అగు= నిండైన; కోపంబుదీపింపన్= ఉవ్వెత్తున కోపంరాగా; వేcడిచూపులు= తీవ్రమైన

చూపులు; మింటన్= ఆకాశంలో; మంటలు+ఎగయన్= మంటలు రేపగా; మంత్రులన్+చూచి= తన మంత్రులను చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అలా మాట్లాడిన కొడుకును ధిక్కరించి, ప్రేమను చూపక, రాక్షసరాజు ప్రహ్లాదుని తన ఒడినుండి క్రిందకు తోసివేశాడు. పట్టలేని కోపం వచ్చింది. ఆ కోపంవల్ల అతని వేడిచూపులు ఆకాశంలో మంటలు రేపాయి. మంత్రులతో ఇలా అన్నాడు.

**శా. క్రోడంబై పినతండ్రిఁ జంపె నని తాఁ గ్రోధించి చిత్తంబులో**
**వీడం జేయఁడు, బంటుభంగి హరికిన్ విద్వేషికిన్ భక్తుఁడై**
**యోడం డక్కట! ప్రాణవాయువులు వీఁడొప్పించు చున్నాఁడు నా**
**తోడన్ వైరము పట్టె, నిట్టి జనకద్రోహిన్ మహిం గంటిరే? 185**

**ప్రతి :** క్రోడంబై= సూకరమై (పంది రూపంతో); పినతండ్రిన్= తన పినతండ్రిని; చంపెనని= చంపాడు గదా విష్ణుమూర్తి అని; తాన్= తాను; క్రోధించి= కోపం వహించి; చిత్తంబులోన్= మనసులో; వీడన్+చేయఁడు= ఆ హరిని విడిచి పెట్టడు; హరికిన్= ఆ విష్ణుమూర్తికి; విద్వేషికిన్= (మీదు మిక్కిలి) నా శత్రువునకు; భక్తుఁడై= భక్తిని చూపించేవాడై; బంటుభంగిన్= సేవకునివలె ఉంటూ; అక్కట= అరే! ఓడండు= భయపడడు; ప్రాణవాయువులు= నా ప్రాణాలను; వీఁడు= ఇతడు; ఒప్పించుచున్నాఁడు= నొప్పిస్తున్నాడు; నా తోడన్= తండ్రినైన నాతో; వైరము పట్టెన్= విరోధిస్తున్నాడు; మహిన్= భూమిపై; ఇట్టి= ఇటువంటి; జనకద్రోహిన్= పితృద్రోహిని; కంటిరే= చూచారా!

**తా :** విష్ణుమూర్తి సూకర రూపాన్ని ధరించివచ్చి తన పిన తండ్రిని చంపాడు గదా. ఆ విషయం తెలిసిన వీడు మనసులో విష్ణువుపై క్రోధం వహించి అతనిని ద్వేషించి, వదలి వేయాలి గదా! అలా చేయకుండా ఆ హరికి బంటుగా భక్తుడై, నా శత్రువు పక్షాన మాట్లాడుతున్నాడు. అలా మాట్లాడటానికి భయపడటం లేదు. అరె! నా ప్రాణవాయువులకు బాధకలిగిస్తున్నాడు. నావంటి తండ్రితో వైరం వహిస్తున్నాడు. ఇలా తండ్రికి ద్రోహం తలపెట్టే కొడుకును ఈ సమస్త భూమండలంలో ఎక్కడైనా చూచారా!

**వ. అని రాక్షసవీరుల నీక్షించి యిట్లనియె. 186**

**ప్రతి :** అని= అంటూ; రాక్షసవీరులన్= వీరులైన రాక్షసులను; ఈక్షించి= చూస్తూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అంటూ, రాక్షసవీరులను చూచి హిరణ్యకశిపుడు ఇలా అన్నాడు.

## ✣ హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వివిధోపాయంబుల హింసించుట ✣

**శా. పంచాబ్దంబులవాఁడు, తండ్రినగు నా పక్షంబు నిందించి య**
**త్కించిద్భీతియు లేక విష్ణు నహితుంగీర్తించుచున్నాఁడు, వ**
**ల్దంచుంజెప్పిన మానఁ, డంగమునఁబుత్రాకారతన్ వ్యాధి జ**
**న్మించెన్, వీని వధించి రండు దనుజుల్ మీ మీ పటుత్వంబులన్. 187**

**ప్రతి:** పంచ+అబ్దంబులవాఁడు= ఐదుఏండ్లవాడు; తండ్రిన్+అగునాపక్షంబున్= తండ్రినయిన నా పద్ధతిని; నిందించి= తిట్టి, తిరస్కరించి; యత్+కించిత్= ఏ కొంచెమయినా; భీతియున్= భయంగూడ; లేక, విష్ణున్= శ్రీహరిని; అహితున్=

శత్రువును; కీర్తించుచున్+ఉన్నాఁడు= పొగడుతున్నాడు; వల్దు= వలదు, వద్దు; అంచున్+ చెప్పినన్= అంటూ చెప్పినా; మానఁడు= విరమించడు, వదలుకోడు; పుత్ర+ఆకారతన్= కొడుకు రూపంతో; అంగమునన్= శరీరంలో; వ్యాధి= రోగం; జన్మించెన్= పుట్టెను; దనుజుల్= ఓ రాక్షసులారా! మీ మీ పటుత్వంబులన్= మీ మీ సామర్థ్యాలతో; వీనిన్= ఇతనిని, ఈ రాజకుమారుని; వధించి, రండు= చంపి; మరలిరండి

**తా :** వయస్సు అయిదేండ్లు, అయినా కన్నతండ్రి నయిన నా పద్ధతిని నిందిస్తున్నాడు, ఏ కొద్దిభయమూ లేకుండా నాకు శత్రువైన విష్ణువును పొగడుతున్నాడు, పిల్లవాడు గదా! అని వారిస్తే వినడు. వీడి తీరు చూడగా, కుమారునిరూపాన, శరీరంలో రోగం పుట్టినట్లుగా ఉంది. రాక్షసులారా! వీణ్ణి తీసికొనిపోయి చంపి రండి. మీ మీ సమర్థతలు వీణ్ణి సంహరించడంలో ప్రదర్శించండి.

**విశే :** తనయుని మీద తండ్రికి కసి – ద్వేషం పెరిగింది. తన వంశనాశకుడైన వ్యక్తిని పనిగట్టుకొని కీర్తిస్తూ, ముల్లోకాలలో ఎదురులేని తనను ధిక్కరిస్తూ, తృణీకరిస్తూ, ఆ అయిదేళ్ళ పిల్లవాడు తనకు ప్రత్యర్థిగా నిల్వడం రాక్షసరాజు జీర్ణించుకోలేకపోతున్నాడు మరి!

**శా. అంగవ్రాతములోఁజికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే**
**షాంగశ్రేణికి రక్ష సేయు క్రియ నీ యజ్ఞుం గులద్రోహి దు**
**స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో**
**త్తుంగఖ్యాతిఁజరించెదం, గులము నిర్దోషంబు గావించెదన్. 188**

**ప్రతి :** చికిత్సకుఁడు= వైద్యుడు; అంగవ్రాతములోన్= అవయవసమూహంలో; దుష్ట+అంగంబు= చెడిన అవయవాన్ని, రోగగ్రస్తభాగాన్ని; ఖండించి= నరికివేసి; శేష+అంగశ్రేణికిన్= మిగిలిన అవయవాల వరుసకు; రక్ష= రక్షణ; చేయుక్రియన్= చేసేవిధంగా, కల్పించే తీరుగా; ఈ+అజ్ఞున్= ఈ తెలియనివానిని; కులద్రోహిన్= వంశనాశకుని; దుస్సంగున్= దుష్టసహవాసంకలవానిని; కేశవపక్షపాతిన్= విష్ణుపక్షం వహించువానిని; అధమున్= నీచుని; చంపించి= వధింపజేసి; వీరవ్రత+ఉత్తుంగఖ్యాతిన్= వీరచరిత్రగలవాడిని అను మిక్కిలిఎత్తైన ఎంతో గొప్ప కీర్తితో; చరించెదన్= ప్రవర్తిస్తాను; కులమున్= వంశాన్ని; నిస్+దోషంబు= దోషంలేని దానినిగా, కావించెదన్= చేస్తాను.

**తా :** వైద్యుడు రోగికి అవసరమైనపుడు, ఆతని శరీరంలో ఒక భాగానికి మాననిరోగం ఏర్పడినపుడు, ఆ రోగం కారణంగా మొత్తం శరీరమే రోగగ్రస్తమయ్యే ప్రమాదమున్నపుడు, ఆ రోగంవున్న అవయవాన్ని ఖండించి, తొలగించి, మిగిలిన శరీరభాగాన్నంతటినీ రక్షిస్తాడు. ఆ ఒక్కభాగం కారణంగా మొత్తం శరీరం పాడుగావడం సహించడు. అనుమతించడు. అదే విధంగా రాక్షసవంశాన నా తనయుని రూపంలో వ్యాధి ఒకటి పుట్టుకొచ్చింది. దీనిని ఈ విధంగా వదలివేస్తే, నా రాక్షసవంశ శరీరమంతా ఈ వ్యాధివ్యాపించి, మొదటికే మోసం జరగవచ్చు. కాబట్టి నా కులానికి పుండువంటి ఈ పుత్రుణ్ణి తెగటార్చి నా అన్వయాన్ని రక్షించుకుంటాను. కొడుకునైనా కులరక్షణకై కడతేర్చిన గొప్పవాడు అనే మహాకీర్తిని వహిస్తాను. కులాన్ని దోషరహితంచేసి తీరుతాను.

**విశే :** వ్యక్తి తాను చేసే మంచిచెడ్డలకు కారణాలు చూపడానికి ప్రయత్నిస్తాడు. తాను ఉన్నతాసనంపైన ఉన్నపుడు, ఇక్కడ హిరణ్యకశిపుడు అదే చేస్తున్నాడు. తానుచేసే పుత్రవధను తాను సమర్థించుకొంటున్నాడు.

ఈ పద్యంలోని 'వీరవ్రతం' పరిశీలించదగింది. సమరమని లేదా పోరాటమని నిశ్చయం అయ్యాక తన కెదురయినవారందరు విరోధులే. అహితులే. ఆ కారణంవలన ప్రహ్లాదుడు కూడా అహితుడే. పోరాటంలో అహితుణ్ణి తన బాటనుండి తప్పించడం సమరాలలో పాటించే వీరకృత్యం. ఇదే వీరవ్రతం. ఈ 'వీరవ్రతం' కారణంగానే హిరణ్యకశిపుడు తపస్సు చేశాడు.

కేశవుడు – శోభనమైన కేశములు కలవాడు, కేశి అను రాక్షసిని సంహరించినవాడు. విష్ణువు శివుడు తానే అయినవాడు. బ్రహ్మ రుద్రులు ఈయనయందు జన్మించారు. బ్రహ్మ విష్ణు రుద్రాత్మకుడైనవాడు.

**క. హంతవ్యుఁడు రక్షింపను, మంతవ్యుఁడు గాఁడు యముని మందిరమునకున్**
**గంతవ్యుఁడు వధమున కుప, రంతవ్యం డనక చంపి రం డీ పడుచున్. 189**

**ప్రతి :** హంతవ్యుఁడు= చంపవలసినవాడు; రక్షింపను= కాపాడుటకు; మంతవ్యుఁడు కాఁడు= ఆలోచింపదగ్గవాడు కాదు; యమునిమందిరమునకున్= యమధర్మరాజు ఇంటికి, యమలోకానికి (సంయమనీపురానికి); గంతవ్యుఁడు= వెళ్ళవలసినవాడు; వధమునకున్= చంపుటకు; ఉపరంతవ్యుఁడు+అనక= మానవలసినవాడు అనకుండా; ఈ పడుచున్= ఈ కుర్రవానిని; చంపి+రండు= వధించిరండి.

**తా :** దనుజేంద్రుడు ప్రహ్లాదుని యెడ దయ చూపరాదంటున్నాడు, వీడు ముమ్మాటికి చంపవలసినవాడే. పోనీపాపం! రక్షిద్దామని అనుకోడానికిగూడ అర్హుడు గాడు. వాడు వెళ్ళవలసినది యమధర్మరాజుగృహానికి మాత్రమే. ఇంకెక్కడికీ కాదు. కాబట్టి, నిర్బంధంగా చంపిగాని మరలి రావద్దు.

**వ. అని దానవేంద్రుం డానతిచ్చిన వాఁడికోఱలు గల రక్కసులు పెక్కండ్రు శూలహస్తులై వక్త్రంబులు దెఱచికొని యుబ్బి బొబ్బలిడుచు ధూమసహితదావదహనంబునుంబోలెఁదామ్రసంకాశంబు లయిన కేశంబులు మెఱయ భేదన వాదనచ్ఛేదనంబులు సేయుచు. 190**

**ప్రతి :** అని= చెప్పి; దానవేంద్రుండు= రాక్షసరాజు; ఆనతి+ఇచ్చినన్= ఆజ్ఞచేయగా; వాఁడికోఱలుగల= పదునైన దంతాలుగల (బయటకు వచ్చికనబడేవి); రక్కసులు= రాక్షసులు; పెక్కండ్రు= చాలామంది; శూలహస్తులు+ఐ= చేతుల్లో శూలాలను కల్గినవారై; వక్త్రంబులు= నోళ్ళు; తెఱచికొని= పెద్దవిగా చేసికొని; ఉబ్బి= ఉత్సాహంతో; బొబ్బలు+ఇడుచున్= పెనుశబ్దాలుచేస్తూ; ధూమ= పొగతో, సహిత= కూడిన; దావదహనంబు= అడవినిప్పు, కార్చిచ్చు; పోలెన్= వలె; తామ్రసంకాశంబులు+అయిన= రాగివంటి; కేశంబులు= వెంట్రుకలు; మెఱయన్= ప్రకాశింపగా; భేదన వాదన+ఛేదనంబులు చేయుచున్= పగులగొట్టుట, మాట్లాడుట; నరుకుటలు అనే ఈ మూడు పనులుచేస్తూ...

**తా :** అని రాక్షసరాజు పల్కినవెంటనే వాడికోరలున్న చాలమంది రాక్షసులు చేతుల్లో శూలాలను ధరించి ఉత్సాహంతో, నోళ్లు తెరచి పెడబొబ్బలుపెడుతూ, రాగిలోహంవంటి జుట్టుకలిగి ఒకేసారి గట్టిగా అరవడం, కొట్టడం, నరకడం చేస్తూ

**ఉ. బాలుఁడు రాచబిడ్డఁడు కృపాళుఁడు సాధుఁడు లోకమాన్య సం**
**శీలుఁడు వీఁ డ వధ్యుఁడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై**
**శూలములందదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్ర వా**
**చాలత నందఱున్ దివిజశత్రుఁడు వల్దనఁడయ్యె భూవరా! 191**

**ప్రతి :** భూవరా!= రాజా!; అందఱున్= దానవులు ఎల్లరును; సుస్థిరులై= దృఢ నిర్ణయం కలవారై (ఇంకో ఆలోచన లేకుండా);వీఁడు= ఇతడు (ఈ రాజకుమారుడు); బాలుఁడు= చిన్న పిల్లవాడు; రాచబిడ్డఁడు= రాజకుమారుడు; కృపాళుఁడు= దయాశీలుడు; సాధుఁడు= మంచివాడు; లోకమాన్యసంశీలుఁడు= లోకంచే గౌరవింపదగిన మంచి స్వభావంగలవాడు; (కావున) అవధ్యుఁడని= చంపదగినవాడు కాదని; చిక్కక= వెనుకాడక; స్రుక్కక= బాధపడక; క్రూరచిత్తులై= దయలేని మనస్సు గలవారై; తద్+అంగములన్= అతని అవయవాలను; శూలములన్= బల్లేలతో; ఉగ్రవాచాలతన్= భయంకరమైన వదరుబోతుతనంతో; ప్రహరించిరి= పొడిచిరి; దివిజశత్రుఁడు= హిరణ్యకశిపుడు; వల్దు+అనఁడయ్యెన్= వద్దు అని పల్కలేదు.

**తా :** మహారాజా! ఆ రాక్షసులందరు ప్రహ్లాదుని జూచి, అయ్యో! ఇతడు చిన్నపిల్లవాడు, రాజపుత్రుడు, పైగా దయాశీలి. కాబట్టి, చంపదగ్గవాడు కాదు–అని అనుకోకుండా క్రూరంగా భయంకర దూషణలతో ఏమరపాటులేకుండా తమ బల్లేలతో అతని అవయవాలను పొడిచి హింసించారు. ఆ హింసాచరణను హిరణ్యకశిపుడు ఏమాత్రం వద్దనలేదు.

**విశే :** ప్రహ్లాదుడు అవధ్యుడనడానికి కారణాలుగా కవి అయిదు విశేషణాలు వాడాడు. అవి బాలుడు, రాజకుమారుడు, జనులపై దయగలవాడు. సాధుశీలం కలవాడు, సుశీలుడు. ఇవన్నీ ఏపాటి మనసున్నవాడైనా కనికరించి వదలివేయ దగ్గవే. మొదట అతడు బాలుడు. స్త్రీ బాలవృద్ధులు అవధ్యులనేది జగమెరిగిన నీతి. చివరగా అతడు లోకం మెచ్చిన శీల సంపదగలవాడు. అయినా క్రూరచిత్తుల కది పట్టలేదు.

**చ. పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రము**
**నొ్నలియదు, లోపలన్ రుధిర ముబ్బదు, కందదు, శల్యసంఘమున్**
**నలియదు, దృష్టివైభవము నష్టము గాదు, ముఖేందుకాంతియుం**
**బొలియదు, నూతనశ్రమము పుట్టదు, పట్టదు దీనభావమున్. 192**

**ప్రతి :** పలువురు= అనేకులు; దానవుల్= రాక్షసులు; పొడువన్= గ్రుచ్చగా; బాలునిదేహము= పిల్లవాని శరీరం; లేశమాత్రమున్= కొంచెం గూడ; ఒలియదు= చర్మమూడిపోదు; లోపలన్= లోపలిభాగంనుండి; రుధిరము= నెత్తురు; ఉబ్బదు= ఉబుకదు – పైకిరాదు; కందదు= కందిపోదు; శల్యసంఘమున్= ఎముకల సమూహంగూడ; నలియదు= నలుగదు, నుగ్గుగాదు; దృష్టివైభవము= చూపు అనే సంపద; నష్టము+కాదు= నశించినదిగాదు; ముఖ+ఇందుకాంతియున్= మొగము అనే చంద్రుని వెలుగుగూడ; పొలియదు= నశింపదు; నూతనశ్రమము= కొత్తవేదన, బాధ; పుట్టదు= ఏర్పడదు; దీనభావమున్= దైన్యముగూడ; పట్టదు= కలుగదు.

**తా :** ఎందరో దానవులు కలిసి శూలాలతో పొడిచినా ప్రహ్లాదుని ఒడలు ఏమాత్రం చిట్లలేదు. ఒడలిలోపలిభాగంలో అయినా రక్త ముబ్బలేదు. అసలు అతని దేహం కందనైనా కందలేదు. ఎముకలు విరుగలేదు, కంటిచూపు తగ్గలేదు. ముఖసౌందర్యం క్షీణించలేదు–చంద్రబింబంవంటి ముఖం కాంతిమంతంగానే ఉంది. బల్లెపుపోటులవల్ల కొత్తబాధయినా ఆ దేహాన పొడకట్టదు. ఇంత జరిగినా ఆ బాలునిలో దీనత్వం కనబడలేదు.

**ఉ. తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుఁడు మాటి మాటి 'కో**
**పన్నగశాయి! యో దనుజభంజన! యో జగదీశ! యో మహా**

పన్నశరణ్య! యో నిఖిలపావన!' యంచు నుతించుఁగాని తాఁ
గన్నుల నీరు దేఁడు, భయకంపసమేతుఁడు గాఁడు భూవరా! 193

ప్రతి : దైత్యకుమారుఁడు= రాక్షసబాలుడు; తన్నున్= తనను; నిశాచరుల్= రాక్షసులు; పొడువన్= శూలాలతో పొడువగా; మాటిమాటికిన్= తడవ తడవకు, ప్రతిపర్యాయం; ఓ పన్నగశాయి!= ఓ పాముపై పరుండేవాడా!; ఓ దనుజభంజన!= ఓ దానవులను సంహరించేవాడా!; ఓ జగద్+ఈశ= ఓ లోక నాయకా!; ఓ మహా+ఆపన్నశరణ్య= ఆపదలో ఉన్నవారి పాలిటికి గొప్ప దిక్కైనవాడా! ఓ నిఖిలపావన!= ఓ అంతటిని, అందరిని పవిత్రం చేసేవాడా!; అంచున్= అని పలుకుతు; నుతించున్+కాని= స్తోత్రం చేయునే గాని; తాన్= తాను; కన్నులన్= కన్నులలో; నీరు+తేఁడు= నీరు రానీడు, ఏడ్వడు; భూవరా!= ఓ రాజా!; భయకంప సమేతుఁడు+కాఁడు= భయంతో ఏ మాత్రం వణకడు.

తా : ఆ రాక్షససేన తనను ఆవిధంగా ఎంత పొడిచినా ఆ బాలుడు మాత్రం ఏడ్వడం లేదు, బెదరిపోయి వణకడం లేదు. పైగా మాటిమాటికి ఆ దేవదేవుని, ఓ పన్నగశాయీ! ఓ జగదీశా! ఓ ఆపన్నశరణ్యా! అంటూ పలువిధాల స్తుతిస్తున్నాడు.

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు, బాహువు లొడ్డఁడు, బంధురాజిలోఁ
దూఱఁడు, ఘోరకృత్య మని దూఱఁడు తండ్రిని, మిత్రవర్గముం
జీరఁడు, మాతృసంఘము వసించు సువర్ణగృహంబులోనికిం
దాఱఁడు, కావరే యనఁడు, తాపము నొందఁడు కంటగింపఁడున్. 194

ప్రతి : లేచి= నిలబడి; దిక్కులకున్= ఆ దిక్కునకు ఈ దిక్కునకు; పాఱఁడు= పారిపోడు; బాహువులు= చేతులు; ఒడ్డఁడు= అడ్డుపెట్టడు; బంధురాజిలోన్= చుట్టాల వరుసలో; తూఱఁడు= ప్రవేశింపడు; ఘోరకృత్యము+అని= భయంకరమైన (చేయరాని) పని అని; తండ్రిని= కన్నతండ్రిని; దూఱఁడు= నిందింపడు; మిత్రవర్గమున్= స్నేహితుల సమూహాన్ని; చీరఁడు= పిలువడు; మాతృసంఘము= తల్లుల సముదాయం; వసించు= నివసించు; సువర్ణ గృహంబులోనికిన్= బంగారు ఇంటిలోనికి; తాఱఁడు= ప్రవేశించడు; కావరే!= రక్షించండి (అని); అనఁడు= పలుకడు; తాపమున్= వేదనను; ఒందఁడు= పొందడు;కంటగింపఁడున్= విరోధించడు, కోపగించడుకూడ.

తా : రాక్షసుల బల్లెములకు చిక్కి బాధించబడే బాలుడు ప్రహ్లాదుడు, అక్కడినుండి లేచి అటు ఇటు పరుగెత్తడు. ఆ శూలాల పోట్లు తప్పించుకొనడానికి చేతులైనా అడ్డుపెట్టడు. దగ్గరున్న చుట్టాలగుంపులో దూరి ఆ పోటులనుండి రక్షణపొందడానికి ప్రయత్నించడు. రక్షణకోసం సమీపానగల రాణివాసం-బంగారుగృహంలోనికయినా వెళ్ళడు. 'రక్షించండి' అంటూ అరవనైనా అరవడు. అసలు ఆ శూలఘాతాలకు బాధపడుతున్నట్లయినా కన్పడడు. ఇంత హింసకు గురౌతున్నా అతనిలో కంటగింపు ఏమాత్రం కనబడదు. నిమ్మకు నీరెత్తినట్లు స్థిమితంగా ఉన్నాడు.

వ. ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టి దని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై య మ్మహావిష్ణునియందుఁ జిత్తంబుఁ జేర్చి తన్మయుండయి పరమానందంబునం బొంది యున్న ప్రహ్లాదునియందు రాక్షసేంద్రుండు దన కింకరుల చేతం జేయించుచున్న మారణకర్మంబులు పాపకర్ముని యందుఁ బ్రయుక్తంబులైన సత్కారంబులుంబోలె విఫలంబు లగుటం జూచి. 195

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సర్వాత్మకంబై= సర్వమూ ఆత్మలో కల్గినదై; ఇట్టిది+అట్టిది+అని= ఈ విధమైనది; ఆ తెరగైనది అని; నిర్దేశింపరాని= స్పష్టం చేయలేని; పరబ్రహ్మంబున్= పరమాత్మ; తాను+అ+ఐ= తానుగానే అయి ఉండి; ఆ+మహావిష్ణునియందున్= ఆ శ్రీహరిపై; చిత్తంబున్= మనస్సును; చేర్చి= నిలిపి; తద్+మయుండయి= ఆ పరమాత్మయందే లీనమైనవాడై; పరమ+ఆనందంబునన్= గొప్ప ఆనందంలో; పొందియున్న= చేరి ఉన్న, తానే ఆనందమూర్తి అయిన; ప్రహ్లాదునియందున్= బాలునిపట్ల; తనకింకరులచేతన్= తన సేవకులచేత; చేయించుచున్న= జరిపిస్తున్న; మారణకర్మంబులు= చంపే పనులు; పాపకర్ముని+అందున్= పాపాత్మునియెడ; ప్రయుక్తంబులు+ఐన= ప్రయోగింపబడిన; సత్కారంబులున్+ పోలెన్= సత్క్రియలవలె, పుణ్యకార్యాలవలె; విఫలంబులు+అగుటన్+చూచి= నిష్ఫలాలు కావడం కనుగొని...

**తా :** రాక్షససేన క్రూరకృత్యాలు ఒకవైపు ప్రహ్లాదుని శరీరంపై కొనసాగుతుండగా, ఆ భక్తుడు మాత్రం తన మనస్సును మహావిష్ణువునందు లగ్నంజేసి, తానే ఆ పరబ్రహ్మస్వరూపం వహించినట్లు, అంతటానిండి ఉండే పరమాత్మగా తానే మారిపోయినట్లు నిశ్చలంగా నిర్వికారంగా నిలిచి ఉన్నాడు. ఆ దృశ్యం చూచిన హిరణ్యకశిపుడు, పాపియెడ ప్రయుక్తాలయిన సత్క్రియలవలె తన మారణ ప్రయత్నాలన్నీ నిష్ఫలాలై నిలవడం చూస్తూ తనలో తాను ఇలా తలపోస్తున్నాడు.

**ఉ. శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపఁగా**
**బాలుఁడు నేలపైఁబడఁడు, పాఱఁడు, చావఁడు, తండ్రినైన నా**
**పాలికి వచ్చి చక్రధరపక్షము మానితి నంచుఁబాదముల్**
**ఫాలము సోఁక మ్రొక్కఁ, డనపాయత నొందుట కేమి హేతువో? 196**

**ప్రతి :** బాలుఁడు= పిల్లవాడు (ప్రహ్లాదుడు), నిశాచరులు= రాక్షసులు; స్రుక్కక= భయపడక; దేహమున్= శరీరాన్ని; నిగ్రహింపన్+కాన్= హింసించగా; నేలపైన్= భూమిమీద; పడఁడు= పడిపోడు; పాఱఁడు= పరుగెత్తడు; చావఁడు= చనిపోడు; తండ్రిని+ఐన+నాపాలికిన్= కన్నవాడినైన నా దగ్గరకు; వచ్చి= ఏ తెంచి; చక్రధరపక్షమున్= విష్ణువుపై అభిమానం; మానితిన్+అంచున్= వదలితిని అంటూ; పాదముల్= (నా) కాళ్ళు; ఫాలము= (తన)నొసలు; సోఁకన్= తాకగా; మ్రొక్కఁడు= నమస్కరించడు; అనపాయతను= అపాయము లేకుండుటను; ఒందుటకున్= పొందుటకు; ఏమి హేతువో= ఏమి కారణమో!

**తా :** వీడు పసివాడు. రాక్షసులు నిరంతరం శూలాలతో పొడిచి హింసించినా క్రిందపడడు. భయపడి పారిపోడు. బల్లెములతో పొడిచినా చావడు. తన తండ్రినైన నన్ను చేరి, శ్రీహరి పక్షం మానివేశాను అని అంటూ నా కాళ్ళమీద తన నొసలు ఆనించి నమస్కరించడు. ఇవన్నీ జరుగకున్నా, ఏ ఆపదా, గాయము లేకుండా ఎలా ఉండగల్గుతున్నాడు? దీనికి ఏమి కారణమో?

**విశే :** ఇన్ని కష్టాలుపడుతున్నా ప్రహ్లాదుడు పరబ్రహ్మ స్వరూపమైన విష్ణువు తాను అనే భావంతో, తన్మయత్వంతో వుండడంచేత శారీరక శిక్షలేవి అతనికి అంటలేదు.

**వ. అని శంకించుచు. 197**

**ప్రతి :** అని శంకించుచున్= ఈ విధంగా అనుమానిస్తూ...

**తా :** అని ఇలా సందేహపడుతూ

సీ. ఒకమాటు దిక్కుంభియూథంబుఁ దెప్పించి కెరలి డింభకునిఁద్రొక్కింపఁబంపు,
నొకమాటు విషభీకరోరగశ్రేణులఁగడువడి నర్భకుఁగఱవఁబంపు,
నొకమాటు హేతిసంఘోగ్రానలములోన విసరి కుమారుని వ్రేయఁబంపు,
నొకమాటు కూలంకషోల్లోలజలధిలో మొత్తించి శాబకు ముంపఁబంపు,

ఆ. విషముఁబెట్టఁబంపు విదళింపఁగాఁబంపుఁ, దొడ్డకొండ చఱులఁద్రోయఁబంపుఁ
బట్టికట్టఁబంపు బాధింపఁగాఁబంపు, బాలుఁగినిసి దనుజపాలుఁడధిప! 198

**ప్రతి :** అధిప! = రాజా!; దనుజపాలుఁడు = రాక్షసరాజు; కినిసి = కోపగించి; బాలున్ = పిల్లవానిని (ప్రహ్లాదుని); ఒకమాటు = ఒకసారి; దిక్+కుంభియూథంబున్ = దిగ్గజాల సమూహాన్ని; తెప్పించి = రావించి; కెరలి = అతిశయించి; డింభకునిన్ = పిల్లవానిని; త్రొక్కింపన్+పంపున్ = కాళ్ళకింద తొక్కించుటకు పంపించును; ఒకమాటు = మరొకపర్యాయం; విషభీకర+ఉరగశ్రేణులన్ = భయంకరమైన విషంకలిగిన పాముల గుంపుతో; కడువడిన్ = మిక్కిలివేగంగా; అర్భకున్ = బాలుని; కఱవన్ = కాటువేయడంకోసం; పంపున్ = పంపించును; ఒకమాటు = ఇంకొకతూరి; హేతిసంఘ+ఉగ్ర+అనలములోనన్ = భయంకరమైన అగ్నిజ్వాలల్లో; కుమారునిన్ = కొడుకును; విసరి వ్రేయన్ = త్రోసివేయుటకు; పంపున్ = పంపించును; ఒకమాటు = ఒకప్పుడు; కూలంకష+ఉల్లోల జలధిలోన్ = గట్టునుతాకుతూ పైకెగసిపడే (అలలుగల) సముద్రాన; శాబకున్ = అర్భకుని; మొత్తించి = కొట్టించి; (అణచి) ముంపన్ = ముంచుటకు; పంపున్ = పంపించును; విషమున్+పెట్టన్+పంపున్ = విషము తినిపించుటకై పంపును; విదళింపఁగాన్+పంపున్ = నరుకుటకై పంపును; దొడ్డకొండచఱులన్ = పెద్దకొండలపైనుండి; త్రోయన్+పంపున్ = తోసి పడవేయుటకై పంపును; పట్టికట్టన్ = పట్టుకొని బంధించుటకై; పంపున్ = పంపును; బాధింపఁగాన్+పంపున్ = హింసించుటకై పంపును.

**తా :** ఏ విధంగానైనా, తప్పక చంపవలసిందే అనే తలపుతో రాక్షసరాజు తన కుమారుణ్ణి, దిగ్గజాల కాళ్ళక్రింద తొక్కించాడు. భయంకర విషసర్పాలతో కరిపించాడు. జ్వాలలుపైకెగసే నిప్పులో తోయించాడు. గట్లుదాకి పైకెగసిపడే అలలుగల సముద్రంలో ముంచేందుకు పంపాడు. విషం పెట్టి, నరికి, కొండలపైనుండి తోసి, కట్టిపడవేసి, హింసించి ఇలా నానావిధాల చంప జూచాడు.

సీ. ఒకవేళ నభిచారహోమంబు సేయించు నొకవేళ నెండల నుండఁబంచుఁ,
నొకవేళ వానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కఁ బట్టు,
నొకవేళఁదనమాయ నొదవించి బెగడించు నొకవేళ మంచున నొంటి నిలుపు
నొకవేళఁబెనుగాలి కున్ముఖుఁగావించు నొకవేళఁబాఁతించు నుర్వియందు,

తే. నీర మన్నంబు నిడనీక నిగ్రహించుఁ, గశల నడిపించు ఱువ్వించు గండశిలల
గదల వ్రేయించు, వేయించు ఘనశరములఁ, గొడుకు నొకవేళ నమరారి క్రోధి యగుచు,199

**ప్రతి :** అమర+అరి = దేవతలవిరోధియైన రాక్షసరాజుహిరణ్యకశిపుడు; క్రోధి+అగుచున్ = కోపంకలవాడై; ఒకవేళన్ = ఒక సమయంలో; అభిచారహోమంబున్ = చంపించే యజ్ఞాన్ని; చేయించున్ = చేయిస్తాడు; ఒకవేళన్ = ఒకసారి; ఎండలన్ =

మండుటెండలలో; ఉండన్+పంచున్= నిలుచుటకై పంపించును; ఒకవేళన్= మరొకమారు; వానలన్= వర్షాలలో; ఉపహతిన్+ఒందించున్= హింసను గల్గించును; ఒకవేళన్= ఇంకొకతూరి; రంధ్రంబులు= నవరంధ్రంబులు (ముక్కు మొదలైనవి); ఉక్కన్+పట్టున్= బిగబట్టును; ఒకవేళన్= ఇంకొకసారి; తనమాయన్= తన రాక్షసమాయను; ఒదవించి= కల్పించి; బెగడించున్= భయపెట్టును; ఒకవేళన్= మరొక వేళలో; మంచునన్= చల్లని మంచు గడ్డల్లో; ఒంటిన్ నిలుపున్= ఒంటరిగా నిలుపుతాడు; ఒకవేళన్= ఇంకోసమయంలో; పెనుగాలికి= గొప్పగాలికి; ఉత్+ముఖున్= అభిముఖమైనవానినిగా (ఎదురు నిలిచిన వానినిగా); కావించున్= చేయును; ఒకవేళన్= మరోసారి; ఉర్వియందున్= భూమిలోపల; పాఁతించున్= పూడ్చిపెట్టును; నీరము+అన్నంబున్= నీళ్ళు; కూడు (కూడు నీళ్ళు) ఇడనీక= పెట్టకుండ; నిగ్రహించున్= నిరోధించును; కశలన్= కొరడాలతో; అడిపించున్= హింసించును; గండశిలలన్= బండరాళ్ళను; ఱువ్వించున్= మీదికి విసరివేయించును; గదలన్= గదలతో; వ్రేయించున్= మోదించును; ఘనశరములన్= వాడి బాణాలను; వేయించున్= మీదికి ప్రయోగింపజేయును.

**తా :** హిరణ్యకశిపుడు కొడుకుపై పగబట్టి క్రోధంతో అనేకవిధాల నిర్బంధంగా చంపడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్నాలు ఇవి, ఒకసారి చేతబడులవంటి హోమాలతో, మరొకసారి మండుటెండలలో నిలబెట్టి, మరొక పర్యాయం వానలలో తడిపి తడిపి, ఇంకొకతూరి నవరంధ్రాలు మూసిపెట్టి, ఒకసారి తన మాయతో బెదరించి, ఇంకొకసారి మంచులో ఒంటరిగా నిలబెట్టి, ఒకసారి పెనుగాలులకు ఎదురునిల్పి, మరొకసారి భూమిలో పాతిపెట్టి, ఇంకొకవేళలో కూడు, నీళ్ళు లేకుండా జేసి, కొరడాలతో కొట్టించి, బండరాళ్ళు మీదికి త్రోయించి, గదలతో మోదించి, వాడిబాణాలతో పొడిపించి తనకు విరోధిగా మారిన కుమారుని చంప ప్రయత్నించాడు.

**విశే :** హోమాలు అనేకరకాలు. తనకోసం, తనవారికోసం చేసేవి కొన్ని. ఆ విధంగా కాకుండా శత్రువులపట్ల ద్వేషంతో చేసే హింసాత్మకమయిన హోమం అభిచారహోమం. ఇటువంటివి రహస్యంగా ఆచరించేవారు.

**వ. మఱియు ననేక మారణోపాయంబులఁ బాపరహితుండైన పాపని రూపుమాపలేక యేకాంతంబున దురంతచింతాపరిశ్రాంతుండయి రాక్షసేంద్రుండు దన మనంబున. 200**

**ప్రతి :** మఱియున్= ఇంకను; న+ఏకమారణ+ఉపాయంబులన్= పలువిధాలైన సంహరించే ప్రయత్నాలతో; పాపరహితుండు+ అయిన= పాపశూన్యుడైన; పాపనిన్= బాలుని; రూపుమాపలేక= సంహరింపలేక; ఏకాంతంబునన్= ఒంటరి ప్రదేశంలో; దుర్+అంత చింతా= తుదకు దుఃఖం కలిగించే; ఆలోచనలతో, పరిశ్రాంతుండు+ఐ= అలసినవాడై; రాక్షస+ఇంద్రుండు= దానవరాజు; తన మనంబునన్= తన మనస్సులో.

**తా :** వర్ణించినవే గాక, ఇంకా ఏవేవో ఉపాయాలతో సాధనాలతో కుమారుని చంపబోయాడు తండ్రి. కాని తనయుడు పాపరహితుడు శ్రీహరిప్రియుడు గాబట్టి చావకపోగా చెక్కు చెదరలేదు. ఇది తండ్రికి కొడుకుమీద పగబట్టినవానికి దుఃఖకారణమైన చింతగా మారింది. ఆ చింతాభారంతో అలసిపోయిన ఆ రాక్షసరాజు తనలో తాను ఈ విధంగా తలపోయసాగాడు.

**ఉ. ముంచితి వార్ధులన్, గదల మొత్తితి, శైలతటంబులందు ద్రొ**
**బ్బించితి, శస్త్రరాజిఁబొడిపించితి మీఁద నిభేంద్రపంక్తి ఁ ద్రొ**

**ప్పించితి, ధిక్కరించితి, శపించితి, ఘోరదవాగ్నులందుఁ ద్రో**
**యించితిఁ, బెక్కుపాట్ల నలయించితిఁ, జావఁ డిదేమి చిత్రమో! 201**

**ప్రతి :** వార్ధులన్= సముద్రాలలో; ముంచితిన్= మునుగజేశాను; గదలన్= గదలతో; మొత్తితిన్= కొట్టాను; శైలతటంబులు+అందున్= పర్వతసానువులలో; ద్రొబ్బించితిన్= పడదోయించాను; శస్త్రరాజిన్= అనేక ఆయుధాలతో; పొడిపించితిన్= గుచ్చునట్లు చేశాను; మీఁదన్= (అతని)మీద, పైన; ఇభ+ఇంద్రపంక్తిన్= ఏనుగుల వరుసను; తొప్పించితిన్= పరుగెత్తించాను; ధిక్కరించితిన్= ఛీత్కరించాను (అసహ్యించుకున్నాను); శపించితిన్= తిట్టాను; ఘోరదవ+అగ్నులందున్= భయంకరమైన కార్చిచ్చులో; త్రోయించితిన్= పడవేయించాను; పెక్కుపాట్లన్= అనేకమయిన రీతులలో; అలయించితిన్= హింసించాను; (అయినా) చావఁడు= చనిపోడు; ఇది+ఏమి చిత్రమో!= ఈ వింత యేమిటో తెలియదు.

**తా :** సముద్రాలలో ముంచాను, గదలతో మోదాను, కొండలపైనుండి క్రిందికి పడద్రోయించాను. ఆయుధాలతో పొడిపించాను, ఏనుగుల కాళ్ళకింద తొక్కించాను, ఛీత్కారంతో అసహ్యించుకున్నాను, తిట్టాను. భయంకరంగా అడవుల్లో నలుదిక్కులా కమ్ముకొనే నిప్పుల్లో త్రోయించాను, ఇంకా ఎన్నో హింసలపాలు జేశాను. అయినా వీడు చావడు. ఇదేమిటి విచిత్రంగా ఉంది!

**విశే :** ప్రాణి చావడానికి అవసరమైన, జీవిని సంహరించడానికి కావలసిన అన్ని ఉపాయాలూ రాక్షసరాజు తన తనయుని పట్ల ప్రయోగించి చూచాడు. తన ఘోరక్రూరయత్నాలన్నీ ఆ అర్భకునిముందు కొరగానివిగా మిగిలిపోగా అతనిలో క్రోధం భయంగా మారబోతున్నది.

**చ. ఎఱుఁగఁడు జీవనౌషధము, లెవ్వరు భర్తలు లేరు, బాధలం**
**దరలఁడు, నైజతేజమునఁదథ్యము జాడ్యము లేదు, మిక్కిలిన్**
**మెఱయుచు నున్నవాఁడొక నిమేషము దైన్యము నొందఁడింక నే**
**తెఱఁగునఁద్రుంతు? వేసరితి, దివ్యము వీని ప్రభావమెట్టిదో! 202**

**ప్రతి :** జీవన+ఔషధములు= బ్రతుకుటకొరకు (కావలసిన) మందులు; ఎఱుఁగఁడు= తెలియదు; భర్తలు= రక్షకులు, ఎవ్వరు=ఎవరుకూడ; లేరు= లేనేలేరు; బాధలన్= వెతలతో; తరలఁడు= భయపడడు; నైజతేజమునన్= సహజమైన ప్రకాశంలో; జాడ్యము లేదు= మందగింపు లేదు; మిక్కిలిన్= ఎక్కువగా; మెఱయుచున్= ప్రకాశిస్తూ; ఉన్నవాఁడు= ఉన్నాడు; ఒక నిమేషమున్= ఒక క్షణమైనా; దైన్యమున్= బేలతనాన్ని; ఒందఁడు= పొందడు; ఇంకన్= ఇంకా; ఏ తెఱఁగునన్= ఏ విధంగా; త్రుంతున్= త్రుంచుదును; వేసరితిన్= అలసిపోయాను; వీని ప్రభావము= ఇతని శక్తి, మహిమ; దివ్యము= స్వర్గలోకానికి చెందినది; ఎట్టిదో= ఎంతటిదో (ఆశ్చర్యకరమనటం).

**తా :** ఎన్నివిధాల చంపబోయినా చావకపోగా మీదు మిక్కిలి దేదీప్యమానంగా వెలుగొందుతున్నాడు. చావకుండ బ్రదికే మందు లేమైనా తెలుసా అంటే, అదీ లేదు. వీడికి రక్షకులెవరూ ఇక్కడ లేరు. పెట్టే బాధలతో బెదరడమూ లేదు. ఒక క్షణమైనా బేలగా అసహాయుడుగా కనిపించడు. వీడిని నేను ఏవిధంగా చంపాలి? అలసిపోయాను. వీడి శక్తి ఏదో దివ్యంగా, అంతుపట్టనిదిగా ఉంది.

**వ. అదియునుం గాక తొల్లి శునశ్శేపుండను మునికుమారుండు దండ్రిచేత యాగపశుత్వంబునకు దత్తుండయి తండ్రి తనకు నపకారి యని తలంపక బ్రతికిన చందంబున. 203**

**ప్రతి :** అదియున్+కాక= ఇంతే కాకుండా; తొల్లి= మునుపు; శునశ్శేపుండు+అను= శునశ్శేపుడు అనే; మునికుమారుండున్= ఋషితనయుడు, తండ్రిచేతన్= తండ్రిచేత; యాగపశుత్వంబునకున్= యజ్ఞమందు (చంపే) జంతువుగా; దత్తుండు+అయి= ఇవ్వబడి; తండ్రి= తన తండ్రి; తనకున్= తనకు; అపకారి+అని= అపకారం చేసేవాడు అని; తలంపక= అనుకోకుండ; బ్రతికిన చందంబునన్= బ్రతికిన విధంగా.

**తా :** పూర్వకాలంలో అజీగర్తుడనే ముని, తనకొడుకును శునశ్శేపుడనేవాడిని, తన జీవికకై, యజ్ఞంలో చంపే బలిపశువుగా ఇచ్చేస్తాడు. వాడు నరకంలో యముని మెప్పించి బ్రతికి తిరిగి తండ్రిని చేరుతాడు. అయినా తనను తనతండ్రి పశువుగా అమ్మినట్లు భావించడు. వాడివలెనే వీడూ (ప్రహ్లాదుడుగూడ) తనను (రాక్షసరాజును) కీడు చేసినవాడినిగా చూడడం లేదు.

**విశే :** కఠోపనిత్తులో చెప్పబడిన నచికేతుడు కూడ తండ్రి తనను యమునికి దానంచేసినప్పటికీ పితృభక్తిని కోల్పోక తండ్రి తనను స్వీకరించాలనే వరాన్ని కోరుతాడు. వేదకాలంలోని శునశ్శేపునివలె, ఉపనిషత్కాలంలోని నచికేతునివలె ఇతిహాసకాలంలో శ్రీరామునివలె, పురాణకాలంలో ప్రహ్లాదుడు పితృభక్తి తత్పరుడు.

**క. ఆగ్రహమున నేఁ జేసిన, నిగ్రహములు పరులతోడ నెఱి నొకనాఁడున్**
**విగ్రహము లనుచుఁ బలుకఁ డ, నుగ్రహములుగా స్మరించు, నొవ్వఁడు మదిలోన్. 204**

**ప్రతి :** నేన్= నేను; ఆగ్రహమునన్= కోపంతో; చేసిన నిగ్రహములు= చేసిన అణచివేతలను; నిగ్రహములు+అనుచున్= కలహాలంటు; నెఱిన్= వరుసగా; ఒకనాఁడున్= ఒక్కసారిగూడ; పరులతోడన్= ఇతరులతో; పలుకఁడు= అనడు; మదిలోన్= మనస్సులో; అనుగ్రహములుగాన్= దయాగుణములుగానే; స్మరించున్= తలచాడుకాని; నొవ్వఁడు= నొప్పిచెందడు.

**తా :** నేను క్రోధంతో తనను అణచడానికి చేసిన, చేయగూడని క్రూరకర్మలన్నిటినీ మనస్సులో తనకు చేసిన ఉపకారాలుగానే భావిస్తాడు. కాని ఇతరులతోగూడ చెడుగా చెప్పడు. తాను బాధపడటమూ ఉండడు.

**వ. కావున వీఁడు మహాప్రభావ సంపన్నుండు, వీని కెందును భయంబు లేదు, వీనితోడి విరోధంబునం దనకు మృత్యువు సిద్ధించు నని నిర్ణయించి చిన్నవోయి ఖిన్నుండై ప్రసన్నుండు గాక క్రిందు సూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంతనంబునఁజండామర్కు లిట్లనిరి. 205**

**ప్రతి :** కావునన్= పైకారణంచేత; వీఁడు= ఈ ప్రహ్లాదుడు; మహాప్రభావసంపన్నుండు= గొప్పశక్తిగలవాడు; వీనికిన్= ఇతనికి; ఎందునున్= ఏ విషయంలోను, భయం లేదు; వీనితోడి విరోధంబునన్= ఇతని పగతో; తనకు మృత్యువు= తనకు చావు; సిద్ధించున్= కలుగుతుంది; అని నిర్ణయించి= అని నిశ్చయించి; చిన్న+పోయి= చిన్నబుచ్చుకొని (సిగ్గుపడి); ఖిన్నుండు+ఐ= ఖేదం (దుఃఖం)గలవాఁడై; ప్రసన్నుండుగాక= శాంతిని పొందలేక; క్రిందు+చూచుచున్= తలవంచి నేలను చూస్తూ; విషణ్ణుండు+ఐ= విషాదాన్ని పొందినవాడై; చింతనంబు+చేయుచున్న= ఆలోచన చేస్తున్న, రాజునకున్= ప్రభువుకు; మంతనంబునన్= ఆలోచనలో; చండామర్కులు= శుక్రాచార్యుని కుమారులు, ఇట్లు+అన్నారు= ఇట్లా అన్నారు.

**తా :** ప్రహ్లాదునితో పగకారణంగా హిరణ్యకశిపుడు, తనకు చావు గలుగుతుందని, ప్రహ్లాదుడు మహాశక్తి సంపన్నుడని నిశ్చయించుకొని ఖిన్నుడై చేష్టలుడిగి క్రిందిచూపులు చూస్తూ విషాదంలో మునిగి ఉండగా గురుపుత్రులు సమీపించి ఇలా అంటున్నారు.

**విశే :** హిరణ్యకశిపుడు తాను వేయించిన శిక్షలకు లొంగని ప్రహ్లాదుని దైవాంశ సంభూతునిగా భావించి శాపం వలన తనకు మరణమాసన్నమైనదని మనస్సులో అనుకొని చింతిస్తున్నాడు.

**శా. శుభ్రఖ్యాతివి; నీ ప్రతాపము మహాచోద్యంబు దైత్యేంద్ర! రో**
**షభ్రూయుగ్మవిజృంభణమ్మున దిగీశవ్రాతముంబోరులన్**
**విభ్రాంతంబుగఁజేసి యేలితి గదా విశ్వంబు! వీఁడెంత? యీ**
**దభ్రోక్తుల్ గుణదోషహేతువులు, చింతంబొంద నీకేటికిన్. 206**

**ప్రతి :** దైత్య+ఇంద్ర= రాక్షసరాజా!; శుభ్రఖ్యాతివి= స్వచ్ఛమైన కీర్తిగలవాడవు; నీ ప్రతాపము= నీ పరాక్రమం; మహాచోద్యంబు= ఎంతో ఆశ్చర్యకరం; రోష= క్రోధంగల; భ్రూ= కనుబొమల; యుగ్మ= జంటయొక్క; విజృంభణమ్మునన్= గట్టి కదలికలతో; దిక్+ఈశవ్రాతమున్= దిక్పాలకులందరిని; విభ్రాంతంబుగన్+చేసి= భయభ్రాంతుల పాలైనవారినిగా చేసి; విశ్వంబు= ప్రపంచాన్ని; ఏలితి+కదా!= ఏలినావు గదా!; వీఁడు+ఎంత?= ఈ అర్భకుడెంత; ఈ దభ్ర+ఉక్తుల్= ఈ అబద్ధపు మాటలు; గుణదోషహేతువులు= మంచి చెడులకు కారణాలు; నీకున్= రాజువైన నీకు; చింతన్+పొందన్= విచారం పొందుట; ఏటికిన్= ఎందుకు?

**తా :** రాక్షసరాజా! నీ ప్రతాపం ఆశ్చర్యకరం. నీ కీర్తి స్వచ్ఛమై మెరుస్తున్నది! నీవు సామాన్యుడివి కావు. యుద్ధాలలో నీ కనుబొమలు క్రోధంతో కదిలితే చాలు. దిక్పాలకులు బెదరిపోతారు. ఈ సమస్త విశ్వాన్ని ఎదురులేకుండా ఏలినవాడివి. అట్టి నీకు ఈ అర్భకుడెంత? వీడి అబద్ధపు సంభాషణలు నీవు లెక్కించదగినవి కావు సుమా!

**శా. వక్రుండైన జనుండు వృద్ధగురుసేవంజేసి మేధానయో**
**పక్రాంతిన్ విలసిల్లు, మీఁదట వయఃపాకంబుతో బాలకున్**
**శక్రద్వేషణబద్ధుఁజేయుచు మదింజాలింపుమీ రోషమున్,**
**శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం డయ్యెడున్. 207**

**ప్రతి :** వక్రుండు+ఐన జనుండు= వంకరవాడైన నరుడు; వృద్ధగురుసేవన్+చేసి= పెద్దలైన; గురువులచెంత సేవచేసి; మేధానయ+ఉపక్రాంతిన్= బుద్ధి నీతిచేరుటవలన; విలసిల్లున్= ప్రకాశించును; మీఁదటన్= ఆపైన; వయస్+ పరిపాకంబుతోన్= ఏండ్లు పైబడుటతో; బాలకున్= పిల్లవానిని; శక్రద్వేషణబద్ధున్+చేయుచున్= ఇంద్రద్వేషానికి గురిచేస్తూ; మదిన్= మనస్సున; ఈ రోషమున్= ఇప్పుడున్న క్రోధాన్ని; చాలింపుము= ఆపుము; శుక్ర+ఆచార్యులు వచ్చునంతకున్= శుక్రాచార్యులు వచ్చేవరకు; ఇతఁడున్= ఈ బాలుడుగూడ; సుశ్రీయుతుండు+అయ్యెడున్= మంచి శుభగుణాలు గలవాడు కాగలడు.

**తా :** నరుడు మొదట బాల్యంలో చెడుప్రవర్తన గలవాడైనా, పెద్దలైన గురువులవద్ద సేవ చేసి తన తెలివి తేటలను నీతి నియమాలనూ మార్చుకొని ప్రకాశిస్తాడు. ఆ తరువాత వయస్సు పెరిగి సక్రమంగా వ్యవహరిస్తాడు. ఈ బాలుడుగూడ

మున్ముందు ఇంద్ర ద్వేషిగా మారగలడని (మార్చగలనని) భావించి నీ రోషాన్ని చాలించు. శుక్రాచార్యులు వచ్చిన తరువాత అంతా చక్కబడుతుంది. అంతవరకు ఈ ప్రహ్లాదుడు గూడ సరిగా నడుచుకుంటాడు.

**వ. అని గురుపుత్రులు పలికిన రాక్షసేశ్వరుండు గృహస్థులైన రాజులకు నుపదేశింపఁ దగిన ధర్మార్థకామంబులు ప్రహ్లాదునకు నుపదేశింపుఁడని యనుజ్ఞ చేసిన వారు నతనికిఁ ద్రివర్గంబు నుపదేశించిన, నతండు రాగద్వేషంబులచేత విషయాసక్తులైన వారలకు గ్రాహ్యంబులైన ధర్మార్థకామంబులు దనకు నగ్రాహ్యంబు లనియును, వ్యవహార ప్రసిద్ధికొఱకైన భేదంబుగాని యాత్మభేదంబు లేదనియును, ననర్థంబులయం దర్థకల్పన సేయుట దిగ్భ్రమం బనియును నిశ్చయించి గురూపదిష్ట శాస్త్రంబులు మంచివని తలంపక గురువులు దమ గృహస్థ కర్మానుష్ఠానంబులకుం బోయిన సమయంబున. 208**

**ప్రతి :** గురుపుత్రులు= శుక్రాచార్యుని కొడుకులు; అని, పలికినన్= అని పలుకగా; రాక్షస+ఈశ్వరుండు= రక్కసులరాజు; గృహస్థులైన= గృహస్థాశ్రమంలో ఉన్న, రాజులకు+ఉపదేశింపన్+తగిన= బోధించ వలసిన; ధర్మ+అర్థకామంబులు= ధర్మం, అర్థం, కామం అనే మూడు పురుషార్థాలు, ప్రహ్లాదునకున్; ఉపదేశింపుఁడు+అని= బోధించండని, అనుజ్ఞచేసినన్= అనుమతినివ్వగా; వారున్= ఆ గురుపుత్రులుగూడ; అతనికిన్, త్రివర్గంబున్= ధర్మ అర్థకామాలను; ఉపదేశించినన్= బోధించగా, అతండు; రాగద్వేషంబులచేతన్= ప్రేమద్వేషములతో; విషయ+ఆసక్తులు+ఐన వారలకున్= లోకంలో లంపటులయిన జనులకు; గ్రాహ్యంబులైన= స్వీకరింపదగిన; ధర్మ+అర్థకామమోక్షంబులు=ధర్మం, అర్థం, కామం, మోక్షం అను పురుషార్థాలు; తనకున్= విషయాసక్తుడుకాని తనకు; అగ్రాహ్యంబులు+అనియున్= స్వీకరింపరానివి అని; వ్యవహార ప్రసిద్ధికొఱకు+ఐనభేదంబుగాని= లోక ప్రవర్తనకై ఏర్పడిన భేదం తప్ప; ఆత్మభేదంబు లేదు+అనియునున్= ఆత్మలలో భేదముండదనీ; అనర్థంబులయందున్= నిష్ప్రయోజనాలయినవాటిని; అర్థకల్పన+చేయుట= ప్రయోజనాలున్నట్లుగా చేయటం; దిక్+భ్రమంబు+అనియును= దిగ్భ్రాంతి (కలిగించుట)అనీ; నిశ్చయించి= నిర్ణయించి; గురు+ఉపదిష్టశాస్త్రంబులు= గురువులచే బోధింపబడిన శాస్త్రాలు; మంచివి+అని తలంపక= ఉత్తమమైనవి ఆలోచించక, గురువులు= ఉపాధ్యాయులు; తమ గృహస్థకర్మ+అనుష్ఠానంబునకున్= తమ తమ గృహస్థధర్మాలను ఆచరించుటకై; పోయిన సమయంబునన్= శిష్యులను విడిచి వెళ్ళిన వేళల్లో...

**తా :** హిరణ్యకశిపుని ఆజ్ఞానుసారం గురుపుత్రులు, ప్రహ్లాదునికి గృహస్థుడు ఆచరించదగ్గ ధర్మాలను, ధర్మం, అర్థం, కామం అనువానిని–ధర్మప్రవర్తన, అర్థ ఆర్జన, కామతృప్తి అనువానిని బోధించారు. అయితే ప్రహ్లాదుడు వాటిని స్వీకరించలేదు. అవి ఇతరులకు దప్ప తనకు కావని, పైగా అవి నిష్ప్రయోజనాలని భావించాడు. ప్రయోజనరహితాలను ప్రయోజన సహితాలుగా ఎంచటం భ్రాంతికరంగూడ అని నిర్ధారణకువచ్చి, వారు బోధించిన అంశాలను ఉచితమైనవిగా గూడ భావించక, వారు గృహకార్యార్థం వెళ్ళిన సమయాలలో

**క. ఆటలకుఁ దన్ను రమ్మని, పాటించి నిశాటసుతులు భాషించిన దో**
**షాటకులేంద్రకుమారుఁడు, పాటవమున వారిఁజేరి ప్రజ్ఞాన్వితుఁడై. 209**

**ప్రతి :** నిశా+అటసుతులు= రాక్షసకుమారులు; తన్ను= తనను; ఆటలకున్= ఆటలాడటానికి; రమ్ము+అని= రావలసిందని; పాటించి= ఆదరిస్తూ; భాషించినన్= పలుకగా; దోషా+ఆటకుల+ఇంద్రకుమారుఁడు= రాక్షస రాజకుమారుడు; ప్రజ్ఞా+అన్వితుఁడై= జ్ఞానసంపన్నుడై; పాటవమునన్= సమర్థతతో; వారిన్+చేరి= వారిని సమీపించి...

**తా :** రాక్షసకుమారులు ప్రహ్లాదునిగూడ తాము ఆడే పాడే వ్యవహారాలలో పాల్గొనమని కోరగా, అతడు జ్ఞానసంపత్తి గలవాడుగాబట్టి, తనకు గల సమర్థతతో వారి దగ్గరకు పోయి.

**క. చెప్పఁడొక చదువు మంచిది, చెప్పెడిఁ దగులములు చెవులు చిందఱ గొనఁగా**
**నెప్పుడు మనయెడ నొజ్జలు, చెప్పెద నొక చదువు వినుఁడు చిత్తము లలరన్. 210**

**ప్రతి :** ఒజ్జలు= గురువులు; ఎప్పుడున్= అన్నివేళలా; మన+ఎడన్= మనకై; ఒక మంచిది చదువు= మంచిదైన ఒక విద్యను; చెప్పఁడు= బోధింపడు; చెవులుచిందఱగొనఁగాన్= చెవులు చిల్లులు పడేటట్లు; తగులములు= మోహాలు; చెప్పెడిన్= చెప్పును; చిత్తములు+అలరన్= మనస్సులు సంతోషించునట్లు; ఒక చదువు= ఒక సద్విద్యను; చెప్పెదన్= బోధిస్తాను; వినుఁడు= ఆలకించండి.

**తా :** మన గురువులు మనకు మంచి చదువును ఎపుడూ చెప్పడం లేదు. కాని, మోహాన్ని కలిగించే మాయ చదువులను మాత్రం ఎపుడూ చెవులు చిల్లులు పడేటట్లుగా చెపుతుంటారు. నేను మీకు మీ మనస్సులు ఆహ్లాదపడే విధంగా ఒక మంచి చదువును చెబుతాను, వినండి!

**వ. అని రాజకుమారుండు గావునఁ గరుణించి సంగడికాండ్రతోడ నగియెడి చందంబునఁ గ్రీడలాడుచు సమానవయస్కులైన దైత్యకుమారుల కెల్ల నేకాంతంబున నిట్లనియె. 211**

**ప్రతి :** అని= ఈ విధంగా; రాజకుమారుండు కావునన్= ప్రహ్లాదుడు రాజకుమారుడైనందువల్ల; కరుణించి= దయతలచి; సంగడికాండ్రతోడన్= స్నేహితులతో కలసి; నగియెడి చందంబునన్= నవ్వులాడే విధంగా; క్రీడలు+ఆడుచున్= ఆటలు ఆడుతూ; సమానవయస్కులు+ఐన= సమానవయస్కులు గలవారైన; దైత్యకుమారులకు+ఎల్లన్= రాక్షసబాలురకందరికి; ఏకాంతంబునన్= రహస్యంగా; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** ప్రహ్లాదుడు రాజకుమారుడైనందువల్ల చాలదయతో, తన తోడి సమవయస్కులు, స్నేహితులైన రాక్షసబాలురతో ఆడుతూ పాడుతూ, నవ్వుతూ, రహస్యంగా ఇలా పలికాడు.

**ఉ. బాలకులార! రండు మన ప్రాయపుబాలురు గొంద ఱుర్విపైఁ**
**గూలుటఁ గంటిరే! గురుఁడు క్రూరుఁడనర్థచయంబునందు దు**
**శ్శీలత నర్థకల్పనముఁజేసెడి, గ్రాహ్యము గాదు శాస్త్ర, మే**
**మే లెఱిఁగించెదన్! వినిన మీకు నిరంతరభద్ర మయ్యెడిన్. 212**

**ప్రతి :** బాలకులార!= ఓ బాలులారా! రండు= (నా) దరిచేరండి; మన ప్రాయపుబాలురు= మన వయస్సుగల పిల్లలు, కొందఱు= కొంతమంది; ఉర్విపైన్= భూమిమీద; కూలుటన్= చనిపోవడాన్ని; కంటిరే!= చూశారా!; గురుఁడు= ఆచార్యుడు; క్రూరుఁడు= దయమాలినవాడు; దుస్+శీలతన్= చెడ్డ స్వభావంతో; న+అర్థచయంబునందున్= నిష్ప్రయోజనాలయిన విషయాలలో; అర్థకల్పనమున్+చేసెడిన్= ప్రయోజనాన్ని కల్పించటం చేయుచున్నాడు; శాస్త్రము= శాసనము; గ్రాహ్యము+కాదు= గ్రహింపదగినదిగాదు; ఏన్= నేను; మేలు+ఎఱిఁగించెదన్= శ్రేయస్సును, మంచిని, తెలియపరుస్తాను; వినినన్= (దానిని) వింటే; మీకున్, నిరంతరభద్రము= మీకు ఎల్లప్పుడు క్షేమం; అయ్యెడున్= కల్గుతుంది.

**తా :** స్నేహితులారా! రండి. మనకు సమవయస్కులయిన బాలురు ఎందరో ఈ భూమిమీద రాలిపోవడం చనిపోవడం చూశారుగదా! మన ఆచార్యుడు దయమాలి నిష్ప్రయోజన విషయాలను ప్రయోజన సహితాలుగా మనలను విశ్వసింపజేయ చూస్తున్నాడు. కావున ఆయన క్రూరుడు. ఆయన బోధించే శాస్త్రం స్వీకార యోగ్యం గాదు. అది తిరస్కార యోగ్యం. నేను మీకు క్షేమకరమైన మార్గాన్ని చూపుతాను. దాన్ని వింటే మీకు నిరంతరం క్షేమం కలుగుతుంది.

**వ.** **వినుండు, సకల జన్మంబులందును ధర్మార్థాచరణ కారణంబయిన మానుషజన్మంబు దుర్లభం, బందుఁ బురుషత్వంబు దుర్గమం, బదియు శతవర్ష పరిమితంబైన జీవిత కాలంబున నియతంబై యుండు, నందు సగ మంధకార బంధురంబయి రాత్రి రూపంబున నిద్రాదివ్యవహారంబుల నిరర్థకంబయి చనుఁ, జిక్కిన పంచాశద్వత్సరంబులందును బాల్యకైశోర వయోవిశేషంబుల వింశతి హాయనంబులు గడచుఁ, గడమ ముప్పది యబ్దంబుల నింద్రియంబుల చేతఁ బట్టువడి దురవగాహంబులయిన కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబులను పాశంబులం గట్టువడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబులకంటె మధురాయమాణమైన తృష్ణకు లో నై భృత్యతస్కరవణిక్కర్మంబులఁ బ్రాణహానియైన నంగీకరించి పరార్థంబుల నర్థించుచు రహస్యసంభోగచాతుర్య సౌందర్య విశేషంబుల ధైర్యవల్లికా లవిత్రంబు లయిన కళత్రంబులను, మహనీయ మంజుల మధురాలాపంబులు గలిగి వశులయిన శిశువులను, శీలవయో రూపధన్యలగు కన్యలను, వినయ వివేకవిద్యాలంకారులయిన కుమారులను, గామిత ఫలప్రదాత లగు భ్రాతలను, మమత్వ ప్రేమదైన్య జనకు లయిన జననీ జనకులను, సకల సౌజన్య సింధువు లయిన బంధువులను, ధనకనక వస్తువాహన సుందరంబు లయిన మందిరంబులను, సుకరంబులైన పశుభృత్య నికరంబులను, వంశపరంపరాయత్తంబు లయిన విత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జించు నుపాయంబుఁ గానక తంతువర్గంబున నిర్గమద్వార శూన్యంబయిన మందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడి పాటవంబు చాలక తగులువడు కీటకంబు చందంబున గృహస్థుండు స్వయంకృత కర్మ బద్ధుండై శిశ్నోదరాది సుఖంబులఁ బ్రమత్తుండయి నిజకుటుంబ పోషణ పారవశ్యంబున విరక్తి మార్గంబుఁ దెలియ నేరక స్వకీయ పరకీయ భిన్న భావంబున నంధకారంబునం బ్రవేశించుఁ, గావునఁ గౌమార సమయంబున మనీషా గరిష్ఠుం డై పరమ భాగవతధర్మంబు ననుష్ఠింపవలయు, దుఃఖంబులు వాంఛితంబులు గాక చేకుఱుభంగి సుఖంబులును గాలానుసారంబులై లబ్ధంబు లగుం; గావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు సేయంజనదు, హరిభజనంబున మోక్షంబు సిద్ధించు, విష్ణుండు సర్వభూతంబులకు నాత్మేశ్వరుండు ప్రియుండు, ముముక్షువైన దేహికి దేహావసాన పర్యంతంబు నారాయణ చరణారవిందసేవనంబు కర్తవ్యంబు.** **213**

**ప్రతి :** వినుండు= శ్రద్ధగా వినండి; సకల జన్మంబులందును= అన్ని పుట్టుకలలోను; ధర్మ+అర్థ+ఆచరణ కారణంబయిన= ధర్మం అర్థం వీని ఆచరణమే మూలమైన; మానవజన్మంబు= నరజన్మ; దుర్+లభంబు= లభించుట చాలకష్టం; అందున్= ఆ పుట్టుకలోను; పురుషత్వంబు= పురుషుడు అగుట; దుర్గమంబు= అత్యంత కష్టం; అదియున్= ఆ పురుషత్వం గూడ; శతవర్షపరిమితంబు+ఐన= నూరు ఏండ్లకు సరిపడిన; జీవితకాలంబునన్= బ్రతుకు సమయానికి; నియతంబు+ఐ+ఉండున్=

పరిమితమై ఉంటుంది; అందున్ సగం= అందులోసగకాలం అంధకారబంధురంబు+అయి; రాత్రిరూపంబున్= చీకటితో కూడిన రాత్రిరూపంలోను; నిద్ర+ఆదివ్యవహారంబులన్= నిద్ర మొదలైన కార్యాలతో; నిర్+అర్థకంబు+అయిచనున్= నిష్ప్రయోజనమై గడచిపోవును; చిక్కిన= మిగిలిన; పంచాశత్+వత్సరంబులు+అందును= ఏబది ఏండ్లలో; బాల్యకైశోరవయో విశేషంబులన్= బాల్యం, కౌమారం, అనేదశలతో; వింశతిహాయనంబులు= ఇరువది ఏండ్లు; కడచున్= గడచిపోవును; కడమ ముప్పదియబ్దంబుల= మిగిలిన ముప్ఫైఏండ్లలో; ఇంద్రియంబుల చేతన్= ఇంద్రియాలతో; పట్టువడి= చిక్కి; దుర్+అవగాహంబులు+ అయిన= ఏమాత్రం అర్థంకానటువంటి; కామ= కోరికలకు; క్రోధ= కోపాలకు; లోభ= పేరాసకు; మోహ= మాయకు; మద= అహంకారానికి, మత్సరంబులు= మాత్సర్యాలు; అను పాశంబులన్+కట్టువడి= అనే తాళ్లతో బంధింపబడి; విడివడన్= విడిపించుకొనుటకు; సమర్థుండుగాక= శక్తిమంతుడుగాక, ప్రాణంబులకంటెన్= అసువులకంటె; మధురాయమాణమైన= ప్రీతికరమైన; తృష్ణకున్= పేరాసకు; లోనై= వశమై; భృత్య= సేవకులు; తస్కర= దొంగలు; వణిక్= వ్యాపారులు (వీరి); కర్మంబులన్= పనులలో; ప్రాణహాని+ఐనన్= ప్రాణాల అపాయాన్నిగూడ; అంగీకరించి= ఒప్పుకొని; పర+అర్థంబులన్= ఇతరుల ధనాన్ని (సంపదను); అర్థించుచున్= కోరుకొంటు; రహస్యసంభోగ= కనిపించని సంభోగాలతో; చాతుర్యసౌందర్యవిశేషంబులన్= నేర్పులు అందచందాలతో; ధైర్యవల్లికాలవిత్రంబులు+అయిన= ధీరత్వము అనే తీగలకు కొడవళ్ళయిన; కళత్రంబులను= భార్యలను; మహనీయ మంజుల, మధుర+ఆలాపంబులు+కలిగి= గొప్ప, అందమైన, తియ్యనైన, మాటలుకల్గి; వశులు+అయిన శిశువులను= లొంగిన చిన్న పాపలను; శీలవయస్+రూపధన్యలు+ అగు= స్వభావంతో, వయస్సుతో, ఆకారంతో, వెలుగొందే; కన్యలను= కూతుళ్ళను; వినయవివేకవిద్యా+అలంకారులు+అయిన= వినయ విద్యా వివేకాలతో భాసిస్తున్న; కుమారులనున్= కొడుకులను; కామితఫలప్రదాతలు+అగు= కోరిన ఫలితాలు ఒసగే; భ్రాతలను= సోదరులను; మమత్వప్రేమదైన్యజనకులు+అయిన= మమకారం, ప్రేమ, జాలి, వీటికి మూలమైన; జననీజనకులను= తల్లిదండ్రులను; సకలసౌజన్యసింధువులు+అయిన= సకల సుగుణాలకు సముద్రంవంటివారయిన; బంధువులను= చుట్టాలను; ధనకనకవస్తువాహనసుందరంబులు+అయిన= ధనకనక వస్తువాహనాలతో ప్రకాశిస్తున్న; మందిరంబులను= ఇండ్లను; సుకరంబులైన= సాధువులైన; పశుభృత్యనికరంబులను= పశుసమూహం సేవకబృందం; వంశపరంపరా+ఆయత్తంబులు+అయిన= వంశంతోపాటు పరంపరగా–ఒకదాని తరువాత ఒకటిగా సిద్ధించే; విత్తంబులను= సంపదలను; వర్జింపలేక= విడువలేక; సంసారంబు నిర్జించు+ఉపాయంబున్= సంసారాన్ని జయించే మార్గాన్ని; కానక= చూడలేక; తంతువర్గంబునన్= దారాలసమూహంతో; నిర్గమద్వార శూన్యంబు+అయిన= బయటపడే మార్గంలేని; మందిరంబున్+చేరి= ఇంటిని చేరుకొని; చిక్కు+పడి= చిక్కుకొని; వెడలెడిపాటవంబు= బయటపడే సామర్థ్యం; చాలక= సరిపోక; తగులు+పడు= తంటాలుపడే; కీటకంబుచందంబునన్= (సాలె)పురుగువలె; గృహస్థుండు= కుటుంబి; స్వయంకృతకర్మబద్ధుండు+ఐ= తాను చేసుకొన్న పనికి (తానే) చిక్కినవాడై; శిశ్న+ఉదర+ఆది సుఖంబులన్= మగగురి – పొట్టమొదలగు సుఖాలతో; ప్రమత్తుండయి= బాగా మదించినవాడై; నిజకుటుంబపోషణపారవశ్యంబునన్= తన సంసారాన్ని సాకే వివశత్వంతో; విరక్తిమార్గంబున్= వైరాగ్యమనేదారిని; తెలియనేరక= తెలుసుకోలేక; స్వకీయపరకీయభిన్నభావంబునన్= తనది ఇతరులది అనే భేదభావంతో; అంధకారంబునన్= చీకటిలో; ప్రవేశించున్= దూరతాడు; కావునన్= కనుక; కౌమారసమయంబునన్= బాల్యం తరువాతిదయిన కుమారదశలో; మనీషా గరిష్ఠుండు+ఐ= బుద్ధితో మిక్కిలిగొప్పవాడై, పరమభాగవత ధర్మంబును= గొప్పభక్తుని ధర్మాన్ని; అనుష్ఠింపన్+వలయున్= ఆచరించాలి; దుఃఖంబులు వాంఛితంబులు+ కాక= కష్టాలు కోరబడినవి కాకున్నను; చేకుఱుభంగిన్= వచ్చిచేరే విధంగా; సుఖంబులునుకాల+అనుసారంబులై= మోదాలుగూడ, కాలాన్ననుసరించినవై; లబ్ధంబులు+అగున్= పొందబడినవి అవుతాయి; కావునన్= కనుక;

వృథాప్రయాసంబునన్= వ్యర్థమయిన ప్రయత్నంతో; ఆయుర్+వ్యయంబు= వయస్సును ఖర్చుచేయటం; చేయన్+చనదు= చేయఁగూడదు; హరిభజనంబునన్= విష్ణువును సేవించుటవలన; మోక్షంబు సిద్ధించున్= ముక్తిలభిస్తుంది; విష్ణుండు= విష్ణుమూర్తి; సర్వభూతంబులకున్= అన్ని ప్రాణులకును; ఆత్మ+ఈశ్వరుండు= ప్రాణనాథుడు; ప్రియుండు= ఇష్టుడు; ముముక్షువు+ఐన= మోక్షాన్ని గోరువాడైన; దేహికిన్= ప్రాణికి; దేహ+అవసాన పర్యంతంబు= దేహత్యాగం వరకు; నారాయణచరణ అరవిందసేవనంబు= విష్ణువుయొక్క పాదపద్మాలను భజించుట; కర్తవ్యంబు= చేయవలసినది.

**తా :** మిత్రులారా! వినండి. అన్ని జన్మలలో మానవజన్మ ఉత్తమం. ఎందుకంటే దానిలో ధర్మం, అర్థం అనే పురుషార్థాలకై పాటుబడే వీలు ఉంది. మానవజన్మలోగూడ పురుషజన్మ దొరకడం అరుదు. అదిగూడ వంద ఏళ్ళకు పరిమితం. దానిలో సగం చీకటి తోడి రాత్రులతో గడచిపోతుంది. మిగిలిన ఏబై (రాత్రిభాగం 50సం.పోగా) ఏళ్ళలో ఇరవైఏళ్ళు బాల్యం, కౌమారం – అనే దశల్లో వెళ్ళిపోతుంది. ఇక మిగిలిన ముప్పైఏళ్ళు ఇంద్రియాలచే కట్టుబడి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనే ఆరు దుర్లక్షణాలతో, వాటితోపాటు, వెంటబడే ఆలు, పిల్లలు (కొడుకులు కూతుళ్ళు) అన్నదమ్ములు, తల్లిదండ్రులు, ఇతర బంధువర్గం, సకలసౌకర్యాలకు నిలయాలయిన ఇళ్ళు వాకిళ్ళు, పాడిపంటలు, పరిజనాలు, వంశపరంపరాగతాలయ్యే ఆస్తిపాస్తులు – ఈ సామగ్రినంతటినీ విడిచిపెట్ట లేక, సంసారాన్ని జయించేమార్గం కనబడక, తానే అల్లుకొన్న సంక్లిష్టమైన గూటిలో తానే బందీఅయిన సాలెపురుగు లాగా మానవుడు యాతనల పాలవుతున్నాడు. తన శరీరసుఖాలే పరమావధిగా భావిస్తూ స్వపరభేదభావంతో ఆ సంసారపు చీకటిలోనే పడి కొట్టుకుంటూ ఉంటాడు. కాబట్టి, కౌమార యౌవనదశలకు, ముందుగానే బుద్ధిమంతుడై భగవద్భక్తిగలిగి ప్రవర్తించాలి. కోరకుండానే స్వయంగా దుఃఖాలు వచ్చి పడినట్లే జీవితంలో సుఖాలూ వాటంతట అవే మనదగ్గరికి చేరతాయి. వాటికని ప్రత్యేకంగా వ్యర్థప్రయత్నాలు చేస్తూ మన ఆయువును వ్యయం చేసికోవలసిన పనిలేదు. విష్ణుమూర్తి సర్వప్రాణి లోకానికి అధినాథుడు. కాగా, ముక్తి కోరేవాడు శరీరయాత్ర సాగినంతకాలం నారాయణుని పాదపద్మాలు సేవించడమే కర్తవ్యంగా జీవించాలి.

**సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థులై విఫలులై కైకొన్న వెఱ్ఱితనము?**
**భద్రార్థులై యుండి పాయరు, సంసారపద్ధతి నూరక పట్టువడిరి,**
**కల యోనులందెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండుఁ**
**దన్నెఱుంగఁడు, కర్మతంత్రుఁడై కడపట ముట్టఁడు భవశతములకు నయిన**

**ఆ. దీన శుభము లేదు, దివ్యకీర్తియు లేదు, జగతిఁబుట్టి పుట్టి చచ్చి చచ్చి**
**పొరల నేల మనకుఁ? బుట్టని చావని త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి. 214**

**ప్రతి :** మనవారు= మనవారందరు; ఘనులు= గొప్పవారు; గృహస్థులు+ఐ= ఇంటివారై; విఫలులు+ఐ= ఫలితం పొందలేనివారై; కైకొన్న= స్వీకరించిన; వెఱ్ఱితనము= వెంగళాయితనం; కంటిర+ఏ= చూచితిరా!; భద్ర+అర్థులు+ఐ+ఉండి= క్షేమం కోరువారై ఉండీగూడ; సంసారపద్ధతిన్= సంసారమార్గాన్ని; పాయరు= వదలరు; ఊరకపట్టు+పడిరి= వ్యర్థంగా చిక్కుబడ్డారు; పురుషుండు= మానవుడు; దేహి+ఐ= శరీరం ధరించినవాడై; కల= (సృష్టిలో) ఉన్న, యోనులందు+ఎల్లన్= అన్ని జననేంద్రియాల్లో; గర్భ+ఆది+అవస్థలన్= గర్భాది దశలను పొందుతూ; పుట్టుచుండున్= పుడుతుంటాడు; తన్నున్= తనను (తాను); ఎఱుంగఁడు= తెలిసికొనలేదు; కర్మతంత్రుఁడు+ఐ= కర్మవశుడై, కర్మకులోబడినవాడై; కడపట= చివరకు; భవశతములకున్+అయినన్= నూరుజన్మల తర్వాతైనా; ముట్టఁడు= గట్టుచేరడు తరించలేడు; దీనన్= ఈ సంసారజీవనంలో;

శుభము లేదు= క్షేమం లేదు; దివ్యకీర్తియున్= గొప్ప ప్రతిష్ఠగూడ; లేదు= ఉండదు; జగతిన్= లోకంలో; మనకున్= తెలివిగలవారమైన మనకు; పుట్టిపుట్టి చచ్చిచచ్చి= పుట్టడం, చావడం; పొరలన్+ఏల= తిరుగుట ఎందుకు?; పుట్టని చావని త్రోవన్= చావు పుట్టువులు లేనిదారిని; వెదకికొనుట= తెలుసుకొనటం; దొడ్డబుద్ధి= గొప్పతెలివి.

**తా :** మీరు చూస్తున్నారు కదా! మనతోటివారు ఒక ఇంటివారై ఆలుబిడ్డలతో విసిగి జీవితంలో ఏమీ సాధించలేక వెర్రివారుగా మిగిలిపోయారు. వారూ మోక్షాసక్తులైగూడ, సంసారాన్ని వదలలేక, దానిలోనే పడి కొట్టుమిట్టాడుతున్నారు. ఆవిధంగా లోకంలో ఉనికిలో ఉన్న అన్ని జీవజాలాల్లో మాటిమాటికీ తాము పుడుతున్నారు. నరుడు ఈ జనన మరణ చక్రంలో పడి, తనను తాను గ్రహించలేకపోతున్నాడు. కర్మవివశుడై చక్రభ్రమణం చేస్తూనే ఉన్నాడు. బయటపడే మార్గం, నూరుజన్మలెత్తినా అతడు అందుకోజాలడు. కాగా, ఈ సంసార జీవనంలో శుభమూ, కీర్తీ ఏదీలేదు. ప్రయోజనంలేని సంసారచక్రంలో పడి, మనమూ మళ్లీ మళ్లీ చావు పుట్టువులలో పడి పొర్లడమెందుకు? చావు పుట్టువులకు అతీతమైన మార్గాన్ని వెదకి పట్టుకోవడం గొప్పతెలివిగదా!

**శా. హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేహోల్లస**
**ద్బాలాలోకనశృంఖలానిచయసంబద్ధాత్ముఁడై లేశమున్**
**వేలానిస్సరణంబు గానక మహావిద్వాంసుఁడుం గామినీ**
**హేలాకృష్టకురంగశాబక మగున్ హీనస్థితిన్ వింటిరే! 215**

**ప్రతి :** హాలా= మద్యంను; పాన= తాగుటవలన, విజృంభమాణ= పెరుగుతున్న, మదగర్వ= అహంకార గర్వంతో; అతీతదేహ= దాటిన శరీరంగల; ఉత్+లసత్+బాలా= మిక్కిలి జ్వలించే యువతుల; ఆలోకన శృంఖలానిచయ= చూపులనే సంకెళ్ళగుంపుతో; సంబద్ధ+ఆత్ముఁడు+ఐ= కట్టబద్ధమనస్సుగలవాడై; మహావిద్వాంసుడు= గొప్ప పండితుడు; లేశమున్= కొంచెంగూడ; వేలానిస్సరణంబు= దరిచేరే మార్గం; కానక= కనబడక; కామినీ= కాముకురాలియొక్క; హేలా= శృంగార విలాసంచే; ఆ కృష్ట= లాగబడిన; కురంగశాబకము= లేడిపిల్ల వంటివాడు; అగున్= అవుతున్నాడు; హీనస్థితిన్= ఈ దీనస్థితిని; వింటిరి+ఏ= విన్నారా?

**తా :** మద్యపానం చేసి, మదగర్వంతోకూడి, మత్తుగా శరీరస్పృహ లేని కన్యయొక్క చూపులనే సంకెళ్ళకు మహాపండితుడుకూడా బందీ అవుతాడు. అంతేకాక ఒడ్డుకు చేరే దారితెలియని ఆ గొప్ప పండితుడు కాముకురాలి శృంగార విలాసాలకు ఆకర్షించబడిన జింకపిల్లవలె, హీనమైన స్థితిని పొందుతారు. ఇట్టి అధోగతిని విన్నారా?

**విశే :** ఆడవాళ్ళ చూపులు లేళ్ళను ఆకర్షిస్తాయని చెప్పడం కవి సమయం.

మహాపండితుడైనా భక్తిజ్ఞానాలు లేకపోతే యువతుల విలాసాలకు బంధీ అవుతాడు. అతని పాండిత్యం లోకానికి ఉపయోగపడదు. పాండిత్యంతోపాటు భక్తి జ్ఞానాలను అలవరచుకున్నప్పుడు లోకానికి ఉపయోగపడతాడని ప్రహ్లాదుని సందేశం.

**ఆ. విషయసక్తులైన విబుధాహితులతోడి, మనికి వలదు, ముక్తి మార్గవాంఛ;**
**నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త, సంగజనులఁగూడి శైశవమున. 216**

**ప్రతి :** శైశవమునన్= బాల్యంలో; విషయాసక్తులు+ఐన= ఇంద్రియ లంపటులయిన; విబుధ+అహితులతోడి= రాక్షసుల విరోధంతోకూడిన; మనికి= బ్రతుకు; వలదు= వద్దు; ముక్తిమార్గవాంఛన్= మోక్షమార్గపుకోరికతో; ఆదిదేవున్= మొదటిదేవుని; విష్ణున్= విష్ణువును; ముక్తసంగజనులన్= వదలిన బంధాలుగల ప్రజలతో; కూడి= కలసి; ఆశ్రయింపుఁడు= శరణు వేడండి.

**తా :** బాలకులారా! బాల్యంలో మీరు లౌకిక అంశాలలో తగుల్కొన్న రాక్షసులతో కలిసి జీవించవద్దు. మోక్షకాంక్షతో, ఇంద్రియ లంపటత్వాన్ని త్యజించిన వారితో కలిసి, ఆదిదేవుడైన విష్ణువును ఆశ్రయించండి.

**వ. కావున విషయంబులఁ జిక్కువడిన రక్కసులకు హరిభజనంబు శక్యంబు గాదు, రమ్యమయ్యును బహుతర ప్రయాస గమ్యమని తలంచితిరేనిఁ జెప్పెద, సర్వభూతాత్మకుండై సర్వ దిక్కాల సిద్ధుండై బ్రహ్మ కడపలగాఁ గల చరాచర స్థూల సూక్ష్మజీవసంఘంబు లందును, నభోవాయుకుంభినీ సలిల తేజంబు లనియెడు మహాభూతంబులయందును, భూతవికారంబులయిన ఘటపటాదులయందును, గుణసామ్యంబయిన ప్రధానమందును, గుణవ్యతికరంబైన మహత్తత్త్వాదియందును, రజస్సత్త్వతమోగుణంబుల యందును భగవంతుం డవ్యయుం డీశ్వరుండు పరమాత్మ పరబ్రహ్మ మనియెడు వాచకశబ్దంబులు గల్గి కేవలానుభవానంద స్వరూపకుండు నవికల్పితుండు ననిర్దేశ్యుండు నయిన పరమేశ్వరుండు త్రిగుణాత్మకంబైన తన దివ్య మాయచేత నంతర్హితైశ్వర్యుండై వ్యాప్యవ్యాపకరూపంబులం జేసి దృశ్యుండును ద్రష్టయు భోగ్యుండును భోక్తయు నయి నిర్దేశింపందగి వికల్పితుండై యుండుఁ, దత్కారణంబున నాసుర భావంబు విడిచి సర్వభూతంబులందును దయాసుహృద్భావంబులు కర్తవ్యంబులు, దయాసుహృద్భావంబులు గల్గిన నధోక్షజుండు సంతసించు, ననంతుం డాద్యుండు హరి సంతసించిన నలభ్యం బెయ్యదియు లేదు, జనార్దనచరణ సరసీరుహ యుగళస్మరణ సుధారస పానపరవశుల మైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై సిద్ధించు ధర్మార్థకామంబులు, కాంక్షితంబై సిద్ధించు మోక్షం బననేల? త్రివర్గంబును నాత్మవిద్యయుం దర్కదండనీతి జీవికాదు లన్నియుఁ ద్రైగుణ్య విషయంబు లయిన వేదంబుల వలనం బ్రతిపాద్యంబులు, నిస్త్రైగుణ్యలక్షణంబునం బరమ పురుషుండైన హరికి నాత్మసమర్పణంబు సేయుట మేలు, పరమాత్మ తత్త్వజ్ఞానోదయంబునం జేసి స్వపరభ్రాంతి సేయక పురుషుండు యోగావధూతత్త్వంబున నాత్మ వికల్పభేదంబునం గలలోఁ గన్న విశేషంబుల భంగిం దథ్యం బనక మిథ్యయని తలంచు నని మఱియుఁ బ్రహ్లాదుం డిట్లనియె. 217**

**ప్రతి :** కావునన్= కనుక; విషయంబులన్= లౌకికాంశాలలో; చిక్కు+పడిన= తగుల్కొన్న; రక్కసులకున్= రాక్షసులకు; హరిభజనంబు= విష్ణుసేవ; శక్యంబు+కాదు= సాధ్యం కాదు; రమ్యము+అయ్యును= అందమైనదైగూడ; బహుతరప్రయాసగమ్యము+అని= మిక్కిలి ఎక్కువ ప్రయత్నాలతో పొందదగినది అని; తలంచితిరి+ఏనిన్= అనుకొంటిరేని; చెప్పెదన్= చెప్పుచున్నాను; సర్వభూత+ఆత్మకుండు+ఐ= ఎల్లప్రాణుల స్వరూపుడై; సర్వదిక్+కాలసిద్ధుండు+ఐ= ఎల్లదిక్కులను, కాలాలను ఉన్నవాడై; బ్రహ్మకడపలగాన్+కల= బ్రహ్మచివరగాగల; చర+అచర= కదలేవి, కదలనివి; స్థూల= దొడ్డవి; సూక్ష్మ= చిన్నవి అయిన; జీవసంఘంబులు+అందును= ప్రాణిసమూహాలలోను; నభస్= ఆకాశం; వాయు= గాలి; కుంభినీ= భూమి; సలిల= నీరు; తేజంబులు= కాంతులు, అనియెడు= అనే; మహాభూతంబులయందును= పంచ

మహాభూతాలలోను; భూతవికారంబులు+అయిన= పంచభూతాలనుండి పుట్టిన; ఘటపట+ఆదులయందును= కుండ, గుడ్డ మొదలైనవానిలోను; గుణసామ్యంబు+అయిన= గుణాలతో సమానత్వంగల; ప్రధానమందును= ప్రకృతిలోను; గుణవ్యతికరంబు+ఐన= గుణాలకు సంబంధించిన; మహత్తత్త్వ+ఆదియందును= బుద్ధితత్త్వం మొదలయిన వాటిలోను; రజస్సత్త్వతమో గుణంబులయందును= రజస్సు, సత్త్వము, తమస్సు – అనే గుణాలలోను; భగవంతుండు= మూలకారణం గలవాడు; అవ్యయుండు= నాశనం లేనివాడు; ఈశ్వరుండు= శక్తిమంతుడు; పరమ+ఆత్మ, పరబ్రహ్మము= పరమాత్మ, పరబ్రహ్మము, అనియెడు= అనే; వాచకశబ్దంబులు+కల్గి= (తనను) పేర్లు గలిగి; కేవల= ఒకేఒక్క; అనుభవ+ఆనంద= అనుభవానికి అందే ఆనందం; స్వరూపకుండును= స్వరూపమైనవాడు; న+వికల్పితుండును= వికల్పంలేనివాడు; న+నిర్దేశ్యుండున్= నిర్దేశించడానికి అలవిగానివాడు; అయిన= అయిన; పరమ+ఈశ్వరుండు= మహాశక్తిమంతుడు; త్రిగుణ+ఆత్మకంబు+ఐన= మూడుగుణాలుగల; తన దివ్యమాయచేతను= తన మహామాయాగుణంతో; అంతర్హిత+ఐశ్వర్యుండు+ఐ= కనిపించని శక్తిగలవాడై; వ్యాప్య వ్యాపకరూపంబులన్+చేసి= వ్యాప్యం, వ్యాపకం అనే రెండు ఆకారాలవలన; దృశ్యుండును= చూడదగినవాడు; ద్రష్టయున్= చూచేవాడూ; భోగ్యుండును= భుజింపదగ్గవాడు; భోక్తయున్+అయి= భుజించేవాడూఅయి, నిర్దేశింపన్+తగి= చూపడానికి అర్హుడై; వికల్పితుండు+ఐ= వికల్పానికి గురైనవాడై; ఉండున్, తద్+కారణంబునన్= ఆ హేతువువలన; ఆసురభావంబు విడిచి= రాక్షసత్వంవదలి; సర్వభూతంబులు+అందును= అన్ని ప్రాణులలోను; దయా సుహృద్+భావంబులు= దయ మైత్రి అనే భావాలు; కర్తవ్యంబులు= ఆచరించవలసినవి; దయాసుహృద్+భావంబులు+కల్గినన్= దయ, మైత్రి కలుగగా; అధోక్షజుండు= విష్ణువు; సంతసించున్= సంతోషపడును; న+అంతుండు= చివరలేనివాడు; ఆద్యుండు= మొదటివాడు; హరి= విష్ణువు; సంతసించినన్= సంతోషపడితే; న+లభ్యంబు= దొరకనిది; ఏ+ఎదియున్= ఏదికూడ; లేదు= అన్నీ లభ్యాలే అనటం! జన+అర్దన= విష్ణువుయొక్క; చరణ సరసీరుహయుగళస్మరణ= పద్మములవంటి పాదాలజంటయొక్క; స్మరణ= ధ్యానమనే; సుధారస= అమృతంయొక్క; పానపరవశులము= త్రాగడంలో లీనమైనవాళ్ళం; ఐతిమి+ఏని= ఐనచో; మనకున్= మనకు; దైవవశంబునన్= అదృష్టం కారణంగా; అకాంక్షితంబులు+ఐ= కోరబడనివై; ధర్మ+అర్థ+కామంబులు= ఈ మూడు పురుషార్థాలు; సిద్ధించున్= కల్గును; మోక్షంబు= చతుర్థ పురుషార్థమైన ముక్తి; కాంక్షితంబు+ఐ= కోరబడినదై; సిద్ధించున్= కలుగును; మోక్షంబు+అనన్+ఏల? = మోక్షమే అనడమెందుకు; త్రివర్గమును= ధర్మఅర్థకామాలు మూడూ; ఆత్మవిద్యయున్= ఆత్మను దెలిపెడి చదువు, వేదాంతవిద్య; తర్కదండనీతి జీవికా+ఆదులు= తర్కవిద్య, దండనీతి, రాజనీతి, బ్రతుకు దెరువు మొదలయివి; త్రైగుణ్యవిషయంబులు+అయిన= సత్త్వరజస్తమోగుణాలకు ఆధారమైన; వేదంబులవలనన్= వేదవిద్యలవలన; ప్రతిపాద్యంబులు= సాధింపదగినవి; నిస్+త్రైగుణ్యలక్షణంబునన్= త్రిగుణ రహితమైన గురుతుతో; పరమపురుషుండు+ఐన హరికిన్= పురుషోత్తముడైన విష్ణువుకై; ఆత్మసమర్పణంబు+చేయుట= తనను తాను అర్పించుకోవటం; మేలు= ఉత్తమం; పరమ+ఆత్మతత్త్వజ్ఞాన+ఉదయంబునన్+చేసి= పరబ్రహ్మతత్త్వం తెలియటంవల్ల; స్వ – పరభ్రాంతి+చేయక= తాను, ఇతరుడు అనే భ్రమలేకుండ; పురుషుండు= నరుడు; యోగ+అవధూతత్త్వంబునన్= యోగంవల్ల సిద్ధించిన అవధూత భావంతో; ఆత్మవికల్పభేదంబునన్= తనలోని వికల్పమైన భేదభావంతో; కలలోన్+కన్నవిశేషంబుల భంగిన్= కలలో చూచిన విషయాలలాగా; తథ్యంబు+ఆనక= నిజమని భావింపక; మిథ్యయని= లేనివి అని (అవధూతత్త్వం), తలంచున్+అని= తలుస్తాడు; అని మఱియున్= ఇంకా; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు, ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** రాక్షసులు లోకసుఖాలలో చిక్కి విష్ణుని సేవించుట అసాధ్యం. అయితే విష్ణుసేవ ఆకర్షణ కల్గినదయినా ఎంతో, ఎన్నో మహా ప్రయత్నాలతో మాత్రమే సిద్ధించే విషయం. అని మీరు తలపోస్తే, మీకు నేను చెప్పేదేమిటంటే, విష్ణువు సర్వవ్యాపి.

అతడులేని ప్రదేశం లేదు. అతడు సర్వప్రకృతి స్వరూపుడు, సర్వకాలాల్లో, దిక్కులలో ఆతడే ఉన్నాడు. బ్రహ్మ మొదలు సకల జీవులలో, పృథివి, నీరు, కాంతి, గాలి, ఆకాశం అనే ఈ పంచభూతాలలో అతడే నిండి ఉన్నాడు. అంతేకాదు, ఆ పంచభూత సృష్టియైన జగత్తంతా విష్ణుమయమే. గుణసామ్యంగల ప్రకృతి, గుణవ్యతికరమైన బుద్ధితత్త్వం, సత్త్వరజ స్తమోగుణాలు, ఈ అన్నింట ఈశ్వరుడు, పరమాత్మ, పరబ్రహ్మ అనే పేర్లతో కేవల ఆనందానుభవమే తన రూపురేఖలుగా గలిగి, తన సృష్టియైన మాయతో తనలో తాను లీనమై ఉన్నాడు. సృష్టిలోని వ్యాప్యవ్యాపకాలు రెండూ, కార్యం, కర్త స్వయంగా తానే అయి ప్రకాశిస్తున్నాడు. కాగా, ఈశ్వరుడు తానే స్వయంగా, చూచేవాడూ, చూడబడే వస్తుసముదాయంగా భాసిస్తూ, తానే స్వయంగా అనుభవమూ, అనుభోక్తా అయి సర్వం తానే ఇమిడి ఉన్నాడు. కావున రాక్షసభావం వదలిపెట్టి, సర్వప్రాణులపట్ల దయను, మైత్రిని వహించాలి.ఈ రెండు గుణాలు–దయ మైత్రి నరుడు అలవరచుకొంటే నారాయణుడు సంతోషిస్తాడు. అతడు సంతోషిస్తే, త్రి పురుషార్థాలు ధర్మ – అర్థ – కామాలతో పాటుగా చతుర్థమైన మోక్షమూ నరునికి కరతలగతమైన ఆమలకమే (ఒక చేతిలో ఉసిరికకాయ అంత సులభమనటం). అపుడు నరుడు నారాయణునకు ఆత్మ సమర్పణ చేసికోవాలి. దానివల్ల అతనిలో అవధూతభావం ఉద్బుద్ధమై లౌకికాంశాలను అన్నింటిని, స్వయంగా చూస్తూకూడ, వాటిని కలలోని వానినిగా మిధ్యగా భావిస్తూ ద్వంద్వాతీతంగా జీవించగలుగుతాడు అని పలికి ప్రహ్లాదుడు ఇంకా ఈ విధంగా అన్నాడు.

**విశే : త్రైగుణ్య, నిస్త్రైగుణ్య విషయాలు**

**త్రైగుణ్య విషయావేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।**
**నిర్ద్వంద్వో నిత్య సత్త్వ స్థో నిర్యోగ క్షేమ ఆత్మవాన్** –భగవద్గీత (2–45)

'ఓ అర్జునా! వేదాలు (అందులోని పూర్వభాగమైన కర్మకాండ) త్రిగుణాత్మకాలైన సంసార విషయాలను తెలిపేవిగా ఉన్నాయి. నీవు త్రిగుణాలను వదలి వేసినవాడవై, ద్వంద్వాలు పాటింపనివాడివై, నిరంతరం శుద్ధసత్వాన్ని ఆశ్రయించినవాడవై, యోగక్షేమాలమీద దృష్టిలేనివాడవై ఆత్మజ్ఞానివి కావయ్యా!

**మ. నరుఁడుం దానును మైత్రితో మెలఁగుచున్ నారాయణుం డంతయున్**
**వరుసన్ నారదసంయమీశ్వరునకున్ వ్యాఖ్యానముంజేసె మున్,**
**హరిభక్తాంఘ్రిపరాగశుద్ధతను లేకాంతుల్, మహాకించనుల్,**
**పరతత్త్వజ్ఞులు గాని నేరరు, మదిన్ భావింప నీ జ్ఞానమున్. 218**

**ప్రతి :** మున్= పూర్వకాలాన; నారాయణుండు= విష్ణువు; నరుఁడున్+తానును= అర్జునుడూ తానూ; మైత్రితోన్+ మెలఁగుచున్= స్నేహంతో ప్రవర్తిస్తూ వుండగా; ఈ జ్ఞానమున్ అంతయున్= నేను మీకు చెబుతున్న ఈ జ్ఞానాన్ని అంతటినీ; వరుసన్= క్రమపద్ధతిలో; నారదసంయమి+ఈశ్వరునకున్= నారదమునీంద్రునకు; వ్యాఖ్యానమున్+చేసెన్= వివరించి చెప్పాడు; హరిభక్త= విష్ణుభక్తులయొక్క; అంఘ్రిపరాగ= పాదరేణువులచేత; శుద్ధతనులు= పవిత్రమైన శరీరాలు గలవారు; ఏకాంతుల్= విష్ణువునందు అనన్య భక్తిగలవారు; మహా+అకించనుల్= సంపదలపై ఆశలేనివారు, ధన వ్యామోహం లేనివారు; పరతత్త్వజ్ఞులుగాని= మహాతత్త్వవేత్తలుతప్ప; ఈ జ్ఞానమున్= ఈ జ్ఞానాన్ని; మదిన్= మనస్సులో; భావింపన్ నేరరు= ఊహించ లేరు.

**తా :** నేను మీకు చెప్పే ఈ జ్ఞానాన్ని అంతటినీ పూర్వం, నారాయణుడు నరునితో కలిసి, నారద మహర్షికి వివరించాడు. దీనిని గ్రహించడం అందరికీ సాధ్యపడే విద్య కాదు. హరిభక్తుల పాదధూళితో పవిత్రమైనవారు, విష్ణువుపై అనన్యభక్తి గల్గి కైంకర్యం తప్ప కైవల్యం వద్దనేవారు, పరతత్త్వజ్ఞానం కలవారు తప్ప, ఇతరులు మదిలో నిలుపుకో జాలరు. ధనసంపాదనకు శక్తిసామర్థ్యాలున్నా దానియందు లంపటత్వం లేనివారు, అసలు భౌతిక వస్తువ్యామోహంలేనివారు అకించనులు.

**వ. తొల్లి నేను దివ్యదృష్టి గల నారదమహాముని వలన సవిశేషం బయిన యీ జ్ఞానంబును బరమభాగవత ధర్మంబును వింటి: ననిన వెఱఁగుపడి దైత్యబాలకు లద్దనుజరాజకుమారున కిట్లనిరి. 219**

**ప్రతి :** నేను; తొల్లి= పూర్వకాలాన; దివ్య దృష్టిగల= దివికి చెందిన చూపుగల, నారదమహాముని వలనన్= నారదమహర్షివల్ల; సవిశేషంబు+అయిన= విశేషంతో గూడిన; ఈ జ్ఞానంబును= ఈ జ్ఞానాన్ని; పరమ భాగవతధర్మంబును= గొప్పదైన భక్తుని ధర్మాన్ని, వింటిన్= విన్నాను; అనినన్= అని పలుకగా; వెఱఁగు+పడి= విస్మయం చెంది; దైత్యబాలకులు= రాక్షసబాలురు; ఆ+దనుజరాజకుమారునకున్= ఆ రాక్షసరాజ తనయునితో; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** పూర్వం నేను దివ్యదృష్టిగల నారదునినుండి ఈ జ్ఞానాన్ని విన్నా ననగా, రాక్షసబాలురు ఆశ్చర్యం చెంది రాజకుమారునితో ఇలా అన్నారు.

**ఉ. మంటిమి గూడి భార్గవకుమారకులొద్ద ననేకశాస్త్రముల్**
**వింటిమి, లేఁదు సద్గురుఁడు వే ఱొకఁడెన్నఁడు రాజశాల ము**
**క్కంటికి నైన రాదు సొరఁగా, వెలికింజన రాదు, నీకు ని**
**ష్కంటకవృత్తి నెవ్వఁడు ప్రగల్భుఁడు సెప్పె గుణాఢ్య! సెప్పుమా! 220**

**ప్రతి :** గుణ+ఆఢ్య= గుణాలతో సంపన్నుడా! భార్గవకుమారకుల+ఒద్దన్= శుక్రాచార్యుని కొడుకులదగ్గర; మంటిమి+కూడి= (కలిసి) జీవించితిమి; అనేకశాస్త్రముల్= ఎన్నో శాస్త్రాలను; వింటిమి= వారు బోధింపగా విన్నాము; ఎన్నఁడున్= ఎప్పుడూ; వేఱు+ఒకఁడు= మరొకడు; సత్+గురుఁడు= మంచిగురువు; లేఁడు= లేనే లేడు; రాజశాల= రాజగృహంలో; ముక్కంటికిన్+ఐనన్= శంకరునకైనను; చొరఁగాన్+రాదు= ప్రవేశింప వీలుకాదు; వెలికిన్= బయటకుగూడ; చనన్ రాదు= వెళ్ళ వీలుగాదు; నీకున్= రాజప్రాసాదవాసివైన నీకు; నిష్కంటకవృత్తిన్= నిరాటంకంగా; ఎవ్వఁడు= ఏ గురుడు; ప్రగల్భుఁడు= దిట్ట(ఐ) చెప్పెన్= బోధించాడు; చెప్పుమా= తెలియజెప్పు.

**తా :** మేమూ రాక్షసగురుకుమారులతో కలిసి జీవించాం. వారివద్దే శాస్త్రాలూ చదువుకొన్నాం. మాకూ, నీకు గూడ ఇతర గురువు లెవరూ లేరు. నీవుండే 'రాజప్రాసాదం, ఇతరులకు గాదు గదా స్వయంగా శివునకూ చొరరానిది. నీవు బయట ఎక్కడా విద్యాభ్యాసం చేయలేదు. మరి ఈ పరిస్థితులలో ఏ గొప్పగురువు నీకు భాగవతధర్మం తెలియజేసే విద్యను బోధించాడు? చెప్పు.

**క. సేవింతుము నిన్నెప్పుడు, భావింతుము రాజ వనుచు బహుమానములం**
**గావింతుము, తెలియము నీ, కీ వింత మతిప్రకాశ మే క్రియఁగలిగెన్? 221**

**ప్రతి :** నిన్ను+ఎప్పుడున్= నిన్ను ఎల్లప్పుడూ; సేవింతుము= కొలుస్తాం; రాజవు+అనుచున్= (కాబోవు) రాజువు అని; భావింతుము= తలుస్తాం; బహుమానములన్= కానుకలను; కావింతుము= చేస్తాం; నీకున్= మా రాజకుమారుడవైన

నీకు; తెలియము= తెలియదు; ఈ వింత= నీవు మాకు చెప్పే ఈ చోద్యమయిన; మతిప్రకాశము= బుద్ధితేజస్సు; ఏ క్రియన్= ఏ విధంగా; కలిగెన్= ఏర్పడింది?

**తా :** కుమారా! నీవు మాకు రాజపుత్రుడవు. ఎప్పుడు నీ సేవలోనే గడుపుతూ ఉంటాం. నిన్ను మాకు కాబోయే రాజుగా కూడా చూస్తాం. నీకు కానుకలూ సమర్పించుకుంటాం. కాని, ఆశ్చర్యకరంగా నీలో ఈ తెలివితేటల తేజస్సు ఎలా ఏర్పడిందో మాకు తెలియదు.

**వ. అని ఇట్లు దైత్యనందనులు ద న్నడిగినఁ బరమభాగవత కులాలంకారుండైన ప్రహ్లాదుండు నగి తనకుఁ బూర్వంబు వినంబడిన నారదు మాటలు దలంచి యిట్లనియె. 222**

**ప్రతి :** అని, ఇట్లు= అని ఈ విధంగా; దైత్యనందనులు= రాక్షసకుమారులు, తన్నున్= తనను, అడిగినన్= అడుగగా; పరమభాగవతకుల+ అలంకారుండు+ఐన= గొప్పభక్తులవంశానికి అలంకారంఅయిన, ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; నగి= నవ్వుతూ; తనకున్= తనకు; పూర్వంబు= ముందు, వినన్+పడిన= వినబడిన, నారదు మాటలు= నారదుని మాటలు, తలంచి= జ్ఞప్తికి తెచ్చుకొంటూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని పైవిధంగా రాక్షసకుమారులు తనను అడిగారు. అందుకు పరమభక్తుల్లో శ్రేష్ఠుడయిన ప్రహ్లాదుడు నవ్వుతూ, తాను పూర్వం నారదుని నుండి విన్న మాటల్ని స్మరించుకొంటూ ఇలా పలికాడు.

**శా. అక్షీణోగ్రతపంబు మందరముపై నర్థించి మా తండ్రి శు**
**ద్ధ క్షాంతింజని యుండఁ జీమగమిచేతన్ భోగిచందంబునన్**
**భక్షింపంబడెఁబూర్వపాపములచేఁబాపాత్మకుండంచు మున్**
**రక్షస్సంఘముమీఁద నిర్జరులు సంరంభించి యుద్ధార్థులై. 223**

**ప్రతి :** మున్= పూర్వం, మా తండ్రి= మా తండ్రి హిరణ్యకశిపుడు; మందరముపైన్= మందరం అనే కొండమీద; అక్షీణ+ఉగ్రతపంబు= గొప్ప భయంకరమైన తపస్సును; అర్థించి= కోరి; శుద్ధక్షాంతిన్= నిర్మలమైన ఓర్పుతో; చని+ఉండన్= వెళ్ళిఉండగా; నిర్జరులు= దేవతలు; పాప+ఆత్మకుండు= పాపమైన మనస్సుగలవాడు–హిరణ్యకశిపుడు; పూర్వపాపములచేన్= ముందు (తానుచేసిన) పాపాలచేత; చీమగమిచేతన్= చీమల సమూహంతో; భోగిచందంబునన్= పామువలె; భక్షింపన్+పడెన్= తినబడెను; అంచున్= అనుచు; రక్షస్+సంఘముమీఁదన్= రాక్షససమూహంమీద; సంరంభించి= వేగిరపడి; యుద్ధ+అర్థులు+ఐ= యుద్ధము కోరువారై...

**తా :** పూర్వమొకప్పుడు మా తండ్రి హిరణ్యకశిపుడు గొప్ప తపశ్చర్యకోసం మందరగిరి మీదికి ప్రశాంతంగా వెళ్ళి ఉండగా, దేవతలు ఆయనను జూచి “వీడు తన పూర్వపాపాలతో, చీమలదండుచేత జిక్కిన పామువలె ఆరగింపబడ్డాడనుకుని తొందరపాటుతో రాక్షసులపై యుద్ధానికి దిగి

**శా. ప్రస్థానోచితభేరిభాంకృతులతోఁబాకారియుందారు శౌ**
**ర్యస్థైర్యంబుల నేగుదెంచినఁదదీయాటోపవిభ్రాంతులై**
**స్వస్థేమల్ దిగనాడి పుత్రధనయోషామిత్రసంపత్కళా**
**ప్రస్థానంబులు డించి పాతి రసురుల్ ప్రాణావనోద్యుక్తులై. 224**

**ప్రతి :** పాక+అరియున్= పాకుడనే పేరుగల రాక్షసుని చంపినవాడు (ఇంద్రుడూ); తారున్= తామూ (దేవతలు); ప్రస్థాన+ఉచిత భేరి భాంకృతులతోన్= యుద్ధయాత్రకు తగిన భేరుల 'భాం భాం' అనే శబ్దాలతో; శౌర్యస్థైర్యంబులన్= పరాక్రమము గట్టితనములతో; ఏగుదెంచినన్= వచ్చిపడగా; తదీయ+ఆటోపవిభ్రాంతులై= వారిదైనసంరంభంవల్ల చెదిరినవారై; స్వస్థేమల్= తమ శరీరబలాలను; దిగన్+అడి= విడిచిపెట్టి; పుత్ర= కొడుకులు; ధన= డబ్బులు; యోషా= స్త్రీలు; మిత్ర= స్నేహితులు; సంపత్= సంపదలు; కళా= కళలు (ఈ అన్నింటి); ప్రస్థానంబులు= విధానాలు; డించి= వదలి; అసురుల్= రాక్షసులు; ప్రాణ+అవన+ఉత్+యుక్తులై= ప్రాణముల రక్షణకై ప్రయత్నించినవారై; పాఱిరి= పరుగెత్తారు.

**తా :** ఇంద్రుడు, దేవతలు, యుద్ధభేరుల మహాధ్వనులతో, పరాక్రమంతో దండెత్తి రాగా ఆ ఆర్భాటాన్ని గమనించిన రాక్షసులు బెదరిపోయి, తమశక్తి సామర్థ్యాలు ఉడిగి, తమ తమ కొడుకులను, స్నేహితులను, ఇళ్ళను, ఇల్లాంద్రను, ధనకనకవస్తువాహనాలను అన్నింటినీ విడిచిపుచ్చి, కేవలం తమప్రాణాలు కాపాడుకోవడంకోసం పారిపోయారు.

**మత్తకోకిలము.**

**ప్రల్లదంబున వేల్పు లుద్ధతిఁబాఱి రాజనివాసముం**
**గొల్లవెట్టి సమస్తవిత్తముఁగ్రూరతంగొనిపోవఁగా**
**నిల్లు సొచ్చి విశంకుఁడై యమరేశ్వరుండదలించి మా**
**తల్లిఁ దాఁజెఱవట్టె సిగ్గునఁదప్తయై విలపింపఁగాన్. 225**

**ప్రతి :** వేల్పులు= దేవతలు; ప్రల్లదంబునన్= కోపంతో; ఉత్+హతిన్= పొగరుతో; పాఱి= పరుగెత్తి; రాజనివాసమున్= రాజగృహాన్ని; కొల్ల+పెట్టి= కొల్లగొట్టి; సమస్త విత్తమున్= మొత్తం సంపదను; క్రూరతన్= కనికరం లేకుండా; కొనిపోవన్+కాన్= ఎత్తుకొని వెళ్ళగా; ఇల్లు+చొచ్చి= ఇంట ప్రవేశించి; అమర+ఈశ్వరుండు= దేవతలరాజు; విశంకుఁడై= సంశయంలేనివాడై; మా తల్లిన్= మా అమ్మను; అదలించి= భయపెట్టి; సిగ్గునన్= సిగ్గుతో; తప్త+ఐ= తపించినదై; విలపింపన్+కాన్= ఏడ్వగా; తాన్= తాను ఇంద్రుడు; చెఱ+పట్టెన్= బందీగా పట్టుకొనెను.

**తా :** దేవతలు క్రోధంతో రాజనివాసాలు చేరుకొని, అక్కడి సిరిసంపదలన్నింటిని ఏపాటి కనికరం లేకుండా కొల్లగొట్టి ఎత్తుకొని వెళ్ళారు. అప్పుడు వారి రాజు ఇంద్రుడు, అంతఃపురంలో దూరి, సిగ్గుతో ఏడుస్తున్న మా అమ్మను బెదిరించి ఏ సంకోచం లేకుండా చెరపట్టాడు.

**వ. ఇట్లు సురేంద్రుండు మా తల్లిం జెఱగొని పోవుచుండ న మ్ముగుద కురరి యను పులుఁగు క్రియ మొఱలిడినఁ దెరువున దైవయోగంబున నారదుండు పొడగని యిట్లనియె. 226**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సుర+ఇంద్రుండు= దేవతలరాజు; మా తల్లిన్= మా అమ్మను; చెఱగొనిపోవుచుండన్= చెరపట్టి తీసుకొనిపోవుచుండగా; ఆ+ముగుద= ఆ ముద్దరాలు; కురరి+అను= ఆడు లకుముకి పిట్ట అనే; పులుఁగుక్రియన్= పిట్ట వలె; మొఱలు+ఇడినన్= ఏడ్పులు-పెడబొబ్బలుపెట్టగా; తెరవునన్= దారిలో; నారదుండు= నారదముని; దైవయోగంబునన్= అదృష్టవశాన; పొడ+కని= గమనించి చూచి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** దేవేంద్రుని చెరలో జిక్కిన మా తల్లి, పెంటి లకుముకిపిట్ట లాగా పెద్దగా మొరపెడుతుండగా, ఆ దారిలో అదృష్టవశాన వెళ్తున్న నారదమహర్షి ఆ దృశ్యాన్నిచూచి, ఇలా అన్నాడు.

**ఉ. స్వర్భువనాధినాథ! సురసత్తమ! వేల్పులలోన మిక్కిలిన్**
**నిర్భరపుణ్యమూర్తివి, సునీతివి, మానినిఁబట్ట నేల? యీ**
**గర్భిణి నాతురన్ విడువు, కల్మషమానసురాలు గాదు, నీ**
**దుర్భరరోషమున్ నిలుపు దుర్జయుఁడైన నిలింపవైరిపైన్. 227**

**ప్రతి :** స్వర్+భువన+అధినాథ= స్వర్గలోకాధిపతీ!; సురసత్తమ!= దేవతలలో శ్రేష్ఠుడా!; వేల్పులలోనన్= దేవతలలో; మిక్కిలిన్= అధికంగా; నిర్భరపుణ్యమూర్తివి= అధిక పుణ్యశాలివి; సునీతివి= మంచి నీతిమంతుడవు; ఈ గర్భిణిన్= ఈ గర్భవతిని; ఆతురన్= బెదరినదానిని; విడువు= వదలిపెట్టు; కల్మషమానసురాలు, కాదు= పాపపు మనస్సు కలదిగాదు; నీ దుర్భరరోషమున్= నీ భరింపరాని క్రోధాన్ని; దుర్జయుఁడు+ఐన= జయింపరానివాడైన; నిలింపవైరిపైన్= హిరణ్యకశిపునిపై; నిలుపు= ఉంచు.

**తా :** స్వర్గమేలే సురశ్రేష్ఠా! ఇంద్రా! నీవు దేవతలలో పుణ్యాలరాశివి, నీతిమంతుడవు గూడ. బెదరి ఏడ్చే ఈ గర్భవతిని చెరబట్టడమెందుకు? వదలిపెట్టు. ఈమె పాపాత్మురాలు గాదు. నీకు రోషముంటే, దానిని దేవతల శత్రువైన హిరణ్యకశిపునిపై చూపించు అబలపై కాదు.

**వ. అనిన వేల్పుఁదపసికి వేయిగన్నుల రవర యిట్లనియె. 228**

**ప్రతి :** అనినన్= అని చెప్పగా; వేల్పున్+తపసికి= దేవతలఋషికి (నారదునకు); వేయి+కన్నుల రవర= వేయి కళ్ళుగల ప్రభువు (ఇంద్రుడు); ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** నారదుని మాటలకు ఇంద్రుడు బదులు ఇలా పలికినాడు.

**ఉ. అంతనిధానమైన దివిజాహితువీర్యము దీని కుక్షి న**
**త్యంతసమృద్ధి నొందెడి మహాత్మక! కావునఁదత్ప్రసూతి ప**
**ర్యంతము బద్ధఁజేసి జనితార్భకు వజ్రపుధారఁద్రుంచి ని**
**శ్చింతుఁడనై తుదిన్ విడుతు, సిద్ధము దానవరాజవల్లభన్. 229**

**ప్రతి :** అంతనిధానము+ఐన= నాశనానికి కారణమైనవాడు; దివిజ+అహితువీర్యము= రాక్షసుని తేజస్సు; దీని కుక్షిన్= ఈ స్త్రీ కడుపున; అతి+అంత సమృద్ధిన్= మిక్కిలి అభివృద్ధిని; ఒందెడిన్= పొందుతున్నది; మహా+ఆత్మక!= గొప్ప మనస్సున్నవాడా!; కావునన్= ఆ కారణాన; తద్+ప్రసూతిపరి+అంతము= ఆ కాన్పువరకు; బద్ధన్+చేసి= బందీగా ఉంచి; జనిత+అర్భకున్= పుట్టిన బాలుణ్ణి; వజ్రపుధారన్= వజ్రాయుధపు పదనుతో; త్రుంచి= నరికి; నిస్+చింతుఁడను+ఐ= చింతలేనివాడనై; తుదిన్= చివరకు; దానవరాజవల్లభన్= రాక్షసరాజు ప్రేయసిని; విడుతున్= వదలెదను; స్థిరము= నిశ్చయం.

**తా :** నాశనమునకు కారణమైన రాక్షసరాజు తేజస్సు ఈ స్త్రీ గర్భంలో పెరుగుతూ ఉంది. కాబట్టి, ఈమె ప్రసవించే వరకు బందీగా ఉంచి, అనంతరం, పుట్టిన బాలుణ్ణి నా వజ్రాయుధపు పదనుతో నరికి నిశ్చింతగా ఉంటాను. అపుడే ఈమెను విడిచిపెడతాను. ఇది నిశ్చయం.

**వ. అని పలికిన వేల్పుఱేనికిం దపసి యిట్లనియె. 230**

**ప్రతి :** అని పలికిన= అని పలుకగా; వేల్పుఱేనికిన్= ఇంద్రునకు; తపసి= నారదుండు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఆతని మాటకు బదులుగా. ఇంద్రునితో నారదుడిట్లంటున్నాడు

**శా. నిర్భీకుండు ప్రశస్తభాగవతుఁడున్ నిర్వైరి జన్మాంతరా**
**విర్భూతాచ్యుతపాదభక్తిమహిమావిష్టుండు దైత్యాంగనా**
**గర్భస్థుండగు బాలకుండు బహుసంగ్రామాద్యుపాయంబులన్**
**దుర్భావంబునఁబొంది చావఁడు భవద్దోర్దర్పవిభ్రాంతుఁడై, 231**

**ప్రతి :** దైత్య+అంగనా= రాక్షస స్త్రీ; గర్భస్థుండు+అగు= గర్భంలోనివాడగు; బాలకుండు= పిల్లవాడు; నిర్+భీకుండు= నిర్భయుడు; ప్రశస్తభాగవతుఁడున్= ప్రసిద్ధ భగవద్భక్తుడుగూడ; నిర్+వైరి= శత్రువులు లేనివాడు; జన్మ+అంతర= మరొక పుట్టుకయందు; ఆవిర్భూత= పుట్టిన; అచ్యుతపాదభక్తి= విష్ణుని అడుగులయందలి భక్తియొక్క; మహిమా+ఆవిష్టుండు= గొప్పదనంతో నిండినవాడు; బహుసంగ్రామ+ఆది+ఉపాయంబులన్= ఎక్కువ యుద్ధాలు మొదలైన ఉపాయాలతో; భవత్= నీ; దోర్దర్ప= భుజగర్వంతో; విభ్రాంతుఁడై= భ్రాంతికిలోనైనవాడై; దుర్భావంబునన్+పొంది= చెడుస్థితిని చెంది; చావఁడు= చావనే చావడు.

**తా :** రాక్షసరాజ్ఞి గర్భస్థశిశువు నిర్భయుడు. ప్రసిద్ధ భగవద్భక్తుడు. అతనికి శత్రువులు ఉండరు. అంతేగాదు. పూర్వజన్మవాసనగా అబ్బిన విష్ణుభక్తితో పరిపూర్ణుడు. అందువల్ల నీ భుజబలగర్వం ఆతనిపై ప్రభావం ఏమాత్రం చూపదు. ఏ యుద్ధాలలోను ఏ ఉపాయాలతోను ఆతడు చావడు.

**వ. అని దేవముని నిర్దేశించిన నతని వచనంబులు మన్నించి తానును హరిభక్తుండు గావున దేవేంద్రుండు భక్తిబాంధవంబున మా యవ్వను విడిచి వలగొని సురలోకంబునకుం జనియె, మునీంద్రుండు మజ్జననియందుఁ బుత్రికాభావంబు సేసి యూఱడించి నిజాశ్రమంబునకుం గొనిపోయి నీవు పతివ్రతవు, నీ యుదరంబునఁ బరమభాగవతుండయిన ప్రాణి యున్నవాఁడు, తపోమహత్త్వంబునం గృతార్థుండై నీ పెనిమిటి రాఁగలం, డందాఁక నీ విక్కడ నుండు మనిన సమ్మతించి. 232**

**ప్రతి :** అని దేవముని= అని నారదుడు; నిర్దేశించినన్= ప్రకటింపగా; ఆతని వచనంబులు= ఆతని మాటలు; మన్నించి= గౌరవించి; తానును హరిభక్తుండు+కావునన్= తానూ విష్ణుభక్తుడే కాబట్టి; దేవ+ఇంద్రుండు= దేవరాజు; భక్తి బాంధవంబునన్= భక్తి అనే బంధుత్వంతో; మా+అవ్వను= మా అమ్మను; విడిచి= వదలి; వలగొని= ప్రదక్షిణం చేసి; సురలోకంబునకున్= స్వర్గానికి; చనియెన్= వెళ్ళెను; ముని+ఇంద్రుండు= మునిరాజు నారదుడు; మత్+జననియందున్= నా తల్లిపట్ల; పుత్రికాభావంబు+చేసి= కూతురుగా భావించి; ఊరడించి= ఓదార్చి; నిజ+ఆశ్రమంబునకున్= తన ఆశ్రమానికి; కొనిపోయి= తీసికొనివెళ్ళి; నీవు పతివ్రతవు= నీవు భర్తయే జీవితంగా గలదానవు; నీ+ఉదరంబునన్= నీ కడుపున; పరమభాగవతుండు+ అయిన= గొప్పభగవద్భక్తుడైన; ప్రాణి= జీవి; ఉన్నవాఁడు= కలడు; నీ పెనిమిటి= నీ మగడు; తపస్+మహత్త్వంబునన్=

గొప్ప తపస్సుతో; కృత+అర్థుండై= నెరవేరిన ప్రయోజనం గలవాడై; రాన్+కలండు= వస్తాడు; అందాఁకన్= అంతదాక; నీవు+ఇక్కడన్+ఉండుము+అనినన్= నీవు ఇక్కడ ఉండుమనగా; సమ్మతించి= అంగీకరించి.

**తా :** నారదుని మాటలు గౌరవించిన ఇంద్రుడు తానును హరిభక్తుడు కాబట్టి నా తల్లిని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. నారదుడామెను కూతురువలె భావించి ఊరడించి, ఆమెను తోడ్కొని తన ఆశ్రమానికి వెళ్ళి, తపశ్చర్యకై వెడలిన నీ పెనిమిటి మరలి వచ్చేవరకు నా ఆశ్రమాన నిలువుమని మా అమ్మను తన దాపున నిలుపుకొన్నాడు.

**విశే :** ఇంద్రునికి హిరణ్యకశిపునిపై వైరం ఉంది కాని, లీలావతియందు పతివ్రత భావమే ఉన్నది. గర్భవతి అయిన స్త్రీని వధింపకూడదనే సనాతనధర్మాన్ని పాటించాడు. అందువల్లనే లీలావతిని ప్రదక్షిణంచేసి విడిచి వెళ్లాడు.

**శా. యోషారత్నము నాథదేవత విశాలోద్యోగ మా తల్లి, ని**
**ర్వైషమ్యంబున నాథురాక మదిలో వాంఛించి నిర్దోషయై**
**యీషద్భీతియు లేక గర్భపరిరక్షేచ్ఛన్ విచారించి శు**
**శ్రూషల్ సేయుచు నుండె నారదునకున్ సువ్యక్తశీలంబునన్. 233**

**ప్రతి :** మా తల్లి= మా అమ్మ; యోషారత్నము= స్త్రీలలో రత్నం; నాథదేవత= నాథుడే దేవతగా గలది; విశాల+ఉద్యోగ= విస్తృతమైన ప్రయత్నశీల; నిర్+వైషమ్యంబునన్= విరోధం లేకుండా; మదిలోన్= మనస్సున; నాథురాకన్= పతిరాకను; వాంఛించి= కోరి; నిస్+దోషయై= తప్పులేనిదై; ఈషత్+భీతియున్ లేక= కొంచెం భయంగూడ లేకుండ; గర్భపరిరక్షా+ఇచ్ఛన్= గర్భాన్ని కాపాడుకొనే కోర్కెతో; విచారించి= ఆలోచించి; నారదునకున్= నారదమహర్షికి; శుశ్రూషల్+చేయుచున్= సేవలుచేస్తూ; సువ్యక్తశీలంబునన్ ఉండెన్= విస్పష్టమైన తన సహజస్వభావంతో ఉన్నది. ఆశ్రమవాసం చేస్తున్నది.

**తా :** మా అమ్మ ఉత్తమురాలు. పతివ్రత, ప్రయత్నశీల. పతిరాకను నిరీక్షిస్తూ నిర్భయంగా నారదాశ్రమంలో తన గర్భరక్షణ చేసికొంటూ నారదసేవలో సంతోషంగా నివసిస్తూ ఉంది.

**వ. ఇట్లు దనకుఁ బరిచర్య సేయుచున్న దైత్యరాజకుటుంబినికి నాశ్రితరక్షా విశారదుండైన నారదుండు నిజసామర్థ్యంబున నభయం బిచ్చి గర్భస్థుండనైన నన్ను నుద్దేశించి ధర్మతత్త్వంబును నిర్మలజ్ఞానంబును నుపదేశించిన నమ్ముద్దియ దద్దయుం బెద్ద కాలంబునాఁటి వినికి గావున నాఁడుది యగుటం జేసి పరిపాటి దప్పి సూటిలేక మఱచె, నారదుండు నా యెడఁగృపగల నిమిత్తంబున. 234**

**ప్రతి :** ఇట్లు, తనకున్+పరిచర్య+చేయుచున్న= ఇలా తనకు సేవ చేస్తున్న; దైత్యరాజకుటుంబినికిన్= రాక్షస రాజపత్నికి; ఆశ్రితరక్షా విశారదుండు+ఐన= ఆశ్రయించినవారిని కాపాడుటలో నేర్పరిఅయిన నారదుండు; నిజసామర్థ్యంబునన్= తన సమర్థతతో; అభయంబు+ఇచ్చి= భయం లేదు అనేమాట నిచ్చి; గర్భస్థుండను+ఐన నన్నున్+ఉద్దేశించి= గర్భంలోఉన్న నన్నుగురించి; ధర్మతత్త్వంబును= ధర్మపు స్వభావాన్ని; నిర్మలజ్ఞానంబును= మలినంలేని తెలివిడిని; ఉపదేశించినన్= బోధించగా; ఆ+ముద్దియ= ఆ ముద్దరాలు; తద్దయున్= మిక్కిలి; పెద్దకాలంబునాఁటి వినికి+కావునన్= బహుకాలానికి ముందుదయిన వినుకలి కావడంచేత; ఆఁడుది+అగుటన్+చేసి= స్త్రీగావడం వలన; పరిపాటి= సంప్రదాయం; తప్పి= లేక; సూటిలేక= లక్ష్యంలేక; మఱచెన్= మరచిపోయింది; నారదుండు= నారదమహర్షి; నాయెడన్= నా యందు; కృప+కలనిమిత్తంబునన్= దయగలుగుట కారణంగా...

**తా :** తన సేవలో మునిగిన నా తల్లికి నారదుడు తన శక్తితో అభయప్రదానం చేసి, గర్భంలోఉన్న నన్ను గురించి ధర్మస్వరూప స్వభావాలను, పరిశుభ్రమైన జ్ఞానాన్ని ఉపదేశించాడు. అయితే, ఆమె స్త్రీకాబట్టి, ఏనాటి సంఘటనోకాబట్టి సంప్రదాయం తెలియదుగాబట్టి, ఆ ఉపదేశమంతటిని మరచింది. నారదుని దయవలన నాలో మాత్రం

**క. వెల్లిగొని నాఁటనుండియు, నుల్లసితంబైన దైవయోగంబున శో**
**భిల్లెడు మునిమత మంతయు, నుల్లంబున మఱపు పుట్ట దొకనాఁడైనన్. 235**

**ప్రతి :** నాఁటనుండియున్= ఆ నాటినుండీ; మునిమతము+అంతయున్= ఋషి మతం (అభిప్రాయం) మొత్తంగూడ; ఉత్+లసితంబు+ఐన= ప్రకాశించే; దైవయోగంబునన్= అదృష్టవశాన; వెల్లి+కొని= ప్రవహిస్తూ; ఉల్లంబునన్= మనస్సునందు; శోభిల్లెడున్= వెలుగును; ఒకనాఁడు+ఐనన్= ఏనాడూ; మఱపు పుట్టదు= మఱచుట గలుగదు.

**తా :** ఆ నాడు, మొదలు నా మనస్సున మాత్రం ఋషిమతం మొత్తం స్పష్టంగా నిలిచి ఉంది. అదృష్టవశాన ఏనాడూ మరపుకు రాలేదు.

**విశే :** భారతీయ సనాతన ధర్మానికి ఋషిమతం, మునిమతం అని మొదటి పేర్లు. వైదికమతం, సనాతనమతం, అనాదిమతం, అనికూడ పేర్లున్నాయి. 'మత' మంటే "అభిప్రాయం" ఇదే తర్వాత 'సంప్రదాయం'గా స్థిరపడింది. 'ధర్మ' మంటే 'సనాతనధర్మము'. స్థిరంగా, ఎప్పటికీ, నాశములేక నిలిచి ఉండేది సనాతనధర్మం. దీనినే పోతనగారు **'మునిమతము', తపసిమతము** అన్నారు. ఇవి మనమతానికి తొట్టతొలి పేర్లు.

**ఆ. వినుఁడు నాదు పలుకు విశ్వసించితి రేని, సతుల కయిన బాలజనుల కయినఁ**
**దెలియవచ్చు మేలు దేహాద్యహంకార, దళననిపుణమైన తపసిమతము. 236**

**ప్రతి :** నాదు పలుకున్= నా మాటను; వినుఁడు= వినండి; దేహ= దేహం; ఆది= మొదలైనవాటియందలి; అహంకార= నేనే అనే భావన; దళన= ఖండించుటయందు; నిపుణమైన= సమర్థమైన; తపసిమతము= ఋషిమతం; విశ్వసించితిరి+ఏని= మీరు నమ్మితే; సతులకైనన్= స్త్రీలకైన; బాలజనులకైనన్= పిల్లలకైన; మేలు= శుభం; తెలియన్+వచ్చు= తెలిసికోవచ్చు.

**తా :** బాలులారా! వినండి. నేను పలికేది ఋషిమతం, దీనిని నమ్మారంటే స్త్రీ బాల సహితంగా ఎల్లజనులూ శుభం పొందవచ్చు. ఇది దేహవ్యామోహాలను నాశనం చేయగలదు.

**వ. అని నారదోక్త ప్రకారంబున బాలకులకుఁ బ్రహ్లాదుం డిట్లనియె, నీశ్వరమూర్తియైన కాలంబునంజేసి వృక్షంబు గలుగుచుండ ఫలంబునకు జన్మసంస్థాన వర్ధనాపక్షీణత్వ పరిపాకనాశంబులు ప్రాప్తంబులైన తెఱంగున దేహంబునకుంగాని షడ్భావ వికారంబు లాత్మకు లే, వాత్మ నిత్యుండు, క్షయ రహితుండు, శుద్ధుండు, క్షేత్రజ్ఞుండు, గగనాదులకు నాశ్రయుండు, గ్రియాశూన్యుండు, స్వప్రకాశుండు,సృష్టి హేతువు, వ్యాపకుండు, నిస్సంగుండుఁ, బరిపూర్ణుండు, నొక్కండునని వివేక సమర్థంబులగు నాత్మలక్షణంబులు పండ్రెండు నెఱుంగుచు దేహాదులందు మోహజనకంబులగు నహంకార మమకారంబులు విడిచి పసిండి గనులు గల నెలవున విభ్రాజమాన కనకలేశంబులైన పాషాణాదులందుఁ బుటంబు పెట్టి వహ్ని యోగంబునఁ గరంగ నూది హేమకారకుండు పాటవంబున హాటకంబుఁ బడయుభంగి నాత్మకృత కార్యకారణంబుల నెఱింగెడి**

**నేర్పరి దేహంబునం దాత్మసిద్ధికొఱకు నయిన యుపాయంబునం జేసి బ్రహ్మ భావంబుఁ బడయు, మూలప్రకృతియు, మహదహంకారంబులును, బంచతన్మాత్రంబులు, నివి యెనిమిదియుం బ్రకృతులనియు, రజసత్త్వతమమంబులు మూడును బ్రకృతి గుణంబు లనియును, గర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాద పాయూపస్థంబులును జ్ఞానేంద్రియుంబులైన శ్రవణనయన రసనా త్వగ్ఘ్రాణంబులును మనంబును మహీసలిల తేజోవాయు గగనంబులును నివి పదాఱును వికారంబు లనియును గపిలాది పూర్వాచార్యులచేతఁ జెప్పంబడియె, సాక్షిత్వంబున నీ యిరువదేడింటిని నాత్మగూడియుండుఁ బెక్కింటి కూటువ దేహ, మదియు జంగమస్థావరరూపంబుల రెండు విధంబులయ్యె, మూలప్రకృతి మొదలయిన వర్గంబునకు వేఱై, మణిగణంబులం జొచ్చియున్న సూత్రంబు చందంబున నాత్మ యిన్నింటియందునుం జొచ్చి దీపించు, నాత్మకు జన్మస్థితి లయంబులు గలవంచు మిథ్యాతత్పరులుగాక వివేక శుద్ధమైన మనంబునం జేసి విచారించి దేహంబునం దాత్మ వెదకవలయు, నాత్మకు నవస్థలు గలయట్లుండుఁ గాని, యవస్థలు లేవు, జాగరణస్వప్న సుషుప్తులను వృత్తు లెవ్వనిచేత నెఱుగంబడు నతండాత్మయండ్రు, కుసుమధర్మంబులైన గంధంబులచేత గంధాశ్రయుండయిన వాయువు నెఱింగెడు భంగిం ద్రిగుణాత్మకంబులయి కర్మజన్యంబు లయిన బుద్ధిభేదంబుల నాత్మ నెఱుంగందగు నని చెప్పి. 237**

**ప్రతి :** అని, నారద+ఉక్త ప్రకారంబునన్= ఇలా నారదునిచే చెప్పబడినవిధంగా; బాలకులకున్= రాక్షసబాలకులతో; ప్రహ్లాదుండు+ఇట్లు+అనియెన్= ప్రహ్లాదుడు ఇలా అన్నాడు;ఈశ్వరమూర్తి+ఐన= భగవంతుని ఆకారమైన; కాలంబునన్+చేసి= కాలం వలన; వృక్షంబు+కలుగుచుండన్= చెట్టుపుట్టుచుండగా; ఫలంబునకున్= పండునకు; జన్మ= పుట్టుక; సంస్థాన= నిలుచుట; వర్ధన= పెరుగుట; అపక్షీణత్వ= తరిగిపోవుట; పరిపాక= పండబారుట; నాశంబులు= నశించుటలు; ప్రాప్తంబులు+ఐన తెఱంగునన్= వచ్చిచేరిన విధంగా; దేహంబునకున్+గాని= శరీరానికే తప్ప; షట్+భావవికారంబులు= ఆరువిధాలైన మార్పులు; ఆత్మకు లేవు= ఆత్మకు గలుగవు; ఆత్మనిత్యుండు= ఆత్మ శాశ్వతుడు; క్షయరహితుండు= నాశం లేనివాడు; శుద్ధుండు= నిర్మలుడు; క్షేత్రజ్ఞుండు= క్షేత్రాన్నెరిగినవాడు; గగన+ఆదులకున్= ఆకాశం మొదలయినవాటికి; ఆశ్రయుండు= ఆధారమైనవాడు; క్రియాశూన్యుండు= కర్మసంబంధం లేనివాడు; స్వప్రకాశుండు= తనంత తానే ప్రకాశించువాడు; సృష్టిహేతువు= సృష్టికి కారణుడు; వ్యాపకుండు= వ్యాపించేవాడు; నిస్సంగుండున్= దేనితోను సంబంధం లేనివాడు; పరిపూర్ణుండున్= అంతటా నిండినవాడు; ఒక్కండున్+అని= ఒక్కడే అని; వివేకసమర్థంబులగు= వివేకంతో తెలుసుకోవడానికి శక్తి గలవైన; ఆత్మలక్షణంబులు= ఆత్మ లక్షణాలు; పండ్రెండున్= పన్నెండింటిని; ఎఱుంగుచున్= తెలియుచు; దేహ+ఆదులందున్= శరీరం మొదలైన వాటిలో; మోహజనకంబులగున్= మోహాన్ని కలిగించేవైన; అహంకార, మమకారంబులు= నేను, నాది అనే భావాలు; విడిచి= వదలి; పసిండి గనులు గల నెలవునన్= బంగారు గనులున్నచోట; విభ్రాజమాన= విశేషంగా ప్రకాశించే; కనకలేశంబులు+ఐన= బంగారుతునుకలుగల; పాషాణ+ఆదులందున్= రాళ్ళు మొదలయిన వానిలో; పుటంబుపెట్టి= పుటము వేసి; వహ్నియోగంబునన్= నిప్పుకలయికతో; కరంగన్+ఊది= కరిగేటట్లు (నోటితో) ఊది; హేమకారకుండు= స్వర్ణకారుడు; పాటవంబునన్= సామర్థ్యంతో; హాటకంబున్+పడయుభంగిన్= బంగారాన్ని పొందే విధంగా; ఆత్మకృతకార్యకారణంబులన్= తనుచేసిన కార్యాలను, కారణాలను; ఎఱింగెడి నేర్పరి= తెలుసుకొనే జ్ఞాని; దేహంబునందున్= శరీరంలో; ఆత్మసిద్ధికొఱకున్+అయిన= ఆత్మజ్ఞానంకోసం అయినట్టి; ఉపాయంబునన్+చేసి=

సాధనవలన; బ్రహ్మాభావంబున్= బ్రహ్మస్థితిని; పడయున్= పొందును; మూలప్రకృతియున్= ఆది ప్రకృతీ; మహత్+ అహంకారంబులును= మహత్తు; అహంకారము – రెండును; పంచతన్మాత్రంబులున్= ఐదు తన్మాత్రలు; ఇవి ఎనిమిదియున్= ఈ ఎనిమిదీ; ప్రకృతులు అనియు= జగత్తుకు మూలమైన తత్త్వములు అని; రజసత్త్వ తమంబులు మూడును= రజోగుణం, సత్త్వగుణం, తమోగుణం అను మూడును; ప్రకృతిగుణంబులనియున్= మూలప్రకృతి గుణాలనియు; కర్మ+ఇంద్రియంబులు+ అయిన= పనులు చేసే ఐదు ఇంద్రియాలు; వాక్+పాణి పాద పాయు+ఉపస్థంబులును= నోరు, చేయి, కాలు, గుదము – ఆసనరంధ్రము, జననేంద్రియాలు; జ్ఞాన+ఇంద్రియంబులైన= తెలివిగలిగించే ఇంద్రియాలు; శ్రవణ నయన రసనా త్వక్+ఘ్రాణంబులు= చెవి, కన్ను, నాలుక, చర్మం, ముక్కులును; మనంబును= మనస్సూ, మహీ, సలిల, తేజో, వాయు; గగనంబులును= భూమి, నీరు, తేజస్సు, గాలి, ఆకాశాలు; ఇవి పదునాఱును= ఈ పదహారూ; వికారంబులు+అనియును= వికృతులనీ (మార్పులనీ); కపిల+ఆదిపూర్వ+ఆచార్యులచేతన్= కపిలుడు మొదలైన పూర్వ గురువులచేత; చెప్పన్+పడియెన్= చెప్పబడినవి; సాక్షిత్వంబునన్= సాక్షిగా ఉండి; ఈ+ఇరువదేడింటిని= ఈ ఇరవైయేడింటిని; ఆత్మ+కూడి+ఉండున్= ఆత్మ కలిసి ఉంటుంది; పెక్కింటి కూటువ= అనేకాల కలయిక; దేహము= శరీరం; అదియున్= అదిగూడ; జంగమస్థావరరూపంబులన్= నడిచెడివి నిలిచెడివి–అనే విధంగా, రెండు విధంబులు+అయ్యెన్= రెండు విధాలైనవి; మూల ప్రకృతి మొదలయిన= పైనచెప్పిన మూలప్రకృతి మొదలైన; వర్గంబునకున్= సమూహానికి; వేఱై= భిన్నమై; మణిగణంబులన్+చొచ్చి+ఉన్న= మణుల వరుసలో ప్రవేశించి ఉన్న; సూత్రంబు చందంబునన్= దారం విధంగా; ఆత్మ+ ఇన్నింటియందునున్= ఆత్మ ఈ చెప్పిన అన్నింటియందును; చొచ్చి దీపించున్= ప్రవేశించి ప్రకాశిస్తుంది; ఆత్మకున్= ఆత్మకుకూడ; జన్మస్థితిలయంబులు= పుట్టుక, ఉనికి, నాశాలు, కలవు+అంచున్= ఉన్నాయి అంటూ; మిథ్యాతత్పరులుగాక= అసత్యానికి వశమైనవారు గాకుండ; వివేకశుద్ధమైన= జ్ఞానంతో నిర్మలమైన; మనంబునన్+చేసి= మనస్సుతో; విచారించి= వివేచనచేసి; దేహంబునందున్= శరీరంలో, ఆత్మన్= ఆత్మను; వెదకవలయున్= కనుగొనవలెను; ఆత్మకున్+అవస్థలు= ఆత్మకు దశలు; కల+అట్లు+ఉండున్+కాని= ఉన్నట్లు ఉంటుంది గాని; అవస్థలు లేవు= దశలు లేవు; జాగరణ స్వప్నసుషుప్తులు+అనువృత్తులు= మేల్కొనుట, కలగనుట, నిద్రించుట అను స్థితులు, ఎవ్వనిచేతన్= ఎవ్వనిచేతను; ఎఱుగంబడు= తెలియబడుతాడో; అతండు= అతడు; ఆత్మయంద్రు= ఆత్మ అని అంటారు; కుసుమధర్మంబులు+అయిన= పూలస్వభావాలైన; గంధంబుచేతన్= వాసనలచే; గంధ+ఆశ్రయుండయిన= వాసనకు ఆధారమైన; వాయువును= గాలిని; ఎఱింగెడుభంగిన్= తెలిసికొనేవిధంగా; త్రిగుణ+ఆత్మకంబులు+అయి= సత్త్వ రజస్తమోగుణాల ఆకారంగలవై; కర్మజన్యంబులయిన= కర్మలవలన గలిగే; బుద్ధి భేదంబులన్= బుద్ధులలోని వేర్పాటువలన; ఆత్మన్= ఆత్మను, ఎఱుంగన్+తగున్+అనిచెప్పి= తెలియవచ్చునని చెప్పి.

**తా :** ప్రహ్లాదుడు రాక్షస బాలురతో నారదుడు చెప్పిన విధంగా ఇలా అన్నాడు. కాలం ఈశ్వరస్వరూపం. కాలంవల్ల చెట్టు కలుగగా చెట్టునుండి పండు (విత్తు) ఏర్పడుతుంది. కాగా చెట్టు ముందు, విత్తుగాదు. దానికి మాత్రం పుట్టుక, ఉనికి, పెరుగుదల, తగ్గుదల, పండబారుట, నశించుట అనే దశలు సంక్రమిస్తాయి. పండు శరీరం, దానికి మూలమైన కాలస్వరూపవృక్షం ఆత్మ, కాగా శరీరానికి తప్ప, పైన జెప్పిన ఆరు వికారాలు (పుట్టుక మొదలైనవి) ఆత్మకు లేవు. ఆత్మ నిత్యుడు, నాశరహితుడు, వ్యాపకుడు, బంధరహితుడు, నిండైనవాడు, ఒక్కడు (కేవలుడు), స్వయంగా వెలిగేవాడు, సృష్టికి మూలం, ఏ సాంగత్యమూ లేనివాడు, నిర్మలుడు, క్షేత్రమెరిగినవాడు, ఆకాశాదులకు ఆధారుడు. ఈ పండ్రెండు ఆత్మలక్షణాలు. వీటిని గ్రహించి, అహంకార మమకారాలను విడిచి, బంగారుగనులలోని మినుకుమినుకుమనే రాళ్ళను పుటం పెట్టి, నిప్పంటించి, కరిగించి, స్వర్ణకారుడు నేర్పుగా బంగారాన్ని కనుగొన్నట్లు, సాధకుడు శరీరంలో గల ఆత్మను సాధనాలద్వారా

గ్రహించగలగాలి. ప్రకృతులు ఎనిమిది ప్రకృతి గుణాలు మూడు, మూలప్రకృతి, మహత్తు, అహంకారం, ఐదు తన్మాత్రలు, కర్మేంద్రియాలు ఐదు, జ్ఞాన ఇంద్రియాలు ఆరు, భూతాలు ఐదు, ఈ పదహారూ వికారాలు అని కపిలమహర్షి మొదలైనవారి కథనం. ఈ మొత్తం ఇరవై ఏడింటినీ, ఆత్మ తాను సాక్షీభూతుడుగా కలిసి ఉంటాడు. ఈ అన్నిటితో కూడింది దేహం. అది రెండు విధాలు. స్థావరం (కదలనిది), జంగమం (కదిలేది) పైన చెప్పిన మూలప్రకృతి మొదలైన సమూహానికి భిన్నంగా మణుల వరుసల్లో దూరివున్న ధారంవలె ఆత్మ ఈ అన్నింటిలోనూ ప్రవేశించి ప్రకాశిస్తుంది. కాగా ఆత్మకు పుట్టుక, ఉనికి, నాశం ఉన్నాయని భ్రమించక దేహంలోని ఆత్మను పరిశుద్ధమైన మనస్సుతో విచారించి దేహంలో ఆత్మను వెదకి గ్రహించాలి. ఆత్మకు గూడ అవస్థలు, దశలు ఉన్నట్లు ఉంటుంది గాని, నిజానికి ఉండవు. గాలిని చూడలేకపోయినా, వాసననుబట్టి (గంధవహుడు) గ్రహించినట్లు శరీరంలో ఆత్మను గ్రహించాలి.

**విశే : ఆత్మ లక్షణాలు** 1. నిత్యుడు 2. నాశరహితుడు 3. శుద్ధుడు 4. క్షేత్రజ్ఞుడు 5. ఆకాశాదులకు ఆశ్రయుడు 6. నిష్క్రియుడు 7. స్వప్రకాశకుడు 8. సృష్టికి కారణమైనవాడు 9. సర్వత్రా వ్యాపించినవాడు 10. దేనితోనూ ఏ సంబంధమూ లేనివాడు 11. పరిపూర్ణుడు 12. ఏకమాత్రుడు.

**ప్రకృతులు** 1. మూలప్రకృతి 2. మహత్తు 3. అహంకారం 4. పంచతన్మాత్రులు

**పంచతన్మాత్రులు** 1. శబ్దం 2. స్పర్శం 3. రూపం 4. రసం 5. గంధం

**ప్రకృతి గుణాలు** 1. సత్త్వము 2. రజస్సు 3. తమస్సు.

**కర్మేంద్రియాలు** 1. నోరు 2. చేతులు 3. కాళ్ళు 4. గుదం 5. జననేంద్రియం.

**జ్ఞానేంద్రియాలు** 1. చెవులు 2. కళ్ళు 3. నాలుక 4. చర్మం 5. ముక్కు (ఉభయేంద్రియం – మనస్సు)

**పంచభూతాలు** 1. భూమి 2. నీరు 3. తేజస్సు 4. గాలి 5. నింగి

**షడ్భావాలు** 1. ఆస్తి–ఉండడం 2. జాయతే – పుట్టడం 3. వర్థతే – పెరగడం 4. విపరిణమతే –మార్పుచెందడం 5. అపక్షియతే – కృశించడం 6. నశ్యతి – నశించడం

**క్షేత్రజ్ఞుడు** శరీరానికే క్షేత్రం అని పేరు. క్షేత్ర తత్త్వాన్ని తెలుసుకున్నవాడు క్షేత్రజ్ఞుడు.

**సీ. సంసార మిది బుద్ధిసాధ్యము గుణకర్మ గణబద్ధ మజ్ఞానకారణంబు,**
**కలవంటి, దింతియ కాని నిక్కము గాదు, సర్వార్థములు మనస్సంభవములు,**
**స్వప్నజాగరములు సమములు, గుణశూన్యుఁడగు పరమునికి గుణాశ్రయమున**
**భవవినాశంబులు పాటిల్లి నట్లుండుఁ బట్టి చూచిన లేవు బాలురార!**

**తే. కడcగి త్రిగుణాత్మకములైన కర్మములకు, జనకమై వచ్చు నజ్ఞానసముదయమును**
**ఘనతర జ్ఞానవహ్నిచేcగాల్చి పుచ్చి, కర్మవిరహితులై హరిcగనుట మేలు. 238**

**ప్రతి :** ఇది సంసారము= ఈ కాపురం; బుద్ధిసాధ్యము= బుద్ధిచే సాధింపదగ్గది; గుణకర్మగణబద్ధము= గుణంచే కర్మచే కట్టబడినది; అజ్ఞానకారణంబు= తెలివితక్కువతనానికి మూలం; కలవంటిది= కలవలె కనిపించి నశించేది; ఇంతియకాని=

ఇంతేగాని; నిక్కము+కాదు= నిజం గాదు; సర్వ+అర్థములు= అన్నివిషయాలు; మనస్+సంభవములు= మనస్సునుండి పుట్టేవి; స్వప్నజాగరములు= నిద్ర, మెలకువలు; సమములు= సమానమైనవి; గుణశూన్యుఁడు+అగు= గుణాలు లేనివాడైన; పరమునకున్= పరమాత్మకు; గుణాశ్రయమునన్= గుణాన్ని, శరీరాన్ని అంటుకొని ఉండుటవలన; భవవినాశంబులు= పుట్టుక చావులు; పాటిల్లినట్లు+ఉండున్= ఏర్పడినట్లు ఉంటుంది; పట్టిచూచినన్= జాగ్రత్తగా గమనిస్తే; బాలురారా!= పిల్లలారా!; లేవు= ఉండవు; కడఁగి= యత్నించి; త్రిగుణ+ఆత్మకములు+ఐన= మూడు గుణాల స్వరూపాలయిన; కర్మములకున్= పనులకు; జనకమై= కారణమై; వచ్చున్+అజ్ఞాన సముదయమును= కలిగే అజ్ఞానపు గుంపును; ఘనతరజ్ఞానవహ్నిచేన్= మిక్కిలి గొప్పదైన తెలివి అనే నిప్పుతో; కాల్చిపుచ్చి= కాల్చిపారేసి; కర్మవిరహితులు+ఐ= కర్మలులేనివారై; హరిన్= విష్ణువును; కనుట= చూచుట; మేలు= శుభము.

**తా :** ఈ సంసారం కేవలం బుద్ధివలన ఏర్పడినది. గుణాలు సత్త్వరజస్తమాలు. వాటివలన కలిగే పనులనుండి పుడుతుంది. కలవంటిది. నిజమైనది గాదు, మనం చేసే, చూసే సమస్తమూ మన మనస్సు కల్పించినదే. నిద్ర, మెలకువ రెండూ ఒకటే. పరమాత్మ గుణరహితుడు. అయితే దేహాశ్రయుడైన కారణాన అతనికీ పుట్టుక నాశనం ఉన్నట్లు అనిపిస్తుంది. కాని వివేకంతో విచారించి చూస్తే ఉండవు.

బాలకులారా! సత్త్వరజస్ తమోగుణాలవలన కర్మలు జరుగుతాయి. ఆ కర్మలకు మూలమైన అజ్ఞానాన్ని, జ్ఞానమనే నిప్పుతో కాల్చివేసి, కర్మలనుండి బయటపడి, విష్ణువును గ్రహించుట శుభము.

**వ. అది గావున గురుశుశ్రూషయు సర్వలాభసమర్పణంబును, సాధుజన సంగమంబును, నీశ్వర ప్రతిమా సమారాధనంబును, హరికథాతత్పరత్వంబును, వాసుదేవునియందలి ప్రేమయు, నారాయణగుణకర్మ నామకీర్తనంబును, వైకుంఠ చరణకమలధ్యానంబును, విశ్వంభరమూర్తి విలోకన పూజనంబులును మొదలయిన విజ్ఞాన వైరాగ్య లాభసాధనంబులైన భాగవత ధర్మంబులపై రతిగలిగి సర్వభూతంబుల యందు నీశ్వరుండు భగవంతుండాత్మ గలండని సమ్మానంబు సేయుచుఁ గామ క్రోధ లోభమోహ మద మాత్సర్యంబుల గెలిచి యింద్రియ వర్గంబును బంధించి భక్తి సేయుచుండ నీశ్వరుండయిన విష్ణు దేవుని యందలి గతి సిద్ధించు. 239**

**ప్రతి :** అది+కావునన్= విషయమది గాబట్టి; గురుశుశ్రూషయున్= గురుసేవ; సర్వలాభ సమర్పణంబును= అన్ని లాభాలు అర్పించటం; సాధుజన సంగమంబునున్= సజ్జనులతో కలయిక; ఈశ్వరప్రతిమా సమారాధనంబును= దేవుని బొమ్మను పూజించుట; హరికథా తత్పరత్వంబును= విష్ణుని కథలయెడ ఆసక్తి; వాసుదేవుని యందలి ప్రేమయున్= కృష్ణునిపట్ల ప్రేమ; నారాయణ గుణకర్మనామ సంకీర్తనంబును= విష్ణువు గుణాలను, పనులను, పేళ్ళను పొగడుట; వైకుంఠ చరణకమలధ్యానంబును= విష్ణువు పాదపద్మాలను ధ్యానించుట; విశ్వంభరమూర్తి విలోకన పూజనంబులును= విశ్వాన్ని మోసేవాని ఆకారాన్ని చూడటం పూజించడాలు; మొదలయిన విజ్ఞాన వైరాగ్య లాభసాధనంబులు+ఐన= మొదలైన, విజ్ఞానవైరాగ్యాలను పొందుటకు ఉపాయాలయిన; భాగవత ధర్మంబులపైన్= భగవద్భక్తుల సత్కర్మలపై; రతి+కలిగి= ఆసక్తిగల్గి; సర్వభూతంబులయందున్= అన్ని ప్రాణాలలో; ఈశ్వరుండు= శక్తిమంతుండు; భగవంతుండు= దేవుడు అయిన; ఆత్మ+కలండని= ఆత్మ ఉన్నాడని; సమ్మానంబు+చేయుచున్= గౌరవించుచు; కామ= కోరిక, క్రోధ= కోపం, లోభ= పేరాస, మోహ= మత్తు, మద= పొగరు, మాత్సర్యంబులన్= ఇతరుల గొప్పదనాన్ని సహించకుండుటలను; గెలిచి=

జయించి; ఇంద్రియవర్గంబును= ఇంద్రియాల సమూహాన్ని; బంధించి= కట్టిపడవేసి; భక్తి+చేయుచుండన్= భక్తితో మెలగుచున్నట్లైతే; ఈశ్వరుండు+అయిన= శక్తిమంతుడయిన; విష్ణుదేవునియందలిగతి= విష్ణువులో లీనమయ్యే స్థితి; సిద్ధించున్= కలుగును.

**తా :** కాబట్టి గురుసేవ, కలుములన్నింటి సమర్పణము, సజ్జన సాంగత్యము, దేవుని బొమ్మను పూజించుట, హరికథలయెడ ఆసక్తి, కృష్ణప్రేమ, విష్ణువును పొగడుట, విష్ణుపాదపద్మ ధ్యానము, దైవసందర్శన సమారాధనలు, మొదలయిన భగవద్భక్తుల ధర్మాచరణపై ఆసక్తితో, సర్వప్రాణులు దైవసమానాలని భావిస్తూ అరిషడ్వర్గమును, ఇంద్రియాలను నియంత్రించి విష్ణుని చేరవచ్చును.

**విశే :** శుశ్రూష అనేశబ్దానికి, విను కోరిక – **"శ్రోతుమిచ్ఛా"** అని అర్థం. రూఢ్యర్థం 'సేవ'గా స్థిరపడినది.

**భాగవతధర్మములు :** 1. గురుపాదసేవ 2. సర్వసమర్పణం 3. సజ్జనసాంగత్యం 4. అర్చావతారపూజ 5. హరికథాశ్రవణం 6. వాసుదేవునిపైభక్తి 7. నారాయణ నామసంకీర్తన 8. విష్ణుపాదధ్యానం 9. అధ్యాత్మచింతన – ఇవి భాగవతధర్మాలుగా పోతన స్పష్టీకరించాడు.

**సీ. దనుజారి లీలావతారంబులందలి శౌర్యకర్మంబులు సద్గుణములు**
**విని భక్తుఁడగు వాఁడు వేడ్కతోఁబులకించి కన్నుల హర్షాశ్రుకణము లొలుక**
**గద్గదస్వరముతోఁ గమలాక్ష! వైకుంఠ! వరద! నారాయణ! వాసుదేవ!**
**యనుచు నొత్తిలి పాడు నాడు నాక్రోశించు నగుఁ జింతనము సేయు, నతి యొనర్చు**

**తే. మరులు కొనియుండుఁదనలోన మాటలాడు, వేల్పుసోఁకిన పురుషుని వృత్తిఁదిరుగు**
**బంధములఁబాసి యజ్ఞానపటలి గాల్చి విష్ణుఁ, బ్రాపించుఁదుది భక్తివివశుఁడగుచు. 240**

**ప్రతి :** భక్తుఁడు+అగువాఁడు= భక్తుడైనవాడు; దనుజ+అరిలీలా+అవతారంబులందలి= విష్ణుని లీలకొరకేర్పడిన అవతారకథలలోని; శౌర్యకర్మంబులు= పరాక్రమపుపనులు; సద్+గుణములు= మంచిగుణాలు; వినివేడ్కతోన్= సంతోషంతో విని; పులకించి= గగుర్పాటుచెంది; కన్నులన్= నేత్రాలలో; హర్ష+అశ్రుకణములు+ఒలుకన్= సంతోషపు కన్నీటిచుక్కలు జారగా; గద్గదస్వరముతోన్= బొంగురుపోయిన గొంతుతో; కమల+అక్ష!= తామరలవంటి కన్నులుగలవాడా; వైకుంఠ= వైకుంఠవాసీ!; వరద!= వరాలిచ్చేవాడా!; నారాయణ!= నీటనివసించేవాడా!; వాసుదేవ!= వసుదేవుని పుత్రుడా!; అనుచున్= అంటూ; ఒత్తిలి పాడున్= పెద్దగా పాడుతాడు; ఆడున్= నాట్యమాడుతాడు; ఆక్రోశించున్= పెద్దగా ఏడుస్తాడు; నగున్= నవ్వులాట; చింతనము+చేయున్= ఆలోచన చేస్తాడు; నతి+ఒనర్చున్= నమస్కారం చేస్తాడు; మరులుకొని+ఉండున్= మోహం పొందుతాడు; తనలోనన్+మాటలు+ఆడున్= తనతో తానే మాట్లాడుతాడు; వేల్పుసోఁకిన= భూతావిష్టుడైన, దయ్యంపట్టిన; పురుషునివృత్తిన్+తిరుగున్= నరుని ప్రవర్తనతో తిరుగాడుతాడు; తుదిన్= చిట్టచివరికి; బంధములన్+పాసి= కట్లు విప్పుకొని; అజ్ఞానపటలిన్= అజ్ఞాన సమూహాన్ని; కాల్చి= బూడిదచేసి; భక్తివివశుఁడు+అగుచున్= భక్తిభావానికి లొంగిపోయి; విష్ణున్+ప్రాపించున్= విష్ణువును పొందుతాడు.

**తా :** భక్తుడుగా మారిన నరుడు భిన్నంగా కనిపిస్తాడు. విష్ణుకథలు విని, వానిలోని శౌర్య ధైర్య గాథలు ఆలకించి పులకిస్తాడు. కళ్ళలో నీళ్ళు ఉబుకగా విష్ణునామ సంకీర్తనం చేస్తాడు. బిగ్గరగా పాడి ఆడతాడు, దేవునికై ఎలుగెత్తి

ఏడుస్తాడు, అంతలో ఆలోచనలో మునుగుతాడు, దేవునిపై మరులు కొంటాడు. దయ్యం పట్టినట్లు ప్రవర్తిస్తాడు. చిట్టచివరకు భవబంధాలు వీడి, అజ్ఞానరాసుల్ని దగ్ధం చేసి, దేవునిలో లీనమౌతాడు.

**వ. కావున రాగాదియుక్త మనస్కుండయిన శరీరికి సంసారచక్ర నివర్తకం బయిన హరిచింతనంబు బ్రహ్మమందలి నిర్వాణ సుఖంబెట్టి దట్టిదని బుధులు దెలియుదురు, హరి భజనంబు దుర్గమంబు గాదు, హరి సకల ప్రాణి హృదయంబుల యందు నంతర్యామియై యాకాశంబు భంగి నుండు, విషయార్జనంబుల నయ్యెడిది లేదు, నిమిషభంగుర ప్రాణులయిన మర్త్యులకు మమతాస్పదంబులును జంచలంబులును నైన పుత్రమిత్ర కళత్ర పశు భృత్య బల బంధు రాజ్య కోశ మణి మందిర మంత్రి మాతంగ మహీ ప్రముఖ విభవంబులు నిరర్థకంబులు. యాగప్రముఖ పుణ్యలబ్ధంబు లైన స్వర్గాదిలోక భోగంబులు, పుణ్యానుభవ క్షీణంబులుగాని నిత్యంబులు గావు, నరుండు విద్వాంసుండ నని యభిమానించి కర్మంబు లాచరించి యమోఘంబు లయిన విపరీతఫలంబుల నొందుఁ, గర్మంబులు గోరక చేయవలయుఁ, గోరి చేసిన దుఃఖంబులు ప్రాపించుఁ, బురుషుండు దేహంబు కొఱకు భోగంబుల నపేక్షించు, దేహంబు నిత్యంబు గాదు, తోడ రాదు, మృతంబయిన దేహంబును శునకాదులు భక్షించు, దేహి కర్మంబు లాచరించి కర్మబద్ధుండయి క్రమ్మఱం గర్మానుకూలంబైన దేహంబుఁ దాల్చు, నజ్ఞానంబునంజేసి పురుషుండు కర్మదేహంబుల విస్తరించు, నజ్ఞాన తంత్రంబులు ధర్మార్థ కామంబులు, జ్ఞానలభ్యంబు మోక్షంబు, మోక్షప్రదాత యగు హరి సకల భూతంబులకు నాత్మేశ్వరుండు, ప్రియుండు, దన చేతనయిన మహాభూతంబుల తోడ జీవసంజ్ఞితుం డయి యుండు, నిష్కాములై హృదయగతుం డయిన హరిని నిజభక్తిని భజింపవలయు.** **241**

**ప్రతి :** కావునన్= కనుక; రాగ+ఆదియుక్తమనస్కుండు+అయిన= రక్తి మొదలయిన వాటితో కూడిన మనస్సుగలవాడైన; శరీరికిన్= ప్రాణికి; సంసారచక్రనివర్తకంబు+అయిన= కుటుంబపు చక్రంనుండి మరల్చే; హరిచింతనంబు= విష్ణుమననం; బ్రహ్మమందలి= పరబ్రహ్మయందుండే; నిర్వాణ సుఖంబు= ముక్తిసౌఖ్యం; ఎట్టిది+అట్టిది+అని= ఎటువంటిదో, అటువంటిదని; బుధులు= పండితులు; తెలియుదురు= గ్రహిస్తారు; హరిభజనంబు= విష్ణుసేవ; దుః+ గమంబుగాదు= పొందరానిదిగాదు; హరి= విష్ణువు; సకలప్రాణిహృదయంబులయందున్= ఎల్లజీవుల మనస్సులలో; అంతః+యామియై= లోపల ఉండువాడై; ఆకాశంబుభంగిన్= ఆకాశంలాగా; ఉండున్= ఉంటాడు; విషయ+అర్జనంబులన్= సంపదలు కూడబెట్టటంవలన; అయ్యెడిదిలేదు= ఒరిగేది ఉండదు; నిమిషభంగురప్రాణులు+అయిన= క్షణంలో క్షీణించే జీవులయిన; మర్త్యులకున్= నరులకు; మమతా+ఆస్పదంబులును= మమత్వస్థానాలైనవి; చంచలంబులునున్= చలనశీలాలైనవి; ఐన= ఐనటువంటి; పుత్ర= కొడుకులు, మిత్ర= హితులు; కళత్ర= భార్యలు; పశు= గొడ్డుగోదలు; భృత్య= సేవకులు; బల= సేనలు; బంధు= చుట్టాలు; రాజ్య= ఏలుబడులు; కోశ= ధనరాసులు; మణి= విలువైన నవరత్నాలు; మందిర= భవనాలు; మంత్రి= మంత్రులు; మాతంగ= ఏనుగులు; మహీ= భూములు; ప్రముఖ= మొదలయిన; విభవంబులు= సంపదలు; నిస్+అర్థకములు= నిష్ప్రయోజకాలు; యాగప్రముఖ పుణ్యలబ్ధంబులు+ఐన= యజ్ఞం మొదలయిన పుణ్యాలవలన దొరికే; స్వర్గ+ఆదిలోకభోగంబులు= స్వర్గం మొదలైన పైలోకాలలోని సుఖాలు; పుణ్య+ అనుభవక్షీణంబులుగాని= పుణ్యాల అనుభవంతో నశించేవే కాని; నిత్యంబులు గావు= శాశ్వతాలు గావు; నరుండు= మానవుడు; విద్వాంసుండను+అని=

పండితుడినని; అభిమానించి= గర్వించి; కర్మంబులు+ఆచరించి= పనులుచేసి; అమోఘంబులయిన= వ్యర్థాలుగాని; విపరీతఫలంబులన్= వ్యత్యస్త (తిరుగబడ్డ) వ్యతిరేకమైన ఫలితాలను; ఒందున్= పొందుతాడు; కర్మంబులు= పనులు; కోరకచేయవలయున్= ఫలితాలను కోరకుండా చేయవలెను; కోరిచేసినన్= ఒకవేళ కోరిచేసినా; దుఃఖంబులు ప్రాపించున్= దుఃఖములు పొందును; పురుషుండు= నరుడు; దేహంబుకొఱకున్= శరీరం కోసం; భోగంబులన్= భోగాలను; అపేక్షించున్= కోరుతాడు; దేహంబు= శరీరం; నిత్యంబు+కాదు= శాశ్వతం గాదు; తోడన్‌రాదు= వెంట రాదు; మృతంబు+ అయినదేహంబును= చచ్చిన శరీరాన్ని; శునక+ఆదులు= కుక్కలు మొదలయినవి; భక్షించున్= తింటాయి; దేహి= ప్రాణి; కర్మంబులు+ఆచరించి= పనులుచేసి; కర్మబద్ధుండు+అయి= పనులచేత కట్టబడినవాడై; క్రమ్మఱన్= మళ్ళీ; కర్మ+అనుకూలంబు+అయిన= చేసిన పనికి తగినదైన; దేహంబున్+తాల్చున్= శరీరాన్ని ధరిస్తాడు; అజ్ఞానంబునన్+చేసి= అజ్ఞానంవలన; పురుషుండు= నరుడు; కర్మదేహంబులన్= పనులవలన కలిగే శరీరాలను; విస్తరించున్= పెంచుకొంటాడు; అజ్ఞానతంత్రంబులు= అజ్ఞానపు శాస్త్రాలు; ధర్మ+అర్థకామంబులు= ధర్మము, అర్థం, కామం అనే పురుషార్థాలు; జ్ఞానలభ్యంబు= జ్ఞానంవల్ల దొరికేవి; మోక్షంబు= ముక్తి; మోక్షప్రదాత+అగు= ముక్తిని ఇచ్చేవాడైన; హరి= విష్ణువు; సకలభూతంబులకున్= ఎల్లప్రాణులకు; ఆత్మ+ఈశ్వరుండు= ప్రాణనాథుడు; ప్రియుండు= ఇష్టమైనవాడు; తనచేతన్+అయిన= తాను నిర్మించిన; మహాభూతంబులతోడన్= భూమి మొదలయిన మూలప్రకృతులతో; జీవసంజ్ఞితుండు+అయి+ఉండున్= జీవుడుగా పేరుగల్గి ఉంటాడు; నిస్+కాములు+ఐ= కోరికలు లేనివారై; హృదయగతుండు+అయిన= హృదయంలోవున్న; హరిని= విష్ణుని; నిజభక్తిని= సత్యమైనభక్తితో; భజింపన్+వలయున్= సేవించాలి.

**తా :** కాబట్టి లౌకిక విషయాసక్తుడైన నరునికి సంసార చక్రభ్రమణంనుండి విముక్తి కల్గించే హరిస్మరణ బ్రహ్మానందంలాంటిదని పండితులంటారు. హరిసేవ సులభమైనదే. హరి సకలప్రాణుల హృదయాలలో ఆకాశంవలె నిండి ఉన్నాడు. లౌకికాలైన సంపాదనలవలన ఒరిగేది శూన్యమే. నిమిష మాత్రమే జీవించగల ప్రాణులైన మానవులకు "నావి" అనే భావాన్ని కల్గిస్తూ చంచలాలైన బిడ్డలు, స్నేహితులు, భార్యలు, పశువులు, సేవకులు, చతురంగబలాలు, చుట్టాలు, రాజ్యం, ధనాగారం, మణులు మాన్యాలు, ఇళ్లు మంత్రులు, ఏనుగులు భూములు మొదలైన వైభవాలు నిరర్థకాలు. యజ్ఞాలవల్ల వచ్చే పుణ్యాలకు ఫలితంగా లభించే స్వర్గసుఖాలు కూడా పుణ్యం అయిపోగానే అంతరిస్తాయి. అవి నిత్యాలు కావు. నరుడు తాను మహావిద్వాంసుడు అనుకుంటూ చేసే పనులు అతనికి వ్యతిరేకఫలితాలు కల్పించి దుఃఖంలో పడవేస్తాయి. ఫలం కోరకుండా కర్మలు చేయాలి. ఫలం కోరి చేస్తే దుఃఖాలు ప్రాప్తిస్తాయి. మానవుడు దేహంకోసమై భోగాలు కోరుకుంటాడు. దేహం క్షణభంగురం నరునకు తోడుగా వచ్చేదికాదు. మరణానంతరం అది కుక్కల నక్కల పాలవుతుంది. దేహి కర్మాచరణంవలన కర్మబద్ధుడవుతున్నాడు. పిదప తాను చేసిన కర్మలకు తగిన దేహాన్ని ధరిస్తాడు. అజ్ఞానంవల్ల జీవుడు కర్మకు తగిన దేహాలు విస్తరించుకుంటాడు. ధర్మార్థకామాలు అజ్ఞానమూలకాలు. జ్ఞానంచేతనే మోక్షం సిద్ధిస్తుంది. మోక్షప్రదాత శ్రీహరి ఒక్కడే. ఆయన సకలభూతాలలోని ఆత్మలకు ఈశ్వరుడు. ఇష్టమైనవాడు. తానే ఏర్పాటు చేసిన భూతాలతోకూడి జీవుడనే పేరుతో పిలువబడుతుంటాడు. కోరికలు లేకుండా తమ హృదయాలలో ఉన్న శ్రీహరిని మిక్కిలి భక్తితో సేవించాలి. అప్పుడే జీవులకు మోక్షం సిద్ధిస్తుంది.

**క. దానవదైత్య భుజంగమ, మానవగంధర్వ సురసమాజములో ల**
**క్ష్మీనాథు చరణకమల, ధ్యానంబున నెవ్వఁడయిన ధన్యత నొందున్. 242**

**ప్రతి :** దానవ= దనుజులైన రాక్షసులు; దైత్య= దితితనయులైన అసురులు; భుజంగమ= నాగులు; మానవ= నరులు; గంధర్వ= గంధర్వులు; సుర= దేవతలు – ఈ అందరి; సమాజములోన్= సమూహాలలో; ఎవ్వఁడు+అయినన్= ఏ ఒక్కడైనా; లక్ష్మీనాథు చరణకమల ధ్యానంబునన్= విష్ణుమూర్తి పాదపద్మధ్యానంతో; ధన్యతన్+ఒందున్= ధన్యత్వాన్ని పొందుతాడు.

**తా :** సృష్టిలోని సర్వ సమాజాలు, రాక్షసులు, నాగులు, నరులు, గంధర్వులు, దేవతలు వీరిలో ఎవ్వరైనా హరిచరణాలు ధ్యానించి ముక్తి పొందవచ్చు.

**క. చిక్కఁడు వ్రతములఁ గ్రతువులఁ, జిక్కఁడు, దానముల శౌచశీలతపములం**
**జిక్కఁడు, యుక్తిని భక్తిని, జిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ! 243**

**ప్రతి :** అచ్యుతుండు= హరి; వ్రతములన్= వ్రతాలతో; క్రతువులన్= యాగాలతో; చిక్కఁడు= దొరకదు; దానములన్= దానాలతో; శౌచశీలతపములన్= శుచిత్వంతోడి తపస్సులతో; చిక్కఁడు= లభించదు; యుక్తినిన్= ఉపాయంతోను; చిక్కఁడు= దొరకదు; భక్తినిన్= భక్తితో; చిక్కినక్రియన్= లభించినట్లుగా; (ఇది) సిద్ధము+సుండీ= నిక్కము సుమా!

**తా :** భక్తితో హరి దొరకినట్లుగా వ్రతాలు, జప తపాలు, యుక్తి ప్రయుక్తులు దాన ధర్మాలతో దొరకదు. ఇది నిజము.

**క. చాలదు భూదేవత్వము, చాలదు దేవత్వ మధికశాంతత్వంబుం**
**జాలదు, హరి మెప్పింప వి, శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్. 244**

**ప్రతి :** విశాల+ఉద్యములార!= విస్తృతమైన యత్నంగల ఓ హితులార!; హరిన్= విష్ణువును; మెప్పింపన్= తృప్తిపరచటానికి; భక్తి= భక్తిభావం; చాలినభంగిన్= సమర్థమైనట్లుగా; భూదేవత్వము= బ్రాహ్మణత్వం; చాలదు= సమర్థం గాదు; దేవత్వము= సురత్వం; అధికశాంతత్వంబున్= గొప్పశాంతిభావంగూడ; చాలదు= సరిపోదు.

**తా :** యత్న శీలురయిన బాలకులారా! హరిని మెప్పించుటకు భక్తి ఒక్కటే సమర్థమైనది. మిగిలిన బ్రాహ్మణత్వం, దేవత్వం, అధిక శాంతత్వం – ఇవి ఏవీ సరిపోవు.

**ఆ. దనుజభుజగయక్షదైత్యమృగాభీర, సుందరీ విహంగశూద్రశబరు**
**లైనఁబాపజీవు లైన ముక్తికిఁబోదు, రఖిల జగము విష్ణుఁడనుచుఁదలఁచి. 245**

**ప్రతి :** పాపజీవులైన= పాపాత్ములయిన; దనుజ= రాక్షసులు; భుజగ= నాగులు; యక్ష= యక్షులు; దైత్య= దితితనయులైన రాక్షసులు; మృగ+ఆభీర= జంతువులు మరియు గొల్లవారు; సుందరీ= స్త్రీలు; విహంగ= పక్షులు; శూద్ర= శూద్రులు; శబరులైనన్= బోయలు వీరెవరైనను; విష్ణుఁడు= హరియే; అఖిలజగము= లోకమాతా; అనుచున్+తలఁచి= అని స్మరించి; ముక్తికిన్+పోదురు= మోక్షానికి చేరగలరు.

**తా :** హరి ఎల్లలోకాల్లో నిండి, సర్వము తానై ఉన్నాడు అని తలచేవారు, పాపజీవులైనా ముక్తికి అర్హులే. వారు రాక్షసులైనా, నాగులయినా, యక్షులయినా, మృగాలయినా, గొల్లలయినా, స్త్రీలయినా, పక్షులయినా, శూద్రులయినా, బోయలైనా! అందరూ అర్హులే.

**క. గురువులు దమకును లోఁబడు, తెరువులు సెప్పెదరు, విష్ణుదివ్యపదవికిం**
**దెరువులు సెప్పరు చీఁకటిఁ, బరువులు పెట్టంగనేల? బాలకులారా! 246**

**ప్రతి :** బాలకులారా!= కుమారులారా!; గురువులు= ఉపాధ్యాయులు; తమకును లోఁబడు= తమకు వశమయ్యే; తెరువులు= దారులు; చెప్పెదరు= చెపుతారు; విష్ణుదివ్యపదవికిన్= హరిని చేరే దివ్యమార్గానికి; తెరువులు= దారులు; చెప్పరు= తెలుపరు; చీఁకటిన్= చీకటిలో; పరువులు= పరుగులు; పెట్టంగన్+ఏల= పెట్టట ఎందుకు?

**తా :** కుమారులారా! మన గురువులు, తమకు మనం లొంగి ఉండే మార్గాలు ఉపదేశిస్తారు తప్ప, హరిని చేరే మార్గం మాత్రం చెప్పరు. కాబట్టి, చీకట్లో పరుగులు పెట్టడ మెందుకు? ఇది కేవలం వ్యర్థప్రక్రియ.

**క. తెం డెల్ల పుస్తకంబులు, నిం డాచార్యులకు, మరల నేకతమునకున్**
**రండు, విశేషము సెప్పెదఁ, బొం డొల్లనివారు కర్మపుంజముపాలై. 247**

**ప్రతి :** ఎల్ల పుస్తకంబులున్= అన్ని పుస్తకాలు; తెండు= తీసికొని రండి; ఆచార్యులకున్= గురువులకు; ఇందు= ఇవ్వండి; మరలన్= ఇంకొకమారు; ఏకతమునకున్= ఏకాంత ప్రదేశానికి; రండు= వచ్చి చేరండి; విశేషము= విశిష్ట అంశం; చెప్పెదన్= బోధింతును; ఒల్లనివారు= అంగీకరించనివారు; కర్మపుంజముపాలై= కర్మలగుంపుకు లోనై; పొందు= వెడలిపొండి.

**తా :** పుస్తకాలన్నింటిని తెచ్చి గురువులకు అప్పగించండి. మళ్లీ ఏకాంతప్రదేశానికి రండి. మరొక విశేషం చెబుతాను. నా మాటలు వినని వారెవరైనా మీలో ఉంటే, వారు వెళ్ళిపొండి. ఎవరి కర్మకు వారే బాధ్యులు.

**క. ఆడుదము మనము, హరి రతిఁ, బాడుద మే ప్రొద్దు విష్ణుభద్రయశంబుల్,**
**వీడుదము దనుజసంగతిఁ, గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్. 248**

**ప్రతి :** మనము= మనం అందరం; హరిరతిన్= విష్ణుభక్తితో; ఆడుదము= నాట్యంచేద్దాం; ఏ ప్రొద్దున్= ఎప్పుడూ; విష్ణుభద్రయశంబుల్= శ్రీహరి శుభకీర్తులను; పాడెదము= కీర్తన చేసెద్దాం; దనుజ సంగతిన్= రాక్షసుల స్నేహాన్ని; వీడుదము= వదలేద్దాం; ముకుందభక్తకోటిన్= హరిభక్తుల బృందాలను; సూటిన్= నేరుగా; కూడుదము= చేరుదాం.

**తా :** మనం హరిభక్తితో ఆడుదాం. హరి కీర్తిప్రతిష్ఠలను, శుభకరమైనవాటిని పాడుకొందాం. రాక్షసులస్నేహాన్ని విడిచిపెడదాం. హరిభక్త కోటిలో సూటిగా చేరిపోదాం.

**క. విత్తము సంసృతిపటలము, వ్రత్తము కామాదివైరివర్గంబుల నేఁ**
**డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము, శుభమగు మనకున్. 249**

**ప్రతి :** సంసృతి పటలము= సంసార పరివారాన్ని; విత్తము= విడిచి వేద్దాం; కామ+ఆదివైరి వర్గంబులన్= కోర్కెలు మొదలయిన శత్రుసమూహాలను; వ్రత్తము= చీల్చేద్దాం; నేఁడు= ఈనాడు; చిత్తము= మన మనస్సు; హరికిని= విష్ణువుకు; ఇత్తము= ఇచ్చేద్దాం; నిర్వాణపదమున్= ముక్తిమార్గాన్ని; చొత్తము= ప్రవేశిద్దాం; మనకున్= మనకు; శుభము+అగున్= మేలు జరుగుతుంది.

**తా :** సంసార పరివారాన్ని విడుద్దాం. కోర్కెలు మొదలయిన, ముక్తివిరోధి గుణగణాలను చీల్చి చెండాడుదాం. నేడే మన మనస్సులను హరికి అర్పిద్దాం. ముక్తిమార్గాన ప్రవేశిద్దాం. మనకు శుభం కలుగుతుంది.

వ. అని యిట్లు ప్రహ్లాదుండు రహస్యంబున న య్యావేళల రాక్షస కుమారులకు నపవర్గమార్గంబు నెఱింగించిన వారును గురుశిక్షితంబులైన చదువులు చాలించి నారాయణ భక్తి చిత్తంబులం గీలించి యుండుటంజూచి వారల యేకాంతభావంబుఁదెలిసి వెఱచి వచ్చి శుక్రనందనుండు శక్రవైరి కిట్లనియె. 250

**ప్రతి :** అని= ఈ విధంగా; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; ఇట్లు, రహస్యంబునన్= ఇలా ఏకాంతప్రదేశాన; ఆ+ఆ+వేళలన్= ఆ యా సమయాలలో, రాక్షసకుమారులకు= రాక్షస బాలలకు; అపవర్గమార్గంబున్= ముక్తికిదారిని; ఎఱింగించినన్= తెలియజేయగా; వారును= ఆ కుమారులుగూడ; గురుశిక్షితంబులు+ఐన చదువులు= ఆచార్యులు ఉపదేశించిన చదువులను; చాలించి= మాని; నారాయణభక్తిన్= హరి భక్తిభావాన్ని; చిత్తంబులన్+కీలించి= మనస్సులలో పాదుకొల్పి; ఉండుటన్+చూచి= ఉండుటను కనుక్కొని; శుక్రనందనుండు= శుక్రాచార్యుని కొడుకు; వారల+ఏక+అంతభావంబు= ఆ పిల్లల అచంచలమైన మనస్సును; తెలిసి= గ్రహించి; వెఱచి= భయపడి; వచ్చి= చేరి; శక్రవైరికిన్= ఇంద్రుని విరోధి, రాక్షసరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** అని ఈ విధంగా ప్రహ్లాదుడు అనేక విధాలుగా అనుకూలమైన సమయాలలో రాక్షస కుమారులకు రహస్యంగా మోక్షమార్గం బోధించసాగాడు. అప్పుడు వాళ్ళందరూ గురువుల దగ్గర తమ చదువులు ఆపివేసి తమ హృదయాలను హృషీకేశునివైపు మళ్ళించారు. వాళ్ళ గురువు ఇది గమనించి, శిష్యుల భావాలు తెలుసుకుని, భయపడి హిరణ్యకశిపుని వద్దకు వచ్చి ఇలా మొరపెట్టుకున్నాడు.

శా. రక్షోబాలుర నెల్ల నీ కొడుకు చేరంజీరి లోలోన నా
శిక్షామార్గము లెల్లఁ గల్ల లని యాక్షేపించి తా నందఱన్
మోక్షాయత్తులఁ జేసినాఁడు, మనకున్ మోసంబు వాటిల్లె, నీ
దక్షత్వంబునఁజక్కఁజేయవలయున్ దైతేయవంశాగ్రణీ! 251

**ప్రతి :** దైతేయవంశ+అగ్రణీ= రాక్షసవంశశ్రేష్ఠుడా! నీ కొడుకు= నీ కుమారుడు; రక్షస్+బాలురను+ఎల్లన్= రాక్షసకుమారులందరినీ; చేరన్+చీరి= చేరదీసి; లోలోనన్= లోపల లోపల రహస్యంగా; నా శిక్షామార్గములు+ఎల్లన్= నేను చదువుచెప్పే ధోరణులు అన్నీ; కల్లలు+అని= అబద్ధాలని; ఆక్షేపించి= నిరసించి; తాను, అందఱన్= బాలలను; అందరినీ, మోక్ష+ఆయత్తులన్= ముక్తికి సిద్ధమైన వారినిగా, చేసినాఁడు= చేస్తున్నాడు; మనకున్= మన రాక్షసులకు; మోసంబు= అపాయం; వాటిల్లెన్= జరిగినది; నీ దక్షత్వంబునన్= నీ సమర్థతతో; చక్కన్+చేయన్+వలయున్= చక్కదిద్దవలసినది.

**తా :** రాక్షసరాజా! నీ కొడుకు రాక్షస బాలురందరినీ చేరదీసి రహస్యంగా నేను బోధించిన పాఠాలన్నీ అబద్ధాలని, నిరర్థకాలని, నిరసించి, వారిని ఆకట్టుకొని, తన బోధలతో, వారినందరినీ ముక్తిమార్గానికి మరలించాడు. మన రాక్షస వంశానికి పెద్దప్రమాదం వాటిల్లింది. ఇపుడు నీవు పూనుకొని నీ సమర్థత నిరూపించుకోవలసి ఉంది. వారినందరినీ మళ్లీ మన మార్గానికి తీసుకవచ్చి ఈ ప్రమాదాన్ని చక్కదిద్దవలసి ఉంది.

క. ఉల్లసితవిష్ణుకథనము, లెల్లప్పుడు మాకుఁజెప్పఁడీ గురుఁడని న
న్నుల్లంఘించి కుమారకు, లొల్లరు చదువంగ దానవోత్తమ! వింటే. 252

**ప్రతి :** దానవ+ఉత్తమ= రాక్షసశ్రేష్ఠా! వింటివి+ఏ= విన్నావా?; ఈ గురుఁడు= ఈ మా రాక్షసగురువు; మాకున్= శిష్యులమైన మాకు; ఎల్లప్పుడున్= ఏ సమయంలో; ఉత్+లసిత విష్ణు కథనములు= ఉజ్జ్వలమైన హరికథలు; చెప్పఁడు= బోధించడు; అని, నన్నున్= గురువునైన నన్ను; ఉత్+లంఘించి= దాటి, తిరస్కరించి; చదువన్+కన్= చదువుకోవడానికి (తన దగ్గర) ఒల్లరు= ఇష్టపడరు.

**తా :** రాజా! ఇది విన్నావా? రాక్షసబాలురు నన్ను తిరస్కరించి నా పాఠాలు వినడం మానేశారు. అందుకు కారణంగా వారు అంటున్నది ఇది. "ఈ గురుడు ఎప్పుడూ మాకు గొప్పవైన హరి కథలను చెప్పడు". అని.

**క. ఉడుగఁడు మధురిపు కథనము, విడివడి జడుపగిదిఁదిరుగు, వికసనమున నే**
**నొడివిన నొడువులు నొడువఁడు, దుడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా! 253**

**ప్రతి :** అధిపా!= రాజా! నీ కొడుకు= నీ పుత్రుడు; మధురిపు కథనము= విష్ణువు చరిత్రను; ఉడుగఁడు= మానడు; విడి+పడి= విడిగా – వేరుగా నిలిచి; జడుపగిదిన్= జడునివలె; తిరుఁగున్= తిరుగుతాడు; వికసనమునన్= వికాసంతో; నేన్= నేను; నొడివిన= పలికిన; నొడువులు= పలుకులు; నొడువఁడు= పలుకడు; దుడుకనిన్= దుష్టుడైన ఈ బాలుని; చదివింపన్= చదివించటం; మాకున్= గురులమైన మాకు; దుర్+లభము= కష్టం.

**తా :** రాజా! ప్రహ్లాదుడు హరికథలు మానడు. అందరిలో ఒకడిగా ఉండక వేరుగా నిలిచి, మందుని (బుద్ధిహీనుని)లాగా తిరుగుతాడు. నేను బోధించే పాఠాలు తాను తిరిగి పలుకడు. ఈ స్థితిలో ఈ అల్లరి పిల్లవాణ్ణి చదివించడం మాకు సాధ్యపడటం లేదు.

**క. చొక్కపు రక్కసి కులమున, వెక్కురు జన్మించినాఁడు విష్ణునియందున్**
**నిక్కపు మక్కువ విడువం, డెక్కడి సుతుఁగంటి? రాక్షసేశ్వర! వెఱ్ఱిన్ 254**

**ప్రతి :** రాక్షస+ఈశ్వర!= రాక్షసరాజా! చొక్కపు రక్కసి కులమునన్= చక్కని రాక్షస వంశాన; వెక్కురు= వెక్కిరింతగా (వికారమైనవాడు); జన్మించినాఁడు= పుట్టుకొచ్చినాడు; విష్ణునియందున్= హరియందు; నిక్కపు మక్కువన్= నిజమైన ప్రేమను; విడువండు= వదలి పెట్టడు; ఎక్కడి సుతున్= ఏ స్థలానికి చెందిన (ఈ స్థలానికి చెల్లడనుట) కొడుకును; వెఱ్ఱిన్= బుద్ధిలేనివాణ్ణి; కంటి= కన్నావు?

**తా :** రాజా! గొప్ప రాక్షస వంశంలో వికారమైన కొరగాని కొడుకుపుట్టాడు. నిత్యం హరిస్మరణ తప్పడు. విష్ణుభక్తి వదలడు. వీడెక్కడనుండి మనవంశానికి వచ్చి చేరాడు? వెఱ్ఱివాడు!

**వ. అని యిట్లు గురుసుతుండు చెప్పినఁ గొడుకువలని విరోధ వ్యవహారంబులు కర్ణరంధ్రంబులందు ఖడ్గ ప్రహారంబులయి సోఁకిన బిట్టు మిట్టిపడి పదాహతంబైన భుజంగంబు భంగిఁ, బవన ప్రేరితంబైన దవానలంబు చందంబున, దండతాడితం బయిన కంఠీరవంబు కైవడి, భీషణరోషరసావేశజాజ్వల్యమాన చిత్తుండును, బుత్రసంహారోద్యోగాయత్తుండును. గంపమాన గాత్రుండును, నరుణీకృత నేత్రుండును నై కొడుకును రప్పించి సమ్మానకృత్యంబులఁదప్పించి నిర్దయుండై యశనిసంకాశభాషణంబుల నదల్చుచు. 255**

**ప్రతి :** అనియిట్లు= అని ఈ విధంగా; గురుసుతుండు= గురుపుత్రుడు; చెప్పినన్= చెప్పగా; కొడుకు వలని విరోధ వ్యవహారంబులు= కుమారునిగూర్చి వినవచ్చిన వ్యతిరేకమైన పలుకులు; కర్ణరంధ్రంబులందున్= చెవి చిల్లులలో; ఖడ్గ ప్రహారంబులయి= కత్తి దెబ్బలయి; సోఁకినన్= తాకగా; బిట్టు= మిక్కిలి; మిట్టిపడి= ఎగిరిపడి; పద+ఆహతంబైన= కాలితో తన్నబడిన; భుజంగంబుభంగిన్= పాములాగా; పవన ప్రేరితంబయిన= గాలిచే ఎగదోయబడిన; దవ+అనలంబు చందంబునన్= కార్చిచ్చులా; దండ తాడితంబు+అయిన= కఱ్ఱతో కొట్టబడిన; కంఠీరవంబుకైవడిన్= సింహంలా; భీషణ= భయంకరమైన; రోషరస= రౌద్రరసపు; ఆవేశ= ప్రవేశంవలన; జాజ్వల్యమాన= మిక్కిలి రగిలిపోయే; చిత్తుండును= మనస్సుగలవాఁడు; పుత్ర= కుమారుడిని; సంహార+ఉద్యోగ+ఆయత్తుండునున్= చంపుటకొరకు సిద్ధమైనవాడు; కంపమానగాత్రుండునున్= అదురుతున్న శరీరం గలవాడు; అరుణీకృతనేత్రుండునున్+ఐ= ఎఱ్ఱగానైన కన్నులుగలవాడయి; కొడుకును రప్పించి= కుమారుణ్ణి రావించి; సమ్మానకృత్యంబులన్= మర్యాదతోకూడిన పనులను; తప్పించి= విడిచి; నిర్దయుండు+ఐ= దయలేనివాడై; అశనిసంకాశభాషణంబులన్= పిడుగులతో సమానమైన మాటలతో; అదల్చుచున్= భయపెడుతూ...

**తా :** గురుసుతుడు, వినిపించిన తన కొడుకును గురించిన మాటలు, తన చెవులపై కత్తిదెబ్బలలాగా తగిలి హిరణ్యకశిపుడు ఎగసిపడ్డాడు. కాలిదెబ్బ తిన్న పాములా, గాలితో చెలరేగిన అడవి నిప్పులా, కర్రదెబ్బతిన్న సింహంలా, భయంకర రౌద్రావేశంతో రగిలే మనస్సుతో, కొడుకును సంహరించడానికి సంసిద్ధుడై, శరీరం వణుకుతుండగా, కళ్ళు ఎఱ్ఱబడి నిప్పులు చిమ్ముతుండగా, కుమారుని రప్పించి, గౌరవాదరాలు విడిచిపెట్టి, దయమాలి పిడుగులవంటి మాటలతో బెదిరిస్తూ

**శా. సూనున్ శాంతగుణప్రధాను నతిసంశుద్ధాంచితజ్ఞాను న**
**జ్ఞానారణ్యకృశాను నంజలిపుటీసంభ్రాజమానున్ సదా**
**శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనా**
**ధీనున్ ధిక్కరణంబు సేసి పలికెన్ దేవాహితుండుగ్రతన్. 256**

**ప్రతి :** శాంత గుణప్రధానున్= శాంతగుణం ముఖ్యమైనవాడిని; అతిసంశుద్ధ+అంచితజ్ఞానున్= మిక్కిలి పరిశుద్ధమైన తెలివిగలవాడిని; అజ్ఞాన+అరణ్య కృశానున్= అజ్ఞానమనే అడవికి నిప్పు అయిన వాడిని; అంజలిపుటీ సంభ్రాజమానున్= ఒగ్గిన దోసిలితో ప్రకాశించేవాడిని; సదా= ఎల్లప్పుడు; శ్రీ= సిరిగల; నారాయణ= హరియొక్క పాదపద్మయుగళీ= తామరలవంటి అడుగుల జంటయొక్క; చింతా+అమృత= స్మరణ అనే అమృతంయొక్క; ఆస్వాదన+అధీనున్= రుచికి లోబడినవాడిని; సూనున్= కొడుకును; ధిక్+కరణంబు+చేసి= తిరస్కారంచేసి, ఛీకొడుతూ; దేవ+అహితుండు= దేవతాశత్రువు, హిరణ్యకశిపుడు; ఉగ్రతన్= క్రోధంతో; పలికెన్= అనెను.

**తా :** శాంతశీలంతో అతిపవిత్రంగా పరిశుద్ధజ్ఞానంతో ఒప్పేవాడు, అజ్ఞానపు అడవులకు అగ్నివంటివాడు, చేతులు జోడించి వెలుగొందేవాడు, సదా నారాయణుని పాదపద్మ ధ్యానమనే అమృతరస ఆస్వాదనంలో మునిగినవాడు అయిన కొడుకును ధిక్కారంతో అనాదరంతో, ఆ దేవవిరోధి ఉగ్రుడై ఇలా పలికాడు.

**సీ. అస్మదీయంబగు నాదేశమునఁ గాని మిక్కిలి రవి మింట మెఱయ వెఱచు,**
**నన్ని కాలములందు ననుకూలుఁడై కాని విద్వేషియై గాలి వీవ వెఱచు,**

**మత్ప్రతాపానలమందీకృతార్చియై విచ్చలవిడి నగ్ని వెలుఁగ వెఱచు,**
**నతితీక్ష్ణమైన నా యాజ్ఞ నుల్లంఘించి శమనుండు ప్రాణులఁజంప వెఱచు,**

**తే. నింద్రుఁ డౌదల నా మ్రోల నెత్త వెఱచు, నమర కిన్నర గంధర్వ యక్ష విహగ**
**నాగ విద్యాధరావలి నాకు వెఱచు, నేల వెఱవవు? పలువ! నీ కేది దిక్కు? 257**

**ప్రతి :** అస్మదీయంబగు= మాది అయిన; ఆదేశమునన్+కాని= ఆజ్ఞతోగాని; రవి= సూర్యుడు; మింటన్= ఆకాశంలో; మిక్కిలి= ఎక్కువగా; మెఱయన్= ప్రకాశించటానికి; వెఱచున్= భయపడుతాడు; అన్నికాలములందున్= ఎల్లవేళలలో; అనుకూలుఁడై+కాని= అనుకూలుడుగా తప్ప; గాలి= వాయువు; విద్వేషి+ఐ= ద్వేషంతో; వీవన్= ప్రసరించడానికి; వెఱచున్= భయపడుతాడు; మత్+ప్రతాప+అనలమందీకృత+అర్చియై= నా పరాక్రమమనే అగ్నివలన తగ్గించబడిన జ్వాలలుగలవాడై; అగ్ని= అగ్నిదేవుడు; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; వెలుఁగన్= మండుటకు; వెఱచున్= భయపడుతాడు; అతితీక్ష్ణమైన= మిక్కిలి చురుకైన; నా+ఆజ్ఞన్= నా ఆనతిని; ఉల్లంఘించి= దాటి; శమనుండు= యముడు; ప్రాణులన్= జీవులను; చంపన్= చంపటానికి; వెఱచున్= భయపడుతాడు; ఇంద్రుఁడు= దేవేంద్రుడు; నా మ్రోలన్= నా యెదుట; ఔదలన్= తలను, మొగమును; ఎత్తన్= ఎత్తటానికి; వెఱచున్= భయపడుతాడు; అమర= దేవతలు; కిన్నర= కిన్నరులు; గంధర్వ= గంధర్వులు; యక్ష= యక్షులు; విహగ= పక్షులు; నాగ= పాములు; విద్యాధర= విద్యాధరులు ఈ అందరి; ఆవలి= సమూహం; నాకున్= ననుజూచి; వెఱచున్= భయపడుతుంది; పలువ= ఓ తుంటరీ!; ఏల వెఱువవు= ఎందుకు భయపడవు? నీకున్= నీకు; దిక్కు+ఏది?= శరణ మెవడు?

**తా :** సూర్యుడు నా ఆజ్ఞ లేక ఆకాశాన ప్రకాశించడానికి భయపడతాడు. వాయువు నాకు అనుకూలంగా తప్ప కాలమేదైనా వీయడానికి జంకుతాడు. అగ్ని, నా పరాక్రమపు వేడిమికి తలఒగ్గి, తగ్గి వెలుగుతాడు. నాకు భయపడతాడు. యముడు నా ఆనతిలేకుండా జీవుల ప్రాణాలు తీయడానికి భయపడతాడు. ఇంద్రుడూ నాముందు తల ఎత్తడానికి జంకుతాడు. సురలు, కిన్నరులు మొదలైన దేవగణం అందరూ నాకు భయపడేవారే! ఒరే తుంటరీ! నీవు ఒక్కడవు మాత్రం నాకు ఎందుకు భయపడవు? నేను కోపగిస్తే నీకు దిక్కెవరు?

**శా. ప్రజ్ఞావంతులు లోకపాలకులు శుంభద్వేషు లయ్యున్ మదీ**
**యాజ్ఞాభంగము సేయనోడుదురు, రోషాపాంగదృష్టిన్ వివే**
**క జ్ఞానచ్యుతమై జగత్త్రితయముంగంపించు, నీ విట్టిచో**
**నాజ్ఞోల్లంఘన మెట్లు సేసితివి? సాహంకారతన్ దుర్మతీ! 258**

**ప్రతి :** దుర్+మతీ= దుష్టబుద్ధీ!; ప్రజ్ఞావంతులు= బుద్ధిగలవారు; లోకపాలకులు= దిక్పాలకులు; శుంభత్+వేషులు+అయ్యున్= ప్రకాశించే వస్త్రాలంకారాలు గలవారైకూడ; మదీయ+ఆజ్ఞాభంగము= నా ఆజ్ఞ ధిక్కరణ; చేయన్+ఓడుదురు= చేయటానికి చాలరు, వెనుకాడుతారు; రోష= క్రోధంతో; అపాంగ= క్రీగంటి; దృష్టిన్= చూపుతో; జగత్+త్రితయమున్= ముల్లోకాలుగూడ; వివేకజ్ఞానచ్యుతమై= తెలివితేటల నుండి జారినవై; కంపించున్= వణకును; ఇట్టిచోన్= ఈ స్థితిలో; నీవు= అర్భకుడవైన నీవు; స+అహంకారతన్= అహంకార సహితంగా; ఆజ్ఞా+ఉల్లంఘనము= ఆనతిని దాటడం; ఎట్లు+చేసితివి= ఏ విధంగా; ఏ ధైర్యంతో, చేయగలిగితివి?

**తా :** ఓరి అల్పజ్ఞుడా! ప్రభావశాలురైన లోకపాలకులే నా ఆజ్ఞను దాటడానికి జంకుతారు. కోపగించి నేను కన్నుతెరిస్తే చాలు ముల్లోకాలూ నా క్రీగంటి చూపుకే మతిపోయినట్లు వణకుతాయి. కాగా, అహంకారంతో కేవలం నీవు ఒక్కడవు నా ఆజ్ఞను భంగపరచడానికి ఎలా సాహసించావు?

**శా. కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ! వై**
**కుంఠుంజెప్పెదు దుర్జయుం డనుచు, వైకుంఠుండు వీరవ్రతో**
**త్కంఠాబంధురుఁడేని నే నమరులన్ ఖండింప దండింపఁగాఁ**
**గుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్? 259**

**ప్రతి :** డింభ= అర్భకా! కంఠక్షోభము+కాఁగన్= గొంతునొప్పి పుట్టేటట్లుగా; ఒత్తిలి= నొక్కి; మహాగాఢంబుగాన్= చాలగంభీరంగా; వైకుంఠున్= విష్ణువును; దుర్జయుండు+అనుచున్= జయింపరానివాడు అంటూ; చెప్పెదు= చెప్తా; వైకుంఠుండు= విష్ణువు; వీరవ్రత+ఉత్కంఠాబంధురుఁడు+ఏని= వీరధర్మ రక్షణ సమర్థుడైతే; నేను= నేను, అమరులన్= దేవతలను; ఖండింపన్+దండింపన్+కాన్= నరుకుతూ, శిక్షిస్తుండగా; మత్+ఘోర+ఆహవక్షోణికిన్= నా భయంకర యుద్ధభూమికి; కుంఠీభూతుఁడు= వెనుకంజవేసినవాడు; కాక= కాకుండ; రావలదె= రావద్దా?

**తా :** అర్భకా! గొంతు నొప్పి పుట్టేటట్లు మాటిమాటికీ హరి దుర్జయుడని చెబుతుంటావు గదా! అదే నిజమై ఉంటే, నేను అమరావతిపై దండెత్తి దేవతలందరినీ నరికి శిక్షిస్తుంటే, ఆ యుద్ధరంగానికి జంకకుండా వచ్చి తనవారిని రక్షించుకోవద్దా? మరి రాలేదెందుకు?

**శా. ఆచార్యోక్తము గాక బాలురకు మోక్షాసక్తిఁబుట్టించి నీ**
**వాచాలత్వముఁజూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్య వం**
**శాచారంబులు నీఱు సేసితివి, మూఢాత్మ్మం గులద్రోహి నిన్**
**నీచుంజంపుట మేలు, చంపి కులమున్ నిర్దోషముంజేసెదన్. 260**

**ప్రతి :** బాలురకున్= రాక్షసకుమారులకు; ఆచార్య+ఉక్తము+కాక= గురునిచే చెప్పబడినదికాకుండ; మోక్ష+ఆసక్తిన్+పుట్టించి= మోక్షమందు కోర్కెను గలిగించి; నీవాచాలత్వమున్+చూపి= నీ వదరుబోతు తనాన్ని చూపి; అహితున్= శత్రువైన; విష్ణున్= హరిని; వర్ణించి= పొగడి; మత్+దైత్యవంశ+ఆచారంబులు= నా రాక్షసవంశ సంప్రదాయాలు; నీఱు+చేసితివి= నీరుగార్చావు; మూఢ+ఆత్మన్= తెలివిలేని మనస్సుగల; కులద్రోహిన్= కులానికి ద్రోహం చేసిన; నీచున్= హీనుని, నిన్+చంపుటమేలు= నిన్ను చంపడమే ఉత్తమము; చంపికులమున్= అలా నిన్ను సంహరించి వంశాన్ని; నిర్+దోషమున్= దోషము లేనిదానినిగా; చేసెదన్= చేయగలను.

**తా :** గురువు చెప్పని మోక్షాన్ని గురించి బాలురకు నేర్పి, దానిలో వారికి ఆసక్తి గల్గించి, నీ వదరుబోతుతనాన్ని ప్రదర్శించావు. మన వంశద్రోహి అయిన హరిని పొగడి నా వంశాచారాన్ని బూడిద చేశావు. ఇటువంటి హీనుని నిన్ను చంపడం ఉత్తమకార్యం. అందువల్ల నిన్ను చంపి నా వంశాన్ని దోషరహితం చేస్తాను.

**క. దిక్కులు గెలిచితి నన్నియు, దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్**
**దిక్కుల రాజులు వేఱొక, ది క్కెఱుఁగక కొలుతు రితఁడె దిక్కని నన్నున్. 261**

**ప్రతి :** అన్నియున్ దిక్కులు= దిక్కులు అన్నింటిని; గెలిచితిని= జయించాను; ఓరి= ఓ డింభక!; నీకున్= నీకు; దిక్కు+ ఎవ్వఁడురా!= రక్షకుడెవ్వడురా!; దేవ+ఇంద్ర+ఆదుల్= దేవేంద్రుడు మొదలయిన; దిక్కులరాజులు= దిక్పాలకులు; వేఱు+ఒకదిక్కు+ ఎఱుఁగక= మరొక రక్షణ తెలియక; ఇతఁడె దిక్కు+అని= ఈయనే రక్షకుడని; నన్నున్= నన్నే; కొలుతురు= సేవిస్తారు.

**తా :** ఓరి అర్భకా! అన్ని దిక్కులూ జయించాను. దేవేంద్రుడు మొదలు దిక్పాలకు లందరు, రక్షణ కరవై నన్నొక్కనినే దిక్కని సేవిస్తున్నారు.

**క. బలవంతుఁడ నే జగముల, బలములతోఁ జనక వీరభావమున మహా**
**బలుల జయించితి, నెవ్వని, బలమున నాడెదవు నాకుఁ బ్రతివీరుఁడవై. 262**

**ప్రతి :** నేన్= నేను; బలవంతుఁడన్= బలశాలిని; బలములతోన్+చనక= సేనలతో వెళ్ళకుండ; వీరభావమునన్= వీరత్వంతో; మహాబలులన్= గొప్పశక్తిమంతులను; జయించితిన్= గెలిచాను; నాకున్= ఇట్టి నాకు; ప్రతివీరుఁడవై= ప్రత్యర్థివై; ఎవ్వనిబలమునన్= ఏ వాని బలసహాయంతో; ఆడెదవు= బదులు పలికుతావు?

**తా :** నేను ఇతరులలాగా, సేనలతో దండెత్తి గాక, నా ఒక్కని శౌర్యంతోనే మహాబలు లెందరినో ఎదిర్చి జయించాను. అట్టి నాకు ప్రత్యర్థివై ఏ బలంతో మాట్లాడుతున్నావురా?

**వ. అనినఁ దండ్రికి మెల్లన వినయంబునఁ గొడు కిట్లనియె. 263**

**ప్రతి :** అనినన్= అనగా; తండ్రికిన్= హిరణ్యకశిపునకు; మెల్లనన్= మెల్లగా; వినయంబునన్= అణకువతో; కొడుకు= ప్రహ్లాదుడు; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** తండ్రి ఈ విధంగా గద్దిస్తే, కొడుకు మెల్లగా అణకువతో ఇలా అన్నాడు.

**క. బలయుతులకు దుర్బలులకు, బల మెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్**
**బల మెవ్వఁడు ప్రాణులకును, బల మెవ్వండట్టి విభుఁడు బల మసురేంద్రా! 264**

**ప్రతి :** అసుర+ఇంద్రా!= రాక్షసరాజా!; ఎవ్వఁడు= ఏవాడు, బలయుతులకున్= బలవంతులకు; దుర్+బలులకున్= బలహీనులకు; బలము= బలమో, ఎవ్వఁడు నీకున్ నాకున్= ఎవ్వడయితే నీకూ, నాకూ; బ్రహ్మ+ఆదులకున్= బ్రహ్మమొదలయినవారికి; బలము= బలమో; ఎవ్వండు= ఎవ్వడు; ప్రాణులకున్= జీవులకు (అన్నింటికి); బలము= బలమో; అట్టి విభుఁడు= అట్టి ప్రభువు; బలము= బలము; నాకు శక్తిప్రదాత,

**తా :** రాక్షసరాజా! లోకంలోగల అందరికి, బలవంతులకు బలహీనులకు, ఎవడు బలమో; నీకు, నాకు, బ్రహ్మ మొదలయిన వారికి సకల ప్రాణులకు ఎవడు బలమో, అట్టి ప్రభుడే నాకు బలం. వాడే నాకు శక్తిప్రదాత.

**విశే :** 'దుర్బలస్య బలం రాజా' – బలహీనులకు రాజే బలం అన్నది సామాజిక న్యాయానికి చెందింది. రాజు లౌకిక జీవితానికి బలం. దేవుడు ముముక్షువులకు ఆత్మబలం.

**క. దిక్కులు కాలముతో నే,దిక్కున లేకుండుఁ, గలుగు దిక్కుల మొదలై**
**దిక్కు గల లేని వారికి, ది క్కయ్యెడు వాఁడు నాకు దిక్కు మహాత్మా! 265**

**ప్రతి :** మహా+ఆత్మా!= గొప్ప మనస్సుగలవాడా!; కాలముతోన్= కాలంతో; దిక్కులు= తూర్పు పడమరలవంటి దిక్కులు; ఏ దిక్కునన్= ఏ వైపున; లేక+ఉండున్= లేకుండా ఉంటాయి?; కలుగున్= ఉంటాయి; దిక్కుల మొదలు+ఐ= దిక్కులకు ఆద్యుడై, దిక్కు గల లేనివారికిన్= దిక్కుగలవారికి, దిక్కు లేనివారికీ; దిక్కు+అయ్యెడు వాఁడు= ఆధారంగా నిలిచేవాడు; నాకున్= నాకుకూడా; దిక్కు= రక్షకుడు.

**తా :** ఓ మహాత్మా! దిక్కులు కాలంతో పాటుగా ఏర్పడ్డాయి. కాబట్టి, దిక్కు లేకపోవడం అనేది లేదు. ఈ దిక్కులకు మూలమైనవాడు ఎవడో, దిక్కు లేనివారికి దిక్కైనవాడు ఎవడో, వాడే నాకూ దిక్కు.

**సీ. కాలరూపంబులఁ గ్రమవిశేషంబుల నలఘుగుణాశ్రయుండయిన విభుఁడు**
**సత్త్వబలేంద్రియసహజప్రభావాత్ముఁడై వినోదంబున నఖిలజగముఁ**
**గల్పించు, రక్షించు, ఖండించు, నవ్యయుం డన్ని రూపములందు నతఁడు గలఁడు**
**చిత్తంబు సమముగాఁ జేయుము, మార్గంబుఁదప్పి వర్తించు చిత్తంబుకంటె**

**తే. వైరు లెవ్వరు, చిత్తంబు వైరిగాక, చిత్తమును నీకు వశముగాఁజేయవయ్య!**
**మదయుతాసురభావంబు మానవయ్య!, యయ్య నీ మ్రోల మేలాడరయ్య! జనులు. 266**

**ప్రతి :** కాలరూపంబులన్= కాలపు స్వరూపాలతో; క్రమవిశేషంబులన్= (దాని) వరుసల విశేషాలతో; అలఘుగుణ+ఆశ్రయుండు+అయిన= గొప్పగుణాలకు ఆధారమైన; విభుఁడు= ప్రభుడు; సత్త్వబల+ఇంద్రియ= బుద్ధిశక్తి ఇంద్రియాలతో; సహజ ప్రభావ+ఆత్ముఁడై= సహజమైన ప్రాభవంగల మనస్సుగలవాఁడై; వినోదంబునన్= ఉబుసుపోకకోసం; అఖిలజగమున్= ఎల్లలోకాన్ని; కల్పించున్= సృజిస్తాడు; రక్షించున్= కాపాడుతాడు; ఖండించున్= నరకుతాడు; అవ్యయుండు= నాశరహితుడు; ఆతఁడు= ఆ విభుడు; అన్నిరూపములందున్= అన్ని ఆకారాలలో; కలఁడు= ఉన్నాడు; చిత్తంబు= మనస్సు; సమముగాన్+చేయుము= సమానంగా చేసుకో; మార్గంబు+తప్పి= దారి తప్పి; వర్తించు చిత్తంబుకంటెన్= ప్రవర్తించే మనస్సుకంటే; వైరులు+ఎవ్వరు?= విరోధులెవరు?; చిత్తంబు= మనస్సు; వైరి+కాక= విరోధిగాక; చిత్తమును= మనస్సును; నీకువశముగాన్= నీ ఆధీనమైనదానినిగా; చేయవయ్య= చేసుకోవయ్య; మదయుత+ఆసురభావంబు= మత్తుతోడి రాక్షసస్వభావము; మానవయ్య= వదలుమయ్య; అయ్య= తండ్రి!; నీ మ్రోలన్= నీ యెదుట; జనులు= ప్రజలు; మేలు+ఆడరు+అయ్య= శుభకరవచనాలు పలుకరయ్య!

**తా :** కాలస్వరూపుడైన ఈశ్వరుడు తనకు సహజసిద్ధమైన శక్తితో, వినోదాత్మకంగా లీలావిశేషంగా అన్నిలోకాలు సృష్టిస్తాడు. పోషిస్తాడు, ఖండిస్తాడు. ఆతడు మార్పు లేనివాడు, అన్నింటా ఉన్నాడు. నీవు నీ మనస్సున సమభావంతో ఉండు. దారి తప్పి ప్రవర్తించే మనస్సుకంటే వేరే శత్రువు లెవరూ లేరు. నీకు, నీ మనస్సు, విరోధిగా గాక, వశమైనదిగా చేసికో, రాక్షస స్వభావం వదలిపెట్టు. ప్రజలు నీ యెదుట నీకు శుభకరమైన పలుకులు పలకడంలేదు.

**విశే :** సత్త్వశబ్దానికి బుద్ధి అనే అర్థం. శ్రీధరీయవ్యాఖ్యలో "సత్త్వం ధైర్యం బుద్ధిర్వా" అని ఉంది.

**ఉ. లోకము లన్నియున్ గడియలోన జయించినవాఁడ, వింద్రియా**
**నీకముఁజిత్తమున్ గెలువ నేరవు నిన్ను నిబద్ధుఁజేయు నీ**

**భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁజేసినఁ బ్రాణికోటిలో**
**నీకు విరోధి లేఁడొకఁడు, నేర్పునఁజూడుము దానవేశ్వరా! 267**

**ప్రతి :** దానవ+ఈశ్వరా!= రాక్షసరాజా!; లోకములు+అన్నియున్= జగములన్నీ; గడియలోనన్= క్షణకాలంలో; జయించినవాఁడవు= గెలిచినవాఁడివి; ఇంద్రియ+అనీకమున్= ఇంద్రియాలశ్రేణిని; చిత్తమున్= మనస్సునూ; గెలువన్+నేరవు= జయించలేకున్నావు; నిన్నున్= మహాబలయుతుడవైన నిన్ను; నిబద్ధున్+చేయు= కట్టివేయబడిన వానినిగా చేసే; ఈ భీకరశత్రులు= ఈ భయంకరులైన విరోధులు; ఆర్వురన్= ఆరుగురిని; ప్రభిన్నులన్+చేసినన్= పగిలిపోయినవారినిగా–ఓడిపోయినవారినిగా చేస్తే; నీకున్= నీకు; ప్రాణికోటిలోన్= జీవసమాజమంతటిలో; ఒకఁడున్= ఒక్కడుగూడ; విరోధి లేఁడు= శత్రువు ఉండడు; నేర్పునన్= వివేకంతో; చూడుము= గ్రహించు.

**తా :** రాక్షసేశ్వరా! క్షణంలో లోకాలన్నీ గెలిచావు. నిజమే. కాని నీ మనస్సును, ఇంద్రియాలను మాత్రం గెలువలేక పోతున్నావు. నిన్ను కట్టి పడవేసే ఈ ఆర్గురు శత్రులను–అరిషడ్వర్గాన్ని (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే వానిని) గెలువలేకున్నావు. ఆ ఆర్గురను జయిస్తే ఇక నీవు జయించవలసిన వారెవ్వరూ మిగలరు. విరోధి ఉండడు. వివేకంతో గ్రహించుమయ్యా!

**విశే :** ప్రహ్లాదుడు తన తండ్రి హిరణ్యకశిపునికి ముందే హితబోధచేశాడు. అరిషడ్వర్గాలనే అంతశ్శత్రుజయాన్ని సాధించవయ్యా! బహిశ్శత్రు జయంకంటే, ఇది శ్రేష్ఠమన్నాడు.

**క. పాలింపుము శేముషి, నున్మూలింపుము కర్మబంధముల, సమదృష్టిం**
**జాలింపుము సంసారముఁ, గీలింపుము హృదయమందుఁగేశవభక్తిన్. 268**

**ప్రతి :** శేముషిన్= బుద్ధిని; పాలింపుము= పాలించు; కర్మబంధములన్= కర్మలచే ఏర్పడే అడ్డంకులను; ఉత్+మూలింపుము= నాశనం చేయి; సమదృష్టిన్= సమానమైన చూపుతో; సంసారమున్= కుటుంబ జీవనాన్ని; చాలింపుము= విడువు; హృదయమందున్= మనస్సులో; కేశవభక్తిన్= హరిభక్తిని; కీలింపుము= నెలకొల్పు.

**తా :** నీ బుద్ధిని నీవు వశపరచుకో, అపుడు కర్మవలన ఏర్పడిన కట్టుబాట్లన్నిటిని తెంచుకో, సమానమైన చూపుతో సంసారాన్ని విడిచిపుచ్చు. ఆపై మనస్సున హరిభక్తిని నిలుపుకో.

**వ. అనినఁబరమభాగవతశేఖరునకు దోషాచరశేఖరుండిట్లనియె. 269**

**ప్రతి :** అనినన్= అనగా; పరమభాగవతశేఖరునకున్= గొప్పభగవద్భక్తునికి; దోషాచరశేఖరుండు= రాత్రులలో తిరుగాడే వారిలో–రాక్షసులలో గొప్పవాడు; ఇట్లు+అనియెన్– ఇలా అన్నాడు.

**తా :** ప్రహ్లాదుని వచనానంతరం రాక్షసరాజైన ఆతని తండ్రి ఇలా అన్నాడు.

**క. చంపినఁ జచ్చెద ననుచును, గంపింపక యోరి పలువ! కఠినోక్తుల నన్**
**గుంపించెదు, చావునకుం, దెంపరివై వదరువాని తెఱఁగునఁగుమతీ! 270**

**ప్రతి :** కుమతీ!= దుర్బుద్ధీ!; ఓరి పలువ!= ఓరి తుంటరి! చంపినన్= చంపితే; చచ్చెదను+అనుచును= చస్తాను అంటూ; కంపింపక= వణకక; కఠిన+ఉక్తులన్= గట్టిమాటలతో; నన్= నన్ను; గుంపించెదు= పొడుస్తున్నావు; చావునకున్=

మరణానికి; తెంపరివి+ఐ= తెగించినవాడివై; వదరువాని తెఱఁగునన్= వాగెడు వానివిధంగా; (నన్ గుంపించెదు పూర్వభాగంతో సమన్వయం.)

**తా :** చావుకు తెగించినవాడవై 'చంపితే చస్తా'నని, అదరుబెదరు లేక పరుషవాక్యాలతో నన్ను పొడుస్తున్నావు. నా కోపాన్ని మరింత తీవ్రస్థాయికి ఎగదోస్తున్నావు.

**శా. నాతోడం బ్రతిభాష లాడెదు, జగన్నాథుండు నా కంటె నీ**
**భూతశ్రేణికి రాజు లేఁడొకఁడు సంపూర్ణప్రభావుండు, మ**
**ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మాఱు నారాయణుం**
**డేతద్విశ్వములోన లేఁడు, మఱి వాఁడెందుండురా? దుర్మతీ! 271**

**ప్రతి :** దుర్మతీ!= ఓరి దుష్టబుద్ధీ!; నా తోడన్= నాతో; ప్రతిభాషలు+ఆడెదు= బదులు మాటలు పలుకుతున్నావు; ఈ భూతశ్రేణికిన్= ఈ జీవప్రపంచానికి; నా కంటెన్= నాకు భిన్నంగా; సంపూర్ణ ప్రభావుండు= నిండైన అధికారంగలవాడు; రాజు= ఏలిక; జగత్+నాథుండు= లోకనాయకుడు; లేఁడు= ఉండడు; మున్ను= పూర్వం; మత్+భ్రాతన్= నా సోదరుని; చంపినన్= చంపగా; నేన్= నేను; పల్మాఱు= అనేక పర్యాయాలు; వెదకితిన్= వెదుకులాడాను, అన్వేషించాను; నారాయణుండు= విష్ణువు; ఏతద్+విశ్వములోనన్= ఈ ప్రపంచాన; లేఁడు= ఉండినవాడు గాడు; మఱి= ఇంక; వాఁడు= ఆ నారాయణుడు; ఎందున్+ఉండురా!= ఎక్కడుంటాడురా!

**తా :** ఓరీ దుర్బుద్ధిగలవాడా నాతో వాదులాడతావు. నా కంటె వేరుగా, ప్రాణిలోకానికి జగనాథుడు, సంపూర్ణ ప్రభావుడైన రాజు వేరొకడు లేడు. పూర్వం నా సోదరుని చంపినపుడు, ఆ నారాయణునికోసం పలు పర్యాయాలు ఈ విశ్వమంతా గాలించాను. వధించడానికి, ఎక్కడా వాడిజాడ లేదు. మరి ఈ విశ్వంలో వాడెక్కడుంటాడురా బుద్ధిలేనివాడా!

**క. ఎక్కడఁ గలఁడే? దే క్రియ నే, చక్కటి వర్తించు? నెట్టి జాడను వచ్చున్?**
**జక్కడుతు నిన్ను విష్ణునిఁ, బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్. 272**

**ప్రతి :** ఏ+కడన్= ఏ స్థలానన్; కలఁడు= ఉన్నాడు; ఏక్రియన్= ఏ విధంగా; ఏ చక్కటిన్= ఏ దిక్కున; వర్తించున్= జీవిస్తాడు; ఎట్టిజాడను= ఏ ఉనికితో; వచ్చున్= కనపడగా వచ్చును; నిన్నున్ విష్ణునిన్= నిన్నూ; విష్ణువునూ, ఇద్దరినీ; చక్కడతున్= చంపుతాను; పెక్కులు= ఎన్నో; వాని భృత్యువు పగిదిన్= ఆ విష్ణుని సేవకునివలె; ప్రేలెదవు= వాగుతావు.

**తా :** వాడు ఎక్కడ, ఎలా, ఏ రూపంతో ఉంటాడు? ఏ విధంగా వస్తాడు? వాడి బంటులాగా ఎక్కువగా వాగుతున్నావు. నిన్నూ నీ విష్ణుణ్ణీ ఇద్దర్నీ చంపేస్తాను.

**వ. అనిన హరికింకరుండు శంకింపక హర్షపులకాంకుర సంకలిత విగ్రహుండై యాగ్రహంబు లేక హృదయంబున హరిం దలంచి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబు సేయుచు నిట్లనియె. 273**

**ప్రతి :** అనినన్= అనగా; హరికింకరుండు= విష్ణుసేవకుండు ప్రహ్లాదుడు; శంకింపక= సంశయించక; హర్ష= సంతోషంచే నయిన; పులక+అంకుర= గగుర్పాటువలని మొలకలతో; సంకలిత= విలసిల్లే, కూడిన; విగ్రహుండు+ఐ= శరీరంగలవాడై;

ఆగ్రహంబు లేక= కోపంలేక; హృదయంబునన్= మనస్సున; హరిన్+తలంచి= విష్ణుని స్మరించి; నమస్కరించి= నమస్కారం చేసి; బాలవర్తనంబునన్= బాలలీలతో; నర్తనంబు+చేయుచున్= నాట్యంచేస్తూ; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** తండ్రిమాటకు తనయుడు కోపగించ లేదు. ప్రహ్లాదుడు మనస్సున హరిని స్మరించి, నమస్కరించి, శరీరం గగుర్పొడిచి విలసిల్లగా బాలలీలతో నాట్యం చేయడం మొదలుపెట్టి ఇట్లన్నాడు.

**మ. కలఁడంభోధిఁ, గలండు గాలిఁ, గలఁడాకాశంబునం, గుంభినిం**
**గలఁ, డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాత్మలం**
**గల, డోంకారమునంద్రిమూర్తులఁద్రిలింగవ్యక్తులందంతటం**
**గలఁ, డీశుండు గలండు, తండ్రి! వెదకంగా నేల నీ యా యెడన్. 274**

**ప్రతి :** తండ్రి!= నాయనా! ఈశుండు= ఈశ్వరుడు; అంభోధిన్= సముద్రంలో; కలఁడు= ఉన్నాడు; గాలిన్= గాలిలో; కలఁడు= ఉన్నాడు; ఆకాశంబునన్= ఆకాశములో; కలఁడు= ఉన్నాడు; కుంభినిన్= భూమిలో; కలఁడు= ఉన్నాడు; అగ్నిన్= నిప్పులో; దిశలన్= దిక్కులందు; పగళ్ళన్= పగటి వేళల్లో; నిశలన్= రాత్రుల్లో; ఖద్యోతచంద్ర+ఆత్మలన్+కలఁడు= సూర్యునిలో, చంద్రుని రూపంలో, కలఁడు; ఓంకారమున్= ప్రణవంలో; త్రిమూర్తులన్= ముగ్గురుమూర్తులలోను; త్రిలింగవ్యక్తులందు+అంతటన్= స్త్రీ పుం నపుంసక రూపాలైన వస్తుజాలంలో; అంతటన్= అన్నిచోట్ల; కలఁడు= ఉన్నాడు. ఈ+ఆ+ఎడన్= ఆ యా చోట్లయందు; వెదకంగాన్+ఏల= అన్వేషించడం ఎందుకు? గాలించడ మెందుకు?

**తా :** తండ్రీ ఈశ్వరునికై ఇక్కడా అక్కడా వెదకవలసిన పనిలేదు. అతడు సముద్రంలో ఉన్నాడు. గాలిలో ఉన్నాడు. ఆకాశంలో ఉన్నాడు. భూమిపై నున్నాడు. నిప్పులో, దిక్కులలో, పగళ్లలో, రాత్రులలో, సూర్యునిలో, చంద్రునిలో ఉన్నాడు. ఓంకారంలో, బ్రహ్మవిష్ణు మహేశ్వరులనే త్రిమూర్తులలో, స్త్రీ పుం నపుంసకరూపములైన సమస్త వస్తుజాలంలో అంతటా ఉన్నాడు.

**క. ఇందుఁగలఁడందు లేఁడని, సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,**
**డెం దెందు వెదకి చూచిన, నందందే కలఁడు, దానవాగ్రణి! వింటే. 275**

**ప్రతి :** దానవ+అగ్రణి= రాక్షస రాజా! వింటి+ఏ= విన్నావా? చక్రి= చక్రధారి, హరి; ఇందున్+కలఁడు= ఇక్కడున్నాడు; అందున్+లేఁడు= అక్కడ లేడు; అను సందేహము= అనే శంక; వలదు= వద్దు; సర్వ+ఉపగతుండు= అన్నింటిలో చెంది నిల్చినవాడు; ఎందు+ఎందున్= ఎక్క డెక్కడ; వెదకి చూచినన్= వెదకి గమనించినా; అందు+అందు+ఏ= అక్కడక్కడే; కలఁడు= ఉన్నాడు.

**తా :** రాజా! చక్కగా విను. హరి, ఇక్కడ ఉన్నాడు, అక్కడ లేడు–అనే సందేహం వద్దు. అతడు ఎక్కడెక్కడ వెదకితే అక్కడక్కడే ఉన్నాడు.

**విశే :** భగవంతుడు సర్వవ్యాపి అయినా జిజ్ఞాసతో అన్వేషించే భక్తులకే కనిపిస్తాడు. అన్న సత్యం ఇందులో గోచరిస్తున్నది.

**వ. అని యి వ్విధంబున. 276**

**ప్రతి :** అని ఈ+విధంబునన్= అని ఈ విధంగా...

**తా :** అని ఈ విధంగా

**మ. 'హరి సర్వాకృతులంగలం' డనుచుఁబ్రహ్లాదుండు భాషింప స**
**త్వరుఁడై 'యెందును లేఁడు లేఁ'డని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ**
**నరసింహాకృతి నుండె నచ్యుతుఁడు నానాజంగమస్థావరో**
**త్కరగర్భంబుల నన్ని దేశముల నుద్దండప్రభావంబునన్. 277**

**ప్రతి :** హరి= విష్ణువు; సర్వ+ఆకృతులన్= అన్ని ఆకారాలలోను; కలండు+అనుచున్= ఉన్నాడు అంటూ; ప్రహ్లాదుండు భాషింపన్= కొడుకు ప్రహ్లాదుడు చెప్పగా; దైత్యుండు= రాక్షసుడైన తండ్రి; సత్వరుఁడై= తొందరపాటుతో కూడినవాడై; ఎందును= ఎక్కడను; లేఁడు లేఁడు+అని= లేనే లేడని; సుతున్= కొడుకును; తర్జింపన్= భయపెట్టగా; అచ్యుతుఁడు= హరి; శ్రీనరసింహ+ఆకృతిన్= శ్రీ నరసింహుని స్వరూపంతో; నానా= అనేకమైన; జంగమ= కదిలేవి; స్థావర= కదలనివి అయినవాని; ఉత్కర= గుంపులయొక్క; గర్భంబులన్= లోపలిప్రదేశాలలో; అన్ని దేశములన్= ఎల్ల ప్రదేశాలలో; ఉద్దండ ప్రభావంబునన్= మిక్కిలి ప్రభావంతో; ఉండెన్= నిండి వుండినాడు.

**తా :** ప్రహ్లాదుడు, 'హరి సృష్టిలోని అన్ని ఆకారాలలో ఉన్నాడు'. అని అంటే, హిరణ్యకశిపుడు తొందరపాటుతో 'లేడు లేడు' అంటూ కొడుకును భయపెడుతున్నాడు. ఆ సమయాన, విష్ణువుమాత్రం, అన్నిచోట్ల, స్థావర జంగమాల లోపల శ్రీ నరసింహుని రూపంలో, మిక్కిలి ప్రభావంతో కొలువై ఉన్నాడు.

**వ. అయ్యవసరంబున నద్దానవేంద్రుండు. 278**

**ప్రతి :** ఆ+అవసరంబునన్= ఆ సమయాన, ఆ+దానవ+ఇంద్రుండు= ఆ రాక్షసరాజు...

**తా :** ఆ సమయాన ఆ రాక్షసరాజు

**క. డింభక! సర్వస్థలముల, నంభోరుహనేత్రుఁడుండు ననుచు మిగుల సం**
**రంభంబునఁ బలికెద వీ, స్తంభంబునఁజూపఁగలవె? చక్రిన్ గ్రిక్రిన్. 279**

**ప్రతి :** డింభక!= అర్భకా! అంభస్+రుహనేత్రుఁడు= పద్మములవంటి కన్నులుగలవాడు, హరి; సర్వస్థలములన్= అన్ని చోట్లా; ఉండును+అనుచున్= కలడంటూ; మిగులన్= ఎక్కువ; సంరంభంబునన్= తొందరతో; పలికెదవు= అంటావు; ఈ స్తంభంబునన్= ఈ స్తంభంలో; చక్రిన్, గిక్రిన్= హరిని, గిరిని; చూపన్+కలవు+ఎ= చూపగలవా?

**తా :** అర్భకా! చాల తొందరపడుతూ హరి, అన్ని చోట్లా ఉంటాడంటున్నావు. అయితే, ఈ స్తంభంలో నీ 'చక్రినీ గిక్రినీ' చూపగలవా?

**క. స్తంభమునఁజూపవేనియుఁ, గుంభిని నీ శిరముఁద్రుంచి కూల్పఁగ రక్షా**
**రంభమున వచ్చి హరి వి, స్రంభంబున నడ్డపడఁగ శక్తుండగునే? 280**

**ప్రతి :** స్తంభమునన్= స్తంభంలో; చూపవు+ఏనియున్= చూపకపోయినచో; కుంభినిన్= భూమియందు; నీ శిరమున్= నీ తలను; త్రుంచి= నరికి; కూల్పఁగన్= పడవేయబోగా; హరి= విష్ణువు; రక్షా+ఆరంభంబునన్= కాపాడేపనితో; విస్రంభంబునన్= నమ్మకంతో; వచ్చి= ఈ స్థలానికి వచ్చి; అడ్డుపడన్+కన్= అడ్డుపడటానికి; శక్తుండు+అగునే?= సమర్థుడేనా?

**తా :** స్తంభమున హరిని నీవు చూపలేకపోతే, నేను నీ తలను నరికి భూమిపై వేస్తాను. ఆ నరకబోయే సమయంలో నీ హరి, నిన్ను రక్షించడానికి నమ్మకంగా వస్తాడా? అతనికి ఆ శక్తి ఉందా?

**వ. అనిన భక్తవత్సలుని భటుండి ట్లనియె. 281**

**ప్రతి :** అనినన్= అనగా; భక్తవత్సలుని= భక్తులయెడ ప్రేమగల శ్రీహరియొక్క; భటుండు= సేవకుడు, ప్రహ్లాదుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** తండ్రిమాటకు కొడుకు బదులు పల్కాడు.

**శా. 'అంభోజాసనుఁడాదిగాఁగఁదృణపర్యంతంబు విశ్వాత్ముఁడై**
**సంభావంబున నుండు ప్రోడ విపులస్తంభంబునందుండఁడే?**
**స్తంభాంతర్గతుఁడయ్యు నుండుటకు నే సందేహమున్ లేదు, ని**
**ర్దంభత్వంబున నేఁడు గానఁబడుఁబ్రత్యక్షస్వరూపంబునన్'. 282**

**ప్రతి :** అంభోజ+ఆసనుఁడు+ఆది+కాఁగన్= బ్రహ్మ (పద్మము ఆసనముగా గల బ్రహ్మ!) మొదలుగా; తృణపర్యంతంబున్= గడ్డిపరక వరకు; విశ్వ+ఆత్ముఁడై= అన్నింట నిండినవాడై; సంభావంబునన్= గౌరవంతో; ఉండుప్రోడ= ఉండేప్రౌఢుడు హరి; విపులస్తంభంబునందున్= విశాలమైన స్తంభంలో; ఉండఁడు+ఏ= ఉండడా? స్తంభ+అంతర్గతుఁడు+అయ్యున్= స్తంభంలోపల వ్యాపించి; ఉండుటకున్= ఉండుటకు; ఏ సందేహమున్= ఏ అనుమానం; లేదు, నేఁడు= ఈనాడు; నిర్దంభత్వంబునన్= మాయలేకుండ; ప్రతి+అక్షస్వరూపంబునన్= కంటి ఎదుటగల ఆకారంతో; కానన్+పడున్= కనబడును.

**తా :** బ్రహ్మదేవుడు మొదలుకొని గడ్డిపరకవరకు ఎల్లయెడల నిండి ఉండే ఆ ప్రౌఢుడు, ఈ విశాలస్తంభంలో ఉండడా? స్తంభంలో ఉండి ఉంటాడనటానికి ఏ శంకా లేదు. నేడు అతడు తన స్వరూపంతో మాయలేకుండా ప్రత్యక్షంగా కనబడగలడు.

**వ. అనిన విని కరాళించి గ్రద్దన లేచి గద్దియ డిగ్గనుఱికి యొఱఁ బెట్టిన ఖడ్గంబు పెఱికి కేల నమర్చి జళిపించుచు మహాభాగవతశిఖామణి యైన ప్రహ్లాదుని ధిక్కరించుచు. 283**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; విని= విని; కరాళించి= అరచి; గ్రద్దనన్+లేచి= వెంటనే లేచి; గద్దియ= సింహాసనం; డిగ్గన్+ఉఱికి= త్వరగా దిగి; ఒఱన్+పెట్టిన= ఒరలోఉంచిన; ఖడ్గంబు పెఱికి= కత్తిని తీసి; కేలన్+అమర్చి= చేత ధరించి; జళిపించుచున్= త్రిప్పుతూ; మహాభాగవతశిఖామణి+ఐన= గొప్పభగవద్భక్తులలో శిరోమణియైన; ప్రహ్లాదునిన్= ప్రహ్లాదుణ్ణి; ధిక్+కరించుచున్= తిరస్కరిస్తూ...

**తా :** అని ప్రహ్లాదుడు పలికాడు. వెంటనే, హిరణ్యకశిపుడు గట్టిగా అరుస్తూ, గబుక్కున సింహాసనంనుండి కిందికి ఉరికి ఒరలోనున్న ఖడ్గాన్ని పైకి తీసి జళిపిస్తూ, భక్తశిఖామణి అయిన ప్రహ్లాదుణ్ణి ధిక్కరిస్తూ

**మ. వినరా! డింభక! మూఢచిత్త! గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం**
**డని భాషించెద, వైన నిందుఁగలఁడే యంచున్ మదోద్రేకియై**
**దనుజేంద్రుండఱచేత వ్రేసెను మహోదగ్రప్రభాశుంభమున్**
**జనదృగ్భీషణదంభమున్ హరిజనుస్సంరంభమున్ స్తంభమున్. 284**

**ప్రతి :** దనుజ+ఇంద్రుండు= రాక్షసరాజు; డింభక= అర్భకుడా!; వినరా= వినురా! మూఢచిత్త!= మొండిమనస్సుగలవాడా! గరిమన్= గొప్పతనంతో; విష్ణుండు= హరి; విశ్వ+ఆత్మకుండు+అని= విశ్వవ్యాపి, అంతటనుండేవాడు అని; భాషించెదవు= పలుకుతావు; ఐనన్= అయితే; ఇందున్+కలఁడు+ఏ= ఇందున్నాడా? అంచున్= అంటూ; మద+ఉద్రేకి+ఐ= పొగరుతో ఉద్రేకం గలవాడై; అఱచేతన్= అరచేతితో; మహా+ఉదగ్ర ప్రభాశుంభమున్= గొప్పభయంకరకాంతితో వెలిగే; జనదృక్+భీషణదంభమున్= జనుల కళ్ళకు భయం కలిగించే ఆటోపంగల; హరిజనుస్+సంరంభమున్= విష్ణువు పుట్టుక (యొక్క) తొందరపాటుగల; స్తంభమున్= స్తంభాన్ని; వ్రేసెను= మోదెను.

**తా :** "వినరా మూర్ఖుడా! అర్భకుడా! గొప్పగా, 'హరి సర్వవ్యాపి' అని అంటావు. అయితే మరి ఈ స్తంభంలో ఉన్నాడా" – అంటూ, తన అరచేతితో, మదమెక్కిన పొగరుతో, ఉద్రేకంతో, భయంకరంగా వెలిగిపోతూ, చూపరుల కళ్లకు భయం గొలుపునట్లుగా రాక్షసరాజు, హరి ఆవిర్భవించబోయే స్తంభాన్ని తొందరగా గట్టిగా చరిచాడు.

## ❖ శ్రీహరి నరసింహరూపంబున స్తంభంబునం దావిర్భవించుట ❖

**వ. ఇట్లు దానవేంద్రుండు పరిగృహ్యమాణ వైరుండును, వైరానుబంధ జాజ్వల్యమాన రోషానలుండును, రోషానల జంఘన్యమాన విజ్ఞాన వినయుండును, వినయ గాంభీర్య ధైర్య జేగీయమాన హృదయుండును, హృదయచాంచల్యమాన తామసుండును, దామసగుణచంక్రమ్యమాణ స్థైర్యుండును నై విస్రంభంబున హుంకరించి బాలుని ధిక్కరించి హరి నిందుఁజూపు మని కనత్కనక మణిమయ కంకణ క్రేంకార శబ్దపూర్వకంబుగా దిగ్దంతి దంత భేదన పాటవ ప్రశస్తంబగు హస్తంబున సభామండప స్తంభంబు వ్రేసిన వ్రేటుతోడన దశదిశలను మిడుంగుఱులు చెదఱం జిటిలి పెటిలిపడి బంభజ్యమానం బగు నమ్మహా స్తంభంబు వలనఁ బ్రళయ వేళా సంభూత సప్తస్కంధబంధుర సమీరణ సంఘటిత ఘోరజోఘుష్యమాణ మహావలాహక వర్గ నిర్గత నిబిడ నిష్ఠుర దుస్సహ నిర్ఘాత సంఘ నిర్ఘోషనికాశంబులైన ఛటచ్ఛట స్ఫటస్ఫట ధ్వని ప్రముఖ భయంకరారావ పుంజంబులు జంజన్య మానంబు లయి యెగసి యాకాశ కుహరాంతరాళంబు నిరవకాశంబు సేసి నిండినం బట్టు సాలక దోదూయమాన హృదయంబులయి పరవశంబులయి పితామహ మహేంద్ర వరుణ వాయు శిఖి ప్రముఖ చరాచర జంతుజాలంబుల తోడ బ్రహ్మాండ కటాహంబు పగిలి పరిస్ఫోటితంబుగాఁ, బ్రఫుల్ల పద్మయుగళ సంకాశ భాసురచక్ర చాప హల కులిశాంకుశ జలచర రేఖాంకిత చారుచరణతలుండును, జరణచంక్రమణఘనవినమిత విశ్వ విశ్వంభరాభార ధౌరేయ దిక్కుంభి కుంభీనస కుంభినీధర కూర్మ కులశేఖరుండును, దుగ్ధజలధిజాత శుండాల శుండాదండ మండిత ప్రకాండ ప్రచండమహోరు స్తంభ యుగళుండును, ఘణ ఘణాయమాన మణి కింకిణీగణ ముఖరిత మేఖలావలయ వలయిత పీతాంబర శోభిత కటి ప్రదేశుండును, నిర్జరనిమ్నగావర్తవర్తుల కమలాకర గంభీరనాభి వివరుండును, ముష్టిపరిమేయ వినుత తనుతర స్నిగ్ధమధ్యుండును, గులాచలసాను భాగ సదృశ కర్కశ విశాల వక్షుండును, దుర్జన దనుజభట ధైర్య లతికా లవిత్రాయమాణ రక్షోరాజ వక్షోభాగ విశంకట క్షేత్ర విలేఖన చంచలాంగలాయమాన ప్రతాప జ్వలన జ్వాలాయమాన శరణాగతనయనచకోర చంద్రరేఖాయమాణ**

వజ్రాయుధ ప్రతిమాన భాసమాన నిశాతనఖరతర ముఖనఖరుండును, శంఖ చక్ర గదా ఖడ్గ కుంత తోమర ప్రముఖ నానాయుధ మహిత మహోత్తుంగ మహీధరశృంగ సన్నిభ వీర సాగర వేలాయమాన మాలికా విరాజమాన నిరర్గళానేకనత భుజార్గళుండును, మంజు మంజీర మణిపుంజ రంజిత మంజుల హార కేయూర కంకణ కిరీట మకర కుండలాది భూషణ భూషితుండును, త్రివళీయుత శిఖరిశిఖరాభ పరిణద్ధ బంధుర కంధరుండును, ప్రకంపన కంపిత పారిజాత పాదపపల్లవ ప్రతీకాశ కోపావేశ సంచలితాధరుండును, శరత్కాల మేఘజాలమధ్య ధగద్ధగాయమాన తటిల్లతా సమాన దేదీప్యమాన దంష్ట్రాంకురుండును, గల్పాంతకాల సకల భువన గ్రసన విలసన విజృంభమాణ సప్తజిహ్వా జిహ్వాతులిత తరలతరాయమాణ విభ్రాజమాన జిహ్వుండును, మేరు మందర మహాగుహాంతరాళ విస్తార విపులవక్త్ర నాసికా వివరుండును, నాసికావివర నిస్సరన్నిబిడ నిశ్శ్వాస నికర సంఘట్టన సంక్షోభిత సంతప్యమాన సప్త సాగరుండును, బూర్వపర్వత విద్యోతమాన ఖద్యోతమండల సదృక్ష సమంచిత లోచనుండును, లోచనాంచల సముత్కీర్యమాణ విలోల కీలాభీల విస్ఫులింగ వితాన రోరుధ్యమాన తారకాగ్రహ మండలుండును, శక్రచాప సురుచిరోదగ్ర మహా భ్రూలతాబంధ బంధుర భయంకర వదనుండును, ఘనతర గండశైలతుల్య కమనీయ గండభాగుండును, సంధ్యారాగ రక్త ధారాధర మాలికా ప్రతిమ మహాభ్రంకష తంతన్యమాన పటుతర సటాజాలుండును, సటాజాలసంచాలన సంజాతవాత డోలాయమాన వైమానిక విమానుండును, నిష్కంపిత శంఖవర్ణ మహోర్ధ్వకర్ణుండును, మంథదండాయమాన మందర వసుంధరాధర పరిభ్రమణ వేగ సముత్పద్యమాన వియన్మండల మండిత సుధారాశి కల్లోల శీకరాకార భాసుర కేసరుండును, బర్వాఖర్వ శిశిరకిరణ మయూఖగౌర తనూరుహుండును, నిజ గర్జానినాద నిర్దళిత కుముద సుప్రతీక వామ నైరావణ సార్వభౌమ ప్రముఖ దిగిభరాజ కర్ణ కోటరుండును, ధవళ ధరాధర దీర్ఘ దురవలోకనీయ దేహుండును, దేహ ప్రభాపటల నిర్మథ్యమాన పరిపంథి యాతుధాన నికురుంబ గర్వాంధ కారుండును, బ్రహ్లాద హిరణ్యకశిపురంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణా వీర రస సంయుతుండును, మహాప్రభావుండును నయిన శ్రీ నృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని. **285**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; దానవ+ఇంద్రుండు= రాక్షసరాజు; పరిగృహ్యమాణవైరుండును= స్వీకరించిన విరోధం గలవాడు; వైర+అనుబంధ= విరోధానికి సంబంధించిన; జాజ్వల్యమాన= మిక్కిలిప్రకాశించే; రోష+అనలుండును= క్రోధమనే నిప్పుగలవాడు; రోష+అనల= క్రోధమనే నిప్పుతో; జంఘన్యమాన= మిక్కిలి చంపబడుతున్న; విజ్ఞాన వినయుండును= తెలివితేటలు అణకువగలవాడు; వినయ= అణకువ; గాంభీర్య= లోతు; ధైర్య= పరాక్రమాలతో; జేగీయమాన= మిక్కిలి కీర్తింపబడుచున్న; హృదయుండును= మనస్సుగలవాడు; హృదయ చాంచల్యమాన తామసుండును= మనస్సున కదలాడే తమోగుణంగలవాడు; తామసగుణ చంక్రమ్యమాణ స్థైర్యుండునున్+ఐ= తామసగుణంచే ఆక్రమింపబడుచున్న ధైర్యంగలవాడును ఐ; విస్రంభంబునన్= నమ్మకంతో; హుంకరించి= 'హుం' అని శబ్దం చేస్తూ, బాలుని ధిక్కరించి= పిల్లవానిని 'ధిక్' అని బెదిరిస్తూ ; హరిన్= విష్ణువును; ఇందున్+చూపుము+అని= ఈ స్తంభంలో చూపుమని; కనత్= వెలిగే; కనక= బంగారపు; మణిమయ= మణులతోనిండిన; కంకణ= కడియముల; క్రేంకారశబ్ద పూర్వకంబుగాన్= 'క్రేం' అనే శబ్దంతో కూడిన;

దిగ్దంతి= దిగ్గజాల, దిక్కులుమోసే ఏనుగుల; దంతభేదనపాటవ= దంతాలను పగులకొట్టడంలో సమర్థతతో; ప్రశస్తంబగు= ప్రసిద్ధమైన హస్తంబునన్= చేతితో; సభామండపస్తంభంబు= సభామండపమునందలి స్తంభాన్ని; వ్రేసినన్= మోదగా; వ్రేటు తోడన= దెబ్బతోపాటుగా; దశదిశలను= పదిదిక్కులందు, మిణుంగురులు= అగ్నికణములు; చెదఱన్= చెదిరిపడగా; చిటిలి పెటిలిపడి= చిట్లి, పెట్లి పడి; బంభజ్యమానంబు+అగు= మిక్కిలి పగులగొట్టబడుచున్న; ఆ+మహాస్తంభంబువలనన్= ఆ గొప్ప స్తంభంనుండి; ప్రళయవేళా= ప్రళయకాలంలో; సంభూత= పుట్టిన; సప్తస్కంధబంధుర= ఏడుస్కంధములతో ఒప్పిన; సమీరణ= గాలితో; సంఘటిత= కూడిన; ఘోర= భయంకరంగా జోఘుష్యమాణ= మిక్కిలి ధ్వనించెడు; మహావలాహకవర్గ= గొప్ప మేఘాల సమూహంనుండి; నిర్గత= బయల్వెడలిన; నిబిడ= దట్టమైన; నిష్ఠుర= కఠినమైన; దుస్సహ= సహింపరాని; నిర్ఘాత సంఘ= పిడుగులగుంపుయొక్క; నిర్ఘోషనికాశంబులు+ఐన= ధ్వనులతో సమానమయిన; ఛటచ్ఛట స్ఫటస్ఫటధ్వని ప్రముఖ= ఛటచ్ఛట, స్ఫటస్ఫటమనే ధ్వనులు మొదలగు; భయంకర+ఆరావపుంజంబులు= భీతిగొలిపే శబ్దాల సమూహాలు; జంజన్యమానంబులు+అయి= మిక్కిలి పుట్టుచున్నవై; ఎగసి= ఎగిరి; ఆకాశకుహర+అంతరాళంబు= ఆకాశగుహ మధ్యభాగం; నిరవకాశంబు+చేసి= ఖాళీలేకుండా చేసి; నిండినన్= నిండగా, పట్టు+చాలక= స్థలం చాలక; దోదూయమానహృదయంబులు+అయి= మిక్కిలి బాధపడే మనస్సులుగలవై; పరవశంబులయి= వశము తప్పినవై; పితామహ= బ్రహ్మ; మహా+ఇంద్ర= దేవేంద్రుడు; వరుణవాయు శిఖిప్రముఖ= వరుణుడు, వాయువు, అగ్ని మొదలయిన; చర+అచర జంతుజాలంబులతోడన్= కదిలే, కదలని ప్రాణి సమూహాలతో; బ్రహ్మాండకటాహంబు= బ్రహ్మాండం అనే గంగాళము (పెద్దలోహపాత్ర) పగిలి; పరిస్ఫోటితంబుగాన్= బద్దలు కాగా; ప్రఫుల్ల= బాగావికసించిన; పద్మయుగళ= తామరల జంటతో; సంకాశ= సమానమైనట్టి; భాసుర= ప్రకాశించే; చక్ర= చక్రము; చాప= ధనుస్సు; హల= నాగలి; కులిశ= వజ్రాయుధము; అంకుశ= అంకుశము (మొనదేలిన లోహపు ఆయుధం); జలచర= చేపయొక్క, వీటి; రేఖా+అంకిత= గీతలతో గుర్తించబడినట్టి; చారుచరణతలుండును= సుందర పాదతలము గలవాడు; చరణ= కాలి; చంక్రమణ= ఎగురుటవలన; ఘనవినమిత= బాగుగా వంచబడిన; విశ్వవిశ్వంభరాభార= మొత్తం భూమి బరువును; ధౌరేయ= మోసే; దిక్+కుంభి= దిగ్గజాలు; కుంభీనస= పాము, ఆదిశేషుడు; కుంభినీధర= పర్వతాలు; కూర్మ కులశేఖరుండును= కూర్మ వంశశ్రేష్ఠుడు; దుగ్ధజలధిజాత= పాల సముద్రములో పుట్టిన; శుండాల= ఏనుగు, ఐరావతంయొక్క; శుండాదండ= తొండపుకర్రవలె; మండిత= అలంకృతమైన; ప్రకాండ= పెద్ద; ప్రచండ= భయంకరమైన; మహా+ఊరు స్తంభయుగళుండును= గొప్ప తొడలజంటగలవాడును; ఘణఘణాయమాణ= ఘణఘణ శబ్దంచేస్తున్న; మణికింకిణీగణ= మణులతోడి చిరుమువ్వల గుంపులతో; ముఖరిత= శబ్దించే; మేఖలావలయవలయిత= ఒడ్డాణపుచుట్టుతో చుట్టబడిన; పీత+అంబరశోభిత= పచ్చని వస్త్రంతో ప్రకాశించే; కటిప్రదేశుండును= నడుము గలవాఁడు; నిర్ఝరనిమ్నగా= దేవగంగానది; ఆవర్తవర్తుల= సుడివలెగుండ్రని; కమల+ఆకర= తామరపూవుకు నిలయమైన; గంభీర= లోతైన; నాభివివరుండును= నాభిరంధ్రం గలవాడును; ముష్టిపరిమేయ= పిడికిలితో కొలువదగ్గ; వినుత= ప్రసిద్ధ; తనుతర= మిక్కిలి, సన్ననైన; స్నిగ్ధమధ్యుండును= అందమైన నడుముగలవాడును; కుల+అచలసానుభాగ= కులపర్వతపు చరియతో; సదృశ= సమానమైన; కర్కశవిశాల వక్షుండును= కఠినమైన విస్తృతమైన వక్షఃస్థలంగలవాడు; దుర్జన దనుజభట= దుర్మార్గులయిన రాక్షససేనల; ధైర్యలతికాలవిత్రాయమాణ= ధైర్యమనే తీగలకు కొడవలిగా అయిన; రక్షస్+రాజవక్షస్+భాగ= రాక్షసరాజు రొమ్ముప్రదేశం అనే; విశంకటక్షేత్ర= వైశాల్యంగల పొలం(యొక్క) విలేఖనచుంచు= దున్నుటయందు ప్రసిద్ధమైన; లాంగలాయమాన= హలము (నాగలి)గా నయినట్టి; ప్రతాపజ్వలన= ప్రతాపమనెడి అగ్నియొక్క; జ్వాలాయమాన= జ్వాలలైనట్టి (అగ్నిశిఖలుగా); శరణ+ఆగత నయనచకోర= శరణన్నవారి కన్నుల చకోరపు పులుగులకు; చంద్రరేఖాయమాణ= చంద్రరేఖలైనట్టిదీ; వజ్ర+ఆయుధప్రతిమాన= వజ్రాయుధంతో

సమానమయినట్టి; భాసమాన= ప్రకాశించుచున్నట్టియు; నిశాత= పదునైన; నఖరతర= కఠినమైనట్టి; ముఖ= మొనలు కలిగిన; నఖరుండు= గోళ్ళుగలవాడును; శంఖ చక్ర గదాఖడ్గ= శంఖం, చక్రం, గద, ఖడ్గం (ఈ నాల్గు విష్ణుని ఆయుధాలు); కుంత= బల్లెము; తోమర= చిన్నఈటె; ప్రముఖ= మొదలయిన; నానా+ఆయుధమహిత= అనేక ఆయుధాలతో ఒప్పుతున్న; మహా+ఉత్తుంగ మహీధరశృంగ సన్నిభ= గొప్పఎత్తైన కొండకొనతో సమానమైన; వీరసాగరవేలాయమాన= వీరరసమనే సముద్రపు ఒడ్డువలెనయిన, మాలికావిరాజమాన= దండలతో ప్రకాశించే, నిరర్గళ+అనేక నతభుజ+అర్గళుండును= అడ్డులేని అనేకములయిన వంగిన; గడియలవంటి బాహువులుగలవాడు; మంజు= అందమైన; మంజీర= అందెల; మణిపుంజ= మణుల సమూహాలతో; రంజిత= ఎఱ్ఱనయిన; మంజుల= సుందరమైన; హార కేయూర కంకణ కిరీట మకరకుండల+ ఆదిభూషణ భూషితుండును= దండలు, భుజకీర్తులు (వంకీలు), కడియాలు, కిరీటం, మకరకుండలాలు మొదలైన అలంకారాలతో అలంకృతుడూ; త్రివళీయుత= మూడుముడుతలతోకూడిన; శిఖరిశిఖర+ఆభ= కొండకొనతో సమానమైన; పరిణద్ధ బంధుర కంధరుండును= విశాలసుందరమైన మెడగలవాడూ; ప్రకంపన= అదరుటవలన; కంపిత పారిజాత పాదపపల్లవ= చలించే పారిజాతపు చిగురుతో; ప్రతీకాశ= సమానమైన; కోప+ఆవేశ సంచలిత+ అధరుండును= క్రోధపు ఆవేశంతో అదరెడి క్రిందిపెదవి గలవాడు; శరత్‌కాల= శరదృతువునందు; మేఘజాలమధ్య= మేఘసమూహాలనడుమ; ధగత్+ధగాయమాన= ధగధగమెరిసే; తటిల్లతాసమాన= మెరపు తీగలతో సమమైన; దేదీప్యమాన= మిక్కిలి వెలిగే; దంష్ట్రా+అంకురుండును= కోరల మొలకలుగలవాడును; కల్ప+అంతకాల= యుగాంతకాలంలో; సకలభువనగ్రసన= ఎల్లలోకాలుమ్రింగుటకై; విలసన= ప్రకాశించే; విజృంభమాణ= పై కెగసే; సప్తజిహ్వ= అగ్ని(యొక్క); జిహ్వాతులిత= నాలుకతో సమానమైన; తరలతరాయమాణ= మిక్కిలి చంచలముగా అగునున్న; విభ్రాజమానజిహ్వుండును= ప్రకాశించే నాలుకగలవాడు; మేరుమందర= మేరువు మందరము అనే పర్వతాల; మహాగుహా+అంతరాళ= గొప్పగుహల లోపలిభాగాలవలె; విస్తార విపుల వక్త్ర నాసికా వివరుండును= వెడల్పయిన నోరు ముక్కురంధ్రాలు గలవాడు; నాసికావివర= ముక్కురంధ్రాలనుండి; నిస్సరత్+నిబిడనిశ్వాసనికర= బయల్వెడలే దట్టమైన ఊర్పులగుంపు (యొక్క); సంఘట్టన సంక్షోభిత= తాకుటతో కల్లోలమై; సంతప్యమాన= బాగాక్రాగుచున్న; సప్తసాగరుండును= ఏడుసముద్రాలు గలవాడు; పూర్వపర్వత= తూర్పుకొండపై; విద్యోతమాన= ప్రకాశించే; ఖద్యోతమండలసదృక్ష= సూర్యమండలంతో సమానమైన; సమంచిత లోచనుండును= ఒప్పెడుకన్నులు గలవాడును; లోచన+అంచల= కన్నులచివరలనుండి; సముత్కీర్యమాణ= బయల్వెడలెడి; విలోలకీలా+ ఆభీల= కదిలెడి జ్వాలలతో భయంకరమైన; విస్ఫులింగ= అగ్నికణాల; వితాన= గుంపుతో; రోరుధ్యమాన= మిక్కిలి నిరోధింపబడుచున్న; తారకాగ్రహమండలుండును= నక్షత్రాల, గ్రహాల సమూహం గలవాడు; శక్రచాప= ఇంద్రధనుస్సువలె; సురుచిర= మిక్కిలి వెలిగే; ఉదగ్ర= భయంకరమైన; మహాభ్రూలతాబంధ= గొప్పకనుబొమల కట్టుతో; బంధుర= ఒప్పిదమైన; భయంకర= భీతిగొలిపే; వదనుండును= మోముగలవాడు; ఘనతర= మిక్కిలిపెద్దవైన; గండశైలతుల్య= గండశిలలతో సమమైన, కమనీయ గండభాగుండును= అందమైన చెకిళ్ళు గలవాడును; సంధ్యారాగరక్తధారాధర= సంధ్యాకాలపు ఎఱ్ఱదనంచేత; మాలికాప్రతిమ= ఎఱ్ఱని మేఘముల వరుసలతో సమానమైన; మహా+అభ్రంకషతంతన్యమాన= గొప్ప ఆకాశాన్ని, అంటే, విస్తరిస్తున్న; పటుతర= పటుత్వంకల; సటాజాలుండును= జూలుయొక్క సమూహంగలవాడు; సటాజాలసంచాలన= జూలుల సమూహం కదుపుటవలన; సంజాతవాత డోలాయమానవైమానిక విమానుండును= పుట్టిన గాలివలన ఊగెడి దేవతల విమానములు గలవాడును; నిష్కంపిత శంఖవర్ణ మహా ఊర్ధ్వకర్ణుండును= కదలని శంఖపురంగు గల పెద్దపొడవైన చెవులు గలవాడు; మంథదండాయమాన= కవ్వముగా చేయబడిన; మందరవసుంధరాధర= మందరపర్వతపు; పరిభ్రమణవేగ= తిప్పుటవలన (మథించుట) కలిగిన వేగంతో; సమ్+ఉత్పద్యమాన= పుట్టుచున్న;

వియత్+మండల= ఆకాశమండలమందు; మండిత= అలంకృతమైన; సుధారాశి కల్లోల శీకర+ఆకార భాసురకేసరుండును= అమృతసముద్రపు అలల తుంపురుల ఆకారంగల వెలిగే జూలుగలవాడు; పర్వ= పర్వవేళలందు; అఖర్వ= పొడవైన; శిశిరకిరణ మయూఖగౌర= చంద్రుని కిరణములవలె తెల్లనైన; తనూరుహుండును= వెంట్రుకలు గలవాడు; నిజగర్జానినాద= తన గర్జన ధ్వనితో; నిర్దళిత= చీల్చబడిన; కుముద, సుప్రతీక వామనైరావణ సార్వభౌమ, ప్రముఖదిక్+ఇభరాజ కర్ణకోటరుండును= కుముదము, సుప్రతీకము, వామనం, ఐరావణం, సార్వభౌమము మొదలైన దిగ్గజాల చెవుల చిల్లులుగలవాడును; ధవళధరాధర= శ్వేతపర్వతమువలె; దీర్ఘ= పొడవైన; దుర్+అవలోకనీయదేహుండును= చూడశక్యముకాని శరీరంగలవాడును; దేహప్రభాపటల= శరీరపుకాంతుల గుంపుతో; నిర్మథ్యమాన= బాగా చిలకబడుచున్న; పరిపంథి= శత్రువులయిన; యాతుధాననికురుంబ= రాక్షసుల గుంపుల; గర్వ+అంధకారుండును= గర్వము అనే చీకటిగలవాడును; ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజననిమిత్త= ప్రహ్లాదుని ఆహ్లాదపరచుట హిరణ్యకశిపుని చంపివేయుట కారణంగా; అంతరంగబహిరంగ= లోపల బయట; జేగీయమాన= మిక్కిలి కీర్తింపబడుతున్న; కరుణ వీరరస సంయుతుండునున్= కరుణరసం వీరరసాలతో కూడినవాడును; మహాప్రభావుండునున్+అయిన= గొప్పశక్తిమంతుడును అయిన, శ్రీనృసింహదేవుండు= శ్రీనృసింహభగవానుడు; ఆవిర్భవించినన్= ఆవిర్భవించగా; కనుంగొని= చూచి.

**తా :** ఈ విధంగా రాక్షసరాజు వైరంకారణంగా రోషానికి లోనై ఆ క్రోధాగ్నిలో వినయవిజ్ఞానాలు కాలిపోగా, చంచలమనస్కుడై తమోగుణం పైకొనగా హుంకరిస్తూ బాలుని ధిక్కరిస్తూ, 'హరిని ఇందు చూపు' మని మణిమయాలయిన కడియాలు క్రేంకారంచేస్తూ ఉండగా, దిగ్గజాల దంతాలను పగులగొట్టే శక్తిగల చేతితో సభామండపస్తంభ మొకదానిని మోదాడు. ఆ స్తంభంపై వేటుపడిన వెంటనే పదిదిక్కులలో అగ్నికణాలు చిందిపడగా, ఆ స్తంభం బ్రద్దలయింది. దానినుండి వెలువడిన ధ్వనులు, ప్రళయకాలం నాటి మేఘాలనుండి పుట్టే పిడుగుల పిండువలె ఎగసిపడి ఆకాశాన్నంతటిని నింపి, స్థలం చాలక, బ్రహ్మాండాన్ని మొత్తం కదిలించి వేసింది. దానితో, బ్రహ్మ మొదలు ఎల్లదేవతలు, సకల చరాచరప్రకృతి చలించిపోగా బ్రహ్మాండమనే గంగాళమే పగిలి దానినుండి నృసింహదేవుడు ఆవిర్భవించాడు.

అతడు వికసించిన తామరల జంటవంటి పాదాలతో, వాటిలోని చక్రం, ధనుస్సు, నాగలి లోనైన శుభరేఖలతో సుందరంగా ఉన్నాడు. ఆతని పాదం భూమిని సోకగానే, దానిభారం వహించే దిగ్గజాలు, ఆదిశేషుడు, కులపర్వతాలు, ఆదికూర్మం వంగిపోయాయి. ఆ అధిక భారానికి. ఆతడి తొడలు అమృతసముద్రం నుండి పుట్టిన ఐరావతపు తొండాలవలె ఘనంగా సుందరంగా ఉన్నాయి. ఆతని నడుము, ఘణఘణ మని ధ్వనించే గజ్జెలతో అలరారే, ఒడ్డాణంతో పీతాంబరశోభితమై ఉంది. దేవగంగా ప్రవాహానగల సుడివంటి, సుందరమగు లోతైన తామరపుష్పంగల నాభిరంధ్రం కలవాడు. ఆతని నడుము, కేవలం పిడికిట ఇమిడేదిగా సన్నగా శోభిస్తుంది అతడు కులపర్వతపు చరియవలె విశాలమైన వక్షఃస్థలంతో ఉన్నాడు. అతని గోళ్ళు, రాక్షససేన ధైర్యమనే తీగను తెగనరికే కొడవళ్ళు, రాక్షసరాజు వక్షఃస్థలమనే పొలం దున్నడానికి నాగళ్ళు. అయితే అవే, శరణాగతుల నయనచకోరాలకు వెన్నెల వెలుగులు. అవి వజ్రాయుధంవలె పదునైనవి గూడా.

ఆతడు, శంఖం, చక్రం, గద, ఖడ్గం మొదలయిన పెక్కు ఆయుధాలతో విలసిల్లే గడియలవంటి అనేక బాహువులతో ఒప్పుతున్నాడు. అతనిదేహం మీద మణిమయ మంజులహారాలు, భుజకీర్తులు, కడియాలు, కిరీటం, మకరకుండలాలు కాంతు లీనుతున్నాయి. ఆతని మెడ, మూడు ముడుతలతో పర్వత శిఖరసమానమై సుందరంగా ఉంది. కోపావేశంతోవణికే అతనిపెదవులు పారిజాతాల చిగుళ్ళవలె, అరుణవర్ణ శోభితాలు. అతనికోరలు, శరత్కాలమేఘాల మధ్య ధగధగమెరిసే మెరుపుతీగలు. అతని నాలుక, ప్రళయకాలాన సృష్టిని కబళించడానికి, ప్రళయాగ్నినుండి ఎగసిపడే జ్వాలామాలిక. అతని

నోరు, ముక్కు రంధ్రాలు, మేరు, మందర పర్వతాల గుహల అంతర్భాగాలు, ఆతని ముక్కునుండి వెడలే ఊర్పులు, సప్తసాగరజలాలను మరిగిస్తున్నాయి. అతని కన్నులు, తూర్పుకొండపై వెలుగొందే సూర్యమండలంతో సమానమైన వెలుగులీనుతున్నాయి. అతని క్రీగంటి చూపులు, వాటినుండి బయల్వెడలే నిప్పుకణాలు, ఆకాశానగల నక్షత్రమండలాలను నిరోధిస్తున్నాయి. అతని కనుబొమలు, హరివిల్లువలె వంగి సుందరంగా భాసించగా, అతని ముఖం భయంకరంగానూ అతిసుందరంగాను ఉన్నది. అతని చెవులు నిశ్చలంగా ఎత్తుగా ఉన్నాయి. అతని జూలు, మందర పర్వతపు మథనతీవ్రత వలన ఎగసిపడే పాలసముద్రపు తరగల తుంపురులవలె మనోహరంగా ఉన్నాయి. అతని వెంట్రుకలు, చంద్రకిరణాలవలె తెల్లగా ఉన్నాయి. అతని గర్జన, దిగ్గజాల చెవుల రంధ్రాలను హోరెత్తిస్తున్నాయి. శ్వేతపర్వతంవంటి పొడవైన, మిరుమిట్లు గొలిపే శరీర మతనిది. అతని దేహంనుండి వెల్వడే తెల్లని కాంతిపుంజాలు శత్రురాక్షస సమూహాల గర్వమనే చీకటిని పారదోలుతున్నాయి.

అతడు, ప్రహ్లాదుణ్ణి రక్షించడానికి హిరణ్యకశిపుని శిక్షించడానికి కారణమైనా, ప్రహ్లాదునియందు కరుణరసంతోనూ, హిరణ్యకశిపునియందు వీరరసంతోనూ ప్రకాశిస్తున్నాడు. ఇంతటి ప్రభావంగల నృసింహస్వామి ఆవిర్భవించాడు.

**విశే : యాతుధానులు :** వేదాలలో రాక్షసులకు 'యాతుధాను'లనే శబ్దం ప్రయోగింపబడింది. 'యాతు' అనే శబ్దానికి 'మాయావిద్య, శాంబరీవిద్య అని పేరు. రాక్షసులు 'కామరూపు'లు, గనుక మాయా/శాంబరీ విద్యచే తమ కిష్టమైనరూపాన్ని ధరించేవారు. రామాయణంలో మారీచుడనే రాక్షసుడు/మాయావి, యాతు విద్యచే 'బంగారుజింక'గా మారడం యాతువిద్యా ప్రభావమే.

**క. నరమూర్తి గాదు, కేవల, హరిమూర్తియుఁగాదు మానవాకారముఁ గే**
**సరియాకారము నున్నది, హరిమాయారచితమగు యథార్థము చూడన్. 286**

**ప్రతి :** చూడన్= పరికించగా; నరమూర్తి+కాదు= మానవరూపం గాదు; కేవల హరిమూర్తియున్+కాదు= వట్టి సింహరూపమూ గాదు; మానవ+ఆకారమున్= నరుని స్వరూపం; కేసరి+ఆకారమున్+ఉన్నది= సింహపు స్వరూపమూ ఉన్నది; హరి= విష్ణువు (యొక్క) మాయా= మాయచే; రచితము+అగు= చిత్రించబడిన; యథార్థము= వాస్తవం.

**తా :** చూస్తుంటే, ఆ ఆకారం, కేవలం నరునిది గాదు, అట్లని సింహానిదీ కాదు. రెండూ మేళవించి ఉన్నాయి. వాస్తవంగా ఇది విష్ణుమాయా కల్పితం.

**ఉ. తెంపున బాలుఁడాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి**
**ష్ఠింపఁదలంచి యిందు నరసింహశరీరముఁదాల్చి చక్రి శి**
**క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతియంచుఁదలంతు నైన నా**
**సొంపును బెంపు నందఱును జూడఁజరింతు, హరింతు శత్రువున్. 287**

**ప్రతి :** బాలుఁడు= అర్భకుడు; తెంపునన్= తెగింపుతో; ఆడినన్= పలుకగా; సుధీరతన్= మంచి ధైర్యంతో; సర్వ+గతత్వమున్= అంతటను వ్యాపించి ఉండుటను; ప్రతిష్ఠింపన్= స్థాపించుటకు; తలంచి= ఆలోచించి; చక్రి= విష్ణువు; ఇందు= ఈ స్తంభంలో; నరసింహ శరీరమున్+తాల్చి= నరసింహ దేహాన్ని ధరించి; శిక్షింపఁగన్= దండించుటకు, వచ్చినాఁడు= పుట్టినాడు; హరిచేన్= విష్ణువుచే; మృతి+అంచున్= మరణము (ఉంది) అని; తలంతున్= అనుకొంటాను; ఐనన్=

అయినా కాని; నా సొంపును+పెంపున్= నా చక్కదనాన్ని, గొప్పతనాన్ని; అందఱున్+చూడన్= ఎల్లరు చూసేవిధంగా; చరింతున్= ప్రవర్తిస్తాను; శత్రువున్= విరోధిని; హరింతున్= నశింప జేస్తాను.

**తా :** ప్రహ్లాదుడు తెగించి అన్నమాటలను, ధైర్యంగా నిరూపించడానికై విష్ణువు తన సర్వగతత్వాన్ని ఋజువు పరచుటకై ఈ స్తంభంలో, స్థిరంగా ప్రదర్శించడానికి, ఆ విధంగా నన్ను దండించడానికి వచ్చి ఉన్నాడు, నాకు చావు తప్పదు, అయినా, నా పెంపూ, సొంపూ కనబడేటట్లు అందరి ముందు నేను శత్రువును ఎదిరించి పోరాడుతాను.

**విశే :** రాక్షసులు విష్ణువుతో వైరం పెట్టుకున్నప్పుడు అతని వలననే మరణిస్తామని తెలిసినపుడు చివరి క్షణంవరకు కూడా తమ పరాక్రమాన్ని చూపి ఎదిరిస్తుంటారు తప్ప శరణాగతులు కారు.

## ❖ నృసింహమూర్తి హిరణ్యకశిపుతోఁ బోరి వధించుట ❖

**వ. అని మెత్తంబడని చిత్తంబున గద నెత్తికొని తత్తఱంబున నార్చుచు నకుంఠిత కంఠీరవంబు డగ్గఱు గంధసింధురంబు చందంబున నక్తంచర కుంజరుండు నరసింహదేవున కెదురు నడచి తదీయదివ్యతేజోజాల సన్నికర్షంబునం జేసి దవానలంబు డగ్గఱిన ఖద్యోతంబునుం బోలెఁ గర్తవ్యాకర్తవ్యంబులు దెలియక నిర్గత ప్రభుండయి యుండె, నప్పుడు 288**

**ప్రతి :** అని= అంటూ; మెత్తంబడని= నీరుగారిపోని; చిత్తంబునన్= మనస్సుతో; గదను+ఎత్తికొని= గదను ధరించి; తత్తఱంబునన్= తొట్రుపాటుతో; ఆర్చుచున్= అరుస్తూ; అకుంఠిత కంఠీరవంబున్= దెబ్బతినని సింహాన్ని; డగ్గఱు=సమీపించే; గంధసింధురంబు చందంబునన్= మదపుటేనుగువలె; నక్తంచరకుంజరుండు= రాత్రుల్లో తిరుగాడే రాక్షసులలో శ్రేష్ఠుడు; నరసింహదేవునకున్= నృసింహమూర్తికి; ఎదురు నడచి= ఎదురుగా వెళ్ళి; తదీయ= అతనిదైన, దివ్య= దివ్యమైన; తేజస్+జాల= కాంతి పుంజపు; సత్+నికర్షంబునన్+చేసి= సామీప్యంవల్ల; దవ+అనలంబు= అడవి నిప్పును; డగ్గఱిన= సమీపించిన; ఖద్యోతంబునున్+పోలెన్= మిణుగురుపురుగు వలె; కర్తవ్య+అకర్తవ్యంబులు= ఇది చేయదగ్గది; ఇది చేయదగనిది – అని రెండును; తెలియక= గ్రహింపజాలక; నిర్గతప్రభుండు+అయి= అధికారదర్పం/తేజస్సు తొలగినవాడై; ఉండెన్= నిలిచెన్; అప్పుడు...

**తా :** అని తలపోస్తూ, హిరణ్యకశిపుడు నీరుగారిపోని మనోధైర్యం తెచ్చుకున్నాడు. గదను ఎత్తిపట్టుకొని తొట్రుపాటుతో గంభీరమైన మృగరాజును సమీపించే మదగజంలాగా హిరణ్యకశిపుడు నృసింహభగవానునికి ఎదురు నడిచాడు. భగభగమండే దావానలం ముందు మిణుగురుపురుగు లాగా శ్రీనృసింహుని కాంతిముందు హిరణ్యకశిపుడు వెలవెలపోయాడు. ఆ సమయంలో ఆ రక్కసుడు ఇది చేయదగింది, ఇది చేయకూడదన్న విచక్షణను కోల్పోయాడు.

**మ. ప్రకటంబై ప్రళయావసానమున మున్ బ్రహ్మాండభాండావరో**
**ధకమై యున్న తమిస్రమున్ జగము నుత్పాదించుచోఁ ద్రావి సా**
**త్త్విక తేజోనిధియైన విష్ణునెడ నుద్దీపించునే? నష్టమై**
**వికలంబై చెడుఁగాక తామసుల ప్రావీణ్యంబు రాజోత్తమా! 289**

**ప్రతి :** రాజ+ఉత్తమా!= రాజులలో శ్రేష్ఠుడా!; మున్= ముందు; ప్రకటంబై= స్పష్టమై; ప్రళయ+అవసానమునన్= ప్రళయకాలపు చివర; బ్రహ్మాండభాండ+అవరోధకము+ఐ= బ్రహ్మాండభాండాలకు అడ్డంకిగా అయి; ఉన్న+తమిస్రమున్= కల చీకటిని; త్రావి= తాగి; జగమున్+ఉత్పాదించుచోన్= లోకాన్ని పుట్టించే సమయాన; సాత్త్వికతేజస్+నిధి+ఐన= సత్త్వగుణపు కాంతికి గనియై నిలిచిన; విష్ణు+ఎడన్= హరియందు; తామసులప్రావీణ్యంబు= తమోగుణ ప్రధానమైనవారి నేర్పు; ఉద్దీపించును+ఏ= ప్రకాశించునా? నష్టమై= నాశనమై; వికలంబై= భగ్నమై; చెడున్+కాక= పాడవుతుంది గాని.

**తా :** రాజులలో శ్రేష్ఠుడా! ధర్మరాజా! పూర్వకాలాన ప్రళయకాలం చివరలో, బ్రహ్మాండ భాండమంతటా చీకటి ఆవరించి నిరోధకంగా ఉండినది. విష్ణువు, లోకసృష్టి చేయబోతూ దానిని మ్రింగి తాను, సత్త్వగుణ కాంతికి నిలయమై నిలువగా, తామసుల నైపుణ్యం భగ్నమై నశించింది, విష్ణువుఎదుట రాక్షసులు నిలువగలరా? కాంతి ముందు చీకటి ఉండగలదా!

**వ. అంత నద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదాదండంబు గిరగిరం ద్రిప్పి నరమృగేంద్రుని వ్రేసిన నతండు దర్పంబున సర్పంబు నొడిసిపట్టు సర్పపరిపంథి నేర్పున దితిపట్టిం బట్టికొనిన మిట్టిపడి దట్టించి బిట్టు కట్టలుక న య్యసుర వరుండు దృఢబలంబున నిట్టట్టు మిడిసి పట్టు దప్పించుకొని విడివడి దిటవు దప్పక కుప్పించి యుప్పరం బెగసి విహంగ కులరాజచరణ నిర్గళిత భుజంగంబు తెఱంగునం దలంగ నుఱికి తన భుజాటోపంబున నరకంఠీరవుండు కుంఠితుం డయ్యెడి నని తలంచి కలంగక చెలంగుచుఁ దన్ను నిబిడ నీరద నికరంబుల మాటున నిలింపులు గుంపులు గొని డాఁగి మూఁగి క్రమ్మఱ నాత్మీయ జీవన శంకా కళంకితులై మంతనంబులఁ జింతనంబులు సేయుచు నిరీక్షింప నక్షీణ సమర దక్షతా విశేషం బుపలక్షించి ఖడ్గ వర్మంబులు ధరియించి భూనభో భాగంబుల వివిధ విచిత్ర లంఘనా లాఘవంబులం బరిభ్రమణ భేదంబులఁ గరాళవదనుండయి యంతరాళంబునఁ దిరుగు సాళువడేగ చందంబున సంచరించిన సహింపక. 290**

**ప్రతి :** అంతన్= పిదప, ఆ+దానవ+ఇంద్రుండు= ఆ రాక్షసరాజు, మహా+ఉత్+దండంబు+అగు= మిక్కిలి గొప్పదైన, గదాదండంబున్= గదాయుధాన్ని, గిరగిరన్+త్రిప్పి= చేతితో చుట్టూరా తిప్పుతూ; నరమృగ+ఇంద్రునిన్= నరసింహుని, వ్రేసినన్= మోదగా, అతండు= నరసింహుడు; దర్పంబునన్= పొగరుతో; సర్పంబును+ఒడిసిపట్టు= పామును అణచి పట్టినట్లుగా; సర్పపరి పంథినేర్పునన్= సర్పవిరోధి అయిన గరుడుని నిపుణతతో; దితిపట్టిన్= రాక్షసుని, పట్టికొనినన్= పట్టుకొనగా; మిట్టిపడి= ఎగసిపడి; దట్టించి= అదరించి; బిట్టు= గట్టి; కదు+ఆలుకన్= ఎక్కువకోపంతో; ఆ+అసురవరుండు= ఆ రాక్షసరాజు; దృఢబలంబునన్= గట్టిసత్తువతో; ఇట్టు+అట్టు= ఇటు అటు; మిడిసి= ఎగసి; పట్టున్+తప్పించుకొని= నృసింహుని, పట్టును విడిపించుకొని; విడి+పడి= వేరై; దిటవు+తప్పక= పట్టుదల వదలక; కుప్పించి= పైకెగిరి; ఉప్పరంబు+ఎగసి= ఆకాశానికి ఎగిరి; విహంగ కుల= పక్షుల సమూహపు; రాజ= రాజైన గరుత్మంతుని; చరణ= కాలినుండి; నిర్గళిత= జారిన; భుజంగంబు తెఱంగునన్= పామువలె; తలంగన్+ఉఱికి= తొలగి పారి; తనభుజ+ఆటోపంబునన్= తన బాహుబలానికి; నరకంఠీరవుండు= నరసింహుడు; కుంఠితుండు+అయ్యెడిన్+అని= ఓడిన వాడవుతాడని; తలంచి= తలుస్తూ; కలంగక= కలతచెందక; చెలంగుచున్= చెలరేగుతూ; తన్నున్= తనను; నిబిడ= దట్టమైన; నీరద= మేఘముల; నికరంబుల= గుంపుల; మాటునన్= చాటున; నిలింపులు= దేవతలు; గుంపులు+కొని= గుమిగూడి; డాఁగి, మూఁగి=

దాగి, చుట్టుకొని, క్రమ్మఱన్= మరల; ఆత్మీయజీవనశంకా కళంకితులై= తమదైన; బ్రదుకుకు చెందిన అనుమానంతో; (కళతప్పినవారై) మచ్చబడినవారై; మంతనంబులన్= పరస్పర భాషణలతో; చింతనంబులు+చేయుచున్= ఆలోచనలు చేస్తూ; నిరీక్షింపన్= (ఎదురు)చూడగా; (తన్నున్ – తో అన్వయం). అక్షీణ= గొప్ప; సమరదక్షతా విశేషంబు= యుద్ధమందలి నేర్పును, ఉపలక్షించి= గుర్తించి; ఖడ్గవర్మంబులు= కత్తి కవచాలను; ధరియించి= తాల్చి; భూనభస్+భాగంబులన్= భూమిపై ఆకాశంలో; వివిధ= అనేక; విచిత్ర= ఆశ్చర్యకరమైన; లంఘనా లాఘవంబులన్= దాటుటలోని నేర్పులతో; పరిభ్రమణభేదంబులన్= చుడుతూ తిరుగుటలోని విధాలతో; కరాళవదనుండయి= భయంకరమైన ముఖము గలవాడై; అంతరాళంబునన్= భూమ్యాకాశముల మధ్య తిరుగుతూ= సాళువడేగ చందంబనన్ – 'శ్యేన' మని పిలువబడే ఒకజాతి డేగవలె; సంచరించినన్= తిరుగాడగా; సహింపక= ఓర్చుకొనలేక.

**తా :** దానవ వీరుడు తన భయంకరమైన గదాదండం గిరగిరా త్రిప్పి నరసింహస్వామిపై విసిరాడు. వెంటనే ఆ స్వామి గరుత్మంతుడు సర్పాన్ని ఒడిసి పట్టినట్లుగా రాక్షసరాజును పట్టుకున్నాడు. దానవేంద్రుడు ఎగిరిపడి ఇటూ అటూ గింజుకుని, కోపంతో, చాకచక్యంతో బలం పుంజుకొని, పట్టు తప్పించుకొన్నాడు. అధైర్యం చెందకుండా గరుత్మంతుని పట్టు తప్పించుకొన్న సర్పరాజులాగా ఎగిరి ఎగిరి పడుతూ చిందులు త్రొక్కుతూ పోరాడ సాగాడు. తన భుజబలం ముందు నరసింహుడు లొంగిపోతాడులే అనుకొని రాక్షసేశ్వరుడు కలత పడకుండా విజృంభిస్తూ అతి నిపుణంగా తన పరాక్రమాన్ని ప్రదర్శిస్తున్నాడు. ఆకాశంలో దట్టమైన నల్లని మేఘాలమాటున నక్కి నక్కి చూస్తూ దేవతలు 'వీడు లొంగేటట్లు లేదు, మన జీవితాలకు ముప్పు తప్పేటట్లు లేదు' అని దిగాలుపడి ఆలోచనలు చేస్తున్నారు. ఆ రాక్షసుణ్ణి రహస్యంగా చూస్తూనే ఉన్నారు. హిరణ్యకశిపుడు యుద్ధ విద్యా తంత్రాలు ప్రదర్శిస్తూ చిత్ర విచిత్ర గతులలో కవచధారియై ఖడ్గచాలనం చేస్తూ భూమ్యాకాశాలంతటా తానే పరిభ్రమిస్తున్నాడు. నేర్పుగా దూకుతున్నాడు. రక రకాలుగా తప్పించుకొంటున్నాడు. తారసిల్లుతున్నాడు. భయం పుట్టించే ముఖంతో ఆకాశంలో తిరిగే డేగలాగా ఎగిరిపడుతున్న రాక్షసుని అహంకారాన్ని సహింపక ఆగ్రహించాడు నరసింహస్వామి!

**విశే : సాళువడేగ –** 'శ్యేన' జాతికి చెందిన డేగ, గ్రద్ద. వీటికి పౌరుషం ఎక్కువ. శత్రుసంహారం చేస్తేగాని వదలిపోదు. యజ్ఞాలలో అగ్నిచయన మనేదొక యజ్ఞం . ఈ యజ్ఞంయొక్క ఆకృతి శ్యేనరూపంతో నిర్మిస్తే శ్యేనచితి అంటారు. చాచిన రెక్కలతో వాడియైన ముక్కుతో పుచ్ఛముతో ఆకాశంలో ఎగురుతున్నట్లు దీని ఆకృతి కల్పించబడుతుంది. గరుడాకృతిగల యజ్ఞవేదికి "సుపర్ణచితి" అని అంటారు. ఋగ్వేదంలోని సుపర్ణసూక్తములో దీని వర్ణనమున్నది. మహాభారతయుద్ధ వ్యూహాలలో శ్యేన, గరుడ వ్యూహాలు సుప్రసిద్ధాలు.

**సీ. పంచాననోద్ధూత పావక జ్వాలలు భూనభోంతరమెల్లఁ బూరితముగ**
**దంష్ట్రాంకురాభీల ధగధగాయిత దీప్తి నసురేంద్రు నేత్రము లంధములుగఁ**
**గంటక సన్నిభోత్కట కేసరాహతి నభ్రసంఘము భిన్నమై చలింపఁ**
**బ్రళయాభ్రచంచలాప్రతిమభాస్వరములై కరనఖరోచులు గ్రమ్మదేర**

**తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి, దృష్టి సారించి బొమలు బంధించి కెరలి**
**జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి, పట్టె నరసింహుఁడా దితిపట్టి నధిప! 291**

**ప్రతి :** అధిప!= రాజా!; పంచానన+ఉద్ధూతపావక జ్వాలలు= సింహపు నోటినుండి ఎగసిన అగ్నికీలలు; భూనభస్+అంతరము+ఎల్లన్= భూమి ఆకాశములలోపల అంతటను; పూరితముగన్= నిండినదికాగా; దంష్ట్రా+అంకుర+ఆభీల ధగధగాయిత దీప్తి= కోరలమొలకల భయంకరమైన ధగధగలాడేకాంతితో; అసుర+ఇంద్రునేత్రములు= రాక్షసరాజు కన్నులు; అంధములుగన్= గ్రుడ్డివి కాగా; కంటక సన్నిభ+ఉత్కటకేసర+ఆహతిన్= ముళ్ళవంటి పెద్దజూలుల దెబ్బతో; అభ్రసంఘము= మేఘాలగుంపు; భిన్నమై= చెదరినవై; చలింపన్= కదలగా; ప్రళయ+అభ్రచంచలా ప్రతిమభాస్వరములై= ప్రళయకాలమందలి మేఘాల మెరపులతో సమానంగా వెలిగెడివై; కరనఖరోచులు= చేతి గోళ్ళకాంతులు; క్రమ్మిదేరన్= వ్యాపింపగా; సటలు= జూలు; జళిపించి= విదిల్చి; గర్జించి= అరచి; సంభ్రమించి= తొందరపడి; దృష్టిసారించి= చూపులు పరపి; బొమలు బంధించి= కనుబొమలు ముడివేసి; కెరలి= కోపగించి; జిహ్వా+ఆడించి= నాలుక చాచి; లంఘించి= దుమికి; దితిపట్టిన్= దితియొక్క కుమారుడైన హిరణ్యకశిపుని; నరసింహుఁడు= నర, మృగశరీరుడైన నరసింహుడు; చేతన్= చేతితో; ఒడిసిపట్టెన్= జవిరి పట్టుకున్నాడు.

**తా :** రాజా! తన నోట వెల్వడే అగ్నిజ్వాలలు, భూమ్యాకాశాల వ్యాపించగా, తన కోరలకాంతుల తీక్ష్ణతకు రాక్షసునికళ్ళు చూపు కోల్పోగా, తన జూలుయొక్క వేగాతిశయానికి ఆకాశమేఘాలు ముక్కలై చెదరిపోగా, తనచేతి గోళ్ళకాంతులు, లయకాలపు మేఘాల మెరపులవలె వ్యాప్తిచెందగ, నరసింహుడు, కేసరములు విదిల్చి, గర్జించి, చూచి, కనుబొమలు ముడివేసి, కోపగించి, నాలుక చాచి, ఎగిరి చేతితో రాక్షసుని ఒడుపుగా పట్టుకొన్నాడు.

**క. సరకుగొనక లీలాగతి, నురగేంద్రుఁడు మూషకంబు నొడిసిన పగిదిన్**
**నరకేసరి దను నొడిసిన, సురవిమతుఁడు ప్రాణభీతి సుడివడియె నృపా! 292**

**ప్రతి :** నృపా!= రాజా! నరకేసరి= నరసింహుడు; సరకుగొనక= లక్ష్యపెట్టక; లీలాగతిన్= అవలీలగా; ఉరగ+ఇంద్రుండు= సర్పరాజు; మూషకంబున్= ఎలుకను; ఒడిసిన పగిదిన్= పట్టినవిధంగా; తనున్+ఒడిసినన్= తనను పట్టుకొనగా; సుర విమతుఁడు= దేవతల విరోధియైన రాక్షసుడు; ప్రాణభీతిన్= ప్రాణభయంతో; సుడి+పడియెన్= కలత చెందెను,

**తా :** రాజా! పాము ఎలుకను పట్టినట్లుగా, నరసింహుడు రాక్షసుని అవలీలగా పట్టుకోగా, అతడు ప్రాణభయంతో కలవర పడినాడు.

**క. సురరాజవైరి లోఁబడెఁ, బరిభావితసాధుభక్తపటలాంహునకున్**
**నరసింహునకు నుదంచ, త్ఖరతరజిహ్వునకు నుగ్రతరరంహునకున్. 293**

**ప్రతి :** పరిభావిత= తిరస్కరింపబడిన, సాధుభక్త పటల+అంహునకున్= మంచిభక్తుల సమూహాల దోషాలు గలవానికి, ఉత్+అంచత్= పైకి ఎగసిన, ఖర తర జిహ్వునకున్= ఎక్కువ వాడిగల నాల్క గలవానికి, ఉగ్రతర రంహునకున్= మిక్కిలి భయంకరమైన వేగం గలవానికి, నరసింహునకున్= నృసింహునకు, సురరాజవైరి= ఇంద్రుని శత్రువు, హిరణ్య కశిపుడు; లోఁబడెన్= లొంగెను.

**తా :** సజ్జనులైన భక్తకోటి దోషాలు తుడిచేవాడు, ఎగసిపడే వాడి నాల్క గలవాడు, మహావేగవంతుడు అయిన నరసింహునకు రాక్షసుడు లొంగిపోయాడు.

**విశే :** అంహు; జిహ్వు; రంహు; సింహు అని నాల్గుసార్లు ఉత్వవిశిష్ట 'హ'కారమునకు పునరావృత్తి కల్పించడంచేత నరసింహుని సింహనాదము, హుంకారములు సన్నివేశానికి తగిన భయానకరసానికి పోషకంగా ఉన్నాయి.

**వ. అంత. 294**

**ప్రతి :** అంతన్= అంతలో...

**తా :** అంతలో

**మ. విహగేంద్రుండహి వ్రచ్చుకైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా**
**గ్రహుఁడై యూరువులందుఁజేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు**
**స్సహు దంభోళికఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం**
**ద్రహుతాశాంతకభీకరున్ ఘనకరున్ దైత్యాన్వయశ్రీకరున్. 295**

**ప్రతి :** నృసింహుండు= నరసింహుడు; స+ఆగ్రహుఁడై= క్రోధావేశంతో కూడినవాడై; మహా+ఉద్వృత్తిన్= గొప్పగా ఎగిసే ప్రవర్తనతో; విహగ+ఇంద్రుండు= పక్షులరాజు గరుత్మంతుడు; అహిన్= పామును; వ్రచ్చుకైవడిన్= చీల్చేవిధంగా; ఊరువులందున్= తొడలపై; చేర్చి= నిల్పి; దుస్సహున్= సహింపరానివాడిని; దంభోళికఠోరదేహున్= వజ్రంవలె గట్టిదేహంగలవాడిని; అచల+ఉత్సాహున్= స్థిరమైన ఉత్సాహం గలవాడిని; మహాబాహున్= గొప్పభుజాలు గలవాడిని; ఇంద్రహుతాశ+అంతక భీకరున్= ఇంద్రునికి; అగ్నికి, యమునికి భయంకరుడైనవాడిని; ఘనకరున్= గట్టిచేతులు గలవాడిని; దైత్య+అన్వయ శ్రీకరున్= రాక్షస వంశశ్రేయస్కరుడైన హిరణ్యకశిపుని; వ్రచ్చెన్= చీల్చినాడు.

**తా :** నృసింహుడు, ఆగ్రహోదగ్రుడై, వజ్రకఠోరదేహుణ్ణి, నిరంతర ఉత్సాహశీలిని, ఇంద్ర యమ అగ్నులకుకూడా భీకరమైనవాణ్ణి, గొప్పభుజాలతో స్వవంశానికి ప్రతిష్ఠ కల్పించిన రాక్షసుడైన హిరణ్యకశిపుణ్ణి తన తొడలపై చేర్చి, గరుత్మంతుడు పామును చీల్చినట్లుగా చీల్చాడు.

**శా. చించున్ హృత్కమలంబు, శోణితము వర్షించున్ ధరామండలిం,**
**ద్రెంచుంగర్కశనాడికావళులు, భేదించున్ మహావక్షముం,**
**ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా, దుష్టాసురున్ వ్రచ్చి ద**
**ర్పించుం, బ్రేవులు కంఠమాలికలు గల్పించున్ నఖోద్భాసియై. 296**

**ప్రతి :** నృసింహుండు; హృద్+కమలంబు= గుండె అనే పద్మాన్ని; చించున్= చీల్చుతాడు; శోణితము= రక్తం; ధరామండలిన్= భూమండలమున; వర్షించున్= కార్చుతాడా; కర్కశనాడికా+ఆవళులు= గట్టి నాడుల వరుసలను; త్రెంచున్= ముక్కలు చేస్తాడు; మహావక్షమున్= గొప్ప రొమ్మును; భేదించున్= బ్రద్దలు చేస్తాడు; మాంసము, సూక్ష్మఖండములుగాన్= కండరాలను చిన్న ముక్కలుగా; త్రుంచున్= ఖండిస్తాడు; దుష్ట+అసురున్= చెడ్డరక్కసుని; వ్రచ్చి= చీల్చి; దర్పించున్= గర్వపడుతాడు; నఖ+ఉద్భాసియై= గోళ్ళతో వెలిగేవాడై; ప్రేవులు= పేగులను; కంఠమాలికలు= మెడకు హారాలుగా; కల్పించున్= చేసుకున్నాడు.

**తా :** నృసింహ దేవుడు, ప్రకాశిస్తున్న తనగోళ్లతో రాక్షసుని పద్మాకారపు గుండెను చీల్చి రక్తాన్ని భూమిపై కార్చాడు. అతని కఠిన నాడులను త్రెంచి, విశాలవక్షాన్ని భగ్నం చేశాడు. ఆతని మాంసాన్ని ముక్కలుగా నరికాడు. అతని ప్రేవులను తన మెడలో హారాలుగా ధరించాడు. ఆపై తన చేష్టలకు గర్వించాడు.

సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు సేయుచో ఘనకుఠారంబులకరణి నొప్పు,
గంభీరహృదయపంకజము భేదించుచోఁ గుద్దాలములభంగిఁగొమరుమిగులు
ధమనీవితానంబు దవిలి ఖండించుచోఁ బటులవిత్రంబుల పగిది మెఱయు
జఠరవిశాలాంత్రజాలంబుఁద్రెంచుచోఁ గ్రకచసంఘంబుల గరిమఁజూపు,

తే. నంకగతుఁడైన దైత్యుని నాగ్రహమున, శస్త్రచయముల నొంపక సంహరించి
యమరు నరసింహు నఖరంబు లతివిచిత్ర, సమరముఖరంబులై యుండె జనవరేణ్య! **297**

**ప్రతి :** అంకగతుఁడైన= తొడలపైనున్న; దైత్యుని= రాక్షసుని; ఆగ్రహమునన్= క్రోధంతో; శస్త్రచయములన్= ఆయుధ సమూహంతో; నొంపక= నొప్పించక; సంహరించి= చంపి; అమరు= ఒప్పెడు; నరసింహు నఖరంబులు= నృసింహుని వాడియైనగోళ్ళు; వక్షస్+కవాటంబు= రొమ్ము అనే తలుపును; వ్రక్కలు+చేయుచోన్= ముక్కలు చేసేటపుడు; ఘనకుఠారంబుల కరణిన్= గొప్ప గండ్రగొడ్డళ్ళవలె; ఒప్పున్= అమరును; గంభీర హృదయపంకజమున్= లోతైన గుండె అనే పద్మాన్ని; భేదించుచోన్= భిన్నం చేసే సమయాన; కుద్దాలముల భంగిన్= గునపములవలె; కొమరు మిగులున్= మిక్కిలి ఒప్పుతాయి; ధమనీవితానంబున్= ధమనుల సమూహాన్ని; తవిలి= తగిలి ఇష్టపడి; ఖండించుచోన్= నరికే సమయాన; పటులవిత్రంబుల పగిదిన్= పదునైన కొడవళ్ళవలె; మెఱయున్= ప్రకాశించును; జఠరవిశాల+ఆంత్రజాలంబున్= కడుపు నందలి విస్తృతమైన ప్రేగులగుంపును; త్రెంచుచోన్= ఖండించేటప్పుడు; క్రకచసంఘంబుల గరిమన్= రంపముల గొప్పతనాన్ని; చూపున్= ప్రదర్శిస్తాయి; జనవరేణ్యా= రాజా!; అతి విచిత్ర సమరముఖరంబులై+ఉండెన్= మిక్కిలి చోద్యమైన యుద్ధపరికరాలై ఒప్పెనాయి.

**తా :** నృసింహుని వాడిగోళ్ళు, అతివిచిత్రంగా రాక్షసుని రొమ్ము అనే తలుపు పగులగొట్టేటపుడు మంచి గండ్రగొడ్డళ్ళలాగా, ఆతని గుండె అనే తామరను చీల్చేటపుడు గునపాలలాగా, అతని ధమనులగుంపును ఛేదించేటపుడు మంచి కొడవళ్ళలాగా, కడుపులోని ప్రేవులవరుసలను త్రెంచేటపుడు, రంపములలాగా, ఉపకరించాయి. రాక్షసుని ఆయుధాలతో చంపక తనవాడియైన గోళ్ళతో చీల్చిచండాడాడు. (రాక్షసుడు ఆయుధాలతో చావడు మరి! వరప్రభావమది)

క. స్ఫురిత విబుధజనముఖములు, పరివిదళితదనుజనివహపతి తనుముఖముల్
గురురుచిజితశిఖిశిఖములు, నరహరిఖరనఖము లమరు నతజనసఖముల్. **298**

**ప్రతి :** నరహరిఖరనఖములు= నృసింహుని వాడిగోళ్ళు; స్ఫురిత విభుధజనముఖములు= వికసించిన దేవతల ముఖాలతో; పరివిదళిత= నరకబడిన; దనుజ, నివహపతి= రాక్షసమూహాల రాజు(యొక్క); తనుముఖముల్= శరీరం, ముఖంతో; గురు రుచి జిత శిఖిశిఖములు= గొప్పకాంతితో అగ్నిశిఖలతో జయించినవి; నతజన సఖముల్= నమస్కరించిన ఆశ్రితులకు మిత్రాలుగా ఐ; అమరున్= ఒప్పాయి.

**తా :** ఆ నరకేసరి నఖాలు శరణాగత సాధుజనులకు ప్రాణసఖాలు. అవి రాక్షసనాథుని శరీరాన్ని చీల్చివేశాయి. దేవతల ముఖాలను వికసింపచేశాయి. గొప్పకాంతులతో అగ్నిశిఖలనుసైతం జయించాయి.

వ. ఇట్లు కేవల పురుషరూపంబును మృగరూపంబునుం గాని నరసింహ రూపంబున రేయునుం బవలునుం గాని సంధ్యాసమయంబున, నంతరంగంబును బహిరంగంబునుం గాని సభాద్వారంబున,

**గగనంబునుం భూమియునుం గాని యూరుమధ్యంబునఁ, బ్రాణసహితంబులును బ్రాణరహితంబులును గాని నఖంబులం ద్రైలోక్యజన హృదయ భల్లుండయిన దైత్యమల్లుని వధియించి మహాదహన కీలాభీల దర్శనుండును, గరాళవదనుండును లేలిహానభీషణ జిహ్వుండును శోణిత పంకాంకిత కేసరుండునునై ప్రేవులు కంఠమాలికలుగా ధరించి కుంభి కుంభ విదళనంబుసేసి చనుదెంచు పంచాననంబునుంబోలె దనుజకుంజర హృదయకమల విదళనంబు సేసి తదీయ రక్తసిక్తంబులైన నఖంబులు సంధ్యారాగ రక్తచంద్రరేఖల చెలువు వహింప సహింపక లేచి తన కట్టెదుర నాయుధంబు లెత్తుకొని తత్తరంబున రణంబునకు నురవడించు రక్కసులం బెక్కుసహస్రంబులం జక్రాదిక నిర్వక్ర సాధనంబుల నొక్కనిం జిక్కకుండం జక్కడిచె, ని వ్విధంబున.** **299**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; కేవల పురుషరూపంబును= వట్టి నరుని ఆకారమూ; మృగరూపంబునున్+కాని= జంతు స్వరూపమూ కాని; నరసింహరూపంబునన్= నరుని సింహపు రూపంతో; రేయునున్= రాత్రీ; పవలునున్+కాని= పగలూ కాని; సంధ్యాసమయంబునన్= సంజవేళ; అంతరంగంబును బహిరంగంబు= లోపల బయటగాని; సభాద్వారంబునన్= సభ (యొక్క) గడపపై; గగనంబునున్ భూమియునున్+కాని= ఆకాశమూ భూమికాని; ఊరుమధ్యంబునన్= తొడలనడుమ; ప్రాణసహితంబులునున్+ప్రాణరహితంబులునున్+కాని= ఉసురుగలవియు; లేనివీ ఐన; నఖంబులన్= గోళ్ళతో; త్రైలోక్యజనహృదయభల్లుండు+అయిన= ముల్లోకముల ప్రజామనస్సులకు బాణమైనవాడు; దైత్యమల్లునిన్= రాక్షసశ్రేష్ఠుని; వధియించి= వధించి; మహాదహనకీలా+అభీలదర్శనుండును= గొప్ప అగ్నిజ్వాలలతో భయంకరముగ కనిపించేవాడు; కరాళవదనుండును= మిట్టపండ్లుగల మొహముగలవాడు; లేలిహానభీషణ జిహ్వుండును= పామువంటి భయంకరమైన నాలుకగలవాడు; శోణితపంక+అంకితకేసరుండును+ఐ= రక్తపు బురద అంటిన జూలుగలవాడు ఐ; ప్రేవులుకంఠమాలికలుగా ధరించి= పేగులను మెడలో హారాలుగా వేసికొని; కుంభికుంభవిదళనంబు+చేసి= ఏనుగు నొసటి నరుకుడుచేసి, చనుదెంచు= వచ్చెడు; పంచ+ఆననంబునున్+పోలెన్= విశాలమైన మొహముగల సింహములాగా; దనుజకుంజర హృదయ కమల విదళనంబు+చేసి= రాక్షసశ్రేష్ఠుని గుండె తామరను చీల్చివేసి; తదీయ రక్తసిక్తంబులు+ఐన= అతని రక్తంతో తడిసిన; నఖంబులు= గోళ్ళు; సంధ్యారాగ రక్తచంద్రరేఖలచెలువు= సంజ ఎరుపున ఎర్రనయిన చంద్రకిరణాల సొగసును; వహింపన్= ధరించగా; సహింపక= ఓర్వలేక (అనంతర సందర్భంతో అన్వయం) లేచి= నిలబడి; తన కదు+ఎదురన్= తన ఎట్టయెదుట; ఆయుధంబులు+ఎత్తుకొని= ఆయుధాలు ధరించి; తత్తరంబునన్= తత్తరపాటుతో; రణంబునకున్= యుద్ధానికై; ఉరవడించు= ఉప్పొంగు; రక్కసులన్= రాక్షసులను; పెక్కుసహస్రంబులన్= వేలకొద్దీ ఉన్న పెక్కుమందిని; చక్ర+ఆదిక నిర్వక్ర సాధనంబులన్= చక్రము మొదలైన అమోఘములైన ఆయుధాలతో; ఒక్కనిన్+చిక్కకుండన్= ఒక్కడినీ మిగల్చక; చక్కడిచెన్= చంపివేసెను; ఈ విధంబునన్= ఈ విధంగా...

**తా :** కేవలం నరుడూ కేవలం మృగమూగాని నరసింహ స్వరూపంతో హరి, పగలూ రాత్రీగాని సంజవేళ, లోపలా బయటా గాని సభాద్వారాన, ఆకాశాన భూమిపైగాక తొడలమధ్య, ప్రాణం ఉన్నవో లేనివో తెలియని గోళ్ళతో, ముల్లోకాలలోని జనుల హృదయాలకు బాణంగా గుచ్చుకుంటూ, వారిని హింసిస్తున్న హిరణ్యకశిపుని నృసింహుడు వధించాడు. వధపిదప అతడు మహాభయంకరంగా కనిపిస్తున్నాడు. జ్వాలలతో ఎగసిపడే అగ్నిహోత్రునివలె భీతిగొల్పుతూ, పొడుచుకొని వచ్చి, వికారంగా కనిపించే కోరలతో, పామువంటి నాలుకతో, కేసరాలనంటిన రాక్షస రక్తంతో, మెడలో మాలికలుగా ధరించిన రాక్షసుని ప్రేగులతో, ఏనుగు కుంభస్థలం చీల్చి, వచ్చే సింహంవలె, రాక్షసుని గుండెతామరను త్రుంచి, ఆ రక్తంతో తడిసిన

జూలుతో, సంజ వెలుగులో మెరిసే చంద్రరేఖల వలె గోళ్లు అబ్బురపరచగా, నిలిచిఉన్నాడు. ఆ స్థితిలో ఆ దేవుని ఎట్టయెదుట ఆయుధహస్తులై యుద్ధానికి సిద్ధమై కనిపిస్తున్న వేలకొలది రాక్షసులను ఒక్కడినికూడా మిగల్చకుండా చంపాడు.

**శా. రక్షోవీరుల నెల్లఁద్రుంచి రణసంరంభంబు చాలించి దృ**
**ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై**
**యక్షీణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పెఁ దన్**
**వీక్షింపంబలికింప నోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్. 300**

**ప్రతి :** నృసింహుఁడు= నరసింహుడు; రక్షస్+వీరులను+ఎల్లన్= ఎల్లరు రాక్షస వీరులను; త్రుంచి= వధించి; రణసంరంభంబు= యుద్ధ ఆర్భాటం; చాలించి= మాని; దృష్టిక్షేపంబు= చూపు, (అతని) నిలుపుట; భయంకరంబుగన్= భయం కలిగించేదికాగా; సభాసింహ+ఆసన+ఆరూఢుఁడై= సభలోని సింహాసనాన్ని అధిష్ఠించినవాడై; అక్షీణ+అగ్రహుఁడై= తగ్గనిక్రోధంగలవాడై; కరాళ+ఆస్యంబుతోన్= భయంకరమైన నోటితో; ఒప్పెన్= ప్రకాశించాడు; తన్= తనను; వీక్షింపన్+పలికింపన్= చూడను, మాట్లాడించను; ఓడి= భయపడి, శక్తిచాలక; ఇతరుల్= అక్కడ మిగిలినవారు; విభ్రాంతులై= దిక్కుతోచనివారై; డాఁగఁగన్= దాక్కొనగా; కంటబడే ధైర్యంచాలనివారై ఉండగా,

**తా :** నృసింహుడు రాక్షసవీరుల సంహారం తరువాత, చూపరులకు భయంకరుడై సింహాసనంపై అధిష్ఠించాడు. అపుడు అతని వైపు చూడడానికి ఎవరూ సాహసించలేకున్నారు. అతని క్రోధం చల్లారలేదు. ముఖం భీషణంగా ఉంది.

**క. సురచారణవిద్యాధర, గరుడోరగయక్షసిద్ధగణములలో నొ**
**క్కరుఁడైన డాయ వెఱచును, నరహరి నయ్యవసరమున నరలోకేశా! 301**

**ప్రతి :** నరలోక+ఈశ!= భూలోకానికి అధిపతీ!; ఆ+అవసరమునన్= ఆ సమయంలో; సుర= దేవతలు; చారణ= చారణులు; విద్యాధర= విద్యాధరులు; గరుడ= గరుడులు; ఉరగ= నాగులు; యక్ష= యక్షులు; సిద్ధ= సిద్ధులు అనే; గణములలోన్= గుంపులలో; ఒక్కరుఁడైనన్= ఏ ఒక్కడూ; నరహరిన్= నృసింహుని; డాయన్= సమీపింపను; వెఱచును= భయపడును.

**తా :** ఓ రాజా! ఆ స్థితిలో, అక్కడగల దేవతలు, చారణులు, విద్యాధరులు, గంధర్వులు, నాగులు, యక్షులు, సిద్ధులు వీరిలో ఏ ఒక్కరూ నృసింహుని సమీపించడానికి సాహసించ లేదు. అందరూ భయభ్రాంతు లయినారు.

**క. తర్షంబుల నరసింహుని, హర్షంబులఁజూచి నిర్జరాంగనలు మహో**
**త్కర్షంబులఁగుసుమంబుల, వర్షంబులు గురిసి రుత్సవంబుల నధిపా! 302**

**ప్రతి :** అధిపా!= రాజా!; నిర్జర+అంగనలు= దేవతాస్త్రీలు; ఉత్సవంబులన్= వేడుకలుగా; నరసింహునిన్= నృసింహుని; హర్షంబులన్= సంతోషంతో; తర్షంబులన్= తమకంతో; చూచి= కనుగొని; మహా+ఉత్కర్షంబులన్= ఎక్కువ గొప్పతనాలతో; కుసుమంబుల వర్షంబులు= పూలవానలు; కురిసిరి= వర్షించారు.

**తా :** ఓ రాజా! ఆ సమయంలో దేవవనితలు సంతోషంతో నృసింహదేవుని జూచి, మహోత్సాహంతో ఆయనపై పూలవానలు కురిపించారు. ఆనందంతో ఉత్సవాలు జరుపుకున్నారు.

**వ. మఱియు న య్యవసరంబున మింట ననేక దేవతా విమానంబులును, గంధర్వగానంబులును, నప్సరోగణనర్తన సంవిధానంబులును, దివ్యకాహళ భేరీపటహ మురజాది ధ్వానంబులును, బ్రకాశమానంబు లయ్యె, సునందకుముదాదు లయిన హరి పార్శ్వచరులును మహేశ్వరవిరించి మహేంద్ర పురస్సరులగు త్రిదశకిన్నర కింపురుష పన్నగ సిద్ధ సాధ్య గరుడ గంధర్వ చారణ విద్యాధరాదులును బ్రజాపతులును నరకంఠీరవదర్శనోత్కంఠు లయి చనుదెంచి. 303**

**ప్రతి :** మఱియును= ఇంకను; ఆ+అవసరంబునన్= ఆ సమయాన; మింటన్= ఆకాశంలో; అనేక దేవతా విమానంబులును= పెక్కు దేవతల విమానాలు; గంధర్వగానంబులునున్= గంధర్వుల పాటలు; అప్సరస్+గణనర్తన సంవిధానంబులును= అప్సరసల సమూహాల నాట్యవిన్యాసాలూ; దివ్య= స్వర్గానికిచెందిన; కాహళ= పెద్దఢక్క; భేరీ= దుందుభి; పటహ= తప్పెట; మురజ+ఆది= మద్దెల మొదలయిన; ధ్వానంబులును= శబ్దాలూ; ప్రకాశమానంబులు+అయ్యెన్= స్పష్టమయ్యాయి; సునందకుముద+ఆదులయిన= సునందుడు, కుముదుడు మొదలైన; హరిపార్శ్వచరులును= విష్ణువు ప్రక్క నడిచే పరిచారకులూ; మహేశ్వర విరించి మహేంద్ర పురస్సరులగు= శంకరుడు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు (మొదట నడుచువారైన); త్రిదశ= దేవతలు (మూడేదశలుగలవారు – (బాల్యకౌమారయౌవనాలు)గలవాడ; కిన్నర= కిన్నరులు; కింపురుష= కింపురుషులు, పన్నగ= నాగులు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు; గరుడ= గరుడులు; గంధర్వ= గంధర్వులు; చారణ= చారణులు; విద్యాధర+ఆదులున్= విద్యాధరులు మొదలయిన ఆయా దేవగణాలూ; ప్రజాపతులును= బ్రహ్మలూ; నరకంఠీరవదర్శన+ ఉత్కంఠులయి= నృసింహుని దర్శనానికై తహ తహ పడేవారై; చనుదెంచి= వచ్చి చేరి...

**తా :** ఇంకా ఆ సమయంలో ఆకసంలో పెక్కు దేవతల విమానాలు, గంధర్వుల పాటలు, అప్సరసల నృత్యాలు, ఢక్క, దుందుభి, తప్పెట, మద్దెల మొదలయినవాని ధ్వనులు వ్యక్తమైనాయి. హరికి పార్శ్వచరులు సునందుడు, కుముదుడు మొదలైనవారు, శంకరుని, బ్రహ్మను, దేవేంద్రుని ముందుపెట్టుకుని దేవతలు, కిన్నరలు, కింపురుషులు, నాగులు, సిద్ధులు, సాధ్యులు, గరుడులు, గంధర్వులు, చారణులు, విద్యాధరులు మొదలయినవారితో పాటుగా ప్రజాపతులు నృసింహస్వామి దర్శన కుతూహలంతో వచ్చిచేరి.

**విశే : వైకుంఠ ద్వారపాలకులు :** జయుడు, విజయుడు (తూర్పు ద్వారపాలకులు). భలుడు, ప్రభలుడు (దక్షిణ ద్వారపాలకులు). నందుడు, సునందుడు (పశ్చిమ ద్వారపాలకులు). కుముదుడు, కుముదాక్షుడు (ఉత్తర ద్వారపాలకులు).

ఇక్కడ తూర్పు ద్వారపాలకులైన జయవిజయులు శాపగ్రస్తులై హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా జన్మించారు.

**ప్రజాపతులు :** భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగీరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వశిష్ఠుడు.

### ❖ బ్రహ్మాది దేవతలు శ్రీనృసింహదేవుని వేర్వేఱ స్తుతించుట ❖

**క. కరకమల యుగళ కీలిత, శిరులై దగ్గఱక భక్తిఁజేసిరి బహు సం**
**సరణాబ్ధితరికి నఖరికి, నరభోజనహస్తిహరికి నరకేసరికిన్. 304**

**ప్రతి :** కరకమల యుగళ కీలితశిరులై= తామరల జంటవంటి చేతులు ఉంచిన తలలుగలవారై (చేతులు తలలపై ఉంచినవారై); దగ్గఱక= సమీపింపక (భయంతో) బహుసంసరణ+అబ్ధి తరికిన్= పెద్ద సంసారమనే సముద్రాన్ని దాటించే

నావకు, నఖరికిన్= గోళ్ళుగలవానికి, నరభోజనహస్తి హరికిన్= రాక్షసుడు అనే ఏనుగునకు సింహమైనవానికి; నరకేసరికిన్= నృసింహునకు, భక్తిన్+చేసిరి= భక్తిని ప్రదర్శించిరి.

**తా :** దేవతాగణాలందరూ, చేతులు తలలపై ఉంచి నమస్కరిస్తూ, భయభక్తులతో సమీపించడానికి వెరుస్తూ, సంసారసాగరాన్ని తరింపజేసే నావయైనవానికి, గోళ్ళుగలవానికి (అవే సంహారకాలు) రాక్షసుడనే ఏనుగు పాలిటి సింహమైన నరసింహునకు తమ భక్తిప్రపత్తులను ప్రదర్శించారు.

**వ. ఆ సమయంబున దేవత లందఱు వేఱు వేఱ వినుతించి, రందుఁ గమలాసనుం డిట్లనియె. 305**

**ప్రతి :** ఆ సమయంబునన్= ఆ వేళలో; దేవతలు+అందఱున్= సకలదేవతలూ; వేఱు వేఱన్= విడివిడిగా; వినుతించిరి= స్తుతించారు; అందున్= వారియందు; కమల+ఆసనుండు= పద్మము పీఠముగాగలవాడు, బ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** అప్పుడు దేవతలందరూ వేర్వేరుగా స్తుతించారు, అందులో బ్రహ్మదేవుడు ఇలా ప్రార్థించాడు.

**మ. ఘనలీలాగుణచాతురిన్ భువనముల్ గల్పించి రక్షించి భే**
**దనముంజేయు దురంతశక్తికి ననంతజ్యోతికింజిత్ర వీ**
**ర్యునికిన్ నిత్యపవిత్రకర్మునికి నే నుత్కంఠతో నవ్యయా**
**త్మునికిన్ వందన మాచరించెదఁ గృపాముఖ్యప్రసాదార్థినై. 306**

**ప్రతి :** నేను= నేను (బ్రహ్మ); ఉత్కంఠతోన్= తహతహతో ఘనలీలాగుణచాతురిన్= గొప్పలీలా గుణపునేర్పుతో; భువనముల్= లోకాలు; కల్పించి= సృష్టించి; రక్షించి= కాపాడి; భేదనమున్+చేయు= నాశనం చేసే; దుర్+అంతశక్తికిన్= మహాశక్తిమంతునికి; న+అంతజ్యోతికిన్= ముగింపులేని ప్రకాశవంతునికి; చిత్రవీర్యునికిన్= ఆశ్చర్యకరమైన పరాక్రమవంతునికి; నిత్యపవిత్ర కర్మునికిన్= ఎల్లపుడు నిర్మల కృత్యాలు గలవానికి; అవ్యయ+ఆత్మునికిన్= నశించని ఆత్మ గలవానికి; కృపా ముఖ్యప్రసాద+ అర్థిన్+ఐ= దయ మొదలయిన అనుగ్రహాన్ని వేడికొనేవాడినై; వందనము+ఆచరించెదన్= నమస్కారం చేస్తాను.

**తా :** అవలీలగా లోకాలు సృష్టించి, పోషించి, నశింపజేసే వానికి, మహాశక్తిమంతునికి, అనంతంగా వెలుగొందేవానికి, ఆశ్చర్యకర పరాక్రమశాలికి, నిత్య నిర్మలకర్మునికి, నేను (బ్రహ్మను) అనుగ్రహార్థినై నమస్కరిస్తున్నాను.

**వ. రుద్రుం డిట్లనియె. 307**

**ప్రతి:** రుద్రుండు= శంకరుడు, ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** శంకరుడు ఇలా స్తుతించాడు.

**చ. అమరవరేణ్య! మీఁదట సహస్రయుగాంతము నాఁడు గాని కో**
**పమునకు వేళ కాదు, సురబాధకుఁడైన తమస్వినీచరున్**
**సమరమునన్ వధించితివి చాలుఁదదాత్మజుఁడైన వీఁడు స**
**ద్విమలుఁడు నీకు భక్తుఁడు పవిత్రుఁడు గావుము భక్తవత్సలా! 308**

**ప్రతి :** అమరవరేణ్య= దేవతలలో శ్రేష్ఠుడా! మీఁదటన్= మున్ముందు; సహస్రయుగ+అంతమునాఁడుగాని= వేలయుగాల చివరగాని; కోపమునకున్ వేళ కాదు= కోపానికి సమయంగాదు (అపుడే సమయమనటం); సురబాధకుఁడైన= దేవతలను పీడించేవాడైన; తమస్వినీచరున్= రాత్రిళ్లు తిరిగేవానిని, రాక్షసుని; సమరమునన్= యుద్ధంలో; వధించితివి= చంపావు; చాలున్= సరిపోయింది; భక్తవత్సలా= భక్తులయెడ ప్రేమగలవాడా!; తద్+ఆత్మజుఁడు+ఐన= అతని కొడుకైన; వీఁడు= ఈ బాలుడు; సద్+విమలుఁడు= మిక్కిలి స్వచ్ఛమైనవాడు; నీకున్+భక్తుఁడు= నీకు భక్తుడు; పవిత్రుఁడు= దోషరహితుడు; కావుము= వీనిని రక్షించు.

**తా :** దేవశ్రేష్ఠా! మున్ముందు, వేలయుగాల అనంతరం, వాటిని నాశమొందించే సమయాన తప్ప, ఇపుడు కోపానికి అవసరంలేదు, దేవతలను హింసించే ఈ రాక్షసుని సంహరించావు, చాలు, భక్తవత్సలా! వీడు ఆ రాక్షసరాజు తనయుడు ప్రహ్లాదుడు. నిర్మలుడు, పవిత్రుడు, మీదు మిక్కిలి నీకు భక్తుడు, వీనిని రక్షించు.

**వ. ఇంద్రుం డిట్లనియె. 309**

**ప్రతి :** ఇంద్రుండు+ఇట్లు+అనియెన్= దేవేంద్రుడు ఇలా కీర్తించాడు.

**తా :** దేవేంద్రుడు నృసింహదేవుణ్ణి ఇలా కీర్తించాడు.

**సీ. ప్రాణి సంఘముల హృత్పద్మ మధ్యంబుల నివసించి భాసిల్లు నీవ యెఱుఁగు**
**దింతకాలము దానవేశ్వరుచే బాధ పడి చిక్కియున్న యాపన్న జనుల**
**రక్షించితివి మమ్ము రాక్షసేశ్వరుఁ జంపి క్రతుహవ్యములు మాకుఁ గలిగె మరల**
**మంటిమి నీ సేవ మరగిన వారలు కైవల్య విభవంబు కాంక్షసేయ,**

**ఆ. రితర సుఖము లెల్ల నిచ్ఛయింపఁగ నేల, యస్థిరంబు లివి యనంత భక్తిఁ**
**గొలువ నిమ్ము నిన్ను ఘోరదైత్యానీక, చిత్తభయద రంహ! శ్రీనృసింహ! 310**

**ప్రతి :** ఘోరదైత్య+అనీక చిత్తభయద రంహ!= భయంకరమైన రాక్షససేనయొక్క మనస్సులకు భీతిగొల్పు వేగంగలవాడా! శ్రీనృసింహ= శ్రీనరసింహా!; ప్రాణి సంఘముల= జీవసమూహాలయొక్క; హృత్ పద్మమధ్యంబులన్= మనస్సులనే తామరలమధ్య; నివసించి= ఉండి; భాసిల్లు= వెలుగొందే; నీవు+అ= నీవే; ఎఱుఁగుదు= తెలియుదువు, ఇంతకాలము= ఇప్పటివరకు; దానవ+ఈశ్వరుచేన్= రాక్షసరాజుచేత; బాధపడి= వెతలుపడి; చిక్కి+ఉన్న= కృశించివున్న; ఆపన్నజనులన్= ఆపదలు పొందినవారిని; మమ్ము= మమ్మల్ని; రక్షించితివి= కాపాడావు; రాక్షస+ఈశ్వరున్+చంపి= రాక్షసరాజును చంపి (అని పూర్వపదంతో 'రక్షించితివి'తో అన్వయం); మరలన్= తిరిగి; క్రతుహవ్యములు= యజ్ఞాలలో అర్పించే ద్రవ్యాలు; మాకున్+కలిగెన్= మాకు లభించినవి; మంటిమి= నీ దయవల్ల జీవించితిమి; నీ సేవ= నీ భజన; మరగినవారలు= ఇష్టమైనవారు; కైవల్య విభవంబు= మోక్షసంపదను; కాంక్ష+చేయరు= కోరరు; ఇతరసుఖములు+ఎల్లన్= వేరు సౌఖ్యాలన్నిటిని; ఇచ్ఛయింపఁగన్+ఏల= కోరుట ఎందుకు?; ఇవి= ఈ సుఖాలు; అస్థిరంబులు= అశాశ్వతాలు. నిన్నున్= నిన్ను మాత్రమే; అనంతభక్తిన్= తుదిలేని భక్తితో; కొలువన్+ఇమ్ము= సేవించ నియ్యి.

**తా :** భయంకర రాక్షససేనలకు భయంకరుడా! శ్రీనృసింహుడా! జీవుల హృదయపద్మాలమధ్య వసించే నీవు ఎరుగనిది గాదు. ఇంతకాలము రాక్షసరాజు పెట్టిన హింసలు సహించి, చిక్కి శల్యమైఉన్న మమ్మందరిని కాపాడితివి. ఆ రాక్షసేశ్వరుణ్ణి సంహరించావు, ఇపుడు యజ్ఞాలలో అర్పించే హవ్యభాగాలు తిరిగి మాకు చేరుతున్నాయి. మేము మనగలుగుతున్నాము.

నీ సేవల భాగ్యం మరగిన వారికి మోక్ష సుఖమూ అక్కరకు రాదు, ఇతర సుఖాలు అశాశ్వతాలు, వాటిని కోరి ఫలమేమిటి? కాబట్టి మమ్మల్ని నిరంతరం నీ సేవ చేసికోనియ్యి.

**వ. ఋషు లిట్లనిరి. 311**

**ప్రతి :** ఋషులు+ఇట్లు+అనిరి= మునులు ఇలా కీర్తించారు.

**తా :** ఋషులు శ్రీనృసింహుణ్ణి ఇలా స్తుతించారు.

**మ. భవదీయోదరలీనలోకముల నుత్పాదించి రక్షింప నేఁ**
**డవి దైత్యేశునిచేత భేదితములై హ్రస్వంబులై యుండ నీ**
**యవినీతు న్నరసింహరూపమున సంహారంబు నొందించి వే**
**దవిధిం గ్రమ్మఱ నుద్ధరించితి గదా! ధర్మానుసంధాయివై. 312**

**ప్రతి :** భవదీయ+ఉదరలీనలోకములన్= నీ పొట్టలో లయించిన, నశించిన, లోకములన్= భువనాలను; ఉత్పాదించి= పుట్టించి; రక్షింపన్= కాపాడగా; నేఁడు= ఈనాడు; అవి= ఆ లోకాలు, దైత్య+ఈశుచేతన్= రాక్షసరాజుచేత; భేదితములై= భేదింపబడినవై; హ్రస్వంబులై+ఉండన్= కురచబారినవై నిలువగా; ఈ+అవినీతున్= ఈ నీతిమాలినవానిని (రాక్షసుని); నరసింహరూపమునన్= నృసింహాకారంతో; సంహారంబును= చంపుటను; ఒందించి= చేసి; వేదవిధిన్= వేద మార్గాన్ని; క్రమ్మఱన్= తిరిగి; ఉద్ధరించితి(వి)+కదా!= పైకి ఎత్తినావుగదా! కాపాడినావు గదా!; ధర్మ+అనుసంధాయివి+ఐ= ధర్మాన్ని అనుసంధించువాడవై ఉద్ధరించితివి అని అన్వయం.

**తా :** స్వామీ! నీ పొట్టలో లీనమైపోయిన లోకాలను మరల పుట్టించి నీవు కాపాడుతుండగా, అవి ఈ రాక్షసుని చేష్టలతో భేదింపబడి కృశించి పోయినవి. ఈ నీతిమాలిన రక్కసుని నృసింహ రూపంతో నేడు సంహరించి, తిరిగి వేదమార్గాన్ని ఉద్ధరించి, ప్రపంచంలో ధర్మసంస్థాపనం చేశావు గదా! మమ్మల్ని ధన్యులను చేశావు.

**వ. పితృదేవత లిట్లనిరి. 313**

**ప్రతి:** పితృదేవతలు+ఇట్లు+అనిరి= పితృదేవతలు ఇలా అన్నారు.

**తా:** పితృదేవతలు శ్రీనృసింహస్వామిని ఇలా కీర్తించారు.

**శా. చండక్రోధముతోడ దైత్యుఁడు వడిన్ శ్రాద్ధంబులన్ మత్సుతుల్**
**పిండంబుల్ సతిలోదకంబులుగ నర్పింపంగ మా కీక యు**
**ద్దండత్వంబునఁదాన కైకొను మహోదగ్రుండు వీఁడిక్కడన్**
**ఖండింపంబడె నీ నఖంబుల నుతుల్ గావింతు మాత్మేశ్వరా! 314**

**ప్రతి :** ఆత్మ+ఈశ్వరా!= సర్వేశ్వరా! దైత్యుఁడు= రాక్షసుఁడు; చండక్రోధముతోడన్= తీవ్రరోషంతో; మత్సుతుల్= నా కొడుకులు; స+తిల+ఉదకంబులుగన్= నువ్వులతోడి నీళ్ళతో; పిండంబుల్= పిండాలను; అర్పింపంగన్= అర్పించగా; మాకున్+ఈక= మాకు ఇవ్వకుండా; ఉద్దండత్వంబునన్= దౌష్ట్యంతో; తాను+ఎ= తానే; కైకొనున్= స్వీకరిస్తాడు;

వీఁడు= ఈ రాక్షసుడు; మహా+ఉదగ్రుండు= మహాభయంకరుడు; ఇక్కడన్ (ఈ+కడన్)= ఈ స్థలాన; నీ నఖంబులన్= నీ గోళ్ళచే; ఖండింపన్+పడెన్= నరుకబడ్డాడు; నుతుల్ కావింతుము= స్తుతులు చేస్తాము.

**తా :** నృసింహా! ఈ రాక్షసుడు, మా పిల్లలు తిలోదక సహితంగా మాకు పిండప్రదానం చేస్తే, పిండాలు మాకు అందకుండా మహారోషంతో తానే కాజేసేవాడు. వీడు మహాభయంకరుడు, దుర్మార్గుడు. ఇప్పుడు ఇక్కడ వీడు నీ గోళ్ళచే ఖండితుడై పడి ఉన్నాడు. నీకు ప్రశంసలు.

**వ. సిద్ధు లి ట్లనిరి. 315**

**ప్రతి :** సిద్ధులు+ఇట్లు+అనిరి= సిద్ధులు ఇలా అన్నారు.

**తా :** సిద్ధులు అనే దేవజాతివారు శ్రీనృసింహుణ్ణి ఇలా కీర్తించారు.

**క. క్రుద్ధుండై యణిమాదిక, సిద్ధులు గైకొనిన దైత్యుఁ జీరితివి మహా**
**యోద్ధవు నీ కృప మాకును, సిద్ధులు మఱలంగఁగలిగె శ్రీనరసింహా! 316**

**ప్రతి :** శ్రీనృసింహా!= నరసింహస్వామీ!; క్రుద్ధుండై= కోపగించినవాడై; అణిమా+ఆదిక సిద్ధులు= అణిమ, గరిమ, మొదలయిన అష్ట సిద్ధులను; కైకొనినదైత్యున్= తీసికొన్న రాక్షసుని; చీరితివి= చీల్చావు; మహాయోద్ధవు= గొప్పయోధుడివి; నీ కృపన్= నీ దయతో; సిద్ధులు= వాడు తీసుకొన్నసిద్ధులు; మాకున్= మాకు; మఱలంగన్+కలిగెన్= తిరిగి లభించినవి.

**తా :** నరసింహా! ఈ రాక్షసుడు, క్రోధంతో మా అణిమాదిసిద్ధులు కాజేశాడు. మహాయోద్ధవైన నీవు వాడిని చీల్చావు. నీ దయతో మా సిద్ధులు మళ్ళీ మాకు చేరాయి.

**వ. విద్యాధరు లిట్లనిరి. 317**

**ప్రతి :** విద్యాధరులు+ఇట్లు+అనిరి= విద్యాధరులు ఇలా అన్నారు.

**తా :** దేవతలైన విద్యాధరులు కూడ నృసింహస్వామివారిని ఇలా స్తుతించారు.

**క. దానవునిఁ జంపి యంత, ర్ధానాదిక విద్యలెల్ల దయతో మఱలం**
**గా నిచ్చితివి విచిత్రము, నీ నిరుపమవైభవంబు నిజము నృసింహా! 318**

**ప్రతి :** నృసింహా!= నరహరీ! దానవునిన్+చంపి= రాక్షసుని వధించి; అంతర్ధాన+ఆదిక విద్యలు+ఎల్లన్= మాయమగుట మొదలయిన చదువులన్నిటిని; దయతోన్= కృపతో; మఱలన్+కాన్+ఇచ్చితివి= మరల ఇచ్చినావు; నీ నిరుపమ వైభవంబు= నీ సాటిలేని విభవము; విచిత్రము= ఆశ్చర్యకరం; నిజము= సత్యం.

**తా :** నృసింహా! రాక్షసుని చంపి, అంతర్ధానం మొదలయిన మా విద్యలన్నిటిని, (వాడు, అపహరించిన వాటిని,) తిరిగి మాకు సమర్పించావు. నీ మహిమ ఆశ్చర్యకరం. అది సాటిలేనిది. నిజంకూడ.

**వ. భుజంగు లి ట్లనిరి. 319**

**ప్రతి:** భుజంగులు= నాగులు; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** నాగులందరూ నృసింహస్వామివారిని కీర్తించారు.

**క. రత్నములను మత్కాంతా, రత్నములనుబుచ్చుకొన్న రక్కసు నురమున్**
**యత్నమున వ్రచ్చి వైచితి, పత్నులు రత్నములుఁగలిగిఁబ్రతికితి మీశా! 320**

**ప్రతి :** ఈశా!= అధిపతీ! రత్నములను= మణులను; మత్+కాంతారత్నములను= మా స్త్రీ రత్నాలను; పుచ్చుకొన్న= తీసికొన్న; రక్కసు+ఉరమున్= రాక్షసుని హృదయాన్ని; యత్నమునన్= పూనికతో; వ్రచ్చివైచితి(వి)= చీల్చివేసినావు; పత్నులు= భార్యలు; రత్నములున్= మణులును; కలిగి= (తిరిగి)పొంది; బ్రతికితిమి= జీవించినాము.

**తా :** శ్రీ నృసింహా! ఈ రాక్షసుడు, మా రత్నరాసులతోపాటు, మా స్త్రీ రత్నాలను అపహరించాడు. వాని హృదయాన్ని నీవు చీల్చావు! మా రత్నాలూ, మా భార్యలు తిరిగి మమ్మల్ని చేరగా మేము తిరిగి జీవించగలిగాము.

**వ. మనువు లిట్లనిరి. 321**

**ప్రతి :** మనువులు+ఇట్లు+అనిరి= మనువులు ఇలా అన్నారు.

**తా :** మనువులు నరసింహస్వామివారిని ఇలా స్తుతించారు.

**క. దుర్ణయుని దైత్యుఁ బొరిగొని, వర్ణాశ్రమధర్మసేతువర్గము మరలం**
**బూర్ణముఁజేసితి వేమని, వర్ణింతుము కొలిచి బ్రదుకువారము దేవా! 322**

**ప్రతి :** దేవా!= దేవుడా! దుర్ణయునిన్= దుష్టనీతిగల; దైత్యున్= రాక్షసుని; పొరిగొని= సంహరించి; వర్ణ= వర్ణాలు (నాలుగు); ఆశ్రమ= ఆశ్రమాలు (నాలుగు) వీటి; ధర్మసేతు వర్గమున్= ధర్మమనెడి వంతెనలను; మరలన్= తిరిగి; పూర్ణమున్+చేసితివి= నిండుగా ఏర్పరచావు; ఏమి+అని వర్ణింతుము= ఏ మాటలతో స్తుతించాలి; కొలిచి= నిన్ను సేవించి; బ్రదుకువారము= జీవిస్తాం.

**తా :** నీతిమాలిన రాక్షసుని సంహరించి, వాడు భ్రష్టపరచిన వర్ణాశ్రమ ధర్మాల వంతెనలను తిరిగి పునర్నిర్మించావు! దేవా! నీ మహిమ నేమని వర్ణించగలం? కేవలం సేవించి జీవించే నీ భృత్యులం.

**విశే : వర్ణములు:** బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర భేదంతో ఈ దేశాన నరులు నాల్గువిధాలు. దాదాపు ఇప్పటికీ ఇవి కొనసాగుతున్నాయి.

**ఆశ్రమములు :** బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసములు ఆశ్రమాలు. జీవన మార్గంలో అవస్థలు నాల్గు. మొదటిది చదువుకోసం, రెండవది సంసారంకోసం, మూడవది సంసారానంతర విశ్రాంతికోసం, నాల్గవది అంతిమజీవనం కోసం.

**వ. ప్రజాపతు లిట్లనిరి. 323**

**ప్రతి :** ప్రజాపతులు= ప్రజాపతులనే దేవతలు; ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** ప్రజాపతులు నరసింహుణ్ణి ఇలా స్తుతించారు.

**మ. ప్రజలంజేయుటకై సృజించితి మమం బాటించి దైత్యాజ్ఞచేఁ**
**బ్రజలంజేయక యింతకాలము మహాభారంబుతో నుంటి, మీ**
**కుజనున్ వక్షముఁజీరి చంపితివి, సంకోచంబు లే కెల్లచోఁ**
**బ్రజలంజేయుచు నుండువారము జగద్భద్రాయమాణోదయా! 324**

**ప్రతి :** జగత్+భద్రాయమాణ+ఉదయా!= లోకానికి శుభకరమయిన పుట్టుక గలవాడా!; మమున్= మమ్ము; ప్రజలన్+చేయుటకై= ప్రజలను పుట్టించుటకు; సృజించితి(వి)= పుట్టించినావు; పాటించి= అంగీకరించి; దైత్య+ఆజ్ఞచేన్= రాక్షసాజ్ఞతో; ఇంతకాలము= ఇంతవరకు; ప్రజలన్+చేయక= ప్రజలను పుట్టింపక; మహాభారంబుతోన్= గొప్పబరువుతో; ఉంటిమి= ఉన్నాము; ఈ కుజనున్= ఈ దుర్జనుని; వక్షమున్= హృదయాన్ని; చీరి చంపితివి= చీల్చి వధించావు; సంకోచంబు లేక= సంశయం లేక; ఎల్లచోన్= అన్నిచోట్ల; ప్రజలన్+చేయుచున్= జనసృష్టి చేస్తూ; ఉండువారము= ఉండగలం.

**తా :** జగత్క్షేమానికై అవతరించిన నృసింహా! నీవు మమ్మల్ని, ప్రజాసృష్టికోసం సృష్టించావు. అయితే మేము ఇంతకాలం ఈ రాక్షసుని ఆజ్ఞాబద్ధులమై మాపని నిర్వహించక నిలిచి ఉన్నాము. ఇకపై మేము మా కార్యం నిస్సంకోచంగా నిర్వహిస్తాము. ఎందుకంటే నీవు ఈ దుర్జనుని వక్షఃస్థలాన్ని చీల్చి చంపావుగదా!

**వ. గంధర్వు లి ట్లనిరి. 325**

**ప్రతి :** గంధర్వులు+ఇట్లు+అనిరి= గంధర్వులు ఇలా పలికారు.

**తా :** గంధర్వులు నృసింహుణ్ణి ఈ విధంగా స్తుతించారు.

**క. ఆడుదుము రేయుఁ బగలుం, బాడుదుము నిశాటునొద్ద, బాధించు, దయం**
**జూడఁడు, నీచే జమునిం, గూడె మహాపాతకునకుఁగుశలము గలదే? 326**

**ప్రతి :** నిశా+అటుని+ఒద్దన్= రాత్రులలో తిరిగెడువాని (రాక్షసుని) చెంత; రేయున్+పగలున్= రాత్రి, పగలు; ఆడుదుము= నాట్య మాడేవారం; పాడుదుము= సంగీతం గానం చేసేవారం; బాధించున్= మమ్ముల్ని హింసించేవాడు; దయన్+ చూడఁడు= దయతో చూడదు; (నేడు) నీ చేన్= నీ వల్ల; జమునిన్+కూడెన్= యముని చేరాడు; మహాపాతకునకున్= మహా పాపాత్మునకు; కుశలము= క్షేమము; కలదు+ఏ= ఉంటుందా? (ఉండదు).

**తా :** రాక్షసుని కొలువులో, మేము రేయుంబగళ్ళు విశ్రాంతి లేక నాట్యం చేశాం. సంగీతం వినిపించాం. అయితే ఆ దుష్టుడు మమ్మెపుడూ దయ దలచలేదు. పైగా హింసించాడు. నీ వల్లనే ఆ దుర్మార్గుడు యముణ్ణి చేరాడు. అలాంటి దురాత్ములకు క్షేమమెక్కడిది?

**వ. చారణు లిట్లనిరి. 327**

**ప్రతి :** చారణులు+ఇట్లు+అనిరి= చారణులు ఇలా స్తుతించారు.

**తా :** శ్రీనృసింహుణ్ణి చారణులు ఇలా కీర్తించారు.

**క. భువనజనహృదయభల్లుఁడు, దివిజేంద్రవిరోధి నేఁడు దెగె నీ చేతన్**
**భవరోగనివర్తక మగు, భవదంఘ్రియుగంబుఁజేరి బ్రదికెద మీశా! 328**

**ప్రతి :** ఈశా!= ఈశ్వరా!; భువనజన హృదయభల్లుఁడు= లోకజనుల గుండెలకు బాణమైనవాడు; దివిజ+ఇంద్ర విరోధి= దేవేంద్ర శత్రువు; నేఁడు= ఈనాడు; నీచేన్= నీ చేతిలో; తెగెన్= చచ్చెను; భవరోగ= పుట్టుక అనే జబ్బుకు; నివర్తకము+అగు= మాన్పే మందైన; భవత్+అంఘ్రియుగంబున్+చేరి= నీ కాలి జంటను ఆశ్రయించి; బ్రదికెదము= జీవిస్తాం.

**తా :** ఈశ్వరా! ఈ రాక్షసుడు ప్రజా హృదయాలకు బల్లెం వంటివాడు. దేవేంద్ర శత్రువు. నేడు నీచేత తెగిపడ్డాడు. పుట్టుక అనే రోగానికి మందైన నీ పాదాల జంటను ఆశ్రయించి, జీవిస్తాం.

**వ. యక్షు లిట్లనిరి. 329**

**ప్రతి :** యక్షులు+ఇట్లు+అనిరి= యక్షులు ఇలా పలికారు.

**తా :** యక్షులు నరసింహస్వామిని ఈ విధంగా కీర్తించారు.

**ఉ. భ్రంశము లేని నీ భటుల భంగవిముక్తుల మమ్ము నెక్కి ని**
**స్సంశయవృత్తి దిక్కులఁబ్రచారము సేయుచు నుండు వీఁడు, ని**
**స్త్రింశముతోడ వీనిఁగడతేర్చితి, వాపద మానె నో చతు**
**ర్వింశతితత్త్వశాసక! త్రివిష్టపముఖ్య! జగన్నివాసకా! 330**

**ప్రతి :** చతుర్+వింశతి తత్త్వశాసక!= ఇరవై నాలుగు తత్త్వాలను శాసించే ఇరవైయైదవతత్త్వమైన విరాట్పురుషుడా! నారాయణుడా! త్రివిష్టపముఖ్య= పాతాళ, మర్త్యలోకాలకు పైనున్న మూడవదైన స్వర్గలోకానికి ప్రధానమైనవాడా! జగత్+నివాసకా!= లోకాలు ఆవాసమైనవాడా! భ్రంశములేని= జారుపాటులేని; భంగవిముక్తులన్= ఓటమిలేని; నీ భటులన్= నీ సేవకులమైన; మమ్మున్+ఎక్కి= మాపై ఎక్కి; నిస్+సంశయవృత్తిన్= నిస్సందేహమైన ప్రవర్తనతో; దిక్కులన్= నల్దిక్కులలో; ప్రచారము+చేయుచున్= సంచారం చేస్తూ; వీఁడు= ఈ రక్కసుడు; ఉండున్= ఉండెను; వీనిన్= ఇటువంటి వీడిని; నిస్+త్రింశముతోడన్= కనికరంలేకుండా; కడతేర్చితి= చంపావు; ఆపద మానెన్= ఆపద తొలగింది.

**తా :** లోకనాయకా! స్వర్గలోక ప్రధానుడా! ఇరవైనాలుగు తత్త్వాలను శాసించేవాడా! మేము నీ భటులం. మాకు ఎక్కడా భంగమూ భ్రంశమూ లేవు. ఇట్టి మాపై అధిరోహించి ఈ రాక్షసుడు ఏ సంకోచమూ లేక నాల్గుదిక్కుల సంచారం చేసేవాడు. మమ్ముల్ని తన వాహనాలుగా వాడుకొన్నాడు. అటువంటి దుష్టుని నీవు కడతేర్చి మాకు ముక్తి గలిగించావు. మాకు ఆపద ముగిసింది.

**వ. కింపురుషు లి ట్లనిరి. 331**

**ప్రతి :** కింపురుషులు+ఇట్లు+అనిరి= కింపురుషులు అనే దేవతలు ఇలా పలికారు.

**తా :** దేవతాజాతికి చెందిన కింపురుషులు నరసింహస్వామిని ఇలా కీర్తించారు.

**క. పురుషోత్తమ! నేరము కిం, పురుషుల, మల్పులము, నిన్ను భూషింపఁగ, దు**
**ష్పురుషున్, సకలసుజన హృ, త్పరుషుం జంపితివి జగము బ్రదికె నధీశా! 332**

**ప్రతి :** అధి+ఈశా!= అధిపతీ!; పురుష+ఉత్తమ!= పురుషులలో శ్రేష్ఠుడా! విష్ణుడా; నేరము= తెలియము; కింపురుషులము= జాతిరీత్యా కింపురుషులం; అల్పులము= చిన్నవారం; నిన్ను భూషింపఁగన్= (మాటలతో) అలంకరించుటకు; సకల సుజన హృద్+పరుషున్= ఎల్లసజ్జనుల హృదయాలకు కఠినుని, చంపితివి= సంహరించావు; జగము= లోకం; బ్రదికెన్= జీవించింది.

**తా :** పురుషోత్తమ! అధీశా! మేము కింపురుషులం, అల్పులం, నిన్ను స్తుతించే శక్తి మాకు చాలదు. శిష్టజనుల హృదయాలు గాయపరచే దుష్టుడైన రక్కసుని తెగటార్చితివి. లోకం జీవించింది.

**వ. వైతాళికు లిట్లనిరి. 333**

**ప్రతి :** వైతాళికులు+ఇట్లు+అనిరి= వైతాళికులు ఇలా పలికారు.

**తా :** వైతాళికులు ఇలా కీర్తించారు.

**క. త్రిభువనశత్రుఁడు పడియెను, సభలందును మఖములందు జగదీశ్వర! నీ**
**శుభగీతములు పఠించుచు, నభయులమై సంచరింతు మార్తశరణ్యా! 334**

**ప్రతి :** ఆర్తశరణ్యా!= బాధితులకు బాసటయినవాడా! జగత్+ఈశ్వరా!= లోకరక్షకా!; త్రిభువనశత్రుఁడు= ముల్లోకాలకు విరోధి అయిన హిరణ్యకశిపుడు; పడియెను= నశించెను; నీ శుభగీతములు= శుభకరమైన నీ పాటలు; సభలందును= సభలలో; మఖములందున్= యాగాలలో; పఠించుచున్= చదువుతు; అభయులము+ఐ= భయం లేనివారమై; సంచరింతుము= తిరుగుతాము.

**తా :** దుఃఖార్తులను బ్రోచేవాడా! లోకనాయకా! ముల్లోకాలకు శత్రువైన రాక్షసుడు నశించాడు, ఇకపై నిర్భయంగా, సభలలో, యజ్ఞశాలల్లో నీ శుభనామసంకీర్తనం చేస్తూ లోకసంచారం చేయగలం.

**వ. కిన్నరు లిట్లనిరి. 335**

**ప్రతి :** కిన్నరులు= ఒక తెగ దేవతలు, ఇట్లు+అనిరి= ఇలా అన్నారు.

**తా :** కిన్నరులు అనే దేవజాతివారు నరసింహస్వామిని ఇలా ప్రస్తుతించారు.

**క. ధర్మము దలఁపఁడు, లఘుతర, కర్మము సేయించు మమ్ముఁగలుషాత్మకు దు**
**ష్కర్ముని౯జంపితి, వున్నత, శర్ములమై నీదు భక్తి సలిపెదము హరీ! 336**

**ప్రతి :** హరీ!= ఓ విష్ణూ! (వీఁడు); ధర్మము= ధర్మాన్ని, తలంపఁడు= ఆలోచించడు; మమ్మున్= మాతో; లఘుతరకర్మము+ చేయించున్= అల్పపు పనులు చేయిస్తాడు; కలుష+ఆత్మకున్= పాపహృదయుని; దుష్కర్మునిన్= చెడు పనులవాడిని; చంపితివి= చంపావు; ఉన్నత శర్ములము+ఐ= అధికమైన సుఖం, సంతోషంగలవారమై; నీదు భక్తి+చలిపెదము= నీ భక్తిని చేస్తాం, నీపై భక్తితో మెలుగుతాము.

**తా :** హరీ! ఈ ధూర్తుడు ధర్మాధర్మ విచారం చేయడు. మాచే అల్పక్రియలు చేయించాడు. దురాత్ముడు, దుష్కర్ముడూ అయిన వీనిని హతమార్చావు. ఎంతో సంతోషంగలవారమై నీ సేవలో తరిస్తాము స్వామీ!

**వ. విష్ణుసేవకులిట్లనిరి. 337**

**ప్రతి :** విష్ణుసేవకులు+ఇట్లు+అనిరి= విష్ణుసేవకులు ఇట్లన్నారు.

**తా :** విష్ణుసేవకులు నరసింహస్వామిని ఇలా సన్నుతించారు.

**ఉ. సంచితవిప్రశాపమునఁజండనిశాచరుఁడైన వీని శి**
**క్షించుట కీడు గాద, కృప సేసితి వీశ్వర, భక్తితోడ సే**
**వించుటకంటె వైరమున వేగమ చేరఁగ వచ్చు నిన్ను నీ**
**యంచితనారసింహతను వద్భుత, మాపదఁబాసి రందఱున్. 338**

**ప్రతి :** ఈశ్వర!= రక్షకా! సంచితవిప్రశాపమునన్= బ్రాహ్మణ శాపంపొందడంవల్ల; చండనిశాచరుఁడైనవీనిన్= భయంకర రాక్షసుడైన వీడిని; శిక్షించుట= దండించుట; కీడు= చెడు; కాదు+అ= కానే కాదు; కృప+చేసితివి= దయ చూపావు; భక్తితోడ సేవించుటకంటెన్= భక్తితో కొలిచేకంటే; వైరమునన్= విరోధంతో; వేగము+అ= త్వరగానే; నిన్నున్, చేరఁగన్+వచ్చున్= నిన్ను చేరుకోవచ్చు; నీ+అంచిత నారసింహతనువు= నీ (యొక్క) ఒప్పెడి నరసింహరూపమైన దేహము; అద్భుతము= ఆశ్చర్యకరం; అందఱున్= ఎల్లరును; ఆపదన్+పాసిరి= విపత్తును విడిచారు.

**తా :** దేవా! బ్రాహ్మణ శాపవచనంవల్ల క్రూర రాక్షసుడైన వీడిని వధించటం, వీడికి కీడు చేసినట్లు గాదు. నీవు వీడిపై దయనే చూపావు, నిన్ను చేరుకోవాలంటే భక్తిమార్గం కంటె, వైరమార్గం వాంఛనీయం. ఎందుకంటె, భక్తితోకంటె, వైరంతో నిన్ను త్వరగా అందుకోవచ్చు. నీ స్వరూపం ఈ అవతారంలో నరుని సింహపు ఆకారాల కలయికతో, ఎంతో ఆశ్చర్యకరంగా ఉంది. అందరూ ఆపదనుండి విముక్తులయ్యారు.

**వ. ఇట్లు బ్రహ్మరుద్రేంద్ర సిద్ధ సాధ్య పురస్సరులైన దేవముఖ్యు లందఱు నెడ గలిగి యనేక ప్రకారంబుల వినుతించి, రందు రోష విజృంభమాణుం డయిన నరసింహదేవుని దగ్గఱఁ జేర వెఱచి లక్ష్మీదేవిం బిలిచి యిట్లనిరి. 339**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; బ్రహ్మ= బ్రహ్మ; రుద్ర= ఈశ్వరుడు; ఇంద్ర= ఇంద్రుడు; సిద్ధ= సిద్ధులు; సాధ్య= సాధ్యులు అనే వీరు, పురస్+సరులైన= ముందు నడిచేవారైన; దేవముఖ్యులు+అందఱున్= సురులలో ప్రధానమైన వారు ఎల్లరూ; ఎడ+కలిగి= దూరం పాటించి; అనేక ప్రకారంబులన్= పలుప్రకారంబులుగా; వినుతించిరి= స్తుతించారు; అందున్= ఆ సందర్భాన; రోషవిజృంభమాణుండయిన నరసింహదేవునిన్= క్రోధంతో చెలరేగే నృసింహుని; దగ్గఱన్+చేరన్+వెఱచి= దగ్గరగా చేరుటకు భయపడి; లక్ష్మీదేవిన్+పిలిచి= శ్రీమహాలక్ష్మిని ఆహ్వానించి; ఇట్లు+అనిరి= ఇలా ప్రార్థించారు.

**తా :** ఈ విధంగా బ్రహ్మమొదలు సాధ్యులవరకు, దేవతలలోని ఎల్లతెగలవారూ వివిధంగా వినుతించినా, ఆ నృసింహదేవుని క్రోధం చల్లార లేదు. వీరందరూ ఆ దేవుని సమీపించడానికీ వెరచి దూరంగా నిలిచారు. అపుడు వారందరు హరి ఇల్లాలైన లక్ష్మిని పిలిచి ఇలా ప్రార్థించారు.

**క. హరికిం బట్టపుదేవివి, హరిసేవానిపుణమతివి, హరిగతివి, సదా**
**హరిరతివి, నీవు సని నర, హరిరోషము డింపవమ్మ! హరివరమధ్యా! 340**

**ప్రతి :** హరివరమధ్యా!= సింహపు అందమైన నడుమువంటి నడుముగలదానా! హరికిన్+పట్టపుదేవివి= విష్ణువుకు పట్టపురాణివి; హరిసేవానిపుణమతివి= విష్ణుసేవలో నేర్పుగల దానవు; హరిగతివి= విష్ణువును అనుసరించు దానవు; సదా= ఎల్లపుడును; హరిరతివి= విష్ణువును ప్రేమించుదానవు; నీవు+చని= నీవు వెళ్ళి; నరహరి రోషమున్= నృసింహుని క్రోధాన్ని; డింపవమ్మ= తొలగించుమమ్మా!

**తా :** సింహంయొక్క నడుంవంటి నడుం గలదానా! ఓ లక్ష్మీ! నీవు హరికి పట్టపురాణివి, ఆయన సేవలో నేర్పుగలదానవు. ఆయననే అనుసరించేదానివి. ఆయనకు ప్రియమైన ఇల్లాలివి. కావున, నీవు నరసింహుని సమీపించి, క్రోధాన్ని తగ్గించాలి. అమ్మా! అలా చెయ్యడం నీకు మాత్రమే సాధ్యం అవుతుంది.

**వ. అనిన నియ్యకొని మహోత్కంఠతోడ నా కలకంఠకంఠి నరకంఠీరవుని యుపకంఠంబునకుంజని. 341**

**ప్రతి :** అనినన్= అని వారు పలుకగా; ఇయ్యకొని= అంగీకరించి; మహా+ఉత్కంఠతోడన్= గొప్ప ఉత్సుకతతో; ఆ కలకంఠకంఠి= కోకిల కంఠస్వరంవంటి కంఠస్వరంగల ఓ లక్ష్మీదేవి; నరకంఠీరవుని+ఉపకంఠంబునకున్+చని= నృసింహుని సమీపానికి వెళ్ళి;

**తా :** ఆ మాటలకు అంగీకరించిన లక్ష్మీదేవి ఉత్సాహంతో ఆ దేవుని సమీపించినదై

**సీ. ప్రళయార్కబింబంబు పగిది నున్నది గాని నెమ్మోము పూర్ణేందునిభము గాదు,**
**శిఖిశిఖాసంఘంబు చెలువు సూపెడుఁ గాని చూడ్కి ప్రసాదభాసురము గాదు,**
**వీరరౌద్రాద్భుతావేశ మొప్పెడుఁగాని భూరికృపారసస్ఫూర్తి గాదు,**
**భయదదంష్ట్రాంకురప్రభలు గప్పెడుఁగాని దరహసితాంబుజాతంబు గాదు,**

**తే. కఠిననఖరనృసింహవిగ్రహము గాని, కామినీజనసులభవిగ్రహము కాదు,**
**విన్నదియుఁగాదు, తొల్లి నే విష్ణువలనఁ, గన్నదియుఁగాదు భీషణాకార మనుచు. 342**

**ప్రతి :** నెఱ+మోము= అందమైన ముఖం; ప్రళయ+అర్కబింబంబు పగిదిన్= ప్రళయకాలపు సూర్యగోళంవలె; ఉన్నది+కాని= ఉందికాని; పూర్ణ+ఇందునిభము+కాదు= నిండు జాబిలితో పోలేది గాదు; శిఖిశిఖా సంఘంబు చెలువు= అగ్నిజ్వాలలగుంపువలె వేడిని; చూపెడున్+కాని= కనబరుస్తుందిగాని; చూడ్కి= చూపు; ప్రసాదభాసురము+కాదు= దయతో వెలిగేదికాదు; వీరరౌద్ర+అద్భుత+ఆవేశము= ఆశ్చర్యమైన వీర రౌద్రరసపు పొంగు; ఒప్పెడున్+కాని= అతిశయిస్తుందిగాని; భూరికృపారసస్ఫూర్తి+కాదు= గొప్ప దయారసపు వెలుగు కాదు; భయద= భయంకరమైన; దంష్ట్రా+అంకుర ప్రభలు= కోరల వెలుగులు; కప్పెడున్+కాని= పైకొంటున్నాయిగాని; దరహసిత+అంబుజాతంబు+కాదు= కొద్దిగా వికసించిన పద్మము గాదు; కఠిననఖరనృసింహవిగ్రహము+కాని= వాడియైన గోళ్ళుగలిగిన నరసింహాకారమే గాని; కామినీజన= స్త్రీ జనానికి; సులభవిగ్రహము= సులభంగా పొందగల ఆకారం కాదు; తొల్లి= ముందు; నేన్= నేను; విష్ణువలనన్= హరివలన; విన్నదియున్+కాదు= విన్నదీకాదు; కన్నదియున్+కాదు= చూచినదీకాదు; భీషణ+ఆకారము+అనుచున్= భయంకరమైన స్వరూపం అంటూ...

**తా :** ఇతని మోము ప్రళయకాలంలోని సూర్యగోళంవలె ఉన్నదిగాని, నిండు చందురుని పోలేది గాదు. ఇతని చూపు అగ్ని జ్వాలల గుంపు వేడిని తలపిస్తుందే గాని, కరుణతో వెలిగిపోవడం లేదు. ఇతనిలో వీరరౌద్రరసతీవ్రత ఉంది గాని కృపారసం కనిపించదు. ఈతని ముఖాన భయంకర దంష్ట్రల వెలుగులున్నాయి గాని, చిరునగవులతో పద్మంవలె ఈ మోము వెలగడం లేదు.

కఠినతరమైన గోళ్ళుగల నృసింహరూపం తప్ప మగువలకు సులభంగా లొంగే ఆకారం గాదు, పూర్వమెపుడూ నేను విష్ణువు విషయంలో విన్నదీ గాదు కన్నదీ కాదు ఈ స్వరూపం, భయంకరమైనది.

**క. పలికెద నని గమకముఁగొనుఁ, బలికినఁగడు నలుగు, విభుఁడు ప్రతివచనములం**
**బలుకఁడని నిలుచు శశిముఖి, బలువిడి హృదయమునఁజనవు భయమును గదురన్. 343**

**ప్రతి :** శశిముఖి= చంద్రానన లక్ష్మి; బలువిడి= అత్యంతం మిక్కిలి ఎక్కువ; హృదయమునన్= మనస్సున; చనవు భయమును= విరుద్ధ భావాలయిన చనువు భయము రెండు; కదురన్= కలుగగా; పలికెదను+అని= నరసింహునితో మాట్లాడగలనని; గమకమున్+కొనున్= ఉత్సాహాన్ని పొందును; పలికినన్= (తాను) మాట్లాడితే; విభుఁడు= భర్త; కడున్+అలుగున్= మిక్కిలి కోపగిస్తాడు; ప్రతివచనములన్+పలుకఁడు+అని= బదులు మాటలు మాట్లాడడు అని; నిలుచున్= ఆగిపోవును.

**తా :** లక్ష్మీదేవి మొదట మాట్లాడటానికి ఉత్సహిస్తుంది. ఆపై తాను పలకరిస్తే కోపగిస్తాడు అనుకుంటుంది. బదులు పలకడేమో అని అనుమానిస్తుంది. అతనియెడ ఆమెకు చనువుతో పాటు భయమూ పుష్కలంగా ఉంది. కాగా ఏమీ చేయక నిలిచి ఉన్నది.

**విశే :** ఎల్లప్పుడూ శ్రీహరిని వీడని లక్ష్మీదేవికూడా ఉగ్రాకారంతో ఉన్న నరహరిని చేరేందుకు జంకింది. అంటే దీనినిబట్టి అప్పటి నృసింహుని ఉగ్రరూపాన్ని ఊహించవచ్చు.

**వ. ఇట్లు నరహరిరూపంబు వారిజనివాసిని వీక్షించి శంకించి శాంతుండైన వెనుక దగ్గఱెద నని చింతించుచున్న వారిజసంభవుం డ ద్దేవుని రోషంబు నివారింప నితరుల కలవి గా దని ప్రహ్లాదుం జీరి యిట్లనియె. 344**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వారిజనివాసిని= పద్మంలో నివసించే లక్ష్మి; నరహరిరూపంబున్= నృసింహుని స్వరూపాన్ని; వీక్షించి= చూచి; శంకించి= సందేహించి; శాంతుండైన వెనుకన్= శాంతించిన పిదప; దగ్గఱెదను+అని= సమీపిస్తాను అని, అనుకొంటూ; చింతించుచున్నన్= ఆలోచిస్తుండగా; వారిజసంభవుండు= పద్మంలో బుట్టినబ్రహ్మ; దేవుడు ఆ+దేవునియొక్క= ఆ నృసింహుని; రోషంబు నివారింపన్= క్రోధాన్ని తొలగించటానికి; ఇతరులకున్+ అలవి+కాదు+అని= పరులకు సాధ్యం కాదని తలుస్తూ; ప్రహ్లాదున్+చీరి= ప్రహ్లాదుని సమీపించి; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు;

**తా :** పద్మజ అయిన లక్ష్మీదేవి నరసింహుని రూపాన్ని చూచి, సందేహించింది. ఆ స్వామి శాంతించిన తర్వాతనే దగ్గరికి వెళ్లాలని అనుకొంటుండగా, బ్రహ్మదేవుడు, నరసింహుని క్రోధాన్ని తగ్గించటానికి ఇతరులకు సాధ్యం కాదు అని తలుస్తూ ప్రహ్లాదుని దగ్గరికి వెళ్లి ఇలా పలికాడు.

**క. తీండ్రమగు రోషమున మీ, తండ్రి నిమిత్తమునఁజక్రి దారుణమూర్తిన్**
**వేండ్రము విడువఁడు, మెల్లన, తండ్రీ! శీతలునిఁజేసి దయ సేయఁగదే! 345**

**ప్రతి :** తండ్రీ!= నాయనా!; చక్రి= విష్ణువు; మీ తండ్రి నిమిత్తమునన్= మీ తండ్రి కారణంగా; దారుణమూర్తిన్= భయంకరాకారంతో; వేండ్రమున్= వేడిమిని; తీండ్రము+అగు= తీవ్రమయిన; రోషమునన్= క్రోధంతో; విడువఁడు= వదలడు; మెల్లనన్= మెల్లగా; శీతలునిన్+చేసి= చల్లబడినవానినిగా మార్చి; దయ+చేయఁగద+ఏ= దయచూపవా?

**తా :** నాయనా! హరి, నీ తండ్రి మూలంగానే, తన భీకరాకారంతో తీవ్రతను ఇంకా వదలడంలేదు. నీవు మెల్లగా అతనిని చేరి చల్లబరిచి మాపై దయజూపు.

**వ. అనిన 'నౌఁగాక'యని మహాభాగవత శేఖరుండయిన బాలకుండు కరకమలంబులు ముకుళించి మందగమనంబున నమంద వినయ వివేకంబుల నరసింహదేవుని సన్నిధికిం జని సాష్టాంగ దండ ప్రణామంబు సేసిన భక్తపరాధీనుండగు నయ్యీశ్వరుం డాలోకించి. 346**

**ప్రతి :** అనినన్= అని బ్రహ్మపలుకగా; ఔన్+కాక+అని= ఔను అలానే జరుగును గాక అంటూ; మహాభాగవతశేఖరుండు+అయిన= మహాభగవద్భక్తులలో శిరోమణిఅయిన; బాలకుండు= పిల్లవాడు; కరకమలంబులు= పద్మములవంటి చేతులు; ముకుళించి= ముడిచి; మందగమనంబునన్= మెల్లని నడకతో; అమంద వినయవివేకంబులన్= గొప్ప అణకువ తెలివితేటలతో; నరసింహదేవుని సన్నిధికిన్+చని= నృసింహుని సమీపానికి వెళ్ళి; స+అష్ట+అంగ దండ ప్రమాణంబు+చేసినన్= ఎనిమిది అవయవాలు భూమికి తాకునట్లు సాగిలపడి నమస్కారమును ఆచరించగా; భక్తపర+ఆధీనుండు+అగు= భక్తులకు లొంగిపోయేవాడైన; ఆ+ఈశ్వరుండు= ఆ దేవుడు; ఆలోకించి= చూచి...

**తా :** బ్రహ్మదేవుని మాటను స్వీకరించిన ప్రహ్లాదుడు చేతులు జోడించి, అలాగే చేస్తాను అంటూ, మెల్లగా, అధిక వినయ విధేయతలతో పాటుగా తెలివితేటలును గలగలిపి నృసింహదేవుని సన్నిధికి వెళ్ళి, సాష్టాంగ నమస్కారం చేయగా, ఆ దేవుడు, ఆ బాలుని జూచి;

**ఉ. ప్రాభవ మొప్ప నుత్కటకృపామతియై కదియంగఁ జీరి సం**
**శోభితదృష్టిసంఘములఁజూచుచు బాలుని మౌళియందు లో**
**కాభినుతుండు పెట్టె నసురాంతకుఁ డుద్భటకాలసర్ప భీ**
**తాభయదానశస్తము ననర్గళమంగళహేతుహస్తమున్. 347**

**ప్రతి :** ప్రాభవము+ఒప్పన్= ప్రభావకరంగా; ఉత్కట కృపామతి+ఐ= మిక్కుటమైన దయాబుద్ధిగలవాడై; కదియంగన్+జీరి= స్పృశించునట్లు లోగొని; సంశోభితదృష్టిసంఘములన్= ప్రకాశించే చూపుల వరుసలతో, చూచుచున్= చూస్తూ; బాలుని మౌళియందున్= పిల్లవాని తలపై; లోక+అభినుతుండు= లోకములచే స్తుతింపబడినవాడు; అసుర+అంతకుఁడు= రాక్షససంహారి; ఉద్భట= క్రూరమైన; కాలసర్ప= కాలమనే త్రాచువలన; భీత+అభయదానశస్తమున్= భయమందినవారికి అభయమొసగుటలో ప్రసిద్ధమైన; అనర్గళ= ఎదురులేని; మంగళహేతు= శుభాలకు కారణమైన, హస్తమున్= అరచేతిని; పెట్టెన్= ఉంచెను.

**తా :** నరసింహమూర్తి మనస్సులో కరుణారసం ఉప్పొంగింది. బాలుణ్ణి దగ్గరకు పిలిచాడు. మిక్కిలి వాత్సల్యంతో అతన్ని చూస్తూ కాలసర్పభూతాన్ని తొలగించేది, నిత్యమూ శుభాలు కలిగించేది అయిన తన హస్తంతో ప్రహ్లాదుని శిరస్సును ఆప్యాయంగా నిమిరాడు.

**వ. ఇట్లు హరికరస్పర్శనంబున భయవిరహితుండును, బ్రహ్మ జ్ఞాన సహితుండును, బులకితదేహుండును, సముత్పన్న సంతోష బాష్పసలిలధారా సమూహుండును, బ్రేమాతిశయ గద్గద భాషణుండును, వినయవివేక భూషణుండును, నేకాగ్రచిత్తుండును, భక్తి పరాయత్తుండును నయి య ద్దేవుని చరణ కమలంబులు దనహృదయంబున నిలిపికొని కరకమలంబులు ముకుళించి యిట్లని వినుతించె. 348**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; హరికరస్పర్శనంబునన్= విష్ణుని చేతి స్పర్శవలన; భయరహితుండును= భీతి మానినవాడు; బ్రహ్మజ్ఞాన సహితుండును= పరబ్రహ్మను గూర్చిన జ్ఞానంతో కూడినవాడు; పులకిత దేహుండును= గగుర్పొడిచిన శరీరం గలవాడు; సముత్పన్న= పెల్లుబికెడు; సంతోషబాష్ప= ఆనందపుకన్నీటి; సలిలధారాసమూహుండును= ప్రవాహంతో కూడినవాడు; ప్రేమ+అతిశయగద్గద భాషణుండును= భక్తియొక్క ఆధిక్యంతో, డగ్గుత్తికతోకూడిన మాటలు గలవాఁడు; వినయవివేక భూషణుండునున్= అణకువ, తెలివితేటలే ఆభరణంగా గలవాడు; ఏక+అగ్రచిత్తుండును= ఒక్కదానిపైనే కేంద్రీకృతమైన మనస్సు గలవాడు; భక్తిపర+ఆయత్తుండునున్= భక్తికి అధీనుడు; అయి= అయి; ఆ+దేవుని చరణకమలంబులు= ఆ నృసింహుని పద్మాలవంటి పాదాలను; తన హృదయంబునన్= తనగుండెలో, నిలిపికొని= నిలిపివుంచి; కరకమలంబులు= పద్మాలవంటి చేతులను; ముకుళించి= ముడిచి, నమస్కరించి; ఇట్లు+అని వినుతించెన్= ఈ విధంగా స్తుతించాడు.

**తా :** ఈ విధంగా తన తలనంటిన హరి చేయివల్ల భయము తొలగి, పులకించిపోయి, ఉప్పొంగి పొరలే ఆనందబాష్పాలతో, గద్గదస్వరంతో, వినయ వివేక విభూషితుడైన ప్రహ్లాదుడు, ఏకాగ్రచిత్తుడై, భక్తికి లొంగి, చేతులు జోడించి నృసింహ భగవానుణ్ణి ఈ విధంగా స్తుతించాడు.

## ❖ ప్రహ్లాదుఁడు నరసింహ మూర్తిని స్తుతించుట ❖

**మ. అమరుల్ సిద్ధులు సంయమీశ్వరులు బ్రహ్మాదుల్ సతాత్పర్య చి**
**త్తములన్ నిన్ను బహుప్రకారముల నిత్యంబున్ విచారించి పా**
**రము ముట్టన్ నుతిసేయ నోపరఁట, నే రక్ష స్తనూజుండ, గ**
**ర్వమదోద్రిక్తుఁడ, బాలుఁడన్, జడమతిన్, వర్ణింప శక్తుండనే? 349**

**ప్రతి :** అమరుల్= దేవతలు; సిద్ధులు= సిద్ధులు అనే ఒక దేవతల ఉపజాతివారు; సంయమి+ఈశ్వరులు= మునీశ్వరులు; బ్రహ్మ+ఆదుల్= బ్రహ్మ మొదలైనవారు; సతాత్పర్యచిత్తములన్= తత్పరత్వముతో గూడిన మనస్సులతో; బహుప్రకారములన్= అనేకరీతులలో; నిత్యంబున్= ఎల్లపుడు; విచారించి= ఆలోచించి; నిన్నున్= నిన్ను; పారము ముట్టన్= తుదిముట్టగా, చివరివరకు; నుతిచేయను+ఓపరు+అఁట= స్తుతించుటకు చాలరట; నేన్= నేను; రక్షస్+తనూజుండన్= రాక్షసునికొడుకును; గర్వమద+ఉద్రిక్తుఁడన్= పొగరుతో, మదంతో ఎగసిపడేవాడను; బాలుఁడన్= అర్భకుడను; జడమతిన్= ఎఱుకచాలని బుద్ధిగలవాడను; వర్ణింపన్+శక్తుండను+ఏ= కొనియాడ జాలినవాడనా? (కానని భావం.)

**తా :** నిన్ను దేవతలు, మునీంద్రులు, బ్రహ్మమొదలైన ప్రముఖులు ఏకాగ్రచిత్తులై బహుధా ఆలోచనలు చేసికూడ సాంతం స్తుతించ జాలరట! ఇక నేనేమో రాక్షసకుమారుణ్ణి, గర్వాద్రిక్తుణ్ణి, మందమతిని అయిన బాలుడిని కనుక నిన్ను ఏమని ఎట్లు స్తుతించగలను?

**మ. తపమున్ వంశముఁదేజమున్ శ్రుతము సౌందర్యంబు నుద్యోగమున్**
**నిపుణత్వంబుఁబ్రతాపపౌరుషములున్ నిష్ఠాబలప్రజ్ఞలున్**
**జపహోమంబులుఁజాల వీశ్వర! భవత్సంతుష్టికై దంతి యూ**
**థపుచందంబున భక్తిచేయవలయుందాత్పర్యసంయుక్తుఁడై. 350**

**ప్రతి :** ఈశ్వర!= అధిపతీ! భవత్+సంతుష్టికై= నీ సంతోషానికి; తపమున్= తపస్సూ; వంశమున్= కులమూ; తేజమున్= ప్రకాశము; శ్రుతము= (వినబడినది) చదువు; సౌందర్యంబున్= అందమూ; ఉద్యోగమున్= ప్రయత్నమూ; నిపుణత్వంబున్= నేర్పూ; ప్రతాప పౌరుషములున్= పరాక్రమం మగటిమి; నిష్ఠాబలప్రజ్ఞలున్= ఏకాగ్రత, బలం, తెలివితేటలూ; జపహోమంబులున్= జపము, హోమమూ; చాలవు= సమర్థమైనవి కావు; నరుఁడు= మానవుడు; తాత్పర్య సంయుక్తుఁడు+ఐ= ఏకాగ్రతతో కూడినవాడై; దంతియూథపు+చందంబునన్= ఏనుగులరాజు మాదిరిగ; భక్తిచేయవలయున్= భక్తిని ఇష్టంతో సేవను చేయాలి.

**తా :** ఈశ్వరా! నీవు తృప్తిచెందాలంటే, నరుని తపస్సు, జాతి, చదువు, అందచందాలు, నేర్పు, ప్రతాప పరాక్రమాలు, నియమ నిష్ఠలు, ప్రజ్ఞా పాటవాలు, జప హోమాలు ఇవేవీ చాలవు. నిన్ను సంతుష్టుని చేయాలంటే, ఆ గజరాజువలె, కేవలంభక్తిపరవశత్వంతోడి శరణువేడడ మొక్కటే మార్గం.

**మ. అమలజ్ఞానసుదానధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర**
**త్వములన్ యజ్ఞతపోఽనసూయలఁ గడున్ దర్పించు ధాత్రీసురో**
**త్తముకంటెన్ శ్వపచుండు ముఖ్యుఁడు మనోఽర్థప్రాణ వాక్కర్మముల్**
**సమతన్ నిన్ను నయించెనేని నిజవంశశ్రీకరుం డౌఁదుదిన్. 351**

**ప్రతి :** అమల= నిర్మలమైన; జ్ఞాన= జ్ఞానంతో; సుదాన= మంచిదానాలతో; ధర్మరతిన్= ధర్మనిరతితో; సత్య= సత్యవ్రతంతో; క్షాంతి= ఓర్పుతో; నిర్మత్సరత్వములన్= మాత్సర్య లేమితో – ఈ అన్ని గొప్ప గుణాలతో; యజ్ఞతపస్+అనసూయలన్= యాగం తపశ్చర్య; అసూయలేమి వీటితో; కడున్ దర్పించు= మిక్కిలి విర్రవీగే; ధాత్రీసుర+ఉత్తముకంటెన్= బ్రాహ్మణశ్రేష్ఠునికంటే; శ్వపచుండు= చండాలుడు (కుక్కను వండుకొనేవాడు); మనస్+అర్థ ప్రాణ వాక్ కర్మలన్= మనస్సు, సంపద, ప్రాణం, మాట, పనులు వీటితో; సమతన్= సమభావంతో, నిన్నున్= నిన్ను; నయించెను+ఏని= చెందెనేని; ముఖ్యుఁడు= శ్రేష్ఠుడు; తుదిన్= చివరకు; నిజవంశ శ్రీకరుండు+ఔన్= తన వంశానికి కీర్తి కల్పించినవాడౌతాడు.

**తా :** నిర్మలమైన జ్ఞానం, మంచి దానం, ధర్మాసక్తి, సత్యం, సహనం, మాత్సర్యం లేకపోవడం, యజ్ఞం, తపస్సు, అసూయ లేకుండుట ఇవన్నీ ఉండి మిక్కిలి గర్వించే బ్రాహ్మణునికంటె మనస్సు, అర్థం, ప్రాణం, మాట, కర్మలు వీటన్నిటితో సమతా బుద్ధితో నిన్ను సేవించే చెండాలుడైనా గొప్పవాడై తన వంశం మొత్తానికి శోభ కూరుస్తాడు.

**విశే :** భగవంతుడు పాండిత్యం, సంపదలు, కులం మున్నగునవికాక అహంకార మమకారాలులేని సమతాదృష్టినే స్వీకరిస్తాడు. అందుకే కులంకన్నా, గుణంమిన్న అనే నానుడి ఏర్పడింది.

**సీ. అజ్ఞుండు సేసిన యారాధనములఁజేపట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁడగుటఁ**
**జేపట్టు నొకచోట సిద్ధ మీశ్వరునకు నర్థంబు లేకుండు, నతఁడు పూర్ణుఁ**
**డైన నర్థము లీశ్వరార్పణంబులు గాఁగఁజేయుట ధర్మంబు సేసెనేని**
**నద్దంబుఁజూచిన నళికలలామంబు ప్రతిబింబితంబగు పగిది మరల**

**తే. నర్థములు దోఁచుఁ,గావున నధికబుద్ధి, భక్తిసేయంగవలయును, భక్తి గాని**
**మెచ్చఁడర్థంబు లొసఁగెడు మేరలందుఁ, బరమకరుణుండు హరిభక్తిబాంధవుండు. 352**

**ప్రతి :** ఈశ్వరుఁడు= భగవంతుడు; అజ్ఞుండుసేసిన= ఏమీ తెలియనివాడు చేసిన; ఆరాధనములన్= పూజలను; చేపట్టడు= స్వీకరించదు; కృపాళుడవుటన్= భగవంతుడు దయామయుడవడంవల్ల; ఒకచోటన్= ఒక్కొక్క వేళ; చేపట్టున్= అజ్ఞుడు చేసిన పూజలనుకూడా స్వీకరిస్తాడు; ఈశ్వరునకున్= భగవంతునకు; అర్థంబు= (మన పూజలవలన) ఫలము; లేకుండున్= ఉండదు; సిద్ధము= సత్యము; కారణము= దానికి కారణం; అతఁడు= ఆ భగవంతుడు; పూర్ణుఁడు= సర్వార్థములతో వాడు నిండిన వాడగుటయే; అయిననూ= అయినా కూడా; అర్థములు= ఫలాలు; ఈశ్వరార్పణంబులు కాగన్= భగవదర్పితములు అగునట్లుగా; చేయుట= (సత్కార్యములు) నిర్వహించుట; ధర్మము= న్యాయం; చేసెనేని= ఆ విధంగా ఈశ్వరార్పణ బుద్ధితో చేసినచో; అద్దంబున్ చూచిన= అద్దాన్ని చూస్తే; అళికలలామంబు= నుదుటి బొట్టు; ప్రతిబింబితంబగుపగిదిన్= ప్రతిఫలించినట్లుగా; మరలన్= మళ్ళీ; అర్థములు= పురుషార్థాలు; తోచున్+కావునన్= సిద్ధిస్తాయి కాబట్టి; అధికబుద్ధిన్= దొడ్డ బుద్ధితో; భక్తి సేయంగవలయును= విష్ణుభక్తిని ఆచరింపవలెను ; భక్తిబాంధవుండు= భక్తికి చుట్టం; పరమకరుణుండు= మిక్కిలి దయగలవాడు అయిన; హరి= విష్ణుమూర్తి; అర్థంబులు+ఒసగెడు+మేరలందు= ఫలితాలు ఇచ్చే సమయంలో; భక్తి గాని= భక్తినే కానీ; మెచ్చడు= మెచ్చుకోడు.

**తా :** భగవంతుడు అజ్ఞాని చేసిన పూజలు స్వీకరించడు. దయామయుడవడంచేత స్వీకరించినా స్వీకరిస్తాడు. భగవంతుడు పరిపూర్ణుడవటంచేత మానవుడు చేసే పూజలవల్ల అతనికెట్టి ప్రయోజనమూ లేదు. ఇది సత్యం. అయినా మనం ఈశ్వరార్పణ బుద్ధితో పూజలు చేయడం ధర్మం. అలా ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తే అద్దంలో మన నుదుటిబొట్టు కనిపించునట్లుగా వాని ఫలితం మనకే వస్తుంది. కాబట్టి గొప్పబుద్ధితో భగవదర్చన చేయాలి. భక్తికి బంధువైన శ్రీమహావిష్ణువు భక్తినే కాని, తక్కిన వానిని మెచ్చుకోరు. మనకు ఫలితాలివ్వడంలో భగవంతుడు పరమ దయామయుడు.

**విశే :** "చిత్తశుద్ధిలేని భక్తి వట్టి శాస్త్రజ్ఞానం వంటిది. భక్తితో కూడిన చదువే 'మంచి చదువు' అన్నాడు ప్రహ్లాదుడు. అటువంటి చదువే "పుట్టని చావనిత్రోవ"యైన ముక్తికి దారితీస్తుంది అని ప్రహ్లాదుడు ముందే చెప్పి ఉన్నాడు.

**క. కావున నల్పుఁడ, సంస్తుతిఁ, గావించెద వెఱపు లేక కలనేరుపునన్**
**నీ వర్ణనమున ముక్తికిఁ, బోవు నవిద్యను జయించి పురుషుఁడనంతా! 353**

**ప్రతి :** అనంతా!= తుదిలేనివాడా! కావునన్= కనుక; అల్పుఁడన్= చిన్నవాడను; వెఱపులేక= భయము మాని; కలనేరుపునన్= ఉన్న నేర్పుతో; సంస్తుతిన్+కావించెదన్= స్తోత్రం చేస్తాను; పురుషుఁడు= నరుడు; నీ వర్ణనమునన్= నీ కీర్తనంచేత; అవిద్యను= అజ్ఞానాన్ని; జయించి= గెలిచి; ముక్తికిన్+పోవున్= మోక్షానికి చేరుతాడు.

**తా :** దేవా! నేను అల్పజ్ఞుణ్ణయినా, నా నేర్పు కొలది నీ స్తుతి చేస్తాను; నీ స్తుతివల్ల నరుడు అజ్ఞానాన్ని గెలిచి ముక్తిని పొందగలడు.

**సీ. సత్త్వాకరుఁడవైన సర్వేశ!, నీ యాజ్ఞ శిరముల నిడుకొని చేయువారు**
**బ్రహ్మాదు లమరులు భయ మందుచున్నారు నీ భీషణాకృతి నేఁడు చూచి**
**రోషంబు మాను, నీ రుచిరవిగ్రహములు కల్యాణకరములు గాని భీతి**
**కరములు గావు లోకములకు, వృశ్చికపన్నగంబుల భంగి భయముఁజేయు**

**తే. నసుర మర్దించితివి, సాధుహర్ష మయ్యె, నవతరించిన పని దీఱె నలుక యేల?**
**కలుషహారివి సంతోషకారి వనుచు, నిన్నుఁదలఁతురు లోకులు నిర్మలాత్మ! 354**

**ప్రతి :** సత్త్వ+ఆకరుఁడవు+ఐన= సత్త్వానికి, శక్తికి స్థానమైన; సర్వ+ఈశ!= అఖిలాండేశ్వరా!; నీ+ఆజ్ఞన్= నీ ఆనతిని; శిరములన్+ఇడికొని= నెత్తిపై పెట్టుకొని; చేయువారు= ఆచరించేవారు; బ్రహ్మ+ఆదులు+అమరులు= బ్రహ్మమొదలగు దేవతలు; నేఁడు= ఈనాడు; నీ భీషణ+ఆకృతిన్‌చూసి= నీ భయంకరస్వరూపాన్ని కనుగొని; భయము+అందుచు+ఉన్నారు= భయం పొందుతున్నారు. రోషంబు మాను= క్రోధాన్ని చాలించు; నీ రుచిర విగ్రహములు= నీ వెలుగొందే ఆకారాలు; కల్యాణకరములు+కాని= శుభకరాలే తప్ప; భీతికరములు+కావు= భయంకరాలు గావు; నిర్మల+ఆత్మ= స్వచ్ఛమైన మనస్సుకల నరసింహా!; లోకములకున్= ప్రజలకు; వృశ్చిక పన్నగంబుల భంగిన్= తేళ్ళు, పాములవలె, భయమున్+చేయున్= భయాన్ని కలిగించే; అసురన్+మర్దించితివి= రాక్షసుని వధించావు; సాధుహర్షము+అయ్యెన్= సజ్జన సంతోషం కలిగింది; అవతరించినపని= దివినుండి భువికి దిగి వచ్చిన కార్యం; తీఱెన్= ముగిసింది; అలుక+ఏల?= కోప మెందుకు? కలుషహారివి= దోషాలను హరించేవాడవు; సంతోషకారివి= సంతుష్టి కలిగించేవాడవు; అనుచున్= అంటూ; లోకులు= ప్రజలు; నిన్నున్+తలఁతురు= నిన్ను స్మరిస్తారు,

**తా :** శక్తికి స్థానమైన స్వామీ! బ్రహ్మాదిదేవతలు నీ యాజ్ఞలను శిరసావహించే నీ సేవకులు; వారు నీ యీ భయంకరరూపం చూచి భీతిపొందుతున్నారు. క్రోధం మాను. నీ స్వరూపాలు సుందర శుభకరాలే, తప్ప భయంకరాలు గావు. పాములు, తేళ్లవలె భయాన్ని కలిగించే రాక్షసుణ్ణి సంహరించావు. సజ్జనులందరూ సంతోషిస్తున్నారు నీ అవతార కార్యం తీరింది. ఇక కోపమెందుకు? దోషాలను పోగొట్టి సంతోషాన్ని కలిగించే నిర్మలమూర్తివని లోకులు నిన్ను స్మరిస్తున్నారు.

**మ. ఖరదంష్ట్రా భ్రుకుటీ సటానఖయు నుగ్రధ్వానయున్ రక్త కే**
**సరయున్ దీర్ఘతరాంత్రమాలికయు భాస్వన్నేత్రయున్నైన నీ**
**నరసింహాకృతిఁ జూచి నే వెఱవఁ, బూర్ణక్రూర దుర్వార దు**
**ర్భర సంసారదవాగ్నికిన్ వెఱతు, నీ పాదాశ్రయుం జేయవే! 355**

**ప్రతి :** ఖర= వాడియైన, దంష్ట్రా= కోరలు; భ్రుకుటీ= కనుబొమలు; సటా= జూలు; నఖయున్= గోరులు కల్గినది; ఉగ్రధ్వానయున్= భయంకర గర్జన గల్గినది; రక్తకేసరయున్= ఎర్రనిజూలుగలది; దీర్ఘతర+అంత్రమాలికయున్= మిక్కిలి పొడవైన ప్రేగుల మాలలుగలది; భాస్వత్+నేత్రయున్= ప్రకాశించే నేత్రాలు గలది; ఐన= ఐ ఒప్పే; నీ నరసింహ+ఆకృతిన్= నీ నరసింహస్వరూపాన్ని; చూచి= కనుగొని; నేన్= నేను; వెఱవన్= భయపడను; పూర్ణ= నిండైన; క్రూర= భయంకరమైన;

దుర్వార= అడ్డగింపరాని; దుర్భర= భరింపరాని; సంసారదవ+అగ్నికిన్= కుటుంబమనే అడవినిప్పుకు; వెఱతున్= భయపడుతాను; నీ పాద+ఆశ్రయున్+చేయవే= నీ కాళ్ళను ఆశ్రయించిన వాడిగా; చేయి!

**తా :** నీ నరసింహస్వరూపం వాడిఅయిన కోరలతో, కనుబొమలతో, జూలుతో, గోళ్ళతో, భయంకర గర్జనలతో, ఎర్రని కేసరాలతో, పొడవైన పేగుల దండలతో, వెలిగే కన్నులతో చూచేవారికి భయంకరమే. కాని, నేను దానికి భయపడను. సంపూర్ణంగా క్రూరము, అడ్డగించటానికి భరించటానికి వీలుగానిది అయిన సంసారమనే దావాగ్నికి భయపడుతున్నాను. కావున నన్ను దీనినుండి రక్షించి నీ కాళ్ళవద్ద ఆశ్రయ మివ్వు.

**విశే :** హిరణ్యకశిపుడు యుద్ధవీరుడైతే, ప్రహ్లాదుడు ఆధ్యాత్మికధీరుడు. చిన్నతనం నుండే మదిలో వైరాగ్యాన్ని పెంపొందించుకొన్న వైరాగ్యనిధి. ఆయన నృసింహస్వామి భయంకరాకృతిని చూచి భయపడలేదు. కాని, 'పూర్ణక్రూర దుర్వార దుర్భర సంసారదవాగ్నికి భయపడుతాడట! ఎంత పరిపక్వమైన సంసార విరక్తి! ఆధ్యాత్మిక చైతన్యం!

**వ. దేవా! సకలయోనులందును సుఖవియోగ దుఃఖసంయోగ సంజనితంబైన శోకానలంబున దందహ్యమానుండనై, దుఃఖ నివారకంబు గాని దేహాద్యభిమానంబున మోహితుండనై పరిభ్రమించుచున్న యేను నాకుం బ్రియుండవు సఖుండవుఁ బర దేవతవు నైన నీ యొక్క బ్రహ్మగీతంబు లయిన లీలావతార కథావిశేషంబులఁ బఠియించుచు రాగాదినిర్ముక్తుండనై దుఃఖ పుంజంబులఁ దరియించి భవదీయ చరణకమల స్మరణ సేవా నిపుణులైన భక్తులం జేరి యుండెద, బాలునిఁ దల్లిదండ్రులును, రోగిని వైద్యదత్తం బయిన యౌషధంబును, సముద్రంబున మునింగెడివాని నావయును దక్కనొరులు రక్షింపనేరని తెఱంగున సంసారతాపతంతప్య మానుండై నీ చేత నుపేక్షితుండయిన వాని నుద్ధరింప నీవు దక్క నన్యుండు సమర్థుండు గాఁడు, జగంబుల నెవ్వండేమి కృత్యంబు నెవ్వనిచేతం బ్రేరితుండై యేయింద్రియంబులం జేసి యేమిటికొఱకు నెవ్వనికి సంబంధియై యే స్థలంబున నే సమయంబునం దేమి రూపంబున నే గుణంబున నపరంబైన జనకాది భావంబున నుత్పాదించి పరంబయిన బ్రహ్మాది భావంబున రూపాంతరంబు నొందించునట్టి వివిధ ప్రకారంబు లన్నియు నిత్యముక్తుండవు రక్షకుండవు నైన నీవ, నీ యంశంబైన పురుషునికి నీ యనుగ్రహంబునఁ గాలంబుచేతం బ్రేరిత యై కర్మమయంబును బలయుతంబును బ్రధానలింగమును నైన మనంబును నీ మాయ సృజియించు, నవిద్యార్పితవికారంబును, వేదోక్తకర్మ ప్రధానంబును, సంసార చక్రాత్మకంబైన యీ మనమున నిన్ను సేవింపక నియమించి తరియింప నొక్కండును సమర్థుండు లేఁడు, విజ్ఞాననిర్జిత బుద్ధి గుణుండవు నీవు, నీ వలన వశీకృతకార్య సాధన శక్తియైన కాలంబు మాయతోడం గూడ షోడశవికారయుక్తంబయిన సంసార చక్రంబుఁ జేయుచుండు, సంసారదావ దహన తంతప్య మానుండనగు నన్ను రక్షింపుము. 356**

ప్రతి : దేవా= శ్రీహరీ! సకలయోనులందును= అన్నిజన్మలలోను; సుఖవియోగ= సుఖంనుండి విడిపోవటం; దుఃఖసంయోగ= దుఃఖంతో కలియటంచేత; సంజనితంబు+ఐన= కలిగినదైన; శోక+అనలంబునన్= దుఃఖం అనే నిప్పుచేత; దందహ్యమానుండనై= మిక్కిలి కాల్పబడుచున్నవాడనై; దుఃఖనివారకంబుగాని= దుఃఖాన్ని అడ్డుకోలేని;

దేహ+ఆది+అభిమానంబునన్= శరీరం మొదలయిన వాటి మీది ప్రేమతో; మోహితుండనై= మత్తిల్లినవాడినై; పరిభ్రమించుచున్న= ఇటు అటు తిరుగుతున్న; ఏను= నేను; నాకున్+ప్రియుండవు= నాకు ఇష్టమైన వాడివి; సఖుండవున్= స్నేహితుడివి; పరదేవతవున్+ఐన= గొప్పదేవుడివిఅయిన; నీయొక్క= నీకు చెందిన; బ్రహ్మగీతంబులు+అయిన= బ్రహ్మ పాడిన; లీలా+అవతారకథావిశేషంబులన్= అవతారలీలా విశేషకథలను; పఠియించుచున్= చదువుతు; రాగ+ఆది నిర్ముక్తుండనై= ప్రేమ మొదలయిన వానినుండి విడివడినవాడనై; దుఃఖపుంజములన్= దుఃఖసమూహాలను; తరియించి= దాటి; భవదీయ= నీకుజెందిన; చరణకమల= పాదపద్మముల; స్మరణ సేవానిపుణులు+ఐన= స్మరణ రూపమైన సేవలో నేర్పరులయిన; భక్తులన్+చేరి+ఉండెదన్= భక్తులతో కలిసి జీవిస్తాను; బాలునిన్+తల్లిదండ్రులును= పిల్లవానిని (వాని) తల్లిదండ్రులు; రోగిని వైద్యదత్తంబయిన+ఔషధంబును= జబ్బుపడినవాడిని, వైద్యునిచే ఈయబడిన మందు; సముద్రంబునన్+మునింగెడువానిన్= కడలిలో మునిగేవాడిని; నావయును= నౌక; తక్కన్= తప్ప; ఒరులు= ఇతరులు; రక్షింపనేరని తెఱంగునన్= కాపాడలేనివిధంగా; సంసారతాపతంతప్యమానుండై= సంసారవ్యామోహంతో తపిస్తున్నవాడినై; నీ చేతను+ఉపేక్షితుండు+అయినవానిన్= నీ చేత ఉపేక్షింపబడినవాడిని; ఉద్ధరింపను= పైకిలేపుటకు; నీవు దక్కన్= నీవు తప్ప; అన్యుండు= ఇతరుడు; సమర్థుండు+కాఁడు= అర్హుడు కాదు, శక్తిమంతుడు కాదు; జగంబులన్= లోకాలలో; ఎవ్వండు+ఏమికృత్యంబును= ఎవడు ఏ పనిని; ఎవ్వని చేతన్+ప్రేరితుండై= ఎవని చేత ప్రేరేపింపబడినవాడై; ఏ+ ఇంద్రియంబులన్+చేసి= ఏ ఇంద్రియాలతో; ఏమిటి కొఱకున్= దేని కొరకు; ఎవ్వనికిన్+సంబంధియై= ఎవ్వరికి చెందినవాడై ఏ స్థలంబునన్= ఏ చోట; ఏ సమయంబునందు= ఏ వేళలో; ఏమి రూపంబునన్= ఏ స్వరూపంతో; ఏ గుణంబునన్= ఏ గుణంతో; అపరంబైన= ఉత్తమంగాని; జనక+ఆదిభావంబునన్= తండ్రి మొదలయిన ఆలోచనతో; ఉత్పాదించి= పుట్టించి; పరంబు+అయిన= ఉత్తమమైన; బ్రహ్మ+ఆదిభావంబునన్= బ్రహ్మమొదలయిన (సృష్టికర్త) విధంగా; రూప+ అంతరంబును+ఒందించు= మరియొక ఆకారమును కల్పించే; అట్టి వివిధ ప్రకారంబులు+అన్నియున్= ఆ విధమైన అనేకరీతులు అన్ని; నిత్యముక్తుండవు=సదా బంధరహితుడివి; రక్షకుండవున్+ఐన= ప్రోచేవాడివిఅయిన, నీవు+అ= నీవే! నీ+అంశంబైన= నీ(లోని) భాగమైన; పురుషునికిన్= నరునికి; నీ+అనుగ్రహంబునన్= నీ దయచేత; కాలంబుచేతన్= కాలంచేత; ప్రేరిత+ఐ= ప్రోత్సహింపబడినదై; కర్మమయంబును= పనుల నిండినది; బలయుతంబును= బలంతో కూడినది; ప్రధానలింగమును+ఐన= ప్రధానలింగ శరీరమునకు కారణమైన; మనంబును= మనస్సును; నీ మాయ= దైవమాయ; సృజియించున్= పుట్టిస్తుంది; అవిద్యా+అర్పితవికారంబును= అజ్ఞానంచే ఇవ్వబడిన వికృతిగలది; వేద+ఉక్త కర్మప్రధానంబును= వేదంలో చెప్పబడిన క్రియలు ముఖ్యమైనదీ; సంసారచక్ర+ఆత్మకంబైన= సంసారమనే చక్ర స్వరూపం గలది అయిన; ఈ మనమున్= ఈ మనస్సుతో, నీవు చేసినదానితో; నిన్నున్ సేవింపక= నీ సేవచేయక; నియమించి= స్వాధీనపరచుకొని; తరియింపన్= దాటుటకు (ముక్తిపొందుటకు); ఒక్కండును సమర్థుండు లేఁడు= ఒక్కడూశక్తిమంతుడు లేడు; విజ్ఞాన నిర్జిత బుద్ధి గుణుండవు నీవు= బ్రహ్మజ్ఞానంచే జయించబడిన బుద్ధి, గుణము – ఈ రెండు కలవాడివి నీవు; నీ వలనన్= నీవు కారణంగా; వశీకృత= స్వాధీనమైనదిగా చేయబడిన; కార్యసాధనశక్తి+ఐన= పనులను సాధించేశక్తి గలదైన; కాలంబు= కాలం (కర్త); మాయతోడన్+కూడన్= మాయతో కూడేట్లుగా; షోడశవికార యుక్తంబు+అయిన= పదహారు వికృతులతో కూడిన; సంసారచక్రంబున్+చేయుచున్+ఉండున్= సంసారమనే చక్రాన్ని చేస్తూ ఉంటుంది; సంసారదావదహన= సంసారమనే దావాగ్నిచేత; తంతప్యమానుండు+అగు= మిక్కిలి కాల్చబడుతున్న వాడనైన; నన్నున్= నన్ను; రక్షింపుము= కాపాడు.

**తా :** నృసింహా! నేను సృష్టిలోని సకల యోనులలో పుట్టి, సుఖం నశించి దుఃఖం లభించి శోకాగ్నిలో కాలిపోతున్నాను. నా యీ దేహాభిమానం దుఃఖాన్ని నివారించ జాలదు. అయినా నేను మోహంలో పడి తిరుగుతున్నాను. ఇట్టి నాకు నీవు ఇష్టుడవు, మిత్రుడవు, పరమదేవతవు. బ్రహ్మ గానంచేసిన నీ లీలావతార కథలను నేను చదువుతూ కోరికలనుండి ముక్తుడనై, దుఃఖాలు దాటి నీ పాదపద్మ స్మరణ చేసే పరమభక్తులతో కలిసి జీవిస్తాను. బాలుణ్ణి తల్లిదండ్రులూ, రోగిని మందూ, కడలిలో మునిగిపోయేవానిని నౌకా, తప్ప మిగతావి రక్షింపలేనట్లు, సంసారంలో కాలిపోయే నరుడు, నీచేత ఉపేక్షితుడైతే, ఇకవాడిని ఉద్ధరించేవారు నీవు తప్ప ఇతరులు లేరు. లోకంలో, ఎవడు ఏ పనిని ఎవరి ప్రేరణతో, ఏ ఇంద్రియాలతో, ఏ కాలాన, ఏ స్థలాన ఏ రూపాన ఏ గుణాన చేయాలో నిర్ణయించేవాడివి నీవు. ఉత్తమంకాని, తండ్రి లోనైన రూపాలలో మొదట సృజించి, జీవిని పిదప ఉత్తమమైన బ్రహ్మాదిరూపాలలోనికి మార్చే శక్తి నీదే. ఈ వివిధ ప్రక్రియల సమాహార రూపుడవే నీవు. నీ అంశయైన మానవునికి నీ దయవల్ల కాలంచేత ప్రేరేపింపబడినది, కర్మమయమైనది, మిక్కిలి బలిష్ఠమైనది, ప్రధాన కారణమైనది అయిన మనస్సును నీ మాయ సృష్టిస్తుంది. వేదాలచే చెప్పబడిన కర్మంవలె ప్రధానంగాగల ఈ సంసారచక్రం వంటి మనస్సు నిన్ను సేవింపకుండా సంసారమును దాటుటకు ఏ ఒక్కడునూ సమర్థుడు కాడు. నీవు బ్రహ్మజ్ఞానంతో బుద్ధిని గుణాన్ని జయించినవాడివి. నీ కారణంగానే, సకలశక్తి కలిగిన కాలం, మాయతో పదహారు వికృతులతో కూడిన సంసారచక్రాన్ని నిర్మిస్తున్నది. నేను ఈ సంసారపు అడవినిప్పులో కాలిపోతున్నాను. నన్ను కాపాడు.

**విశే:** అనంత సంసార దుఃఖసాగర ప్రయాణంలో దిక్సూచిని పట్టుకొనుమని తన జీవిత నౌకాకర్ణధారిని, ఆ పరాత్పరుని ఉద్దేశించి ప్రార్థిస్తూ సర్వజీవుల ప్రతినిధిగా ప్రహ్లాదుడు చేసిన సంప్రార్థనమే ఈ విశిష్ట వచనం!

**సీ. జనులు దిక్పాలుర సంపదాయుర్విభవములు గోరుదురు భవ్యంబు లనుచు,**
**నవి యంతయును రోషహాసజృంభితమైన మా తండ్రి బొమముడి మహిమఁజేసి**
**విహతంబు లగు,నట్టి వీరుండు నీ చేత నిమిషమాత్రంబున నేఁడు మడిసెఁ,**
**గావున ధ్రువములు గావు బ్రహ్మాదుల శ్రీవిభవంబులు జీవితములుఁ,**

**తే. గాలరూపకుఁడగు నురుక్రముని చేత, విదళితము లగు, నిలువవు వేయు నేల?**
**యితర మేనొల్ల నీమీఁది యెఱుక కొంత, గలిగియున్నది కొలుతుఁగింకరుఁడ నగుచు. 357**

**ప్రతి :** జనులు= ప్రజలు; భవ్యంబులు+అనుచున్= శుభకరాలని; దిక్+పాలురన్= దిక్కులకు ప్రాలకులైన దేవతలను; సంపత్+ఆయుర్+విభవములు= సంపదలు, ఆయుస్సు, వైభవాలను; కోరుదురు= కోరుకుంటారు. అవి+అంతయును= అవి అన్నీ; రోషహాసజృంభితమైన= క్రోధంతో, నవ్వుతో, పెంపొందే, మా తండ్రి బొమముడి మహిమన్+చేసి= మా తండ్రి కనుబొమల ముడి గొప్పతనంవలన; విహతంబులగున్= నాశనమవుతాయి; అట్టివీరుండు= అంతటి ధీరుడూ; నీ చేతన్= నీ చేతిలో; నిమిషమాత్రంబునన్= ఒకే నిమేష సమయంలోనే; నేఁడు= ఈనాడు; మడిసెన్= చనిపోయాడు; కావునన్= కాబట్టి; బ్రహ్మ+ఆదుల శ్రీవిభవంబులు= బ్రహ్మ మొదలగువారి సిరిసంపదలు; జీవితములున్= బ్రదుకులు; ధ్రువములు+కావు= శాశ్వతాలు గావు; కాలరూపకుఁడగున్+ఉరుక్రముచేతన్= కాలస్వరూపుడయిన వామనునిచే; విదళితములు+అగున్= నశిస్తాయి. నిలువవు= నిలిచి ఉండవు; వేయున్+ఏల?= వేయిమాటలేల? ఏను= నేను; ఇతరము=

వేరేదీ; ఒల్లన్= కోరను; నీ మీఁది+ఎఱుక= నిన్ను గురించిన జ్ఞానం; కొంత+కలిగి+ఉన్నది= కొంచెము ఏర్పడి ఉన్నది; కింకరుఁడన్+అగుచున్= సేవకుడనై; కొలుతున్= నిన్ను సేవింతును.

**తా :** లోకులు, ఏదో ఒరుగుతుందని, దేవతలను, సంపదలు, ఆయుస్సులు, వైభవాలు కోరుకుంటారు. అవి అన్నీ, మా తండ్రి క్రోధంతోనో, నవ్వుతోనో, కనుబొమలు ముడిచి చూస్తే చాలు నశించిపోయేవి. అటువంటి వీరుడూ నేడు నీ చేత క్షణకాలంలో చనిపోయాడు. కాబట్టి, బ్రహ్మ మొదలు అందరి సిరిసంపదలు, వైభవాలు, బ్రదుకులు, శాశ్వతాలు కావు. అవి అన్నీ, కాలస్వరూపుడైన ఉరుక్రముని చేత (అన్ని లోకాలు ఆక్రమించేవానిచేత) ధ్వస్తమై పోయేవే! నిలిచేవి గావు; వేయిమాటలేల? నేను నీ పాదసేవ తప్ప వేరేవి కోరను. నీ గురించిన జ్ఞానం కొంత నాలో కలిగింది. నీకు బంటునై నిన్ను సేవిస్తాను.

**మత్తకోకిలము.**

**ఎండమావులవంటి భద్రము లెల్ల సార్థము లంచు మ**
**ర్త్యుండు రోగనిధాన దేహముతో విరక్తుఁడు గాక యు**
**ద్దండమన్మథవహ్ని నెప్పుడుఁ దప్తుఁడై యొకనాఁడుఁ జే**
**రండు పారము దుష్టసౌఖ్యపరంపరాక్రమణంబునన్. 358**

**ప్రతి :** మర్త్యుండు= నరుడు; ఎండమావులవంటి= ఎండమావులనుపోలిన; భద్రములు+ఎల్లన్= శుభాలు అన్నీ; సార్థములు+అంచున్= ప్రయోజనసహితాలు, అనుకొంటూ; రోగనిధానదేహముతోన్= రోగాలకు నిలయమయిన శరీరంతో; విరక్తుఁడు+కాక= విరాగికాక; ఉద్దండ మన్మథ వహ్నిన్= తీవ్రమయిన మదనుని కామదాహంతో; తప్తుఁడు+ఐ= తపించినవాడై; దుష్టసౌఖ్య పరంపరా+ఆక్రమణంబునన్= పాడు సుఖాల వరుసలు పైకొనుటవల్ల; ఎప్పుడున్= ఎన్నటికిగాని; పారమున్ చేరండు= ఒడ్డును పొందలేడు.

**తా :** నరుడు ఎండమావులవంటి శుభాలన్నీ, సత్యాలని భ్రమించి, రోగాలపుట్ట అయిన శరీరంతో ఉండికూడా విరాగికాకుండా, తీవ్ర కామాగ్నితో కాలిపోతుంటాడు. చెడు సుఖాల దొంతరలు తనను లోగొన్నకారణంగా. ఏనాటికీ అతడు సంసారపు ఒడ్డును చేరజాలడు.

**ఉ. శ్రీమహిళామహేశ సరసీరుహగర్భులకైన నీ మహో**
**ద్దామకరంబుచే నభయదానము సేయవు, నేను బాలుఁడం**
**దామస వంశ సంభవుఁడ, దైత్యుఁడ, నుగ్రరజోగుణుండ ని**
**స్సీమ దయం గరాంబుజము శీర్షముఁ జేర్చుట చోద్యమీశ్వరా! 359**

**ప్రతి :** ఈశ్వరా!= దేవా!; శ్రీమహిళా= లక్ష్మీదేవికి; మహేశ= శివునికి; సరసీరుహగర్భులకున్+ఐనన్= బ్రహ్మదేవునికైనా; నీ మహా+ఉద్దామకరంబుచేన్= నీ గొప్ప హస్తంతో; అభయదానము+చేయవు= అభయమియ్యవు, చేయవు; నేను బాలుఁడన్= నేనా పిల్లవాడను; తామస వంశ సంభవుఁడన్= తమోగుణప్రధానమైన రాక్షసవంశాన పుట్టినవాడిని, దైత్యుఁడన్= రాక్షసుడిని; ఉగ్రరజస్+గుణుండన్= భయంకర రజోగుణవంతుడిని; నిస్సీమదయన్= హద్దులేనికరుణతో; కర+అంబుజము= పద్మంవంటి నీ చేయి; శీర్షమున్+చేర్చుట= నా తలపై నిలుపటం; చోద్యము= అద్భుతం.

**తా :** స్వామీ! లక్ష్మీదేవికి, శివునికి, బ్రహ్మదేవునికైనా నీ గొప్ప హస్తమునెత్తి అభయ దానం చేయవు. కాని, నేను బాలుడను; రాక్షసవంశమున పుట్టినవాడిని, గొప్ప రాక్షసుడిని, రజోగుణం కలవాడిని అయినా నా తలపై నీ చేయిని ఉంచి అభయ మొసగుట ఎంత అద్భుతమో కదా.

**వ. మహాత్మా! సుజనులయిన బ్రహ్మాదులందును, దుర్జనులైన మాయందును సేవానురూపంబునం బక్షాపక్షంబులు లేక కల్పవృక్షంబు చందంబున ఫలప్రదానంబు సేయుదువు, కందర్పసమేతంబగు సంసార కూపంబునం గూలుచున్న మూఢ జనులం గూడి కూలెడి నేను భవదీయ భృత్యుండగు నారదుని యనుగ్రహంబునం జేసి నీ కృపకుఁ బాత్రుండనైతి, నన్ను రక్షించి మజ్జనకు వధియించుట నా యందులఁ బక్షపాతంబు గాదు, దుష్టదనుజ సంహారంబును శిష్టభృత్యమునిజన రక్షా ప్రకారంబును నీకు నైజ గుణంబులు, విశ్వంబు నీవ; గుణాత్మకంబైన విశ్వంబు సృజియించి యందుం బ్రవేశించి హేతు భూత గుణయుక్తుండవై రక్షక సంహారకాది నానా రూపంబుల నుండుదువు; సదసత్కారణ కార్యాత్మకం బయిన విశ్వంబునకుం బరమకారణంబు నీవ; నీ మాయచేత వీఁడుఁ దాననియెడు బుద్ధివికల్పంబు దోఁచుఁ; గాని నీ కంటె నొండెద్దియు లేదు; బీజంబు నందు వస్తుమాత్ర భూత సౌక్ష్మ్యంబును వృక్షంబునందు నీలత్వాదివర్ణంబునుం గలుగు తెఱంగున విశ్వంబునకు నీ యంద జన్మస్థితి ప్రకాశ నాశంబులుం గలుగు; నీ చేతనయిన విశ్వంబు నీ యంద నిలుపుకొని తొల్లి ప్రళయకాల పారావారంబునఁ బన్నగేంద్ర పర్యంకంబునఁ గ్రియారహితుండవై నిజసుఖానుభవంబు సేయుచు నిద్రితుని భంగి యోగనిమీలిత లోచనుండవై మెలంగుచుఁ గొంతకాలంబునకు నిజకాల శక్తిచేతం బ్రేరితంబులై ప్రకృతి ధర్మంబులయిన సత్త్వాదిగుణంబుల నంగీకరించి సమాధి చాలించి వెలుంగుచున్న నీ నాభియందు వటబీజంబు వలన నుద్భవించు వటంబు తెఱంగున నొక్క కమలంబు సంభవించె, నిట్టి కమలంబువలన నాల్గుమోముల బ్రహ్మ జన్మించి దిశలు వీక్షించి కమలంబునకు నొం డయిన రూపంబు లేకుండుటఁ జింతించి జలాంతరాళంబుఁ బ్రవేశించి జలంబులందు నూఱు దివ్యవత్సరంబులు వెదకి తన జన్మంబునకు నుపాదానకారణంబైన నిన్ను దర్శింప సమర్థుండు గాక మగిడి కమలంబు కడకుం జని విస్మయంబు నొంది చిరకాలంబు నిర్భర తపంబు సేసి పృథివియందు గంధంబు గను చందంబునఁ దనయందు నానా సహస్రవదన శిరో నయన నాసా కర్ణ వక్త్ర భుజ కర చరణుండును బహువిధాభరణుండును మాయాకలితుండును మహాలక్షణలక్షితుండును నిజప్రకాశ దూరీకృతతముండును బురుషోత్తముండును నయిన నిన్ను దర్శించె, నయ్యవసరంబున. 360**

**ప్రతి :** మహాత్మా!= గొప్ప మనస్సుగలవాడా! సుజనులయిన= సజ్జనులయిన; బ్రహ్మ+ఆదులందును= బ్రహ్మమొదలైన వారిపై, దుర్జనులు+ఐన= చెడ్డజనులయిన; మా యందును= మా వంటి సామాన్యులపై; సేవా+అనురూపంబునన్= సేవకు తగినవిధంగా; పక్ష+అపక్షంబులులేక= స్వ పరభావంబులు లేక; కల్పవృక్షంబు చందంబునన్= కల్పతరువులాగా; ఫలప్రదానంబు+చేయుదువు= ఫలాలు ఇస్తావు; కందర్పసమేతంబు+అగు= మన్మథునితో కూడినదైన; సంసార కూపంబునన్+కూలుచున్న= సంసారమనే బావిలో పడుతున్న; మూఢజనులన్+కూడి= బుద్ధిహీనప్రజలను కలసి; కూలెడి

నేను= చెడెడి నేను; భవదీయ భృత్యుండు+అగు= నీ సేవకుడయిన; నారదుని+అనుగ్రహంబునన్+చేసి= నారదముని దయవలన; నీ కృపకున్+పాత్రుండన్+ఐతిన్= నీ దయకు అర్హుడనయ్యాను; నన్నున్+రక్షించి= నన్ను కాపాడి; మత్+జనకున్+ వధియించుట= నా తండ్రినిచంపుట; నా+అందులన్+పక్షపాతంబు+కాదు= నా వైపు మొగ్గుచూపుట కాదు; దుష్టదనుజసంహారంబును= దుష్టరాక్షస వధ; శిష్టభృత్యమునిజన రక్షాప్రకారంబునునీకు= సజ్జన సేవకులను మునులను రక్షించే విధానం నీకు; నైజగుణంబులు= సహజ లక్షణాలు; విశ్వంబు= చరాచరసృష్టి; నీవు+అ= నీవే; గుణ+ఆత్మకంబు+ఐన విశ్వంబు= త్రిగుణాత్మకమైన ప్రపంచం; సృజియించి= పుట్టించి; అందున్+ప్రవేశించి= అందులో చేరి; హేతుభూతగుణయుక్తుండవు+ఐ= కారణమనే గుణంతో కూడినవాడవై; రక్షకసంహారక+ ఆదినానారూపంబులన్+ ఉందుదువు= ప్రోచేవాడు; చంపేవాడు-మొదలయిన అనేక ఆకారాలతో నిలుస్తావు; సత్+అసత్కారణకార్య+ ఆత్మకంబు+అయిన= ఉనికి లేమి; కారణం కార్యం ఈ ఆకారంగల; విశ్వంబునకున్= ప్రపంచానికంతా; పరమకారణంబు= ప్రధానహేతువు; నీవు+అ= నీవే; నీ మాయచేతన్= నీ మాయచేత; వీఁడు తానున్+అనియెడు= ఎదుటివాడూ, తాను అనే; బుద్ధివికల్పంబు= బుద్ధిలో భేదం; తోఁచున్+కాని= తలపుకు వస్తుంది; కాని; నీకంటెన్+ఒండు+ఎద్దియున్ లేదు= నీ కంటె భిన్నంగా; మరొకటి ఏదీలేదు; బీజంబునందున్= గింజయందు; వస్తుమాత్ర భూతసౌక్ష్మ్యంబును= వస్తువు పుట్టడానికి అవసరమైన సూక్ష్మశక్తీ; వృక్షంబునందున్= చెట్టులో; నీలత్వ+ఆదివర్ణంబునున్+కలుగు తెఱంగునన్= నలుపు మొదలయిన రంగును కలిగేవిధంగా; విశ్వంబునకు= సమస్త జగత్తుకు; నీ+అంద= నీయందే; జన్మస్థితి ప్రకాశనాశంబులున్= పుట్టుక ఉనికి వృద్ధి చావులు; కలుగున్= ఏర్పడుతాయి; నీ చేతన్+అయిన= నీ వలన పుట్టిన; విశ్వంబు= ప్రపంచం; నీయందు+అ= నీలోనే; నిలుపుకొని= నిలుపుకొంటూ; తొల్లి= పూర్వం; ప్రళయకాల పారావారంబునన్= ప్రళయవేళ సాగరంలో; పన్నగ+ఇంద్రపర్యంకంబునన్= శేషతల్పము పైన; క్రియారహితుండవు+ఐ= నిష్క్రియుండవై; నిజసుఖ+ అనుభవంబు+చేయుచున్= ఆత్మసుఖానుభూతిని పొందుతు; నిద్రితునిభంగిన్= నిద్రించినవాని విధంగ; యోగనిమీలితలోచనుండవు+ఐ= యోగంతో మూసికొన్న కన్నులుగలవాడవై; మెలంగుచున్= ప్రవర్తిస్తూ; కొంతకాలంబునకున్= ఇలా కొంతకాలం గడచిన తర్వాత; నిజకాలశక్తిచేతన్= తన కాలమహిమచే; ప్రేరితంబులు+ఐ= ప్రేరేపింపబడినవై; ప్రకృతితత్త్వంబులు+అయిన= సృష్టిలక్షణాలయిన; సత్త్వ+ఆదిగుణంబులన్+అంగీకరించి= సత్త్వం రజస్సు తమస్సు అనే మూడు గుణాలను స్వీకరించి; సమాధిచాలించి= యోగనిద్ర మాని; వెలుంగుచున్న= ప్రకాశిస్తున్న; నీ నాభియందున్= నీ బొడ్డునందు; వటబీజంబువలనన్+ఉద్భవించు= మఱ్ఱివిత్తనంనుండి పుట్టే; వటంబు తెఱంగునన్= మఱ్ఱివృక్షం వలె; ఒక్క కమలంబు= ఒక్క తామరపువ్వు; సంభవించెన్= పుట్టింది; ఇట్టి కమలంబువలనన్= ఈ తామరపువ్వునుండి; నాల్గుమోముల బ్రహ్మజన్మించి= చతుర్ముఖ బ్రహ్మపుట్టి; దిశలు వీక్షించి= దిక్కులు చూచి; కమలంబునకున్= తామరపువ్వుకు; ఒండు+అయిన= ఇతరమైన; రూపంబు లేకుండటను= వస్తువు లేకపోవటం గూర్చి; చింతించి= ఆలోచించి; జల+అంతరాళంబున్= నీటి లోపలిభాగాన్ని; ప్రవేశించి= దూరి; జలంబులందున్= నీళ్లలో; నూఱు దివ్యవత్సరంబులు వెదకి= వంద దేవసంవత్సరాలు వెదకి; తన జన్మంబునకున్= తనయొక్క పుట్టుకకు; ఉపాదానకారణంబు+ఐన నిన్నున్= ముఖ్యకారణమైన నిన్ను; దర్శింపన్ సమర్థుండు+కాక= చూడశక్తిగలవాడుగాక; మగిడి= తిరిగి; కమలంబు కడకున్+చని= పద్మం వద్దకు వెళ్ళి; విస్మయంబును+ఒంది= ఆశ్చర్యంపొంది; చిరకాలంబు= పెద్దకాలం; నిర్భరతపంబు+చేసి= గొప్పతపస్సుచేసి; పృథివియందున్ గంధంబు+కనుచందంబునన్= భూమిలో గంధమును, దానిలక్షణమును కనుగొన్న విధంగా; తనయందున్= తనయందే; నానా సహస్రవదనశిరో నయన నాసాకర్ణ వక్త్ర భుజకర చరణుండును= అనేక వేల మొగములు, తలలు, కళ్ళు, ముక్కులు, చెవులు, నోళ్ళు, బాహువులు, చేతులు, కాళ్ళుకలవాడును; బహువిధ+ఆభరణుండును= పలు రకాల భూషణాలుగలవాడును;

మాయాకలితుండును= మాయతో కూడినవాడును; మహాలక్షణలక్షితుండును= గొప్ప లక్షణాలతో గుర్తింపబడినవాడు; నిజప్రకాశ దూరీకృతతముండును= తన వెలుగుచేత నశింపజేయబడిన చీకటిగలవాడు; పురుష+ఉత్తముండును=పురుషులలో శ్రేష్ఠుడు; అయిన నిన్నున్= విష్ణువును(నిన్ను); దర్శించెన్= చూచాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** మహానుభావా! సుజన దుర్జనభేదం లేక సేవానురూపంగ నిష్పక్షపాతంగా కల్పతరువువలె ఫలాన్ని ఇస్తావు. మన్మథ ప్రేరితమైన సంసారమనే నూతిలో కూలిపడే మూఢజనులలో ఒకడినైన నేను; నీ భక్తుడయిన నారదముని కృపవల్ల నీ దయకు పాత్రుడినయ్యాను; నన్ను రక్షించడం, నా తండ్రిని చంపడం – ఈ క్రియలు, నీవు నాపై పక్షపాతంతో చేయలేదు; దుష్టరాక్షస సంహారం శిష్టపరిరక్షణం నీకు సహజలక్షణాలు; ఈ ప్రపంచం నీవే. గుణస్వరూపమైన విశ్వాన్ని పుట్టించి, అందు ప్రవేశించి, దానికి హేతుభూతములైన గుణాలతో కూడినవాడవై, రక్షకునిగా సంహారకునిగా నానా ఆకారాలతో విశ్వంలో నిలిచావు. ఈ విశ్వం ఉనికి  కారణం, కార్యం అనే స్వరూపం గలది; అంతటికి పరమకారణం మాత్రం నీవే. లోకానగల భేదభావ సర్వస్వం నీ మాయావిలాసమే. నిజానికి నీవు తప్ప అన్యమేదీ లేదు. విత్తనంలో అతిసూక్ష్మవస్తువైన వృక్షం పెక్కురంగులతో పెరిగినట్లుగా, ఈ విశ్వం వెలుగుతున్నది. దీనికి పుట్టుక ఉనికి, పెరుగుదల, నాశం – ఈ క్రియలన్నీ నీయందే. నీ సృష్టిఅయిన విశ్వం నీయందే ధరించి ప్రళయవేళ సముద్రంపై శేషతల్పంపై క్రియలు ఉడిగి, నిజసహజసుఖానుభూతిలో మునిగి యోగనిమీలిత నేత్రుండవై యుండి, ప్రకృతికి సంబంధించిన సత్త్వం మొదలైన గుణాలను అంగీకరించి సమాధి స్థితిని చాలించావు. నీ నాభిలో మఱ్ఱి విత్తనంనుండి పుట్టిన మఱ్ఱిచెట్టులాగా ఒక పద్మం పుట్టింది.  దానినుండి నాల్గుమోములదేవుడు బ్రహ్మ ఉదయించాడు. అతడు దిక్కులు చూచి, తన జన్మస్థానమైన పద్మంతప్ప, ఇతరవస్తువు ఏదీ కనబడక నీటి లోపలి భాగాన దూరి, నూరు దేవసంవత్సరాలు వెదకి, తన జన్మస్థాన స్థావరమైన నిన్ను చూడజాలక, తిరిగి పద్మం వద్దకు వచ్చి పెక్కుకాలం తపస్సుచేసి భూమిలో గంధలక్షణాన్ని గుర్తించినట్లు, తనయందే వేలకొలది  మొఖాలు, తలలు, కన్నులు, ముక్కులు, చెవులు, నోళ్ళు, భుజాలు, చేతులు కాళ్ళు గలవాడిని, అనేక ఆభరణాలతో ఒప్పేవానిని, మాయతో కూడినవాడిని, గొప్ప లక్షణాలతో గుర్తింపదగినవాడిని తన కాంతితో చీకటినంతా తొలగించేవాడిని పురుషులలో ఉత్తముడైన వాడిని నిన్ను చూచాడు. ఆ సమయంలో.

**క.	ఘోటకవదనుండవై మధు, కైటభులంద్రుంచి నిగమగణముల నెల్లం**
**బాటించి యజున కిచ్చిన, కూటస్థుండ వీశ్వరుండవు! కోవిదవంద్యా!	361**

**ప్రతి :** కోవిదవంద్యా!= పండితులచేత నమస్కరింపబడేవాడా!; ఘోటకవదనుండవు+ఐ= గుఱ్ఱపు మోముగలవాడవై; మధుకైటభులన్= మధువు; కైటభుడు అనేరాక్షసులను; త్రుంచి= చంపి; నిగమగణములను+ఎల్లన్= వేద సమూహాలను అన్నింటినీ; పాటించి= (రక్షించడంద్వారా) గౌరవించి; అజునకున్+ఇచ్చిన= బ్రహ్మకు ఒసగిన; కూటస్థుండవు= పరమాత్మవు; ఈశ్వరుండవు= శక్తిమంతుడవు.

**తా :** పండితులచేత నమస్కరింపబడేవాడా! దేవా! మధుకైటభులు అనే రాక్షసులు వేదాపహరణం చేయగా నీవు హయగ్రీవుడవై వచ్చి వారిని పట్టి వధించి, ఆ వేదాలను తిరిగి బ్రహ్మకర్పించిన వాడవు గదా! పరమాత్ముడవు నీవు.

**వ.	ఇవ్విధంబునం గృత త్రేతా ద్వాపరంబులను మూండు యుగంబులందును దిర్యఙ్మానవ మునిజలచరా కారంబుల నవతరించి లోకంబుల నుద్ధరించుచు హరించుచు యుగానుకూల ధర్మంబులం బ్రతిష్ఠింపుచు నుండుదువు. దేవా! యవధరింపుము.	362**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా, కృత త్రేతాద్వాపరంబులనున్= కృత, త్రేత, ద్వాపరం అనే యుగంబులందును= మూడు యుగాలలో; తిర్యక్+మానవముని జలచర+ఆకారంబులన్= పశు పక్షి మానవ మునిరూపాన, జలచరరూపాలలో; అవతరించి= జన్మించి; లోకంబులన్= లోకులను, ఉద్ధరించుచున్= కాపాడుతూ; హరించుచున్= సంహరిస్తూ; యుగ+అనుకూలధర్మంబులన్= యుగాలకు తగిన ధర్మాలను; ప్రతిష్ఠింపించుచున్= ప్రతిష్ఠింపజేస్తూ, ఉండుదువు= ఉంటావు; దేవా!= నృసింహా! అవధరింపుము= శ్రద్ధగా ఆలకించు.

**తా :** దేవా! ఈ విధంగా కృత త్రేతా ద్వాపరయుగాలలో యథాక్రమంగా పశువుగా, మానవునిగా జలచరంగా అవతరించి లోకుల నుద్ధరిస్తూ, తుదకు సంహరిస్తూ యుగానురూప ధర్మసంస్థాపనం చేస్తున్నావు. శ్రద్ధగా ఆలకించు స్వామీ!

**సీ. కామహర్షాదిసంకలితమై చిత్తంబు భవదీయచింతనపదవి సొరదు,**
**మధురాదిరసముల మరగి చొక్కుచు జిహ్వ నీ వర్ణనమునకు నిగుడనీదు,**
**సుందరీముఖములఁజూడఁగోరుచుఁజూడ్కి తావకాకృతులపైఁదగులువడదు,**
**వివిధదుర్భాషలు వినఁగోరు వీనులు వినవు యుష్మత్కథావిరచనములు,**

**తే. ఘ్రాణ మురవడిఁదిరుగు దుర్గంధములకుఁ, దవులు గొలుపదు వైష్ణవధర్మములకు,**
**నడఁగి యుండవు, కర్మేంద్రియములు పురుషుఁ, గలఁచు సవతులు గృహమేధిఁ గలఁచునట్లు. 363**

**ప్రతి :** చిత్తంబు= మనస్సు; కామహర్ష+ఆది సంకలితమై= కోరికలు సంతోషాలు మొదలైనవాటితో కూడినదై; భవదీయ చింతనపదవి+చొరదు= నీదైన ఆలోచనలదారి తొక్కదు; జిహ్వ= నాలుక; మధుర+ఆదిరసములన్ మరగి చొక్కుచున్= తియ్యని రసాలకు లొంగి తన్మయమౌతూ; నీ వర్ణనమునకున్= నీ పొగడ్తకు; నిగుడన్+ఈదు= విననీయదు; సుందరీ, ముఖములన్+చూడన్+కోరుచున్= అందగత్తెల మోముల చూడ ఇచ్ఛగిస్తూ, చూడ్కి= చూపు; తావక+ఆకృతులపైన్= నీకు జెందిన స్వరూపాలపై; తగులు+పడదు= ఇష్టపడదు; వీనులు= చెవులు; వివిధ దుర్భాషలు, వినన్+కోరున్= పలు చెడుమాటలు వినుటకు కోరును; యుష్మత్+కథావిరచనములు= నీ చరితల విశేషాలు; వినవు= ఆలకించవు; ఘ్రాణము= ముక్కు; ఉరవడి= వేగపడి, తొందరపడి; దుర్గంధములకున్= చెడువాసనలకై; తిరుగున్= పరిభ్రమిస్తుంది; వైష్ణవధర్మములకున్= విష్ణువుకు చెందిన ధార్మిక విషయాలకు; తవులు+కొలుపదు= ఆసక్తి గైకొనదు; కర్మ+ఇంద్రియములు= పనిచేసే ఇంద్రియాలు; పురుషున్= నరుని; సవతులు= సపత్నులు – ఒకరికిమించిన ఇల్లాండ్రు; గృహమేధిన్= గృహస్థుని; కలఁచునట్లు= వేధించునట్లు; కలఁచున్= బాధించును; అడఁగి+ఉండవు= లోబడి ఉండవు.

**తా :** దేవా! మనస్సు కోరికలు సంతోషాలలో మునిగి నీ చింతనకు యత్నించదు; నాలుక తియ్యనైన రుచికరమైనవాటికి మరగి, నీ కీర్తనకు పాల్పడదు; కన్ను సుందరాంగుల ముఖమును జూస్తుందేకాని, నీ స్వరూపాలను చూడటానికి ఇష్టపడదు; చెవులు చెడుమాటలు వినగోరుతుంది తప్ప నీ కథలను గాదు; ముక్కు దుర్వాసనలకై పరుగెడుతుందేకాని; వైష్ణవధర్మ సుగంధాలకు (ప్రాణాయామాది క్రియలకు) పాల్పడదు. ఈ విధంగా ఈ కర్మేంద్రియాలన్నీ, సవతులు గృహస్థుని వేధించినట్లు వేధిస్తాయే తప్ప, అతనికి (నరునికి) లొంగి ఉండవు.

**వ. ఇవ్విధంబున నింద్రియంబులచేతం జిక్కువడి స్వకీయ పరకీయ శరీరంబులందు మిత్రామిత్ర భావంబులు సేయుచు జన్మమరణంబుల నొందుచు సంసారవైతరణీ నిమగ్నం బయిన లోకంబు నుద్ధరించుట**

**లోకసంభవ స్థితిలయకారణుండవైన నీకుం గర్తవ్యంబు, భవదీయ సేవకుల మయిన మా యందుం బ్రియభక్తులయిన వారల నుద్ధరింపుము. 364**

**ప్రతి :** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ఇంద్రియంబులచేతన్= ఇంద్రియాల చేతిలో; చిక్కు+పడి= చిక్కి; స్వకీయ పరకీయ శరీరంబులందున్= స్వపరశరీరాలలో; మిత్ర+అమిత్రభావంబులు+చేయుచున్= శత్రుమిత్రభావాలను– యథాక్రమంగా అనగా తనదానిలో మిత్ర్వత్వం; ఇతరుల దానిలో శత్రుత్వం, చేస్తూ; జన్మమరణంబులన్+ఒందుచున్= చావుపుట్టుకలను పొందుతూన్న; సంసార వైతరిణీ నిమగ్నంబు+అయిన= కుటుంబమనే వైతరణిలో మునిగిన; లోకంబును= ప్రజలను; ఉద్ధరించుట= కాపాడుట; లోకసంభవ స్థితిలయకారణుండవైన= లోకాలపుట్టుక ఉనికి లయాలకు మూలమైన; నీకున్+కర్తవ్యంబు= నీకు చేయవలసిన పని; భవదీయ సేవకులమయిన= నీ దాసులమైన; మాయందున్= మాలో; ప్రియభక్తులయిన వారలన్+ఉద్ధరింపుము= ఇష్టమైన భక్తులను రక్షింపుము.

**తా :** నరుడు ఈ విధంగా తన ఇంద్రియాల వల్ల చిక్కులు పొందుతూ తన శరీరాన్ని అభిమానిస్తూ పరశరీరాలతో పగపెట్టుకొని, పుడుతూ, చస్తూ, సంసారమనే వైతరణిలో మునిగి ఉన్నాడు. ఈ లోకాల పుట్టుక, ఉనికి, లయాలకు హేతుభూతువైన నీవే రక్షకుడవు కావలసి ఉన్నది. ఈ సంసారమనే వైతరణినుండి నీ సేవకులమైన మాలో నీకు ప్రియభక్తులను ఉద్ధరించు.

**విశే :** వైతరణి నరకలోక ద్వారాలముందు జుగుప్సాకరంగా రక్తంతో పొంగి పొరలే నది.

**మ. భగవద్దివ్యగుణానువర్తన సుధాప్రాప్తైకచిత్తుండనై**
**బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్, భిన్నాత్ములై తావకీ**
**యగుణస్తోత్రపరాఙ్ముఖత్వమున మాయాసౌఖ్యభావంబులన్**
**సుగతింగానని మూఢులన్ గని మదిన్ శోకింతు సర్వేశ్వరా! 365**

**ప్రతి :** సర్వ+ఈశ్వరా!= అంతటికీ ఏలికా!, అంతటిని ఏలేవాడా!; భగవత్= భగవంతుని; దివ్యగుణ+అనువర్తన సుధా = దివ్యమైన గుణాల కీర్తనామృతపు; ప్రాప్త+ఏకచిత్తుండను+ఐ= ప్రాప్తికొరకై ఏకాగ్రమైన మనస్సుగలవాడనై; సంసరణ+ఉగ్రవైతరణికిన్= సంసారమనే భయంకర వైతరణీనదికి; బెగడన్= భయపడను; భిన్న+ఆత్ములై= అన్యాసక్తమైన మనస్సులు గలవారై; తావకీయ గుణ= నీవైన గుణాలు; స్తోత్ర పరాఙ్ముఖత్వమునన్= పొగడ్తలకు విముఖమై, వ్యతిరేక భావంతో; మాయా సౌఖ్యభావంబులన్= అబద్ధపు సుఖభావనలతో; సుగతిన్= మోక్షాన్ని; కానని మూఢులన్+కని= చూడజాలని మూఢులను చూచి; మదిన్ శోకింతున్= మనస్సున ఏడుస్తాను.

**తా :** దేవా! భగవంతుని దివ్యనామ సంకీర్తనమనే అమృతపుధారలతో మనసు పండిన నేను, ఘోరమైన వైతరణికి భయపడను; కాని, లోకంలో మూఢులు అబద్ధపు, అశాశ్వత సుఖాలకు లొంగి, నీ సంకీర్తనకూ, ముక్తిమార్గానికీ దూరంగా ఉన్నారు. వారికోసం నా మనస్సు శోకిస్తున్నది!

**విశే :** లోకంలో అందరూ తమకోసం తాము లోలోపల దుఃఖిస్తూ బాధపడుతారుగాని, అందరూ బాగుపడలేదే అనే ఉదార, విశాలహృదయంతో ప్రవర్తించడం లేదు. ప్రహ్లాదుడు ఇటువంటి **'ఉదారచరితానాం తు వసుధైవ కుటుంబకమ్'** అనే విశ్వజనీన హృదయం కలవాడు కనుకనే పరమ భాగవతుల్లో మొట్టమొదటివాడుగా పరిగణింపబడ్డాడు.

**వ. దేవా! మునీంద్రులు నిజవిముక్తి కాములయి విజనస్థలంబులం దపంబు లాచరింతురు, కాముకత్వంబు నొల్లక యుండువారికి నీ కంటె నొండు శరణంబు లేదు, గావున నిన్ను సేవించెదఁ, గొందఱు కాముకులు కరద్వయ కండూతి చేతం దనియని చందంబునఁ దుచ్ఛంబయి పశుపక్షి క్రిమికీట సామాన్యం బయిన మైథునాది గృహమేధి సుఖంబులం దనియక కడపట నతిదుఃఖవంతు లగుదురు, నీ ప్రసాదంబు గల సుగుణుండు నిష్కాముండయి యుండు, మౌనవ్రత జపతపశ్శ్రుతాధ్యయనంబులును, నిజధర్మవ్యాఖ్యాన విజనస్థలనివాస సమాధులును, మోక్షహేతువులగు, నైన నివి పదియు నింద్రియ జయంబు లేని వారికి, భోగార్థంబు లయి విశ్రమించు వారికి జీవనోపాయంబు లయి, డాంబికులకు వార్తాకరంబులయి యుండు, సఫలంబులు గావు, భక్తిలేక భవదీయజ్ఞానంబు లేదు, రూపరహితుండవైన నీకు బీజాంకురంబుల కైవడిఁ గారణకార్యంబు లయిన సదసద్రూపంబులు రెండును బ్రకాశ మానంబులగు, నా రెంటియందును భక్తియోగంబున బుద్ధిమంతులు మథనంబున దారువులందు వహ్నిం గనియెడు తెఱంగున నిన్నుఁ బొడగందురు, పంచభూత తన్మాత్రంబులును, ఘ్రాణేంద్రియంబు లును, మనోబుద్ధ్యహంకార చిత్తంబులును నీవ, సగుణంబును నిర్గుణంబును నీవ, గుణాభిమానులయిన జన్మమరణంబుల నొందు విబుధు లాద్యంతంబులు గానక నిరుపాధికుండవైన నిన్నెఱుంగరు, తత్త్వజ్ఞు లయిన విద్వాంసులు వేదాధ్యయనాది వ్యాపారంబులు మాని వేదాంత ప్రతి పాద్యుండవగు నిన్ను సమాధివిశేషంబుల నెఱింగి సేవింతు, రది గావున. 366**

**ప్రతి :** దేవా! ముని+ఇంద్రులు= ఋషిశ్రేష్ఠులు; నిజ విముక్తికాములు+అయి= తమ విమోచనను కోరువారై (ముముక్షువులై), విజనస్థలంబులన్= నిర్జనములైన ఏకాంతస్థలాలలో; తపంబులు+ఆచరింతురు= తపస్సుచేయుదురు; కాముకత్వంబును+ ఒల్లక+ఉండువారికి= కోర్కెలకు లొంగక ఉన్నవారికి; నీ కంటెన్= నీకు భిన్నమైన; ఒండు శరణంబు లేదు= మరొక దిక్కులేదు. కావునన్= కాబట్టి; నిన్నున్ సేవించెదన్= నిన్ను కొలుస్తాను; కొందఱు కాముకులు= కొందరు కోర్కెలకు లొంగినవారు; కరద్వయకండూతిచేతన్+తనియని= చేతుల జంట తీటచేత తృప్తిపడని; చందంబునన్= విధంగా; తుచ్ఛంబు+అయి= హీనమై; పశు పక్షిక్రిమికీటక సామాన్యంబయిన= పశువులు పక్షులు పురుగులు వీటికీ సమానమైన, మైథున+ఆది గృహమేధి సుఖంబులన్= సంభోగం మొదలయిన గృహస్థ సుఖాలతో; తనియక= తృప్తిపడక; కడపటన్= చివరకు; అతిదుఃఖవంతులు+అగుదురు= మిక్కిలి దుఃఖం గలవారౌతారు; నీ ప్రసాదంబు+కల సుగుణుండు= నీ దయగల సద్గుణుడు; నిష్కాముండయి= కోరిక లేనివాడై; ఉండున్= జీవిస్తాడు; మౌనవ్రతం= మాట్లాడకుండా ఉండే బ్రహ్మచర్య వ్రతం; జప= మంత్రజపాలు; తపస్= తపస్సు; శ్రుత= శాస్త్రశ్రవణం; అధ్యయనంబులు= వేదాధ్యయనం; నిజధర్మ= తమ ధర్మాలను; వ్యాఖ్యాన= వివరిస్తూ (శాస్త్రమననం); విజనస్థలనివాస= ఏకాంతంలో చేస్తూ; సమాధులును= సమాధులను పొందుట; ఈ పదీ; మోక్షహేతువులు+అగున్= ముక్తికి కారణాలు అవుతాయి; ఐనన్+ఇవిపదియున్= ఐతే, ఈ పదిగూడ; ఇంద్రియ జయంబులేని వారికిన్= జితేంద్రియులుగానివారికి; భోగ+అర్థంబులు+అయి= భోగాలు తీర్చేవై; విశ్రమించువారికిన్= విశ్రమించేవారికి; జీవన+ఉపాయంబులయి= బ్రతుకు తెరువులై; డాంబికులకున్= దంబాచారులకు; వార్తా కరంబులు+అయి+ఉండును= ప్రసిద్ధిని కలిగించునవై ఉంటాయి; సఫలంబులు+కావు= ప్రయోజన వంతంగావు; భక్తిలేక= భగవద్భక్తి లేకుండ; భవదీయజ్ఞానంబు= నీదైన జ్ఞానం; లేదు= ఉండదు; రూపరహితుండవైన నీకున్= ఆకారంలేనివాడైన నీకు; బీజ+అంకురంబులకైవడిన్= విత్తు మొలకలవలె; కారణ కార్యంబులు+అయిన= కలిగించునది

కలిగినది అయిన; సత్+అసత్ రూపంబులు రెండును= ఉన్న లేని ఆకారాలు రెండూ; ప్రకాశమానంబులు+అగున్= వ్యక్తమవుతాయి; ఆ రెంటి యందును= ఆ రెండు రూపాలలోను; భక్తియోగంబునన్= భక్తిమార్గం ద్వారా, బుద్ధిమంతులు= పండితులు; మథనంబునన్= మథించుటవలన; దారువులందున్= కొయ్యలందు; వహ్నిన్+కనియెడు తెఱంగునన్= నిప్పును పొందేటట్లు; నిన్నున్+పొడగందురు= నిన్నుచూస్తారు; పంచభూత తన్మాత్రంబులును= పంచభూతాల ధర్మాలు–శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఐదూ, ప్రాణ+ఇంద్రియంబులును= ప్రాణము, ఐదు ఇంద్రియాలూ, మనస్+బుద్ధి+అహంకార చిత్తంబులును= మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం ఈ నాల్గూ; నీవు+అ= నీవే; సగుణంబును, నిర్గుణంబును, నీవ= గుణాత్మకాలు, గుణరహితాలు రెండూ నీవే; గుణ+అభిమానులు+అయిన= సగుణత్వంపై శ్రద్ధగల, జన్మమరణంబులన్+ ఒందువిబుధులు= పుట్టుక చావులను పొందే పండితులు; ఆది+అంతంబులు+కానక= మొదలు చివర తెలియక; నిర్+ఉపాధికుండవైన= ఉపాధి (ఆకారం)లేని; నిన్నున్+ఎఱుంగరు= నిన్ను తెలియలేరు; తత్త్వజ్ఞులు+అయిన విద్వాంసులు= తత్త్వమెరిగిన పండితులు; వేద+అధ్యయన+ఆదివ్యాపారంబులు మాని= వేదాధ్యయనం మొదలైన కార్యాలు మానుకొని; వేద+అంతప్రతిపాద్యుండవు+అగు= ఉపనిషత్తులు ప్రతిపాదించేవాడవైన; నిన్నున్= నిన్ను; సమాధివిశేషంబులన్= విశిష్టమైన యోగధ్యానాదుల ద్వారా; ఎఱింగి= గ్రహించి; సేవింతురు= కొలుస్తారు; అది+కావున్= విషయ మదికాబట్టి...

**తా :** శ్రీహరీ! తమ ముక్తి కోరి, మునీశ్వరులు కొందరు ఏకాంతస్థలాలలో తపస్సులు చేస్తారు. అయితే కోరికలే లేనివారికి నీవే శరణం. కొందరు నరులు కామప్రకోపంతో, చేతిదురదలు గోకే కొద్దీ పెరిగినట్లు, తుచ్ఛమైన పశువుల్లాగా, పక్షుల్లాగా, క్రిముల్లాగా, కీటకాల్లాగా తమ మైథునక్రీడలతో గృహస్థ మాత్రజీవనంతో తృప్తిచెందక, కామేచ్ఛ పెరిగి పెరిగి చివరకు అతి దుఃఖభాజనమైన జీవనాన్ని సాగిస్తారు. నీ దయగల సజ్జనుడు కామపీడకు లోనుగాక జీవిస్తాడు. మౌనం, బ్రహ్మచర్యవ్రతం, జపం, తపం, శాస్త్రశ్రవణం, వేదాధ్యయనం, స్వధర్మానుష్ఠానం, శాస్త్రాన్ని మననంచేయడం, ఏకాంతవాసం, సమాధిస్థితి అనే ఈ పదీ మోక్షకారణాలు. అయితే ఇవే ఇంద్రియజయం లేనివారికి భోగంకోసమే విశ్రమించేవారికి కేవలం జీవనోపాయాలు కాగలవు. ఇవే డాంబికులకు ప్రసిద్ధిహేతువులూ అవుతాయి. వారికి అవి నిష్ఫలాలే! భక్తిలేక భగవద్జ్ఞానం గలుగదు. ఆకారం లేని నీకు విత్తనం, మొలకవలె కారణం, కార్యం అయిన సదసద్రూపాలు రెండూ ఉన్నాయి. ఆ రెంటినుండి భక్తియోగంతో బుద్ధిమంతులు దారువును మథించి అగ్నిని బొందినట్లు, నిన్ను గ్రహిస్తారు. నరుని సకలప్రవృత్తికి మూలమైన పంచభూతాలు, తన్మాత్రులు, పంచప్రాణాలు, పంచేంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం నీవే. నీవు కానిది ఏదీ సృష్టిలో లేదు. సగుణ నిర్గుణాలు రెండూ నీవే. సాకారాన్ని అభిమానిస్తూ జననమరణాలు పొందే పండితులు నీ ఆద్యంతాలు తెలుసుకోలేక పరమాత్ముడవైన నిన్ను గ్రహించలేరు. తత్త్వజ్ఞానులైన విద్వాంసులు వేదాధ్యయనం మొదలైన కృత్యాలు మాని ఉపనిషత్తులలో ప్రతిపాద్యుడవైన నిన్ను యోగధ్యానాది సమాధినిష్ఠలతో తెలుసుకొని సేవిస్తారు. అందువల్ల...

**విశే :** **"భక్తి లేక భవదీయ జ్ఞానంబులేదు"** అని ప్రహ్లాదుడు భాగవతపురాణ మర్మాన్ని ఒక్కమాటలో సంక్షిప్తంగా వ్యక్తీకరించాడు. భాగవతం 'భక్తి'కి పట్టాభిషేకం చేసిందనడానికి ప్రహ్లాదుడే సాక్షి!

**సీ. నీ గృహాంగణభూమి నిటలంబు మోవంగ మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని,**
**నీ మంగళస్తవనికరవర్ణంబులు పలుమాఱు నాలుకఁబలుకఁడేని,**
**నీ యధీనములుగా నిఖిలకృత్యంబులు ప్రియభావమున సమర్పింపఁడేని,**
**నీ పదాంబుజముల నిర్మలహృదయుఁడై చింతించి మక్కువఁజిక్కఁడేని.**

**తే.** **నిన్నుఁజెవులార వినఁడేని, నీకు సేవ, సేయ రాఁడేని బ్రహ్మంబు జెందఁగలఁడె?**
**యోగియైనఁదపోవ్రతయోగియైన, వేదియైన మహాతత్త్వవేదియైన.** **367**

**ప్రతి :** యోగి+ఐనన్= యోగం నేర్చినవాడైనా; తపస్+వ్రతయోగి+ఐనన్= తపస్సు అనే; వ్రత= జీవనంతో; యోగిఐనన్= యోగిఅయినా; వేది+ఐనన్= తెలిసినవాడైనా; మహాతత్త్వవేది+ఐనన్= గొప్ప తత్త్వజ్ఞానం ఎరిగినవాడైనా; నీ గృహ+ అంగణభూమిన్= నీ ఆలయ ప్రాంగణస్థలాన; నిటలంబు= నొసలు; మోవంగన్= తాకేటట్టు; నిత్యంబు= సదా; మోదించి= సంతోషించి; మ్రొక్కఁడు+ఏని= నమస్కరించకపోతే; నీ మంగళస్తవ నికరవర్ణంబులు= నీ శుభస్తోత్ర సమూహంలోని అక్షరాలు; పలుమాఱు= పెక్కు పర్యాయాలు; నాలుకన్= జిహ్వతో; పలుకఁడు+ఏనిన్= పలుకని వాడైతే; నీ+అధీనములుగాన్= నీకు సమ్మతమైన; నిఖిలకృత్యంబులు= అన్నిపనులు; ప్రియభావమునన్= ప్రేమతో; సమర్పింపఁడు+ఏని= (నీకు) ఇవ్వనివాడైతే; నీ పద+అంబుజములన్= నీ పాద పద్మాలను; నిర్మల హృదయుఁడు+ఐ= మాలిన్యంలేని మనస్సు గలవాఁడై; చింతించి= మననం చేసి, తలచి; మక్కువన్= ప్రేమలో; చిక్కఁడు+ఏని= మునిగిపోనివాడైతే; నిన్నున్= నిన్ను; చెవులు+ఆరన్+ వినఁడు+ఏని= నీ కీర్తనలు చెవులనిండ విననివాఁడైతే; నీకున్+సేవ+చేయన్+రాఁడు+ఏని= నీకు కొలువక రానట్టయితే; బ్రహ్మంబున్= పరబ్రహ్మన్ని; చెందన్+కలఁడె!= పొందగలడా? (పొందలేడు).

**తా :** నిత్యం సంతోషంతో వచ్చి, నీ ఆలయ ప్రాంగణాన్ని నొసటితో తాకి నీకు మొక్కకపోతే, నీ స్తోత్రంలోని అక్షరాలు, పలుపర్యాయాలు తన నాల్కతో పల్కనట్టయితే, తన పనుల నన్నింటిని ప్రేమతో నీకు సమర్పించినట్టయితే, నీ పాదధ్యానంతో నిర్మలమనస్కుడై నీ మీది ప్రేమలో పడిపోనిచో, నీ స్తుతులు చెవులార వినకపోతే, నీ సేవకోసం రానట్టయితే, వాడు యోగి అయినా, మహాతత్త్వజ్ఞానియైనా, తపస్సు వ్రతాలు ఆచరించినవాడైనా, వేదాలు చదివినవాడైనా, పరబ్రహ్మను చేరగలడా? చేరలేడని భావం.

**విశే :** 'భక్తి' అనే భావన మనస్సులో లేకుండా ఎంతటి గొప్పవారైనా బ్రహ్మైక్యం పొందడం సాధ్యంకాదు. వారు యోగులైనా/ తపోవ్రత యోగులైనా, వేదియైనా, మహాతత్త్వవేదియైనా వారికి మోక్షంలేదని ప్రహ్లాదుని నిష్కర్ష.

**వ.** **కావున భవదీయ దాస్యయోగంబు కృపసేయు మని ప్రణతుండైన ప్రహ్లాదుని వర్ణనంబులకు మెచ్చి నిర్గుణుండైన హరి రోషంబు విడిచి యిట్లనియె.** **368**

**ప్రతి :** కావునన్= కాబట్టి; భదీయదాస్యయోగంబు= నీ సేవాభాగ్యం; కృప+చేయుము+అని= అనుగ్రహించు అని; ప్ర+నతుండైన= మిక్కిలి నమస్కరించినవాడైన; ప్రహ్లాదుని వర్ణనంబులకున్‌మెచ్చి= భక్తుని పొగడ్తకు సంతోషించి; నిర్గుణుండు+ఐన హరి= నిర్వికారుడైన విష్ణువు; రోషంబు విడిచి= క్రోధం వదలి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** కాబట్టి అన్నింటా ఉచితమైన నీ దాస్యభాగ్యాన్ని ప్రసాదించమని నమస్కరించిన ప్రహ్లాదుని స్తుతులకు మెచ్చి నిర్గుణుడైన విష్ణువు క్రోధం మాని ఇలా అన్నాడు.

**విశే :** ప్రహ్లాదుడు నరసింహస్వామిని 'దాస్యయోగం' ప్రసాదించమని ప్రార్థించాడు. 'దాస్యయోగ' మంటే జీవితాంతం నిత్య కైంకర్యం. 'కైంకర్య భక్తి'. వీరు సామీప్య, సాలోక్యముక్తులనే వైకుంఠంలోను కోరుకొంటారు తప్ప 'సాయుజ్యం' కాదు. శ్రీవైష్ణవులందరూ ఈ విధమైన ముక్తినే కోరుకుంటారు.

**శా. సంతోషించితి నీ చరిత్రమునకున్, సద్భద్ర మౌఁగాక !నీ**
**యంతర్వాంఛితలాభ మెల్లఁ గరుణాయత్తుండనై యిచ్చెదం?**
**జింతంజెందకు, భక్తకామదుఁడ నే, సిద్ధంబు దుర్లోక్యుఁడన్,**
**జంతుశ్రేణికి నన్నుఁజూచినఁబునర్జన్మంబు లే దర్భకా! 369**

**ప్రతి :** అర్భకా!= బాలకా! నీ చరిత్రమునకున్= నీ నడతకు; సంతోషించితిన్= ఆనందించాను; సత్+భద్రము+ఔన్+కాక!= మంచి శుభం కలుగు గాక!; నీ+అంతర్వాంఛిత లాభము+ఎల్లన్= నీ మనోవాంఛిత ఫలితమంతా; కరుణా+ ఆయత్తుండను+ఐ= కృపకులొంగినవాడినై; ఇచ్చెదన్; చింతన్+చెందకు= విచారించకు; నేన్= నేను; భక్తకామదుఁడన్= భక్తుల కోర్కెలు ఇచ్చేవాడను; దుర్+లోక్యుఁడన్= చూడరాని (భయంతో) వాడను; సిద్ధంబు= వాస్తవం; జంతుశ్రేణికిన్= ప్రాణికోటికి; నన్నున్+చూచినన్= నన్ను చూస్తే; పునర్+జన్మంబు= మరల పుట్టుట; లేదు= ఉండదు.

**తా :** బాలకా! నీ నడత నాకు సంతోషకరం; నీకు శుభమౌగాక! నీవు తలంచిన కోర్కెలన్నీ కృపతో తీర్చగలను. విచారించకు; నేను భయంకరుడనైనా భక్తులకు వరదుడనే. నిజమే. నన్ను చూడటం కష్టమే. అయితే నన్ను చూచిన ప్రాణికోటికి ముక్తి లభిస్తుంది.

**విశే :** సర్వధర్మాలను వదిలి నన్నే శరణుపొందినవాడిని సర్వపాపాలనుండి విముక్తుణ్ణి చేసి ఉద్ధరిస్తాను – అని గీతలో శ్రీకృష్ణభగవానుడు అభయమిచ్చాడు.

**ఆ. సకలభావములను సాధులు విద్వాంసు, లఖిల భద్రవిభుఁడ నైన నన్నుఁ**
**గోర్కు లి మ్మటంచుఁగోరుదు, రిచ్చెదఁ, గోరు మెద్దియైనఁ గుఱ్ఱ! నీవు. 370**

**ప్రతి :** కుఱ్ఱ!= అర్భకా!; సకలభావములను= ఎల్లవిధాల; సాధులు= సజ్జనులు; విద్వాంసులు= పండితులు; అఖిల భద్రవిభుఁడను+ఐన నన్నున్= ఎల్లశుభాలకు అధిపతినైన నన్ను; కోర్కులు+ఇమ్ము+అటంచున్= కోర్కెలు తీర్చుమంటూ, కోరుదురు= అర్థిస్తారు; ఎద్ది+ఐనన్= ఏదైనా; నీవు= నీవూ; కోరుము= అడుగు; ఇచ్చెదను= అన్నీ ఇస్తాను.

**తా :** బాలకా! అన్నివిధాల విద్వాంసులు సజ్జనులు, ఎల్లశుభాలకు ఏలికనైన నన్ను తమ కోర్కె లీడేర్చమని అర్థిస్తారు. నీవూ ఏదైనా కోరు; తప్పక ఇస్తాను.

**వ. అని పరమేశ్వరుండు ప్రహ్లాదునియందుఁ గల సకామత్వంబుఁ దెలియు కొఱకు వంచించి యిట్లానతిచ్చిన నతండు నిష్కాముండైన యేకాంతి గావునఁ గామంబు భక్తియోగంబునకు నంతరాయం బని తలంచి యిట్లనియె, నుత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తి గల నాకు వరంబు లిచ్చెద నని వంచింప నేల? సంసార బీజంబునకు హృదయ బంధకంబు లయిన కామంబులకు వెఱచి ముముక్షుండనై సేమంబు కొఱకు నేమంబున నిన్నుం జేరితిఁ, గామంబులును, నింద్రియంబులును, మనశ్శరీర ధైర్యంబులును, మనీషాప్రాణ ధర్మంబులును, లజ్జాస్మరణ లక్ష్మీసత్య తేజో విశేషంబులును, నశించు; లోకంబులందు భృత్యు లర్థకాములయి రాజుల సేవింతురు, రాజులుం బ్రయోజనంబు లర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదు, రవ్విధంబునం గాదు, నాకుం గామంబు లేదు, నీకుం బ్రయోజనంబు లే, దయినను దేవా! వరదుఁడ**

**వయ్యెద వేనిఁ గామంబులు వృద్ధిబొందని వరంబు కృపసేయుము, కామంబులు విడిచిన పురుషుండు నీతోడ సమాన విభవుం డగు, నరసింహ! పరమాత్మ! పురుషోత్తమ! యని ప్రణవ పూర్వకంబుగా నమస్కరించిన హరి యిట్లనియె.** **371**

**ప్రతి :** అని= పైవిధంగా పలికి; పరమ+ఈశ్వరుండు= నృసింహస్వామి; ప్రహ్లాదుని యందున్+కల= ప్రహ్లాదునిలో ఉన్న; సకామత్వంబున్= కోర్కెలుకోరుతున్న భావాన్ని; తెలియుకొఱకున్= ఎరుగుటకై; వంచించి= మభ్యపెట్టి; ఇట్లు+ఆనతి+ఇచ్చినన్= ఇట్లు సెలవీయగా; అతండున్= భక్తుడైన ప్రహ్లాదుడు; నిష్కాముండు+ఐన= కోర్కెలులేని; ఏకాంతి+కావునన్= ఏకాంతభక్తి కలవాడుకనుక; కామంబు= కోర్కె; భక్తియోగంబునకున్= భక్తిసాధనకు; అంతరాయంబు+అని తలంచి= విఘ్నం అవుతుందని ఆలోచించి; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు; ఉత్పత్తి మొదలు= పుట్టినప్పటినుండి;కామ+ఆది+అనుభవ+ఆసక్తి+ కలనాకున్= కోర్కెలు మొదలయినవానిని తీర్చుకొనుటలో ప్రీతిగల నాకు; వరంబులు+ఇచ్చెదన్+అని= వరాలు ఇస్తాను అని; వంచింపన్+ఏల?= మోసగించటం ఎందుకు? సంసారబీజంబునకున్= సంసారమనే విత్తుకు; హృదయబంధకంబులు+ అయిన= మనస్సును కట్టివేసే; కామంబులకున్= కోర్కెలకు, వెఱచి= భయపడి; ముముక్షుండను+ఐ= మోక్షాన్ని కోరేవాఁడినై; సేమంబుకొఱకున్= క్షేమం కొరకు; నేమంబునన్= నియమంతో; నిన్నున్+చేరితిన్= నిన్ను ఆశ్రయించాను. కామంబులును= కోర్కెలూ; ఇంద్రియంబులును= ఇంద్రియాలూ; మనస్+శరీరధైర్యంబులును= మనస్సు; దేహధైర్యాలూ, మనీషాప్రాణ ధర్మంబులును= బుద్ధి, ప్రాణం, ధర్మాలూ, లజ్జా= సిగ్గు; స్మరణ= స్మృతి; లక్ష్మీ= భాగ్యం; సత్య= సత్యం; తేజస్+విశేషంబులును= గొప్ప తేజస్సులూ; నశించున్= నాశంపొందుతాయి; లోకంబులందున్= లోకాలలో; భృత్యులు+ సేవకులు, అర్థకాములు+అయి= సంపదవంటి ప్రయోజనాలు కోరేవారై; రాజులన్= అధిపతులను; సేవింతురు= కొలుస్తారు; రాజులుం= రాజులు గూడ; ప్రయోజనంబులు+అర్థించి= లాభాలు కోరి; భృత్యులకున్= సేవకులకు; అర్థంబులు+ ఒసంగుదురు= ధనాలు ఇస్తారు. ఆ+విధంబునన్+కాదు= ఆ పద్ధతితో గాదు; నాకున్+కామంబు లేదు= నాకు కోర్కె లేదు; నీకున్+ప్రయోజనంబు లేదు= నీకూ లాభం లేదు; అయిననున్= అయినా; దేవా!= నృసింహా! వరదుఁడవు+ అయ్యెదవు+ఏనిన్= వరమిచ్చేవాడివైతే; కామంబులు= కోర్కెలు; వృద్ధి+పొందని= పెరుగని; వరంబుకృప+చేయుము= వరాన్ని అనుగ్రహించు; కామంబులు విడిచిన పురుషుండు= కోర్కెలు వదలిన నరుడు; నీ తోడన్= నీతో; సమానవిభవుండు+అగున్= సమానమైన సంపత్తిగలవాడవుతాడు; నరసింహ!= నృసింహస్వామీ; పరమ+ఆత్మ= పరమాత్మా!; పరబ్రహ్మ!= పరబ్రహ్మ స్వరూపుడా!; పురుష+ఉత్తమ!= పురుషులలో శ్రేష్ఠుడా!; అని; ప్రణవపూర్వకంబుగా= ఓంకారంతో కలిపి ఓం నరసింహ! అని; నమస్కరించినన్= వందన మాచరించగా; హరి= నృసింహస్వామి; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు;

**తా :** ఆ ప్రకారంగా దేవుడు భక్తునిలోగల కోర్కె తెలిసికొనుటకై, అతనిని వంచిస్తూ పలికాడు. ప్రహ్లాదుడు కామరహితుడు, ఏకాంత భక్తుడు కాబట్టి కోర్కె భక్తికి భంగకరమని భావించి దేవునితో, “పుట్టిన దాదిగా కోర్కె లీడేర్చుకొనుటలో ప్రీతిగల నాకు వరం ఇస్తానని మోసగించు టెందుకు? సంసార బీజానికి ఆదికారణమైన కామాలకు భీతిల్లి ముక్తి గోరి క్షేమార్థినై నియమవర్తినై నిన్ను ఆశ్రయించాను. కోర్కెలు, వాటి మూలాలయిన ఇంద్రియాలు, మనశ్శరీరాది సర్వవిశేషాలు, బుద్ధి ప్రాణధర్మాలు, సిగ్గు, తలపు, సంపద, సత్యం, తేజస్సు మున్నగునవి నశిస్తాయి. లోకాల్లో సేవకులు ధనకాంక్షతో రాజను సేవిస్తే, వారు స్వప్రయోజనార్థులై వారికి ధనాలు అర్పిస్తారు. ఆ విధంగా వద్దు. నాకు కోర్కె లేదు; నీకూ ప్రయోజనం

లేదు; అయినా నృసింహా! నాకు వర మియ్యదలిస్తే, కోర్కెలు పెరగని వర మివ్వు. నిష్కాముడయిన నరుడు, నీకు సమానుడౌతాడు. ఓం నృసింహా! ఓం పరమాత్మ! ఓం పురుషోత్తమా!" అని నమస్కరించగా అతనితో దేవుడిట్లన్నాడు.

**విశే :** ప్రహ్లాదుడు చివరి ఘట్టంలో కూడ భగవంతుడు పెట్టిన పరీక్షలోనెగ్గి 'ఏకాంతి' (విష్ణువునందు అనన్యభక్తి, ఆత్యంతిక, పరమైకాంత భక్తిగలవాడు) కాబట్టి కామం భక్తియోగానికి అంతరాయమని నిశ్చయించి **'కామంబులు వృద్ధిపొందని వరము కృప చేయుము"** అని కోరడం పరమైకాంత భక్తికి పరమ చరమోదాహరణ.

**సీ. నీయట్టి సుజ్ఞాననిపుణు లేకాంతులు గోర్కులు నాయందుఁగోర నొల్ల,**
**రట్లైనఁబ్రహ్లాద! యసురేంద్రభర్తవై సాగి మన్వంతరసమయ మెల్ల,**
**నిఖిలభోగంబులు నీవు భోగింపుము, కల్యాణబుద్ధి నా కథలు వినుము,**
**సకలభూతములందు సంపూర్ణుఁడగు నన్ను యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి**

**ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన మాచరింపు మీశ్వరార్పణముగ,**
**భోగముల నశించుఁబుణ్యంబు, వ్రతములఁబాపసంచయములు పాయు నిన్ను. 372**

**ప్రతి :** నీ+అట్టి= నీలాంటి; సుజ్ఞాన నిపుణులు= మంచి జ్ఞానంలో నేర్పరులు; ఏకాంతులు= ఒంటరివారు; కోర్కులు= వాంఛలు; నా+అందున్= నా నుండి; కోరన్+ఒల్లరు= కోరను ఇష్టపడరు; అట్లు+ఐనన్= అలాగైతే; ప్రహ్లాద!= భక్తుడా! అసుర+ఇంద్రభర్తవు+ఐ= రాక్షస చక్రవర్తివై; సాగి= జీవించి, మను+అంతర సమయము+ఎల్లన్= మన్వంతరం వరకు ఎల్లకాలం; డెబ్బది ఒక్క దివ్యయుగాలు; నీవు= నీవు; నిఖిలభోగంబులు= ఎల్లవైభవాలూ; భోగింపుము= అనుభవించు; కల్యాణబుద్ధిన్= శుభకరబుద్ధితో; నా కథలు= నా చరితలు; వినుము= ఆలకించు; సకలభూతములందున్= అన్ని ప్రాణులలో; సంపూర్ణుఁడు+అగు= నిండినవాడనైన; నన్నున్= నన్ను; యజ్ఞ+ఈశున్= యాగాల అధిపతిని; ఈశ్వరున్= శక్తిమంతుని; ఆత్మన్= మనస్సులో; నిలిపి= ఉంచి; కర్మచయములు+ఎల్లన్+ఖండించి= కర్మలన్నింటిని నరికి; పూజనము= అర్చనను; ఈశ్వర+అర్పణముగన్= దేవునకు అర్పించినట్లుగా; ఆచరింపుము= చేయి; భోగములన్= భోగాలవల్ల; పుణ్యంబు నశించున్= పుణ్యం తీరిపోతుంది; పాప సంచయములు= పాపాలప్రోగులు; వ్రతములన్= వ్రతాచరణవలన; నిన్ను= నీనుండి; పాయున్= విడిపోతుంది.

**తా :** ప్రహ్లాదా! నీవంటి జ్ఞానులు నా నుండి వరాలను ఆశించరు. అయితే, నీవు రాక్షసచక్రవర్తిగా డెబ్బైఒక్క దివ్యయుగాలు అనగా మన్వంతరం వరకు భోగాలు అనుభవించు; నా (హరి) శోభనబుద్ధితో; అన్నింటా నిండిన నన్ను సకలేశ్వరుని, మనస్సులో నిలిపి నిష్కాముడవై, భగవదర్పణబుద్ధితో పూజలు చేయి. భోగాల అనుభవాలవలన పుణ్యం నశిస్తుంది. వ్రతాలు ఆచరించు; దానివలన పాపాలు నశిస్తాయి.

**వ. మఱియు నటమీఁదఁ గాలవేగంబునం గళేబరంబు విడిచి త్రైలోక్య విరాజమానంబును, దివిజరాజజేగీయ మానంబును బరిపూరిత దశదిశంబును నైన యశంబుతోడ ముక్తబంధుండవై నన్ను డగ్గఱియెదవు. వినుము. 373**

**ప్రతి :** మఱియున్= ఇంక; అటమీఁదన్= ఆపైన; కాలవేగంబునన్= వేగంగా కాలం తిరుగగా; కళేబరంబు= శరీరం; విడిచి= వదలి; త్రైలోక్య విరాజమానంబును= ముల్లోకాలలో వెలుగొందేదీ; దివిజరాజజేగీయమానంబును= దేవేంద్రునిచేత

ప్రశంసింపబడేదీ; పరిపూరిత దశదిశంబును+ఐన= నిండిన పదిదిక్కుల్లో వ్యాపించినదీఐన; యశంబుతోడన్= కీర్తితో; ముక్తబంధుండవు+ఐ= బంధాలు తెంచుకొని; నన్నుడగ్గఱియెదవు= నన్ను సమీపిస్తావు; వినుము= ఇంకా విను.

**తా :** ఆ మీద, కాలవేగానికి లోనై శరీరపతనం జరిగిన తరువాత, ముల్లోకాల్లో వెలిగే, దేవేంద్రునిచే కీర్తింపబడే, పదిదిక్కుల వ్యాపించిన సత్కీర్తితో పాటుగా బంధాలు తెగి, నన్ను చేరగలవు. ఇంకా విను.

**ఆ. నరుఁడు ప్రియముతోడ నా యవతారంబు, నీ యుదారగీతనికరములును**
**మానసించునేని మఱి సంభవింపఁడు, కర్మబంధచయముఁగడచిపోవు. 374**

**ప్రతి :** నరుఁడు= మానవుడు; ప్రియముతోడన్= ప్రీతితో; నా+అవతారంబున్= నా (నృసింహ) అవతారకథను; ఈ ఉదారగీత నికరములును= ఈ గొప్ప గానకథావళులను; మానసించును+ఏని= మనస్సు కెక్కించుకొంటే; మఱి= మళ్ళీ; సంభవింపఁడు= పుట్టడు; కర్మబంధ చయమున్= కర్మ బంధనాల సమూహాన్నికూడ; కడచిపోవున్= దాటిపోతాడు.

**తా :** మనుష్యుడు ప్రీతితో నా యీ నృసింహావతార వృత్తాంతాన్ని, ఇందలి ఇతర ఆధ్యాత్మికాంశాలను మనస్సు కెక్కించుకొన్నట్లయితే, అతనికి పునర్జన్మ ఉండదు. కర్మబంధాలు అన్నీ దాటి ముక్తికి చేరుకుంటాడు.

**విశే :** నృసింహావతార కథా తత్త్వాన్ని, సంపూర్ణంగా ఆకళించుకొన్నావాడు సకలకర్మబంధాలనుండి విడుదలను పొందుతాడు.

**వ. అనినఁబ్రహ్లాదుం డిట్లనియె. 375**

**ప్రతి :** అనినన్= అని నృసింహస్వామిపలుకగా; ప్రహ్లాదుండు+ఇట్లనియెన్= భక్తుడైన ప్రహ్లాదుడు ఇలా అన్నాడు.

**తా :** అని నృసింహుడు పలుకగా, ప్రహ్లాదుడు ఇలా బదులు చెప్పాడు.

**సీ. దంష్ట్రివై తొల్లి సోదరుని హిరణ్యాక్షు నీవు చంపుటఁజేసి నిగ్రహమున**
**మా తండ్రి రోషనిమగ్నుఁడై సర్వలోకేశ్వరుఁబరము నిన్నెఱుఁగ లేక**
**పరిపంథిపగిది నీ భక్తుండనగు నాకు నపకారములు సేసె; నతఁడు నేఁడు**
**నీ శాంతదృష్టిచే నిర్మలత్వము నొందెఁ, గావునఁబాపసంఘుంబువలనఁ**

**తే. బాసి శుద్ధాత్మకుఁడు గాఁగ భవ్యగాత్ర!, వరము వేఁడెద నా కిమ్ము వనజనేత్ర!**
**భక్తసంఘాతముఖపద్మపద్మమిత్ర! భక్తకల్మషవల్లికాపటులవిత్ర! 376**

**ప్రతి :** వనజనేత్ర= పద్మనయనా! తొల్లి= ముందు; దంష్ట్రివి+ఐ= వరాహానివై సోదరునిన్= సహోదరుడైన; హిరణ్య+అక్షున్= హిరణ్యాక్ష పేరుగలవాడిని; నీవు చంపుటన్+చేసి= నీవు వధించటంవలన; నిగ్రహమునన్= నిరోధంతో; మా తండ్రి= నా తండ్రి; రోషనిమగ్నుఁడై= క్రోధంలో మునిగి; సర్వ+లోక+ఈశ్వరున్= ఎల్లలోకాలు ఏలే; పరమున్= పరదేవతను, నిన్ను+ఎఱుఁగలేక= నిన్ను గ్రహింప జాలక; పరిపంథిపగిదిన్= విరోధివలె; నీభక్తుండను+అగునాకున్= నీ భక్తిలో మునిగిననాకు; అపకారములు+చేసెన్= చెడులు చేస్తాడు; నేఁడు= ఈనాఁడు; అతఁడు= ఆ రాక్షసరాజు; నీ శాంత దృష్టిచేన్= శాంతించిన నీ చూపుతో; నిర్మలత్వమున్+ఒందెన్= పాపరహితుడయ్యేడు; కావునన్= కాబట్టి; భవ్యగాత్ర!= శుభశరీరా! దేవా!; పాపసంఘుంబువలనన్= పాపాలప్రోగులనుండి; పాసి= విడివడి; శుద్ధ+ఆత్మకుఁడుకాఁగన్=

నిర్మలమనస్కుడయేట్లు; వరమున్+వేఁడెదన్= వరాన్ని కోరుతాను, నాకున్+ఇమ్ము= నాకు ఇవ్వు; భక్తసంఘాత ముఖపద్మ పద్మమిత్ర!= భక్తులశ్రేణుల మోము తామరలకు సూర్యుడా!; భక్తకల్మషవల్లికాపటులవిత్ర!= భక్తుల పాపాలు అనే తీగలకు గొప్పకొడవలి వంటివాడా!

**తా :** పద్మాక్ష! పూర్వం నీవు నా తండ్రికి సోదరుడైన హిరణ్యాక్షుని వరాహావతారంతో వధించావు. ఆ కోపంతో మా తండ్రి సర్వేశ్వరుడవైన నిన్ను గ్రహించలేక నీకు విరోధిగా మారి; నీ భక్తుడినైన నాకు అపకారం చేశాడు. అయినా అతడు నేడు నీ శాంత దృష్టిచే నిర్మలుడైనాడు. కనుక నాతండ్రి సకలపాపాలనుండి విముక్తుడై శుద్ధాత్ముడయ్యేట్లుగా నాకు వరమిమ్ము. భక్తుల ముఖపద్మాలకు భాస్కరుని వంటివాడా! వారి పాపాల తీగలకు గొప్పకొడవలి వంటివాడా! మంగళకరమైన శరీరంగలవాడా! దేవా! నీకు నమస్కారములు.

**వ. అనిన భక్తవత్సలుం డిట్లనియె. 377**

**ప్రతి :** అనినన్= అని ప్రహ్లాదుడు పలుకగా; భక్తవత్సలుండు= శ్రీనృసింహభగవానుడు; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** అని ప్రహ్లాదుడు పలుకగా, భక్తవత్సలుడైన నృసింహస్వామి ఇలా అన్నాడు.

**మ. నిజభక్తుండవు నాకు, నిన్నుఁగనుటన్ నీ తండ్రి త్రిస్సప్త పూ**
**ర్వజులంగూడి పవిత్రుఁడై శుభగతిన్ వర్తించు, విజ్ఞాన దీ**
**ప జితానేకభవాంధకారు లగు మద్భక్తుల్ వినోదించు దే**
**శ జనుల్ దుర్జనులైన శుద్ధులు సుమీ! సత్యంబు దైత్యోత్తమా! 378**

**ప్రతి :** దైత్య+ఉత్తమా!= రాక్షసశ్రేష్ఠా! నాకున్+నిజభక్తుండవు= నాకు నిజమైన భక్తుడివి; నిన్నున్+కనుటన్= నిన్ను చూడడంవల్ల; నీ తండ్రి= హిరణ్యకశిపుడు; త్రిః+సప్తపూర్వజులన్+కూడి= మూడుచే గుణించబడ్డ ఏడుగురు (21) ఇరువయ్యొక్కతరాల పూర్వపురుషులతో కలిసి; పవిత్రుఁడై= పరిశుద్ధుడై; శుభగతిన్= క్షేమమార్గాన; వర్తించున్= ప్రవర్తిల్లును; విజ్ఞానదీప= జ్ఞానమనే దీపంచే; జిత+అనేకభవ+అంధకారులు+అగు= అనేక జన్మాంధకారాలను జయించిన; మద్భక్తుల్= నా భక్తులు; వినోదించు దేశజనుల్= సంతోషిస్తూ ఉండే దేశంలోని ప్రజలుకూడా; దుర్జనులు+ఐనన్= దుష్ట జనులైనా; శుద్ధులు సుమీ!= పవిత్రులే సుమా! సత్యంబు= ఇది నిజం.

**తా :** రాక్షసశ్రేష్ఠా! నీవు నాకు నిజమైన భక్తుడవు; అట్టి నిన్ను గన్న నీ తండ్రి, ఇరువదొక్కతరాల తన పూర్వులందరితో పాటుగా పవిత్రుడై శుభమార్గాన ప్రవర్తిస్తాడు. అంతేకాదు; జ్ఞానదీప్తులతో తమ పూర్వజన్మల పాపాల చీకట్లు పారద్రోలిన నా భక్తులు నడిచే దేశాలలోని చెడ్డవాళ్లైనా మంచివాళ్లే అవుతారు! ఇది సత్యం.

**సీ. ఘనసూక్ష్మభూతసంఘాతంబులోపల నెల్లవాంఛలు మాని యెవ్వ రయిన**
**నీ చందమున నన్ను నెఱయ సేవించిన మద్భక్తు లగుదురు, మత్పరులకు**
**గుఱిసేయ నీవ యోగ్యుఁడ వైతి, విటమీఁద వేదచోదితమైన విధముతోడఁ**
**జిత్తంబు నామీఁదఁజేర్చి మీ తండ్రికిఁ బ్రేతకార్యములు సంప్రీతిఁజేయు**

**తే. మతఁడు రణమున నేఁడు నా యంగమర్శ, నమున నిర్మలదేహుఁడై నవ్యమహిమ**
**నపగతాఖిలకల్మషుఁడై తనర్చి, పుణ్యలోకంబులకు నేఁగుఁబుణ్యచరిత! 379**

**ప్రతి :** పుణ్యచరిత= పవిత్రమైన నడతగలవాడా! ఘన= పెద్ద; సూక్ష్మ= చిన్న; భూత సంఘాతంబులోపలన్= ప్రాణిసమూహం లోపల; ఎల్లవాంఛలున్= అన్నికోర్కెలను; మాని= వదలి; ఎవ్వరైనన్= ఏ ఒక్కరైనా; నీ చందమునన్= నీ విధంగా; నెఱయన్= ప్రకాశింపగా; నన్నున్ సేవించినన్= నన్ను కొలిచినచో; మద్భక్తులు+అగుదురు= నా భక్తులు కాగలరు; మత్+పరులకున్= నా భక్తులకు; గుఱి+చేయన్= లక్ష్యమైన వాడినిగా చేయటానికి; నీవ= నీవే; యోగ్యుఁడవు+ఐతివి= తగినవాడివి అయినావు; ఇటమీఁదన్= ఇక ముందు; వేదచోదితమైన విధముతోడన్= వేదంచే ప్రేరేపింపబడ్డ రీతిలో; చిత్తంబున్= మనస్సును; నా మీఁదన్= నాపై; చేర్చి= నిలిపి; మీ తండ్రికిన్; ప్రేత+కార్యములు= మరణానంతర అంత్యక్రియలు; సంప్రీతిన్= ప్రేమతో; చేయి; అతఁడురణమునన్= ఆతడు యుద్ధంలో; నేఁడు= ఈనాడు; నా అంగమర్శనమునన్= నా శరీర స్పర్శతో; నిర్మలదేహుఁడు+ఐ= పవిత్ర శరీరుడై; నవ్యమహిమన్= కొత్తగొప్పతనంతో; అపగత+అఖిల కల్మషుఁడు+ఐ= తొలగిన అన్ని పాపాలు గలవాడై; తనర్చి= ఒప్పి; పుణ్యలోకంబులకున్= పవిత్ర లోకాలకు; ఏఁగున్= వెళ్తాడు.

**తా :** సచ్చరిత్రా! ప్రహ్లాదా! సృష్టిలోని పెద్ద చిన్న ప్రాణులన్నింటా ఎవరు కోర్కెలు మాని నీవలె నన్ను కొలుస్తారో, వారు నాకు భక్తులు. నా భక్తులకు ఆదర్శంగా నీవు నిలిచావు. ఇకపై, వేదోక్తంగా, నాపై మనసుపెట్టి, నీ తండ్రికి అపరకర్మలు భక్తిశ్రద్ధలతో నిర్వహించు. అతడు; యుద్ధంలో నా శరీరస్పర్శకారణంగా శుద్ధశరీరుడై నూతన మహిమతో అతని పాపాలన్నీ నశించి, పుణ్యలోకాలకు చేరుకుంటాడు.

**వ. అని యిట్లు నరసింహదేవుం డానతిచ్చిన హిరణ్య కశిపునకుం బ్రహ్లాదుండు పరలోక క్రియలు సేసి భూసురోత్తములచేత నభిషిక్తుం డయ్యె, నయ్యెడం బ్రసాద సంపూర్ణ ముఖుండైన శ్రీ నృసింహదేవునిం జూచి దేవతా ప్రముఖ సహితుండైన బ్రహ్మదేవుం డిట్లనియె. 380**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; నరసింహదేవుండు= నృసింహుడు; ఆనతిన్+ఇచ్చినన్= ఆజ్ఞాపింపగా; హిరణ్యకశిపునకున్= తన తండ్రికి; ప్రహ్లాదుండు= ప్రహ్లాదుడు; పరలోకక్రియలు= ఇతరలోకం కొరకు తగిన పనులు; చేసి; భూసుర+ఉత్తములచేతన్= బ్రాహ్మణశ్రేష్ఠులచేత; అభిషిక్తుండు+అయ్యెన్= రాజ్యానికి పట్టాభిషేకం చేయబడిన వాఁడు అయినాడు; ఆ+ఎడన్= ఆ సమయంలో; ప్రసాద సంపూర్ణముఖుండు+ఐన నృసింహదేవునిన్+చూచి= అనుగ్రహంతో నిండిన ముఖం గలవాడైన నరసింహుని చూచి; దేవతాప్రముఖ సహితుండైన= దేవతలలో శ్రేష్ఠులతో కూడినవాడైన; బ్రహ్మదేవుండు= బ్రహ్మ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తా :** ఈ విధంగా నృసింహుడు ఆజ్ఞాపించగా ప్రహ్లాదుడు తన తండ్రికి అపరకర్మలుచేసి, అనంతరం బ్రాహ్మణోత్తములచేత రాజ్యానికి పట్టాభిషిక్తుడైనాడు; అపుడు దయా పరిపూర్ణుడయిన నృసింహస్వామిని, ప్రముఖదేవతా పరివృతుండైన బ్రహ్మ సమీపించి ఇలా అన్నాడు.

**సీ. దేవ దేవాఖిలదేవేశ! భూతభావన! వీఁడు నాచేత వరము వడసి**
**మత్సృష్టజనులచే మరణంబు నొందక మత్తుఁడై సకలధర్మములుఁజెఱచి**

**నేఁడు భాగ్యంబున నీచేత హతుఁడయ్యెఁ, గల్యాణ మమరె లోకముల కెల్ల,**
**బాలు నీతని మహాభాగవతశ్రేష్ఠుఁబ్రదికించితివి మృత్యుభయముఁబాపి**

**తే. వరము కృప సేసితివి మేలు వారిజాక్ష! నీ నృసింహావతారంబు నిష్ఠతోడఁ**
**దగిలి చింతించువారలు దండధరుని, బాధ నొందరు, మృత్యువు బారిఁబడరు. 381**

**ప్రతి :** దేవ దేవ+అఖిలదేవ+ఈశ= సమస్త దేవతలకు దేవుడవైన నృసింహా! భూతభావన= ప్రాణులకు కారణమైనవాడా! వీఁడు= ఈ–రాక్షసుడు; నా చేతన్+వరము+పడసి= నా నుండి వరంపొంది; మత్+సృష్టజనులచేన్= నాచే సృష్టించబడిన వారిచేత; మరణంబును+ఒందక= చావును పొందక; మత్తుఁడు+ఐ= మదించినవాడై; సకలధర్మంబులున్= ఎల్ల ధర్మములను; చెఱచి= చెడగొట్టి; నేఁడు= ఈనాడు; భాగ్యంబునన్= అదృష్టం చేత; నీ చేతన్+హతుఁడయ్యెన్= నీ చేత చనిపోయిననాడు; లోకములకున్+ఎల్లన్= ఎల్లలోకాలకు; కల్యాణము+అమరెన్= శుభము కలిగింది; బాలున్= పిల్లవాడైన; ఈతనిన్= ఇతనిని; మహాభాగవతశ్రేష్ఠున్= గొప్పభక్తులలో శ్రేష్ఠుని; మృత్యుభయమున్+పాపి= మరణభీతిని తొలగించి; బ్రదికించితివి= బతికించావు; వరము కృప+చేసితివి= వరాన్ని దయచేసావు; మేలు= శుభం; వారిజాక్ష!= తామరల వంటి కన్నులుగలవాడా! నీ నృసింహ+అవతారంబున్= నీ యీ నరసింహావతారకథను; నిష్ఠతోడన్= నియమంతో; తగలి= ఇష్టపడి; చింతించువారలు= మననం చేసేవారు; దండధరుని బాధను= యముని బాధను; ఒందరు= పొందరు; మృత్యువు బారిన్+పడరు= మరణంపాలిట పడరు.

**తా :** నృసింహదేవా! వీడు ఈ రక్కసుడు నానుండి వరం గ్రహించి, నాచే సృష్టింపబడిన వారెవరిచేతను మృత్యుభయం లేనివాడై మదోన్మత్తుడై, ఎల్లధర్మాలు చెడగొట్టి నేటికి నీచేత నిహతుడైనాడు, లోకాలకు అన్నింటికీ నేడు శుభం చేకూరింది. ఈ బాలుడు మహాభాగవత శిరోమణి. ఇతడిని మృత్యుభయం నుండి విముక్తుని చేసి బ్రతికించావు! వరమూ ఒసగినావు. దేవా! ఈ నృసింహావతార కథను మననం చేసేవారు యముని పాలిట పడరు; వారికి మృత్యుభయమూ కలుగదు.

**వ. అనిన నరసింహదేవుండిట్లనియె. 382**

**ప్రతి :** అనినన్= అని బ్రహ్మదేవుడు పలుకగా; నరసింహదేవుండు= నరసింహస్వామి; ఇట్లు+అనియెన్= ఇలాగన్నాడు.

**తా :** బ్రహ్మ మాటలకు నృసింహుడు ఇలా బదులు పలికాడు.

**క. 'మన్నించి దేవశత్రుల, కెన్నఁడు నిటువంటి వరము లీకుము, పాపో**
**త్పన్నులకు వరము లిచ్చుట, పన్నగముల కమృత మిడుట పంకజగర్భా!' 383**

**ప్రతి :** పంకజగర్భా!= తామరపువ్వు గర్భంలో జన్మించిన బ్రహ్మదేవా! మన్నించి= గౌరవించి; ఎన్నఁడున్= ఎప్పుడూ! ఇటువంటి వరములు= ఇలాంటి వరాలు; దేవశత్రులకున్= రాక్షసులకు; ఈకుము= ఇయ్యవద్దు; పాప+ఉత్పన్నులకున్= పాపంనుండి పుట్టినవారికి; వరములు+ఇచ్చుట; పన్నగములకున్= పాములకు; అమృతము+ఇడుట= అమృతం ఇవ్వటంవంటిది.

**తా :** బ్రహ్మదేవా! ఇకమీద ఎప్పుడూ రాక్షసులకు ఇటువంటి వరాలు ఇయ్యబోకు; పాపాత్ములకు వరముల దానమంటే, పాములకు అమృతదానం వంటిదే సుమా!

**వ. అని యిట్లానతిచ్చి బ్రహ్మాదిదేవతా సమూహంబుచేఁ బూజితుండై భగవంతుండైన శ్రీనృసింహదేవుండు తిరోహితుండయ్యె!, బ్రహ్లాదుండును శూలికిఁ బ్రణమిల్లి తమ్మిచూలికి వందనంబులు సేసి ప్రజాపతులకు మ్రొక్కి భగవత్కళలైన దేవతలకు నమస్కరించినం జూచి బ్రహ్మదేవుండు శుక్రాది మునీంద్ర సహితుండై దైత్య దానవ రాజ్యంబునకుం బ్రహ్లాదుం బట్టంబు గట్టి యతనిచేతఁ బూజితుండై దీవించె, అంత నీశానాది నిఖిలదేవతలు వివిధంబులగు నాశీర్వాదంబులచేత నా ప్రహ్లాదునిఁ గృతార్థుం జేసి తమ్మిచూలిని ముందట నిడుకొని నిజస్థానంబులకుఁ జని, రిట్లు విష్ణుదేవుండు నిజపార్శ్వచరు లిరువురు బ్రాహ్మణ శాపంబునం జేసి ప్రథమజన్మంబున దితిపుత్రులైన హిరణ్యాక్షహిరణ్యకశిపులను వరాహనారసింహ రూపంబుల నవతరించి వధియించె, ద్వితీయ భవంబున రాక్షసజన్మంబు దాల్చిన రావణకుంభకర్ణులను శ్రీరామ రూపంబున సంహరించెఁ దృతీయ జన్మంబున శిశుపాల దంతవక్త్రులను పేరులం ప్రసిద్ధి నొందిన వారలను శ్రీకృష్ణ రూపంబున ఖండించె, నివ్విధంబున మూఁడు జన్మంబుల గాఢ వైరానుబంధంబున నిరంతర సంభావితధ్యానులై వారలు నిఖిలకల్మషవిముక్తులై హరింగదిసి, రని చెప్పి నారదుండిట్లనియె. 384**

**ప్రతి :** అని ఇట్లు+ఆనతి+ఇచ్చి= అని ఈ విధంగా ఆజ్ఞనిచ్చి; బ్రహ్మ+ఆదిదేవతా సమూహంబుచేన్= బ్రహ్మమొదలయిన దేవతల గుంపుచేత; పూజితుండై= పూజింపబడి; భగవంతుండు+ఐన= భగవానుడైన; శ్రీ నృసింహదేవుండు= నరసింహుడు; తిరోహితుండయ్యెన్= మాయమైనాడు; ప్రహ్లాదుండును= ప్రహ్లాదుడు; శూలికిన్= శంకరునికి; ప్రణమిల్లి= నమస్కరించి; తమ్మిచూలికిన్= బ్రహ్మకు; వందనంబులు+చేసి= ప్రణామాలుచేసి; ప్రజాపతులకు మ్రొక్కి= ప్రజాపతులకు నమస్కరించి; భగవత్+కళలు+ఐన= భగవంతుని అంశాలైన; దేవతలకు; నమస్కరించినన్+చూచి= నమస్కరించగా చూచి; బ్రహ్మదేవుండు శుక్ర+ఆది ముని+ఇంద్రసహితుండు+ఐ= శుక్రాచార్యుడు మొదలయిన మునిశ్రేష్ఠులతో కూడి; దైత్యదానవ రాజ్యంబునకున్= రాక్షసుల రాజ్యానికి; ప్రహ్లాదున్+పట్టంబు+కట్టి= ప్రహ్లాదుని పట్టాభిషిక్తునిజేసి; అతనిచేతన్= ఆ పట్టాభిషిక్తుడైన ప్రహ్లాదునిచే; పూజితుండు+ఐ= పూజింపబడిన; దీవించెన్= ఆశీర్వదించాడు; అంతన్= ఆపైన; ఈశాన+ఆది నిఖిలదేవతలున్= శంకరుడు మొదలయిన దేవతలందరు; వివిధంబులగు= అనేకవిధాలయిన; ఆశీర్వాదంబులచేతన్= దీవెనలతో; ఆ ప్రహ్లాదునిన్+ కృత+అర్థున్ చేసి= ఆ ప్రహ్లాదుని, నెరవేరిన ప్రయోజనం గలవానిగాచేసి; తమ్మిచూలిని ముందటన్+ఇడుకొని= బ్రహ్మను ముందు నిలుపుకొని; నిజస్థానంబులకున్+చనిరి= తమలోకాలకు వెళ్ళారు. ఇట్లు, విష్ణుదేవుండు= ఇలాగ విష్ణుభగవానుడు; నిజపార్శ్వచరులు+ఇరువురు= తన ప్రక్క నడచు సేవకులు ఇద్దరు; బ్రాహ్మణశాపంబునన్+చేసి= సనకసనందనుల శాపంవలన; ప్రథమజన్మంబునన్= మొదట్టి పుట్టుకలో; దితిపుత్రులయిన= దితికొడుకులయిన; హిరణ్యాక్ష; హిరణ్యకశిపులను= ఆ పేర్లుగలవారిని; వరాహనారసింహ రూపంబులన్= వరాహ; నృసింహ ఆకారాలతో; అవతరించి= దిగి (భువినుంచి); వధియించెన్= చంపాడు; ద్వితీయభవంబునన్= రెండవపుట్టుకలో; రాక్షసజన్మంబున్+తాల్చిన= రాక్షసులై పుట్టిన; రావణ కుంభకర్ణులను; శ్రీరామరూపంబునన్= శ్రీరాముని రూపంతో; సంహరించెన్= చంపాడు; తృతీయజన్మంబునన్= మూడవ పుట్టువులో; శిశుపాల దంతవక్త్రులనుపేరులన్= ఆ యా పేరులతో; ప్రసిద్ధిని+ఒందిన= ప్రఖ్యాతిని పొందిన; వారలను= వారిని; శ్రీకృష్ణరూపంబునన్= శ్రీకృష్ణుని ఆకారంతో; ఖండించెన్= నరికాడు; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; మూఁడు జన్మంబులన్= మూడు పుట్టువులలోను; గాఢవైర+అనుబంధంబునన్= గట్టి వైరపు సంబంధంతో; నిరంతర సంభావితధ్యానులై= ఎల్లపుడు ఏర్పడిన ధ్యానంగలవారై; వారలు= ఆ ఇద్దరు పార్శ్వచరులు; నిఖిలకల్మష విముక్తులై= ఎల్ల

పాపాలనుండి విడివడినవారై; హరిన్+కదిసిరి= విష్ణువును చేరారు; అని చెప్పి= అని చెబుతూ; నారదుండు+ఇట్లు+అనియెన్= నారదుడు ఇంకా ఇలా అన్నాడు.

**తా :** ఆ విధంగా ఆజ్ఞాపించి, బ్రహ్మాది దేవతల పూజలు స్వీకరించి, దేవుడు నృసింహుడు మాయమయ్యాడు; ప్రహ్లాదుడు శంకరునికి, బ్రహ్మదేవునికి, ప్రజాపతులకు, ఇతర దేవతలకు వరుసగా నమస్కరించాడు. అపుడు బ్రహ్మ, శుక్రాచార్యుడు మొదలయిన మునులతో కలసి యావద్రాక్షస రాజ్యానికి ప్రహ్లాదుణ్ణి పట్టాభిషిక్తుని జేసి, అతనిచే పూజలందుకొని, అతనిని దీవించాడు. ఆ తరువాత శంకరాది సర్వదేవతలు పలువిధాల ప్రహ్లాదుని దీవించి, బ్రహ్మను ముందుంచుకొని తమ తమ స్థానాలయిన లోకాలకు మరలి వెళ్ళారు. ఈ విధంగా విష్ణువు, తన పార్శ్వచరులిద్దరు, సనకసనందనుల శాపవశాన, మొదటి జన్మలో హిరణ్యాక్ష హిరణ్యకశిపులనే రాక్షసులుగా జన్మించగా, వారిని వరాహ నరసింహ అవతారాలు ఎత్తి సంహరించాడు; రెండవ జన్మలో వారు, రావణ కుంభకర్ణులనే దైత్యులుగా జన్మించగా, శ్రీరాముడై వారిని వధించాడు; మూడోజన్మలో శిశుపాల దంతవక్త్రులను పేరులతో జన్మించగా, వారిని శ్రీకృష్ణుడై చంపాడు. ఇట్లా మూడు జన్మలలో గట్టి ద్వేషానుబంధంతో, నిరంతరం శ్రీహరి ధ్యానమగ్నులై వారు పాప విముక్తులై తిరిగి హరిని చేరారు అని వివరించి నారదుడు ఇంకా ఇలా అన్నాడు.

**విశే :** హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణకుంభకర్ణులు, శిశుపాలదంతవక్త్రులు వీరందరూ 'వైరభక్తి'కి ప్రకృష్టోదాహరణులు. **"గాఢవైరానుబంధంబున నిరంత సంభావిత ధ్యానులై"** ఆ విష్ణుమూర్తి చేతనే **'నిఖిలకల్మష విముక్తు'**లైనారు.

**ఉ.** **శ్రీరమణీయమైన నరసింహవిహారము నింద్రశత్రు సం**
**హారముఁబుణ్యభాగవతుఁడైన నిశాచరనాథపుత్ర సం**
**చారము నెవ్వఁడైన సువిచారత విన్నఁబఠించినన్ శుభా**
**కారముతోడ నే భయముఁగల్గని లోకముఁజెందు భూవరా!** **385**

**ప్రతి :** భూవరా! = ఓ రాజా! శ్రీ రమణీయమైన= వెలుగులతో అందమైన; నరసింహ విహారము= నృసింహుని సంచారం; ఇంద్రశత్రు సంహారమున్= రాక్షసుని మరణం; పుణ్యభాగవతుఁడైన= పవిత్ర భగవద్భక్తుడైన; నిశాచరనాథపుత్ర సంచారమున్= రాక్షసరాజు తనయుని (ప్రహ్లాదుని) చరితను; ఎవ్వఁడు+ఐనన్= ఏ నరుడైనా; సువిచారతన్= మంచి ఆలోచనతో; విన్నన్+పఠించినన్= విన్నా; చదివినా; శుభ+ఆకారముతోడన్= క్షేమకరమైన స్వరూపంతో; ఏ భయమున్+కల్గని లోకమున్= ఏ భీతీ పుట్టని లోకాన్ని; చెందున్= పొందుతాడు.

**తా :** రాజా! ఈ సుందరమైన నృసింహ వృత్తాంతాన్ని, రాక్షస సంహారాన్ని, మహాభాగవతశిరోమణి అయిన ప్రహ్లాదుని చరిత్రను, ఎవ్వడైనా, నిర్మల మనస్కుడై విన్నా, చదివినా, అతడు భయంలేని లోకానికి చేరగలడు.

**మ.** **జలజాతప్రభవాదులున్ మనములోఁజర్చించి భాషావళిం**
**బలుకన్ లేని జనార్దనాహ్వయపరబ్రహ్మంబు నీ యింటిలోఁ**
**జెలియై మేనమఱందియై సచివుఁడై చిత్తప్రియుండై మహా**
**ఫలసంధాయకుఁడై చరించుటలు నీ భాగ్యంబు రాజోత్తమా!** **386**

ప్రతి : రాజ+ఉత్తమ! = రాజశ్రేష్ఠా!; జలజాత ప్రభవ+ఆదులున్= పద్మంనుండి పుట్టిన బ్రహ్మమొదలైన వారును; మనములోన్= మనస్సున; చర్చించి= వాదించి; భాషా+ఆవళిన్= మాటల్లో; పలుకన్‌లేని= చెప్పలేని; జన+అర్దన+ఆహ్వాయ, పరబ్రహ్మంబు= జనార్దనుడు అనే పరమాత్మ; నీ+ఇంటిలోన్= నీ యింటన్; చెలి+ఐ= స్నేహితుడై; మేన మఱంది+ఐ= శరీర సంబంధంతో; మరిదియై; సచివుఁడై= మంత్రాంగం నడుపువాడై; చిత్తప్రియుండు+ఐ= మనస్సునకు ఇష్టుడై; మహాఫల సంధాయకుఁడు+ఐ= గొప్ప ప్రయోజనాన్ని కల్పించేవాడై; చరించుట= తిరుగాడటం; నీ భాగ్యంబు= నీ అదృష్టం.

తా : రాజశ్రేష్ఠా! బ్రహ్మాది దేవతలు గూడ తమ మనస్సులలో తర్కించి-'ఇది యిట్టిది' అని మాటలలో చెప్పజాలని పరబ్రహ్మస్వరూపమే శ్రీకృష్ణుడు. అతడు నీ యింట నీకు స్నేహితుడుగా, మేనమరిదిగా, మంత్రాంగం నెరపే అమాత్యుడుగా, మనఃప్రియుడుగా, మహాప్రయోజన సంధాతగా మెలగటం నీ అదృష్ట విశేషం!

## ❖ త్రిపురాసుర సంహారము ❖

**క. బహుమాయుఁడైన మయుచే, విహతంబగు హరుని యశము విఖ్యాత జయా**
**వహముగ నీ భగవంతుఁడు, మహితాత్ముఁడు ము న్నొనర్చె మనుజవరేణ్యా! 387**

ప్రతి : మనుజవరేణ్యా= మానవోత్తమా! బహుమాయుఁడు+ఐన= అనేక మాయలుగల; మయుచేన్= మయునిచేత; విహతంబు+అగు= నశింపజేయబడిన; హరుని యశమున్= శివునికీర్తిని; విఖ్యాత జయ+ఆవహముగన్= దిగ్విజయంగా; మహిత+ఆత్ముఁడు= పూజ్యమనస్కుడు; ఈ భగవంతుఁడు= ఈ దేవదేవుడు; మున్ను+ఒనర్చెన్= పూర్వం చేసాడు.

తా : రాజా! పూర్వం, మాయావి ఐన మయునివల్ల శివునికీర్తికి భంగం కలిగింది. అపుడు విష్ణుదేవుడు ఆ భంగపాటును పోగొట్టి జయావహంగా కీర్తికి వన్నె తెచ్చాడు.

విశే : మయుడు – కశ్యపప్రజాపతికి ధనువుకు పుట్టినవాడు రాక్షసశిల్పి.

**వ. అనిన ధర్మనందనుం డిట్లనియె. 388**

ప్రతి: అనినన్= అని నారదుడు పలుకగా; ధర్మనందనుండు= ధర్మరాజు (యముని కొడుకు); ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

తా : అని నారదమహర్షి పలుకగా ధర్మరాజు ఇలా అన్నాడు.

**క. ఏ కర్మంబున విభుఁ డగు, శ్రీ కంఠుని యశము మయునిచే సుడివడియెన్?**
**వైకుంఠుఁడెవ్విధంబునఁ, గైకొని తత్కీర్తి చక్కఁగా నొనరించెన్? 389**

ప్రతి : ఏ కర్మంబునన్= ఏ పనివలన; విభుఁడగు= ప్రభుడైన; శ్రీకంఠుని యశము= శివునికీర్తి; మయునిచేన్= మయునిచేత; సుడివడియెన్= భంగమొందింది? వైకుంఠుఁడు= విష్ణువు; ఏ+విధంబునన్= ఏ రీతిగా; కైకొని= స్వీకరించి; తత్కీర్తి= అతని యశాన్ని; చక్కఁగాన్ ఒనరించెన్= బాగుచేసెను.

తా : మయుడు ఏ విధంగా శివుని కీర్తికి హాని చేశాడు? విష్ణుమూర్తి, అపుడు ఏ మార్గాన శివకీర్తిని చక్కదిద్ది, శివశక్తి సహాయకుడయ్యాడు?

**వ. అనిన నారదుం డి ట్లనియె, 390**

**ప్రతి:** అనినన్= అని ధర్మజుడు పలుకగా; నారదుండు+ఇట్లు+అనియెన్= నారదమహర్షి ఇలా అన్నాడు.

**తా:** అని ధర్మరాజు అడుగగా, నారదుడు ఇలా బదులు పలికాడు.

**క. చక్రాయుధ బలయుతు లగు, శక్రాదుల కోహటించి శమమున నసురుల్**
**సక్రోధంబున నరిగిరి, విక్రమములు మాని మయుని వెనుకకు నధిపా! 391**

**ప్రతి :** అధిపా!= రాజా! చక్ర+ఆయుధ బలయుతులు+అగు= చక్రమనే ఆయుధంతో బలవంతులయిన శక్ర+ఆదులకున్= ఇంద్రుడు మొదలయినవారికి; ఓహటించి= ఓడి; అసురుల్= రాక్షసులు; శమమునన్= శాంతితో; విక్రమములు+మాని= పరాక్రమాలు వదలి; సక్రోధంబునన్= క్రోధంతో; మయుని వెనుకకున్= మయుని వెనుకకు; అరిగిరి= వెళ్ళారు.

**తా :** రాజా! రాక్షసులు, చక్రాయుధం వంటి వాటితో బలవంతులయిన ఇంద్రాది దేవతలతో తలపడి, పిదప ఓడిపోయి క్రోధంతో యుద్ధక్రీడ మాని, మయుని వెనుకకు రక్షణకోసం వెళ్ళారు.

**వ. ఇట్లు రక్కసులు దన వెనుకఁ జొచ్చిన మాయా నిలయుండును దుర్నయుండును నైన మయుండు దన యోగబలంబున నయోరజత సువర్ణమయంబులై యెవ్వరికిని లక్షింపరాని గమనాగమనంబులు వితర్కింపరాని కర్కశపరిచ్ఛదంబులును గలిగిన త్రిపురంబుల నిర్మించి యిచ్చిన నక్తంచరు లందఱు నందుఁ బ్రవేశించి కామసంచారులై పూర్వవైరంబుఁ దలంచి సనాయకంబులయిన లోకంబుల నస్తోకంబయిన నిజబలాతిరేకంబున శోకంబు నొందించిన. 392**

**ప్రతి :** ఇట్లు, రక్కసులు= రాక్షసులు; తనవెనుకన్+చొచ్చినన్= తన వెనకరాగా; మాయా నిలయుండును= మాయలకు స్థానమైనవాడు; దుర్+నయుండును= దుష్టనీతిగలవాడు, ఐన మయుండు; తన యోగబలంబునన్= తన యౌగికశక్తితో, అయస్+రజత సువర్ణమయంబులు+ఐ= ఇనుము, వెండి, బంగారం అనే మూటితో నిర్మితాలయి; ఎవ్వరికిని= ఏ వారికి; లక్షింపరాని= గుర్తింపరాని; గమన+ఆగమనంబులు= రాకపోకలు; వితర్కింపరాని= ఊహింపరాని; కర్కశ పరిచ్ఛదంబులును= కఠినమైన పైతొడుగులును (దుప్పట్లు); కలిగిన= కలిగి ఉన్న; త్రిపురంబులన్= మూడు పట్టణాలను; నిర్మించి+ఇచ్చినన్= ఏర్పరచి ఇవ్వగా; నక్తంచరులు+అందఱున్= రాక్షసులు అందరూ; అందున్+ప్రవేశించి= ఆ త్రిపురాలలో చేరి; కామసంచారులై= తమ ఇచ్ఛానుసారం సంచారం చేస్తూ; పూర్వవైరంబున్= మునుపటి పగను; తలంచి= స్మరిస్తూ; సనాయకంబులయిన= నాయకులతో కూడి; లోకంబులన్+అస్తోకంబయిన= గొప్పదైన; (స్తోకము= తక్కువ–అస్తోకము– తక్కువకానిది) నిజబల+అతిరేకంబునన్= తమ శక్తియొక్క అతిశయంతో; శోకంబును+ఒందించినన్= పరితాపం కలిగించగా...

**తా :** ఇట్లు రాక్షసులు తన వెనుక నిలువగా, మాయావీ, నీతిమాలినవాడూ అయిన మయుడు తన యోగశక్తితో, ఇనుము, వెండి, బంగారాలతో, ఎవ్వరికిని గుర్తించరాని రాక పోకలు, ఊహింపరాని కఠినమైన పైతొడుగులు గలిగిన మూడు పురాలను కట్టించి ఇవ్వగా, రక్కసులందరు వాటిలో చేరి, కోరినట్లు కోరినచోటికి తిరుగుతూ, మునుపటి పగను తలచుకొని, లోకాలన్నిటినీ వాటి పాలకులతోపాటుగా, తమ అతిశయించిన బలంతో శోకాలపాలు చేస్తూండినారు.

**క. లోకాధినాథులెల్లను, శోకాతురు లగుచు శరణు సొచ్చిరి దుష్టా**
**నీక విదళనాకుంఠున్, శ్రీకంఠున్ భువనభరణచిత్తోత్కంఠున్. 393**

**ప్రతి :** లోక+అధినాథులు+ఎల్లను= లోకాల పాలకులు అందరు; శోక+ఆతురులు+అగుచున్= పరితాపంతో భయగ్రస్తులు అవుతూ; దుష్ట+అనీక= దుష్టసేనలను; విదళన+అకుంఠున్= నరుకటంలో వెనుకాడని; భువనభరణచిత్త+ఉత్కంఠున్= లోకాలను మోయటంలో మనస్సులో ఉత్సాహం గలవానిని; శ్రీకంఠున్= శివుని; (శ్రీ – విషము కంఠమున గలవానిని) శరణు+చొచ్చిరి= శరణు పొందారు.

**తా :** లోకపాలకులందరు శోకాలపాలై, దుష్టసేనల పీచమడచటంలో వెనుకాడని, లోకరక్షణభారం వహించడానికి ముందు నడిచే శివుని శరణు వేడారు.

**వ. ఇట్లు సకల లోకేశ్వరుండగు మహేశ్వరుం జేరి లోకపాలకులు ప్రణతులై పూజించి కరకమలంబులు ముకుళించి. 394**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; సకలలోక+ఈశ్వరుండు+అగు= ఎల్లలోకాలకు అధిపతి అయిన; మహా+ఈశ్వరున్+చేరి= శంకరుని సమీపించి; లోకపాలకులు= లోకాల ఏలికలు; ప్ర+నతులై= నమస్కృతులై; పూజించి= అర్చించి; కరకమలంబులు= పద్మాలవంటి చేతులను; ముకుళించి= జోడించి;

**తా :** లోకపాలకులందరు ఎల్లలోకాలకు ఏలిక అయిన మహేశ్వరుని జేరి నమస్కరించి, పూజించి, చేతులు జోడించి, ఇలా ప్రార్థించారు.

**క. త్రిపురాలయులగు దానవు, లపరాజితు లగుచు మాకు నశ్రాంతంబున్**
**వపురాదిపీడఁజేసెద, రపరాధకులను వధింపు మగజాధీశా! 395**

**ప్రతి :** అగజా+అధి+ఈశా= పార్వతీపతీ! (అగజ – కొండకూతురు – ఆమెకు అధీశుడు); త్రిపుర+ఆలయులు+అగు= త్రిపురాలు నివాసాలుగా గల; దానవులు= రాక్షసులు; అపరాజితులు+అగుచున్= ఓడిపోనివారై; మాకున్ అశ్రాంతంబున్= మాకు ఎల్లపుడూ; వపుర్+ఆదిపీడన్+చేసెదరు= దేహం మొదలయినవాటికి బాధను కలిగిస్తున్నారు; అపరాధకులను= నేరం చేసేవారిని, ఆ రాక్షసులను; వధింపుము= చంపు.

**తా :** ఓ పార్వతీ పతీ! త్రిపురవాసులైన రాక్షసులు యుద్ధాలలో ఓటమి పాలు గాక, నిరంతరం, మాకు శారీరక మానసిక బాధలు కల్గిస్తున్నారు. ఆ అపరాధులను సంహరించు.

**క. దీనులము గాక యుష్మద, ధీనులమై యుండు మేము దేవాహిత దో**
**ర్లీనుల మైనారము బల, హీనుల మగు మమ్ముఁగావు మీశాన! శివా! 396**

**ప్రతి :** ఈశాన= ఈశ్వరా! శివా= శుభకరుడా! దీనులముగాక= దుఃఖితులం గాక; యుష్మద్+అధీనులమై+ఉండుమేము= నీ అధీనంలో నిలిచే మేము; దేవ+అహిత దోర్+లీనులము+ఐనారము= రాక్షసుల బాహువులకు లొంగిన వారమైనాము; బలహీనులమగు మమ్మున్+కావుము= బలంలేని వారమైన మమ్మల్ని రక్షించు.

**తా :** శివా! మేము నీకు దాసులమై ఏ దుఃఖమూ లేక ఇంతకాలం ఉన్నాము. ఇపుడు త్రిపురాసురుల బాహుబలానికి లొంగిపోయి దుర్బలుల మైనాము. మమ్మల్ని కాపాడు.

**వ. అనిన భక్తవత్సలుండగు పరమేశ్వరుండు శరణాగతులైన గీర్వాణుల వెఱవకుండుఁడని దుర్వార బలంబున బాణాసనంబుఁ గేల నందికొని యొక్క దివ్యబాణంబు సంధించి త్రిపురంబుల పయినేసిన మార్తాండ మండలంబున వెలువడు మయూఖజాలంబుల చందంబునఁ దద్బాణంబువలన దేదీప్యమానంబులై యనేక బాణసహస్రంబులు సంభవించి భూనభోంతరాళంబులు నిండి మండి తెప్పలుగాఁ గుప్పలుగొని త్రిపురంబుల పయిఁ గప్పె, నప్పుడు తద్బాణపావక హేతి సందోహ దందహ్యమానులై గతాసులైన త్రిపురపుర నివాసులం దెచ్చి మహాయోగియైన మయుండు సిద్ధరసకూపంబున వైచిన. 397**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; భక్తవత్సలుండగు= భక్తులయెడ వాత్సల్యం కలవాడైన; పరమ+ఈశ్వరుండు= శంకరుడు; శరణ+ఆగతులు+ఐన= శరణు జొచ్చిన; గీర్వాణులన్= దేవతలను; వెఱవక+ఉండుఁడు+అని= భయపడకండని; దుర్వార బలంబునన్= వారింపరాని శక్తితో; బాణ+ఆసనంబున్= ధనుస్సును; కేలన్+అందికొని= చేతితో పట్టుకొని; ఒక్క దివ్యబాణంబు= ఒక్క దివ్యమైన శరం; సంధించి= ప్రయోగించి; త్రిపురంబులపయిన్+ఏసినన్= మూడు పురాలమీద ప్రయోగించగా; మార్తాండమండలంబునన్+వెలువడు= సూర్యమండలంలోంచి బయల్వెడలే; మయూఖ జాలంబుల చందంబునన్= కిరణాల గుంపుల మాదిరిగా; తద్+బాణంబువలనన్= ఆ బాణంనుండి; దేదీప్యమానంబులు+ఐ= మిక్కిలి వెలుగేవై; అనేకబాణ సహస్రంబులు= పెక్కువేల బాణాలు; సంభవించి= పుట్టి; భూనభస్+అంతరాళంబులు= భూమి ఆకాశముల లోపలిభాగములు; నిండి= వ్యాపించి; మండి= జ్వలించి; తెప్పలుగాన్+కుప్పలు+కొని= కుప్పతెప్పలుగా, తండోపతండాలుగా; త్రిపురంబుల పయిన్= మూడు పురాల మీద; కప్పెన్= ఆచ్ఛాదించాయి; అప్పుడు= ఆ వేళలో; తద్+బాణ పావకహేతి సందోహదందహ్యమానులై= ఆ బాణపు అగ్నిజ్వాలలచే మిక్కిలి కాలుచున్నవారై; గత+అసులైన= పోయిన ప్రాణాలుగల; త్రిపురనివాసులన్+తెచ్చి= త్రిపురాలలో నివసించే రాక్షసులనుతీసికొనివచ్చి; మహాయోగి+ఐన= గొప్పయోగశక్తిగలవాడైన; మయుండు; సిద్ధరసకూపంబునన్= సిద్ధరసంగల బావిలో; వైచినన్= పడవేయగా...

**తా :** వారి ప్రార్థనలు విన్న శంకరుడు భక్తవత్సలుడు గావున దేవతలను 'వెఱువకుడు' అని అభయమిచ్చి మహాశక్తితో ధనుస్సును చేతితో గ్రహించి దివ్యమైన బాణమొకటి సంధించి త్రిపురాలపై వేశాడు. దాని నుండి వేలబాణాలు, సూర్యగోళంనుండి కిరణాలవలె ఉద్భవించి, భూమిని, ఆకాశాన్ని వాటిలోపలి బయటి ప్రదేశాలు అన్నింటను నిండి, కుప్పలు తెప్పలుగా త్రిపురాలను కప్పివేశాయి. అప్పుడు ఆ బాణాల అగ్నిజ్వాలల గుంపులలో కాలి; ఉసురు బాసిన త్రిపురవాసులైన రాక్షసులను తీసికొని వచ్చి, గొప్ప యోగశక్తిగల మయుడు; సిద్ధరసపు బావిలో వేయగా

**క. సిద్ధామృత రస మహిమను, శుద్ధ మహావజ్రతుల్య శోభితతనులై**
**వృద్ధింబొందిరి దానవు, లుద్ధతనిర్ఘాతపావకోపము లగుచున్. 398**

**ప్రతి :** దానవులు= రాక్షసులు; సిద్ధ+అమృత రసమహిమను= సిద్ధరసం అనే అమృతరసపు మహిమతో; శుద్ధ మహావజ్రతుల్య శోభిత తనులై= గొప్పవజ్రంతో సమానమై ప్రకాశించే శరీరాలు గలవారై; ఉద్ధత= పెద్ద; నిర్ఘాత= పిడుగులలోని; పావక+ఉపములు+అగుచున్= నిప్పులతో సమానులవుతూ; వృద్ధిన్+పొందిరి= పెంపొందారు.

**తా :** రాక్షసులు, ఆ అమృత మహిమతో, గొప్పవైన వజ్రాలతో సమానమైన శరీరాలు గలవారై, భయంకరమైన పిడుగులలోని అగ్నులతో పోలి, పెంపుదల వహించారు.

**క. కూపామృతరససంగతి, దీపితులై నిలిచియున్న దేవాహితులన్**
**రూపించి చింత నొందెడు, గోపధ్వజుఁజూచి చక్రి కుహనాన్వితుఁడై. 399**

**ప్రతి :** కూప+అమృతరస సంగతిన్= బావియందలి అమృతపు చేరికతో; దీపితులు+ఐ= వెలుగొందుతున్నవారై; నిలిచి+ఉన్న= ఎదుట నిలబడిన; దేవ+అహితులన్= రాక్షసులను; రూపించి= చూచి; చింతను+ఒందెడు= విచారాన్ని పొందిన; గోపధ్వజున్+చూచి= (నందిధ్వజాన్ని గుర్తుగాగల)శంకరునిచూచి; చక్రి= విష్ణువు; కుహనా+అన్వితుఁడై= కపటంతో కూడినవాడై...

**తా :** ఆ బావిలోని అమృతరస ప్రభావంతో, బ్రదికి, వెలుగులు చిమ్ముతూ ఎదుట నిలిచిన రాక్షసులను చూచి శంకరుడు విచార వదనుడైనాడు; అది చూచి శ్రీహరి కపటవేషధారియై,

**శా. ఉత్సాహంబున నొక్కపాఁడి మొదవై యూథంబు ఘ్రాణించుచున్**
**వత్సంబై తన వెంట బ్రహ్మ నడువన్ వైకుంఠుఁడేతెంచి యు**
**ద్యత్సత్త్వంబునఁగూపమధ్యరసముంద్రావెన్ విలోకించుచుం**
**దత్సౌభాగ్యనిమగ్నులై మఱచి రా దైత్యుల్ నివారింపఁగన్. 400**

**ప్రతి :** ఉత్సాహంబునన్= పూనికతో; ఒక్కపాఁడి మొదవు+ఐ= ఒకపాడి ఆవై; యూథంబున్= ఆవుల గుంపును; ఘ్రాణించుచున్= వాసన చూస్తూ; వత్సంబై= దూడయై; తనవెంటన్= తనవెంట; బ్రహ్మ నడువన్= బ్రహ్మరాగా; వైకుంఠుఁడు= శ్రీహరి; ఏ తెంచి= వచ్చి; ఉద్యత్+సత్త్వంబునన్= ఉప్పొంగే శక్తితో; కూపమధ్యరసమున్= బావిలోని అమృత రసాన్ని; త్రావెన్= తాగాడు; ఆ దైత్యులున్= ఆ రాక్షసులుకూడ; తత్+సౌభాగ్య నిమగ్నులై= దాని అందచందాలలో మునిగినవారై; విలోకించుచున్= చూస్తూ; నివారింపఁగన్= అడ్డగించడం; మఱచిరి= విస్మరించారు.

**తా :** శ్రీహరి, తాను పాడియావుగా, బ్రహ్మ దూడగా తన వెంటరాగా, త్రిపురాలలో ప్రవేశించి, అక్కడి బావిలోని అమృతరసం మొత్తం తాగాడు; ఆ ఆవుదూడల అందచందాలు చూస్తూ మైమరచిన రాక్షసులు, దానిని అడ్డగించడం మరచిపోయారు.

**వ. ఇట్లు విష్ణుండు మోహనాకారంబున ధేనువయి త్రిపురమధ్య కూపామృత రసంబు ద్రావిన నెఱింగి శోకాకుల చిత్తులయిన రసకూపపాలకులంజూచి మహాయోగియైన మయుండు వెఱఁగు పడి, దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె. 401**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విష్ణుండు= విష్ణుభగవానుడు; మోహన+ఆకారంబునన్= మోహింపజేసే రూపంతో; ధేనువు+అయి= ఆవుగా మారి; త్రిపురమధ్య కూప+అమృత రసంబున్= త్రిపురాల నడుమ (గల) బావిలోని అమృతరసాన్ని; త్రావినన్= తాగగా; ఎఱింగి= తెలిసికొని; శోక+ఆకుల చిత్తులు+అయిన= దుఃఖంతో కలత చెందిన మనస్సులుగల; రసకూపపాలకులన్= సిద్ధరసపు బావి రక్షకులను; చూచి; మహాయోగి+అయిన మయుండు= గొప్పయోగి అయిన

మయుడు; వెఱఁగుపడి= విస్మయంచెంది; దైవగతిన్= దైవరీతిని; చింతించి= ఆలోచించి; శోకింపక= దుఃఖింపక; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తా :** ఇలా విష్ణువు మోహనాకారంలో గోవుగా వచ్చి త్రిపురాల మధ్యగల బావిలోని అమృతరసం అంతా తాగేసరికి ఇది తెలుసుకొని గుండెలు బాదుకొని ఆ బావికాపరులను దుఃఖించసాగారు. శోకిస్తున్న వాళ్లను చూచి మహాయోగియైన మయుడు విషయం తెలుసుకొని ఆశ్చర్యపడ్డాడు. ఆ దురదృష్టం గురించి తలచుకొని బాధపడకుండా ఇలా అన్నాడు.

**ఆ. అమరులైన దనుజులైనను నరులైన, నెంత నిపుణులైన నెవ్వరైన**
**దైవికార్థచయముఁదప్పింపఁగా లేరు, వలదు దనుజులార! వగవ మనకు! 402**

**ప్రతి :** దనుజులార!= రాక్షసులారా!; అమరులు+ఐనన్= దేవతలైనా; దనుజులు+ఐనను= రాక్షసులైనా; నరులు+ఐనన్= మనుషులైనా; ఎంత నిపుణులు+ఐనన్= ఎంత నేర్పరులైనా; ఎవ్వరు+ఐనన్= ఎవ్వరైనా; దైవిక+అర్థచయమున్= దైవనిర్ణయాలయిన విషయాలను; తప్పింపఁగాన్= మాన్పడానికి; లేరు= సమర్థులు గారు; మనకు= మనం; వగవన్= దుఃఖించడం; వలదు= వద్దు.

**తా :** రాక్షసులారా! లోకాలలో, దేవతలైనా, రాక్షసులైనా, మానవులైనా, వారెంత నేర్పరులైనా సరే దైవనిర్ణయాలను తప్పించలేరు; మార్చలేరు. కావున మనకిక్కడ శోకించే అవసరం లేదు.

**వ. అని పలికె. అంత విష్ణుండు నైజంబులైన ధర్మ జ్ఞాన విద్యాతపో విరక్తి సమృద్ధి క్రియాశక్తి విశేషంబుల శంభునికిఁ బ్రాధాన్యంబు సమర్పించి రథ సూత కేతువర్మ బాణాసన ప్రముఖ సంగ్రామ సాధనంబులు సేసినం గైకొని. 403**

**ప్రతి :** అని పలికెన్= అని అన్నాడు; అంతన్= అనంతరం; విష్ణుండు= హరి; నైజంబులైన= తనవైన; ధర్మ= ధర్మం; జ్ఞాన= తెలివి; విద్యా= చదువు; తపస్= తపస్సు; విరక్తి= వైరాగ్యం; సమృద్ధి= వీటి ఆధిక్యంతో; క్రియాశక్తి విశేషంబులన్= విశేషమైన క్రియాశక్తులతో; శంభునికిన్= శంకరునికి; ప్రాధాన్యంబు= ప్రాముఖ్యం; సమర్పించి= కలిగించి; రథ= రథం; సూత= రథచోదకుడు; కేతు= జెండా; వర్మ= కవచం; బాణ+ఆసనం= ధనుస్సు; ప్రముఖ= మొదలయిన; సంగ్రామసాధనంబులు= యుద్ధసామగ్రి; చేసినన్= కల్పించగా; కైకొని= స్వీకరించి...

**తా :** అనంతరం శ్రీహరి తన శక్తియుక్తులు ధర్మజ్ఞాన విద్యా విశేషాదులను ఉపయోగించి, శివునకు ప్రాధాన్యం కల్పించి, రథ సూత కేత్వాది యుద్ధసామగ్రిని సంతరించి అర్పించాడు; వాటిని స్వీకరించి శంకరుడు.

**మ. శరియై కార్ముకియై మహాకవచియై సన్నాహియై వాహియై**
**సరథుండై సనియంతయై సబలుఁడై సత్కేతనచ్ఛత్రుఁడై**
**పరమేశుండొక బాణమున్ విడిచెఁదద్బాణానలజ్వాలలం**
**బురముల్ గాలె ఘటచ్ఛటధ్వని నభోభూమధ్యముల్ నిండఁగన్. 404**

**ప్రతి :** పరమ+ఈశుండు= శివుడు; శరి+ఐ= బాణంగలవాడై; కార్ముకి+ఐ= ధనుస్సుగలవాడై; మహాకవచి+ఐ= గొప్ప కవచంగలవాడై; సన్నాహి+ఐ= ప్రయత్నశీలియై; వాహి+ఐ= వాహనమైన ఎద్దుగలవాడై; సరథుండు+ఐ= రథంగలవాడై;

సనియంత+ఐ= సారథిగలవాడై; సబలుఁడు+ఐ= బలంతో కూడినవాడై; సత్+కేతనచ్ఛత్రుఁడు+ఐ= మంచి జెండా; గొడుగు గలవాడై; ఒక బాణమున్= ఒక బాణాన్ని; విడిచెన్= ప్రయోగించాడు; తద్+బాణ+అనలజ్వాలలన్= ఆ బాణాగ్ని జ్వాలలలో; ఛటచ్ఛటధ్వని= ఛటఛట శబ్దం; నభస్+భూమధ్యముల్ నిండఁగన్= ఆకాశం భూమి నడుమభాగమంతా నిండేటట్లుగా; పురముల్= త్రిపురాలు, మూడునగరాలు; కాలెన్= దగ్ధమయినాయి.

**తా :** అనంతరం శివుడు, బాణము, ధనుస్సు, కవచం, వాహనం, రథం, సారథి, జెండా, గొడుగు ఈ అన్నిటితో శోభిస్తూ ఒక బాణాన్ని ఆ మూడు పురాలపై వేశాడు. ఆ బాణ జ్వాలల్లో, ఛట ఛట ధ్వని భూమ్యాకాశాలు నిండగా, అవి కాలి బూడిదయ్యాయి.

**వ. ఇట్లు హరుండు దురవగాహంబులైన త్రిపురంబుల నభిజిన్ముహూర్తంబున భస్మంబుసేసి కూల్చిన, నమర గరుడ గంధర్వ సిద్ధ సాధ్య యక్ష వల్లభులు వీక్షించి, జయ జయ శబ్దంబులు సేయుచుఁ గుసుమ వర్షంబులు వర్షించిరి, ప్రజలు హర్షించిరి, బ్రహ్మాదులు కీర్తించి, రప్సరసలు నర్తించిరి, దివ్యకాహళ దుందుభి రవంబులును, మునిజనోత్సవంబులును బ్రచురంబు లయ్యె, నిట్లు విశ్వజనీనంబగు త్రిపురాసుర సంహారంబున నఖిలలోకులును సంతసిల్లియుండ నయ్యవసరంబున. 405**

**ప్రతి :** ఇట్లు హరుండు= ఈ విధంగా శివుడు; దుర్+అవగాహంబులు+ఐన= ప్రవేశింప వీలులేని; త్రిపురంబులన్= మూడు నగరాలను; అభిజిత్+ముహూర్తంబునన్= అభిజిత్తు అనే నక్షత్రంలో మధ్యాహ్న ముహూర్తకాలంలో; భస్మంబు+చేసి= బూడిద చేసి; కూల్చినన్= పడగొట్టగా; అమర= దేవతలు, గరుడ= గరుడులు, గంధర్వ= గంధర్వులు, సిద్ధ= సిద్ధులు, సాధ్య= సాధ్యులు, యక్షవల్లభులు= యక్షజాతి నాయకులు (వీరందరు దేవయోనులు); వీక్షించి= చూచి; జయ జయ శబ్దంబులు+చేయుచున్= 'జయ జయ' అనే ధ్వనులుచేస్తూ, కుసుమవర్షంబులు= పూలవానలు; వర్షించిరి= కురిపించారు; ప్రజలు= జనులు; హర్షించిరి= సంతసించారు; బ్రహ్మ+ఆదులు= బ్రహ్మ మొదలయినవారు; కీర్తించిరి= పొగిడారు; అప్సరసలు= దేవ వేశ్యలు; నర్తించిరి= నాట్యమాడారు; దివ్య= స్వర్గానికి చెందిన; కాహళ దుందుభి రవంబులును= పెద్దబూర (కొమ్ము), భేరుల ధ్వనులు; మునిజన+ఉత్సవంబులును= ఋషుల వేడుకలు; ప్రచురంబులు+అయ్యెన్= అధికమైనాయి. ఇట్లువిశ్వజనీనంబగు= ఇలా సకల భూతాలకు మేలుచేసే దయిన; త్రిపుర+అసురసంహారంబునన్= మూడు పురాల రక్కసుల వధవలన; అఖిల లోకులును= ఎల్లలోకాలవారూ; సంతసిల్లి+ఉండన్= సంతోషించి ఉండగా; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో...

**తా :** ప్రవేశింప వీలుగాని త్రిపురాలను శివుడు, కేవలం క్షణకాలాన భస్మం చేసి పడగొట్టగా, వివిధ దేవతాగణం, వారి నాయకులు చూచి సంతసించారు. జయ జయ శబ్దాలతో పూలవానలు కురిపించారు. ప్రజలూ హర్షించారు. బ్రహ్మాదులూ పొగడినారు. అప్సరసలు నర్తించారు; స్వర్గంలోని పెద్దబూరలు భేరులు మ్రోగాయి. ఋషుల వేడుకలు పెరిగి, అందరికి, మేలు జరిగిన త్రిపురాసురవధ లోకాలనన్నింటికి సంతోషకరంగా ముగిసినది. ఆ సమయంలో

**ఆ. తృణకణముల భంగిఁద్రిపురంబుల దహించి, పరముఁడవ్యయుండు భద్రయశుఁడు**
**శివుఁడు పద్మజాదిజేగీయమానుఁడై, నిజనివాసమునకు నెమ్మిఁజనియె. 406**

**ప్రతి :** పరముఁడు= పరాత్పరుడు; అవ్యయుఁడు= నాశం లేనివాడు; భద్రయశుఁడు= శుభయశస్కుడు; శివుఁడు= శంకరుడు; తృణకణములభంగిన్= గడ్డిపరకలవలె; త్రిపురములన్= మూడు పురాలను; దహించి= కాల్చి; పద్మజ+ఆది జేగీయ

మానుఁడై= బ్రహ్మమొదలైన వారిచేత మిక్కిలి స్తుతింపబడినవాడై; నిజనివాసంబునకున్= తన స్వస్థలానికి; నెమ్మిన్+చనియెన్= ప్రీతితో వెళ్ళాడు.

**తా :** పరాత్పరుడైన శంకరుడు గడ్డిపరకలను వలె త్రిపురాలను క్షణకాలంలో బూడిద చేసి, బ్రహ్మాది దేవతలు తనను కీర్తిస్తుండగా, తన కైలాసగిరిని చేరుకున్నాడు.

**వ. ఇట్లు నిజమాయా విశేషంబున మర్త్యలోకంబున విడంబించు చున్న విష్ణుని పరాక్రమ విధానంబులు మునిజన వంద్యమానంబులై, సకల లోక కల్యాణ ప్రదానంబులై యుండు ననిన విని నారదునకు ధర్మనందనుం డిట్లనియె. 407**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; నిజ మాయా విశేషంబునన్= తన విశేషమైన మాయతో; మర్త్యలోకంబునన్= మానవలోకాన; విడంబించుచున్న= ప్రబలుతున్న; విష్ణుని పరాక్రమవిధానంబులు= శ్రీహరి శౌర్యరీతులు; మునిజన వంద్యమానంబులై= ఋషులచే నమస్కృతాలై; సకల లోకకల్యాణ ప్రదానంబులై+ఉండున్= ఎల్లలోకాలకు క్షేమదాయకాలుగా ఉంటాయి; అనినన్ విని= అని తెలుపగా విని; నారదునకున్= నారదమహర్షితో; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇలా పలికాడు.

**తా :** ఈ విధంగా తన మాయలతో భూలోకంలో అతిశయిస్తున్న శ్రీహరి శౌర్యపరాక్రమ పద్ధతులు ఋషులచే నమస్కరింపదగినవై, ఇతర సర్వజనులకు క్షేమాన్ని కలిగిస్తాయి అని పలికిన నారదునితో ధర్మరాజు ఇలా అంటున్నాడు.

## ✤ నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమ ధర్మంబులు తెలుపుట ✤

**సీ. అనఘాత్మ! సకలవర్ణాశ్రమాచార సమ్మత ధర్మ మెయ్యది మానవులకు?**
**నే ధర్మమున నరుం డిద్ధ విజ్ఞానము భక్తియుఁబ్రాపించుఁ? బద్మజునకు**
**సాక్షాత్సుతుండవు, సర్వజ్ఞుఁడవు, నీకు నెఱుఁగ రానిది ధర్మమింత లేదు,**
**నారాయణ పరాయణస్వాంతు లనఘులు శాంతులు సదయులు సాధువృత్తి**

**ఆ. మెఱయుచున్న ఘనులు మీ వంటివా రెద్ది, పరమధర్మ మనుచు భక్తిఁదలఁతు?**
**రట్టి ధర్మరూప మఖిలంబు నెఱిఁగింపు, వినఁగ నిచ్చ గలదు విమలచరిత! 408**

**ప్రతి :** అనఘ+ఆత్మ= పాపం లేని మనస్సుగలవాడా!; విమల చరిత!= నిర్మలమైన నడతగలవాడా!; మానవులకున్= నరులకు; సకలవర్ణ+ఆశ్రమ+ఆచార సమ్మత ధర్మము+ఏ+అది?= అన్నివర్ణాలకు, ఆశ్రమాచారాలకు, అంగీకృతమైన ధర్మం ఏది? ఏ ధర్మమునన్= ఏ ధర్మాచరణవలన; నరుండు= మానవుడు; ఇద్ధ విజ్ఞానమున్= వెలిగే తెలివితేటలను; భక్తియున్= భక్తినీ, ప్రాపించున్= పొందుతాడు; పద్మజునకున్= బ్రహ్మకు; సాక్షాత్+సుతుండవు= స్వయాన కొడుకువు; సర్వజ్ఞుఁడవు= అన్ని విషయాలు తెలిసినవాడివి; నీకున్+ఎఱుంగరానిది= నీకు తెలియనిది; ధర్మము+ఇంత= కొంచెం ధర్మంగూడ; లేదు= ఉండదు; నారాయణ పరాయణస్వాంతులు= శ్రీహరికి స్వాధీనమైన మనస్సులుగలవారు; అనఘులు= పాపరహితులు; శాంతులు= శాంతాత్ములు; సదయులు= దయావంతులు; సాధువృత్తిన్= మంచివర్తనతో; మెఱయుచున్న= వెలుగొందుతున్న; ఘనులు= గొప్పవారు; మీవంటివారు= మీలాంటివారు; ఎద్ది= ఏది; పరమధర్మము+అనుచున్=

గొప్పధర్మమని; భక్తిన్+తలఁతురు= భక్తితో అనుకుంటారు? అట్టి ధర్మరూపము= ఆ ధర్మ స్వరూపం; అఖిలంబున్+ ఎఱిఁగింపు= మొత్తం తెలుపవలసింది; వినఁగన్= వినుటకు; ఇచ్ఛ+కలదు= కోర్కె గలదు.

**తా :** నారద మహర్షీ! నీవు స్వయంగా బ్రహ్మకు సుతుడవు. సర్వజ్ఞుడవు; నీ వెరుగని ధర్మ మేదీ లోకంలో ఉండదు. నరులకు సర్వవర్ణముల ఆచారాలకు వలసిన ధర్మమేది? విష్ణుభక్తులు; శాంతి; దయ; మంచి నడతగల మీ వంటివారు ఏది గొప్పధర్మమని అనుకుంటారు? ఆ ధర్మపు స్వరూప స్వభావాలు మొత్తమూ తెలుపు. వినాలనే కోర్కెతో ఉన్నాను.

**వ. అనిన నారదుండు ధర్మరాజుం జూచి దాక్షాయణియందు నిజాంశంబున నవతరించి, భువన శోభనంబు కొఱకు బదరి కాశ్రమంబునఁ దపోనిరతుండయి యున్న నారాయణునివలన సనాతనంబగు ధర్మంబు వింటి, నది సెప్పెద, సకల వర్ణంబుల జనులకు సత్యంబును, దయయును, నుపవాసాది తపంబును, శౌచంబును, సైరణయు, సదసద్వివేకంబును, మనోనియమంబును, బహిరింద్రియ జయంబును, హింస లేమియు, బ్రహ్మచర్యంబును, దానంబును, యథోచితజపంబును, సంతోషంబును, మార్దవంబును, సమదర్శనంబును, మహాజనసేవయు, గ్రామ్యంబు లయిన కోరికలు మానుటయు, నిష్ఫలక్రియలు విడుచుటయు, మితభాషిత్వంబును, దేహంబుగాని తన్ను వెదకి కొనుటయు, నన్నోదకంబులు ప్రాణులకుం బంచి యిచ్చుటయుఁ బ్రాణులందు దేవతాబుద్ధియు, నాత్మబుద్ధిం జేయుటయు, శ్రీనారాయణ చరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కార దాస్యాత్మ సమర్పణ సఖ్యంబు లనియెడి త్రింశల్లక్షణంబులు గలుగ వలయు, నందు సత్కులాచారుండయి మంత్రవంతంబులైన గర్భాధానాది సంస్కారంబు లవిచ్ఛిన్నంబులుగాఁ గలవాఁడు ద్విజుండు. ద్విజునకు యజన యాజ నాధ్యయ నాధ్యాపన దాన ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితంబులు. రాజునకుఁ బ్రతిగ్రహ వ్యతిరిక్తంబులయిన యజనాది కర్మంబు లయిదును బ్రజాపాలనంబును, బ్రాహ్మణులు గానివారివలన దండశుల్కాదులు గొనుటయు, విహితకర్మంబులు, వైశ్యునికిఁ గృషి వాణిజ్య గోరక్షణాది కర్మంబులు, బ్రాహ్మణ కులానుసరణంబును విహితంబులు, శూద్రునకు ద్విజశుశ్రూష సేయవలయును. 409**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; నారదుండు= నారదమహర్షి; ధర్మరాజున్+చూచి= ధర్మరాజును చూస్తూ; దాక్షాయణియందున్= సతీదేవియందు; నిజ+అంశంబునన్= తన (యొక్క) భాగంవలన; అవతరించి= జన్మించి; భువనశోభనంబుకొఱకున్= లోకక్షేమంకోసం; బదరికా+ఆశ్రమంబునన్= బదరిక అనే తపోవనంలో; తపస్+ నిరతుండు+అయి= తపస్సున ఎల్లప్పుడు ఉండువాడై; ఉన్న నారాయణుని వలనన్= నారాయణముని వలన; సనాతనంబు+అగు ధర్మంబున్+వింటిన్= ప్రాచీన ధర్మాన్నిగూర్చి విన్నాను; అది+చెప్పెదన్= దాని వివరిస్తాను; సకలవర్ణంబుల జనులకున్= అన్ని వర్ణాల ప్రజలకు; సత్యంబును= సత్యం; దయయును= దయ; ఉపవాస+ఆది తపంబును= ఉపవాసం మొదలైన తపస్సును; శౌచంబును= పరిశుభ్రతయు; సైరణయున్= ఓరిమీ; సత్+అసత్+ వివేకంబును= మంచి చెడుల జ్ఞానమూ; మనస్+నియమంబును= మనస్సును నియమించుట; బహిస్+ఇంద్రియ జయంబును= బయటి ఇంద్రియాల విజయంను; హింస లేమియున్= అహింస; బ్రహ్మచర్యంబును= బ్రహ్మచర్య దీక్ష; దానంబును= దానం చేయడం; యథా+ఉచిత జపంబును= వీలైనంత జపంచేయడం; సంతోషంబును; మార్దవంబును= మృదుత్వంను, మెత్తనితనంను; సమదర్శనంబును=

సమదృష్టి కలిగివుండడం; మహాజనసేవయున్= గొప్పవారిని సేవించడం; గ్రామ్యంబులయిన= అల్పమైన; కోరికలు= వాంఛలను; మానుటయున్= మానడం; నిష్ఫలక్రియలు మానుటయున్= ఫలితంలేని పనులు చేయకుండడం; మితభాషితంబును= మితంగా మాట్లాడటం; దేహంబుగాని తన్ను వెదకికొనుటయున్= శరీరం కంటె భిన్నమయిన తనను (ఆత్మను) వెతుక్కోవడం; అన్న+ఉదకంబులు= తిండి-నీరు-ఇవి; ప్రాణులకున్+పంచి+ఇచ్చుటయున్= జీవులకు పంచిపెట్టడం; ప్రాణులందున్= జీవులపట్ల; దేవతా బుద్ధియున్= దైవములు-అనే భావన; ఆత్మబుద్ధిన్+చేయుటయున్= తనవంటివారనే బుద్ధితో (పనులు) చేయడం; శ్రీనారాయణ= శ్రీహరియొక్క; చరణ= పాదాలయొక్క; స్మరణ= తలవడం; కీర్తన= కీర్తించడం; శ్రవణ= వినడం; సేవా+అర్చన= పూజ చెయ్యడం; నమస్కార= సాగిలబడడం; దాస్య= సేవాభావంతో; ఆత్మసమర్పణ= తనను అర్పించుకొనడం; సఖ్యంబులు+అనియెడు= స్నేహం అనే; త్రిశంత్+లక్షణంబులు= ముప్పది లక్షణాలు; కలుగన్+వలయును= ఉండవలసినవి; అందున్= వారిలో; సత్‌కుల+ఆచారుండు+అయి= మంచి; కులాచారాలుగలవాడై; మంత్రవంతంబులైన= మంత్రాలుగల; గర్భ+ఆధాన+ఆదిసంస్కారంబులు= గర్భాధానం (కార్యము) మొదలగు సంస్కారాలు; అవిచ్ఛన్నంబులుగాన్= భంగం; లేకుండా నిరంతరంగా; కలవాఁడు ద్విజుఁడు= కలిగినవాడు బ్రాహ్మణుడు; ద్విజునకున్= బ్రాహ్మణునికి; యజన-యాజన+అధ్యయన+అధ్యాపన-దాన-ప్రతిగ్రహంబులు+ అనుషట్కర్మంబులు= యాగం చేయడం, చేయించడం, చదవడం, చదివించడం, ఇవ్వడం, తీసికొనడం- అనే ఆరు పనులు; విహితంబులు= విధింపబడినవి; రాజునకున్= క్షత్రియునికి; ప్రతిగ్రహ వ్యతిరిక్తంబులు+అయిన= తీసికోవటానికి భిన్నమయిన; యజన+ఆది= యాగం చేయడం మొదలయిన; కర్మంబులు+అయిదును= పనులు ఐదును; ప్రజాపాలనంబును= జనులను ఏలుట; బ్రాహ్మణులు+కానివారివలనన్= బ్రాహ్మణేతరులనుండి; దండశుల్క+ఆదులు+కొనుటయున్= దండించడం, పన్నులు గ్రహించడం; విహితకర్మంబులు= విధించబడిన పనులు; వైశ్యునికిన్= కోమటికి; కృషివాణిజ్యగోరక్షణ ఆదికర్మంబులు= దున్నుట, సరుకులు కొనుట, అమ్ముట; ఆవులు పెంచుట మొదలయిన పనులు; బ్రాహ్మణకుల+అనుసరణంబును= బ్రాహ్మణకులాన్ని అనుసరించి నడవడం; విహితంబులు= విధించబడిన పనులు; శూద్రునకున్= నాల్గవజాతివారికి; ద్విజశుశ్రూష= బ్రాహ్మణులకు పరిచర్య; చేయన్+వలయును= చేయడం ధర్మం.

**తా :** ధర్మరాజు మాటకు నారదుడు, అతనిని చూచి, సతీదేవియందు విష్ణువు అంశతో కలిగి, లోకరక్షణకై బదరికాశ్రమాన తపస్సుచేసే నారాయణమునివలన ప్రాచీనధర్మమిది-అని విని ఉన్నాను. దానిని నీకు చెప్పెదను.' వినుము. ఎల్లవర్ణాలవారికీ, సత్యం, దయ మొదలయిన ముప్పది లక్షణాలు ఉండాలి అవి సత్యం, దయ, ఉపవాసం (తపస్సు), శౌచం, ఓర్పు, సదసద్ వివేకం, మనోనియమనం, ఇంద్రియజయం, అహింస, బ్రహ్మచర్యం, దానం, జపం, సంతోషం, మృదుత్వం, సమత్వం, మహాజనసేవ, నిష్కామత్వం, నిష్ఫల క్రియాత్యాగం, మితభాషిత్వం, ఆత్మాన్వేషణం, అన్నోదకదానం, ప్రాణులయందు దేవతాబుద్ధి, ప్రాణులయందు ఆత్మబుద్ధి, (శ్రీమన్నారాయణుని) స్మరణం, కీర్తనం, సేవార్చనం, నమస్కారం, దాస్యం, ఆత్మసమర్పణం, సఖ్యం. ఇవి సామాన్య ధర్మాలు. ఇక ప్రత్యేక ధర్మాలు ఇవి: బ్రాహ్మణునికి, ఎవరియింట అంతరాయంలేకుండ గర్భాధానం మొదలయి సంస్కారాలు సాగునో వానికి, యజ్ఞకరణం యజనం, యాజనం (యాగం చేయించడం) చదవడం, చదివించడం, ఇవ్వడం, తీసికొనడం ఈ ఆరు పనులు విధివిహితాలు. రాజునకు ఈ ఆరింట తీసికొనుట తప్పమిగిలిన అయిదు పనులు, బ్రాహ్మణేతరులను దండించుట, వారినుండి పన్నులు గ్రహించుట – ఇవి విధివిహితాలు. వైశ్యునకు దున్నుట, వాణిజ్యం, పాడిపశువుల పోషణ, బ్రాహ్మణుల అనుసరణ-ఇవి విధివిహితాలు. శూద్రునకు విప్రులను సేవించడం విహితక్రియ.

**విశే :** నారదుడు బదరికాశ్రమంలో తపస్సు చేస్తున్న నారాయణుని వల్ల విన్న 30 లక్షణాలుగల 'సనాతన ధర్మము' గురించిన విషయాలు ధర్మరాజుకు తెలిపిన ఘట్టమిది. "సనాతన"మంటే ఎప్పటికీ ఉండేది. నాశంలేనిది. సనాతన ధర్మం 30 లక్షణాలు : 1. సత్యం 2. దయ 3. తపస్సు 4. శౌచం 5. సైరణ 6. సదసద్వివేకం 7. మనోనియమనం 8. ఇంద్రియజయం 9. అహింస 10. బ్రహ్మచర్యం 11. దానం 12. జపం 13. సంతోషం 14. మృదుత్వం 15. సమత్వం 16. మహాజనసేవ 17. నిష్కామత్వం 18. నిష్ఫలక్రియాత్యాగం 19. మితభాషిత్వం 20. ఆత్మాన్వేషణం 21. అనుమోదకదానం 22. ప్రాణులందు దేవతాబుద్ధి 23. ఆత్మబుద్ధి 24. (శ్రీమన్నారాయణుని) స్మరణం 25. కీర్తనం 26. సేవార్చనం 27. నమస్కారం 28. దాస్యం 29. ఆత్మసమర్పణం 30. సఖ్యం. ఇవి సకల వర్ణాల వారికి సమానం.

**సీ. విను, కర్షణాదికవృత్తికంటెను మేలు యాచింప నొల్లని యట్టి వృత్తి**
**ప్రాప్తంబుఁగైకొని బ్రదుకుకంటెను లెస్స యనుదినంబును ధాన్య మడిగికొనుట**
**యాయవారముకంటె నధికకళ్యాణంబు పఱిగ యెన్నుల ధాన్యభక్షణంబు**
**శిలవృత్తికంటెను శ్రేయ మాపణములఁ బడ్డ గింజలు దిని బ్రదుకుఁ గనుట**

**ఆ. యెడరుచోట నృపతి కీ నాల్గువృత్తులుఁ, దగుఁ, బ్రతిగ్రహంబు దగదు తలఁప**
**నాపదవసరముల నధముఁడెక్కువజాతి, వృత్తి నున్న దోషవిధము గాదు. 410**

**ప్రతి :** విను= విను; కర్షణ+ఆదిక వృత్తికంటెను= వ్యవసాయం మొదలయిన వృత్తికంటె; యాచింపన్+ఒల్లని= యాచనకు ఇష్టపడని; అట్టివృత్తి= అలాంటి జీవిక, బ్రదుకుదెరువు; మేలు= ఉత్తమం; ప్రాప్తంబున్+కైకొని బ్రదుకుకంటెను= దొరికినది గ్రహించి దానితో జీవించడంకంటె; అనుదినంబును= ప్రతిదినం; ధాన్యము+అడిగికొనుట= వడ్లను బిచ్చమెత్తుట; లెస్స= ఉత్తమం; యాయవారముకంటెన్= దిన దిన యాచనకంటె; పఱిగ+ఎన్నుల ధాన్యభక్షణంబు= పరిగ ఏరుట వలన వచ్చిన ఎన్నుల నుండి దొరికే ధాన్యాన్ని తినడం; అధికకళ్యాణంబు= ఎక్కువ శుభకరం; శిలవృత్తి కంటెను= పరిగ ఏరి బ్రదుకుటకంటె; ఆపణములఁ బడ్డగింజలు= వాణిజ్య ప్రదేశాలలో కిందబడ్డ గింజలు తిని బతకడం; శ్రేయము= ఉత్తమం; ఎడరుచోటన్= అనువుగాని చోట; నృపతికిన్= రాజునకు; ఈ నాల్గు వృత్తులున్= పైని వివరించిన నాల్గుజీవికలూ; తగున్= అర్హమైనవి; తలఁపన్= ఆలోచించగా; ప్రతిగ్రహంబు+తగదు= తీసికొనుట (దానం) చెల్లదు; ఆపద్+అవసరములన్= ఆపత్సమయాలలో; అధముఁడు= అల్పకులంవాడు; ఎక్కువజాతి వృత్తిన్+ఉన్నన్= పైజాతివాని జీవికతో ఉన్నను; దోషవిధము గాదు= తప్పు పద్ధతి గాదు.

**తా :** 'కృషి' కంటె అయాచన, అంటె బిచ్చమెత్తుకొనకుండా ఉండటం మేలు; దొరికిన దానితో జీవించడంకంటె అనుదిన యాచన ఉత్తమం. దానికంటె పరిగ ఏరి జీవించుట క్షేమం. దానికంటె వ్యాపార ప్రదేశాల జారిపడే గింజలపై బతుకడం మేలు. రాజు చెడినస్థితిలో ఈ నాల్గు విధాల జీవికకు అర్హుడు. ప్రతిగ్రహం మాత్రం అతనికి అనుచితం. ఆపద సమయంలో అల్పకులజుడైనా అధిక వృత్తిలో జీవిస్తే దోషం లేదు.

**వ. వినుము. శిలవృత్తియు నుంఛవృత్తియు ఋత మనియు, నయాచితవృత్తి యమృత మనియు, నిత్యయాచ్ఞావృత్తి మృత మనియుఁ, గర్షకవృత్తి ప్రమృత మనియు నెన్నుదు, రట్టి వృత్తుల జీవించుట మేలు,**

**వాణిజ్యంబు సత్యానృత మనియు, శ్వవృత్తి నీచసేవ యనియుఁ బలుకుదురు, సర్వవేదమయుండు బ్రాహ్మణుండు, సర్వదేవమయుండు క్షత్రియుండు. బ్రాహ్మణక్షత్రియులకు నీచసేవనంబు కర్తవ్యంబు గాదు. 411**

**ప్రతి :** వినుము= జాగ్రత్తగా ఆలకించు; శిలవృత్తియున్= పొలంలో క్రిందబడ్డగింజలు ఏరి బ్రదుకుట; ఉంఛవృత్తియున్= మిగిలిన కంకుల నుండి గింజల గ్రహించుట; ఈ రెండు ఋతము+అనియున్ (అత్యుత్తమని); అయాచితవృతి (బిచ్చమెత్తనిబ్రదుకు); అమృతమనియున్ (ఉత్తమమనీ); నిత్యయాచ్ఞావృత్తి (అనుదిన భిక్షాజీవనం); మృతమనియున్ (ఉత్తమం కానిదని); కర్షకవృత్తి (పొలం దున్ని జీవించడం); ప్రమృతము+అనియున్ (అధమమని); ఎన్నుదురు= లెక్కిస్తారు; అట్టి వృత్తులన్ జీవించుట మేలు= ఆ వృత్తులతో బ్రదుకుట మంచిది; వాణిజ్యంబు= వ్యాపారం; సత్య+అనృతమనియున్= సత్యముగా కనిపించే అసత్యమనీ; నీచసేవ= అల్పుల సేవించుట; శ్వవృత్తియని= కుక్క బతుకనీ; అనియున్+పలుకుదురు= అందురు; బ్రాహ్మణుండు= విప్రుడు; సర్వవేదమయుండు = అన్నివేదాలతో నిండినవాడు; విప్రుండు= బ్రాహ్మణుడు; సర్వదేవమయుండు క్షత్రియుండు= అన్ని దేవతా స్వరూపాలతో నిండినవాడు రాజు; బ్రాహ్మణ క్షత్రియులకున్= విప్రులకు, క్షత్రియులకు; నీచసేవనంబు= అల్పుల సేవ; కర్తవ్యంబు+కాదు= చేయవలసిన పనికాదు.

**తా :** శిల, ఉంఛవృత్తులు రెండూ ఋతమనీ, బిచ్చమెత్తని జీవికను అమృతమనీ, నిత్యమూ యాచించే బ్రదుకు తెరువును మృతమనీ, పొలం దున్ని జీవించటాన్ని ప్రమృతమనీ తలుస్తారు. ఆ వృత్తులతో జీవయాత్ర చేయుట మేలు. వ్యాపారాన్ని సత్య–అనృతమనీ, నీచసేవను శ్వవృత్తి, కుక్కబతుకనీ పిలుస్తారు. బ్రాహ్మణుడు అన్నివేదాల ఆకారం. క్షత్రియునిలో దేవతలందరు నివసిస్తారు. కాగా బ్రాహ్మణ క్షత్రియులకు అల్పులను సేవించుట చేయవలసిన పనిగాదు.

**క. దమమును శౌచముఁ దపమును, శమమును మార్దవముఁ గృపయు సత్యజ్ఞాన,**
**క్షమలును హరిభక్తియు హ, ర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా! 412**

**ప్రతి :** అధిపా!= ధర్మరాజా! అగ్రజాతికిన్= విప్రకులానికి; దమము= బహిరింద్రియ నిగ్రహం; శౌచమున్= శుభ్రత; తపమును= తపస్సు; శమమును= అంతరింద్రియ నిగ్రహం; మార్దవమున్= మెత్తదనమూ; కృపయున్= దయాగుణమూ; సత్యజ్ఞానక్షమలును= సత్యము, తెలివి, ఓర్పులును; హరిభక్తియున్= నారాయణునిపై ప్రీతి, హర్షము= సంతోషం– ఈ గుణాలన్నీ; నిజలక్షణములు= సహజ లక్షణాలు.

**తా :** రాజా! శమదమగుణాలు, తపశ్శౌచాలు, దయ, మృదుత్వం, సత్యజ్ఞానగుణాలు ఓర్పు, హరిభక్తి హర్షం–ఇవి బ్రాహ్మణునికి సహజ లక్షణాలు.

**ఉ. శౌర్యము దానశీలముఁబ్రసాదము నాత్మజయంబుఁ దేజమున్**
**ధైర్యము దేవభక్తియును ధర్మము నర్థముఁ గామమున్ బుధా**
**చార్యముకుందసేవలును సత్కృతియుం బరితోషణంబు స**
**ద్వీర్యము రక్షణంబుఁ బృథివీవరశేఖర! రాజచిహ్నముల్. 413**

**ప్రతి :** పృథివీవరశేఖర!= రాజశ్రేష్ఠా! శౌర్యము= శూరత్వం; దానశీలమున్= ఇచ్చే స్వభావం; ప్రసాదమున్= అనుగ్రహం; ఆత్మజయంబున్= తనను తాను జయించుట (ఆత్మనిగ్రహం); తేజమున్= కాంతీ; ధైర్యమున్= ధీరత్వం; దైవభక్తియునున్=

దేవతలపై భక్తి; ధర్మమున్= ధర్మప్రవృత్తి; అర్థమున్= ధనం; కామమున్= కోర్కెలూ; బుధ= పండితుల; ఆచార్య= గురువుల; ముకుందసేవలును= శ్రీహరి కొలువులూ; సత్కృతియున్= గౌరవించుట; పరితోషణంబున్= సంతోషం; సత్+వీర్యము= మంచి వీరభావం; రక్షణంబున్= కాచుట, ఇవన్నీ రాజచిహ్నముల్= రాజుల లక్షణాలు.

**తా :** రాజా! శౌర్యం, దానగుణం జనులను అనుగ్రహించుట ఆత్మనిగ్రహం, కాంతి, ధైర్యం, దైవభక్తి, ధర్మం, అర్థం, కామం, పండితులను, ఆచార్యులను, విష్ణుమూర్తిని, నిత్యమూ సేవించుట, సత్కర్మముచేయుట, సంతోషం, వీరుడుగా ఉండుట, జనులను రక్షించుట ఇవి రాజ లక్షణాలు.

**క. ధర్మార్థకామవాంఛయు, నిర్మలగురుదేవవిప్రనివహార్చనముల్**
**నిర్మదభావముఁబ్రమదము, శర్మకరత్వమును వైశ్యజనలక్షణముల్. 414**

**ప్రతి :** ధర్మ+అర్థకామవాంఛయున్= ధర్మం, అర్థం, కామం అనే మూడుపురుషార్థాలపై, వాంఛయున్= కోరిక; నిర్మల= పవిత్రులైన; గురుదేవ విప్ర నివహ= గురువులను, దేవతలను, బ్రాహ్మణులను; అర్చనముల్= పూజించటం; నిర్+మదభావమున్= అహంకారంలేని గుణం; ప్రమదము= సంతోషం; శర్మకరత్వమునున్= సంతోషం కలిగించడం– ఇవి వైశ్యజనలక్షణముల్= వైశ్యజనుల లక్షణాలు.

**తా :** ధర్మ అర్థ కామాలు అనే మూడు పురుషార్థాలు వైశ్యులకు ప్రియమైనవి. గురువులను సురలను బ్రాహ్మణులను సేవించుట, మదం లేకుండటం, సంతుష్టి కలిగించడం అనేవి వైశ్యలక్షణాలు.

**ఉ. స్తేయము లేని వృత్తియు శుచిత్వము సన్నుతియున్ నిజేశులన్**
**మాయలు లేక డాయుటయు మంత్రము సెప్పక పంచయజ్ఞముల్**
**సేయుటయున్ ధరామరుల సేవయు గోవుల రక్షణంబు న**
**న్యాయము లేమియున్ మనుజనాథ! యెఱుంగుము శూద్రధర్మముల్. 415**

**ప్రతి :** మనుజనాథ= రాజా!; స్తేయము లేని వృత్తియున్= దొంగతనం లేని బ్రతుకుతెరవు; శుచిత్వము= శుభ్రత; సత్+నుతియున్= సజ్జనులపొగడటం; నిజ+ఈశులన్= తమ నాయకులను; మాయలు లేక= కపటం లేకుండ; డాయుటయున్= సమీపించడమూ; మంత్రము+చెప్పక= మంత్రం లేకుండ; పంచయజ్ఞముల్+చేయుటయున్= ఐదు యజ్ఞాలు చేయడం; ధరా+అమరుల సేవయున్= బ్రాహ్మణులసేవ; గోవుల రక్షణంబు= గోసేవ; అన్యాయము లేమియున్= అన్యాయం లేకుండుట; శూద్ర ధర్మముల్= శూద్రుల ధర్మాలని; ఎఱుంగుము= తెలిసికో.

**తా :** దొంగతనం చెయ్యని జీవితం, పరిశుభ్రత, తమ నాయకులను కపటం లేకుండ సేవించడం, మంత్రరహితంగా పంచయజ్ఞాలు నిర్వహించడం, బ్రాహ్మణుల కొలువు, గోసేవ చెయ్యడం, న్యాయమైన ప్రవృత్తి–ఇవి శూద్ర లక్షణాలు.

**పంచయజ్ఞాలు :** 1. దేవయజ్ఞం 2. ఋషియజ్ఞం 3. పితృయజ్ఞం 4. భూతయజ్ఞం 5. మనుష్యయజ్ఞం – ఇవి పంచమహాయజ్ఞాలు.

**సీ. నిలయము పాటించి నిర్మలదేహయై శృంగార మే ప్రొద్దుఁజేయవలయు**
**సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమ రంజింపవలయు**

**దాక్షిణ్య సంతోష ధర్మమేధాదుల దైవత మని ప్రియుఁదలఁపవలయు**
**నాథుఁ డే పద్ధతి నడచు నా పద్ధతి నడచి సద్బంధుల నడపవలయు**
**ఆ. మార్దవమునఁ బతికి మజ్జన భోజన, శయన పాన రతులు జరపవలయు**
**విభుఁడు పతితుఁడైన వెలఁది ప్రాతివ్రత్య, మహిమఁబుణ్యుఁజేసి మనుపవలయు. 416**

**ప్రతి :** నిలయమున్ పాటించి= ఇంటిని గౌరవించి; నిర్మలదేహ+ఐ= శుభ్రమైన శరీరంతో; ఏ ప్రొద్దున్= ఎల్లపుడూ; శృంగారమున్+చేయవలయున్= అలంకారం చేయాలి; సత్యప్రియ+ఆలాపచతుర+ఐ= నిజమైన ఇంపైన మాటలలో నేర్పరితనంతో; ప్రాణ+ఈశు చిత్తంబు= ప్రాణనాథుని మనస్సు; ప్రేమన్= ప్రీతితో; రంజింపన్+వలయున్= ఆనందింప జేయాలి; ప్రియున్= పతిని; దాక్షిణ్య సంతోష ధర్మ మేధాదులన్= దయ, సంతోషం ధర్మం, మేధాసంపత్తి మొదలైన అంశాలలో; దైవతము+అని= దేవుడని; తలఁపన్+వలయున్= ఎంచాలి; నాథుఁడు+ఏపద్ధతిన్+నడచున్= పతి ఏ మార్గాన నడుస్తాడో; ఆ పద్ధతిన్+నడచి= ఆ మార్గంలోనే నడుస్తూ, సత్+బంధులన్= మంచి చుట్టాలను; నడపవలయున్= ప్రవర్తింప జేయాలి–నడిపించాలి; పతికిన్= భర్తకు; మార్దవమునన్= మృదుత్వంతో; మజ్జన భోజనశయనపానరతులు= స్నానం, భోజనం, శయనం, సేవనం, రతిక్రీడలు; జరపన్+వలయున్= చేయాలి; విభుఁడు= పతి; పతితుఁడైనన్= భ్రష్టుడైతే; వెలఁది= స్త్రీ; పాతివ్రత్యమహిమన్= పతివ్రతాధర్మ ప్రభావంతో; పుణ్యున్+చేసి= పవిత్రునిగావించి; మనుపవలయున్= కాపాడాలి, మార్చుకోవాలి.

**తా :** స్త్రీ, తన ఇంటిని గౌరవిస్తూ, తానూ ఇల్లూ శుభ్రంగా ఒప్పే విధంగా మెలగాలి. పతిని సల్లాపచతురయై సంతోషపరచాలి. పతిని, దేవునిగా భావించాలి. భర్త నడిచే మంచిమార్గాన్నే తానూ అనుసరించాలి. బంధు జనాన్ని గూడ ఆ మార్గంలోనే నడిపించాలి. పతికి స్నానపానాలలో, అన్నపానీయాలలో సంసారసుఖంలో సంతుష్టిని కలిగించాలి. పతి పతితుడైతే, ఆ సతి, తన పాతివ్రత్య ప్రభావంతో, అతనిని సరైన మార్గంలో తీర్చిదిద్దుకోవాలి.

**క. తరుణి దన ప్రాణవల్లభు, హరిభావముగా భజించి యతఁడును దానున్**
**సిరి కైవడి వర్తించును, హరిలోకమునందు సంతతానందమునన్. 417**

**ప్రతి :** తరుణి= స్త్రీ; తన ప్రాణవల్లభున్= తన ప్రాణనాథుని; హరిభావముగాన్= విష్ణుభావంతో; భజించి= సేవించి; హరిలోకము నందున్= వైకుంఠంలో; సంతత+ఆనందమునన్= నిరంతర సంతోషంతో; అతఁడును= తనభర్తా; తానున్= తానూ; సిరి కైవడిన్= లక్ష్మివలె; వర్తించును= జీవిస్తుంది.

**తా :** స్త్రీ, తన పతిని సాక్షాత్తు హరిగా భావించి సేవించాలి, అలా మెలిగినట్లైతే, అనంతరకాలాన వైకుంఠంలో, అతడు హరిగా, తాను సిరిగా నిత్యానందంతో మెలగగలరు.

**క. ఉపవాసంబులు వ్రతములుఁ, దపములు వేయేల? భర్త దైవత మని ని**
**ష్కపటతఁగొల్చిన సాధ్వికి, నృపవర! దుర్లభము లేదు నిఖిలజగములన్. 418**

**ప్రతి :** నృపవర!= రాజశ్రేష్ఠ! సాధ్వికిన్= పతివ్రతకు; ఉపవాసంబులు= ఉపవాసం చెయ్యడం అనే; వ్రతాలు= ఆ పేర వ్రతాలు (నోములు); వేయి+ఏల?= వెయ్యి ఎందుకు? భర్త= పతి; దైవతము+అని= దేవుడు అని; నిష్కపటతన్= కపటం లేకుండా; కొల్చినన్= సేవిస్తే; నిఖిలజగములన్= ఎల్లలోకాలలో; దుర్లభము లేదు= పొందరానిది ఉండదు.

**తా :** రాజా! స్త్రీకి ఉపవాసాది అనేక వ్రతాలతో (నోములతో) పనే లేదు. కేవలం భర్తను దైవభావంతో సేవిస్తే చాలు; ఆమెకు ఎల్లలోకాలలో దొరకనిది ఉండదు.

**వ. మఱియు సంకర జాతులయిన రజక చర్మకారక నట బురుడ కైవర్తక మేద భిల్లురగు నంత్యజాతు లేద్వురకును జండాల పుల్కస మాతంగ జాతులకును నా యా కులాగతంబులయిన వృత్తులఁ జౌర్య హింసాదులు వర్జించి సంచరింపవలయు, మానవులకుఁ బ్రతియుగంబున నైసర్గికంబులైన ధర్మంబులు రెండు లోకంబులందును సుఖకరంబు లని వేదవిదులైన పెద్దలు సెప్పుదురు, కారుకారున దున్నెడు క్షేత్రంబు లావు సెడు, నందుఁ జల్లిన బీజంబులు నిస్తేజంబులై యుండి లెస్సగ నంకురింపవు, నిరంతర ఘృత ధారా వర్షంబున దహనంబునకు దాహకత్వంబు లేక శాంతిం జెందు, నందు వేల్చిన హవ్యంబులు ఫలింపవు, తద్విధంబున ననవరత కామానుసంధానంబున ఁగామోన్ముఖంబైన చిత్తంబు కామంబులఁ దనిసి నిష్కామంబై విరక్తి నొందుం గావున సత్త్వ స్వభావంబు తోడ నెప్పుడుఁ దప్పక నిజవంశానుగత విహిత ధర్మంబున వర్తించు నరుండు మెల్లన స్వాభావిక కర్మపరత్వంబు విడిచి ముక్తి నొందు, జాతిమాత్రంబునఁ బురుషునికి వర్ణంబు నిర్దేశింపం బనిలేదు. శమదమాది వర్ణ లక్షణ వ్యవహారంబులఁ గనవలయు నని మఱియు నారదుం డిట్లనియె. 419**

**ప్రతి :** మఱియున్= ఇంకా; సంకరజాతులు+అయిన= వేర్వేరు జాతుల కలయికతో కల్గిన; రజక చర్మకారక నట బురుడ కైవర్తక మేద భిల్లురు+అగు+అంత్యజాతులు+ఏద్వురకునున్= చాకలి, చర్మకారులు, నటకులు, మేదర, జాలరి, మేద, చెంచులు–అనే కులాలవారు ఏడుగురికి; చండాల పుల్కస మాతంగ జాతులకును= చండాల, బోయ, మాతంగజాతులకు; ఆ+ఆ+కుల+ఆగతంబులు+అయిన= ఆ యా కులాల నుండి వచ్చిన; వృత్తులన్= జీవికలతో; చౌర్యహింసా+ఆదులు వర్జించి= దొంగతనం; హింస–మొదలైనవి వదలిపెట్టి; సంచరింపవలయున్= ప్రవర్తించాలి; మానవులకున్= నరులకు; ప్రతియుగంబునన్= యుగయుగాన; నైసర్గికంబులు+ఐన ధర్మంబులు= సహజాలైన ధర్మాలు; రెండు లోకంబులు+అందును= ఇహపరలోకాలు రెండింట; సుఖకరంబులు+అని= క్షేమకరాలు అని; వేద విదులు+ఐన పెద్దలు+చెప్పుదురు= వేదం తెలిసినవారు చెప్తారు; కారుకారునన్= పంట పంటకు; దున్నెడు క్షేత్రంబులు= సాగుచేసే పొలాలు; లావు+చెడున్= బలము తగ్గుతుంది; అందున్+చల్లిన= అందులో వేసిన; బీజంబులు= విత్తనాలు; నిస్+ తేజంబులు+ఐ+ఉండి= బలం చాలనివై; లెస్సగన్= బాగా; అంకురింపవు= మొలవవు; నిరంతరఘృత ధారావర్షంబునన్= ఎడ తెరపిలేని నేతి ధారలు కురియుటవలన; దహనంబునకున్= అగ్నికి; దాహకత్వంబులేక= కాల్చేశక్తి ఉడిగి; శాంతిన్+చెందున్= ఆరిపోతుంది; అందున్= ఆ అగ్నిలో; వేల్చిన= హోమం చేసిన; హవ్యంబులు= హవిస్సులు; ఫలింపవు= ఫలితాలివ్వవు; తద్+విధంబునన్= ఆ విధంగా; అనవరత కామ+అనుసంధానంబునన్= నిరంతరం కోర్కెలు తీర్చుకొనుటవలన; కామ+ఉన్ముఖంబైన చిత్తంబు= కోర్కెలకు ఆయత్తమైన మనస్సు; కామంబులన్= కోర్కెల వలన; తనిసి= తృప్తిచెంది; నిష్కామంబు+ఐ= కామరహితమై; విరక్తిన్+ఒందున్= వైరాగ్యాన్ని పొందుతుంది; కావునన్= కనుక; సత్త్వస్వభావంబుతోడన్= సాత్త్వికమైన తన మనస్సుతో; ఎప్పుడున్= ఎల్లప్పుడు; తప్పక= తప్పకుండా; నిజవంశ+అనుగత విహిత ధర్మంబునన్= తనకులానుగతం అయి పరంపరగావచ్చిన ధర్మంతో, వృత్తితో; వర్తించునరుండు= జీవించే మానవుడు; మెల్లనన్= నెమ్మదిగా; స్వాభావిక కర్మపరత్వంబు విడిచి= సహజ కర్మలోని లంపటాన్ని వదలి; ముక్తిన్+ఒందున్= మోక్షాన్ని పొందుతాడు; జాతిమాత్రంబునన్= పుట్టుక

మాత్రంచేత; పురుషునికిన్= నరునికి; వర్ణంబు= జాతి; నిర్దేశింపన్+పనిలేదు= నిర్ణయించ పనిలేదు; శమదమ+ఆది వర్ణలక్షణ వ్యవహారంబులన్= శాంతి, నిగ్రహం మొదలయిన జాతి గురుతుల తీరుతెన్నులను; కనన్+వలయున్= చూడాలి; అని; మఱియున్= ఇంకా; నారదుండు+ఇట్లు+అనియెన్= నారదమహర్షి ఇలా పలికాడు.

**తా :** ఇంకా సంకరజాతులయిన చాకలి, చర్మకారుడు, మేదరి, జాలరి, చెంచు-మొదలైన ఏడు కులాలవారు, మాల బోయ మాతంగ మొదలైన జాతులకు చెందినవారు, తమతమ పరంపరాగతాలైన వృత్తులనే చేస్తూ, దొంగతనం హింస మాని, జీవించాలి. నరులకు సహజ ధర్మాలు, రెండు భూ స్వర్గ లోకాలలో క్షేమకరాలని వేదవేత్తలు అంటారు. ప్రతిఋతువుతో తప్పక దున్ని పండించే పొలాలు, కొంతకాలానికి బలహీనపడి, వాటిలో వేసిన గింజలు సరిగా మొలవవు. ఎల్లపుడూ నేతిధారలతో అగ్నిని వేలుస్తూ ఉంటే, అగ్నికూడ చల్లారి, అందలి యజ్ఞహవిస్సులు నిష్ఫలమౌతాయి. అదే విధంగా నిరంతరం కామాదులలో మునిగి తేలుతూవుంటే చివరకు మనస్సు నిష్కామమై వైరాగ్యం పుడుతుంది కనుక సత్త్వస్వభావంతో తన వంశధర్మంలో ప్రవర్తించే మానవుడు స్వాభావిక కర్మలను క్రమంగా విడిచి ముక్తిని పొందుతాడు. కాగా జాతిమాత్రంతో నరుని గుర్తింప పనిలేదు. అతని శమదమాది వర్ణలక్షణాలను, చూచి మెలగవలెనని, నారదుడు ఇంకా ఇలా అన్నాడు.

**క. క్రమమున వర్ణంబుల చి, హ్నము లెల్లను జెప్పఁబడియె నాశ్రమముల ధ,**
**ర్మము లెఱిఁగించెద నన్నియు, సమదాహితహృదయశూల! సదమలశీలా! 420**

**ప్రతి :** సమద+అహిత హృదయశూల!= మదించిన శత్రువులగుండెలకు బల్లెమైన వాడా!; సద్+అమలశీలా!= మంచి నిర్మల స్వభావం గలవాడా!; క్రమమునన్= వరుసగా; వర్ణంబుల= నాల్గువర్ణాలవారి; చిహ్నములు+ఎల్లనున్= లక్షణాలన్నీ; చెప్పన్+పడియెన్= చెప్పబడ్డాయి; ఆశ్రమముల ధర్మములు= నాల్గు ఆశ్రమాల లక్షణాలు; అన్నియున్= మొత్తం; ఎఱిఁగించెదన్= తెలియజేస్తాను.

**తా :** శత్రువుల గుండెలకు శూలం వంటివాడా! నిర్మలశీలుడా! ధర్మరాజా! వరుసగా నాల్గువర్ణాలవారి లక్షణాలు చెప్పాను. ఇక నాల్గు ఆశ్రమాల ధర్మాలు తెలుపుతాను.

**వ. వినుము బ్రహ్మచారి మౌంజీ కౌపీన యజ్ఞోపవీత కృష్ణాజిన పలాశదండ కమండలు ధరుండును. సంస్కారహీన శిరోరుహుండును, దర్భహస్తుండును, శీల ప్రశస్తుండును, మౌనియునై త్రిసంధ్యంబును బ్రహ్మ గాయత్రి జపియించుచు, సాయం ప్రాత రవసరంబుల నర్కపావక గురుదేవతోపాసనంబులు సేయుచు, గురుమందిరంబునకుం జని దాసుని చందంబున భక్తి వినయ సౌమనస్యంబులు గలిగి వేదంబులు చదువుచు నధ్యయనోపక్రమావసానంబుల గురుచరణంబులకు నమస్కరించుచు, రేపు మాపును విహిత గృహంబుల భిక్షించి భైక్షంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మిత భోజనంబు గావించుచు, విహిత కాలంబుల నుపవసించుచు నంగనలందు నంగనాసక్తులందుం బ్రయోజన మాత్రభాషణంబు లొనర్చుచు, గురు పరాంగనలవలన నభ్యంగకేశ ప్రసాధన శరీర మర్దన మజ్జన రహస్య యోగంబులు వర్జించుచు, గృహంబున నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు. 421**

**ప్రతి :** వినుము= జాగ్రత్తగా విను; బ్రహ్మచారి= బ్రహ్మచర్యంలోవున్న విద్యార్థి; మౌంజీ= ముంజగడ్డితో చేసిన మొలతాడు; కౌపీన= గోచి; యజ్ఞ+ఉపవీత= జందెం; కృష్ణ+అజిన= జింకచర్మం; పలాశదండ= మోదుగుకర్ర; కమండలు ధరుండును=

కమండలం అనే నీటి పాత్రను ధరించినవాడు; సంస్కారహీనశిరోరుహుండును= సంస్కారహీనమైన తలగలవాడు; ధర్భహస్తుండును= చేతిలో దర్భలుగలవాడు; శీలప్రశస్తుండును= స్వభావంవలన ప్రసిద్ధుడు; మౌనియును+ఐ= మాటలు మానిన వాడు అయి; త్రిసంధ్యంబును= మూడు సంధ్యలలోను; బ్రహ్మగాయత్రిన్= గాయత్రి మంత్రాన్ని; జపియించుచున్= మననంచేస్తూ; సాయం ప్రాతః+అవసరంబులన్= సాయం సమయం, ఉదయపువేళలలో; అర్కపావక గురుదేవతా+ఉపాసనంబులు+చేయుచున్= సూర్యుని, అగ్నిని, గురువర్యుని ఉపాసన చేస్తూ; గురుమందిరంబునకున్+చని= గురువుగారిఇంటికి వెళ్ళి; దాసుని చందంబునన్= సేవకుని రీతిగా; భక్తి వినయ సౌమనస్యంబులు+కలిగి= భక్తి, అణకువ, మంచి మనస్సులు కల్గి వేదాలు చదువుతు; అధ్యయన+ఉపక్రమ+అవసానంబులన్= అధ్యయనానికి ముందు వెనుకల; గురుచరణంబులకున్+నమస్కరించుచున్= గురుపాదాలకు వందనం చేస్తూ; రేపుమాపును= ఉదయం సాయంకాలం; విహితగృహంబులన్= విధించబడిన, నిర్ణయించబడిన ఇండ్లలో; భిక్షించి= బిచ్చమెత్తి; భైక్షంబు= బిచ్చంగా వచ్చింది; గురువునకున్ నివేదించి= గురువుకు అర్పించి; అనుజ్ఞ+కొని= అనుమతిపొంది; మితభోజనంబు+కావించుచున్= మితమైన భోజనాన్ని చేస్తూ; విహితకాలంబులన్= విధించబడిన సమయాలలో; ఉపవసించుచున్= ఉపవాసాలు చేస్తూ; అంగనలు+అందున్= స్త్రీలతో; అంగనా+ఆసక్తులయందును= స్త్రీలపట్ల ఆసక్తిగలవారితో; ప్రయోజన మాత్రభాషణంబులు+ఒనర్చుచున్= వలసినంత మాత్రమే మాట్లాడటం చేస్తూ; గురు= గురువుయొక్క; పరాంగనలవలనన్= ఇతరులకు సంబంధించిన స్త్రీలవలన; అభ్యంగ= తలస్నానం; కేశప్రసాధన= తలదువ్వుకొనడం; శరీరమర్దన= ఒడలికి నలుగు (పెట్టించుకొనుట); మజ్జన= స్నానమాడటం; రహస్యయోగంబులు= ఏకాంతంలో కలవటాలు; వర్జించుచున్= వదలిపెడుతూ; గృహంబునన్+ఉండక= ఇంట్లో లేక; జిత+ఇంద్రియత్వంబునన్= ఇంద్రియాలను జయిస్తూ; సత్యభాషణుండు+అయి= నిజం పలుకేవాడై; సంచరింపన్+వలయున్= తిరుగాలి.

**తా :** విను. బ్రహ్మచారి, గడ్డి మొలనూలు, గోచి, జందెం, జింకచర్మం, మోదుగుకర్ర, కమండలం–వీటిని ధరించి, శిరోజాలను సంస్కారహీనంగా వదలి, చేత దర్భలను ధరించి, శీలంతో, మౌనంతో మూడు సంధ్యలలో గాయత్రీ జపంచేస్తూ, ఉదయం సాయం వేళలలో సూర్యుని, అగ్నిని, గురువును పూజిస్తూ, గురువు ఇంటిని చేరి, భక్తితో, అణకువతో, మంచి మనసుతో సేవచేస్తూ, వేదాలు చదువుతు, చదువు మొదలా చివరా గురుపాదాలకు నమస్కరిస్తూ, ఉదయ సాయం వేళలలో నిర్ణీత గృహాలలో బిచ్చమెత్తి, వచ్చినదానిని గురువు కర్పించి, అతని అనుమతితో మితంగా భుజించి, ఆయా కాలాలలో ఉపవాసాలు చేస్తూ, స్త్రీలతో, వారిపట్ల ఆసక్తిగలవారితో యెడ ఆసక్తులతో, మితభాషణ చేస్తూ, గురువుగారికి, ఇతరులకు సంబంధించిన స్త్రీలవల్ల నలుగు, తలస్నానం, వీటిని విడిచి, వీటికి దూరంగా ఉంటూ, ఏకాంతంగా వారితో ఉనికి గూడ కలగకుండా, యింట్లో ఉండక, ఇంద్రియాలను జయించి, నిజం పలుకుతూ మెలగవలసి ఉంటుంది.

**ఆ. పొలఁతి దావవహ్ని; పురుషుఁడాజ్యఘటంబు, కరఁగకుండరాదు కదిసెనేని,**
**బ్రహ్మయైనఁ గూఁతుఁ బట్టకమానఁడు, వడుగు కింతి పొత్తు వలదు వలదు. 422**

**ప్రతి :** పొలఁతి= స్త్రీ, దావవహ్ని= కారుచిచ్చు; పురుషుఁడు= మగవాడు; ఆజ్యఘటంబున్= నేతికుండ; కదిసెను+ఏనిన్= దగ్గరయితే; కరఁగక+ఉండన్+రాదు= కరగకుండ ఉండటం జరగదు; బ్రహ్మ+ఐనన్= బ్రహ్మదేవుడైనా; కూఁతున్= కూతురిని; పట్టక మానఁడు= పట్టుకోక ఉండలేడు; వడుగుకున్= బ్రహ్మచారికి; ఇంతిపొత్తు= మగువతోకూడిక; వలదు వలదు= కూడనే కూడదు;

**తా :** స్త్రీ అడవినిప్పు. పురుషుడు నేతికుండ. ఈ రెండూ ఒకచోట చేరితే నేతికుండ కరిగిపోకుండా, బ్రహ్మదేవుడైనా తన కూతురినే తాకకుండ ఉండలేడు. ఇక ఇతరుల మాట చెప్పే దేముంది? కాగా బ్రహ్మచారికి మగువతో పొత్తు కూడనే కూడదు.

**వ. వినుము. స్వరూప సాక్షాత్కారంబున దేహి బహిరింద్రియాదికం బయిన యంతయు నాభాస మాత్రంబుగా నిశ్చయించి యెందాఁక జీవుండు స్వతంత్రుం డయిన యీశ్వరుండు గాకుండు, నంతదడవు నంగన యిది, పురుషుండ నే ననియెడి బుద్ధిమానుట కర్తవ్యంబు గాదు, బ్రహ్మచారి యతి గృహస్థులం దెవ్వఁడైనఁ జిత్తంబు పరిపక్వంబుగాక యద్వైతానుసంధానంబు సేసిన మూఢుండగుం గావున, రహస్యంబునం బుత్త్రిక నైనం దాయకుండవలయు. 423**

**ప్రతి :** వినుము= జాగ్రత్తగా విను; స్వరూపసాక్షాత్కారంబునన్= తన ఆత్మ సాక్షాత్కారంతో; దేహి= ప్రాణి, (మానవుడు); బహిర్+ఇంద్రియ+ఆదికంబు+అయిన+అంతయున్= బయటి ఇంద్రియాలు అన్నీ; ఆభాసమాత్రంబుగాన్= లేనిది ఉన్నట్లుగా అనిపించటమే అని; నిశ్చయించి= నిర్ణయించి; ఎంత+దాఁక= ఎంత వరకు; జీవుండు స్వతంత్రుండు+అయిన= స్వతంత్రుడైనట్టి; ఈశ్వరుండుగాక+ఉండున్= ఈశ్వరుడు కాకుండా ఉంటాడో (అద్వైత స్థితిని పొందడో); అంత+తడవున్= అంతవరకు; అంగన+ఇది= ఈమె స్త్రీ పురుషుండన్ నేను = నేను మగవాడిని; అనియెదు బుద్ధి= అనే ఆలోచన; మానుట= తొలగించుకొనుట; కర్తవ్యంబుగాదు= చేయకూడదు; బ్రహ్మచారి= బ్రహ్మచర్యంలో వున్నవాడు; యతి= సన్న్యాసి; గృహస్థులందున్= గృహస్తులలో; ఎవ్వఁడైనన్= ఏ ఒక్కడుకూడా; చిత్తంబు పరిపక్వంబు గాక= మనస్సు పండక; అద్వైత+అనుసంధానంబు+చేసినన్= అద్వైతభావాన్ని; తనకు అన్వయించుకొంటే, మూఢుండు+అగున్= బుద్ధిహీను డౌతాడు, కావునన్= కనుక; రహస్యంబునన్= ఏకాంత ప్రదేశాన; పుత్రికను+ఐనన్= కూతురినైనా; డాయక+ఉండవలయును= సమీపించక ఉండాలి.

**తా :** రాజా! వినుము. నరుదు, ఆత్మసాక్షాత్కారం పొంది, తన ఇంద్రియాలతోపాటుగా, కనిపించే లోకమంతా ఆభాసమాత్రంగా నిశ్చయించుకొని, తానూ, ఈశ్వరుడూ ఒకటేనని మానవుడు ఎప్పటివరకు గ్రహించలేడో అప్పటివరకు ఈమె స్త్రీ నేను పురుషుడిని అనే భేదంభావం వీడరాదు. బ్రహ్మచారి, సన్న్యాసి, గృహస్థుడు – ఈ ముగ్గురిలో ఎవరైనా, మనఃపరిపాకం లేక అద్వైతసిద్ధాంతాన్ని ఆచరిస్తే, మూఢుడు కాగలడు. అందువల్ల, ఏకాంతంలో కూతురుతోనైనా ఉండకూడదు.

**చ. శిరమున మేన సంస్కృతులు సేయక చందనభూషణాద్యలం**
**కరణము లెల్ల మాని ఋతుకాలమునన్ నిజభార్యఁబొందుచుం**
**దరుణులఁజూడఁబాఱక ధృతవ్రతుఁడై మధుమాంసవర్జియై**
**గురుతరవృత్తితో మెలఁగు కోవిదుఁడొక్క గృహస్థు భూవరా! 424**

**ప్రతి :** భూవరా!= రాజా! శిరమునన్= తలపై; మేనన్= శరీరంమీద; సంస్కృతులు+చేయక= సంస్కారాలు చేసుకొనక; చందన భూషణ+ఆది+అలంకరణములు+ఎల్లన్= గంధం పూసికొనుట, నగలు మొదలయిన అలంకారాలన్నీ; మాని= వదలి; ఋతుకాలమునన్= ఋతుకాలంలో; నిజభార్యన్= తనపత్నిని; పొందుచున్= కలుస్తూ; తరుణులన్= యువతులను; చూడన్+పాఱక= చూడటానికి పరుగెత్తకుండ; ధృతవ్రతుఁడై= దృఢమైన దీక్షగలవాడై; మధుమాంసవర్జియై= మద్యాన్ని మాంసాన్ని విడిచినవాడై; గురుతర వృత్తితోన్= మిక్కిలి గొప్పదైన నడతతో; మెలఁగు= ప్రవర్తించే; కోవిదుఁడు= పండితుడే; ఒక్క గృహస్థు= ఉత్తమ గృహస్తుడు.

**తా :** రాజా! గృహస్థుడైన నరుడు, తలకు ఒంటికి సంస్కారం చేసుకోకుండా శరీరంపై గంధపు పూతలు పూసికొనుట, నగలు ధరించుట మాని, ఋతుకాలంలో మాత్రం తన భార్యతో కూడుచు, ఇతర యువతులకై పరుగులు పెట్టక దీక్షవహించి, మద్యమాంసాలు విడిచిపెట్టి జీవించినవాడే, పండితుడు. అతని జీవనం మహోన్నతం! అతడే సద్గృహస్థు.!

**వ. మఱియు ద్విజుండు గృహస్థుండై గురువుల వలన నుపనిషదంగసహితంబైన వేదత్రయంబును పఠియించి నిజాధికారానుసారంబుగ నర్థవిచారంబు సేసి తన బలంబు కొలంది గురువులకు నభీష్టంబు లొసంగి గృహంబున నొండె, వనంబున నొండె, నైష్ఠికత్వంబు నాశ్రయించి, ప్రాణులతోడ జీవించుచు గురువునందు, నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందు నచ్యుతదర్శనంబు సేయుచు నింద్రియ వ్యసనాదిమగ్నుండు గాక యెఱుక గలిగి వర్తించుచుఁ బరబ్రహ్మంబు నొందు. 425**

**ప్రతి :** మఱియున్= ఇంకా; ద్విజుండు= బ్రాహ్మణుడు; గృహస్థుండు+ఐ= గృహస్థ ధర్మంలో ఉంటూ; గురువుల వలనన్= ఆచార్యులనుండి; ఉపనిషద్+అంగసహితంబు+ఐన= ఉపనిషత్తులతో వేదాంగాలతో కూడినదై; వేదత్రయంబును= వేదాలు మూడిటిని; పఠియించి= చదివి; నిజ+అధికార+అనుసారంబుగన్= తన శక్తికి అనుకూలంగా; అర్థవిచారంబు+చేసి= వేదార్థపు ఆలోచనలు చేసి; తన బలంబు కొలంది= తన సమర్థతను బట్టి; గురువులకున్= ఆచార్యులకు; అభి+ఇష్టంబులు+ఒసంగి= కోరినవి ఇచ్చి; గృహంబునన్+ఒండెన్= ఇంట్లోగాని; వనంబునన్+ఒండెన్= అడవిలోగాని; నైష్ఠికత్వంబును= నిష్ఠాపర్వతాన్ని; ఆశ్రయించి= స్వీకరించి; ప్రాణులతోడన్= జీవులతో; జీవించుచున్= బ్రతుకుతూ; గురువునందున్= ఆచార్యునిలో, అగ్నియందున్= నిప్పులో, ఆత్మయందున్= తనలో, సర్వభూతంబులయందున్= ఎల్లప్రాణులలో; అచ్యుతదర్శనంబు+చేయుచున్= శ్రీహరిని దర్శిస్తూ, ఇంద్రియవ్యసన+ఆదిమగ్నుండు+కాక= ఇంద్రియాలకు లొంగిపోవటం మొదలైన వానిలో మునిగినవాడు గాక; ఎఱుక+కలిగి= జ్ఞానం గలిగి; వర్తించుచున్= నడచుకొంటూ; పరబ్రహ్మంబున్+ఒందున్= పరమాత్మను చేరుతాడు.

**తా :** బ్రాహ్మణుడు గృహస్థాశ్రమం స్వీకరించి, గురువులదగ్గర ఉపనిషత్తులతో అంగాలతో కూడిన మూడువేదాలు చదివి, తన ధీబలానుసారంగా వేదార్థాల విచారణచేసి, తన సమర్థతను బట్టి గురువులకు దక్షిణ లిచ్చి, అనంతరం, తాను తన యింట్లోగాని, అడవిలోగాని ఇతర జీవులతో కలిసి బ్రతుకుతూ, గురువులో, అగ్నిలో, తనలో, ఎల్లప్రాణులలో శ్రీహరి దర్శనం చేస్తూ, ఇంద్రియవ్యసనాలకు లొంగిపోక జ్ఞానవంతుడై, మెలుగుతూ చివరికి పరమాత్మను చేరుతాడు.

**క. వినుము వనప్రస్థునకున్, మునికథితము లైన నియమములు గల వాచొ**
**ప్పున వనగతుఁడై మెలఁగెడి, ఘనుఁడు మహర్లోకమునకు గమనించు నృపా! 426**

**ప్రతి :** నృపా!= రాజా! వినుము; వనప్రస్థునకున్= వానప్రస్థాశ్రమం స్వీకరించినవానికి; మునికథితములు+ఐన= మునులు చెప్పిన; నియమములు+కలవు= కట్టుబాట్లు ఉన్నాయి; ఆ చొప్పునన్= ఆ విధంగా; వనగతుఁడు+ఐ= అడవికి వెళ్లి; మెలఁగెడి ఘనుఁడు= జీవించే ఉత్తముడు; మహర్+లోకమునకున్= ఆ పేరుగల పైలోకానికి; గమనించున్= వెళ్తాడు.

**తా :** రాజా! వానప్రస్థాశ్రమంలో ఉండేవాడికి మునులు చెప్పిన కట్టుబాట్లు ఉన్నాయి. వాటిని పాటిస్తూ అరణ్యంలో జీవించే నరుడు గొప్పవాడు. అతడు మహర్లోకానికి వెళ్తాడు.

**వ. అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనంబునకుంజని, దున్నక పండెడి నీవారాదికంబు లగ్నిపక్వంబుసేసి యొండె నామంబులు సేసియొండె నర్కపక్వంబులైన ఫలాదులొండె భక్షించుచు వన్యాహారంబుల నిత్యకృత్యంబులయిన చరుపురోడాశంబు లొనర్చుచుఁ, బ్రతిదినంబును బూర్వ సంచితంబులు పరిత్యజించి నూతనద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్ని కొఱకుఁ బర్ణశాలయైనఁ బర్వత కందరం బయిన నాశ్రయించుచు, హిమ వాయు వహ్ని వర్షాతపంబులను సహించుచు, నఖ శ్మశ్రు కేశ తనూరుహంబులు ప్రసాధితంబులు సేయక, జటిలుం డై వసియించుచు, దండాజిన కమండలు వల్కల పరిచ్ఛదంబులు ధరియించి పండ్రెండైన, నెనిమిదైన, నాలుగైన, రెండైన నొక వత్సరంబయినఁ దపః ప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై చరించుచు, దైవవశంబున జరారోగంబుల చేతఁజిక్కి నిజధర్మానుష్ఠాన సమర్థుండు గాని సమయంబున నిరశనవ్రతుఁడయి యగ్నుల నాత్మారోపణంబులు సేసి సన్న్యసించి యాకాశంబునందు శరీర రంధ్రంబులును, గాలియందు నిశ్శ్వాసంబును, దేజంబు లోపల నూష్మంబును, జలంబుల రసంబును, ధరణియందు శల్యమాంస ప్రముఖంబులును, వహ్నియందు వక్తవ్యంబుతోడ వాక్కును, నింద్రునియందు శిల్పంబుతోడఁ గరంబులును, విష్ణునియందు గతితోడఁ బదంబులును, బ్రజాపతి రతితోడ నుపస్థంబును, మృత్యువందు విసర్గంబుతోడఁ బాయువును, దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును, వాయువందు స్పర్శంబుతోడఁ ద్వక్కును, సూర్యుని యందు రూపంబుతోడఁ జక్షువులును, సలిలంబులందుఁ బ్రచేతస్సహితయయిన జిహ్వాయు, క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును, జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును, గవియైన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు, రుద్రునియం దహంకారంబుతోడ మమత్వంబును, క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడఁ జిత్తంబును, బరంబునందు గుణంబులతోడ వైకారికంబును డిందించి యటమీఁదఁ బృథివిని జలంబునందును, జలంబును దేజంబు నందును, దేజంబును వాయువునందును, వాయువును గగనంబునందును, గగనంబును నహంకార తత్త్వంబునందును, నహంకారంబును మహత్తత్త్వంబునందును, మహత్తత్త్వంబును బ్రకృతియందును, బ్రకృతి నక్షరుండైన పరమాత్మయందును లయంబు నొందించి, చిన్మాత్రావశేషితుం డయిన క్షేత్రజ్ఞుని నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండైన వహ్నిచందంబునఁ బరమాత్మయైన నిర్వికార పరబ్రహ్మంబునందు లీనుండు గావలయు. 427**

**ప్రతి :** అటమీఁదన్= అటు తరువాత; గృహస్థ+ఆశ్రమంబు విడిచి= గృహస్థాశ్రమాన్ని వదలి; వనంబునకున్+చని= అడవికి వెళ్ళి; దున్నక పండెడి= కృషి లేకుండ స్వయంగా పండే; నీవార+ఆదికంబులు= నివ్వరి అనే ధాన్యం మొదలయినవి; అగ్నిపక్వంబులు+చేసి+ఒండెన్= నిప్పున ఉడికించిగాని; ఆమంబులు+చేసి+ఒండెన్= పచ్చిది గాని; అర్కపక్వంబులైన= సూర్యునివలన పండిన; ఫల+ఆదులు+ఒండెన్= పండ్లు మొదలయినవిగాని; భక్షించుచున్= తింటూ; వన్య+ఆహారంబులన్= వనమందలి ఆహారాలతో; నిత్యకృత్యంబులయిన= ప్రతిదినం చేసే పనులైన; చరుపురోడాశంబులు+ఒనర్చుచున్= హవ్యము; యజ్ఞంకోసంచేసే పిండివంటలు చేస్తూ; ప్రతిదినంబును= ప్రతిరోజూ; పూర్వసంచితంబులు= ముందు పోగుచేసినవి; పరిత్యజించి= వదలి; నూతనద్రవ్యంబులు= కొత్త వస్తువులు; సంగ్రహించుచున్= సంపాదిస్తూ; అగ్నికొఱకున్=

హోమాగ్నిరక్షణకు; పర్ణశాల+ఐనన్= ఆకులతో ఉన్న కుటీరం అయినా; పర్వతకందరంబు+అయినన్= కొండగుహ అయినా; ఆశ్రయించుచున్= చేరుతూ; హిమవాయువహ్నివర్ష+ఆతపంబులను సహించుచున్= మంచు, గాలి, నిప్పు, వాన, ఎండలను ఓర్చుకుంటూ; నఖ–శ్మశ్రు–కేశ–తనూరుహంబులు= గోళ్ళు, మీసాలు, గడ్డాలు, తలవెంట్రుకలు, ఒంటిమీది వెంట్రుకలు, ప్రసాధితంబులు+చేయక= అలంకృతాలుచేయక; జటిలుండై= జడలు తాల్చినవాడై; వసియించుచున్= నివసిస్తూ; దండ+అజినకమండలు వల్కల పరిచ్ఛదంబులు= కఱ్ఱ, జింకచర్మం, కమండలం (నీటిపాత్ర) నారచీరలు, దుప్పట్లు, ధరియించి= ధరించి; పండ్రెండు+ఐనన్, ఎనిమిది+ఐనన్, నాలుగు+ఐనన్, రెండు+ఐనన్, ఒకవత్సరంబు+అయినన్= పన్నెండు, ఎనిమిది, నాలుగు, రెండు ఒకఏడాది లేదా ఎంతకాలమైనా; తపస్+ప్రయాసంబునన్= తపస్సు వల్ల శ్రమతో, బుద్ధినాశంబు+కాకుండన్= తెలివి నశించకుండ; మునియై= ఋషియై; చరించుచున్= తిరుగుతూ; దైవవశంబునన్= దైవం కారణంగా; జరారోగంబులచేతన్+చిక్కి= ముదిమికి జబ్బులకు లొంగి; నిజధర్మ+ అనుష్ఠానసమర్థుండు+కాని= తన ధర్మాచరణకు శక్తిమంతుడుకాని; సమయంబునన్= కాలంలో; నిరశనవ్రతుండు+అయి= భోజనం మాను వ్రతంగలవాడై; అగ్నులన్= నిప్పులను; ఆత్మ+ఆరోపణంబులు+చేసి= ఆత్మలో ఆరోపించి; సన్న్యసించి= అంతా వదలి; ఆకాశంబునందున్= ఆకాశంలో; శరీరరంధ్రంబులును= దేహపుచిల్లులును; గాలిలో నిశ్వాసంబును= వాయువులో నిశ్వాసను; తేజంబులోపలన్= కాంతిలో; ఊష్మంబును= వేడినీ; జలంబులన్= నీళ్ళలో, రసంబును= ద్రవాన్ని; ధరణి+అందున్= భూమిలో; శల్యమాంస ప్రముఖంబులును= ఎముకలు, మాంసం, మొదలయినవాటిని; వహ్నియందున్= నిప్పులో; వక్తవ్యంబుతోడన్ వాక్కును= పలుకవలసిన దానితోపాటు పలుకును; ఇంద్రునియందున్= ఇంద్రునిలో; శిల్పంబుతోడన్+కరంబులును= శిల్పంతోపాటు(వాటిని చేసిన) చేతులు; విష్ణునియందున్= శ్రీహరిలో; గతితోడన్+పదంబులును= నడకతోపాటు కాళ్ళను; ప్రజాపతిన్= ప్రజాపతిలో; రతితోడన్+ఉపస్థంబును= సంభోగంతో యోనీ; మృత్యువందున్= చావులో; విసర్గంబుతోడన్= మలవిసర్జనతోపాటు; పాయువును= ముడ్డిని; దిక్కులందున్= దిశలలో; శబ్దంబుతోడన్= ధ్వనితోపాటు; శ్రోత్రంబును= చెవులును; వాయువునందున్= గాలిలో; స్పర్శంబుతోడన్= స్పర్శతో; త్వక్కును= చర్మమూ; సూర్యునియందున్= సూర్యుని వెలుగులో; రూపంబుతోడన్= ఆకారంతోపాటు; చక్షువులును= కన్నులునూ; సలిలంబులందున్= నీళ్ళలో; ప్రచేతస్+సహిత+అయిన= వరుణునితో కూడిన; జిహ్వయున్= నాలుకయు; క్షితియందున్= భూమిలో; గంధసహితంబయిన= వాసనతోకూడిన; ఘ్రాణంబును= ముక్కునూ; చంద్రునియందు= చంద్రునిలో; మనస్+రథంబులతోడన్= కోర్కెలతోపాటు; మనంబును= మనస్సును; కవి+ఐన బ్రహ్మయందున్= పండితుడైన బ్రహ్మదేవునిలో; బోధంబుతోడన్= జ్ఞానంతోపాటు; బుద్ధియున్= బుద్ధీ; రుద్రునియందున్= శివునిలో; అహంకారంబుతోడన్= నేను అనే భావంతోపాటు; మమత్వంబును= మమకారాన్ని; క్షేత్రజ్ఞునియందున్= పరమాత్మలో; సత్త్వంబుతోడన్= శక్తితోపాటు; చిత్తంబును= మనస్సును; పరంబునందున్= పరబ్రహ్మంలో; గుణంబులతోడన్= గుణాలతోపాటు; వైకారికంబును= వికృతితో కూడిన జీవుణ్ణి; డిందించి= లయం చేసి; అటమీఁదన్= ఆపైన; పృథివిని= భూమిని; జలంబునందును= నీటిలో; జలంబును= నీటిని; తేజంబునందును= ప్రకాశంలో; తేజంబును= ప్రకాశాన్ని; వాయువునందును= గాలిలో; వాయువును= గాలిని; గగనంబునందును= ఆకాశంలో; గగనంబును= ఆకాశాన్ని; అహంకారతత్త్వంబునందును= అహంకార స్వభావంలో; అహంకారంబును= అహంకారాన్ని; మహత్+ తత్త్వంబునందును= బుద్ధితత్త్వంలో; మహత్తత్త్వంబును= బుద్ధితత్త్వాన్ని; ప్రకృతియందును= మూలప్రకృతిలో; ప్రకృతిని= మూలప్రకృతిని; అక్షరుండు+ఐన= నాశంలేని; పరమ+ఆత్మయందును= పరబ్రహ్మంలోను; లయంబును+ఒందించి= కలిపి; చిత్+మాత్ర+అవశేషితుండు+అయిన= చిన్మాత్రంగా మిగిలినవాడైన; క్షేత్రజ్ఞునిన్= పరమాత్మను; అక్షరత్వంబునన్=

స్థిరత్వంలో; ఎఱింగి= గ్రహించి; ద్వయరహితుండై= ద్వంద్వంలేనివాడై; దగ్ధకాష్ఠుండైన= కాలిన కర్రలుగల; వహ్ని చందంబునన్= నిప్పువిధంగా; పరమాత్మయైన= పరబ్రహ్మమయిన; నిర్వికార పరబ్రహ్మంబునందున్= వికారంలేని పరబ్రహ్మలో; లీనుండు= లయమైనవాడు, కలసిపోయినవాడు; కాన్+వలయున్= కావాలి.

**తా :** అటు తరువాత, గృహస్థాశ్రమం వదలి అడవికి వెళ్ళి, కృషి చేయక స్వయంగా పండే నివ్వరి మొదలైన ధాన్యాన్ని వండిగాని వండకగాని, ఎండకు పండిన పండ్లనుగాని తింటూ, అడవిలోని కందమూలాదులతో, నిత్యం చేసే యజ్ఞాలకు హోమద్రవ్యాలు చేస్తూ, అనుదినమూ, ముందురోజు పోగుచేసిన పదార్థాలను వదలి, కొత్తవి సంపాదిస్తూ, అగ్ని రక్షణకోసం పర్ణశాలను గాని, కొండగుహనుగాని ఆశ్రయించి, మంచు, గాలి, నిప్పు, వాన, ఎండలను ఓర్చుకొంటూ, గోళ్ళు, గడ్డాలు, తలవెంట్రుకలు, ఒడలి వెంట్రుకలు – వీటిని సంస్కరించక, కర్ర, తోలు, కమండలం, నారచీరలు, దుప్పట్లు, ధరించి, పన్నెండైనా, ఎనిమిదైనా, నాలుగైనా, రెండైనా, ఒక్కఏడైనా, తపశ్చర్యతో, బుద్ధినాశం జరగకుండ జాగ్రతుడై, మునిగా తిరుగుతూ నివసించాలి. అపుడు విధివశాన ముదిమి, రోగాలు వీని బారినపడి అనుష్ఠాన నిర్వహణకు చాలనివాడైతే, ఆహారం మాని, అగ్నులను ఆత్మలో నిక్షేపించుకొని (అగ్నిక్రియలు మాని) సన్యాసాశ్రమం స్వీకరించి, ఆకాశాన దేహపుచిల్లులను, గాలిలో ఊర్పును (ఉచ్ఛ్వాసనిశ్వాసాలు) తేజస్సులో వేడిని, నీళ్లలో ద్రవాన్ని భూమిలో ఎముకలు మాంసములను, నిప్పులో పలుకవలసిన దానితోపాటు పలుకును, ఇంద్రునిలో చేతతోపాటు చేతిని, హరియందు నడకతోపాటు కాళ్ళను, ప్రజాపతిలో సంభోగంతో పాటు యోనిని, చావున మలంతోపాటు ముడ్డిని, దిక్కులలో శబ్దంతోపాటు చెవిని, గాలిలో స్పర్శతోపాటు తోలును, సూర్యునిలో ఆకారంతోపాటు కళ్ళను, వరుణుడితోడి నాలుకను, భూమిలో వాసనతోడి ముక్కును, చంద్రునిలో కోర్కెలతోపాటు మనస్సును, పండితుడైన బ్రహ్మలో తెలివితోపాటు బుద్ధినీ, శివునిలో అహంకారంతోపాటు, మమకారాన్ని, పరమాత్మలో శక్తితోపాటు మనస్సును, పరబ్రహ్మంలో గుణాలతోపాటు వికృతితో కూడిన జీవుణ్ణి లయింపజేసి, ఆపైన, నేలను నీటిలో, నీటిని తేజస్సులో, తేజస్సును గాలిలో, గాలిని ఆకాశంలోను, ఆకాశాన్ని అహంకారంలో, అహంకారాన్ని బుద్ధిలో, బుద్ధిని ప్రకృతిలో, ప్రకృతిని నాశరహిత పరమాత్మలో, లీనంజేసి, చిన్మాత్రంగా మిగిలిన ఆత్మను శాశ్వతమని గ్రహించి, ద్వంద్వభావాతీతుడై, కర్రలు కాలిన తరువాత మిగిలిన నిప్పువలె, నిర్వికార పరబ్రహ్మంలో లయం కావాలి.

**క. అనఘ! వనప్రస్థుండై, చని తద్ధర్మంబు లిట్లు సలుపుచు మఱియున్**
**మనెనేని సన్న్యసింపం, జను నటమీఁదటను ముక్తసంగత్వమునన్. 428**

**ప్రతి :** అనఘ= పాపరహితా!; వనప్రస్థుండైచని= వానప్రస్థమనే ఆశ్రమంలో ప్రవేశించి; (అడవికి) చని= వెళ్ళి; ఇట్లు= ఈ విధంగా, పైన వివరించినట్లు; తద్+ధర్మంబులు= ఆ ధర్మాలు; సలుపుచున్= చేస్తూ; మఱియున్= ఇంకా; మనెను+ఏని= బతికితే; అటమీఁదటను= ఆపై; ముక్తసంగత్వమునన్= అన్ని సంఘాలను విడిచినవాడై; సన్న్యసింపన్+చనున్= సన్న్యాస ఆశ్రమాన్ని స్వీకరించాలి.

**తా :** రాజా! వానప్రస్థాశ్రమం స్వీకరించి, అడవికి వెళ్ళి, ఆ ఆశ్రమ ధర్మాలు పాటిస్తూ ఇంకా బ్రతికి ఉంటే, అపుడు, సర్వసంగాలను అంటే అన్ని సంబంధ బాంధవ్యాలను వదలి సన్న్యసింప వచ్చు.

**వ. ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుండును, సర్వభూత నిరపేక్షుండును, భిక్షుండును, నిరాశ్రయుండును, నాత్మారాముండును, సర్వభూతసముండును, శాంతుండును,**

**సమచిత్తుండును, నారాయణ పరాయణుండును నై కౌపీనంబను నాచ్ఛాదన మాత్రంబైన వస్త్రంబు ధరియించి దండాది వ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులు గాని శాస్త్రంబులు వర్జించి గ్రహనక్షత్రాది విద్యలనభ్యసింపక భేదవాదంబులైన తర్కంబులు తర్కింపక యెందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వంచించి యుపన్యసింపక బహువిద్యల జీవింపక మత్తాది వ్యాపారంబుల నుల్లసిల్లక, పెక్కు దినంబు లొక్కయెడ వసింపక యూరూర నొక్కొక్క రాత్రి నిలుచుచుఁ, గార్యకారణ వ్యతిరిక్తంబైన పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు, సదసన్మయంబైన విశ్వంబునందుఁ బర బ్రహ్మంబయిన యాత్మ నవలోకించుచు జాగరణ స్వప్న సంధి సమయంబుల నాత్మనిరీక్షణంబు సేయుచు, నాత్మకు బంధమోక్షణంబులు మాయా మాత్రంబులు గాని వస్తుప్రకారంబున లేవనియును, దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును, మృత్యువు ధ్రువం బనియును నెఱుంగుచు, భూతదేహంబుల సంభవనాశంబులకు మూలం బయిన కాలంబుఁ బ్రతీక్షించుచుఁ, నివ్విధంబున జ్ఞానోత్పత్తి పర్యంతంబుఁ జరియించి యటమీఁద విజ్ఞాన విశేషంబు సంభవించినఁ బరమహంసుండై దండాది చిహ్నంబులు ధరియించి యుండె, ధరియింపక యుండె బహిరంగవ్యక్త చిహ్నుండు గాక యంతరంగ వ్యక్తంబైన యాత్మానుసంధానంబు గలిగి మనీషియై బాహ్యానుసంధాన భావంబున మనుష్యులకుఁ దనవలన నున్మత్త బాలమూకుల తెఱంగుఁ జూపుచుండవలయును. 429**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; వానప్రస్థ+ఆశ్రమంబు జరిపి= వానప్రస్థాశ్రమం స్వీకరించి, ముగించి; సన్యసించి= సన్యాసాశ్రమం స్వీకరించి; దేహమాత్ర+అవశిష్టుండును= శరీరంతో మాత్రం మిగిలినవాడు; సర్వభూతనిర్+అపేక్షుండును= అన్నిప్రాణులపై కోరికలు ఉడిగినవాడు; భిక్షుండును= భిక్షువు (బిచ్చమెత్తిబ్రదికేవాడు); నిర్+ఆశ్రయుండును= ఆశ్రయము–ఇల్లు వాకిలి లేనివాడు; ఆత్మ+ఆరాముండును= తనలో తాను క్రీడించువాడును; సర్వభూత సముండును= ఎల్లప్రాణులయెడ సమానుడు; శాంతుండును= శమించినవాడు; సమచిత్తుండును= సమానమైన, భేదంలేని మనస్సుగలవాడు; నారాయణపరాయణుండును= హరితత్పరుడు; ఐ= అయి; కౌపీనంబు+ అను+ఆచ్ఛాదనమాత్రంబు+ఐన= గోచీ మాత్రమైన; వస్త్రంబు ధరియించి= గుడ్డకట్టుకొని; దండ+ఆది వ్యతిరిక్తంబులు= కఱ్ఱమొదలయినవాటికి భిన్నమైనవి; విసర్జించి= విడిచిపెట్టి; ఆత్మపరంబులుగానిశాస్త్రంబులు= ఆత్మకు సంబంధించని శాస్త్రాలు; వర్జించి= విడిచిపెట్టి; గ్రహనక్షత్ర+ఆది విద్యలన్= గ్రహాలకు నక్షత్రాలకు సంబంధించిన విద్యలను= శాస్త్రములను (జ్యోతిషం మొ॥); అభ్యసింపక= చదవక; భేదవాదంబులు+ఐన= జీవాత్మ పరమాత్మలకు భేదం చెప్పు; తర్కంబులు= న్యాయాదిశాస్త్రాలు; తర్కింపక= వాదించక; ఎందును= ఏ విషయంలోనూ; పక్షీకరింపక= పక్షపాతంలేకుండా; శిష్యులకు; గ్రంథంబులు= శిష్యులకు శాస్త్రాలు; వంచించి+ఉపన్యసింపక= మోసగించి చెప్పక; బహువిద్యలన్= పలువిద్యలతో, ప్రదర్శనపు ఆటలతో; జీవింపక= బ్రతుకక; మత్త+ఆదివ్యాపారంబులన్= మదమెక్కివర్తించుట మొదలయిన పనులతో; ఉల్లసిల్లక= ఉల్లాసం పొందక; పెక్కుదినంబులు= ఎక్కువరోజులు; ఒక్క+ఎడన్= ఒక్కస్థలంలో; వసింపక= నివసించక; ఊరు+ఊరన్= ప్రతి ఊరిలోను; ఒక్కొక్క రాత్రి నిలుచుచున్= ఒక్క రేయి మాత్రం ఉంటూ; కార్యకారణ వ్యతిరిక్తంబు+ఐన= కార్య కారణాలకు వ్యతిరేకమైన; పరమాత్మయందున్= పరబ్రహ్మలో; విశ్వంబు; దర్శించుచున్= సర్వాన్ని చూస్తూ; సత్+అసత్+మయంబైన= మంచి

చెడులతో నిండిన; విశ్వంబునందున్= ప్రపంచంలో; పరబ్రహ్మంబయిన యాత్మను= పరబ్రహ్మస్వరూపమైన ఆత్మను; అవలోకించుచున్= చూస్తూ; జాగరణ స్వప్నసంధి సమయంబులన్= మేల్కొనుట, నిద్రించుట, వాటినడుమ సమయాలలో; ఆత్మనిరీక్షణంబు+చేయుచున్= ఆత్మదర్శనం చేస్తూ; ఆత్మకు (జీవునకు); బంధమోక్షణంబులు= బంధం మోక్షం అనునవి; మాయామాత్రంబులుగాని= కేవల మాయలు, అసత్యాలు తప్ప; వస్తుప్రకారంబునన్ లేవు+అనియున్= వాస్తవానికి; ఉండవు అనీ; దేహంబునకున్= శరీరానికి; జీవితంబు ధ్రువంబుగాదు+అనియున్= జీవించి ఉండటం శాశ్వతం గాదనీ; మృత్యువు ధ్రువంబనియునున్= చావు తప్పనిదనీ; ఎఱుంగుచున్= గ్రహిస్తూ; భూతదేహంబులన్= ప్రాణులశరీరాల; సంభవనాశంబులకున్ మూలంబయిన కాలంబున్= పుట్టుట గిట్టుటలకు కారణమైన కాలంకోసం; ప్రతీక్షించుచున్= నిరీక్షిస్తూ; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; జ్ఞాన+ఉత్పత్తి పర్యంతంబున్= జ్ఞానం కలిగేవరకు; చరియించి= తిరిగి; అటమీఁదన్= ఆ పైన; విజ్ఞానవిశేషంబు= విశేషజ్ఞానం; సంభవించినన్= పుడితే; పరమహంసుండై= పరమహంసయై, సిద్ధుడై; దండ+ఆదిచిహ్నంబులు= కఱ్ఱమొదలయిన గుర్తులు; ధరియించి+ఒండెన్, ధరియింపక+ఒండెన్= వహించి గాని, వహింపక గాని; బహిర్+అంగవ్యక్తచిహ్నుండు+కాక= బయటకు తెలిసే లక్షణాలు గలవాడుగాక; అంతర్+అంగవ్యక్తంబైన= మనస్సులో మాత్రం కనిపించే; ఆత్మ+అనుసంధానంబుకలిగి= ఆత్మతో కలిసికోవటం కలిగి; మనీషి+ఐ= పండితుడై; బాహ్య+అనుసంధానభావంబునన్= బయటి కలయికతోడి ప్రవర్తనతో; మనుష్యులకున్= నరులకు, తోటి సామాన్యులకు; తన వలనన్= తననుండి; ఉన్మత్త బాలమూకుల తెఱంగున్+చూపుచున్+ఉండవలయున్= పిచ్చివాని, అర్భకుని, మూగవాని విధానాన్ని, ప్రదర్శిస్తూ ఉండాలి.

**తా :** మూడవదైన వానప్రస్థాశ్రమానంతరం; నరుడు నాల్గవదీ చివరిదీ అయిన సన్యాసాన్ని స్వీకరించాలి. సన్యాసమంటే శరీరంమాత్రం మిగిలి, మిగిలినదంతా వదలిపోవడం. ఆ స్థితిలో సన్యాసికి ఎల్లజీవులు సమానం. అయితే అతనికి ఏ జీవితోను పని ఉండదు. బిచ్చంతో జీవించాలి. ఏ ఆధారం అతని కుండకూడదు. ఒంటరిగా ఆత్మయందే క్రీడించే మనస్థితి ఉండాలి. సర్వభూతాలలో సమత్వం, శాంతస్వభావం, సముచితత్వం, నారాయణ పరాయణత్వం కలవాడై శరీరంపై గోచీ ఒక్కటే వస్త్రంగా ధరించి, కఱ్ఱ తప్ప మిగిలిన పూర్వాశ్రమ సంచితమంతా విడిచిపెట్టాలి. ఆత్మజ్ఞానం చెప్పని శాస్త్రాలు విడిచిపెట్టాలి. గ్రహనక్షత్రాదులను గూర్చి చెప్పే జ్యోతిషాన్ని, జీవేశ్వర భేదమును చెప్పు తర్కశాస్త్రాన్ని చర్చించరాదు. దేనియందును పక్షపాతం లేక శిష్యులను మోసగించి గ్రంథాలకు విపరీతార్థాలు చెప్పక, వైద్యాది విద్యలతో జీవింపక, మత్తు కలిగించే వృత్తితో సంతోషించక ఉండాలి. ఒకచోట పలుదినాలు నివసింపరాదు. దినానికొక ఊరు మారి తిరగాలి. కార్యకారణభావానికి అతీతమైన పరమాత్మలో విశ్వాన్ని దర్శిస్తూ, మంచిచెడులతోకూడిన లోకమంతా పరమాత్మ దర్శనమే చేయగలగాలి. మెలకువలోనైనా, కలలోనైనా, నిద్ర నుండి లేచు సమయములోనైనా ఆత్మదర్శనమే చేయాలి. ఆత్మకు నిజంగా బంధం, ముక్తి లేవని, అవి లోకవ్యవహారంకోసం ఏర్పడ్డాయనే ఎరుక సన్యాసికి ఉండాలి. దేహానికి జీవితం శాశ్వతం కాదని మరణం తప్పదని గ్రహించాలి. ప్రాణుల పుట్టుక చావులకు మూలమైన కాలాన్ని దర్శిస్తూ జీవనయాత్ర సాగిస్తున్న సమయంలో సన్యాసికి విశేషజ్ఞానం కలిగితే, అపుడతడు పరమహంసగా మారే వీలుంది. ఆ స్థితిలో అతడు తన ఇష్టంకోసం, సన్యాసాశ్రమపు గుర్తులు త్యజించినా, ధరించినా భేదముండదు. లోకం కోసం సన్యాస చిహ్నాన్ని ధరించనక్కర లేదు. అయితే బాహ్యప్రపంచం తనను తిరస్కరించకుండ జీవిక సాగించాలి. పరమహంసస్థితిలో ఆత్మానుభూతమైన ఆనందాన్ని అంతరంగాన వహించి, బయటకు, తాను పిచ్చివానివలె పిల్లవానివలె అపుడపుడు మూగవానివలె కనిపించాలి.

## ✤ ప్రహ్లాదాజగర సంవాదము ✤

**క. మునివల్లభుఁడజగరుఁడను, సునయుండు హిరణ్యకశిపు సూనుండును ము**
**న్నొనరించిన సంవాదము, విను మీ యర్థంబునందు వెలయు నరేంద్రా! 430**

**ప్రతి :** నర+ఇంద్రా!= ఓ రాజా!; మునివల్లభుఁడు= ఋషిశ్రేష్ఠుడైన; అజగరునకున్= అజగరుడు అనే పేరుగలవాడికి; సునయుండు= మంచినీతి గలవానికి; హిరణ్యకశిపు సూనుండును= ప్రహ్లాదుడు; మున్ను= పూర్వం; ఒనరించిన సంవాదము= చేసిన సంభాషణం; వినుము= శ్రద్ధగా విను; అందున్= దానిలో; ఈ+అర్థంబున్= మనమిపుడు చెప్పుకొనే ఈ విషయం గూడ; వెలయున్= ఉన్నది;

**తా :** రాజా! పూర్వం అజగరుడు అనే మునికి; హరిభక్తుడైన ప్రహ్లాదునకు మధ్య నడిచిన సంవాదం, నీకు నేనిపుడు చెప్పే అంశాలకు సంబంధించిందే. దానిని శ్రద్ధగా విను.

**వ. తొల్లి భగవత్ప్రియుండయిన ప్రహ్లాదుండు కతిపయామాత్య సమేతుండయి లౌకికతత్త్వంబు నెఱింగెడి కొఱకు లోకంబుల సంచరించుచు నొకనాఁడు కావేరీతీరంబున సహ్యపర్వత తటంబున ధూళి ధూసరితంబు లయిన కరచరణాద్యవయవంబుల తోడ గూఢంబైన నిర్మల తేజంబుతోఁ గర్మాకారవచోలింగ వర్ణాశ్రమాదుల నెవ్వరికి నెఱుంగఁబడక నేల నిద్రించుచు నజగర వ్రత ధరుండైన మునిం గని డాయం జని విధివత్ప్రకారంబున నర్చించి మునిచరణంబులకు శిరంబు మోపి మ్రొక్కి యతని చరిత్రంబు దెలియ నిశ్చయించి యి ట్లనియె. 431**

**ప్రతి :** తొల్లి= పూర్వం; భగవత్ ప్రియుండు+అయిన ప్రహ్లాదుండు= (విష్ణుమూర్తికి ఇష్టుడయిన)ప్రహ్లాదుడు; కతిపయ+అమాత్య+ సమేతుండు+అయి= కొందరు మంత్రులతో కూడి; లౌకికతత్త్వంబున్+ఎఱింగెడి కొఱకున్= లోకపు స్వభావాన్ని గ్రహించటానికై; లోకంబులన్= లోకాలలో; సంచరించుచున్= తిరుగుతూ; ఒకనాఁడు= ఒకదినాన; కావేరీతీరంబునన్= కావేరి నది ఒడ్డున; సహ్యపర్వతతటంబునన్= సహ్యం అనే పర్వత సమీపంలో; ధూళి ధూసరితంబులయిన= దుమ్ముతో బూడిద రంగుగలవయిన; కరచరణ+ఆది+అవయంబులతోడన్= చేతులు కాళ్ళు మొదలయిన అంగాలతో; గూఢంబైన= దాగిఉన్న; నిర్మలతేజంబుతోడన్= పవిత్రకాంతితో; కర్మ+ఆకార, వచస్+లింగ వర్ణ+ఆశ్రమాదులన్= పనులతో; రూపంతో; మాటతో; స్త్రీ పుంలింగంతో; కులంతో; ఆశ్రమం మొదలయినవాటితో; ఎవ్వరికిన్+ఎఱుంగన్+పడక= ఎవరికీ తెలియరాక; నేలన్= నేలపై; నిద్రించుచున్= నిద్రిస్తున్న; అజగరవ్రతధరుండైన= కొండచిలువ వ్రతాన్ని పూనిన; మునిన్+కని= ఋషినిచూచి; డాయన్+చని= సమీపానికి వెళ్ళి; విధివత్ ప్రకారంబునన్= శాస్త్రప్రకారంగా; అర్చించి= పూజించి; మునిచరణంబులకున్= ఋషికాళ్ళకు; శిరంబుమోపి= తల ఆనించి; మ్రొక్కి= నమస్కరించి; అతనిచరిత్రంబు= అతని నడత, పుట్టు పూర్వములు; తెలియన్+నిశ్చయించి= ఎరుగుటకు నిర్ణయించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** మహాభక్తుడైన ప్రహ్లాద చక్రవర్తి పూర్వం లౌకిక తత్త్వం తెలుసు కోవాలనుకొన్నాడు. కొందరు మంత్రులను వెంట తీసుకొని లోకసంచారం చేయసాగాడు. అలా ప్రయాణిస్తూ కావేరీ నదీ తీరం చేరుకొన్నాడు. అక్కడ సహ్యపర్వతాలు విస్తరించి ఉన్నాయి. ప్రహ్లాదుడు ఆ పర్వతసానువులలో సంచరిస్తుండగా, ఆ ప్రదేశంలో దుమ్ము కొట్టుకొని పోయిన దేహంతో అజగరుడనే ముని శయనించి ఉన్నాడు. శరీరం ధూళితో నిండి ఉన్నా ఆయన అద్భుతమైన తేజస్సు నిగూఢంగా వెలుగుతున్నది. కార్యంవల్ల కానీ, ఆకారంవల్ల కానీ, మాటవల్ల కానీ, లింగభేదంవల్ల కానీ వర్ణాశ్రమాదులవల్ల కానీ,

ఏమాత్రం గుర్తించటానికి వీలులేకుండా కొండ చిలువవలె నిర్వికారంగా నేలపై పడుకొని ఉన్నాడు. ప్రహ్లాదుడు మహామహిమాన్వితుడైన ఆ మునీశ్వరుని సమీపించి యథా విధిగా పూజించి నమస్కరించాడు. ఆ మునీశ్వరుని పవిత్ర చరిత్ర తెలుసుకోవాలని నిశ్చయించుకొని ఇలా పలికాడు.

**సీ. భూమి నుద్యోగియై భోగియై యుండెడి, నరునికైవడి మునినాథ! నీవు**
**ఘనశరీరము దాల్చి కదలవు, చిత్ర, ముద్యమయుక్తునకుఁ గాని ధనము లేదు,**
**ధనవంతునకుఁగాని తగు భోగములు లేవు, భోగికి గాని సంపూర్ణమైన**
**తనువు లే, దుద్యోగధనభోగములు లేక నేల నూరక వడి నిద్ర వోవు**

**ఆ. నీకు నెట్లు గలిగె నిరుపమదేహంబు?, సముఁడ వార్యుఁడవు, విశారదుఁడవు,**
**బుద్ధినిధివి, జనులఁబొగడవు, దెగడవు, నిద్ర ప్రతిదినంబు నిలుపనేల? 432**

**ప్రతి :** మునినాథ= మునిరాజా! భూమిన్= నేలపై; ఉద్యోగియై= (ప్రయత్నంగలవాడై) పనిగలవాడై; భోగియై= అనుభవం గలవాడై; ఉండెడి నరునికైవడిన్= జీవించే మానవునివలె; నీవు ఘనశరీరము+తాల్చి= నీవు పెద్ద దేహము ధరించి; కదలవు= చలింపవు; చిత్రము= ఆశ్చర్యం; ఉద్యమయుక్తునకున్+కాని= ప్రయత్నించేవారికి తప్ప తక్కినవారికి; ధనము లేదు= డబ్బు రాదు; ధనవంతునకున్+కాని= డబ్బుగలవానికి తప్ప; తగు భోగములు లేవు= తగిన సుఖాలు ఉండవు; భోగికిన్+కాని= సుఖం ఉన్నవారికి తప్ప; సంపూర్ణమైన తనువు లేదు= పుష్టిగల దేహం లేదు; ఉద్యోగధనభోగములు= ఏ పని చెయ్యక ధనంలేక ఏసుఖం లేక; నేలన్= భూమిపై; ఊరకపడి నిద్ర+పోవు నీకున్= పనిలేక పడి నిద్రించే నీకు; నిర్+ఉపమదేహంబు= ఇలాంటి సాటిలేని శరీరం; ఎట్లు కలిగెన్= ఎలా ఏర్పడింది? సముఁడవు= సమత్వం కలవాడివి; ఆర్యుఁడవు= పూజ్యుడవు; విశారదుఁడవు= పండితుడవు; బుద్ధినిధివి= తెలివికి గనివి; జనులన్= ప్రజలను; పొగడవు= కీర్తించవు; తెగడవు= నిందించవు; ప్రతిదినంబున్= అనుదినం; నిద్ర నిలుపన్+ఏల?= నిద్రిస్తున్నావెందుకు?

**తా :** ఋషివర్యా! లోకాన పనీ పాటా చేస్తూ, అన్నపానాదులను అనుభవిస్తూ ఉండే వానివలె పెద్దదేహం ధరించి ఉన్నావు; కాని కదలవు; మెదలవు; చిత్రం! పని చేసేవానికే ధనం వస్తుంది. ధనవంతునకే భోగం కలుగుతుంది, సుఖం అన్నపానాదులు ఉన్నవానికే నిండైన దేహం ఉంటుంది. పని, ధనం, సుఖం–ఏవీలేకుండ నీకు ఈ సాటిలేని తేజోవంతమైన దేహం ఎలా కలిగింది? సమాన భావంతో, పాండిత్యంతో, బుద్ధిబలంతో వెలిగే నీవు ఎవరినీ పొగడవు; అట్లని తెగడవు కూడ. మరి ప్రతిదినం ఇలా నిద్రలో కాలం గడుపుతున్నావేమిటి?

**వ. అని యిట్లు ప్రహ్లాదుం డడిగిన వికసితముఖుండయి మునీంద్రుండు తదీయ మధురాలాపసుధారస ప్రవాహంబులు కర్ణంబులఁబరిపూర్ణంబులైన నతని నవలోకించి యిట్లనియె. 433**

**ప్రతి :** ఇట్లు+అని= ఈ విధంగా; ప్రహ్లాదుండు అడిగినన్= ప్రహ్లాదుడు అడుగగా; వికసితముఖుండయి= విప్పారిన మోముగలవాడై; ముని+ఇంద్రుండు= ఋషిశ్రేష్ఠుడు; తదీయ మధుర+ఆలాప సుధారసప్రవాహంబులు= అతని తియ్యని మాటల అమృతపు ఏరులు; కర్ణంబులన్= చెవులలో; పరిపూర్ణంబులు+ఐనన్= నిండగా; అతనిన్+అవలోకించి= అతణ్ణి చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తా :** ప్రహ్లాదుని సుమధురమైన మాటలను వినిన అజగర మునీంద్రుడు విప్పారిన ముఖంతోను చిరునవ్వుతోనూ చూస్తూ ఇలా బదులిచ్చాడు.

**సీ. ఆంతరంగికదృష్టి నంతయు నెఱుఁగుదు, వార్యసమ్మతుఁడ వీ వసురవర్య!**
**విశ్వజంతువుల ప్రవృత్తి నివృత్తి లక్షణములు నీ యెఱుంగనివి లేవు,**
**భగవంతుఁడగు హరి పాయక నీ మనో వీథి రాజిల్లుచు వెలుఁగుతేని**
**క్రమమున బహుళాంధకారంబుఁబరిమార్చుఁ బరమసాత్త్వికుఁడవు, భద్రబుద్ధి**

**ఆ. వైన నీవు నన్ను నడిగెదు గావున, విన్న ధర్మమెల్ల విస్తరింతు,**
**నిన్నుఁజూడఁగలిగె నీ తోడిమాటల, నాత్మశుద్ధి గలిగె ననఘచరిత! 434**

**ప్రతి :** అసురవర్య!= రాక్షసశ్రేష్ఠ! ఆంతరంగికదృష్టిన్= లోపలిచూపుతో; అంతయున్+ఎఱుఁగుదువు= సమస్తమూ నీకు తెలుసు; ఆర్య సమ్మతుఁడువు= ఆర్యులకు అంగీకృతుడవు; ఈవు= నీవు; విశ్వ జంతువుల= ఎల్లజీవుల; ప్రవృత్తి నివృత్తి లక్షణములు= ప్రవృత్తి నివృత్తి లక్షణాలు; నీ యెఱుంగనివి= నీకు తెలియనివి; లేవు= ఉండవు; భగవంతుఁడగు హరి= దేవుడయిన విష్ణువు; పాయక= విడువక; నీమనస్+వీథిన్= నీ హృదయమనే దారిలో; రాజిల్లుచున్= వెలుగొందుతూ; వెలుఁగుతేని క్రమమునన్= సూర్యుని విధంగా; బహుళ+అంధకారంబున్= గాఢమైన నల్లని చీకటిని, పరిమార్చున్= నశింపజేస్తాడు; పరమసాత్త్వికుఁడవు= గొప్ప సత్త్వగుణుడవు; భద్రబుద్ధివి+ఐన= శుభకరమైన తెలివి గలవాడయిన; నీవు నన్నున్+అడిగెదు= నీవు నన్ను అడుగుతున్నావు; కావునన్= కాబట్టి; విన్న ధర్మము+ఎల్లన్= విన్న ధర్మమంతా; విస్తరింతున్= వివరిస్తాను; అనఘచరిత!= పుణ్యచరితా!; నిన్నున్+చూడన్= నిన్ను చూడటం; కలిగెన్= సిద్ధించింది; నీతోడిమాటలన్= నీతో మాటలవలన; ఆత్మశుద్ధి కలిగెన్= మనశ్శుద్ధి సమకూడింది;

**తా :** రాక్షసోత్తమ! పుణ్యచరితా! సజ్జన సమ్మతి బడసిన నీవు, లో చూపుతో సర్వజ్ఞుడివి! నీకు తెలియని ప్రవృత్తి నివృత్తి ధర్మాలు లేవు. దేవుడయిన శ్రీహరి నీ మనస్సులో సూర్యునివలె వెలుగుతూ, చీకట్లు హరించి వేయగా, నీవు పరమ సత్త్వగుణసంపన్నుడవైనావు. శుభశీలుడవైన నీవు, నన్ను కోరినావు గావున నేను విన్న ధర్మమంతటిని నీకు వివరిస్తాను. నిన్ను చూడటం నీతో మాట్లాడంతో ఆత్మశుద్ధి కలుగుతుంది.

**వ. వినుము, ప్రవాహకారిణియై విషయంబులచేతం బూరింపరాని తృష్ణచేతం బడి కర్మంబులఁ బరిభ్రామ్యమాణుండనైన నేను నానావిధ యోనులందుఁ బ్రవేశించుచు, వెడలుచు నెట్టకేలకు మనుష్యదేహంబు ధరియించి యందు ధర్మంబున స్వర్గ ద్వారంబును, నధర్మంబున శునకసూకరాది తిర్యగ్జంతు యోని ద్వారంబుల నొంది క్రమ్మఱ మనుష్యుండనై పుట్టవలయు నని వివేకించి సుఖరక్షణ దుఃఖమోక్షణంబుల కొఱకు ధర్మంబు సేయు దంపతుల వ్యవహారంబు గని సర్వక్రియా నివృత్తి గలిగిన జీవుండు స్వతంత్రుఁడై ప్రకాశించునని నిర్ణయించి భోగంబులు మనోరథ జాత మాత్రంబులు గాని, శాశ్వతంబులు గావని పరీక్షించి నివృత్తుండనై యుద్యోగంబు లేక నిద్రించుచుఁ బ్రారబ్ధభోగంబుల ననుభవించుచు నుండుదు, నివ్విధంబునఁ దనకు సుఖరూపంబైన పురుషార్థంబు దనయందుఁ గలుగుట యెఱుఁగక పురుషుండు శైవాలజాల నిరుద్ధంబులైన**

**శుద్ధజలంబుల విడిచి యెండమావులు జలంబులని పాఱెడు మూఢుని వడువున సత్యంబుగాని ద్వైతంబుఁ జొచ్చి ఘోర సంసార చక్ర పరిభ్రాంతుండైయుండు దైవతంత్రంబులైన దేహాదుల చేత నాత్మకు సుఖంబును దుఃఖనాశనంబునుం గోరుచు నిరీశుండైన వాని ప్రారంభంబులు నిష్ఫలంబులగు, నదియునుంగాక మర్త్యునకు ధనంబు ప్రాప్తంబయిన నది దుఃఖకరంబుగాని సుఖకరంబు గాదు, లోభవంతులయిన ధనవంతులు నిద్రాహారంబులు లేక రాజచోర యాచక శత్రుమిత్రాది సర్వస్థలంబులందును శంకించుచు దానభోగంబులు మఱచి యుండుదురు, ప్రాణార్థవంతులకు భయంబు నిత్యంబు, శోకమోహ భయక్రోధరాగశ్రమాదులు వాంఛామూలంబులు, వాంఛ లేకుండవలయును. 435**

**ప్రతి :** వినుము= బాగా ఆలకించవలసింది; ప్రవాహకారిణియై= పారుటను చేయునదై; విషయంబులచేతన్= వస్తువులచేత; పూరింపరాని= నింపలేని; తృష్ణచేతన్+పడి= ఆశబారినపడి; కర్మంబులన్= పనులవలన; పరిభ్రామ్యమాణుండనైన= త్రిప్పబడుచున్న; నేను నానావిధయోనులందున్= నేను పలురకాల జన్మలలోను; ప్రవేశించుచున్+వెడలుచున్= పుడుతూ, చస్తూ; ఎట్టకేలకున్= చిట్టచివరకు; మనుష్యదేహంబుధరియించి= నరునిశరీరం తాల్చి; అందున్= ఆ శరీరంలో; ధర్మంబునన్= ధర్మంవలన; స్వర్గద్వారంబును= స్వర్గపువాకిలిని; అధర్మంబునన్= అధర్మంవలన; శునకసూకర+ఆది తిర్యక్+జంతుయోని ద్వారంబులన్= కుక్కలు, పందులు మొదలయిన పశువుల యోనుల వాకిళ్ళను; ఒంది= పొంది; క్రమ్మఱన్= మరల; మనుష్యుండై పుట్టవలయును+అని= మనుష్యునిగా పుట్టాలికదా అని!; వివేకించి= తెలివితో గ్రహించి; సుఖరక్షణ దుఃఖమోక్షణంబులకొఱకున్= సుఖాలు కాపాడుకోవటానికి; దుఃఖాలు వదిలించుకోవటానికి; ధర్మంబు+చేయు= ధర్మం ఆచరించు; దంపతుల వ్యవహారంబు= ఆలుమగల ప్రవర్తనను; కని= చూచి; సర్వక్రియా నివృత్తి= అన్ని పనులనుండి మరలుట; కలిగిన జీవుండు= కల్గిన ప్రాణి; స్వతంత్రుడై ప్రకాశించును+అని నిర్ణయించి= తనకు తాను అధిపతి అయి వెలుగుతాడు అని నిశ్చయించి; భోగంబులు= అనుభవాలు; మనస్+రథ జాతమాత్రంబుగాని= కోరికలతో మాత్రమే పుట్టినవి తప్ప; శాశ్వతంబులు+కావని పరీక్షించి= నిత్యమైనవి కావని గ్రహించి; నివృత్తుండను+ఐ= పనులనుండి మరలినవాడనై; ఉద్యోగంబులేక= పనిపాటులులేక; నిద్రించుచు= నిద్రిస్తూ; ప్రారబ్ధభోగంబులను= ప్రారబ్దంవలన కలిగిన సంపదలను; అనుభవించుచున్= పొందుతూ; ఉండుదున్= పడి ఉండేవాడిని; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; తనకున్; సుఖరూపంబైన పురుషార్థంబు= సుఖపు ఆకారంగల ప్రయోజనం; తనయందు+అ= తనలోనే; కలుగుట= కలగడం; ఎఱుంగక= తెలియక; పురుషుండు= నరుడు; శైవాలజాలనిరుద్ధంబులైన= నాచుప్రోగులచే అడ్డగింపబడినవైన; శుద్ధజలంబులు విడిచి= తేటనీళ్ళు వదిలి; ఎండమావులు జలంబులని= ఎండమావులను నీళ్ళని; పాఱెడుమూఢునివడువునన్= పరుగెత్తే బుద్ధిలేనివాని విధంగా; సత్యంబుగాని= అబద్ధమైన; ద్వైతంబున్+చొచ్చి= తాను వేరు దైవం వేరను భావాన్నిపూని; ఘోర సంసార చక్ర పరిభ్రాంతుండు+ఐ+ఉండున్= భయంకరమైన సంసారమనే చక్రంలో పడి తిరుగుతూ నిలుస్తాడు; దైవతంత్రంబులు+ఐన= దైవాధీనాలయిన; దేహ+ఆదులచేతన్= శరీరంమొదలైన వాటిచేత; ఆత్మకున్= తనకు; సుఖంబును= సుఖాన్ని; దుఃఖనాశంబునున్+కోరుచున్= దుఃఖపులేమిని కాంక్షిస్తూ; నిర్+ఈశుండైనవాని ప్రారంభంబులు= దైవంలేని వాని పనులు; నిస్+ఫలంబులు+అగున్= ప్రయోజనంలేనివి అగును; అదియునున్+కాక= అదేగాకుండ; మర్త్యునకున్= నరునికి; ధనంబు= డబ్బు; ప్రాప్తంబు+అయినన్= దొరికితే; అది దుఃఖకరంబుగాని సుఖకరంబుగాదు= ఆ ధనం దుఃఖాన్నిచ్చేదేగాని సుఖాన్నిచ్చేదేగాదు; లోభవంతులు+అయిన ధనవంతులు= పిసినిగొట్టువారైన ధనవంతులు;

నిద్రా+ఆహారంబులులేక= నిద్ర భోజనంమాని; రాజ= రాజువలన; చోర= దొంగవలన; యాచక= బిచ్చగానివలన; శత్రు= శత్రువువలన; మిత్ర+ఆది= మిత్రం మొదలయిన; సర్వస్థలంబులందును= అన్నిచోట్లలో; శంకించుచున్= సందేహపడుతూ; దానభోగంబులు మఱచి= ఈవి, అనుభవాలు మరచి; ఉండుదురు= జీవిస్తారు; ప్రాణ+అర్థవంతులకున్= ప్రాణం ధనంగలవారికి; భయంబు నిత్యము= భయం ధ్రువం; శోక= నాశంవల్ల దుఃఖం; మోహ= భ్రాంతి; భయ= వెఱపు; క్రోధ= ద్వేషం; రాగ= ప్రేమ; శ్రమ= చాకిరి; ఆదులు= మొదలైనవి; వాంఛామూలంబులు= కోరికలవలన కలిగేవి; వాంఛ= కోరిక; లేక+ఉండవలయున్= మాని జీవించాలి.

**తా :** విషయ సుఖాలచేత తృప్తి పొందక పరుగులుపెట్టే దురాశ వెంటబడి నేను కర్మబంధాలలో చిక్కుకొని సంసార చక్రంలో పరిభ్రమించాను. నానా జన్మలూ ఎత్తాను. మరణించాను. ఈ పరిభ్రమణంలో చిట్ట చివరకు ఎట్ట కేలకూ మనుష్య దేహం ధరించాను. ఆ జన్మలలో ధర్మాలూ, పుణ్యాలూ చేసి స్వర్గ ద్వారాలు చేరుకొన్నాను. అధర్మాలూ, పాపాలూ చేసి శునక, సూకరాది జంతువుల యోనులలో పుట్టి నానా బాధలూ పడ్డాను. మరలా ఆలోచించి మానవ జన్మ ఎత్తాలి అనే వివేకంతో సుఖ సంపాదన కోసం, దుఃఖ నివారణ కోసం ధర్మం చేసే దంపతులను దర్శించాను. సమస్తక్రియల నుంచీ నివృత్తి పొందిన జీవుడు స్వతంత్రుడై ప్రకాశిస్తాడని నిర్ణయించుకొన్నాను. భోగాలు కోరికల వల్ల జనించేవే కాని శాశ్వతాలు కావని పరీక్షించి నిర్ణయించుకున్నాను. కర్మబంధాలనుంచి నివృత్తి పొంది, ఏ ప్రయత్నమూ, ఏ కోరికా లేకుండా ఇలా నిద్రిస్తూ, ప్రారబ్ధ భోగాలు అనుభవిస్తూ పడి ఉన్నాను.

ఈ విధంగా తనకు కావలసిన సుఖరూపమైన పురుషార్థం తన లోనే జన్మిస్తుందని పురుషుడు తెలుసుకోలేక పోతున్నాడు. పరిశుద్ధ జల ప్రవాహాన్ని విడిచిపెట్టి ఎండమావుల వెంటపడి పరుగెత్తే మూర్ఖునివలె జీవుడు అసత్యమైన ద్వైతంలో పడిపోతున్నాడు. ఘోర సంసార చక్రంలో పడి తిరుగుతున్నాడు. దైవ తంత్రాలైన దేహాదులచేత ఆత్మకు సుఖమునూ, దుఃఖనాశనమునూ కోరుకొనే నిరీశు డైనటువంటి వాని ప్రయత్నాలు నిష్ఫలా లవుతాయి. అదీకాక నరునకు ధనం ప్రాప్తిస్తే అది దుఃఖం కలిగిస్తుందే తప్ప సుఖం కలిగించదు. లుబ్ధులైన ధనవంతులు నిద్రాహారాలు మాని ప్రభువులనూ, యాచకులనూ, చోరులనూ, శత్రువులనూ, మిత్రులనూ అందరినీ అనుమానిస్తూ, దానం చేయటం, అనుభవించటం మరచిపోతారు. నిత్యం దుఃఖంతో బాధ పడుతుంటారు. ప్రాణంమీద, ధనంమీద తీపిఉన్న వాళ్ళను నిత్యం భయం వెంటాడుతూ ఉంటుంది. శోకం, మోహం, భయం, క్రోధం, రాగం, శ్రమ, మున్నగు వానికి కోరికలే కారణం. కాబట్టి కోరికలు లేకుండా ఉండటం శ్రేయస్కరం.

**మ. సరఘుల్ గూర్చిన తేనె మానవులకున్ సంప్రాప్తమైనట్లు లో**
**భ రతుల్ గూర్చిన విత్తముల్ పరులకుంబ్రాపించుఁబ్రాప్తాశియై**
**తిరుగంబోని మహోరగంబు బ్రదుకున్ దీర్ఘాంగమై యుండియుం**
**జిరకాలంబును వాని వర్తనములం జింతించి యేకాంతినై** **436**

**ప్రతి :** సరఘుల్= తేనెటీగలు; కూర్చినతేనె= సంపాదించిన తేనె; మానవులకున్= నరులకు; సంప్రాప్తమైనట్లు= దొరికినట్లు; లోభరతుల్= పిసినిగొట్టువారు; కూర్చిన విత్తముల్= ప్రోగుచేసిన డబ్బులు; పరులకున్= ఇతరులకు; ప్రాప్తించున్= లభిస్తాయి; ప్రాప్త+ఆశి+ఐ= దారిలో లభించినదానిని తినేదై; తిరుగన్+పోని= జీవికకై అటునిటు పరిభ్రమించని; మహా+ఉరగంబుబ్రదుకున్= గొప్పపాము జీవిస్తుంది; దీర్ఘ+అంగమై+ఉండియున్= పొడవైన శరీరం కలిగినదయినా;

చిరకాలంబు= అధికకాలము; వానివర్తనములన్+చింతించి= వాటి జీవితాలు గూర్చి ఆలోచించి; ఏకాంతిని+ఐ= ఏకాంతవాసినై...

**తా :** తేనెటీగలు సంపాదించే తేనె మానవుల పాలవుతుంది. లోభులు కూడబెట్టిన సంపద పరులపాలవుతుంది. అయితే సర్పం దొరికినది తిని, తన దీర్ఘ దేహాన్ని చిరకాలం నిలుపగలుగుతుంది. ఈ రెంటి జీవనాన్ని చూచి నేను ఏకాంతంగా.

**క. అజగరమును జుంటీఁగయు, నిజ గురువులుగాఁదలంచి నిశ్చింతుఁడనై**
**విజనస్థలిఁగర్మంబుల, గజిబిజి లేకున్నవాఁడ గౌరవవృత్తిన్. 437**

**ప్రతి :** అజగరమును= కొండచిలువను; జుంటి+ఈఁగయున్= తెనేటీగను; నిజగురువులుగాన్+తలంచి= తన(నా) ఆచార్యులుగా భావించి; నిశ్చింతుఁడనై= చింతలేనివాడనై; విజనస్థలిన్= నిర్జన ప్రదేశాన; కర్మంబులగజిబిజిలేక= పనుల తొందరలేక; గౌరవవృత్తిన్= మర్యాదగల జీవనంతో; ఉన్నవాఁడన్= నిలిచినాను.

**తా :** కొండచిలువను, తేనేటీగను గురువులుగా భావించి వాటి జీవనాన్ని అనుకరిస్తూ ఏకాంతంగా సర్వక్రియలు విడిచి ఏ చింతా లేక జీవిస్తున్నాను.

**సీ. అజినవల్కల దుకూలాంబరంబులు గట్టి యైన గట్టక యైనఁ నలరుచుందు**
**నాందోళికారథ హయనాగముల నెక్కి యైన నెక్కకయైన నరుగుచుందు,**
**గర్పూరచందన కస్తూరికా లేప మైన భూరజమైన నలఁదుచుందు,**
**భర్మశయ్యల నైనఁబర్ణశిలాతృణ భస్మంబు లందైనఁ బండుచుందు,**

**ఆ. మానయుక్తమైన మానహీనంబైనఁ, దీయనైన మిగులఁ దిక్తమైనఁ**
**గుడుతు సగుణమైన గుణవర్జితంబైన, నల్పమైనఁజాల నధికమైన. 438**

**ప్రతి :** అజిన వల్కల దుకూల+అంబరంబులు= చర్మము; నారచీరలు; సన్నని దుస్తులు; కట్టియైనన్+కట్టకయైనన్= ధరించిగాని ధరించకగాని; అలరుచున్+ఉందున్= వెలుగొందుతుంటాను; ఆందోళికా రథహయనాగములన్= పల్లకి, రథము, గుర్రము, ఏనుగులను, ఎక్కియైనన్; ఎక్కకయైనన్= ఎక్కిగాని; ఎక్కకుండగాని; అరుఁగుచున్+ఉందున్= వెళుతుంటాను; కర్పూర చందన కస్తూరికా లేపమైనన్; భూరజమైనన్= కర్పూరము, గంధము, కస్తూరి–వీనిపూత అయినా, నేల ధూళి అయినా, దుమ్ము అయినా; అలఁదు చుందున్= పూసికొనుచుందును; భర్మశయ్యలనైనన్= బంగారు పడకలపైగాని; పర్ణశిలాతృణ భస్మంబులందైనన్= ఆకులు, రాళ్ళు, గడ్డిపరకలు, బూడిదలపైగాని; పండుచుందున్= పడుకుంటాను; మానయుక్తమైన= గౌరవంతో కూడిందైనా; మానహీనంబు+ఐనన్= గౌరవం లేనిది అయినా; తీయనైన= మధురమైనా; మిగులన్+తిక్తమైనన్= ఎక్కువచేదైనా, సగుణమైనన్= గుణముతో కూడినదైనా, గుణవర్జితంబు+ఐనన్= గుణములేనిదైనా; అల్పము+ఐనన్= తక్కువైనా; చాలన్+అధికమైనన్= మరీ ఎక్కువైనా; కుడుతున్= తింటాను.

**తా :** చర్మాలైనా, నారబట్టలైనా, సన్ననిమంచిదుస్తులైనా ధరిస్తాను; ధరించకుండానైనా సంతసిస్తాను; పల్లకీలు, రథాలు, గుర్రాలు, ఏనుగలపై ఎక్కిగాని ఎక్కకగాని సంచరిస్తుంటాను; కర్పూరం, శ్రీగంధం, కస్తూరి–వీటి పూతనైనా, నేలదుమ్మునైనా, ఒడలికి పూసుకుంటాను; బంగారు పాన్పులమీదైనా, ఆకులమీదైనా, రాళ్ళమీదైనా, గడ్డిమీదైనా, బూడిదమీదైనా పడుకుంటాను.

ఇక భోజనం, తియ్యనైనా, చేదైనా, ఎక్కువైనా, తక్కువైనా, గౌరవంగా పెట్టినా, అవమానంతో పెట్టినా (సమానభావంతో) స్వీకరిస్తాను.

**క. లే దని యెవ్వరి నడుగను, రా దని చింతింపఁబరులు రప్పించినచోఁ**
**గా దని యెద్దియు మానను, ఖేదము మోదమును లేక క్రీడింతు మదిన్. 439**

**ప్రతి :** లేదని ఎవ్వరిన్= లేదంటూ ఎవరినీ; అడుగను= యాచింపను; రాదు+అని= దొరకదని; చింతింపన్= దుఃఖించను; పరులు= ఇతరులు; రప్పించినచోన్= తెప్పించినయెడల; కాదు+అని= వద్దు అని; ఎద్దియున్= ఏదీ; మానను= వదలను; మదిన్= మనస్సులో; ఖేదము, మోదమును= దుఃఖం సంతోషం; లేక= ఉండక; క్రీడింతున్= ఆడుకొంటాను.

**తా :** లేదు అని ఎవరినీ అడుగను; దొరకలేదని విచారించను; ఇతరులు తెప్పించిన ఏ వస్తువునైనా వద్దని అనను. మనస్సున ఖేదమోదాలకు అతీతంగా ఆడుకుంటాను.

**క. నిందింపఁబరుల నెన్నఁడు, వందింప ననేకపీడ వచ్చిన, మది నా**
**క్రందింప, విభవముల కా, నందింపఁబ్రకామవర్తనంబున నధిపా! 440**

**ప్రతి :** అధిపా!= రాజా! ప్రకామవర్తనంబునన్= అధికమైన ప్రవర్తనతో; ఎన్నఁడున్= ఎప్పుడూ; పరులన్= ఇతరులను; నిందింపన్= దూషించను; వందింపన్= నమస్కరించను; అనేకపీడ వచ్చినన్= పలుబాధలు మీదపడినా; ఆక్రందింపను= దుఃఖించను; మదిన్= మనస్సులో; విభవములకున్= సంపదలకు; ఆనందింపన్= సంతోషించను;

**తా :** రాజా! నా ప్రవర్తనలో 'అతి' ఉండదు; ఏనాడూ పరులను దూషించను; పలుబాధలు కలిగినా దుఃఖించను; మనస్సున ఏడ్వను; అట్లని సంపదలకు ఆనందించను కూడ.

**వ. ఇట్లు గోరిక లేక యొక్క సమయంబున దిగంబరుండనై పిశాచంబు చందంబున వర్తించుచుఁ బెక్కు దినంబులం గోలెఁ బెనుఁ బాఁప వర్తనంబుఁ గైకొని నిమీలిత లోచనత్వంబున నేకాంత భావంబున విష్ణునియందు వికల్పంబును భేదగ్రాహక చిత్త వృత్తులఁ జిత్తంబు నర్థరూప పరిభ్రమణంబు గల మనంబు నందు మనంబును, నహంకారంబునందు నహంకారంబును, మాయయందు మాయను, నాత్మానుభూతియందు లయంబు నొందించి సత్యంబు దర్శించుచు విరక్తినొంది స్వానుభవంబున నాత్మస్థితుండనై యుండుదు. నీవు భగవత్పరుండవు గావున రహస్యంబైన పరమహంస ధర్మంబు స్వానుభవ గోచరంబైన తెఱంగున నీకు హృద్గోచరంబగునట్లు సెప్పితి ననిన విని. 441**

**ప్రతి :** ఇట్లు+కోరికలేక= ఇలా ఇచ్ఛలేకుండా; ఒక్కసమయంబునన్= ఒక వేళ; దిక్+అంబరుండనై= దిసమొలవాడనై; పిశాచంబు చందంబునన్= దయ్యంవలె; వర్తించుచున్= నడుస్తూ; పెక్కుదినంబులన్+కోలెన్= పలు దినాలనుండి; పెనుఁబాఁపవర్తనంబున్= గొప్ప పామునడతను; కైకొని= స్వీకరించి; నిమీలిత లోచనత్వంబునన్= మూసిన కన్నులు కలవాడనై భావంతో; ఏకాంతభావంబునన్= ఏకాగ్రచిత్తంతో; విష్ణునియందున్= హరిలో; వికల్పంబును= అనిశ్చయాన్ని; భేదగ్రాహక చిత్తవృత్తులన్= భేదాన్ని కలిగించే మనఃప్రవృత్తులలో; చిత్తంబును= మనస్సును; అర్థరూప పరిభ్రమణంబులు+

కల= వస్తురూపమైన తిరుగుళ్ళుగల; మనంబు నందున్= చిత్తంలో; మనంబును= చిత్తాన్ని; అహంకారంబునందున్= అహంకారంలో; అహంకారంబును= అహంకారాన్ని; మాయయందు మాయను= మాయలో మాయను; ఆత్మ+అనుభూతియందున్= ఆత్మతోడి అనుభవంలో; లయంబును+ఒందించి= లీనంచేసి; సత్యంబు దర్శించుచున్= నిజాన్ని చూస్తూ; విరక్తిని+ఒంది= వైరాగ్యాన్నిపొంది; స్వ+అనుభవంబునన్= నిజానుభూతిలో; ఆత్మస్థితుండను+ఐ+ఉందుదున్= ఆత్మనిష్ఠ కలవాడనై ఉంటాను. నీవు; భగవత్పరుండవు కావునన్= నీవు దేవునియందు ఆసక్తుడివి గాబట్టి; రహస్యంబు+ఐన= గుట్టు అయిన; పరమహంసధర్మంబు= పరమహంసయొక్క (సన్న్యాసికి అనంతరుడైన విరాగి) ప్రవృత్తి; స్వ+అనుభవ= నిజ అనుభూతికి; గోచరంబు+ఐన తెఱంగునన్= తెలియవచ్చిన విధంగా; నీకు; హృద్+గోచరమగునట్లు= మనస్సుకెక్కేటట్లు; చెప్పితిన్+అనినన్= తెలియజేశాను అని పలుకగా; విని= ఆలకించి;

**తా :** ఈ విధంగా ఏ కోరికా లేకుండా పూర్వం కొన్నాళ్ళు దిగంబరంగా పిశాచంలాగా ప్రవర్తిస్తుండేవాణ్ణి. ఇపుడు చాలా రోజులనుంచీ పెద్ద కొండ చిలువలాగా కళ్ళు మూసుకొని భావం భగవంతుని పాదపద్మాలపై కేంద్రీకరించి ఇలా ఉండిపోయాను. భ్రాంతిని భేదభావం చూపే చిత్త వృత్తులలోనూ, చిత్తాన్ని అర్థరూపాలపై పరిభ్రమించే మనస్సులోనూ, మనస్సును అహంకారంలోనూ, అహంకారాన్ని మాయలోనూ, మాయను ఆత్మానుభూతిలోనూ కేంద్రీకరించి విలీనం చేశాను. అది మొదలు సత్యదర్శనం చేస్తూ విరక్తి పొందాను. స్వానుభవంతో ఆత్మస్థితి అలవాటు చేసుకొన్నాను. ప్రహ్లాదా! నీవు భక్తశిఖామణివి కాబట్టి ఈ రహస్యమైన పరమహంస ధర్మాన్ని నాకు తెలిసినంతవరకు నీకు అర్థమయ్యేలాగా చెప్పాను. అని అజగరముని అన్నాడు.

**క. ఘను నజగరముని వల్లభు, దనుజేంద్రుఁడు పూజసేసి తగ వీడ్కొని నె**
**మ్మనమున సంతోషించుచుఁ, జనియెన్ నిజగేహమునకు శశికులతిలకా! 442**

**ప్రతి :** శశికులతిలకా!= చంద్రవంశశ్రేష్ఠా! ఓ ధర్మరాజా! ; ఘనున్ అజగరమునివల్లభున్= గొప్పవాడైన అజగరమునినాథుని; దనుజ+ఇంద్రుఁడు= రాక్షసరాజు ప్రహ్లాదుఁడు; పూజ+చేసి= పూజించి; తగన్= తగురీతిలో; వీడ్కొని= విడిచి; నెఱ+మనమునన్= నిండైన మనస్సుతో; సంతోషించుచున్= ఆనందం చెందుతూ; నిజగేహమునకున్= తనయింటికి; చనియెన్= వెళ్ళాడు.

**తా :** ధర్మరాజా! అజగరముని శ్రేష్ఠుని పూజించి, అతనిని వీడ్కొని, మనస్సు నిండిన ఆహ్లాదంతో నిండగా తన యింటికి ప్రహ్లాదుడు వెళ్ళాడు.

**వ. అనిన యుధిష్ఠిరుం డిట్లనియె. 443**

**ప్రతి :** అనినన్= అని పలుకగా; యుధిష్ఠిరుండు= యుద్ధంలో స్థిరమైనవాడు; ధర్మరాజు; ఇట్లు+అనియెన్= మళ్ళీ ఇలా అన్నాడు.

**తా :** అని నారదుడు పలుకగా మళ్ళీ ధర్మరాజు ఇలా అడిగాడు.

**క. ననుబోఁటి జడగృహస్థుఁడు, మునివల్లభ! యిట్టి పదవి మోదంబున నే**
**యనువునఁజెందును? వేగమ, వినిపింపుము నేఁడు నాకు విజ్ఞాన నిధీ! 444**

**ప్రతి :** విజ్ఞాననిధీ= విజ్ఞానపుగనివైన నారద మహర్షీ! మునివల్లభ!= మునిశ్రేష్ఠా! ననుబోఁటి= నావంటి; జడగృహస్థుఁడు= మూఢుడైన కుటుంబి; ఇట్టిపదవి= ఇటువంటి ఉన్నతస్థితి; మోదంబునన్= సంతోషంతో; ఏ అనువునన్= ఏ పద్ధతిలో; చెందును= పొందగలడు? నేఁడు= ఈనాడు; వేగము+అ= త్వరగా!; నాకున్ వినిపింపుము= నాకు తెలియజేయి.

**తా :** అజగర వృత్తాంత శ్రవణం తరువాత, ధర్మరాజుకు తనకూ అటువంటి స్థితి కావాలి అనిపించింది. దానికై తాను చేయవలసిందేమిటి? ఏ మార్గాన తానూ మోక్షాన్ని పొందగలనో వేగంగా తెలుపుమని నారదమునిని ప్రశ్నించాడు.

**వ. అనిన నారదుం డిట్లనియె, గృహస్థుం డయినవాఁడు వాసుదేవార్పణంబుగా గృహోచితక్రియ లనుసంధించుచు మహామునుల సేవించి వారల వలన నారాయణ దివ్యావతార కథా శ్రవణంబు సేయుచు, నయ్యె విహితకాలంబుల శాంతజనులం గూడి మెలంగుచుఁ, బుత్ర మిత్ర కళత్రాది సంగంబులు గలల వంటివని యెఱుంగుచు లోపల నాసక్తి లేక సక్తుని కైవడి వెలుపలఁ బురుషకారంబు లొనర్చుచుఁ దగులంబులేక విత్తంబు లిచ్చి జనక సుత సోదర సఖి జ్ఞాతి జనుల చిత్తంబులు సమ్మదాయత్తంబులు గావించుచు, ధనధాన్య నిధాన దైవలబ్ధంబుల వలన నభిమానంబు మాని యనుభవించుచు, గృహక్షేత్రంబులఁ జొచ్చి యుదరపూరణ మాత్రంబు దొంగిలినవాని దండింపక భుజగ మృగ మూషక మర్కట మక్షికా ఖరోష్ట్రంబుల హింసింపక పుత్త్రులభంగి నీక్షించుచు, దేశకాల దైవంబుల కొలందిని ధర్మార్థకామంబులఁ బ్రవర్తించుచు, శునక పతిత చండాలాదులకైన భోజ్యపదార్థంబులు దగిన భంగి నిచ్చుచు నిజవృత్తి లబ్ధంబులగు నశనాదులచేత దేవ ఋషి పితృభూత మానవుల సంతర్పించుచుఁ బంచమహాయజ్ఞావశేషంబుల నంతర్యామి పురుషయజనంబును నాత్మజీవనోపాయంబును సమర్థించుచు నుండవలయు. 445**

**ప్రతి :** అనినన్= అని ధర్మరాజు అడుగగా; నారదుండు+ఇట్లు+అనియెన్= నారదమహర్షి ఇలా అన్నాడు; గృహస్థుండు+అయినవాఁడు= సంసారి అయినవాడు; వాసుదేవ+అర్పణంబుగాన్= విష్ణువునకు అర్పణంగా; గృహ+ఉచితక్రియలను= ఇంటికి వలసిన పనులను; అను సంధించుచున్= నిర్వహిస్తూ; మహామునులన్+సేవించి= మహర్షులను కొలచి; వారలవలనన్= వారినుండి; నారాయణ= విష్ణుని; దివ్య+అవతారకథా= దివ్యములైన అవతారాలకు చెందిన కథలను; శ్రవణంబు+చేయుచున్= వింటూ; ఆ+ఆ+విహితకాలంబులన్= విధించబడిన ఆ యా సమయాలలో; శాంతజనులన్+కూడి మెలంగుచున్= ప్రశాంతులైనవారితో కలిసి ప్రవర్తిస్తూ; పుత్ర మిత్ర కళత్ర+ఆదిసంగంబులు= కొడుకులు; స్నేహితులు, పత్నులు మొదలయినవారి కలయికలు; కలలవంటివి+అని+ఎఱుంగుచున్= స్వప్నాలవంటివి అని గ్రహిస్తూ; లోపలన్= మనస్సులో; ఆసక్తిలేక= కోరికలేక; సక్తునికైవడిన్= కోరికగల వానివలె; వెలుపలన్= బయటన్, లోకములో; పురుషకారంబులు+ఒనర్చుచున్= పురుష ప్రయత్నాలను చేస్తూ; తగులంబులేక= లంపటాలు లేక; విత్తంబులు+ఇచ్చి= ధనం ఇచ్చి; జనక, సుత, సోదర, సఖి జ్ఞాతి జనులచిత్తంబులు= తండ్రి, కొడుకు, అన్నదమ్ములు, మిత్రులు, తోబుట్టువులు–ఈ అందరి మనస్సులు; సమ్మద+ఆయత్తంబులు+కావించుచున్= సంతోషానికి సిద్ధమైనవిగా చేస్తూ; ధనధాన్య నిధానదైవలబ్ధంబులవలనన్= ధనం, ధాన్యం, నిధులు, అదృష్టాలు, వీటివలన లభించినవాటి వలన; అభిమానంబుమాని= ఆత్మగౌరవంలేక; అనుభవించుచున్= అనుభవిస్తూ; గృహక్షేత్రంబులన్+చొచ్చి= ఇండ్లలో, పొలాల్లో ప్రవేశించి;

ఉదరపూరణమాత్రంబు= కడుపు నింపుటకు మాత్రం; దొంగిలినవానిన్= అపహరించినవాణ్ణి; దండింపక= శిక్షించక; భుజగమృగ మూషక మర్కట మక్షికాఖర+ఉష్ట్రంబులన్= పాములు, లేళ్ళు, ఎలుకలు, కోతులు, ఈగలు, గాడిదలు, ఒంటెలు వీటిని; హింసింపక= బాధించక; పుత్రులభంగిన్= కొడుకులవలె; ఈక్షించుచున్= చూస్తూ; దేశకాలదైవంబులకొలందిని= స్థలాన్ని, సమయాన్ని, అదృష్టాన్ని అనుసరించి; ధర్మ+అర్థకామంబులన్= ధర్మం, అర్థం, కామం, సదాచరణ, ధనార్జన, కోరికలపూరణ, వీటిలో; ప్రవర్తించుచున్= మెలగుతు; శునకపతిత చండాల+ఆదులకు+ఐనన్= కుక్కలు, చెడినవారు, మాలలు మొదలైనవారికి గూడ, భోజ్యపదార్థంబులు= భోజన పదార్థాలు; తగినభంగిన్+ఇచ్చుచున్= ఉచితరీతిగా ఇస్తూ; నిజవృత్తిలబ్ధంబులు+అగు= తమ బ్రదుకుతెరువులవలన దొరికిన; అశన+ఆదులచేతన్= అన్నం మొదలైనవాటిచేత; దేవఋషి పితృభూత మానవులన్= దేవతలను, మునులను, పితృదేవతలను, ప్రాణులను, నరులను; సంతర్పించుచున్= సంతృప్తిపరుస్తూ, పంచమహాయజ్ఞ+అవశేషంబులన్= ఐదు గొప్ప యాగాల ఫలితాలతో; అంతర్యామి= లోపలనివసించే; పురుషయజనంబును= నరుని పూజిస్తూ; ఆత్మజీవన+ఉపాయంబును= తన బ్రతుకు సాధనాన్ని; సమర్థించుచున్= నిర్వహిస్తూ; ఉండన్+వలయున్= నిలువాలి, జీవించాలి.

**తా :** అని పలికిన ధర్మరాజుతో నారదవచనా లివి; సంసారి కృష్ణార్పణంగా ఇంటిపనులు నిర్వహిస్తూ మహర్షులను, కొలిచి, వారినుండి విష్ణుని అవతారకథలు వింటూ; ఆ యా సమయసందర్భాలనుబట్టి, ప్రశాంతులయిన ఉత్తములతో కలిసి మెలుగుతూ కొడుకులు, మిత్రులు, భార్యల కలయికలు కలలుగా గ్రహిస్తూ, లోపల కోర్కె లేకుండ, బయట కార్యక్రమాలు చేస్తూ, లంపటం మాని ధనదానంతో తల్లిదండ్రులను, కొడుకులను, తోబుట్టువులను, మిత్రులను, బంధువులను సంతోషాలలో తేల్చుచు, ధనధాన్యాలు, నిధులు అదృష్టాలవల్ల దొరికిన వానిపట్ల, అభిమానం లేక అనుభవిస్తూ, ఉదరపోషణకోసం ఇళ్ళుపొలాలల్లో దూరి దొంగిలించేవారిని శిక్షించకుండ, పాములు లేళ్ళు గాడిదలు ఒంటెలు మొదలైన జంతువులను హింసించక, కొడుకులవలె చూస్తూ, స్థల కాలదైవాలను అనుసరించి త్రిపురుషార్థాలు–ధర్మాచరణ, అర్థార్జన, కామ పరిపూర్తి చేస్తూ, కుక్కలు, చెడినవారు, అంటరానివారికైనా అన్నాది వస్తువులు అందిస్తూ, తన వృత్తివల్ల దొరికినవాటితో, దేవతలను పితరులను ఇతర జీవులను నరులను సంతృప్తిపరుస్తూ యాగవిశేషాలతో అంతర్గతుడైన తనను తాను పోషిస్తూ జీవనయాత్ర సాగించాలి.

**విశే : పంచ మహాయజ్ఞాలు :** దేవయజ్ఞం, ఋషియజ్ఞం, పితృయజ్ఞం, భూతయజ్ఞం, మనుష్యయజ్ఞం.

**ఆ. జనకగురులనైనఁజంపు నర్థమునకై, ప్రాణమైన విడుచు భార్యకొఱకు,**
**నట్టిభార్యఁబురుషుఁడతిథిశుశ్రూష సే, యించి గెలుచు నజితు నీశునైన. 446**

**ప్రతి :** పురుషుఁడు= నరుడు; అర్థమునకై= డబ్బుకోసం; జనకగురులను+ఐనన్= తండ్రినైననూ, గురువులనైననూ; చంపున్= వధిస్తాడు; భార్యకొఱకున్= ఆలు కోసం; ప్రాణమైనన్= ప్రాణానైనా; విడుచున్= వదలును; అట్టిభార్యన్= అట్టి ప్రియమైన భార్యచేత; అతిథిశుశ్రూష+చేయించి= అతిథికి సేవచేయించి; అజితున్+ఈశునిన్+ఐనన్= జయింపబడని శివునిగూడ; గెలుచున్= ఓడిస్తాడు;

**తా :** నరుడు డబ్బుకోసం తండ్రినైనా, గురువునైనాకూడా చంపడానికి వెనుకాడదు; ఆలికోసం ప్రాణమైనా అర్పిస్తాడు; అట్టి భార్యచేత, అతిథిసేవ చేయించి, అతడు జయింపరాని శివునిగూడ జయిస్తాడు.

**ఆ. పరముఁడీశ్వరుండు బ్రాహ్మణముఖమున, నాహరించి తుష్టుఁడయిన భంగి**
**నగ్నిముఖమునందు హవ్యరాసులు గొని, యైనఁదుష్టి నొందఁడనఘచరిత! 447**

**ప్రతి :** అనఘచరిత!= పాపములేని చరిత్రగలవాడా! ఈశ్వరుండు పరముఁడు= పరమాత్ముడైన భగవంతుడు; బ్రాహ్మణముఖమునన్= బ్రాహ్మణుని నోటితో; ఆహరించి= భుజించి; తుష్టుఁడు+అయినభంగిన్= సంతోషించిన; అగ్నిముఖమునందున్= అగ్ని దేవునిద్వారా; హవ్యరాసులు+కొనియైనన్= యజ్ఞభాగాలను స్వీకరించినా కూడ; తుష్టిన్+ ఒందఁడు= మోదాన్ని పొందడు.

**తా :** సర్వజగన్నాథుడైన దేవుడు, బ్రాహ్మణుని నోటిద్వారా భుజించి సంతుష్టుడైనట్లుగా, యాగంలో అగ్నిద్వారా హవ్యరాసులు భుజించిగూడ సంతుష్టుడు కాడు.

**వ. కావున గృహస్థుండు బ్రాహ్మణులందును, దేవతలందును మర్త్యపశు ప్రముఖ జాతులందును నంతర్యామియు, బ్రాహ్మణాననుండును నైన క్షేత్రజ్ఞునందు నయ్యై కోరికలు సమర్పించి సంతర్పణంబు సేయవలయు, భాద్రపదంబునఁ గృష్ణ పక్షంబునందును, దక్షిణోత్తరాయణంబులందును, రేయింబగలు సమమైన కాలంబులందును, వ్యతీపాతంబునందును, దినక్షయంబులందును, సూర్యచంద్రగ్రహణంబు లందును, శ్రవణద్వాదశి యందును, వైశాఖ శుక్ల తృతీయయందును, గార్తిక శుక్లనవమియందును, హేమంత శిశిరంబులలోన నాలుగష్టకలందును, మాఘశుక్ల సప్తమియందును, జన్మ నక్షత్రంబుల తోడం గూడిన పున్నమలందును, ద్వాదశితోడం గూడిన యుత్తరాత్రయ శ్రవణానూరాధలందును, నుత్తరాత్రయ సహితంబు లయిన యేకాదశీ తిథులందును, జన్మ నక్షత్ర యుక్త దివసంబులందును, మఱియుఁ బ్రశస్తకాలంబు లందును, జననీ జనక బంధుజనులకు శ్రాద్ధంబులును, జపహోమస్నాన వ్రతంబులును, దేవబ్రాహ్మణ సమారాధనంబులును, నాచరింపవలయు, భార్యకుఁ బుంసవనాదికంబును, నపత్యంబునకు జాత కర్మాదికంబును, దనకు యజ్ఞదీక్షాదికంబును, బ్రేతజనులకు దహనాదికంబును, మృతదివసంబున సాంవత్సరికంబును జరుపవలయు. 448**

**ప్రతి :** కావునన్= కనుక; గృహస్థుండు= సంసారి; బ్రాహ్మణులందును= విప్రులలో; దేవతలందును= దేవతలలో; మర్త్యపశు ప్రముఖ జాతులందును= నరుదు, పశువులు మొదలగు జాతులో; అంతర్యామియున్= లోనుండేవాడు; బ్రాహ్మణ+ఆననుండును= బ్రాహ్మణుడు ముఖంగా గలవాడు; ఐన= అగు; క్షేత్రజ్ఞునందున్= దేవునందు; ఆ యా కోరికలు; సమర్పించి= ఇచ్చి; సంతర్పణంబున్= భోజనంతో తృప్తిపరచటం; చేయవలయున్= ఆచరించాలి; భాద్రపదంబునన్= భాద్రపదమాసంలో; కృష్ణపక్షంబునందును= బహుళపక్షంలో; దక్షిణ+ఉత్తర+అయనంబులందును= దక్షిణాయన; ఉత్తరాయణాలలో; రేయింబగలు= రాత్రి, పగలు, రెండును; సమమైన కాలంబులందునున్= సమానమైన దినాలలో; వ్యతీపాతంబునందును= అతిక్రమంలో; దినక్షయంబులందునున్= తిథితగ్గినపుడును; సూర్యచంద్ర గ్రహణంబులందునున్= సూర్యుని చంద్రుని గ్రహణ సమయాలలోను; శ్రవణద్వాదశియందును= శ్రవణనక్షత్రంతో కూడిన; వైశాఖశుక్ల తృతీయయందును= వైశాఖమాసంలో శుక్లపక్షం తదియనాడు; కార్తికశుక్ల నవమియందును= కార్తికమాసంన, శుక్లపక్షంన

నవమి తిథినాడు; హేమంతశిశిరంబులలోనన్= హేమంత, శిశిర ఋతువులలో; నాలుగు+అష్టకలందును= నాల్గుశ్రాద్ధకాలాలలో; మాఘశుక్ల సప్తమియందును= మాఘమాసంన; శుక్లపక్షంన సప్తమినాడు; జన్మనక్షత్రంబులతోడన్+ కూడిన= జన్మ నక్షత్రాలతోకూడిన; పున్నమలందును= పున్నమి దినాలలో; ద్వాదశి తోడంగూడిన= ద్వాదశితో కూడిన; ఉత్తరాత్రయ శ్రవణానూరాధలందును= మూడు ఉత్తరానక్షత్రాలలో; శ్రవణ, అనూరాధ, నక్షత్రాలలోను, ఉత్తరాత్రయ సహితంబులగు= ఉత్తరా నక్షత్రాలు మూడిటితో కూడిన; ఏకాదశీ తిథులందును= ఏకాదశి తిథులలో; జన్మనక్షత్రయుక్త దివసంబులందును= జన్మనక్షత్రంతో కూడిన దినాలలోను; మఱియున్= ఇంకా; ప్రశస్తకాలంబులందును= పుణ్యకాలాలలో; జననీ జనక బంధుజనులకున్= గతించిన తల్లి తండ్రి ఇతర బంధువులకు; శ్రాద్ధంబులును= శ్రాద్ధక్రియలు; జపహోమస్నానవ్రతంబులును= జపం, హోమం, స్నానవ్రతాలు; దేవబ్రాహ్మణ= దేవతలకు, బ్రాహ్మణులకు; సమారాధనంబులును= భోజనాలతో గూడిన సత్కారాలు; ఆచరింపన్+వలయున్= చేయాలి; భార్యకున్= ఆలికి; పుంసవన+ఆదికంబును= పుం-సవనము, ఆలు చూలు నిలిచినపిదప, పురుషశిశువు గలుగవలెననిచేసెడి యాగం మొదలైనవి; అపత్యమునకున్= శిశివుకు; జాతకర్మ+ఆదికంబును= పుట్టినప్పటి సంస్కారము మొదలయినవి, తనకు; యజ్ఞదీక్షా+ఆదికంబును= యజ్ఞదీక్ష-యాగ నిర్వహణకైన దీక్షమొదలయినవి; ప్రేతజనులకున్= చనిపోయినవారికి; దహన+ఆదికంబును= దహనసంస్కారాలు మొదలైనవి; మృతదివసంబునన్= చనిపోయిననాడు; సాంవత్సరికంబును= పోయిన పిదప సంవత్సరానంతరం చేసే సంస్కారం; జరుపన్+వలయున్= జరుపాలి.

**తా :** కాబట్టి, గృహస్తు బ్రాహ్మణులలో, దేవతలలో, నరులలో, పశుపక్ష్యాది జీవులలోపల నివసించువాడూ, బ్రాహ్మణుడే (తన) ముఖంగా గలవాడు అయిన పరమాత్మకు కోర్కెలు సమర్పించి భోజనోత్సవం చేయాలి; భాద్రపదమాసంలో కృష్ణపక్షంలో, దక్షిణాయన, ఉత్తరాయణకాలాలలో, (కర్కాటక, మకర సంక్రమణాలలో) రేయింబగళ్లు సమానమైన సమయాలలో (విషువత్‌కాలంలో), అతిక్రమాలలో, తిథి తగ్గినపుడు, సూర్యచంద్రగ్రహణసమయాలలో, శ్రవణనక్షత్ర కలిసిన ద్వాదశినాడు, వైశాఖమాస శుక్లపక్ష తృతీయనాడు, కార్తికమాస శుక్లపక్ష నవమినాడు, హేమంత శిశిర ఋతువులలో నాల్గు శ్రాద్ధకాలాల్లో, మాఘ శుక్లసప్తమినాడు, తమ తమ జన్మనక్షత్రాలతో గూడిన పూర్ణిమలలో, ద్వాదశితోకూడిన ఉత్తరాత్రయ (ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర) శ్రవణ, అనురాధ నక్షత్రాలలో ఉత్తరాత్రయంతో కూడిన ఏకాదశులలో తమ తమ జన్మ నక్షత్రాలు వచ్చిన రోజులలో మరియు ఇతర పుణ్యకాలాలలో చనిపోయిన తల్లిదండ్రుల శ్రాద్ధకర్మలూ, జపహోమవ్రతాలు; సమారాధనలు చేయాలి; ఆలికి పుంసవనమూ, శిశువునకు జాతకర్మలు, తనకు యాగదీక్ష, పోయినవారికి దహనాదిక్రియలూ, చనిపోయిన తిథినాడు సాంవత్సరికం జరపాలి.

**మ. విను, మే దేశములన్ దయా గుణ తపో విద్యాన్వితంబైన వి**
**ప్రనికాయంబు వసించు, నే స్థలములన్ భాగీరథీ ముఖ్య వా**
**హిను లుండున్, హరిపూజ లెయ్యెడల భూయిష్ఠప్రకారంబులం**
**దనరున్ భూవర! యట్టి చోటులఁ దగున్ ధర్మంబులంజేయఁగన్. 449**

**ప్రతి :** భూవర!= రాజా! విను; ఏ దేశములన్= ఏ దేశాలలో; దయాగుణ తపస్+విద్యా+అన్వితంబైన= దయతో, సద్గుణాలతో, తపస్సుతో, చదువుతో కూడిన; విప్రనికాయము= బ్రాహ్మణుల సమూహం; వసించున్= నివసిస్తుందో; ఏ స్థలములన్= ఏ తావులలో; భాగీరథీ ముఖ్యవాహినులు= గంగ, ఇతర ప్రముఖనదులు; ఉండున్= ప్రవహిస్తాయో;

ఏ+ఎడలన్= ఏ స్థలాలలో; హరిపూజలు= విష్ణుపూజలు; భూయిష్ఠప్రకారంబులన్= అత్యధికరీతులలో; తనరున్= జరుగుతాయో; అట్టిచోటులన్= ఆ ప్రదేశాలలో; ధర్మంబులన్+చేయన్+కన్= ధర్మాలు చేయటం; తగున్= తగినది.

**తా :** రాజా! ఎక్కడ, దయతో, సద్గుణాలతో, తపస్సుతో, చదువుతో గూడిన విప్రులుంటారో, ఎక్కడ గంగ ఇతర ముఖ్యనదులు ప్రవహిస్తాయో, ఎక్కడ అత్యధికంగా శ్రీహరి పూజలు జరుగుతుంటాయో, అక్కడ ధర్మాచరణ చేయటం ఉచితం. ఉత్తమం.

**క. హరియందు జగము లుండును, హరిరూపము సాధుపాత్రమం దుండు, శివం**
**కరమగు పాత్రము గలిగిన, నరయఁగ నది పుణ్యదేశ మనఘచరిత్రా! 450**

**ప్రతి :** అనఘచరిత్రా!= పాపంలేని నడతగలవాడా! హరియందున్= విష్ణువులో; జగములు+ఉండును= లోకాలు ఉంటాయి; హరిరూపము= హరి ఆకృతి; సాధుపాత్రము= ఉత్తమ పాత్రము, ప్రథమ పూజార్హము; అందున్+ఉండున్= దానిలో జగత్తు అలా వర్తిల్లుతుంది; శివంకరము+అగు= శుభకరమైన; పాత్రముగలిగినన్= హరి ఆకృతి ఉంటే; అది= ఆ ప్రదేశము; అరయఁగన్= పరిశీలింపగా; పుణ్యదేశము= పవిత్ర ప్రదేశము.

**తా :** అనఘా! శ్రీహరి ఉదరంలో విశ్వం విస్తరించి ఉంటుంది. అటువంటి శ్రీహరి సాధు పురుషులలో ఉంటాడు. సత్పాత్రులున్నదేశం పుణ్యప్రదేశం కాబట్టి దేశ, కాల, పాత్రలను గుర్తించి అవి ప్రాప్తించిన వెంటనే ఆ అవకాశం జారవిడువకుండా పుణ్యకార్యాలు చేయాలి.

**వ. మఱియు ఁగురుక్షేత్రంబును గయాశీర్షంబును బ్రయాగంబును బులహాశ్రమంబును నైమిశంబును ఫాల్గునంబును సేతువును బ్రభాసంబును గుశస్థలియును వారణాసియు మధురాపురియును బంపాబిందు సరోవరంబులును నారాయణాశ్రమంబును సీతారామాశ్రమంబును మహేంద్ర మలయాదులైన కులాచలంబులును హరిప్రతిమార్చన ప్రదేశంబులును హరిసేవాపరులైన పరమభాగవతులు వసించెడు పుణ్యక్షేత్రంబులును శుభకాముండైన వాఁడు సేవింపవలయు. 451**

**ప్రతి :** మఱియున్= ఇంకా; కురుక్షేత్రంబును= కురుక్షేత్రం; గయాశీర్షంబును= గయాక్షేత్రం; ప్రయాగంబును= త్రివేణీ సంగమం; పులహ+ఆశ్రమంబును= పులహుని ఆశ్రమమూ; నైమిశంబును= నైమిశారణ్య పుణ్యభూమి; ఫాల్గునంబును= ఫల్గుణీనదీ తీరం; సేతువును= రామసేతువూ; ప్రభాసంబును= ప్రభాసతీర్థం; కుశస్థలియును= కుశస్థలి; వారణాసియు= వారణాసీ; మధురాపురియును= మధురాపురీ; పంపాబిందు సరోవరంబులును= పంపా, బిందు అనే సరస్సులు; నారాయణాశ్రమంబును, సీతారామాశ్రమంబును= నారాయణ సీతారామ ఆశ్రమాలు రెండూ; మహేంద్రమలయాదులైన కులాచలంబులును= మహేంద్రగిరి, మలయ పర్వతమనే ఇతర కులగిరులు; హరిప్రతిమా+అర్చన ప్రదేశంబులును= హరియొక్క విగ్రహాల పూజాస్థలాలూ; హరిసేవాపరులు+ఐన= విష్ణుసేవాసక్తులయిన; పరమభాగవతులు= పరమభక్తులు; వసించెడు పుణ్యక్షేత్రంబులును= నివసించే పుణ్యప్రదేశాలు; శుభకాముండైనవాఁడు= క్షేమం కోరేవాడు; సేవింపవలయున్= సేవించాలి.

**తా :** రాజా! పుణ్యక్షేత్రాలు ప్రసిద్ధాలు, కురుక్షేత్రం, గయ, ప్రయాగ, పులహాశ్రమం, నైమిశం, ఫాల్గుణం, రామసేతువు, ప్రభాసతీర్థం, కుశస్థలి, వారణాసి, మధురానగరి, పంపబిందుసరస్సులూ నారాయణ సీతారామ ఆశ్రమాలు; మహేంద్ర

మలయాది కులపర్వతాలూ, హరిమూర్తులుగల క్షేత్రాలు, హరిభక్తులు నివసించే స్థలాలూ–ఇవి అన్నీ ప్రశస్త పుణ్యక్షేత్రాలు. క్షేమాన్ని కోరేవాడు వీటిని సేవించాలి.

**ఆ. భూవరేంద్ర! యిట్టి పుణ్యప్రదేశంబు, లందు నరుఁడు సేయునట్టి ధర్మ**
**మల్పమైన నది సహస్రగుణాధిక, ఫలము నిచ్చు హరికృపావశమున. 452**

**ప్రతి :** భూవర+ఇంద్ర!= రాజేంద్రా! ఇట్టి పుణ్యప్రదేశంబులందున్= ఈ పుణ్యక్షేత్రాలలో; నరుఁడు= మానవుడు; చేయున్+అట్టిధర్మము= చేసే ధర్మకార్యం; అల్పము+ఐనన్= తక్కువదైనా; అది= ఆ కార్యం; హరికృపావశమునన్= హరిదయ కారణంగా; సహస్రగుణ+అధికఫలమున్+ఇచ్చున్= వేయిరెట్లు ఎక్కువ ఫలితాన్ని ఇస్తుంది.

**తా :** రాజా! ఈ పుణ్యక్షేత్రాలలో చేసే ధర్మకార్యం స్వల్పమయినా, హరిదయవల్ల వేయిరెట్లు అధిక ప్రయోజనాన్ని కల్గిస్తుంది.

**వ. వినుము, చరాచరం బయిన విశ్వమంతయు విష్ణుమయం బగుటంజేసి పాత్ర నిర్ణయ నిపుణులైన విద్వాంసులు నారాయణుండు ముఖ్యపాత్రం బని పలుకుదురు. దేవఋషులు, బ్రహ్మ పుత్రులైన సనకాదులును నుండ భవదీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుం డయ్యె ననేక జంతు సంఘాత సంకీర్ణంబైన బ్రహ్మాండ పాదపంబునకు నారాయణుండు మూలంబు, తన్నిమిత్తంబున నారాయణ సంతర్పణంబు సకల జంతు సంతర్పణంబని యెఱుంగుము ఋషి నర తిర్యగమర శరీరంబులు పురంబులు, వానియందుఁ దారతమ్యంబులతోడ జీవరూపంబున భగవంతుండయిన హరి వర్తించుటం జేసి పురుషుం డనఁ బ్రసిద్ధుఁ డయ్యె నందుఁ దిర్యగ్జాతుల కంటె నధికత్వంబు పురుషునియందు విలసిల్లుటం జేసి పురుషుండు పాత్రంబు పురుషులలోన హరితనువైన వేదంబును ధరించుచు సంతోష విద్యాతపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు బ్రాహ్మణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండయిన యోగి ముఖ్య పాత్రం బని పలుకుదురు పరస్పర పాత్రంబులకు సహింపని మనుష్యులకుఁ బూజ నార్థంబుగాఁ ద్రేతాయుగంబునందు హరిప్రతిమలు గల్పింపఁ బడియెఁ, గొందఱు ప్రతిమార్చనంబు సేయుదురు పాత్ర పురుష ద్వేషులైన వారలకు నట్టి ప్రతిమార్చనంబు ముఖ్యార్థప్రదంబు గాదు మందాధికారులకుఁ బ్రతిమార్చనంబు పురుషార్థప్రదం బగును 453**

**ప్రతి :** వినుము= విను; చర+అచరంబైన= కదిలేది, కదలనిది; విశ్వము+అంతయున్= ప్రపంచం అంతా; విష్ణుమయంబు+అగుటన్+చేసి= విష్ణునితో నిండినది అగుటవల్ల; పాత్రనిర్ణయ నిపుణులు+ఐన విద్వాంసులు= పాత్రత్వ నిశ్చయంలో నేర్పరులయిన పండితులు; నారాయణుండు ముఖ్యపాత్రంబని= విష్ణువు ప్రధానపాత్రమని; పలుకుదురు= అంటారు; భవదీయరాజసూయంబునన్= నీ రాజసూయయాగంలో; దేవఋషులు= దేవమునులు; బ్రహ్మపుత్రులైన= బ్రహ్మతనయులైన; సనక+ఆదులును+ఉండన్= సనకుడు మొదలయినవారు అక్కడ ఉండగా; హరి= విష్ణువు; అగ్రపూజకున్= మొదటి పూజకు; సమ్మతుండు+అయ్యెన్= ఇష్టపడినాడు; అనేక జంతు సంఘాత సంకీర్ణంబైన= పలు జీవుల సమూహంతో నిండిన; బ్రహ్మాండ పాదపంబునకున్= బ్రహ్మాండము అనే చెట్టుకు; నారాయణుండు= హరి; మూలంబు= మొదలు (కాండము), తద్+నిమిత్తంబునన్= ఆ కారణాన; నారాయణసంతర్పణంబు= నారాయణుని తృప్తిపరచుట; సకల జంతు

సంతర్పణంబని= ఎల్లజీవులను తృప్తిపరచడమే అని; ఎఱుంగుము= గ్రహించు. ఋషి నరతిర్యగమర శరీరంబులు= ఋషుల, నరుల, పశుపక్షుల, దేవతల దేహాలు; పురంబులు= నివాస యోగ్యస్థలాలు; వానియందున్= ఆ పురాలలో; తారతమ్యంబులతోడన్= హెచ్చుతగ్గులతో; జీవరూపంబునన్= ప్రాణి ఆకారంతో; భగవంతుండయిన= దేవుడైన; హరి= విష్ణువు; వర్తించుటన్+చేసి= ఉండుటవల్ల; పురుషుండు+అనన్= పురుషుడు అని; ప్రసిద్ధుండు+అయ్యెన్= ప్రశస్తుడైనాడు; అందున్= వారిలో; తిర్యక్+జాతులకంటెన్= పశుపక్షుల జాతులకంటె; అధికత్వంబు= పెద్దరికం; పురుషునియందున్= నరునిలో; విలసిల్లుటన్+చేసి= ప్రకాశించటంవల్ల; పురుషుండు= నరుడు; పాత్రంబు= అర్హుడు (పూజకు); పురుషులలోనన్= నరులలో; హరితనువు+అయిన= విష్ణుని దేహమైన; వేదంబును; ధరించుచున్= వేదాన్ని; మోస్తూ,(పఠిస్తూ); సంతోషవిద్యాతపస్+గరిష్ఠుండైన= ఆనందం, చదువు తపస్సులతో మిక్కిలి గొప్పవాడైన; బ్రాహ్మణుండు పాత్రంబు= విప్రుడు అర్హుడు; బ్రాహ్మణులలోనన్= బ్రాహ్మణులలోనూ; ఆత్మజ్ఞాన పరిపూర్ణుండయిన= ఆత్మజ్ఞానంతో నిండిన; యోగి ముఖ్యపాత్రంబు+అని= యోగి ప్రధాన పాత్రమని; పలుకుదురు= చెప్తుతారు; పరస్పర పాత్రంబులకున్= ఇతరులను పాత్రములుగా వ్యవహరించటానికి; సహింపని= ఓర్వలేని; మనుష్యులకున్= నరులకు; పూజన+అర్థంబుగాన్= పూజకొరకు; త్రేతాయుగంబునన్= త్రేత అను యుగంలో; హరిప్రతిమలు= హరివిగ్రహాలు; కల్పింపన్+పడియెన్= చేయబడినవి. కొందఱు ప్రతిమా+అర్చనంబు+చేయుదురు= విగ్రహపూజ చేస్తారు; పాత్రపురుష ద్వేషులైన వారలకున్= పూజ్యులైనవారిని ద్వేషిస్తూ విగ్రహారాధన చేసేవారికి; అట్టిప్రతిమార్చనంబు= ఆ విగ్రహపూజ; ముఖ్య+అర్థప్రదంబు+కాదు= ప్రధానలాభకారి కాదు; మంద+అధికారులకున్= మందాధికారులకు; ప్రతిమార్చనంబు= విగ్రహారాధన; పురుషార్థప్రదంబు+అగును= పురుషార్థ సాధకం అవుతుంది.

**తా :** విను. చరాచరజగత్తు హరిమయం కాబట్టి పాత్ర నిర్ణేతలు హరినే పూజకు ముఖ్యపాత్ర మన్నారు. దేవర్షులు, సనకాదులు కొలువై ఉండగా, రాజసూయంలో అగ్రపూజకు హరి అంగీకరించటం ఈ అంశానికి తార్కాణం. బ్రహ్మాండం అనేక జీవజాతుల సమూహాలతో విలసిల్లే మహావృక్షం. దానికి మూలం నారాయణుడు. కాగా, నారాయణ సంతర్పణమంటే, సర్వజగజ్జంతు సంతర్పణ. జీవుల శరీరాలు పురాలు; వానిలో అధిక అల్పాంశ రూపాన వసించటంవలన అతడు పురుషుడని వ్యవహరించబడుతున్నాడు. అందుకే పురుషులలో విష్ణుదేహమయిన వేదాను ధరించటంవలన బ్రాహ్మణుడు శ్రేష్ఠుడు. వారిలో ఆత్మజ్ఞానపరిపూర్ణుడయిన యోగి మరీ శ్రేష్ఠుడు. త్రేతాయుగంలో పరస్పర యోగ్యతలను సహించని నరులకు పూజనార్థమై హరిప్రతిమలు కల్పించబడ్డాయి. కొందరు ప్రతిమార్చన చేస్తారు. కొందరు చేయరు. పూజ్యులైనవారిని ద్వేషిస్తూ విగ్రహారాధన చేసేవారి పూజ ఫలప్రదం కాదు. కాని, జ్ఞానంలో అల్పాధికారులకు ప్రతిమా సమర్చన పురుషార్థసాధకమే.

**ఆ. అఖిలలోకములకు హరి దైవతము చూడ, హరికి దైవతము ధరాధినాథ!**
**పదపరాగలేశపం క్తిచేఁ ద్రైలోక్య, పావనంబు సేయు బ్రాహ్మణుండు. 454**

**ప్రతి :** ధరా+అధినాథ= ధర్మరాజా!; అఖిలలోకములకున్= ఎల్లలోకాలకు; హరి= విష్ణువు; దైవతము= దేవుడు; చూడన్= పరిశీలింపగా; హరికిన్= శ్రీహరికి; పదపరాగలేశపంక్తిచేన్= కాలిధూళికణాలవరుసచే; త్రైలోక్యపావనంబు+చేయు బ్రాహ్మణుండు= ముల్లోకాలు పవిత్రం చేసే విప్రుడు; దైవతము= దేవుడు.

**తా :** రాజా! ఎల్లలోకాలకు విష్ణువు దేవుడు; పరిశీలిస్తే తనపాదధూళిలేశంతో ముల్లోకాలూ పవిత్రం చేసే విప్రుడు ఆ హరికి దేవుడు.

**వ. అట్టి బ్రాహ్మణ జనులందుఁ గర్మనిష్ఠులు, దపోనిష్ఠులు, వేదశాస్త్రనిష్ఠులు, జ్ఞానయోగ నిష్ఠులునై కొందరు వర్తింతు, రందు జ్ఞాననిష్ఠునికి ననంత ఫలకామియైన గృహస్థుండు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును, దేవతల నుద్దేశించి హవ్యంబులును బెట్టుట ముఖ్యంబు, దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైనఁ బితృకార్యంబునకు ముప్వురనైన నొకరినైన భోజనంబు సేయింప వలయు, ధనవంతునకైనను శ్రాద్ధవిస్తారంబు కర్తవ్యంబు కాదు. దేశ కాలప్రాప్త కందమూల ఫలాదికం బయినవారి నై వేద్యంబున విధిచోదిత ప్రకారంబుగా శ్రద్ధతోడఁ బాత్రంబునందుఁ బెట్టిన యన్నంబు కామదంబయి యక్షయ ఫలకారియగు, ధర్మతత్త్వవేదియైన వాఁడు శ్రాద్ధంబులందు మాంస ప్రదానంబు సేయక భక్షింపక చరింపవలయుఁ; గందమూలాది దానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు, ప్రాణిహింస సేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు, యజ్ఞవిదులైన ప్రోడలు నిష్కాములయి బాహ్యకర్మంబులు విడిచి యాత్మజ్ఞాన దీపంబులందు గర్మమయంబు లయిన యజ్ఞంబుల నాచరింతురు. 455**

**ప్రతి :** అట్టి బ్రాహ్మణజనులందున్= అట్టి బ్రాహ్మణ ప్రజలలో; కర్మనిష్ఠులు= కర్మను నిష్ఠగాకలవారు; తపస్+నిష్ఠులు= తపస్సును నిష్ఠగా చేసేవారు; వేదశాస్త్ర నిష్ఠులు= వేదశాస్త్రాలను అధ్యయనం చేసేవారు; జ్ఞానయోగ నిష్ఠులున్+ఐ= జ్ఞానలో, యోగలోను సిద్ధిగలవారుగా; కొందరు వర్తింతురు= కొందరుంటారు; జ్ఞాననిష్ఠునికిన్= జ్ఞాన సిద్ధిగలవాడికి; అనంతఫలకామియైన= అనంత ప్రయోజనాన్ని కోరేవాడయిన; గృహస్థుండు= గేస్తు; పితృజనులన్+ఉద్దేశించి= పితృదేవతలను, ప్రేతలను గూర్చి; కవ్యంబులను= పిండప్రదానాలు; దేవతలను+ఉద్దేశించి= దేవతలనుగూర్చి; హవ్యంబులును= హోమద్రవ్యాలు; పెట్టుట ముఖ్యంబు= చేయటం ప్రధానం; దైవకార్యంబునకున్= దేవతాకార్యాలలో; ఇరువురును+ఐనన్+ఒకరినైనన్= ఇద్దరినైన, ఒకరినైన; పితృకార్యంబునకున్= పితృదేవతల పనిలో; ముప్వురనైనన్+ఒకరినైనన్= ముగ్గురిని గాని ఒక్కరినిగాని; భోజనంబు+చేయింపన్+వలయున్= భుజింపజేయాలి; ధనవంతునకున్+ఐనన్= డబ్బుగలవానికైనా; శ్రాద్ధవిస్తారంబు= శ్రాద్ధక్రియల విస్తృతి మాత్రమే; కర్తవ్యంబు+కాదు= చేయవలసిందిగాదు; దేశకాల ప్రాప్త కందమూలఫల+ఆదికంబు+అయినవారి నైవేద్యంబునన్= ప్రదేశాలనుబట్టి, సమయాన్నిబట్టి దొరికే దుంపలు; వేళ్ళు (చెట్టుమొదళ్ళు) పండ్లు మొదలయినవి; అయినవారి నైవేద్యంబున= బంధువుల, నివేదనగా (అర్పితంగా); విధిచోదిత ప్రకారంబుగాన్= శాస్త్రోక్తవిధంగా; శ్రద్ధతోడన్= శ్రద్ధగా; పాత్రంబునందున్= అర్హమైనచోట; పెట్టినఅన్నంబు= భోజనం; కామదంబు+అయి= కోర్కెలు నెరవేర్చునదై; అక్షయఫలకారి+అగున్= అక్షయమైన ఫలితం ఇచ్చునదైన; ధర్మతత్త్వవేదియైనవాఁడు= ధర్మం (యొక్క) స్వభావాన్ని ఎరిగినవాడు; శ్రాద్ధంబులందున్= ఆబ్దికాలలో; మాంస ప్రదానంబు+చేయక= మాంసం నివేదించక; భక్షింపక= తినక; చరింపన్+వలయున్= ప్రవర్తించాలి; కందమూల+ఆది దానంబునన్+అయ్యెడి ఫలంబు= దుంపలు, వేళ్లు, మూలములు మొదలయినవి ఇవ్వటంవల్ల కలిగే ఫలితం; పశుహింసనంబునన్= జంతువులను చంపుటవలన; సంభవింపదు= కలుగదు; ప్రాణిహింస+చేయక వర్తించుటకంటెన్= జీవహింసమాని జీవించటంకంటె; మిక్కిలి ధర్మంబులేదు= పెద్ద పుణ్యం లేదు; యజ్ఞవిదులైనప్రోడలు= యాగం తెలిసిన ప్రౌఢులు; నిష్కాములయి= కోర్కెలుడిగినవారై; బాహ్యకర్మంబులువిడిచి= కేవలం బాహ్యాచారాలు విడిచిపెట్టి, చేసేపనులు వదలి; ఆత్మజ్ఞానదీపంబులందున్= ఆత్మజ్ఞానమనే దీపం వెలుగులలో కర్మమయంబులయిన= క్రియలతో; యజ్ఞంబులన్= యాగాలను; ఆచరింతురు= చేస్తారు.

**తా :** హరిని మించిన బ్రాహ్మణులలో, కర్మల తపస్సులో వేదశాస్త్రాలలో జ్ఞానయోగాలలో సిద్ధులయినవారున్నారు. వారిలో జ్ఞాననిష్ఠునికి, సంసారికి, పితరులకోసం కవ్యాలు దేవతలకోసం హవ్యాలు సమర్పించాలి; దైవకార్యాలకైతే ఒకరిద్దరు, పితృకార్యాలకైతే, ఒకరిని లేదా ముగ్గురుని భోజనాలతో తృప్తిపరచాలి; ధనవంతుడైనా శ్రాద్ధకర్మలు విస్తరించరాదు; భోజనాలలో మాంసాదులు కూడదు, కందమూలాలు ప్రశస్తతరాలు; జీవహింసను మానుటకు మించిన ధర్మాచరణ లేదు. యాగవేత్తలు బాహ్యక్రియలను వదలి అంతర్ముఖులై జ్ఞానయోగంతో ధర్మాలు నిర్వహిస్తారు. అది అందరికి అనుసరించ తగింది.

**క. పశువులఁబొరిగొని మఖములు, విశదములుగఁజేయు బుధుని వీక్షించి తమున్**
**విశసనము సేయునో యని, క్రశిమన్ బెగడొందు భూతగణము నరేంద్రా! 456**

**ప్రతి :** నరేంద్రా!= రాజా! పశువుల్= జంతువులను; పొరిగొని= చంపి; మఖములు= యాగాలు; విశదములుగన్= విపులంగా; చేయుబుధునిన్= చేసే పండితుని; వీక్షించి= చూచి; తమున్= తమను గూడ; విశసనము+చేయునో+అని= హింసించునో అని; క్రశిమన్= కృంగిపోయి; భూతగణము= జీవ సంఘం; బెగడు+ఒందున్= శోకిస్తుంది;

**తా :** రాజా! విప్రుడు జంతువులను హింసించి చేసే యాగాలు చూచి మిగిలిన జీవప్రపంచం, తాము గూడ వాటివలె తెగిపడవలసి వస్తుందేమోనని కృశించి శోకిస్తాయి.

**వ. అది గావున ధర్మవేది యయినవాఁడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత నిత్యనైమిత్తిక క్రియలఁ జేయవలయు, నిజధర్మ బాధకం బయిన ధర్మంబును, పరధర్మ ప్రేరితంబయిన ధర్మంబును, నాభాసధర్మంబును, బాషండ ధర్మంబును, గపటధర్మంబును ధర్మజ్ఞుండయిన వాఁడు మానవలయు, నైసర్గిక ధర్మంబు దురితశాంతి సమర్థంబగు, నిర్ధనుండు ధర్మార్థంబు యాత్రసేయుచునైన ధనంబు గోరవలదు, జీవనోపాయంబునకు నిట్టట్టుఁ దిరుగక కార్పణ్యంబు లేక జీవించు మహాసర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండై యెద్దియుం గోరక బ్రదికెడి సుగుణునికిం గల సుఖంబు కామలోభంబుల దశదిశలం బరిధావనంబు సేయువానికి సిద్ధింపదు, పాదరక్షలు గలవానికి శర్కరాకంటకాదుల వలన భయంబు లేక మెలంగ నలవడుభంగిఁ గామంబుల వలన నివృత్తి గల వానికి నెల్ల కాలంబును భద్రంబగు, నుపస్థమునకును జిహ్వాదైన్యంబునకుఁ బురుషుండు గృహపాలక శునకంబుకైవడి సంచరించుచు సంతుష్టి లేక చెడు, సంతోషి గాని విప్రుని విద్యా తపో విభవ యశంబులు నిరర్థకంబులగు, నింద్రియ లోలత్వంబున జ్ఞానంబు నశించు, సకలభూలోక భోగంబుల భోగించియు దిగ్విజయంబు సేసియు బుభుక్షా పిపాసలవలనఁ గామపారంబును, హింసవలనఁ గ్రోధపారంబును జేరుట దుర్లభంబు, సంకల్పవర్జనంబునఁ గామంబును, గామవర్జనంబునఁ గ్రోధంబును, నర్థానర్థ దర్శనంబున లోభంబును, నద్వైతానుసంధానంబున భయంబును, నాత్మా నాత్మ వివేకంబున శోకమోహంబులును, సాత్త్విక సేవనంబున దంభంబును, మౌనంబున యోగాంతరాయంబును, శరీరవాంఛలేమిని హింసయు, హితాచరణంబున భూతజంబయిన దుఃఖంబును, సమాధిబలంబున దైవిక వ్యథయుఁ బ్రాణాయామాదికంబున మన్మథవ్యథయు, సాత్త్వికాహారంబున నిద్రయు, సత్త్వగుణంబున రజస్తమంబులును, నుపశమంబున సత్త్వంబును గురుభజన కుశలుఁడై శీలంబున జయింపవలయు. 457**

**ప్రతి :** అది+కావునన్= దానిని బట్టి; ధర్మవేది+అయినవాఁడు= ధర్మం తెలిసినవాడు; దైవప్రాప్తంబులయిన= దైవికంగా లభించిన; కందమూల+ఆదికంబుచేతన్= దుంపలు, వేళ్ళు మొదలయినదానితో, నిత్యనైమిత్తికక్రియలన్= నిత్యమూ చేసే పనులు–భోజనాదికాలు, నైమిత్తికాలు ఏదైన ఒక నిమిత్తాన్ని అనుసరించి చేసే పనులు; చేయవలయున్= నిర్వహించాలి; నిజధర్మబాధకంబయిన ధర్మంబును= తన ధర్మానికి పీడకల్గించే ధర్మాన్ని; పరధర్మప్రేరితంబయిన ధర్మంబును= ఇతర ధర్మం వలన ప్రేరేపింపబడ్డ ధర్మాన్ని; ఆభాస ధర్మంబును= కనిపించుటకే ధర్మమై, నిజానికి ధర్మం కానిది; పాషండధర్మంబును= వేదబాహ్యమైన ధర్మాన్ని; కపటధర్మంబును= అబద్ధమైన ధర్మాన్ని; ధర్మజ్ఞుండు+ఐనవాఁడు= ధర్మవేత్త; మానవలయున్ వర్జించాలి; నైసర్గికధర్మంబు= సహజమైన ధర్మం; దురితశాంతిసమర్థకంబు+అగున్= పాపనాశనశక్తిగలదవుతుంది. నిర్ధనుండు= ధనహీనుడు; ధర్మ+అర్థంబు= ధర్మంకోసం; యాత్ర+చేయుచున్+ఐనన్= యాత్రలు చేస్తూగూడ; ధనంబు= డబ్బు; కోరన్+వలదు= కోర కూడదు; జీవన+ఉపాయంబునకున్= బ్రతుకు తెరువుకోసం; ఇట్టు+అట్టున్= ఇటు, అటు, తిరుగక; కార్పణ్యంబు లేక= లోభితనం లేక, జీవించు= బ్రతికె, మహాసర్పంబు తెఱంగునన్= పెద్ద పాములాగా; సంతోషంబునన్= సంతోషంతో; ఆత్మ+ఆరాముండై= తనలో (తాను) ఆనందించువాడై; ఎద్దియున్+కోరక= ఏదీ కోరక; బ్రతికేడి; సుగుణునికిన్+కలసుఖంబు= బ్రతికే సద్గుణవంతునికి ఉండేసౌఖ్యం; కామలోభంబులన్= కోరికలు పేరాసలతో; దశదిశలన్= పదిదిక్కులకు; పరిధావనంబు చేయువానికి సిద్ధింపదు= పరుగెత్తెవారికి కలుగదు; పాదరక్షలు గలవానికిన్= చెప్పులు గలవాడికి; శర్కరాకంటక+ఆదులవలనన్= గులకరాళ్ళు, ముళ్ళుమొదలగువానివలన; భయంబులేక మెలంగన్= నిర్భయంగా మసలటం; అలవడుభంగిన్= అలవాటయినట్లుగా; కామంబులవలన నివృత్తిగలవానికిన్= కోరికలపట్ల విముఖుడైనవానికి; ఎల్లకాలంబును= అన్ని వేళల్లో; భద్రంబు+అగున్= శుభమగును; ఉపస్థమునకును= ఆడుగురికోసం;(కామసుఖంకోసం) జిహ్వాదైన్యంబునకున్= నాలుక చాపల్యానికీ; పురుషుండు= నరుడు; గృహపాలకశునకంబు కైవడిన్= ఇంటికాపలా కుక్కవలె; సంచరించుచున్= ప్రవర్తిస్తూ; సంతుష్టిలేక= సంతృప్తి లేక; చెడున్= నశిస్తాడు; సంతోషిగాని= సంతోషం లేని; విప్రుని= బ్రాహ్మణుని; విద్యాతపస్+విభవయశంబులు= చదువు, తపస్సు, సంపద, కీర్తులు; నిర్+ అర్థకంబులగున్= నిష్ప్రయోజనాలవుతాయి; ఇంద్రియలోలత్వంబునన్= ఇంద్రియాలకు లొంగిపోవటంవలన; జ్ఞానంబు నశించున్= తెలివి చెడును; సకల భూలోకభోగంబులన్= ఎల్ల భూమిమీదిసుఖాలను; భోగించియున్= అనుభవించికూడ; దిగ్విజయంబు+చేసియున్= దిక్కుల జయించి కూడ; బుభుక్షాపిపాసలవలనన్= ఆకలి దప్పులవలన; కామపారంబును= కోర్కెల గట్టును; హింసవలనన్= హింసకారణాన; క్రోధపారంబును= కోపపు గట్టును; చేరుట దుర్లభంబు= చేరుకొనుట సాధ్యంకాదు; సంకల్పవర్జనంబునన్= ఆశల తొలగింపువలన; కామంబును= కోరికను; కామవర్జనంబువలనన్= కోర్కెలు విడుచుటవలన; క్రోధంబునున్= కోపాన్ని; అర్థ+అనర్థదర్శనంబునన్= ప్రయోజనం, అప్రయోజనాలను చూడడంవలన; లోభంబును= పేరాసను; అద్వైత+అనుసంధానంబువలనన్= జీవుడూ దేవుడూ ఒక్కరే, రెండు కాదు అనే భావాన్ని అన్వయించుకొనటంవలన; భయంబును= భీతిని; ఆత్మ+అనాత్మవివేకంబునన్= ఆత్మ, ఆత్మకానిది అనే జ్ఞానం వలన; శోకమోహంబులును= శోక, మోహాలను, సాత్త్విక సేవనంబునన్= సాత్త్విక జనులను కొలుచుటవలన; ధంభంబును= ఆటోపమును; మౌనంబునన్= మాటలలేమివలన; యోగ+అంతరాయంబును= యోగవిఘ్నాన్ని; శరీరవాంఛలేమినిన్= దేహపు కోరికలేకుండటవలన; హింసయు= హింస; హిత+ఆచరణంబునన్= మేలు చేయుటవలన; భూతజంబయిన దుఃఖంబును= ప్రాణుల నుండి పుట్టిన దుఃఖము; సమాధిబలంబునన్= చిత్తముయొక్క ఏకాగ్రతవలన; దైవికవ్యథయున్= ఆధిదైవిక కష్టములను; ప్రాణ+ఆయామాదికంబునన్= ప్రాణాయామం మొదలయిన క్రియలవలన; మన్మథవ్యథయున్= మైథునేచ్ఛ; సాత్త్విక+ఆహారంబునన్= సత్త్వగుణకరమైన భోజనంవలన; నిద్రయు= నిద్రపోవుటయు; సత్త్వగుణంబునన్=

సత్త్వం అనే ఉత్తమ గుణంవలన; రజస్+తమంబులును= రజోగుణతమోగుణాలూ; ఉపశమనంబునన్= శాంతివలన; సత్త్వంబును= సాత్త్విక గుణాన్ని; గురుభజనకుశలుఁడై= ఆచార్యుని సేవలో నేర్పరియై; శీలంబునన్= సహజ స్వభావంతో; జయింపవలయున్= గెలవాలి.

**తా :** కాగా తత్త్వమెరిగినవాడు కందమూలాలతోనే తన నిత్యక్రియలు, నైమిత్తిక క్రియలూ చేసికోవాలి. స్వధర్మబాధకమైన పరధర్మచోదితమైన ఆచరణకు దూరంగా మెలగాలి; అట్లే వేదబాహ్యమైన ఆభాసమాత్రమైన అసంబద్ధమైన ధర్మాన్ని అతడు మానుకోవాలి. సహజధర్మం వల్ల పాపనాశనం గలుగుతుంది. ధర్మార్జనకై తీర్థయాత్రలు చేస్తూ కూడ ధనహీనుడు ధనాన్ని కాంక్షించరాదు. బ్రదుకు తెరువుకై లోకంలో పలువిధాల పరుగులు పెట్టటంమాని, ప్రాప్తలాభంతో జీవించే పెద్దపాములాగా సుఖశాంతులతో మెలగాలి. పాదరక్షలు, నడిచే వానిని కంటకాది బాధనుండి రక్షించేవిధంగా, కామరాహిత్యము నరుని జీవయాత్రాయాతనలనుండి కాపాడుతుంది. జిహ్వకు లోగి ఉపస్థకు దాసుడై పురుషుడు, ఇంటికాపలా కుక్కవలె వర్తిస్తూ సంతుష్టహీనుడై నశిస్తున్నాడు. అసంతుష్ట విప్రుని చదువుసంధ్యలు, కీర్తి వైభవాలు నిష్ప్రయోజనాలు. ఇంద్రియాలకు లొంగటంవలన జ్ఞానం నశిస్తుంది. ఆకలిదప్పుల వలన కోర్కెలను, హింసవలన క్రోధాన్ని నిర్జించుట అసంభవం. కాబట్టి సంకల్ప త్యాగంతో కామాన్ని, కామ త్యాగంతో క్రోధాన్ని, సమ్యక్‌దర్శనంతో లోభాన్ని, అద్వైతభావంతో వెఱపును, ఆత్మవివేకంతో శోకాన్ని, సత్త్వంతో దంభాన్ని, మౌనంతో యోగవిఘ్నాన్ని, వైరాగ్యంతో హింసను, ప్రాణాయామంతో మన్మథబాధను జయించి నరుడు ముక్తిమార్గాన పయనించవచ్చు.

**విశే : నిత్యము :** ప్రతి దినమూ చేయవలసిన సంధ్యావందనాదులు.

**<u>నైమిత్తికం</u> :** నిమిత్తంగా వచ్చిన ఆబ్దికం మొదలైనవి.

**క. హరిమహిమ దనకుఁజెప్పిన, గురువున్ నరుఁడనుచుఁదలఁచి కుంఠితభక్తిం**
**దిరుగు పురుషుశ్రమ మెల్లను, గరిశౌచముక్రియ నిరర్థకంబగు నధిపా! 458**

**ప్రతి :** అధిపా!= రాజా! తనకున్= తనకు; హరిమహిమన్= విష్ణుగొప్పతనాన్ని; చెప్పిన గురువున్= బోధించిన ఆచార్యుని; నరుఁడు+అనుచున్+తలఁచి= మానవమాత్రునిగా భావించి; కుంఠిత భక్తిన్= కుంటుబడిన గురుభక్తితో, తిరుగు= సంచరించే; పురుషుశ్రమము+ఎల్లను= నరుని కృషిసర్వం; కరిశౌచము క్రియన్= ఏనుగు స్నానంలాగా; నిరర్థకంబు+అగున్= నిష్ప్రయోజనమవుతుంది.

**తా :** రాజా! హరి మహిమను తనకు బోధించిన గురుని, మానవమాత్రునిగా భావించి ప్రవర్తించు నరుని శ్రమ మొత్తం గజస్నానంవలె తుదకు నిరర్థకంగా ముగిస్తుంది.

**విశే : గజస్నానం :** ఏనుగు స్నానం చేసినతరువాత తన శరీరంపై దుమ్ము చల్లుకుంటుంది. అందువల్ల ఆ స్నానం నిరర్థకమని భావిస్తారు.

**ఉ. ఈ వనజాతనేత్రుఁబరమేశు మహాత్ముఁబ్రధానపూరుషున్**
**దేవశరణ్యు సజ్జనవిధేయు ననంతుఁబురాణయోగి సం**
**సేవితపాదపద్ముఁదమ చిత్తములన్ నరుఁడంచు లోకు లి**
**చ్ఛావిధిఁజూచుచుందురు సన్మతి లేక నరేంద్రచంద్రమా! 459**

**ప్రతి :** నరేంద్ర చంద్రమా!= రాజశ్రేష్ఠా! ధర్మరాజా!; లోకులు= సామాన్యజనులు; ఈ వనజాతనేత్రున్= ఈ పద్మనేత్రుని; పరమ+ఈశున్= గొప్పరక్షకుని; మహాత్మున్= గొప్పమనస్సుగలవాడిని; ప్రధానపూరుషున్= పురుషోత్తముని; దేవశరణ్యున్= దేవతలకు శరణు ఒసగేవాడిని; సజ్జన విధేయున్= సత్పురుషులకు లోగేవాడిని; అనంతున్= తుదలేనివాడిని; పురాణయోగి= ప్రాచీనులైన ముని పుంగవులచేత; సంసేవితపాదపద్మున్= యోగులచేత కొలువబడే చరణకమలాలుగలవాణ్ణి; తమ చిత్తములన్= తమ మనస్సులలో; నరుఁడు+అంచున్= మానవుడు అని; ఇచ్ఛావిధిన్= ఇచ్ఛాపూర్వకంగా; సత్+మతిలేక= మంచి బుద్ధిలేక; చూచుచుండుదురు= చూస్తూ ఉంటారు.

**తా :** రాజా! ఈ హరి ఈశ్వరుల కీశ్వరుడు, పురుషోత్తముడు, సురలకు శరణమైనవాడు, అయినా సజ్జన విధేయుడు, ప్రాక్తన యోగిపుంగవులచే సేవలందుకొనే చరణకమలాలు గలవాడు; కాని సామాన్యజనులు వివేకశూన్యులై ఈ మహాత్ముడిని మానవమాత్రునిగా భావిస్తున్నారు.

**వ. వినుము షడింద్రియంబులలోన నొకటియందుఁ దత్పరులై యిచ్ఛాపూరణ విధానంబులఁ జరితార్థులమైతి మను వారలు ధారణాభ్యాస సమాధియోగంబుల సాధింపలేరు, కృషి ప్రముఖంబులు సంసార సాధనంబులు గాని మోక్షసాధనంబులు గావు, కుటుంబ సంగంబునఁ జిత్తవిక్షేపం బగుఁ, జిత్త విజయ ప్రయత్నంబున సన్న్యసించి సంగంబు వర్జించి మితంబయిన భిక్షాన్నంబు భక్షించుచు శుద్ధ వివిక్త సమప్రదేశంబున నొక్కచో నాసీనుండై సుస్థిరత్వంబునఁ బ్రణవోచ్చారణంబు సేయుచు రేచక పూరక కుంభకంబులఁ బ్రాణాపానంబుల నిరోధించి కామహతంబయిన చిత్తంబునఁ బరిభ్రమణంబు మాని కామ విసర్జనంబుసేసి మరలు నంతకు నిజనాసాగ్ర నిరీక్షణంబు సేయుచు నివ్విధంబున యోగాభ్యాసంబు సేయువాని చిత్తంబు కాష్ఠరహితంబైన వహ్ని తెఱంగున శాంతిఁ జెందుఁ, గామాదులచేత వేధింపంబడక ప్రశాంత సమస్త వృత్తం బయిన చిత్తంబు బ్రహ్మసుఖ సమ్మర్శనంబున లీనంబై మఱియు నెగయ నేరదు. 460**

**ప్రతి :** వినుము= శ్రద్ధగా విను; షట్+ఇంద్రియములలోనన్= ఆరు ఇంద్రియాలలోన; ఒకటియందున్= ఒక్కదానిలో; తత్పరులై= ఆసక్తులై; ఇచ్ఛా పూరణవిధానంబులన్= కోర్కెలు తీర్చుకొనే పద్ధతులతో; చరిత+అర్థులమైతిమి+అనువారలు= కృతకృత్యులమైనాము అనేవారు; ధారణా+అభ్యాస సమాధి యోగంబులన్= ధారణతో, అభ్యాసంతో, చిత్తంయొక్క ఏకాగ్రతతో, యోగంతో; సాధింపలేరు= జయం పొందలేరు; కృషి ప్రముఖంబులు= దున్నుట మొదలయినవి; సంసార సాధనంబులుగాని మోక్షసాధనంబులుకావు= సంసారాన్ని ఈదుటానికి ఉపకరణాలుగాని, మోక్షమును సాధించిపెట్టునవి కావు; కుటుంబ సంగంబునన్= సంసారపుపొత్తువలన; చిత్తవిక్షేపంబగున్= మనస్సు చెదిరిపోతుంది; చిత్తవిజయ ప్రయత్నంబునన్= మనస్సును జయించేయత్నంలో; సన్న్యసించి= సర్వం త్యజించి; సంగంబు వర్జించి= పొత్తు విడిచి; మితంబయిన భిక్షాన్నంబు= మితంగా బిచ్చపుతిండి; భక్షించుచున్= తింటూ; శుద్ధ వివిక్త సమప్రదేశంబునన్= శుభ్రమైన ఏకాంతమైన చదునైన, మిట్టపల్లాలులేని సమానస్థలంలో; ఒక్కచోన్= ఒకచోట; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; సుస్థిరత్వంబునన్= గట్టి కదలికలేమితో; ప్రణవ+ఉచ్చారణము+చేయుచున్= ఓంకారాన్ని ఉచ్చరిస్తూ; రేచక పూరక కుంభకంబులన్= ఊపిరిని వదలుట, పీల్చుట, నిలిపి ఉంచుట అనే ఈమూడు క్రియలతో; ప్రాణ+అపానంబులన్= ప్రాణ–అపాన–వాయువులను; నిరోధించి= అడ్డుకొని; కామహతంబయిన చిత్తంబునన్= కోర్కెకు లొంగిన మనస్సుతో; పరిభ్రమణంబు= చుట్టూ తిరగటం;

మాని= వదలి; కామవిసర్జనంబు+చేసి= కోర్కెను విడిచిపుచ్చి; మరలునంతకున్= వెను దిరుగువరకు; నిజనాసా+అగ్రనిరీక్షణంబు+చేయుచున్= తన ముక్కుచివరి భాగంలో చూపును నిల్పుతూ; ఇ+విధంబునన్= ఈ పద్ధతితో; యోగ+అభ్యాసంబు+చేయువానిచిత్తంబు= యోగాన్ని అభ్యసించేవాడి మనస్సు; కాష్ఠరహితంబు+ఐన= కట్టెలులేని; వహ్నితెఱంగునన్= నిప్పువలె; శాంతిన్+చెందున్= శాంతిని పొందుతుంది; కామ+ఆదులచేతన్= కామం మొదలైనవానిచేత; వేధింపఁబడక= బాధింపబడక; ప్రశాంతసమస్తవృత్తంబయిన= శాంతించిన అన్నిప్రవర్తనలుగల; చిత్తంబు= మనస్సు; బ్రహ్మసుఖసమ్మర్శనంబునన్= బ్రహ్మానంద అనుభవమనందు; లీనంబై= లయమై; మఱియున్= ఆపైన; నెగయన్+నేరదు= లేవలేదు, నిలబడలేదు.

**తా :** ఆరింద్రియాలలో ఒకదానిలో ఆసక్తులై, ఇచ్ఛాపూర్వక పద్ధతులతో యోగాభ్యాసులైనవారు సాధించేది శూన్యం. శ్రమించటం, కుటుంబపోషణకు తప్ప, మోక్షసాధనకు ఉపకరించదు. సాంసారపుపొత్తు చిత్తభ్రంశాన్ని గలిగిస్తుంది. కాబట్టి మనోవిజయప్రయత్నంతో తొట్టతొలుత సన్న్యసించాలి. బిచ్చపు మెతుకులతో శరీరధారణ చేస్తూ ఏకాంత ప్రదేశంలో ఆసీనుడై ఓంకారనాదం చేస్తూ; ప్రాణ-అపానవాయువులను, రేచక పూరక కుంభకమైన యోగమార్గంలో నిరోధించి, మనఃపరిభ్రమణాన్ని మాని, నాసాగ్రాన దృష్టినిలిపి ఉంచితే, కట్టెలు లేని నిప్పువలె తుదకు చిత్తం శమిస్తుంది. ఆ ప్రశాంత నిర్మలచిత్తం, బ్రహ్మానందసుఖ సమాశ్లిష్టమై ఇక మరలిరాదు.

**మ. ధరణీదేవుఁడు సన్న్యసించి యతియై ధర్మార్థకామంబులం**
**బరివర్జించి పునర్విలంబమునఁదత్ప్రారంభి యౌనేని లో**
**భ రతింగ్రక్కిన కూడు మంచి దనుచున్ భక్షించి జీవించు దు**
**ర్నరుచందంబున హాస్యజీవనుఁడగున్ నానాప్రకారంబులన్. 461**

**ప్రతి :** ధరణీదేవుఁడు= విప్రుడు; సన్న్యసించి= సన్యాసం స్వీకరించి; యతియై= సర్వం విడిచి, యోగి అయి, ధర్మ+అర్థకామంబులన్+పరివర్జించి= ఆ మూడు పురుషార్థాలను విడిచిపెట్టి; పునర్విలంబమునన్= మరికొంతకాలానికి; తద్+ప్రారంభి+ఔన్+ఏనిన్= వాటిని మొదలుపెట్టినవాడు అయితే, లోభరతిన్= పేరాసతో; క్రక్కినకూడు మంచిది+అనుచున్= కక్కిన కూడు; మంచిదని; భక్షించి= తిని; జీవించు= బ్రతికే; దుర్నరు చందంబునన్= హీననరుని విధంగా; నానాప్రకారంబులన్= అనేకవిధాల; హాస్యజీవనుఁడు+అగున్= నవ్వులపాలైన బ్రతుకు గలవాడవుతాడు.

**తా :** విప్రుడు సన్న్యసించి, పురుషార్థత్రయాన్ని విడిచిపుచ్చి, కొంతకాలం తరువాత, మరల పూర్వజీవనంలో ప్రవేశిస్తే, అపుడు, లోభాసక్తితో కక్కిన కూడు నాశించి తిరిగి తిన్నట్లుగా వాడు, హీనుడై పలువిధాల అపహాస్యానికి గురై జీవిస్తాడు.

**క. మలమునఁగ్రిమియును బడు క్రియ, నిలఁబడు నొడ, లాత్మ గాదు హేయం బనుచుం**
**దలఁతురు తద్జ్ఞులు, పొగడుదు, రలసత నొడ లాత్మ యనుచు నజ్ఞు లిలేశా? 462**

**ప్రతి :** ఇలా+ఈశ!= ధర్మరాజా! తద్జ్ఞులు= తత్త్వజ్ఞానులు; మలమునన్= పురీషమునందు; క్రిమియును+పడుక్రియన్= సూక్ష్మ క్రిమికీటకం పడినవిధంగా; నిలఁబడు ఒడలున్= నిలబడే దేహం; ఆత్మకాదు= ఆత్మకాదు; హేయంబు+అనుచున్= అసహ్యం అని; తలఁతురు= భావిస్తారు; అజ్ఞులు= జ్ఞానశూన్యులు; అలసతన్= సోమరితనంతో; ఒడలు= శరీరం; ఆత్మ+అనుచున్= ఆత్మ అని; పొగడుదురు= కొనియాడుతారు.

**తా :** ధర్మరాజా! మలంలోపడి క్రిమి ఉన్నట్లుగా ఉండే దేహం అది ఆత్మకాదు అది హేయమని ఆత్మజ్ఞులు తలుస్తారు. అజ్ఞులు దేహాన్నే ఆత్మగా తలచి దానిని ప్రశంసిస్తారు.

**ఆ. వ్రతము మానఁదగదు వడుగుఁగుఱ్ఱనికిని, గ్రియలు మానఁ దగదు గృహగతునికిఁ,**
**దపసి కూర నుండఁదగదు, సన్న్యాసికిఁ, దరుణితోడి పొత్తు దగదు తగదు, 463**

**ప్రతి :** వడుగున్+కుఱ్ఱనికిన్= బ్రహ్మచారి బాలునికి; వ్రతము మానన్+తగదు= నియమిత జీవనం మానుట కూడదు; గృహగతునికిన్= గృహస్థునికి; క్రియలు మానన్+తగదు= పనులు మానుట కూడదు; తపసికిన్= తపస్వికి; ఊరన్+ఉండన్+తగదు= ఊరిలో నివాసం కూడదు; సన్న్యాసికిన్= యతికి; తరుణితోడి పొత్తు= యువతితో కలయిక; తగదు తగదు= కూడనే కూడదు.

**తా :** బ్రహ్మచారి తన వ్రతాన్ని మానరాదు. సంసారి తన నిత్యనైమిత్తిక క్రియలను మానరాదు. ఇక తపశ్చర్యలలో ఉన్నవానికి ఊరిలో నివాసం, సన్యసించినవారికి యువతితో పొత్తు తగదుగాక తగదు.

**సీ. రథము మే నెల్ల, సారథి బుద్ధి, యింద్రియ గణము గుఱ్ఱములు, పగ్గములు మనము,**
**ప్రాణాది దశవిధ పవనంబు లిరుసు, ధర్మాధర్మగతులు రథాంగకములు**
**బహుళతరంబైన బంధంబు చిత్తంబు, శబ్దాదికములు సంచారభూము,**
**లభిమాన సంయుతుండయిన జీవుఁడు రథి, ఘనతరప్రణవంబు కార్ముకంబు,**

**తే. శుద్ధజీవుండు బాణంబు, శుభదమైన, బ్రహ్మమంచితలక్ష్యంబు, పరులు రాగ**
**భయ మద ద్వేష శోక లోభ ప్రమోహ, మాన మత్సర ముఖములు మానవేంద్ర! 464**

**ప్రతి :** మానవ+ఇంద్ర!= రాజా!; మేను+ఎల్లన్= దేహమంతా; రథము= రథం; బుద్ధి= తెలివి; సారథి= రథచోదకుడు; ఇంద్రియగణము= ఇంద్రియాల సమూహం; గుఱ్ఱములు= రథవాహనాలు; మనము= మనస్సు; పగ్గములు= పగ్గాలు; ప్రాణ+ఆది దశవిధపవనంబులు= ప్రాణం మొదలయిన పదిగాలులు; ఇరుసు= చక్రాలను కలిపే అడ్డకమ్మి; ధర్మ+అధర్మగతులు= ధర్మాధర్మరీతులు; రథ+అంగకములు= చక్రాలు; చిత్తంబు= ప్రజ్ఞ; బహుళ తరంబైన= నానావిధమైన; బంధంబు= నిర్మాణపుకట్టు; శబ్ద+ఆదికములు= శబ్దం మొదలయినవి; సంచారభూములు= సంచరించే ప్రదేశాలు; అభిమానసంయుతుండు+అయినజీవుఁడు= అభిమానంతో కూడిన, జీవుడు; రథి= రథికుడు; ఘనతరప్రణవంబు= మిక్కిలి గొప్పదయిన ఓంకారం; కార్ముకంబు= ధనుస్సు; శుద్ధజీవుడు= కేవలజీవుడు; బాణంబు= అమ్ము; శుభదము+ఐన బ్రహ్మం= శుభంకరమైన పరబ్రహ్మం; అంచితలక్ష్యంబు= గురికి కేంద్రం; రాగ= ప్రేమ; భయ= భీతి; మద= పొగరు; ద్వేష= పగ; శోక= దుఃఖం; లోభ= పేరాస; ప్రమోహ= మోహం; మాన= అభిమానం; మత్సర= పరుల ఉత్కర్షను సహింపకుండుట; ముఖములు= మొదలయినవి; పరులు= శత్రువులు.

**తా :** రాజా! ముక్తిరూప పరబ్రహ్మలక్ష్యాన్ని ఛేదించాలి–అంటే నరుడు ఇట్లా సంసిద్ధుడు కావాలి: దేహం రథం; ఇంద్రియాలు గుఱ్ఱాలు; మనస్సుపగ్గాలు; ప్రాణం ఇరుసు; ధర్మ–అధర్మాలు చక్రాలు; వీటిని ఒకటిగా బంధించేది ప్రజ్ఞ; బుద్ధి సారథి; ఇక జీవుడు రథంమీద ఉన్నవాడు; ఓంకారం ధనుస్సు; కేవల జీవుడు బాణం; వరసగా ప్రేమ, భయం, పొగరు, పగ, శోకం, ఆశ, మోహమత్సరాలు మొదలయినవి జయించవలసిన శత్రువులు.

**విశే : 1. ఆత్మానం రథినం విద్ధి – శరీరం రథమేవచ ।**
**బుద్ధింతు సారథిం విద్ధి – మనః ప్రగ్రహమేవ చ ॥**
**ఇంద్రియాణి హయాన్యాహుః – విషయాం స్తేషు గోచరాన్ ।**
**ఆత్మేంద్రియ మనోయుక్తం – భోక్తే త్యాహుర్మనీషిణః ॥** – కఠోపనిషత్ (3–57,58)

**2. ప్రణవోధనుః శరోహ్యాత్మా – బ్రహ్మతల్లక్ష్యముచ్యతే ।**
**అప్రమత్తేన వేద్ధవ్యం – శరవత్తన్మయో భవేత్ ॥** – ముండకోపనిషత్

**వ. ఇట్లు మనుష్య శరీర రూపంబయిన రథంబు దన వశంబు సేసికొని మహాభాగవత చరణకమల సేవానిశితంబయిన విజ్ఞాన ఖడ్గంబు ధరియించి శ్రీమన్నారాయణ కరుణావలోక బలంబున రాగాదిశత్రు నిర్మూలనంబు గావించి ప్రణవబాణాసనంబున శుద్ధజీవశరంబును సంధించి బ్రహ్మమనియెడు గుఱియందుఁ బడవేసి యహంకార రథికుండు రథికత్వంబు మాని నిజానందంబున నుండవలయు, నట్టి విశేషంబు సంభవింపని సమయంబున బహిర్ముఖంబు లయిన యింద్రియ ఘోటకంబులు బుద్ధి సారథి సహితంబులై స్వాభిమాన రథికుని ప్రమత్తత్వంబు దెలిసి ప్రవృత్తిమార్గంబు నొందించి విషయశత్రు మధ్యంబునంగూల్చిన.**
**465**

**ప్రతి :** ఇట్లు; మనుష్యశరీరరూపంబు+అయిన రథంబు= మానవుని దేహరూపమైన రథం; తనవశంబు+చేసికొని= తన అధీనం చేసుకొని; మహాభాగవత= మహాభక్తుల; చరణకమల= పాదపద్మాల; సేవానిశితంబు+అయిన; సేవచే పదునెక్కిన; విజ్ఞానఖడ్గంబు= జ్ఞానమనే కత్తిని; ధరియించి= చేతబట్టి; శ్రీమత్+నారాయణ కరుణా+అవలోకబలంబునన్= లక్ష్మీసమేతుడైన విష్ణువు (యొక్క) దయగల చూపుల బలంతో; రాగ+ఆదిశత్రునిర్మూలనంబు= ప్రేమమొదలయిన విరోధులను నాశనం; కావించి= చేసి; ప్రణవబాణ+ఆసనంబునన్= ఓంకారమనే ధనుస్సునందు; శుద్ధజీవశరంబును= కేవల జీవుడనే బాణాన్ని; సంధించి= ఎక్కుపెట్టి; బ్రహ్మమనియెడు గుఱియందున్= పరబ్రహ్మమనే లక్ష్యంపై; పడన్+వేసి= పడునట్లు చేసి; అహంకారరథికుండు= అహంకారమనే రథికుడు, రథమెక్కి యుద్ధం చేసేవాడు; రథికత్వంబుమాని= రథమెక్కిచేసే యుద్ధం వదలి; నిజ+ఆనందంబునన్+ఉండన్+వలయున్= సహజానందంతో ఉండాలి; అట్టివిశేషంబు= ఆ ఆనందం; సంభవింపని సమయంబునన్= కలుగని సందర్భంలో; బహిర్ముఖంబులయిన= బాహ్యదృష్టి కలిగిన; ఇంద్రియఘోటకంబులు= ఇంద్రియాలు అనే గుర్రాలు; బుద్ధిసారథి సహితంబులై= బుద్ధి అనే సారథితో కూడినవై; స్వాభిమానరథికుని= స్వాభిమానమనే రథియొక్క; ప్రమత్తత్వంబు తెలిసి= అజాగరూకతను గ్రహించి; ప్రవృత్తిమార్గంబును+ ఒందించి= ప్రవృత్తి అనే త్రోవను పొందించి, తిరిగి బయలుదేరిన చోటికే, చేర్చి; విషయశత్రుమధ్యంబునన్+కూల్చినన్= వస్తురూప శత్రువుల త్రోవలో కూల్చివేసితే...

**తా :** ఈ విధంగా జీవరూప రథికుడు శరీరరథాన్ని స్వాధీనంచేసికొని, భగవద్భక్తుల సేవానిర్వహణం వలన పదునైన జ్ఞానరూపఖడ్గం ధరించి, విష్ణుదయాబలంతో రాగద్వేషాది శత్రుసంహారం చేసి, ఓంకారరూప ధనుస్సుతో, కేవలజీవబాణాన్ని సంధించి, పరబ్రహ్మమనే లక్ష్యంపై వదలాలి. వదలి ఇక, నిష్క్రియుడై మిగిలి, స్వానందమయుడుగా నిలవాలి. అయితే, అది సంభవింపనిపక్షాన ఇంద్రియరూప అశ్వాలు, బుద్ధిసారథితోకూడి, అతని పరాకుమూలంగా తిరిగి మరలి వచ్చి, ప్రవృత్తి మార్గాన విషయరూప శత్రువుల నడుమ రథాన్ని పడవేస్తే;

**ఆ. విషయశత్రులెల్ల విక్రాంతితోడ సా, రథిసమేతుఁడయిన రథికుఁబట్టి**
**యుగ్రతిమిరమృత్యుయుతమగు సంసార, కూపమధ్యమందుఁగూల్తు రధిప! 466**

**ప్రతి :** అధిప!= రాజా! విషయ శత్రులు+ఎల్లన్= విషయరూపానగల శత్రువులందరూ; విక్రాంతితోడన్= పరాక్రమంతో; సారథిసమేతుఁడు+అయిన= సారథితో కూడినవాడైన; రథికున్+పట్టి= రథిని పట్టుకొని; ఉగ్రతిమిర మృత్యుయుతము+అగు= భయంకరమైన చీకటి మరణంతోకూడిన; సంసారకూప మధ్యమందున్= కుటుంబమనే బావినడుమ; కూల్తురు= పడవేస్తారు.

**తా :** అక్కడి విషయాల రూపంలో నిరీక్షిస్తున్న శత్రువులందురు (ప్రేమ–పగ; ఈర్ష్య–అసూయ–వంటివి) పరాక్రమంతో, సారథితోసహ, రథికుని పట్టుకొని, ఘోరమైన చీకటి, మరణంతో కలిసి ఉండె సంసారపుబావిలో పడదోస్తారు.

**వ. వినుము వైదికకర్మంబు ప్రవృత్తంబును, నివృత్తంబును నన రెండు దెఱంగులయ్యె, నందుఁ బ్రవృత్తంబునఁ బునరావర్తనంబును, నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ, బ్రవృత్తకర్మంబులోన నిష్టాపూర్తంబులన రెండు మార్గంబులు గల, వందు హింసా ద్రవ్యమయ కామ్యరూపంబులయిన దర్శ పూర్ణమాసపశు సుత వైశ్వదేవ బలిహరణ ప్రముఖంబులైన యాగాదికంబు లిష్టంబులు, దేవతాలయ వన కూప తటాక ప్రముఖంబులు పూర్తంబులు, ప్రవృత్తకర్మంబున దేహంబు విడిచి దేహాంతరారంభంబున దేహి హృదయాగ్రంబున వెలుంగు, వానితోడ నింద్రియంబులుంగూడ భూతసూక్ష్మయుక్తుండై ధూమ దక్షిణాయన కృష్ణపక్ష రాత్రి దర్శంబుల వలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుండై వృష్టి ద్వారంబునఁ గ్రమంబున నోషధి లతాన్న శుక్ల రూపంబులం బ్రాపించి భూమియందు జన్మించు, నిది పునర్భవ రూపంబయిన పితృమార్గంబు, నివృత్త కర్మనిష్ఠుం డయిన వాఁడు జ్ఞానదీప్తంబు లయిన యింద్రియంబులందుఁ గ్రియాయజ్ఞంబుల యజించి ఇంద్రియంబుల దర్శనాది సంకల్ప మూలంబయిన మనంబునందు వికారయుక్తంబయిన మనంబును, వాక్కునందు విద్యావిలక్షణమైన వాక్కును, వర్ణసముదాయంబు నందు వర్ణసముదాయంబును, నకారాది స్వరత్రయాత్మకం బయిన యోంకారంబునందు నోంకారంబును, బిందువందు బిందువును. నాదంబునందు నాదంబును, బ్రాణంబునందు ప్రాణంబును బ్రహ్మమందు నిలుపవలయును, దేవమార్గంబయిన యుత్తరాయణ శుక్ల పక్ష దివా ప్రాహ్ణ పూర్ణిమా రాకల వలన సూర్య ద్వారంబున బ్రహ్మలోకంబునందుఁ జేరి భోగావసానంబున స్థూలోపాధియైన విశ్వుండై సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధియైన తైజసుండై సూక్ష్మంబును గారణంబునందు లయించి, తుర్యుండై సూక్ష్మలయంబునందు శుద్ధాత్ముండై యివ్విధంబున ముక్తుం డగును. 467**

**ప్రతి :** వినుము= ఆలకించు; వైదికకర్మంబు= వేదంలో చెప్పినకర్మ; ప్రవృత్తంబు; నివృత్తంబునన= ప్రవృత్తి; నివృత్తి అనే; రెండుతెఱంగులు+అయ్యెన్= రెండు విధాలయింది; అందున్= ఆ రెండింటిలో; ప్రవృత్తంబునన్= ప్రవృత్తిమార్గంలో; పునర్+ఆవర్తనంబును= తిరిగి మరల వచ్చుట; నివృత్తంబునన్= నివృత్తిమార్గంలో; మోక్షంబును= ముక్తి; సిద్ధించున్= లభిస్తాయి; ప్రవృత్తకర్మంబులలోనన్= ప్రవృత్తి మార్గంలోని కర్మలలో; ఇష్టా+పూర్తంబులన; రెండుమార్గంబులు గలవు= రెండు త్రోవలు ఉన్నవి; అందు హింసా ద్రవ్యమయ; కామ్యరూపంబులు+అయిన= హింసామయమైన, ద్రవ్యమయమైన,

కామ్యరూపమైన (అశ్వమేధం మొదలయిన రూపాలుగల); దర్శ= అమావాస్యనాడు చేయదగు యజ్ఞం; పూర్ణమాస= పూర్ణిమనాడు చేసే యజ్ఞం; పశు= పశువుతో (మేక ఆవు వంటి వానితో) చేసే యజ్ఞం; సుత= సోమయాగం; వైశ్వదేవ= విశ్వేదేవతలకోసం చేసే యజ్ఞం; బలిహరణ= బలి ఇస్తూ చేసే యజ్ఞం; ప్రముఖంబులు+ఐన= మొదలయిన వయిన; యాగ+ఆదికంబులు= యజ్ఞాలు మొదలయినవి; ఇష్టంబులు= ఆపేర ప్రసిద్ధాలు; దేవతా+ఆలయ, వన, కూప, తటాక ప్రముఖంబులు= దేవాలయం, ఉద్యానవనం, బావి, చెరువు మొదలయినవి, పూర్తంబులు= ఆ పేర ప్రసిద్ధాలు; ప్రవృత్తకర్మంబునన్= ప్రవృత్తికర్మలందు; దేహి= ప్రాణి; దేహంబు విడిచి= శరీరం వదలి; దేహ+అంతర+ఆరంభంబునన్= మరొక శరీరాన్ని దాల్చుటకు (దాల్చు) మొదట; హృదయ+అగ్రంబునన్= మనస్సు తుదిలో; వెలుంగున్= జ్వలించును, మండును; వానితోడన్= ఆ ప్రాణితోపాటు; ఇంద్రియంబులున్+కూడన్= ఇంద్రియాలూ కలువగా; భూత సూక్ష్మయుక్తుండు+ఐ= సూక్ష్మభూత విపాకాలతో కూడినవాడై; ధూమ= ధూమమార్గమైన; దక్షిణ+అయన= దక్షిణాయనమందలి; కృష్ణపక్షరాత్రి= బహుళపక్షపురాత్రివలన; దర్శంబులవలనన్= అమావాస్యనాటి యాగాలవలన; సోమలోకంబున్+చేరి= చంద్రలోకాన్ని చేరి; భోగ+అవసానంబునన్= భోగం అనగా సుఖానుభవం ముగిసినపుడు; విలీనదేహుండై= లీనమైన శరీరం గలవాడై; వృష్టిద్వారంబునన్= వాన ద్వారా; క్రమంబునన్= వరుసగా; ఓషధి= మూలిక; లతా= తీగ; అన్న= అన్నం; శుక్ల= వీర్యం; రూపంబులన్= ఆకారాలను; ప్రాపించి= పొంది; భూమియందున్= భూమిమీద; జన్మించున్= పుట్టును; ఇది= ఈ వర్ణించిన విధం; పునర్భవ రూపంబు+అయిన= మరొక జన్మరూపమైన; పితృమార్గంబు= పితరుల మార్గం; ఇక, నివృత్తకర్మనిష్ఠుండు+అయినవాఁడు= నివృత్తకర్మయందు (ద్వితీయ మార్గం) నిలిచినవాడు; జ్ఞానదీప్తంబులు+అయిన= జ్ఞానంతో జ్వలించే; ఇంద్రియంబులందున్= ఇంద్రియాలలో; క్రియాయజ్ఞంబులన్= యజ్ఞాది క్రియలు; యజించి= హోమంచేసి; ఇంద్రియంబులన్= ఇంద్రియాలను; దర్శన+ఆది= చూపు మొదలయిన; సంకల్పమూలంబు+అయిన= సంకల్పాలకు హేతువైన; మనంబునందున్= మనస్సులో; వికారయుక్తంబు+అయిన= వికృతులతో గూడిన; మనంబును= మనస్సును; వాక్కునందున్= మాటలో; విద్యావిలక్షణమైనవాక్కును= చదువువలన విలక్షణమైన మాటను; వర్ణసముదాయంబునందు= అక్షరాల సమూహంతో; వర్ణసముదాయంబునున్= వర్ణమాలను; అకార+ఆది స్వరత్రయ+ఆత్మకంబయిన= అకార, ఉకార, మకారాలతో కూడిన; ఓంకారంబునందున్+ఓంకారంబును= ఓంకారంలో, ఓంకారాన్ని; బిందు వందున్= అనుస్వారంనందు; బిందువును= అనుస్వారాన్ని; నాదంబునందున్= శబ్దంలో, నాదాన్ని; ప్రాణంబునందున్= ప్రాణంలో; ప్రాణంబును= ప్రాణాన్ని; బ్రహ్మమందున్= పరబ్రహ్మలో; నిలుపవలయును= ఉంచాలి; దేవమార్గంబు+అయిన= దేవతల త్రోవయైన; ఉత్తరాయణ శుక్ల పక్ష దివా ప్రాహ్ణ పూర్ణిమారాకలవలనన్= ఉత్తరాయణమందు, శుక్లపక్షంలో, పగలు, ఉదయము, పదహారుకళలతోడి పూర్ణిమలవలన (ఆ దినాలలో); సూర్యద్వారంబునన్= సూర్యునిద్వారా; బ్రహ్మలోకంబునందున్+చేరి= బ్రహ్మలోకానికి చేరుకొని; భోగ+అవసానంబునన్= ఫలాలు అనుభవించిన పిదప; స్థూల+ఉపాధియైన= స్థూలమైన దేహంగల; విశ్వుండై= విశ్వుడై; సూక్ష్మంబునందును= సూక్ష్మోపాధికుడైన తైజసునిలో; లయించి= లయంచేసి; సూక్ష్మోపాధియైన= సూక్ష్మశరీరం ఉపాధిగాకల; తైజసుండై= తైజసుడై; సూక్ష్మంబును= సూక్ష్మశరీరం ఉపాధిగాకల తైజసుని; కారణంబునందున్= కారణశరీరం ఉపాధిగాకల ప్రాజ్ఞునిలో; లయించి= లయంచేసి; తుర్యుండై= బ్రహ్మమై; సూక్ష్మలయంబునందున్= సూక్ష్మమైనలయంలో; శుద్ధ+ఆత్ముండై= పరిశుభ్రమైన ఆత్మగలవాడై; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ముక్తుండు+అగున్= మోక్షాన్ని పొందుతాడు.

**తా :** వైదికకర్మ రెండు విధాలు–ప్రవృత్తము; నివృత్తము; అని. ప్రవృత్త మార్గాన నడచినవారికి; పునరావర్తనము (మరలి వచ్చుట) సిద్ధిస్తుంది. నివృత్తి మార్గంలో నడచినవారికి మోక్షం సిద్ధిస్తుంది. ప్రవృత్త కర్మలలో ఇష్టం, పూర్తం – అనే రెండు

త్రోవలు ఉన్నాయి. అమావాస్యనాటి యజ్ఞం, పూర్ణిమనాటి యజ్ఞం, పశువుతో, సోమరసాదులతో, చేసే యజ్ఞాలు మొదలయినవి ఇష్టములు. దేవాలయం, ఉద్యానవనం, బావి, చెరువు మొదలయినవాటి నిర్మాణాలు పూర్తములు. ప్రవృత్తి కర్మంవలన, దేహి, దేహం వదలి, దేహాంతర స్వీకార ప్రారంభసమయాన, మనస్సు అగ్రభాగాన జ్వలిస్తాడు. అనంతరం చంద్రలోకంజేరి, భోగాల అనుభవానంతరం దేహం లీనమై పోగా, వానద్వారా క్రమంగా, ఓషధిగా, లతగా, అన్నంగా శుక్లంగా మారి మరల భూమిమీద ఆవిర్భవిస్తాడు. ఇది పునర్భవరూపమైన పితరుల మార్గం. ఇక నివృత్తి మార్గగామి, నివృత్త కర్మలలో నిష్ఠతో నిలిచి తన ఇంద్రియాలను జ్ఞానంతో ప్రజ్వలింపజేసి ఆ జ్వలనంలో క్రియారూపయాగాలన్నిటిని భస్మంచేసి ఇంద్రియాల సంకల్పశక్తికి మూలమైన మనస్సులో వికృతులతోడి మనస్సును వాక్కులో, చదువువలన లక్షణం మారినవాక్కును; అక్షరసమామ్నాయంలో అక్షరసమామ్నాయాన్ని, స్వరత్రయాత్మకమైన ఓంకారంలో ఓంకారాన్ని, బిందువులో బిందువును, నాదంలో నాదంను, ప్రాణంలో ప్రాణాన్ని బ్రహ్మమందు నిలపాలి. అపుడు అతడు దేవమార్గంలో, ఉత్తరాయణకాలాన, శుక్లపక్షాన, పగలు ఉదయాన, రాత్రి పదహారుకళలుగల పూర్ణిమనాడు, సూర్యునిద్వారా బ్రహ్మలోకం చేరి; భోగం ముగిసిన తరువాత; స్థూలోపాధికుడైన విశ్వుని తేజస్సులో తేజస్సుని కారణోపాధికుడైన ప్రాజ్ఞునిలో, ప్రాజ్ఞుని బ్రహ్మంలో లీనంచేసి ముక్తుడు అవుతాడు.

**ఆ. అమరనిర్మితంబులై యొప్పు పితృదేవ, సరణు లెవ్వఁ డెఱుఁగు శాస్త్రదృష్టి**
**నట్టివాఁడు దేహియై మోహమున నొందఁ, డతిశయించు బుద్ధి నవనినాథ! 468**

**ప్రతి :** అవనినాథ= రాజా!; ఎవ్వఁడు= ఎవరైతే; అమరనిర్మితంబులు+ఐ= దేవతలచేత చేయబడినవై; ఒప్పు= ప్రకాశించే; పితృదేవ సరణులు= పితరుల దేవతల మార్గాలు; ఎఱుఁగున్= తెలిసికొంటాడో; అట్టివాఁడు శాస్త్రదృష్టిన్= అలాంటివాడు శాస్త్రపు చూపుతో; (అసాధారణమైనదానితో) దేహియై= శరీరధారియై; మోహమునన్= చిత్తవైకల్యాన్ని; ఒందఁడు= పొందడు; బుద్ధిన్= బుద్ధితో; అతిశయించున్= అధికుడవుతాడు.

**తా :** రాజా! పైన తెల్పినవి, దేవతలు నిర్మించిన, పితరుల, దేవతల మార్గాలు. ఆ మార్గాలను గ్రహించినవాడు, శాస్త్రదృష్టి కలుగుటవలన, దేహధారియైనా మోహాన్ని పొందడు. లోకంలో స్వబుద్ధితో ప్రకాశిస్తాడు.

**వ. వినుము దేహాదులకుఁ గారణత్వంబున నాదియందును నవధికత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంతరంగంబును భోక్తయుఁ బరంబును నపరంబును జ్ఞానంబును జ్ఞేయంబును వచనంబును వాచ్యమును నప్రకాశంబును ప్రకాశంబును నైన వస్తువునకు వేఱొండు లేదు, ప్రతిబింబాదికంబు వస్తుతత్త్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడు భంగి నైంద్రియకం బైన సర్వంబును నర్థత్వంబున వికల్పితంబయి తోఁచుంగాని పరమార్థంబు గాదు. దేహాదికంబులు మిథ్యాత్మకంబులు, వానికి హేతువులయిన క్షితి ప్రముఖంబులును మిథ్యాత్మకంబు లగుట సిద్ధంబు, పరమాత్మకు నవిద్యచేత నెంతదడవు వికల్పంబు దోఁచు నంత దడవును భ్రమంబునుం దోఁచు, నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్యయయి శాస్త్రవిధి నిషేధంబులు గల లోపల మేలుగన్న తెఱం గగు, భావాద్వైత క్రియాద్వైత ద్రవ్యాద్వైతంబులు మూఁడు గల, వందుఁ బటతంతు న్యాయంబునఁ గార్య కారణంబులందు వస్తు వొక్కటియై యుండు నని యెఱింగి, యేకత్వాలోచనంబు సేసి వికల్పంబు లేదని భావించుట భావాద్వైతంబు, మనోవాక్కాయ కృతంబులైన**

**సర్వకర్మంబులను ఫలభేదంబు సేయక పరబ్రహ్మార్పణంబు సేయుట క్రియాద్వైతంబు, పుత్త్రమిత్రకళత్రాది సర్వప్రాణులకుం దనకును దేహంబునకుం బంచభూతాత్మకత్వంబున భోక్త యొక్కరుండను పరమార్థత్వంబున నర్థకామంబుల యెడ నైక్యదృష్టిం జేయుట ద్రవ్యాద్వైతంబు, నేర్పున నాత్మతత్త్వానుభవంబున నద్వైతత్రయంబును విలోకించి వస్తుభేదబుద్ధియుఁ గర్మభేదబుద్ధియు స్వకీయపరకీయబుద్ధియు స్వప్నంబులుగాఁ దలంచి ముని యైనవాఁడు మానవలయు. 469**

**ప్రతి :** వినుము= విను; దేహ+ఆదులకున్= దేహం మొదలయిన వాటికి; కారణత్వంబునన్= కారణమవటంవలన; ఆదియందును= మొదట్లో; అవధికత్వంబునన్= హద్దు అగుటవలన; అంతమందును= చివరలో; కలుగుచున్= ఉంటూ; బహిరంగంబునన్= బయట; భోగ్యంబును= భోగార్హమైనది; అంతరంగంబునన్= లోపల; భోక్తయున్= ఫలాలను అనుభవించువాడు; పరంబునున్= పరమైనది; అపరంబును= అపరమైనది; జ్ఞానంబునన్= జ్ఞానాన్ని; జ్ఞేయంబును= తెలిసికొనదగినది; వచనంబునన్= శబ్దంలో; వాచ్యమును= చెప్పదగినది; అప్రకాశంబునన్= చీకటిలో; ప్రకాశంబునున్+ఐన= వెలుగు ఐన; వస్తువునకున్= పదార్థానికి; వేఱు+ఒండు లేదు= భిన్నంగా మరొకటిలేదు; ప్రతిబింబ+ఆదికంబు= ప్రతిఫలనం మొదలయినది; వస్తుతత్త్వంబునన్+చేసి= పదార్థ స్వభావంవలన; వికల్పితంబై= భ్రాంతిగలిగినదై; తలంపన్+పడుభంగిన్= ఆలోచింపబడునట్లుగా; ఐంద్రియకంబైన= ఇంద్రియాలకుచెందిన; సర్వంబును= అంతా; అర్థత్వంబునన్= విషయ పరమైనదిగా; వికల్పితంబయి= భ్రాంతిగలిగినదై; తోఁచున్+కాని= అనిపించునేగాని; పరమ+అర్థంబు+కాదు= వాస్తవమైనది గాదు; దేహ+ఆదికంబులు= శరీరం మొదలయినవి; మిథ్యా+ఆత్మకంబులు= లేమి, అసత్యం స్వభావంగా గలవి; వానికిన్+హేతువులు+అయిన= వాటికి కారణాలయిన; క్షితిప్రముఖంబులును= భూమిమొదలయినవీ; మిథ్యా+ఆత్మకంబులు+అగుట= సత్యంకానివి అవటం; సిద్ధంబు= నిరూపింపబడింది; పరమాత్మకున్= పరబ్రహ్మానికి; అవిద్యచేతన్= అజ్ఞానం చేత; ఎంత+తడవు= ఎంత సమయం; వికల్పంబు= భ్రాంతి; తోఁచున్= అనిపిస్తుందో; అంత+తడవును= అంతవరకు; భ్రమంబు= భ్రమకూడ; తోఁచున్= కనిపిస్తుంది; అవిద్యా నివృత్తి+ఐనన్= అజ్ఞానం తొలగితే; సర్వంబును= అంతా, (మొత్తమును); మిథ్య+అయి= లేనిదై; శాస్త్రవిధినిషేధంబులన్= శాస్త్రం (యొక్క) విధి నిషేధాలలో ఉన్న; కలలోపల= స్వప్నంలో; మేలుకన్నతెఱంగు+అగున్= మేల్కొన్నట్లు అవుతుంది; భావ+అద్వైత, క్రియా+అద్వైత, ద్రవ్య+అద్వైతంబులు= భావక్రియా ద్రవ్యరూపములైన మూడు అద్వైతములు, కలవు; అందున్= వాటిలో; పటతంతున్యాయంబునన్= తంతువుల (దారముల) రూపాంతరమే–మరియొకరూపమే (పటము) వస్త్రం= అను న్యాయంవలన; కార్యకారణంబులందున్= కార్యంనందు కారణంనందు; వస్తువు+ఒక్కటి+ఐ+ఉండున్= పదార్థం ఒకటే అయి ఉంటుంది; అని యెఱింగి= అని గ్రహించి; ఏకత్వ+ఆలోచనంబు+చేసి= ఒకటే అని తలచి; వికల్పంబు లేదు= భ్రాంతి లేదు; అనిభావించుట= అని తలచటం; భావ+అద్వైతంబు= భావాద్వైతమనబడుతుంది; మనస్+వాక్+కాయ కృతంబులు+ఐన= మనస్సుచే, మాటచే, శరీరంచేత చేయదగినవైన, సర్వకర్మంబులను= అన్ని పనుల్లోను; ఫలభేదంబు+చేయక= ఫలితపు భేదం పాటించక; పరబ్రహ్మ+అర్పణంబు+చేయుట= పరమాత్మకు ఇచ్చివేయటం, క్రియాద్వైతంబు= క్రియా ద్వైతం; పుత్రమిత్ర కళత్ర+ఆది సర్వప్రాణులకున్= కొడుకు, స్నేహితుడు, భార్య, మొదలయిన అన్ని జీవులకు, తనకు; దేహంబునకున్= శరీరత్వంతో; పంచభూతాత్మకత్వంబునన్= పంచభూతాలతో కూడిన; భోక్త= అనుభవించేవాడు; ఒక్కరుండు+అను= ఒక్కడే అనే; పరమ+అర్థత్వంబునన్= మహాజ్ఞానంతో; అర్థకామంబుల+ఎడన్= అర్థం, కామం అనే; ఐక్యదృష్టిన్+చేయుట=

ఒకటైన చూపును కలిగి ఉండటం; ద్రవ్యాద్వైతంబు= ద్రవ్యాద్వైతం; నేర్పునన్= నిపుణతతో; ఆత్మతత్త్వ+అనుభవంబునన్= ఆత్మతత్త్వపు అనుభూతితో; అద్వైతత్రయంబును= ఈ మూడు అద్వైతాలను; విలోకించి= చూచి; వస్తుభేదబుద్ధియున్= విషయాలలోని భేదపు అవగాహన; కర్మభేదబుద్ధియున్= కర్మల్లోని భేదపు అవగాహన; స్వకీయ పరకీయబుద్ధియున్= తనది ఇతరులది అనే బుద్ధి; స్వప్నంబులు+కాన్+తలంచి= తన కలలుగా భావించి; ముని+ ఐనవాఁడు= ఋషియైనవాడు; మానవలయును= వదలాలి.

**తా :** శరీరాది కార్యాలకు, కారణంగా మొదట, హద్దుగా చివర, ఉంటూ, బయటకు భోగ్యంగా, లోపలభోక్తగా, ఉత్తమం, అనుత్తమం, జ్ఞానం జ్ఞేయం, వచనం వాచ్యం, చీకటి వెలుగు అయిన పదార్థాలకు భిన్నంగా మరొకటి లేదు. ప్రతిబింబం వస్తుస్వభావానుసారంగా భ్రాంతిగలదిగా (అదే వస్తువుగా భ్రాంతి) అనిపిస్తుందిగాని సత్యంగాదు; శరీరం మొదలయిన కార్యాలు, మిథ్యాస్వరూపాలు; వాటికారణాలయిన నేలమొదలైనవి మిథ్య అనటం స్పష్టం. పరమాత్మకు, అజ్ఞానకారణాన ఎంతవరకు వికల్పం కనిపిస్తుందో, అంతవరకు భ్రాంతిగూడ నిలబడి ఉంటుంది. అయితే, అజ్ఞానం అంతరించిన పిదప, అంతా మిథ్యగా తెలిసి యథార్థజ్ఞానం సిద్ధిస్తుంది. శాస్త్రంలో చెప్పిబడిన విధినిషేధాలు కలలో మేల్కొన్న విధంగా అవుతాయి. అద్వైతం – మూడువిధాలు: భావాద్వైతం, క్రియాద్వైతం, ద్రవ్యాద్వైతం, అని; పటతంతు న్యాయంతో (కార్యకారణాలు–రెండూవాస్తవానికి ఒకటే) భిన్నంగా కనిపించే వస్తు ప్రపంచమంతా ఒకటే అనే భావంతో మెలగడం–భావాద్వైతం; మనోవాక్కాయాల ద్వారా జరిగే సర్వక్రియలూ వాటి ఫలితాలతోసహా; పరమాత్మకు సమర్పించడం క్రియాద్వైతం; పుత్రమిత్ర కళత్రాదులయిన సర్వజీవకోటికీ, తనుకూ, పంచభూతాత్మకదేహం ద్వారా, భోక్త ఒక్కడే అని గ్రహించి, అర్థం, కామం–అనే పురుషార్థాలు రెండిటిలోను సమభావంతో మెలగడం, ద్రవ్యాద్వైతం; ఈ విధంగా, త్రివిధ – అద్వైత భావాలతో, సృష్టిలోని సకలభేదాలు, స్వప్నప్రాయాలుగా గ్రహించి, నరుడు ముని కావాలి.

**క. వాదములు వేయు నేటికి?, వేదోక్తవిధింజరించు విబుధుఁడు గృహమం**
**దాదరమున నారాయణ, పాదంబులు గొలిచి ముక్తిపదమున కేఁగున్. 470**

**ప్రతి :** వాదములు= ద్వైతమని; అద్వైతమని, చేసే చర్చలు; వేయున్+ఏటికి?= వేయైనా ఎందుకు? వేద+ఉక్త విధిన్+చరించు విబుధుడు= వేదాలలో చెప్పబడినట్లుగా జీవించే పండితుడు, గృహమందు= ఇంటిలో; ఆదరమునన్= ప్రేమతో; నారాయణపాదంబులు= శ్రీహరి చరణములు; కొలిచి= సేవించి; ముక్తిపదమునకున్+ఏఁగున్= మోక్షపదవికి వెళ్తాడు.

**తా :** వాదాలు, వివాదాలు, సంవాదాలు వేయేల? వద్దు. వేదోక్తవిధితో జీవించే పండితుడు, తన యింటనే శ్రీహరి పాదపూజచేసి మోక్షపదవిని చేరగలడు.

**శా. భూపాలోత్తమ!, మీరు భక్తిగరిమస్ఫూర్తిన్ సరోజేక్షణ**
**శ్రీపాదాంబుజయుగ్మమున్ నియతులై సేవించి కాదే మహో**
**గ్రాపత్సంఘములోనఁజిక్కక సమస్తాశాంతనిర్జేతలై**
**యేపారంగ మఖంబు సేసితిరి దేవేంద్రప్రభావంబునన్. 471**

**ప్రతి :** భూపాల+ఉత్తమ!= రాజశ్రేష్ఠ! ధర్మరాజా!; మీరు; భక్తిగరిమ స్ఫూర్తిన్= భక్తి (యొక్క) గొప్పతనం గోచరించడంచేత; సరోజ+ఈక్షణ= శ్రీహరియొక్క; శ్రీపాద+అంబుజయుగ్మమున్= శోభాయుక్తాలైన పాదపద్మపుజంటను; నియతులు+ఐ=

నియమం గలవారై; సేవించికాదే!= పూజించేకదా! మహా+ఉగ్ర+ఆపత్ సంఘములోనన్= మిక్కిలి ఘోరమైన విపత్తుల సమూహంలో; చిక్కక= దొరకిపోకుండ; సమస్త+ఆశాంత నిర్జేతలై= అన్నిదిగంతాలను జయించినవారై; ఏపారంగన్= (ఏపు+ఆరంగన్) ఆధిక్యం విస్తరించగా; దేవ+ఇంద్రప్రభావంబునన్= ఇంద్రుని ప్రాభవంతో; మఖంబు+చేసితిరి= యాగం నిర్వహించారు.

**తా :** రాజా! మీరు ఉన్నతభక్తి విశేషంతో, నారాయణుని పాదపద్మాలను నిష్ఠాగరిష్ఠులై సేవించే గదా! ఘోర విపత్తుల పాలు గాకుండ, ఎల్లదిగంతాలను గెలిచి దేవేంద్ర వైభవంతో యజ్ఞం నిర్వహించారు.

## ❖ నారదుని పూర్వజన్మ వృత్తాంతము ❖

**వ. వినుము పోయిన మహాకల్పంబునందు గంధర్వులలోన నుపబర్హణుం డనుపేర గంధర్వుండ నైన నేను సౌందర్య మాధుర్య గాంభీర్యాది గుణంబుల సుందరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలైన బ్రహ్మలు దేవసత్త్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబు సేయుకొఱకు నప్సరోజనులను గంధర్వులనుంజీరిన. 472**

**ప్రతి :** వినుము= వినవలసింది; పోయిన మహాకల్పంబునందున్= గతించిన మహాయుగంలో; గంధర్వులలోనన్= ఆ పేరుగల దేవగణాలలో; ఉపబర్హణుండు+అనుపేరన్= ఉపబర్హణుడు అను పేరుతో; గంధర్వుండను+ఐన నేను= గంధర్వ జన్మనెత్తిననేను; సౌందర్య మాధుర్యగాంభీర్య+ఆదిగుణంబులన్= సౌందర్యం, మాధుర్యం, గాంభీర్యం మొదలైన గుణాలతో; సుందరులకున్= (సుందరి+లు) సౌందర్యవతులకు (అందగత్తెలకు); ప్రియుండను+ఐ= ప్రేమపాత్రుడనై; క్రీడించుచున్= విహరిస్తూ; ఒక్కనాఁడు= ఒకదినాన; విశ్వస్రష్టలు+ఐన= విశ్వకర్తలయిన; బ్రహ్మలు= ప్రజాపతులు; దేవసత్రము+అనియెడి= దేవ సత్రము అనే; యాగంబులోనన్= యజ్ఞంలో; నారాయణకథలు= శ్రీహరి చరితలు; గానంబు సేయుకొరకున్= పాడుటకై; అప్సరస్+జనులను= అప్సరసలను, గంధర్వులన్= గంధర్వులను; చీరినన్= పిలువగా...

**తా :** గత మహాకల్పంలో, నేను 'ఉపబర్హణుడు' అనే పేరుతో గంధర్వగణంలో పుట్టి, చెలువంతో, తియ్యనైన లోతైన ప్రవృత్తితో, సుందరీమణులకు ప్రేమాస్పదుడనై విహరిస్తుండగా, ఒకనాడు విశ్వకర్తలయిన ప్రజాపతులు దేవసత్రమనే యజ్ఞంలో శ్రీహరికథల గానంకోసం అప్సరసలను, గంధర్వులను పిలువగా,

**ఆ. క్రతువులోని కేను గంధర్వగణముతోఁ, గలసిపోయి విష్ణుగాథ లచటఁ**
**గొన్ని పాడి సతులఁగూడి మోహితుఁడనై, తలఁగి చనితి నంత ధరణినాథ! 473**

**ప్రతి :** ధరణినాథ!= ఓ రాజా! ఏను= నేను; గంధర్వ గణముతోన్= గంధర్వుల గుంపుతో; కలసి= చేరి; క్రతువులోనికిన్= యజ్ఞంలోనికి; పోయి= వెళ్లి; అచటన్= అక్కడ; విష్ణుగాథలు= హరిచరితలు; కొన్నిపాడి= కొన్ని గానంచేసి; సతులన్+కూడి= యువతులతో కలిసి; మోహితుఁడనై= మోహానికి గురియైన వాడనై; అంతన్= ఆపైన; తలఁగి చనితిన్= తొలగి వెళ్ళాను;

**తా :** రాజా! నేనూ గంధర్వులతో ఆ యజ్ఞాలకు వెళ్లాను. అక్కడ కొన్ని విష్ణుకీర్తనలను పాడుతూ అక్కడి యువతుల మోహానికి గురి అయి, పక్కకు తొలగి వెళ్లాను.

**క. వారిజగంధుల పొత్తున, వారిం గైకొనక తలcగి వచ్చిన బుద్ధిన్**
**వా రెఱిcగి శాప మిచ్చిరి, వారింపcగరాని రోషవశమున నధిపా! 474**

**ప్రతి :** అధిపా!= రాజా!; వారిజ గంధుల పొత్తునన్= యువతుల కలయికవలన; వారిన్= ఆ ప్రజాపతులను; కైకొనక= లక్ష్యపెట్టక; తలcగి వచ్చిన బుద్ధిన్= తొలగివచ్చిన (నా) తెలివిని; వారు+ఎఱిఁగి= వారు గ్రహించి; వారింపcగరాని= నివారింపవీలుగాని; రోషవశమునన్= క్రోధకారణాన; శాపము+ఇచ్చిరి= శపించారు.

**తా :** నేను యువతుల పొత్తుతో, ఆ ప్రజాపతులను పట్టించుకొనక, తొలగివచ్చిన తీరును వారు తెలిసికొని, మహారోషంతో నన్ను శపించారు.

**ఆ. 'పంకజాక్షు నిచటcబాడక కామినీ, గణముcగూడి చనిన కల్మషమున**
**దగ్ధకాంతి వగుచు ధరణీతలంబున, శూద్రజాతి సతికి సుతుcడ వగుము.' 475**

**ప్రతి :** ఇచటన్= ఈ యాగశాలలో; పంకజాక్షున్= శ్రీహరిని; పాడక= స్తుతింపక; కామినీ గణమున్+కూడి= కాముకురాంద్రగుంపుతో కలిసి; చనినకల్మషమునన్= వెళ్ళిన పాపంవలన; దగ్ధకాంతివి+అగుచున్= కాలిన తేజస్సు గలవాడవై; ధరణీతలంబునన్= భూమిపై; శూద్రజాతి సతికిన్= శూద్రురాలైన వనితకు; సుతుcడవు+అగుము= కొడుకువు కమ్ము...

**తా :** 'ఈ యాగ భూమిలో శ్రీహరిని కీర్తింపక కాముకురాంద్ర గుంపుతో కలసి, వెళ్ళిపోయిన పాపఫలితంగా, కాంతి హీనుడవై, భూమండలాన శూద్రజాతి వనితకు కొడుకువు కమ్ము.'

**విశే :** 'నారదుని పూర్వజన్మ వృత్తాంతకారణము' ఇక్కడ చెప్పబడింది. జన్మకర్మములు నారదునికైనా తప్పదని తెలిపే నారదుని పూర్వజన్మ కథ.

**వ. అని యిట్లు విశ్వస్రష్టలు శపించిన నొక బ్రాహ్మణదాసికిcబుత్త్రుండనై జన్మించి యందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూష సేసిన భాగ్యంబున నిమ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్త్రుండనై జన్మించితి. 476**

**ప్రతి :** ఇట్లు= ఈ విధంగా; విశ్వస్రష్టలు= విశ్వకర్తలు; శపించినన్= శపించగా; ఒక బ్రాహ్మణదాసికిన్= ఒక బ్రాహ్మణుని దాసికి; పుత్రుండను+ఐ జన్మించి= పుత్రుడుగా పుట్టి; అందున్= ఆ జన్మలో; బ్రహ్మవాదులైన పెద్దలకున్= బ్రహ్మప్రవచనం చేసే పెద్దలకు; శుశ్రూష+చేసిన భాగ్యంబునన్= సేవ చేసిన అదృష్టంవలన; ఈ+మహాకల్పంబునందు= ఈ మహాయుగాన; బ్రహ్మపుత్రుండను+ఐ జన్మించితిన్= బ్రహ్మదేవుని కొడుకుగా పుట్టాను.

**తా :** ఆ శాపవశాన, భూలోకాన ఒక బ్రాహ్మణ దాసికి కొడుకుగా పుట్టాను, ఆ సమయంలో అక్కడ బ్రహ్మవాదులైన పెద్దలకు సేవచేసిన భాగ్యానికి బదులుగా ఈ మహాకల్పంలో బ్రహ్మదేవుని కొడుకుగా పుట్టాను.

**ఆ. కౌశలమున మోక్షగతికి గృహస్థుc డే, ధర్మ మాచరించి తగిలి పోవు**
**నట్టి ధర్మ మెల్ల నతివిశదంబుగాc, బలుకcబడియె నీకు భవ్యచరిత! 477**

**ప్రతి :** భవ్యచరిత!= ధన్యచరిత్రా! గృహస్థుcడు= గేస్తు; ఏ ధర్మము+ఆచరించి= ఏ ధర్మాన్ని అనుసరించి; కౌశలమునన్= నేర్పుతో; మోక్షగతికిన్= ముక్తిమార్గానికి; తగిలి పోవున్= ఆసక్తితో వెళ్తాడో; అట్టి ధర్మము+ఎల్లన్= ఆ విధమైన ధర్మమంతా; అతివిశదంబుగాన్= అతిస్పష్టంగా; నీకున్= నీ కొరకై; పలుకన్+పడియెన్= చెప్పబడింది.

**తా :** రాజా! గేస్తు, ఏ ధర్మాచరణతో నేర్పుగా, మోక్షమార్గాన్ని అందుకొని ప్రయాణిస్తాడో, అటువంటి ధర్మప్రకారమంతా నీకై అతి స్పష్టంగా నేను వివరించాను.

**మ. అఖిలాధారుఁడజాదిదుర్లభుఁడు బ్రహ్మంబైన విష్ణుండు నీ**
**మఖమందర్చితుఁడై నివాసగతుఁడై మర్త్యాకృతిన్ సేవ్యుఁడై**
**సఖియై చారకుఁడై మనోదయితుఁడై సంబంధియై మంత్రియై**
**సుఖదుండయ్యె, భవన్మహామహిమ దాఁ జోద్యంబు ధాత్రీశ్వరా! 478**

**ప్రతి :** ధాత్రీ+ఈశ్వరా! = రాజా! అఖిల+ఆధారుఁడు= సర్వానికి ఆశ్రయమైనవాడు; అజ+ఆదిదుర్లభుఁడు= బ్రహ్మాదులకు దొరకనివాడు; బ్రహ్మంబు+ఐన విష్ణుండు= పరబ్రహ్మస్వరూపమైన శ్రీహరి; నీ మఖమందున్= నీ యాగంలో; అర్చితుఁడు+ఐ= పూజింపబడినవాడై; నివాసగతుఁడు+ఐ= ఇంటనున్నవాడై; మర్త్యాకృతిన్ (మర్త్య+ఆకృతిన్)= మానవుని ఆకారంతో; సేవ్యుఁడై= సేవింపఁదగినవాడై; సఖి+ఐ= స్నేహితుడై; చారకుఁడు+ఐ= నిర్వాహకుడై; మనస్+ దయితుఁడు+ఐ= మనస్సునకు ప్రియుడై; సంబంధియై= బంధువై; మంత్రియై= మంతనాలు చేయువాడై; సుఖదుండయ్యెన్= సుఖాన్నిచ్చేవాడైనాడు; భవత్+మహామహిమ= నీ గొప్పతనం; తాన్= అది (మహిమ); చోద్యంబు= విచిత్రం!

**తా :** విశ్వానికి ఆధారమై నిలిచి, బ్రహ్మాదులకూ అలభ్యుడైనవాడు; స్వయంగా పరబ్రహ్మస్వరూపుడు విష్ణువు. అట్టి హరిని నీవు నీ యాగసందర్భాన అర్చించావు. అర్చనకు పాత్రమగుటే కాదు, నీయింట నున్నాడు. మానవాకృతితో నీ సేవలందుకున్నాడు. నీకు స్నేహితుడతడు; నిర్వాహకుడూ అతడే. నీ మనస్సున కెక్కినవాడు; నీకు బంధువు; నీకు మంత్రి కూడ. ఈ అన్ని విధాలుగా దేవుడు నీకు సుఖశాంతులు కల్పించాడు. రాజా! నీ మహిమ గొప్పది; విచిత్రమైనది కూడా.

**విశే :** భాగవతంలో మూడుచోట్ల ఆదిమధ్యాంతాలలో నారదుడు ధర్మరాజుతో శ్రీకృష్ణపరమాత్మతోడి జీవనం ధర్మరాజు చేసుకొన్న అదృష్టమని ప్రశంసించాడు.

1. అర్జునుడు ధర్మరాజుతో – మనసారథి, మనసచివుడు... (I - 356)

2. నారదుడు ధర్మరాజుతో – జలజాత ప్రభవాదులున్ ... (VII - 386)

3. నారదుడు ధర్మరాజుతో – "అఖిలాధారుఁడు"... (VII - 478) ఈ మూడు పద్యాలు ధర్మరాజెంతటి భాగ్యశాలియో తెలియజేస్తున్నాయి. కష్టాలు కష్టాలుగా గాక నల్లేరుపైన బండినడకగా చేశాడు శ్రీకృష్ణ పరమాత్మ.

**వ. అని యిట్లు నారదుండు సెప్పిన వృత్తాంతం బంతయు విని ధర్మనందనుండు ప్రేమ విహ్వలుండై వాసుదేవునిం బూజించె. వాసుదేవ ధర్మనందనుల చేతఁ బూజితుండై నారదమునియు దేవమార్గంబునం జనియె నని శుక యోగీంద్రుండు పాండవపౌత్త్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పిన. 479**

**ప్రతి :** అని+ఇట్లు= అని ఈ విధంగా; నారదుండు+చెప్పిన= నారదుడు వివరించిన; వృత్తాంతంబు+అంతయున్ విని= చరిత్ర అంతా విని; ధర్మనందనుండు= ధర్మరాజు; ప్రేమ విహ్వలుండై= ప్రేమతో వివశుడై; వాసుదేవునిన్= వసుదేవసుతుని, కృష్ణుని; పూజించెన్= అర్చించెను; వాసుదేవ ధర్మనందనులచేతన్= కృష్ణధర్మరాజులచేత; పూజితుండు+ఐ= అర్చితుడై; నారదమునియున్= నారదఋషికూడ; దేవమార్గంబునన్= ఆకాశమార్గాన; చనియెన్+అని= వెళ్ళెను అని;

శుకయోగి+ఇంద్రుండు= యోగి శ్రేష్ఠుడైన శుకుడు; పాండవ పౌత్త్రునకున్= పరీక్షిన్మహారాజునకు, చెప్పెనని= వివరించెనని; సూతుండు= పురాణ కథకుడు సూతుడు; శౌనక+ఆదులకున్+చెప్పినన్= శౌనకుడు మొదలయినవారికి; చెప్పగా.

**తా :** నారదుడు పల్కిన సకల వృత్తాంతమూ విన్న ధర్మరాజు, ప్రేమతో పొంగిపోయి, తనముద్దుల మరదియైన దేవదేవుని, వాసుదేవుని అర్చించాడు. అనంతరం వారిరువురూ కలిసి దేవమునిని పూజించారు; అతడూ సంతుష్టుడై ఆకాశమార్గాన వెడలిపోయాడు. అని శుకయోగి, పరీక్షిత్తునకు చెప్పాడు–అని సూతుడనే కథకుడు శౌనకాది మునులకు నైమిశారణ్యాన చెప్పాడు. చెప్పగా (....అనంతరకథకు ప్రారంభం)

**క. రాజీవసదృశలోచన!, రాజీవభవాదిదేవ రాజవినుత! వి,**
**భ్రాజితకీర్తిలతావృత, రాజీవభవాండభాండ! రఘుకులతిలకా! 480**

**ప్రతి :** రాజీవ సృదృశలోచన!= పద్మాలతో సమమైన కన్నులుగలవాడా!; రాజీవభవ+ఆదిదేవరాజ వినుత!= బ్రహ్మ మొదలయిన దేవతా శ్రేష్ఠులచేత స్తుతింపబడినవాడా!; విభ్రాజితకీర్తిలతా+ఆవృత!= ప్రకాశించే కీర్తిరూప లతలతో కప్పబడినవాడా! రాజీవభవ+అండభాండ!= బ్రహ్మాండమనే భాండములు కలవాడా!; రఘుకులతిలకా!= రఘువంశంలో శ్రేష్ఠుడా!

**తా :** పద్మాలవంటి కన్నులుకలవాడా! బ్రహ్మ మొదలైన దేవతలచే స్తుతింపబడినవాడా! ప్రకాశించే కీర్తి అనే లతలచే కప్పబడిన బ్రహ్మాండభాండాలుకలవాడా! రఘుకులశ్రేష్ఠా!

**మాలిని**

**ధరణిదుహితృరంతా! ధర్మమార్గానుగంతా!**
**నిరుపమనయకాంతా! నిర్జరారాతిహంతా!**
**గురుబుధసుఖకర్తా! కుంభినీచక్రభర్తా!**
**సురభయపరిహర్తా! సూరిచేతోవిహర్తా! 481**

**ప్రతి :** ధరణి దుహితృరంతా!= భూదేవి కొమార్తెయైన సీతతో క్రీడించేవాడా! ధర్మమార్గ+అనుగంతా!= ధర్మమార్గాన్ని అనుసరించేవాడా! నిరుపమనయకాంతా!= సాటిలేని న్యాయంతో అందమైనవాడా! నిర్జర+అరాతిహంతా!= దేవతలకు శత్రువులైన, రాక్షసులను వధించేవాడా! గురుబుధ సుఖకర్తా!= గురువులకు; పండితులకు శుభం చేసేవాడా! కుంభినీచక్రభర్తా!= భూమండలానికి అధిపతీ! సురభయ పరిహర్తా!= దేవతల భయం పరిహరించేవాడా! సూరిచేతస్+విహర్తా!= పండితుల మనస్సులలో విహరించేవాడా!

**తా :** సీతాదేవితో క్రీడించుటలో ఆసక్తి కలిగినవాడా! ధర్మమార్గాన్ని అనుసరించేవాడా! అనుపమన్యాయప్రియా! అసురమర్దనా! గురువులకూ, పండితులకూ సుఖాన్ని ఇచ్చేవాడా! భూచక్రాన్ని ధరించేవాడా! దేవతల భయాన్ని దూరం చేసేవాడా! పండితుల మనస్సుల్లో సంచరించేవాడా!

**గద్యము: ఇది శ్రీపరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసన మంత్రి పుత్త్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబయిన శ్రీ మహాభాగవతంబను మహా పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్ష**

**హిరణ్యకశిపుల పూర్వజన్మ వృత్తాంతంబు సెప్పుటయు, హిరణ్యకశిపు దితి సంవాదంబును, సుయజ్ఞోపాఖ్యానంబును, యమసల్లాపంబును, బ్రహ్మవరలాభ గర్వితుండైన హిరణ్యకశిపు చరిత్రంబును, బ్రహ్లాద విద్యాభ్యాస కథయును, బ్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదంబును, బ్రహ్లాదు వచనంబు ప్రతిష్ఠింప హరి నరసింహరూపంబున నావిర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకు నభయం బిచ్చి నిఖిలదేవతానివహ ప్రహ్లాదాది స్తూయమా నుండై తిరోహితుం డగుటయుఁ, ద్రిపురాసుర వృత్తాంతంబును, నీశ్వరుండు త్రిపురంబుల దహించుటయు, వర్ణాశ్రమ ధర్మ వివరణంబును, బ్రహ్లాదాజగర సంవాదంబును, స్వధర్మ ప్రవర్తకుఁడగు గృహస్థుండు ముక్తుండగు మార్గంబు నారదుండు ధర్మజునకుఁ దెలుపుటయు, నారదుని పూర్వజన్మ వృత్తాంతంబును నను కథలు గల సప్తమస్కంధము. 482**

**ప్రతి :** ఇది= ఈ రచన; శ్రీపరమేశ్వర= శ్రీ పరమాత్మునియొక్క; కరుణాకలిత= దయచే కలిగిన; కవితా విచిత్ర= కవితచే విచిత్రుడైన; కేసన మంత్రిపుత్ర= కేసనామాత్యుని కుమారుడగు; సహజపాండిత్య= సహజసిద్ధమైన వైదుష్యంగల; పోతన+అమాత్య= పోతనామాత్యునిచేత; ప్రణీతంబు+ఐన= రచింపబడిన; శ్రీమహాభాగవత పురాణంబునందున్= శ్రీ మహాభాగవత మహాపురాణంలో; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; నారదుండు= నారదుడు; హిరణ్యాక్షహిరణ్యకశిపుల పూర్వజన్మవృత్తాంతంబు+చెప్పుటయున్= హిరణ్యాక్షునియొక్క, హిరణ్యకశిపునియొక్క మునుపటి పుట్టుకలలోని సంగతులను చెప్పటం; హిరణ్యకశిపు దితిసంవాదంబును= వారిద్దరియొక్క సంభాషణ; సుయజ్ఞ+ఉపాఖ్యానంబును= సుయజ్ఞునియొక్క ఉపకథ; యమసల్లాపంబును= యముని సల్లాపము; బ్రహ్మవరలాభ గర్వితుండైన= బ్రహ్మచే వరాన్ని పొందటంవలన పొగరుపట్టిన; హిరణ్యకశిపు చరిత్రంబును= హిరణ్యకశిపుని కథ; ప్రహ్లాద విద్యాభ్యాస కథయును= ప్రహ్లాదుడు విద్యాభ్యాస వృత్తాంతం; ప్రహ్లాద హిరణ్యకశిపుల సంవాదంబును= ప్రహ్లాద హిరణ్యకశిపుల సంభాషణలు; ప్రహ్లాదు వచనంబు ప్రతిష్ఠింపన్= ప్రహ్లాదుని మాటను నిలబెట్టటానికి; హరి= మహావిష్ణువు; నరసింహరూపంబునన్= నృసింహాకృతితో; ఆవిర్భవించి= పుట్టి; హిరణ్యకశిపుని సంహరించి= హిరణ్యకశిపుని చంపి; ప్రహ్లాదునకున్ అభయంబు+ఇచ్చి= ప్రహ్లాదునకు భయము తొలగించి; నిఖిలదేవతానివహ= సమస్త దేవతల సమూహంచేతను; ప్రహ్లాద+ఆది= ప్రహ్లాదుడు మున్నగు వారిచేతను; స్తూయమానుండు+ఐ= కొనియాడబడిన; తిరోహితుండు+అగుటయున్= అంతర్ధానం అవడం; త్రిపుర+అసుర వృత్తాంతంబును= త్రిపురాసురుల సంగతి; ఈశ్వరుండు త్రిపురంబులన్ దహించుటయున్= ఈశ్వరుడు త్రిపురములను కాల్చుట; వర్ణ+ఆశ్రమ ధర్మ వివరణంబును= నాల్గు కులాలు, నాల్గు ఆశ్రమాల వివరణ; ప్రహ్లాద+అజగర సంవాదంబును= ప్రహ్లాదుని అజగరమునియొక్క సంభాషణ; స్వధర్మ ప్రవర్తకుండు+అగు= లోకధర్మాన్ని అనుష్ఠించువాడైన; గృహస్థుండు= ఇంటి యజమానుడు; ముక్తుండగు మార్గంబు= మోక్షం పొందే విధం; నారదుండు= నారదమహర్షి; ధర్మజునకు తెలుపుటయున్= ధర్మరాజుకు చెప్పటం; నారదుని, పూర్వజన్మ వృత్తాంతంబును= నారదుని తొలిపుట్టుకకు సంబంధించిన విషయం; అను కథలు గల్గిన సప్తమస్కంధము= మొదలైన కథలు కలిగిన సప్తమస్కంధము.

*:: శ్రీకృష్ణార్పణమస్తు ::*

# పద్యగద్యసూచి

## షష్ఠస్కంధము

## సప్తమస్కంధము

